# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

జూలై 1958

సంపుటము 35 : : సంచిక 7

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## జూలై 1958

# దీపాంగన

శ్రీ దాశరథి

దీపశిఖ నిల్చినది పురంధ్రీ లలాట
పట్టి దీర్చిన కుంకుమ బొట్టు వోలె;
దీప శిఖ పిల్చినది, చనుదెంచినాను
తనువు తనువెల్ల ఆజ్యపాత్రమ్ము వోలె

ఎరకలు వచ్చె నా యెడద కిప్పుడు, దీపకుమారికా భుజాం
బరమున తేలియాడెదను పాడెద; మంచులు పేరినట్టి ఈ
ధరణి జడత్వమూడ్చుటకు తాపము పెంచెద, వేడిలేని ఈ
పరిసరముల్ కవోష్ణరసవారిధిలో నెసలాడజేసెదన్

నాకున్ దీపశిఖాకుమారికకు ఈ నాడా! శతాబ్దాల ముం
దే కానుండెను పెండ్లి! కాని పవనద్వేషమ్ము దీపానకున్
నాకున్ మధ్య నఖాతముల్ నిలిపె; నైనన్ దాని చేలాంచలం
బాకంపించె మదీయ శీర్షమున ప్రేమామోద సంవాహమై

శలభమ నైన నన్ శరభ సామజ సింహ బలంబులిచ్చి ది
వ్వెల దొరసాని పెంచినది, ప్రేముడితో ముడివేసి-వాన గా
డ్పుల తొలిదాడినాడు నను బ్రోచిన, దెంతటి రాగబంధమో!
చలి యన లేదు దీపక భుజా భుజగీ పరిరంభణమ్మునన్

బందీయయ్యె జగమ్ము దీపకళికా ప్రత్యగ్ర బాహా యుగం
బందున్ నా యెదవోలె; అంధ తమస వ్యాధూత కోకారి వ
న్నిందా బంధుర లోకమున్ విడచి మద్దీపాంగనా లింగ నా
నంద స్యందన మెక్కి రివ్వుమని పోనా స్వర్గమార్గమ్ములన్!

# భా ర తి

ప్రతి యింట నొక చిన్ని ప్రమిద వెల్గించిన
అవిరళస్నేహ రాజ్యాధిరాజ్ఞి,
ప్రతిగుండె నొక ప్రభాప్రతిమ నిర్మించిన
కల్పనా నల్ప శృంగార ధాత్రి
ప్రతి తోటలో నవప్రసవమై విచ్చిన
కాంతార కాంత వాసంత లక్ష్మి.
ప్రతి మానవీ ముఖాంబరమందు ప్రాకిన
గోరోచనా చంద్ర చారు మూర్తి.

దీపభామిని, ఆశాతిదీప్త కీర్తి,
మంచు కరగించి, వేడికల్పించి, వాగ్వి
పంచి సవరించి వాయించి ప్రకృతి నెల్ల
మూర్ఛ తేరిచి చేతనాంబుధిని దేల్చె!

కాలిన రెక్కలన్ పులుగుకై వడి నీపద కంజ సన్నిధిన్
వ్రాలితి, నిన్ను మ్రింగుటకు వచ్చిన గాడుపు దుండగినితో
ఆలము సేసి గెల్పుగొనునప్పుడు రెక్కలు కాలిపోయె నీ
జ్వాలలు సోకి; నీకొరకు ప్రాణములైన పణమ్ము పెట్టెదన్

నీలోతేజము తగ్గిపోవునెడ నందింతున్ కవోష్ణాస్రమున్
తైలంబట్టుల—అశ్రుధారలను సంతప్తాజ్యధారం బలెన్;
జ్వాలా చేల విలోల తావక వపుర్వల్లీ విలాసంబుతో
భూలోకంబును సొంత మొక్కత్రుటి సమ్మోహింపగా జేతువే!

నన్ను స్నేహము చేసికొన్నావు నీవు
వెల్గుచున్నావు నామనః పీఠి పైన
ప్రతి రుధిర బిందువును సమర్పణ మొనర్చి
నిన్ను వెల్గించుటకు మరణింతు నేను

# దీపాంగన

నీ కీలా పరిచుంబితంబయిన నా స్నిగ్ధా ధరోష్ఠమ్ముపై
ప్రాకెఙ్ కమ్మదనాలు ద్రాక్షరసమై, ప్రత్యగ్ర మాధ్వీకమై;
లోకాతీత సుఖమ్ము కూర్చినవి నీ రోచిష్ణు బాహాయుగ
ప్రాకారాంతర జృంభమాణ లికుచాభస్వర్ణ వక్షోజముల్

వెలుతురు మొగ్గవై బ్రతుకు వీథుల నూత్న పరీమళమ్ములన్
జిలికిన నీకుగాను విరచించితి గుండియ కొండమీద ది
వ్వెల రతనాలమేడ; పదవే అటనుందువుగాని; కోటి గుం
డెల వెలిగింప గల్గు రమణిన్ నిను గాడుపు పాలొనర్తునే

నీ నృతి జూచి లోకము ఖణిల్లను గజ్జెలతో నటింపగా
బూనెను; జారిపోయినది పో భవదంసగతాంబరాంచల
శ్రేణి; కటీఙ్పటంబు శిథిలీ కృతమయ్యె, వివస్త్రవైతివే
రాణి! రవీంద్రకల్పిత విలాసిని ఊర్వశివోలె, దీపికా!

నిను కౌగింటను గొన్న నా తనువు పోనేపోవుగానీ భవత్
తను తేజః పరిణాహ పింజరితమీ ధాత్రీతలంబెల్ల ఆ
త్మనుగా జేసి వసింతు సప్తజగతీ మధ్యమ్మునన్ దీప భా
మిని ప్రేమించిన దీప్తిమంతుడనుగా మిన్నెక్కి క్రీడించుచున్

# హరవిలాసము : కుమారగిరి

శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి

శ్రీనాథుఁడు తన కృతులలో నేదియో యొక రీతిని ప్రసక్తిని గల్పించుకొని రెడ్డిరాజుల ప్రాభవము నభివర్ణించుచు వచ్చినాఁడు. ఏ ప్రబంధమునందే విషయమును వరించినను నది చారిత్రక ప్రమాణముచే బలపడునదియే యగును. సమకాలిక కవిరచనములు వాని కుపోద్బలకములై వెలయుచుండును. హరవిలాస కృతి భర్త కాంచీపుర వాసియైన యవచితిప్పయసెట్టి. అతఁడు శ్రీనాథునకు బాల్యసఖుఁడు. కొండవీటి రెడ్డి రాజులతో వాణిజ్య సంబంధ మేర్పఱచుకొని, వైభవ ప్రాభవముల నార్జించి వన్నెకెక్కినవాఁడు. కావున నే కొండవీటిలో పెదకోమటి వేముని సామ్రాజ్య మంతరించిన తరువాత, శ్రీనాథునకుఁ గృతిభర్తగా, శివభక్తుఁడు, కుమారగిర్యధీశలబ్ధ రాజలాంఛనుఁడు, మహావిభవ సంపన్నుఁడు నగు అవచి తిప్పయ్యసెట్టి గాన వచ్చినాఁడు. ఈవిషయమును శ్రీనాథుఁడు హరవిలాస కృత్యాదియం దిట్లు తెలిపియున్నాఁడు.

వ. "త్రిపురాంతక దేవ దివ్య శ్రీపాద పద్మారాధకుండును,...వశీకృత నిఖిల భూభుజుండును, సత్యత్యాగ ధ్వజుండును, వినిర్మల కులశీలుండును, కవి జన స్తోత్రపాత్రుండు...ననం బరగి, జంబూ ద్వీప భూభువనమండలీ మకుట మండనాయమానంబగు కొండవీడు పురంబు రాజధానిగాఁ గీర్తిలతాధిష్ఠిత శైవల ద్వీపాంతరాళుండగు కొమరగిరి వసంత నృపాలువలన వాందోళికా ఛత్ర చామర తురంగ భద్రపీఠాది రాజ్యచిహ్నములు వడసి, యమ్మహారాజునకుఁ బ్రతివత్సరంబును వసంతోత్సవంబులకుం దగిన కస్తూరీ కుంకుమ ఘనసార సంకుమద హిమాంబు కాలాగురు గంధసార ప్రధానంబులగు సుగంధ ద్రవ్యంబు లొడఁగూర్చియుఁ, జీని సింహళ తవాయి హురుముంజీ జోణంగి ప్రభృతి నానా ద్వీప నగరాకరంబులకు ధనకనక వస్తువాహన మాణిక్య గాణిక్యంబులు దెప్పించియుఁ, గవి గమకి వాది వాంశిక వైతాళికాదులగు నర్థిజనంబులకు నర్థంబులు గుప్పించియు, ధీగంభీర సదాగంభీర గంభీరగంభీర సదాచారగంభీర భువన విఖ్యాతి గైకొను నవచితిప్ప ప్రభుండు"

ఈ వర్ణనమున మనకెన్నియో విషయములు విదితములగుచున్నవి. అవచి తిప్పయ యుభయ కవిమిత్రుఁడు. ఉదారుఁడు. కవిజన కల్పకము ననునది మొదటి విషయము. ఆ వెనుక కొండవీటి పాలకుఁడైన వసంతరాజ బిరుదాంకితుఁడగు కుమారగిరివలన రాజచిహ్నములు బడసిన మేటి కిరాటుఁడని తెలియవచ్చుచున్నది. కుమారగిరి ప్రతివత్సరము వసంతోత్సవములను జరుపుచుండెడి వాఁడనియు, ఆ యుత్సవములకు వలయు కస్తూరీ కర్పూర గంధసారాది సుగంధ ద్రవ్యములను ద్వీపాంతరములనుండి రావించి, యొసఁగుచుండెడి వాఁడనియు, తన్మూలకముగ కుమారగిరితో నవచి తిప్పయకు వ్యాపారిక సంబంధము ఘనిష్ఠమయ్యెననియు, ఆ నాఁటి యాంధ్రుల నౌకా వ్యాపారము చీని సింహళాది ద్వీపాంతరములతోఁ గొనసాగుచుండెననియు విదితమగుచున్నది. అవచి తిప్పయ కవిప్రియుఁడనియు నర్థిజనుల కర్థములు గుప్పించు వాఁడనియుఁ దెలియుచున్నది.

అవచితిప్పయసెట్టి కుమారగిరి జరుపు ప్రతి సంవత్సర వసంతోత్సవములకే యే ద్వీపములనుండి యే యే సుగంధ ద్రవ్యములను గొనివచ్చుచుండెడి వాఁడో, ఆ నాఁడే యే రేవులు నౌకా వ్యాపారమునం దుపయోగపడుచుండెడివో వాని నీ కృత్యాదియందు శ్రీనాథుఁడు తెలిపియున్నాఁడు.

సీ. పంజారఁ గర్పూర పాదపంబులఁ దెచ్చె
జలనోంగి బంగారు మొలకఁ దెచ్చె
సింహళంబున గంధసింధురంబులఁ దెచ్చె
హురుమంజి బలుతేజి హరులు దెచ్చె
గోవ సంపద్ధ పంకు మద ద్రవము దెచ్చె
యాంపఁ గట్టాణి ముత్యాలు దెచ్చె
బోటఁ గస్తూరికా పుట కోశములు దెచ్చెఁ
జీనిఁ జీనాంబర శ్రేణిఁ దెచ్చె

జగద గోపాల రాయ వేశ్యా భుజంగ
పల్లవాదిత్య భూదాన పరశురామ
కొమరగిరి రాజదేవేంద్రు కూర్మిహితుఁడు
జాణ జెగజెట్టి దేవయ చామిసెట్టి.

హర. 1-26.

మ. తరుణీ చీనితవాయి గోవ రమణా
స్థానంబులం జంపనా
గరు కర్పూర హిమాంబు కుంకుమ రజః
కస్తూరికా ద్రవ్యముల్
శరధిం గప్పలి జోఁగు బల్లి వలికా
సమ్యగ్నఁ దెప్పించు వే
ర్పరి యై వైశ్య కులోత్తముం డవచి తి
ప్పం డల్పుఁడే యిమ్మహిన్.

హర. 1-28

దీనిఁబట్టి అవచి తిప్పయసెట్టి తన సోదరుల తోడ్పాటుతో ద్వీపాంతరముల నుండి బహుమూల్య వస్తువులను దెప్పించి, వానిని గొండవీట నిలువఁజేసి, కుమారగిర్యధీశ్వరునకుఁ గూర్మిహితుఁడై వన్నెకెక్కియుండెనని తెలియుచున్నది. అవచి తిప్పయ వంశము వారికి వ్యాపారిక సంబంధ మీ కొమరగిరి నాఁడేగాక తత్పూర్వమునందు అవచిసెట్టికి, కుమారగిరి రెడ్డి తాతయగు ప్రోలయ వేముని నాఁడుకూడఁ గలదని యీక్రింది పద్యము తెలుపుచున్నది.

క. శ్రీ పర్వత సోపాన
స్థాపకుఁడగు రెడ్డివేమ జగతీపతికిన్
బ్రాపైన యవచి ధీమణి
యాపాణికి జనించె నభ్యుదయములతోన్.

హర. 1-18.

ప్రోలయ వేముని ప్రశస్తికి నిదానము శ్రీశైలమునుండి కృష్ణానదికి సోపానములు గట్టించుట. రెడ్డిరాజులు వెలకొల్పిన శాసనములలో ప్రోలయ వేముని పాతాళగంగకు సోపానములు నిర్మింపఁజేయుట ప్రధానముగ నిరూపింపఁబడినది. తన్నిదర్శకమైన యీ క్రింది శ్లోకము పెక్కుశాసనములలోఁ గానవచ్చుచున్నది.

శ్లో. సోపానాని కృతాని యేన కృతినా
పాతాళగంగాతటే
శ్రీశైలస్య మహీశమౌళిమణినా
తాన్యేవ చిత్రంపునః
సోపానాని భవన్తి
మేరుశిఖరారోహాయ నాకాపగా
గాహాయ త్రిదశాంగనా జన
మహా సౌధాధిరోహాయ చ.[1]

శ్రీశైలవాసి మల్లికార్జునదేవుని సాన్నిధ్యమునఁ బ్రవహించు కృష్ణానదికి పాతాళగంగ యని పేరు. శ్రీశైలమునుండి పాతాళగంగా ప్రవాహమువఱకు ప్రోలయ వేముఁడు సోపానములు నిర్మింపఁజేయఁగా, తన్మార్గమునఁ బాతాళగంగలో స్నానము చేయువారికి నా సోపానములే స్వర్గారోహణమునకు సోపానములగుచున్నవని యీ శ్లోక భావము. ఈ వేముని ప్రధానాపదానమును శ్రీనాథుఁడిటు నుగడించినాఁడు. మఱియు నీపద్యమునందే యవచిసెట్టి ప్రోలయ వేమునికి బ్రాపుగ నుండెనని తెలియవచ్చుచున్నది. అవచి తిప్పయ వంశమువారు సముద్ర నౌకావ్యాపారమున ప్రఖ్యాతివడసి, విశేష ధన మార్జించినవారు. ఆనాఁడు ఆంధ్రదేశమునందలి యోడరేవులలో ముకుళపురము (మోటుపల్లి – గుంటూరుజిల్లా బాపట్లకు సమీపమున నున్నది.) ప్రసిద్ధమైనది. దానిమీఁద నధికారము సన్నిహితులైన రెడ్డిరాజుల కేర్పడియుండినది. ప్రోలయ వేముఁడు తన తమ్ముఁడైన మల్లారెడ్డిచే ముకుళపురమును వశము చేసికొనెననియు, తన్మూలమున గొంత యాదాయము లభించుచుండెడిదనియు హరివంశములోని యీ క్రిందిపద్యము తార్కాణించుచున్నది.

శా. బాహాదర్పమునం బ్రతీప ధరణీ
పాలావళిం ద్రోలి యు
త్సాహోదగ్రుఁడు మోటుపల్లిఁ గొని స
త్ప్రద్వీప సద్వస్తు సం
దోహంబుం దనకిచ్చు నెచ్చెలి సము
ద్రుం బ్రీతుఁ గావించుచున్
మాహాత్మ్యంబు వహించె మల్లరథినీ
నాథుండు గాఢోద్ధతిన్.

—హరి. పీఠిక.

దీనిబట్టి ప్రోలయ వేమునినాఁడు మోటుపల్లి నుండి ద్వీపాంతర వ్యాపారము సాగుచుండెననియు, తదధికారము అద్దంకి ప్రభువుల వశమందుండెననియు, దెలియవచ్చుచున్నది. ప్రోలయ వేముని తరువాత

1. చూ. రెడ్డిసంచిక – అనపర్తి శాసనము.

నుప్పష్టము చేయుటలో శ్రీనాథుని కొక ప్రత్యేకత యున్నది. అది యీ హరవిలాస కృత్యాదిలో సహస్రముఖముల భాసిల్లినది.

కుమారగిరి తండ్రియగు అనపోతారెడ్డి మహావీరుఁడు. పరమ శివభక్తుఁడు. అభ్యుదారుఁడునని యాతని శాసనములవలనఁ దెలియుచున్నది. అతని నాఁడు ఇరుగు పొరుగులనున్న విజయనగరము, రాచకొండ, దేవరకొండ రాజధానులుగాఁగల వెలమరాజుల తోడను మహమ్మదీయుల తోడను యుద్ధములు వెలుపుచు విజయములు సాధించుటతోడనే కాలము గడచి పోయినది. అతని తరువాత నాతని తమ్ముఁడగు అనవేమారెడ్డి మహావీరుఁడై విజయములు సాధించుచు, పరమధార్మికుఁడై యగ్రహారములొసఁగుచుఁ గొండవీటి రాజ్యమును గొంతకాలము పాలించెను. ఆ వెనుక కుమారగిరి రాజ్యపాలకుఁడయ్యెను. ఈతఁడు తండ్రి మహావీరుఁడై విజయములు సాధించిన తార్కాణము లేమియుఁ గానరావు. విద్యావినోదియై కళాప్రియుఁడై ధార్మికుఁడై గ్రంథ రచనయందును వసంతోత్సవ నవాభినయ దర్శనములందును నుత్సుకత గలవాఁడై నిరాతంకముగాఁ గాలము గడుపుచుండినట్లు తెలియవచ్చుచున్నది. కాలమున యుద్ధాగ్నిప్రసంగములు లేనపుడే ప్రభువు లుత్సవదర్శనోత్సుకులు కళావినోదులు కాఁగలరు. కుమారగిరికి శత్రు విధ్వంసన విధి లేకయే యుండెను. ఆ పని యంతయు నాతని సోదరి భర్త స్నేహపాత్రుఁడు మహావీరుఁడు నగు కాటయ వేముఁడు నిర్వహించుచుండినవాఁడు. అందువలన రాజ్యభారమంతయుఁ గాటయవేముని పైఁ బెట్టి కుమారగిరి మనోహర వసంతోత్సవములతోడను, అభినవాభినయ ప్రదర్శనములతోడను, సంతానాభ్యుదయముతోడను గాలము నానందముతో గడుపుచుండెడివాఁడు. ఈ విషయమును కాటయవేముఁడు మాళవికాగ్నిమిత్ర వ్యాఖ్యా ప్రారంభమునందిట్లు వ్రాసియున్నాఁడు.

శ్లో. భాగ్యం నామ సమగ్ర మీదృశమతి
స్నేహైకపాత్రం యతో
వీరం కాటయవేమ మత్ర రిపుధ్వంసే
నియుజ్య స్వయమ్
నిత్యం సద్భి రసంగతై రభినవైః కాంతై
ర్వసంతోత్సవైః
సంతానాభ్యుదయైః కుమారగిరి
భూపాలో నృపాలోత్తమః.

యుద్ధములం దుద్ధతులైన శత్రువీరులను ధ్వంసము చేయుపనికి, స్నేహపాత్రుఁడు వీరుఁడునగు కాటయ వేముని నియోగించి, తాను నిత్యము నవాభినయముల తోడను వసంతోత్సవ దర్శనములతోడను, సంతానాభ్యుదయముతోడను నానందించు భాగ్యము కుమారగిరికి సమగ్రముగఁ గలిగెనని యీ శ్లోకభావము. కుమారగిరి వసంతోత్సవము లెంతటివైభవముతో జరిగెడివో యీ విషయమును శ్రీనాథుఁడు హరవిలాసమునఁ దెలిపియే యున్నాఁడు.] అభినయ ప్రదర్శనములతోఁ గాలముగడుపు తీరెట్టిదో దానిని కాటయ వేముఁడు తాను రచించిన అభిజ్ఞాన శాకుంతల వ్యాఖ్యానమున కుమారగిరి రాజీయ ప్రారంభమునం దిట్లు వివరించినాఁడు.

శ్లో. జయతి మహిమా లోకాతీతః కుమారగిరి ప్రభోః
సదసి లకుమాదేవీ యస్య ప్రియా సదృశప్రియా,
నవమభినయం నాట్యార్థానాం తనోతి సహస్రధా
వితరతి బహూ నర్థా నర్థి వ్రజాయ సహస్రశః.
—అభి. కుమా. 3 శ్లో.

కుమారగిరి ప్రభువు సభలో లక్ష్మీ సమానురాలు ప్రీతిపాత్రురాలునగు లకుమాదేవియను లాస్యకర్త్రి, నాట్యార్థములకు వేలకొలఁదిగ నూతనాభినయములను ప్రదర్శించి ప్రదర్శించుచుండును. లక్ష్మీ సదృశిగ నవ యాచకులకు వేలకొలఁదిగ ధనములిచ్చుచుండును. ఆమె యాస్థాన లాసికగా నుండుటచేఁ గొమరగిరి నృపాలుని మహిమ లోకాతీతమై విరాజిల్లుచుండెనని భావము. కుమారగిరి వసంతరాజ బిరుదాంకితుఁడై వసంతరాజీయమను నాట్యశాస్త్ర గ్రంథమును రచించెను. దానిలో భరతాదుల గ్రంథములకంటె విలక్షణముగఁ గొన్ని విషయములు జతగూర్పఁబడినవి. అట్టి విషయములకు నూతనాభినయములు ప్రదర్శించుటకై లకుమాదేవి యుపయోగపడుచుండెడిదిగాఁ దెలియ వచ్చుచున్నది. కుమారగిరి వసంతరాజీయమను నాట్యశాస్త్ర గ్రంథమును రచించినట్లు కాటయవేముని నోటనే మనకుఁ దెలియవచ్చుచున్నది.

శ్లో. మునీనాం భరతాదీనాం భోజాదీనాంచ
భూ భుజాం

శ్లో. పుత్రః ప్రాదురభూత్తస్య కుమారగిరి భూపతేః
అన్నవోత ఇతి ఖ్యాతః స్వ పితామహవిక్రమః॥
తంబాల మంక మారోప్య కుమారగిరి భూపతిః
దాక్షారామే తులాదాన మకార్షీదతికౌతుకాత్ ॥
అథ తస్మై కుమారాయ యౌవరాజ్య విభాసినే
దేశం దిగ్విజయాక్రాంతం దాతుకామ
స్సభూపతిః॥

చతుర్విధోపాయ నయ ప్రవీణం
సామ్రాజ్య నిర్వాహ మహా ప్రభావం
స్వసుః పతిం కాటయ వేమ భూపం
రాగా దవాది దతికౌతుకేన.
ఉదీచ్యా దాక్షిణాత్యాశ్చ ప్రతీచ్యాశ్చ మహీశ్వరాః
ఆచరంతి సదా మైత్రీ మస్మాభిరతి కౌతుకాత్ ॥
తస్మాత్సింహాద్రి పర్యంత ప్రాచ్యవివమహీశ్వరాః
జేతవ్యా స్త్వన్మహీపాలా నఘునా జయ లీలయా॥

ఆ కుమారగిరి భూపాలునకు అన్నవోతుఁడను కుమారుఁ డుదయించెను. ఆ కుమారుఁడు తాతయగు అన్నవోతునితో సమానమగు పరాక్రమము గలవాఁడై యుండెను. ఆ బాలు నొడిలోఁ గూర్చుండఁ బెట్టుకొని కుమారగిరి దక్షారామమునం దతి కౌతుకముతో తులాపురుష దానము గావించెను. పిమ్మట నాకుమారునకు యౌవరాజ్యమున పట్టాభిషేకము చేసి, దిగ్విజయముచే నాక్రమించిన క్రొత్తదేశము నియ్యఁ దలపెట్టి, సామదానాది నీత్యుపాయ నిపుణుఁడు, సామ్రాజ్య నిర్వహణ దక్షుఁడు, తనసోదరీ భర్తయునగు కాటయ వేముని గౌరవించి ప్రేమ పూర్వకముగ నిట్లనెను. “ఉత్తర దక్షిణ పశ్చిమ దిక్కులందున్న భూపాలకులు మనతో నెల్లపుడు మైత్రి నాచరించుచున్నారు. సింహాచల పరిసరములందున్న తూర్పునాఁటి భూపాలురే మనకు జయింపవలసినవారుగా నున్నారు. కావున వారినిపుడు హేలగా జయింపుము” ఈప్రసంగముచే నీతి చతురుఁడు సామ్రాజ్యనిర్వహణ దక్షుఁడు విజయసాధకుఁడు కాటయ వేముఁడేయనియు కుమారగిరిపరమధార్మికుఁడై కీర్తిప్రతాపాభరణుఁడు మాత్రమే యనియు తెలియుచున్నది.

శ్లో. తత స్శైల పురాత్తస్య కుమారగిరి భూపతేః
రమ్యం రాజమహేంద్రాఖ్య నగరీంప్రత్యపద్యత॥
తన్నగర్యాంగరీయస్యాం ప్రాకారాంతర భూమణిం
ఆస్తే శ్రీ గోపికాధీశ శ్శుకబ్రహ్మ ప్రతిష్ఠితః॥
ఇత్థం ప్రభావోదయ భాసమానం
తం గోపికానాథ మశేష సేవ్యం
మహామతిః కాటయ వేమ శౌరి
ర్జయ ప్రసిద్ధ్యై మనసా ప్రణమ్య॥
అస్మిన్దిగ్విజయే తుభ్యం గ్రామ మత్యూర్జితం విభో
దాస్యామీతి ప్రతిశ్రుత్య సత్యశాసన వైభవః॥
......ప్రాతిష్ఠత ప్రాజ్ఞ ఃపతీ న్విజేతుం॥
తతో వింధ్యాద్రి సింహాద్రి మధ్యవర్తి మహీశ్వరాన్
జిత్వా తద్దేశ దుర్గేషు నియుజ్య స్వాధికారిణః॥

అటుపిమ్మటఁ గాటయ వేముఁడు కొండవీటి నుండి కుమారగిరి యధికారమునందున్న రాజమహేంద్రవరమునకుఁ దరలివచ్చెను. ఆ పురమున ప్రాకారాంతరాలంకారభూతుఁడై శుకబ్రహ్మ ప్రతిష్ఠితుఁడైన గోపాలదేవుని దర్శించి విజయము లభించుటకై నమస్కరించి, “ఈ తూర్పునాఁటి విజయము లభించిన నీకు మహా విభవ సంపన్నమైన గ్రామము నర్పింతునని మ్రొక్కుకొని, శుభలగ్నమున ప్రయాణభేరి మ్రోగించుచు తూర్పునాఁడు జయించుటకు బయలుదేఱెను. ఆ జైత్రయాత్రలో సింహాద్రికి వింధ్యాంద్రికి మధ్య నుండు మహీపాలకులను జయించి, జయించిన దుర్గములందుఁ దనవారి నధికారులుగా నియోగించి మరలివచ్చెను.

శ్లో. తతో నిజ భుజా లబ్ధ మహా విజయ హేతవే
హిమాచల సముత్తుంగ పతంగ పతికేతవే॥
రాజరాజ మహేంద్రాఖ్య పురీనిత్య నివాసినే
శ్రీమద్గోపాలదేవాయ శాశ్వతైశ్వర్యదాయినే॥
కుమారగిరి భూభర్తు స్సుతేన రవి తేజసా
అన్నవోత కుమారేణ సామ్రాజ్యసు చిర శ్రియా॥
తుల్యభాగ నదీతీరే గ్రామ ముద్దామ వైభవం
సోయం కాటయ వేమాంకః ప్రాదాపయదుదారధీః॥
శాకాబ్దే నేత్రచంద్రజ్వలన శశిమితే మాసివైశాఖసంజ్ఞే
సప్తమ్యాం శుక్లపక్షే కుమారగిరి విభోస్సూను రింద్ర
ప్రతాపః
గ్రామం శ్రీ యన్నవోత ప్రభు రను పఱితి ప్రౌఢ
నామాభిరామం
ప్రాదా దా చంద్రతారం నిజ విజయ కృతే గోపికా
ధీశ్వరాయ.

తరువాతి కాటయ వేముఁడు తన భుజబల లబ్ధ విజయమునకుఁ గారణభూతుఁడై రాజమహేంద్రవాసియైన గోపాలదేవునకు, కుమారగిరి కుమారుఁడైన కుమారాన్నవోతుని చే తుల్య భాగానదీతీరమున మహావిభవ సంపన్నమైన గ్రామమును దానము చేయించెను. శ॥సం॥౧౩౧౨ క్రీ. శ. 1390 వైశాఖ శుద్ధ సప్తమినాఁడు అన్నవోత ప్రభువు గోపాలదేవునకు తనకు విజయమునకుగూర్చిన

# నివురుగప్పిన నిప్పు

"కావ్యశ్రీ"

శేషగిరి సినిమా చూస్తున్నాడన్న మాటేగాని అతని మనసు మనసులో లేదు. చూడగా, చూడగా తన జీవిత గాథ తెరకెక్కిందా అన్న అనుమానం మరీ బలపడ సాగటంతో శేషగిరి పూర్తిగా మైమరచిపోయి గడిచిపోయిన కమ్మని జీవిత ఘట్టాల మధుర స్మృతులను నెమరు వేసుకొంటూ సినిమా అయిపోయిన సంగతి గమనించలేక చుట్టూ లేచిన జనాన్ని చూచి ఉలిక్కిపడి లేచినిలుచున్నాడు! రమణ కూడా లేచాడు. ఇద్దరూ బయటకు వచ్చి రమణ ఇంటివైపు నడవటం మొదలుపెట్టారు. శేషగిరి మకాం దూరంగా రైలు పట్టాల అవతల ఉండటంచేత ఎప్పుడు సినిమాకు వెళ్ళినా రమణ ఇంటి దగ్గర పడుకోవటం మామూలైపోయింది. దారిలో నీలిరంగు వేసిన కర్ర స్తంభాల డాబా దగ్గరకు వచ్చాక రమణ వెనక్కి వెనక్కి తగ్గి ఆ డాబా గుమ్మంలోనికి చూడటం యెందుకో శేషగిరికి అర్థం కాలేదు. ముందుకు వెళ్ళిన శేషగిరి ఒక అడుగు వెనక్కి వేసి తానూ చూడబోయాడు, ఆ డాబా వీధి గుమ్మంలోనుంచి లోపలకు! ఇంతలో రెండవ ఆటకు కంగారుగా వెళుతూ — గాలికెగిరి తన ముఖం మీద ముసురుపడ్డ వాయిల చీర పైట తీసుకొంటూ తనవంక వయ్యారంగా చూచి చిరునవ్వు నవ్వి మల్లెపూల ఘుమఘుమలు వెదజల్లి వెళ్ళిపోయిన ఓ మిటారి పొంకాన్ని బింకాన్ని చూచి నీలిరంగు వేసిన కర్ర స్తంభాల డాబా సంగతి మరిచిపోయాడు శేషగిరి. రమణ వచ్చాడు. ఇద్దరూ కలసి రమణ యింటికి వచ్చి ఎప్పటిలాగే చావిడిలో పడుకొన్నారు.

రమణ గుర్రుపెట్టి నిద్రపోతున్నాడు శేషగిరి జాగ్రదవస్థో స్వప్నావస్థో తెలియని అయోమయ స్థితిలో సినిమా రేపిన తియ్యని గాయాలు తలుచుకొంటూ కళ్ళుమూసుకొని పడుకొన్నాడు. మధుమాసపు తొలి రోజుల మందపవనాలు మందయానల కేశబంధాల్లోని మందపరిమళాలు తెచ్చి డెందానికి మరింత ఆనందం కూరుస్తుంటే శేషగిరి హృదయాంతరాళంలోని జ్ఞాపకాలు అగాధాలలో పడి సుడిగుండాలు తిరుగుతున్నాయి. "పాలిపోయిన బుగ్గలమీద కన్నీళ్ళు ధారలు కట్టి ప్రవహిస్తుంటే ముడివిడిన జుట్టు మూపు మీద చిందరవందరగా పడివుండగా, కొడి తగ్గించిన లైటు పట్టుకొని వచ్చి తన దగ్గర నిలుచుని నీళ్ళునిండిన కళ్ళతో తనవంక చూస్తున్న లక్ష్మి" కనుపించగానే ఉలిక్కిపడి లేచాడు శేషగిరి. అతనలా లేస్తుండగనే లైటు ఆర్పినట్లుగా గదిలోవున్న కాంతి మాయమై చీకటి మయమయింది. లోపల ఎవరో గది తలుపులు గడియ వేసినట్లు చప్పుడయింది. తాను చూచింది కలో నిజమో తేల్చుకోలేకపోయాడు శేషగిరి. ఇన్నాళ్ళకు లక్ష్మి కలలోనైనా కనుపించినందుకు సంతోషింపబోయాడు శేషగిరి. కానీ మరుక్షణంలోనే లక్ష్మి కన్నీళ్ళు గుర్తుకువచ్చి పడుకొన్న మంచంలోనే కృంగిపోయాడు.

శేషగిరి బదిలీ అయి ఆ వూరు వచ్చినప్పటినుంచి రమణ, గిరి స్నేహంగావుంటున్నారు. ఆ వేళ ఆదివారం కావటంతో షికారుకు బయలుదేరిన మిత్రులు గోదావరి వడ్డున దూరంగా, వేసవి యెండలకు నీరెండి బయలుపడ్డ యిసుక తిన్నెమీద కూర్చున్నారు. శుక్లపక్షపు పంచమి చంద్రుని లేత వెన్నెలలో నదీమతల్లి జలతారు చీర కట్టినట్లుగా మెరుస్తూ ఉంది.

"ఏరా శేషగిరీ! ఇక బ్రతుకంతా బ్రహ్మచారిగానే గడపదలచావా?"

"నువ్వెన్నిసార్లడిగినా సమాధానం మారదు రమణా! చెప్పానుగా అవునని"

కాస్సేపు నిశ్శబ్దంగా శేషగిరి వంక చూచి సిగరెట్టు అగ్గిపెట్టె తీశాడు రమణ.

"పోనీ నువ్వు చెపుతానన్న కథ యివాళయినా చెపుతావా?"

"ఏకథ?"

"అదే! నువ్విలా బ్రహ్మచారిగా వుండటానికి కారణమైన కథ!" అంటూ సిగరెట్టు వెలిగించటానికి

ముందే మరణించాడు. అమీరుకు తల్లి లేదు. అలా జరిగిన మరునాడే అమీరుని వాళ్ళ తమ్ముణ్ణి తీసుకొని వాళ్ళమ్మమ్మ తన యింటికి కాకినాడ వెళ్ళిపోయింది.

నాలో తుఫాను చెలరేగింది. మరుగునపడివున్న మమతలు బయటపడసాగాయి. అమీరున్నీసా వెళ్ళిపోవటంతో నా హృదయంలోని ముగ్ధవాంఛా పారిజాత పరిమళమంతా దుఃఖితమస్సుగా మారిపోయింది. ప్రపంచమంతా చీకటిగా తోచింది. పాతికమంది పిల్లా పెద్దలతో కిటకిటలాడే మా చిన్నాన్నగారింట్లో నేను భరించరాని ఒంటరితనంతో బాధపడేవాడిని! నా హృదయంలో వాంఛాదుఃఖాలు రెండూ ఒకేసారి గంగాయమునల్లాగ కలసి పెనవేసుకొని మథింపజొచ్చాయి." అని నిట్టూర్చి ఆపుచేశాడు శేషగిరి.

"ఇంతకూ నువ్వు కథ చెపుతున్నావా కవిత్వం చెపుతున్నావా?"

"ఆనాటి నా హృదయంలోని బాధ అర్థమయ్యేటట్లు వర్ణించాలంటే భాష దొరకటంలేదు రమణా. నేను వాడిన పదాలు నా భావము ముందు చాలా పేలవాలు"

"సరే తర్వాత కథ కానీయ్" అన్న రమణ మాటలతో తిరిగి చెప్పసాగాడు శేషగిరి.

"ఆ జ్ఞాపకాలతోనే తర్వాత సంవత్సరంకూడా గడిపాను. ఆ సంవత్సరంలో ఒక్కసారయినా అమీరును చూడలేకపోయాను. కనీసం ఆమె దగ్గరనుంచి ఉత్తరమైనా రాలేదు. నేనూ వ్రాయలేదు. స్కూలు ఫైనలు పరీక్షలు బాగానే వ్రాశాను. సెలవులలో కూడా స్వగ్రామం వెళ్ళకుండా అక్కడే వుండి హిందీ చదువుతున్నాను. నా హృదయానికి నిజమైన వసంతఋతులక్షణాలప్పుడే పొడచూపాయి. మా యింటి యెదురుగావున్న వారమ్మాయి పెళ్ళికి వాళ్ళచుట్టాలొచ్చారు. మావాళ్ళందరితోబాటు నేనూ వెళ్ళాను పెళ్ళికి. పెళ్ళికొడుకు తాళికట్టే ఆ సుముహూర్తములో అప్రయత్నముగా పేరంటాళ్ళలో నిలుచున్న ఓఅమ్మాయివంక చూశాను. అప్పటికే ఆ అమ్మాయి నావంక చూస్తూవుంది. "ఆగండోయ్ భజంత్రీలు" అని పురోహితుడు అరిచేవరకూ మేమలా ఒకరినొకరు చూచుకొంటూనే వున్నాం. పెళ్ళయిపోయిన పది రోజులవరకూ ఆ అమ్మాయి అక్కడే వుంది. ఆ పది రోజులలో మా పరిచయం రహస్య సమావేశాలవరకు వచ్చింది. ఒకనాటి సంధ్యాసమయంలో లక్ష్మితో నేను "పెళ్ళంటూ చేసుకొంటే నిన్నుతప్ప మరెవ్వరిని చేసికోను" అని ప్రమాణం చేశాను. ఆమె చటుక్కున వంగి నాపాదాలకు నమస్కరించింది.

"ఆ అమ్మాయిపేరు లక్ష్మా?"

"అవును. అసలు పేరు చాల పెద్దదట. అందుకంచేతా చివరనున్న లక్ష్మి అనే పిలిచేవారు. నేనూ అంతే"

"ఊఁ తర్వాత"

"నాలో పరవళ్ళుత్రొక్కే ప్రేమప్రవాహమంతా ఆమె పాదాలదగ్గరకు ప్రవహించింది. మా రహస్యసమావేశాలు ఎలాగో బయటకు పొక్కాయి. పెద్దలవరకూ ప్రాకాయి. మా చిన్నాన్న నన్ను సన్న సన్నగా మందలించాడు. ఆరాత్రి వాళ్ళ తమ్ముడు కృష్ణారావుచేత చీటీ పంపించింది లక్ష్మి ఒక్కసారి మాట్లాడమని. ఆ మరునాడే తను యింటికి వెళ్ళిపోతూవుందట అనుకొన్నట్లుగానే మా పెరటిలో పశువులశాల అవతల గడ్డిమేటి ప్రక్కనుకూర్చొని లక్ష్మి రాకకోసం యెదురుచూస్తున్నాను. "పాలిపోయిన బుగ్గలమీద కన్నీళ్లు చారలుకట్టి ప్రవహిస్తుంటే, ముడివిడిన జుట్టు మూపుమీద చిందరవందరగా పడివుండగా కొడి తగ్గించిన లైటు పట్టుకొనివచ్చి, నీళ్లు నిండిన కళ్లతో నావంక చూస్తూ చటుక్కున నా కాళ్ళకు నమస్కరించింది. ఆమె నోదార్చటం యెలాగో నాకు తెలియలేదు. సంగతులన్నీ చెప్పింది. మా ప్రణయగాథ బయటపడినందువల్లనే తనను బలవంతంగా పంపించేస్తున్నారట! మేమలా మాట్లాడుతూవుండగానే ఎవరో ముసలమ్మవచ్చి లక్ష్మిని రెక్కపట్టుకొని లాక్కుపోయింది. అప్పటినుంచి యిప్పటివరకూ లక్ష్మి నాకు కనుపించనేలేదు.

"లక్ష్మిని పెళ్ళాడటానికి మీవాళ్లు అంగీకరించలేదా?"

"లేదు"

"ఎందుకనీ?"

"వాళ్లనాన్న జూదగాడట! వ్యభిచారట! ఆసంబంధం మాకు సరికాదట."

"లక్ష్మికి పెళ్లయిందా"

"అయిందట"

"ఏ వూరు?"

"సామర్లకోట"

రమణ యెందుకో గతుక్కుమన్నట్లయాడు. అనుమానిస్తూ అడిగాడు.

"లక్ష్మి పుట్టిల్లు ఏవూరు?"

"రాజవరం"

"రాజవరమా" యీసారి నిజంగా కంగారు పడ్డాడు రమణ!

"ఏం అలా అడుగుతున్నావు?"

"ఏంలేదు. మా అత్తవారుకూడా రాజవరమేగా! మీ లక్ష్మిని నే నెరుగుదునేమో అని"

"అవును మీ అత్తవారుకూడా ఆ వూరే కాబట్టి నీకు తెలియక పోయినా మా చెల్లాయికి తెలిసి వుంటుంది! ఇంటికివెళ్లాక కనుక్కో. లక్ష్మి యెలా వుందో"

"అలాగే! లక్ష్మి మొగుడిపేరు తెలుసా?"

"తెలియదు"

"తండ్రిపేరు"

"వెంకన్న"

రమణముఖంలో రంగులు మారుతున్నాయి. ఉన్నట్టుండి ఒక్కసారిగా నవ్వి అన్నాడు.

"ఓరి! చంపావుపో! వాళ్లయిల్లు మా అత్తవారి యింటిప్రక్కనే! నీ లక్ష్మి మా ఆవిడ ప్రాణస్నేహితులు కూడాను. ఇద్దరూ ఒకటే అన్నట్లుంటారు. అయితే ఫరవాలేదు నీ లక్ష్మి సుఖంగానే వుంది"

"అదే నాకు కావలసింది. ఆమె పవిత్రతే ఆమెను కాపాడుతుంది. అన్నిసార్లు రహస్యంగా కలుసుకొన్నా ఒక్కసారికూడా ఆమెను నేను స్పృశించలేదు. నిప్పులాంటిది మనిషి" రమణ యీ మాటలువింటూ ముఖం త్రిప్పుకొన్నాడు. కాస్సేపు నిశ్శబ్దం తాండవించింది. చివరకు రమణ రావే అడిగాడు,

"మరి అమీరున్నీసా యేమయింది?"

"చెపుతున్నాగా కంగారుపడకు" అని తిరిగి ప్రారంభించాడు శేషగిరి.

"స్కూలుఫైనలు ప్యాసయ్యాను. మా మేనమామ కూతురునిచ్చి పెళ్లిచేయాలని పెద్దలలో ఉద్దేశాలు బయలుదేరాయి. చదువు పూర్తయేవరకూ పెళ్లిమాట తలపెట్టవద్దని చెప్పి అంతలో కాలేజీలు తెరవటంవల్ల కాకినాడవెళ్లి కాలేజీలో చేరాను. నా జీవితానికిక వెలుగులేదని దృఢనిశ్చయంతో బలవంతంగా యిక చేసేదిలేక ఇంటరు చదవటం మొదలుపెట్టాను. మొదటి సంవత్సరం అయిపోయింది. వేసవి సెలవలలో స్వగ్రామం వెళ్లటానికిష్టంలేక మా పిన్నిగారి యింటికి వెళ్లాను. ఒకనాడు సాయంకాలం అలా బయటకు వెళ్ళి తిరిగి వచ్చేటప్పటికి నా పాత రీడింగురూములో నేను పడుకొనే మంచం మీద కూర్చుని మా పిన్నితో మాటలాడుతున్న ఒక స్త్రీవ్యక్తిని చూచి నేను గుమ్మంలోనే నిలబడిపోయాను. సంపంగి గుత్తిలా కుందనపు బొమ్మలా, పచ్చగా బొద్దుగా మిలమిలలాడుతున్న యెప్పుడో చూచిన ముఖాన్ని పోల్చుకొంటూ నిలుచున్న నన్నుచూచి ఆమె నవ్వుతూ అంది "ఏం గిరీ! మరిచిపోయావేమిటి _"

"మన అమీరున్నీసారా" అంది మా పిన్ని! సరిగా అప్పటికే నేనూ పోల్చుకొన్నాను. ముగ్గురం కూర్చుని కబుర్లు మొదలుపెట్టాం. అమీరు హయ్యరు గ్రేడు ట్రయినింగు చదివిందట. సెలవు లాఖరున పంతులమ్మగా పనిలో ప్రవేశిస్తుందట.

ఆ రాత్రి మరల నాలో వ్యధ ప్రారంభమయ్యింది. అమీరును చూచినప్పటినుంచి ఆనాటి యేడుపుముఖంతో లక్ష్మి నా కళ్ళలో మెదలటం ప్రారంభించింది. లక్ష్మికి అప్పటికే పెళ్లి అయిపోయిందని విన్నాను. ఎంత మానదామన్నా ఆమె తలపులు నన్ను వెంటాడుతూనే వున్నాయి ఆ ఆలోచనలతోనే తెల్లవారుఝామున సన్నగా మగత కునుకు పట్టింది. దెయ్యంపట్టినట్లుగా ఉక్కిరిబిక్కిరై కళ్లు తెరిచేటప్పటికి అమీరు నీసా నా బుగ్గమీద ముద్దు పెట్టుకొంటూవుంది. ఆవేశం అణుచుకోలేక మారు మాటలాడలేక పోయాను. నేనుచేసింది తప్పే! అయినా నిజం చెపుతున్నాను అప్పట్లో ఆమె కౌగిలినుండి తప్పించుకోవటం నా చేత కాలేదు. అసలు తప్పించుకోవాలని దృష్టి రానేలేదు నాకు——...మరునాడు ప్రొద్దుట ఎండెక్కి మెలకువ వచ్చి తలగడమీద నలిగి పడివున్న మల్లెపూలచెండును గుండెలమీద చెమట కంటుకొనివున్న తెగబారెడు నిడుపు పొగవెంట్రుకను కంగారుగా తీసి బయటకు పారేస్తుంటే మా పిన్ని వచ్చి "అమీరు వెళ్ళిపోయిందిరా! నీతో చెప్పమంది." అంది. అమీరు విచిత్ర మనస్తత్వం అర్థంగాక తెల బోయాను. ఇలా జరిగి ఆరేళ్లయింది. అప్పటినుంచీ

యిప్పటివరకూ అమ్మాయి కనుపించలేదు. కానీ ఒక రంభూను వ్యాపారితో లేచిపోయిందని, మరలవచ్చి ఒక కొయ డ్రైవరుతో వుంటుందని కబుర్లు విన్నాను. ఇప్పుడెక్కడుందో తెలియదు. లక్ష్మి సంగతి అసలు తెలియనే తెలియదు. ఈ ఆరు సంవత్సరాల నుంచీ పెళ్ళి చేసుకోమని మా వాళ్లు పోరాడుతూ నేవున్నారు. నేనిలా గేవున్నాను. ఇది నా కథ!" అని ముగించాడు శేషగిరి. ఇద్దరూ యిళ్ళకు వెళ్ళిపోయారు.

శేషగిరి పనిచేస్తున్న ఆఫీసులోవున్న టైపిస్టు కృపాబాయికి శేషగిరి అంటే అటువంటి భావం యెందుకు కలిగిందో ఆమెకు కూడా తెలియదు. ఎప్పుడూ యెగుపెక్క వుండే కళ్ళతో యేక్షణం చూచినా కోపంగా కనుపించే అతని ముఖమంటే తన కెందుకింత యిష్టం కలిగిందా అని కృపాబాయి చాలా సార్లు ఆలోచించింది కాని సమాధానం దొరకలేదు. ఆ వేళ మధ్యాహ్నం లంచ్ టైములో ప్యూనువచ్చి రమణను శేషగిరిని కృపాబాయి పిలుస్తున్నారని చెప్పి వెళ్ళిపోయాడు! మిత్రుల చిరునవ్వులు లెక్క చేయకుండా యిద్దరు టైపింగు రూములోకి వెళ్ళారు. అప్పటికే టిఫిన్లు పెట్టిన ప్లేట్లు, కాఫీ వీరి కోసం యెదురు చూస్తున్నాయి శుభ్రముకులోపరి ప్లేట్లు కప్పులు కాళీలయ్యాయి ఇంతలో ద్వారకా లంచ్ హోంనుంచి యెవరో ఫోనులో రమణను పిలుస్తున్నారని ప్యూను కబురు తెచ్చాడు. రమణ మేనేజరు దగ్గర సెలవు తీసికొని ఇంటికి వెళ్ళిపోయాడు.

"ఇవాళ మనం సినీమాకు వెళ్ళాలి" గోముగా అడిగింది కృపాబాయి.

"దానికేం? అలా గే" అన్నాడు శుద్ధసత్వ పదార్థం లాగ.

"అయితే ముందు మా యింటికి రండి! అక్కడ నుంచి యిద్దరం కలసి వెళదాం"

"సరే" అని శేషగిరి అక్కడనుంచి వెళ్ళిపోతూ వుండగా అతనితో పనిచేస్తున్న మరొక గుమాస్తా ఇబ్రహీం అలా వెళుతూ రుసరుస చూశాడు. కృపాబాయి సన్నని మృదువైన చేతి వేళ్ళు విజయ గర్వంతో టైపుమిషను కీ బోర్డు మీద ఉత్సాహంగా నాట్యమాడాయి.

అయిదు కాగానే ఆఫీసునుంచి బయటకువచ్చి ఇండియన్ కాఫీ హౌసులో కాఫీ త్రాగి తిన్నగా కృపాబాయి యింటికి వెళ్ళాడు శేషగిరి. అప్పటికి సినీమాకు వెళ్ళటానికి సిద్ధంగా లేదావిడ! పదినిముషాలు కూర్చోమని చీర సింగారించుకొని 8 గంటలకు వచ్చింది. ఇక తొలి ఆట లాభం లేదు కాబట్టి రెండవ ఆటకు వెళదామంది. సరే అన్నాడు! మరొక అరగంటలో అయిదారు రకాల స్వీట్సు—పళ్లు—పాలు పట్టుకొచ్చి తినమనికూర్చుంది. వద్దంటే పనేమిరా తిని తీరాలంది. చేతులు పట్టుకొంది. గడ్డం పట్టుకొని బ్రతిమాలింది. అవన్నీ చేయాలని చేస్తున్నట్లుగా స్పష్టంగా తెలుస్తూనే వున్నాయి. ఆ బాధ తప్పించుకోవాలని యిష్టం లేకపోయినా ఆమె చెప్పినట్లు చేయక తప్పింది కాదు శేషగిరికి అప్పటికి తొమ్మిదయింది. ఇద్దరూ సినీమాకు బయలు దేరారు. హాలుదగరకు వెళ్ళేటప్పటికే ఆట ప్రారంభ మయ్యింది. ఇద్దరూ లోపలకు వెళ్ళి కూర్చుంటూ వుండగా వెనక సీటులో గాజులు గలగలలాడాయి. శేషగిరి వెనక్కి తిరిగి చూశాడు. ఆ వెనక సీట్లో ఆవిడ ముఖం ప్రక్కకు త్రిప్పుకొని పైట చెంగు ఓరగా ముసుగుపెట్టుకొంది. అంతవరకూ ఆవిడ ప్రక్కను కూర్చున్న తను చటుక్కున లేచి వెళ్ళిపోయాడు. ఆట జరిగిపోతూవుంది. ఇంటర్ వల్ లో లైటు వెలగానే వెనక్కి తిరిగి చూశాడు గిరి. ఆ వెనక సీట్లో ఆవిడ లేదు. ఆమె ప్రక్క తను తిరిగి రానే లేదు. సినీమా అయిపోయింది. శేషగిరి లేచి చూశాడు. ఆ వెనకసీట్లో ఆవిడ లేదు. అతను కృపాబాయిని రిక్షా ఎక్కించి వంటరిగా రమణ యింటికి నడక ప్రారంభించాడు. కొంతదూరం వచ్చేటప్పటికి తన వెనకాల యెవరో వస్తున్నటుగావుందని ఆగి చూశాడు! పరిచితు లెవరూ లేరు. ఎవరో ఆడవాళ్లు—అన్నట్లు ఆ వెనక సీట్లో ఆవిడ ఇంకా ముఖానికి ముసుగుతోనే వస్తుంది. ఈమె యిల్లుకూడా యిటే కాబోలు ననుకున్నాడు. ఇంతలో నీలిరంగు వేసిన కర్ర స్తంభాల డాబాదగరకు వచ్చాడు! అలవాటయినటుగా అటు చూశాడు. తలుపులు వేసివున్నాయి. ముందుకు నడిచాడు. "శేషగిరీ" అన్న ఆడగొంతుకు పిలుపువిని అదరిపడి ఆగి వెనక్కి చూశాడు. ఎవరూ లేరు. ఆ నీలిరంగు వేసిన కర్ర స్తంభాల డాబా తలుపు లెవరో తీస్తున్నారు! చూస్తున్నాడు! మరలా వినిపించింది అదేపిలుపు "గిరీ". ఆశ్చర్యం! ఆవిడే! తన వెనకసీట్లో ముసుగు వేసుకుని కూర్చున్న ఆవిడే ఆ నీలిరంగువేసిన కర్ర స్తంభాల

రమణకు మెలకువ వచ్చింది. నెమ్మదిగా కాంతి తాము పడుకొన్న చావిడిలోకి వస్తున్నట్లయి, కన్నులు మూసుకొని దొంగనిద్ర నభినయించాడు రమణ. ఒక అమ్మాయి పాలిపోయిన బుగ్గలుమీద కన్నీళ్ళుచారలు కట్టి ప్రవహిస్తూవుంటే ముడివీడిన జుట్టు మూపుమీద చిందరవందరగా పడివుండగా కొడి తగ్గించిన లైటు పట్టుకొనివచ్చి శేషగిరి పాదాలదగ్గర నిలుచుని నిలుచుని నీళ్ళునిండిన కళ్లతో గిరివంక చూసింది. ఇంతలో లోపల యేదో చప్పుడు కావటంతో చటుక్కున లైటార్పి తన గదిలోకివెళ్ళి వెంటనే గడియపెట్టుకొంది. ఈ దృశ్యమంతా నిద్రపోయినట్టుగా నటిస్తూ చూచిన రమణకు ఇక నిద్ర పట్టలేదు. ఆలోచిస్తూ ఆ రాత్రంతా జాగరం చేశాడు.

ఆ మర్నాడు రమణ కాజువల్ లీవు ఎందుకు పెట్టాడో అర్థం కాలేదు శేషగిరికి. ఆఫీసు టైము కాగానే ఇండియన్ కాఫీ హౌసులో కాఫీ త్రాగి రమణ యింటికి బయలుదేరిన శేషగిరి సాయంకాలం సినీమాగోడ్లకు షికారుకువచ్చి పలకరించే మిత్రులనందరినీ సరుకొని తీరా రమణ యింటికి వెళ్ళేటప్పటికి ఏడున్నర అయింది. రమణ మామూలుగా వుండేచోట వీధి చావడిలో లేడు. కాస్సేపు అలాగే నిలబడి "రమణా" అనిగట్టిగా పిలిచాడు. శేషగిరిని చూచీ చూడగానే రమణతల్లి బావురుమంది. శేషగిరి అర్థంగాక కొయ్యబారిపోయాడు. రమణతల్లి యేడుస్తూ జరిగిన కథను టూకీగా తేల్చేసింది. "రమణ తన భార్యను ప్రొద్దుటనుంచీ నానా హింసలు పెట్టి కొట్టి చివరికి సాయంకాల ఆరుగంటలబండికి పుట్టింటికి ఒంటరిగా బలవంతంగా పంపించేశాడు."

"కారణమేమిటి?"

"ఏమీ యెరగనట్టు యిలా అడుగుతావేం? లక్ష్మిని నువ్వెరుగుదువటగా! పెళ్లికాకముందు మీరిద్దరు ప్రేమించుకొన్నారట. ఎంతపని చేశావు నాయనా! స్నేహంగా వుండివుండి మా యింటికే నిప్పుపెట్టావు!" అని గట్టిగా యేడవటం ప్రారంభించిందావిడ. శేషగిరి కన్నులు చీకట్లు క్రమ్మాయి. భూకంపం వచ్చినట్టుగా భూమి జలదరించి పోయింది. నిలబడలేక చటుక్కున భూమ్మీద చతికిలబడ్డాడు. ఇంతలో ఆ ముసలావిడ యేడుపుతో కర్తవ్యం గుర్తుకువచ్చి "లక్ష్మి" అని పెద్దగా కేక పెట్టి స్టేషనుకి పరుగెత్తాడు. అక్కడకు వెళ్ళాక తెలిసింది. బండి రెండు నిమిషాలు క్రితమే 8 గంటలకు వెళ్లిపోయింది. హతాశుడై అక్కడే కూలబడ్డాడు. "ఏం చేయగలడు? ఏం చేయాలిప్పుడు." ఆ ప్రశ్నలే ప్రళయఘోషలా మారు మ్రోగుతున్నాయి అతని హృదయంలో. ఎంత వెదికినా జవాబు దొరకటంలేదు. మనసంతా వికలమైపోయింది. కేవలం జడపదార్థంలాగ - రాతి బొమ్మలా కూర్చుండిపోయాడు గాలిమాత్రం పీలుస్తూ. అలా యెంతసేపున్నాడో తెలియదు. "తన లక్ష్మి రమణ భార్యా?" ఏమిటీ విచిత్ర సంఘటన? ఏమిటి దీని పర్యవసానం? ఇంతలో మొదటి ఆట సినీమా అయిపోయింది. రోడ్డుమీదపోయే ఆడవాళ్ళ గొంతులో- ప్రతి గొంతులోను రమణతల్లి నిష్ఠుర కఠినస్వరమే వినబడుతూవుంది. ఏదో జ్ఞాపకం వచ్చినట్టుగా ఉద్వేగంగా లేచాడు" "ఎలాగయినా సరే రమణకు నచ్చచెప్పాలి! లక్ష్మిని తీసుకురావాలి! వాళ్ళ కాపురం చక్కచేయాలి" ఉన్మాదంతో తూలాడు. సరాసరి రమణ యింటికి పరుగెత్తాడు. రమణ యింటిదగ్గర లేడు! ఏమయ్యాడో తెలియదు. సినీమారోడ్డున వెదికాడు. లేడు రమణ! ప్రతిచోటా టిక్కట్టుకొని ప్రతి సినీమా హాలులోను వెదికాడు! కనుపించలేదు రమణ! అప్పటికే పన్నెండు దాటింది. అసలే భోజనం చేయకుండా వున్న శేషగిరి ఆకలి నీరసంతో ఆయాసంతో ఆవేశంతో తూలిపోతున్నాడు. ఎంత వెదికినా రమణ కనుపించలేదు. ఈ పాటికి యింటికివచ్చి వుంటాడేమో అన్న ఆలోచనరాగానే పెద్ద పెద్ద అంగలు వేసుకొంటూ రమణ యింటివైపు బయలుదేరాడు. దారిలో నీలిరంగువేసిన కర్రస్తంభాల డాబా కనుపించగానే ఒక విచిత్రమైన ఆలోచన తట్టింది. "అమీరున్నీసా-కాదు. తాయారు దగ్గరున్న డబ్బుతెచ్చి రమణ కిచ్చి లక్ష్మి నిర్దోషి, కాపురం చేసికోమని బ్రతిమాలితే రమణ ఒప్పుకోవచ్చు." గబగబా మెట్లెక్కాడు! తలుపులు బిగించివున్నాయి. లోపలనుంచి సన్నగా మాటలువినరావటంతో కిటికీలోనుంచి తొంగిచూశాడు. అటు తిరిగి సోఫాలో కూర్చున్న పురుషహస్తం రెండు పది రూపాయలనోట్లు ఎదురుగా నిల్చున్న తాయారు కందిస్తూవుంది. శేషగిరి గుండెలు అగ్నిపర్వతంలాగ బ్రద్దలయ్యాయి నోట్లు అందిస్తున్న ఆ "యెడమచేతి మణికట్టు క్రింద చిన్నప్పుడు కాలినమచ్చ" స్పష్టంగానే కనుపించింది. ఇక చూడలేకపోయాడు శేషగిరి. వ్యామోహంలో వున్న పురుషుడు భార్య సౌశీల్యాన్ని, అనుమానించినమీద, ఇక భరించలేడు. దారంతెగిన గాలిపటంలా దిక్కులు తెలియకుండా బయలుదేరాడు శేషగిరి. గడియారస్తంభం, హాస్పిటలు, కాలేజీదాటి యింకా నడిచాడు. కృపాబాయి యింటి ముందుగా వెళుతూ-అప్పుడే లోపలనుంచివచ్చి సైకిలెక్కి వెళ్ళిపోతున్న ఇబ్రహీంను సాగనంపి తలుపు వేసుకొంటున్న కృపాబాయి మసకగా కనుపించగానే సన్నగా నవ్వుకొన్నాడు. ఇంకా నడచి రైలుపట్టాలు దాటుతున్నాడు. కాలికేదో తగిలింది. చూచాడు. తెగిపడిన స్త్రీతల. పట్టాల కవతలమొండెం. ఆ పాలిపోయిన లక్ష్మిముఖం చూచి పట్టణమంతా ప్రతిధ్వనించేలాగ గట్టిగా నవ్వాలనుకొన్నాడు. కానీ నవ్వురాలేదు.

# తెలుగులో నానుళ్లు - పలుకుబళ్లు

## శ్రీ పిల్లలమఱ్ఱి వేంకటహనుమంతరావు

ఏ భాషాసౌందర్యమైనా ఆ భాషలో కనిపించే సహజమైన నానుళ్ళు-పలుకుబళ్ళపైన ముఖ్యంగా ఆధారపడి ఉంటుంది. వీనినే జాతీయాలనికూడా అంటారు. భాషను సజీవస్రవంతిలా ప్రవహింపచేసేవి భాషలో అందచందాలను అందించేవి అందులో గర్భితమైన నానుళ్ళు—పలుకుబళ్ళే! ఈ జాతీయాలను పదిలపరచ గల్గిన వాళ్ళు ఆయా భాషలు మాతృభాషలుగా కలిగిన వాళ్ళే. అన్యభాషీయులు నూతనంగా మరియొక భాష వ్యాకరణరీత్యా, నిఘంటువులద్వారా అభ్యసింపవచ్చునుగాని సహజసిద్ధమైన భాషాసౌందర్యాన్ని, ఆ భాషలోని నానుళ్ళలోను పలుకుబళ్ళలోను ఉన్న జీవాన్ని, వంటపట్టించుకోలేరు. అలాంటి 'రమ్యానుభవం' ఆ భాషాప్రాంతాల్లో పుట్టి పెరిగి ఆ భాషను జీర్ణించుకొన్నవాళ్ళుతప్ప యితరులు పొందలేరు. అసలు వాని సౌందర్యాన్ని, అలాంటివాని ప్రయోగాల్ని గమనించకపోతే, భాషకున్న ఒయ్యారాలనూ, ఒదుగులనూ, ఎదుగుపొదుగులనూ, తీరుతీయాలనూ తెలిసికోకపోతే—భాషాభ్యాసం చేసినా వ్యర్థుడే అవుతాడు. కాబట్టి ఇలాంటి నానుళ్ళు పలుకుబళ్ళు, సామెతలు—జాతీయాలు—ఏ భాషకా భాషకు అమరి ఉండి ఆ యా భాషలను విశిష్టంగా ప్రత్యేకించి భద్రపరుస్తూ ఉంటాయి!

సహజసౌందర్యవిలసితాలు, స్వయంప్రకాశాలూ అయిన నానుళ్ళు—పలుకుబళ్ళు ఆ భాషను మాతృభాషగా కలిగినవాళ్ళ భాషా వ్యవహారములో లభించడం మాట అటుంచి, ముఖ్యంగా యివి పట్టణవాసుల వ్యవహారములోకన్నా గ్రామీణుల వ్యవహారంలో హెచ్చుగా ఇమిడి ఉంటాయనడం తథ్యం. అన్యభాషాసంపర్కం, విజాతీయ నాగరికతా ప్రభావాలు ఏ భాషపైననైనా ఏ భాషీయులపైననైనా కొంతవరకుపడి, వారి భాషావ్యవహారంలో మార్పులు తీసుకొచ్చి తీరుతాయి. కృత్రిమత్వం కల్పించితీరుతాయి. ద్విభాషాప్రాంతాలలో, బహుభాషా వ్యవహారాలుండే పెద్ద పెద్దనగరాలలో ఇలాంటి భాషాసాంకర్యము గోచరించితీరుతుంది. వాక్యనిర్మాణపద్ధతిలో పదప్రయోగక్రమంలో అన్యభాషా ధోరణులు ప్రభావాన్ని నెరపడం — కొన్నియెడల కేవలానువాదాలే దొర్లడం - మనం కనిపెట్టవచ్చు. అన్ని భారతీయభాషలలోను. ఇటీవల కొన్ని శతాబ్దాల తరబడి ప్రభుత్వభాషగా ఏలికవహించిన ఇంగ్లీషు భాషాప్రభావం హెచ్చుగా ఉన్నట్లు తెలిసికోగలం. అలాగే తత్పూర్వం ముస్లింల పరిపాలనాప్రభావం దేశభాషలపైన లేకపోలేదు. న్యాయస్థానాలలో విపణివీథులలో నలుగుడుపడుతూ ఉన్న భాషనుచూస్తే, ఇంగ్లీషు, ఉర్దూపదాల బాహుళ్యం స్పష్టంగా అవగతమౌతుంది. అలాగే ద్విభాషాప్రాంతాలలో కన్నడపద సాహచర్యం, తమిళపద సంసర్గం, ఒరియాపద ప్రభావం, ఉరుదూభాషాప్రాచుర్యం, ఆయా భాషల ఉచ్చారణలూ తెలుగుభాషకు సంక్రమించడం మనము కనిపెట్టుతూ పొందుతున్న అనుభవమేకదా!

ఇలాంటి అన్యభాషా నాగరికతా సంపర్కంలేని గ్రామీణుల వ్యవహారంలో, ఆ ప్రభావానికిదూరంగా ఉన్నట్టివారి వ్యవహారంలో పలుకుబళ్లు నానుళ్లు పదిలపడి ఉండడం — గ్రామాలన్ని పట్టణాలుగా క్రమంగా మారిపోతూఉన్న యీ దినాలలో కష్టమే అయినా-భాషకు నిజంగా జీవాన్నిపోసే యీ జాతీయాలు ఇంకా నశించకుండా ఉండడం మన అదృష్టమే. కవులు రచయితలు తమ తమ రచనలలో ఆ యా ప్రాంతాల భాషాజీవిత సర్వస్వమైన జాతీయాలనే పెన్నిధిని చాలవరకు భద్రపరుస్తూ వచ్చారు. అయితే గ్రాంథికభాషలో రచనసాగిన కావ్యాలలో.ఆ కాలంలో ఈలాంటి నానుళ్లు పలుకుబళ్లు బహుధా చొప్పించడానికి ఎక్కువ అవకాశాలు లేకపోయినమాట వాస్తవం. కాని వ్యావహారిక భాషోద్యమాన్ని నడిపిన కీ. శే. గిడుగు వెంకట రామమూర్తి పంతులుగారి ధర్మమా అని యీ యిరవయ్యో శతా

## తెలుగులో నానుళ్లు - పలుకుబళ్లు

బ్దిలో వ్యావహారిక భాషలో తెలుగు పత్రికలు, గ్రంథాలు, కావ్యాలు, ఉపన్యాసాలూ, అసంఖ్యాకంగా వెలువడడం మూలాన మనకు కొంతకు కొంతైనా మన నానుడులు — పలుకుబళ్లు మాండలికాలు — సామెతలు నేటి మనవాఙ్మయంలో భద్రపడి ఉన్నాయి. తెలుగులో వ్యావహారిక భాషే గ్రాంథిక భాష అయిన యీ సమయాన, ప్రామాణికత్వం అంటూ వ్యావహారిక భాష కేర్పడవలసిన యీ తరుణంలో మన నానుళ్లు పలుకుబళ్లు, సామెతలు, మాండలికాలు క్రోడీకరించి నిఘంటువులుగా రూపొందించడానికి ప్రయత్నాలు ఒకదెస జరుగుతూ ఉండడం మనము హర్షింపదగిన విశేషం. ఈ నా వ్యాసం అలాంటి ప్రయత్నానికి ఏకొలదిగానో దోహదం కాగలదనే విశ్వాసం!

ఏ భాషలో ఉన్న నానుళ్లు — పలుకు బళ్లు ఆ భాష మాట్లాడేవాళ్ల శీలాన్ని, ఆచార వ్యవహారాలను జీవితాన్నీ ప్రతిబింబించ కలిగినవి అవుతాయి అనడం సత్యం. అలంకారాలపైన ప్రీతీ, ముక్కుమీద కోపమూ, పగులను పరిహసించే స్వభావం, అల్ప సంతోషస్వాంతతా, వ్యావసాయిక జీవిత సౌభాగ్యమూ, ప్రకృతిసౌందర్యపరవశత్వమూ, పైకి పాషాణసదృశత్వ కాఠిన్యమూ, హృదయంలో ఆర్ద్రతాపూర్వకమైన ప్రేమా, పాపభీతీ, దైవభక్తి ఉద్రేకమూ జాత్యభిమానము, కళాప్రియత్వమూ మున్నగునవి తెలుగువారి గుణశీలా లన్నింటిని తెలియజెప్పేవి యీ మన నానుళ్లు — పలుకుబళ్లూను.

ఇంక మన నానుళ్లను — పలుకు బళ్లను కొన్నింటిని వివిధ శీర్షికల క్రింద విభజించి యీ దిగువ నుదాహరిస్తున్నాను.

### జంట పదాలు :

ఇవి నామవాచకాలకు చెందినవి. వీటిల్లో ప్రాసలూ, ఆద్యంతాక్షర నియమాలూ, సాదృశ్యమూ ఎంత చక్కగా అమరివుంటాయో గుర్తించండి. ఈ జంట పదాలలో కొన్ని పదాలకు అర్థం విచారించవలసి ఉంటున్నది. ఎక్కడో కొన్ని ఒకే అర్థాన్ని తెలిపే పదాలై రెండూ ఉంటున్నవి; యతిప్రాసల అందమే అందం!

పెళ్ళీ పేరంటమూ
నౌకర్లూ చాకర్లూ
ఊరూ పేరూ
కొంపా గోడూ

డాబులు డప్పీలు
చెట్టూ పుట్టా
పిల్లా పీచూ
పరువూ ప్రతిష్ఠా
మన్నూ మష్నూ
చెట్టూ చేమా
నీతీ జాతీ
సందూ గొందూ
ఈడూ జోడూ
కొయ్యా గొంతిమూ
ఆకూ అలమూ
ఆలనా పాలనా
గాలీ ధూళీ
అతీ గతీ
వానో! వంగడో!
శుద్ధం బద్ధం
పూలూ పుక్కాయి
కలో గంజో
కాలం కర్మం
వావీ వరుసా
సయాన భయాన
బండీ బద్ధమూ
అదుపూ ఆజ్ఞా
గుడ్డా పాతా
ఆగం అల్లరీ
దుమ్ము గుమారం
దగ్గర ? దాపా ?
చీకూ చింతా
నుయ్యో గొయ్యో
జీతం నాతం
డబ్బూ దస్కమూ
అభము శుభము
మంచీ చెడ్డా
మూటా ముల్లే
పాడీ పంటా
తలా తోకా
బీదా బిక్కీ
ఇరుగూ పొరుగూ
బూడిదా బుగ్గీ
కూలీ నాలీ

ఎదుగూ బొదుగూ
ముసలీ ముతకా
నగలూ నాణ్యాలు
ముద్దూ మురిపెమూ
మడీ మైలా
తీర్థం సార్థం
మందూ మాకూ
వీలూ చాలూ
తేళ్లూ జెంకర్లూ
విధి విరామమూ
అంతూ పొంతూ
వదరూ బెదరూ
పొలమూ బుట్రా
రుచీ పచీ
భాగ్యమో! బంగారమో!
సిగూ ఎగూ
చదువూ సంధ్యా
దిక్కూ దివాణం
దారీ డొంకా
అమీ తుమీ
మాటా మర్యాదా
భయమూ భక్తి
కూడూ గుడ్డా
తిండీ తిప్పలు
చెత్తా చెదారం
అంటూ సొంటూ
మడీ మాన్యం
చాటూ మాటూ
లెక్కా డొక్కా
గొడ్డూ గోదా
అన్నము పున్నము
బాగూ ఓగూ
పిల్లా జెల్లా
ఇల్లూ వాకిలి
రేపో మాపో
పుణ్యమూ పురుషార్థమూ
సొమ్మూ సంబంధమూ
చీరెలూ సారెలూ
గట్టూ గనుమూ
మాటా మంతీ

తాడూ బొంగరమూ — చిన్నదా? చితుకదా?
కూరా నారా — నీళ్లూ నిప్పులూ
గడ్డీ గాదం — పోరూ పొక్కూ
చేటూ పాటూ — చాటూ మాటూ
వంటా వార్పూ — దిక్కూ మొక్కూ
సాయిలా బాయిలా — పురుగూ పుట్రా
ఆలూ చూలూ — ఊరూ వాడూ
మన్నూ మశానం — ఆస్తీ పాస్తీ
అగ్గీ బుగ్గీ — మడీ దడీ
గుట్టూ మట్టూ — చెట్టూ పుట్టా
దేవుడూ దయ్యమూ — కరువో కాలమో
బేరం సారం — తీరూ తియమూ
వన్నె చిన్నె — పండూ ఫలమూ
కథా కమామిషు — మొదలైనవి.

## వ్యస్త, సమస్త పదాలు :

వ్యస్తంగా కొన్ని, సమస్తంగా కొన్ని పదాలు విశేషణాలతో అలంకారాలతో కూడినవి కన్పిస్తున్నాయి. కేవలం సూటిగా ఒక అర్థం చెప్పేవి కాక వీటిలో కొన్ని భావాన్నీ, శీలాన్నీ, తెలియచెప్పేవిగాను ఉంటున్నాయి. వ్యస్తంగాను సమస్తంగాను వాని సొగసులను విశిష్టార్థలను పరికించవలసి ఉంది: కొన్ని అవ్యయాలనుకూడా చూడవచ్చు :

ఆకతాయి — తిప్పకాయ
తింగరంగా అని — నాసామిరంగా అని
ససేమిరా — తెగుదునమ్మో అని
కబుర్లరాయుడు — ఉట్రుడియుంగా
ఆకపబోకసగా — మాగినుశానమ్మ
కానరాని చీలి — పరాచికం
ఉత్త అగ్భకుడు — వెర్రివెంగళప్ప
వెకిలి వేషాలు — ఇచ్చకాలు
శషభిషలు — మనసులోమాట
కలికానికైనా — ఉప్పుతో తొమ్మిది
దూరాభారం — తామరతంపర
తినపనేమో, తానేమో — పోచాయింపులు
చూచాయగా — బట్టబయలు
బ్రతుకుజీవుడా అని — రావంఢాళి
ఉత్తపుణ్యానికి — ఉక్కిరిబిక్కిరి
బులిబుచ్చికాలు — మిడిమేలం

బుక్కా ఫకీరు — కల్లబొల్లికబుర్లు
అపసోపాలు — బొడ్డూడనివాడు
తాయిలం — సంగనాచి
ఆగింటా — గోపీపాతరాయుడు
ఒళ్లుబరువు — ఉన్నపళంగా
కట్టకట్టుకొను — లావాదేవీలు
కాలికి బలపం కట్టుకొని — తలనిండపనకాయ
విచ్చలవిడిగా — అజెపనిగా
విసమెత్తు — గడుగ్గాయి
గుండెమీద చెయి వేసికొని — పొట్టచేయకట్టుకుని
చెవులు దోరపెట్టుకొని — చీమ చిటుక్కుమంటె
ఆవసుర చిన — ఒళ్లు తెలియక
చెప్పులలో కాళ్లుపెట్టుకొని — వేలంవెర్రి
పోచికోలుకబుర్లు — వ్రాతకోతలు
తెండోపతెండాలు — అంతరపొంతరవాళ్లు
బ్రతుకుబండారం — కన్నులపండువు
వన్నెలవిసనకర్ర — పాపాయి పగుపడాయి
పైలా పచ్చీస.

## అలంకారిక పదాలు :

ఉపమ, రూపకావ్యలంకారాలను ప్రోదిగొన్న పదాలు కొన్ని ముచ్చట గొల్పుతూ అనిపిస్తున్నాయి:

కుక్కగొడుగులులాగా — తలకొట్టి వేసినట్లు
కొంగుబంగారం — అరవచాకిరి
గాడిదబరువు — కోతిమూకలాగ
కాకిగోల — నక్కవినయాలు
అవగింజంత — కీతకన్ను
వినుకుపాడి — మాపిపాయసం ముత్తైదులాగా
కుళ్లుకుమ్మడికాయ — సుద్దొద్దు చేలో బడినట్లు
ఎంగిలిమంగలం — కాలుకాలిన పిల్లిలాగా
అరటిపండొలిచి చేతిలో పెట్టినట్లు — కత్తైవిరిచినట్లు
అట్టుడికినట్లు — పొట్టచెక్కలయ్యేటట్లు
కుండపగలకొట్టినట్లు — చెప్పుకింద తేలులాగా
కుక్కినపేనులాగా — పూలలో దారములాగా
మొహంవాచేటట్లు చివాట్లు — పొట్టిబుడంకాయ
విడ్డి మొత్తుకున్నట్లు — పిండి ఆరబోసినట్లు
మిన్నువిరిగి మీదపడ్డట్లు — చెంపకుచేరడేసి కళ్లు
కొటుకకళ్లు — బెల్లంకొట్టిన రాయిలాగా
సావక్రింద వెన్నెలలాగా — మొదలైనవి.

## ధ్వన్యనుకరణాలు :

### ఆంగికవస్తు విశేష సూచకాలు

వస్తువిశేషాలను, అంగవికారాలను సూచించే టప్పుడుగాని, ధ్వనిని అనుకరించే సమయానగాని ప్రత్యేకంగా ఆపదాలనే మనం వాడవలసి ఉంది. వేరే పదాలను వాడితే నుడికారము తెలియనివాళ్లమే అవుతాము: ఆయా క్రియాపదాలను ప్రయోగాలను చూడండి:

గజగజవణకడం — రెపరెపలాడడం
(గుండె) ఝల్లుమనడం — (ప్రాణాలు) వకవకలాడడం
(ఆకులు) బిలబిలరాలడం — (చేతులు కాళ్లు) విలవిల కొట్టుకోడం
చెంగుచెంగున ఎగరడం — మలమల మాడడం
కలకల నవ్వడం — గబగబ నడవడం
(గుండె) దడదడ లాడడం — (గంట) ఖంగుమని మోగడం
గిలగిల తన్నుకోవడం — కుతకుత ఉడకడం
ఘల్లు ఘల్లున గజ్జలు — కణకణలాడే నిప్పులు
భోరున వర్షం — హోరుమని గాలి
రణగొణ ధ్వని — ముసిముసి నవ్వులు
చిర్రుబుర్రు మనడం — చడామడా తిట్టడం
చివాలున లేవడం — భోరుమని ఏడ్వడం
భావురుమని ఏడ్వడం — నిటారుగా నిల్వడం
దభేలుమపడడం — (గుండె) గుభేలుమనడం
గుజగుజలుపోవడం — చకచక నడవడం
తళతళ మెరవడం — కళపెళా వేయించడం
చరచర సాగిపోవడం — వలవల ఏడ్వడం
బిరబిర నడవడం — (చర్మం) విరవిరలాడిపోవడం
(వేళ్లు) కొంకర్లు పోవడం — వలిగొనిపోవడం

మొదలైనవి.

### క్రియాపదాలు :

ప్రత్యేకంగా పరిశీలింపదగినది క్రియాపదాల ప్రయోగంలో ఉన్న వైచిత్రి! ఇవి శక్తిభావో ద్వేగాన్నీ, భావనైశిత్యాన్ని అందలి తరతమభేదాల్నీ తెలిపేవిగా ఉండి భావాలు కేంద్రాలుగా పెట్టుకొని సంచారం సల్పేవిగా ఉన్నాయి. కొన్ని కొన్ని నామవాచకాలతో క్రియాపదాలు చేరి విశిష్టమయిన అర్థాలను ఇచ్చేవి అవుతున్నాయి. ఈ పలుకుబళ్ళను తిలకించండి :

చెవికోసుకోవడం — కంకణం కట్టుకోవడం
మాట ఇవ్వడం — పట్టి పల్లార్చడం
లెక్క కట్టడం — మెతుకు గతకడం
వేషాలు వేయడం — పందెం కాయడం
పోకిళ్ళు పోవడం — పద్యమల్లడం
కవిత్వం చెప్పడం — పూలు ముడవడం
పుట్టి మునగడం — దీపం కొండెక్కడం
నల్లపూసలు పెరగడం — చెవులో గీపెట్టడం
ప్రొద్దు పొల్మలడం — నిభాయించడం
మనసులో పాలుత్రాగడం — కళ్ళప్పగించడం
నడుము బిగించడం — ఘటికలు ద్రింగడం
నీళ్ళు నములడం — చప్పరించడం
పోరు పెట్టి ఏడ్వడం — చిన్నబుచ్చుకోవడం
నోరు తెరచుకొని వినడం — పగలబడి నవ్వడం
చంకలు ఎగరవేయడం — లొట్టలు వేయడం
పళ్ళికిలించడం — చెవిన పడడం
ఇల్లు చక్కబెట్టుకోవడం — కళ్లుబడడం
చెవులప్పగించడం — తలపట్టిపోవడం
చిటికగొట్టడం — ఒళ్లు దాచుకోవడం
మరగడం — కాళ్ళు గడ్డాలు పట్టుకోవడం
కాళ్లావేళ్లా పడడం — వళ్లంతా కళ్ళు చేసుకోవడం
మసిలిపోవడం — కళ్ళల్లో నిప్పులుపోసుకోవడం
కాలుమీద కాలు వేసికొని కూచోడం
తంపటలు పెట్టడం
చాపచంకన పెట్టుకోవడం
అందనాలు త్రొక్కడం
కళ్ళలో వొత్తులు వేసుకోవడం
నోరుపారేసుకోవడం
కాళ్ళీడ్చుకు నడవడం
తలదాచుకోవడం
నూరిపోయడం — మొదలైనవి.

### చీవాట్లు : అధిక్షేపణలు :

తెలుగువారికి ముక్కుమీదకోప మెక్కువ అన్నారు. కాకపోతే "సోడాబుడ్డి" కొట్టితే వచ్చే పొంగులాగా అప్పటికప్పుడే చల్లారిపోతుంది అనుకోండి. ఏమైనా వారి కోపాన్ని నిరూపించే వీ క్రింది తిట్లు — అధిక్షేపణలు. చూడండి:

కళ్లు కన్పించడంలా ? — ఏముఖం పెట్టుకువచ్చావు
తీపరమా ? — పట్టపగ్గాలు లేవు

తేరగా వచ్చిందేం? ఎక్కడ దాపురించాడు.
నీ మొహం తుమ్మలలో పొద్దుగుంకినట్టుంది.
కోతులు కొరుకుతూ మొహం చెవులలో పిల్లు మొలచాయా?
తెలివి చట్టుబండలైనట్టు చలిమిడి మొహం
పీడా వదిలింది జిడ్డు మొహం
తెలివి తెల్లవారినట్టుంది పిల్లికి బిచ్చం పెట్టడు
ఇంత విరగబాటా ఏం పొయ్యేకాలం
మరీ సోద్యంగా ఉన్నదే (చోద్యం)
పనీపాటా లేకపోతే సరి అఘోరించావులే
పొట్టకోస్తే అక్షరంముక్క లేదు నానామాటలు
నీకేం మతిపోయిందా డొక్కచీల్చి డోలుకట్టడం—

మొదలైనవి సర్వసామాన్యంగా వినిపించేవే— మానవుల అంతస్తులనుబట్టి వారివారి సంస్కారాలను ఇవి చెప్పుతూ ఉంటాయి. శిష్టజన వ్యవహారమే ప్రమాణంగా వీనినికూడా ఎంచుకోవలసివచ్చింది.

## పరిశిష్టము

తెలుగుజాతిలో మాగిన సామెతలు కొన్ని సుప్రసిద్ధంగా వ్యవహారములో ఉన్నవి ఉల్లేఖించుకుంటేగాని ఈ వ్యాసం శోభాయమానంగా ఉండదని కొన్ని మాత్రం ఇస్తున్నాను ఇందులో నానుళ్లు పలుకుబళ్ళ శ్రేణిలో వచ్చేవి కొన్ని తొంగిచూస్తూంటాయి:

పుట్టుకతో పుట్టింది పుడకలతో గాని పోదు
చెవులలో ఇల్లుకట్టుకొని పోరడం. ఏటికి ఎదురీతగా
పిండికొద్దీ రొట్టె తలమునిగి తాటిప్రమాణం
చెంపకు చేరడేసి కళ్లు మూన్నాళ్లే పట్టపగలు
అయినవాళ్లకు ఆకులలో కానివాళ్లకు కంచాలలో
ముందువాళ్లకు మూకిళ్లు—వెనకవాళ్లకు వాకిళ్లు
రమ్మన్నారు తిమ్మన్నబంతికి
ఆడిందిఆట పాడిందిపాట
గుర్రం గాడిద సమానం నోట్లోనువ్వుగింజ నానదు
చేతగాని చెన్నయ్య కుడుం పిసితే పండగ
చూరుపట్టుకు వ్రేలాడడం
కాలికి వేస్తే వేలికి వేలికి వేస్తే కాలికి
కడుపులో చల్ల కదలకుండా. దేవుడు చాలమేలుచేస్తే
మూడుపూలూ ఆరుకాయలూ. చేతిలో చిల్లిగవ్వైనా లేదు
కన్నమ్మకే వాపి—తిన్నమ్మకే వాపి
కానబోతే కొరివి—అమ్మబోతే అడివి.
జన్మకు శివరాత్రి!

పైన ఉదహరించిన నానుళ్లలో పలుకుబళ్లలో ఉన్న అందచందాలను, భాషలోని ఒంపులనూ ఒయ్యారాలనూ, ప్రత్యేకంగా వివరించడానికి అర్థవివేచనకూ పూనుకోలేదు. ఇందుకు గ్రంథ విస్తర భీతియే కారణం. భాషావేత్తలు, విజ్ఞులు, ఇందలి అందచందాలను అభిమానంతో అనుశీలింతురు గాక! మన తెలుగువెలుగుతోపాటు భాషలోని నాదసౌందర్యాన్ని, జాతీయాలను భద్రపరచుకోవలసిన కర్తవ్యం ఆంధ్రులందరిపయినా ఉన్నదని విజ్ఞప్తి.

# కరుణాలహరి

శ్రీ బూర్గుల రామకృష్ణరావు

దేవ! విషాదభూమి బహుతీవ్ర విషానల మూలమౌర నా
నా విషయ వ్యాఘ్రోగ్ర తిమి నక్ర ఝషాకుల మీ భవాబ్ధిలో
నావ యొకండు గన్పడ కనారతముం బడి కొట్టుకొందు దుః
ఖావధి గాన నీ కిదె మదాత్మ సమర్పణ మందుకోఁగదే.

భవభయదాగ్ని కీలలకుఁ బ్రాణము ఠావులుదప్పి, భీతిచే
భవ దరుణాంఘ్రి పంకజము పాయక దిక్కని పట్టుకొంటి నే
నవిరతమున్, దయారస సుధాబ్ధివి గావున పథ్యమేది యే
దవుననుకొందువో యది దయన్ ఘటియింపవె నాకు శ్రీపతీ!

అరయ ననేక దేహముల నల్లికవెట్టి మరీచి కావళిన్
దొరయు మహా మరుస్థలిగఁ దోచు ప్రపంచ మెఱింగి వీడి యో
మురహర! నీ దయామృత సముద్రములోఁ బడి యోలలాడగా
దొరకొని నామనో మృగము దూకుచు నూరక చెంగలించెడిన్.

నీ పదఫుల్లపంకజ వినిర్మల దివ్యమరంద పాన లీ
లా పరతంత్రతన్ బరమలంపటమైన మనోమిళింద మో
శ్రీ పరమేశ! చాపల మశేషమునున్ విడనాడి, నిన్ వినా
యే పరదైవమేని నిరసించి దృణంబని యెంచుఁగాంచితే.

ఏనరు లీ జగత్త్రియము నెల్లవిధమ్ముల నేలఁ గంకణ
మ్మూనిన నిన్ను, నీచరణ యుగ్మముఁ గాదని త్రోసివైచి, యే
కోననో వేరుదిక్కు గనుగో వెదకం జనువారో, వార లీ
శాన! కృతాంత దుర్దమ నిశాంత కవాటము తట్టరే హరీ!

లలిత రమా ముఖాంబుజ విలాస వికాసన పూర్ణ దక్షతన్
బొలిచి జగత్త్రయీ జన విబోధ విధాన నిదాన దీక్షమై
నలమి త్వదీయ దివ్యనయనారుణ రేఖలు జాలువారి తా
మెలమి హరించు నెన్నఁడో కదే మదబోధ విభావరిన్ హరీ!

నిరతి సురాసుర ప్రకర నిస్తుల చిత్త చకోర చుంబిత
మ్మరయ సమస్తసాధు జనతాఖిల తాపచయాప నోద నా
దరమగు నీ ముఖమ్మను సుధానిధిఁ జాల్గొను పండువెన్నెలల్
విరిసి మదీయ మానవ మలీమస దుర్నిశిఁ దోచు టెన్నఁడో.

నిండగు యౌవనమ్మున వినిర్మల పాండుర గండమండలిన్
మండిత చండ దీధితి కనన్మణి కుండల తాండవమ్ములన్
బండువు సేయు నీ వదన పంకజ మచ్యుత! ముద్దుగుల్కు మా
దండను దోచి కందోవకుఁ దానొక విందగు టెన్నఁడో ప్రభూ!

గంగా తుంగ తరంగ భంగిమను జక్కన్ దూగి దేవాసురా
భంగ శ్రీక లలాట లాలితమునై త్వత్పాద పంకేరుహా
సంగమ్మైన పరాగపుంజమది యాశా! యుత్తమాంగాననే
సింగారించు టదెప్పుడో కద దయాసింధూ! జగద్బాంధవా.

దేవ! మదింద్రియాశ్వములు ద్రెంచుకొనెన్ మద మేచి, త్రెంచి పా
శావళి నా వివేకమను సట్టి దయో! యురికెన్ జవమ్మునన్;
దావక పాద మందురనుఁ దారిచి త్వద్గుణబంధనమ్మ సం
దీవ బిగింపు తండ్రి! వహింయించు నొకించుక సాధుభావమున్.

పతినై సర్వపురాణ వాగ్వితతికిం బట్టంగ రానట్టి స
ద్గతి యా శ్రీ పురుషోత్తమున్ విడిచి నిన్ గల్యాణమూర్తిన్ మహా
సతియా నామది సిగ్గువిడి పరమేశా! యింక నెవ్వారి సం
గతి నాసించును దెల్పవే పరమ మాంగళ్యాకృతీ! శ్రీపతీ!

నీదు కృపాలవం బదియ నేను వరించితి, నంత మీఁద నిం
కేదియు స్వప్న జాగృతుల నెన్నఁడు గోరన లేదు సక్కు; మీ
నాదు నివేదన మ్మొగి మనమ్మునఁ దాత్త్వికమంచుఁ దట్టినా
వేద విధేయ! కాదనక వేగమ నన్ను బరిగ్రహింపుమా!

అనదను నన్నయో! విడిచి రందరు చూచితె యిప్పుడో దయా
వనధి! యొకింత నాదు దురవస్థ గనుంగొనరాదె, యింక నై
నను నను జెట్టవట్టి యొకనాడయినన్ మఱివేగ లేవ? వే
డిన విధరాదు, రా కటికి డెందము వ్రాఁడ విసైతి వేలరా?

## క రు ణా ల హ రి

అతి భరమైన యీ జగము నంతయుఁ బూనెదు, జీవకోటి బల్
ధృతి భరియింతు, నీకు బరు వింతకు తోచనలేద, జీవ సం
తతిఁ బరమాణువైన నను దండ్రి! భరింపగ భారమానె? నా
గతి యెవరింక నాప్త జన కల్పక! నీవ యుపేక్ష సేసినన్.

పరిపూర్ణమ్మగు భక్తియున్ వినయమున్ బాలించి ప్రశ్నించెదన్,
సరిగా నారసి యుత్తరమ్మొసఁగుమా, సత్యమ్మదెట్లున్నదో,
త్వరగా నన్ను సముద్ధరించుటకు నాతంకమ్ము లేమున్న? వా
కరి కన్నన్ గిరికన్న నేను బరువై కాన్పింతునే, మాధవా!

ధనములు వేడ, రాజ్యసుఖ దర్పము లక్కఱలేదు విద్య లి
మ్మనను గృపాతరంగిత నిరర్గళ మంగళ భావభంగిమ
మ్మనితర వస్తు సుందర మహాంగరుచిం గనుగొన్నఁ జాలు నీ
వనయము నాదువంకఁ; గమలాక్ష! యిదొక్కటె నిన్ను వేడెదన్!

వీఁడతి నీచుడున్ ఖలుఁ డపేతగుణుం డధమాధముండె, నా
వాఁడని యాదరింపఁ దగువాఁడు దయానిధివైన నీకుఁ, దా
నేడ విషమ్ము గ్రక్కు ఫణులేడ యదైనను జందనమ్ము గా
పాడుట లేదె నీడయయి వాని నమంద ముదమ్మునందగన్.

ఆకలి ధాక కోర్వక మహార్తిని సిగ్గనుమాట మాటకున్
లేకయ బాటలందుఁ గణలేశము లబ్బినచోట మెక్కుచున్
దేకువ దప్పితిన్; హరి! త్వదీయుఁడు కింకరుఁ డన్యుఁ జేరి యా
వాకిటఁ గుక్కయాట యది వాసియె నీ కకలంక! చెప్పుమా!

నరకమునందుఁ గూలుదునొ నాకటఁ బోయెడిదేమి? సిగ్గు లే
కరరె చరించు నిన్నరుని కా తలవంపు లనాథ నాథ! యో
నరహరి నీకొ చూచుకొను, నాపయి నీదు కటాక్ష ముంపవా
కరమున నెత్తి చూపెదరు గాదె నినున్ జనమాడి పోయుచున్.

నరకమునందు బాధల ననారత మేను భరింతు నెట్టులో
మురహర! నా స్వకర్మగతి మూలమటంచు చెటో యోర్మవట్టి; యీ
నరణి నిదొక్కటే హృదయశల్యము నన్గని యెల్లవారు వీఁ
డరరె! యనాథుఁడంచనెదరయ్య ప్రభూ! పలుగాకి లోకముల్.

స శే షం.

# రఘునాథరాయల వాల్మీకి చరిత్ర

శ్రీ వి. యస్. రాఘవ

"పంపా విరూపాక్షు బహు జటా జూటికా
రగ్వధ ప్రసవ సౌరభ్యములకు
తుంగభద్రా సముత్తుంగ వీచి ఘటా
గంభీర ఘుమ ఘుమారంభములకు
.........................
నిర్నిబంధ నిబంధమై నెగడు కవిత."

మన తెనుగు కవిత.

బహుళాంధ్రశ్రోత్రియ ప్రపంచమును పెంపొందించిన కీర్తి, కవితాకన్యకకు పెళ్లిపందిరులు వేయించిన ఘనత కవిరాజశిఖామణి నన్నెచోడునికి, సాహితీ సమరాంగణ సార్వభౌమ కృష్ణరాయ నృపతికి, సంగీతవిద్యా రసజ్ఞుడు రఘునాథ భూపతికి దక్కినది.

ఉ॥ "తారస పుష్టిమై ప్రతిపదంబున జాతియు
వార్తయున్ జమ
త్కారము నర్థగౌరవము గల్గు ననేక కృతుల్
ప్రసన్న గం
భీరగతిన్ రచించి మహిమించిన చో నికశక్తు లెవర
య్యా! రఘునాథ భూప రసికాగ్రణికిన్ జెవి
సోక జెప్పగన్."
(విజయవిలాసము)

అని విజయవిలాసకర్త చేమకూరి వేంకటకవిచే నుతింపబడిన రఘునాథ భూప రసికాగ్రణి విరచిత "వాల్మీకి చరిత్ర" కవితా సుమసౌరభమును రసహృదయులాఘ్రాణింతురు గాక!

## తారతమ్య పరిశీలన

"మూరు రాయరగండ" బిరుదాంకితుడైన కృష్ణరాయ నృపతి అనంతరము తంజావూరు సామ్రాజ్యలక్ష్మికే కాక, సాహిత్య రాజ్యలక్ష్మికిని శ్రీనాథుడై విలసిల్లిన నాయక వంశజుడు రఘునాథ భూపాలుడు.

"శరణాగత రక్షామణి బిరుదాంక! భామినీ నవీన మృగాంక!" అని ప్రశంసలందుకున్న ఈ విద్వన్మణి రఘునాథ రామాయణము, నలచరిత్రము (ద్విపద) శృంగార సావిత్రి, పారిజాతాపహరణము, వాల్మీకి చరిత్రము ఆదిగాగల ఆంధ్ర కావ్యములకే కాక, రామాయణ సంగ్రహము, సంగీతసుధ వంటి సంస్కృత కావ్యములకును కృతికర్తయై భాసిల్లెను. చేమకూర వేంకటకవి విజయవిలాసము, కృష్ణాధ్వరీ నైషధ పారిజాతములకును కృతిభర్త యీతడే.

భువనవిజయము కృష్ణరాయల సభా భవనమే! రఘునాథ రాయల సభా భవనమే విజయవిలాసము! కృష్ణరాయ, రఘునాథరాయ లిరువురును సుకవులే! కృష్ణరాయలు సంగీతానురక్తుడు. రఘునాథభూపాలుడు "రఘునాథ మేళ" రాగకల్పన మొనర్చిన వాగ్గేయకారుడు. కృష్ణరాయల సచివాగ్రణి తిమ్మరుసు. రఘునాథరాయలకు గోవింద దీక్షితుడు. ఇరువురకును "వెల్తి వైష్ణవంబు ముదిరె!" రఘునాథరాయ లభినవ కృష్ణరాయలని పేర్కొనవచ్చును. కదనరంగమునను, కవితారంగమునను సశేష ప్రజ్ఞాపాటవములను కనుపరిచిన ప్రతిభావంతులు!

## వాల్మీకి చరిత్రము: మూలము.

కవితావతార ప్రథమతీర్థమై, పరమపవిత్రమగు రఘునాథుని చరిత్రమును జగదాదిమ కావ్యముగ సంతరించి, లోకైకగురుడైన వాల్మీకి చరిత్రమును రఘునాథ రాయలు సహజపాండితీ గరిమతో దివ్యప్రబంధముగ ప్రపంచిత మొనరించి కరుణాసింధుడైన ఆ శ్రీరామచంద్రునికే అంకిత మొనర్చినాడు.

ధర్మఖండము, వాశిష్ఠ రామాయణము, భక్తవిజయకావ్యములలోని గాథల నాధారముగా గొనినను తన ఉపజ్ఞచేత దానికి మెఱుగులుదిద్ది, సుందర కళాఖండముగా తీర్చిదిద్దినశిల్పి ఈతడు. క్రూరకర్మల పాల్పడిన కిరాతునికి, రామమంత్రోపదేశ భాగ్యమును కల్పించి, మోక్షమార్గమునకు సోపానమును నిర్మించి వాల్మీకిగా నొనరించినాడీతడు. వాశిష్ఠ రామాయణము, భక్తవిజయములలోని వాల్మీకి ఉత్తమ ద్విజకుటుంబీకుడైనటును, బాల్యమున కిరాతవనితాలోలుడై, సత్సంగత్య ఫలితమున పులుకడిగిన ముత్యంబై పరివర్తనమందిన గాథలవంక తమమనస్సును జొరనీయక, ధర్మఖండమునందలి కిరాతి జన్మ నాధారముగా గొని, మూడాశ్వాసముల మహాప్రబంధ రచనగా కొనసాగించినాడు.

## కథాసంగ్రహము.

గంగాతీరంబున నరనారాయణాశ్రమంబై, ముక్తిసుందరీపావనమనబడు బదరికావనమున శౌనకాది మహర్షులు హరినామస్మరణ చిత్తులై యుండు ఘట్టముతో ఈ గాథ ఆరంభమగుచున్నది. కలహాభోజనుడైన నారదుని ఆగమనము, నాగేంద్రశయాన పుణ్యకథల శ్రవణోత్సుకత, పర్వతకుని వైకుంఠుని లీలా నామస్మరణల వివరణలు వెన్వెంట సాగిన సంఘటనలు.

క్షీరసాగరశయనుడైన శేషశాయిని దర్శించి, సప్తర్షులు సప్తద్వీప, సప్తకుల పర్వతములను దాటి, తామ్రపర్ణివద్దగల గజతీర్థ స్నాతులై, ధనుష్కోటి రామలింగేశుని దర్శించిరి; మధురయందలి సోమసుందరుని సేవించిరి; శ్రీ రంగనాథునికి కైంకర్య మొనర్చిరి. తంజావూరు, కుంభకోణము, శ్రీముష్ణము, చిదంబరము ఆదిగాగల క్షేత్రములను గాంచిరి; తిరుపతియందలి శ్రీ వేంకట గిరివల్లభుని భక్తి ప్రపత్తులతో నుతించిరి! సత్య గుణాన్వితుడైన మల్లికార్జునుని భజించి, సాక్షాత్కారము బడసి, అభీష్టముల నెరవేర్చుకొనిరి! వింధ్యాచలము దాటి, గ్రీష్మ గమనవేళకు వారణాశి జొచ్చిరి; గ్రీష్మర్తు తాపానుతప్తులై తమసానదియందు గ్రుంకులిడు తరుణమున భీకరుడై, అంబుపొదిని ధరించి, నిప్పుకలుగ్రక్కు మేఘపు పిల్లయయిన భిల్లుడడ్డుపడి వారిని హింసించెను. వానికి జ్ఞానోదయము గలిగించి, రామమంత్ర మహిమ నెఱింగించిరి ఆ సప్తర్షులు. కఠోరతపోదీక్షాపరుడైన ఆ కిరాతుని తపోభంగమునకై ఇంద్రునిచే పంపబడిన రంభోర్వశులు తమ ఆట, పాటలు చెవిటిముందట జాటించు శంకువట్లు చందముకాగా, విఫల మనోరథులై వినువీధి చేరిరి. తపోనిష్ఠకు మెచ్చి, సప్తర్షులు, శ్రీ రామచంద్రుడు సాక్షాత్కరింపగా వల్మీకము చించుకొని వాల్మీకియై, రామ చరితమును భగవదాజ్ఞగా దివ్య ప్రబంధముగా కైసేసి వాల్మీకి యశశ్శరీరు డయ్యెను." అని కథాకర్ణనాతివేలహృష్టులైనట్టి దివ్య మహర్షులకు ఆ లీలామానుష విగ్రహుని దివ్య ప్రబంధములను వినిపించెను నారదునిచే నియుక్తుడైన ఆ పర్వతకుడు.

## కథాగమన వివరణ

రామనామ సంకీర్తన శ్రవణము కలుగు ప్రదేశమున మారుతాత్మజుడు ప్రత్యక్షమగును అను విషయము జగద్విదితమే కదా! రామభక్తపుంగవులగు రఘునాథ భూపాలుడు తన కావ్యములలో దశరథాత్మజునకు చక్కని రూపు రేఖలను కల్పించినాడు. ఆ పుంసాం మోహనరూపుని రూపధేయంబు, విశ్వమోహన కళా విశేషము ఈ రీతిని సంభావించెను.

"మ. కరుణాసింధుడు, సత్యసంధుడు, జగ
త్కల్యాణ బంధుడు, బం
ధుర సౌజన్యుడు, లోకమాన్యుడు, గుణ
స్తోమైక ధన్యుండు, సా
గర గంభీరుడు, మేరుధీరుడు, శుభా
కారుండు, సంగ్రామ దు
ర్ధరదోర్దాముడు, వైరిభీముడు, ననన్
రాముండు మించున్ మహిన్.

ఈ గ్రంథావతారికయందు పవనసుతుని ప్రస్తావన :

ఉ. "ఎక్కడ రామ సంకీర్తన
మొకించుకయే విననైన వేడ్కదా
నక్కడ వచ్చి రంజలికృ
తాంజలియై ప్రమదాశ్రు పూరముల్
పిక్కటిలంగ మైబులక
బృందము జాదుకొనంగ బాడుచున్
జొక్కుచు నాడునయ్యనిల
సూను ప్రభాసిత భానుగోత్రునన్."

దీనికి మాతృకగా గణింపబడే శ్లోకం ఇది :

"యత్ర యత్ర రఘునాథ కీర్తనం,
తత్ర తత్ర కృతమస్తకాంజలిం,
భాష్పవారి పరిపూర్ణ లోచనం
మారుతిం నమత రాక్షసాంతకం
మనోజవం, మారుత తుల్యవేగం
జితేంద్రియం, బుద్ధిమతాం వరిష్ఠం
వాతాత్మజం, వానరయూథ ముఖ్యం
శ్రీరామదూతం శిరసా నమామి.॥

బదరీవనమును ప్రవేశించిన నారదుని శౌనకాది మహర్షులు విష్ణుకథాసారముల నెఱింగింప వేడగా, నారదునిచేత నియుక్తుడైన పర్వతకుడు కథా కథనమునకు కడంగెను.

"క్షీరసాగర శయనుడైన శేషశాయి మానవుల హృదయాంతరాళములే తన నివాసగృహమని నుడువగా, సప్తర్షులు పుణ్యక్షేత్ర సందర్శనలు సాగించుకొనుచు, శ్రీగిరి మల్లికార్జునుని చేరుకొనిరి. హరిహరాదులపట్ల గౌరవభావములకు రూపకల్పన రఘునాథ భూపాలుని శ్రీగిరివర్ణన. భారతీయ సంస్కృతిలో శివకేశవులిరువురు కారు! "ఏక మేవాద్వితీయం," అను భావముతో అద్వైతమును ప్రతిపాదించి హరిహరుల కభేదమును చాటింపజూచినాడీతడు.

"శ్రీశైలశిఖరం దృష్ట్వా పునర్జన్మ నవిద్యతే" అను లోకోక్తి సార్థకత మొనరించి, మల్లికార్జునుని మహిమలకు ముగ్ధ మనోహారతను చేకూర్చి, రఘునాథుని పరమత సహిష్ణుతను వెలార్చినదాతని శ్రీగిరివర్ణన.

సీ|| చుక్కల దొరయొకించుక నిక్కి శిరమున
బదినూలు చుంగులపాగ జుట్టి
తెలుపు వెన్నెలనీను తెళుకు నెమ్మోముపై
దొలువల్క లీనెడు తొడవు పెట్టి
ముద్దులజింక ముమ్మొనవాలు ముట్టెను
సరవితో రెండు హస్తములబట్టి
పెళపెళసను చెఱంగుల రంగుల డరెడు
మూడు వన్నెలపట్టు మొలనుగట్టి

గీ|| కేళ్ళుబుకు ముత్తియపు జాయగిబ్బనెక్కి
చారు తర హార శృంగార హారి యగుచు
ధారుణీశ్వర రాజనందనయు దాను
నమ్మునీంద్రుల ప్రేమాల ప్రత్యక్షమయ్యె."

గ్రీష్మ గమన వేళకు సప్తర్షులు వారణాశిని చేరుకొనిరి. ఆ ఘట్టమున పద్యమిది:

క|| ఆకాశేశ్వరు తార్తీ
యైక విలోచనమునందు నెసగెడు సెగలే
పైకొనియె ననగ లోకం
బాకుల బడదోచె గ్రీష్మమతి భీష్మంబై.

ఫాలాక్షుని నేత్రమునుండి నెసగెడు సెగలే గ్రీష్మర్తు రూపమును దాల్చినవోయేమి? అనునట్లున్నదట ఆ మండు టెండ.

అలంకారికుల అభిమతము ప్రకారము ప్రబంధ మష్టాదశ వర్ణన సంహితమైన రచన. ఋతు వర్ణన అందగ్రగామి. రఘునాథుడును తన కావ్యమున ఋతు వర్ణనల కవకాశమును కల్పించకపోలేదు.

సాహితీ సమరాంగణ సార్వభౌముడయిన కృష్ణరాయ నృపతి తన "ఆముక్తమాల్యద"లో గ్రీష్మర్తు వర్ణనయందు నిరూపమానమైన కవితా శిల్పమును ప్రదర్శించెనని విజ్ఞుల అభిప్రాయము. కుంపట్లయందు తామరలను మొలిపించి, నీరింకిన నదుల రేవులలో దిగంబరుని (శివుని) చేత గుడ్డలుదికించి, పాతాళాన్నంటుకున్న నూతి నీటి కెరపెట్టి తెప్పించి సాహితీ లోకమునకు గ్రీష్మర్తు వర్ణన పేరుతో చలివేంద్రము నాతడు నిర్మించెనని విమర్శకుల భావము.

నీరింకిన రేవులలోని గుడ్లపంక్తి, మీనములను చంచుపుటాలలో చీల్చి చెండాడే బక సమూహము, కవితా ప్రావీణ్యఘనీపుడైన రాయల క్రాంతిదర్శిత్వానికి, స్వభావోక్తిచే భూషితమైన పద్యచిత్రమై గ్రీష్మర్తు వర్ణనకు మకుటాయమానమైనది.

ఇక రఘునాథరాయుని గ్రీష్మర్తువర్ణనలు:

## ఫణీంద్రుల అనుతాపము.

చ. ఘనతర కీచకోత్కర ముఖంబుల నెదత భోగి
పూత్కృతుల్
పెనరగనూది యోషధి కదంబక మూర్ధము
కొంపెలం
గనకము సేసె దత్సనుయు కైతవ సిద్ధుపసంగ
నైల్పెసం
గనగన మించెనెంతయు నఖండ దవాగ్ని
శిలాప్రఖండముల్.

గ్రీష్మకాలి చండమార్తాండ కిరణంబు కాటిమీటెనట.

గీ. ఊష్మలతమించ నెంతయు గ్రీష్మసాలి
చండమార్తాండ కిరణంబు కాటిమీట
నెండమావులు గదలెనుద్దండ గతుల
మృగకులంబులు గని తృష్ణదవులుకొనగ.

రమణీరమణుల అనుతాప, ఉపశమనము లిట్లు వర్ణితములైనవి.

సీ. కమ్మవిడెంపు లేగారంబుగల మోవి
కంపనక్కెర పానకంబులిచ్చి
చలువ తావులు గుల్కు కలికి లేటుల్కు న
ప్రెంపు బల్కులను గరము జొనిపి
జీనిపన్నీరునించిన యాటెనుచకుంభ
యుగళంబు నక్కున నొత్తియొత్తి
పాటల సుమ సౌరభంబులు వెదజల్లు
సొగసు బయ్యెద కొంగు సురటి విసరి

గీ. రమణులెంతయు దమతమ రమణులకును
తాపములుబాపి రొక్కకొంత తపనుడపుడు
తనదు సంక్రమించు మూర్తుల నెవసినట్లు
కొండెలవియమంగ గంటంపు టెండగాసె.

వేసవి యెలెండల జోటజోట నిప్పుకలు గ్రక్కుచో నక్కొకశిపుట భోజనంబు వెలవడి యతీంద్రులు భూరుహవిభాగఫట్టం బైనతమసా నదీతీరం చేరుకుంటారు. భిల్లీమతల్లుల నాగరికత, ప్రకృతి రామణీయకతను తిలకిస్తారా మునిచంద్రులు.

మ. తమసా నిమ్నగదాటి తజ్జల సముద్యద్బాల
శైవాల జా
తము సారద్యుతి దీర భూరుహవిభాగట్టంబుతో
గూడి సం

తమసా నీకము బోలె నల్దెసలు నిండం జూచి
యోహో! మహా
తమసా నీకము నిండె జెల్లదని చింతం జాల
బల్కెంపుచున్.

స్రగ్ధర. కవిరామానీంద్ర చంద్రుల్ ఘనరసవద
సృక్స్ఫారణామంచు పంచా
నన కోపాటోప చండన్న ఖర కులిశ భిన్న త్రుట
త్కుంభి రాట్కుం
భిని వేశోన్ముక్తముక్తా ఫల సరవిసరోద్భాసి
ఖిల్లీ మతల్లీ
ఘనురాస్ఫాల స్ఫురన్ని స్స్వని జనితమృగీ
ధావనంబున్ వనంబున్.

ఇచ్చట అంత్యానుప్రాసశబ్దాలంకార సంఘటిత రచన పరిశీలింపదగినది.

నాటి భిల్లకాంతలు సహితము పట్టుపీతాంబరములు ధరించు భాగ్యవతులే; రక్తచందనము, గుగ్గిలంపు బొగలు, తేటపునుగు, తని వితీరవారను భవించుచుండిరి. పుట్టతేనియు, పెరతేనె, పుట్టజున్ను తొఱ్ఱ తేనియలు, వెదురుబ్రాలు ఆనాటిభిల్లులకు కోకొల్లలు! ఫలధాన్యములు వారికున్నంత మరి యెవ్వరికిని లేవు.

నానాతీర్థ సందర్శన మొనర్చిన మునులు మార్గము కానక "విపిన భూమిపాపట" వలెనున్న తిప్పత్రోవ వెంట వెడలు సమయమున నాసికకు దుర్గంధము, సోకి, ప్రేవులు గుండెలు నిలువక వాంతులు ప్రారంభమైనవి. వారు ప్రవేశించినది బోయపల్లె.

మహాకవికి నిర్దిష్టమైన గుణ విశేషములలో యథావస్తు వర్ణన లొనర్చుట, భావనామూలక వర్ణనలు కూర్చుట ప్రధానాంశములు. బోయపల్లెయందలి పులుగులు, ఘోరవంబు లొనర్చు జాగిలములు, పశువులకు నూరబందులు, మురికి గవులు భయోత్పాతమైనవి ముక్తిలలన గోరు ఆ వేల తాపసులకు!

భీకరుడై మేఘపు పిల్లయైన కిరాతకుడు శరపంక్తులు ప్రయోగించి, "నిలు నిలువుడు మీ చేతంకల సొమ్ములనిచ్చి కదలుడు. వాతో జలపట్టిన మిము సందరనుతికి పారన్ వైతున్" అని బెదరించినాడు. శరసంధానము నిష్ప్రయోజనము కాగా, ఋషిపుంగవులు "రాతచేసిరే కిరాతా" అని సంబోధించి వయబోధకుమార్గం కల్పించారు. హృదయ పరివర్తనకు అంకురమై బుద్బుదప్రాయమైన జీవితమునకు విశిష్ట వ్యాఖ్యానమైనదీ సంఘటన.

క|| ప్రాయము జలకల్లోల
ప్రాయము కాయంబు నస్థిరం బిందులకై
రోయక దురితమె తంమని
పాయక చేసెదవు నింద పరగ ఋళిందా!"

అని హెచ్చరించిరి ఆ ఋషిపుంగవులు.

ఆకాలపు వారెంత కాములో అంతమోక్షకాములు; వారు వేదవేదాంత వికాస భాసుర విచిత్ర చరిత్రులు, రాగరహితులు, శమదమాది సంపత్సమేతులు అను అంశము ఆనాటి గ్రంథము లన్నిటను చోటు చేసుకొన్నది.

ఆలుబిడ్డలకై తానీ పాపకార్యమునకు బూనుకొంటినని ఆ ఋళిందుని సందేహము. మును లా పాపకార్యమునందు సతీసుతులు భాగస్వాములేమో కనుగొని రమ్మనగా మార్గమధ్యమున నేలవాలములను గమనింపక చింతాభరితుడై గృహాంగణము చేరుకుంటాడా బోయ!

క. విలునమ్ములు నటువైచుచు
వలసతి నొక జింకతోలునందు గూర్చుం
డిల వ్రాయుచు దనపాపము
దలపోయుచు విస్మయమున దల్లడపడుచున్.

ఆ వేదవాభిగీతహృదయుడై జింకతోలుపై నుపవిష్టుడాయెను. భవిష్యతున ముని కోకిలగా పరివర్తితుడు కాబోవు ఆ కిరాతుడు.

"ఓ? సతీ! నే నొర్చిన పాపంబుల దలపగ నీవు బరిగలదో!" అను గద్దింపునకు "నాయక! నీదగు పాపంబునకు బరిలేగు. నీ ప్రాపున నెంతయు గుడిచి కట్టి పాసగుట కన్నన్" అని ప్రత్యుత్తర మొసగిన దాతని అర్ధాంగి. కొని తెచ్చినను, దోపిడీ యొనర్చి తెచ్చినను, జూదమాడి తెచ్చినను, పాపపుణ్య వివక్షత లేక సపర్య లొనర్చుటయే తన విద్యుక్తధర్మమని కనువిప్పు కలిగించిందా కలికి. అరటియాకుమీది ముల్లువలెనున్న ఆతని మనస్సుకు ముక్తిమార్గమే శరణ్యమైనది. "మరా. మరా" అను తిరు మంత్రాభ్యాస మొనర్చి కఠోర తపోదీక్ష కుపక్రమించాడా బోయ

సర్వసంగపరిత్యాగియై సంసారముకోసి, బంధువుల తగులెల్ల మొదలంట తెగగోసి, సకల వ్యాసంగములు మాని మౌనివర్తనుడు కాగా, వానికలవాగెల్ల చెట్లు పుట్టలను వెదకి, నట్టడవిలో చెట్టుంబలెనున్నవాని కనుగొని, చాపనదస్యువు బట్టెనో చాపురేయని మందలించి అవ్యాసులెల్ల మహావ్యాధులబోలె బాధింప ఆ శబరనాథుడు "కనుదెఱచి నవ్వి"

క. "...యేమియు
బరిలేదని ముందు మీరు పలికితిరిపుడే
పనికిటు వచ్చితిరిందఱు
జనుడెఱుగదు మీదుమాయ జరుగునె? యింకన్."

అని మందలించి, తన జనకుడు దశరథసుతుడు, తల్లి జనకజ, బంధువులు రామభక్తులని తాను పరిశోధించిన విషయమును వెల్లడించెనా భిల్లుడు! మాయామోహిత జగమున మానవకల్పిత బంధుమిత్ర కళత్ర

బాంధవ్యములను మాయాపాశము తొలగించి సత్యార్థ పరిశీలనా కాముకులు కండని హెచ్చరించాడా మహా వ్యాధులను.

క. "సతులెవ్వరు? సుతులెవ్వరు?
హితులెవ్వరెటె వఱద వెంబడి నొకచో
జతకూడిన కాష్ఠంబుల
గతి నించుక కూడినిల్చి కదలుదు రవలన్."

కఠోర తపోదీక్షా పవిత్రుడైన అతని తపోగ్ని చతుర్దశభువనముల వ్యాపింపగా, ఇంద్రాది దిక్పాలురు తల్లడిల్లినాకభూమిలో నాడు పాడుతున్న రంభోర్వశీ సంవాదమునకు స్వస్తిపలికించి. తమసాతీరమున కిరాతుడొనర్చు తపోభంగమున కాయత్తపరచినారా రంభోర్వశులను.

ఆ పాటలగంధులు అనురాగపూరిత నృత్యకళాభినయములను ప్రదర్శించి, విఫలమనోరథులైరి. రఘునాథుడు స్వభావసిద్ధముగా సంగీతానురక్తుడు, వాగ్గేయకారుడు! అందువలననే స్వకపోలకల్పిత రఘునాథమేళ రాగప్రస్తారమును తన గ్రంథమున పొందుపరిచినాడు.

సీ. అదితాళము ద్వితీయక మంఠక్రీడ
జయమంగళంబును జంపెలీల
చాచపుటంబు చంచుత్పుటంబును షష్టి
తాపుత్రికంబు విద్యాధరంబు
రతిహంసలీల శ్రీరంగంబు రంగంబు
కంకళిపంచ కాకోధములను
కోకిల ప్రియమువిలోకి తుంబురుడుక్క
డెంకి త్రిభంగి మట్టెశరజయము

గీ. నంది నందివ జయసింహానందనములు
మొదలుగాగల తాళములు మొనసియున్న
గూడికల్ చటముగ గొనియాడతేని
బిరుదులివి యెత్తు నేను నే బిరుదటంచు.

సప్తర్షి సందర్శన భాగ్యమబ్బిన ఆ బోయవల్మీకమునుండి బయల్వెడిన రీతిని గమనింపుడు.

"ఆ వల్మీకము జించుకొంచు
నుదయాహార్యంబి రాశింబునం
దావిర్భావమునొందు భాస్కరుని
చాయన్ శోణశోణ ప్రభా
వ్యావల త్కిరణంబులలోయన జటా
ప్రాంతంబు శోభిల్లగా
వేవేగం జనుదెంచి యమ్మునుల
సేవించెం బ్రియం బెచ్చగన్"

అంజలి ఘటించిన ఆ వాల్మీకికి ఆర్తజనబాంధవుడు, ఆశ్రితపక్షపాతి అయిన శ్రీరాముడు తనపావన చరిత్రను గ్రంథస్థ మొనరింప ఆనతివ్వగా, రామాయణ కల్పద్రుమం నిర్మించి కవితావతార ప్రథమతీర్థం బయ్యెవాముని కోకిల. "వాక్షి: కుగుణే కావ్యం" అను నానుడికిని నొరవిడి దిద్దినది మహాకవియే.

తమసా తరంగిణీ తీర్థమున కృతస్నానుపాపుటకు వెడలిన వాల్మీకి మహాముని నది తీరాన పగస్సాం ఏంచుపులాలవాడించుకుంటూ, గుండెల నొలకబోసుకుంటున్న క్రౌంచమిథునంపు గనను కనుగొంటాడు. మగక్షణమే కిరాతుని శరఘాతి మళనిప తమె తెగిలి కిలకిల నెల క్రొలింది క్రౌంచం. క్రౌంచి ఆగాపు: ఆయన హృదయం ద్రవించింది. ఆవేదనా భరిత హృదయపు ఆవేశమే రసాత్మక శ్లోకరూపమున సాక్షాత్కరించింది.

"మా నిషాద ప్రతిష్ఠాం త్వమగమః శాశ్వతీః సమాః
యత్క్రౌంచ మిథునాదేకమవధీః కామ
మోహితమ్"

ప్రథమమైన వాల్మీకి వాక్కులలో ఛందస్సు ముందహాస మొనరించింది. శోకగర్భాలపు శోకమే శ్లోకమైనదట!

క. "శోకమున బలుకు పలుకే
శ్లోకంబై నిలిచె నిఖిలలోకోత్తరమై
శ్రీకరమై మృగుపదశో
భాకరమై చూపమిట్టి యద్భుతమెంగున్."
(రఘునాథ రామాయణము)

ఆ రసాత్మక శ్లోకము రామాయణకల్పవృక్షము మైనది. దాని ఛాయలలోనే పలువురు సాహిత్య పిపాసువులు చలిపందిరులు నిర్మించుకున్నారు.

## ప్రకృతి వర్ణనచాతురి

మహాకవికిగల మహిమాన్విత గుణములలో ఋజుత్వము ప్రధానము. శ్రీనాథుని "భీమఖండము"తో ఆవిర్భావమైన ప్రకృతి వర్ణనా రామణీయకత, కృష్ణరాయ, రఘునాథరాయల కాలములందు మెరుగులుదిద్దుకొని మణికంఠ హారతరళన్యాప్తిని వినంబించెను.

భక్తి భావమునందును, పుణ్యక్షేత్ర సందర్శనాభిలాషయందును రఘునాథరాయలు కృష్ణదేవరాయలకు సరితూగగలడు. శ్రీకృష్ణదేవరాయలు శ్రీవిల్లిపుత్తూరునకు కావ్యగౌరవము కలిగింపగా, రఘునాథరాయలు అహోబిలము, మధుర, శ్రీరంగములను గ్రంథస్థము మొనరించినాడు.

రఘునాథునికి గల ద్రావిడీ పరిచితి, పుణ్యక్షేత్ర సందర్శనాభాగ్యము గణ్యములై ముగ్ధమనోహర రూపమున భావుకుల నానందింపజేసిన హృదయారవిందముల నొనర్చెను.

భోగిభోగ శయనీయశాయి శ్రీరంగశాయిని ఈ భక్తాంఘ్రి రేణువు భజించిన రీతి:

సీ. పంకజ బింబు బింబస్థాయి త్రైలోక్య
మంగళదాయి శ్రీ రంగశాయి
సకల జనావన సంధాయి గరుడ తు
రంగమశాయి శ్రీ రంగశాయి
సహ్యకన్యాతటాంచల కులాయి ప్రపంచ
రక్షణోపాయి శ్రీ రంగశాయి
అఖిల దైవత సంసేవితశాయి అగణిత
బ్రహ్మాండశాయి శ్రీ రంగశాయి

గీ. నిఖిల జగదింద్రజాలంబు నెఱపుమాయి
అమ్మలకు మొదల నచ్చైన త్రాయి
కొలుచు వారలపాలిటి తలపురాయి
రావణానుజదాయి శ్రీ రంగశాయి."

అనుప్రాస ఘటితమైన ఈ సీసము సంకుసాల నృసింహ కవి కవికర్ణ రసాయనమునందలి శ్రీ రంగనాథ స్తవమును స్మృతి పథమునకు గొనితెచ్చును:

సీ. అపవర్గ కాంక్షచే నాకొన్న వారికి
దంగేటిజున్ను శ్రీ రంగశాయి
నిర్వాణ దారిద్ర్య నిర్విణ్ణుడగువాని
ముంగిటి సేవధి రంగశాయి
సంసారమల విమోచనము నాకాంక్షించు
సంగువు పెంగంగ రంగశాయి
పరమార్థ లాభ తత్పరుడైన వానికి
ముంగొంగు పసిడి శ్రీ రంగశాయి

గీ. చెదర కొకటి యమృతంబు బిడికిటొకట
శృంగములు లేని మొదవు శ్రీ రంగశాయి
కోరువారల కోర్కె లీ గోరివచ్చు
జంగమామర తరువు శ్రీ రంగశాయి.

## శృంగారము:

ప్రబంధములకు ప్రణయమే పెన్నిధి; ఈ ప్రబంధము కిరాతవుల జీవితాంశములకు ఆటపట్టు కనుక బోయమిటారికత్తియల శృంగారము కావ్యపుటడుగడుగునా గోచరించును. మగవలు తమ మగలకై పరితపించిన పట్టులు శబరులు వాల్మీకికి ప్రబోధించిన భాగమునందు ద్యోతకమైనవి.

ఉ. బోయమిటారికత్తియలు పున్నమ వెన్నెల బైట నీపయిం
బాయనిబాళి కిన్నెరలు మాటికి మీటుచు నీ ప్రతాపమున్
హాయని చొక్కి పాడ వినవా? కనవా? మనవారి వాసినీ
వీయెడ వొంటినుండదగవే? తగవే? చను దెమ్ము వీటికిన్.

## రసిక ప్రవృత్తి:

"సమకాలిక జనుల త్రికరణ ప్రవృత్తులు ప్రతి గ్రంథమునందును ప్రతిబింబించి యుండుట యెరుగ వచ్చును" అను శ్రీ రాళ్ళపల్లివారి పలుకులు మన మహాకవుల రచనల కన్వయించుకొన్న నాటి వారి ప్రవృత్తి, నివృత్తులు, సుఖ, సౌభాగ్యములు, అనురాగావేదనలు, భోజన శయ్యా సంప్రదాయములు వారి కావ్యముల యందు జీర్ణించుకొనిపోయి, సుఖ స్వప్నమువంటి రసికజాతి జీవితమునకు దర్పణములై భాసిల్లుట మనము గుర్తింపవచ్చును. తెలినులి వెచ్చయోగిరములతో తృప్తిపడిన విష్ణుచిత్తుడు, గుప్పుల బడసేసి నుప్పుగండలసేసి చవులు మరిచి చప్పరించు కిరాతవనితలు మనకు కావ్యరంగమునందు ప్రత్యక్షమగు పాత్రలు. తీక్ష్ణసుగంధములను ఓర్చుకొను శక్తి నశించిన మన రసిక ప్రవృత్తికి, అప్సరాంగనల కుచద్వయముల నలంకరింప కస్తూరికా దానమును ఆశించిన శ్రీనాథాదుల జీవితములకు, పచ్చికస్తూరి మేనలందుకొను కిరాత వనితల విన్యాసములకు నడుమగల అగాథ మెంత గొప్పదో?

నిర్భాగ్య దామోదరులుగా భావింపబడు కిరాత వనితల జీవన విధానములోని సంప్రదాయజ్ఞత ఇటు వర్ణితమైనది.

"నారచీరలుగట్టి – యన్నంబుదట్టి
గాలి మెసవుచు – నాతిపై బాళిలేక
జపము ప్రేళుల నెన్నుచు జాతివిడిచి
బాపలను గూడియుండుట బ్రాతియగునె?"

ఈ రాజకవి కవిత్వము మధురపద ఘటితమై, ధారాశుద్ధి కలిగి ప్రసన్న గంభీరగతిని అలరారుచున్నది. శబ్దాలంకార రచనయం దాతడు కొకలుతీరిన బంటు.

అంత్యానుప్రాసయందలి అభిలాషకు మున్నుదహరించిన "బోయమిటారికత్తియలు" అను పద్య భాగమునందలి వినవే? కనవే? దగవే? తగవే? అను పద ప్రయోగములు ప్రమాణములు.

భావానుగుణపు ఛందస్సును నడిపించుటయందలి అతని చతురతకు సిరులకు గోపురమైన కాశికాపుర వీధులలోని ధ్వని విశేషములను వ్యక్తపరచు పద్య భాగము ప్రబల నిదర్శనము.

సీ. ప్రతివీథి సంచర త్పార్వతీ చరణాంబు
జాత నూపురఝుళం ఝుళరవంబు
విశ్వనాథ విహార వృషభరాజాకుంఠ
కంఠ ఘంటాఘణం ఘణనినదము

పటహారవవభంగ భాగీరథీభంగ
సంఘ ఘుమంఘుమ స్వనభరంబు
రక్షాధికార భైరవభుజా స్తంభ గం
భీరఢక్కా ఢంఢ మారవంబు
గీ. సరవి నెచ్చోట మోక్షంబు జాటుసిరుల
కాపురంబగు నాకాశికాపురంబు
దఱిసి మణికర్ణికాది తీర్థములనాడి
యభవు సేవించి యచ్చట నలరుచుండె.

గంభీర ముద్రదాల్చిన భ్రమరాంబికా సందర్శన ఘట్టము గంభీరగతిని నడిచినది.

స్ర॥ కవిరంతన్ భ్రమరాంబికన్ హరి
వణీ కాదంబ కాదంబినీ
జటాశోభా నికురంబ చుంబరచరీ
చంచత్కరాంభోజభా
జనవాలవ్యజనా నిలాంకుర చలాం
చత్కుంతలం గాంతలం
ఘనజంఘాల మృగేంద్రవాహన వహి
గ్రైవేయ శాతోదరిన్.

తృణజ్యోతి, ఓహరి, సాహరి ఆదిగాగల విశిష్ట ప్రయోగము లీకవికి నన్నిచోడ, కృష్ణరాయల కావ్య పరిచయ భాగ్యమున కలిగినట్లు విశదీకరించుచున్నవి.

దక్షిణాంధ్ర సాహిత్యమునకు కంఠాభరణమైన ఈ కావ్యము కవితాప్రౌఢిమయందు, భావనాబలమునందు, కావ్యనిర్మాణ కౌశలమునందును రఘునాథుని బుద్ధికుశలతను, ఉపజ్ఞను వేనోళ్ళచాటి, రసస్ఫోరకమై వెలయుచున్నది.

## కవిత్వనిర్వచనము :

ఛందోబద్ధమైన కవిత్వమునకు రసపరిపాటి బంగారునకు తావియని సెలవిచ్చినాడు రఘునాథ భూపాలుడు!

"జాతియు వ్రాపంబు దప్పని యంతమాత్ర
మునకె తిన్నను దామెచ్చికొనెడివాని
పాటిసేతురె! రసపరిపాటిజేట
మాటలగవిత్వము ఘటియించు మేటికవులు!"

శ్మశానముల బోలిన నిఘంటువులను దాటి, వ్యాకరణముల బోలిన శృంఖలములను విడచి, ఛందస్సుల సర్వపరిష్వంగం విసర్జించను నే తగున భావకులావాడు ఉండిరేమో! కవితకు రసపరిపాటి ప్రధానాంగమని గుణగ్రహణ రసజ్ఞుడైన ఆ కవిచంద్రుడు గ్రహించి, విలక్షణమైన కవితారచనకు సామగ్రిని గ్రంథస్థమొనరించినాడు.

"పలుకగవలె నవరసములు
గులుకం జవ్యములు చెవులకున్ హృద్యముగా
............................
..........................
........................
చెప్పవలె కప్పురంబులు
కుప్పలుగా బోసినట్లు, కుంకుమపైపై
కుప్పినక్రియ, విరిపాట్లను
విప్పినగతి, ఘుమ్మనకవిత్వము సభలన్.

చెవులకు జవులై చల్లగ
గవులకు దవులై, సమస్తకౌగ్యకళాబం
ధువులై రససంపుల
యువురా! యనగవిత యవని నలరగవలదా!"

పరాగరంజితమైన మాటలతేట, రసవంతమై, అర్థవంతమైన రచన కవితారచన! ఎంతటి విశిష్ట వ్యాఖ్యానమో! ఏనాటిమాటో కాని, ఆ మాట బంగారునీట లిఖింపదగినది. రసపరిపాటి నిగ్రహింప నేరక, ఛందస్సుపై మమకారం పెంచుకొని, తమ మనస్సును దానికై లగ్నమొనర్చుకొని కవితారచన కుపక్రమించినవారికీ వ్యాఖ్యానము కనువిప్పు కాగలదేమో! ఛందస్సు పత్రికా లోకమునకు సంబంధించిన సమస్య అని భావించవచ్చునేమో!

## ఉపసంహారము :

రఘునాథుని కవితాశాఖ నధిష్ఠించి వాల్మీకి కోకిల వాటికిని పేటికిని 'రామ' 'రామ' యని కర్ణరసాయనముగ కూయుచున్నది.

"పుట్టతేనియ బోలిన నిట్టలంపు దియ్యదనము కలిగిన తెలుగు బాసయందు బుట్టు బుద్ధివు మనుగడను నీరాచకేసరి వ్రాసి, తనుగొల్చు వేల్పునకు నీకబ్బపు కన్యనిచ్చి యెల్లకడల నెల వేళల దెలుగువారిలో నెలకొనిన పేరు గడించినాడు. మహోదారుడై, శత్రుజేతయై, కృతిప్రణేతయై, శరణాగతత్రాతయై గాంధర్వ విద్యాధురంధరుడై, కవిపండిత హృదయ సంస్థితుడగు నీరఘునాథ భూనేత చరిత్రము బంగారు నీట లిఖింపదగినది. రాజకవీంద్రకృతమై, కవిరాజ సమ్మానితమగు నీతని కృతులాంధ్ర మహాజనులాదరింతురు గాక!" అను శ్రీ నిడుదవోలువారి ఆశాభావపు పలుకులు రఘునాథరాయని రచనా రామణీయక మూలక విశిష్ట మణిహారములు.

# పంపకవి

శ్రీ కె. సుబ్బరామప్ప

తెలుగు కన్నడ సాహిత్యముల బాంధవ్యమును గూర్చి మే నెల భారతిలో ప్రకటింపబడెను. 16 వ శతాబ్దమువఱకు తెలుగు కన్నడ సాహిత్యముల పరస్పర సంబంధము నందులో వివరించితిని. ఈ వ్యాసమున కన్నడిగుల ఆదికవియైన పంపకవిని గూర్చి తెలుగువారికి పరిచయము గావింప దలచితిని.

కన్నడ సాహిత్యమున మేటికవులు పంప, రన్న, పొన్న అనువారు. వీరిని రత్నత్రయ మందురు. తెనుగు సాహిత్యమున కవిత్రయమువంటివారు వీరు. కన్నడ సాహిత్యమున 9 వ శతాబ్దమున నృపతుంగుడు "కవిరాజ మార్గ"మను గ్రంథమును వ్రాసినను, అది లక్షణ గ్రంథమగుటచే 10 వ శతాబ్దమున కావ్యమును వ్రాసిన పంపకవియే కన్నడిగుల ఆదికవియని ప్రసిద్ధికి వచ్చెను.

పంపకవి ఆంధ్రదేశముతో సంబంధము కలవాడు. ఆంధ్రభాషతోను సంప్రదాయములతోను నీతనికి పరిచయము గలదు. శ్రీ నిడదవోలు వేంకటరావుగారు తమ సాహిత్యచరిత్రలో పంపకవి తెనుగునకూడ కవిత్వము వ్రాసినట్లు కొన్ని పద్యముల నుదాహరించి యున్నారు. తెలుగువారికి నన్నయ భట్టారకు డెట్లనో కన్నడిగులకు పంపకవియు నట్టివాడు.

ఆనాడు మతము నాశ్రయించుకొని సాహిత్య మభివృద్ధి జెందినది. కన్నడ సాహిత్యము జైనయుగ, వీరశైవయుగ, బ్రాహ్మణయుగ అని విభజించి చెప్పబడినది. అనగా సాహిత్యముపై మతములకెట్టి ప్రభావము గలదో వ్యక్తమగును. పంపకవి సదాచార సంపన్నులైన బ్రాహ్మణ వైదిక కుటుంబమునకు జెందినవాడు. జైన మతావలంబి యయ్యెను. ఆంధ్ర దేశమున నాడు విజృంభించుచున్న వైదికమతము గిట్టక కన్నడ నాడునకు విచ్చేసి యుండనోపు. అటులనే వైదిక కన్నడిగుడైన నారాయణభట్టు కన్నడ దేశమున 10, 11 శతాబ్దాలలో విజృంభించుచున్న జైనమతము సరిపడక కాబోలు ఆంధ్రదేశమునకు వచ్చి రాజరాజ నరేంద్రుని ఆస్థానమును జేరి నన్నయ్యకు భారత రచనలో సహాయపడెను. పంపకవి ముత్తాత తండ్రియైన మాధవ సోమయాజి మంత్రసిద్ధినిపొంది యజ్ఞయాగాదికముల నాచరించి ప్రసిద్ధికెక్కినవాడు. ఈతనిమహిమ చేత నే పంపనికి గౌరవము. కాని ఆతని యాగధూమము నుండి జైనమతావలంబియైన తన కీర్తికి నైల్యము గల్గెనని బహుశః పంపడు వ్యసనపడియుండును. ఈ మాధవ సోమయాజి సంతతిలోని అభిరామదేవుడే పంపని తండ్రి. పంపకవికి అనూచానముగ వచ్చిన బ్రాహ్మణ సాంప్రదాయముతో క్రొత్తగ గైకొన్న జైనధర్మము గూడ కలిసికొని రెండును పాలును నీరువలె కలిసి పోయినవే గాని ఒకదానితో నొకటి ఘర్షించలేదు. మతాంతరుడైనను నీతనియందు మతాంధత మూడలేదు. పంపనియందు రెండు సంస్కృతుల సారమును జేరికొని పుష్టినొందెను. ఉదారమయ్యెను. దీని ఫలితము ఆతని కవిత్వమున కానవచ్చును.

పంపని వంశీయులు వేంగిమండలములోని వేంగిపల్లు అను అగ్రహారమున నుండినవారు. వేగినాడు కృష్ణాగోదావరీనదుల మధ్యగల ప్రాంతము. ఇది ఆంధ్ర దేశమైనను అక్కడ కూడ కొందరు కన్నడిగులు నివసించుచుండిరని గోచరమగుచున్నది. నృపతుంగుడు తన "కవిరాజ మార్గమున" (9 వ, శతాబ్దము) కన్నడ దేశ విస్తారమును వివరించుచు "కావేరి ఇంద గోదావరి వరం" (కావేరినుండి గోదావరి వఱకు అని) చెప్పి కొన్నాడు. పంపకవి పెద్దవాడై గొప్పకవి అగు సమయమునకు వేంగిమండలమునకు పశ్చిమమున నుండు కన్నడ నాడునకు సమీపమున గల వేములవాడ యందు రాజ్యము సేయుచున్న అరికేసరి ఆస్థానమును జేరెను. ఈ ప్రభువుయొక్క ఆశ్రయమున కావ్య రచనగావించి పూజాపురస్కార లాభములను పొందెను ("పూజనెగళ్త లాభగళు") పిమ్మట నితడు కన్నడదేశమున మలెనాడు ప్రాంతమున సంచరించి అందలి ప్రకృతి రామణీయకమునకు అచ్చెరువంది తన కావ్యమునందు దానిని సొగసుగ వర్ణించెను.

వానిలో బనవాసి యొకటి. దీని నితడు కడు హృద్యంగముగ చిత్రించెను.

అరికేసరి రాజు పంపని తన ఆస్థానకవిగా జేసికొని అతనిచే "విక్రమార్జున విజయ"మను పేర మహాభారతము వ్రాయించెను. ఒక శతాబ్దము గడచినవెనుక తెనుగుదేశమున వేంగీమండలము నేలిన రాజరాజనరేంద్రుడు నన్నపార్యునిచే మహాభారతము నే తెనుగున వ్రాయించెను. పంపకవి తొలుత "ఆదిపురాణ"మను జైనతీర్థంకరుని చరిత్రను వ్రాసెను. పిమ్మట మహాభారతమును రచియించెను. తనకు ఆశ్రయదాతయైన అరికేసరిని అర్జుననితో పోల్చి తనివిదీర అతని ధైర్యసాహస పరాక్రమములను వర్ణించియున్నాడు. అందులకే దీనికి మహాభారతమను పేరిడక "సాహస విక్రమార్జున విజయము"ని నామకరణ మొనరించెను. ఈ అనుకరణమును మన నన్నయభట్టు కూడ జేసి ధర్మరాజును వర్ణించుచుట రాజరాజనరేంద్రుని పొగడియున్నాడు. "రాజకులైక భూషణుడు" అను మొదలయిన నన్నయ పద్యములను చదివినప్పుడు రాజరాజును ధర్మరాజునకు పోల్చిన ఛాయ కనుపించును. గ్రంథమును అంకితము చేయుపద్ధతికూడ పంపని సాంప్రదాయమును నన్నయ్యకూడ అనుకరించెనని చెప్పవచ్చును. పంపకవి గ్రంథాదిలో చాళుక్య వంశమును బ్రహ్మాండముగ వర్ణించియున్నాడు. చాళుక్య నరేంద్రుడైన రాజరాజునకును అప్పటికే ప్రసిద్ధికి వచ్చిన పంపని భారతముపై అభిమానము గల్గియుండును. తన యాస్థానమున నాతని భారతమును నారాయణభట్టుచే చదివించి యుండును. అదినన్నయ్యను భారతమును తెనుగున వ్రాయుమని కోరునంతవరకు అతనిని ప్రోత్సహించినది. అందులకే నారాయణభట్టు సహాయమును ఆపేక్షించి నన్నయ్య భారత రచనకు పూనుకొన్నాడు నారాయభటు పంప భారతమును మన నన్నయ్యకు బాగు చదివి వివరించినాడు. లేదేని "భారత ఘోర రణంబునందు నారాయణునట్లు తన కిష్టుడును సహాధ్యాయుడును నైనవాడు అభిమతంబుగ తోడై" ఇంతకంటె నేమి సహాయమును చేసియుండ నోపును? అందులకే కొందఱు నన్నయభటు, పంపని అనుసరించినాడు ఈ అనుకరణలను వేరుగ నివేదింతును.

పంపడు కవిమాత్రమే కాడు. యోధుడు. వీరుడు. భారతకథలో అరికేసరి కథను జోడించి తన పోషకుని కీర్తిని చిరస్థాయిగా నిల్పెను. రాజువెంట రణరంగములకుకూడా పోయి శౌర్యముతో పోరాడినాడు దీని నుండి ప్రభువునకును ఆశ్రితునకును కావలసినంత ప్రయోజన మయెను. రణరంగములను, అందలి వివిధ విన్యాసములను సైనికుల దినచర్యలను, వారి లోపదోషములను, ధైర్య సాహసములను అతి సైజముగ భారతమున వర్ణించియున్నాడు.

పంపకవి రచియించిన "ఆదిపురాణము" "విక్రమార్జున విజయము"లనుగూర్చి పరిచయము చేసికొందము.

## "ఆదిపురాణము" (క్రీ. శ. 941)

ఆదిపురాణము ఆదిజైనతీర్థంకరుడైన వృషభనాథుని చరిత్రను వర్ణించును. దీనిని వ్రాయునప్పుడు జైనమతాభిమానము ఈ కవియందు మెండుగా కానుపించును. ఈ గ్రంథ రచన మూలమున రెండు ధర్మములను సాధింపనెంచెను. "నెగళ్-ఆదిపురాణదోళ్-అఱువుదు కావ్యధర్మమం, ధర్మముమం" అని గ్రంథాదిని చెప్పుకొన్నాడు. ఈ రెంటి ఘర్షణలో (కావ్యధర్మము-మతధర్మము) కావ్యరసోత్పాదనకు మతధర్మము అడ్డువచ్చినదని చెప్పవచ్చును. దీనికి ముఖ్యమైన కారణము జైనపురాణస్వరూపమునందే గలదు. అందులో లోకదేశాది విభాగములు, తపోమహిమ, జన్మాంతర కథలు, తీర్థంకరునికి ఆఖరు జన్మమున జరుగు 'పంచమహాకల్యాణములు' అతడు గావించిన ధర్మోపదేశములు—మొదలైనవి జైనసాంప్రదాయానుసారముగ వర్ణించియే తీరవలెను. కవికల్పనాశక్తికచట తావులేదు. ఈ కారణములచే పంపకవికి ఆదిపురాణ రచనయందు చేతులు బిగపట్టినట్టయినది. ఈ పురాణ కథనమందు కొన్ని నీరసములైన ఘట్టములను తొలగించిన యెడల నిదియొక ఉత్తమ కావ్యమగును. దీనియందు జైనధర్మసారమును రమ్యముగ చిత్రించియున్నాడు.

మానవుని సహజప్రవృత్తి భోగములకడకేపోవును. ఇటు, విషయ సుఖములందు వ్యామోహపడి వానిని పొందగోరి సంసారమున తగుల్కొని పరితపించును. ఒకవైపు కీర్తిప్రశస్తులకై మోజుపడి వానిని సాధించుటకై ప్రాకులాడును ఇన్నియు లభించినప్పటికిని కడకు మిగులునది—అతృప్తి. దొరకిన భోగము లేవైనను శాశ్వతముగ నిల్చునా? చూచుచుండగనే కంటి యెదు

టనే మాయమైపోవును. భోగాంత్యమున త్యాగమని వైభవాంత్యమున వైరాగ్యమని తెలిసికొనుటయు జీవునికి ముక్తిలేదు. ఈ తత్త్వము భారతదేశమున వైదిక — అవైదిక దర్శనముల కన్నింటికిని సమానమే యైనను తీవ్రమైన తపశ్చర్యను బోధించునట్టి జైనదర్శనమున మాత్రము దీని కెక్కువ ప్రాశస్త్యముగలదు. ప్రతి జైనతీర్థంకరుని చరిత్రయును, సంసారమందలి నిస్సారతను, సన్యాస మందలి మహత్త్వమును బోధించును. ఈ తత్త్వము ఆదిపురాణమందు పంపకవి సొగసుగా కావ్యరూపముగా రూపొందించియున్నాడు.

ఆదినాథుడు తపస్సునుండి ధర్మామృతమును సాధించి లోకమున వ్యాపింపజేసిన వైరాగ్యమూర్తి. ఈ పరిపాకమును పొందుటకు అతని జీవమెన్నియో జన్మల నెత్తవలసివచ్చెను. నాటకమందలి దృశ్యముల వలె యీ జన్మములన్నియు నొకటి వెంబడి నొకటి వచ్చుచుండెను. రాజపుత్రుడుగా పుట్టినప్పటియాతని భోగాసక్తి జన్మజన్మమును నేరీతిగా వెన్నంటి వచ్చినదియు, ధర్మశ్రద్ధ యెట్లు పుట్టినదియు విషయాసక్తి యెట్లు సడలినదియు వైరాగ్యమెట్లు హత్తుకొనినదియు మిక్కిలి రసవంతముగ యీ పురాణకథనమున పంపకవి వర్ణించియున్నాడు. పంపని తొలికావ్యముగ నిది వెలసినది.

## విక్రమార్జున విజయము
## లేక భారతము

వ్యాసభారతమును విక్రమార్జున విజయమను పేరిట పంపకవి వ్రాసెనని యిదివరకే తెల్పితిని. ఈ కావ్యమున భారతకథతోపాటు తన కృతిభర్తయైన అరికేసరి చరిత్రయు నేర్పుతో చేర్చియున్నాడు. అరికేసరియొక్క బిరుదులను అర్జునుకిని అర్జుని సాహసమును అరికేసరికిని పోల్చుచు ఒకరి ప్రశంస వచ్చినప్పుడంతయు వేరొక్కని చరిత్ర సూచితమగునట్లు చిత్రణము గావించియున్నాడు. ఈతని భారతమున అర్జునుడే నాయకుడు. ద్రౌపది పంచభర్తృక కాదు. అర్జునుని భార్యమాత్రమే యగును. ఈ సంగతి జైనభారతమున స్పష్టముగ చెప్పబడినది. సుభద్రార్జునుల వివాహమును కవి లోకాంబికా అరికేసరుల వివాహముతో నేర్పున జోడించి వర్ణించియున్నాడు. సుభద్రార్జునుల ప్రణయకథకు పంపకవి యెక్కువ ప్రాశస్త్యము నిచ్చియున్నాడు. బహుశః తన ప్రభువున్న, ప్రభుపత్నిని మెప్పించుటకై యిట్లొనరించియుండునేమో! కౌరవవధానంతరము రాజ్యపట్టాభిషేకము జరిగినది ధర్మరాజునకు కాదు; అర్జునునకే. ధర్మజుడు గూడ దీనికి సమ్మతిని సూచించును. వయోవృద్ధత్వమే ప్రతిబంధకమని ధర్మజుడే చెప్పి అర్జునునకు పట్టాభిషేకమొనర్చును. పంపకవి వ్యాసభారత కథాంశములను అనేక చోటుల మార్పు చేసియున్నాడు. చేసిన చోటులలో మెరుగు పెట్టినట్టున్నది. కాని లోటుకనబడదు. కాని కృష్ణావతారమునకు తగిన ప్రాశస్త్యమునీయలేదు. మహాభారత ప్రధాననాయకుల గుణగణములను పేర్కొను సందర్భమునగూడ కృష్ణుని చేర్పలేదు.

అర్జునునకింతటి ప్రాధాన్యమిచ్చిన పంపకవి కర్ణునిగూడ ప్రశంసించకపోలేదు. దుష్టచతుష్టయమున కర్ణునిచేర్చినను అదిక్షణికమైన ఆపాదనయే. కర్ణునికిగల్గిన దురదృష్టపరిస్థితులను జాలిగొని వర్ణించియున్నాడు.

“కర్ణుని తల భారతం” అను నానుడిని పంపకవియే సమర్థించినాడు. (“కర్ణం గొడితుంబిల్ భారతం”) ఈ మాటను కృష్ణునితో చెప్పించును. అది చాలక అర్జునునితోకూడ చెప్పించి సమర్థించెను. కర్ణుని త్యాగము, స్నేహము, గర్వము, పౌరుషమును గూర్చి వేనోళ్ల పొగడినాడు, స్వామిభక్తి పరాయణునిగ చిత్రించెను. కర్ణునిగూర్చి వర్ణించిన పట్టులలో మచ్చునకు!

“నెనెయదిరణ్ణ భారతదోళ్ -
ఇన్ పెఱరారుమన్; ఒందెచిత్తదిం
నెనెవొడె కర్ణనం నెనెయ; కర్ణనోళ్ -
ఆర్ దొరె! కర్ణ నేఱు; క
ర్ణన పడెమాతినోళ్ పుదిదు
కర్ణరసాయన మల్తె భారతం.”

అతని రెండు కృతులలోను పంపకవికి దేనిపై ప్రీతి మెండుగనుండెనో చెప్పుటకష్టము. ప్రభుని మెప్పించుటకై భారతమును, తన ఆత్మసంతోషమునకై ఆదిపురాణమును వ్రాసినాడు. జినేంద్రుని చరితను కావ్యముగ వ్రాసి పునీతుడు కావలెనను కోరికయే యాతనిని ఆదిపురాణమును వ్రాయునటు జేసెను. ఆది పురాణమును రచియించిన పంపడు “పురాణకవి”యని పేరువడెను. రన్నయను కవి (రత్నత్రయములోని రెండవవాడు) యీ కావ్య

మును "ఉపమాతీతమని" పొగడెను. ఈతని కృతులు కన్నడ సాహిత్యమున నొక క్రొత్తయుగమునే సృష్టించెను. జైనయుగమనుటకు మారుగ పంపయుగమయ్యెను. చంపూరచనలో వ్రాసినవారందఱికిని, వారు జైనులు కానీ, కాకపోనీ, క్రీ. శ. 1200 వరకు పంపకవి కావ్యములే ఆదర్శములైనవి. ఆదిపురాణమున గద్యపద్యములలో దీర్ఘములైన సంస్కృత సమాసములు మెండు. కొన్ని పద్యములలో పాదాంత్యములందలి కన్నడ ప్రత్యయములను తొలగించిన యవి కేవల సంస్కృత రచనలేనా యనిపించును. ఈతని రచన "లలితపద" భూయిష్ఠమై "ప్రసన్న కవితాగుణము"లతో నొప్పినది. "అక్షర రమ్యత"గలదు. పంపని రచనలోని యీగుణములనే మన నన్నయ్య అనుకరించెను.

భారతము రచించువేళకు ఈతనిలో సంస్కృతముపై కొంత మోజుతగ్గినది. అచ్చకన్నడ నుడులను అనేకచోట్ల వాడుచువచ్చెను. లోకానుభవము కూడ అప్పటికి అతిశయించినది. వర్ణనావైశద్యము కవి సూక్ష్మదృష్టిని తెలియజేయును. యుద్ధవర్ణనలలో నీతనికీయానుకూల్య ముండెను. అతడు స్వయముగ వీరుడు. రణరంగమున జొరబడి అక్కడి సన్నివేశములను, విన్యాసములను కన్నార గాంచినాడు. అందువల్లనే యీతని యుద్ధవర్ణనలన్నియు స్వభావోక్తులు. ఇతడు "ప్రసన్నకథా" కథనమందు దక్షుడు. శంతను—సత్యవతి సందర్శనము, కర్ణజననము, కుంతీకర్ణ సంభాషణము, శతశృంగ పర్వతమున పాండురాజు కథ మొదలైనవి ఇందుల కుదాహరణములు.

నవీన కల్పన, రసానుగుణమైన కథాశరీర రచన, వస్త్వనురూప రసనిర్మాణము, రసమునకు తగినట్లు ఛందస్సును వాడుట, కావ్యసౌందర్యమును చెడనీయక అంగోపాంగములను వర్ణించుట, పంపని రచనందు కానవచ్చును. అతడు పాత్రలకు జీవమిచ్చి యెదుట నిల్పి మాట్లాడునట్లు చేయును. సహజముగ వర్ణించును. సన్నివేశమునకు తగినట్లు మితిమీరక కథను నడిపించును. బహువిధప్రయోగ దక్షతను చూపును. సముచ్చయములను విరివిగా వాడుట ఇతనికి ఇష్టము. "హితమిత మృదువచన," "ప్రసన్న గంభీర రచన చతుర," "కోమలం...సూక్తిగర్భం, మృదుసందర్భం, విచారక్షమం, ఉచితపదం, శ్రవ్యం" అని తన కావ్యగుణములను గూర్చి నిరూపించుకొన్నాడు. "లలిత పదం" "ప్రసన్న కవితాగుణం," "అక్షర రమ్యత"—వీనినిగూర్చి కూడ చెప్పికొన్నాడు.

పంపకవి మహాభారతమందలి యొక ఆశ్వాసమైన భీమదుర్యోధనుల గదాయుద్ధ కథనే రన్నకవి "గదాయుద్ధ" అను గొప్ప కావ్యముగా వ్రాసినాడు. పంపని శైలిని మెచ్చికొని యాతని కొన్ని వాక్యములను చిరుమార్పులచే తన గ్రంథమున చేర్చికొన్నాడు. ఈతని కల్పనా చాతుర్యమున కొక యుదాహరణము.

"ఇదఱొళ్ శ్వేతాతపత్ర స్థగిత దళదిశా
మండలం, రాజచక్రం,
పుదిదత్తాడి త్తసంగిత్తె దఱొళె
కురురాజాన్వయం, మత్ప్రతాప
క్కె దఱెందం నోడకుర్వ ద్విగుదిసువె
మహాభారత క్కాదియాయ్త
బ్జ దళాక్షీ కేళ సామాన్యమె బగెయె
భవత్కేశ పాశ ప్రపంచం"

ద్రౌపదీ కేశపాశమే ఒక ప్రపంచమైనది. దానియందు అనేక రాజాధిరాజులు అడగిపోయిరి. కౌరవ వంశమే దానియందు అంత్యమయ్యెను. మహాభారత సంగ్రామమునకు అది నాంది అయ్యెను కౌరవుల నుండి ద్రౌపదికి గల్గిన అవమానమే మూలకారణము కదా! ఇది పై పద్యము యొక్క భావము.

## నన్నయ అనుకరణ

పంపకవిని నన్నయభట్టు కొన్ని సందర్భములలో అనుకరించి యున్నాడు. తనకు సహాధ్యాయుడును, ఇష్టుడును నైన నారాయణభట్టుచే పంపని రచనా రీతులను, వర్ణనా కౌశల్యమును, 'ప్రసన్న కవితార్థ యుక్తిని', 'అక్షర రమ్యతను' తెలిసికొన్నాడు. అనుకరించదగిన వానిని అందుకొన్నాడు. చాళుక్యులు కన్నడము తెలియనివారు కారు. చాళుక్యులు కన్నడిగులు సంబంధికులు (మా. డా. నేలటూరి వెంకటరమణయ్యగారి "వేములవాడ చాళుక్యులు" "భారతి" డిశంబరు 1948) ఒక శతాబ్దమునకు ముందే రచింపబడినట్టి పంపభారతము సంగతి రాజరాజనరేంద్రుని ఆస్థానమున ప్రసిద్ధికి వచ్చియే యుండును. కన్నడ కవి నారాయణభట్టుయొక్క సహాయమునుగూర్చి నన్నయ గ్రంథాదిని గొప్ప ఉపమానము

లతో ప్రశంసించుటనుబట్టి పరికించినచో పంప భారతము నన్నయకు అతడు బాగుగ పరిచయము చేసినాడని తెల్లమగును.

నన్నయ అనుకరించిన పట్టులు కొన్ని మాత్రము సూచింతును.

నన్నయ గ్రంథాదిని వ్రాసిన "సారమతిన్" అను పద్యముతో దీటైనది పంపభారతమున "లలితపదం ప్రసన్న కవితాగుణం" ఇత్యాదితో ప్రారంభమగును. అంకితపద్ధతి, గ్రంథాదిని దేవతాస్తవము పంపని అనుకరణయే. ఆదిపర్వమున శకుంతలోపాఖ్యానమున కణ్వాశ్రమమును దుష్యంతుడు దర్శించినప్పుడు, ఆశ్రమప్రాంతమున వైరి వర్గమును విడి జంతుజాలము అన్యోన్యముగ నుండుటయు, శుకములు వేదపఠనమును చేయుచున్నదియు పంపకవి భారతములోనిదే. పంప భారతమున పాండురాజు శతశృంగ పర్వతమునకు బోయినప్పుడు అందలి మున్యాశ్రమము లిట్లుండెనని పంపకవి వర్ణించియున్నాడు.

"మునికుమారరు ఓదువ వేదవేదాంగగళం తప్పు విడుచు జడిదు బగ్గిసువ పదుమరాగన బణ్ణదర గిణిగళు మం, సురభిగళ తోరెద మొలెగళ నుణ్బురువ మరిగళం పూగెనూంకి కూంకి మొలెగళ నుణ్బ కిశోరకేసరి గళుమం, తమ్మొమ్మె సెల దాడువ కిశోం కేసరి గళం పిడుదు తెగెవ కరికలభంగళుమం; ఆ గళాగళిందె పాయ్వ పులిగళ మరిగళోళ్ పరిదాడువ తరుణ హరిణం గళుమం... చోద్యం పట్టు."

## నన్నయ :

"శ్రవణసుఖంబుగా సామగానంబులు
చదివెడిశుకముల చదువుదగిలి
కదలక వినుచుండు కరులునకరికర
శీతలచ్ఛాయ తచ్ఛీకరాంబు...
.........చోద్యమంది"

## కృతిపతి వర్ణన

పంప : "శ్రీ పతిగె యుద్ధమల్ల మహీపతిగె నెగళ్తెపుట్టి" మొదలైన పద్యాలు

నన్నయ: "రాజకులైక భూషణుడు" "విమలాదిత్యతనూజుడు" మొదలైన పద్యములతో ఇంచుమించు పోలికలు గలవి.

ఛందోనుకరణములు, పద్యముల ఎత్తుగడలు, విభక్తి పల్లటములు, వర్ణనారీతులు కొన్ని పట్టులలో పంపని అనుకరించినాడు నన్నయ.

పంపకవి "కవితా గుణార్ణవ" "సుకవిజన మనోమానసోత్తంసహంస," "సంసార సారోదయ" మొదలైన బిరుదావళిని సంపాదించికొన్నాడు. లేదేని ఆ పురాణమును మూడు నెలలోను, విక్రమార్జున విజయమును (భారతమును) ఆరు నెలలోను ముగించునా? మహాకవి యనిపించుకొనుట పూర్వజన్మ సుకృతము. ప్రతిభాశాలియగుటకు పుణ్యము చేసి యుండవలెను. అటువంటి కవిని బడయుటకు జనులుకూడ నోచి యుండవలెను. ఇటువంటి కవిని బడసిన కన్నడిగులు ధన్యులు.

## ఆధార గ్రంథములు


1. "పంప" శ్రీ. తీ. నం. శ్రీకంఠయ్య ఎం.ఏ., (మైసూరు విశ్వవిద్యాలయ ప్రకటన)

2. "కన్నడ సాహిత్య" శ్రీ కె. వెంకటరామప్ప ఎం. ఏ., (మైసూరు విశ్వవిద్యాలయ ప్రకటన)

3. "నాడోజ పంప" శ్రీ ముళియ తిమ్మప్పయ్య (మంగళూరు)

4. కన్నడ సాహిత్యచరిత్ర" శ్రీ.రం. శ్రీ.ముగళి.

# పరీక్ష

శ్రీ ఆర్. యం. చిదంబరం

గంటలు గణగణమని ఒక్కసారి మ్రోగాయి.

దీపాలవెలుగులో ఆ దివ్యమంగళాకారుడు వెలసి పోతున్నాడు. రకరకాల పువ్వుల సువాసన వుక్కిరిబిక్కిరి చేసింది. మనసులో ఆకాశపు టంచుల్ని అధిగమించి పైకి లేచిపోతూన్న భావాలు. మానవాతీతమైన ఆ శక్తి ఘనతని శంకించేందుకు ఆస్కారంలేని వాతావరణం. రెండు నిమిషాలవరకూ వంచిన తల పైకెత్తలేను. మూసినకళ్లు తెరవలేదు. ఏదో వూహాతీతమైన జ్యోతి వెలిగింది.

నీటి చుక్కలతో బరువు దిగుచుకున్నట్టున్న ఆ రెండు పువ్వుల్ని కళ్ళకద్దుకుని ఆవరణదాటి బయటకొచ్చాను. సుందరి కంగారుగా నడిచిపోతోంది ఆమె నడకనుబట్టి గుర్తుపట్టాను. ఎదురుగా వస్తున్న మనిషిని ఢీకొనబోయింది కూడా—ఒకటి రెండుసార్లు చీర కాళ్ళ కడ్డంవచ్చి ఆమెను బోల్తా కొట్టించబోయింది. గడియారం వంక చూస్తే ఆరుగంటలైంది. అయిదున్నరకే రమణ వచ్చివుండాలి. చప్పట్లు చరిచి పిలవగానే సుందరి ఆగి వెనక్కి తిరిగిచూసి ఏదో తప్పిదంచేసిన దానికిమల్లే నాలిక కొరుక్కుంది. ఒక వేళ ఆమెగుళ్ళో నే నన్ను చూసివుండి కూడా పలకరించలేదేమో!

'సుందరీ! ఏమిటిది? ఎన్నడూ లేనిది ఇవాళిలా వచ్చావు? రమణ ఇంకా రాలేదా?' అనడిగాను.

'ఇంకా రాలేదు...మీరింటికి వస్తున్నారుకదా! అక్కడంతా చెప్తాను.' ఆమె కంఠం భయాన్ని దాచలేక బాధపడుతూంది. రెండడుగులు తొందరగా ముందుకువేసి ఛటుక్కున ఆగిపోయింది.

'చూడండి!...మీరు నాకో సాయం చెయ్యాలి. నేనిలా గుళ్ళోకివచ్చినట్లు ఆయనతో మాత్రం చెప్పకండి. అసలా ప్రస్తావనే ఎత్తవద్దు...ప్రళయం లేస్తుంది!

మలుపు తిరిగేవరకూ ఆమె ఎంత వేగంతో పోతున్నదీ నేను గమనించగలిగాను. సుందరి రమణను చూసి ఎందుకు జడుసుకుంటోందో నాకు తెలుసు. ఆ కారణం తల్చుకుంటే ఆపుకోలేని నవ్వువచ్చింది.

రమణ ఇల్లుచేరుకునే సరికి మరో పది నిముషాలు పట్టింది.

'ఎవరది?' అంటూ రామయ్యగారు కళ్ళమీద అరచేయి వుంచుకుని నేనెవర్నో కనుక్కుందికి ప్రయత్నించారు.

'నేనండీ!...సాంబమూర్తిని' అని వాక్యం పూర్తిచేయటం, సుందరి వెండిగ్లాసునిండా పొగలు కక్కుతూన్న కాఫీని నాముందర వుంచటం ఒక్కసారే జరిగాయి. నేననుకున్నది సరైనదే—రమణ ఇంకా ఇంటికి రాలేదు.

'అవున్నాయనా!...నువ్వింతదగ్గరగా వున్నా కనపడటంలేదు. మనిషి ఏఅవయవం లేకపోయినా ఎలాగోలాగ బతుకు యీడ్చుకుపోగలడు కాని, చక్షువులు లేకపోతే జీవించలేడు. అవి లేనంతకాలం వెలుగూ—చీకటీ—అనే విభేదం వుండదు' ఆమాటలు శిథిలమయిన కట్టడంలోంచి వచ్చినట్టున్నాయి. ఏదో లోతైన ఆవేదన—తుఫానుకు చెట్టు భయంతో వూగిసలాడినట్టు.

"అలా ఎందుకనుకుంటారు? ఎలాగూ రేపుజరుగుతుందిగా! నెలరోజుల్లో మీ కళ్ళకు యౌవనంవస్తుంది" అంటూ నవ్వటానికి ప్రయత్నించాను. ప్రతి చిన్న విషయానికీ బాధపడుతూ, అనుమానపడుతూ వుండే వ్యక్తులు సూర్యుడు తూర్పున వుదయిస్తాడన్న సత్యాన్నికూడా నమ్మలేరు. రామయ్యగారిది నియమబద్ధమైన సనాతనజీవితం.

"బాబు ఏడీ!...కనపట్టంలేదు!" అనడిగాను.

సుందరి ముఖంలో విచారరేఖలు విస్తరించాయి.

# పరీక్ష

"ఏం చెప్పమండి?...ఆ వేళటినుండి ఒక టైజ్వరం మధ్యమధ్య తగ్గుతుంది. మళ్ళా వస్తుంది. అప్పుడప్పుడు వాంతులు—ఏవో పలవరింతలు—జడుసుకున్నాడని చెబితే ఆయన వినిపించుకోరు, ఏం చేయను? ఖర్మ' అంటూ నెత్తిబాదుకుంది.

'అసలు సంగతది కాదు నాయనా! బాబుకు రెండేళ్లున్నప్పుడు పెద్దగా జబ్బుచేసింది. జ్ఞాపకం వుందా? బతుకుతాడని ఎవరూ అనుకోలేరు. అప్పుడు మనవణ్ణి దక్కించమని తిరుపతి దేవుడికి మొక్కుకున్నాను. అప్పట్నుంచీ వీడిదగ్గర బుర్ర బద్దలుకొట్టుకుంటున్నాను. అతను వినిపించుకోడు. తనకలాంటి నమ్మకాలు లేవంటాడు. వెంకటేశ్వరస్వామికి కోపం రాకుండా వుంటుందా?' అని వ్యాఖ్యానించింది రవణతల్లి. 'ఇలాంటి నాస్తికులమధ్య బతకలేం నాయనా!...మా తమ్ముడు నిన్ననే వుత్తరం రాశాడు. కళ్లుబాగుపడ్డాక తన దగ్గరకువచ్చి వుండమని—' అని విసుక్కున్నారు రామయ్యగారు.

మానవ జీవితాలకు పునాది రుజువులేని నమ్మకాలేమోననిపిస్తుంది. ఒక అబద్ధాన్ని పదే పదే చెప్పటం వలన అదే నిజంగా మారుతుందని, దాన్ని ప్రజలు విశ్వసిస్తారని షేక్స్పియర్ ప్రతిపాదించాడు. దాని నిజానిజాలు ఎలావున్నా కొన్ని సూత్రాలు మాత్రం విమర్శకాస్కారం యివ్వకుండా మనలో పాతుకుపోయాయి. వాటిని ఖండించటం అంత సులభం కాదు. విజ్ఞానశాస్త్రం సరైన రుజువులేనిదే దేన్నీ ఆమోదించదు. కాని వేదాంతం ఎలాంటి ఉపపత్తీ ఇవ్వకుండా శాసిస్తుంది. 'పాపంచేస్తే యమలోకానికి పోతావంటుంది. తనకు దాస్యంచేస్తే తలచుకున్న కోరికలుకోరినా నెరవేరుస్తానంటుంది'...జరగవలసినదంతా ముందే నిశ్చితమైనప్పుడు విజయంకోసం కనపడని దేవుణ్ణిగురించి ఆలోచించటం వృథాగా కాలాన్ని పాడుచేయటం కాదా?' అని రవణలాంటివారు ప్రశ్నిస్తే వాళ్ళకు సరైన సమాధానం లభించదు సరికదా, ఎదురుగాలులు దావాగ్నిలా చుట్టేశాయి. కన్న తల్లిదండ్రులు కూడా అతన్ని అసహ్యించుకోటానికిదే మూలకారణం.

పక్కగదిలో బాబు నిద్రపోతున్నాడు. నుదుటిమీద చేయివుంచి చూశాడు. జ్వరంలేదు. మళ్ళీ హాల్లోకి వెడదామని వెనక్కి తిరిగేసరికి అతని మెడలో వున్న పసుప్పచ్చటితాడు చూడలేదు. నా కళ్ళల్లో వున్న ప్రశ్న అర్థంచేసుకున్న సుందరి చెప్పింది.

'ఆయనతో చెప్తారు కనక - తలతీసేస్తారు... ఈ వీధిచివర వున్న ఆచారిగారు మంత్రించి ఇచ్చారు. రేపు ఉదయానికల్లా బాబు కిలకిలమని నవ్వుతూ లేచి తిరుగుతాడన్నారు. ఏంచేయను మరి? ఈ సాయంత్రం గుళ్ళోకివెళ్ళి మొక్కుబడి చెల్లించివచ్చాను. ఆయన వచ్చేస్తారేమోనని కంగారుపడ్డాను—ఇంకా నయం!.. దేవుడిదయ!'

ఒక వ్యక్తి తనకున్న అభిప్రాయాన్ని మరొకరి నెత్తిమీద రుద్దటం అన్యాయమనిపించింది. రవణతో పరిచయం కలిగాక ఈ నాలుగేళ్లలో అతనిలో చాలా విచిత్రాలు చూశాను. సుందరిని ఏ వ్రతమూ—పూజా—చేసుకోనివ్వడు. అంతే ఆమెమీద చేయి చేసుకోటంగాని, గదమాయించటం కాని జరగదు. మనసును చీల్చి వేసేటట్లు తమాషాగా కబురు చెప్పివాదించే సామర్థ్యం అతనికి వుంది. ఆనాటి దృశ్యం ఇంకా నాకు గుర్తుంది.

'ఇవేళ హరికథాకాలక్షేపం వుంది. అత్తయ్యా, నేనూ వెడుతున్నా.' అంది సుందరి.

'కథ ఏమిటట?... నేనూ వస్తాను.' అన్నాడతను సీరియస్ గా. సుందరి తెల్లమొహం వేసింది.

'రామాయణంలో యుద్ధకాండ.' అంది. అసలు రామాయణం పేరు తన భర్త ఎప్పుడైనా విన్నాడా? అని ఆమె అనుమానపడినా నేను ఆశ్చర్యపడను.

కూర్చున్నవాడల్లా రవణ కుర్చీలోంచి అమాంతం లేచి చిన్నపిల్లాడిలాగంతులేసూ 'అప్పుడు శ్రీరాముడేమన్నాడంటే...' అంటూ మొదలెట్టే 'అది కాస్తా నేనే చెప్తాను. అలా కూర్చోండి.' అన్నాడు. సుందరికి కోపం, ఏడుపూ కలిసివచ్చాయి. తరతరాలుగా ఆమెలో పాతుకుపోయిన ఆస్తిక భావాల్ని వేళ్లతో సహా పెళ్ళగించి గిరవాటు పెట్టటానికి ప్రయత్నించటం వృథా. ఇదంతా చూస్తున్న నాకు ఎవరిపక్షం వహించాలో తెలిసింది కాదు. సుందరి మనసు సున్నితమైంది. ఎన్ని మెళకువలు తెలిపి డొంక తిరుగుడుగా చెప్పినా దాంట్లో వున్న 'కారం' ఆమె రక్తంలో కలిసిపోతుంది. మగవాడు ముగ్గురం ఓ మిత్రుడి పెళ్ళికి బయలుదేరాం. నేనే

ముందుగా ఆ అనుమానాన్ని లేవదీశాను. ‘ముగ్గురం కలిసి వెడితే ఆ పని ముక్కలవుతుంది.’ అని. రవణ నాకేసి వింతగా చూసి ‘మీరు కొన్ని శతాబ్దాలకు పూర్వం జన్మించి వుండవలసింది. అదే నిజమయితే దాన్ని పరీక్షించటానికి ఇదే అనువైన సమయం’ అంటూ బయలుదేరాడు. అతని మాట కెదురు చెప్పలేకపోయాం. ఇంతలో పుండుమీద కారంజల్లినట్లు వెనకనుంచి ఎవరో తుమ్మడం—ఒంటి బ్రాహ్మడు ఎదురుగా రావటం జరిగాయి. రవణకు అనుకోకుండా నిధిదొరికినంత సంతోషం కలిగింది. నా గుండెలు మాత్రం అతివేగంతో కొట్టుకున్నాయి. అనాది నుంచీ ఎముకల్ని అంటిపెట్టుకుని వున్న నమ్మకాల్ని ఎలా విదలించగలం?

పెళ్ళి సవ్యంగా జరిగిపోయింది. రవణ మమ్మల్ని వెక్కిరించాడు. సాయంత్రం మేడమెట్లు దిగుతూ కాలుజారిపడ్డాడు. ఎముకలు విరగవలసిందే కాని అదృష్టవశాత్తూ అంతపనీ జరగలేదు. ఈ సంఘటనను ఆధారంగా తీసుకుని అతనిలో పరివర్తన తీసుకురావడానికి యత్నించాను. పరాకుగా వుండటంవలన అలా జరిగిందే కాని, శకునాలకూ, దీనికీ ముడిపెట్టటం తెలివితక్కువన్నాడు. ‘ఇదంతా ఆ వేళ జనుసుకున్న దానిఫలితం!’ అంటూ సుందరి ఆలోచనా ప్రవాహానికి అడ్డం తగిలింది...అవునవును...ఆ సంఘటన ఎలా మరవగలను?...నాలుగేను రోజులక్రితం ఆదివారం నాడు...తథాగతుడు చిరునవ్వు నవ్వాడు.

అస్పష్టంగా కనిపిస్తున్న వదనంలోంచి బయలుదేరుతూన్న విజానకాంతుల్లో నేను మునిగిపోయాను. నాలో నేనే ఏదో గొణుక్కున్నాను. గుహ ప్రతిధ్వనించింది. తొమ్మిదడుగుల ఎత్తున్న బుద్ధుడు మళ్ళీ చిరునవ్వులు విసిరాడు.

ఏదో మెత్తగా కాళ్ళకు చుట్టుకున్న అనుభూతి. ఊహా ప్రపంచంలో కొన్ని సంవత్సరాలక్రితం వున్న వైభవంలో దైవత్వాన్ని మిళితం చేసుకుని విహరిస్తున్న మనసు ఒక్కసారిగా ఈ లోకంలోకి పరుగులుతీస్తూ వచ్చింది.

అసలే కొండ ప్రదేశం—ఏ కొండ చిలవో—పామో కాలికి చుట్టుకునివుంటే?...భయంతో తలదించి చూసి ఆశ్చర్యపోయాను.

‘మావయ్యా!...మావయ్యా!’ అంటూ గంతులేస్తూ నవ్వాడుబాబు. అతని బుగ్గలు సొంటపడి అమాయకత్వంతో నిండిపోయాయి. నెత్తికి చుట్టివున్న ఎర్రరుమాలు అటూ యిటూ, గాలికి రెపరెపలాడింది.

బాబూ!... ఇలా ఇక్కడికివచ్చావు?...... ఎవరు తీసుకొచ్చారు?’ అంటూ గభాలున ఎత్తుకున్నాను.

నావెనకాల కంగారుగా రవణ-సుందరి పరుగెత్తుకురావటం చూశాక అంతా అర్థమైంది.

‘హోరిపిడుగా!... మమ్మల్ని వెర్రివెంగళ్ళాయిల్ని చేసి బాగా ఆడిస్తున్నావురా!... మీరువచ్చినట్టు నాకు తెలియదు. సుందరి చేతివుంగరం ఎక్కడో పడిపోయింది. అది వగులుగావుంటే పెట్టకో వద్దన్నాను. వినలేదు. ఆమెకు ఏ దూర్వాసుడూ శాపంయివ్వలేదు కనుక ఇప్పుడొచ్చిన ప్రమాదమేమీ లేదు... ఆ రాతిమీద బాబును కూర్చోబెట్టి వెదుకుదామని వెళ్ళాం. ఈలోగా వాడు పరిశోధకుడిలా బయలుదేరాడు.’ అన్నాడు రవణ. నవ్వకపోతే కొండాదెబ్బలు తగులుతాయన్నట్టు సుందరి నవ్వింది. రవణముఖంలో నిరాశా రేఖలు కదిలాయి

‘కానరీస్ గుహాలంటే ఏవిటో అనుకున్నాను—ఇందుకేనా బొంబాయినుంచి ఇరవైమైళ్ళ ప్రయాణం చేసివచ్చాను? అంతా నేతిబీరకాయలాంటిది. హక్స్లే అన్నట్టు మనం చూడని ప్రదేశంలో ఏదో వింత వుందని అనుకోటమే కాని, అది సత్యదూరమన్నమాట నిజం.’

మేం నడుస్తూ కొండసగం యెక్కాం.

‘అయితే రవణా! ఈ గుహాలు నీలో ఆధ్యాత్మిక చింతల్ని లేవదీయటం లేదూ?... పోనీ నీకు దానిమీద నమ్మకంలేదు కనక వదిలేద్దాం. చరిత్రాత్మకంగా - కళారూపంలో నీకేలాంటి ఉత్సుకతా కలగటంలేదూ? సుమారు వెయ్యి సంవత్సరాలక్రితం ఈ గుహల్లో నివసించిన బౌద్ధ భిక్షువుల జీవితక్రమం, ఆచార వ్యవహారాలు, వీటిని గురించి ఆలోచించాలనిపించటం లేదూ?’

‘లేకేం?...తెలుస్తూనే వుంది. కాయకష్టం లేకుండా; బుద్ధుడు పేరు చెప్పుకుని హాయిగా, గొర

వంగా బతికారు —. ఇందులో మెమ్మకో తగ్గదేమీ లేదు.'

అతనితో వాదించి లాభం లేదని ముందే చెప్పాను.

రెండు ఎత్తైన కొండల మధ్య పెద్దలోయ — వానాకాలంలో ఆలోయ నీటితో నిండి వుంటుందని వినికిడి. అవతల కొండమీద కొన్ని గుహలు కనిపించాయి కాని అక్కడకు వెళ్ళేమార్గం మాత్రం కనపడలేదు. రవణ ఆ దృశ్యం ఫోటో తీయటానికి కామెరా సరిచేస్తున్నాడు. సుందరి లోయకేసి తదేక దీక్షగా చూస్తోంది. నేను ట్రైపాయిడ్ సరిచేస్తున్నాను.

సుందరి ఒక్కసారిగా కెవ్వుమంది.

బాబు కనపడలేదు. ప్రకృతి సౌందర్యాన్ని చూస్తూ మమ్మల్ని మేం మర్చిపోయి అతన్ని గురించి ఆలోచించనేలేదు. అసలే అల్లరిపిడుగు. అందులోనూ కొత్తచోటు. రవణ కంగారుగా నాలుగు వైపులా చూశాడు 'అమ్మోయ్' అని అరుస్తూ బాబు గుహలోంచి పరుగెత్తుకొచ్చాడు.

ఆ గుహలోపల ఎడంపక్కనే చిన్న గదిలా వుంది. అక్కడంతా చీకటితో నిండివుంది. ఒంటరిగా వస్తే ఎంతటి గుండెనిబ్బరం వున్నవాళ్ళైనా జడుసుకుంటారు. అయినా అతనా చీకట్లోకి ఏముందని వెళ్ళాడు? కళ్ళు బెదురుతున్నాయి. ముఖంనిండా చెమట బొట్లు. మళ్ళీ గట్టిగా అరిచాడు.

'ఏంట్రా?...ఏమయింది? అసలక్కడి కెందుకెళ్ళావు?' అని గదమాయించాడు రవణ. బాబు సమాధానం చెప్పక వెర్రిగా చూశాడు.

'జడుసుకున్నట్టున్నాడు. రాక్షసుడికి మల్లే మీరు అరవకండి. ఇంక దిగిపోదాం—పదండి—చాలు' అని సుందరి సమాధానంకోసం ఎదురుచూడకుండా గబగబా దిగిపోయింది. చేసేదిలేక మేం కూడా వెంబడించాం... ...అది!......అప్పుడు జడుసుకున్నాడు—అందుకే యీ జ్వరం.

నా ఆలోచనలు ఒకచోటికి వెళ్ళి ఆగిపోవటం రవణ నన్ను నవ్వుతూ పలకరించటం ఒక్కసారే జరిగాయి. హఠాత్తుగా ఆఫీసులో ఇన్స్పెక్షన్ వచ్చిపడిందని, ఫోంచేసి మళ్లీ వెళ్లవలసి వుంటుందని చెప్పాడు. ఆఫీసుదుస్తులైనా విప్పకుండా తిన్నగా బాబుపడుకున్న మంచందగ్గరకు వచ్చాడు. అమాయకంగా నవ్వుతూ నిద్రపోవటం అతని కాశ్చర్యాన్ని కలిగించింది. మెడవరకూ దుప్పటి కప్పి వుండటంవలన మెడలోని తాడు అతనికి కనిపించే అవకాశం లేదు. సుందరి తెలివైంది కనక ముందుజాగ్రత్త పడింది. వ్యక్తిగతాభిప్రాయం ఎలావున్నా ఈ ప్రత్యక్ష నిదర్శనాన్ని ఖండించలేకపోయాను. రవణ బాబు నుదుటిమీద చెయ్యివుంచి చూశాడు.

'అరే!...జ్వరం నార్మలుకు వచ్చినట్టుందే! చిత్రం!...డాక్టరు మూడురోజులవరకూ టెంపరేచర్ వాచ్ చేయమన్నాడే!...సుందరీ! వొడ్డించు! ఇదుగో వస్తున్నా' అంటూ కదలిపోయాడు.

సుందరివిడిచిన దీర్ఘమైన నిట్టూర్పులో వుండే అర్థం నా ఒక్కడికే తెలుసు. పెదవుల మధ్యనుంచి నీటిబుడగలా పేలటానికి సిద్ధంగావున్న నవ్వును బలవంతంగా అణచుకుని వంటింట్లోకి వెళ్లింది.

నాటకరంగంమీద ఓపాత్ర ఎడంపక్కనుంచి వెళ్లగానే కుడిపక్కనుంచి మరోపాత్రప్రవేశించినట్టు రవణచేతిలో థర్మామీటరుతో ప్రత్యక్షమయ్యాడు. ఇంకో నిమిషంలో బాంబు పేలుతుందనుకున్నాను. టెంపరేచర్ చూసే ప్రయత్నంలో ఆ 'మంత్ర రజ్జువు'ను కనుక్కున్నాడు.

'సుందరీ!' అని పిలిచాడు.

పాత్రలన్నీ మళ్ళీ రంగంమీదికి చేరుకున్నాయి.

'చూడండి!...మీకు కోటి నమస్కారాలు. నన్ను మీరేమన్నా చేసినా, ఫరవాలేదు. కాని బాబునుమాత్రం దక్కనీయండి. మీకుతోచదు. ఒకరు చెబితే అర్థంకాదు. చిన్నపిల్లలు జడుసుకోటం సహజం—అందుకు ఏ డాకరూ ఇంతవరకూ మందు కనిపెట్టలేదు. వైద్యం చేయలేదు'

సుందరి దీనంగా చెప్పుకుపోయింది.

రవణ ఫక్కున నవ్వేసి ఆ తాడు కాస్తా పుటుక్కున తెంపేశాడు.

'పట్టివెర్రిపిల్ల మా సుందరి' అంటూ రాగయుక్తంగా పలికాడు. ఈ సందడిలో బాబు వేలొక్కని గట్టిగా ఏడవటం మొదలుపెట్టాడు. అతని దృష్టిలో ఇలాంటి నమ్మకాలకు ప్రాధాన్యం లేదు.

'ఇది భౌతికంగా అనాగరికత—దేనైనా పరీక్షించకుండా నిశ్చయించటం బుద్ధిమంతుడి లక్షణం కాదు.' అన్నాను.

'అంతే ననుకోండి! భూమి గుండ్రంగా వుంది కనక అనాగరికతలో పుట్టి, నాగరికతలో బతికి తిరిగి అక్కడికే చేరుకుంటాం... అది సరేకాని రేపు రెండు గంటలకు ఆపరేషన్ ముందుగానే వస్తుండండి.' అంటూ టెంపరేచర్ చూసి వంటింట్లోకి నడిచాడు.

రామయ్యగారికి అరవై యేళ్ళు దాటాయి. కంటి పాపలో మధ్యవున్న చుక్క క్రమంగా తెలబడి అక్కడ శూన్యం ఏర్పడుతుంది. అప్పుడు కళ్ళు కనిపించటం మానేస్తాయి. దిన్ని "కేట్రాక్స్" అంటారు. దీనికి ఆధునిక విజ్ఞానంలో చికిత్సవుంది. ఆపరేషన్ ద్వారా దృష్టిని తిరిగి రప్పించవచ్చు. రామయ్యగారు ఆపరేషన్‌కు ముందు ఓ చిన్న సంతర్పణ జరిపించాలని, సహస్రనామార్చనలు జరిపించాలని కోరుకున్నారు. కాని రవణ వినిపించుకోక అశ్రద్ధ చేశాడు. అందుచేత ఆయన కేమాత్రం శాంతిలేదు.

మర్నాడు అంతా సవ్యంగానే జరిగింది. సర్జన్ నా మిత్రుడు. అతన్ని పిలిచి అడిగాను. అతను పెదవి విరుపులో ఆశారేఖల్ని మేళవింపజేస్తూ, యాభై శాతం విజయం—డయాబెటిస్ పేషంట్లవిషయంలో ఎలాంటి ఫలితమూ చెప్పలేం—అది వారి వారి అదృష్టం మీద ఆధారపడి వుంటుంది, అన్నాడు. నరనాడులు కృంగిపోయాయి. అంటే కాస్తోకూస్తో సాయపడిన కళ్ళు అంధకారంలో యిరుక్కుపోతాయన్నమాట! ఈవిషయం తెలిస్తే రామయ్యగారు ఇదంతా దైవశాపమని కొడుకును దుమ్మెత్తి పోస్తారు. సముద్రంలో హఠాత్తుగా తుఫాను జనించినట్టు ఈ సంఘటనతో ఆ కుటుంబంలో కలహాలు జనిస్తాయి. హాలహాలంలోంచి అమృతం లభ్యమైనట్టు దీనివలన రవణ మారితే బాగానే వుండును. ఈ విషయం ఆ సాయంత్రం రవణతో ప్రస్తావించాను.

'అంటే వాళ్ళు షుగర్ టెస్ట్ సరిగ్గా చేయలేదన్నమాట. అలా అనుమానంగావుంటే బాగుపడేవరకూ యింజక్షన్లు ఇవ్వవలసింది. ఇదేకనక ఫెయిల్యూర్ అయితే దావా వేసి సర్జన్ అంతు కనుక్కుంటాను' అంటూ పళ్ళు పటపట కొరికాడు. పోనీ దేవుడికి కొంత లంచం పారేస్తే ఏంపోయింది?

రవణ ఆ రాత్రి పన్నెండుదాకా ఇంటికి రాడన్న సంగతి చెప్పటానికి వెళ్ళాను. సుందరి భూగోళాన్నంతా మోస్తున్నట్టు కనిపించింది.

'చూడండన్నయ్యగారూ!... బాబుకు మళ్ళీ జ్వరం వచ్చిందండి. నిద్రలో పిచ్చిగా పలవరింతలు. ఎవరో పీక నొక్కుస్తున్నారట! కళ్ళు తెరిచినప్పుడల్లా గుడ్లు మిటకరించి నాలుగువైపులా చూస్తున్నాడు. ఇప్పటికి వారంరోజులుగా అతని పరిస్థితి అటూఇటూ కాకుండావుంది. ఆయనకంతా వేళాకోళంగావుంది. ఏం చేయమంటారు చెప్పండి?'

'అయితే సుందరీ!... ఆ తాడుకట్టడంవలన ఏదైనా ఫలితం కనిపించిందా?'

'అయ్యో! ఆ తాడు కట్టిన అయిదుగంటలకల్లా జ్వరం తిరుగుముఖం పట్టింది. ముఖంలో నవ్వువచ్చింది'

'అయితే మరో తాడు మంత్రించి తీసుకువస్తే సరిపోతుంది.'

'ఎలా? ఆయన తెంపిపారేస్తారుకదా?'

'రవణ వున్నప్పుడు తీసిదాచేయ్—దానికిదే విరుగుడు!'

'అలా సనికేరాదు. కనీసం మూడురోజులైనా మెడలో వుండాలని అవధానిగారన్నారు. ఇవతలకు తీస్తే దాంట్లో మనకు విశ్వాసం లేదని గుజావు చేయటమన్నమాట. డాక్టరు వచ్చి చూశాడు. ఉదయం ఇంజక్షనిచ్చాడు. మూడేళ్ళ కుర్రాడి శరీరంలో సూది గుచ్చుతుంటే చూస్తూ నిలబడ్డారీయన—నిజం చెబుతాను. ఇలా అడుగడుక్కీ ఈయనతో జగడం పెట్టుకుని కాపరం చేయుటమెలా?'

సుందరి కళ్ళు నీటితో నిండిపోయాయి. ఆమెకెలాంటి సలహా యివ్వలేక పోయాను.

భార్యాభర్తల మధ్య తెగతెంపులు కావటానికి పెద్ద పెద్ద కారణాలు అవుసరంలేదు. మనస్తత్వశాస్త్ర దృష్ట్యా దీని పరిమాణమూ నిర్ణయించలేం—నాకు తెలిసిన ఓ మిత్రుడు వున్నట్టుండి కర్ణాటక సంగీతం నేర్చుకోటం మొదలుపెట్టాడు. ఇంటిదగ్గర ఒక్క గంట మాత్రమే సాధకం చేసేవాడు. వినయ విధేయతలలో మెలగిన సతీమణి ఓపికతో వుండలేక అతన్ని విడిచి వేసింది. అలాగే వీళ్ళిద్దరిమధ్యా ఏదైనా అవాంతరం వుద్భవిస్తుందేమో నని భయపడ్డాను. కాని రవణ

సుందరిని ప్రాణంకంటె ఎక్కువగా ప్రేమిస్తున్నాడని నాకు తెలుసు. ఆమెకోసం అతను చేయవలసిన త్యాగం అంటూ ఏదైనా వుంటే అది వూహాకందనిదై ఉంటుంది.

ఏవైనా చుట్టూ కారుమబ్బులు కమ్ముకుంటున్నాయి.

తరువాత వారంరోజులు సందిగ్ధావస్థలో జరిగిపోయాయి. డాక్టరు మొదట్లో 'న్యుమోనియా' అన్నాడు. తరువాత టైఫాయిడ్ అన్నాడు. కోర్టుకు పోయే దోవలో వుంది కనక హాస్పిటల్‌కు వెళ్ళి రామయ్యగారిని చూసి వస్తున్నాను. తరువాత రెండు రోజులకు రామయ్యగారిని డిశ్చార్జ్ చేశారు. కాని కంటికున్న కట్టు మరో వారం రోజులవరకూ విప్పకూడదన్నారు. రవణ తల్లి వెంకటేశ్వరస్వామి ముందు చేసిన తప్పుకు చెంపలు వాయించుకుని బాబును దక్కించుకోమని కొడుకుతో పోరుపెట్టేది. ఆమెకు రెండు మూడుసార్లు దేవుడు కలలో కనిపించి, మాట నిలుపుకోకపోతే పగతీర్చుకుంటానన్నారట!

ఆ వేళ ఓ పెద్ద కేసులో వాదించి ఓడిపోయాను కొండంత నిరాశతో ఇంటికి తిరిగి వచ్చి ఆ కేసు తాలూకు వివరాలన్నీ నెమరు వేస్తూ నా వాదనలో బలహీనత ఎక్కడ వుందని ఆలోచిస్తుంటే రవణ ఫోన్‌లో పిలిచాడు.

'తాటిపండు తలిచెట్టుతో సంబంధం వదలుకోటానికి సిద్ధంగా వుంటే కాకి వాలిందట — ఆ నింద కాస్తా పాపం, ఆ నోరులేని దానిమీద వేశారు. అలాగే నాకూ జరిగింది. కాని నేను జడుసుకోటానికి పిరికిపందను కాను. ఇదో సవాలైతే దాన్ని ఒప్పుకుంటున్నాను.'

ఈ వుపోద్ఘాతం భయాన్ని కలిగించింది

'బాబు మధ్యాహ్నం పన్నెండు గంటలకు మమ్మల్ని వదిలి వెళ్ళిపోయాడు. వెంటనే రావాలి.'

అరగంటలో చెమటలు కక్కుకుంటూ ఇంట్లో వాలాను.

ఎవరో కిలకిల నవ్వుతూ 'మావయ్యా!... మావయ్యా!' అంటున్నట్లనిపించింది. దయామయుడైన బుద్ధుడు ప్రసాదించే వరాలు ఇలాంటివేనా?... కళ్ళు చెమ్మగిలాయి.

దీపం ఆరిపోగా మిగిలిన శరీరం అక్కడ వుంది.

సుందరి నన్ను చూడగానే ఇంకా గట్టిగా గుండెలు బాదుకుని ఏడవసాగింది.

'మా బాబును చేతులారా చంపారు... నా మాట విన్నారు కారు'

అంతకంటె ఎక్కువగా తిరుగుబాటు చేసే శక్తి ఆమెకు లేదు.

'మన ప్రాప్తం అంతే — ఏం చేస్తాం? రాసి వున్నది జరక్క మానుతుందా?' అంటూ ఓదార్చటానికి యత్నించాను. రామయ్యగారు కదలిక లేని శిలలా కూర్చుని వున్నారు. ఆయన ముఖంలో ప్రతి ముడతలోనూ కొన్ని లక్షల బాధలు ములుకుల్లా గుచ్చుకుంటూ పాములా మెలితిరిగి పోతున్నాయి. చెప్పి చూశాను. శాయశక్తులా ప్రయత్నించాను. ఫలితం లేకపోయింది. కన్ను లేని బాధ ఒకవంక — ఇది రెండో వంక.

రవణమాత్రం గంభీరంగా వున్నాడు.

'డాక్టర్ లాడ్‌ని పిలవవలసింది. పొరపాటైంది. అతను సరిగా డయాగ్నైస్ చేసివుండేవాడు.'

ఆ దుఃఖం సుందరిలో ఉపశమించదు.

రెండురోజులు గడిచాక నన్ను కోర్టులో కలుసుకున్నాడు.

'సుందరి ఏమీ సుఖంపొందటం లేదు. వుండు మీద కారం జల్లినట్లుగా బాబును చంపింది నేనేనని సాధిస్తోంది మా యిద్దరి అభిప్రాయాల మధ్య ఎంతమాత్రం సామరస్యం కాని, పోలిక కాని లేదు రేపు పుట్టింటికి వెళ్ళటానికి అన్ని ఏర్పాట్లూ చేసుకుంది. ఆమెను ఆగించటానికి నేను ప్రయత్నించలేను. శత్రువులు ఎంతకాలం చెలిమిగా ఉన్నట్లు నటించగలరు?

పచ్చటి సంసారాన్ని ధ్వంసం చేసుకోటం సులువుగానే జరుగుతుంది.

రవణకున్న నాస్తిక భావాన్ని తొలగించాలన్నది నా అభిప్రాయం కాదు. సిరమయిన అభిప్రాయాన్ని మార్చటమంటే కొండలను చిటికెన వేళ్ళమీద ఆడించటము లాంటిది. రవణ దేవుణ్ని నమ్మనందుకు నా కేలాంటి బాధా లేదు. ఎందుచేతనంటే నేనూ దేవుణ్ణి చూడలేదు. కానతనిమూలంగా ఇతరులందరికీ ఎన్నో రకాల బాధలు కలుగు

తున్నాయి. ఇతరులకు హాని కలగనప్పుడు వారిని సంతోష పెట్టటానికి మన కిష్టం లేకపోయినా ఓ సిద్ధాంతాన్ని ఆచరిస్తున్నట్టు నటించటంలో తప్పులేదు. శూన్యాన్ని చూపిస్తూ అక్కడేదో విచిత్రమైన వస్తువుందని ఎవరైనా వాదిస్తే ఆ వాదాన్ని ధిక్కరించి, విమర్శించి నోరెండించుకోటం అనవసరం.

పది రోజులు గడిచాయి.

ఆరోగ్యం సరిగ్గా వుండకపోవటంవలన రవణ ఇంటికి వెళ్ళటం వీలుపడలేదు. అందుచేత అక్కడి వాతావరణం ఏ విధంగా తయారైంది నాకు తెలియదు. ఓ నాడు సాయంత్రం కిటికీ దగ్గరగా పడక్కుర్చీలో పడుకుని వీధికేసి చూస్తున్నాను. పసుప్పచ్చ టాక్సీ రోడ్డువారగా ఆగింది. చెయ్యిపట్టుకుని రామయ్యగారిని రవణ నడిపించి తీసుకు వస్తున్నాడు. నాకేం అర్థం కాలేదు. రామయ్యగారిని మంచంమీద కూర్చోబెట్టాం. నేనేమీ అడక్కుండానే రవణ మొదలు పెట్టాడు.

'నాన్నగారు నా దగర వుండటానికి కిష్టపడటం లేదు. చిన్నాన్నగారి వూరెడుతున్నారు. మిమ్మల్ని చూడాలంటే తీసుకువచ్చాను.'

'చూడు నాయనా! ... చిన్నప్పట్నుంచీ కట్టుదిటంతో, దైవభక్తిలో పెరిగాను. ఈ ముసలితనంలో నా నీతులమధ్య ఎలా వుండగలను? ఆపరేషన్ చేశాక వున్న కన్నుకూడా పోయింది.'

'మూర్తిగారూ! నేనిదివరకే చెప్పాను. తప్పంతా ఆ సర్జన్‌దే – దావా వేయటానికి ఏదైనా ఆస్కారం వుందేమో చూడండి– నేను సిద్ధంగావున్నాను.'

'నువ్వు వృథాగా శ్రమపడకు... నేనుచేసుకున్న పుణ్యం అంతే–దేవుడికి నామీద దయతప్పింది.'

'అలాగనకండి!... కాలం ఒకేరీతిగావుండదు– ఈ పరిస్థితులలో మీరుకన్న కొడుకుకి దూరంగా వెళ్ళిపోవటం మంచిదికాదు.'

రామయ్యగారు నవ్వారు.

'నేను ముందే చెప్పాను. ఇది రెండుతరాల సిద్ధాంతాల మధ్యవున్న పోరాటం. నా కిది కుదరదు. వేరుగా వుండటం మంచిది.'

రవణంటే నాకూడా అసహ్యం వేసింది. కట్టుకున్న పెళ్ళాన్ని పంపేశాడు, తండ్రిని తరిమేశాడు. అతను సాధించిన దేమిటి? తరువాత సంభాషణ ఎంతో సేపు సాగలేదు—ఇద్దరూ తిరిగి వెళ్ళిపోయారు.

నేటి విజ్ఞానం దైవాన్ని గురించి ప్రస్తావించదు. సిద్ధాంతాలను అల్లుకుంటూపోయి చివరకు అనంతంలో అస్తమిస్తుంది. నిప్పులేనిదే పొగకనిపించనట్టు దేవుడనేవాడే లేకపోతే ఈ చరిత్ర ఎలా పుట్టింది? కారణరహితంగా ఏదీ జరగదు. తరతరాలుగా వస్తున్న నమ్మకాల్ని కాలదన్ని, మనకున్న స్వల్పతార్కిక జ్ఞానంతో అనంతమైన విశ్వంలో ఓ కిరణం తాలూకు అణువునుమాత్రం చూడగలిగి నేను సర్వస్వం తెలుసుకున్నానని గుండెమీద చేయివేసుకుని చెప్పటం సులభం కావచ్చు. కాని అందుమూలంగా ఏర్పడే చిక్కులు అనంతం. అవన్నీ నిస్సహాయతతో వున్న మృగాన్ని కొండచిలువలా చుట్టేసి హతమారుస్తాయి.

* • *

నాలుగుమాసాలు గడిచాక ఓనాడు రవణఇంటికి వెళ్ళాను. బాబుపోయాక, అప్పుడప్పుడు కలుసుకుని యోగక్షేమాలు విచారించటమే కాని, ఇంటికి వెళ్ళటం ఇదే మొదటిసారి. హాల్లో ఎవరో అమ్మాయితో పకపక నవ్వుతూ కబురు చెబుతున్నవాడల్లా నన్ను చూసి కొంచెం కంగారుపడ్డాడు. ఆ అమ్మాయికూడా వినయంగా లేచి నిలబడింది. నాకేం అర్థం కాలేదు. కట్టుకున్న పెళ్ళాన్ని తన్ని పొమ్మని ఏపటి పగటి వేషాలనిపించింది. అయినా, నిజానిజాలు తెలుసుకోకుండా తొందరపడకూడదని నిశ్చయించుకున్నాను. కుర్చీలో కూర్చోబెట్టాడు. 'నామీద శీత కన్ను వేశారు. నేను మీకు చేసిన ద్రోహమేవిటి?' అనడిగాడు.

'అబ్బే! అలాంటి దేమీ లేదు. తీరుబడిలేక...' అని నేనింకా వాక్యం పూర్తి చేయకుండానే 'అవునవును...తలకుమించిన పనులు...సరే కానీయండి ఇంక పరిచయాలు చేస్తాను. ఈ లలన నా ద్వితీయ కళత్రం. పేరు సుజాత. వివాహం గప్‌చిప్‌గా జరిగినందుకు క్షమించండి. ఈయన ఆ సిక ప్రామాట్ సాంబమూర్తిగారు—ఫేమిలీ ఫ్రెండ్' అనగానే ఆ అమ్మాయి నమస్కరించింది. శరీరంతో ప్రతిరక్తపుచుక్క కోపంతో పొంగిపోయింది. ఆ అమ్మాయి వయ్యారంగా లోపలకు నడిచివెళ్ళి

పళ్లెంలో మైసూరు పాకౌలు, గ్లాసు నిండా పాలూ తీసుకొచ్చి నా ముందర వుంచింది.

'ఛీ?...నిన్ను మనిషికింద జమకట్టటం నా పొరపాటు. నిష్కారణంగా సుందరి జీవితం నాశనం చేసినందుకు బాధలేదు. సిగ్గులేదు. మరో అమ్మాయిని పెళ్ళిచేసుకున్నాడట, ఎవరెస్టు శిఖరం ఎక్కినట్టు గొప్పగా చెబుతున్నాడు...ఇదుగో రమణా! ఈనాటి నుండి నీకూ, నాకూ సంబంధం నాస్తి' అంటూ అరిచాను.

'ఎవరూ?...అన్నయ్యగారా? గది కప్పు కాస్తా పైకెగిరి పోగలదు. ఏమిటంత గట్టిగా అరుస్తున్నారు?'. అంటూ సుందరి ప్రత్యక్షమైంది.

"నాకళ్ళను నమ్మమంటారా? వద్దా?" అనడిగాను.

"తప్పదయ్యా! ఎదురుగా కనిపిస్తుంటే ఎలా కాదనగలం?...చూడు మరి. ఇప్పుడే స్నానం చేసి వచ్చినట్టుంది. జుట్టు తడిగావుంది." అన్నాయి.

"ఏమిటిదంతా?" అనడిగాను.

'మీకోపాగ్నిని రగిల్చినందుకు క్షమించండి... సుజాతిసుందరికి స్వయానా చెల్లెలు. సుందరివచ్చి రెండురోజులైంది మిమ్మల్ని రమ్మన్నది ఇందుకే...'

'ఆలుమగల కయ్యాలు అద్దంమీద ఆవగింజ' లన్నపాత సామెతను జ్ఞప్తికి తెచ్చుకున్నాను.

తరువాత రమణజరిగినదంతా వివరంగా చెప్పుకుపోయాడు. నేను ముందేచెప్పాను. అతను సుందర్ని విడిచి బతకలేడని. మామగారింటికి వెళ్లి సుందరిని వచ్చేయమని సామదానభేద దండోపాయాలు ప్రయోగించి బతిమాలి విజయం సంపాదించాడట.

'రేపే అమ్మా, నాన్నావస్తున్నారు. వారం రోజుల క్రితం చిన్నాన్నగారి వూరు వెళ్ళాను. ఇదర్నీ వొప్పించేసరికి తలప్రాణం తోకకువచ్చింది. నేను నాస్తికుడ నయితే దేవుడు నన్ను దండిస్తాడు కాని అమాయకులైన వాళ్ళెందుకు దండిస్తాడని నచ్చచెప్పాను. మరో సర్జన్ చేత ఆ రెండో కంటికి ఆపరేషను చేయించాలి.'

మనుష్యుల మనస్తత్వాలు ఎంత స్వల్పకాలంలో మారిపోయాయి!...

నాలుగైదు నెలలు గడిచాక ఓనాడు నేను వెళ్ళేసరికి రమణ ఆఫీసుకు వెళ్ళిపోయాడు. ఇల్లంతా బిక్కుబిక్కుమంటూవుంది. బాబు అటూయిటూ నవ్వుతూ గెంతుతుంటే చీకటి కోణంలో మెరపు మెరసినట్టుం షేది. సుందరి శుచిగా పూజచేస్తోంది.

'ఏమిటిది?' అనడిగాను ఆశ్చర్యపోతూ.

రమణతల్లి చెప్పుకుపోయింది.

'ఏముందినాయనా! ఆదేవుడికింకా మామీద దయ కలగలేదు. పుట్టిన ఒక్కనలుసూ అలాపోయిందా మరి—ఇంక దానికి సంతానప్రాప్తి లేదని మొన్న ఎవరో జోస్యం చెప్పారు. అప్పట్నుంచి అది బెంగ పెట్టుకుంది. వాడితో చెబితే జోస్యమంతా వట్టి బూటకమన్నాడు. చివరకు బతిమాలి దాన్ని సత్యనారాయణ వ్రతం చేసుకోనీయమన్నాను. మొగుడూ, పెళ్ళాం కలిసి ఏఅన్నవరమో వెళ్లి ఆ వ్రతం కాస్తా చేస్తే పిల్లలు వెంటనే పుడతారు? కాని మావాడు దైవనామస్మరణకూడా చేసాడూ? అందుకని ప్రతిశుక్రవారం అదొక్కతే ఇలా చేసుకుంటోంది. దేవుడికి కనికరం కలక్కుండావుంటుందా?'

'అతనెలా వప్పుకున్నాడు?... ఆశ్చర్యంగా వుందే?'

'పాపాయి కావాలని అతనికిమాత్రం వుండదాయేమిటి? అదలావుంచి ఇది దేవుడి శక్తికి పరీక్ష—గీటురాయి...చూద్దాం—అన్నాడు ఒకవేళ పాపాయి పుటినా అది దైవప్రసాదమని నమ్మడనుకో.' సుందరి ఈ మాటలన్నీ వింటూ సిగ్గుతో తల వంచేసుకుంది. ఆమె బుగ్గలు ఎర్రగా కందిపోయాయి.

ఆ వ్రత ఫలితం ఏమిటో తెలుసకోవటానికి కొంతకాలం పట్టింది.

ఓనాడు రమణ నన్ను 'ఇరానీ రెస్టారెంట్'లో పట్టుకున్నాడు.

'చిన్న పాపింటి వుందండి. మీరుకూడా రండి' అంటూ తీసికెళ్ళి రకరకాల బొమ్మలు, చీరలు, పువ్వులు కొన్నాడు. నన్ను కూడా ఇంటికి రమ్మన్నాడు.

'ఈ బొమ్మలెవరికి?' అనడిగాను.

'మా చిన్నాన్న కుటుంబం నిన్ననే దిగింది. చిన్నాన్న కొడుక్కి.' అన్నాడు. ఆయన్ని నే నింతవరకూ చూడలేదుకనక పరిచయం చేసుకుందామనుకుని అతన్ని వెంబడించాను. తీరాజేసి ఇలుచేరుకున్నాక అక్కడ కొత్త మొహాలేవీ కనపడలేదు.

'మీ చిన్నాన్న పాపాయి ఏదీ?' అనడిగాను.

'ఆ పాపాయి మా కెందుకండీ? మా యింట్లో నే పాపాయి రాబోతుంటేనూ?...మరి బొమ్మలన్నీ ఎందుకనుకున్నారు?' అని చమత్కరించాడు. ఆశ్చర్యంగా సుందరివైపు చూశాను.

సిగ్గుతో తలవంచుకుని అక్కణ్ణుంచి కదలిపోయింది.

'కంగ్రాచ్యులేషన్స్ – సత్యనారాయణమూర్తి దయ' అన్నాను.

'అంతా హంబక్' అన్నాడు.

ప్రస్తుతానికి రమణ కుటుంబంలో అందరూ నవ్వుతూ కనిపించినా అతని విపరీత సిద్ధాంతాలు ఏదో రోకనాడు తుఫానును లేవదీస్తాయని నాకు తెలుసు. అందుకని అతనిలో శాశ్వతమైన మార్పు తీసుకురావట మెలాగని ఆలోచించి ఆలోచించి ఏ నిర్ణయానికీ రాలేకపోయాను. రమణ వ్యక్తులతో పోరాటం సాగించటం మానేసి గడ్డిపెడ్ గా వున్న నమ్మకాలతో పోరాడి గెలుపొందితే బాగుండేది. రాత్రి పదకొండు గంటలవుతుంది.

మామూలుగా తొమ్మిదింటికే కళ్ళు తెలియని నిద్ర పట్టేసుంది. ఆ వాళ ఎంత ప్రయత్నించినా కళ్ళు మూతపడలేదు అంటే, దానికేదో కారణం వుందని తృప్తిపడ్డాను. దీపం ఆర్పేయటానికి మంచం మీదనుంచి లేవటం, ఎవరో తలుపుతట్టటం ఒకేసారి జరిగాయి. తలుపు కిర్రుమంటూ తెరచుకుంది. రమణ లోపల కొచ్చాడు. పున్నమినాడు దివ్యంగా వెలుగుతున్న చంద్రుడు ఒక్కసారి కాంతి హీనంగా తయారవుతే ఎలా వుంటుంది? రమణ ముఖం కూడా అలాగే వుంది. చొక్కా చెమటతో తడిసిపోయింది. పెదవులు వణుకుతున్నాయి.

'మూర్తిగారూ! తక్షణం రావాలి—సుందరికి నెప్పులు ప్రారంభమై అయిదుగంటలపైచిలుకవుతుంది. డాక్టర్ లాడ్ ప్రసవం సులభంగా జరగదని, ఆపరేషన్ చెయ్యాలని అంటున్నాడు. అదికూడా ప్రమాదంతో కూడినదంటున్నాడు. ఏంచేయను?... చెప్పండి—' అంత మనిషీ నిలువునా కంపిస్తున్నాడు.

'రమణా! ఇందులో నేనుమాత్రం చేయగలిగిందేముంది? డాక్టర్ని బతిమాలుకోటం మెరుగు—'

'అబ్బే!... అదంతా పూర్తయింది. ఇంక తన వలన అయ్యేదేమీ లేదని, అంతా దేవుడి చేతిలోనే వుందని అన్నాడు—'

'అవును... అతనన్నది సరైందే—దైవాన్ని నువ్వు ధిక్కరించలేవు. నీ యిష్టా యిష్టాలతో అతనికి సంబంధంలేదు. నన్నడిగితే సుందరిని రక్షించగలిగింది ఒక్క భగవంతుడే!'

రమణ అయిదు నిమిషాలవరకూ మాటాడలేదు. ఒక్కసారిగా ఆవేశం వచ్చినవాడిలా గోడమీదున్న శ్రీకృష్ణుడి పటానికి నమస్కరించి, లెంపలు వాయించుకుని, "కృష్ణా!... నన్ను క్షమించు, నా అభిప్రాయాలు పునాది లేనివి... నా సుందరిని రక్షించు...' అన్నాడు.

నాకు కలిగిన ఆనందంలో వూపిరి నిలిచిపోతుం దనుకున్నాను.

ఇద్దరం టాక్సీలో హాస్పిటల్ కు వచ్చాం.

డాక్టర్ లాడ్ చిరునవ్వుతో బయటకివచ్చాడు.

'కంగ్రాచ్యులేషన్స్ మిస్టర్ రమణా!... మొగపిల్లాడు.

భయపడవలసిన అవసరంలేదు...మూర్తిగారూ!

'మీతో కొంచెం మాట్లాడాలి ఇలారండి...' అంటూ నన్ను తన గదిలోకి తీసుకు పోయాడు.

'చివరకు దేవుడికి దండం పెట్టాడా లేదా?'

'ఆ...అంతా అనుకున్నట్టే జరిగింది.'

డాక్టర్ లాడ్ కన్నుగీటి పెద్దగా నవ్వాడు

గదిలోంచి బయటకొచ్చాను. రమణ ముఖం ప్రశాంతంగా వుంది.

'రమణా! నువ్వు ఏమనుకున్నా సరే! ఈ లోకంలో సుఖంగా బతకాలనివుంటే నలుగురూ అవునన్నదాన్ని కాదనకుండా, ఖండించకుండా వుండాలి. దాన్ని మనం నమ్మినా, నమ్మకపోయినా, నమ్మినట్టు నటించటంలో తప్పులేదు. ఈ నటనవలన ఇతరులకు బాధలేదు. వారి మూలాన మనకూ బాధలేదు. సత్యాన్వేషణకు బయలుదేరితే మందిలో మానవుడిగా బతకలేం. ఏ వాల్మీకిగానో—సోక్రటీస్ గానో—గలీలియో గానో—లూథర్ గానో బతకవలసి వుంటుంది. మనం బతికేది స్వల్పకాలం. ఈ మాత్రం దానికి కోరి కొరివితో నెత్తిగోక్కున్నట్టు కష్టాలను తెచ్చుకోవ మెందుకు?...'

రమణ అంగీకార సూచకంగా తల వూగించాడు.

చివరకు నాలో సందేహం కలిగింది—ఇందులో గెలిచిందెవరు? ఓడిపోయిందెవరు? ఏమో!...జయాపజయాలు దైవాధీనాలు—

సరైన సమాధానంమాత్రం రాలేదు.

రాదు కూడా—

# మన స్వీయ చరిత్రలు

## శ్రీ డి. రామలింగం

నేటి గద్య రచనారీతులలో స్వీయ చరిత్ర ఒకటి. పూర్వం మన సాహిత్యంలో స్వీయ చరిత్రలంటూ లేవు. అసలు చరిత్ర రచన విషయంలోనే మన దేశీయులకు మొదటినుంచీ అంత శ్రద్ధవున్నట్లు కన్పించదు: మన పూర్వీకులు ఎంతసేపూ పారమార్థిక విషయాలకే ప్రాధాన్యమిచ్చారు గాని లౌకికవిషయాలపై వారికి అంతగా ఆసక్తిలేదు. అందుచేతనే కాళిదాసు ఏకాలం నాటివాడు? రామాయణం వ్రాసిన మొల్ల కుమ్మరి వారి ఆడపడుచా, కమ్మరివారి ఆడపడుచా? అనే ప్రశ్నలు ఉదయించినప్పుడు సందిగ్ధంగానే సమాధానం చెప్పుకోవలసి వస్తున్నది. మన ప్రాచీన కవులు తమ కావ్యాల అవతారికలలో తమ పుట్టుపూర్వోత్తరాలను, తమ కృతిని అంకితం పొందేవారి వంశ చరిత్రను కొంత వ్రాసుకున్నారు గాని వాటివల్ల ఆ కృతికర్తల, కృతిపతుల జీవిత విశేషాలు అంతగా తెలియవు. అలాంటి విశేషాలను తెలిపే గ్రంథాలను వారు ప్రత్యేకంగా వ్రాయలేదు. అది మన సంప్రదాయం కాదనే కారణం చేతకూడా సంకోచించి వదలిపెట్టారు. అయితే ఆధునిక కాలంలో వచన రచన బాగా వ్యాప్తిలోకి వచ్చిన తరువాత అనేక సాహితీరూపాలతోపాటు స్వీయ చరిత్ర అనే కొత్తరీతికూడా ఆవిర్భవించింది. అప్పటి నుంచీ తెలుగు సాహిత్యంలో కొన్ని స్వీయచరిత్రలూ, ఆత్మకథలూ వెలువడ్డవి.

స్వీయ చరిత్ర అనగా తననుగూర్చి తాను వ్రాసుకోవడం. అలా వ్రాసుకోవడంలో కొన్ని చిక్కులున్నవి. ఇతరులనుగూర్చి వ్రాయడం సులభంకాని తన్నుగూర్చి తాను వ్రాసుకోవడమంటే అనేక చిక్కులతో కూడుకొన్న పని. ఆత్మ చరిత్ర వ్రాసుకోవడానికి వ్యక్తిగతంగా కొంత ప్రతిపత్తి వుండాలి. అంటే ఇతరులకు చెప్పదగ్గ వృత్తాంతమంటూ ఒకటి వుండాలి. సార్థకమైన జీవితం గడిపి, తమకూ కొంత చరిత్ర వున్నదన్న విశ్వాసం కలిగితేనే ఆత్మ కథలు వ్రాయడం పడుతుంది. అటువంటి చరిత్ర ఏదీ లేనప్పుడు అది ఆత్మకథ గాక ఎవరో అన్నట్లు ఆత్మఘోష అవుతుంది. అయితే చెప్పుకోదగ్గ చరిత్ర వున్నప్పటికీ ఏదో చేతనైనంత వరకు సేవ చేశానే గాని నన్నుగూర్చి నేను చెప్పుకోవడమేమిటి? అనే భావంతో ఆ పనికి పూనుకోవడానికి కొందరు వెనకాడుతారు. ఒకవేళ వ్రాయాలనే అభిలాష వున్నా ఆత్మస్తుతి, పరనింద అవుతుందేమోనని జంకుతారు. పైగా స్వీయ చరిత్ర యావత్తూ వ్రాయాలంటే మొదటినుంచీ ఎప్పటి విశేషాలను అప్పుడు డైరీలలో వ్రాసి, ఆ డైరీలను పదిలపరచుకొని వుండాలి. అలా దిన చర్యలు వ్రాసే అలవాటు మన వారిలో చాలామందికి లేదు. మరి పాశ్చాత్యులు అలాంటి దినచర్యలను ఆధారంగా పెట్టుకొనే పెద్ద పెద్ద గ్రంథాలు బాగా రచించుకోగలిగారు. అటువంటి డైరీలు లేనప్పుడు కేవలం జ్ఞాపకశక్తిమీదనే ఆధారపడవలసి వస్తుంది. అలాంటి సందర్భాలలో కొన్ని తప్పులు దొర్లడం సహజం.

ఇన్ని చిక్కులున్నప్పటికీ కూడా తెలుగులో స్వీయ చరిత్రలు వెలువడ్డవి. కొందరు పెద్దలు మిత్రుల ప్రోద్బలంచే వ్రాస్తే, మరికొందరు వారికే బుద్ధిపుట్టి వ్రాశారు. మానవుడు సంఘజీవి. తన కష్టసుఖాలను తోటివారికి చెప్పుకోవాలనే కోర్కె ప్రతివారికీ వుంటుంది. ఆ కోర్కెననుసరించే తాము చేసిన పనులను, పడ్డ కష్టాలను, తమకు కలిగిన అనుభవాలను ఇతరులకు చెప్పాలన్న అభిలాషతో స్వీయచరిత్రలు వ్రాశారు. ముందు చనిపోయినవారెలా జీవించారో వెనుక వచ్చినవారు తెలుసుకొనే అవకాశం లేకపోతే అనుభవం అనే మాటకు ప్రయోజనం వుండదు. కనుక తమ చరిత్రలను చూచి తమ సంతివారు. బంధువులు, కుటుంబ గౌరవాన్ని నిలబెట్టుకొని, స్వశక్తిమీద ఆధారపడి ఉత్కృష్టాదర్శాలతో జీవిస్తారన్న ఆశయంతో కొందరు వ్రాశారు. మరి కొందరు తమ చరిత్రలను తమ ఆనందంకొరకే వ్రాసుకున్నారు. ఇంకా కొందరు కాలం గడచినమీదట తమవలె

కష్టాలు పడువారు తమ చరిత్ర చూచి, పూర్వం తమ వంటి వ్యక్తి ఒకరు వుండేవారని తెలుసుకొని ఊరట పడతారన్న ఆశతో వ్రాశారు. ఏ ఆశయంతో, ఏ ప్రోద్బలంవల్ల వారు వ్రాస్తేనేమి వాటివల్ల మన సాహిత్యంలో స్వీయచరిత్రలు లేని కొరత తీరడమే గాక, ఆ పెద్దల జీవితచరిత్రల మూలకంగా దేశచరిత్ర కూడా తెలుసుకొనే అవకాశం కలుగుతున్నది.

ఆంధ్ర సాహిత్య లక్ష్మికి వచన రచన, ఉపన్యాసాలు, నాటకాలు, ప్రహసనాలు, జీవితచరిత్రలు, ప్రకృతి శాస్త్రాలు, నవలలు మొదలైన అనేక నూతనాలంకారాలను చేకూర్చి, ఆధునిక వాఙ్మయ రూపాలకు బాటలు వేసి, ఆంధ్రదేశ చరిత్రలో యుగకర్త అని పేరు పొందిన మహనీయుడు కందుకూరి వీరేశలింగం పంతులుగారే తెలుగు సాహిత్యంలో స్వీయచరిత్ర లేని కొరతను తీర్చారు. మన మొట్టమొదటి స్వీయచరిత్ర వారిదే. వారు తమ చరిత్రను వ్రాస్తూ "తెలుగుభాషలో స్వీయచరిత్రమును వ్రాయబూనుట కిదియే ప్రథమ ప్రయత్నము. తన్నుగూర్చి తాను వ్రాసుకొనునప్పుడు ఈశ్వర ముఖమును చూచి సత్యమునే చెప్ప బూనినను సమకాలపు వారది ఆత్మస్తుతిగానో పరనిందగానో భావించి అన్యథా తలచవచ్చును. ఒకానొకప్పుడు పరులనుగూర్చి అప్రియములగు సత్యములను బయలుపరుపవలసివచ్చినప్పుడు వారికిని, వారి మిత్రులకును, బంధువులకును మనస్తాపము కలుగవచ్చును. అయినను సాధ్యమైనంతవరకు అన్యుల మనస్సులకు నొప్పి కలిగించెడు విషయములను అనావశ్యకముగా ఇందు జొప్పింపమానితిని" అని చెబుతూ ఇటువంటి దుష్కరమైన కార్యానికి తాము పూనుకొన్నందుకుగాను దానిని సమంజసంగా నిర్వహించేందుకు శక్తిని ప్రసాదించవలసిందిగా ఈశ్వర ప్రార్థనకూడా చేశారు. వీరేశలింగంగారి స్వీయచరిత్ర ఒక విధంగా ఆంధ్రదేశ సాంఘిక చరిత్ర. అందులో ఆ మహానుభావుని జీవిత విశేషాలేగాక అప్పటి దేశ స్థితి. విద్యావిధానం, సంఘంలో అమలులోవున్న దురాచారాలు, మూఢవిశ్వాసాలు మొదలగువాటి నన్నిటినీ బహిరతం చేశారు. అట్టి సాంఘిక స్థితిని సంస్కరించవలెనన్న లక్ష్యంతో వారు ఎట్టి ప్రయత్నాలు చేశారు? ఏయే ఇబ్బందు లెదుర్కొన్నారు? ఎటువంటి అభియోగాలు వారిపై మోపబడ్డవి? వాటి నన్నిటినీ తట్టుకొని ఎలా నిలువగలిగారు? ఆనాటి తెలుగు సాహిత్యం ఏ పరిస్థితిలోవుంది? ఆంధ్రజాతి అభ్యున్నతికి ఆయన చేసిన సేవ ఏమిటి? మొదలైన అనేక విషయాలు ఈ స్వీయచరిత్రలో విశదంగా వ్రాయబడ్డవి. వీరేశలింగంపంతులుగారికీ, వారి ప్రత్యర్థులకూ జరిగిన న్యాయవిషయక వ్యవహారాలు, నోటీసులు, మిత్రులతో వారు జరిపిన ఉత్తరప్రత్యుత్తరాలు, వారి ఉపన్యాసాలు, వ్రాసిన పత్రాలు, ఆకాలంనాటి సంఘటనలపై పత్రికాభిప్రాయాలు, చాలావరకు యథాతథంగా ఉదహరించడంచేత అప్పటి ఆంధ్రదేశ విశేషాలు ఏతరంవారైనా తెలుసుకొనే వీలు కలుగుతున్నది సామాన్య కుటుంబంలో జన్మించి, పెద్ద పదవిలో లేకపోయినా, సంకల్పబలంతో ఆంధ్రజాతికే చరిత్రను కల్పించిన మహాపురుషుడు వీరేశలింగంపంతులుగారు. సంఘ సంస్కర్త, వచన రచనా పితామహుడు, బహుళ గ్రంథకర్త, దాత, మహానుభావుడూ అయిన ఆయన స్వీయచరిత్ర ఏ తరంవారికైనా ఉత్తేజకరమైన గ్రంథం.

తరువాత రాంబొట్ల జగన్నాథశాస్త్రిగారు తమ స్వీయచరిత్ర వ్రాసుకున్నారు. ఈయన విశాఖపట్నం జిల్లా వాసి. రెండు గవంచాలు చేతబట్టుకొని ఇల్లు వెడలి, జీవయాత్రకు గడిగిన సామాన్యుడీయన. అయినా చివరకు సిరి ఈయన పంచజేరక తప్పిందికాదు. ప్లీడరీ వృత్తిలో అటు న్యాయమూర్తులకూ, ఇటు న్యాయవాదులకూ గౌరవభాజనుడై ఘనతగాంచిన వ్యక్తి. ఈయన స్వీయ చరిత్రను వెలలేదు. బంధుమిత్రుల కోసమే ప్రచురింపబడింది.

కృష్ణాజిల్లా దివి తాలూకా వక్కలగడ్డ గ్రామవాసి, బలభద్ర కోటయ్య తమ ఆత్మకథ వ్రాసి ప్రకటించారు. వీరు విశ్వబ్రాహ్మణులు, బ్రాహ్మమత ప్రభావంతో స్వీయ సంఘోద్ధరణకై పాటుపడ్డ వ్యక్తి.

రాయసం వెంకటశివుడుగారు తమ స్వీయచరిత్ర వ్రాసి ప్రకటించారు. ఈయన వీరేశలింగం పంతులుగారికి శిష్యుడూ, సహచరుడూ. బాల్యంనుంచి సత్ప్రవర్తన కలిగి ఉన్నత విద్యాభ్యాసంచేసి, ఉపాధ్యాయ పదవిలోవుండి, కటకపటం నెల్లూరులోని వెంకటగిరి మహారాజా వారి కళాశాలకు ప్రధానాచార్యులై 'సత్యసంవర్ధని,' 'జనానా' మొదలగు పత్రికలను నడిపి, స్త్రీజనాభ్యుదయానికై కృషిచేసి, గుంటూరులో కొన్ని వేల రూపాయలు ఖర్చుపెట్టి ఒక

మందిరమును నిర్మించి ప్రజల కప్పగించిన ఉదార పురుషుడీయన. వీరి ఆత్మ చరిత్రకు దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు పీఠిక వ్రాస్తూ 'ఇది వెంకట శివుడిగారి సొంత కథ కాదు. ఆంధ్ర దేశంలోను, హిందూదేశంలోను, ప్రపంచమందును కలిగిన భావపరివర్తన కూడా ఇందున్నది' అన్నారు.

'సూర్యనారాయణీయము' మరొక స్వీయ చరిత్ర. ఇది 'సామాన్య సంసారి జీవిత కథ' అని రచయిత వల్లూరి సూర్యనారాయణరావుగారు చెప్పుకున్నారు. బందరులో వకీలుగా, సంఘ సంస్కర్తగా, రాజకీయ వాదిగా పేరుపడ్డవారీయన. అన్ని విషయాల లోను స్వతంత్రాలోచన గల వ్యక్తి. పరోపకారం ఆదర్శంగా పెట్టుకున్నవారు. తాము స్వార్జితంగా సంపాదించిన డెబ్బదివేల రూపాయల ఆస్తిని విద్యా సంస్థ కిచ్చివేసిన వదాన్యులు. మానవులు స్వశక్తి మీదనే ఆధారపడి జీవించడం గౌరవమనీ, కర్మయోగులుగా వుండి ప్రజాసేవ చేయవలెననీ, ఈయన తమ స్వీయచరిత్రద్వారా ప్రబోధించారు.

'కళాప్రపూర్ణ' చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారి స్వీయచరిత్రకొక ప్రత్యేకత వున్నది. ఈయన పుట్టంధుడు కాదు గాని తరువాత దృష్టిని కోల్పోయారు. పుట్టింది బహు సామాన్యకుటుంబం. కాని వ్యక్తిత్వం గొప్పది. చిలకమర్తివారు వీరేశలింగంగారి అడుగుజాడల్లో సంఘ సంస్కరణోద్యమానికీ, సాహిత్యానికీ, తెలుగు నాటక రంగానికీ అపారమైన సేవచేశారు. మొదటినుంచీ వీరికి ప్రజాహితజీవనం గడపవలెనన్న వాంఛ వుండేది. స్వయంగా ఎక్కడికీ పోలేకపోయినా, ఎవరినో ఒకరిని వెంటబెట్టుకొని శ్రమపడి ప్రతి మహాసభకూ హాజరై వక్తల ఉపన్యాసాలను శ్రద్ధగా విని, నిస్సంకోచంగా తమ అభిప్రాయాలను వ్యక్తీకరించి, ప్రజాహిత జీవనంలో ఉద్వేగం కలిగించిన ప్రతిభాశాలి. ఈయన హాజరైన మహాసభలు, ఇచ్చిన ఉపన్యాసాలు అనేకం. ఆంధ్రదేశంలో విద్యావ్యాప్తికి, సంఘ సంస్కరణకు, మతోద్ధరణకు, నిమ్నజాతుల సంక్షేమానికి, మహిళాభ్యుదయానికీ రాజకీయ సంస్కరణలకు, లలితకళల అభివృద్ధికీ ఎంతో పాటుపడడమేగాక అనేక గ్రంథాలు రచించి ఆంధ్ర విశ్వవిద్యాలయంవారి 'కళాప్రపూర్ణ' బిరుదుపొంది, తెలుగు సాహిత్యంలో చిరస్థాయిగా వుండే స్థానం సంపాదించుకొన్న ప్రజ్ఞావంతులు. మన స్వీయ చరిత్రలలో చిలకమర్తి వారి స్వీయచరిత్ర పాఠకునికి అత్యంతాసక్తిని కలుగజేసుంది. కారణం వారి వచన రచనాశైలి, వినయ పూర్వకము, నిగ్రహ యుతము అయిన వారి చెప్పే విధానమూను.

ఆంధ్రోద్యమంలో, భారతదేశ రాజకీయ రంగంలో, విప్లవోద్యమంలో పనిచేసిన ముగురు ప్రముఖుల స్వీయచరిత్రలు తెలుగు సాహిత్యానికి అలంకారప్రాయమైనవి. ఒకరు దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారు; శాసనసభ్యుడుగా, ఆంధ్ర మహాసభాధ్యక్షుడుగా, కాంగ్రెసువాదిగా గాంధీమహాత్ముని గౌరవాదరాలకు పాత్రుడైన మహావ్యక్తి ఈయన. భారత ప్రథమ స్వాతంత్ర్య సమరం గడిచిన కొన్నేండ్లకే దేశభక్తుడు పుట్టాడు. ఆయన స్వీయచరిత్ర డెబ్బయి ఏండ్ల ఆంధ్రదేశ చరిత్ర. భారతదేశ చరిత్రకూడా అందులో వున్నది. సత్య తత్పరత, ఆస్తిక్యము, వినయం, నిరంతర సేవాసక్తి, ఆత్మవితరణం—ఇవి దేశభక్తుని ఉత్తమ గుణాలు. "జీవితములో సుఖదుఃఖము లనునవి వ్యక్తికి మాత్రమే సంబంధించినవి. పరుల కుపకరించునదే సార్థక జీవనమని యెంతును. అయితే ఈ నిర్ణయము లోకులు చేయవలసినదే. సాధారణముగ ఎవ్వరి జీవితమందైనను సుఖదుఃఖములు రెండును అనుభూతములగుచుండును. దినదినమును నూతనానుభవములు కలుగుచుండుటచే, జీవితము నూతన కళలతో నొప్పారు నొక నాటకరంగమువలె నుండును. నిర్మల వర్తనము కలిగి, సత్యనిష్ఠతో ప్రవర్తించువారికి మనః క్లేశమునకు కారణములుండవు." అని కొండా వెంకటప్పయ్య పంతులుగారు తమ జీవితానుభమును గూర్చి చెప్పుకొన్నారు.

రెండవది టంగుటూరి ప్రకాశం పంతులుగారి 'నా జీవితయాత్ర' అనే ఆత్మకథ. ఆంధ్రప్రజానాయకులుగా ప్రకాశంగారు అనితరమైన స్థానం పొందారు. లక్షలు సంపాదించి, లక్షలు ఖర్చుపెట్టిన త్యాగి. గుండె నిబ్బరానికీ, ధైర్య సాహసాలకూ, త్యాగాలకూ ప్రకాశం పంతులుగారిని చెప్పుకొని మరొకరిని చెప్పాలి. ఆంధ్రుల గుణగణాలకు ఆయన ప్రతినిధి. కాంగ్రెసువాదిగా, పత్రికా సంపాదకుడుగా, మంత్రిగా అవిభక్త మద్రాసుకూ, ఆంధ్ర రాష్ట్రానికీ ముఖ్యమంత్రిగా ఆయన చేసిన సేవ అనుపమమైనది. అసలు దక్షిణ భారతంలో జాతీయోద్యమానికి గుండెనిచ్చిన ధీరోదాత్తుడు ఆయనే. ప్రకాశం పంతులుగారి స్వీయ

చరిత్ర యువజనానికి ఆదర్శప్రాయమైన వీరగాథ. పైగా ఇది సాహితీమూల్యం కూడా సంతరించుకొన్నది.

మూడవది 'నేను-నా దేశం' అను పేరుతో గదర్ వీరుడు దర్శి చెంచయ్యగారు వ్రాసుకున్న స్వీయ చరిత్ర. 'పోయిన అర్ధ శతాబ్దిలో మనదేశంలో ఆర్థిక, సాంఘిక, రాజకీయ, సాంస్కృతిక రంగాలలో వచ్చిన ప్రతి మహోద్యమం దర్శి చెంచయ్యగారి జీవిత దర్పణం మిగిల్చింది' అని పీఠికా కర్త అన్న మాట అక్షరాలా నిజం. అటు నాయకుడూ కాక ఇటు అనుచరుడూ కాక, ముక్కుకు సూటిగా పోయి తనకు తోచిన ఉద్యమంలో పాల్గొన్న చెంచయ్యగారి ఆత్మకథ ఉద్బోధకరమైంది. తమ స్వీయచరిత్రకు ప్రస్తావన వ్రాస్తూ "మనదేశ మహోద్యమానికి మకుటప్రాయమయిన గాంధీ మహాత్ముని జీవితచరిత్ర తలపుకు వచ్చి హడలిపోయ్యాను. అంతగొప్ప ఆత్మకథ తరువాత నేను వ్రాయడమేమిటని నాలో నేను నవ్వుకున్నాను. కాని ఆ మహోద్యమంలో మహాత్ముని జీవితమొక అగ్నిగుండమైతే నా సమిధకూ అందులో తావు లేక పోలేదు అన్న భావం మాత్రమే నన్ను ఈ రచనకు ప్రేరేపించింది" అని చెంచయ్యగారు చెప్పుకున్నారు. భారతదేశం పరాధీన స్థితినుంచి బయటపడవలె నన్న వాంఛ నాటి దేశభక్తులలో ఎంత బలీయంగా వుందీ ఇలాంటి విప్లవ వీరుల జీవిత చరిత్రలవల్ల తెలుస్తుంది.

డాక్టర్ కె. యన్. కేసరిగారు 'నా చిన్ననాటి ముచ్చట్లు' అంటూ తమపత్రిక గృహలక్ష్మిలోనూ, ఇతరత్రా కొన్ని వ్యాసాలు వ్రాశారు. అవే పుస్తక రూపంలో వెలువడ్డవి. డాక్టర్ కేసరిగారు రాజకీయ నాయకులు కారు. వైద్యులు. పత్రికా సంపాదకులు. సేవా పరాయణులు, వితరణ శీలురు. వైద్యరూపంగా, పత్రికా ముఖంగా, విదుషీమణులకు స్వర్ణ కంకణ బహూకరణ రూపముగా ఆయన స్త్రీలకు చేసిన సేవ సంస్మరణీయ మయినది. మద్రాసులో మైలాపూరులోని కేసరివిద్యాలయం, త్యాగరాయనగర్‌లోని కేసరి ప్రాథమిక పాఠశాల ఆయన దాతృత్వానికి నిదర్శనాలు. దాదాపు రెండులక్షల రూపాయలు ప్రజాహితైక కార్యాలకు దానంచేసిన వదాన్యుడాయన. అంతేకాదు. పండితులను గాయకులను సత్కరించిన కళోపాసకుడు కూడా. ప్రాచీన కళా సంస్కృతుల పట్ల ఆదరాభిమానాలు గల వ్యక్తి డాక్టరు కేసరి గారు.

పండితులూ, పరిశోధకులూ, యోగనిష్ఠాపకులూ అయిన వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 'ప్రజ్ఞా ప్రభాకరం' అను పేరుతో ఆత్మకథ వ్రాసుకున్నారు. మరి కొందరు పద్యరూపంలో తమ స్వీయచరిత్రలనూ స్వీయానుభవాలనూ వ్రాసుకున్నారు. తిరుపతి వేంకట కవులలో ఒకరైన శ్రీ చెళ్ళపిళ్ల వేంకటశాస్త్రిగారి 'జాతక చర్య' ఈ సందర్భంలో సంస్మరించదగింది.

సాధారణ జీవిత చరిత్రలకూ, స్వీయ చరిత్రలకూ ఒక భేదం వుంది. ఒకరు మరొకరి జీవిత చరిత్ర వ్రాసినప్పుడు అన్ని విషయాలు సమగ్రంగా లభించక పోవచ్చు. కాని ఎవరి చరిత్రను వారే వ్రాసుకొన్న పక్షంలో సంగతులన్నీ సంపూర్ణంగా ఉదహరించడానికి వీలుపడుతుంది. అయితే స్వీయచరిత్రలో కూడా ఉత్తమగుణాలనే వ్రాసుకొని దుర్గుణాలను, లోపాలను వెలడించడం జరుగక పోవచ్చు. అయితే మన స్వీయచరిత్ర కారులు వారిలోపాలను చాలవరకు నిస్సందేహంగా వెలడించారు. మహానుభావులైన వారి చరిత్రలు అవశ్యం పఠనీయమైనవి. అవి మనకు గతాన్ని తెల్పి, భవిష్యత్తును ప్రబోధించి, వెలుగు నీడలలో కూడిన ఈ జీవయాత్రలో మార్గ సూచికలుగా ఉపకరిస్తాయి.

మన గద్యరచనలో స్వీయచరిత్ర విభాగం ఇంకా విస్తృతం కావడం అవసరం. ఇంకా ఎందరో పెద్దల స్వీయచరిత్రలు వెలువడాలి. ముఖ్యంగా పద్మభూషణ మాడపాటి హనుమంతరావు పంతులుగారు, గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు, తిల్లావఝుల శివశంకరస్వామిగారు, విశ్వనాథ సత్యనారాయణగారి వంటి అనుభవజ్ఞులు సాహితీపరులు తమ స్వీయ చరిత్రలను వ్రాసి ప్రకటించాలి. ఆ స్వీయచరిత్రలు వెలువడడానికి వారి మిత్రులు ప్రోద్బలంచేసి, తద్వారా స్వీయచరిత్ర విభాగాన్ని మరింత సంపన్నం చెయ్యాలి.

# చతుర్ముఖులు

శ్రీ అంగర సూర్యారావు

## పాత్రలు:

| | |
|---|---|
| గోపాలరావు | రామచంద్రకవి |
| కీర్తిశ్రీ | కమలాకరం |
| విశ్వనాథం | గణపతి |
| వెంకటసుబ్బయ్య | పాపారాయుడు |

రంగమణి.

స్థలం : కళామంటపం

సమయం : రాత్రి 7 గంటలు.

హాలుమధ్య ఒకద్వారం కనిపిస్తోంది. తలుపులు మూసివున్నాయి. లోపలినుంచి నృత్యంచేస్తున్నట్లు మువ్వల ధ్వని, పాట - తక్కువస్థాయిలో విని పిస్తున్నాయి. హాలులో — సింహాసనం ఆకారంలోవున్న ఒక కుర్చీ, దాని ముందు అందంగా అలంకరించబడిన ఒక టేబిలు వున్నాయి. టేబిలుకు కుడి వైపున మూడు కుర్చీలు వున్నాయి. కుడివైపునుంచి కీర్తిశ్రీ వస్తాడు. వయస్సు 35 సంవత్సరాలు. ఖద్దరు లాల్చీ, పంచె, భుజంమీద ఖద్దరు శాలువా-చూడగానే 'కవి' అని తెలుస్తుంది. కీర్తిశ్రీ హాలు ఖాళీగా వుండడం చూసి నిరుత్సాహపడతాడు. ఒకక్షణం ఆలోచించి హాలుమధ్య వున్న ద్వారం దగ్గరకు వెళతాడు. చెయ్యి వెయ్యగానే ఒక్కసారిగా తలుపులు తెరుచుకుంటాయి. ఉద్వేగంగా మువ్వలధ్వని, క్షేత్రయ్య పదంలోని చివరి చరణం వినిపిస్తాయి.

"...దేవరే వరుడు కావలెనని
భావజుని పూజ లొనరించిన
ఆ వనిత పే గేమి సెల వీరా,
సిగ్గేల లేరా!"

లోపలినుంచి గణపతి వస్తాడు. వయస్సు 18 సంవత్సరాలు. లాల్చీ, పరాయి వేసుకున్నాడు. కాళ్ళకు మువ్వలు వున్నాయ్.)

గణపతి.: (కీర్తిశ్రీని పరిశీలనగా చూస్తూ) ఎవరుమీరు?

కీర్తిశ్రీ: నేను కీర్తిశ్రీని—విశ్వనాథంగారు వున్నారా?

గణ : మీ పేరు ఎక్కడో విన్నట్టుందే! (ఆలోచిసాడు.)

కీర్తి : (తేలిగా) ఆహా! దానికేముంది! వినేవుంటావు.

గణ : (ఏదో జ్ఞప్తికి వచ్చినట్లు) మీరు పత్రికలలో యేమైనా రాస్తూవుంటారా?

కీర్తి : వెనక రాసేవాణ్ణి.

గణ : అద్గదీ! అలా చెప్పండి. మిమ్మల్ని చూడగానే అమాంతంగా కవిగారని తెలిసిపోయింది. లోపలికి దయచేయండి.

కీర్తి : తీరిక లేదు. యిప్పుడు నేను రాచకార్యంమీద తిరుగుతున్నాను.

గణ : కవులకు రాచకార్యాలేమిటి చెప్మా!

కీర్తి : అబ్బాయీ! నువ్వు చిన్నవాడవు. నీకు యీ పెద్ద విషయాలు తెలియవు. ఇటీవల సాహిత్య

రంగాన్ని మేం రాజకీయరంగానికి దగ్గరగా తీసుకువెళ్ళాం.

విశ్వనాథం : (లోపలినుంచి) గణపతీ ! గణపతీ !

గణ : (ద్వారం దగ్గరకు వెళ్ళి) యిక్కడే వున్నానండి. మీకోసం యెవరో వచ్చారు.

విశ్వ : (లోపలినుంచి) యిప్పుడెవరురా దిగబడ్డారు ?

గణ : (పేరు మర్చిపోయి) కీర్తి...కీర్తి...

(విశ్వనాథం లోపలినుంచి వస్తాడు. తెల్లగా, లావుగావున్నాడు. గుండ్రని ముఖం, గిరజాలు, గ్లాస్కో లాల్చీ, పంచె—నాట్యాచార్యుడికి కావలసిన లక్షణాలన్నీ వున్నాయి. వయస్సు 30 సంవత్సరాలు.)

విశ్వ : (కీర్తిశ్రీని గుర్తించి చిరునవ్వుతో) ఓహో ! మీరా కీర్తిశ్రీగారూ ! ఎవరో అనుకున్నాను.

కీర్తి : రామచంద్రకవిగారు రాలేదా ?

విశ్వ : లేదండీ. నేనూ వారికోసమే చూస్తున్నాను.

కీర్తి : (రిస్టువాచీ చూసి) ఎంతో టైంలేదు. ఏర్పాటులు యింకా పూర్తికాలేదు. నేను వెళ్ళి రామచంద్రకవిగార్ని తీసుకువస్తాను. (కుడివైపు వెళుతూవుంటాడు.)

విశ్వ : కీర్తిశ్రీగారూ ! చిన్నమాట ! (కీర్తిశ్రీని సమీపించి) గోపాలరావుగారివంటి సుప్రసిద్ధ నాయకుడు మీ రచయితల సమావేశానికి వస్తున్నందుకు నాకు చాలా సంతోషంగావుంది.

కీర్తి : (ప్రసన్నుడై) మీవంటి సహృదయులకు సంతోషంగానె వుంటుంది. (కోపంతో) కాని...... వుంటారు చూడండి కొందరు.......

విశ్వ : పోనిద్దురూ ! వాళ్ళ మాటలను పట్టించుకుంటే మనం క్షణంసేపు మర్యాదగా బ్రతికలేం.

కీర్తి : మీరేదో చెప్పబోయి మానేశారు.

విశ్వ : అహా ! మరేంలేదు. యీ సమయంలోనే గోపాలరావుగారికి నాపేరు కొంచెం సిఫారసు చేయించాలి.

కీర్తి : తప్పకుండా చేయిద్దాం. మన రామచంద్రకవిగారు యెంత చెబితే అంత. దానికి తిరుగులేదు.

విశ్వ : మీరు నలుగురూ కలిసి నాటక సంఘంలో నాపేరు పడేలా చూడాలి.

కీర్తి : తప్పకుండా చూద్దాం. యిప్పుడే వస్తాను. (కుడివైపు వెళ్ళిపోతాడు.)

విశ్వ : (ఆలోచిస్తూ) యిది మంచి సమయం.

గణ : దేనికండి ?

విశ్వ : గోపాలరావుగారిని మంచిచేసుకునేందుకు.

గణ : ఆయన్ని మంచిచేసుకోవడం యెందుకు ?

విశ్వ : ఈనాడు కళారంగం అంతా ఆయనచేతుల్లో వుంది. ఆయన తలుచుకుంటే యేమైనా చెయ్యగలరు.

గణ : అయితే మన నర్తనశాలకు ఆహ్వానించండి. నేను నాలుగు జావళీలను అభినయించి చూపిస్తాను.

విశ్వ : నువ్వు అభినయిస్తే లాభంలేదు. — సర్వాంగ శోభితయైన, సింహమధ్యము అయిన లలనామణి కావాలి.

గణ : అటువంటి నర్తకి యిప్పుడు యెక్కడ దొరుకుతుందండి ?

విశ్వ : అదే ఆలోచిస్తున్నాను. మంచి చిక్కువచ్చి పడింది. గోపాలరావుగారిని ఆహ్వానిస్తాం. బాగానే వుంది. కనీసం ఒక శిష్యురాలిద్వారా ఆయనకు పూలమాల సమర్పించాలి.

గణ : (గుండెలమీద చెయ్యి వేసుకొని) నేను స్వయంగా సమర్పిసానండి.

విశ్వ : (కోపంతో) ఊరుకోవోయ్. అందుకు నువ్వు పనికిరావు.

గణ : (నిరుత్సాహపడి) అదేమిటండీ? నాకేంలోటు?

విశ్వ : (విసుగ్గా) నీకేం లోటులేదురా నాయనా!— కానీ ఆడవాళ్లద్వారా సమర్పింప చెయ్యడం ఒక ఫాషన్.

గణ : యింత ఆకస్మికంగా శిష్యురాలు యెలా దొరుకుతుందండి?

విశ్వ : యిదివరకు కోమల, కల్పవల్లి వుండేవారు. వాళ్ళు వుండే రోజుల్లో...

గణ : (మధ్యలో అందుకొని) వాళ్ళు యిప్పుడు గోపాలయ్యగారిదగ్గర నేర్చుకుంటున్నారండి.

విశ్వ : ఆ గోపాలయ్య మన ప్రాణానికి యముడులా తయారయ్యాడు.

గణ : ఆయనదగ్గర చాలామంది నేర్చుకుంటున్నారండి.

విశ్వ : యీ రోజుల్లో డాబూ, దర్పం కావాలి. విద్య చూసే వాళ్ళు లేరు. అందుకే గోపాలయ్యలాంటి వాళ్ళు చెలామణీ అవుతున్నారు. గోపాలయ్యని మించిపోవాలంటే నాకు ఒకటే ఉపాయం తోస్తోంది.

గణ : యేమిటండీ అది?

విశ్వ : నాటక సంఘంలో స్థానం సంపాదించడం.

గణ : దానివల్ల లాభం యేమిటండీ?

విశ్వ : అంతా లాభమే. ఎక్కడకు వెళ్ళినా రాజ వీధిలో వెళ్ళొచ్చు. మనమీద "సుప్రసిద్ధ నాట్యాచార్యుడు" అనే ముద్ర అమాంతంగా పడిపోతుంది. యీ రోజుల్లో మనకు వచ్చిన విద్యకంటే ముద్రపడడం అత్యంతముఖ్యం. అర్థమయ్యిందికదూ? ఒకేఒక్కసారి ముద్ర పడిందనుకో—యిహ దానికి ఛస్తే తిరుగుండదు.

(చివరిమాట అనే సమయంలో కుడివైపునుంచి వెంకటసుబ్బయ్య వస్తాడు. సిల్కు చొక్కా, గ్లాస్కో పంచె, వేళ్ళకు ఉంగరాలు—ధనవంతుడని తెలుస్తుంది. చేతిలో జిప్ బాగ్ వుంది.)

వెంకటసుబ్బయ్య : (వస్తూనే) యేమిటండోయ్ విశ్వనాథంగారూ తిరుగు లేదంటున్నారు?

విశ్వ : ఓహో! వెంకటసుబ్బయ్యగారా! యేమిటి—యెప్పుడూ లేనిది యిలా దయచేశారు?

వెంక : యిక్కడ రచయితల సమావేశం వుందటకదూ! కాస్సేపు కూర్చొనిపోదామనివచ్చాను. యింకా యెవరూ రాలేదా?

గణ : (ఆశ్చర్యంగా చూస్తూ) మీరు సిల్కుస్టోర్సు ప్రొప్రయిటర్ గారు కదండీ?

వెంక : (గణపతి కేసిచూసి) అవును. (విశ్వనాథంతో) యీ కుర్రాడెవరండీ?

విశ్వ : వీడు నా శిష్యుడు గణపతి. యీ వూళ్ళో యే నాట్యాచార్యుడైనాసరే నా శిష్యుడితో సమాన స్థాయిలో నాట్యం చెయ్యమనండి చూద్దాం.

వెంక : మంచి శిష్యుణ్ణే సంపాదించారు.

విశ్వ : సంపాదించడం కాదండీ—తయారుచేశాను.

గణ : (ఆశ్చర్యంతో) సిల్కుస్టోర్సు ప్రొప్రయిటర్ గారికి రచయితల సమావేశానికీ సంబంధం యేమిటా అని నా సంశయం!

విశ్వ : (గణపతి కేసి కోపంగా చూస్తూ) ఉష్! వూరుకో! (వెంకటసుబ్బయ్యతో) చూడండి వెంకటసుబ్బయ్యగారూ! మీ వంటి కుబేర పుత్రుల సహకారంలేనిదే యే సంస్థా బ్రతకలేదు.

వెంక : అవి వెనకటి రోజులు. యిప్పుడు మమ్మల్ని కత్తిరిలో పెట్టి నొక్కేశారుకదండీ. కూర్చుంటే పన్ను! నుంచుంటే పన్ను! సినిమా చూస్తే పన్ను! కారెక్కితే పన్ను! చివరకు కాలం చేసినా పన్ను వేస్తున్నారు. దానధర్మాలమీద కూడా పన్నేసేశారుకదా!

విశ్వ : మీరు చెప్పింది నిజమే అనుకోండి. మీలాంటి వారు మమ్మల్ని కొంచెం ఆదుకోవాలి.

వెంక : అయిదు రూపాయలు దాటి చందా యిస్తే మా ఆడాళ్లు ఒప్పుకోరు. ఆ అయిదురూపాయలకైనా చచ్చిచెడి ఒప్పించాను.

విశ్వ : మీ దయ!

వెంక: మీ శిష్యుణ్ణి—ఓ రెండు నిముషాలు—విడిచి పెట్టగలరా?

విశ్వ: అలాగే తీసుకు వెళ్లండి. నాకూ తొందరపనులు వున్నాయి. నా సభ్యత్వం సంగతి నిర్ణయించవలసిన రోజు యిది. (మధ్యద్వారంలోనుంచి వెళ్లిపోతాడు.)

వెంక: (గణపతిని ఒక ప్రక్కకు తీసుకువెళ్ళి) అబ్బాయ్ నీకు హేండ్ కెమెరాతో ఫోటోలు తియ్యడం వచ్చునా?

గణ : (సంతోషంతో) ఓ! అద్భుతంగా తీస్తాను. నేను స్నాప్ షాట్సు తియ్యడంలో ఎక్స్పర్టును.

వెంక: యిదివరకు యెప్పుడైనా తీశావా?

గణ : లక్షసార్లు తీశాను—ఒకసారి సుందరవేణి గార్డెన్ ప్రక్కనుంచి వస్తోంది. అప్పుడు నేను ప్రిన్సిపాల్ గారి రూం దగ్గర వున్నాను. చూశాను. వెంటనే స్తంభం వెనక్కి వెళ్లాను. జేబులోంచి బేబీ కెమెరా తీసి ఒకేఒక స్నాప్ షాట్ ...

వెంక: (నవ్వుతూ) యిహనేం! నీకు బాగా తెలును.

గణ : (తన ప్రసంగాన్ని కొనసాగిస్తూ) కెమెరా క్లిక్ మంది. వెంటనే చెవిచుర్రుమంది. వెనక్కి తిరిగి చూశాను. మా ప్రిన్సిపాల్ గారు రుద్రావతారంలో కనిపించారు. కెమెరా జప్తు చేసేశారు.

వెంక: అరరే! దొరికి పోయావటయ్యా!

గణ : నేను మూడు రోజులు అహోరాత్రాలూ విచారించాను.

వెంక: కెమేరా పోయినందుకా?

గణ : కాదు. సుందరవేణి ఫోటో పోయినందుకు.

వెంక: సరే! అదంతా యిప్పుడెందుకు? నాకు నీతో చిన్న పనివుంది.

గణ : నన్ను పూర్తిగా చెప్పెయ్యనివ్వండి. ఆ తరవాత నేను కళాశాల వదిలిపెట్టి వర్తనశాలలో అడుగుపెట్టాను. యిప్పటికీ నా కెమెరా కాలేజీ మ్యూజియంలో వుంది. మీరు యెప్పుడైనా మా కాలేజీకి వెళ్లినప్పుడు చూడొచ్చు.

వెంక నువ్వు—అవసరానికి తగిన మనిషివి దొరికినందుకు నేను చాలా సంతోషిస్తున్నాను.

గణ : యిప్పుడు చెప్పండి నన్నేం చెయ్యమంటారో?

వెంక: (సంచిలోంచి కెమెరా బయటకు తీసి) యీ కెమెరా జాగ్రత్తగా పట్టుకో. మన నాయకుడు గోపాలరావుగార్ని ఎరుగుదువా?

గణ : తెలియదండి.

వెంక: (ఆశ్చర్యంతో) అరే! గోపాలరావుగారినే ఎరగవా?

గణ : పేరు విన్నానండి. మంచి పోజులో యిద్దరు సినిమా తారలమధ్య కూర్చొని తీయించుకున్న ఫోటోలో చూశానండి. మనిషిని మాత్రం చూళ్ళేదు.

వెంక : యిప్పుడు వస్తారు చూద్దూగాని. నువ్వేం చెయ్యాలో తెలిసిందా?

గణ : అదే తెలియడం లేదు.

వెంక : గోపాలరావుగారు రాగానే అందరితో కలిపి ఒక ఫోటో తియ్యి. ఆ తరవాత నేను యేదో నెపంమీద ఆయన ప్రక్కకు వెళతాను. వెంటనే మేం యిద్దరం కలిసివున్నట్టు—అతి జాగ్రత్తగా ఫోటో తియ్యాలి. అదే ముఖ్యం.

గణ : (తేలిగ్గా) ఓ! అదెంతపని!

వెంక : మేం యిద్దరం కలిపి మాట్లాడ్డం తటస్థించినప్పుడు ఒక ఫోటో తియ్యి. యిద్దరం నవ్వుతూ వుంటే మరో ఫోటో తియ్యి. నువ్వు తీసిన ఫోటోలన్నిటిలో మేం యిద్దరం తప్పకుండా వుండి తీరాలి.

గణ : అదంతా నాకు విడిచిపెట్టండి. యే పోజ్‌లో యే రకంగా, యే యాంగిల్ లోంచి తియ్యాలో అదంతా నేను చూసుకుంటాను. అలా చూస్తూ వుండండి ఫోటోల వర్షం కురిపించేస్తాను.

వెంక : యేమయ్యోయ్! ఫిల్మంతా తగలేశావుగనక! మూణ్ణాలుగు ఫోటోలకంటె యెక్కువ తియ్యకు.

గణ : అదికూడా నాకు విడిచిపెట్టండి. కెమేరా నా చేతిలో పడితే యికమీద విహారంచేసానంటే నమ్మండి (ఒక్కసారి భయంతో) ఫోటోలు తీసే యెవరూ యేమనరు కదా?

వెంక : యెవ్వరూ యేమనరు. పైగా సంతోషిస్తారు. (కెమేరా గణపతికి యిస్తూ) యిదిగో! తీసుకో!

గణ : (కెమేరా భుజానికి తగిలించుకొని) మీకు శాంపిల్ గా ఒక ఫోటో తీసి చూపమంటారా?

వెంక : (వారిస్తూ) వద్దొద్దు. వృధాగా ఫిల్మ్ పాడు చెయ్యకు—కెమేరా జాగ్రత్తగా వాడాలి. మంది కాదు. యెరువు తెచ్చాను తెలిసిందా?

గణ : యెరువు వస్తువును నే నెప్పుడూ సొంత వస్తువులాగే చూసుకుంటాను. మీకా భయం అక్కరేదు.

వెంక : మరేం చెప్పావో నీదే భారం. నీకు కన్సెషన్ రేటుకు సిల్కు కోట్ యిస్తానే!

(వెంకటసుబ్బయ్య ఎడమవైపు వెళ్ళి పోతాడు. గణపతి కెమేరాను పరీక్ష చేసి చూస్తూవుంటాడు. కుడివైపునుంచి పాపారాయుడు వస్తాడు. లావుగా. పొడవుగా వున్నాడు, సిల్కు పంచె, కోటు, జరీకండువా, బొద్దుమీసం—వయస్సు 50 సంవత్సరాలు.)

పాపారాయుడు : (గణపతిని సమీపించి) యిలాగ యెవళ్ళైనా వచ్చారా అబ్బాయీ?

గణ : ఓ! బోల్డుమంది వచ్చారు.

పాపా: రామచంద్ర కవిగారున్నారా?

గణ: (పాపారాయుణ్ణి ఆపాదమస్తకం చూసి) మీరు కూడా రచయితల సమావేశానికి వచ్చారా?

పాపా: ఆఁ! అందుకే వొచ్చాను.

గణ: మీ పేరు?

పాపా: పాపారాయుడు గారు.

గణ: మీరు పత్రికలలో ఏమైనా రాస్తూవుంటారా?

పాపా: పత్రికల్లో రాయడంలేదు — పాడూ లేదు. (విసుగ్గా) పాతమార్కెట్టులో మా హోల్ సేల్ బియ్యంషాపు లేదటయ్యా?

గణ: మీరు బియ్యం వర్తకులన్నమాట! అలా చెప్పండి.

విశ్వ: (లోపలనుంచి) గణపతీ! గణపతీ!

గణ: (బిగ్గరగా) పాపారాయుడు గారితో మాట్లాడుతున్నానండి.

విశ్వ: (ప్రవేశించి) ఓహో! పాపారాయుడు గారా! రండి. రండి. ఇదే మా నర్తనశాల!

పాపా: దాని మాటకేం గాని యిస్వనాథం గారూ! మీ పాతబకాయి అలాగే వుండిపోయింది. ఈ నెల్లో యేమైనా జమకడతారా?

విశ్వ: తప్పకుండా కడతాను. రండి. ఒకసారి లోపలికి దయచేయండి.

పాపా: యెళ్లిపోయేటప్పుడు వస్తాలెండి. (ఎడమవైపు వెళ్లుతూవుంటాడు.)

గణ పాపారాయుడు గారూ! మా సంగీతనృత్య పాఠశాలకు మీరు చందా యిచ్చారా?

పాపా: (కోపంతో) యేమి చందా అయ్యా! మీ చందాలు కొవుకొని మా తాడు తెంపేస్తున్నారు. (ఎడమవైపు వెళ్లిపోతాడు)

గణ: రచయితల సమావేశానికి వర్తకులూ, డాక్టర్లూ, ప్లీడర్లూ, అధికారులూ—అందరూ వస్తున్నారు కాని రచయితలు కనిపించరేమండీ?

విశ్వ: నిజం చెప్పాలంటే రచయితలమీద గౌరవం యెవరికీ లేదు. కానీ వున్నట్టు నటిస్తారు. అదొక ఫాషన్. అది కాకపోయినా కేవలం రచయితలే సమావేశంలో పాల్గొంటే—ఆ సమావేశానికి ఛస్తే కళరాదు. గొప్ప గొప్ప ఉద్యోగస్తులూ, పెద్ద పెద్ద వర్తకులూ హాజరై మొదటి వరసలో కూర్చుంటే చాలు. ఆ సమావేశం కలకలలాడుతుంది.

గణ: (వింతగా) అలాగటండీ!—అయితే ఇవేళ నా కెమేరాను అన్ని కోణాలలోకీ పరుగులెత్తిస్తాను.

విశ్వ: (కెమెరాకేసి చూస్తూ) యిది ఎక్కడినుంచి తెచ్చావ్?

గణ: మనది కాదు లెండి. వెంకటసుబ్బయ్యగారిది.

రంగమ్మ: (నేపథ్యంలోంచి) యిశ్వనాథంగారున్నారా?

విశ్వ: (కుడివైపు చూసి ఉలికిపడి) వచ్చాంగా భగవంతుడా! యీ ఆడవాళ్ళు యే సమయానికి రాకూడదో సరిగా ఆసమయానికే వస్తారు—ఒరేయ్ గణపతీ నేను లేనని చెప్పి—వస్తున్న మనిషిని వెంటనే పంపించెయ్యి.

(తొందరగా లోనికి వెళ్ళిపోతాడు. కుడివైపు నుంచి రంగమ్మ వస్తుంది. జుట్టు చిందరవందరగా ముఖంమీద పడుతోంది. ఎరుపు జాకెట్టు, ముతకచీర కట్టుకొంది. ముక్కుకు కమ్మివుంది. ఆమెలోని సహజ సౌందర్యాన్ని ఆమె వేషం మరుగుపరుస్తోంది. చూడగానే సంస్కారంలేని మనిషని తెలుస్తుంది. వయస్సు 20-25 సంవత్సరాల మధ్య యెంతైనా వుండవచ్చు.)

రంగ: (వస్తూనే బిగ్గరగా) యేరీ? యిశ్వనాదంగారేరి?

గణ: ఎందుకు?

రంగ: అదంతా నీకెందుకంట

గణ: నువ్వు—కొంపతీసి—రచయితల సమావేశానికి రాలేదు కదా?

రంగ: (కోపంతో) పాలించవయ్యా, పాలించు; యీయెకసక్కేలు, యేళాకోళాలు నాదగ్గిర పంజెయ్యవ్—యిశ్వనాదం గారెక్కడున్నారో సెప్పు.

గణ: అదేమో నాకేం తెలుసు?

రంగ: యిక్కడ్లేరా?

గణ: లేరు.

రంగ: యెందుకు లేరో నేను సూస్తాను (గుడ్లురిమి చూసి) యీగదిలోపల యెవళ్లున్నారు?

గణ: అదంతా నీకనవసరం.

రంగ : (పైకీ క్రిందికి చూసి) అబ్బో కుర్రోడు కబురాడ తన్నాడు, కబుర్లు—తప్పాకో నేను గదిలో కెళ్ళి నూసొస్తాను. (చరచరా గదిదగ్గరకు వెళుతుంది)

గణ : (అమాంతంగా గదిద్వారానికి అడ్డువచ్చి) లోప లికి వెళ్ళడానికి వీలేదు.

రంగ : యెందుకు యీ లేదో నేను చూస్తాను. (పైట చెంగు మొలచుట్టూ తిప్పి మొలలో దోపు తుంది.)

గణ : (కెమెరాచేత్తో పట్టకొని) ఆ పోజ్ లో ఒక ఫోటో తీసాను. కదలకుండా నిలబకు.

రంగ : ఓహో! కుర్రోడో!—ఫొటోవ్ తీస్తాడంట! ఫొటోవ్, సెవ్వు మెలెయ్యగల్ను (గణపతిని రెక్క పటకొని పక్కకు లాగేసి తొందరగా గదిలోకి వెళ్ళి పోతుంది)

గణ : (బిగ్గరగా) గురువుగారూ! వ్యవహారం నా చెయ్యిదాటి పోయింది.

(వెంటనే రంగమ్మ విశ్వనాథాన్ని చెయ్యి పట్టు కొని గదిలోంచి లాక్కువస్తుంది.)

రంగ : (గణపతికేసిచూస్తూ) ఏం కుర్రోడా? నా కళ్లు మూద్దామనుకున్నావా? వుప్పుడు సెప్పు యికెద నాదంగా రెక్కడున్నారో?

గణ : నువ్వు మా గురువుగార్ని విడిచిపెడతావా లేదా?

రంగ : (బిగ్గరగా) యిడిసిపెట్టను గాక యిడిసిపెట్టను. రెక్క పట్టుకుని యీడుసు కెళతాను. మద్దిని నువ్వెవరవూ అంట!

గణ : (కోపంతో) యీడ్చుకు వెళ్ళడానికి నువ్వెవ రవూ అని నేనంటాను!

రంగ : ఈయనకీ నీకూ సంబందం యేంటో సెప్పు?

గణ : ముందు నువ్వు చెప్పు.

రంగ : నాతో యెందు కబద్దమాడేవో - ముందు నాకు జవాబు సెప్పుకో!

విశ్వ : (యేంతోచక యిద్దరికేసీ చూస్తూ వుంటాడు. మన్నులో అందుకొని) యేమిటి శ్రీరంగం......

గణ : (కోపంతో) మా గురువుగార్ని నిలదియ్యడానికి నీకు గల హక్కేమిటో ముందు చెప్పు!

రంగ : మా యిద్దరిమద్దికీ రాడానికి నువ్వెవరవ్?

గణ : యీ కళామండపంలోకి రావడానికి నీకు వున్న హక్కేమిటి?

విశ్వ : (గణపతిని బతిమాలుతూ) వూరుకో రాబాబూ!

రంగ : (విశ్వనాథాన్ని చూపిస్తూ) యీయన్ని దాసి పెట్టడానికి నీ అక్కేంటి?

విశ్వ : శ్రీరంగం! నా మాట విను. గోలచెయ్యకు. యిక్కడికి పెద్ద మనుషులు వస్తారు.

రంగ : (కోపంతో) రానియ్. ఆ పెద్ద మణుషులు ముందే పెడతాను. — నన్నిలా అన్నాయం సెయ్యడానికి నేన్నీ కేంసేశాను?

విశ్వ : నే నేం అన్యాయం చేశాను?

రంగ : అన్నెయంకాదూ! (యేడుస్తూ) ఊఁ! ఊఁ! నన్నిలా ఉసుగుపెడితే నీకేమొస్తాది ... నేను సిన్నప్పట్నుంచీ...

విశ్వ : (మన్నులో అందుకొని) ఉష్! వూరుకో శ్రీరంగం! అదంతా యిప్పుడెందుకు?

గణ : (సంశయంతో) గురువుగారూ! ఈవిడ ఎవరండీ?

విశ్వ : (చిరాగ్గా) నా శిష్యురాలు లేవోయ్! వూరుకో!

గణ : (మరింత ఆశ్చర్యంతో) మరి అపస్వరాలు పలుకు తోందేం?

విశ్వ : (విసుగ్గా) అబ్బా! అంతలోతులకు పోకురా!

రంగ : రెండు రోజుల్నించి యెందుకొచ్చ బట్టంలేదు? నిన్నే దేవుళ్ళా నమ్ముకున్నానా?

విశ్వ : (బతిమాలుతూ) శ్రీరంగం! నామాటవిని ఇప్ప టికి వెళ్ళిపో. నేను ఒకగంటలో వస్తాను.

రంగ : నేనొచ్చినా ఒప్పుకోను.

గణ : చచ్చిపోయిన తరవాత యిటువంటివాళ్ళే కామినీ భూతాలౌతారట!

రంగ : (అమాంతంగా గణపతి చొక్కా పట్టుకుని) యేంటి కుర్రోడా అంటున్నావ్?

గణ : (ముందుకుచూస్తూ) హా! హతోస్మి! (కుడివైపు చూపిస్తూ) రామచంద్రకవిగారూ యింకా చాలామంది వస్తున్నారు.

విశ్వ : (తొందరగా) రంగమ్మా! నువు గదిలోకివెళ్ళిపో. మేం పిలిచేవరకూ యివతలకు రాకు సుమా!

రంగ : నేనెందుకెళ్ళాలి?

గణ : అబ్బబ్బ! నీతో ఆర్గ్యూ చెయ్యడానికి టైం లేదమ్మా మహాతల్లీ! లోపలికి వెళ్ళిపో!

విశ్వ : పదు! పదు! ఆలస్యంచేస్తే కొంపమునుగుతుంది. (విశ్వనాథం గణపతి కలిసి ఆమెను లోపలికిపంపి తలుపులు దగ్గరకు వేస్తారు. యిద్దరూ ఒకరికేసి ఒకరు విషాదంగా చూసుకొని—యేమీ యెరుగనట్లు కుడివైపు చూస్తూవుంటారు. రామచంద్ర కవి, కీర్తిశ్రీ, కమలాకరం మాట్లాడుకుంటూ కుడివైపునుంచి వస్తారు. రామచంద్రకవి సిల్కులాల్చీ, గ్లాస్కోపంచె కట్టుకున్నాడు. భుజం మీద కాశ్మీరుశాలువా వుంది. ముఖం ప్రశాంతంగా వుంది. చిరునవ్వు నవ్వుతూ మాట్లాడ్డం అలవాటు. వయస్సు 60 సంవత్సరాలు—కమలాకరం సన్నంగా, పొడవుగా వున్నాడు. కళ్ళు లోతుకుపోయి వున్నాయి. నలిగిపోయిన షరాయి, పొట్టిచేతుల చొక్కా—జుత్తు చిందరవందరగా వుంది. వయస్సు 30 సంవత్సరాలు.)

రామచంద్రకవి : (కమలాకరంతో) మీరు చెప్పింది నిజమే! అతడు పండితుడే కావచ్చు.—ఎవరు యే మంచిపని చేసినా విమర్శించే స్వభావం అతనిది.

కమలాకరం : వారిని ఆహ్వానించినంతమాత్రాన నష్టమేముందండి?

కీర్తిశ్రీ : అంతా నష్టమే! అడుగడుగుకు అడ్డుతగులుతూవుంటే మీరేం చెయ్యగలరు?

రామ : కమలాకరంగారూ! వారిసంగతిమాకుపూర్తిగా తెలుసు. వారితో కలిసి యిరవై సంవత్సరాలు పనిచేశాం.

కీర్తి : ఆయన కొందరు అనామధేయుల్ని చేరదీసి ఒక ముఠా కడుతూవుంటాడు.

కమ : వారిలో చాలా మంది రచయితలు వున్నారన్న విషయం మనం ఒప్పుకోవాలి.

కీర్తి : అవును. ఉన్నమాట వాస్తవమే. కాని వారినందరినీ యిప్పుడు ఆహ్వానిస్తే యీ సమావేశం రసాభాసమవుతుంది,

కమ : (ఆశ్చర్యంతో) రచయితల నందర్నీ విడిచిపెట్టి యీ సమావేశానికి యెవర్ని ఆహ్వానించినట్లు?

కీర్తి : కమలాకరంగారూ! ఆ విషయాలన్నీ మనకెందుకు? పెద్దవారు—రామచంద్రకవిగారి నిర్ణయానికి విడిచి పెట్టడం శ్రేయస్కరం.

రామ : అటువంటి గొప్పవాళ్ళను, నాయకులను ఆహ్వానించినప్పుడు సభ ప్రశాంతంగా వుండాలి. గందరగోళం జరగకూడదు.

కమ : రామచంద్ర కవిగారూ! మీరు అన్యథా భావించకపోతే నా అభిప్రాయం చెబుతాను.

రామ : చెప్పండి.

కీర్తి : దానికేం చెప్పండి. మనలో మనం అన్ని విషయాలూ కూలంకషంగా చర్చించుకోవడం మంచిది.

కమ : సాహిత్య సభలకు రాజకీయనాయకులను ఆహ్వానించడం మంచిది కాదని నా నమ్మకం.

కీర్తి : మీ ఉద్దేశం?

కమ : సాహిత్య రంగంలో ప్రవేశంలేని వారు యేం మాట్లాడతారు? వారి స్వీయాభిప్రాయాలు వినడానికి చాలా సహనం ఓర్పు కావాలి.

రామ : గోపాలరావుగారు అందరు నాయకులవంటివారు కారు. ఆయన కొన్ని పుస్తకాలు రాశారు. సంగీతం, నృత్యం మొదలైన కళలతో కూడా ఆయనకు అపారమైన పరిచయం వుంది.

కమ : అయితే సాహిత్యాన్ని రాజకీయ ప్రయోజనాల కోసం వుపయోగించుకోరంటారా?

రామ : మేం అందరం వుండగా అటువంటిది జరగనివ్వం.

విశ్వ : (రామచంద్ర కవిని సమీపించి) నమస్కారం.

రామ : (నమస్కారం అందుకొని) ఏమిటి విశ్వనాథం గారూ మనవాళ్ళు యెవరైనా వచ్చారా?

గణ : (కలగ జేసుకొని) చాలా మంది వచ్చారండి. పెద్దపెద్ద వర్తకులు, అధికారులూ, చాలామంది గొప్ప వాళ్ళంతా (ఎడమవైపు చూపిస్తూ) ఆ వరస కుర్చీలలో కూర్చున్నారు. వాళ్ల వెనుక నిలబడిన వాళ్ళంతా డవాలీ బంట్రోతులూ, కారు డ్రైవర్లూను.

రామ : (కీర్తిశ్రీతో) టీ ఎక్కడ యేర్పాటు చేద్దాం.

కీర్తి : (ఎడమవైపు చూపిస్తూ) ఆ హాలు బాగానే వుంది.

రామ : (విశ్వనాథంతో) మీ వర్తకశాలలో యేర్పాటు చేస్తే?

విశ్వ: (యేం చెప్పాలో తోచక) యిక్కడ అంత...

గణ : (వెంటనే అందుకొని) అంత బాగా వుండదండి.

రామ: ఒకసారి లోనికి వెళ్ళి చూద్దాం. (గదికేసి వెళ్లిబోతాడు)

విశ్వ: (భయంతో) వద్దండి. వద్దండి.

కీర్తి: (అనుమానంతో) యేం?

గణ: (ముందుకు వచ్చి) అన్ని సామాను చిందర వందరగా అడ్డంగా వున్నాయండి. ఇంకా యేమీ సర్దలేదు.

కీర్తి: అటువైపు హాలు బాగానే వుంది. అక్కడ పార్టీ యేర్పాటు చేద్దాం. తరవాత సమావేశం యిక్కడ జరుపుకోవచ్చు.

(కీర్తిశ్రీ ముందు—వెనుక రామచంద్రకవి, కమలాకరం ఎడమవైపు వెళుతూ వుంటారు)

విశ్వ: రామచంద్రకవిగారూ!

(రామచంద్రకవి ఆగి వెనక్కి తిరిగి చూస్తాడు. కీర్తిశ్రీ, కమలాకరం నిష్క్రమిస్తారు)

రామ: ఏమిటో త్వరగా చెప్పండి.

విశ్వ: నా మాట మరచిపోయారా?

రామ: దేన్నిగురించి?

విశ్వ: నాటకసంఘంలో నా సభ్యత్వంగురించి.

రామ: అహా! ఆవిషయం నేనుమరిచిపోలేదు. జాబితా తయారుచేసేటప్పుడు నేను దగ్గరే వుంటాను.

విశ్వ: మీ మేలు మరచిపోను. నాటకసంఘంలో నేను మీ సిద్ధాంతాలకు అనుకూలంగా నడుచుకుంటాను.

రామ: తరవాత స్థిమితంగా మాట్లాడదాం. (వెళ్లిపోతూ వుంటాడు)

విశ్వ: మరో చిన్న మనవి.

రామ: నాకు టైం లేదు. త్వరగా చెప్పండి.

(రంగమ్మ ఆకస్మికంగా తలుపులు తెరిచి ద్వారం దగ్గర నిలబడుతుంది)

రంగ: (చిరాగ్గా) అబ్బబ్బా! యేంటీ సొద...

(ఆమెను చూడగానే విశ్వనాథం, గణపతి కంగారుపడతారు. గణపతి ఆమెను లోపలకు నెట్టి తలుపు దగ్గరకు వేస్తాడు)

రామ: ఆవిడ యెవరు?

గణ: ఆవిడ మా గురువుగారి...

విశ్వ: (అమాంతంగా మనస్సులో అనుకొని) శిష్యురాలు లెండి.

రామ: అలా వుందేం?

గణ: జానపద నృత్యంకోసం వేషం వేయించామండి. (గణపతి తలుపు గట్టిగా పట్టుకొని నిలబడతాడు)

విశ్వ: రామచంద్రకవిగారూ! మీరు నాకు మరో చిన్న సహాయం చెయ్యాలి.

రామ: చెప్పండి.

విశ్వ: గోపాలరావుగారు మీమాటకు ఎదురు చెప్పరు.

రామ: అతనికి నామీద గౌరవభావం వుంది సాధారణంగా నేను చెప్పింది కాదనరు.

విశ్వ: మరేమీ లేదు. మీరచయితల సమావేశం ముగియగానే వారు నా వసతిశాలకు వచ్చే యేర్పాటు చెయ్యాలి.

రామ: చెబుతాను.

విశ్వ: చెప్పడం కాదు. తమరు తప్పకుండా ఏర్పాటు చెయ్యాలి!

రామ: మా సమావేశానికి మీరు కూడా వస్తారు కదూ అప్పుడు మాట్లాడదాం (ఎడమవైపు నిష్క్రమిస్తాడు.)

గణ: ఈతలుపు పట్టుకోలేక నా ప్రాణం పోతోంది. లోపల్నించి ఆమె ఉడుం పట్టు పట్టి లాగుతోంది.

విశ్వ: యిదెక్కడి ఖర్మ వచ్చి పడిందిరా!— యీమెను వెంటనే యిక్కడినుంచి పంపించకపోతే మన మర్యాద దక్కదు.

గణ: ఆమె మర్యాదగా వెళ్లిపోతుందన్న ఆశ నాకు యేకోశానా లేదు.

విశ్వ: యిప్పుడీ అపాయంనుంచి తప్పుకోవడం యెలారా నాయనా?

గణ: (ఆకస్మికంగా) నాకో అద్భుతమైన ఉపాయం తోచిందండి.

విశ్వ: యేమిటో వేగం చెప్పితగలడు! గోపాలరావుగారు వచ్చే సమయానికి యీమెను పైకి పంపించాలి.

గణ: ఎక్కడికీ పంపనక్కర్లేదు.

విశ్వ: ఎక్కడైనా దాచేద్దామంటావా?

గణ : దాచవక్కర్లేదు. దర్జాగా కుర్చీమీద కూర్చోపెడదాం.

విశ్వ : నువ్వు చెప్పేదేమిట్రా బాబూ!—నీ గురువుగారు యిలా మర్యాదగా బతకడం నీకు ఇష్టం లేదా?

గణ : నేచెప్పేది పూర్తిగా వినండి. యిప్పుడు రంగమ్మగారిని బయటకు పంపడం మంతరం కాదు.

విశ్వ : అలాగే కనబడుతోంది.

గణ : మనం వెంటనే ఆమెను చక్కగా అలంకరించి నర్తకిగా మార్చేద్దాం.

విశ్వ : యీ వుపాయం వెనుక అపాయం వుంది సుమా!

గణ : మనం రంగమ్మగారిని జాగ్రత్తగా కాచుకోవాలి. ఆమెను నోరు విప్పకుండా చెయ్యాలి. కారుమబ్బులో మెరుపుతీగలా దూరాన్నుంచి తళుక్కున మెరిస్తేచాలు. గోపాలరావుగారి...

విశ్వ : (మధ్యలో అందుకొని) నీ కవిత్వం కట్టిపెట్టు! అసలు విషయం చెప్పు.

గణ : (తేలిగ్గా) అబ్బే! యేం లేదండి గోపాలరావుగారు రాగానే మన రంగమ్మగారు యెదురు వెళ్ళాలి. పూలమాల ఆయన మెడలో వెయ్యాలి తరవాత ఎనిమిది అడుగుల దూరంలో—చక్కని భంగిమలో—శిల్ప సుందరిలా కదలకుండా కూర్చోవాలి.

విశ్వ : (భయంతో) యేమీ ప్రమాదం లేదంటావా?

గణ : యిక టైం లేదండి. వెంటనే మనం పని ప్రారంభించాలి. (తలుపు విడిచిపెడతాడు. రంగమ్మ కోపంతో ధుమధుమగా ప్రవేశిస్తుంది.)

రంగ : నన్ను—బోనులో యెలకలాగ—లోపల పెట్టేసి జారిపోదా మనుకుంటున్నారా? నే నిక్కణ్ణుంచి కదల్ను.

గణ : నువ్వు కదలకుండా కూర్చోవడమే మాకు కావలసింది (ఒక కుర్చీ ప్రక్కకులాగి) కూర్చో!

విశ్వ : చూడు శ్రీరంగం! నువ్వు మాకు ఒక సహాయం చెయ్యాలి.

గణ : నీ మేలు ఛస్తే మరిచిపోం.

విశ్వ : యిక్కడకు పెద్దపెద్దవాళ్లు వస్తారు.

రంగ : వస్తే రానియ్. నాకేం?—యీ పెద్దోళ్ల బండారం ఎవళ్ళకి తెలియదంట?

గణ : నీతో మంచితంటా వచ్చి పడిందంట!

రంగ : (కోపంతో గణపతి కేసి చూసి) యేం? యెలా గుండేంటి?

విశ్వ : రంగమ్మా! నా మర్యాద నీ చేతుల్లోవుంది. నేను చెప్పినట్టువిని నా పరువు నిలబెట్టు.

రంగ : నువ్వు సెప్పిన మాటకల్లా గంగిరెద్దులాగ తలూపుతున్నాను. అందుకే నా బతుకిలా గొచ్చింది.

గణ : (బిగరగా) ఉష్! యీ ఒక్కసారికైనా మా మాట వినవమ్మా మహాతల్లీ!

విశ్వ : యిక టైంలేదు రంగమ్మా! నువ్వు ఒప్పుకోకపోతే లాభంలేదు.

రంగ : (కొంచెం మెత్తబడి) ఏం సెయ్యాల్నేను?

గణ యేమీ చెయ్యొద్దు. కూర్చోవడమే!

రంగ : (నవ్వుతూ) ఓస్! యింతేనా! అలాగే కూచుంటాను.

విశ్వ : అయిదు నిముషాలపాటు మేం ఏంచెప్పినా నువ్వు వినాలి. నీ వేషం మార్చేస్తాం.

గణ : నిన్ను నాట్యకత్తెలా తయారుచేస్తాం. అంటే సినిమాలలో నాట్యం చేస్తారు చూశావ్! వాళ్లలా చేస్తాం.

విశ్వ : ఒక గొప్పనాయకుడొకాయన వస్తున్నారు. ఆయన రాగానే నువ్వు సిగ్గును అభినయించి...

గణ : (మధ్యలో అందుకొని) ఆ అభినయం నేను నేర్పుతానే!

విశ్వ : పూలదండ ఆయనమెళ్లో వెయ్యాలి.

రంగ : (బిగ్గరగా) అమ్మ బాబోయ్! ఆ పనిమాత్రం నేను చచ్చినా సెయ్యను. (విశ్వనాథం మీదికి వెళ్లి కోపంతో) యెంతిదయినా నీకు నీతిలేకపోతే నాకు లేదనుకున్నావా?

గణ : హా! చచ్చితిమి! అడుగడుగుకూ హంసపాదే!

విశ్వ : అందులో తప్పేంలేదు శ్రీరంగం.

రంగ: మీ పెద్దోళ్ళేంజేసినా తప్పుండదు. మొన్న సిన్నమ్మిమ్మకూతురు రాజిని చెరువు గట్టుమీద (గణపతిని చూపిస్తూ) యిలాంటి కుర్రాడొకడు సెంగట్టుకు లాగేడంట!

గణ : (బిగ్గరగా) హా చచ్చితిమి! నేను కాదు.

రంగ: అప్పుడే మయ్యిందో యెరుగుదువా? కులపోళ్లందరూ వొచ్చి వొంద రూపాయలు తప్పేసేశారు.

విశ్వ: అదంతా యిప్పుడెందుకులే రంగమ్మా! పోనీ దండ చేతికిచ్చెయ్యి చాలు.

రంగ: అలాగంటే ఒప్పుకుంటాను.

విశ్వ: నువ్వసలు నోరు తెరచి మాట్లాడకూడదు.

గణ: యెవరేం ప్రశ్న వేసినా (అభినయించి చూపిస్తూ) యిలా ఓరచూపుచూసి, చిరునవ్వు విసిరి వూరుకోవాలి.

విశ్వ: దూరంగా కూర్చుని చూస్తూవుంటే చాలు.

గణ: నోరు తెరిచావో మేం ఆఖరనుకో.

రంగ: (విశ్వనాథంతో) యిదంతా అయిపోయినాక యింటికొస్తావా మరి?

విశ్వ: ఓ! తప్పకుండా!

గణ: (కళ్లు పెద్దవిచేసి) మళ్లా కాలినడకను కాదు—కారులోనే యింటికి వెళ్లడం.

విశ్వ: సంచి పట్టుకురా గణపతీ!

(గణపతి ఒక్కదూకు దూకి గదిలోకి వెళతాడు.)

రంగ: యిదంతా యేంటి?

విశ్వ: తరవాత చెబ్తానుగా!

(గణపతి సంచి తీసుకువచ్చి దానిలోని పౌడరు డబ్బాలు, రంగులు వగైరా టేబిలుమీద పెడతాడు.)

విశ్వ: (రంగమ్మతో) కూర్చో.

(రంగమ్మ కుర్చీలో కూర్చుంటుంది. గణపతి ఒక నల్లగుడ్డ తీసుకువచ్చి—జుత్తు ముఖంమీద పడకుండా తలకు కడతాడు. విశ్వనాథం ఆమె ముక్కుకు వున్న కమ్మి తీసేస్తాడు. ముఖానికి పౌడరు అద్దుతాడు. గణపతి "ఐబ్రో పెన్సిల్"తో కనుబొమలు దిద్దుతూ వుంటాడు. ఎడమ వైపునుంచి వెంకటసుబ్బయ్య, పాపారాయుడు మాట్లాడుకుంటూ వస్తారు)

పాపా: (వస్తూనే) నే నూరుకోలేదులే! ఘట్టిగా అడిగేశాను. "పాతబియ్యం కావాలన్నమాట తమరు సెప్పనేలేదు. నా దగ్గరున్నయ్యి మూడేరకాలు, వంకసన్నాలు, కిష్ణకాటుకలు. అక్కళ్లో—యేం బియ్యం కావాలో తమరే సెలవియ్యండి." అన్నాన్నేను.

వెంక: వర్తకులమీద మునుపు ఎంత గౌరవం వుండేది! (ముందుకుచూసి సంతోషంతో) ఏమండోయ్! విశ్వనాథంగారూ! ఇవేళ నాట్యం కట్టిస్తున్నారేమిటి?

విశ్వ: (తొందర పడుతూ) అబెబ్బె...యేం లేదండి.

పాపా: (రంగమ్మను పైకీ కిందికీ చూసి) ఓహోహో! వేషం యెంత సక్కగావుంది! ఎంకటసుబ్బయ్యగారూ! మీరు సెబ్తే నమ్మరుగానీ—యెనక రోజులు యేం రోజులండి!

వెంక: (రంగమ్మకేసి చూస్తూ వెకిలిగా నవ్వి) అహాహా! ఆ రోజులే అంత!

పాపా: యేటేటా భాగోతం కట్టేవోరు. సీర సింగారించుకొని తెరలోంచి భామ వచ్చేసరికి తెల్లారిపోయాది.

గణ: (తల పైకెత్తి) అయితే పాపారాయుడుగారూ! మరి భాగోతం యెప్పుడయ్యేది?

పాపా: భాగోతం నూడ్డాని కెవడెల్లి సచ్చాడయ్యా! సీలాంటి కుర్రగుంటలంతా భామవేషం వచ్చేదాకా వూపిరికి బిగబట్టుక్కూర్చునీయ రమకో! యీలోపుని వంత పాటగాడు సెప్పుకోసిన మేకలాగ కుయ్యోమని ఒకటే అరుపు.

గణ: (విశ్వనాథంతో) గురువుగారూ! ఇక్కడవుంటే మన పని అవదు.

విశ్వ: సరే! లోపలికి వెళ్లిపోదాం. వెంకటసుబ్బయ్యగారూ! మరి మీ చందామాట మర్చిపోతున్నారు.

వెంక: (రంగమ్మకేసి చూస్తూ) అలాగే ఇస్తాన్లెండి.

గణ: (జేబులోంచి వెంటనే రసీదుల పుస్తకం తీసి) ఒక యాభై రూపాయలు రాయమని సెలవా?

వెంక: (తొందరపడుతూ) వద్దొద్దు. ఇప్పుడు నాదగ్గర పది రూపాయలకంటే యెక్కువ లేవు. (జేబులోంచి పర్సుతీసి పదిరూపాయల నోటు గణపతికిస్తాడు. గణపతి వెంకటసుబ్బయ్యకు రసీదు ఇస్తాడు.)

గణ: పాపారాయుడుగారూ! మీకుకూడా ఒక పది రూపాయలు రాస్తానూ?

పాపా: (ఖంగారు పడుతూ) వీమయ్యోయ్! ఆ పని మాత్రం సెయ్యకు. పదికి మనకి పడదు. యెనకటి భాగోతం రోజుల్దగ్గిర్నుంచీ ఇప్పుడుదాకా మందొకటే రేటు! మూడూముచ్చెవక రాసుకో. అంతకంటే దమ్మిడీ యెక్కువివ్వను.

గణ : ముచ్చెవక అంటే యేమిటి?

వెంక : ఆ మాత్రం తెలియదటయ్యా! ముచ్చెవక అంటే మూడు పావలాలు.

విశ్వ : (గణపతితో) తొందరగా కానియ్. మనకి టైం లేదు.

(గణపతి రసీదు రాసి పాపారాయుడికియిస్తాడు. పాపారాయుడు రసీదు జాగ్రత్తగా పరిశీలించి చూసి—జేబులోంచి చిన్న సంచితీసి—సంచి చుట్టూ కట్టివున్న తాడు జాగ్రత్తగా విప్పి మూడు రూపాయల ముప్పావలా లెక్కపెట్టి యిస్తాడు.)

గణ : (డబ్బు తీసుకొని విశ్వనాథంతో) గురువుగారూ మీ రిద్దరూ లోపలికి వెళ్ళిపోండి. నేను అన్నీ సర్దుకొని క్షణంలో వస్తాను.

వెంక : (రంగమ్మను పరిశీలనగా చూస్తూ) యీవిణ్ణి యిదివర కెప్పుడూ చూసినట్లు లేదే, కొత్తగా చేరిందా?

గణ : అబ్బే! లేదండి. పాతావిడే! యింతవరకూ రంగం మీదికి తీసుకు రాలేదు.

వెంక : పేరేమిటి?

గణ : పేరా? అటువంటి యిటువంటి పేరు కాదు. (విశ్వనాథం భయంతో గణపతి కేసి చూస్తాడు. గణపతి తన ధోరణిలో) అసలు మేం పేరుకే ప్రాముఖ్యం యిస్తాం. మనిషితోపాటు పేరు కూడా నాట్యరంగానికి అనుగుణంగా వుండాలి. (కళ్లు పెద్దవిచేసి) యీమె పేరు రంగమణి!

(విశ్వనాథం రంగమ్మ లోపలికి వెళ్ళిపోతారు.)

పాపా : (బిగ్గరగా నవ్వుతూ) పేరు మాత్రం మహా ముద్దుగా వుంది.

(గణపతి రంగు డబ్బాలు వగైరా టేబిలు మీదినుంచి తీసి సంచిలో సర్దుకొని లోనికి వెళ్లిపోతూ వుంటాడు.)

వెంక : అబ్బాయ్! మాట! (గణపతి ఆగి వెనక్కి తిరిగి చూస్తాడు.) ఫోటోలు మాట మర్చిపోయేవు సుమీ!

గణ : యెంత మాట! మరిచి పోవడమే! ఫోటో తియ్యవలసిన సమయంలో నాకు కొంచెం సౌంజ్ఞ చెయ్యండి. చాలు! మిగిలిన వ్యవహారం నేను చూసుకుంటాను.

(గణపతి లోనికి వెళ్ళిపోతాడు.)

పాపా : (వెంకటసుబ్బయ్యతో) ఫోటో లేంటండి?

వెంక : (తేలిగా) ఆఁ! యేం లేదు. అలాంటి పెద్ద వాళ్ళతో ఫోటో తీయించుకుంటే సరదాగా వుంటుంది చూడండి.

పాపా : బాబ్బాబు! గోపాలరావు గారితో కలిపి నాక్కూడా ఒక ఫోటోవ్ తీయించుదురూ! అలాంటి ఫోటోవ్ ఒకటి మా కొట్లో వుండాలి. సీటికి మాటికి సిన్నా పెద్దా మా కొట్టుమీద కెగబడుతుంటారు.

వెంక : అలాగే చేద్దాంలెండి.

(బయట కారు ఆగిన ధ్వని వినిపిస్తుంది. ఎడమ వైపునుంచి తొందరగా రామచంద్రకవి, కీర్తిశ్రీ వస్తారు. వారి వెనుక కమలాకరం వస్తాడు. గది లోనుంచి విశ్వనాథం వస్తాడు. అందరూ యెదురువెళ్ళి కుడివైపునుంచి గోపాలరావును తీసుకువస్తారు. గోపాలరావు తెల్లగా, పొడవుగా వున్నాడు. నల్లటి లాంగుకోటు, పంచెకట్టు, కళ్ళజోడు—ముఖంలో—రాజఠీవి వుట్టిపడుతూవుంటుంది. వయస్సు 40 సంవత్సరాలు.)

రామచంద్రకవి, కీర్తిశ్రీ : యిలా దయచేయండి. యిలా.

గోపాల : (అంతా కలయజూసి) సాహితీవేత్తల గోష్ఠిలో పాల్గొనడం నాకు చాలా సంతోషం.

కీర్తిశ్రీ : అసలు తమ వంశమే అటువంటిది.

రామ : (ఒక్కొక్కరినీ పరిచయం చేస్తూవుంటాడు.) వీరిపేరు కీర్తిశ్రీ.

గోపా : (కీర్తిశ్రీ నమస్కారాన్ని అందుకొని) వ్యావహారిక భాషకు వ్యాకరణం రాస్తున్నది వీరే కదూ?

రామ : అవునండి. వీరే!

కీర్తి : పూర్తిచేసేశానండి. ముద్రణ సౌభాగ్యమే యింకా నోచుకోలేదు.

రామ : వీరు వెంకటసుబ్బయ్యగారు. (ప్రఖ్యాత వర్తకులు. సాహిత్య పోషకులు. (వెంకటసుబ్బయ్య నమస్కరిస్తాడు.) వీరు పాపారాయుడుగారు, వీరుకూడా ప్రముఖ వర్తకులు. సారస్వతాభిమానులు. (పాపారాయుడు నమస్కరిస్తాడు) వీరు విశ్వనాథంగారు ప్రసిద్ధ నాట్యాచార్యులు.

గోపా : (నమస్కారం అందుకొని విశ్వనాథంతో) మీరు కార్మిక నాయకుడు అవతారంగారికి యేదో అవుతారుకదూ?

విశ్వ : ఆయన నాకు స్వయంగా మేనమామేనండి.

గోపా : మీకు సంఘంలో సభ్యత్వం యిప్పించమని ఆయన నాకు చెప్పారు.

విశ్వ : తమరు యీ సమావేశం ముగిసిన తరవాత నా నర్తనశాలకు దయచేయాలి.

గోపా : చూస్తాను. ఆలోచిస్తాను.

రామ : విశ్వనాథంగారి నర్తనశాల (ద్వారంకేసి చూపిస్తూ) యిదేనండి.

గోపా : చూద్దాం, టైంవుంటే తప్పకుండా వస్తాను

రామ : వీరిపేరు కమలాకరంగారు, ప్రస్తుతం పత్రికలలో యెక్కువగా రాస్తున్న వారిలో వీరొకరు.

(కమలాకరం దూరాన్నుంచి నమస్కరిస్తాడు.)

గోపా : (కమలాకరంకేసి నిరక్ష్యంగా చూసి) పత్రికలు నేను చదవను. నేటి పత్రికా రచయితల పేర్లు నాకు తెలియవు.

రామ : యిలా దయచెయ్యండి.

(ముందు రామచంద్రకవి, వెనుక గోపాలరావు ఆ యిద్దరి వెనుకా మిగిలినవారు ఎడమవైపు నిష్క్రమిస్తారు. — గది తలుపు అమాంతంగా తెరుచుకొని ఒక్క దూకు దూకి గణపతి ప్రవేశిస్తాడు. అతని భుజానికి కెమేరావుంది.)

రంగ : (ద్వారందగ్గర కనిపించి) లోపలికొచ్చేవంటే నెవ్వు మెలేస్తాను నేను పిలిసేదాకా రాకు. (తలుపులు దగ్గరకు వేసేస్తుంది)

గణ : ఏ పనీ చెయ్యకుండా కూర్చోవడమంటే మనకు చచ్చేనంతపని (తలుపుదగ్గరకు వెళ్లి) రంగమ్మా! రంగమ్మా!

రంగ : (నే పక్యంలోంచి కోపంతో) మాటాడొద్దంటే మనిసివి కావూ?

గణ : పోనీ ఆ సద్దిల ఆయినా యిలా పారెయ్యవమ్మ తల్లీ, కొంచెం ప్రాక్టీసు చేసుకుంటాను.

రంగ : నువ్వు గింజుకు సచ్చినా తలుపు తియ్యను.

గణ : (బిగ్గరగా) నన్నేం చెయ్యమంటావిక్కడ?

రంగ : (కోపంతో) ఎందుకలా సిందులొక్కుతావ్?

గణ : (సంతోషంతో) భలే! బాగా జ్ఞాపకం చేశావ్. చిందులు! (కాలుమీద దరువేస్తూ పాటపాడతాడు.)

నామ తెచ్చిన మల్లి మొగ్గలు
ముడువనంటుంది — చిలుకా
పలుకనంటుంది!

పాపా: (ఎడమవైపునుంచి వచ్చి) సిన్నోడా! మ బాగా పాడుతున్నావే!

గణ : పాటపాడడం గొప్పతనం కాదండీ పాపారాయుడుగారూ! పాటకు తగ్గినంగా అడుగు వేసి అభినయించాలి

పాపా: శ్రీ రాజితం కూతుర్నిచూస్తే పెద్ద పిచ్చోళ్లైపోయినోళ్లు పాటపాడి అడుగేసుంటే సెయ్యాల, తలా, కన్నూ అన్నీ ఒకటే తిప్పడం!!

(వెంకటసుబ్బయ్య, కీర్తిశ్రీ మాట్లాడుకుంటూ ఎడమవైపునుంచి వస్తారు)

వెంక : (ప్రవేశిస్తూ) రంగుమాత్రం పక్కా రంగు. రంగు గ్యారంటీ యివ్వగలను కాని సుద్ద గ్యారంటీ యివ్వలేను.

కీర్తి : అది విడిచిపెట్టి మరో రకం యివ్వండి ఖరీదు స్వల్పంగా వుండాలి. ఒక అరతాను ప్రస్తుతానికి చాలు.

(వెంకటసుబ్బయ్య, కీర్తిశ్రీ మాట్లాడుతూ కుడి చివరకు వెళతారు. ఎడమవైపునుంచి తీరుగా గోపాలరావు వస్తాడు. అతని వెనుక రామచంద్రకవి వస్తాడు.)

రామ : (గోపాలరావుతో నెమ్మదిగా) మా అబ్బాయి విషయం కొంచెం...

గోపా : (మధ్యలో అందుకొని) అవును. జ్ఞాపకంవుంది అదే చూస్తున్నాను.

రామ : ఏదో ఒక శాఖలో...

గోపా : ఆలోచిస్తాను.

రామ : (మధ్యను వున్న పెద్దకుర్చీ చూపిస్తూ) దయ చేయండి. (గోపాలరావు కాలుమీద కాలు వేసి, మెడ ఓరగా పెట్టి కూర్చుంటాడు. ఎడమవైపు నుంచి విశ్వనాథం పూలదండ తీసుకొనివస్తాడు)

రామ : కీర్తి శ్రీగారూ!

(కీర్తి శ్రీ విశ్వనాథం చేతిలో వున్న పూలదండ తీసుకొని గోపాలరావు మెడలో వేస్తాడు. అందరూ చప్పట్లు కొడతారు.)

వెంక : (గణపతితో రహస్యంగా మాట్లాడి గోపాల రావును సమీపించి) అయ్యా! తమరు మా వర్తకుల సంఘానికి ఒకసారి దయచెయ్యాలి.

గోపా : యిప్పుడు తీరిక లేదు. నెలరోజులలో (గణపతి ముందుకు వచ్చి ఫొటో తీస్తాడు.) తిరిగి వస్తాను. అప్పుడు మీ సంఘానికి రావడానికి ప్రయత్నిస్తాను.

వెంక : మళ్ళీ సారి వచ్చినప్పుడు తమరు తప్పకుండా దయచెయ్యాలి.

(రామచంద్రకవి, కీర్తిశ్రీ, విశ్వనాథం ఒకవరుస లోను, వెంకటసుబ్బయ్య, కమలాకరం మరో వరసలోను కూర్చుంటారు. గణపతి అందరికీ వెనుక ద్వారపాలకుడిలా తలుపుదగ్గర నిలబడతాడు.)

రామ : (లేచి నిలబడి) యిది శుభదినం. గోపాలరావు గారిని నేను మీకు వేరే పరిచయం చెయ్య వక్కరలేదు. సారస్వతరంగంలో వారు చేసిన కృషి అపారమైనది. కేవలం సాహిత్యంలోనే గాక యితర లలితకళలతో కూడా వారికి పరిచయం వుంది. పత్రికలు భాషను పాడుచేస్తున్న వన్న విషయాన్ని మొదట వెల్లడించినది వీరే! నేటి రచయితలు వట్టి చెత్త రాస్తున్నారు. వాటిని పత్రికలు ప్రకటిస్తున్నవి.

కమ : (మధ్యలో అందుకొని) మీరు పత్రికలు చదువుతున్నారా?

రామ : పత్రికలు చదవడం నేను యేనాడో మానేశాను.

కమ : చదవకుండా 'చెత్త' అని మీరెలా చెప్పగలరు?

కీర్తి : కూర్చోండి కమలాకరంగారూ! రామచంద్రకవి గారికి అంతా తెలుసు.

కమ : పోనీ మేం చెత్త రాస్తున్నప్పుడు మీరు ఉత్తమ రచనలను అందించి మాకు దారి చూపించవచ్చు కదండీ?

రామ : కూర్చోండి. ఆ విషయంకూడా చెబుతాను. (కమలాకరం కూర్చుంటాడు.) రవీంద్రుడంతటి వాణ్ణే ప్రజలు మరిచిపోతున్నారు. అంతా చూస్తూవుంటే విరక్తికలుగుతోంది. కొత్తగా కావ్యాలు రాసేకంటే భాషవిషయంలో శ్రద్ధ తీసుకోవడం మంచిదని నాకుతోచింది. నేటి రచయితలు భాషకు ప్రాధాన్యత యివ్వడం లేదు. భాషకు పుష్టిచేకూర్చేందుకు మేం కృషి చెయ్యవలసివుంది. సాహిత్యరంగంలోవున్న అవ్యవస్థను తొలగించాలి. భాషనుగురించి కీర్తిశ్రీగారు విపులంగా చర్చిస్తారు. (కూర్చుంటాడు.)

కీర్తి : (లేచి) వ్యావహారిక భాషకు వ్యాకరణం వుండి తీరాలి. యీ విషయం నేను...

కమ : (మధ్యలో అందుకొని) అప్పుడు వ్యావహారిక భాష తిరిగి గ్రాంథిక భాష అవదా?

వెంక : నువ్వూరుకోవయ్యా! ఆయన్ని మాటాడనియ్.

కీర్తి : కొన్ని నియమాలు అవసరం, ప్రస్తుతంవున్న తీరుతెన్నులు చూస్తే వ్యాకరణం చాలా అవసరమని తోచింది. వెంటనే నేను కృషి ప్రారంభించాను.

కమ : మీ వ్యాకరణం కేవలం సూచనగావుంటే మేం ఒప్పుకుంటాం. యిలావుండితీరాలని శాసించడానికి వీల్లేదు.

పాపా: కూర్చోవయ్యాబాబ్బాయ్! ఆర్ని మాటాడనియ్.

గోపా : (మధ్యలో కలగచేసుకొని లేచి) నాకు టైంకావస్తున్నది అన్ని విషయాలూ యిక్కడ చర్చించడానికి వ్యవధిచాలదు. మీరు ఒక నివేదిక తయారుచేసి నాకుయివ్వండి. నేను తరవాత పరిశీలిస్తాను. — యీనాడు రచయితల మీద యెన్నో బాధ్యతలువున్నాయ్. పీడిత కార్మికులు జీతంచాలడంలేదంటున్నారు. సమ్మె చేస్తామంటున్నారు. వివిధ కర్మాగారాలలో

పనిచేసే కార్మికులు చీటికి మాటికి సమ్మెనోటీసులు యిస్తున్నారు. యీ పరిస్థితిని ప్రతిపక్షాలవాళ్లు చక్కగా వినియోగించుకుంటున్నారు. వారుకూడా కొంతమంది రచయితలను చేరదీశారు. ఆకలి, సమ్మె, చావు, ఏడుపు—యెప్పుడూ యివే సమస్యలు.—యీ సమస్యలతోనే వేలకొద్దీ పుస్తకాలు తయారుచేస్తున్నారు. ప్రజలను దారితప్పిస్తున్నారు. యీ పరిస్థితులలో మన రచయితలపైవున్న బాధ్యతలు అపారమైనవి. లౌకిక సమస్యలనుంచి ప్రజల దృష్టిని మళ్లించాలి. మన పూర్వీకులందరూ శృంగారాన్ని మాత్రమే కవితావస్తువుగా స్వీకరించారు. యిది గమనించవలసిన విషయం. (కమలాకరంతప్ప అందరూ హర్షధ్వానాలుచేసారు.) రాజకీయవేత్తల జీవితం పూలపాన్పువంటిదనుకంటారు. ఎంతమాత్రం కాదు. అన్నీ సమస్యలే యెదురు వస్తూవుంటాయి ఒకవైపునుంచి ప్రతిపక్షాన్ని కాచుకోవాలి. ప్రతిపక్షంవాళ్ళు యెప్పుడూ ముందునుంచే పొడుస్తారు గనక వాళ్ళను కాచుకోవడం తేలిక. యిక మన పక్షంవాళ్ళు వున్నారే—వాళ్ళను కాచుకోవడం మనతరంకాదు. మన పక్షంవాడెప్పుడూ మనతోనే వుంటూ—వున్నట్లు నటిస్తూ—వెనకనుంచి ఒక్క పోటు పొడుస్తాడు.

కీర్తి : (చప్పట్లుకొట్టి) చక్కగా సెలవిచ్చారు.

గోపా : (ఉపన్యాసాన్ని కొనసాగిస్తూ) యిలాంటి కుట్రలను సి. ఐ డీలు కూడా పసిగట్టలేరు.

కమ : (మధ్యలో అందుకొని) యీమధ్య రచయితల సమావేశాలకు కూడా సి. ఐ. డీలు వస్తున్నారు.

గోపా : సి ఐ. డీల పోస్టులు అనవసరం అని నా వ్యక్తిగతాభిప్రాయం. ఎందుకంటారా? సి. ఐ. డీలు చేసే పనులన్నీ యీనాడు పత్రికలవాళ్లే చేసేస్తున్నారు. కనక సి. ఐ. డీల పోస్టులు 'సూపర్ ఫ్లూయిస్' (అందరూ బిగ్గరగా హర్షధ్వానాలు చేస్తారు.) పరిశీలించి చూస్తే మన ప్రాచీన సాహిత్యంలో అనేక లోపాలు కనిపిస్తాయి. రామాయణాన్ని పోతన రాసివుంటే ఎన్నోరెట్లు బాగుండేది. అదేవిధంగా తిక్కన భాగవతాన్ని, ఎఱ్ఱన మనుచరిత్రను రాసివుండవలసింది. (రామచంద్రకవి, కీర్తిశ్రీ ఒకరిముఖం ఒకరు చూసుకుంటారు.) అసలు కవిత్వం అంటే దారుణ భావనల చిత్రణం. పత్రికా రచయితలుగా లబ్ధప్రతిష్ఠులైనవారికి మేం కొన్ని కార్యాలు అప్పగించాం. త్వరలో సాహిత్యాన్ని మేం క్రింది మెట్టునుంచి పైకి తీసుకువెళ్ళి స్వర్ణ సింహాసనం అధిష్ఠింప చేస్తాం. (అందరూ హర్షధ్వానాలు చేస్తారు.) యిటీవల మా సహచరుడు ఒకరు రామాయణ భారతాలను పాఠ్యగ్రంథాలుగా వుపయోగించ కూడదన్నారు. యీ విషయాన్ని చాలామంది అపార్థం చేసుకున్నట్లు కనిపిస్తోంది. ఉదాహరణకు రామాయణంలోని వానరసైన్యంలో డిసిప్లిన్ లేదు. అటువంటి విషయాలు చిన్నపిల్లల మనస్సులమీద చురుగ్గా పనిచేసాయి. అటువంటి విషయాలను రచయితలు జాగ్రత్తగా పరిశీలించాలి. రచయితలు తమ బాధ్యతలను గుర్తించాలి. యువరచయితలు ఉద్రేకంతో దారితప్పే అవకాశం వుంది. అందువల్ల అరవై సంవత్సరాలు దాటిన రచయితలు మాత్రమే అగ్రశ్రేణిలో వుండాలని నా అభిప్రాయం. మిమ్మల్నందరినీ కలుసుకోగలిగినందుకు చాలా సంతోషిస్తున్నాను. (గోపాలరావు హర్షధ్వానాల మధ్య కూర్చుంటాడు. గణపతి ముందుకువచ్చి ఫొటో తీస్తాడు.)

రామ: మన సమావేశానికి హాజరై తమ అమూల్యాభిప్రాయాలను తెలియజేసిన గోపాలరావు గారికి ధన్యవాదాలర్పిస్తున్నాను. (అందరూ హర్షధ్వానాలు చేసారు.)

కీర్తి : (రామచంద్ర కవితో) మన నివేదికమాట సెలవిచ్చారు కాదు.

రాము: (గోపాలరావును సమీపించి) మేం రెండు నిమిషాలలో నివేదిక తయారుచేసుకు వస్తాం.

విశ్వ: యీలోగా తమరు నా వర్తకశాలను దర్శింపగోర్తాను.

గోపా: సరే కానివ్వండి.

రామ: కమలాకరం గారూ రండి.

కమ : నాకు వేరే పని వుందండి. సెలవ్. (కుడివైపు వెళ్ళిపోతాడు.)

కీర్తి : (కోపంతో) రేపటినుంచి యితనిని కూడా మనం దూరంగా వుంచాలి.

(రామచంద్రకవి, కీర్తిశ్రీ, వెంకటసుబ్బయ్య, పాపారాయుడు ఎడమవైపు వెళ్ళిపోతారు. విశ్వనాథం గణపతికి సైగచేస్తాడు. గణపతి గది లోకి వెళ్ళిపోతాడు.)

విశ్వ : యిదే నా నవరసశాల! తమరు...

(గోపాలరావు లేస్తాడు. వెంటనే గది తలుపులు తెరుచుకుంటాయి. చక్కగా అంకరించుకొని, బెదురుచూపులతో — రెండు చేతులతో పూలమాల పట్టుకొని రంగమ్మ ప్రవేశిస్తుంది. ఆమె రూపంలో గుర్తించలేనంత మార్పు వచ్చింది. ఆమెను ఒక క్షణమయినా విడిచిపెట్టకుండా — అంగరక్షకుడిలా — గణపతి ఆమె వెనకనే తిరుగుతూ వుంటాడు. ఆమె యెటు అడుగువేస్తే తనుకూడా అడుగువేస్తూ వుంటాడు. గోపాలరావు యెటునడిస్తే విశ్వనాథం కూడా అటే నడుస్తూ వుంటాడు.)

గోపా: (సంతోషంతో) అన్ని కళలకంటే భరతనాట్యంమీద నాకు అభిమానం యెక్కువ. (రంగమ్మను సమీపిస్తాడు.) భీత హరిణేక్షణ అన్న వర్ణన కవి యీమెనుచూసే చేసివుండాలి.

గణ : అద్భుతంగా సెలవిచ్చారు.

(రంగమ్మ గోపాలరావుకు దండ ఇవ్వబోతుంది. అతను దండ తీసుకోకుండా ఆమె ముఖంలోకి చూస్తూంటాడు. రంగమ్మ వెనక్కి అడుగు వెయ్యబోతుంది. వెంటనే గణపతి ఆమె చేతిలోని పూలమాల తీసుకొని తనే వేసేస్తాడు.)

గోపా: విశ్వనాథం గారూ! మీ శిష్యురాలికి భయం ఎక్కువ ననుకుంటాను.

విశ్వ : చిత్తం! తమవంటి పెద్దలదగ్గర మాలాంటి ఆరి తేరినవాళ్ళకే భయంగా వుంటుంది.

గణ : అందులోను యీ భయం వుంది చూశారూ! యిది సిగ్గుకు సంబంధించినది.

గోపా : స్త్రీలకు సిగ్గు సహజమైన ఆభరణంవంటిది.

విశ్వ : చిత్తం.

గోపా : (రంగమ్మతో) యిలా రా అమ్మాయ్. నీ పేరేమిటి ?

గణ : (వెంటనే అందుకొని) 'రంగమణి' అండి.

గోపా : రూపానికి, విద్యకు తగినపేరు. పేరు చక్కగా వుంది. ఈమెకు 'హంసగమన' అని బిరుదు యిస్తున్నాను.

గణ : (ప్రశంసిస్తూ) ఒహోహో! యేం చక్కని బిరుదు!

విశ్వ : తమది కళాహృదయం!!!

గోపా : (జేబులోంచి సెంటుబాటిల్ తీసి) రంగమణి! యిదిగో! నీకు యీ సెంటుబాటిల్ బహూకరిస్తున్నాను. (రంగమ్మ చేతికి యివ్వబోతాడు. రంగమ్మ తీసుకోకుండా వెనుకకు అడుగు వేస్తుంది. ఆమె వెనుకనుంచి చెయ్యిచాచి గణపతి సెంట్ బాటిల్ తీసేసుకుంటాడు.)

విశ్వ : (ప్రశంసిస్తూ) యెవరికి—యే సమయంలో—యెటువంటి బహుమతి యివ్వాలో—తమకు అంతా తెలుసు!

గోపా : (రంగమ్మకు దగ్గరగా వెళ్ళి) ఏదీ! ఒక పాట పాడి వినిపించు.

విశ్వ : (వెంటనే అందుకొని) ఆర్కెస్ట్రా లేనిదే పాట పాడలేదండి.

గణ : తమకు యే పాట కావాలో సెలవివ్వండి సార్! నేను పాడి వినిపిస్తాను.

గోపా : (కోపంతో) యితడెవరు ?

విశ్వ : నా శిష్యుడేనండి. యీ వూళ్ళో కాలికి గజ్జెలు కట్టుకలిగిన వాళ్ళంతా యెప్పుడో ఒకప్పుడు నా దగర నాట్యం నేర్చుకున్నవాళ్ళేనండి.

గోపా : ఆర్కెస్ట్రా లేకుండా సహజమైన కంఠస్వరంతో మీ శిష్యురాలితో ఒక పాట పాడించండి. (కుర్చీ రంగమ్మవైపు తిప్పి ఠీవిగా కూర్చుంటాడు.)

గణ : (ముందుకువచ్చి కెమేరా పైకెత్తి) తమరు అలాగే కూర్చోండి. రంగమణిగారూ! మీరు కూడా యిటు.........

(రంగమ్మ గణపతి కేసి ఉరిమిచూస్తుంది.)

విశ్వ : (రంగమ్మకు నోరు తెరవవద్దని సైగ చేస్తాడు. గోపాలరావుతో) తమరు యీసారి వచ్చేటప్పుడు ముందుగా నాకు తెలియజేస్తే......

గణ : (ముసుగినీ ఫొటో తీసి వెంటనే అందుకొని) బ్రహ్మాండమైన నాట్యప్రదర్శనలు యేర్పాటు చేస్తామండి.

విశ్వ : యిరవై మంది శిష్యురాండ్రతో ఒకేసారి అడుగు, తాళం తప్పిపోకుండా నృత్యం చేయిస్తానండి.

గణ : అది సర్కస్‌కంటే అందంగా వుంటుందండి.

గోపా: ఆ విషయం తరవాత ఆలోచిద్దాం. (రంగమణితో) సిగ్గు సర్వత్రా రాణించదు. ప్రత్యేకించి నర్తకీమణులకు, నటీమణులకు సిగ్గు అపకారం చేస్తుంది —ఏదీ! ఒక్క చిన్న పాట పాడి వినిపించు.

నేపథ్యంలో : సార్ ! టెలిగ్రాం ! !

గణ : (వెంటనే కుడివైపు వెళ్ళి, చిన్న కవరు తీసుకొని వస్తాడు. చిరునామా చూసి) తమకే సార్ !

(గోపాలరావు కవరు చింపి చూస్తాడు. కోపంతో అతనిముఖం యెర్రబడుతుంది. గణపతి, విశ్వనాథం అతనికి చెరోవైపు నిలబడి ఆత్రుతతో చూస్తూవుంటారు.)

గోపా: (లేచి) నేను అనుమానించినంతా జరిగింది. (కోపంతో) అవిశ్వాసం !—అవిశ్వాసం ! !

(గోపాలరావు తొందరగా కుడివైపు వెడుతూ వుంటాడు. రామచంద్రకవి, కీర్తిశ్రీ యెదురువైపునుంచి వస్తారు )

రామ: (గోపాలరావు వెళ్లిపోతూవుండడం చూసి తొందరగా)వెళ్ళిపోతున్నారా? మా నివేదిక....

గోపా: (మధ్యలో అందుకొని) యిప్పుడు తీరిక లేదు. పోస్టులో పంపండి. చూస్తాను.

(గోపాలరావు బిరబిరా కుడివైపు వెళ్ళిపోతాడు. అతని వెనుక రామచంద్రకవి, కీర్తిశ్రీ నిష్క్రమిస్తారు.)

రంగ: (చేతులకువున్న ఆభరణాలు వగైరా తీసిపారేస్తూ కోపంతో) సిగ్గూ యెగ్గూ లేకుండా నన్ను నలుగుర్లోనూ నిలబెడతారా? మీపని పడతానుండండి.(అలంకారాలన్నీ తీసేస్తూవుంటుంది )

గణ : రంగమ్మా ! కదలకుండా మా గురువుగారి ప్రక్కను నిలబడు. మీ యిద్దరినీ ఒక ఫోటో తీసేస్తాను.

రంగ: (కోపంతో) యేం? యెలాగుండేంటి?

(గణపతిమీదికి రాబోతూ వుంటుంది. విశ్వనాథం ఆమెను పట్టుకోబోతూ వుంటాడు. ఆ సమయంలో గణపతి వెనుకకు అడుగు వేసి యిద్దరినీ ఫొటో తీసేస్తాడు. సరిగ్గా ఫొటో తీస్తున్న సమయంలో ఎడమవైపునుంచి వెంకటసుబ్బయ్య, పాపారాయుడు వస్తారు.)

వెంక: (అమాంతంగా గణపతి చేతిలోని కెమేరా లాక్కొని) ఫెటమంతా దండుగు చేసేశావు.

పాపా: గోపాలరావుగారేరీ?

విశ్వ : ఏదో అర్జంటు పనిమీద వెళ్ళిపోయారు. అదేం రాజకీయమో !

వెంక: అరరే! అప్పుడే వెళ్ళిపోయారా ?

పాపా: పదండి ! బంగాళా కెల్దాం.

(వెంకటసుబ్బయ్య,పాపారాయుడు తొందరగా కుడివైపు వెళ్ళిపోతారు.)

గణ : యిది మన వర్తమానకాల చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించవలిసిన రోజు !

రంగ: (కోపంతో) వుండుండు ! నీపనయిపోలేదులే !

(రంగమ్మ గణపతిమీదికి వస్తూవుంటుంది. గణపతి ఒక్క దూకుదూకి యెడమవైపు నిష్క్రమిస్తాడు. రంగమ్మ ధుమధుమగా యెడమవైపు వెడుతూవుంటుంది. విశ్వనాథం అలిసిపోయినవాడిలా కుర్చీలో కూలబడతాడు.

[ తెర ]

# జాతక శాస్త్రప్రయోజనము

శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు

రమారమి ఇరువది ఐదేండ్లకు పూర్వము ఒకప్పుడు ఏదో కార్యార్థమై బెంగుళూరునగరమునకు పోయి అచట నా మిత్రుని యింట విడిసియుంటిని. ఉత్తర దేశమునుండి ఒక గొప్ప జ్యోతిష్కుఁడు తీర్థయాత్రలు సలుపుచు వచ్చి వారము దినములుగ ఆ నగరములో ఒక సంపన్నగృహస్థుని యింట విడిసియున్నాడని ప్రస్తావవశమున నా మిత్రుడు నాకు తెలిపెను. ద్రవ్యార్థమునకై దేశసంచారము చేయు జ్యోతిష్కుల వంటి వాఁడు కాడనియు, అడిగినవారికి ఉచితముగ, జాతక ఫలమో, సులభ చికిత్సలో అతడు సూచించుననియు, వినుటచే అతనిని చూడవలయునని సంకల్పించితిని. జాతకశాస్త్రమును గురించి అతని అనుభవవిశేషము లెట్టివో, ఏపద్ధతు లతడు అవలంబించుచుండెనో, దైవ పురుషకారముల పరస్పరసంబంధమునుగూర్చి అతని ఊహాలు, అనుభవము లెట్టివో, నూతన గ్రహాదుల ఫలములపై అతని విశ్వాసమేపాటిదో, మున్నగు సమస్యలనుగూర్చి అతనితో చర్చించుట లాభకారి యనుకొంటిని. జ్యోతిషమే జీవనోపాయముగా ఏర్పరుచుకొన్నవారు ఇట్టి చర్చలతో కాలయాపనము చేయుటకు పూనుకొనరని పాఠక మహాశయులు సులభముగా గ్రహించగలరు.

ఆమరునాటి ఉదయమున ఎనిమిది గంటలకు నేనును, నామిత్రుఁడును, ఆ తైర్థికుడున్న గృహస్థుని ఇల్లు చేరితిమి ఆ ఇంటి వసారాలోని చిన్న గదిలోనే ఆ తైర్థికుని బస. ఆగదిలో అర్థభాగమునకు ఒక చిన్న తెర వ్రేలగట్టి, లోపల అతడేమో పనిలో నుండెను గదివాకిట మేము నిలుచుకొన్న పాతిక నిమిషములకు అతడు కొంచెముగా తెరవార చేసి, చూసి గదిలోపలికి వచ్చి కూర్చుండుడని చేసైగతో పిలిచెను. లోపలికేగి అందున్న చిఱచాపపై మేము కూర్చుంటిమి. "రొట్టె నిప్పులపై వేసినాను. త్వరలో వత్తును" అని చెప్పి తన పని ముగించి, నిమిషకాలములో వచ్చి మా ముందు కృష్ణాజినముపై కూర్చుండి, వచ్చిన పని ఏమని ప్రశ్నించెను. మా సంభాషణ మంతయు ఆంగ్లభాషలోనే జరిగినది.

వంగపండువన్నెగల దేహచ్ఛాయ, బ్రహ్మతేజస్సు తొణుకుచుండు ముఖవర్చస్సు, విభూతితో సిద్ధమైన మూడు తిర్యక్పుండ్రములతో నిగనిగలాడు విశాలఫాలము, సౌజన్యమును సూచించు గొప్ప నేత్రములు, విశాల భుజాంతరమున వ్రేలుచున్న తెల్లని ఉపవీతము, మోకాలి బంటిగా కట్టిన ధౌతవస్త్రము, కలిగి పద్మాసనమున ఆసీనుడైయున్న ఆ మహనీయుని చూచినవారికి, అతడొక ఉత్తమవంశసంజాతుడనియు, గొప్ప సంస్కృతి గల పండితుఁడనియు, తపస్సంపన్నుడగు యోగి యనియు తోచకమానదు.

"తాము గొప్ప జ్యోతిశ్శాస్త్రవేత్తలని, విని దర్శనమునకై వచ్చితిని" అంటిని.

"జాతకము తెచ్చినారా?" అతని ప్రశ్న.

"నేను విద్యార్థిని, సందేహములను కొన్నింటిని మనవిచేయుదలచితిని."

"సంతోషము. కొంత విరామముగా కూర్చుంటిరేని, తెలిసినది చెప్పగలను."

అతని సౌజన్యమునకు సంతోషించితిని. ఒక్కొక్కటిగా నా సందేహములను చెప్పి, అతని ప్రత్యుత్తరములను బడయుగలిగితిని. ముఖ్యముగా, పరాశర వరాహమిహిర, శ్రీపతి ప్రముఖుల సంప్రదాయమునే అతడవలంబించుచుండుట, వశిష్ఠాది ప్రాచీన మహర్షులకు అభిమతమైన సాయన పద్ధతితోనే ఫలములను గమనించుట ఉపయుక్తమార్గమని సోపపత్తికముగా అతడు వివరించెను. నూతనముగా ఖగోళశాస్త్రజ్ఞులచే కనుగొనబడిన ఇంద్రవరుణులకు సయితము ఫలప్రదత్వము కలదని అనుభవము తెలుపుచుండుటచేత, జాతక ముహూర్తాదులలో వానిని

నిరాదరించుట శాస్త్రమునకు నష్టమనియు, పాశ్చాత్య పథక గ్రంథములనుండి సాయన గ్రహగతులయొక్కయు సాయన లగ్నాది భావములయొక్కయు, స్థితిని గుర్తించుట సులభమార్గమనియు, ఏకమూలికా ప్రయోగముగా సర్వజాతకములకును, వింశోత్తరీ దశనుకట్టి ఫలములు చెప్పుట శాస్త్రసమ్మతము కాదనియు, యవనులనుండి నేర్చుకొని, మన ప్రాచీన పండితులు అభివృద్ధిపరచియున్న తాజిక సంప్రదాయమందలి దృష్టి యోగములు, వర్షజాతి కాదులు ఉపయోగించుట ఎంతో ప్రయోజనకారి యనియు, విపులముగా అతడుపన్యసించినాడు.

"దైవపురుషకారముల పరస్పర సంబంధ మెట్టిది? దైవము అనగా గ్రహగతి, దుష్టమైనప్పుడు, పురుషకారమేమి చేయగలదు" అని అడిగితిని.

"ఇది చాల చిక్కు సమస్య. స్థూలముగా నిట్లు నిర్వచింపవచ్చును. మంచివైనా, చెడ్డవైనా దశలను రమ్మనుటకుగాని, రావలదనుటకుగాని, మన కధికారము లేదు. వ్యక్తుల పురాకృత కర్మ ఫలమునకే దైవశక్తి అనిపేరు. అది ఈ జన్మమున ఏ కాలములో, ఏ స్వభావముతో, పక్వానకు రాగలదో, జాతకశాస్త్రము దశాదులద్వారా, మనకు సూచించగలదు. ఈ దైవశక్తి ప్రసారమును నిషేధించుటకు కాని, నిరోధించుటకు కాని, పురుషకారమునకు సాధ్యము కాదు. అయినా, ఆ శక్తికి ఏదోవిధముగా పురుషకారము తోడుపడనిదే, ఫలము లేదనుట ముఖ్యసూత్రము. తన స్వభావముతో సరిపడు భావములు మనలో ఆశక్తి రగులుకొలిపి ఉద్రేకింపజేయును. సాధారణముగా, ఆ భావములు మన హృదయములను ఏవైపునకు లాగునో, ఆ మార్గమునందే, తెలిసియో, తెలియకయో, మనము పురుషకారమును చేయుచుందుము. అట్లని, ఆ భావములకు దాసులుగా ప్రవర్తించి తీరవలెనని నియమము లేదు. తగిన సంస్కారమువలన, వివేకమువలన ఇంద్రియముల నిగ్రహించి స్వాధీనములో నుంచుకొని, ఆ దైవశక్తి ప్రసారమునకు మార్గాంతరమును కల్పించవచ్చును. పురుషకారమున కనుగుణముగా, దైవశక్తి ఫలము యొక్క స్వభావము భిన్నస్వరూపములతో గోచరించగలదు. అనగా, దైవశక్తి యొక్క స్వభావమును మార్చలేదు కాని, దాని స్వరూపమును పురుషకారము మార్చగలదనుట. దైవపరిపాక ఫలము అనుభవించక తీరదు. తగినరీతి ప్రవర్తించి దాని స్వరూపమును మార్చవచ్చును.

అవశ్య మనుభోక్తవ్యం,
కృతం కర్మ శుభా శుభం"

అను సిద్ధాంతమునకు, ఈ ఉపపత్తిచే ఏమియు బాధలేదు. శంకర భగవత్పాదాచార్యులు సన్యసించి మొసలిపట్టునుండి విముక్తినొందుట, కృష్ణదేవరాయలు రాజ్యత్యాగము చేసి ప్రబల కుహూయోగదుష్ఫలమును తప్పించుకొనుట, మున్నగునవి ఈ సందర్భమున వెలలేని దృష్టాంతములు.

"సామాన్యజీవితము నుండి యొక చిన్న ఉదాహరణము చూచుడు. మండు వేసవిలో, వాయు సంచారములేని దినములలో, దుర్భరమగు తాపములో కంటికి నిద్ర అంటక బాధపడుదుముకదా? ఈ అననుకూల పరిస్థితి తగ్గించుకొనుటకై విద్యుచ్ఛక్తితో తిరుగు వీవనొకదానిని రెండో మూడో వందల రూప్యములకు కొనితెచ్చి ఉపయోగించుకొంటిమేని, ఆ బాధ కొంత తగ్గించుకొనగలము. ఈ ఉదాహరణములో మనము చేసిన కార్యమునకు అర్థమేమి? ఒకరకపు బాధ తగ్గించుకొనుటకై, మరొకరకపు బాధను ఓర్చుకొన్నామనుట! ఆ రెండు మూడువందలు సంపాదించుటకొరకు అనుభవింపవలసిన కాయిక మానసిక పరిశ్రమవలని క్లేశమును అంగీకరించి వేసవి బాధను తగ్గించుకొనుటే కదా ఇది? విమర్శించి చూచితిమేని, దుష్టదశాకాలపు ఫలమును తగ్గించుకొనుటకై శాస్త్రము విధించిన జపతపములు, దానధర్మములు పూజాప్రయోగములు, మున్నగునవి, అన్నియు, ఇట్టి తత్త్వముపైన ఆధారపడినవే. ఇదే యుక్తితో, సందర్భానుసారముగా, దైవఫలస్వరూపమును మార్చి కొంతలో కొంత హితకరముగా అనుభవించుటకు వీలున్నది. కాని, దీనికి గొప్ప సంకల్పశక్తి, మహత్తరసంస్కారము, కావలసియున్నది."

అని ఉపన్యసించి అతడు తూష్ణీమాగెను. అతని సమన్వయశక్తి చాలా రమ్యముగా నుండినది. సంతోషించితిమి.

"ఈ విషయమున తమ అనుభవము లున్నచో, వినుటకు కుతూహలము కలదు" అంటిని.

“ఆవశ్యకముగా మనవి చేతును. మునుముందు రానున్న దశాస్వభావమును గమనించి, దానికి ఏ స్వరూపమున్నచో హితమో, ఊహించి, తగినరీతి పురుషకారము జరుపుటే నా అభ్యాసము. చలికాలము రానున్నదనగా, ఉన్నిగుడ్డలు సిద్ధము చేసుకొందుము కదా? దైవము నెదుర్కొనుటకై పురుషకారము చేయు సన్నాహము ఇదికాక మరిఏమి? జాతక శాస్త్రమువలన మనకు కలుగు ప్రయోజనమింతే. భవిష్యత్తులో ఎప్పుడేమి జరుగవచ్చునో, ముందుగా తెలుసుకొని, దానిని అనుభవించుటకు కన్నులుమూసుకొని కాచుకొని యుండవలెనని కాదు. నా ఇప్పటి జీవితము సహా దీనికొక గొప్ప ఉదాహరణము. విసుగు లేనిచో, వినవచ్చును.”

“అంతకంటే భాగ్యమా?” అని నా ఆత్రత వెల్లడించితిని. ఆ మహనీయుడు తెలిపిన ఆత్మకథ సావధానముగా విని సంతసించితిని. సంగ్రహముగా అందలి ముఖ్యాంశము లివి.

అయోధ్యానగరప్రాంతమందలి ఆభిజాత్య కుటుంబమున జనించిన శ్రోత్రియబ్రాహ్మణు డతడు. చిన్నవాడే తండ్రియొద్ద సంస్కృతకావ్యములను పఠించి, జ్యోతిశ్శాస్త్రములో ప్రవేశము నార్జించి, తరువాత ఆంగ్లభాష నభ్యసించి పట్టభద్రుడై, దొరతనమువారి కార్యస్థానములో చిన్న ఉద్యోగిగా చేరి, అతడు జీవితమును కడపుచు వచ్చినాడు. అయిదు సంవత్సరముల క్రిందటి వంద రూప్యములు వేతనముతో తాలూకా కార్యాలయములో గణకాధ్యక్షుడుగా అతడు పనిచేయుచుండెను. అప్పటి కతని వయస్సు ఏబది. ప్రాతకాలపు తెల్లదొరలకు వంగి సలాములు కొట్టి పూలమాలలు వేయుటకు, వారి దొరసానుల దాసీజనమునకు ఉపాయనము లర్పించి ఆశ్రయించుటకు, తగనమున సత్త్వము లేమిం జేసియు, కొంతమట్టుకు స్వతంత్రాభిప్రాయములు కల ఖండితవాది యగుటం జేసియు, సర్వసాధారణముగా రావలసినట్టి ఉద్యోగాభివృద్ధి అతనికి రాలేదు. ఉన్నంతలో తృప్తిపడు స్వభావముతో, ఆ విషయమున అతడు ప్రయత్నించినవాడు కాడు. చిన్న వయస్సులో అతనికి ఇరువురు కుమారులు, ఒక కూతురును కలిగిరి. తరువాత అనుకూల పతియగు అతని కులకాంత అనారోగ్యముతో కొంత కాలము బాధపడినది. ఆమె జాతకమున పంచమభావమునకు ప్రబల శనివేధ సిద్ధమగుచుండుట గమనించి, మరల గర్భధారణ సందర్భము వచ్చెనేని, ప్రమాదకారి కావచ్చునని నిర్ధరించి, బ్రహ్మచర్యమును సాధించుటకే కృతనిశ్చయుడై, ఇంద్రియనిగ్రహమునకు అనుకూలించు ఆహార విహార నియమములను అనుష్ఠించుచు, మంత్ర జపాదులను అతడు సాధించుచు రాసాగెను. తరుణియగు అతని భార్యకు ఈ దీక్ష ప్రారంభములో కొంత కష్టముగా చూపట్టినది. కాని, తగిన ఉపదేశము వలన భర్తృదృష్టాంతమువలన ఆమె సహా క్రమముగా ఆ దీక్షను అలవరచుకొనగల్గినది. శనివేధకు మార్గాంతరము చూపుటకే యీ యుక్తి. భార్యకు ఆరోగ్యము చక్కబడినది. ఆధ్యాత్మికజ్ఞానము విస్తరించినది. సకాలములో కూతురునకు, కుమారులకు సహా వివాహములు జరిపినా రా దంపతులు. తగినవిద్య నార్జించి కుమారులు వృత్తిలో ప్రవేశించి తమ కుటుంబములతో హాయిగా నున్నారు. అల్లుడు యోగ్యతకల న్యాయవాది అగుటచే, కూతురు జీవితము రమ్యముగా సాగుచున్నది. సత్సంతానసౌభాగ్యము వారందరకును కలదు. అగుటచే, యీ దంపతులకు సాంసారికముగా తొందరలు లేవు. ఉన్నంతలో తృప్తులై సుఖముగా కాలము గడుపుచుండిరి.

ఇట్లుండగా 51 వ సంవత్సరపు వయస్సునుండి మూడేండ్లు రవి శని వేధ, తరువాత రెండు సంవత్సరములు రవి వరుణ వేధ, క్రమముగా తన జాతకమునకు రాగలదనియు, ఆ కాలమందే భార్య జాతకమున లగ్నమునకు వరుణ సప్తక వేధ, రవికి అష్టమాధిపతినుండి కేంద్ర వేధ, సిద్ధమగుననియు, ఆ శాస్త్రజ్ఞుడు మునుముందే గమనించినాడు. అప్పుడే తన సంతానమునకు సహా క్రూరదశలు చూపట్టినవి. తన లగ్నమునకు మాత్రము చక్కని గురుదృష్టి యుండుటచే, తన ఆయుర్దాయమునకు భంగము లేదనియు, కుటుంబవియోగము తప్పదనియు, అతడు నిర్ధరించుకొన్నాడు. ఆలోచించి, ఆలోచించి ఈ దుష్టదైవఫలమునకు స్వరూపాంతరమును కల్పింప సంకల్పించినాడతడు. ఏబదియొకటవ యేట తటాలున ఉద్యోగమును చాలించుకొని, ఉపకార వేతనము సంపాదించుకొని, కూతు నింట కొన్నాళ్లు, కుమారుల ఇండ్లలో వరుసగా కొన్నాళ్లు, విశ్రాంతిగా భార్యతో కాలము కడపినాడు. ఎవరికి కాని, ఏమాత్రమైనా సందేహము కలుగకుండు

వటుగా జాగరూకతతో ప్రవర్తించుచు, తగిన దిన మొకటి చూచుకొని యుండి, చేర్చి పెట్టుకొని యుండిన రెండువేల రూప్యములను భద్రపరచి తీసికొని, ఇతరులకు తెలియకుండ ఆనాటి అర్ధరాత్రమున కట్టుగుడ్డలతో ఇలు వెడలి, రైలులో హుటాహుటి ప్రయాణముచేసి నేరుగా హరిద్వారము వచ్చి చేరుకొన్నాడు. సాధువుల గుంపులో చేరుటకు వలసిన వేషాదులను సంతరించుకొనుచు, వారముదినము లచట నిలిచియుండు కాలములో, వార్తాపత్రికలలో అతని ఆకస్మిక కాంతర్ధాన కథ ఛాయాచిత్రముతో కూడ ప్రకటించబడినది. తన్ను గూర్చిన సమాచారమును తెలిపిన వారికి అయిదువందల రూప్యముల బహుమతి ఇత్తుమని తన భార్యాపుత్రులు చేసిన ప్రకటనమును, ఏ అపరాధముండినా క్షమించి ఇంటికి తిరిగి రావలయునని అత్యంత వినయముతో వారు తనకు వ్రాసిన విన్నపమును, వార్తాపత్రికలలో చూచిన అతనికి గొప్ప పరితాపము కలిగినది. కాని, వియోగబాధ ఉభయులు అనుభవించుట వారి శ్రేయస్సు కొరకే అని నెమ్మదిపడినాడా ధీరుడు. తగిన వేషమును సంతరించుకొని బైరాగులలో చేరి కొన్నాళ్ళలో బయలుదేరి, బదరికాశ్రమము చేరుకొని. కొంతకాలమందుండి అతడు బ్రహ్మకపాలము, కేదారక్షేత్రము, గంగోత్రి, మానసరస్సు కైలాసము, మొదలగు దివ్యక్షేత్రముల వెంట తిరుగుచు మూడు సంవత్సరములు (శనివేధా కాలము) హిమాలయములలో కడపినాడు. తరువాత హిమాచలము వదలి భారతదేశమందలి నానా పుణ్యక్షేత్రములను సందర్శించుచుండగనే నాలవయేడు కడచినది. ఐదవ సంవత్సర మిది. గడువు సమీపించుచున్నది. కనుక ఆరు నెలలలో దక్షిణయాత్ర ముగించుకొని, తిరుపతి, కంచి, చిదంబరము, శ్రీరంగము, మధుర, రామేశ్వరము, ధనుష్కోటి, క్షేత్రములు సేవించి, కన్యాకుమారిని పూజించి, దశాకాలము (గురుణవేధ) ముగియగనే, నేరుగా రైలెక్కి ఆకస్మికముగా తనవారిని చేరుకోవలెనని అతని సంకల్పము. శుభదశా కాలమును ఈ రూపముగా మార్చుటవలన, తనవారికి ఇతరవిధముగా క్లేశము రాకుండనుండవలెనని అతని ఆశ. కొంతకాలము వియోగక్లేశ మనుభవించినా, తుదకు మోదాంతముగా పరిణమించునని అచంచలవిశ్వాస మతనిది. ఏకాకిగా తిరుగుట, స్వజనవియోగము, ద్రవ్యాభావము, ప్రయాణక్లేశము. మొదలుగా అతడు సయితము కష్టము లనుభవించినా డనుట వాస్తవమే. కాని యీ యాత్రలో అనేకములగు యోగులను ఆశ్రయించుటవలన, చిత్తశాంతి లభించుటే కాక, సులభచికిత్సలు, యోగాసన ప్రక్రియలు, జనోపయోగములగు అనేక మంత్ర రహస్యములు, మొదలగు విద్యలు కొన్ని సులభంగా అతనికి లభించినవి. ఆరోగ్యము, దేహదార్ఢ్యము, చక్కగా నున్నవి. ఆయా నగరములలో ఏ గృహస్థుని ఇంటనో విడిసి, వైద్యమువలన కాని, జ్యోతిషమువలన కాని, అడిగినవారికి ఉచితముగా ఉపకరించుచు, నగరాంతరము చేరుటకు వలసినంత ద్రవ్యమును ఏ దాత నుండియో స్వీకరించి ముందు ప్రయాణము సాగించుట అతని కార్యక్రమము. ఎల్లుండి తిరుపతికి వెళ్ళ గలడట!

అత్యాశ్చర్యకరమగు ఆ మహనీయుని ఆత్మకథ విని ఆనందముగ్ధుల మైతిమి. అతని సంస్కృతి, శాస్త్ర జ్ఞానము, తపశ్శక్తి, మనోదార్ఢ్యము, నిరుపమానములు. కృతజ్ఞతతో వందనము లర్పించి 11 గంటలకు ఇల్లు చేరుకొంటిమి.

ఇట్టి దృష్టితో ఉపయోగించినపుడే జాతకము మానవులకు ప్రయోజనకారి యనుభావము అప్పటి నుండి నాకు బలపడినది. ఓపికకొలది, నిదర్శనములు కొన్ని సంపాదించితిని. వానిలో, ఒకటి రెండు మాత్రము పాఠకమహాశయులకు నివేదింతును.

1943 వ సంవత్సరములో ఒకనాడు ఉత్తమ కక్ష్యకు చెందిన గొప్ప రాజకీయోద్యోగి యొకడు నా ఎరిగినవారితో పరిచయపత్రము నొకటి సంపాదించుకొని నాకడకు వచ్చెను. యోగ్యతానుసారముగా, అతనిని గౌరవించి, అతిథి సత్కారము జరిపి, అతడొక్కింత విశ్రాంతినందిన తరువాత, అతని కార్యభార మేమో, ఏ రీతిగా అతనికి నేనుపకరించ గలనో, తెలియగోర ప్రశ్నించితిని

"నేను గొప్ప కష్టములో నున్నానండీ! నా జాతకము చూచి తగిన సలహా ఇత్తురను ఆశతో వచ్చితిని."

అని చెప్పి, తన జాతకమందలి నిచ్చినా డతడు. దానికి నేను సిద్ధపరచిన సాయనచక్ర మిది:

| | | | |
|---|---|---|---|
| బు 12-20<br>శు 7-19 | ర 1 17<br>రాజ్య 2-20<br>కే 16-51<br>I 22-4<br>శ 28-18 | ప్రేమ 19-5 | య 17-43 |
| పుణ్య 13-48<br>శ 6-42 | (సాయనము)<br>—<br>జాతక చక్రము | | ఇ 0.50<br>వివాహ<br>13-40 |
| చ 23-0<br>X 16 58<br>భార్య 13-40 | | | |
| వ 25-36 | | కు 9-47(వ)<br>రా 16-51 | |

సూచన :—

విద్యార్థులకు వలసిన సామగ్రి అంతయు ఈ చక్రమునందు కలదు. కనుక, జన్మదిన, జన్మకాల, జన్మస్థానాదులను ప్రత్యేకముగా ఇచట పేర్కొనలేదు. చదువరులు క్షమింతురుగాక.

లగ్నములో ధనాధిపతి శుక్రుడు, దశమ కేంద్రములో చతుర్థాధిపతి చంద్రుడు, పుణ్యసహమములో చేరి స్వక్షేత్రమగు లాభస్థానములో దశమాధిపతి శని, కల ఈ జాతకుడు గొప్ప అదృష్టశాలియై, అభివృద్ధికరమగు ఉన్నతోద్యోగములలో నుండగల్గుట విశేషము కాదు. దశమాధిపతితో మిత్రదృష్టికలిగి, మేషరవి సంయోగమందున్న రాజ్యసహమము సైతము పైయర్థమును బలపరచుచున్నది. ప్రశాంతకోమల హృదయము, దయాదాక్షిణ్యశీలత, లలితకళారసికత, ధారాళస్వభావము, సౌజన్యదృష్టి, జాతకునికి కలవని పైగ్రహములు సూచించగలవు వివేచనాపరత, నిష్కల్మషహృదయము, త్యాగశీలత, అనునవి బుధ గురు కేంద్రయోగమువలని ఫలము. శుక్ర కేతువుల నడుమునున్న లగ్నమునకు చంద్రదృష్టి యుండుట ఆకారసౌష్ఠవము సామాన్యమగుటకు కారణము కాబోలు? నిరంతరహాస్యముఖము, సౌజన్యము తొలుకాడు విశాలనేత్రములు, మృదుమధురసల్లాపధోరణి, అతని ముఖమునకు సహజమైన అలంకారము

అది యట్లుండె. దేవమానదశలో అప్పటికి చలిత దశమ కేంద్రము వరుణుని మిత్రదృష్టిలోనుండి వెలువడి శుక్రుని స్నేహదృష్టిని అందుకొనుచున్నది. దశమాధిపతి శనిచలించి లగ్నాధిపతియగు కుజునితో పరిపూర్ణ త్రికోణ శుభదృష్టిలో నుండెను. అందుచేత ఉద్యోగగౌరవములందేమి, ఆర్థిక సౌభాగ్యమునందేమి, శుభదశలు జరుగుచుండుటచే, ఆ విషయములలో అతనికిపుడు అలజడి కలుగుట అసంభవము. చలితలగ్నమునకు కాని, దశమమునకు, కాని ఏ వేధయు చూపట్టదు.

మరి ఇతని క్లేశమునకు కారణమేమి?

జాతకములో గొప్ప లోపమునదగిన యోగమొక్కటియున్నది. కర్కాటకములో తృతీయభావమందున్న ఇంద్రునినుండి వ్యయభావములో నున్న మేషునికి నిండు కేంద్రవేధ కలదు. ఈ గ్రహములు రెండును ఆపోక్లిమస్థానములలో నుండుటచే ఈయోగముయొక్క దుష్ఫలము వ్యక్తిగుణముల నంటక పరిస్థితులవలన కలుగు అవ్యవస్థ, ఆందోళనము తెలుప కలదు. సోదరులనుండియో బంధువులనుండియో లేక ఇరుగు పొరుగు వారినుండియో, ఇబ్బందులు కలుగవచ్చును. అనవసరముగా అ ప నిం ద లు రావచ్చును. జాతకుని దయాళుత్వమును, దాక్షిణ్య స్వభావమును ఇతరులు దుర్వినియోగపరచుట అసంభవము కాదు. క్లేశము ఫలమగును.

చతుర్థ (గృహ) భావాధిపతి యగు చంద్రునికి గురువునుండి అర్ధకేంద్రవేధ వ్యయభావమునుండి వచ్చుచున్నది. ఇట్టిపరిస్థితులు అధికవ్యయమునకు కారణము కావచ్చును.

కాని, ఈ యోగము లితనికి జన్మసిద్ధములు. ఇపుడే వీనికి వచ్చిన ప్రత్యేకత ఏమియు చూపట్టదు.

చలితచంద్రుడిపుడు నాల్గవ భావములో సంచరించుచుండుట. జన్మ చంద్ర శుక్రుల వేధను కడచి ఈ చంద్రుడు శనివేధకు పోవుచున్నాడు. క్లేశమేదయినా, అది ఇంటి పరిసితులకు సంబంధించి యుండగలదు వేరేమీ చూపట్టదు.

“ఉద్యోగాదులలో దోషము కానరాదు. మీకు మనః క్లేశము కలిగించు పరిస్థితులున్నచో, అవి గృహకృత్యములకు సంబంధించియుండునని తోచుచున్నది” అంటిని.

“భగవంతుని దయతో ఉద్యోగాదులలో నాకు ఏమీ అతృప్తికాని, ఇబ్బందులుకాని, ఇప్పటివరకు

లేవు. నాఇల్లే నాకు ప్రత్యక్షనరకము. దాచుట ఎందుకు? నా భార్య గయ్యాళిగంప! ఆమె పోరు పడ లేక జీవితము దుర్భరమయినది. ఇదే నాగోడు." దీనముగా అతడు ప్రతి ఇచ్చెను

"కళత్రస్థానములో రాహుకుజులున్నారు. మీ భార్య అభిమానశాలిని, సమర్థురాలు, కోపశీల, కావచ్చును."

అని, క్షణమాగి, మరల, "లగ్నాధిపతి సప్తమ భావములో నున్నాడు.

'సప్తమే లగ్నపే భార్యా
దేశకారీ పతిర్భవేత్.'

అను న్యాయము ననుసరించి, ఆమె ఇష్టాను సారము మీరు వర్తించవలసియుండును." అని పలికితిని.

"ఆమె ఏమి కోరినా, ఎంత నష్టమైనా, చేయుటకు సర్వదా సిద్ధమేనండీ! కంకిం అనక చేయగలను. కాని, చేసినా తప్పు, చేయకపోయినా తప్పు. మాటలాడితే తప్పు, ఊరకుంటే తప్పు. ఇంటిలో ఉంటే తప్పు, బైట పోతే తప్పు! భరించ లేకున్నాను.

"సంతానము?" అంటిని.

"ఆరుగురున్నారు. పెద్దకూతురు పెండ్లికి సిద్ధముగ నున్నది. కుమారులు చిన్నవారు. వారినిచూచి ఇంత కాల మోర్చినాను. కానిచో స్త్రీహత్యాపరాధమునకై ఎప్పుడో ఉరికంబము నెక్కియుందు నేమో?

ఆ పెద్దమనుష్యుని మాటకు చకితుడనైతిని. పరిస్థితి ఎంతో ఘోరముగా, ప్రమాదకరముగా, ఉన్నదని స్పష్టమైనది. కాని, అతని దశలలో క్రూరమైనవి ఏమీ చూపట్టవు. భార్య జాతకములో ప్రబలమగు దుష్టదశలు ఏర్పడి, ఆమె గ్రహములలో ఇతని గ్రహములకు క్రూరవేధ ఇపుడు వచ్చి యుండనిచో, ఇట్టి స్థితి వచ్చుటకు అవకాశము లేదు.

"మీ భార్యగారి జాతక మున్నదా?" అని అడిగితిని.

"ఉన్నది. ఇరువదియొక్క గుణములున్నవని, దోషసామ్యమున్నదని, మహాయోగజాతకమని, ఏమేమో చెప్పి నా కొంప కూల్చినారు."

అని జాతక చక్రమొకటి ఇచ్చెను. దానికి సాయన చక్రమిది :—

| | | | |
|---|---|---|---|
| I 28-51<br>రా 28-24 | చ 19-44<br>వివాహ<br>29-42 | | కు 15-7<br>కే 16-44 |
| వ 4-40(వ) | (సాయనము)<br>—<br>భార్య<br>జాతకము.<br>— | | యు 0-47<br>శు 17-35<br>ఇ 26-56 |
| శ 8-19 (వ) | | | బు 9-46<br>ర 27-55 |
| X 29-8 | పుణ్య 20-40<br>భర్త 23-30 | | కే 25-24 |

లగ్నదశమాధిపతి గురువు దశమ కేంద్రములో, పుణ్యసహమము భర్తృసహమముతో చేరి భాగ్యభావములో, పంచమాధిపతి చంద్రుడు స్వస్థానములో, కల జాతకురాలు గొప్ప అదృష్టశాలిని అని చెప్పుటలో ఆశ్చర్యమేమి?

ఈమెను వివాహమైన అనంతరమే భర్తకు యోగము పట్టియుండరాదా? అతని దశమకేంద్రములో ఈమె బృహస్పతి, అతని లగ్నగతిశుక్రునికి ఈమె సింహ రవినుండి పూర్ణ త్రికోణ దృష్టి. అతని దశమ చంద్రునితో ఈమె భర్తృసహమమునకు నికరమగు అర్ధకోణ స్నేహదృష్టి! ఈ యోగములు వ్యర్థములు కానేరవు.

కాని, అతనికి క్లేశము కలిగించు కారణములను మన మిపుడు గమనించవలసియున్నది. ఈమె జాతకములోనున్న ప్రబల దోషములు రెండు నాల్గింట కుజశనిసంయోగ మొకటి! చలచల క్రాగుచున్న నూనెలో చన్నీరు పోయుట వంటి యోగ మిది. అందులో అది యుండుట చతుర్థ కేంద్రములో (గృహము, మనస్సు), క్షణములో మంటలుమింటి కెగయగలవు. జాతకురాలి మనోధర్మమునకు ఈ స్వభావమున్నది. కోపము చెలరేగినపుడు, తత్ఫలముగా తనకైనా, ఇతరులకైనా, కాయకష్టమో ద్రవ్యనష్టమో, కలుగవచ్చునను విషయము ఆమె బుద్ధికి స్ఫురించదు. ఇక, బుధ వరుణుల సమసప్తక వేధ

రెండవది. శక్తిగొప్పది. కాని, అది సద్వినియోగము చేసుకొను కౌశల్యము శశవిషాణప్రాయము. బుద్ధికి 'మురారిమార్గము'. ఇతరుల బుదినో, ఉపదేశమునో, అంగీకరించు సహనము, మృగ్యము. తలకుమించిన స్వాతంత్ర్యప్రీతి, శాఠ్యము, మొరకుపటు, ఇవి సామాన్య ఫలములు. విశేషమేమనగా, జాతకములో చతుర్థ, సప్తమభావముల కధికారి బుధుడు. గృహ కృత్య విషయములలో, భర్త విషయములో, ఈ బుధ వరుణ వైషమ్యము ఫలించవలయుననుట! కొరవితో తలగోకుకొన్నట్లుండును ఈమెతోడి వ్యవహారము. ఇట్టి స్వభావముతో ఈమె భర్తను క్లేశపెట్టుటేల వింత?

కాని, ఇవన్నియు జన్మకాలికయోగములు. ఈ స్వభావము ఆమెకు అజన్మసిద్ధమైనది. పదునాగు సంవత్సరములకు పైగా భర్తతో సంసారము చేసినది యీ కుటుంబిని. సత్సంతాన సౌభాగ్యమున్నది. ఇంతకాలము ఈమె స్వభావమును సహించి నెమ్మదిగా కడపిన భర్తకు ఇప్పుడీ అసహన మేల?

భార్యాభర్తల జాతకములను కొంత పోల్చి చూడుము. అన్యోన్యముగా వీరి రవి చంద్రులకు స్నేహ దృష్టిలేదు. కనుక, ఈ దాంపత్యబంధములో భక్తికి ప్రాధాన్యము లేదు. కాని పరస్పరముగా ప్రబలాకర్షణ మును వీరికి సంతరించుటకు కొన్నియోగము లేర్పడినవి.

(I) భర్త శుక్రునిపైన భార్య వివాహసహమము;

(II) భర్త రవినుండి, భార్య వరుణునినుండి, పైశుక్రునికిని, వివాహసహమమునకుసహా అనుకూల త్రికోణ దృష్టి;

(III) భార్య పంచమాధిపతి చంద్రుడు భర్త లగ్నమునకు వచ్చుట;

(IV) భర్త చతుర్థభావ బిందువుపై ఆమె శుక్రుడు;

(V) భార్య పంచమభావమందలి శుక్రునితో భర్తృ ప్రేమసహమమునకు శుభదృష్టి;

ఈ యోగముల ప్రాబల్యమున, భార్య స్వభావములో కార్కశ్యముండినా, కోమల స్వభావుడగు భర్త సహించుకొని, ఆమె ఇష్టానుసారముగ ప్రవర్తించుచు వచ్చినాడు. అథవా, ప్రమరాగమాధ్వీరసానుభవకాలములో అందందు చూపట్టిన ఆమె పిచ్చిచేష్టలు, శ్రీనాథ కవిసార్వభౌముడు సెలవిచ్చినట్లు,

"ఇక్షురసంపు పానకములో,
మిరియపుకారంబుబోలె"

రుచికరముగా గానవచ్చి యుండును.

కాని, దేవమానదశలో అప్పటి వయస్సునకు భార్య జాతక గ్రహములనుండి ప్రబల దుష్టదృష్టియోగములు భర్త జాతకగ్రహముల కేర్పడినవి. అందుచే, ఆ సాధుశీలుడు భరింపలేనంత గయ్యాళితనము, శాఠ్యము, భార్య స్వభావములో ఇపుడు కానవచ్చినవి. అణగని ఆణిముత్యమైనది భార్య. భర్త క్లేశపడక ఏమి చేయగలడు.?

"మూడు సంవత్సరములనాడు మీకు పరస్పరముగా ప్రబల దుష్టదశ లారంభమైనవి. ఇంకా కొంత కాలము మీరు ఓర్పుకోవలసియుండు నేమో?" అంటిని.

"నేను సహించినంత, ఓర్పుకొన్నంత, ఏ యుగములో, ఏ మానవుడైనా, సహించి, ఓర్చియుండడు. నాకష్టములు విన్నచో, మీరిట్లు చెప్పియుండరు. వినండి."

అతడు తన పురాణము చెప్పుచుండగా, ఆశ్చర్యముతో వింటిని. దాని సంగ్రహమిది.

అతనికి తమ్ములు కలరు. ఏక కుటుంబము. తోడి కోడండ్రపైన అనుక్షణము స్వారిచేయుట ఇతని భార్యకు బాగా అలవాటైనది. స్వతంత్ర జీవనమునకు చాలినంత సంపాదనము తమ భర్తలకు లేకపోవుటం జేసియు, వయస్సులో చిన్నవారగుటంబట్టియు, అవ లేక, అనుభవించలేక, వారు పడుచున్న బాధలు చూచి, చూచి, సహించక దయాశాలియగు జాతకుడు రెండు మూడేండ్లకు పూర్వము తన భార్యతో వేరు కాపురము పెట్టి, సోదరులకు నెలనెలకు ద్రవ్యసాహాయ్యము చేయుచువచ్చినాడు. అతని భార్య ఈ దయాశాలిత్వమును సహించ లేకపోయి భర్తను తీవ్ర విమర్శనకు గురి చేసినది. ఏమైనా, సోదరులను నిరాదరించలే దతడు. భార్యకు అతృప్తి హెచ్చినది. ఏకకుటుంబములో పనులన్నియు తోడికోడండ్రు నిర్వహించుకొని పోవుచుండగా, వారి నెత్తిపాకుచుటకుమాత్ర మలవాటుపడిన భార్యకు స్వంత కాపురము నిర్వహించుట కష్టమై, వేరుకాపురము పెట్టినందుకు..భర్తను తూల

బాధుచు వచ్చెను. వంటవార్పులకు, పైపనులకు, పనివారి నేర్పరచినా, క్లేశము తప్పలేదు. ఆమెగోల భరింపలేక, వంటవాడు మూడుదినములకు, పనికత్తె వారమునకు కొలువు చాలించుకొని, కూలి సయితము తీసుకొనక పలాయనమైరి. క్రొత్తవారిని వెదకి తెచ్చినా, వారు సయితమంతే. తగినపనివారిని సంపాదించు యోగ్యత లేదని ఎత్తిపొడుపు. పనివారిని సంపాదించుట అసాధ్యముకాగా, హోటలునుండి భోజనము తెప్పించుకొను ఏర్పాటుచేసినాడు భర్త. కాని, తిండి బాగుగాలేదని మూడు మూడుదినముల కొక హోటలు మార్చవలసి వచ్చినది. కోపమా, చెప్పనలవి కాదు. ఆక్రోశము వర్ణనాతీతము. మంచి మాటలు చెప్పినచో, మంటలో నేయిపోసినట్లే! దండించినా వ్యవహారము బజారున కెక్కగలదు. కోపము వచ్చినపుడు, (అది రమ్మన్నచో రాగలదు) ఏపదార్థము చేతికి దొరికినా, సర్వనాశనమే. సమీపమందు పసిపిల్లలున్నచో నేలపైబడి విలవిల తన్నుకొనురీతిగా వారిని బాదుచుండగ చూచి సహించుట అసాధ్యము. ఇరుగు పొరుగువారు సమాధానము చెప్పవచ్చినచో, వారికి ఆయువు మూడినట్లే. బంధువులు వెరచి ఇంటికి రారు. స్నేహితులు దూరమైనారు. ఇరుగు పొరుగులవారితో రామరావణయుద్ధము. సంఘములో తలఎత్తి తిరుగుట అవమానమైనది. పుట్టినింటికి వెళ్ళుమంటే వెళ్ళదు. పిలుచుకొనిపోయి విడిచివచ్చినా మరుదినమే తిరిగి వచ్చును. జీవితము దుర్భరమైనది. వారముదినములు వెనుక నొకనాడు అనవసరముగా కుమారుని వాతలు పడునట్లు కర్రతో బాదుచుండగా చూచి ఓర్వలేక రివాల్వరు తెచ్చి కాల్చుటకు సిద్ధమై, కారుబోరు మనుపసికందులను చూచి మానుకొన్నాడట! ముందేమో!

చలితదశలో భార్య రవి భర్త కుజునిమీదికివచ్చినాడు. ఆమె బుధునికి భర్త చలితశని సమసప్తకము; చలిత చతుర్థము ఇంద్రుని సంయోగములోనున్నది. ఆమె చలితలగ్నము వరుణుని కేంద్రవేధకు పోయినది. భార్య చలితశని భర్త చలిత శుక్రునితో సంయోగము. భర్త చలిత పుణ్యసహమము భార్య జన్మయమునికి కేంద్రము. భార్య చలిత వరుణునితో భర్త చలిత శుక్రుడు సార్ధకేంద్రము. భర్త చలితకుజుడు భార్య చలిత వరుణునితో సార్ధకేంద్రము!

ఏమి యుద్ధమిది! ఇంకను కొన్ని కలవు. కాని, జరుగుచున్న కథకు ఈ దశలే చాలు. వాస్తవముగా అతని అవస్థ దయనీయమైనది. పాపము!

"ఇంకా అధమపక్షము తొమ్మిదిమాసములు దుష్టదశ లుండగలవు. ఈ కాలములో మీరు ఒకరికొకరు దూరముండుట మంచిది. లేనిచో, దశావసాన కాలము సన్నిహితమగు కొలది, ఎవరికైనా అత్యాగ్రహము కలుగవచ్చును. ఏదుష్పరిణామమయినా సాధ్యమే."

"అది నా పరిస్థితులలో సాధ్యముకాలేదు కదండీ?"

"ఒక యుక్తిచేయుండి. హిమాలయప్రాంతమునకు మీ ఉద్యోగమును మార్పు చేయించుకోండి. స్త్రీలు పిల్లలు నివసించుటకు వీలుకాదను నెపమున కుటుంబమును వదలి వెళ్లవచ్చును. దుష్టకాలము తీరిన తరువాత మరలిరావచ్చును." అంటిని.

"సరే! ప్రయత్నించవచ్చును. కాని నేను లేని కాలములో బిడ్డలగతి ఏమగునో అని భయము."

"ఆభయము అవసరము లేదు. సంతానమునకు చెరుపు కలుగు దశలు లేవు. నిర్భయముగా వెళ్లవచ్చును."

"అప్పుడు ఈ దశల ఫలమేమగును?" అతని సంశయమిది.

"మీరు లేరే అని, ఆమె వ్యసనపడుచు, మీపైన కోపముతో పండ్లు కొరకుట, చిరంజీవులను తలచుకొని మీరు ఖేదపడుట, ఇంతటితో ఫలము చెల్లిపోగలదు."

అతనికి నచ్చచెప్పితిని. ఆ పెద్దమనుష్యుడు కొంత తృప్తిపడి స్వస్థానమునకు వెళ్ళినాడు. తరువాత రెండు నెలలలో ఏదో ప్రయాసపడి మార్పు సంపాదించుకొని వెళ్ళుచు మార్గమధ్యమున నా ఇంట ఒక పూట విడిసి పోయివత్తునని చెప్పి ప్రయాణము సాగించెను. ఆరేడు మాసములు దాటినతరువాత మరల స్వస్థానమునకు ఉద్యోగమును మార్పించుకొనివచ్చి అతడు తన కుటుంబమును చేరుకొనగలిగెను. దుష్టదశలు కడచినవి. భార్యలో అప్పటి ఉద్రిక్తస్థితి తగినది, స్వభావము మారలేదు కాని, సహ్యముగా తరువాతి కథ నడచుచువచ్చినది. అతడును తృప్తితో కాలము వెళ్ళబుచ్చుచున్నాడు. అట్టి తొందరలిప్పుడతనికి లేవు.

## జాతక శాస్త్రప్రయోజనము

ఒకప్పుడు ఒకానొక కుటుంబమునకు గొప్పక్లేశము వచ్చినది. భర్త జాతకమందలి పాపగ్రహములతో ఆమె జాతకమందలి క్రూరగ్రహములకు దేవమానదశలలో పరస్పరవేధ వచ్చియుండిన కాలమది. భర్త స్వభావములోనున్న అఖండకల్యాణగుణములు కొన్ని మితిమీరిపోవుచుండు కతమున ఆ గృహిణి సహించుట అతికష్టమగుటచే ఆ విషయమున భర్తను మందలించుచు, తత్ఫలముగా వీరావేశమువచ్చిన భర్తనుండి ఆమె నానాప్రకారముగా శారీరక మానసిక బాధలనుభవించుట దినచర్యగా నుండినది. ఆ సీమంతిని ప్రార్థనచే వారి జాతకములను చూడవలసి వచ్చినది. అప్పటికి పండ్రెండు నెలలకు కాని, ఆ దశలు తీరిపోవనియు, గడ్డుకాలము రానున్నదనియు, గమనించితిని. ఈ దశాకాలమును భర్తకు దూరముగా పోయి వియోగముతో కడపవలెననియు, చేతిబిడ్డను తప్ప ఇతరుల రక్షణభారమంతయు భర్తపైననే వదలి వెళ్లుటే కాక, భర్తలేఖలకు ప్రతిసహా వ్రాయకూడదనియు చెప్పితిని. శాస్త్రవిశ్వాసము కలదగుటచే, వారముదినములలో ఆమె వెడలిపోయి దూరప్రాంతమందలి బంధువుల ఇండ్లలో సంవత్సరము కడపినది. దశాకాలము ముగియగనే, అంతదనుక బిఱ్ఱబిగిసియుండిన భర్త మెత్తబడి ఆమెయున్న స్థలమునకేపోయి ప్రాధేయపడి, తనమార్గములు కొన్ని ఆమెకు హితకరముగా నుండునట్లు మార్చుకొందునని ప్రమాణములు పలికి, సమాధానపరచి ఆమెనింటికి పిల్చుకొనిపోయినాడు. అతని స్వభావములో గొప్పమార్పువచ్చినది—అనగా, భార్యకు సహ్యముగా నుండునంత మార్పనుట. వారి కుటుంబములో ఇపుడు శాంతి, తృప్తి నెలకొనియున్నవి.

భార్యాభర్తల విషయములో ఇట్లు వియోగమును ఉపదేశించుట భావ్యమా! అని ఆక్షేపించువారుందురు కాబోలు! ఆవియోగము ననుభవించిన భార్యాభర్తలే ఈప్రశ్నకు సదుత్తరము చెప్పతగినవారు. ఒక్క మనవి. సాన్నిధ్యము విషమయినపుడు, వియోగము తగినమందు ఏల కారాదు? వ్యాధిస్వభావము ననుసరించి కొన్ని సందర్భములలో విషము నయితము ఔషధరూపమున అమృతమగుననుట పాఠకమహాశయులు ఎఱుంగని విషయము కాదు.

వియోగము వాస్తవముగా క్లేశప్రదమే. గడ్డుకాలములో ఆక్లేశమును కొంత సహించినచో, జీవితము బాగుపడుసందర్భములలో, దానిని దోషమన నేల?

"నస్వల్పస్య కృతే భూరి,
నాశయే న్మతిమాన్ నరః,
ఏతదేవహి పాండిత్యం,
యత్ స్వల్పాద్భూరి రక్షణం."

అని కదా పెద్దలు చెప్పిరి?

వేటూరి—
సుందరశాస్త్రిగారి
సువర్ణసుందర రసము
సర్వమేహములకు సంజీవి.
గుణము ప్రత్యేకము
అనుభవసిద్ధము. ఇంజెక్షన్లు అవసరం లేదు. ఎటువంటి నవామేహాలనైనా కుదుర్చును.
50 మాత్రలు రు. 5.
ఆర్షరసాయనశాల, ముక్త్యాల.

# ఊహాకలాపం

## శ్రీ యస్వీ జోగారావు

అదియొక సుఖస్వప్న సుముహూర్తము !
ముహుర్ముహు రీహోదోహాల
మధురోహా మహావర్తము !
అదివివిక్త మహోరాత్ర మిహజీవిత
మహా యాత్ర కవిముక్తము !

* * *

అదిఅపూర్వశరత్పూర్ణిమా శర్వరీ పర్వ
సౌందర్య సర్వస్వధూర్వహాసర్వంసహా!
అదివిశ్రాంత తమిస్ర విధూదయ మృదూస్ర
వికస్వరవలాహకశకలైక ప్రకాశమాకాశము!
అదిఆకాశ విపులాతలాంచల విశాల
వివిధాశావకాశ పేశల
రాకాసుధాకరాలోకవ్యాకుల
సలిలౌఘ దీర్ఘసమాసము సముద్రము !
ఆ సముద్ర తీరమ్మున
అదిగో యొక శివాలయము
అతి శిథిలము ! శివాలయము !
శిథిలాలయ సవిధమ్మున
చిత్తభవుని చితి రగిలిన
స్థాణ్వాశ్రమ స్మశానమ్ము
నా నదిగో యొక సమాధి !

* * *

ఆ చోట నావేళ అంభోధి అలలపై
గయ్యాళిగాలి వాహ్యాళికేళి-
ఆచోట నావేళ ఆకాశ వీధిలో
జాబిల్లి మొగిలు దోబూచులాట

* * *

ఆ సమాధి వేదికపై
ఆసీనుండై కవి యొక
డున్నా డున్మత్తుని వలె
మిన్నువంక కన్నిగిడ్చి-
కలనైనా కనిపించని
తన ప్రేయసి సాకీ ఆ
కాశం బన్నట్లు కటా
ఉన్నా డున్మత్తుని వలె
మిన్నువంక కన్నిగిడ్చి-
వెన్నెల కను సన్నలలో
వెలిమబ్బుల వెనుక నొదిగి
ఊహాల కందీ యందని
మోహనాంగి హొయలు దలచి
కావ్యాలాప కలాపము
కడుకొని చేయుచు పాపము
ఉన్నా డున్మత్తుని వలె
మిన్నువంక కన్నిగిడ్చి!
అపు డకస్మికముగ నల
చంద్రకిరణ మొకటి జారి
సంద్రములో పడి యక్కడ
నొక యల చెలరేగి విగు
ర్వించి విసరె నొక గాడుపు !

ఆశ్చర్యము !
కడలి బయల్వెడలినదో
చదలనుండి జారినదో
కాని యొకానొక లతాంగి
మేనంతా మేలిముసుగు
మేఘములో చంద్రరేఖ !
అదిగో తన కభిముఖముగ-
అడుగులు తడబడ
వడివడిగానవ్వడి లేకుండగ
నడచుచున్న దొంటరిగా !
ఆలో నొక అభీలాకారు
డతి క్రూరుడు
ముష్కర తస్కరు డతిదుష్కర
కార్యచికీర్షా ధుర్యుడు
కాంతడాసి కత్తిదూసి
నగలక్కడ పెట్టి మరీ
కదలు మనుచు బెదరించెను.
ఆ ధృష్టా ధరోష్ఠ
చటుల స్ఫోట నోద్భూతోద్ధుర
వాతవిధూతమై
మే బాసెను మేలిముసుగు!
అహో సహజ మహోరాశి !
లోకోత్తర రూపోజ్జ్వల !
తన ఊహా దాత్యూహ
వ్యూహములో
విరిసిన విద్యుల్లత !
తన ఆశాకాశములో
వికసించిన రాకాశశి !
అచ్చముగా తన ప్రేయసి !
గతచంద్రగ్రహణవేళ-

అతికామార్థాతురులై
అభిసారము, కాదు కాదు
వ్యభిచారము లాభ మనెడు
బంధుజనుల బాధరోసి
సంద్రములో సాగిరిన
చంద్రవదన ! జలదవేణి !

* * *

ఆ క్షణమ్మున అంగ మెల్లను
అక్షులుగ వీక్షించి యామెను
సొమ్ములుంచిన చొప్పు లేదని
తట్టలేదో తట్టినా యొక
ఆశ మెట్లును నాశమైనది
పొరుగు నేలను పొందరా దని
అనవడుచున్నాడు చోరుడు.
'అన్న కన్నగ ! ఆభరణములు
సున్న నీవిక తప్పకో'మ్మని
ఆమె యన్నది.
'ఏమి వగుసిది ! యేమి మన్నన !
ఏకతమ ఎలనాగ లెవ్వరు
నడికిరేయి పరాయి పురుషుని
పలుకరించెడి పాడిగా' దనె
వాడు గండర గండమిండడు !
'బావ పోసి బాకుగా కీ
రొండిలోపల రొక్కమున్నద?'
అన్నదామె మహాద్భుతమ్ముగ
అపు డకస్మికముగ నల
చంద్రకిరణ మొకటి జారి
సంద్రములో పడి యక్కడ
నొక యల చెలరేగి విగు
ర్వించి వినరె నొక గాదుపు !

శిథిలాలయ గర్భములో
శివు డొనర్చె సత్కారము!
సమాధిచాటున కలకల
నవ్విన దొక నృకపాలము!
కలవరపడి కల మెలకువ
నవధరించె కవీశ్వరుడు.
ఏరీ యీ నిశాచరులు
వామకర్మ వశంవదులు ?
అదుగో ఘోర విషాణము,
సమాధి సవిధమ్మున నొక
పటుకర్కశ పాషాణము!

అదిగో మరి అభిసారిక,
శిథిలాలయ శిల్పములో
శివుని వెనుక చిత్ర మనెడు
చిత్రభవుని పరిచారిక!
అవేమిటా ఊళలు ?
కడతేరిన కవిస్వామి
కడతేరని ముడి యూహాలు.
అదేమిటా సమాధిపై
చిత్రముగ శిలాక్షరములు ?
"భావకవి కట్టిన ఊహాకలాపములో
భామవేష మెప్పటికీ తెరవెళ్లదు"


# ప్రమాద రక్షణకు ప్రశస్తమైనది భీమా

ఎప్పుడు ఏ ప్రమాదం వచ్చేదీ, ఏ క్షణం ఎలా ఉండేదీ తెలియని ఈ దినాలలో
* అగ్ని * మోటార్‌కారు * కార్మిక నష్టపరిహారం * నౌక
* ఫయడిలిటి గ్యారంటీ మొదలైన భీమాలకు
మాతో సంప్రతించండి.

**యునైటెడ్ ఇండియా ఫైర్ అండ్ జనరల్**
**ఇన్సురెన్సు కంపెనీ,**

"బాంబే లైఫ్ బిల్డింగ్స్"
9, బ్రాడ్వే, మద్రాసు. 1.
Telephone: 4241, Telegrams: "UNIGEN"
బ్రాంచీలు:
విజయవాడ - బెంగుళూరు - బొంబాయి - కలకత్తా - న్యూఢిల్లీ - పాట్నా
కొలంబో - సింగపూరు - కోయంబత్తూరు - జాకార్తా.

# చిన్న సంసారం

శ్రీ పంతుల కృష్ణారావు

సాయంత్రం సత్యనారాయణ ఆఫీసునుంచి వచ్చేసరికి ఇంట్లో అతని తమ్ముడి భార్య శకుంతల కన్పించింది. ఆమెను చూడగానే సత్యనారాయణకి చాల వరకు ఆందోళన తగ్గింది. మూడురోజులనుంచి అతను ఆమెవిషయమే భార్య నడుగుతున్నాడు. వారం రోజులై శకుంతల రావడంలేదు. ఆమె రాకపోతే తమ్ముడూ భార్యా ఇంట్లో యేం ఇబ్బందులు పడుతున్నారో అన్న భయమే మొదట ఆవరిస్తుంది సత్యనారాయణని.

సత్యనారాయణ తమ్ముడు ఆ ఊళ్ళోనే ఒక కర్రల డిపోలో గుమస్తాగా పనిచేస్తూ నెలకి నలభై రూపాయిలు తెచ్చుకుంటున్నాడు. అక్కడే ఎనిమిది రూపాయిల అద్దెకి వేరే ఒక యిల్లుతీసుకొని భార్యతో ఆయింట్లోవుంటున్నాడు. అతనికి ఆ నలభైరూపాయిలే ఆధారం. మరేమీ పైరాబడికూడా లేదు. వచ్చేజీతంలో ఇంటద్దెపోగా మిగిలిందానితో ఆభార్యాభర్తా నెలల్లా గడపాలి! — ముప్పయిరెండురూపాయిలతో ఇద్దరు మనుషులు నెలరోజులు గడపడం కష్టమే! — ఇందుకే సత్యనారాయణ తమ్ముడి సంసారాన్ని చూసి చాలా విచారిస్తూవుంటాడు.

అయితే తమ్ముణ్ణిగురించి అంత విచారించి, జాలి పడి సత్యనారాయణ అతనిబాధల్ని ఏమేనా నివారించ గలుగుతున్నాడా అంటే లేదనే చెప్పాలి! అసలు తమ్ముడి సంసారకష్టాన్ని రూపుమాపే శక్తి సత్యనారాయణకి లేదు. సత్యనారాయణకూడా గుమస్తాయే! అయితే జీతంమాత్రం నెలకి నూరురూపాయిలు. కాని పదిహేనురూపాయిలు ఇంటద్దె చెల్లించగా మిగిలిన ఎనభైయైదురూపాయిలతో తనూ భార్యా యేం ఇబ్బందులు పడకుండా నెలరోజులు కాలక్షేపంచెయడం అతనికీ బ్రహ్మాండంగానే వుంది. అప్పటికీ సత్యనారాయణ తమ్ముడికి చేయగలిగిన సహాయమంతా శక్తివంచన లేకుండా చేస్తూనేవున్నాడు. శేషగిరికి అందిన నలభై రూపాయిలు ఆ భార్యాభర్తలు పదిహేనురోజులు కాలక్షేపంచేయడానికి సరిపోతాయి. మిగిలినపదిహేను రోజులు ఏరోజుకారోజు వెతుక్కోవడమే అవుతోంది. అటువంటప్పుడు సత్యనారాయణ ప్రతినెలా తమ్ముడికి అయిదూ పది సర్దుబాటుచేసి, అతని ఇంట్లో లేని సామానులు తనఇంటిలోనుంచియిచ్చి సహాయపడుతూనే వున్నాడు. అయినా ఒక్కొక్కరోజున ఇంట్లో భోజనాలు లేకుండావున్నట్టు వింటున్నాడు. అవును మరి! వందరూపాయిలు సంపాదిస్తున్న తనకే ఆజీతంతో సంసారం నిర్వహించడం అంత సులభం కానప్పుడు నలభైరూపాయితో సంసారం చెయ్యడం తనతమ్ముడి కెంతకష్టం? తనెంత సహాయంచేస్తే అతనికి ఈబాధలు తప్పుతాయి?

సత్యనారాయణ లోనికి వెళ్ళాడు. ఆ యింటికి రెండే గదులు, ఒకదాని ప్రక్క ఒకటి ఉన్నాయి. అందులో ఒకటి వంటకి భోజనాలకి; రెండవది పడక గది. రెండుగదులద్వారాన్ని కలుపుతూ చిన్నవరండా, వరండా దాటితే చిన్న గచ్చువాకిలి, ఆవాకిలి దాటితే వీథిద్వారం!

సత్యనారాయణ వెళ్ళేసరికి అతని భార్య, తమ్ముడిభార్య, పడకగది ద్వారందగ్గర వరండాలో కూర్చొని మాట్లాడుకుంటున్నారు. సత్యనారాయణ రావడం చూచి తమ్ముడి భార్య లేచి నిల్చొని, "వెళతానక్కయ్యా!" అంది. "అప్పుడే వెళతావంటావేమమ్మా!—వచ్చి ఎంతసేపయింది కనుక?—ఓ ఘడియ కూర్చొ వెళిపోదువుగాని!" అంది సత్యనారాయణ భార్య. "లేదక్కయ్యా!—ఇంకా వంటచేయాలి! చాలా పనులున్నాయి. మళ్ళీ వస్తాను!" అంది శకుంతల. "ఏది? అనడమే కాని కన్పించడమే లేదు! ఒస్తూ వుండమ్మా!—నువ్వు రాకపోతే మీ సంగతులేమీ తెలియక మాకాందోళనగా వుంటుంది!" అంది సత్యనారాయణభార్య ఆమెను సాగనంపుతూ. "అలాగే అక్కయ్యా!" అంది శకుంతల.

ఇంట్లోకివెళ్లిన సత్యనారాయణ గదిద్వారం దగ్గరనుంచి ఇద్దరు ఆడవాళ్ళూ అడంలేచిపోగానే తిన్నగా గదిలోకిపోయి ఆలోచిస్తూ కుర్చీలో కూర్చున్నాడు. అతని కళ్ళముందు శకుంతల ఆకారమే మెదులుతోంది. ఆమెను తలుచుకున్నప్పుడల్లా సత్యనారాయణకి ఆమెమీద అమితమైనజాలి వేస్తూ వుంటుంది. క్రిందటిసారి వచ్చినప్పటికి ఇప్పటికి చాలా నీరసించినట్టు కన్పిస్తోంది. శకుంతల వారం రోజులక్రిందట వచ్చినప్పుడు ముఖం యింత వాడిపోయి లేదు. ఈసారి మరీ కాంతిహీనంగా వుంది ముఖం. పాపం!—తన తమ్ముడితో ఎన్ని బాధలు పడుతోందో యేమిటో!—కట్టుకున్న చీరా, తొడుగుకున్న జాకెట్టు చాలా మాసిపోయి వున్నాయి. బట్టలు కూడా లేనట్టున్నాయి తమ్ముడిని పెళ్లాడినది మొదలు ఆపిల్లకి అన్నీ కష్టాలేకాని సుఖం అన్నది లేకుండావుంది. కాని తన తమ్ముడు మాత్రం యేం చేయగలడు?—భార్యకి చీరలు కొనలేదు, ఇంట్లోకి నెలకి సరిపడ్డ సామాను తేలేదు అంటే నలభైరూపాయిల జీతం తెచ్చుకుంటూ వాడేం చేయగలడు?—ఇంకా ఈ మాత్రం ఉద్యోగం దొరకబట్టి ఈపాటైనా నిలవ గలుగుతున్నారు. లేకపోతే ఆ చదివిన సెకండుఫారం చదువుకి ఈమాత్రం ఆధారమేనా దొరుకుతుందనుకున్నాడా తను?—అయితే అందుకని వాడు కర్మ వాడను భవిస్తాడంటూ తను ఊరుకోగలడా అంటే ఊరుకోలేడు. చిన్నప్పుడు చదువుకోనందుకు తనిప్పుడు శేషగిరిని చూచి విసుక్కోడు. పైగా అతనిలాగ తయారయాడని ఎవరేనా అతనిని అన్నా తను సహించడు.

సత్యనారాయణ అలాగే ఆలోచిస్తూ కూర్చున్నాడు. భార్య కప్పుతో కాఫీతెచ్చి టేబిల్ మీద వుంచింది. కాని సత్యనారాయణ అది గమనించనే లేదు.

"కాఫీ చల్లారిపోతోందండి!" అని హెచ్చరించింది భార్య. సత్యనారాయణ భార్యవంక చూశాడు. ఆమె తెలుపు అంచుపచ్చంచులు గల కనకాంబరం రంగుచీర, తెల్ల నివాయిల్ జాకెట్టు ధరించింది. మెళ్లో పుస్తెలతాడుకాక మూడుపేటల బంగారపు గొలుసు, చెవులకు రాళ్ళ తమ్మట్లు, చేతులకు ఒక్కొక్క బంగారపుగాజు వున్నాయి. ముఖం నవ్వుతో కదుముకొని పచ్చగా పసుపు రాసుకొని వుంది. కళ్ళకి కాటుకవుంది తలలో మల్లెపువ్వులు పరిమళాన్ని వెదజల్లుతున్నాయి. సత్యనారాయణ భార్యవంక చూస్తూ ఆమె అనుభవిస్తూన్న జీవితానికీ, తన తమ్ముడిభార్య అనుభవిస్తూన్న జీవితానికీ గల వ్యత్యాసాన్ని గురించి ఆలోచించసాగాడు. తన భార్యచూస్తే ఇంతనీటుగా ముస్తాబై మనసులో ఏ చీకూచింతా లేకుండా వుంది. అటు తన తమ్ముడిభార్య మెళ్ళో నల్లపూసలదండ తప్పించి మరో ఆభరణం లేక, కట్టుకుందుకు మంచిబట్టయినా లేక ఒక్కొక్క రోజున తినడానికి తిండికూడా లేక నానాబాధలూ పడుతోంది. ఐశ్వర్యం అనుభవించలేకపోయినా దేనికీ ఇబ్బంది పడకుండా ఉన్నదానితో సుఖంగానే సాగిపోతోంది తన సంసారం. అటు తన తమ్ముడి సంసారం చూస్తే ఇంట్లో ఏ వస్తువూ లేక ప్రతిదానికీ ఇబ్బంది పడుతూ ఏరోజు కారోజు ఎలా సాగుతుందా అన్నట్టుగావుంది. ఊరినిండా అప్పులైపోయి తీర్చలేక నానాబాధలు పడుతున్నాడతను.

సత్యనారాయణ ఇంకా అలాగే కూర్చోవడం చూచి, "కాఫీ చల్లారిపోతోందండీ!" అని మరోసారి జ్ఞాపకంచేసింది భార్య.

సత్యనారాయణ కాఫీత్రాగేసి ఖాళీకప్పు టేబిల్ మీద వుంచాడు.

ఇంటికొచ్చినప్పట్నుంచి భర్త తనతో మాటాడకుండా ఆలోచిస్తూ కూర్చోవడంచూసి, "ఏమిటండీ ఇంటికొచ్చిన దగ్గర్నుంచి అంతతీవ్రంగా ఆలోచిస్తున్నారు?" అని అడిగింది భార్య సత్యనారాయణ కెదురుగావున్న కుర్చీలో కూర్చుంటూ.

"ఉఁహూఁ!—ఏమీ లేదు!" అన్నాడు సత్యనారాయణ.

"ఏమీ లేకపోతే ఆఫీసునుంచి వచ్చినది మొదలు మాటాడకుండా ఎందుకిలా కూర్చున్నారు?" అని ప్రశ్నించింది భార్య.

"మరేం లేదు. మా తమ్ముడి సంసారం గురించే!—ఇవాళ శకుంతల వొచ్చిందికదా, ఇంట్లో ఎలా కాలక్షేపం చేస్తున్నారో ఎలావుంటున్నారో తెలిసిందేమో అని!"

"తెలియకపోవడానికి ఏమంత రహస్యం కనక నా?—ఎలాగ కాలక్షేపం అవుతోందో అడిగితే

తెలుసుగా? ఇంతకాలం ఎలావుంటున్నారో ఇప్పుడూ అలాగే వుంటున్నారు. కాని అంతకంటే మరేమీ సుఖపడిపోలేదు...ఇవాళొచ్చి మళ్ళీ ఇంట్లో ఏ వస్తువూ లేదంటే రెండుసేర్ల బియ్యం పావుసేరు కందిపప్పు, పావుసేరు నూనె ఇచ్చాను!" అంది భార్య.

సత్యనారాయణ భారంగా ఒకనిట్టూర్పు విడిచాడు.

"అయినా ఇంత అధ్వాన్నం యేమిటండీ?—అంతకూ నెలమా?—ఈ నెలలో ఇప్పటికి అప్పుడే రెండేసిసేర్ల బియ్యం మూడుసార్లిచ్చాను. పంచదార నాలుగుసార్లిచ్చాను. నూనె మూడుసార్లొచ్చి పట్టుకెళ్ళింది. పప్పులూ, ఉప్పులూ లెక్కేలేదు!" అంది భార్య.

భార్య ఇలాగ అంటూంటే సత్యనారాయణ కళ్ళలో దైన్యమయమైన శకుంతల స్వరూపం మెదిలి మనస్సు చివుక్కుమంది.

"పాపం!—ఆపిల్ల యేంచేస్తుంది రాజ్యం?—మనం కాకపోతే వాళ్ళకి ఈస్థితిలో మరెవ్వరు సాయం చేస్తారు?—మనతో కాకపోతే ఆ అమ్మాయి ఇంకెవ్వరితో చెప్పుకుంటుంది?—నా జీతం మనిద్దరికే చాలడమే బ్రహ్మాండంగా వుందని కాని లేకపోతే వాళ్లూ మనం కలిసి ఒక్క కుటుంబంగా వుండవలసిన మాట!—వాళ్ళనిచూసి మనమే ఇలా విసుక్కుంటే తక్కిన వాళ్ళంతా ఎంత హీనంగా చూస్తారు?" అని అన్నాడు.

తనమాటలవల్ల భర్త బాధపడినట్లు గ్రహించి మళ్ళీ అంది రాజ్యం, "ఛా!—నేనా అమ్మాయి నేమీ అనడంలేదండీ!—పాపం, ఆపిల్లేం చేస్తుంది?—అందుకాదు!—మీ తమ్ముడిమాట చెబుతున్నాను!—ఇంట్లోకి కావలసిన వస్తువులు లేకపోతే ఆడది ఎలాగ సంసారం చేస్తుందండీ?—ఏమి తెమ్మన్నా "నాదగ్గర డబ్బులేదు. నన్నేం చేయమన్నావ్?" అంటాడట!—అలాగని ఊరుకోకుండా వేళకి భోజనం అమర్చకపోతే నానాతిట్లూ తిడతాడట!—ఈ సంగతే చెప్పుకొని 'నేనీ సంసారం ఎలాగ చేసేదక్కా!' అంటూ యేడ్చింది పాపం శకుంతల."

"అవును రాజ్యం. వాడినంటే వాడుమాత్రం ఏంచేయగలడు?"

"మగవాడు చేతగాకపోతే ఇంట్లోవున్న ఆడది చేస్తుందిటండీ?—ఏ సామానూ లేకపోతే రోజూ ఎన్నిళ్ళకని అప్పులకి తిరుగుతుంది పాపం ఆ పిల్ల?"

"నిజమే!—అయితే నలభై రూపాయల రాబడితో ఎవడుమాత్రం ఇంతకంటే చేయగలడో చెప్పు!"

సత్యనారాయణ ఈ మాటనడంతో, "ఇప్పుడు తనూ భార్యా వున్నప్పుడే ఇలాగ సంసారం చేస్తున్న మనిషి రేపొద్దున్న పిల్లా పాపా పుడితే ఇంకేం చేస్తాడండీ?" అని అడిగింది రాజ్యం.

తన తమ్ముడి పరిస్థితుల వర్ణన చేసుకోకుండా భార్య ఇలాగ తేలికగా మాటాడడం సత్యనారాయణకి కొంచెం కష్టాన్ని కలిగించింది. శేషగిరి ఇప్పటి పరిస్థితుల కెలాగవచ్చాడో సత్యనారాయణకి తెలుసు. అందుచేతనే శేషగిరి ఇప్పుడు సంసారం చేయలేకపోతున్నాడంటే అతనిని సత్యనారాయణ కోపగించుకోడు. హీనంగా చూడడు. పైగా అతని నెవ్వరేమన్నా తను బాధపడతాడు. భార్య అన్నమాటలకి కొంచెం కోపంతో అన్నాడు సత్యనారాయణ:

"నువ్వన్నవన్నీ నిజమే రాజ్యం!—అయితే వాడుమాత్రం యేంచేయగలడంటాను. దొరికినంతకాలం ఊరినిండా అప్పులుకూడా చేసేసి రవ్వంత లోటు రానీయకుండా చేశాడు. ఇప్పుడెవ్వడూ అప్పివ్వడంలేదు; ఏ దుకాణం వాడూ అరువివ్వడంలేదు. ఇంక ఎలాచేస్తాడు?"

భర్త ఇలాగ అనడంతో రాజ్యం ఏమీ అనలేక ఊరుకుంది. రెండునిముషాలు ఊరుకున్నాక మళ్ళీ అంది:

"పాపం, శకుంతలని చూస్తే ఎంతో జాలివేస్తోందండీ!—ఆ కట్టుకున్న బట్టలూ ఆ మనిషీ ఎలాగుందో చూశారా?—రెండేరెండు చీరలున్నాయిట. అందులో ఒకటి రెండు మూడుచోట్ల చిరిగిపోయిందిట కూడాను!"

"ఆపిల్ల అవస్థలుకూడా చూస్తున్నాను రాజ్యం!" భారంగా నిట్టూరుస్తూ అన్నాడు సత్యనారాయణ.

"మొన్న పండగనాడు చీరకొనుక్కోమ్మని ఎనిమిదిరూపాయిలిచ్చామా?—ఆ డబ్బు ఇంటి క్రిందే ఖర్చయిపోయిందట!" అంది రాజ్యం.

"మనం పొరపాటు చేశాం. డబ్బివ్వకుండా వీరే కొనిచ్చెయ్య వలసింది!"

"అదే!— అయినా రానురాను మరీ దిగజారి పోతున్నారండీ!— ఎవ్వరికీ దమ్మిడీయేనా బాకీ తీర్చడంలేదట. వాళ్లంతా రోజూవచ్చి దీనిని అనరానిమాట లనడంట!"

"........................"

"పోనీ దీనిపైన మరో పదో పదిహేనో దొరికే మరొక చిన్నపని ఎక్కడైనా చూసినా బాగుణ్ణు!"

"హుం!— సెకెండుఫారం చదివినవాడికి పనెవడిస్తాడు రాజ్యం?— ఇదేనా ఆ షావుకారు తెలిసినవాడు కాబట్టి వీడినుంచుకున్నాడు."

"అయినా ఇతను చదువుకోక పోవడమేమండీ? స్కూలుఫైనలైనా అయితే మీలాగ నూరురూపాయిల ఉద్యోగమేనా దొరుకునా?"

"చదువుకోకపోవడమేమండీ అంటే నేనొకటి చెప్తాను విను!— వీడు చదువుకోకుండా తిరిగినది జ్ఞానంలేని వయస్సులో. దాని ఫలితాన్ననుభవిస్తున్నది ఇప్పుడు. ఇప్పుడు తనన్ని బాధలు పడవలసి వుంటుందన్న జ్ఞానమేవుంటే అప్పుడలాగ తిరిగేవాడే కాడు. ఏమనిష్కోరి. తనంతటతాను బాధల్ని తెచ్చుకొని అనుభవించడు."

సత్యనారాయణ ఈమాటలనగానే రాజ్యం అంది: "మీరన్ని ఇలాగే చెప్తారండీ!— చిన్నప్పుడు చదువుకోకుండా తిరగడం అతనితప్పుకాదు; పెద్దయాక ఇప్పుడు పెళ్లాన్ని కొల్చుకతినడమూ అతని తప్పుకాదు!— మీ తమ్ముడుకదూ?— అంచేత అతను చేసినవాటిని సమర్థిస్తూ వుండండి!"

భార్య అన్నమాటకి నిముషంసేపు ఊరుకొని, కుర్చీలో సరిగా సర్దుకు కూర్చొని గంభీరంగా అన్నాడు సత్యనారాయణ:

"రాజ్యం, నువ్విలాగంటున్నావు. చిన్నప్పుడు చదువుకోలేదని, పెద్దవాడయాక భార్యని సుఖపెట్టలేదని నువ్వు మా తమ్ముడిని ఇన్నిమాటలంటున్నావు కాని వాడెటువంటి పరిస్థితులవల్ల ఎటువంటి పరిసర ప్రభావంవల్ల ఈవిధంగా తయారయాడో ఆలోచించడంలేదు. చెబుతున్నాను విను!— మా తమ్ముడు ఇప్పుడీస్థితికి వచ్చాడంటే అందులో వాడి నేరం ఏమీ లేదు!"

రాజ్యం భర్తముఖంవంక చూస్తూ మాట్లాడక కూర్చుంది. సత్యనారాయణ చెప్పసాగడు.

"శేషగిరి తెలివితక్కువవాడు కాడు. వాడికి నాకంటే మంచి తెలివితేటలున్నాయి. మంచి జ్ఞాపకశక్తి గ్రహింపుశక్తి వున్నాయి. అయితే ఏమన్నంటే ఏం లాభం?— అవన్నీ ఎందుకూ పనికి రాకుండా పోయాయి అన్నీ ఉన్నా చదువంటేయేమీ శ్రద్ధవుండేదికాదు మా తమ్ముడికి. అప్పుడు చిన్నతనం. ఎంతసేపూ బడి మానేసి చెట్లూ చేమలూ ఎక్కి ఆడుకుందాం అన్న ఆలోచనే కాని, దానివల్ల ఎటువంటి నష్టాలు వస్తాయో తెలియని వయస్సు. దానికితోడు చదువుకొమ్మని, బడికి వెళ్లమని ఎవరూ నిర్బంధించేవారు కారు. మా అమ్మా నాన్నా ఉన్నారంటే వాళ్లదొక రకం. మా అమ్మకి నేనన్నా, మా తమ్ముడన్నా ఊరంత ముద్దు. మా అమ్మకి ఎనమండుగురం పుట్టాం. అందులో ఆరుగురు చనిపోగా మేమిద్దరం మిగిలాం. నేను నాలుగోవాడిని, వాడు ఆఖరువాడు. అందుచేత బడికి వెళ్ళకపోయినా, ఎంత అల్లరిచేసినా, ఎలాగ తిరిగినా ఏమీ అనేదికాదు. ఇంక మా నాన్నగారు ఉన్నారంటే ఆయనకిఇంటి విషయాలేమీ అవసరం వుండేవికావు. తన కవసరంలేని ఇతరుల పనులన్నిటిని నెత్తిని వేసుకొని క్షణం ఇంటిదగ్గర ఉండకుండా తిరిగేవారు కాని తనయింట్లో ఏం జరుగుతున్నా, ఎవరెలా వున్నా పట్టించుకొనేవారు కారు. అసలు మాకు మొదట్లో వున్న పాతిక వేల రూపాయల ఆస్తి ఆయన ఇటువంటి వాటికి వినియోగించడంచేతనే ఎర్రని యేగాని అయినా మిగలకుండా పోయింది. ఊరినిండా అప్పులైపోయి ఆస్తి అంతా నేను ఏడేళ్లవాడినై ఉన్నప్పుడే వేలం వేయబడింది. మళ్ళీ ఆయనవల్ల మహోపకారంపొందిన వాళ్లే మాఆస్తి వేలం వేయించారు. కాని మాటంటే ఆయన ఒప్పేవారు కారు. విషభుజంగాల్ని, నరరూప రాక్షసుల్ని చేరదీయడంచేతనే ఆయనా స్థితికి వచ్చారంటే చాలా కోపగించుకొనేవారు. ఆస్తి పోయాక మానాన్న చాలా చిక్కుల్లో పడ్డారు. బడిపంతులు పనివల్ల వచ్చే నలభై రూపాయలతోను సంసారం వెళ్లడం

చాలా కష్టమైపోతుండేది. వచ్చిన జీతం చాలక ఇలాగే ఊరినిండా అప్పులు చేయవలసి వచ్చేది. వాడుకల వాళ్లకి బాకీలు తీర్చక అవి నెల నెలకి పెరిగిపోతూ వుండేవి. వాళ్లంతా ఇంటిమీద పడి నానామాటలూ అంటూండేవారు. అయితే అటువంటి పరిస్థితులలో కూడా మా నాన్నకి ఇంటి విషయాలలో శ్రద్ధవుండేది కాదు. ఆస్తి పోయి అన్నవస్త్రాలు పనుతూన్నప్పటికి ఆయన తల మీద బాధ్యతలు వేసేవాళ్ళు మాత్రం వదలలేదు. ఆయన కంత అపకారం చేసినవాళ్ళే మళ్లీ ఏదో పని ఆయన ద్వారా జరిపించుకోడానికని వస్తూవుండేవారు. ఇలాగ ఆయనకెప్పుడూ ఇతరుల విషయాలలోనే కాని, ఇంటి విషయాలలో ఏమీ శ్రద్ధవుండేది కాదు. ఇలాగ మా తమ్ముడి చదువు విషయంలో మా అమ్మా నాన్నా కూడా శ్రద్ధ తీసుకోలేదు. అదే వాడిని ఇప్పుడీ స్థితికి తెచ్చిపెట్టింది. వాడెప్పుడూ చెట్టెక్కి ఆడటం, చెరువులో దిగి ఈదటంలో చూపే శ్రద్ధ చదువులో చూపేవాడు కాడు. పుస్తకం పట్టుకోడం, బడికి వెళ్లడమంటే గండంలాగ వుండేది వాడికి. మూడొంతుల కాలం ఏదో మిషతో బడి మానేసేవాడు. అయితే మూడొంతుల కాలం బడికి వెళ్లకపోయినా, ఏనాడూ పుస్తకం పట్టుకు చదవకపోయినా ఆ వెళ్లినప్పుడు బడిలో చెప్పగా విన్నదే జ్ఞాపకం వుంచుకొని, పరీక్షలలో (వ్రాయగా పదిహేను, ఇరవై, పాతికా మార్కులు వస్తూండేవి). కాని ఆమార్కులతో ఎలా పాసవుతాడు? అందుచేత మధ్యమధ్య ఒక్కొక్క క్లాసు రెండేసి సంవత్సరాలు చదవవలసొచ్చేది. అప్పుడే నా మా అమ్మా, నాన్నా వాడిని మందలించి శ్రద్ధగా చదువుకొమ్మని, బడికి వెళ్లమని చెప్పేవారు కారు. వాడిని విచ్చలవిడిగా వదిలేశారు. కొంచెం శ్రద్ధవహించి చెప్పకపోతే ఆ వయస్సులో వాడికేమిటి తెలుస్తుంది? అమ్మా నాన్నా ఉన్నారు కదా నాకేం లోటు? అని అనుకుంటాడే గాని వారెల్లకాలం వుండరని, ఉన్నా తనని పోషించలేరని, పెద్దయాక తన స్వశక్తిమీదే తను బ్రతకవలసి వుంటుందని, ఇన్ని బాధలుంటాయని వాడికప్పుడేం తెలుసు? అలాగ తెలుసుకొని వుంటే ఇప్పుడీ స్థితికే రాకపోను!"

సత్యనారాయణ కొంచెం ఆగాడు. కుర్చీలో బద్ధకంగా చేరబడ్డాడు.

"సరే, ఎలాగైతేనేం మధ్యమధ్య ఒక్కొక్క క్లాసు రెండేసేళ్ళు చదువుతూ పద్నాలుగేళ్లకు సెకండుఫారంలోకి వచ్చాడు. సెకండుఫారంలోకి వచ్చాక మా తమ్ముడికింక చదవటం అంటే పూర్తిగా బద్ధకం ఏర్పడింది. స్కూలుకి వెళ్లడం అంటే ఇష్టం లేకపోయింది. ఒకరోజున మా అమ్మతో తనకింక చదవాలని లేదని, స్కూలు మానేస్తానని అన్నాడు మా తమ్ముడు. ఈ సంగతి మా అమ్మ మా నాన్నగారితో చెప్పింది. మా నాన్నగారు మా తమ్ముడిని పిలిచి, "చదువు మానేసి ఏమిటి చేస్తావురా?" అని అడిగారు. "ఏదైనా ఉద్యోగం చేస్తాను నాన్నా!" అన్నాడు మా తమ్ముడు. "నీకే ఉద్యోగం దొరుకుతుందిరా?" అన్నారు మా నాన్న. "ఏది దొరికితే అదే చేస్తాను. నేను ఇంక చదవలేను!" అన్నాడు మా తమ్ముడు. అంతే!—అలాంటప్పుడు మా నాన్న గట్టిగా చెప్పాలా? అదేమీ లేకుండా ఆయన ఊరుకున్నారు. దానితో వాడు చదువుకి స్వస్తి చెప్పేశాడు. చదువు మానేశాక ఇంక ఉద్యోగం చేస్తానని బయల్దేరాడు మా తమ్ముడు. కాని రెండవ ఫారం చదివిన వాడికి ఎక్కడేం ఉద్యోగం దొరుకుతుంది? —గోల్డుగోల్డు నగలమ్మే ఏజంటుగా కొంత కాలం, ఏదో మందులమ్ముతూ కొంత కాలం తిరిగాడు. కాని వాటివల్ల పాతిక ముప్ఫయ్ రూపాయిలకంటే ఎక్కువ వచ్చేది కాదు. అప్పటికి నువ్వు వచ్చావు. వాడి సంపాదనా అదే నువ్వూ చూసేవుంటావు. ఆ స్థితిలో వాడికి పెళ్లి ఒకటి తలపెట్టారు. ఎవడికో ఒకడికి చెల్లెల్నిచ్చి మూడు ముళ్ళూ వేయించి తన బాధ్యత ఒదుల్చుకుందామని చూస్తున్న ఈ శకుంతల అన్నగారు అప్పుడు తన చెల్లెల్ని మా తమ్ముడికిస్తానంటూ మా నాన్నతో చెప్పొచ్చాడు. ఆయనతో మాట్లాడాక మా నాన్నగారు కూడా రెండవ మాట అనకుండా ఒప్పేసుకున్నారు. దాని ఫలితంగా వీళ్లిద్దరికి పెళ్ళి జరిగిపోయింది. వాడి పెళ్లయిన తర్వాత ఏడాదిలోనే మా అమ్మా నాన్నా మూడు మాసాల వ్యత్యాసంలో చనిపోయారు. ఆ తర్వాత ఈ కరువు ఎక్కువై వస్తువుల ధరలన్నీ పెరిగిపోవటంచేత వాడప్పుడు సంపాదిస్తూండే ముప్ఫయ్ రూపాయిలతోను, నేను తెచ్చేజీతంతోను. ఇరవై రూపాయిల ఇంటద్దె చెల్లిస్తూ నలుగురు మనుషులం జీవించడానికి సరిపోకపోవటంచేత వాళ్ళూ మనం వేరయిపోవడం జరిగింది. అప్పటినుంచి వాళ్ల సంసారం ఇలాగే వుంది. ఆ మందులమ్మే పనికంటే ఈ డిపో గుమస్తా ఉద్యోగం అయితే మరొక పది రూపాయిలు ఎక్కువ దొరుకుతాయని, స్థిరంగా ఈ ఊళ్ళో వుండవచ్చునని నాకు

తెలిసిన షావుకారుతో చెప్పి ఈ పని యిప్పించాను. అయినా వాడిస్థితి అలాగే వుంది. ఊళ్ళో చూస్తే విపరీతంగా అప్పులు పెరిగిపోయి వున్నాయి. ఇంట్లో చూస్తాంటే అన్నిటికీ ఇబ్బందిపడుతున్నారు. సరిగ్గా తినడానికి తిండీ, కట్టుకోడానికి బట్టా కూడా లేక వాడూ ఆ పిల్లా పడరాని అవస్థలన్నీ పడుతున్నారు. ఇంత చిన్న వయస్సులోనే వాళ్ళిద్దరి జీవితాలకి సుఖం లేకుండా పోతోంది."

సత్యనారాయణ తను చెప్పేదంతా అయిపోయిందన్నట్టుగా భారంగా ఊపిరి వదలి కుర్చీలో చేరబడ్డాడు. రాజ్యం ఒక అయిదు నిముషాలు ఏదో ఆలోచిస్తూ అలాగే కదలకుండా కూర్చుంది. ఆ తర్వాత ఇలాగ అంది:

"అయితే ఇంతకీ మీరు అనేదేమిటీ అంటే మీ తమ్ముడికి చిన్నతనంలో ఎవ్వరూ చెప్పకుండా వదిలేయడంచేతనే అతనిప్పుడీ స్థితికి వచ్చాడంటారు. అయినా అతనికా వివేకం వుండాలికాని ఒకరు చెబితే తెలుస్తుందిటండీ?—చెప్పినా వింటాడా?"

సత్యనారాయణ అన్నాడు:

"రాజ్యం, నువ్విలా అంటావని నాకు తెలుసు. అయితే నేను చెప్పవలసినది ఇంకా పూర్తి కాలేదు. చెప్పేదంతా పూర్తిగా విని తర్వాత సందేహాలు తీర్చుకో!—ఎవరి వివేకం వారికుండాలి కాని ఒకరు చెప్పినందువల్ల తెలుస్తుందా? వింటారా? అన్నావు. చిన్నతనంలో పద్నాలుగు పదిహేనేళ్ళవాడికి, మొదట్నుంచి ఏ కష్టాలూ ఎరుగకుండా తల్లిదండ్రులచాటున గారాబంతో పెరిగినవాడికి తను చదువుకోవాలనీ, చదువుకోకపోతే తను పెద్దవాడయాక ఉద్యోగం దొరకదనీ, ఉద్యోగం లేకపోతే పెళ్ళాన్నీ పిల్లల్నీ పోషించడం కష్టమని ఇవన్నీ ఏం తెలుస్తాయి?—ఇంక వినడం మాటా?—మొదట్లో ఏ పిల్లకైనా చదువు, బడి అంటే భయంగానే వుంటుంది. అయిష్టంగానే వుంటుంది. అలాగని చెప్పి ఊరుకుంటే వాళ్ళెందుకు పనికొస్తారు?—చిన్నతనంచేత వాళ్ళకి తెలియక బడికి వెళ్ళను చదువుకోను అన్నప్పటికీ పెద్దవాళ్ళైన వాళ్ళు వాళ్ళకి బోధపరచాలి. వాళ్ళు వినకపోతే కాస్త కఠినంగానైనా ప్రవర్తించాలి. మొదట్లో కొద్దికాలం అది వాళ్ళకి బాధగా అనిపించినా తర్వాత తర్వాత వాళ్ళంతట వాళ్ళే తెలుసుకొని దారిలో పడతారు. చెప్పకపోతే అనుభవించేవరకు ఇటువంటి విషయాలు తెలియవు... ఇంతెందుకు తలవెండ్రుకవాసిలో తప్పిపోయింది కాని లేకపోతే నేనీనాడు ఈమాత్రం ఉద్యోగం అయి ఈ మోస్తరుగా నేనా ఉండగలిగేవాడినా?—నువ్వు ఈపాటి మంచిబట్టలు కట్టుకొని ఇంత నీటుగా ముస్తాబై ఇంత సర్వ్యారంగా ఉండగలిగేదానివా?—మన సంసారం కూడా మా తమ్ముడి సంసారంలాగే వుండును!"

రాజ్యం ఊపిరి బిగపట్టుకొని వినసాగింది. సత్యనారాయణ చెప్పాడు.

"పన్నెండేళ్ళవరకు నేను కూడా వాడిలాగే చదువూ సంధ్యా లేకుండా తోటలమ్మట, దొడ్లమ్మట తిరిగినవాడినే!—అప్పుడు చిన్నతనం!—ఇప్పుడున్నంత జ్ఞానం అప్పుడెక్కడిది?—ఎంతసేపూ ఏ తోటలో చెట్లెక్కి ఆడుదామా, ఏ చెరువులో దిగి యీదుదామా అనే కాని చదువుకుందాం బడికి వెళదాం అన్న ఆలోచన ఉండేది కాదు. దీనికితోడు ఎన్నిరోజులు బడికి వెళ్ళకపోయినా మా అమ్మ ముద్దుచేత, మా నాన్నగారు స్వంతపనుల్లో అయివున్న ఉపేక్షాభావంచేత వెళ్ళమని చెప్పేవారు కారు. నేను మూడువంతుల కాలం బడికి వెళ్ళేవాడిని కాదు. ఇంటి దగ్గరైనా చదువుకునేవాడిని కాను. ఎప్పుడూ ఇంటి దగ్గర మాత్రం ఉండకుండా తిరుగుతూ వుండేవాడిని తోటలంటా, చెరువులంటా."

"ఇలాగ వుండగా మా అమ్మఅన్నగారు ఒకసారి మా యింటికి వచ్చాడు. ఆయన కలెక్టరు కోర్టులో హెడ్ గుమాస్తాగా పనిచేస్తూ వుండేవాడు. ఆయన సంతానం అయిదుగురు కొడుకులు. ముగ్గురు కూతుళ్ళు. వారంతా ఇప్పుడూ ఉన్నారు. పెద్ద కొడుకు డాక్టరు, రెండవ కొడుకు వకీలు; అప్పటికి మూడోవాడు ఇంజనీరింగు, నాలుగవవాడు ఎం. ఎస్ సి, అయిదవ కొడుకు బి. కాం చదువుతూవుండేవారు. కూతుళ్ళలో ఇద్దరు కొడుకుల తర్వాత పుట్టిన పెద్ద కూతురు అయిదో ఫారంవరకు చదివి మానేసి పెళ్ళయి కాపురం చేస్తూవుండేది. ఆమె భర్త తాహసీల్దారుగా వుండేవాడు. తర్వాత ఇద్దరు కూతుళ్ళూ మగపిల్లలందరి తర్వాత పుట్టినవాళ్ళు. రెండవ కూతురు అయిదవ ఫారం, మూడవ కూతురు మూడవ ఫారం చదువుతూ వుండేవారు.—ఆయన మా యింటికి వచ్చాడు. పరిస్థి

తులన్నీ చూశాడు. ఇంటిమీదపడి అప్పులవాళ్ళు అనరాని మాటలంటున్నా, ఇంట్లో వస్తువులు లేవని మాఅమ్మ చెబుతున్నా, నేను చదువు సంధ్యలు లేక పాడైపోయి తిరుగుతున్నా, తన కేమీ సంబంధం లేదన్నట్టుగా వున్న మా నాన్నగారి ధోరణిని చూసి చాలా ఆశ్చర్యపడ్డాడు. కోపంకూడా వచ్చింది. మా నాన్నకి శ్రద్ధలేకపోయినా తనేనా అతనికి గట్టిగా చెప్పనందుకు మా అమ్మని మందలించాడు. నే నింక మరి అక్కడుంటే దమ్మిడీకికూడా పనికి రాకుండా పాడవుతానని, తన వద్దకు పంపించేస్తే మంచి క్రమశిక్షణలోవుంచి రస్తాలోకి తీసుకొస్తానని చెప్పి నన్ను వాళ్ళ యింటికి తీసుకొనిపోయాడు."

"మా మామయ్య చాలా ఖచ్చితమైన మనిషి. పద్ధతైనవాడు. అతను ఏర్పరచిన పద్ధతుల ప్రకారం అందరూ నడుచుకుంటూ వుండాలి!—పిల్లలందరికీ ఆయనంటే హడల్! అంత పెద్ద డాక్టరు ఉద్యోగం చేస్తూండే పెద్దవాడికి, వకీలుగా ప్రాక్టీసు పెట్టుకొని అంతపేరూ, రాబడీ వున్న రెండవవాడికికూడా పెళ్ళిళ్ళయి పిల్లల తండ్రులైనప్పటికీ తండ్రి అంటే గౌరవం, భయం రెండూ వుండేవి. ఆయన అన్న మాటకు వారుకూడా ఎదురు చెప్పేవారు కారు. ఆయన పిల్లలికి కొన్ని పద్ధతు లేర్పరిచాడు. ఆరుగంట లయేసరికి నిద్రలేవాలి! ఇలాటివాటిలో మామూలుగానే వుండేవాడు. కొంతమంది పెద్దలు కాఫీ పిల్లలకి అలవాటు చేస్తే పాడైపోతారని దగ్గర పిల్లలున్నా వారికివ్వకుండా తాము మాత్రం తాగేస్తారు. కాని మా మామయ్య రూల్స్‌లో కాఫీ నిషేధంకాదు. ఉదయం ఏడు గంటలకి కాఫీ, సాయంకాలం నాలుగు గంటలకి కాఫీ, ఏదో ఫలహారం రోజూ వుండేవి. ఉదయం కాఫీ అయాక పదిగంటలవరకు ఎవరి పనులలో వారుండేవారు. పది గంటలకి భోజనం చేసి, కాలేజీలకి కొందరు, హైస్కూళ్లకి కొందరు వెళ్లిపోయేవారు. మామయ్య రెండో కొడుకు కోర్టుకు వెళ్లిపోయేవాడు. పెద్దవాడికి ఆస్పత్రి ఉదయం ఏడున్నరనుంచి పదిగంటలవరకు, మధ్యాహ్నం మూడున్నరనుంచి అయిదున్నరవరకు ఉండేది. మిగతా వేళల్లో ఆయన ఇంటిదగ్గరే వుండేవాడు. నేను అక్కడ అప్పటికింకా ఏ స్కూల్లోను చేరలేదు. ఇంటిదగర నాకు బాగా ట్యూషన్ చెప్పి ఆ మీదటికి హైస్కూల్లో మొదటి ఫారంలో చేర్పించాలని మామయ్య ఉద్దేశం. నాకప్పటికి ఇంగ్లీషు అక్షరాలు మాత్రం వచ్చాయి. మానాలు, ఎక్కాలుకూడా బాగా వచ్చేవికావు.

"సాయంకాలం కాలేజీలనుంచీ, హైస్కూళ్ళనుంచీ వచ్చాక కాఫీ టిఫిను అయాక మగ పిల్లలంతా అలాగే షికార్లకని వీధిలోకి వెళ్ళేవారు. ఏడున్నరవరకు తిరిగి ఏడున్నరా అయేసరికి భోజనాలకివచ్చేవారు. భోజనాలయాక ఎవరి గదులలో వారు కూర్చొని పదిగంటలవరకు చదువుకొనేవారు. పది గంటలకి అంతమందీ నిద్రపోయేవారు. ఇదే వాళ్ళింట్లో పిల్లల కేర్పరచిన పద్ధతి. అంతమంది ఈ పద్ధతి ప్రకారమే నడిచేవారు. అయితే ఇంత పద్ధతిగావున్నా ఆయన పిల్లల కెంతవరకు స్వేచ్ఛ అవసరమో అంతవరకు ఇచ్చేవాడు. వాళ్ళ సరదాలన్నీ తీర్చేవాడు. చూడవలసిన సినిమాకాని, నాటకంకాని, సర్కసుకాని వచ్చిందంటే ఆ బాలగోపాలాన్నీ తీసుకొని వెళ్ళేవాడు. ఇంట్లో ఎవ్వరికీ రవ్వంతలోటు రానిచ్చేవాడు కాడు. కాని ఎవ్వరికి మంచి మార్కులు రాకపోయినా, చదువులో అశ్రద్ధ వహించినా అగ్గిరుద్రుడైపోయేవాడు. "వెధవా! ఇప్పుడు చదువుకోకపోతే ఆ తర్వాత ముష్టెత్తుకోడానికే కాని మరెందుకూ పనికి రావురా!" అంటూ తిట్టేవాడు. నాకు మొదట్లో ఆ పద్ధతులన్నీ చాలా బాధగా వుండేవి. వెళ్ళిన మర్నాటి నుంచీ ఆయన నన్ను చాలా కట్టుదిట్టంలో వుంచాడు. నన్నెక్కడికీ కదలనిచ్చేవాడు కాడు. చదువుతే కాని ఒప్పేవాడు కాడు. మా ఊళ్ళో ఉన్నప్పుడు చెరువులంట, తోటలంట, ఇష్టం వచ్చినట్టు తిరిగే నాకు మా మామయ్య చేసిన కట్టుబాట్లు చాలా కష్టంగా వుండేవి. నాకా యిల్లు అప్పట్లో ఖైదులాగే అనిపించేది. ఆయన ఒక్కొక్క రోజున చదువుకోకపోతే గట్టిగా కసిరేవాడు. నాకప్పుడు లోలోపల ఎంతేనా దుఃఖం వచ్చేది. కాని ఇప్పుడు ఆలోచిస్తుంటే ఆ పద్ధతులెంత మంచివో తెలుస్తోంది. నాకు ఆ యేడాదంతా బాగా ట్యూషన్ చెప్పి హైస్కూల్లో మొదటి ఫారంలో చేరేలాగ చేసే బాధ్యత తన పిల్లలందరిమీద వేశాడు మా మామయ్య. నాకు కొద్దిరోజుల్లోనే మానాలు, ఎక్కాలు పూర్తిగా వచ్చేశాయి. అప్పటినుంచి నాకు ఆ ఇంటందరూ ట్యూషను చెప్పడం ఆరంభించారు. ఎవరికి తీరిక వున్నప్పుడు వారు నాకు లెక్కల్లోను, తెలుగు, ఇంగ్లీషు, హిస్టరీ, జాగ్రఫీ, సైన్సు మొదలగు

వాటన్నిటిలోను పాఠాలు చెప్పేవారు. ముఖ్యంగా నాలుగవవాడు, అయిదవవాడు నాకు చెబుతూ వుండేవారు. ఒక్కొక్కప్పుడు మా మామయ్య కూతుళ్ళుకూడా చెప్పేవారు. మా మామయ్య రెండవకూతురు నా కంటె ఏణ్ణర్ధం పెద్ద. మూడవ పిల్ల ఆరుమాసాలు చిన్న. ఆ అమ్మాయిల్ని చూస్తుంటే నా కెంతో సిగ్గువేసేది. నా కప్పుడప్పుడే జ్ఞానోదయం అవుతోంది. ఆ ఆడపిల్లలు నాకంటె పెద్ద క్లాసులు చదవడం, నాకు ట్యూషన్ చెప్పడం చిన్నతనంగా అనుపించసాగింది వాళ్ళంతా అలాగ పెద్ద పెద్ద క్లాసులు చదువుతూంటె నేనింకా మొదట్లోనే వుండడం చాలా తెలకంపు అనిపించేది. రోజులు గడుస్తు కొద్దీ వాళ్ళందరినీ చూస్తున్నకొద్దీ నాకుకూడా చదువంటే శ్రద్ధ యేర్పడడం ప్రారంభించింది. మా మయ్య పెద్ద కొడుకు రెండవ కొడుకు కూడా కటుంబాలతో ఆ యింట్లోనే వుండేవారు. వాళ్ళ కుటుంబాల్ని చూస్తుంటే నాకు ఎంతో ముచ్చటవేసేది. ఇంట్లో అంతా చాలా నీటుగా వుండేవారు. మామయ్య మనవలకి కూడా మామయ్యంటే భయమే. ఇంట్లో ఏమీ అల్లరి చేయకుండా అతిబుద్ధిగా వుండేవారు. అదంతా మా మామయ్య నేర్పిన క్రమశిక్షణ ఆ పిల్లలు కూడా అక్షరాలు. గుణింతాలు చదువుతూ వుండేవారు. మామయ్యగారింట్లో ఆ క్రమశిక్షణ, చదువులో కల శ్రద్ధ నాకెంతైనా నచ్చేయి. ఇంట్లో అంతమందీ ఎప్పుడూ కులాసాగా, సరదాగా కన్పించేవారు. ఇంట్లో అంతా పదిహేనుమంది వుండేవారు. అంతమంది వున్నా ఇంట్లో దేనికీ ఇబ్బంది వుండేది కాదు. ఎవరికేది కావాలన్నా వెంటనే వచ్చేసేది. అవును మరి! పెదవాడు, రెండవవాడు అమితంగా ఆర్జిస్తున్నారాయె!—లోటు యెందుకుంటుంది?— అయితే ఆ సంపాదనశక్తి వారి కెలాగ వచ్చింది?— మామయ్య ఏర్పాటుచిన కట్టుబాట్లలో పెరిగి బుద్ధిగా చదువుకోవడంచేత, వాళ్ళని మా మామయ్య అంత పెద్ద చదువులు చదివించడంచేత."

రాజ్యం కదలకుండా కుర్చీలో కూర్చొని, రెప్పవాల్చకుండా చూస్తూ ఏదో ఆలోచిస్తోంది తనని తాను మరచి. సత్యనారాయణ చెప్పుకుపోతున్నాడు.

"నాకు క్రమంగా చదువులో ఉత్సాహం దీక్ష జనించసాగాయి. వాళ్ళందరిలాగా చదువుకోవాలన్న పట్టుదల యేర్పడింది. దానితో రాత్రింబవళ్ళు చదవడం ప్రారంభించాను. నా అంతట నేనే తెలియనివాటని అడిగి తెలుసుకోడం ప్రారంభించాను. పుస్తకాలు పట్టుకొని వెళ్ళి ఎవరు తీరుబాటుగా వుంటే వాళ్ళముందు కూర్చొని ట్యూషన్ చెప్పమనే వాడిని. ఎవరికి పని లేనప్పుడు వారు నాకు చెప్పేవారు. మా మామయ్య నాలుగో కొడుకు రోజూ ఉదయం గంట, సాయంకాలంగంట నాకు ట్యూషన్ చెప్పేవాడు. చాలా బాగా చెప్పేవాడు. ఏ రోజు కారోజు అప్ప చెప్పుకొనేవాడు. మామయ్య కూడ పదిరోజుల కొకసారి అన్నిటిలోను పరీక్ష చేసి నా చదువెలా వుందో చూస్తుండేవాడు. ఇంటంత మందీ నా చదువు విషయంలో చాలా పట్టుదలగా వుండేవారు. ఇలాగ మామయ్య దగగ భయంచేతనైతేనేం, వాళ్ళందరిలాగా చదువుకోవాలన్న పట్టుదలవల్లనైతేనేం, వాళ్ళందరూ నా యందు చూపిన శ్రద్ధవల్లనైతేనేం బాగా చదవడం ప్రారంభించి, ఇంగ్లీషు అక్షరాలలో వున్నవాడిని, మావాళ్ళు, ఏకొంటలు నివాడిని ఒక్క యేడాది హైస్కూల్లో మొదటి ఫారంలో ప్రవేశించడానికి వీలుగా తయారయాను. ఆ యేడే నన్ను హైస్కూల్లో జేర్చారు. నాకు ప్రవేశపరీక్షలో మంచి మార్కు లొచ్చాయి.... హైస్కూల్లో ప్రవేశించాక నాకు మరెవ్వరూ చెప్పే అవసరం లేకపోయింది. రోజూ క్లాసులో చెప్పేవన్నీ జాగ్రత్తగా విని ఇంటికి వచ్చాక చదువుకుంటూండేవాడిని నాకు అన్ని ఫస్టు మార్కు లొచ్చేవి "

"ఇలాగ ఆరు సంవత్సరాలు దీక్షగా చదివి పందొమ్మిదేళ్లు వచ్చేసరికి స్కూల్ ఫైనల్ పాసయాను. అన్నిటిలోను ఫస్టుగా మార్కులు వచ్చాయి నాకు. నేను స్కూల్ ఫైనల్ పాసవగానే నన్ను కాలేజీలో చేర్పించమని మా మామయ్య మా నాన్నగారికి ఉత్తరం వ్రాశాడు. కాని మా నాన్నగారు అంగీకరించలేదు. అక్కడ పరిస్థితులు ఏమీ బాగు లేవనీ, నేనింక ఉద్యోగంలో చేరకపోతే జరగడం కష్టం అనీ, ఇంకా చదువుతూ కూర్చుంటే అవతల ఉద్యోగానికి ఈడు మించిపోతుందనీ, అంచేత నన్ను వెంటనే పంపించేయమనీ వుత్తరం వ్రాశారు. నాకు కాలేజీలో చేరి పెద్ద చదువు చదువుకోవాలని

కోరికగా వుండేది. మా నాన్నగారు వ్రాసిన ఉత్తరం చూశాక ఆ కోరికలన్నీ అణగారి పోయాయి. నేను కాలేజీలో చదివే ఆశను వదులుకొని ఇంటికి ప్రయాణమయ్యాను. ఇంటికి వెళ్ళిన మర్నాటినుంచి ఉద్యోగప్రయత్నాలారంభించాను. కనబడిన ఖాళీ ఉద్యోగాలన్నిటికి అప్లికేషన్లు పెట్టాను. ఆఫీసులన్నీ తిరిగాను. అందరినీ ప్రార్థించాను. కాని ఫలితం లేకపోయింది. నాలుగేళ్లు ఉద్యోగం లేకుండా వున్నాను. చివరకి అనుకోకుండా ఈ ఉద్యోగం అయింది."

సత్యనారాయణ చెప్పడం ముగించాడు. రాజ్యం అచేతనంగా అలాగే ఏదో ఆలోచిస్తూ కొంతసేపు వుండిపోయింది. చివరకు అంది:

"పోనీ లెండి!—మీ మామయ్యపేరు చెప్పుకొని ఈ వాళ ఈవిధంగా నేనా బ్రతుకుతున్నాం. లేకపోతే మీరన్నట్టు మన సంసారంకూడా మీ తమ్ముడి సంసారంలాగే తయారయేదేమో!"

"నిస్సందేహంగా!— మా మామయ్య నన్నప్పుడు కాని అక్కడికి తీసుకుపోయి అంతపట్టుబట్టి చెప్పించకపోతే నాకు యేనాటికీ చదువుమీద శ్రద్ధ యేర్పడేది కాదు."

"పాపం, మీ తమ్ముడికే ఎవరు చెప్పారు కారు!"

"వాడినికూడా తీసుకొచ్చేస్తా నంటూ వుండేవాడు. నా చదువైపోయాక మా తమ్ముడిని తీసుకు వద్దా మనుకుంటూ వుండగానే మా మామయ్య హఠాత్తుగా గుండెఆగి చనిపోవడం జరిగింది. దానితో ఆ విషయంలో శ్రద్ధతీసుకున్న వాళ్లెవరూ లేకపోయారు."

"పోనీ, యింట్లో మీరుండేవారు కదా?- మీరేనా అతనికి చెప్పవలసింది!"

"నే నెంతో చెప్పేవాడిని కాని వాడు వినేవాడు కాదు; అసలువాళ్లు ఊరుకుంటున్నప్పుడు నేను చెబితే వాడికేం లక్ష్యం వుంటుంది?- నేను వాడిని గట్టిగా కోపంపడేవాడిని. వాడు నా కెదురుతిరిగేవాడు. వాడి నలాగ విచ్చలవిడిగా వదిలేస్తే ఎందుకూ కొరగాకుండాపోతాడని, కొంచెం అదుపులో వుంచండని మా నాన్నతోను అమ్మతోను శతపోరేవాడిని. మా నాన్నగారు స్వంతవిషయాలలో ఆయనకుగల అశ్రద్ధచేత, మా అమ్మ వాడిమీదగల ముద్దుచేత యేమీ అనేవారు కారు. నేను ఒక్కొక్కప్పుడు వాడిని దండించడానికి పూనుకుంటే "అంతమందీ పోనేపోయారు. వీడి నేనా బ్రతకనివ్వవుట్రా?" అంటూ నాతో దెబ్బలాడేది మా అమ్మ. వాడు చదువు మానేస్తానన్నప్పుడు నేను చాలా తీవ్రంగా పోట్లాడేను. కాని లాభం లేకపోయింది. మా నాన్న మాట్లాడలేదు. మా అమ్మ 'వాడిభాగ్యమేదో వాడుపడతాడు. నువ్వేమీ పోషించక్కర్లేదు. వాడి నేమీ అనకు!' అంది."

"హుం!—ఆవిడన్నట్టుగా ఇప్పుడు బాధే పడుతున్నా డతను!"

"అంతే!—చిన్నప్పుడు పిల్లల్ని అదుపులో వుంచి, వాళ్ళవిషయంలో శ్రద్ధవహించకపోతే ఆ ఫలితాలు పెద్దవారయాక ఈస్థితికే వస్తాయి. మా మామయ్య పిల్లల్ని చూడు!-ఇప్పుడందరూ పెద్దపెద్ద ఉద్యోగాలలో వున్నారు. వందలకి వందలు ఆర్జిస్తున్నారు. ఎందువల్ల?—మా మామయ్య వాళ్లని చిన్నప్పట్నుంచి మంచి శిక్షణలో వుంచి పెద్ద చదువులు చెప్పించడం చేత. మళ్లీ ఆయన ఆస్తి మా ఆస్తిలో నాలుగోవంతేనా ఉండేదికాదు. ఉద్యోగంలో రాబడికూడా చెప్పుకో తగ్గంత లేదు. అయినా ఆయన అందులోనే జాగ్రత్తగా చేసుకొని పిల్లల్ని ప్రయోజకుల్ని చేశాడు. మా నాన్నగారు ఆ జాగ్రత్తలేక హద్దుమీరిన మర్యాదలకి పోయి, అనవసరమైనవాటని నెత్తిని వేసుకొని, గోముఖవ్యాఘ్రాలవంటివారిని నమ్మి ఆస్తినంతటని అప్పులవాళ్లకి అర్పించి కన్న సంతానాన్ని ఈస్థితికి తెచ్చారు."

"పాపం, శకుంతల ఇంకా చెప్పడానికి సిగ్గుపడి దాస్తోందికాని ఇంట్లో ఒక్కొక్కరోజున ఉపవాసాలుకూడా వుంటున్నారుటండీ!"

"అవునట రాజ్యం!—నాకుకూడా ఈవార్తలొస్తున్నాయి!" విచారంగా అన్నాడు సత్యనారాయణ.

"మనం ఇంకేం చేయగలం చెప్పండి!—నెలకైన దానిలో మూడొంతుల సామాన్లు ఎప్పుడంటే అప్పుడిస్తూనే వున్నాను. ఇదికాక మీరు అయిదు పదీ ఎక్కడోఅక్కడ తెచ్చి ప్రతి నెలా ఆయనకి సర్దుతూ నేవున్నారు. బట్టలు లేక బాధపడుతోందని అప్పు

డప్పుడు చీర కొనుక్కోమని ఇస్తున్నాను. ఇంతకంటే సాయపడడానికి మన ఆదాయం మాత్రం యెంత చెప్పండి!" అంది రాజ్యం భర్త ముఖంలోకి చూస్తూ.

"నిజమే రాజ్యం!" అన్నాడు సత్యనారాయణ ఏదో ఆలోచిస్తూ. కొంతసేపు ఊరుకొని మళ్లీ అన్నాడు.

"ఆపిల్ల ఇక్కడుండేకంటే వాళ్లన్నగారింటికి వెళిపోయి కొంతకాలం అక్కడుంటే మంచిదని పిస్తున్నది!

అక్కడికి వెళితేమాత్రం యేం సుఖపడిపోవాలి ఆ ఒదినగారు నానా కొల్పులు కొల్పి వేధిస్తుంది!"

"అప్పులవాళ్లు ఇంటి నొదలకుండా తిరుగుతున్నారట. వాళ్ళందరిని తప్పించుకుంటూ వీడు కనబడకుండా తిరుగుతున్నాడట. వాళ్లంతా వీడెక్కడ కనబడినా తంతాం అంటున్నారట."

"అయ్యయ్యో! వాళ్లతో మీరేనా చెప్పారు కారండీ?" అని అడిగింది రాజ్యం.

"చెబితే మాత్రం ఎంతకాలం ఊరుకుంటారు రాజ్యం. మాసాలు, సంవత్సరం అయినా దమ్మిడీ కూడా తీర్చకుండా వుంటే?" అన్నాడు సత్యనారాయణ.

"వెధవలు అన్నంత పనీ చేస్తారేమిటో?" అంది రాజ్యం భయంగా.

"అయినా మనం ఏం చేయగలం రాజ్యం?— అప్పటికీ నేను చెబుతూనే వున్నాను వాళ్లతో!" అన్నాడు సత్యనారయణ విచారంగా.

"ప్చ్" అంది రాజ్యం భారంగా.

వారంరోజులు గడిచాయి. శకుంతల ఈవారం రోజులనుంచీ రాలేదు.

ఆవేళ సాయంత్రం ఆఫీసునుంచి ఇంటికొస్తూనే, "శకుంతలొచ్చిందా?" అని అడిగాడు సత్యనారాయణ భార్యని.

"ఆవేళనుంచి మరి రాలేదండీ!" అన్నది రాజ్యం.

"రాకపోతే నువ్వేనా వెళ్లి కనుక్కోవద్దుటే ఏమిబ్బందులు పడుతున్నారో యేమిటోను?" అన్నాడు సత్యనారాయణ.

"నాలుగురోజుల క్రిందట వెళ్లాను కదుటండీ?" అంది రాజ్యం.

"అప్పుడు వెళితే సరా?— వాళ్ల పరిస్థితులు బాగులేనప్పుడు ఎలా వుంటున్నారో కనుక్కుంటూ వుండొద్దూ మనంవుండి?" అన్నాడు సత్యనారయణ.

"ఇంకా మరెలాగ కనుక్కోమనమండీ?" అన్నది రాజ్యం.

"అదికాదు రాజ్యం, వాళ్ల పరిస్థితి మరీ ప్రమాదకరంగా వుంది. ఇవాళ పొద్దున్న ఎవడో అప్పులవాడు ఇంట్లో కూడా చొంబడి మాతమ్ముడిని తిన్నపోతే శకుంతల గోలపెట్టగా ఇరుగుపొరుగులవాళ్లొచ్చి దెబ్బలాడి బయటికి పంపించేశారట వాడిని.

"ఇది మీకెవరు చెప్పేరు?"

"మా ఆఫీసులో పనిచేస్తున్న గుమస్తా ఒకడు ఆవీధిలోనే వుంటున్నాడు. వాడు చెప్పాడు. నేను వెళ్లి కనుక్కుందామంటే ఈ ఆఫీసుపనివల్ల అవకాశం లేకుండా వుంది. అదికాకుండా ఆపిల్లకి నాదగ్గర ఊరంత మొహమాటం!"

"బాగుంది!" అన్నది రాజ్యం.

"ఒకసారివెళ్ళి కనుక్కొని వచ్చేదాం రాకూడదూ?" అని అడిగాడు సత్యనారాయణ.

"ఇప్పుడా?" అంది రాజ్యం బద్ధకంగా.

ఏం?— రిక్షాలోవెళ్ళి మళ్ళీ అరగంటలో వచ్చేద్దాం!" అన్నాడు సత్యనారాయణ. రాజ్యం నిముషం ఆలోచించి, "అయితే అలాగే!" అంది.

"ఉండు. నేను రెండు నిముషాల్లో మొహం కడుక్కొనొచ్చేస్తాను!" అంటూ సత్యనారాయణ డ్రెస్సు విప్పి లుంగీకట్టుకొని తువ్వాలు, సబ్బుపెట్టె పట్టుకొని బాత్ రూంలోకి వెళ్లాడు.

ఇంతలో వీధి తలుపు దభీమని తోసుకొని ఒక పదిహేనేళ్ళ కుర్రవాడు గాభరాపడుతూ లోపలికొచ్చి, "ఏమండీ, శకుంతల ఒంటిమీద కిరసనాయిల్ పోసుకొని నిప్పంటించుకుంది. చాలా ప్రమాదంగా వుంది. మిమ్మల్ని వేగంగా రమ్మంటున్నారండీ!" అని చెప్పాడు. ఈ మాట వినగానే రాజ్యం "ఆఁ!" అంటూ అలాగే మ్రాన్పడి నిల్చుండిపోయింది. ప్రక్కనున్న బాత్ రూంలోవున్న సత్యనారాయణ ఈ మాట వినగానే సగం సగం మొహం కడుక్కుంటూన్న

వాడూ గభీమని బయటకువచ్చి "ఏమిటే?" అని అడిగాడు.

"శకుంతల ఒంటికి నిప్పంటించుకుందటండీ!" అంది రాజ్యం.

"అవునండీ, ఇప్పుడే అరగంట క్రిందట, మంటలార్పి పడుకోబెట్టారు. చాల ప్రమాదంగా వుంది. మా నాన్నగారు ఇంజక్షనులిస్తున్నారు." అన్నాడు వచ్చిన కుర్రాడు.

"మీ నాన్నగారెవరు"?

"డాక్టరు కామేశ్వరరావుగారండీ!"

వెంటనే సత్యనారాయణ లాల్చీ వేసుకొని వీధిలో పోతున్న రిక్షాని పిలిచాడు. అతను, భార్య వెంటనే రిక్షాలో బయల్దేరారు.

అయిదు నిముషాలలో రిక్షావెళ్లి ఆ యింటిముందు ఆగింది. సత్యనారాయణ, రాజ్యం రిక్షా దిగి లోనికి వెళ్లారు. కాని అప్పటికే శకుంతలచనిపోయింది. ఆమె మృతదేహం మంచంమీద పడివుంది. వారిద్దరు వెళ్ళేసరికి ఇంట్లో ఇసకవేస్తేరాలనంతమంది జనం చుట్టివేసివున్నారు. శకుంతల దేహాన్ని చూసి సత్యనారాయణ దుఃఖంతో అలాగే మ్రాన్పడిపోయాడు. ఆమె దేహం చాలాచోట్ల కాలిపోయి ఎర్రగా కన్పిస్తూన్న మాంసంతో భయంకరంగా వుంది. ముఖం పూర్తిగా కాలిపోయి వికృతంగా వుంది. రాజ్యం చూడగానే కెవ్వుమని అరచి భయంతో కళ్ళుమూసుకుంది.

శకుంతల మృతదేహంవున్న మంచం ప్రక్కనే చిన్న అల్మైరా వుంది. ఆ అల్మైరాలో చిన్నహరికేన్ లాంతరు వుంది. ఆ లాంతరులోని కిరసనాయిలే ఒంటిమీద ఒంపుకుంది శకుంతల. ఆ లాంతరు క్రింద ఒక ఉత్తరం కన్పించింది సత్యనారాయణకి. అతనా ఉత్తరం తీసి చూశాడు. అది తన తమ్ముడు భార్యకి వ్రాసిన ఉత్తరం. అందులో ఇలాగ వ్రాసి వుంది.

శకుంతలా!

నువ్వు ఈ ఉత్తరం చూసేసరికి నేనిల్లు వదలి చాలా దూరం పోయివుంటాను. నేనిలాగ నిన్ను విడిచిపెట్టి వెళ్ళిపోతూన్నందుకు నామీద నీకు చాలా కోపం రావచ్చు. అసలు నాకుకూడా నిన్నొదిలి వెళ్లడం ఇష్టంలేదు. కాని ఏంచేసేది? పరిస్థితులిలాగ వచ్చాయి. నాకొచ్చిన జీతం మనిద్దరికి పదిహేను రోజులకి మాత్రమే సరిపోతోంది. తక్కిన పదిహేనురోజులు నువ్వు ఎవ్వరింటేనా అడిగితెచ్చిన నాడు తినడం లేని నాడు ఉపవాసాలుండడం జరుగుతోంది. ఊళ్లో ఎవ్వరూ అప్పుకాని, అరువుకాని ఇవ్వకుండా వున్నారు నాకు. ఈ పరిస్థితులలో మనం ఎంతకాలం సంసారం సాగించగలం?—ఏమిటో శకుంతలా!— రానురాను బ్రతుకంటేనే రోత పుడుతోంది. మా అన్నయ్యలాగ చిన్నప్పుడు చదువుకొనివుంటే ఇప్పుడిన్ని బాధలు లేకపోయేవేమో!—కాని అప్పుడేమిటో చిన్నతనంవల్ల ఇవన్నీ తెలియక చదువుకోకుండా తిరిగాను. మా అమ్మా నాన్నా అయినా అప్పుడు శ్రద్ధవహించి గట్టిగా చెప్పారు కారు. కాని ఇప్పుడవన్నీ తల్చుకొని విచారిస్తే యేం లాభం? అయితే ఇప్పుడు రెండు సమస్యలు నన్ను బాధిస్తున్నాయ్: మొదటిది సంసారం ఇంకఎలాగ వెళుతుందా అన్నది, రెండవది అప్పులవాళ్లబాధ. ఇప్పుడు మొదటిబాధకంటే రెండవ బాధే అధికంగావుంది. ఎక్కడికి వెళ్ళినా ఈఅప్పుల వాళ్లు నాప్రాణాలు పీకేస్తున్నారు చివరికి ఇంట్లో కూడా చొరబడి చేయిచేసుకోడానికి తయారవుతున్నారు. ఇందువల్ల కొంతకాలం ఎటేనా తిరిగితే ఈబాధలు తప్పుతాయన్న ఉద్దేశంతోను, ఇంతకంటే మంచి ఉద్యోగం దొరుకుతుందేమో అన్న ఆశతోను ఇల్లువిడిచి పోతున్నాను. ఎటు పోతున్నానో మాత్రం ఇప్పుడు చెప్పలేను. అసలు ఎటుపోవడమో నాకే తెలియడంలేదు. నాగురించి నువ్వు మరేమీ విచారించకు. నేనుండిమాత్రం నిన్నేం సుఖపెట్టేను?— ఇలాగ నలభై రూపాయిల జీతం తెచ్చుకుంటూ ఇకమీదట మాత్రం యేం సుఖపెట్టగలను?—అంచేత నువ్వు మరి విచారించకుండా మీ అన్నయ్యదగ్గరకు వెళ్ళిపో!—మనరోజులు బాగుండి ఏనాటికేనా ఈ దారిద్ర్యం వదిలితే తిరిగి కలుసుకుందాం!—

శేషగిరి.

# నక్షత్రాలు: గ్రహాలు

శ్రీ కొల్ల మణిభూషణరావు

అనాది యుగములనుండి అనంతమైన నీలాకాశమున అసంఖ్యాకమై మినుకు మినుకు మెరయు నక్షత్రమండలములను చూచుటవలన వీటియందు ప్రాణి జీవించుటకు ఎవ్విధమగు ఆధారములు గలవా? లేవా? యను సమస్య వచ్చి అనిర్ణీతమైయుండెను. ఈ విశాలదృష్టిలో ఇట్టి అసంఖ్యాకమైన నక్షత్రములు దేనినుండి ఉద్భవించినవా యను తలంపు రాకమానదు.

యుగయుగములనుండి ఈ సమస్య అపరిష్కృతమైయుండెను. నేటి ఖగోళశాస్త్రము అత్యున్నత స్థితికి వచ్చిన తరువాత అనేక శాస్త్రజ్ఞులు ఈ విషయమై పలువిధముల చర్చలు జరిపిరి. మహాశాస్త్రవేత్త, మేధావి, యగు సర్ హెరాల్డ్ స్పెన్సర్ జోన్సు తన అరువదినాల్గవయేట ఈ విషయముగూర్చి కొన్ని ముఖ్యోద్దేశములను తెల్పుచు అనేక గ్రంథములను రచించెను. తన ముఖ్య పరిశీలనలబట్టి ఎల్లప్పుడు ఒకే పరిమాణము గొప్ప తేజస్సు, భయంకరమైన అగ్ని, వాయువులు మొదలగు వానితో నిండిన ఈ సూర్యమండలము చుట్టూ పడి దీక్షగా తిరుగుచున్న నవగ్రహములలో భూమియు నొక గ్రహమై యున్నదని తెలిపెను.

భూమిపై నివసించెడి ప్రాణికోటివలె ఇతర గ్రహములందుకూడ ప్రాణులుండుటకు కొన్ని అవకాశములు గలవని చెప్పుచున్నారు. సూర్యునకు మిక్కిలి దగ్గరగను దూరముగను సంచారముచేయు గ్రహములందు ప్రాణులు జీవించుటకు ఆధారములు లేవు. కొన్నిజీవులు మాత్రము హెచ్చు ఉష్ణమునందు అనగా మరుగుచున్న నీటియావిరియందును, మంచుకన్న -10°C ఉష్ణము వద్దను జీవింపగలవు. ఆయా ప్రదేశములందుండెడి వాతావరణమునందు ప్రాణి జీవించుటకు అనుకూలమగు వాయువులు అనగా ప్రాణవాయువు నత్రజని నీటియావిరి మున్నగునవి ఉండిన అచ్చటకూడా ప్రాణులు జీవింపగలవు.

సూర్యుని చుట్టూ తిరుగుచున్న నవగ్రహములలో బుధుడు మిగిలిన గ్రహములకన్న దగరగా నున్నాడు. బుధుని ననుసరించియే శుక్రుడు అను గ్రహము తిరుగుచున్నది. భూమి తరువాత పై గ్రహములవలె ప్రత్యేక వృత్తములలో అంగారకుడు బృహస్పతి, శని వరుణుడు, ఇంద్రుడు, యముడు అను గ్రహములు వరుసగా సూర్యుని చుట్టూ తిరుగుచున్నవి.

గ్రహములు నక్షత్రములు గావు. వీనికి నక్షత్రములకు వలె ప్రత్యేకమగు తేజస్సును లేదు. గాని సూర్యుని కిరణములచే తేజోవంతముగా మన దృష్టికి గోచరించును. నక్షత్రములకు, సూర్యునకు మధ్యనుండెడి దూరముతో ఈ నవగ్రహముల దూరము సరిపోల్చిన ఈ గ్రహములు సూర్యునకు చాలా సమీపమునన్నవని చెప్పుటలో సందేహము లేదు. ఈ గ్రహములలో మిక్కిలి దగ్గరగానున్న బుధుడు సూర్యునకు మూడు కోట్ల అరువది లక్షల మైళ్ళ దూరములో గలడు. నవగ్రహములలో చివరనుండెడి గ్రహములు ఇంద్రుడు, యముడు, సూర్యునకు సుమారు 400 కోట్ల మైళ్ళ దూరములో గలరని చెప్పుదురు. నవగ్రహము లన్నింటి పరిమాణము, సూర్యుని పరిమాణముతో సరిపోల్చిన సూర్యునిలో 1/170 వ వంతు కూడ లేవు. నవగ్రహములలో సూర్యమండలమునకు దగ్గరగా నున్న గ్రహములు అనగా బుధుడు, శుక్రుడు, భూమి, అంగారకుడు అను వాటికి ఇహలోకపుగ్రహము లందురు.

బుధుడు సూర్యునిచుట్టు నొకసారి తిరుగుటకు సుమారు 88 దినములు పట్టును. అందువలన అచ్చట సంవత్సరమునకు 88 దినములని చెప్పవచ్చును. బుధుడు భూమికన్న అనేక రెట్లు సూర్యునకుదగ్గరగా నుండుటచే సూర్యునకు భూమ్యాకర్షణశక్తికన్న బుధుని యందెడి ఆకర్షణశక్తి ఎక్కువ. ఈ గ్రహము తనలో తాను తిరుగుచు సూర్యునిచుట్టూ భూమివలె ఒకేవేగ

ముతో తిరుగుచున్నది. ఇచ్చటి వాయుమండలము భయంకరమగు విషవాయువులతో (Poisnous gass) నిండియున్నదని చెప్పుదురు. అచ్చటి ఉష్ణమాపకము 350°c పైగా నుండుటచే ఎవ్విధమగు ప్రాణులును జీవించుటకు అవకాశములు లేవు.

సూర్యమండలమునకు దగ్గరగానున్న రెండవ గ్రహము శుక్రుడు. ఈ గ్రహముయొక్క వ్యాసము సుమారు 3,008 మైళ్ళు గలదు. శుక్రగ్రహము, భూమికన్న సూర్యునకు సుమారు రెండుకోట్ల యాభైలక్షల మైళ్ళ తక్కువ దూరములో తిరుగుచున్నది. శుక్రుడు సూర్యునిచుట్టు నొకసారి తిరుగుటకు 225 దినములు పట్టును. శాస్త్రజ్ఞులు, పరిశోధకులు, ఈ గ్రహము గూర్చి పరిశీలింపగా ఇచ్చటనుండు మేఘములు దట్టమైన నీటి యావిరితో నిండి ఎవ్విధమగు విషవాయువు లుండుటకు అవకాశములు లేవని ఊహింపసాగిరి. బొగ్గుపులుసువాయువు అధికముగా నుండుటచే అచ్చటి ఉష్ణము మరిగెడి నీటికన్న హెచ్చు. అనగా సుమారు 120°c ఉండునని ఊహించిరి. అచ్చటి వాతావరణముయొక్క చలనముకూడ అధికముగా నుండుటచే అచ్చట తుపానులు వర్షములు భూమిపైనుండెడివాటికన్న అధికముగా నుండును. ఈ గ్రహమందు ప్రాణి జీవించుటకు అనుకూలమైన వాయువు లెవ్వియు లేనందున ఇచ్చట జీవరాసుల ఉనికికి ఆస్కారం కనుపించదు.

భూమి, సూర్యునినుండి 9 కోట్ల 30 లక్షలమైళ్ళ దూరములో గలదు. సూర్యుని కాంతి భూమిని చేరుకొనుటకు సుమారు 8 నిముషములు పట్టుచున్నది. ఈ భూమండలము తనలో తాను తిరుగుచు, 365¼ దినములలో సూర్యునిచుట్టు ప్రత్యేక వ్యాసములో తిరుగుటకు 580,000.000, మైళ్ళు ప్రయాణము చేయుచున్నది. తనలో తాను తిరుగుటకు 24 గంటలు లేక ఒకదినము పట్టుచున్నది. తనలో తాను తిరుగుచు సూర్యునిచుట్టు తిరుగుటవలన రాత్రింబవళ్ళు, ఋతువులు కల్గుచున్నవి. భూమండలముయొక్క వ్యాసము సుమారు 8,000 మైళ్ళు గలదు. భూమి సూర్యునిచుటూ అండాకారముగా (Elliptical way) తిరుగుటచే ఉత్తర దక్షిణ ధ్రువములందు 175 నుండి 180 దినములు వరుసగా పగలును రాత్రియు గలుచుండును. భూమిపై ఉష్ణమాపకము 32° F నుండి 125° F వరకుండును. ఇదిగాక ఇచ్చటి వాయుమండలము ప్రాణులుజీవించుటకు అనుకూలమైన వాయువులు, ప్రాణవాయువు, నత్రజని, నీటియావిరి, మున్నగు వాటితో నిండియున్నది. భూమండలము చుట్టు చంద్రుడు తిరుగుచున్నాడు.

అంగారకగ్రహమునందు ప్రాణి జీవించుటకు కొన్ని అవకాశములు గలవు. ఈ గ్రహము భూమికన్న సూర్యునకు ఒకటిన్నర రెట్లు దూరములోనున్నది. అచ్చట దినమునకు 24 గంటల 37.5 నిముషము లుండును. అంగారకగ్రహము భూమికన్న పదిరెట్లు తక్కువ బరువుకల్గి సుమారు, 4,230 మైళ్ళ వ్యాసము కల్గియున్నది. భూమ్యాకర్షణశక్తికన్న ఇచ్చటనుండెడి ఆకర్షణశక్తి చాలాతక్కువని చెప్పుదురు. ఈగ్రహము చుట్టు ఉదజని, హీలియం (Helium) మున్నగు వాయువులు ఆవరించుకొనియున్నవని తేల్చుచున్నారు. ప్రాణి జీవించుటకు ముఖ్యాధారము ఉష్ణము. అచ్చటి శీతోష్ణస్థితి హిమాలయ పర్వతములపైనుండెడి శీతోష్ణస్థితికన్న చల్లగనుండును. దూరదర్శినీయంత్రము (Telescope)ల సహాయమున తీసిన కొన్ని ఛాయాచిత్రములనుండి కొన్నికాలములందు అంగారక గ్రహమందు కొన్ని ప్రదేశములు ఆకుపచ్చగనుండి, గోధుమవరముగా మారినట్లుగపడుటచే అచ్చట సస్యాభివృద్ధి (Vegetation) ఉన్నదని తెలియుచున్నది. ఈ గ్రహమందు ఆదిమమైన వృక్షజాతికూడ కలదని నేటి శాస్త్రజ్ఞులు విశ్వసించుచున్నారు. ఈ విషయము మొట్టమొదట నేషనల్ జిగ్రాఫికల్ లోవర్ అబ్జర్వేటరీ పరిశోధకదళనాయకుడు ఇ. సి. సిఫుర్ కనిపెటెను. ఈ పరిశోధకదళము దక్షిణాఫ్రికానుండి అనేక పరిశోధనములు గావించుచున్నది.

బృహస్పతి అను గ్రహము భూమికన్న 1,300 హెచ్చు వైశాల్యము గల్గియున్నది. ఈ గ్రహము చుట్టును ఆరు ఉపగ్రహములు (Satllites) గలవు. వీటిలో 3 ఉపగ్రహములు ఈ గ్రహముయొక్క చలనమునకు వ్యతిరేకముగా తిరుగుచున్నవి. ఇచ్చట మంచుకన్న అనేకరెట్లు చల్లగా నుండును.

సూర్యునినుండి ఆరవ గ్రహము శని (Saturn). ఈగ్రహముచుట్టు మూడు వృత్తములు (Rings of Saturn) గలవు. ఇవియు చిన్న చిన్న తునకలుగా విడిపోవు ఉపగ్రహములని చెప్పవచ్చును. ఇవియుగాక ఈ గ్రహమునకు 9 ఉపగ్రహములు గలవు. ఈ గ్రహమందు ఉష్ణము మంచుకన్న —150°c తక్కువగా నుండును. ఈ గ్రహము చుటూ దట్టమైన మంచు అమోనియా (Ammonia) వాయువులతో ఆవరించుకొనియుండుటచే ఇచ్చట ఎవ్విధమగు ప్రాణులు జీవిం

ఈ మోస్తరుగానే యీ సాంకేతాలు సాగిపోతూ వుంటాయి. ఈ గ్రంథమందలి ముఖపత్రంలోని అంశాలు చాలావరకు—కవి, దేశ, కాలాదుల నిరూపణకు ఉపకరిస్తున్నవి. ఈ క్రిందివి ముఖపత్రాంశాలు:—

శ్రీ

—కృష్ణరాజ మహారాజకంఠీరవ వరేణ—త్రిభువన భీషణ శుంభనిశుంభ కుంభినీధర దంభ సంభేద దంభోళి నిభ దోర్దండ మండిత చాముండికా చరణ పుండరీక సేవాసాదిత ఖండనోద్ధత ప్రచండ రిపు షండ ఖండనోద్దండ మండలాగ్ర భూమండలాఖండలత్వ మార్తాండసుత పాండిత్య పండితీకరణ శౌండ ప్రాజ్ఞౌదార్య ప్రాబంధిక వసుధా సుధాంధోగణ గణనీయ మందార మంజరీ మకరంద మాధురీధురీణ వాగ్వైఖరీ నిధాన ప్రచురతర ప్రబంధ నిబంధన నైపుణ్య ధౌరేయ చిత్రతర చరిత్ర పరికర్మితాత్రేయసగోత్ర చామరాజ ధరా కాంత స్వాంత కుముద చంద్రబింబనుహిమ సాంబ ప్రతిబింబ మహీసూర పురవర ధీశేన—విరచితా తదాజ్ఞయా తత్కులమంత్రిప్రవర శ్రీశైలార్య దౌహిత్రేణ

శ్రీతిరుమలాచార్యనామ్నా ప్రకటితా

—సంఖ్యా సద్రత్నకోశికా—

(తత్పద వర్ణానుక్రమణికా)

చిన్నపుర్యాం వర్తమానతరంగిణీ ముద్రాక్షర శాలాయాం

—ద్వితీయవారం ప్రముద్రితా—

శకాబ్దాః ౧౭౭౮.

దీని ఆంధ్రానువాదంకూడా గమనించతగిందే:—పై ముఖపత్రానికి ప్రక్కపొరటలో ఇది ప్రచురింపబడ్డది:—అది యీ క్రిందిది:—

కృష్ణరాజ మహారాజ కంఠీరవ

వరులచే

శ్రీమత్సమస్తభూమండల మండనాయమాన నిఖిల దేశావతంస కర్ణాటజనపద సంపదధిష్ఠానభూత, శ్రీమన్మహీశూర మహాసంస్థానమధ్య దేదీప్యమానావికల కలానిధి కుల క్రమాగత రాజ క్షితిపాల ప్రముఖ నిఖిల నిజ రాజాధిరాజ మహారాజ చక్రవర్తి మండలానుభూత, దివ్యరత్న సింహాసనారూఢ, శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర, ప్రౌఢప్రతాప ప్రతిమవీర, నరపతి బిరుదు గలవారల గండలోకైకవీర, యదుకుల పయఃపారావార కళానిధి, శంఖచక్రాంకుశ కుఠార మకర మత్స్య శరభ సాళ్వ గండభేరుండ ధరణివరాహ, హనుమద్గరుడ కంఠీరవాద్యనేక బిరుదాంకిత శ్రీచామరాజ మహీపాల ధర్మపత్నీ కెంపనంజమాంబా గర్భసుధాంబుధి రాకాసుధాకరాయమాన—శ్రీ చాముండికాంబా వరప్రసాదోద్భవులగు వారిచే—

విరచితంబులై

తదాజ్ఞానుసారేణ

తత్కులమంత్రిప్రవర శ్రీశైలార్యదౌహిత్రులగు

—శ్రీ తిరుమలార్యునిచే—

ప్రచురము చేయబడిన

సంఖ్యా సద్రత్నకోశంబు

చాతురంగిక చమత్కృతి చక్రము

చతురంగ పారసర్వస్వంబను గ్రంథంబునందుఁ

బ్రతిపాదితంబులగు

౧౪౪ యిండ్ల చతురంగచక్రములలో

౬౪ యిండ్ల చతురంగచక్రములలో

ననేక ప్రకారములుగా నశ్వగతి

నడుపంబడియుండు వాని యం

దాశ్చర్యకరంబులైన కొన్ని చక్రంబులు

చెన్నపట్టణపు వర్తమానతరంగిణీ

ముద్రాక్షరాలయంబు

రెండవ ఆవృత్తి

ముద్రింపబడియె.

శకాబ్దాః ౧౭౭౮.

ఈ కృతికర్తఅయిన శ్రీకృష్ణరాజ మహారాజ కంఠీరవుడు — వందయేండ్లనాటివాడని గ్రంథస్థాధార రీత్యా తెలుస్తున్నది. ఇప్పటి మైసూరురాజ్యానికి గవర్నరుగావుండే శ్రీ జయచామరాజేంద్ర ఒడెయరు, ఇతనికి పూర్వం ప్రభుత్వంచేసిన శ్రీ కృష్ణరాజేంద్ర ఒడెయర్లకు ఈ కృతి రచయిత,—తాత తరంవాడని ఊహించుకోవచ్చును. — ఒక్కతరం ప్రభువుకు, మరొక్కతరం రాజుకు 85 సంవత్సరాల అంతరం ప్రకారం చూచినట్లయితే ఈ కావ్యకర్త నంద యేండ్ల (పుస్తకముద్రణ కాలము శాకాబ్దాలు౧౭౭౮) క్రిందటివాడని దరిదాపుగా నిర్ణయించుకోవడంలో బాధకంవుండదు. మైసూరుపాలకులు యాదవకులం వారు. చాముండికాదేవి వారి కులదైవం. సాధారణంగా వారిపేర్లు చామరాజో — కృష్ణరాజో అయి వుంటుంది. ఇట్టి ఆనవాయితీ తక్కిన రాజకులాల్లో

మృగ్యం. పైన చూపిన గద్యభాగాల్లో వీరికున్న బిరుదాలన్నీ గోచరిస్తాయి.

కృతికర్త అయిన శ్రీ కృష్ణరాజు తండ్రి శ్రీ చామరాజ మహీపాలుడు; తల్లి శ్రీ కెంపనంజమాంబ. ఇతడు సంస్కృతంలోనే కాకుండా, తెలుగులోను మంచిపండితుడు, చతురంగాది క్రీడాదులలో విశారదుడు. ఇతడు ఈ చదరంగాల్లోని కిటుకులన్నీ క్షుణ్ణంగా ఎరిగినవాడు. కనుక అప్పటికే అనగా నూరేండ్ల క్రితమే కర్ణాటదేశంలో తెలుగు సాహిత్యం నిరాఘాటంగా ప్రచారంచేస్తూవున్నట్లు బోధపడుతూవున్నది. పైగా, ఆంధ్రపండితకవుల్లైన ఆదిపంపకవి మొదలయినవారే ఆ కర్ణాటక భాషలో కూడా వ్రాసినట్లు చరిత్రలు చెబుతున్నవి. వీరశైవమత గ్రంథాలు దాదాపు తెలుగులో వ్రాయబడ్డవి. తన్మతస్థాపకుడయిన బసవేశ్వరుని కాలానికి విశేషప్రచారానికి వచ్చినవన్నీ కన్నడములోనివి కావేవు. అసలు బసవేశ్వరుడూ కన్నడీడే.

కావ్యయుగంలో, జాతిచే కర్ణాటకులయినవారు—తమ మాతృభాషను—వ్యవహారాల్లో ఉపయోగిస్తూ వచ్చినా గ్రంథరచన ప్రస్తావము వచ్చేటప్పటికి తెలుగుభాషకే ప్రాధాన్యమిచ్చినారు. శ్రీకృష్ణదేవరాయలు పుట్టుకతో కర్ణాటకుడు అయినా తెలుగుకే ఎనలేని ప్రాముఖ్యం ఇచ్చి ఆదరించాడు. అవిధంగానే ఈ కృష్ణరాజ మహారాజ కంఠీరవుడు ఆంధ్రాన్నే ఎక్కువగా అభిమానించినట్లు కనబడుతున్నది. ఇంతెందుకు? బిడారం కృష్ణప్ప రాచప్పలు కన్నడులే. అయినా వాళ్ళు తెలుగుకీర్తనలు, జావళ్ళు పాడే గొప్పసంగీత విద్వాంసులుగా మైసూరు మహారాజా స్థానంలో చెలామణి అయినారు. ఆ యీ సంపర్కాలను పురస్కరించుకొని మాత్రే — కన్నడానికి ఆంధ్రులే తొలినుండి ప్రాణంపోసి, లిపితో సహా, తక్కిన హంగులన్నీ (తమ తెలుగుభాషకువలె) కుదిర్చిపెట్టారు. ఇది విషయాంతరం.

గ్రంథాంతంలో ఈ క్రింది వాక్యాలు కనబడుతున్నవి:—

"శ్రీమత్సమస్త ధరణీమండల పుండరీకకర్ణికాయమాన కర్ణాటకజనపద మధ్య విద్యోతమాన విస్మయమాన వైభవ భవనాయమాన శ్రీ మన్మహీశూరపురవరాధీశ రాజాధిరాజ చామరాజ ధర్మపత్నీరత్న కెంపనంజాంబికా గర్భ సుధాంబుధి సుధాకరాయమాణ శ్రీ కృష్ణరాజ మహారాజ కంఠీరవగుణచే శాలివాహన శక వత్సరంబులు ౧౬౭౨ కి సరియయిన పరాభవనామ సంవత్సరపు కార్తీకశుద్ధ ౧౦ గురువారంబున లోకోపకారార్థంబుగా విరచితంబయినది.

చెన్నపట్టణముతో చేరిన తిరువటీశ్వరుని పేటలో కుశలకలారత్నగర్భమనే శిల్పభావ ముద్రాక్షరశాలకు అధిపతియైన కం. కృష్ణరాజుచాత అచ్చువేసి రంగులు తీర్చబడినది.

ఈ మాటలనుబట్టి—ఇది వర్తమాన తరంగిణీ ముద్రాక్షరశాలలో శా. శ. ౧౬౮౨ లో ముద్రణం అయినా శ్రీ కృష్ణరాజమహారాజ కంఠీరవునిచే ౧౬౭౨ లోనే విరచితమయిందని తెలుస్తున్నది. అనగా, రచనానికి. ముద్రణానికి 10 యేండ్ల అవకాశం ఉండినదని దృఢమవుతున్నది. పైగా, పటములన్నీ వర్తమానతరంగిణిలో ముద్రితాలయితే వర్ణచిత్రశిల్పాలుమాత్రం కుశలకలారత్నగర్భ శిల్పభావ


ఔరా! అదేమిటామాట!
సంతానం కుళ్లి కృషిస్తూ ఉంటే తల్లికి క్షోభ కాదూ?
భారతీ-భారతాంబ బొల్లి, సమస్తచర్మవ్యాధులచే పీడింపబడుచున్న తన సంతానం కోసం ఎంత విచారిస్తూ ఉందో?
(స్థాపితము 1920 సం॥రం)
ఇదుగో మా చిరకాల అనుభవంతో ఇస్తూ ఉన్న అభయం.
మాకు నేడే వ్రాయండి
రెడ్డి అండ్ కో.,
గోపాలపురం. (తూ గో.జి)

ముద్రాక్షరశాలలో దిద్ది తీర్చబడింపని విశదమవుతున్నది. ప్రతిచతురంగ చక్రంలోను అశ్వగతి క్రమాన్ని సూచిస్తూ రంకులతో వేయబడినగళ్లు— ఆ క్రీడలోని అశ్వగతులను విస్పష్టంగా తెలిసికోవడానికి ఎక్కువగా తోడ్పడుతున్నవి. పరదేశీయ గృహాంతర్వినోద క్రీడలకు (Indoor Games) పనుపడిన మనవాళ్ళు, చిరకాలంనుండి మిక్కిలి ఉత్సాహం కలిగించే దేశీయక్రీడలను బొత్తిగా మఱచినారు. అన్యదేశీయానుకరణంవల్ల ఆర్థికంగాను, సాంఘికంగాను, జాతీయంగాను మనవాళ్ళ వ్యాయామరంగం కేవలం పెద్దమ్మ తాండవించే సదనంగా తయారు కావడం శోచ్యం. అన్ని కళలతోబాటు ఈ క్రీడా కళనుగూడా పునరుద్ధరించడం మన కనీసధర్మం.

కావన— ఈ సంఖ్యారత్నకోశ చతురంగ సారసర్వస్వాలను ఎవరయినా వెలుగులోకి తేవడానికి పూనుకొంటే— ఆంధ్రంలోని సుప్రసిద్ధ వినోదక్రీడా సమితిలో మకుటాయమానమనిన్నీ, విరామసమయాల్లో మహారాజుల మొదలు సేవకుల వరకు—ఎల్లరకు ఆనందసంధాయకమనిన్నీ—బుద్ధివికసనానికి మిక్కిలి సహకారి అనిన్నీ, ప్రఖ్యాతిపొందిన యీ చతురంగపు టాట ఇకమీదనయిన ఊపిరిపోసికొని జీవించడానికి అవకాశం కలగడమేకాకుండా, సంఖ్యారత్నకోశం గూడా మనసారస్వతంలోని ఒక అపూర్వతలంకారంగా ప్రకాశింపగలదని నా ఆశయం.

# కృష్ణాతీర శిలాలయములు విష్ణుకుండినులవే

## శ్రీ మాజేటి ప్రసాదరావు

ఉండవల్లి, మొగల్రాజపురం, భైరవకొండ మొదలైన శిలాలయాలన్నీ కృష్ణాతీరమందున్నవి. మొదటిది గుంటూరుజిల్లాలోను చివరిరెండు కృష్ణాజిల్లాలోను యున్నవి.

క్రీ. శ. మూడవ శతాబ్దము ప్రారంభమగుసరికి దక్షిణ హిందూదేశమందు శాతవాహన రాజవంశీయుల పరిపాలన మంతరించినది. వారి తరువాత ఆంధ్రదేశమును మాటులు, అభీరులు, ఇక్ష్వాకులు, పల్లవులు మొదలగువారు భిన్నాభిన్నముచేసి స్వతంత్ర పరిపాలన సాగించియున్నారు. వీరి తరువాత ఆంధ్రదేశమును పరిపాలించినవారు సాలంకాయనులు. వీరి తరువాత విష్ణుకుండినులు. వీరి పరిపాలన దాదాపు క్రీ. శ. 4 వ శతాబ్దము ప్రారంభమునుండి క్రీ. శ. 6 వ శతాబ్దము వరకు సాగియున్నది.

శ్రీ డూ్యబ్రియేల్ (Dubriel) మహాశయుడు కూడ వీరు పైకాలమందే యాంధ్రదేశమును పరిపాలించినారనియు, వీరు లలితకళలను ఎక్కువగా పోషించినారనియు, వైదిక మతాన్ని కూడా ఆదరించారనియు తెలియుచున్నదనియు వ్రాసియున్నారు.

ఉండవల్లి, భైరవకొండ, మొగల్రాజపురం మొదలగు శిలాలయాల నిర్మాణం, అలంకరణ మొదలగు వానిని పరీక్షించినయెడల యీ క్రింది లక్షణము లగుపించును.

1. ఈ దేవాలయములన్నియు పర్వతములు తొలిచి చెక్కబడినవే.

2. ఈ దేవాలయములలో ముందు మంటపములు (Halls) చతురస్రాకారపు స్తంభాలపై ఆధారపడి యుండును.

3. మందిరద్వారము లన్నిటి కిరుపైపుల ద్వారపాలకుల విగ్రహములు గూళ్ళలో చెక్కబడి యుండును.

4. ఈ ద్వారపాలకుల బొమ్మలు జుట్టుముడితోను, తలమీద రెండు కొమ్ములతోను, విచిత్రాలంకరణలతో ఉంటాయి.

5. స్తంభములు చెక్కబడినతీరు, వానిమీద చెక్కబడిన లతలు, పద్మములు.

అన్నిటికన్న ఎక్కువగా ఈ దేవాలయము లందు కానవచ్చు ముఖ్యలక్షణములు రెండు గలవు. 1. ఈ దేవాలయా లన్నిటియందు చెక్కబడియున్న 'పూలకుండీ' బొమ్మలు. స్తంభాలయొక్క అడుగుభాగమందు ఒక పూలకుండీబొమ్మ, దానినుండి పుష్పములు బయటకు వచ్చుచున్నట్లు చెక్కబడియున్నవి Flowers in the vase). 2. దేవాలయ మంటపము) అడుగుభాగమున గోడలమీద పంజా పైకెత్తి, తోకలు పైకిలేపియున్న సింహాపు బొమ్మలు.

ముఖ్యముగా పై-రెండు విషయములు పరిశీలించిన యెడల-ఈ శిలాలయములు విష్ణుకుండిన నిర్మితములే అను

టలో సందేహ ముండజాలదు. కారణమేమన విష్ణుకుండినుల దానశాసనములందు మనము 'కేసరి' ముద్రను గాంచగలము. ఈ విష్ణుకుండినులు పరిపాలించిన ప్రాంతమందు దొరికిన నాణెములమీద కూడ ఒక వైపు పూలకుండీ బొమ్మ, రెండవవైపున పంజా పైకి ఎత్తి తోకలు ఉన్నత్తుగా పైకి లేపియున్న సింహపు బొమ్మ కాంచగలము ఈ నాణెములు బంగారు, వెండి లోహముతో చేయబడియున్నవి. ఈ నాణెములను ఎక్కువగా ఉత్తర సర్కారు జిల్లాలలో కమీషనరుగా పనిచేసిన సర్ వాల్టర్ ఇలియట్ (Sir Walter Ell·ot) సంపాదించెను.

సర్ వాల్టర్ ఇలియట్, ప్రొఫెసర్ రాప్సన్ మొదలగువారు ఆ నాణెములు పల్లవరాజులకు చెందినవని తప్పుడుగా సిద్ధాంతీకరించి యున్నారు. వీరి సిద్ధాంతములు తప్పుగా పేర్కొనడానికి తగినంత ఆధారము కలదు. 1. ఈ నాణెములమీద నున్న సింహము పూలకుండీ, సౌధము మొదలగు ముద్రలన్నియు ఈశిలాలయములకు సంబంధించినవై యున్నవి. 2. విష్ణుకుండిన రాజుల దానశాసనములమీద కేసరిముద్రలు ఉన్నవి. 3. వీరు ఈసిద్ధాంతము చేసియున్న కాలమునకు విష్ణుకుండినులను రాజవంశము ఆంధ్రదేశమును పరిపాలించిన దను విషయము చరిత్రకారులకు తెలిసియుండలేదు. 4. ఈనాణెములు ఎక్కువగా విష్ణుకుండినులు పరిపాలించిన ఉత్తరసర్కారుజిల్లాలయందే లభించినవి.

పై నుదహరించిన కారణములయందు ముఖ్యముగా గమనింపదగినవిషయము వారు ఈ నిర్ణయము చేసిన కాలమునాటికి ఆంధ్రదేశమును పాలించిన రాజుల వంశక్రమము నిర్ణయింపబడి యుండలేదు. మరియొక కారణ మేమనగా వీరికి లభించిన నాణెముల యందు ఒక నాణెముమీద పూలకుండీ, సింహము ముద్రలేకాక, 'శ్రీపర్వత' యను నక్షరములుకూడ నున్నవి. విష్ణుకుండినరాజులు "శ్రీపర్వతస్వామి"ని ఆరాధించియున్నారని తెలియుచున్నది.

ఉండవల్లి గుహాలయందు ఒక గోడమీద రెండు మాటలలో 7 అక్షరముల పేరు ఒకటి చెక్కబడియున్నది. ఆ అక్షరములు "శ్రీ ఉత్పత్తి పిడుగు" ఈ పేరు ముందరి హాలులో కానవచ్చుచున్నది. ఇంకొక విచిత్ర మేమనగా ఈ పేరే విజయవాడ ఇంద్రకీలాద్రి పర్వతముపైనున్న "అక్కన్న—మాదన్న" గుహాలయ ద్వితీయశ్రేణియందున్న స్తంభములపైన (Supporting walls) మీదకూడనున్నది. ఈ విషయము ఆర్కియాలజీడిపార్టుమెంటు (Archaelogical Department.) వారు కూడా చూచిఉన్నట్లు కనబడుటలేదు.*

పై నుదహరించిన వాస్తవములను పరికించిన యెడల ఈ శిలాలయములు లలితకళల నెక్కువగా ఆదరించిన విష్ణుకుండిన రాజవంశీయులే నిర్మింపదు యుందురనియనుటలో సందేహ మిసుమంతయును లేకేని

---

* ఈ పేరు ఈ గుహాలు నిర్మించిన, నిర్మింపజేసినవారిలో ఎవరిదో తెలియదు.


## భారతి సచిత్ర మాసపత్రిక

### ప్రకటన రేట్లు

కవరు పేజీలు

| | కాజువల్ | కంట్రాక్టు |
|---|---|---|
| 4 వ కవరు పేజి | | |
| 2 లేక 3 రంగులు | రు. 125/- | రు. 100/- |
| 2 లేక 3 వ కవరు పేజి | | |
| ఒకే (నలుపు) రంగు | 90/- | 75/- |
| లోపలి పేజీలు | | |
| పూర్తి పేజి | 70/- | 60/- |
| అర్ధ పేజి | 35/- | 30/- |
| పావు పేజి | 20/- | 15/- |

ప్రత్యేక స్థానములకు 25% అదనం.

సంవత్సరమునకు వరుసగా 12 ప్రకటనలు చేయువారికే కాంట్రాక్టు రేటు వర్తించును.

* కవులు, కళాకారులు, రచయితలు మొదలైన వారి ప్రకటనలు ఒక కాలం ఇంచికి లేపకు రు. 2/- చొప్పున ప్రకటించబడును.

మేనేజరు, భారతి,

మద్రాసు-1.

# గ్రంథ విమర్శనము



## శ్రీ శాంతి సామ్రాట్టు అశోక చరిత్రము

శ్రీ కల్లూరి వేంకటనారాయణరావు: ప్రతులకు శ్రీ కె. ఆర్. కృష్ణశర్మ రైల్వే స్టేషన్ దగ్గర. అనంతపురం. వెల: 5 రూపాయలు.

శ్రీ కల్లూరి వేంకటనారాయణరావుగారు 'ఆంధ్ర వాఙ్మయ సంగ్రహ చరిత్ర' రచించిన 'కవితావేది'గా ఆంధ్ర పాఠక లోకానికి చిరపరిచితులు. వీరీ ప్రస్తుత పద్యకావ్యం 'బోధార్షి' అనే లేఖినీ నామధేయంతో రచించారు.

ఇది సుమారు 14 వందల పద్యాలతో సప్త కాండాత్మకంగా రచించిన ఉద్గ్రంథం. కథాగమనానికి అనుకూలంగా రచయిత కాండలన్నీ తిరిగి చిన్న చిన్న 'ధార'లుగా విభజించుకొన్నారు.

అశోక చక్రవర్తి కళింగాపూర్వ శాంతి సందేశమే ఈ కావ్యం పరమలక్ష్యం. అయితే 'శాంతి సామ్రాట్టు అశోక చరిత్రము' అని ఈ కావ్యానికి పేరు పెట్టడంవల్ల దీనిలో అశోక చరిత్ర, ఆ చక్రవర్తి బాల్యంనించీ వర్ణించడం కొంతవరకు సమంజసం కావచ్చును

కథాగమనం యావత్తూ ఆ చక్రవర్తి బౌద్ధ ధర్మావలంబనానికీ, బౌద్ధ ధర్మవ్యాప్తికీ ఉపాంగంగా వర్ణించినప్పుడే ఈ కథా వర్ణనకు సార్థక్యం ఏర్పడగలదు. నిజానికి అశోకచక్రవర్తి బాల్యకథలకు, వివాహాది కథలకు ఈ కావ్యలక్ష్యంతో అంతగా సమన్వయంగాని, అంగాంగీ భావంగాని లేదు.

పైగా ఈ కావ్యం అశోకచక్రవర్తి చరిత్రతో కాక, అతని జనకుడు బిందుసారుని చరిత్రతోను, దానికి పూర్వం మౌర్యచక్రవర్తుల సంగ్రహచరిత్రతోను ప్రారంభం అవుతుంది. ఇంకా దీనికిపూర్వం ఈ కావ్యావతరణకు నాందిగా, కవి ఈ అశోకచరిత్ర అంతా వేదాంగుడనే గురువుచేత మహారాష్ట్ర నాయకుడు బాలాజీకి వినిపింపజేస్తారు. కవి తమ కావ్యం అంతా బాలాజీ శ్రోతగా రచించారు.

ఈ కావ్యంలో తృతీయ కాండలోగాని అశోకుడు జన్మించడు. కళింగయుద్ధము, అశోకుని వైరాగ్యము, మొదలయినవన్నీ పంచమ కాండలో వస్తాయి.

కావ్య లక్ష్యదృష్ట్యా, కథా కథనదృష్ట్యా పరిశీలిస్తే కళింగ యుద్ధానికి పూర్వం జరిగిన అశోక చరిత్ర గాథలన్నీ ఈ కావ్యానికి సన్నిహితంగా సమన్వయించవు. కేవలం అశోకచరిత్ర వర్ణనమే ఈ కావ్యానికి పరమలక్ష్యమని అనుకొన్నా, మొదటి మూడుకాండలగాథ ఈ కావ్యానికి కేవలం భారభూతంగానే కనిపిస్తున్నది

కళింగ యుద్ధానికి పూర్వరంగంతో ఈ కావ్యం ప్రారంభించివుంటే దీని కథారచనలో చక్కని సంశ్లిష్టత, అంగాంగీ భావము అమరివుండేవి.

ఈ కావ్యరచన అంతా సుసంస్కృతమయిన సాంప్రదాయిక శైలిలో చక్కని ధారాశుద్ధితో శ్రావ్యంగా సాగిపోయింది.

ఈ క్రింది పద్యాలనుబట్టి వీరి రచనా శక్తి, కవితా పటిమ గురించవచ్చును. ఇవి ద్వితీయ కాండలో బిందుసారుని సుభద్రాంగీ ప్రథమ సమావేశ ఘట్టంలోని పద్యాలు:

'ఆ వాటినీ సమీపమున
నద్భుత విక్రమచారు రూపసం
పత్తులతోడ నిందుముఖి
మానిని నొక్కతె చాపహస్తను
ద్యత్తినీయ పుంఖశర
ధారణ తత్పర, సుప్రయోగ దృ
గ్దత్త మనస్క జూచి, యధికంబుగ
నచ్చెరువంది రెల్లరన్.'

'పరిచర కలకలముల్ విని
జూచె భూజాని మెచ్చె సుందరరమణిన్
వర వర్ణ లీఢ పదా
త్తిర, శరసంధాన కౌర్య తన్మయు తరుణిన్.'

'వీపున నొక దసకరమున్
దూపుల గన్గొనె ను దీర దోర్బలము, రుచుల్
దాపిన గండము, జొక్కపు
మూపును నాతిపముపంటు ముంగురులపసల్.'

'శాస్త్రి'

# గ్రంథ విమర్శనము

## సూక్తినిధి

శ్రీ మిన్నికంటి గురునాథశర్మ. వెల 1-8-0. ప్రతులకు రచయిత, బ్రాడీపేట, 5 వ లైను గుంటూరు 2.

'నీతిలీల' 'భావలీల' అని ఈ పద్యకావ్యం రెండు భాగాలు మళ్ళీ నీతిలీలలో రెండాశ్వాసాలు, భావలీలలో రెండాశ్వాసాలు ఉన్నాయి.

నీతిలీలలో ప్రథమాశ్వాసంలోని పద్యాలన్నీ ప్రాచీన సంస్కృత సూక్తిశ్లోకాలకు అనువాదాలు. రెండవ భాగంలోని పద్యాలన్నీ కవిస్వకపోల కల్పితాలు.

ఇక భావలీలలో మొదటి ఆశ్వాసం సంస్కృత కవి నాగరాజు రచనకు ఆంధ్రానువాదము. ఈ నాగరాజు ధారానగరాధీశ్వరుడు. ఇతడు టాకవంశోద్భవుడు. ఇతని మూలశ్లోక రచన గూఢార్థమయంగా ఉంటుంది. అయితే కొంత ఆలోచిస్తే ఆ భావం సులభంగానే గోచరిస్తుంది. నిజానికి ఈ శ్లోకాలను ప్రహేళికలన్నా అనవచ్చును. ఈ క్రింది అనువాదాన్ని బట్టి వీటి స్వభావము గ్రహించవచ్చును.

"అలఘుల విల్లుజేయుల పువు
టమ్ములకున్ దది ప్రీతి తొయ్యలిం
దలచుచు బాంధుడొక్కడు ని
దాఘమునన్నడి మింట సూర్యుడు
జ్జ్వలుడైయుండ, దప్పిగొని
పరిడి శూన్యసరోవరంబు న
ల్వలకులు సూచియుంబువులు
పానము సేయక మోదమందెసిన్."

ఇక్కడ మదనాతురుడయిన పాంథుడు మధ్యాహ్న వేళ దప్పిగొని నీళ్ళు లేని ఒక సరోవరం సమీపించాడు. నీళ్ళు మీ తాగక పోయినా అతి ఆనందంగానే ఉన్నాడు. మొట్టమొదట ఇది చదవగానే నీళ్ళేమీ లేనిచోట దప్పిగొని అచ్చటికి వచ్చిన వ్యక్తి సంతోషంగా ఉండడానికి కారణమేమని మనకు సందేహం కలుగుతుంది కాని అతడు మదనాతురుడు. తామరలు మన్మథ బాణాలు. ఆ చెరువులో అవి కనబడకపోయేసరికి మంచి నీళ్లు త్రాగకపోయినా అతని కెంతో సంతోషం కలిగింది. ఇదీ దీని గూఢార్థం!

నాగరాజకవి శ్లోకాల ధోరణి అంతా ఈ విధంగా సాగిపోతుంది. అనువాదకులు తమ మనోజ్ఞమైన శైలిలో అక్కడక్కడ మూల రచనకు కూడా మెరుగులు పెట్టారు. ఈ కృతి అనుకరిస్తూ ఈ కవి స్వకపోలకల్పితంగా వ్రాసిన రచనకూడా హృద్యంగా సాగింది:

"అటు నిటు జూచి గబగబ నరిగి గదికి
నప్పబాణ సగుండెను నలగు పాన్పు
నందు మెయివాల్చి సుగుణ నిల్వగ్రముంగు
దన్ను రసికోని లేచి యుద్దవిడిబరచె"

ప్రాచీన నీతిసూక్తులకు ఈ కవి చేసిన అనువాదం కూడా పరిశీలించదగినదే:

"తిలలిక్షు దండములు కాం
తలు, తురగులు, చందనమ్ము తాంబూలము భూ
ములు దధి బంగారమ్ము మి
కుల మర్దనమున వహించు గుణవర్ధనమున్"

స్వకపోల కల్పితంగా ఈ కవి రచించిన నీతిలీల ప్రాచీన కవుల నీతిలీలతో తులతూగుతున్నది:

"బీదవాడు రాతిమీద వారు బయట
నిదుర బోవు గంటె నిండ రేయి
మేడలోన పాన్పుమీద బరుండిన
ధనికునకు రాదు! తన్ను కొన్న!"

శ్రీ మిన్నికంటి గురునాథ శర్మగారి 'సూక్తినిధి' కవితాభిమానులందరు పరిశీలింపదగినది. 'శాస్త్రి'

## విజ్ఞాన యాత్ర
## కుటీర పరిశ్రమలు

శ్రీ కె. వి. ఎ. సత్యనారాయణ వర్మ. ప్రతులకు: పేరూరి సత్యవీర వెంకటేశ్వరరావు. వంకట నారాయణ వీధి. గాంధీనగరం. కాకినాడ. వెల: ఒక రూపాయి.

ఆంధ్రదేశంలో కుటీర పరిశ్రమలను గురించి విజ్ఞాన యాత్ర ధోరణిలో వ్రాసిన చిన్నగ్రంథం ఇది. కనకనే గ్రంథకర్త దీనికి 'విజ్ఞానయాత్ర: కుటీర పరిశ్రమలు' అని పేరు పెట్టారు. దీనికి 1957 సంవత్సరం

ప్రముఖపత్రికలూ, ప్రఖ్యాతసాహితీపరులూ ప్రశంసించిన

**ఉత్తమ గ్రంథాలు**

1. సంజప్రణయం: పదికథలూ, గల్పికలు. రచన: పూషా: వెల 0-50 న. పై.
2. పారిజాతం: నేటి ప్రఖ్యాత కథకుల పదకొండు కథలు. వెల రు 1-25 న. పై.
3. తెరమెరుగులు: (ఐదు ఉత్తమ నాటికలు) తుక్కుపిల్ల దొరికింది (రావికొండలరావు); దొంగ (పోతుకూచి సాంబశివరావు); తెల్లవారింది (హితశ్రీ); తెరమరుగు పీడలు (కొండముది శ్రీరామచంద్రమూర్తి); ప్రేంతు ప్రత్యేకం (అంగర సూర్యారావు). వెల రు 1-50 న. పై.

శోభా ప్రచురణలు, విజయనగరం సిటీ.

జనరంజక సాహిత్య గ్రంథా
ప్రభుత్వం బహుమతి లభించింది.

ఇందులో గ్రంథకర్త పా-- ప్రాంతాలలో అల్లికలనుగురించీ, ఏలూరు రత్న కంబళ్ళ నేతనుగురించీ, కొండపల్లి బొమ్మలు, బందరు కలంకారీ అద్దకాలు మొదలైన ఆంధ్రదేశంలోని ప్రసిద్ధమయిన కొన్ని కుటీర పరిశ్రమలను గురించీ సంగ్రహంగా వివరించారు. ఆయా కుటీరపరిశ్రమల వివరణలో వీరిచ్చిన ఛాయాచిత్రాలు ఆయా పరిశ్రమల స్వరూప స్వభావాలు అవగాహన చేసుకోవడానికి బాగా సహకరిస్తున్నాయి.

శ్రీ సత్యనారాయణగారి గ్రంథంలో విదేశాలలోను, ఇతర రాష్ట్రాలలోను ప్రసిద్ధికెక్కిన మన ఆంధ్రదేశపు కుటీర పరిశ్రమలను గురించి మాత్రమే సంగ్రహంగా వివరించారు.

వీరి గ్రంథం ముగించగానే అంతగా ప్రసిద్ధి పొందని కుటీరపరిశ్రమ లెన్నెన్నో మన గ్రామసీమలలో ఖిలావస్థలో ఉన్నాయని స్ఫురిస్తుంది. కొబ్బరి పీచు మొదలైనవి పేని తాళ్లు తయారుచెయ్యటం ఈ జాతి పరిశ్రమలకిందికే వస్తుంది. ఇలాగే ఆయా గ్రామాలలో కంచుపాత్రలు పోతపోసేవారు, ఇత్తడిసామానులు తయారుచేసే కుటీరపారిశ్రామికులు, ఇంకా ఇతర కుటీర పారిశ్రామికులు ఎందరెందరో ఉన్నారు.

ఈ పారిశ్రామికుల ఆర్థికమయిన స్థితిగతులు. వారికి కావలసి ముడివస్తువుల సరఫరా, రవాణా సౌకర్యాల ఏర్పాట్లు మొదలైనవి జాగ్రత్తగా ఏర్పాటు చెయ్యవలసిన అవసరం చాలా ఉన్నది. ఇటువంటి కుటీర పారిశ్రామికులందరూ కొద్దో గొప్పో ప్రతిపల్లెలోను కనిపిస్తున్నారు. ఆయా పరిశ్రమలలో వీరికి ప్రత్యేకంగా పెద్ద ప్రసిద్ధివచ్చి ఉండకపోవచ్చును. ప్రసిద్ధిపొందిన కుటీర పారిశ్రామికుల సంఖ్యకన్న వీరి సంఖ్య పెద్దది. ప్రసిద్ధిపొందినవారి పరిస్థితులే అంతంతగా ఉన్నప్పుడిక వీరిమాట వేరేచెప్పనక్కర లేదు.


సరిక్రొత్త ఉపయోగకరమైన
పుస్తకాలు

ఆధునిక సాంకేతిక విషయములపై పలు రకములైన పుస్తకములుగలవు. పట్టీ ఉచితము. ఇంగ్లీషులో వ్రాయండి. N. K. Paul & Sons. Post, 12202 Calcutta-5.


ఈ గ్రంథంలో సమగ్రంగా ఆర్థికాది సమస్త దృక్పథాలతోను ఆంధ్రదేశపు కుటీరపరిశ్రమలను గురించి చర్చించి ఉంటే ఈ పుస్తకం మరింత ఉపయుక్తంగా ఉండేది. ఏతావతా మన దేశంలో బాగా ప్రసిద్ధికెక్కిన కుటీరపరిశ్రమలను గూర్చి సంగ్రహంగా పరిచయం సంపాదించుకోడానికి మాత్రమే ఈ చిన్న గ్రంథం ఉపయోగించగలదు. 'శాస్త్రి'

## ప్రణుతి

శ్రీ కవిరాజమూర్తి. ప్రతులకు: ప్రజాసాహిత్య పరిషత్తు, ఖమ్మంమెట్టు. వెల: ఒక రూపాయి.

ఇది పరమేశ్వరుని గూర్చి స్వేచ్ఛా ఛందస్సులో రచించిన కావ్యం. విస్పష్టమైన భావాలతో సరళంగా సాగిన రచన ఈ కావ్యంలో అంతటా ప్రతిధ్వనిస్తున్నది:

"అమావాస్య నిశిలో
ఉడుగుల సవ్వడివలె
భయకంపిత హృదయంలో
మ్రోగే దహదహవలె
మృత్యువు ఆగమనంలో
బెదరే కాయంవలె
నాలో నే ఇమిడిఉన్న
పరరూపపు దానవుండు
నీ ఉనికిని మాప నీకు
నీ మార్గం వెనుక నీడు"

## శ్రీ కృష్ణదేవరాయలు

శ్రీ సి. రామ్మూర్తిరావు. టీచరు, జయ్‌హింద్ సెకండరీ స్కూల్, మచిలీపట్టణం. వెల-రూపాయి.

ప్రాచీన సంప్రదాయ ధోరణిలో గద్య పద్యాత్మకంగా రచించిన రూపకం. అక్కడక్కడ రచయిత ఈ రూపకంలో పాటలుకూడా చేర్చారు.

## వీరాంబ

శ్రీ ఆర్. వెంకటేశ్వర్లు, పెదకళ్లేపల్లి. వెల: అర్ధరూపాయి.

ఉయ్యూరులో గ్రామదేవత వీరమ్మను గురించి ప్రజలలో అనుశ్రుతంగా వినవస్తున్న గాథతో రచించిన గద్యరచన. రచయిత ఈ చరిత్ర అంతా ఒక కథగా సులభశైలిలో రచించారు.

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad.



# అమృతాంజనము

ఎంత భయంకరమైన
కాలి నొప్పి నైనా క్షణంలో ఉపశమింప
జేస్తుంది

లక్షలాది ప్రజలు 1893 నుంచి దేశమంతటా. అమృతాంజనాన్ని వాడు తున్నారు. అమృతాంజనము బెణుకులు, వాపులు, తలనొప్పి, పళ్లపోటు, జలుబులు, దగ్గులు మొదలైన వాటిని ఉపశమింపజేస్తుంది.
అమృతాంజనము
అన్ని నొప్పులకు
దివ్యామృతము.






అమృతాంజన్
లిమిటెడ్.
మద్రాసు-4, బొంబాయి-1, కలకత్తా-7.


ప్రతి ఆదివారం రాత్రి 6-30గం॥ లకు 41 మీటర్లమీద రేడియో సిలోన్‌లో దక్షిణ భారతభాష

# విషయానుక్రమణిక

## ఆగస్టు 1958

# కరుణాలహరి

శ్రీ బూర్గుల రామకృష్ణరావు

* గతసంచిక తరవాయి *

మృగముఁ నాగము నావలెన్ భవమునం దెంతేనియుఁ జిక్కి తా
మగచాల్గం బడ, నన్నుమాని మఱి యా యన్నింటి విప్పించి నా
వు గదా! నన్నిడిపింప కుండుటది బాబూ! నీదు దెందమ్ముఁ బి
ట్టఁగలింపం జనదే? యదేమి కత మప్పా! పక్షపాతానకుఁ?

ఏగతిలేని యార్తులకు నీవ శరణ్యము పాపహారి! యం
చాగమ తత్త్వముల్ దెలుప, నట్టిఁడ వీవని నిశ్చయించి నే
నేగి సమస్త పుణ్యముల హేళనముం బొనరించినాఁడ; నీ
లాగున నంబుజేక్షణా! తలంప వొకింత యదేల చెప్పుమా!

పతితులఁ బ్రోవఁగాఁగలుగు పావనమూర్తివి నీవయంచు నే
సతతము వేదశాస్త్రములు సల్పెడుఘోషను బాగవింట, దు
ష్కృతములచే యుపాసనము సేసితి నోవరదా! యశేష దు
ర్గతులకు నీవసద్గతివిగా మదిఁ గట్టిగ నమ్మి శ్రీపతీ!

మునుసుకృతంబులఁ మఱచిపోయియు సేయనలేద యెన్నఁడున్;
విను మఖిలమ్ము దుష్కృతమ వేమరు సేసితి, నీదు ముందటఁ
గొన కిపు డేమి పల్కవలె కొంకును జంకును వీడి? సిగ్గు యె
గ్గనునది లేదుగాని యొక యంతయు గర్వము లేదు శ్రీహరీ!

మదమును గామమోహములు మత్సరముఁ బలమెల్లయెత్తి నీ
యెదుటన శత్రువుల్ గదిసి యింతగ నన్నిటు లేడిపింపగా
నదిర! గదారి నందకము లాపయి శార్ఙ్గము చేతఁబట్టియున్
గదలవు సిగ్గు సెందవు కనన్ నను గాదని యుందువేలరా?

గోతనుబడ్డబిడ్డఁగని కొండొక దారిని బోవువాఁడునుఁ
బ్రీతిని జాగుసేయకయ పేరిమితోడుత నుద్ధరించెడిఁ;
ద్రాతవు నీవు నోజనక! దారి భవాంబుధి దూకుచున్న యీ
లేత వయస్సువాని గని లీలగఁ జూచుచు నూరకుండు దే.

* జగన్నాథ పండితరాయల కృతికి అనుకృతి.

వరపుణ్యప్రియ! పుణ్యవంతులకు సర్వశ్రేయముల్ గూర్తువన్
బిరుదల్లుండగ నిమ్ము; పాపినగు నన్ వేఁ బ్రోవరానేని యీ
ధర విశ్వంభరుఁడన్న పేర్నిలువ దంతన్ గాచి కొమ్మిమ్మను; ఎ
వ్వరు గాదన్నను నీవు గాదనక నన్ బాలింపు లక్ష్మీప్రియా !

పరుషము లెన్నియో యకట! పల్కుచునుంటి నటంచు రోసమున్
విరసముఁ బూనకయ్య; యొకవేళ దురాత్ముఁడనైన దోసమున్
మురహర! కోటికల్మష విమోహితునిన్ మఱి వావదూకు ని
ర్భర కరుణాబ్ధిలో విసరివైవు; జగద్భరమింత తప్పెడిన్.

కృతము గణించి నాకవల నెల్లసుఖమ్ము లనుగ్రహింతొ యా
శ్రితుఁడను నే గ్రహింపనవి చిన్నము పున్నము సేసియుండమిన్;
పతితుల నుద్ధరించుట స్వభావము నాకని యేలుదేని శ్రీ
పతి! తలఁదాల్తు నీదయ యవశ్యముఁ దుష్టియుఁ బుష్టిసెందెదన్.

పతితుఁడనైన దుఃఖముల పాలగువాడనునైన నెంతొ దు
ర్మతియుఁ గృతఘ్నుఁడే యయిన మంచితనమ్మనుమాట లేక యే
బ్రతికిననైన సిగ్గువడి ప్రాంజలినై భవదీయుఁడన్న న
ప్రతిహత మీశ! నీదయకుఁ బాత్రుఁడగున్ గద యీ యపాత్రుఁడున్ !

చతురతఁ బుణ్యమే సలుపు సాధులపైఁ గృపఁ గుమ్మరింతు వా
ప్రతిఫలమేమి నీకటఁ గృపానిధి! యీ ననుబోటివానిపై
సతత కృపాకటాక్షముల బాల్కొనఁ జేసిన నాడు నీదు కీ
రితి యది యేమి వేసము ధరించునొ నీవ గ్రహింపు మాధవా !

మును పోకనాడు లాలనము పొందిన బిడ్డఁడు తండ్రిచేత నీ
డున, మఱి బుద్ధి నేర్వగ గడుంగడుఁ దాడితుఁడౌటయుక్త; మా
లనయును బాలనన్ దెలియ లాలన నీయెడ నే నెఱుంగ, ప్రా
క్తన నిజ పాపకర్మమునఁ దన్నులు తింట యొకండు దక్కరా !

"భగవన్ !" నే బహు దోషదూషితుఁడనై పాపౌఘముల్ ముంగఁగా,
పగలన్ మున్గుచు నేమి తోఁచక వృథావాగ్ధోరణిన్ దిట్టైతిన్
జగతిన్ బాంధుఁడు ప్రేయసీ విరహజ జ్వాలాగ్ని సంతప్తుఁడై
పగతో నయ్యమృతాంశుఁ దిట్టునుగదా! భద్రాను సంధాయకా!

# కరుణాలహరి

ఓ కరుణానిధీ! మిగుల నుద్ధతిమై దహియించె దుర్దశా
వ్యాకులుఁ బాప పంజరుని బట్టిక పీలిచి పిప్పిసేసెన
ప్పా! కను మేదిమో జ్వర మపారకృపామృతసాగరా! ననుఁ
జేకొని పీడకున్నది యిసీ! క్షణమేని యిఁకేమి సేయుదున్.

అల్పుఁడనై కటూక్తుల నిరంతర జల్పనముం బొనర్చ సం
కల్పితమౌనె నాదుపయి కారుణికోత్తమ! నీకుఁ గ్రోధ మ
త్యల్పమయో! గణింత్రె కుపితాతుర బాలక భాషితమ్ములం
దెల్పు! మహానుభావులు సుధీ నిధు, లాశ్రిత లోకపాలకా!

ఉరగారాతి సుకేతనా! కనుమయో! యుత్తంభితాశాసము
త్కర ఘోరాహులఁ జుట్టికొంటి, జటిలో దగ్రజ్వరోన్మత్తకుం
జరవజ్రాంకుశ, నన్ మహాజ్వరశిఖిజ్వాలావళీధుఁ నిరా
దరతన్ పీడకు మ్రొక్కుకొందును మహాధన్వంతరీ! శ్రీహరీ!

ఏనన దుష్కృతమ్ము లవి యెన్నఁడు సేయన లేదటంచు, నో
దానవ వైరి! పల్కెద యథామతి నొక్క నిజ, మ్మదేమనఁ
మానసమందు భీతి ననుమానముఁ బాపి ఖగేంద్రయాన! నీ
యాన, సుధానిధాన, పతితావన తావక నామగానముల్.

శర్వ పితామహాదులును సర్వ సుపర్వనిశాచరావళుల్
నిర్వచనమ్ము నేరకయు నిన్ బురుషోత్తముఁ డంచుఁ గొల్వ నిన్
గర్వ మఖర్వ మూని యిటు గంటె యుపాలభమానవాక్కులన్
జెర్వెదు వీడిసీ! ఖలుఁడు ఛీ! కను ఛీ! యిదె పాడు బుద్ధియుఁ.

సకలమ్మున్ విడనాడినాఁడ, మఱి నా సర్వస్వముఁ నీవ,ని
న్నిఁక నే కోరిక యేని కోర నిదిగో యీ కొంచె మర్థింతు, నీ
యకలం కాద్భుత మెల్లయందముల కాహా యందమే మూర్తి మా
మక హృన్మందిర గోచరమ్మగుత, శ్రీమందార మాలాధరా!

సశేషం

# హరవిలాసము: దేవదారు వనవిహారము

శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి

శ్రీనాథుఁడు బ్రాహ్మీదత్తవరప్రసాదుఁడు. తత్ప్రసాదలబ్ధవాణీ ప్రసారమునఁ బరమేశ్వరు నారాధించువాఁడు. సంస్కృత కవులలోఁ గవితా రూపోపహారములఁ బార్వతీ పరమేశ్వరుల నారాధించినవాఁడు కాళిదాసు. అతని యడుగు జాడలలో నడచినవాఁడు శ్రీనాథుఁడు. వివిధ రసభావములను బరమేశ్వరాలంబనముగఁ జిత్రించుటలోఁ బెక్కు విషయములం దిరువురకును సామ్యము గానవచ్చును. శ్రీనాథుఁడు తాను సంతరించిన హరవిలాసములోఁ ద్వితీయ చతుర్థాశ్వాసములందు కుమార సంభవ కావ్యానుసరణము గావించుట యిందులకొక నిదర్శనము. కుమార సంభవ కావ్యమునం దష్టమ సర్గలోఁ బార్వతీ పరమేశ్వరాలంబన శృంగార రస భావములు పరాకాష్ఠ నందింపఁబడినవి. హరవిలాసమున పార్వతీ పరమేశ్వర వివాహము వఱకు కుమారసంభవమునందలి కథావస్తువు నాదరించి, పిమ్మట శృంగార రస సమగ్రత నాపాదించుటకై శివ పురాణమునందలి దేవదారు వనవిహార కథావస్తువు గైకొనినాఁడు శ్రీనాథుఁడు.

శైవ కవులు శివుని విలాసములలో దేవదారు వన విహారమును బ్రథమముగ గణించి, తదాశ్రయమున శృంగార రసభావములను బరమేశ్వరాలంబనముగ నతిమాత్రము చిత్రించుట యొక పరిపాటి. ఆ ప్రక్రమమునఁ బరమ శివభక్తుఁడైన శ్రీనాథుఁడు దేవదారు వన విహార కథావస్తువును దన హరవిలాస కావ్యోపస్కారకముగఁ గైకొనియు శృంగార రసభావముల నతిమాత్రముగఁ జిత్రింపఁదలఁచియు నౌచిత్యమునకు రస పోషణమునకు సారస్యమునకు భక్తి భావావిష్కృతికి లోపమేపాటియు సోఁకకుండ నిర్వహించియున్నాఁడు. ఈ దేవదారు వనవిహారము సంస్కృతమున ఉత్ప్రేక్షా వల్లభుఁడను కవి రచించిన భిక్షాటన కావ్యమునందును, తదితర శైవకవుల కృతులందును గానవగును. కాని యా రచనలన్నియు శృంగారరస నిర్వాహణమున నుచ్ఛృంఖలములై నడచినవియే. శ్రీనాథునకు సమకాలికుఁడగు నిశ్శంక కొమ్మనామాత్యుఁడు, ఈతని కాశీఖండ కృతిభర్తయగు వీరభద్రారెడ్డి సోదరుఁడు దొడ్డారెడ్డికిఁ గృతిగా నొసఁగిన శివలీలా విలాసమునందును దేవదారు వన విహారమును జిత్రించియే యున్నాఁడు. అదియు శృంగార రస భావావిష్కరణమున నుచ్ఛృంఖలమై కొనసాగినది.

శ్రీనాథుఁ డీయితివృత్తమును జేఁబట్టి ఔచిత్యమును సంతరించుకొనుచు రస నిర్వాహణమునఁ బ్రణిధానము సంయమము నలవరించుకొని, శృంగార రసమును భక్తితో మేళవించి చరమసీమకుఁ గొనిపోయినాఁడు. ఆ విషయము నిట నా యూహ కొలఁది వివరింతును. పరమేశ్వరుఁడు పార్వతిని బెండ్లియాడి, మన్మథుని పునరుజ్జీవితునిఁజేసి, పారిషదగణము తన్ను భజించుచుండ శీత నగమున నవ్య కుటుంబభార సమన్వితుఁడై సంసారసుఖమనుభవించుచుండెను. పార్వతి మీఁది వలపుచేఁ ద్రిలోకనాథేశ్వరుఁ డిప్పుడు హిమవంతు నింట నిల్లఱికముండెను. ఏనాఁడైన నత్తవారియింట నిల్లటముండిన యల్లునిపై నత్తవారి కనాదర భావమేర్పడక మానదు. ఈశ్వరునకు సైత మట్టిది తటస్థించెనని తెలుపుచు—

"ఆర్యపైఁ గూర్మిరెట్టినో? యద్రియింట
నిల్లటంబుండెఁ ద్రిభువనాధీశ్వరుండు."

అనినాఁడు. త్రిలోకాధిపతికైనను భార్యమీఁది వలపుచే నత్తవారింట నిల్లటముండుట యనివార్యమని యిందు ధ్వనితము.

ఇప్పటి యీశ్వర వేషము శ్వశుర గృహనివాస యోగ్య నూత్నాలంకార పరిశోభితము. ఇంతకుముందు నాగయజ్ఞోపవీతధారి యిపుడు బంగారు జన్నిదములు సవరించుచున్నాఁడు. రుద్రుఁ డిపుడు గజాసురచర్మము వీడి పట్టుపచ్చడములు దాల్చుచున్నాఁడు. భస్మాంగరాగము నుజ్జగించి కస్తూరితో మేదించిన శ్రీ గంధ మలఁదుచున్నాఁడు. ఎముకల పేరులు వదలి ముత్యాల హారములు ధరించుచున్నాఁడు. జడలపైఁ బాగడ చాళ్ళెము ధరించి బాలచంద్రు నవతంసముగఁ గూర్చుచున్నాఁడు. ఇట్లు చంద్రశేఖరుఁడు పెండ్లికొడుకున

ఉచితమైన వేషము దాల్చి హిమవంతునింట మనువు గుడుచుచుండెనఁట. శివుని ఇంట్లికొడుకుగాఁ జిత్రించుట శ్రీనాథుని లోకవినోదము.

హరుఁ డీవిధముగ దివ్యవేషభూషితుఁడై తన వాహనమగు వృషభమును వాహ్యాళికి వదలివచ్చు అశ్వముల నధిరోహించి, ప్రథమగణములు వెంటరాఁగ నోషధిప్రస్థపురవీథులలో నడయాడఁ దొడఁగెను. తమ ప్రభు వీతీరుగ మహావిభవాభిశోభితుఁడై, యోషధిప్రస్థమున విహరించుచుండ, నాతని యనుచరులు వీట నెవ్వరెదురులేక యవకతవకచేష్టలు సేయఁగడఁగిరి. వేశవాటమున స్వేచ్ఛాచారమునఁ జరింపఁ దొడఁగి, విద్యాధర గంధర్వాప్సరో గరుడ భామినీ విటులను బహువిధంబుల బాధింపఁ దొడఁగిరి.

సీ. పులి శిలాసములఁ గప్పుకుని బాఱఁగఁబొఱ
విద్యాధరాంగనా విటగణంబు
గంధర్వ కామినీ కాముక వ్రాతంబు
లాతోఁగొని మోది లజ్జగొంద్రు
కకపాల వెలిబూదిఁ గన్నులలోఁ బ్రామి
బాధింతు రప్సరః పల్లవులను
గరుడ భామా భుజంగప్రతానముఁబట్టి
బాధింతు రుగయోగ పట్టకముల
నాగడీలు మహాధూర్తులగడుఁ గాను
లుద్ధతులు గొంగ్లు పలుగాకు లుదుగు మిడుకు
లాకతాయిలు శిశులు గయ్యాళు లగుచు
నోషధిప్రస్థ మిల్లిల్లు నుడుకుచుండ.

—హర. 5-10.

తన యల్లుని పరివార మోషధిప్రస్థపురంబున క్షుద్రోపద్రవంబులు సేయుచుండ హిమవంతుఁ డది యంతయు నెఱింగి, మేనాదేవియు దానును మంతనం బుండి, యీశ్వరునితో డి పొత్తింతియు చాలునని, తన కూఁతు రావించి, "ప్రమథ గణములు భూతములు పిశాచములు మున్నగు ధూర్తగణములను నీ మగఁ డాదరించును. నీ భర్త యగు గరళకంఠుఁడు వారి ధూర్తచేష్టితములు మాన్పవలదా? అమంగళాకారుఁడై బ్రహ్మకపాలము చేతఁబట్టి వాడవాడల భిక్షమెత్తిన కూడు గాక యిట్టి దివ్యాన్నము లాతనికి రుచించునా?" యని హిమవంతుఁ డా యాదిభిక్షుని స్వరూపమును వికృతముగా నిరూపించెనఁట.

సీ. తలమీఁది చదలేటి దరిమీలఁ దినఁజేరు
కొంగలు చెలఁగి కొంగొంగు రనఁగ
మెడఁ దన్ను పురుకల నిడుపేగు లొండొంటిఁ
బోరిఁ బోరిఁ దాఁకి బొణ్బొణుఁగు రనఁగఁ
గట్టిన పులితోలు కడకొంగు సోఁకి గూఁ
బోతు తత్తడి చిఱ్ఱుబుఱ్ఱు మనఁగఁ
గడి దుంపుఁ బాములు కకపాలలో నున్న
భూతి మెఁ జిలికిన బుస్సు రనఁగ
తమ్మిపూఁజూలి పునుక కంచమ్ము సాచి
దిట్టతనమున బిచ్చము దేహి యనుచు
వాడవాడల భిక్షించు కూడు గాని
యిట్టి దివ్యాన్నములు మెచ్చునే శివుండు?

—హర 5-16.

ఈ పద్యమున నీశ్వరుని భిక్షాటన స్వరూప మభివర్ణితమైనది. దారుకావన విహారమున కీ భిక్షుక రూపము బీజభూతముగను, ప్రధాన రస నిర్వహణసాధనముగను చిత్రించియున్నాఁడు. హిమవంతు డిట్టి యీశ్వర రూపము నమంగళాకారముగా నిరూపించి, యాతని నవమానింపఁ గడఁగుటయే పరమేశ్వరుని దేవదారువన ప్రయాణమునకు నిదానమై జంగమభిక్షుక వేషధారణమునకుఁ గారణమైనది. మరల నా జంగమభిక్షుక వేషధారణము మునిపత్నీ సమ్మోహకమై శంకరుని యాదిభిక్షుక స్వరూపావిష్కృతికి మూలమైనది. ఇట్లీ యితివృత్తమున శ్రీనాథుఁడు వెలార్చిన త్రివిధ భిక్షుక స్వరూపములకుఁ గార్యకారణభావము సమన్వితమైనది. హిమవంతుఁడు తనకూఁతుతో నిట్లనుట, పార్వతికభిమానము గలిగి, యామె తన భర్తను ప్రమథగణ దుష్ప్రవృత్తి నివృత్తికిఁ గడఁగువానిగఁ జేయుటకే. హిమవంతుఁడీ పలుకులు తన పుత్రితోఁ బలుకు నవసరముననే యఖిలలోకేశ్వరుఁడగు నీశ్వరుఁడు మామ మనస్సులోని విసుగును, జారగణములకుఁ గలుగు వేసటను, ప్రమథగణములు సేయు ధూర్తకృత్యములను నెఱిఁగి వెంటనే దేవదారువనమునకుఁ బోఁదలఁచెను. తలఁచిన వెంటనే పరమేశ్వరుఁడు నందివాహనారూఢుఁడు కతిపయ ప్రమథగణ పరివార పరివృతుఁడునై మామకెఱింగింపక గౌరితోఁ జెప్పక దేవదారువనముఁ బ్రవేశించెను.

శివలీలా విలాసమునందలి దేవదారువనవిహార ఇతివృత్తము శివభక్తి తాత్పర్య సముద్బోధకము. ఈశ్వర

భక్తివిముఖులై కర్మఠులైన దేవదారు వనవాసి మునులకు శివభక్తితత్పరత నొదవించుటకై హరిహరులు మాయా విటవిట రూపములు దాల్చి తమ విలాస విచేష్టితములచేఁ దదాశ్రమ వాసులైన మును లందఱకుఁ గామవికారములు గలిగించి, ధూర్తవిచేష్టితములచే మునిపత్నుల పాతివ్రత్యమునకు భంగమాపాదించి, తన్మూలకముగ నవిటి మునుల కీశ్వరభక్తి యేర్పడునట్లు చేయుదురు. హరవిలాసమున నీశ్వరుఁడు గావించిన దేవదారు వనవిహారము మహాలింగావిర్భావమునకు నిదానము. శివపురాణాంతర్గత కథావస్తువు దీనికి మూలము. కాళిదాస విరచిత కుమారసంభవ కావ్యవస్తువే తత్ప్రబంధాంతర్గత వస్తునిర్మితి కాదర్శము. కావునఁ గావ్య సామగ్రీ సముచ్చయమునకు వలయు వస్తుసమన్వీలన మిందు గావింపవలయును. అందులకై దేవదారువన సౌందర్యమును జిత్రింప దొరకొనినాఁడు. ఆ వనమును దపోధనులకు దేవతామిథునములకును విహారయోగ్యము గావించినాఁడు.

దేవదారువనము హిమవత్పర్వత దక్షిణసీమలో గౌరీ తపోవనోపాంత దేశసంస్థితమగుటచే మునిజన సంసేవ్యమై యొప్పలారినది. ఆ పర్వతం బెట్టిదనిన—

సీ. వృద్ధకచ్ఛపరాజువీపు పంక్తిపీఠంబు
సురతరంగిణి వెల్లసిరిసుపాగ
మహీమండలమునకు మానదండము పేరు
పూర్వపరాబ్ధులు పొగడుటెంకలు
కాత్యాయనీదేవి కన్యారత్నంబు
బేసికన్నుల వేల్పు పెండ్లికొడుకు
పాలనీయము శేషశైల సామ్రాజ్యంబు
యాగహవిర్భాగ మోగిరంబు
మేరువన్నెగు కైలాస మలయ సహ్య
గంధమాదన మందర క్రౌంచ వింధ్య
భూధరంబులు చుట్టాలు పొగడఁదరమె
సకలగుణధాముఁ బర్వత సార్వభౌము?

—హర. 5-20.

హిమవత్పర్వత సార్వభౌముని మహిమము సకల సద్గుణ విభవ శోభితము, వర్ణనాతీతము. అతనికి జతఁగూడిన విభవ మన్యశైల విలక్షణము. మహర్షిజన తపశ్చర్యాయోగ్యము దివ్యబృంద పరిభోగ యోగ్యమును.

క. అందు విహరింతురు కాంచన
కందరగమందిరములందుఁ గౌతుక మొప్పన్
బృందారక మిథునంబులు
కందర్పవిహారములఁ బెక్కుకేళులన్.

ఈ పర్వతము కేవలము మౌనితపశ్చర్యా యోగ్యమే కాక రసికజన విహారయోగ్యముకూడ నని తెలుపుటకే కవనము. ఆ రసికజనము బృందారక మిథునములనుట దేవాధిదేవుని విహారయోగ్యమని నిరూపించుటకు. ఇటు లాహిమవత్పర్వతము నుభయవిధ సామగ్రీ సమన్వితము గావించి, ప్రత్యేకముగ దేవదారువనమునకే విభవమును సమన్వితము చేసియున్నాఁడు.

సీ. కర్ణికామాణిక్య కనక పద్మములతోఁ
గల్పవల్లీ కుడుంగములతోడ
విమల చింతారత్న వేదికాస్థలములతో
సిద్ధతాపస శ్రేణితోడ
దివ్యలోకాప్సరః స్త్రీకదంబములతోఁ
గామధుగ్ధేను సంఘములతోడ
దివ్యౌషధీలతా దీపమాలికలతో
సకలర్తు సన్నివేశంబుతోడ
మదనవైరికిఁ గాపురమ్మయిన
మంచుగుబ్బలి తొలిసీమాంచలమున
దేవతాముని సేవ్యమై తేజరిల్లు
ధర్మసంజీవనము దేవదారు వనము.

ఈ సన్నివేశమునం దభివర్ణితమైన విషయము కాళిదాస విరచితాభిజ్ఞాన శాకుంతలమునందలి కశ్యపాశ్రమ వర్ణనమును దలఁపింపఁ జేయుచున్నది.

శ్లో. ప్రాణానామనిలేన వృత్తిరుచితా సత్కల్పవృక్షే వనే
తోయే కాంచనపద్మరేణుకపిశే ధర్మాభిషేకక్రియా
ధ్యానం రత్నశిలాతలేషు విబుధస్త్రీసన్నిధౌ సంయమః
యత్కాంక్షన్తి తపోభిరన్యమునయ స్తస్మిం స్తపస్యన్త్యమీ.

అభి. శాకుం. సప్తమాంకము.

ప్రాణాయామయోగ యోగ్యములగు కల్పవృక్షములు, కాంచన పద్మపరాగ కపిశమై యభిషేక యోగ్యమగు తోయము, ధ్యానయోగ్యమైన రత్నశిలా

## హరవిలాసము : దేవదారు వనవిహారము

స్థలములు, మఱియు సైర్యమునకు విబుధ స్త్రీ సాన్నిధ్యమునను నివిగలచోటు తపశ్చర్యచేఁగాని లభ్యము గాదనినాఁడు కాళిదాసు. ఆ సామగ్రినంతయు నీ దేవదారు వనమునను సమకూర్చియు శ్రీనాథుఁ డంతటితోఁ దనివిచెందక కామధుగ్ధేను సంఘమును దివ్యౌషధీలతా దీపమాలికలను సకలర్తు సన్నివేశమును జతఁగూర్చి. దేవదారు వనమును దేవతాముని సేవ్యమును ధర్మసంజీవనమును గావించియున్నాఁడు.

ఇఁక నచట వసియించు సంయమి సందోహమును పంచబాణ సదృశులను, వారి బింబాధరలను సౌందర్య కళానిర్జిత బృందారక సతులను గా చిత్రించియున్నాఁడు. పరమేశ్వరుఁడు జంగమ వేషధారియై తన్మునిపత్నుల పాతివ్రత్యము భంగింపజేయునై యుండెను; కావున దద్వనితామణుల కంటెను సౌందర్యమును సమకూర్చి పెట్టినాఁడు. మఱియు పరమేశ్వర భోగయోగతాదియం దాపాదించుటకై తద్వనమున వారు నెఱపెడి విహారములలోఁ గొన్ని విలాసములు గాన్పింపఁజేసినాఁడు.

శా. ఆయా వేళల మౌనిభార్యలు గృహ
వ్యాపార లీలాభవ
త్కాయ క్లేశము లుజ్జగింతురు లస
త్కర్పూర రంభాఫల
చ్ఛాయా శీతల చంద్రకాంతమణి సో
పాన ప్రదేశంబులన్
వాయుప్రేరణ, బచ్చకర్పూరము పై
వర్షింప నక్కానలోన్.

—హా. 5-38.

మౌని భార్యలాయా వేళల గృహవ్యాపారము లందు శ్రమగొనినపుడు కర్పూరపుటరఁటి చెట్ల నీడలలోఁ జంద్రకాంత శిలాతల వేదికలపైఁ గూర్చుండి వాయుప్రసారమునఁ బచ్చకర్పూరము మీఁద రాలుచుండ నాయాసము నుజ్జగింతురఁట. మఱియు మధ్యాహ్నకాలమున గృహవ్యాపారము లందలి యలసటచే మేనులఁ జెమటలు పొడమినపుడు సెలయేళ్లలోఁ జల్లులు చిలుకులు నాడుదురఁట. ఇట్లా తపోవన పరిసర ప్రదేశమంతయు మౌనిజన వనితా విహారయోగ్య సామగ్రీ సముపేతమై విరాజిల్లుచుండె నని చిత్రించుటకీ యుపక్రమము.

ఇఁక నాతపోవన ప్రకృతి తపశ్చర్యా నిరత మనస్కులైన మునివారి కనుకూలమైన సామగ్రితో నొప్పారియుండెనని చిత్రించినాఁడు. అచటి మునులు జ్యోతిష్టోమాది యాగముల నాచరించుచుండ, త్రేతాగ్ని సముద్భూతమై పుణ్యధూమశిఖాన్వితమైన పరిమళము పాతక సంఘము నణఁగించుచుండును. అచటి గంగాతోయములు పాపము లేడింటిని శమించును. తుమ్మెదలు ప్రణవాక్షరము లాపించును. శుకశారికలాగమ సిద్ధాంతములను ప్రసంగించును. నెమిలు శాస్త్రము లాలపించును. ఈ తీరున నచటి ప్రకృతి యంతయు సద్భావ సముద్బోధకమై నెలయుచుండె ననినాఁడు. ఈ వర్ణన పరిపాటి భారతమునందలి శకుంతలోపాఖ్యానములోని కణ్వాశ్రమ వర్ణనరీతిని దలఁపింపఁ జేయుచున్నది. మహాత్ముల యాశ్రమ వర్ణనమునట్ల కాళిదాసువలె శ్రీనాథుఁడును గొంత ప్రణిధానము వహించును.

ఇక నచటి నీవార ముష్టింపచులైన మునులు మన్మథు నేపాటియు లెక్కింపక కామక్రోధాది వికారములు దరిజేరనీయక పగలోక సాధన పరాయణులై ప్రశాంతచిత్తులై యాత్మశమోపాంతముల నియమవంతులై చరింతురట. తత్ప్రశాంత తపోవనమున మునికన్యకా కదంబము పసిఁడికుండలతో సెలయేటినీటిని గొని తెచ్చి, క్రొన్నెలతలకు నీరుపోయుటను మనోహర దృశ్యముగఁ జిత్రించియున్నాఁడు.

సీ. జిలుఁగైన కనకంపుఁ జీనాంబరము కొంగు
పాలిండ్ల బింకంబు బయలుపఱుప
భ్రమరకంబులఁ జుట్టు ప్రస్వేదకణములు
నొసలి కస్తురిబొట్టు నూలుకొలుప
దరవిశ్లథంబైన ధమ్మిల్ల భారంబు
చిమ్మచీకటులకుఁ జిటమిటువఁ
వరహాటక రత్న తాటంక దీప్తులు
చెక్కుటద్దముల పై జీరువాఱఁ
బసిఁడికుండల నిర్ఝరాంభస్సు దెచ్చి
పోయుఁ గంకణ నిక్వాణములు సెలంగఁ
గన్నెలతలకు మునికన్యకాకదంబ
మభిమతంబైన యప్పావనాశ్రమమున.

ఈ సీసములోఁ గ్రమముగ కట్టు బొట్టు జుట్టు అను నీ మూఁడును బొంకముగఁ జిత్రింపబడినవి. ముని కన్యలు కన్నెలతలకు కుండలతో నీరుపోయుట వారి

ఏడునకు పరిపడిన తపశ్చర్య. హిమవత్పర్వతమును సకల వస్త్వాకరముగఁ జిత్రించుటను గాఁబోలు ముని కన్యకా జనమునకుఁ జీనాంబరములు తాటంకములు కంకణ నిక్వాణములు సమకూర్చి పసిడికుండలతోఁ గన్నెలతలకు నీరుపోయించినాఁడు శ్రీనాథుఁడు. ఇటు లనే తదాశ్రమ గోవుల గోష్ఠదేశములందు లేఁగదూడలు గంతులు వేయుట నెంతయు స్వాభావికముగను లలిత సుకుమారముగను జిత్రించియున్నాఁడు.

శా. ఆనందంబునఁ గ్రుళ్ళిఁబుచ్ఛములు పై
ల్లార్చుచున్ లేఁగల
క్రాలన్ గోవుల గోష్ఠదేశమున
జంఘాలాఘవంబొప్ప హో
మానుష్ఠాన విధిప్రకార పరతం
త్రాత్మప్రసూ కామధు
గ్ధేనూధస్య సుధాప్రవాహ లహరీ
తృప్తాంత రంగంబులై.

—5-34.

దేవదారు వనమునందలి గోష్ఠప్రదేశములందు లేఁగదూడలు హోమానుష్ఠానయోగ్యపయస్సంపాదనము ముగిసిన వెనుక తమ మాతలగు కామధేనువుల పయస్సుధా లహరులఁ గ్రోలి యానందంబునఁ దోఁకలు కద లించుచు గంతులు వేయుట చూడ ముచ్చట గొల్పును. అచటి ధేనువులు కామధేనువు లగుటచేఁ దదూధస్య మమృతప్రవాహమె యానందము నొదవించి జంఘా లాఘవము నొడఁగూర్చినది. లేఁగదూడలు పాలుత్రాగి గంతులు వేయు తీరు సహజ మధురమైన యొక ప్రేక్ష ణీయము.

ఈ తీరుగనే పర్ణశాలాంతరముల మునికన్యలు చెంచు చిగురాకుఁ బోణుల వేడబములు దాల్చి వారి చేష్టల నభినయించుటయుఁ గడుమనోహరముగ జిత్రింప బడినది.

సీ. సెలయేటి తెలినీటఁ జిలుబంతి పసుపాడి
సేస క్రొమ్ముళ్ళ బిచ్చియలు తుఱిమి
గురువింద పేరులు గుబ్బచన్నులఁ దాల్చి
నెమిలి పించంబు బుట్టములుగట్టి
పయ్యెదమాలుగాఁ బాలుటాకు లమర్చి
చాఁదునఁ దిలకంబు సంతరించి
కంకేళి చిగురాకుఁ గర్ణపూరముఁ జేసి
కుసుమ పూవులధూళి కురులఁ జల్లి
చెంచుఁ జపరాకు బోణుల చేఁత లెల్ల
నభినయింతురు పర్ణశాలాంతరములఁ
దండ్రులెంతేని జనువఁద్దు తల్లులెదుర
గారవమ్మున మునికన్యకా జనమ్ము.

—5-38.

ఆరణ్యక ప్రకృతిలో నాగరకుల కభినేయవిషయ ములు ముగలైన చెంచు చిగురాకుబోండ్ల చేఁతలగుటకుఁ దత్స్వరూపము వంతకుమందే పొంకముగఁ జిత్రించి నాఁడు.

శా. ఆమోదంబున వేఁటలాడుదురు నీ
హారాద్రి కాంతార రే
ఖా మధ్యంబునఁ జాపటంకృతులతో
గంధద్విపశ్రేణులన్
శ్యామ శ్యామ మనోజ్ఞ మధ్య లురుగుం
జాభూషణాలంకృతల్
వ్యామగ్రాహ్యపయోధరల్ శబర సే
నానాథ సీమంతినుల్.

—5-24.

ఈవిధముగ సహజ సౌందర్యముతోఁ గూడిన దేవదారు వనోపాంతమంతయుఁ దపశ్శాలుర తపోను ష్ఠానమునకు సరిపడిన సామగ్రితోఁ గూడియుండెనది. అమహాయోగులైన యచటి మునులు కామము పొడ సూపకుండ నెంతటి నియమములు పాటింతురో వారికి గామోద్దీపనము సేయుటకు, వారల వ్రతముల భంగింపఁజేయుటకు పదునాల్గుజాతుల యప్సరోంగ నలు జాతి కొక్కక్కవాడ యేర్పడ స్థిరావాసము లేర్పఱచుకొని తమ తమ భవనములందు ఆత్మోత్పత్తి స్థానలాంఛితములైన పతాకముల నెగురవైచుకొనుచు మునులకు మదనవికార మొదవింపఁజేయుటకై ప్రతి భవన భిత్తిభాగములందును జిత్తరువులు సంతరించుకొని యుండిరఁట. ఆ చిత్తరువులను, తత్తద్భవన వాసిను లైన యచ్చర పూవుబోండ్లను శ్రీనాథుఁ డీతీరుగ జిత్రించియున్నాఁడు.

"కోరకిత నేత్ర త్రిభాగుండై కుసుమ కంక పత్త్రింబుల వంకలొత్తుచు రతీదేవి వృత్త స్తనంబుల మీఁద వత్తమిల్లియున్న చిత్తభవు విక్రమసంపత్తి ప్రకారంబును, నట్టేటం బట్టపగలు యోజనగంధియను గంధగజగమన వ్రతువచనుంగవ చూచి తొట్రుపడు

వసిష్ఠపౌత్రుని దృష్టిప్రియత్వంబును, నాచార్యు భార్యయగు తారాదేవిమీఁదఁ దారకరాజు వలపు చీటంబు వాటంబుసేయు లలిత కటాక్షవీక్షావిక్షేపమ్ములును, స్ఫూర్తిమాలి మాలినీనది సైకతంబున నేకాంతంబుం బలెఁ బొదలు కురువింద పొదలలో వేలుపులంజియు కెంజిగురుం బెదవి చవిచూచి చొక్కిన కుశిక నందను రాగావేశంబును, కుసుమ కోదండుని విజయ డిండిమంబగు విభాండకసుతుని వనితామండలాసక్తియు, బృందావనంబునందు ముకుందుం డొనరించిన నందవ్రజవధూవిహారాడంబరంబును నంబురుహసూతి స్మృతి చెడియాడు పట్టింపఁ గొనిన దోషంబు పట్టనుం బురహూతుండు గౌతము కళత్రంబు మీఁదం గల్పించిన చీకటితప్పును జూపఁజూపఁ జిత్తంబు వ్రీళాభ్యాగునఁట."

ఏతచ్చిత్రోన్మీలిత వస్తువర్ణనము మన్మథ వికారోద్బోధకము. ఇవియన్నియుఁ బురాణప్రసిద్ధములైనవి కేతరాగవికృతి సంపాదకరూపములు. ఇట్టిచిత్రశాలము వాసి తపోనిష్ఠుల నిష్ఠాభంగమునకై చిత్రింపఁ బడినవి. ఇటులనే తదావాసంబుల నివసించు నప్సరోంగనలను త్రిభువన వశీకరణయోగ్య విభ్రమ వ్యాపారాలాపాది భూషితలఁగాఁ జిత్రించినాఁడు.

ఇట్లు వసించియుండు నచ్చేడియలలో "విబుధమత్తకాశినీ జనోత్తమయగు తిలోత్తమయు, వశీకృత కుసుమనారాచయగు ప్రమ్లోచయు, నలకూబర నఖరేఖాంకిత స్తనకుంభయగు రంభయు, ఘనవేణియగు సుకేశియుఁ, గలమంజుఘోషయగు మంజుఘోషయు, శృంగార వారాశియగు నూర్వశియు, రూపానురూపస్థానకయగు మేనకయు, నవ్వరారోహలు అలఘువోక కలికిచూపుల, హేలాసందర్శిత మేఖలా కలాపంబులగు విభ్రమ వ్యాపారంబుల, హాటకతులాకోటి ఝళీఝళీత్కారమంథరంబులగు మందగమనంబుల, వికస్వరకపోలఫలకంబులగు మొలకనవ్వుల, నమృతరసరూపంబులగు నాలాపంబులఁ, ద్రిభువనంబులు వశీకరింతు"రఁట. విబుధమత్తకాశినీజనోత్తంసంబుల సౌందర్యంబు సమాకర్షకమగుటయే గాక, వారల చూపులు మందగమనములు మందహాసములు మధురాలాపములు త్రిభువనమోహన సాధనములని చిత్రించియున్నాఁడు. ఇంతటి సంమోహన సామగ్రి యుండినను వికృతినందని వచటి వీతరాగుల చిత్తవృత్తులనియు, అట్టి దేవదారు వనమున మదన వికారము నావిర్భవింపఁజేయఁబూనుకొనిన పరమేశ్వర సౌందర్య మహాతీతమని నిరూపింపఁదలఁచి త్రిభువన మోహన స్వరూపవతులయిన యప్సరోంగనల ద్వారా శివునిచే భిక్షాటన ప్రవృత్తి కుపక్రమింపఁ జేసినాఁడు.

అట్టి దేవదారువనమునం దీశ్వరుఁడు తన పరివారమునంతయు నిటునటునంపనియమించి

తే. పసిఁడి కప్పెరలాఁతొప్పఁ బద్మకోల
జోగ పట్టియ కకపాల జోలె సంచి
కలికి కౌటుక గిర్జొట్టు పలుఁగుపేరు
జాతిగాఁ దాల్చి నెఱమించె జంగమగుచు.

—5-41.

ఈ జంగమరూపచిత్రణములో శ్రీనాథుని నాఁటి జంగమ భిక్షుక స్వరూపము ప్రతిఫలించుచున్నది. ఇట్టి జంగమరూపముదాల్చి ప్రాలేయాచల కన్యకాధిపతి దేవదారువనమున భిక్షాటనమునకై బయలుదేఱి, తొలుత నప్సరో వేశవాటమునఁ జరింప మొదలిడినాఁడు. అచటి యచ్చరలందఱు వింతయొయ్యారములు మొలకెత్త నా జంగమ భిక్షువునకు భిక్షాన్నములిడ దొరకొనిరి. 'ప్రమ్లోచ మోచాఫలస్థూలాపూప ఘృతాన్వితంబయిన భిక్షమును, నఖాంకురద్యుతులతో మాణిక్యముద్రాలంకార మయూఖ కాంతులు గీలుకొను కెంగేలితోఁ బెట్టినది. రంభ, రంభాద్రుమఫలసమగ్రమయిన భిక్షమును గామారికి, నలకూబరుఁడు దనరాపుఁజన్నుల కొనఁబట్టి యొత్తిన నఖక్షతరేఖ బయల్పడునట్లు పెట్టినది. మంజుఘోష, కలఘోష భరితకంకణ నూపురా ద్యలంకార భూషితయై యెదురుగా నల్లనేతెంచి, హేమపాత్రి నమృత దివ్యాన్న పాయసాహారభిక్ష నొసఁగెను. హారిణి దాక్షాయణీభర్తకుఁ జక్కెరాగ మెలర్పఁగా మాధుకర భిక్షాన్నము వడ్డించెను. ఊర్వశియు నల్లనఁ జేరవచ్చి శ్రీవల్లభకూర్మి నెచ్చెలికి వాఁడనైరికి మంచుఁగొండ రాజల్లునికి ధవళాన్నము భిక్షముగాఁ బెట్టెను. తిలోత్తమాప్సరస పులకండముతో డను ఘృతంబుతోడను గూడిన భిక్షమును పసిఁడిసిబ్బెములుగల పయ్యెద కొంగింపుకజాఱ చన్కట్టు ఫాలలోచనుని మూఁడు కన్నులకు ముచ్చటగొల్పునట్టులు పెట్టెను. సహజసౌజన్యయగు సహజన్య, దోర్మూల కూలంకషంబులైన వీఁగుఁబాలిండ్లు పైఁట చెఱఁగు వీడఁ గొలుపు శంకరునకుఁ బుణ్యభిక్ష పాసఁగ వడ్డించెను. చిత్రరేఖ కనకనూపుర మేఖలా కలకలము రత్నకంకణరవములో రాయిడింప

సభవున కమృతాన్నభిక్ష మొసఁగెను. తద్వ్యాలేఖాంగనలును భుజంగభూషణునకు సపాంగ రంగస్థల లాస్యలంపటంబులగు కటాక్షవీక్షణంబులతోఁ గూడ భిక్షాన్నంబులు సమర్పించిరి.'

శివదారువన వేశవాటమున మదనవైరి భిక్షాటనము సేయునపుడు అప్సరోవిలాసవతుల విలాసము లేవియు నేపాటియు నాతని మనసు నపహరింపలేదు. ఆ క్రమముననే వారలిచ్చు చందనకుసుమ ధూపదీపాద్యుపచారంబులు గైకొనుచు, నంతటితోఁ దనివిసనక కనకగర్భుక పాలపాత్రంబునఁ బూర్ణంబె కరపల్లవంబున నుల్లసిల, నల్లనల్లన యోగపాదుకాయుగళంబు గల్లుగల్లున మొరయ మునిజనాశ్రమంబులఁ బ్రవేశించినాఁడు శివుఁడు. మునివాటమున భిక్షాప్రవృత్తికిఁ గారణము వేశవాటమునఁ దన భిక్షాపాత్ర మర్ధపూర్ణ మగుటచే దానిఁ బూరింపఁజేయుటకని కడు మనోజ్ఞతముగఁ దెలిపియున్నాఁడు. అటనుండి మునిపత్నీ మనోహరణ దక్షమగు సౌందర్యమును, తత్సముచిత విభ్రమభంగిని శంకరునెడఁ గాన్పింపఁజేసినాఁడు.

హరుఁడు మునిమందిరంబుల మోసలనిలిచి, 'భవతి భిక్షాం దేహి' యని వారివాహ గర్జాగంభీర స్వరంబునఁ బలుకుచుఁ, గులాంగనాజనంబు నపాంగ దృక్తరంగంబుగఁ జిఱునగవులిసిఱింతలువాఱఁ గనుంగొనుచు, సంయమివధూపాతివ్రత్యభంగంబు దనకుఁ బరమ ప్రయోజనంబుగా నర్మగర్భోక్తి సందర్భంబులు నిజాభిలాషంబు దేటపఱుచుచుఁ బ్రకటింపం దొడంగిన—

మ. దరహాసంబుల భ్రూలతానటన ము
ద్రా విభ్రమ ప్రౌఢిమన్
బరిహాసోక్తుల భావగర్భరస సం
పల్లంపటాలోకన
స్ఫురణాభంగుల మౌనికాంతల మనం
బుల్ వారలాడె న్మహే
శ్వరుఁ డుద్దామ విలాసదారువనికా
వాట ప్రదేశంబులన్.

—హర 6—53

సీ. సులభమార్గంబుఁ జేయ దుపక మాంజాయన...
ముకపైల సంప్రసూతులింప్లఁ
బుణ్యగృహిణులఁ బతిభక్తి పూర్ణమతుల
భాగ్యసంపన్నలను బుత్రపౌత్రవతుల
సతులను ముత్తైదువులను నిశ్శంకవృత్తి
రజనికరఖండమౌళి విరాళిగొలిపె. హర. ౬-౫౪

ఉద్దామ విలాసియగు మహేశ్వరుఁడు దారుకావనవాట ప్రదేశంబుల మునికాంతల మనములను మందహాసములతోడను భ్రూభంగవిభ్రమప్రౌఢిమలతోడను, నర్మభాషితములతోడను, భావగర్భితాలోకనముల తోడను జూఱలాడెనఁట. ఇట శ్రీనాథుఁడు శృంగార రసభావావిష్కరణవిషయమునఁ బాటించిన సంయమము మహాతీతము. ఇట్టి ఘట్టములందు రసావిష్కరణ తత్త్వము నెఱిఁగిన కాళిదాసాది మహాకవులకుఁ గొందఱికే గాక సంయమము పాటించుట యందఱకు నలవిగాదు. ఇట్టి ఘట్టములందు శృంగార భావములను, తదుద్భూతచేష్టాదికము నెంత వివిధమైనఁ బ్రపంచింపవచ్చును. ఈ తరుణమునందు సైతము భావము నతి నిబిడము సేయుచు, నౌచితీభంగము గావింపక, జుగుప్సావహభావము సోకకుండ హరుని విలాసాదికము నే శ్రీనాథుఁడు వ్యక్తీకరింపఁ గలిగెననుటలో నాతనికిఁ బరమేశ్వరునెడఁగల భక్తిభావమే కారణము. పరమేశ్వరుఁ డిట్టి విలాసముల చేతనే తన ప్రయోజనమును సాధించెననుటకు పతిభక్తి పూర్ణమతులను, పుణ్యగృహిణులను, పుత్రపౌత్రభాగ్య సంపన్నలను, సతులను, ముత్తైదువలను సైతము విరాళి గొలిపెనని వివరించినాఁడు. మఱియు మునిపత్నీ పాతివ్రత్యంబును భంగింపఁజేసిన విధము నతిగంభీరముగను భావగర్భితముగను సముచితముగ సాగించినాఁడు.

ఏ ఇల్లు ప్రతి గృహంబున భిక్షాటనంబు సేయుచు మహోక్షలాంఛనుఁడు వాంఛానుకూలప్రకారంబున జారసురత వ్యాపారపరాయణుండై మగల కన్ను మొఱంగి, సంధ్యాసమయంబుల ననుష్ఠానార్థంబుఁ బురుషులు సమిత్కుశ ఫలాహరణార్థం బెండెనిఁ జనిన యెడను వేచి, శపథప్రత్యయంబును నిగూఢనిశ్వాసోచ్ఛ్వాసంబును నివారిత సల్లాపంబును నిమేషమాత్ర సౌఖ్యంబును నిబిరీస భయకంపంబునైన సంభోగంబు లభిలషించు నారంభోరువుల మదనలేఖా కథాసందేశ వాక్యంబులను, సంకేతస్థాన కంకేళికుంజల నికుంజక్రీడ సంవేశ క్రీడల, నుపాంత్య దూతీ పరామర్శంబులను, భ్రూలతాదేశంబులను, నపాంగ రంగస్థల లాస్యలంపట కటాక్షవీక్షావిక్షేపంబులను మందహాస కందళిత పరిస్పందంబులను గందర్ప బ్రహ్మానందం బనుభవింపఁజేసి మిసిమింతుఁడును గాక

# హరవిలాసము: దేవదారు వనవిహారము

దేవదారు కాంతారమధ్యంబున ఖట్వాంగ పాణి భిక్షా వృత్తిఁ జరించుచుండెనఁట.

నెఱమించె జంగము వేషముదాల్చి తనహావభావ విలాసాగులచే హృదయముఁజూఱఁగొనిన పరమేశ్వరుని గనయఁగోరు రంభోరువులను వాగ్విలాసాది విభ్రమ ప్రదర్శన మాత్రముననే హరుఁడు కందర్ప పరబ్రహ్మానంద మనుభవింపఁ జేసెనని చిత్రించుటలో శృంగారరసము వ్యంగ్య మహితమై పరాకాష్ఠ నందినది. ఈ వర్ణనమునఁ గవికిఁగల భావసంయమ మతివేలమై చూపట్టినది. ఈ ఘట్టము నందె నిశ్శంక కొమ్మనామాత్యుఁడు తనరచనలో సంయమము నేపాటియుఁ బాటింపక మునిపత్నులతోడి పరమేశ్వర విహారవర్ణనమునందు బంధాదికమును గూడఁ జిత్రించి వదలినాఁడు. దారుకావనము పరమసంయమి తపస్విగాధ నిలయము. ఋషిపత్నులు పాతివ్రత్య నిష్ఠాగరిష్ఠలు. తత్పాతివ్రత్యభంగ ప్రవృత్తుఁడైన శంకరుఁడు యోగీశ్వరేశ్వరుఁడు. తదాలంబనముగ నిర్వహింపవలసిన శృంగారమున సంయమమును బాటింపకున్నది రసజ్ఞ హృదయములకు వైరస్యమును గలిగింపకమానదు కావుననే శ్రీనాథుఁ డిప్పటినఁ బరమ సంయమియైనాఁడు

ఇంతవఱకు మునిపత్నుల పాతివ్రత్య భంగమును నిగూఢముగ నెఱపెనాఁడీశ్వరుఁడు. తత్ప్రవృత్తి ప్రత్యక్షమై మహర్షులందఱు కంటఁబడినఁగాని హాబంధన ప్రయత్నము జరుగ నేరదు. తత్ప్రయత్నమునఁగాని మహాలింగావిర్భావము జరుగ నేరదు. తదుపక్రమము నకై యాదభిక్షుని భైక్షుక స్వరూపమును మఱింత మనోహరముగఁ జిత్రించినాఁడు.

సీ. మువ్వన్నె పులితోలు మొలదిండుగాఁగట్టి
కరొట్లఁ కాహి పాగా ధరించి
చిలువ పోగులను ప్రేల్వెవుఁ గీనచేం
వలరాచ నీలుమైఁ గలయ నటఁది
చిన్నారి పొన్నారి శశిరంపుఁ దలఁదాల్చి
కొనగోటి జతి లేటి కొదమఁ బూని
పచ్చియేనికతోలు పచ్చడంబు ధరించి
గిలుకు మువ్వలకోలఁ గేలఁబట్టి
పసిఁడి జలపోసనముతోడ నెసక మెసఁగ
బిసరుహాసను పుఱియ దొప్పెర ధరించి
పెద్ద నడివిధి నిలుచుండి భిక్షయడుగు
నాశ్రమంబులయందు ఖట్వాంగపాణి.

—హర 5-86.

ఇపుడు పరమేశ్వరుఁడు నిజరూపముతో ఘంటాపథమధ్యంబున నిలిచి ఋష్యాశ్రమముల భిక్షకు నడుగఁ దొడఁగెను. ఇంతవఱకు మిండజంగము రూపమునుండిన పరమేశ్వరుని నిజస్వరూప మిపుడు ప్రత్యక్షమైనది. ఈ ప్రత్యక్షభావమే తద్బంధనప్రయత్న హేతువైనది.

"ఇవ్విధంబున మన్మథమనోనందు మనోహ్లాదం బునఁ గన్నుగానక మునిశ్రేష్ఠంబుల పాతివ్రత్యంబు పొలివుచ్చుచు నిచ్చలు విడిఁ జరింపబూనిన నిలింపమౌని వ్రాతంబు వారికి వారికి నెఱింగి యజుయజవోవుచు వదనంబు ప్రకాశింపంజాలక లోలోన యనందుకొని యుండుచు పెనప్పాటం బ్రజ్ఞాభవనంబుఁ బాటిల్లు చీకటితప్పు కప్పిపుచ్చు నెరవుపడకుండానట్టు గాఁ ప్రకాశించిన గట్టాయితంబై యొండఱు నా జగజ్జెట్టి వేల్పు శోధించం బట్టికొనువారై చుట్టుముట్టిరి."

పరమేశ్వర కర్తృకమై యింటింటఁ గప్పిపుచ్చుటకు వలనుపడని యా చీకటితప్పు బయటఁబడినపుడు మహర్షులందఱు నేకమై, జగదేకవిభుఁడైన యీశ్వరుని శక్తిసామర్థ్యములు దామెఱుఁగియుఁ బట్టికొని బంధింపఁ జుట్టుముట్టిరి. తత్సన్నాహము చూచి పరమేశ్వరుఁడు మందహాసము సేయుచుఁ దనలింగముచు వెంగి దాఁనఁ బెరిగించి, తత్స్థానంబున నా మునుఁ సన్నాహము నడఁచివైచి, సోమార్క మహాసోపానంబుల డిగివచ్చు విమద్గంగాప్రవాహంబున నభిషేకం బాపాదించి, తల్లింగోత్సేధంబున బ్రహ్మాండ వైర్పరం బప్పళింపఁ జేసెఁనాఁడు. బ్రహ్మాండవ్యాప్తమైన యా పరమేశ్వర లింగమునకు బ్రహ్మ తన కరకమండలుతీర్థంబున నభిషేకం బాపాదించి, గంధపుష్పాద్యుపచారములతో నుపాసించి బ్రహ్మాండపరివ్యాప్తంబైన యా లింగంబు నుపసంహరింపుమని స్తుతిపూర్వకముగఁ బ్రార్థించెను. పరమేష్ఠి ప్రార్థన నంగీకరించి పరమేశ్వరుఁడు 'లింగార్చనాపరులను మత్సంగత్వంబు కృపసేసెద' నని తెలిపి నిజమహాలింగమును స్తంభింపఁజేసెను. దేవదారు వన దివ్యాశ్రమస్థులగు గృహస్థులు పరమేశ్వరు మహత్త్వము గాంచి, తమ మనంబుల నాతనియెడ నీర్ష్యాదోషము లుజగించి. యా శేషాహిభూషణుని బహువిధ భక్తివిశేషముల భజియించిరఁట.

ఈవిధముగ శృంగారరసపరాకాష్ఠ నాపాదించుటకై యావిర్భావమైన యీ దేవదారు వన విహారము పరమేశ్వరభక్తిభావమునఁ బర్యవసన్నమైనది. శ్రీనాథుఁడే రసమును నిర్వహింప సమకట్టెను దానిని బరమేశ్వరాలంబనముగనే చిత్రించును గానఁ దత్తత్ ప్రదర్శనీయలౌకిక భావములన్నియు నైహిక విషయములతో నాదబములయ్యును నాధ్యాత్మిక భావపర్యవసన్నము లగుచుండును. అత్తెఱంగమీఁద నెల్లపోకడ గా నిర్వహించి ధూర్తనేష్టితముఁకుఁ గడెగిన శంకరుఁడు సర్వలోక సముపాస్యలింగస్వరూపుఁడై యవతరించినాఁడు!

# అంతర్వాహిని

'హితశ్రీ'

రివ్వురివ్వున వీచే గాలుల్లో జనతా ఎక్స్‌ప్రెస్ ముందుకి దూసుకుపోతూ పట్టాలు మోగుతోంది. తనకి చేరువగా ఉన్న కిటికీ అద్దం పైకిలాగి విశ్వం తూర్పు దెసగా చూశాడు.

వయ్యారాలు పోలకబోస్తూ దవ్వుదవ్వులకి జరిగి పోయే చీకటి చీర చెంగు దొంకపుచ్చుకుని వెలుగు సరాగా లాడుతుంటే ఆకాశం ముసిముసిగా నవ్వుతోంది!

చైత్ర శుద్ధ పాడ్యమి.

తెల తెలవారుతోంది.

కొత్తగాలులు రివ్వున వీస్తూ విశ్వాన్ని పరామర్శించాయి. ఆ శుభోదయ సుందర దృశ్యాన్ని వేడుకగా చూస్తూ పులకితుడయ్యాడు విశ్వం. వెనకనించి ప్రసరించే అరుణకాంతికి కొండల అంచులు గీతలు గీసినట్టు స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఆకాశమార్గాన పక్షులు స్వేచ్ఛగా కలకల గానంచేస్తూ బారులు బారులుగా సాగిపోతున్నాయి. దూరంలో పసుగణాలు తీరికగా పచ్చిక మేస్తున్నాయి. ఆ పరిసరాలు చూడగానే విశ్వానికి ప్రాణం లేచివచ్చినట్టయింది. ఆ ప్రాంతాలలో తనెప్పుడూ సంచరించలేదు, నిజమే. కాని ఆ చిరపరిచిత దృశ్యాలన్నీ ఏదో ఆత్మీయతని జ్ఞాపకం చేస్తుంటాయి ఎప్పుడూ. అక్కడ రైలు దిగి ఆ ప్రదేశమంతా కాలినడకన తిరగాలని తన కెన్నోసార్లు అనిపించింది. కాని ఇప్పటివరకూ అది కోరికగానే నిలిచిపోయింది. మనుషుల కోరికలు కొన్ని ఎంత చిన్నవైనా ఎప్పుడూ కోరికలుగానే నిలిచిపోతూంటాయి. సముద్రస్నానం చెయ్యాలని తనకి ఎన్నోసార్లనిపించింది. వాల్తేరులో మూడు సంవత్సరాలు గడిపినా, చివరికి ఆ కోరిక తీర్చుకోకుండానే ఆ ఊరు విడిచి వచ్చేస్తున్నాడు.

రంయిమని వీచినగాలికి ఇంజన్‌లోనుంచివచ్చిన బొగ్గురవ్వ విశ్వం కంట్లో పడ్డది. తటాలున తల వెనక్కి లాక్కుని జేబు రుమాలుతో ఎలాగో అవస్థపడి దానిని తీసివేశాడు. కాని కన్ను ఎర్రబడ్డది. అప్రయత్నంగా ఎదురుగా ఉన్న సీటువైపు చూశాడు విశ్వం. ఆ అమ్మాయి ఇంకా అలాగే కూర్చుని నిశ్చలంగా కిటికీలోంచి బయటికి చూస్తూనే ఉంది. తన అవస్థ ఆమె చూసేవుంటుంది. అయినా తల లోపలికి తీసుకోదేం? తన ఉనికి గుర్తించటం ఆమె కేమాత్రం ఇష్టం ఉన్నట్టు లేదు. ఇంతకీ. స్వానుభవమైతేగాని ఏ విషయమూ మనుషులు గుర్తించరు. అందుకు కారణం ఒకప్పుడునిర్లక్ష్యమూ, ఇంకోసారి అహంకారమూను. పాపం, ఆమెకంట్లో రవ్వపడితే అవస్థపడుతుంది కాబోలు. ఆడవాళ్లు ఎంతసేపటికీ పైకి డాబు సరేగాని ఎంత చిన్న ఉపద్రవం జరిగినా ఇట్టే బయటపడి పోతారు. అయినా, ఈ అమ్మాయికి కొంచెం బెట్టు ఎక్కువలా ఉంది. రాజమండ్రినించీ చూస్తున్నాడు. ఒంటరిగా అర్ధరాత్రి రాజమండ్రిలో ఈవిడ రైలెక్కటం ఆశ్చర్యంగానే ఉంది. ఎవరో స్నేహితురాండ్రు మొదలైనవాళ్లు స్టేషన్‌కివచ్చి సాగనంపి వెళ్లారు. అప్పటినించీ ఆమె ముభావంగా అలాగే కూర్చుని ఉంది. ఉత్తర హిందూస్తానీ యువతిలా తలమీద ఆ ముసుగెందుకూ? తన అందం కళ్లతో తాగెయ్యటానికి ఇక్కడెవరో సిద్ధంగా వున్నట్టు!

ఈ అమ్మాయి ఎవరోగాని వేషభాషల్లో నాగరికత ఉట్టిపడుతూనేవున్నా కొత్త పూర్వాచారాల చాదస్తం వున్నట్టుంది. గోదావరినదిలో డబ్బులు వేసి దణ్ణం పెట్టింది. తనకి నవ్వొచ్చింది. తను చూస్తున్నాడనే సంకోచమైనా ఆమెకి కలగలేదు. ఆ అభిప్రాయం వుంటే ఓ చిన్న దొంగచూపుచూసివుండేది! అన్నట్టు ఆమె రెండుమూడుసార్లు తనవైపు చూసినట్టు అనుమానంగా ఉంది. తన తోలుసంచీ వైపుమాత్రం తప్పకుండా చూసింది. బహుశా దానిమీద తన అడ్రసు వుండే వుంటుందనుకుందేమో! అంత తెలుసుకోవాలని

వుంటే తనని అడగకూడదూ? పలకరిస్తే నోటిముత్యాలు రాలిపోతాయికాబోలు. ఎక్కడికి వెళుతుందో ఈమె! ఒకవేళ విజయవాడలో దిగిపోతుందేమో!

ఈ ఆలోచనరాగానే మళ్ళీ కిటికీలోంచి బయటికి చూశాడు విశ్వం. జనతా ఎక్స్‌ప్రెస్ విజయవాడ సమీపిస్తోంది. కేవడా ఇంజన్ గావుకేక పెట్టింది. తను గుంటూరువెళ్ళేబండీలోకి మారాలి. చేతిగడియారం చూసుకుని, లేచినుంచుని సామాన్లు సర్దుకోసాగాడు విశ్వం. తోలుసంచీ తియ్యబోయి అప్రయత్నంగా ఆమెవైపు చూశాడు అతను. ఆమె యథాలాపంగా తన సామాన్లవైపు చూసింది. ఒక్క క్షణం విశ్వంలో ఏదో బలహీనత ఆవరించి తన అడ్రెస్ ఆమెకి కనిపించేలా ఆ సంచీ తిప్పాలని అనుకున్నాడు కాని వెంటనే ఆ ఊహకి సిగ్గుపడ్డాడు. తనెందుకు ఆమెని గురించి అంతసేపు ఆలోచించాడు? తనెవరు, ఆమె ఎవరు? ఆమెని మళ్ళీ తనజీవితంలో ఎప్పుడూ చూడటం తటసించకపోవచ్చు. పైగా ఆమె తనకి స్నేహితురాలేమీ కాదు. ఆమెతో ఒక్కమాట కూడా మాట్లాడలేదు. రాజమండ్రినించి కలిసి ప్రయాణం చేశారు, నిజమే అయినా ఆమెని గురించి ఏ విషయమూ తనకి తెలియదు. తనని గురించి ఆమెకి తెలియదు. ఆమె తనని గురించి ఏమైనా అనుకుందో, లేదో! అనుకునే ఉంటుంది. తను ఏవేవో అనుకున్నాడు. ఆమె మాత్రం ఎందుకనుకోకూడదు! చిత్రం, ఇంతసేపు ప్రయాణంచేసే మనుషులో అనుకోటాలతోనే విడిపోతున్నారు తనూ, ఆమే. తోటి ప్రయాణీకులతో మాట్లాడకుండా దూర ప్రయాణాలు చేసిన రోజులున్నాయి—భాష తెలియనందువల్ల ఆ వ్యక్తి తెలుసువాడై, మగవాడైతే తను మాట్లాడకుండా వుండడు. కాని 'ఆమె' ఐపోయింది ఆ వ్యక్తి!

ఎక్స్‌ప్రెస్ ప్లాట్‌ఫారం సమీపిస్తోంది. ఆమె ఏమిటో సర్దుకుంటున్నట్టంది. సామాన్లు ఏమీ లేవే. ఒక చిన్న చేతిసంచి మాత్రం ఉంది. వెనక్కి తిరిగి చూడాలనిపించింది విశ్వానికి. కాని సాహసం చాలలేదు. ఒకవేళ అదే సమయంలో ఆమెకూడా తనవైపు చూస్తే!

"టిక్కెట్టు పోయిందండీ."

ఆందోళన వ్యక్తమయే సన్నని స్వరం వినిపించింది. విశ్వం గుండె కొట్టుకోవటం స్పష్టంగా విన్నాడు. వెనక్కి తిరిగాడు. కాని ఆమెవైపు చూడటానికి బిడియ పడ్డాడు.

"ఎలాగండీ?"

ఏం చెప్పాలో విశ్వానికి తెలియలేదు.

"ఎలాపోయిందీ!" ప్రయత్నించి అడిగాడు.

"ఏమో. చేతి రుమాలులో పెట్టుకున్నాను. కిందపడి పోయిందేమో!"

విశ్వం చుట్టుపక్కల చూశాడు. ఏమీ కనిపించలేదు. ఆమె గాభరా పడుతోంది. అతనికి కొంచెం చిరాకు వేసింది. ఆడవాళ్లు జాగ్రత్తమనుషులని తను ఇప్పటిదాకా అనుకున్నాడు.

"బయటపడిపోయి ఉంటుంది. ఎలాగండీ?" అందామె.

"టి. సి. తో చెప్పండి" అందామనుకున్నాడు. కాని జాలివేసింది. ఇదికాక తనేమీ చెయ్యలేకపోతే వొట్టి అప్రయోజకుడు అనుకొంటుందేమో. ముఖ్యం మొగం ఎరగని మనిషే అయినా ఆమె తనని గురించి అలా అనుకోటం తనకిష్టంలేదు.

"పోన్లెండి, పోయినా ఫరవాలేదు ఇంకో టిక్కెట్టు తెచ్చిపెడతాను. ఎక్కడిదాకా వెళ్లాలి?" అడిగాడు ధైర్యం చెబుతున్నట్లు.

"విజయవాడలో దిగిపోతానండీ." ఆలోచించాడు విశ్వం. సేపట్లో ఎక్స్‌ప్రెస్ ఆగింది.

"టికెట్ నెంబరు తెలుసా?"

"ఊఁహుఁ"

ఇంత అజాగ్రత్త మనిషికి పరాకేమిటి? తనెప్పుడూ టికెట్ కాదుగదా, ఇంకేదీకూడా పారేసుకోలేదు. అయినా, టికెట్ కొనగానే నెంబరు చూసి గుర్తుపెట్టుకోటం తనకి అలవాటు.

"ఇప్పుడే వస్తానుండండి.?" అనేసి, రైలుదిగి నడవసాగాడు విశ్వం. గార్డు కనిపించాడు. అతనితో చెబుదామనుకున్నాడు విశ్వం. కాని ఏం లాభం? ఎక్సెస్ కట్టుకోవాలిసిందే నంటాడు. ఆమె దగ్గిర డబ్బుందో, లేదో. అబ్బ. సమస్యలు తెచ్చిపెట్టటం ఈ ఆడవాళ్ళ నైజం. విసుగ్గా ప్లాట్‌ఫారం చివరిదాకా ఓ చూపు విసిరాడు విశ్వం. చప్పున అతనిలో ఊహ తట్టింది. గబగబ బుకింగ్ ఆఫీసు దగ్గరికి వెళ్ళి ఓ ప్లాట్‌ఫారం టికెట్ తీసుకుని వెనక్కి వచ్చాడు. కిటికీ

లోంచి ఆమె చూస్తోంది. ఆ లేత ఆకుపచ్చ మేలిముసుగు తనకి గుర్తే.

"ఇదిగోనండి ప్లాట్‌ఫారం టికెట్. స్టేషన్‌వాళ్లు ఎవరైనా అడిగితే రైల్లో ప్రయాణం చెయ్యలేదని చెప్పండి." టికెట్ ఇస్తూ అన్నాడు విశ్వం.

"అబద్ధమా?" అందామె ఇష్టంలేనట్టు. ఆ అనటం కూడా తను ఉత్తి అబద్ధాలకోరు అనే నిర్లక్ష్య భావం సూచిస్తున్నట్టు వినిపించింది అతనికి. అందులో ఏదో అపహాస్యం కూడా ధ్వనించింది. విశ్వానికి ఒళ్ళు మండింది.

"నిజం చెప్పినా ఫర్వాలేదు, దగ్గిర డబ్బుంటే" అనేసి పోర్టర్‌ని పిలిచి సామాన్లు పట్టించుకుని గుంటూరు బండికేసి నడవసాగాడు విశ్వం. అతని మనసు పరిపరి విధాల ఆలోచిస్తోంది. అలా కర్కశంగా అనకుండా వుంటే బావుండేదనిపించింది అతనికి. పాపం, చిన్నబుచ్చుకుందేమో. అయినా ఆమె అలా ఎందుకనాలి? ఒక్కొక్కసారి నిజానికి విలువ శూన్యమనే విషయం తెలియనంత అమాయకురాలా ఆమె! అర్థరాత్రి ఒంటరిగా ప్రయాణంచేసే మనిషికి అమాయకత్వమేమిటి? కాని ఆమె తరహా చూస్తే పాతకాలపు వాసనలు పోయినట్టు లేవు. సొంత డబ్బు పెట్టుకుని టికెట్ కొనిస్తే కనీసం 'థాంక్స్' అని కూడా అనలేదు. ఏం మర్యాద! మర్చిపోయిందేమో! ముఖంలో కృతజ్ఞత తాండవించే ఉంటుంది. ఇంతకీ తను ఆ సమయంలో కూడా ఆమె కళ్ళలోకి చూడలేకపోయాడు. ఆమె వదనంకూడా సరిగ్గా చూడలేదు. విశ్వానికి కొంచెం ఆశ్చర్యం వేసింది. మాట్లాడేటప్పుడు ఎదటి వ్యక్తి కళ్ళలోకి చూసి తను మాట్లాడలేడు. కారణం ఏమిటో? ఈ విషయం తను చాలాసార్లు గమనించాడు.

ఆలోచిస్తూ విశ్వం గుంటూరు వెళ్ళే రైల్లో కూర్చున్నాడు. సెకండ్ క్లాస్ కంపార్ట్‌మెంటు వెతుక్కోటం, పోర్టర్‌కి డబ్బులిచ్చి పంపివేయటం యాంత్రికంగా జరిగిపోయాయి. రైలు కదలటానికి ఇంకా చాలా వ్యవధి ఉంది ఆలోచనలన్నీ కట్టివేసి ఆకాశంలోకి చూశాడు విశ్వం. ప్రభాతకాంతులు నాలుగు దిక్కులకీ వ్యాపిస్తున్నాయి. రాత్రంతా నిద్రలేదు. పడుకోటానికి ఖాళీఉన్నా రాత్రంతా ఏమేమిటో ఆలోచిస్తూ అలా కూర్చునే ఉన్నాడు పత్రికల పేజీలు తిప్పుతుంటే అనేకానేకమైన ఆలోచనలు మనసులో మెదిలాయి. ఈ మూడేళ్ళనించీ ఇంతతీరికగా గడిపిన సమయం తనకి ఈ రాత్రే. ఆనర్స్ పరీక్ష తృప్తికరంగానే రాశాడు. బహుశా రెండో తరగతిలో ఉత్తీర్ణుడు కావొచ్చు. అంతకంటె తను ఎక్కువ ఆశలకి ఎప్పుడూ పోలేదు, తన సరిహద్దులు తనకి తెలుసు. తన జీవితంలో ఒక దశ గడిచిపోయింది. ఇక రెండో దశ ప్రారంభం కావాలి జీవితరంగంలో పోటీలు, కుస్తీపట్లు మొదలైనవాటికి నాందీ ప్రస్తావన జరుగుతుంది కాబోలు. పోటీలు [illegible] మానవులకి ఉగ్గుపాలతో పెట్టిన విద్య. రానురాను అది మరీ అనివార్యమౌతోంది. ఎటువంటి ధక్కాముక్కీలకైనా తను సిద్ధపడాలి. మొదటినించీ ప్రశాంతత అంటే తనకి ఇష్టం కాని ప్రపంచం తనని హాయిగా ఓమూల ఉండనివ్వదు. కవ్విస్తుంది; రెచ్చగొడుతుంది; పోట్లాడుతుంది. జనంలో తనూ ఒకడు. ఆ వ్యక్తిత్వానికి ఎన్నో సవాళ్లు. అన్యాయాలూ, అక్రమాలూ. ఆవేశాలూ, అభిమానాలూ, ఆకర్షణలూ పగ్గాల్లా తననీ రంగంలోకి ఈడుస్తాయి. రకరకాల అద్దాల్లో రకరకాలుగా తన ప్రతిబింబం ప్రతిఫలిస్తుంది. కాని ఈ అన్ని ప్రతిబింబాల్లో విశ్వం అనే వ్యక్తి – ఒక మనిషి–తనని తను గుర్తించుకోగలడా? కనీసం ఇలా ఒకసారి తను ఆలోచించాడనే విషయమైనా గురుకి రాగలదా? బహుశః తన భవిష్యత్తు ఈ ప్రశ్నపై వచ్చే సమాధానంమీదే ఆధారపడి ఉంటుంది. బుద్ధిబలంమీద విశ్వాసం ఉన్నన్నాళ్ళూ తార్కిక శక్తి వెలుగు చూపిస్తూనే ఉంటుంది. కాని నమ్మినవాటిని ఆచరణలో పెట్టటానికి ధైర్యం ఉండాలి. తనకా ధైర్యం ఒక్కటే ఉంటే చాలునని ఆ క్షణంలో విశ్వం చాలా సాధారణమైన కోరిక కోరుకున్నాడు. అస్పష్టమైన ఆలోచనలన్నీ అలా ఒక దారికివచ్చి తృప్తికరమైన ముగింపుకి ఆస్కారమివ్వటంవల్ల అతని మనస్సు తేలికపడ్డది.

"వసపూడి నారింజండీ, వడ్లపూడి నారింజ కాయ అణా, కొయ్యమంటారా బాబు?" తప్పకుండా కొంటాడనే ఆశతో ఆ పళ్ళమ్ముకునే ఆసామీ విశ్వంవంక చూశాడు అతను పరధ్యానంగా వొద్దన్నట్టుగా తలతిప్పాడు. ఇంతలో చటుక్కున విశ్వం మనసులో ఏదో జ్ఞాపకం మెదిలింది కోనపల్లిలో మామయ్యకి నారింజతోట ఉంది. తను స్కూల్ ఫైనల్

చదువుతున్నప్పుడు — అంటే అయిదేళ్ళకిందటిమాట— మామయ్యగారింటికి వెళ్ళాడు. అప్పటినించీ ఆ నారింజ తోట అప్పుడప్పుడూ జ్ఞాపకం వస్తూనే ఉంటుంది తనకి. పాపం, ఈసారికూడా తనని వచ్చి రెండు రోజులుండిపొమ్మని ఉత్తరం రాశాడు మామయ్య. ఏమిటో ఆ పల్లెటూరు వెళ్ళాలనుంటే తన కంత ఇష్టం లేదు. పైగా అదో యాతన ప్రయాణం. బెజవాడనించి బస్సులో రాచవరంవెళ్ళి అక్కడినించి డొంకదారిన ఏ మైలున్నరో రెండు మైళ్ళో నడవాలి. ఈ మధ్య మట్టిరోడ్డు పడ్డదని మామయ్య రాశాడు. అయినా బద్ధకిస్తూనే ఉన్నాడు ఇప్పటివరకూ, పైగా నాన్నకి కూడా అంత ఇష్టంలేదు. "ఆఁ, ఏముందిలెద్దూ అక్కడ?" అంటాడు. అమ్మ అప్పుడప్పుడు ఓసారి వెళ్ళిరమ్మని అంటూ ఉంటుంది. కిందటి మాఘ మాసంలో పద్మ పెళ్ళికి మామయ్య వచ్చినప్పుడు నిష్ఠూరం వేసిపోయాడు — ఆనర్స్ చదువుతో తనకి భూమ్యాకాశాలు అందటం లేదుట! ఓ సారి వెళ్ళి రావాలని అనుకున్నాడు విశ్వం. అలా అనుకోగానే "ఎప్పుడు?" అనే ప్రశ్న ఉదయించింది. ఎలాగూ విజయవాడ రానే వచ్చాడు. ఇప్పుడే ఆ ముక్కేదో తీర్చుకుంటే బావుంటుందనిపించింది అతనికి. ఏదైనా అనుకుంటే అది నెరవేర్చేదాకా తోచదు విశ్వానికి. వెంటనే పోర్టర్ని పిల్చి సామాను పట్టించుకుని స్టేషన్ బయటికివచ్చి జట్కా చేసుకుని ఆనందవిలాస్ —బోర్డింగ్ అండ్ లాడ్జింగ్ హౌస్ —కివెళ్ళి ఓగది అద్దెకి తీసుకుని సామాన్లు అక్కడ పడేసి బస్ స్టాండ్కి వెళ్ళాడు. రాచవరం వెళ్ళే బస్సులు అప్పటికే రెండు వెళ్ళిపోయాయి అని తెలుసుకుని ఓపిగ్గా బస్సుకోసం కాచుకుని కూర్చున్నాడు. అసలే బస్సుప్రయాణాలు అతనికి తలనొప్పి. పైగా తను వెళ్ళబోయే కంకరరోడ్డు అంతంత మాత్రమైనదే. ఈ మధ్యనే సంపాదకునకు లేఖల శీర్షికలో విజ్ఞప్తులూ, ఆక్షేపణలూ రాచవరం రోడ్డుని ప్రజానీకం దృష్టికి తెచ్చాయి. ఎలాగైతేనేం, బస్సు ఒంట బస్తది. విశ్వంలాగే మరికొంతమంది పడిగాపులు పడివున్న జనం బస్సుకోసం ఎగబడ్డారు. చేతిలో ఓచిన్న సంచీమాత్రమే ఉండటంవల్ల విశ్వం జనాన్ని తోసుకుని ఫ్రంట్ సీట్లో స్థలం సంపాదించుకున్నాడు, కొంచెం తేలిగ్గానే కుదురుగా కూర్చున్న విశ్వానికి ఆక్షణంలో ఆశావాదంమీద కొంచెం నమ్మకం కలిగింది. జీవితంలో ఎన్నిటికోసమో ఆగాలి. చివరిదాకా ఆగే ఓపికఉన్న వాడికే ఫలితం దక్కుతుంది. మొదటిపాఠం నేర్చుకున్న విద్యార్థిలా విశ్వం మెరిసే కళ్ళతో జనంవైపు చూశాడు. అయితే అతని సంతోషం ఎంతోసేపు ఉండలేదు. బస్సు కదలబోయే సమయానికి పోలీస్ ఇన్స్పెక్టరుగారు అల్లంత దూరంలో కనిపించారు. పక్కనఉన్న కానిస్టేబుల్ బస్సు కండక్టర్కి దూరంనించే సంజ్ఞ చేశాడు. బస్సు ప్రయాణీకులు కొందరు విశ్వంవైపు జాలిగా చూశారు. కండక్టరు విశ్వం దగ్గిరికొచ్చి బతిమాలుతున్నట్టుగా అన్నాడు.

"సార్, ఈసీట్ ఇన్స్పెక్టర్ గారికి రిజర్వ్ చేశాం. దయచేసి ఇలా కూర్చుంటారా?" అని వెనకవైపున ఓచిన్న ఖాళీ చూపించాడు విశ్వానికి ఒళ్ళు మండింది.

"రిజర్వ్ చేస్తే ముందు చెప్పక పోయారా?" అన్నాడు.

కండక్టరు అతనిమాట వినిపించుకోలేదు. దిగక తప్పదన్నట్టుగా వెళ్ళిపోయాడు.

"సార్" అని కొంచెం జాలిగా అన్నాడు డ్రైవర్. ఇన్స్పెక్టర్ బస్సుకి కొంచెం దూరాన నిలబడ్డాడు. విశ్వానికి ఏం చేయటానికీ తోచలేదు. ఇన్స్పెక్టర్ వస్తాడని బస్సువాళ్ళకి ముందు తెలిదన్నమాట స్పష్టం. రిజర్వేషన్మాట శుద్ధ అబద్ధం. అదే నిజమైతే మొదటనే తనని ఆ స్థలంలోకి రానిచ్చేవాళ్ళు కారు. కాని ఇప్పుడేం చెయ్యటం? ఈ గొడవలు తనకి తెలిసినవే. సిటీబస్ సర్వీసు ప్రయాణాల్లో అనుభవించిన పాటే. పేచీ పెట్టటంవల్ల లాభంలేదు. చిరాగ్గా లేచి బస్సు వెనక సీటులో కూర్చున్నాడు తాత్కాలికాల్లో తాత్కాలికం బస్సులో ఫ్రంట్ సీట్. ఏక్షణాన అయినా ఖాళీ చెయ్యమని నోటీసు రావొచ్చు. అధికారాన్ని అసహ్యించుకునే విశ్వం ఆ క్షణాన అధికారం హస్తగతం చేసుకుని విజయంతో గర్వించాలని జీవితంలో మొట్టమొదటిసారిగా అనుకున్నాడు అయితే అలా అనుకున్నందుకు అతను వెంటనే విచారించక పోలేదు. ఇంత చిన్న చిన్న పరీక్షలకే తను తట్టుకోలేక లొంగి

పోతే తన వ్యక్తిత్వం సంగతేమిటి? "అబ్బ, మనసు పాట్టి చెడ్డది" అని స్వగతంలో అన్నాడు విశ్వం.

ఇన్‌స్పెక్టర్ గారు కూర్చోగానే బస్సుకదిలి సాగిపోతోంది. గతుకుల్లోనించి పోతున్నప్పుడల్లా ఆ కుదుపులకి తూలిపడుతున్నారు జనం. ప్రయాణీకుల్లో చాలామంది చదువుసంధ్యలు లేని పల్లెటూరిజనం. మోటుతనం వేషంలోనే కాక మాటల్లోకూడా ప్రస్ఫుటమౌతోంది. ఎవరో లంకపొగాకు చుట్ట వెలిగించాడు. ఆ పొగ సూటిగా విశ్వంమీదికి వొదిలాడు. తరవాత బస్సు కిటికీలోంచి తుపుక్కున ఉమ్మి వేశాడు. గాలికి ఆ తుప్పరలు విశ్వం మోచేతికి తగిలాయి. అగ్నిహోత్రుడయాడతను.

"పారెయ్యవయ్యా ఆ చుట్ట."

"ఏంటే?"

"ఆ చుట్ట పారెయ్యమంటున్నాను."

"సిగరెట్టయితే పనికొచ్చుద్దా?" అన్నాడు ఆ ఆసామీ కోపంగా. అంత కోపంలోకూడా విశ్వానికి నవ్వొచ్చింది. తను అన్నదేమిటి, అతను అర్థం చేసుకున్నదేమిటి? ఇహ తను ఏమిఅంటే ఏం ప్రయోజనం! మనుషులు ఈ కాలంలోకూడా ఇంత అధ్వాన్నంగా ఉంటారని తను అనుకోలేదు. విశ్వం ఏమీ మాట్లాడకపోటంతో పక్కనఉన్న ఇద్దరు ముగ్గురు కలగచేసుకుని చుట్ట పారెయ్యమని ఆ ఆసామీకి సలహా ఇచ్చారు. అతను ఏమనుకున్నాడోగాని చుట్ట ఆర్పి తలపాగాలో పెట్టుకున్నాడు.

రాచవరం వచ్చిందని కండక్టరు కేకేశాడు. బస్సు బాధనుండి విముక్తి పొందాలనే తొందరలో విశ్వం బస్సు దిగబోతూ పొరపాటున గేటుపక్కనకూర్చున్న ఓ నడివయసుస్త్రీ కాలు కొంచెం తొక్కాడు. వెంటనే "చూడలేదండీ, పొరపాటు" అంటూనే ఉన్నాడు. ఆవిడ తారామండలానికి లేచింది. పక్కవాళ్లుకూడా ఆవిడనే వెనకేసుకొచ్చారు.

"ఆడకూతురు కనపట్టం లేదంటయ్యా?" అన్నాడు ఒకాయన.

"ఓయబ్బో, కుర్రకారు కుర్రకారా ఈ రోజుల్లో?" అని రిమార్కు చేశాడింకో పెద్దమనిషి.

"కలికాలం. బ్రహ్మంగారు ఏనాడో చెప్పారు" అని విచారించాడింకొక ఆసామీ.

ఆవిడ నడివయసు స్త్రీ కనుక సరిపోయింది కాని లేకపోతే తనకి ఆ రోజుతోనే భూమ్మీద నూకలు తీరిపోయేవనిపించింది విశ్వానికి. గోరంతలు కొండంతలుగా చేసే స్వభావం మనుషులు మార్చుకోలేరేమిటని ఆశ్చర్యం వేసింది అతనికి. ఎలాగో ఆ గొడవనించి తప్పించుకుని రోడ్డుమీద చేతిసంచీతో నిలబడ్డాడు విశ్వం. చెరిగిపోయిన చిన్నబోర్డు కోనపల్లికి దోవ చూపిస్తోంది. అక్కడక్కడ చెదురుగా పొలాల్లో మనుషులు కనిపిస్తున్నారు. దూరదూరాన రెండెడ్ల బండ్లు పొలాలకి అడ్డంగా పోతూ ఉన్నాయి బహుశా మట్టిబండ్లు అయివుంటాయి. కంకరరోడ్డు దాటి మట్టిరోడ్డుమీదికొచ్చాడు విశ్వం. దారి విశాలంగానే ఉంది. బండిచక్రాల ఇనపపట్టాల చారలు రద్దీగల రస్తాయేనని చాటుతున్నాయి. దారికి రెండుపక్కలా బాగా పెరిగిన వృక్షాలు తీర్చిదిద్దినట్టున్నాయి. వాసంత సమీరం హాయిగా వీస్తోంది. మధుమాసశోభ వెల్లివిరుస్తోంది. అంటుమామిడిచెట్లు పువ్వులతో, చిన్ని చిన్ని పిందెలతో కన్నుల పండువగా కనిపిస్తున్నాయి. అక్కడక్కడ వేపచెట్లు విరబూచి కొమ్మలతో వింజామరలు వీస్తున్నాయి. దూరదూరాన వృక్షాలు రాలిపోయిన ఆకులతో మోడులుగా కన్పిస్తున్నాయి. దగ్గరగా ఉన్న చెట్లు ఎర్రటి కొత్త చిగుళ్ళతో వసంతోదయాన్ని చాటుతున్నాయి. ఆ ప్రకృతి సౌందర్య సంపదల మధ్యన నడుస్తూన్న విశ్వం ఏదో అతిలోక సౌఖ్యం అనుభవిస్తూ తన్నుతాను మర్చిపోయి కొత్త కొత్త అందాలు అన్వేషిస్తున్నాడు. బారెడు పొద్దెక్కినా దట్టంగా వ్యాపించిన చెట్లకొమ్మలు, ఆకులు ఎండ సోకనివ్వటంలేదు. ఆకుల సందుల్లోంచి సూర్యకిరణాలు వెలుగుల రవ్వలుగా జారిపడుతున్నాయి. బాటకి ఒకటి రెండు ఫర్లాంగుల దూరంలో కాలవ ప్రవహిస్తోందని ఆ ప్రాంతాల్లో నెమ్మది నెమ్మదిగా బారులుగా ఎగిరే తెల్లటి కొంగలూ, నీటికాకులూ చెప్పకనే చెబుతున్నాయి. కనుచూపు మేర దూరంలో తెరచాప కనిపించి ఆ దృశ్యాన్ని మరింత రమణీయంగా దిద్దుతోంది. కోసెడు దూరంలో ఏరు ప్రవహిస్తోంది విశ్వం హృదయంలో రసవాహిని పొంగి పొర్లసాగింది. ఎంతకాలం నించో తను బస్తీ దృశ్యాలకి అలవాటుపడ్డాడు. మోటారుకార్లూ, బస్సులూ, సైకిళ్లూ

దుకాణాలూ, సినిమా థియేటర్లూ, కృత్రిమ హావభావాలూ, పార్కులో క్రమపద్ధతిన పెంచబడిన చెట్లూ, రేడియో సంగీతం, ఈగలమోతా సినిమా స్లైడ్లలాగా అతని మనోవీథిలో అవతరించి అంతరించాయి. ఎన్నాళ్ళకి తను ప్రకృతి మధ్యన ఒంటరిగా తన్మయత్వంతో నిలబడగలిగాడు! ప్రకృతిసౌందర్యం వ్యక్తించినకొద్దీ హృదయ సౌందర్యం పెంపొందుతుంది. మానవుడి నిసర్గగుణ ప్రేమ. ఆ సహజగుణం సహజ ప్రకృతిలో భాసిస్తుంది. కృత్రిమ వాతావరణంలో నివురుగప్పిన నిప్పులా అంతర్గతంగా వెలుగుతూ ఉంటుంది. విశ్వం గట్టిగా ఊపిరి పీల్చి వొదిలాడు. ఏదో బరువు తన మీది నించి తొలగినట్టుగా ఉంది. తనేదో సత్యం కనుక్కున్నాడు. ఏదో చీకటి తెర తొలగిపోయినట్టయింది. వసంతుడు మంచు తెరలు తొలగించి వస్తే తన మనసుని ఆవరించిన నీలితెరలు తను ఒక్కొక్కటే తొలగించుకుంటున్నాడు. ఇప్పటివరకూ తను మానవుణ్ణి ద్వేషిస్తున్నాడు. విషాదభూయిష్ఠమైన అతని చర్యలు నిరసిస్తున్నాడు. అసహ్యించుకోటం అందరూ చెయ్యగలిగినపనే. కార్యకారణాలు అర్థం చేసుకోటంలోనే విజ్ఞత ఉంది.

ఆలోచిస్తూ నడుస్తున్న విశ్వం మనసులో ఓ సందేహం కలిగింది. వసంత శోభకి హృదయం ప్రఫుల్లితమై ఉదాత్తమౌతుంది. నిజం. కాని హేమంతంలో......

విశ్వం భావవీథిలో మెరుపు మెరిసింది. ప్రకృతి సౌందర్యమనుభవించే విషయం తను విస్మరిస్తున్నాడు. ఎండమావుల్లో, తొలకరిముత్యాల్లో, తెలిమబ్బుల్లో, మంచుతెరలో అందాలు తొలకిసలాడవా? సౌందర్యం ప్రకృతికి సహజం. ప్రేమ మానవుడికి సహజం. ఇవి రెండూ మరుగునపడితే ఇతరేతరశక్తులు విజృంభించవచ్చు. తను ప్రకృతికీ, మనిషికీ అవినాభావ సంబంధం కల్పిస్తున్నాడు. తనకు తెలిసిన అనేక విషయాల్లో ఇది సమర్థనీయమే. ఇది కొత్త సంగతేమీ కాదు. కాని తను ఈ రోజున అనుభవపూర్వకంగా తెలుసుకుంటున్నాడు. భావనే బతుకుగా చేసుకున్న కళారాధకులు ఈ సత్యాన్ని అనుభూతి పొంది ఉంటారు. తను కళారాధకుడు కావొచ్చు. కాని కళాజీవి కాగలడా? సర్వత్రా సౌందర్యాన్ని దర్శించగలడా?

తను అనుకోకుండా పెద్ద ప్రశ్నే వేసుకున్నాడు. సర్వత్రా సౌందర్య దర్శనం! అన్నిచోట్లా, అన్నిటిలో సౌందర్యం చూడగలవాడు ధన్యుడే. అది ఆదర్శం. రససిద్ధులకది సాధ్యమేమో. తనలాటి సామాన్యమానవుడి సంగతేమిటి? వస్తుతః ఆర్ద్రహృదయులైతే అప్రయత్నంగానే రసానుభవం పొంది జీవితంలో పూలబాటలు పరుచుకుని సాదరంగా ఇతరులకి ఆతిథ్యమిచ్చి జీవితసౌఖ్యం పంచుకుంటారు. కాని ఈరోజుల్లో అంతటివాళ్ళు ఎంతమంది!

ఏ మామిడికొమ్మమీదినించో కోయిల కుహూమంది.

ఆ మధుర సంగీతం విశ్వం ఆలోచనల్ని పారదోలింది. ఆ సంగీతం వినిపించినవైపు తలెత్తి చూశాడతను.

మళ్ళీ కొమ్మమీది కోయిల కుహూమంది. పరవశించాడు విశ్వం. ఆ సంతోషంలో కొంటెంగా తను కూడా 'కో' యన్నాడు.

ఎవరో రైతు కాబోలు విశ్వం పక్కనుంచి వెడుతూ "మందేఊరు?" అన్నాడు.

అందులో ఏదో ఎగతాళి గోచరించింది విశ్వానికి. "ఈ ఊరే" అన్నాడు వెక్కిరించినట్టు. ఆ రైతు కొంచెం వింతగా చూసి ఏదో అనబోయాడు. విశ్వం పలుకు చెయ్యకుండా ముందుకి వెళ్ళాడు. మరుక్షణంలోనే తను అలా అన్నందుకు అతను విచారించాడు. అలా అడగటం పల్లెలో రివాజే. తను అనవసరంగా తొందరపడి అపార్థం చేసుకుని అగౌరవంగా సమాధానం చెప్పాడు. తరచు మనుషుల లోపాలే వాళ్ళ అపార్థాలకి కారణాలు. ఇతర్ల నెత్తిమీద తమ లోపాల ఫలితాలు రుద్దటం ఘోరం. విశ్వం తన ప్రవర్తనకి సిగ్గుపడ్డాడు.

రోడ్డుమలుపు తిరిగేసరికి బాటమీద కొంచెం దూరంలో ఏదో పనిలో నిమగ్నులైన జనం కనిపించారు. మరి కొంచెం దగ్గిరికి వొచ్చేసరికి వాళ్ళంతా రోడ్డుమీద కంకర వేసే పనిలో ఉన్నారని గ్రహించాడు విశ్వం. అతనికి కొంచెం ఆశ్చర్యం వేసింది. వాళ్ళెవరూ పాటకజనంలా లేరు. అందరూ యువకులు. విద్యార్థుల్లా కనిపిస్తున్నారు. పూర్తిగా దగ్గిరి

తొచ్చేసరికి విశ్వానికి అసలు సంగతి తెలిసింది. వాళ్లందరూ కాలేజీ విద్యార్థులు. కాలేజీ సాంఘిక సేవా సమితి వేసవి శిబిరం ఈసారి ఈ ఊళ్లో వేశారన్న మాట. విశ్వం వినోదంగా రోడ్డు నిర్మాణ కార్యక్రమం చూస్తూ నిలబడ్డాడు. ఇంతలో ఆ శిబిరం నిర్వహించే కాలేజీ అధ్యాపకుడు ఆ వైపుకి వచ్చాడు. విశ్వం ఆయనకి పాత విద్యార్థి. 'నమస్కారం మాస్టారూ!' అన్నాడు విశ్వం.

"ఏమోయ్, ఇలా వచ్చావు, ఏంచేస్తున్నావిప్పుడు?" అడిగాడాయన.

"ఎకనమిక్స్ ఆనర్స్ పరీక్షకి వెళ్లానండి."

"అలాగా బాగా రాశావా?"

"బాగానే రాశానండి."

"సంతోషం. ఇలా వొస్తున్నావేమిటి కథ?"

తన మేనమామ ఊరు అదేననీ, చుట్టపు చూపుగా చూసిపోటానికి వచ్చాననీ చెప్పాడు విశ్వం. ఆ అధ్యాపకుడు కొంచెం చనువుతీసుకొని అన్నాడు.

"అయితే నువ్వూ ఒకవిధంగా ఈ ఊరువాడివే మరి మీ ఊరిపనిలో నువ్వు లేకుండా ఎలా? శ్రమదానం చేసితీరాలిసిందే!" అన్నాడు.

విశ్వం చిరునవ్వు నవ్వాడు. తను ఆ కాలేజీలో చదివినప్పుడు ఇటువంటి కార్యక్రమాల్లో కొన్నిసార్లు పాల్గొన్నాడు. మాస్టారు గారు తనని ప్రత్యేకించి ఆ జ్ఞాపకంతోనే బలవంతం పెడ్తున్నారని తనకి తెలుసు.

"ఏమిటోయ్ తటపటాయిస్తావు. అదిగో, ఆ పార పుచ్చుకో పద. నేనూ వొస్తున్నాను" అని హుషారిచ్చాడు అధ్యాపకుడు. ఆయనమీద గౌరవంవల్లనైతేనేం, ఆ సమయంలో తనకీ ఉత్సాహం కలగటంవల్లనైతేనేం విశ్వం రంగంలోకి దూకాడు.

ఉదయం సుమారు తొమ్మిదిన్నరగంటలు కావస్తోంది. అలిసిపోయాడు విశ్వం. పార పక్కన పడేసి తన వేషం చూసుకుని అదిరిపోయాడు. తెల్లటిషర్టూ, ప్రౌజరూ ఎర్రగా ఐపోయాయి. నలిగిపోయాయి. ఈ అవతారంతో మామయ్యగారింటికి వెళ్లటం ఎలా? తనకి ముందుచూపు బొత్తిగా తక్కువ. తనని చూడగానే మామయ్య "ఎవరోయ్, గ్యాంగ్ కూలీవా?" అనడుగదా! ఏంచేయటం? అస్థలంలో గానీ, ఇంకెక్కడగానీ ఇంటికి వెళ్ళేలోపున బట్టలు మార్చుకోటం అసంభవం.

"ఏమోయ్, వెషతా వేమిటి?" అన్నాడు అధ్యాపకుడు.

"అవునండి"

"అలసిపోయావు. వెళ్లు. మళ్ళీ కనిపిస్తావుకదూ. విష్ యూ గుడ్ లక్" అన్నాడాయన.

విశ్వం సెలవుతీసుకుని కాళ్ళీడ్చుకుంటూ తల వొంచుకుని ఇల్లు చేరుకున్నాడు. మామయ్య ఇల్లు తనకి బాగా గుర్తే. పెద్ద మర్రిచెట్టు దాటగానే చెరువు, చెరువు పక్కనేఉన్న పెద్ద మండువాఇల్లు. అదే ఆయన నివాసం.

సంకోచిస్తూ ఓరగా వేసి వున్న తలుపు నెట్టి లోపలికి ప్రవేశించాడు విశ్వం. పెద్ద ఆవరణా, బాదం చెట్టూ, పూలమొక్కలూ, ఓమూల గొడ్లపాకా అవన్నీ తనకి బాగానే జ్ఞాపకం ఉన్నాయి.

గొడ్లదగ్గిర మేత సరిజేస్తూ బట్టలకంటిన గడ్డి పరకలు దులుపుకుంటున్న వెంకట్రామయ్యగారు తలుపు చప్పుడు విని తలెత్తిచూసి కేకేశారు.

"ఎవరోయ్ అది?"

గోడకి పిడకలు కొడుతూ ఆ కేక విని సీతమ్మగారు వెనక్కి తిరిగి విశ్వంవైపు ప్రశ్నార్థకంగా చూసింది.

పడమరదిక్కున ఒకమూల బావిచప్టా మీద బట్టలు జాడించుకుంటున్న అమ్మాయి, జానకి, ముంగురులు వెనక్కి తోసుకుంటూ, స్వేదబిందువులు తుడుచుకుంటూ పక్కకి తిరిగిచూసింది.

పలుకు నేలమీద మోపుకుంటూ, ఎగకట్టిన పంచెతో వీధిలోంచి అప్పుడే వొస్తున్న సూరి విశ్వం వైపు పరకాయించి చూశాడు.

వీళ్లందర్నీ చూసి విశ్వం చిరునవ్వు తెచ్చుకుని పెదిమలు కదిలించబోయే లోపుగా వెంకట్రామయ్యగారే కేకేశారు.

"ఓరి నువ్వట్రా" మన విశ్వమేన్రా, అలా చూస్తారేం?"

"అంతా బావున్నారా నాయనా?" అంది సీతమ్మ.

"ఆ. బాగానే వున్నారత్తయ్యా." అన్నాడు విశ్వం. వెంకట్రామయ్యగారు పకపక నవ్వుతూ, "ఇదేం వేషంరా?" అన్నారు.

"ఎక్కడ పడ్డావయ్యా. బావా?" అన్నాడు నూరి.

"కాళ్ళు కడుక్కోటానికి బావకి నీళ్ళివ్వవే జానకీ, అలా పిచ్చి మొద్దల్లే చూస్తావేం?" అంది సీతమ్మగారు.

విశ్వం ఉక్కిరిబిక్కిరి అయ్యాడు.

జానకి చెంబుతో నీళ్ళు తెచ్చి దగ్గిర పెట్టింది. ఆమెవైపు అప్రయత్నంగా చూశాడు విశ్వం. తలంటి పోసుకున్నట్టుంది. జుట్టు చుట్టచుట్టుకుని వదులుగా ముడివేసుకుంది. చెంపలమీద ముంగురులు జారిపడుతున్నాయి. శరీరం తీగలా వంగి స్ప్రింగ్‌లా చివాలున మళ్ళీ వెనక్కి వెళ్ళింది.

"ఈ అమ్మాయి మన జానకేనా?" అన్నాడు విశ్వం. ఆ మాటలు అతని నోటినించి ఎలా జారాయో అతనికే తెలియదు.

"నుంచున్న పళంగా పెళ్ళి చేసెయ్యను లేవయ్యా, అలా భయపడతావేం, ముందు కాళ్ళు కడుక్కో" అంది సీతమ్మగారు ముసిముసి నవ్వులతో.

విశ్వం సిగ్గుపడ్డాడు. చెంబెడు నీళ్ళూ కాళ్ళమీద దొర్లించుకుని అక్కడికి చేరువలోనే వాల్చివున్న మంచంమీద కూలబడ్డాడు. జానకి ఎంతలో ఎంత మారిపోయింది! పద్మ పెళ్ళికి వీళ్ళందర్నీ చూశాడు గాని జానకిని చూడలేదు. ఏదో కారణంవల్ల రావటానికి వీలుపడలేదన్నారు. ఇంతలోనే గుర్తుపట్టటానికి వీల్లేకుండా మారిపోయింది. ఎంత ఆశ్చర్యం!

"ఈ వేషమంతా ఏమిటో చెప్పనేలేద!" అన్నాడు నూరి. విశ్వం ఆలోచనలనించి తేరుకుని జరిగిన విషయం చెప్పి అన్నాడు.

"ఛ. ఛ. వెధవపని, ఇక నా జన్మలో చెయ్యను. ఊళ్ళోకి రావటానికే సిగ్గుపడి చచ్చాను అనుకో."

నూరి బిగ్గరగా నవ్వాడు.

"మా సొంత పనులకోసం ఒళ్ళు విరుచుకుంటూ అదే ఎంతో గొప్ప అని మేమూ, అందరూకూడా అనుకుంటూంటే నువ్వు ఇతర్లకోసం శ్రమపడికూడా సిగ్గుపడతావేమిటోయ్ బావా?"

ఆ మాటల్లో ఏదో అర్థం మెరుపులా మెరిసి వెలుగు కనిపించినట్టయింది విశ్వానికి. తనుపొరబడ్డాడు. తను ఎంతసేపటికీ తననుగురించి ఇతర్ల దృష్టిలో ఆధారంగా ఆలోచించటం ఎందుకో తనకి అర్థం కావటం లేదు. తననిగురించి తన అభిప్రాయంకంటె ఇతర్ల అభిప్రాయాలకి విలువ ఇస్తున్నాడు. అంటే తననిగురించి ఇంతవరకూ ఒక నిర్దిష్టమైన అభిప్రాయం తనకి లేదన్నమాట. విషయం తెప్పిస్తూ వెంకట్రామయ్యగారు అడిగారు.

"ఎక్కడినుంచి రావటం?"

"వాల్తేరు నించి."

"ఏం, అంత బుద్ధి కుదిరిందే? ముందురాసే బండీ పంపేవాణ్ణిగా."

"ముందు అనుకోలేదు."

"అంటే ఎగ్గొట్టాలనే అనుకున్నావన్నమాట. సరేలే, ముందు స్నానం చెయ్యి. తరవాత తీరిగ్గా మాట్లాడుకుందాం. పండగపూట వచ్చావు, అదే చాలు"

నూరి స్నానాలగదికి దారితీశాడు. విశ్వం అనుసరించాడు.

స్నానంచేసి బట్టలు వేసుకుని హాల్లోకి రాగానే బల్లమీద అద్దం, దువ్వెనా పెట్టి వెళ్ళింది జానకి. మళ్ళీ వెంటనే వచ్చి హెయిరాయిల్ సీసా బల్లమీద పెట్టి వెళ్ళబోయింది.

"ఇవన్నీ నాదగ్గర ఉన్నాయి."

"ఇక్కడా ఉన్నాయిగా."

విశ్వం ఇంకేమీ అనలేదు. జానకి కూడా అక్కడ లేదు. ఏదో మాట్లాడాలనిపించింది విశ్వానికి. కాని ఏదో అడ్డుపడుతోంది. ఈ జానకితో నేనా మొన్న మొన్నటిదాకా తను అంత స్వేచ్ఛగా మాట్లాడింది వయసులో మార్పు ఎన్ని విషయాల్లో మార్పు తెస్తుంది!

వరండాలోకి వచ్చాడు విశ్వం. అప్పటికే వెలుగువచ్చినట్టుంది. వెంకట్రామయ్యగారు పడకకుర్చీలో జేరబడి చదువుతున్నారు. పలుగు తలకిందులుగా పాతి కొబ్బరికాయల పీచు తీస్తున్నాడు పాలేరు వెంకన్న. నూరి సహాయం చేస్తున్నాడు.

"ఏమిటి మామయ్యా విశేషాలు?"

వెంకట్రామయ్యగారు తలెత్తి చూసి "కూర్చోరా" అన్నాడు.

ఇంతలో సీతమ్మగారు వచ్చి బాదంఆకు ఒకటి అందిస్తూ, "ఇదికొంచెం నోట్లో వేసుకో నాయనా" అంది.

"ఏమిటత్తయ్యా ఇది?"

"ఉగాది పచ్చడి."

విశ్వం మారుమాట్లాడకుండా రుచి చూశాడు.

"కొత్తసంవత్సరం నీకు బాగా యోగిస్తుంది లేవోయ్." అన్నారు వెంకట్రామయ్యగారు.

"మీ అందరికీ కూడా" అన్నాడు విశ్వం.

అప్పుడేవొస్తున్న సూరి అందుకున్నాడు. "మా కేమిటిలే. నీకు మంచి గిరాకీ తగుల్తుంది. సంవత్సరం పొడుగునా సాంఘిక సేవ చేస్తూనే ఉంటావులే."

నవ్వాడు విశ్వం.

ఏడాదికి తొలిరోజున తొలిఘడియలు సంతృప్తికరంగానే గడిచాయి తనకి. ఈ కొత్తసంవత్సరం పాతబడేసరికి తన జీవితంలో ఏయే మార్పులు జరుగుతాయో! తీపి, చేదు, వగరు, పులుపుల మిశ్రమమే జీవితం అని ఉగాది పచ్చడి హెచ్చరిక చేసింది. అందులో వేసిన ఆ యేటి కొత్త ఫలపుష్పాలు జీవితపు కొత్త అనుభవాల సంపుటికి ప్రారంభోత్సవం చేశాయి.

## 2

భోజనానంతరం కాసేపు పిచ్చాపాటీ మాట్లాడుకుని మంచంమీద వెన్ను వాల్చగానే తనకు తెలియకుండానే కునుకు పట్టింది విశ్వానికి. లేచి చూస్తే సూర్యుడు పడమటికి తిరిగి ఉన్నాడు. రిస్ట్‌వాచి చూసుకున్నాడతను. అప్పుడే నాలుగు దాటింది. అంతా పనులమీద ఉన్నట్టున్నారు. దగ్గిర ఎవరూ లేరు. కొంచెం దూరంలో పాలేరు వెంకన్నమాత్రం కొబ్బరికాయల పీచు తీసే పనిలో నిమగ్నుడై వున్నాడు. అతనిని చూడగానే విశ్వానికి జాలేసింది. పండగపూటకూడా అతనికి పని తప్పదల్లే ఉంది.

విశ్వం నిద్ర లేవటం వెంకన్న చూశాడు.

"ఏం బాబూ లేచారా?" పలకరించాడు.

"ఊఁ" అన్నాడు విశ్వం.

వెంకన్న ఓ కొబ్బరి బోండం బరువు చూసి చెక్కి రంధ్రం చేసి విశ్వానికిస్తూ అన్నాడు.

"దాహం పుచ్చుకోండి, బాబూ. మా చెడ్డ ఎండగా ఉంది."

విశ్వం అక్కు చెప్పలేదు.

"మన తోటలో కాయేనండి. ఇయ్యింటే ఊళ్లో వాళ్లు ఎగబడతారనుకోండి."

మన తోట...!

ఇద్దర్నీ కలిపి మాట్లాడుతున్నాడు వెంకన్న. నిజానికా తోట ఇద్దరిలో ఎవరిది కాదు. పాపం, శ్రమ చేసేది తనే కనుక అదో రకమైన తృప్తి పొందుతున్నాడు కాబోలు. ఈ దేశంలో శ్రమకి ఫలితం దక్కటం అంత సులభంగా జరిగేది కాదు. సానుభూతి చూపిస్తూ అన్నాడు.

"పండగనాడుకూడా పనేమిటోయ్, హాయిగా విశ్రాంతి తీసుకోక?"

"పండగైతే పని చేయకూడదా బాబు? పని చెయ్యకపోతే నాకు వొళ్లు ఇరగ్గొట్టినట్టుంటది."

"అంత చెయ్యాలని ఉంటే సొంతపనేదైనా చేసుకోకూడదూ?"

"ఇది సొంత పని కాదంటండీ?"

అమాయకుడల్లే ఉన్నాడు. ఆంధ్రదేశం రాజకీయంగా ఎంతో ముందున్నదని తను అనుకుంటున్నాడు. చైతన్యవంతమైన ప్రజ అని గర్వపడేవాడు. పీడక శక్తుల్ని గురించి ఏమీ తెలియనట్టు మాట్లాడతాడేం ఇతను!

"నువ్వు వట్టి అమాయకుడివోయ్."

వెంకన్న చిరునవ్వు నవ్వాడు.

"అయితే ఆ తప్పు అసామీగారిదేనండి. అరితోనే చెప్పండి ఆమాట"

విస్తుపోయాడు విశ్వం. అతనేదో వర్మగర్భితంగా మాట్లాడుతున్నాడు అతనలా అంటాడని తను ఏమాత్రం ఊహించలేదు.

"అంటే?" అన్నాడు అర్థం కానట్టు తెలియచేస్తూ.

అప్పుడే అటువైపు వస్తున్న సూరివైపు చూపిస్తూ అన్నాడు వెంకన్న.

"అడుగో చిన్నాయన వస్తున్నాడు. ఆయన్నే అడగండి. ఏం చిన్నయ్యా, నన్ను రాత్రిబావులోకి తోసింది ఎవరు, నువ్వు చెప్పు"

విశ్వం అప్రతిభుడయ్యాడు. మనుషులు పైకి కనబడేటంత తెలివితక్కువ వాళ్లు కారు! సూరి నవ్వుతూ అడిగాడు.

"ఏమిటి బావా నీ సందేహం?"

"ఏం లేదులే."

వెంకన్న వైపు తిరిగి సూరి అన్నాడు.

"వెంకన్నా, కడవతో నీళ్లు పెట్టు. బావ ముఖం కడుక్కుంటాడు."

విశ్వం లేచాడు. వెంకన్న నీళ్లు తోడి ఇచ్చాడు. ఆ చల్లటి ఉదకం తగలగానే నిద్రబడుగు పూర్తిగా తొలగిపోయి శరీరంలో కొత్తశక్తి వచ్చింది విశ్వానికి.

జానకి కాఫీ కప్పుతో వరండాలో నిలబడి తటపటాయించటం చూశాడు విశ్వం. దగిరికి వచ్చాడు. ఆమె కాఫీ కప్పు బల్లమీద పెట్టి వెళ్లిపోయింది. ఈ కొత్తదనం ఏమిటో అసహజంగా కనిపించింది విశ్వానికి.

కాఫీ త్రాగాడు.

"ఊరిమీద తిరగటానికి సిద్ధమేనా?" అన్నాడు సూరి.

"మావయ్య ఏడీ?"

"ఏదో పనిమీద బయటికి వెళ్లారు। అలా తిరిగొద్దాం పద, ఓపిక ఉంటే."

ఇద్దరూ బయల్దేరారు. ఎదురైనవాళ్లు విశ్వం వైపు పరకాయించి చూస్తున్నారు. నడుస్తూ ఊడల మర్రి సమీపించారు. బోదెచుట్టూ అరుగు కట్టారు. దగ్గరలోనే కిల్లీ దుకాణం లాంటి కొట్టు ఒకటుంది. దానికెదురుగా ఉన్న ఓ చిన్న పెంకుటింటిముందు 'యువజన గ్రంథాలయం' అనే బోర్డు ఉంది. మర్రిచెట్టు ఆకుల్లోంచి దూసుకొచ్చిన కర్రలకి ఏవో రాజకీయ పార్టీల జండాలు కట్టబడి కొంచెం ఎబ్బెట్టుగా కనిపిస్తున్నాయి దూరంలో గుడి గోపురం, ధ్వజస్తంభం కనిపిస్తున్నాయి. గుడికి పక్కగా ఉన్న ఖాళీస్థలంలో కొంత మంది గుమిగూడి ఏవో ఆటలు ఆడుకుంటున్నారు. ఈ దృశ్యాలన్నీ విశ్వం పరిశీలగా చూస్తున్నాడుకాని, సూరి కళ్లు ఎదురుగా రచ్చబండమీద ఉన్న యువకులమీదే ఉన్నాయి. వాళ్లని సమీపించగానే విశ్వానికి అందర్నీ పరిచయం చేశాడు. వాళ్ళందరికీ ఏవేవో కొత్త సంగతులు చెప్పి వాళ్ళలో ఉత్సుకత కలగచేయాలని మొదట విశ్వం అనుకున్నాడు. కాని కొద్ది నిమిషాల సంభాషణ తరవాత వాళ్ళెవరూ తను మాట్లాడేది సరిగా వినటమే లేదని విశ్వం గ్రహించి ఆ ప్రయత్నం విరమించుకున్నాడు. మరికొంతసేపటికి తను అనే ఓ కొత్తవ్యక్తి అక్కడ ఉన్నాడనే విషయమే వారు పట్టించుకున్నట్టులేదు. తనకి తలనొప్పి పుడుతోంది. లేకపోతే, స్కూలు కమిటీ మెంబర్ల గొడవలూ, గుడి మాన్యాల వసూళ్ళ కైంకర్యాలూ, బంజరు తగాదాలూ మొదలైనవన్నీ తనకెందుకు?

విశ్వం విసుగుదల కనిపెట్టి సూరి లేచి నుంచున్నాడు.

"ఊళ్ళో గుడిదగ్గర పోటీలుపడి చెడుగుడు ఆడుతున్నార్ట, చూద్దాం పదండి." అని హెచ్చరించాడతను మిత్రుల్ని. కొంతమంది నిరుత్సాహపడ్డారు. చివరికి ఎక్కువమంది కదలడానికే నిశ్చయించుకుని చెడుగుడుపందెం జరుగుతున్న చోటికి వెళ్లారు.

ఆట మంచి జోరుగా ఉంది. సమ ఉజ్జీలు. అటూ ఇటూ పైజనం హుషారిస్తున్నారు. ఉద్రేకాలూ, ఆవేశాలూ పెరుగుతున్నాయి. ఆటగాళ్లు రాను రాను వెల దగ్గిరే కాచుకుంటున్నారు. కూతకి వెళ్ళినవాడు పాయింటు ఇవ్వటమో, తేవటమో జరుగుతోందిగాని ఊరికె రావటంలేదు.

ఉన్నట్టుండి పెద్ద సంచలనం రేగింది. "ఏమిటేమిటి?" అంటున్నారు కొంతమంది. "ఘోరం, అన్యాయం" అని ఖండిస్తున్నారు మరి కొంతమంది.

"ఏంజరిగిందిరా సూరీ?" ఆత్రంగా అడిగాడు విశ్వం.

"తలకాయ పగిలింది" అన్నాడు సూరి తాపీగా, అదేం పెద్దవిషయం కానట్టు.

జనం మూగుతున్నారు.

"ఎవరిది?"

"ఎవరిదో లే. చెబితేమాత్రం నీకేం తెలుస్తుంది."

"అంత దురుసుగా ఆడకపోతే యేం?"

"నీకే విషయాలు తెలియవులే. అంతా ప్లాను ప్రకారమే జరిగింది."

"అంటే, ఇలా జరుగుతుందని నీకు ముందే తెలుసా?"

"ఊహించాను. ఒకమాట చెబుతాను విను. ఇక్కడ అకస్మాత్తుగా ఎవరికీ ఏమీ తెలియకుండా జరిగే విషయాలు బహు తక్కువ."

"అసలేం జరిగింది?"

"చెప్పాను కదూ! వెలతాకినా తొక్కటం దేనికి మనిషిని? అందరూ మీదపడితే ఏమవుతాడు, పాపం! ఓడించి గెలిచెయ్యాలని అట ఏర్పాటు చేశారు, ఓడిపోయారు అదీ సంగతి"

"ఏమిట్రా ఈ తగాదాలు చిన్న పిల్లల్లాగ?"

నూరి నవ్వాడు పాడిగా.

"పార్టీలు బావా పార్టీలు."

"ఏం పార్టీలు?"

"ఏ గాయైతే ఏం తల పగలకొట్టుకోటానికి? ఏవో పార్టీలు ప్లీడరువి. ప్రయివేటువీ"

సంచలనం పెద్దదైంది. మాటలు రెండువైపులా తూలుతున్నారు. సర్దటానికి మనస్ఫూర్తిగా ఎవరూ ప్రయత్నిస్తున్నట్టు లేదు. వ్యవహారం చేతులు కలిసే దాకా వొచ్చేట్టుంది.

"సర్దుబాటు చెయ్యడానికి ప్రయత్నిద్దాం పద" అన్నాడు విశ్వం.

"ఇక్కడ నీ మాట ఎవరూ వినరు."

"చూద్దాం."

"లాభం లేదు. ఇంకో రహస్యం చెప్పమన్నావా? ఇక్కడ సర్దుబాటు చేసేట్టు కనిపించేవాళ్ళకి వ్యవహారం అంత త్వరగా సరుబాటు కావటం ఇష్టం వుండదు. దమ్మి జరిగి కొత్త తమాషా చూస్తేగాని వాళ్ళకి తృప్తివుండదు. పన్ను లేకుండా వినోదం చూడొచ్చు కదూ మరీ." వ్యంగ్యంగా నవ్వాడు నూరి.

"ఇలా ఊరికేవుంటే మనం ఆ తరగతిలోకే చేరుతాము" అన్నాడు విశ్వం.

"నామాట విని నువ్వు కాసేపు ఆ గుళ్ళోకూచో నేనిప్పుడే వొస్తా." అనేసి విశ్వం సమాధానం కోసం ఎదురు చూడకుండానే గుంపులో కలసి ఓసారివెనక్కి తిరిగి విశ్వాన్ని వెళ్ళమన్నట్టుగా చెయ్యి ఊపాడు. ఈ ఉపద్రవానికి విశ్వం మనసు కొంచెం దెబ్బతింది. అతను విషాదగ్రస్త వదనంతో గుడివైపుకి అడుగులు వేయసాగాడు. జనం వాదించుకుంటూనే ఊరివైపు పోతున్నారు.

కొంతదూరం వచ్చి ఆగాడు విశ్వం. శ్రావ్యమైన కంఠం వినిపిస్తోంది. పురాణకాలక్షేపం జరుగుతోంది...

అఖిలరూపములు దనరూపమైనవాడు
ఆదిమధ్యాంతములు లేక యడరువాడు
భక్తజనముల దీనులపాలివాడు
వినడె చూడడె తలపడె వేగరాడె

గజేంద్రమోక్షం. అలాగే వింటూ నిలబడ్డాడు విశ్వం. చిన్నప్పుడు తను కంఠోపాఠం చేసిన పద్యం. అప్పుడు తనకి అర్థం తెలియదు. ప్రారంభ పద్యమని తెలుసు. గుర్తుకి తెచ్చుకున్నాడు మొదటిపాదం...,

కలుగడే నాపాలికలిమి సందేహింపఁ
గలిమిలేములు లేక కలుగువాడు...

తనకి చాలా ప్రీతిపాత్రమైన పద్యం. ఏదో హాయిగా ఉండేది చదువుతుంటే. అప్పుడు తనకు భక్తిఅంటే ఏమిటో తెలియదు. కనుక అది ఉండాలనుకునేవాడు. కాని ఇప్పుడు తను పూర్వపు విశ్వం కాదు. యుక్తాయుక్తాలు తెలిసినవాడు. పూర్వాపరాలు విచారించగలవాడు. ఇప్పుడా పద్యం వింటుంటే తనకి పూర్వపు అనుభూతి కలగటం లేదు.

పురాణ కాలక్షేపం జరుగుతూనే ఉంది.

"లావొక్కింతయులేదు ధైర్యము విలోలంబయ్యె..." వినమ్రుడై గజేంద్రుడు వేడుకుంటున్నాడు. అలా వేడుకోటం విశ్వానికి ఇష్టం లేదు.

ఆలోచిస్తూ నిలబడ్డాడు విశ్వం. కొంచెం సేపట్లో పురాణం ఐపోయింది. గుడిగంటలు వినిపిస్తున్నాయి. ఒక్కొక్కరే బయటకి వెడుతున్నారు. గుడిలోపలికి వెడితే మండపంమీద హాయిగా కాసేపు కూర్చోవచ్చుననిపించింది విశ్వానికి. నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ చేరుకోసాగాడు. అలా వెడుతూ యథాలాపంగా తలెత్తిచూసి, మళ్ళీ అలాగే అటువైపే చూసి నిలబడిపోయాడతను. జానకి! పట్టుచీర కట్టుకుని అరచేతిలో పళ్ళెం బుజా

నికి సమీపంగా పట్టుకుని ఎడం చేతిలో పూలసజ్జతో భాగవతారిణిలా కనిపిస్తోంది. వాలు జడలో పచ్చగన్నేరుపూలు తురుముకుంది. ఈ వేషం చూసి ఆశ్చర్యపోయాడు విశ్వం. అతనిని అకస్మాత్తుగా చూసి జానకి కొంచెం చకితురాలై ఆగింది.

"సూరేడీ?"

ఒక్కొక్కసారి సూరిని అన్నయ్యఅనీ, ఇంకో సారి సూరి అని పిలుస్తుంది జానకి.

"ఎక్కడికో వెళ్లాడు."

"దేవుణ్ణి చూస్తావా?"

"ఊహుఁ."

"ఏం?" కొంచెం ఆశ్చర్యపడి అడిగింది జానకి.

"నాకు కనపడడు కనుక."

జానకికి అర్థమైంది.

"పూజారి ఉన్నాడు" అంది కొంచెంకొంటెగా.

"ఆ కాలింగ్ బెల్ కొట్టటానికి నాకు ఓపిక లేదు."

"మాటలు నేర్చుకున్నావే!"

"నువ్వు భక్తురాలివి కాబోలు."

"నీకు భక్తి లేదా?"

"చెప్పులమీద ఉంది."

జానకి ముఖం చిట్లించుకుంది.

"సరిగ్గా మాట్లాడరాదూ?"

ఇంటిదగ్గిర బిడియపడి ఇక్కడ ఒంటరిగా ఉన్నప్పుడు ఇంత స్వేచ్ఛగా ఆమె మాట్లాడటం విశ్వానికి ఆశ్చర్యంగా ఉంది. కావాలని తెచ్చి పెట్టుకునే లక్షణం కాకపోతే అసలు సిగ్గేమిటి!

"నాకు నమ్మకంలేదు ఇటువంటి వాటిమీద." అన్నాడు విశ్వం.

"అలా చెప్పు."

"నేను రౌరవాది నరకాలనుభవిస్తానని నువ్వు భయపడుతున్నట్టున్నావు."

"ఊహుఁ."

"ఏం? మరి నాకు భక్తి లేదుగా?"

"మంచివాళ్లకి భక్తిఉన్నా లేకపోయినా పరవాలేదులే."

"నేను మంచి వాడినా?"

"కాదా?"

"కాదేమో! నీ కేం తెలుసు?"

"మంచి వాడివి కాకపోతే టికెట్ పారేసుకున్న వాళ్ళకి సొంత డబ్బుతో విసుక్కోకుండా టికెట్ కొనిస్తావా?"

అప్రతిభు డయ్యాడు విశ్వం.

"అలా కొయ్యబారి పోతావేం?" అంది జానకి నవ్వుతూ.

"ఈవిషయం నీకెలా తెలుసు?"

"ఇటువంటివి తెలియకుండా ఉంటాయా?"

"నే నెవరికీ చెప్పలేదే! కొంపతీసి ఆ అమ్మాయిది కూడా ఈ ఊరే నేమిటి?"

"ఊఁ"

"నీకు తెలుసన్నమాట ఆమె ఎవరో."

"ఊఁ"

"ఎవరు?"

"ఎవరైతే ఏం?"

"ఊరికే తెలుసుకుందామని, ఆ అమ్మాయి ఎవరైతే ఏంగాని ఉట్టిమర్యాదామట్టూ లేని మనిషి, జానకీ"

జానకి కొంచెం ఆశ్చర్యంగా అంది.

"కాదే!"

"కాకపోవట మేమిటి? అంత సహాయంచేస్తే కనీసం కృతజ్ఞతయినా చెప్పలేదు."

"ఓహో; అయితే నువ్వు పెద్దసహాయమే చేశావన్నమాట."

విశ్వం కొంచెం సిగ్గుపడ్డాడు. తనేదో మహాత్యాగం చేసినట్లు మాట్లాడాడు. తన ఉద్దేశం అదికాకపోయినా.

"చేశానని కాదు, సంగతి చెబుతున్నాను. పైగా నేనేదో అబద్ధం చెప్పుకున్నానని ఆవిడ గునిసింది. నాకోసమైనట్టు. ఆమె అబద్ధాలాడదు కాబోలు, పాపం."

"అవును" అంది జానకి.

"అయితేమాత్రం!" అన్నాడు విశ్వం కొంచెం ఉక్రోషంగా. "ఇంతకీ ఆ అమ్మాయి ఎవరో చెప్పావు కాదే!"

"ఏం? కృతజ్ఞత తెలియచెయ్యమని ఉత్తరం రాస్తావా? ఆ అమ్మాయిపేరు జానకి."

తెల్లబోయాడువిశ్వం. అతనికళ్లలో అపనమ్మకం గోచరించింది.

"జానకా?"

"అవును. జానకే, అంటే నేనే."

నవ్వింది జానకి, కొద్దిక్షణాలు ఏమీమాట్లాడలేక పోయ్యాడు విశ్వం.

"నిజమా? నేను గుర్తుపట్టలేకపోయాను."

"అందుకే నువ్వు మంచివాడివి."

"నువ్వురాజమండ్రి ఎందుకు వెళ్లావు?"

"వెనక మాఇంటిపక్కన ఒక డెప్యూటీ పంచాయతీ ఆఫీసర్ గారుండేవారు. ఆయనకుమార్తె నాకు ముఖ్యస్నేహితురాలు. ఆ అమ్మాయి పెళ్ళికి నన్ను తప్పక రమ్మనమని బలవంతంచేస్తే వెళ్లాను. వాళ్లు ఈమధ్యనే రాజమండ్రి బదిలీమీద వెళ్లారు."

"అలాగా ఒంటరిప్రయాణమంటే నీకు భయం లేదన్నమాట"

"భయమెందుకూ? బెబ్బులి ఎత్తుకుపోతుందా? పొలానికి ఎన్నిసార్లు ఒంటరిగా వెళ్ళి రావటంలేదు!"

"టికెట్ పోతే మరి అంత గాభరాపడ్డావేం?"

జానకి సమాధానంఇవ్వలేదు. చిరునవ్వు నవ్వింది.

"రైల్లో నన్ను గుర్తుపట్టావా?" అనుమానంగా అడిగాడు విశ్వం.

"అనుమానించాను."

"నేను చాలా మారానని అందరూ అంటారే!"

"పోలికలు ఎక్కడికిపోతాయి?"

కొంచెం చిలిపిగా విశ్వం ముక్కువైపు చూసిందామె.

"నాది గరుత్మంతుడి ముక్కుకదూ?" నవ్వుతూ అన్నాడు విశ్వం. జానకి చిన్నప్పుడు తనని అలాగే వేళాకోళం చేసేది.

'అని నేననలేదే!' ముసిముసిగా నవ్వింది జానకి.

"నేనుమాత్రం నిన్ను గుర్తుపట్టలేకపోయాను."

"మగవాళ్లకి మరుపెక్కువ."

"అనుమానంచినదానివి పలకరిస్తే తేలిపోయేదిగా."

"ఒకవేళ నువ్వు కాకపోతే?"

"ఏం కాకపోతే, ఇంతలోకే కొంపలంటుకుంటాయా?"

సమాధానం అనవసరం అన్నట్టుగా జానకి ఊరుకుంది.

"సమయానికి నేనున్నానుకనుక సరిపోయింది గాని లేకపోతే అవస్థపడేదానివే"

"అప్పుడు టికెట్ పోయేదికాదు లే."

"అన్నీ మన వీలుప్రకారం జరుగుతాయా?"

"నువ్వున్నావుకనుకే టికెట్ పోయిందేమో."

"అదేమిటి?"

"లేకపోతే నువ్వు మేగజైన్‌మీద రాసుకున్న నీపేరూ, లెదర్ బ్యాగ్ మీద రాసుకున్న అడ్రసు చూడటానికి వీలు అయేదికాదుగా."

వింతగా చూశాడు విశ్వం. అనుమానిస్తూ అన్నాడు. "అయితే అంతా వొట్టిదేనా?" విస్మయం అతని ముఖంలో తాండవించింది. జానకి చిరునవ్వు నవ్వింది. దాంతో అతని అనుమానం రూఢిఅయింది.

"నువ్వు అబద్ధాలు చెప్పవుగా" అన్నాడువిశ్వం కొంచెం కోపంగా.

"ఏం, గుంజీలు తియ్యాలా!"

ఆ మాటల్లో ఏదో వ్యంగ్యం ఉంది. తటుక్కున విశ్వం స్మృతి పథంలో ఒకదృశ్యం. మెదిలింది. పూర్వం ఒకసందర్భంలో జానకి అబద్ధం చెప్పిందని "అబద్ధమాడరాదు" అనిపిస్తూ ఆ పిల్లచేత వరసగా కాళ్ళునెప్పి పుట్టేట్టు గుంజీలు తీయించాడు.

"అబద్ధమా?" అని రైల్లో జానకి అన్నమాటలో అదే చిలిపితనంతో కూడిన ఎత్తిపొడుపు. విస్తుపోయాడతను. చాదస్తురాలు, అమాయకురాలు అనుకొన్న జానకిలో ఇంత గడుసుతనం ఉందనుకోలేదు.

"ఏమిటి బావా! ఆలోచిస్తున్నావు?" అంది జానకి.

"ఏంలేదు లే." అన్నాడు.

"నిజంగా గుళ్ళోకి వెళ్లావా?"

"ఊఁహుఁ."

# అంతర్వాహిని

"అయితే యిక్కడికి ఎందుకు వచ్చావు. మరి ?"

"సూరి ఇక్కడ ఉంటానన్నాడు. ఇప్పుడే వస్తానన్నాడు. ఇంకా రాలేదే, పోదామా ?"

"పద."

దారితీసింది జానకి. తనని పల్లెలోకి వెళ్ళమని బలవంతం చేస్తుందనుకున్నాడు విశ్వం. కాని ఆమె అలా ప్రవర్తించకపోవటం అతనికి కొంచెం ఆశ్చర్యంగానే ఉంది. దేవుణ్ణిగురించి జానకితో వాదన వేసుకోవాలనిపించిందతనికి. కాని ఆమె అందుకు అవకాశం ఇవ్వటం లేదు. ఇద్దరూ నడుస్తున్నారు. దారిలో సూరి కలిశాడు.

"పరిస్థితి అదుపులోకి వచ్చినట్టేనా ?" ఆందోళనగా అడిగాడు విశ్వం.

"కొంచెం ఉద్రిక్తంగానే ఉంది వాతావరణం. కాని సద్దుమణిగిందనుకోవొచ్చులే. లోలోపల రాజుతూనే ఉంటుందనుకో."

"దెబ్బతగిలిన వాడెలా ఉన్నాడు ?"

"ఆస్పత్రిలో చేర్పించి వచ్చాం. అంత ప్రమాదమేం లేదు."

"ఈ ఊళ్ళో ఆస్పత్రి ఉందా ?"

"ఉందిలే లోకల్ ఫండ్ డిస్పెన్సరీ."

"డాక్టరేమన్నాడు ?"

"ప్రాణభయం ఏమీ లేదన్నాడు కాంపౌండర్."

"డాక్టర్ !"

"డాక్టర్ ఈ ఊరినించి బదిలీఅయి మూడునెల లయిందిలే. ఇంకా కొత్తడాక్టరు రాలేదు."

"నిజం ? విడ్డూరంగా ఉందే !"

సూరిపొడిగా నవ్వాడు.

"అదంతేలే. డాక్టర్లు కొరతగా ఉన్నార్ట."

కొంచెంసేపు మౌనంగా నడిచారు వాళ్ళు. మలుపు తిరగగానే కొంతమంది పిల్లలు ఏకోతికొమ్మంచో ఆడుకుంటూ కనిపించారు. వాళ్ళని దగ్గరికి పిలిచి జానకి కొబ్బరి చిప్పలు ఇచ్చింది.

"చెయ్యి నొప్పిపుడుతోంది కాబోలు. పాపం" అన్నాడు విశ్వం.

"ప్రసాదం" అంది జానకి.

"ధర్మానికి మారుపేరా ?" అన్నాడు. "ఏదోలే, వాళ్ళకీ వాస తృప్తి" అందామె.

ఇంచుమించు అదే సమయంలో ఓ కుంటివాడు ఎదురై "ధర్మంబాబూ" అన్నాడు. విశ్వం ముఖం చిట్లించుకుని కసురుకున్నాడు. అవుక్కునె వాళ్ళని చూస్తే అతని కదోవిధమైన అసహ్యం. జాలి లేదని కాదు. కాని అవకలి మనిషిని ఆ స్థితిలో చూస్తే అతనికి ఈసడింపు అప్రయత్నంగా రగులుతుంది. కుంటివాడు సూరివైపు చూసి చెయ్యి చాపాడు.

"వెధవ వేషం!" అన్నాడు విశ్వం.

పళ్లెంలోంచి చిల్లరడబ్బులు తీసి జానకి వాడి చేతిలో వేసింది. అతను ఏదో దీవన గొణిగి వెళ్ళిపోయాడు.

"అలవాటు చేస్తేనే వాళ్లు ఈ విధంగా తయారయ్యేది."

"పోనీలే, పాపం" అంది జానకి.

విశ్వం ఊరుకోకుండా ముష్టివాళ్ళనిగురించి ఓ లెక్చరు దంచేశాడు. దేశం ఇలాంటి సోమరిపోతుల్ని భరించలేదన్నాడు. సంఘానికి ఇదో చీడపురుగులా తయారైందనీ, ముష్టి వెయ్యటం వాళ్ళనిమరింత నికృష్ట జీవితానికి అంకితం చెయ్యటమేననీ ఏమేమిటో మాట్లాడాడు.

జానకీ, సూరీ ఏమీ మాట్లాడలేదు. విశ్వానికి కొంచెం అనుమానం వేసింది. వాళ్ళు తనమాటలు వింటున్నట్టు లేదు. అంటే తనది వెర్రి వెంగళప్ప ధోరణి అని కాబోలువాళ్ళి అభిప్రాయం! అభిమానం ముంచుకొచ్చి ఉపన్యాసం ముగించేస్తూ అన్నాడు.

"మీకు తెలియదు పట్టణాల్లో బిచ్చగాళ్లది ఎంత పెద్ద సమస్యో!"

"పోనిద్దూ" అన్నాడు సూరి. కాని జానకిమాత్రం నోరు మెదల్పలేదు. అలా ఊరుకోటం విశ్వానికి నచ్చలేదు. తనది తప్పో రైటో తెల్చాలనికాదు. తను అంతసేపు హేతుపూర్వకంగా మాట్లాడినా ఆమె అలా నిర్లిప్తంగా వుండటం తనకి కష్టంగా వుంది. చిన్నతనం కూడా వేసింది. చూస్తే జానకిది కొంచెం నిర్లక్ష్య స్వభావంలా వుంది.

ఇంటికి చేరేసరికి అసుర సంజ వేళయింది. వీధి వాకిలి ఓరగా వుంది. లోపలికి వెళ్లేసరికి ఆరుబయట

పేము పడకకుర్చీలో కూర్చుని పాలేరు వెంకన్నతో ముచ్చటిస్తున్న వెంకట్రామయ్యగారు కనిపించారు. వాళ్ల ముగ్గుర్నీ చూడగానే అడిగారు ఆయన.

"రాములవారి గుడికి వెళ్ళొచ్చారా?"

"ఊఁ." అన్నాడు సూరి.

"ఏమిట్రా సూరీ, మన వెంకన్న ఏదో గలాటా జరిగిందంటున్నాడు?"

సూరి జరిగింది పూసగుచ్చినట్లు చెప్పసాగాడు. మళ్ళీ ఆ గొడవంతా ఏకరువు పెట్టటం విశ్వానికి విసుగు పుడుతోంది. లేచి లోపలికి వెళ్ళాడు. అక్కడ జానకి కొబ్బరి ముక్కలు చాకుతో తరుగుతోంది. విశ్వాన్ని చూడగానే పళ్లెం అతనిముందుకు తోసి "ఇదుగో బావా, దేవుడిప్రసాదం—వొద్దనకూడదు" అంది. ఆ ముందుజాగ్రత్తకి అతనునవ్వి కొబ్బరిముక్కలు నోట్లో వేసుకున్నాడు.

"అరటిపండు మాత్రం ఇవ్వకు జానకీ, నాకు చక్కరకేళీ తప్ప సాదాది ఇష్టంలేదు" అన్నాడు.

రాత్రి భోజనాలయాయి. దొడ్లో అందరికీ పక్కలు వేశారు. పందిరిమల్లె పకాలున నవ్వినట్టుగా పూలతో నిండి సువాసనలు వెదజల్లుతోంది. దొడ్డిగుమ్మం ఎదురుగానే గ్రామచావడి ఉంది. అక్కడ సందడి ఎక్కువగా వుంది. హరికథా కాలక్షేపం. దొడ్డి తలుపులు తెరుచుకుని చాప వేసుకుని సీతమ్మగారూ, జానకీ కూర్చున్నారు. వెంకట్రామయ్యగారు చుట్టపొగ గుప్పునవొదుల్తూ, బయట అటూ ఇటూ పచార్లుచేస్తూ కథాశ్రవణం చేస్తున్నారు. సూరీ, విశ్వం మంచాలమీద పడుకుని వీలైనప్పుడు హరికథ వింటూ, కబుర్లు చెప్పుకుంటూ కులాసాగా కాలక్షేపం చేస్తున్నారు. విశ్వానికి కొద్దిసేపట్లో మాగన్ను పట్టింది.

"ఘనుడా భూసుర జేగనో
వడుమ మార్గశ్రాంతుడై చిక్కెనో..."

ఆ పైన విశ్వం వినలేదు. అతనికి మళ్ళీ మెలకువ వచ్చేసరికి రుక్మిణీకల్యాణం ఐపోయింది. హరిదాసు ఉత్సాహంగా "జై శ్రీమద్రమారమణ గోవిందో హరి" అంటున్నాడు.

## 3

కోనపల్లిగ్రామంలో వెంకట్రామయ్యగారు ఒకప్పుడు చిన్న రైతుమాత్రమే. ఉడుకురక్తం పొంగే వయసులో స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని దేశానికి అంతో ఇంతో నిస్వార్థమైన సేవచేశాడు. తరవాత తరవాత కుటుంబభారం నెత్తినపడి సంసార సాగరంలో మునిగి గ్రామంలోనే స్థిరపడిపోయి రాజకీయ జీవితానికి ఉద్వాసన చెప్పాడు. పొలాల్లో స్వయంగా కష్టించి పనిచేసి క్రమేణా పసుపు, పుగాకు పంటల వల్ల వచ్చే ఆదాయంతో మోతుబరి ఆసామీ అయాడు. ఆయనకి సూరి, జానకి ఇద్దరే సంతానం. కిందటి సంవత్సరమే సూరి బి. ఏ. పూర్తిచేశాడు. పై చదువులకి పోవాలని ఎంతో ఉబలాటపడ్డాడు. కాని వెంకట్రామయ్యగారికి అది ఇష్టంలేకపోయింది. పెద్ద చదువు చదివితే సూరి పల్లెలో పొలం వ్యవహారాలు చూసుకుంటూ కాలం గడపటానికి ఇష్టపడడని ఆయన భయం. చూసే దిక్కు లేకపోతే సుక్షేత్రమైన మాగాణీ బంజరుభూమైపోతుంది. తనకేమో ఓపిక సన్నగిల్లుతోంది. అందువల్ల సూరి చదువుకి స్వస్తిచెప్పి ఇంట్లోనే ఉండటం తన అభిమతమని ఘంటాపథంగా చెప్పాడు. అయినా కూడా పై చదువులకి వెళ్ళాలని పట్టుదల ఉంటే వెళ్లమన్నాడు. కాని అలా ఇరుకున పెట్టటం సూరికి సరిపడలేదు. తను చదవనే చదవను పొమ్మన్నాడు. కొత్తలో కోపంతో పొలంపని చూడటం కూడా మానేశాడు. కాని ఎల్లకాలం ఒకేరీతిగా ఎవరూ ఉండరు. రాను రాను పరిస్థితుల్ని సరిపెట్టుకుని పోయిన ఉత్సాహాన్ని కొద్ది కొద్దిగా కూడదీసుకుని తండ్రికి అన్నింటిలో చేదోడు వాదోడుగా ఉండసాగాడు. చదువుకున్నవాడు కావటంవల్ల గ్రామంలో అందరిలో పరపతికూడా ఉంది. పల్లెటూరి రాజకీయాల్లో అతను కలగచేసుకోడు. పల్లెజనం సాంస్కృతికంగా అభివృద్ధిపొందే కార్యక్రమాల్లోమాత్రం విధిగా పాల్గొంటాడు. ఈ స్థితిలో విశ్వం వచ్చి చదువు కొనసాగించమని పురికొల్పాడు. అతనిలో అణగిఉన్న కోరిక మళ్లీ పైకుబికింది. మామయ్యతో ఈ విషయం ప్రస్తావిస్తానని విశ్వం మాట ఇచ్చాడు.

పండగవెళ్ళిన రెండోరోజున విశ్వం ప్రయాణం కట్టాడు. ఎంతో బలవంతంమీద అందర్నీ ఒప్పించాడు.

జానకి కాఫీతెచ్చి ఇచ్చింది. ఈ రెండురోజుల్లో పునరుద్ధరించబడిన చనువుతో "థాంక్స్" అన్నాడు.

"వొద్దులే."

"ఏం?"

"ప్రతి చిన్న విషయానికీ ఇక్కడ కృతజ్ఞత స్వీకరించే అలవాటు లేదుగా."

"ఓహో! సరే అయితే, ఉపసంహరించుకున్నాను. మరి నేను వెళుతున్నాను."

"మళ్ళా ఎప్పుడు రావటం?"

విశ్వం రెండు చేతులూ ఎత్తి నమస్కరించాడు. "బాబోయ్, మళ్ళీనా?"

జానకి నవ్వాపుకొని "అదేమిటి, అలా అంటావు?" అంది.

"నాకు ఒంటరితనం ఇష్టం. బస్తీలో రెండో కంటివాడికి తెలియకుండా మన బతుకు మనం బతకొచ్చు. ఇక్కడ ప్రతివాడికీ మన గొడవే కావాలి. పైగా ఈ పోట్లాటలూ, కొట్లాటలూ నేను చూస్తూ కూర్చోలేను. అబ్బబ్బ! ఎంత అజ్ఞానం. ఏదైనా నేర్చుకుందామని ఒక్కడికీ లేదుగద. పైగా ఈర్ష్య ప్రతిదానికీ"

"అది అందరికీ సహజమేగా."

"ఇక్కడివాళ్ళ సంగతి వేరులే."

"స్థలాన్నిబట్టి స్వభావాలు మారతాయా మనుషులకి?"

"పరిస్థితుల్నిబట్టి ప్రవర్తన మారొచ్చని నా నమ్మకం. మీ ఊరినిగురించి మంచిమాటలు చెప్పటం లేదని నీకు కష్టంగా ఉన్నట్టుంది. పోనీ. ఓ మీటింగు ఏర్పాటుచేయిస్తే కాసేపు పొగిడి వెళతాను."

"నువ్వు మీటింగు పెడితే వాళ్ళు వస్తారా?"

"రారు. అదే నేను అనబోయేది. వాళ్ళకి తెలియదు. చెబితే వినరు."

"మాటలు చెబితే ఎవరైనా బాగుపడతారా?"

"ఒకరు చెప్పేదేమిటి? మనిషికి కొంత ఆలోచన కావాలి. అందుకోసం ఏకాంతం కావాలి. వెధవ కబుర్లు కొట్టిపోస్తూ, చీట్లాడుతూ కాలం గడపకపోతే, ఏటొడ్డునో మరో చోటో కూర్చొని ప్రకృతిలో లీనమై మంచీ చెడూ ఆలోచించుకుంటూ జీవితంలో చీకూ చింతా లేకుండా కలిసి కట్టుగా బతకటం నేర్చుకోకూడదూ?"

జానకి చిరునవ్వు నవ్వింది. ఆమె ఏమీ అనకపోవటంతో తను బాగామాట్లాడాడని విశ్వం సంతోషపడ్డాడు.

బాగా తెల్లవారింది. వెంకన్న బండి కట్టుకొచ్చాడు. బస్సుదాకా దిగవిడిచిపెట్ట రావటానికి వెంకట్రామయ్యగారూ, సూరి సిద్ధపడ్డారు.

"వెళుతున్నా జానకీ"

"మంచిది. అందర్నీ అడిగానని చెప్పు బావా?" అంది జానకి.

విశ్వం నవ్వుకున్నాడు. ఈ లాంఛనాలన్నీ అర్థం చేసుకుని అమల్లో పెట్టటంత వయసొచ్చిందా జానకికి! తనప్పుడే పెద్దవాళ్ళలో చేరిపోయినట్టుగా ప్రవర్తిస్తోంది ప్రతి విషయంలో.

రెండెడ్లబండీ జోరుగా పోతోంది. ఇంకా బాగా ఎండెక్కనందువల్ల హాయిగా చల్లగా గాలి వేస్తోంది. ఎద్దుల మువ్వలధ్వనులు వాద్యసంగీతంలా లయబద్ధంగా వినిపిస్తున్నాయి. కొంచెందూరంలో ఎదురుగా ఓబండి వస్తోంది.

"ఎవరిదిరా ఆబండి? "వెంకట్రామయ్యగారు అడిగారు.

"మునసబుగారి దండి" అన్నాడు వెంకన్న ఎద్దుల్ని అదిలిస్తూ.

"సూరి చదువు సంగతేమిటి మావయ్యా" విశ్వం కదలేశాడు విషయాన్ని.

"గ్రాడ్యుయేటయ్యాడుగా."

"పై చదువు సంగతి"

"ఎందుకురా బోలెడంత డబ్బు పోసి చచ్చు చదువులూ?"

"అయితే వాడిది చచ్చుచదువేనంటావు"

వెంకట్రామయ్యగారు నాలిక కొరుక్కున్నాడు.

"అది కాదురా. వాడు తప్ప నాకు ఆసరా ఎవరున్నారు చెప్పు. వాడు చదువుకని వెళ్ళిపోతే, వ్యవహారాలన్నీ ఏమయ్యేట్టు?"

"అందుకని వాడి భవిష్యత్తు పాడుచేస్తావా ఏమిటి?"

"వాడి భవిష్యత్తుకేం. సంపాదించి ఎవరికీ ఎత్తిపొయ్యక్కర్లేదుగా."

"సంపాదనకోసమేనా చదువులు?"

"ఈ రోజుల్లో అంతే."

"ఎవరో అనాలిసినమాటలు నువ్వంటావేం మావయ్యా?"

"నీకు తెలుసు లేరా విశ్వం. నువ్వూరుకో."

"పొలాలు కౌలు కిచ్చేసి అందరూ ఒక చోటే ఉండొచ్చు. నిక్షేపంగా రెండేళ్లు కాగానే ఎం. ఏ. ప్యాసైపోతాడు."

"అక్కడితో అయినట్టేమిటి? మరొకటి చదవాలనిపించవచ్చు. చదువుకి అంతేమిటి? మన పరిస్థితులు చూసుకోవాలి గాని."

"నీక్కోపం వొస్తే రావొచ్చుగాని ఈ విషయంలో నువ్వు నీ స్వార్థమే చూసుకుంటున్నావు మావయ్యా"

వెంకట్రామయ్యగారు పొడిగా నవ్వారు.

"పోనీ అలానే అనుకోండి. వాడికి అంతపట్టుదలగా ఉంటే చదవొద్దని నేనేం అనలేదే."

"అదా రాజకీయపు ఎత్తు, నువ్వు మనస్ఫూర్తిగా వెళ్ళమనక పోతే వాడు వెళ్ళడు."

"నేను వాడి బాగుకోరే వాడిని కాదా?

విశ్వానికి విసుగుపుట్టింది. ఊరుకోమన్నట్టు సంజ్ఞ చేశాడు సూరి.

"నీ ఇష్టం." అన్నాడు విశ్వం.

కొంచెం సేపు ఎవరూ మాట్లాడలేదు. మునసబుగారి బండి వేగంగా వస్తోంది. ఇద్దరు పాలేళ్ళకి కొంచెం పోటీ పడ్డది. ఎవరి ఎద్దులూ తీసిపోయినవి కావని రుజువు కావాలి. గంటల మోతలు ఎక్కువయాయి. ఎదురెదురుగా వెళ్ళే బళ్లి మధ్యదూరం తక్కువౌతున్న కొద్దీ జోరు ఎక్కువ కాసాగింది.

బండిని బండి దాటుతోంది. ఇరుసూ ఇరుసూ ఒరుసుకుని చక్రం చక్రం ఢీకొన్నాయి. ఆగిపోయాయి బళ్లు రెండూ, ఇరుసులు తప్పించాలి. వెంకన్న దిగబోయి మళ్ళీ ఎందుకో మనసు మార్చుకుని కూర్చున్నాడు. అవతల వ్యక్తీ అలాగే చేశాడు. వాళ్లిద్దరూ మాటామాటా అనుకున్నారు. నీది తప్పంటే నీది తప్పన్నారు. ఎవరిది తప్పో తేలలేదు. ఇంటువంటివి తేలేవి కూడా కావు. మునసబుగారు కదల్లేదు. ఠీవిగా కూర్చున్నారు. వెంకట్రామయ్యగారూ అంతే.

"ఏమిట్రా ఈ గొడవ?" అన్నాడు విశ్వం.

సూరి పొడిగా నవ్వాడు "ముందెవరు దిగితే వాళ్లి అంతస్తు తక్కువ, చిక్కా!" అన్నాడు.

పాలేళ్లూ మాటలు మీరుతున్నారు.

"ఇద్దరూ పొలాల్లో పనిచేసుకునే వాళ్లే. ఇద్దరూ శ్రమజీవులే పొద్దున లేస్తే మొహా మొహాలు చూసుకునేవాళ్లే. ఈ కీచులాట ఎందుకు?"

"అదే తమాషా వాళ్లికోసం కాదు వాళ్ల పేచీ. వాళ్ల యజమానులకోసం, యజమానుల ఘనతబట్టి తమ ఘనత కొల్చుకోటం ఇంకా పోలేదు లే." చిన్నగా చెప్పాడు సూరి.

వెంకట్రామయ్యగారు కొంచెం ముందుకి వెళ్లారు.

మునసబుగారుకూడా జరిగారు. పాలేళ్ల మాటల్లో యజమానుల మాటలు కలిశాయి. పోరు ఘోరమయ్యే సూచన కనిపించింది.

బండిలోంచి గభాలున ఉరికాడు సూరి. వెనకనే విశ్వంకూడా దూకాడు.

అవతల బండిలోంచి అదే సమయంలో ఒక యువకుడు కిందికి దూకాడు. ఇంచుమించుగా ఒకే సమయంలో అందరూ ఇరుసులమీద చెయ్యేశారు. బళ్లు విడిపడ్డాయి. ఎవరూ ఏమీ మాట్లాడుకోలేదు. మళ్లీ బళ్లలో ఎక్కారు. క్రమక్రమంగా బళ్ల మధ్య దూరం ఎక్కువ కాసాగింది.

వెంకట్రామయ్యగారు ఓ సారి ఆకాశంలోకి చూస్తూ కొంచెం అర్థ స్వగతంగా అన్నాడు.

"నా చిన్నతనపు రోజుల్లో ఇలాగే జరిగివుంటే తలకాయలు ఎగిరేవి."

ఆలోచనలో నిమగ్నుడైవున్న విశ్వం ఆ మాటలు విని సూరివైపు కొంచెం ప్రశంసా పాత్రంగా చూశాడు. అతను నిర్లిప్తంగా శూన్యంలోకి చూడసాగాడు.

"ఆ అబ్బాయి ఎవరు?"

"మునసబుగారబ్బాయి, పట్నంలో చదువుకుంటున్నాడు." క్లుప్తంగా చెప్పాడు సూరి.

ఆ తరవాత చాలా సేపటిదాకా ఎవరూ ఏమీ మాట్లాడలేదు. చిరుగంటల గణగణ వింటూ కూర్చుండిపోయారు.

[సశేషం]

# ఆంగ్లభాషలో భారతీయ పదజాలం

శ్రీ కొండముది శ్రీరామచంద్రమూర్తి

భారత స్వాతంత్ర్య దినం నాడు ఢిల్లీలో లార్డు మౌంట్ బాటన్ మాట్లాడుతూ "భారతీయులు, ఆంగ్లేయులు కలిసి మెలిసి సంచరించిన గత కొద్ది శతాబ్దాల్లోనూ ఆంగ్లేయ జీవనవిధానము, ఆచారవ్యవహారాలు, భాష, ఇక్కడి భారతీయుల సాంగత్యం వలన ఎంతగానో మారిపోయినవి — కానీ దానిని గుర్తించడం మాత్రం ఇంకా జరుగలేదు." అని అన్నారు. ఇది అక్షరాలా యదార్థం. నాలుగువందల సంవత్సరాల క్రిందట, ఏనాడు ఆంగ్లేయులు వ్యాపారమన్న కారణంతో మన గడ్డమీద అడుగుపెట్టారో, ఆ నాటినుండే సుదీర్ఘమైన, సుదృఢమైన సంబంధ బాంధవ్యాలు మనకూ వారికీ ప్రారంభమయ్యాయి. సాంఘికార్థిక, రాజకీయ రంగాల్లోనే కాకుండా, భాషలో కూడా ఇరుతెగలా ఎంతో మార్పు జరిగింది.

పండిట్ నెహ్రూగారో సందర్భంలో మాట్లాడుతూ "నేనొకసారి ఆంగ్లభాషలో హిందూస్థానీ పదాలు ఎన్ని వున్నాయోనన్న కుతూహలంతో కొద్ది పరిశ్రమ చేశాను. కానీ ఆ మహాకార్యాన్ని చివర వరకూ కొనసాగించడం మాత్రం జరిగింది కాదు. అయినా చేసిన ఆ కొంచెం కృషిలోనే, లెక్కకు మిక్కిలిగా హిందూస్థానీ పదాలు, ఆంగ్లభాషలో కన్పించడం నాకు చాలా ఆశ్చర్యం వేసింది." అన్నారు. హిందూస్థానీపదాలు మాత్రమే కాదు, ఏ మాత్రం కొద్ది పరిశ్రమ చేసినవారికైనా, భారతీయ భాషలన్నీకూడా, కొద్దో గొప్పో, తమతమ పదాభరణాలతో ఆంగ్లభాష నలంకరించడం విస్మయం కల్గించక మానదు.

ఆంగ్లరచయితలుకూడా ఈ పరిస్థితిని గుర్తించారు. కానీ కొద్దిమంది మాత్రమే గణనీయమైన కృషి చేశారు. మరికొంతమంది తగినకృషి చేయకుండానే, సర్వమూ తెలుసుకున్నట్టుగా ప్రవర్తించారు. కొన్ని నిర్ణయాలుకూడా చేసివేశారు 1 డాక్టర్ మేరీ యస్. సర్ జీన్‌స్టన్, ఆంగ్లంలో భారతీయపదాలు మొత్తం 188 (అక్షరాలా నూటఎనభై ఎనిమిది) ఉన్నాయని లెక్క తేల్చారు. ఇదే గనుక నిజమైతే ప్రొఫెసర్ ఫిక్లే చేసిన పరిశోధన అంతా గాలిలో దీపమన్నమాట. చివరకు ఆమె 2 cod ఇచ్చిన మాటలనైనా లెక్కలోకి తీసుకోలేదు. ఆ విధంగా "బ్రాహ్మన్, మొగల్" మొదలైన మాటలు ఆమె లిస్టులోనుంచి జారిపోయాయి.

ఈ విధంగా భారతీయ భాషాప్రభావంమీద తగిన శ్రద్ధ లేకుండానే దాన్నిగురించి ఒక నిర్ణయానికి వచ్చినవారిని వదిలివేసి 3 oed ని మనం ప్రమాణంగా తీసుకున్నట్లయితే, మనకు రమారమి ఆంగ్లంలో భారతీయ పదాలు 900 వరకూ కన్పిస్తాయి. ఇవీ ఈ పదాలకు కూర్పులూ, చేర్పులూ, మినహాయింపులూ మరెన్నో!

అయితే మన భాషలమీద ఇంగ్లీషు ప్రభావాన్ని గనక లెక్కలోకి తీసుకున్నట్లయితే, ఆంగ్లభాషపై భారతీయ భాషాప్రభావం చాలా తక్కువే. ఒక్క తెలుగులోనే మనం అనునిత్యం మాట్లాడుకునే మాటల్లోనే దాదాపు 3000 పదాలుండగా, భారతీయ భాషల పదాలన్నింటినీ కలుపుకున్నా, ఆంగ్లంలో, పైన యిచ్చిన సంఖ్యకు సగానికన్నా మించలేదు.

ఈ విధంగా, ఆంగ్ల పదాలు మన భాషల్లో విరివిగా కన్పించటానికీ, భారతీయ పదాలు ఇంగ్లీషులో తగినంత ప్రాతినిధ్యం పొందలేక పోవడానికీ ఎన్నో కారణాలున్నాయి. ఆంగ్లేయులు ఎన్నడూ కూడా ఈ ఉష్ణదేశాన్ని తమ జన్మస్థలంగా భావించలేరు. పైగా ఇక్కడి ఆచార వ్యవహారాలు వారికి అత్యంత వ్యతిరేకం. స్వకార్యం నిమిత్తం ఈ దేశానికివచ్చినవారైనా తిరిగి తమతమ జన్మస్థలాలకు వెళుతూ వెళుతూ ఏవో నాలుగు మాటలు ముక్కున గఱచుకొని

---

1. History of Foreign words in English అన్న గ్రంథములో
2. Concise Oxford Dictionary
3. Oxford English Dictionary

పోయేవారుతప్ప శ్రద్ధతో, భక్తితో—ఏ కొద్దిమందినో మినహాయిస్తే—ఇక్కడి భాషా సౌరభాన్ని ఆఘ్రాణించిన పాపాన పోలేదు.

ఇక, ఈ 900 పదాలైనా, ఆంగ్లం లోకి బలవంతాన ప్రవేశించడానికి కారణాల నేకమున్నాయి. వారి చేష్టలు, వారి భావాలు విశదీకరించగలిగేవి భారతీయ పదాలు తప్ప మరేవి వారి భాషలో లేక పోతేనే, ఆంగ్లేయులు, ఒక తెలుగు మాటనో, ఒక బెంగాలీ పదాన్నో, అది ఇది కాకపోతే ఏ సంస్కృతం మాటనో స్వీకరించేవారు. అందుకనే "క్యాలికో, టమ్నార్, బనియన్, పైజమా, బందకూట్, ముంగీస్, జాక్, మ్యాంగో" లాంటివి వారికి అవసరములయినాయి.

ఇక్కడే రెండు పదాలను గురించి వివరించవలసిన అవసరం వుంది. "రైతు, రైత్వారీ పదాలు దక్షిణ భారతంలో వున్న లాండ్ రెవిన్యూ పద్ధతి సూచించినంత వివరంగా, సమగ్రంగా, పెజంట్, కల్టివేటర్, ఎగ్రికల్చరిస్ట్ అన్న పదాలు సూచించలేవు. అందుకనే రైత్ రైత్వార్ పదాలు రెండూ చక్కగా ఆంగ్లంలోకి కలిసిపోయాయి." అని హెచ్. హెచ్. విల్సన్ చెప్పారు. ఆ విధంగానే తెలుగులో "మిద్దె" అన్న పదం కూడా!

ఇంతకన్నా ఎక్కువ సంఖ్యలోనే భారతీయ పదాలు ఆంగ్లంలో చేరివుండేవి. కాని ఈస్ట్ ఇండియా కంపెనీ ఓ ఫర్మానా జారీ చేసింది, ఎవరు కూడా అనవసరంగా భారతీయ పదాలు ఉపయోగించవద్దు అని. అయినప్పటికీ యథేచ్ఛగా 1624 నుండీ 18వ శతాబ్దం చివరి దాకా అటూ యిటూ పదాలు మారుతూనే వచ్చాయి. "ఫర్మానా, అవాదీ, పర్వానా, చౌకీదార్, రహదార్, చాప్, గోడౌన్, దఫ్తర్ ఖానా" మొదలైనవన్నీ.

అదీకాక, ఇంకో కారణం కూడా ఆంగ్లంలోకి భారతీయ పదప్రవాహాన్ని నిరోధించింది. పదునేడవ శతాబ్దానికల్లా, ఆంగ్లేయులు 'తమ భాష, తమ దేశం' అన్న స్థితిలోకివచ్చేశారు. లాటిన్, ఫ్రెంచి భాషల తర్వాత, షేక్స్పియర్ వల్లనే ఇంగ్లీషు తీర్చిదిద్దబడింది. ఎప్పుడయితే, తమ భాషకు యౌవనం వచ్చిందో, అప్పటినుంచి పరభాషా పదజాలంతో తమ భాష నలంకరించడం మానివేశారు ఆంగ్లేయులు.

## 2

ఒక భాషలో దిగుమతి అయిన పదాలయొక్క స్వభావాన్ని గూర్చి పరిశీలన చేసే ముందు రెండు విషయాలను గురించి ఆలోచించాలి. 1. ఆ పదాలు ఎలా జాతీయం చెయ్యబడాయి? 2. ఆ పదాలకు శాశ్వతత్వం వున్నదా?

జాతీయం చెయ్యబడిన పదాలు కూడా మళ్ళీ రెండు రకాలు. "ఈ విదేశీ పదం తప్ప మాట తప్ప ఇంకొకటి ఉపయోగించడానికి వీలేదు" అన్నటువంటివి కొన్ని. ఉదా: "బక్షీష్. సిపాయ్" మొదలైనవి రెండవ రకానికి చెందినవి ఏవో కొన్ని కొన్ని ప్రత్యేక సందర్భాల్లో తగినంత అవసరంవుండి ఉపయోగింపబడేవి. ఇటువంటి జాతీయం చెయ్యబడ్డ మాటలే ఆంగ్లంలో చాలా వున్నాయి. "ఉదా: మాయ, మొఘజిత్, మొగల్. లూట్, పగోడా, జాక్, జంగిల్" ఇత్యాది.

పై పదాలను గురించి oed ముచ్చటించి వున్నా, బాగా వాడుకలోవున్న రెండు మాటలను అది వదిలివేసింది. 1 అనకొండ (తమిళం). 2. పాండా (నేపాల్).

'అనకొండ' అంటే తన కందిన ఆహారాన్ని క్షణంలో జీర్ణం చేసుకునే ఒక పెద్దపాము. 'పాండా' అనేది హిమాలయాల్లోవుండే ఒక మృగం. ఈ రెండు మాటలూ, ఇప్పుడు ఆంగ్లంలో బహుళ ప్రచారంలో వున్నాయి ఇటువంటిదే తెలుగుమాట "లంక" అనే టటువంటిది, శ్రీ జి సుబ్బారావుగారు చెప్పినట్లుగ ఈ రకమైన మాటలన్నీకూడా ఆంగ్ల భాషకు ఆభరణాలు మాత్రమే. భోజనంలో కూర, చారు వున్నట్లుగానే, ఇవికూడా భాషకు ఉపకరణాలుగా వుంటాయి అవసరమైతే వుంచుకోనూవచ్చు. వెగటు వేసిన వాడూ విసర్జించుకోనూ వచ్చు అంతే!

అయితే, దిగుమతి అయిన మాటల కన్నింటికీ కూడా శాశ్వతత్వం ఉన్నదా అన్న విషయం, వాటి అవసరం మీదనే ఆధారపడివుంది. అదీకాక ఏ మాట అయినా పదికాలాలపాటు వుండాలీ అంటే, అది జన సామాన్యంలో బాగా ప్రచారం సంపాయించుకోవాలి. ఇందుకు రచయితలు తోడ్పడాలి. ఈ వ్యాసం ఉత్తరార్థంలో ఆంగ్ల రచయితలు భారతీయ

పదజాలాన్ని ఏలా ఉపయోగించారో తెలుసుకుందాం.

## 3

మాటలచేత మహీపతుల మన్నన లందగవచ్చు అన్నది ఆనాటి సంగతి అయితే, మాటల ప్రభావం చేత, మాటలలోని మార్పువలన, చరిత్రకందని కొందరిని గురించి తెలుసుకోవచ్చునన్నది ఈనాటి విశేషం 'మాటలే' ఆర్థిక విప్లవాన్ని విశదీకరిస్తాయి. 'మాటలే' సాంఘిక స్థితిగతులను బోధపరుస్తాయి. ఆ 'మాటలే' చివరకు సంస్కృతినీ, నాగరికతనూ తెలియ జెబుతాయి.

## 1600 నుండి 1700 వరకు

ఆంగ్లంలోకి ప్రవేశించిన భారతీయ పదాలను శతాబ్దాల వారీగా పరిశీలిస్తే ఇదే సంగతి తేటతెల్లమౌతుంది. మొదటగా పదునేడవ శతాబ్దాన్ని పరిశీలిద్దాం.

ఈ శతాబ్దంలో తీసుకున్న మాటలు పూర్తిగా వ్యాపారానికి సంబంధించినటివి. దాదాపు అన్నీ వస్తువుల పేర్లే. ఉదా: క్యాలికో, చుద్దార్, టస్సార్, బంగాల్ (ఇదివరలో వస్తువుల ముక్కలను బంగల్ అని పిలిచేవాళ్ళు); దుంగారే (చాలా తక్కువ రకానికి చెందిన గుడ్డను 'దుంగారే' అని పిలిచేవాళ్ళు. ఈ గుడ్డతో ట్రౌజర్లు కుట్టించుకొన్నారు. ఇటువంటివే ఇంకా చాలా మాటలు వున్నాయి. అయితే ఈ మాటలన్నీ కూడా వాడుకలో లేకుండాపోయి, కాలగర్భంలో కలిసిపోయాయి. చనిపోకుండా బ్రతికి వున్న మాటల్లో 'క్యాలికో' అన్న దానికి చక్కటి చరిత్ర వుంది.

## క్యాలికో

16వ శతాబ్దంలో ఇది "కల్లికట్, కలికో" అని పిలువబడేది ఆతర్వాత పోర్చుగీసు, ఫ్రెంచి భాషల ప్రభావానికి లోనయింది. అసలు ఆకాలంలో గోవా తర్వాత చాలా పెద్ద ఓడరేవు అయిన క్యాలికట్ నుంచీ వచ్చే తెల్లని వస్త్రానికీ, దీనికీ కొంత సామ్యం వుంది. ఇటువంటి, భౌగోళికమైన మాటలను వస్తువులకు వాడుకునే సౌలభ్యాన్ని భారతదేశం ఇంగ్లాండుకు ఆశేషంగా కల్గించింది. ఉదా: "దుంగార్, సూరత్, బెంగాల్, మద్రాస్, మలబార్, జోధ్‌పూర్, 'జాకోనెట్' " 'క్యాలికో' అన్నమాట ఎంత వాడుకలోకివచ్చింది అంటే, తూర్పునుంచి దిగుమతి చేసుకున్న ప్రతి నూలుగుడ్డను ఇదే పేరుపెట్టి పిలిచేవారా కాలంలో పాశ్చాత్యులు. తర్వాత, తర్వాత ఇది "చాలా పల్చని, పనికిరాని గుడ్డ" అని పేరు సంపాయించుకొంది. పాశ్చాత్యుల నాట్య విశేషాల్లో ఒక నాట్యవిశేషానికి "క్యాలికో బాల్" అని పేరు. అక్కడ అప్పుడు నాట్యంచేసే వారందరూ కూడా నూలుగుడ్డలు మాత్రమే కట్టుకు వచ్చేవారట! అమెరికాలో "ముద్రింపబడిన నూలుగుడ్డ"కు క్యాలికో అని పేరు. అమెరికన్ విద్యార్థి దృష్టిలో "A choice bit of Calico" అంటే అమ్మాయ్ అని అర్థం. ఆవిధం గానే సూరత్ అంటే 'చాలా తక్కువ రకానికి చెందిన గుడ్డ' అన్న భావమేర్పడింది.

ఈ శతాబ్దానికే చెందిన వ్యాపార వస్తువుల పేర్లలో "కొప్రా, కాయిర్, తుతునాగ్ (తెలుగు తుత్తునాగం), పెప్పర్, సుగర" అన్నవి కొన్ని. పెప్పర్, సుగర్ అన్నమాటలు ఇంతకు చాలాకాలం క్రితమే, గ్రీకు, లాటిన్లద్వారా, ఇంగ్లండులోనికి వెళ్ళిపోయినట్టివి.

ఇటువంటివే మరికొన్ని మాటలు: "దుభాషి, కూలీ; బజార్; టూపీ; పైసా; మొహార్, పగోడా (గోల్కొండలో అప్పట్లో వాడుకలో వున్న ఒక నాణెం), దీవార్; ఫనమ్; గుజ్; మాండ్; పీస్; సేర్; తులా."

ఈ శతాబ్దంలోనే మరొక్క విశేషం, 1690-95 నాటికల్లా పోర్చుగీసులు పశ్చిమకోస్తా అంతటా స్థావరా లేర్పరచుకుని బాగా స్థిరపడ్డారు. అదిగాక, భారత-పోర్చుగీస్, దేశీయుల సాహచర్యం వల్ల "ఇండో-పోర్చుగీస్" మాటలు కొన్ని ఉద్భవిల్లాయి. ఆ తర్వాత వచ్చిన ఆంగ్లేయులకు కూడా పోర్చుగీసు వారవలంబించినపద్ధతే తమూ అవలంబించకతప్పలేదు.

డాక్టర్ డాల్గాడో అభిప్రాయం ప్రకారం ఈ సమయంలోనే 300 మలయాళీ పదాలు పోర్చుగీసు ద్వారా ఇంగ్లీషులోకి ప్రవేశించినవి. అయితే అందులో చాలా పదాలను ఇప్పుడు కాలమనే మహాసర్పం మింగివేసిందనుకోండి. అల్లా మింగివేయబడ

కుండా కొనవూపిరితో బ్రతికివున్న పదాలలో 'తోపాసి' అన్నదొకటి. దీని అర్థం సైనికుడు గావచ్చు లేక ఓడలో పనిచేసే పాకీవాడు కావచ్చు. లేక భారతదేశంలో పోర్చుగీసువారి సంతానం కావచ్చు. ఏమైనా మన హిందూ "దుబాషీ" పదానికీ, దీనికీ కొంత సారూప్యం వుంది. ఇండో - పోర్చుగీసువారు మొదట్లో ఈ దుబాషీలు (Translaters)గా పనిచేసేవారని దీన్నిబట్టి తెలుస్తోంది.

సంపూర్ణమైన చరిత్రగల మరొకమాట "ఫెరింగీ". భారతీయులు మొదట్లో పోర్చుగీసువారిని ఫెరింగీలని పిలిచేవారు. తర్వాత తర్వాత పాశ్చాత్యులందరికి ఈ పదమే వర్తించింది. కానీ ఈ పదం అసలు ఎలా పుట్టిందో మాత్రం వూహాకందకుండా వుంది. బహుశా 'ఫ్రాంక్' అన్న పదం 'వికృతిచెంది ఫిరంగీ అయిందేమో!' యూరోపు దేశీయుల నందరనూ కూడా భారతీయులు మొదట్లో 'ఫ్రాంక్స్' అని పిలిచేవారు. ఎందుకంటే ఫ్రెంచివారు చేసిన యుద్ధాలే భారతీయుల స్మృతిపథంలో నిల్చిపోయి ఐరోపావాసులు అంటే ఫ్రెంచివారు అనే దృష్టి ఏర్పడిపోయింది. ఆ ఫ్రెంచివారే ఫ్రాంకులయి, ఆ ఫ్రాంకులే ఫిరంగీలయినారు. ఆ పిదప పోర్చుగీసువారు తమ మతవిస్తరణకై చేసిన దుస్తంత్రాలు, దుర్ణయాల మూలంగా, వారు క్రిస్టియనులు కావటంచేత, ఫిరంగీ అంటే హేళనగా క్రిస్టియన్ అనే అర్థం వచ్చింది. ద్రావిడ వాఙ్మయంలో 'ఫిరంగీ' అంటే "యుద్ధాల్లో తుపాకి మందుపెట్టి కాల్చే ఒక మారణసాధనం" అనే అర్థం కూడా వుంది. "బీటల్, ఆరెకా, కాయిర్, కోప్రా" మొదలైనవన్నీ ఇటువంటి మళయాళీ మాటలే. మాటలచేత చరిత్రను తెలుసుకోవచ్చు నన్న నిర్ణయానికి సహాయకారులు "మొగల్, మున్షీ, గుమాస్తా, దుబాషీ" మొదలైన పదాలు.

17వ శతాబ్దంలో మొగలు రాజకిరీటం ధగద్ధగాయమానంగా వెలుగుతున్నది. ఆ సొగసులు, ఆ దర్బారులు, వారి వైభవం, చూడవచ్చిన పాశ్చాత్యుల కళ్ళకు మిరుమిట్లు గొల్పేవి. 1586లో అక్బరు చక్రవర్తి ఆస్థానానికి ఎలిజబెత్ రాణి. జాన్ న్యూబెరీని తన ప్రతినిధిగా పంపింది. అప్పుడే "మొగల్" అన్న పదం "గణనీయవ్యక్తి, స్వేచ్ఛావర్తనుడైన చక్రవర్తి" అన్న అర్థాన్ని సంపాయించుకుంది. "ఫర్మానా" కూడా అటువంటిదే. మొగలు సార్వభౌముల ఆహ్వానానికి తెల్లవారి రాకపోకలు అభ్యంతర రహితంగా యథేచ్ఛగా సాగిపోతుండేవి. సూరత్‌లో మొట్టమొదటిసారిగా ఆంగ్లేయులు తమ ఈస్టిండియా కంపెనీని స్థాపించుకోటానికీ, బుడతకీచులు తమ ప్రాభవాన్ని పెంపొందించుకోనటానికీ, ఉదారహృదయులైన ఆ ఢిల్లీనవాబులు "ఫర్మానా"లు జారీ చేస్తుండేవారు.

మొదటే మనవిచేశాను. ఆంగ్లేయుల జీవన విధానానికీ, మన జీవనవిధానానికి వారి సంస్కృతికీ మన సంస్కృతికీ హస్తిమశకాంతర భేదమున్నదని. ఈ భేదాన్ని అంచెలంచెలుగా అధిగమించటానికే "దుబాషీలు, మున్షీలు, గుమాస్తాలు" అవసరమైనారు ఆంగ్లేయులకు. ఇటువంటిదే తెలుగుమాట "బోయ్" (Boy) కూడా. పల్లకీలు మోసేవారిని తెలుగువారు 'బోయీ'లని పిలుస్తుంటారు. ఆ బోయీ, చివరకు బోయ్ అయింది. అర్థం మారింది. "పకీర్, డోంగీ, రాజా, మహల్, పాలంక్విన్, ధోనీ, మ్యాంగో, బన్యన్, షేక్, సంబూర్, నవాబ్" ఇవన్నీ అప్పట్లో ఆంగ్లేయులకు క్రొత్తగా పరిచయమైన పదాలు.

ఈ పదునేడవ శతాబ్దంలో ఆంగ్లేయులు భారతీయులకు సమానప్రతిపత్తి నిచ్చి గౌరవంతో, ఆదరంతో సంచరించారు. భారతీయ జీవనవిధానాన్ని తెలుసుకోవడానికి ఎంతో ఆసక్తి చూపించారు. హిందూమతాన్ని, హిందువుల దైవభక్తినీ ఖండించలేదు. హిందూ ముస్లిము పండుగలను—"హోళీ, దివాళీ, మొహరం, రామదాన్"—లను తామూ తమ భాషలోకి చేర్చుకున్నారు. భోజనంలో వస్త్రధారణంలో భారతీయుల ననుకరించారు. "బన్యన్‌షర్ట్స్, లాంగ్‌డ్రాయర్స్, కాంగీక్యాప్స్, బన్యన్‌కోట్స్, మూర్ మెన్స్‌ట్రౌజర్స్" వుండేవి ఆ రోజుల్లో.

## 1700 నుండి 1800 వరకు

పదునెనిమిదవ శతాబ్దంలో ఆంగ్లంలోకి ఎగుమతి చేసిన మాటలు క్రిందటి శతాబ్దంలో వాటికన్నా చాలా తక్కువ. అదికాక తీసుకున్న మాటలకే కూర్పులూ, చేర్పులూ, మినహాయింపులూ చేసి అనేక క్రొత్త మాటలు సృష్టించారు. ఆ తరుపరి ఈ శతాబ్దంలో, పూర్వార్థంలో 20 మాటలు మాత్రమే ఇంగ్లీషులోకి ప్రవేశించగలిగితే అదే శతాబ్దం ఉత్తరార్థభాగంలో 140 దాకా ప్రవేశార్హతను సంపాదించగలిగాయి.

# ఆంగ్లభాషలో భారతీయ పదజాలం

1750 ప్రాంతాలవరకూ కూడా ఆంగ్లేయులు తమ వర్తకంమీదనే బాగా దృష్టి వుంచారు. యుద్ధాల జోలికి బాగా పోలేదు. అందుచేత వ్యాపారానికి కావలసిన మాటలను ఇదివరకే తీసుకుని వుంచటంచేత వారికి క్రొత్త మాటలు నేర్చుకోవలసిన అవసరం లేకపోయింది. ఏవో కొద్ది మాటలు "జూట్, బందనా, కర్నిఖార్, దస్తూక్" లాంటివి మాత్రమే తీసుకోబడ్డాయి.

అయితే తీసుకోబడ్డ మాటలు విశేషార్థాలతో గాని చెక్కులూ కూర్పులతోనూ, కొన్ని కొన్ని సమయాల మినహాయింపులతోనూ విశేషంగా వినియోగింపబడ్డాయి. ఉదా: "బెంగాల్ సిల్క్, మ్యాంగోబర్, పాగోడ్ గాడ్, ఇండియా పెప్పర్, నబాబ్ మేకర్, మహారాటాడిచ్, సిపాయ్, ఛీఫ్, ఇండియా సైజ్, నబాబిజమ్, నబాబ్ షిప్."

కానీ, వ్యాపార పదాలు ఈ శతాబ్దంలో ఎంత తక్కువగా వున్నాయో, రాజకీయ సైనిక పదాలు అంత ఎక్కువయ్యాయి. "సిపాయ్, సిబ్బంది, తెలింగా, రిసాలాహ్, లూటీవాలా, దివానీ." వంటివి ఈ రకానికి చెందినవి. ఈ విధంగా సైనిక పదాలు వృద్ధి కావటం, ఆంగ్లేయులు భారతీయుల మధ్యగల సంబంధాలు ఏ స్థితికి వస్తున్నాయో విశదీకరిస్తుంది. మొదట్లో ఆంగ్లేయులకు ఆంగ్ల సిపాయీలే ఎక్కువగా వుండేవారు. కానీ చివరకు ఈ ఆంగ్ల సిపాయీలే చిన్నరకం రాజకుమారుల్లాగా సంచరించటంతో సుబేదార్లతో, హవల్దార్లతో, జమేదార్లతో, నాయక్‌లతో భారతీయ దళాలు ఏర్పడ్డాయి. ఈ శతాబ్దంలోనే విచిత్రమైన క్రొత్త పదాలు రెండు జన్మించాయి. 1. బ్లాక్ హోల్, 2 నాచ్. బ్లాక్ హోల్ ఆఫ్ కలకటా కథ అబద్ధమైనా ఆ పదం ఎంత సంచలనాన్ని, దుమారాన్ని కల్గించవలెనో అంతటినీ కల్గించింది. జనానాలో ఘోషా స్త్రీల ఆనందం నిమిత్తమై "నాచ్" ప్రవేశపెట్టబడింది. ఇటువంటి జాతికి చెందిన పదాలే "చిలుం, ముక్నా, ఖేడా"లు.

## 1800 నుండి 1900 వరకు

ఈ శతాబ్దంలో పదాల ఎగుమతి దిగుమతుల వ్యాపారం బాగా ఎక్కువైంది. క్రిందటి శతాబ్దం కన్నా, తామరతంపరగా మాటలకు మాటలు పుట్టి కాకుండా సరాసరి సంస్కృతంనుంచే అభివృద్ధి అయినాయి. ఈ శతాబ్దంలోనే మొట్టమొదటిసారిగా "ఇండో-యూరోపియన్" అన్న శబ్దం వినబడింది. ఈ శతాబ్దంలో మరొక్క విశేషం ఏమిటంటే, గతంలోలాగా కాకుండా, సరాసరి సంస్కృతంనుంచే అనేక పదాలు గ్రహింపబడాయి. "ఉదా: సంధి, గుణ, స్వరభక్తి, దేవనాగరి." ఇత్యాది. ఇంతవరకూ భౌతిక విజ్ఞానానికి చెందిన పదజాలమే విశేషంగా ఆంగ్లంలోకి తీసుకోబడింది. కానీ ఈ శతాబ్దంలో భారతీయ వేదాంతశాస్త్రం మంచి ప్రాముఖ్యాన్ని సంపాయించుకొంది. భారతీయసంస్కృతి, వాఙ్మయం, హిందూమతం తమ తమ పదజాలాన్ని ఆంగ్లానికి దత్తత చేసినవి. "బ్రాహ్మణ" అన్న శబ్దానికి కుచేల సంతతి కలిగింది. "ఉదా: బ్రాహ్మనిక్ ఫిలాసఫీ, బ్రాహ్మనికల్, బ్రాహ్మనికల్-ఫిగ్-ట్రీ.

18వ శతాబ్దం చివరి భాగంలో "వేద, రిగ్వేద, అవతార్, సుర, తంత్ర," లాంటి పదాలు, 19వ శతాబ్దంలో "యుగ, అమృత, భక్తి, స్వరూప, బుద్ధిజం, కర్మ, దేవ, మహాత్మ, మేళా, పూజా, సంహిత, సంస్కార, ఉపనిషద్, విమాన" లాంటి పదాలు ఆంగ్లానికి బలాన్ని చేకూర్చాయి. ఇట్లా చేరి, తమ భావను పుష్టి కల్పించడాన్ని ఓవెన్ బార్‌ఫీల్డ్ మున్నగు వారెందరో సమర్థించారు. అయినా "కర్మ, కర్త, మాయ" ఇత్యాదికి ఆంగ్లంలో సరియైన అర్థాన్నిచ్చే మరో పదాలేవి? వారు సమర్థించటం ఏమంత వింత కాదు.

ఇంక నేపాలుయుద్ధం, ఆఫ్ఘన్‌యుద్ధం సిపాయి తిరుగుబాట్లు మరికొన్ని పదాలను చేర్చినవి ఇంగ్లీషులోకి. ఉదా: "కుక్రీ, జెజైల్, పాండీ, చుపట్టీ, లోటా, ఫంసీగార్" వంటివి. అదీగాక పైతరగతికి చెందని పదాలు—బంగీ, పచిసి, తమాషా, బంగారుమ్, హూలాలూక్, తూన్—అనేకం.

## ఇరవయ్యో శతాబ్దం

ఈ శతాబ్దంలో, ముఖ్యంగా భారతస్వాతంత్ర్య సమరం, ఇంగ్లీషులో మన పదాలు చేరడానికి చాలా వరకు దోహదం చేసింది. ప్రథమ ద్వితీయ ప్రపంచ సంగ్రామాలు "ఆర్మీస్లాంగ్" ఏర్పడడానికి కారణములయ్యాయి. "బాబాచీ, చక్, చెలో, అచ్‌ఛుంగ్,

డెకో, గన్‌వాలా" కొత్తగా పుట్టిన పదాలలో కొన్ని మాత్రమే. ఇహ మహాత్ముని ఉద్యమం "అహింస"ను ప్రచారాన్నిచ్చింది.

ఆ తర్వాత హిందూ మహమ్మదీయమత కలహాలు, పాకిస్తాన్ అవతరణం. "పాకిస్తాన్ పాకిస్తానైజేషన్, గూండా, గూండాయిజమ్" మొదలయిన మాటలను అందరికీ తెలియజెబుతాయి.

ఏమైనా భారతదేశం రిపబ్లిక్ గా అవతరించడంతో, ఎటువంటి మార్పులు భారతాంగ్ల భాషల మధ్య కలుగుతాయో చెప్పడం కష్టం. కాని. ఇప్పుడు ఈ రెండు దేశాలమధ్య వున్నటువంటి సుహృద్భావమే గనక కలకాలం నిలిచివున్నట్లయితే, భారత భాషలు ఆంగ్ల భాషా సంపర్కంతో అభివృద్ధి చెందగలవనీ, భారత భాషల సంపర్కంతో ఆంగ్లభాష కూడా మూడు పూవులూ ఆరుకాయలూ కాయగలదనీ మాత్రం మనం నిస్సంశయంగా ఆశించవచ్చు.

## 4

ఇంతవరకూ ఆంధ్ర, తమిళ, మళయాళీ, గుజరాతీ, నేపాలీ, హిందుస్తానీ పదాలు ఏ కారణాల చేత, ఎన్నిరకాలుగా ఆంగ్లంలోకి తీసుకోబడ్డాయో అన్న విషయాన్ని గూర్చి తెలుసుకున్నాం. ఈ వ్యాస భాగంలో తీసుకోబడిన పదాలు ఎట్టిమార్పులకు గురి అయిందీ, ఈ మార్పులు చేయడంలో ఏదైనా పద్ధతి అవలంబింపబడిందా, లేదా అన్న విషయాలను గురించి తెలుసుకుందాం.

విలియం హాకిన్స్: Pattans-Psthans. Ras-bootes-Rajputs అనీ, సర్ థామస్ రో: Cytore-Chittore Umbras-Omrahs అనీ, జాన్‌ఫ్రయర్: Medapollon - Madhavapalem. Shawjhan. Shahjehan. అనీ ఈవిధంగా వివిధరచయితలు వాడిన పదాలలో 'స్పెల్లింగులో' భేదముండడానికి కారణం వారికి భారతీయభాషలనుగురించి సమగ్రమైన జ్ఞానం లేకపోవడమే. ఆయా వివిధరచయితలు భారతదేశాన్ని గూర్చి పరాయివారల ముఖతః వినడమేకాని, ప్రత్యక్షంగా ఈ దేశాన్ని చూచి, ఇక్కడి పరిస్థితులను గమనించినవారు కాదు. అయితే పర్షియన్, హిందూస్థాన్ భాషలను క్షుణ్ణంగా నేర్చుకున్న థామస్ కోర్యాట్, జాన్ మిల్డెన్ హాల్ వంటివారు లేకపోలేదు. కానీ వారు చాలా తక్కువ.

కానీ 19 వ శతాబ్దం వచ్చేసరికి పరిస్థితులు కొంచెం బాగుపడ్డాయి. భారతదేశం ఇంగ్లండు ఆధిపత్యం క్రిందకు రావడంతో బహుళ సంఖ్యలో ఆంగ్లేయులీదేశానికి రావడమూ, ఇక్కడ భారతప్రజలనూ, వారిభాషలను గూర్చి సమగ్రపరిశీలన చేయడమూ జరిగింది. ఇంతవరకు ఉచ్చారణ (Pronounciation) కే ప్రాముఖ్యం యిచ్చినవారల్లా ఇప్పుడు 'స్పెల్లింగు'కు కూడా ప్రాముఖ్యం యివ్వడం ప్రారంభించారు. సర్ విలియం జోన్సు వంటి పెద్దలు ఈ మార్పుకోసం బాగా కృషి చేశారు. అయితే అక్కడక్కడా కొందరు తెలివి తక్కువవారు లేకపోలేదు. "బుద్ధ అనేవారు బుద్ధ అవడానికి; బాబర్ అవడానికి భాబర్."

అయితే ఇరవయ్యో శతాబ్దం వచ్చేసరికి The Society for pure English వారు, దిగుమతి చేసుకున్న మాటలకు సరియైన వ్యుత్పత్తి నిచ్చి, రూపకల్పన చేయడంలో మంచి కృషి చేశారు. పైగా భారతీయపదాలు కూడా పెద్ద మార్పేమీ లేకుండానే, ఆంగ్ల వ్యాకరణ చట్టంలోకి ఇమిడిపోయాయి. కాని ఆయా పదాలకు "ఫలానా నామవాచకం, ఫలానిది క్రియ" అని చెప్పడంలోనే కొంచెం కష్టమైంది.

సాధారణంగా ఏ భాషలోనైనా నామవాచకాలే ఎక్కువగా వుంటాయి. ముఖ్యంగా, హిందీ, ఉర్దూవంటి భాషల్లో నామవాచకాలు పుంలింగాలుగానో, స్త్రీలింగాలుగానో వుంటాయి. ఆ విధంగానే "రోటి" స్త్రీలింగమయితే, "చా" పుంలింగం— "తమాషా" పుంలింగమయితే "చిట్టి" స్త్రీలింగం. కానీ ఆంగ్లంలో, పదాలకు వాటివాటి అర్థాన్నిబట్టి మాత్రమే, లింగనిర్ణయం చేసేవారు.

ఆంగ్లంలోకి విశేషణాలు కూడా బాగానే తీసుకోబడ్డాయి. ఉదా: బెంగాలీ మాటలు, కచ్చా, పక్కా.

కానీ క్రియాపదాలను గ్రహించడం మాత్రం అంత సులభంగా జరిగింది కాదు. కొన్ని కొన్ని నామవాచకాలకు "—Age; - dom; - ism" చివర చేర్చారు. ఉదా: డకాయిటెజ్; బాబూడమ్; బ్రాహ్మనిజమ్; ఇత్యాది.

క్రియాపదాలకు చివరన ing చేర్చారు: ఉదా: లూటింగ్, సలామింగ్.

కొన్నిచోట్ల క్రియలనే నామవాచకాలుగా ఉపయోగించారు. ఉదా: షాంపూ డెకో. మరి కొన్నిచోట్ల నామవాచకాలనే క్రియలుగా ఉపయోగించారు. ఉదా: నాచ్, పంకా, టామ్ టామ్

మరికొన్ని, విస్తృతమైన అరగాంభీర్యాన్ని పొందగలిగినాయి. ఉదాహరణకు 'అనకొండ' అన్న పదాన్నే తీసుకోవచ్చు. మొదట్లో సింహళంలో ఒకానొక పామును "అనకొండ" అనేవారు. కానీ రాను రాను. ఏపామైనా సరే, తన కందిన ఆహారాన్ని వదిలిపెట్టకుండా చూర్ణం చూర్ణం చేసుకోగలది వున్నట్లయితే, దాన్ని 'అనకొండ' అని పిలవడం ప్రారంభించారు. ఇలాగే విస్తృతపర్చబడిన అర్థాలతో "బండీకూట్ (తెలుగు: పంది కొక్కు), బంగాళా, ఖీక్, కోహినూర్, ఫర్మాన్" మొదలైన పదాలు వాడబడుతున్నాయి.

మరికొన్నిచోట్ల, పదాలయొక్క అర్థం సంక్షిప్తం చేయబడింది. "నబాబ్, బాబూ, క్యాలికో" మొదలైన పదాల అర్థం ఇలా సంక్షిప్తీకరణానికి లోనయింది.

మరికొన్ని సందర్భాల్లో కొన్ని కొన్ని పదాలు తమ పూర్వపు అర్థాన్నే కోల్పోవలసి వచ్చినవి. "ఉదా: బీటల్ నట్, కూలీ, గాడీ, జంగిల్, లూట్, మ్యాంగ్" మొదలైనవి.

ఏమైనా ఇటువంటి పరిణామాలన్నీ కూడా సజీవమైన భాషలో జరుగుతూనే వుంటాయి ఇంగ్లీషు నుంచి తెలుగులోకి దిగుమతి చేసుకోబడిన పదాలకు కూడా ఇదే గతి సంభవించింది. అది సహజంకూడా!

## 5

ఈ వ్యాసం మొదట్లో సుడివినట్లుగా, కొన్ని క్రొత్త పదాలు ఒక భాషలో చేరినప్పుడు, ఆ పదాలు బాగా వ్యాప్తిలోకి రావాలీ అంటే, ఆ భాషలోని రచయితలే ప్రముఖపాత్ర వహించాలి. ఆ పదాలకు బాగా ఆదరణా వ్యాప్తీ లేకపోతే, క్రమేణా నీళ్ళు లేని చెట్లలాగా అవే నశించిపోతాయి.

అయితే ఆంగ్లరచయితలుమాత్రం స్వపరభేదాన్ని పెట్టుకోకుండా, అవసరమైనప్పుడెలా విదేశీపదాలు వాడేవారు. వాడుతున్నారు. ప్రతిపదానికీ ఒక క్రొత్త చైతన్యాన్నీ ఒక క్రొత్తపుష్టినీ ఇచ్చారు. ఆంగ్లవాఙ్మయంలో దిగ్గంతులైనవారిచేత ఈపదాలు వాడబడడం చేతా, అదీ ఆ కవిపుంగవులు పదికాలాలపాటు నిలిచి పోయే తమతమ గ్రంథాల్లో ఈ పదాలను ఉపయోగించడంచేతా, ఆంగ్లభాషా స్రవంతిలోకి ప్రవహించిన భారతీయ పదజాలం చెక్కుచెదరక నిలిచివుండగలదని మనం ధైర్యంగా చెప్పకోవచ్చు.

ఈస్టిండియా కంపెనీ భారతదేశానికి రాక పూర్వమే, భారతీయపదాలు కొన్ని, ఆంగ్లేయులచేత స్వీకరింపబడ్డాయి. ఉదా:—అల్లం. బెరిల్, జింజర్, రైస్, సుగర్, పాంథర్—ఈ మాటలన్నీ కూడా గ్రీకు ల్యాటిన్ ఫ్రెంచిభాషలద్వారా ఆంగ్లంలోకి ప్రవేశించాయి. ఆంగ్లకవుల రచనలనుంచి ఒక్కటొక్కటిగా ఉదాహరణలిస్తాను.

ఛాసర్ : The Hous of Fame. 1·1288: 'Walles of berile'.

మార్లో: 'సుగర్' అన్న పదాన్ని ఉపయోగించాడు. డిటో; II. 1. 600. 'రైస్' అన్న పదాన్ని కూడా ఇతనే మొదటగా ఉపయోగించాడు rice porridge; The Jew of Malta. III. IV. 1363.

షేక్స్పియర్ : 'పెప్పర్' అన్న మాట నుపయోగించాడు 'pepper-ginger-bread' Henry IV. III. 1·260; 'pepper-Corn' Henry IV·III.III 9 1క్రియగా కూడా అతని మాట నుపయోగించాడు.

ఇన్ని పదాలను గురించి మనం ముచ్చటించుకొంటున్నాంగాని, హిందూదేశానికి 'ఇండియా' అన్న పేరెలావచ్చిందో మనం చర్చించలేదు. పాకిస్తాన్ లాగా, హిందూస్థాన్ అని మనం ఇప్పుడిప్పుడంటున్నా పాశ్చాత్యులందరూ కూడా 'ఇండియా' అనే భారతదేశాన్ని పిలుస్తున్నారు ఇండియా అన్నపదం సంస్కృత 'సింధు' పదంగా వచ్చింది. సంస్కృతం నుండి పర్షియన్, అటుపై గ్రీక్, అక్కడనుండి ల్యాటిన్, అక్కడనుండి ఆంగ్లంలోకి ప్రవేశించింది. ఓల్డ్ ఇంగ్లీషులో "ఇండియా, ఇండియాన్, ఇండిస్క్" అన్నమాటలు కన్పిస్తున్నాయి. కానీ 1200-1600 కాలంలో ఇండియా అన్నమాటపోయి "ఇండే. ఇండె, ఇండ్" అన్నమాటలు వ్యాప్తినిపొందాయి. ఛాసర్ 'ఇండే' అన్నపదాన్ని ఉపయోగించాడు. స్పెన్సరు కూడా అపదాన్నే స్వీకరించాడు అయితే ఒక్కసారి మాత్రం 2"ఇండియా" అన్నమాటనెలాగో అతనుపయోగించడం జరిగింది. అతనుపరి తూర్పు పశ్చిమ ఇండియా దీవులమూలంగా ఈమాట మరింత వ్యాప్తిలోకివచ్చింది. మిలన్ మహాకవి కాటన్ వర్ణన సందర్భంలో మొగల్ ప్రస్తావన తీసుకవచ్చాడు 3

---

1. "I am pepper'd, I warrant. for this world". Romeo & Juliet· III. 1.104.
2. The Faerie Queene. II. 72,5·
3. Paaradise Lost· II 1-4.

"బెంగాలా, డక్కన్, మలబార్, ఆగ్రా, లాహోర్, గేంజెస్, ఇండస్, హైడాస్పస్ (జీలం నది)" మొదలైన పేర్లు నుపయోగించాడు.

ఇంక 'ఇండియన్' అన్న పదాన్ని మొట్టమొదట సారిగా ఉపయోగించే గౌరవం డ్రైడన్‌కు దక్కింది 1 అదీగాక అతను ఔరంగజేబుతో వ్రాసిన నాటక మొకటి వుండనే వుంది.

18వ శతాబ్దంలో, తిరువాన్కూర్‌లో పుట్టి, తనయౌవన ప్రథమార్థంలో ఇక్కడ ఉద్యోగం చేసిన రాబర్ట్ ఆర్మ్, ఎడ్మండ్ బర్క్ లిద్దరూ ఎంతగానో భారతీయ పదజాలాన్నాదరించారు. ఒకరు ఈ దేశ వాసులతో కలిసి మెలిసి ఇక్కడి భాషా సౌరభాన్నాఘ్రాణిస్తే, మరొకరు అదేమీ లేకుండానే, విదేశంలో వుండికూడా చక్కటి విమర్శనా జ్ఞానంతో, తప్పటడుగు వేయకుండా భారతీయ పదాలమీద స్వారీచేశాడు.

డేనియల్ డీఫో పోప్, వాల్పోల్, స్మాలెట్ మొదలయిన వారంతా ఎక్కడో అక్కడ ఏదో వొక సందర్భంలో భారతీయ పదాన్ని వాడేవున్నారు.

పదునెనిమిదవ శతాబ్దం చివరి భాగానికల్లా మహాపండితులైన "సర్ ఛార్లెస్ విల్కిన్స్, నెథానియల్ హాల్ హెడ్, అలెగ్జాండర్ డౌ, సర్ విలియం జోన్స్, అలెగ్జాండర్ హామిల్టన్" ప్రభృతులంతా ఇండియన్ వ్యవహారాలమీద మక్కువ జూపి, భారతీయ భాషల నాదరించి, అందలి పదాలతో తామూ సాన్నిహిత్యాన్ని కల్గించుకొన్నారు. ఏ తప్పూ లేకుండా వాడారు.

ఇహ పందొమ్మిదవ శతాబ్దంలో నవలా రచయితలూ, విమర్శకులూ, కవులూ, చరిత్రకారులూ, యావన్మందీ భారతీయ భాషల సౌష్ఠవాన్ని గుర్తించి, ఆయా పదాలను వాడుకొన్నారు.

స్కాట్, సథే, బైరన్, మెకాలే, థాకరే, కిప్లింగ్, సర్ ఎడ్విన్ ఆర్నాల్డ్, సర్ జి. ఓ. ట్రెవల్యాన్, జేన్ ఆస్టిన్, టి. యస్. ఇలియట్ ఇలా ఎంతమందినైనా చెప్పవచ్చు. వారు వాడిన పదాల జాబితాలో నుండి "బనియన్ డే, అమృత, వీణ, హిందూసానిష్, థగ్, వకీల్, పంకా, ఫకీర్"లాంటి వాటి నెన్నైనా చూపించవచ్చు.

2సర్ వాల్టర్ స్కాట్ భారతదేశాన్ని గూర్చిన మొట్టమొదటి నవల వ్రాశాడు. సథే హిందూ స్వర్గాలనూ, దేవతలనూ తనపద్యాల్లో చిత్రించాడు.3

కానీ కిప్లింగ్‌లాంటివారు హిందూదేశంమీది అభిమానంతో తమ తమ గ్రంథాల్లో వాడిన మాటలన్నీ కూడా సర్వజనులకూ ఆమోదయోగ్యం కాలేదు. చాలా మాటలు "నౌలఖా, ఖైదీ, సాహిబా, జల్దీ, జాదూ" వంటివి చచ్చిపోయాయి.

అయితే ఇరవయ్యో శతాబ్దంలో ఒక విచిత్రమైన పరిస్థితి వచ్చిపడింది. ఆంగ్లేయులు మనదేశాన్ని గూర్చి, మన జీవనాన్ని గూర్చి కథావస్తువులు తీసుకుని ఆంగ్లంలో రచనలు చేయడానికి బదులు, భారతీయులే రవీంద్రులు చూపిన బాటలో, భారతీయ చైతన్యాన్ని యథాతథంగా చిత్రిస్తూ రచనలు సాగిస్తున్నారు.

ప్రముఖ నవలారచయితలైన శ్రీ కె. ఎ. అబ్బాస్, డా. ముల్క్‌రాజ్ ఆనంద్, శ్రీ ఆర్. కె. నారాయణ్ లాంటివారు చేస్తున్న కృషివలన ఆంగ్లానికే ఒక క్రొత్త జీవం వస్తున్నది. అంతేగాక ఈ ప్రత్రికల యుగంలో పత్రికా రచయితలు వహిస్తున్న పాత్ర మరీ ముఖ్యమైంది కావడంతో, ప్రముఖ పత్రికా రచయితలయిన శ్రీ కుందూరి ఈశ్వరదత్తు మొదలయినవారి ఉద్యమాలతో భారతదేశం ఆంగ్ల భాష అనే అద్దంలో తనను తాను సగర్వంగా చూచుకొంటున్నది.

ఇదే పదికాలాలపాటు వర్ధిల్లాలి. రాజకీయంగా దేశపరిస్థితి ఎట్లున్నా భాషల సంపర్కంలోనే, ఒక క్రొత్త చైతన్యం పొంగులు వారుతుంది. అప్పుడే అటు ఆంగ్లమూ, ఇటు భారతదేశ భాషలూ వర్ధిల్లేది! తథాస్తు.*

---

1. Marriage ala Mode IV 304.
2. The Surgeon's Daughter
3. The Curse of Kehama

* ఈ నా వ్యాసరచనలో శ్రీ జి. సుబ్బారావుగారి Indian Word in English అన్న గ్రంథమే చాలావరకూ తోడ్పడింది. ఇందుకు వారికి నా కృతజ్ఞతలు. ఇంకా తోడ్పడిన గ్రంథాలు ఇవి :

1. A Dictionary of American English on Historical principles.

2. Daniel Jones': An English pronouncing Dictionary.

3. H. H. Wilson: A glossary of judicial and revenue terms and of useful words occurring in official documents relating to the administration of the Govt. of British India.

# పిట్టపోరు

శ్రీ గన్నిసెట్టి వెంకటేశ్వరరావు

## పాత్రలు :

రామానుజయ్య ఒక భూస్వామి వయస్సు 50
నారాయణయ్య - అతని బావమరిది,, 40
నాంచారమ్మ - అతని చెల్లెలు ,, 35
ఏడుకొండలు - అతని నౌకరు ,, 35
పేరయ్య - పెళ్లిళ్ళ పేరయ్య,, 40

కాలం: వర్తమానం. స్థలం రామానుజయ్య ఇల్లు. తెరఎత్తేసరికి రామానుజయ్య పడక కుర్చీలో పడుకొని పేపరు చూస్తుంటాడు. సీర్కావి ధోవతి, బనీను, బొద్దు మీసం, హుందా అయిన విగ్రహం.

కొంచెమాగి, ఏడుకొండలు బయట నుండి వచ్చి లోనికి వెళుతుంటాడు.

రామా : ఒరేయ్ ఏడుకొండలూ! (బిగ్గరగా పిలుస్తాడు)
ఏడు : (ఆగి) నేనిక్కడే వుండానండీ!
రామా : ఇక్కడే చచ్చావూ?
ఏడు : అయ్యా! ఏంది బాబూ?
రామా : లోనికెళ్ళి కొంచెం పొగాకుపాయ పట్రా.
ఏడు : (వెళ్ళి పొగాకు తెచ్చియిస్తాడు).
రామా : (చుట్ట ముట్టుకొంటూ) ఏడుకొండలూ!
ఏడు : బాబూ!
రామా : కేలెండరందుకో—ఇవ్వాళ తారీకెంతో?
ఏడు : ఇయ్యాల పదేను బాబూ.
రామా : (ఉలికిపడి) ఆఁ! ఎంతన్నావ్?
ఏడు : (బిత్తరపోయి) పదేను బాబూ! ఏంది బాబూ?
రామా : నాకా సంగతే గుర్తులేదు సుమా! (బిగ్గరగా) ఒరేయ్ ఏడుకొండలూ!
ఏడు : నేనిక్కడే వుండాను బాబూ!
రామా : ఆ అచ్చిని పిలిచి ఇల్లూ, దొడ్డీ అంతా శుభ్రం చేయించు.
ఏడు : సిత్తం. (కొంచెమాగి) సంగతేంటి బాబూ!
రామా : ఇవ్వాళ తెనాలినుండి మాధవయ్యగారొస్తున్నార్రా!
ఏడు : మాదవయ్యగారా! ఆయనోరు బాబూ?
రామా : ఎవరేమిట్రా నీ బొంద! ఏడు తాలూకాల్లో యెదురులేని మోతుబరిరా! మాధవయ్య గారంటే మజాకా అనుకొన్నావా?
ఏడు : అనుకోలేదు బాబూ! కాని ఎందుకొత్తున్నారా అని......
రామా : నీ బుర్రలో సరుకు చాలా తక్కువరా!
ఏడు : సిత్తం.
రామా : కాకపోతే ఏమిట్రా! మనింట్లో పెళ్ళికొచ్చిన పుత్రాడున్నాడా?
ఏడు : సినబాబుగారున్నారు గందండీ!
రామా : ప్రస్తుతం వాడి పెళ్ళివిషయంలో బేరాలు జరుగుతున్నాయా ఈ మార్కెట్లో?
ఏడు : సిత్తం. జరక్కపోవటం వేంటి బాబూ! వొకటా! రెండా! వందలకొంపల సమందాలు వరసాగ్గా వత్తుంటే!
రామా : (చిరునవ్వుతో) అవునా? మరి ఈ పరిస్థితులో యాభైమైళ్ళ దూరాన్నుంచి, వక మోతుబరి ఆసామీ మనఇంటికి వస్తున్నాడంటే, ఎందుకొస్తున్నాడో...

ఏసు : (నవ్వుతూ) తెలిసిందిలెండి. ఆయన గోరి దగ్గరకూడా పెళ్ళికొచ్చిన బుల్లెమ్మగారుండారన్నమాట!

రామా : ఒకళ్ళం ఖర్మ! ఇట్టగున్నారు యిద్దరు!

ఏసు : ఆఁ! మనకుండాదొక్కబ్బాయేగా బాబూ?

రామా : ఏడ్చావులే వెధవ తెలివి.

ఏసు : సిత్తం. (కొంచెము ఆగి) మీ పద్ధతి నాకేం నచ్చలేదు బాబూ!

రామా : ఏం?

ఏసు : లేకపోతే ఏందండీ...అమ్మగోరు బతుకు సాలించి ఏడా దెల్లిపోయింది. ఇల్లు సూత్తంటే బోసుగా మంటుందా? తొందరగా సినబాబు పెల్లిసేసి, కోడలమ్మను తీసుకొత్తే యిలు కల కల లాడుద్దనుకొంటే, మీ రేందో వచ్చిన సమందమల్లా ఏదో వంక బెట్టి తిరగ్గొడతంటే, ఎట్టాగండి?

రామా : తొందరపడితే యేలారా? నిదానించిన కొలది రేటు పెరుగుతుంటే.

ఏసు : మొన్నొచ్చినోరు యెంతిత్తామన్నారుబాబూ?

రామా : (చుట్ట ముట్టించి) అబ్బే ఎంతో ఎక్కడిదిరా! వాళ్ళు పాతికలోపుగానే పలుకుతున్నారు.

ఏసు : పాతికంటే, పాతికొందలా బాబూ?

రామా : ఛ! వందలేమిట్రా వందలు! వేలురా వేలు!

ఏసు : (గుండెలు కొట్టుకొంటూ) పాతికేలే! మరింకేం బాబూ—తొందరగా ముడెట్టెయ్యండీ.

రామా : ఒరేయి ఏసుకొండలూ!

ఏసు : అయ్యా!

రామా: (మీసం దువ్వుతూ) రామానుజయ్య నాయుడి కొడుకంటేనే చాలు; వాడొట్టి పనికిరాని దద్దమ్మయినా సరే, పాతిక వేలకు చిలిగవ్వ తగ్గదురా! అందులో మనవాడు ప్లీడరు కాబోతుంటే......

ఏసు : (అదోలా మొహంపెట్టి) సిత్తం.
(బయటనుండి "ఏయ్ బండబ్బీ! ఆపు వాయనా ఆపు." అన్నమాట—జట్కా ఆగిన చప్పుడు వినిపిస్తాయి.)

రామా : (కంగారుగా) మనవాకిట్లోనే బండి ఆగిందను కొంటా చూడ్రా.

ఏసు : (వాకిలి దగ్గిరకెళ్ళి) సిత్తం. మన నాంచారమ్మగారు దిగినారండీ.

రామా : (విసుగ్గా) చావకపోయింది! ఇవ్వాళే దిగబడిందే!

ఏసు : (బయటకు చూస్తూ) రాండమ్మగోరూ! పాల బండి కొచ్చినారా?

నాం : అవున్నాయనా! పాసుబండి గంట లేటు, కూర్చునీ కూర్చునీ దుంప తెగిపోయింది.
(లోనికొస్తుంది. సామాన్యమైన వేషం. చేతిలో ట్రంకుంటుంది.)

రామా : ఏం చెల్లెమ్మా అంతా కులాసా?

నాం : (పెట్టె క్రిందపెట్టి) ఆఁ, ఏదో ఇలా వున్నాం. నీ వంట్లో ఉసులుగా వుంటుందా అన్నయ్యా?
(బెంచీమీద కూర్చుంటుంది. ఏసుకొండలు ట్రంకు తీసుకొని లోనికెళతాడు)

రామా : ఫర్వాలేదు. ఉత్తరమయినా రాయకుండా హఠాత్తుగా వచ్చేవేమిటమ్మాయ్?

నాం : ఏదీ! వారంరోజులనుంచీ ఇవ్వాళా రేపా అనుకుంటుంటే, ఇప్పటికి పడింది ప్రయాణం. నిజంగా, చస్తున్నాన్నా అన్నయ్యా చాకిరీతో.

రామా : అవును పాపం. మీమామగారేమంటున్నాడు?

నాం : ఏమంటాడు, నన్ను కాల్చుకు తింటున్నాడు! చచ్చినవాడు గాదు; బ్రతికినవాడు గాదు మంచాన పడి నా దుంప తెగేస్తున్నాడు—సరేగాని సత్తిగాడు పట్నంలోనే చదువుతున్నాడా?

రామా : ఆ.

నాం : ఉత్తరాలన్నా రాస్తుంటాడా?

రామా : ఎందుకు రాయడు?

నాం : మరీ సంవత్సరమున్నా పెళ్ళిగోడ వుందా, లేదురా అన్నయ్యా?

రామా : వాడి చదువు పూర్తిగావాలిగా! ఇప్పుడు పెళ్ళికేం తొందర?

నాం : నీకేం నీకలాగే వుంటుంది. ఎదిగినపిల్ల నింట్లో బెట్టుకొని ఎన్నాళ్ళుగుతం చెప్పు?

రామా : నిజమే మరి.

వాం : అందులో మీ బావ సంగతి తెలియం దేముం దన్నయ్యా?

రామా : అవును తెలియం దేముంది! వట్టి కయ్యాల మనిషి.

వాం : ఈ సంవత్సరం పిల్ల పెళ్ళి చెయ్యాలని గట్టి పట్టుదల మీదున్నారు. నువ్వు మెదలకుండా వుంటే, బయట సంబంధా లెక్కడ చూస్తారోనని భయంగా వుంది.

రామా : చూడనియ్. చూసేవాడు నీవాపితే మాత్రం ఆగుతాడా?

వాం : అదేమిట్రా అన్నయ్యా! నువ్వూ అలాగే అంటావ్? (దుఃఖస్వరంతో) అసలు నీ వాలకం చూస్తే నాకు పుట్టింటి ఆశ లేకుండా చేసేటట్లున్నావే!

రామా : (చిరాగ్గా) ఇదుగో వాంఛారమ్మా, వచ్చిన ఎడం లేదు; అప్పుడే ఏమిటీ గొడవ?

వాం : చూడన్నయ్యా! నువ్వు నా పిల్లని సత్తిగాడికి చేసుకోక పొయ్యావంటే, నేను నుయ్యో గొయ్యో చూచుకొని తీరతాను. (చీదేస్తుంది.)

రామా : సరేలే తర్వాత మాట్లాడదాం నిదానంగా. ముందు నువ్వు లోనికెళ్ళి కాళ్ళు మొహం కడుక్కో.

వాం : మాట్లాడే దేముంది; ఏమయినాసరే నీతో అవుననిపించుకోవాలి; ఈ ఇంట్లో నేను గంగ ముట్టాలి. అంతే ముసుగులో గుద్దులా టెందుకు నాకేమాటా తేల్చిచెప్పు.

రామా : చెబుతాన్లే లోనికెళ్ళు.

వాం : వెడతాన్లే నేవచ్చిం దందుకే తెలిసిందా? ఒరేయ్ ఏసుకొండలూ! (అనుకొంటూ లోనికెళుతుంది.)

రామా : (అటూయిటూ తిరుగుతూ) పాడుపీడ ఇవ్వాళే దిగిందే! అవతల నారాయణయ్యగారొస్తుంటే... (నారాయణయ్య వస్తాడు. ఖద్దరులాల్చీ, ధోవతి సన్నగా బాగుగా వుంటాడు. చేతిలో బేగ్ వుంటుంది.)

నారా : (వస్తూనే పలకరించి) ఏంబావా? తీరుబడిగా వున్నట్టున్నావే?

రామా : (అతణ్ణి చూడగానే ఉలిక్కిపడతాడు.) ఇదేమిట్రోయ్! హఠాత్తుగా వెలిశావు? తొలకరి మెరుపులాగా!

నారా : (నవ్వుతూ) నీకళ్ళేం జిగేల్ మనలేదుగదా!

రామా : అంటేమాత్రం తప్పుతుందట్లే! కూర్చో అంతా కులాసేనా?

నారా : ఏదో నీదయవల్ల యిలా వున్నాం. నీవంట్లో కులాసాగా వుంటోందా? (మంచంవాల్చుకొని కూర్చుంటాడు.)

రామా : ఆహా! ఒరేయ్ ఏసుకొండలూ! (కుర్చీమీద కూర్చుంటాడు.)

ఏసు : (లోపలనుండి) అయ్యా! (వచ్చి) ఏంటి బాబూ? ఓ నారాయణయ్యగారొచ్చినారే! అంతా బాగుండారా బాబూ?

నారా : ఆ. నువ్వు బాగున్నావా ఏసుకొండలూ?

ఏసు : నాబాక్కేం లెగండి. (సంచితీసుకొని లోనికి వెళతాడు.)

నారా : ఏంబావా! కబుర్లేం చెప్పకుండా దిగులుగా కూర్చున్నావు? కొంపతీసి నేనొచ్చానని కాదు గదా!

రామా : ఇక్కడేముంటాయి బాబూ కబుర్లు? బస్తీ నుంచొచ్చావు; నువ్వే చెప్పాలిగాని.

నారా : ఆఁ, మనసత్యం చదువు ఈ సంవత్సరంతో ఆఖరేగా?

రామా : ఊఁ.

నారా : అసలు మీ అమ్మాయి కూడా రావాలనుకొంది. "అన్నయ్యను చూచి చాలారోజులయ్యింది; ఇద్దరం వెళదామండీ!" అని గోల చేసింది. ఇద్దరం బయలుదేరితే ఇంటిదగ్గర ఎలాగని నేనే వద్దన్నాను.

రామా : అవున్లే పాపం! చార్జీలు కూడా ఎక్కువవుతాయిగా!

నారా : (నవ్వుతూ) నేనెంత పొదుపుగా కూడబెట్టినా, నీకొడుక్కి, కోడలికేగా! నే కట్టుకు పొయ్యే దేముయినా వుంది గనుకనా!

రామా : అయితే బాగా కూడబెట్టు. (ఇద్దరూ నవ్వుకొంటారు.)

నారా: (జేబులోనుండి సిగిరెట్ తీసి ముట్టించి) చూడు బావా! అసలు నేవచ్చిన పనేమిటంటే...

రామా: తరవాత తీరుబడిగా మాట్లాడుకొందాం గాని, లోనికెళ్ళి స్నానం వగయిరాలు ముగించుకో. ఒరేయ్ ఏసుకొండలూ.

ఏసు: (లోపలనుండి) వస్తున్నానయ్యా.

నారా: ఆఁ ఫర్వాలేదులే. టిఫిన్ దండిగానే పడింది. (కొంచెమాగి) మా అమ్మ బొత్తిగా మంచాన పడిపోయింది బావా! ఏవేళకెలా వుంటుందో! అందుకని ఆమె కళ్ళముందరే ఆ కొస్త ముచ్చటా జరగాలని గోలచేస్తోంది.

ఏసు: (వచ్చి) వోరుబాబూ?

నారా: మా అమ్మగారు(రా. ఏమైనా సరే, ఈమాఘంలో సత్యానికీ, శారదకూ పెళ్ళిచెయ్యక తప్పదు బావా!

ఏసు: కానియ్యండి బాబూ! మా సక్కని జోడా! సిలకా గోరింకల్లాగుంటారు.

నారా: (ముసిముసిగా నవ్వుతూ) ఏం బావా? ఏమంటావ్?

రామా: నాదేముంది బాబూ! అల్లుడూ మామా యిష్టపడితే, నా అభ్యంతరమేముంటుంది?

నారా: వాడిమొఖం వాడిదేముంది! మన మేంచేస్తే వాడు కాదంటాడ గనక? అయినా శారద వాడికేంపరాయిదిగాదుగా! చిన్నప్పట్నుంచీ...

రామా: అలాగనకోయ్ నారాయణయ్యా! కాలం మారిపోయింది. ఈమధ్య నాకూ అదే అనిపించింది. "ఆడదిక్కులేని ఇల్లు అడవితో సమానమంటారు" పిల్లవాడికి త్వరగా పెళ్ళిచేసి కోడల్ని ఇంటికి తెచ్చుకుందామని.

నారా: (విచారంగా) అవునుబావా! మా చెల్లెలుండగా ఇల్లెంత కలకలలాడుతుండేది! అందుకనే...

రామా: మరి చెప్పేది పూర్తిగా విను. ఆమాటే వాడితో అంటే "చదువు పూర్తయ్యేవరకూ, అలాంటి పిచ్చి ఆలోచనలేవి చెయ్యవద్దని" తెగేసి చెప్పాడు.

నారా: చదువు ఈ ఏటితో ఆఖరేగా? చూడుబావా! నువ్వు నీకొడుక్కి నిదానంగా నచ్చచెప్పుకుంటావో నాకెందుగ్గాని, ఈ సంవత్సరం ఆ కొస్త శుభం జరిపించక తప్పదు!

రామా: నేనూ అదే ఆలోచిస్తున్నాను. ఆ తర్వాత మాట్లాడుకుందాం. నాక్కొంచెం పనుంది. నేవలా వెళ్ళొస్తాగాని, నువ్విలోగా స్నానపానాదులు ముగించుకో. (బిగ్గరగా) ఒరేయ్ ఏసుకొండలూ!

ఏసు: నేనిక్కడే వుండాను బాబూ! (నారాయణయ్యతో) నీల్లు తోడమంటారా బాబూ?

నారా: ఊఁ.

(ఏసుకొండలు లోనికెళతాడు. రామానుజయ్య ఉత్తరీయం భుజానవేసుకొని, చుట్టముట్టించి చెప్పులు తొడుక్కొని బయటకెళ్ళిపోతాడు.)

నాంచా: (వచ్చి) ఎప్పుడొచ్చావు నారాయణయ్య బావా?

నారా: (చిరునవ్వుతో) ఓ నువ్వా! నాంచారమ్మొదినా! ఎప్పుడు రాక?

నాంచా: నీకంటే రెండడుగులు ముందుగా వచ్చాను. అంతా బాగున్నారా?

నారా: ఆహా! పొలంపనులయ్యాయా నాంచారమ్మొదినా?

నాంచా: జనుము యింకా కొయ్యలేదు బావా! మీ అన్నయ్యకు నిముషం తీరటంలేదంటే నమ్ము!

నారా: మరి పనిరోజుల్లో వచ్చావు విశేషమేమిటి?

నాంచా: విశేషాలేముంటాయి! మాఅన్నయ్యను ఒకసారి చూచిపోదామని వచ్చాను. ఏం రాగూడదా?

నారా: ఆఁ ఆఁ ఎంతమాట! అన్నా, చెల్లెలు రాకుండా ఎలా? సరేగాని పిల్ల పెళ్ళీడుకొచ్చిందిగా! ఈ సంవత్సరమన్నా చేస్తున్నా రన్నయ్యా?

నాంచా: భగవంతుడు చల్లగా చూస్తే చేద్దామనే అనుకొంటున్నాము. మరి మీ శారదపెళ్ళి ఈ సంవత్సరం చేస్తావు నారాయణబావా?

నారా: మన చేతుల్లో ఏముంది? ఆరోజు రావద్దూ?

నాంచా: నీకేంలే ఉన్నమహారాజువి! ఎలాగైనా చెయ్యొచ్చు.

నారా: మీరేనా లేనివాళ్ళు?

ఏసు: (వచ్చి) మీకు నీల్లుతోడాను బాబుగారూ!

నాంచా: లేబావా స్నానం చెయ్యి. ప్రొద్దెక్కిoది.
(నారాయణయ్య లోనికెళుతూంటాడు. నాంచారమ్మ అతనివంక చూచి మూతి త్రిప్పుతుంది.)

నాంచా: (నెమ్మదిగా) ఒరేయ్ ఏడుకొండలూ.

ఏసు: అమ్మా!

నాంచా: నేను అన్నయ్యతో పెళ్ళివిషయం మాట్లాడడానికొచ్చినట్లు ఈయనకు తెలియనియ్యకు.

ఏసు: అందుకేనేం టప్పగోరూ మీరొచ్చింది?

నాంచా: ఉష్! నిమ్మళంగా మాట్లాడు వింటాడు. అందుకేలేరా!

ఏసు: సరేలెండమ్మా.

నాంచా: వట్టి తంపులమారి మనిషి! మా అన్నయ్య మనసిరిచేస్తాడుసుమా!

ఏసు: సిత్తం.

నాంచా: ఎలాగయినా తనకూతుర్ని మా సత్తిగాడి మెడకు తగిలించాలని చూస్తున్నాడు.

ఏసు: అవునండీ! వచ్చీరాంగానె అయ్యగారితో ఆ రాసకారవే మాటాడ్డారు.

నాంచా: (ఆదుర్దాగా) మాట్లాడాడూ? అన్నయ్యేమన్నాడు?

ఏసు: నాను సరిగా ఇనలేదుగావండి; మొత్తానికయ్యగారు సరిగా సమాధానం సెప్పినట్టులేరండి.

నాంచా: హమ్మయ్య! ఒరేయ్ ఏడుకొండలూ!

ఏసు: అమ్మా!

నాంచా: ఎవరెంత తన్నుకుచస్తేమాత్రం, నా అన్నన్ను కాదంటాడ్రా?

ఏసు: ఎట్టాగంటారండి!

నాంచా: ఆయనెంత బావమరిదయితే మాత్రం... అయినా ఇంకేం బావమరిదిలే! మా వదినతో నే పోయింది వాళ్ళకూ మాకూ చుట్టరికం! ఏమంటావు?

ఏసు: (అయిష్టతగా) సిత్తం.

నాంచా: సరేగాని, బయట సంబంధాలేమయినా వస్తున్నాయా?

ఏసు: అయ్యో! రాకపోటం వేంటండీ? వకటా రొండా! వొందలు! వొచ్చేపొయ్యేవోల్లకి తెంపులేదంటే నమ్మండి!

నాంచా: మరి మా అన్నయ్యేమంటున్నాడు?

ఏసు: ఉలక్కుండా పలక్కుండా అట్టానే వుండారు.

నాంచా: చూడు ఏడుకొండలూ! డబ్బున్నదంటే ఎవరికయినా ఆశ కలగొచ్చు. అందుకనే, ఏ నిముషానెలావుంటుందో, ఆ కాస్తమాట అనిపించుకొని వెళదామని వచ్చాను. ఏమంటావ్?

ఏసు: సిత్తం. మా సెడ్డ మంచాలోసనండీ.

నాంచా: మనమ్మాయిని చూచావుగా నువ్వు? ఎలా వుంటుందంటావు.

ఏసు: బుల్లెమ్మగోరికేంవండీ? చినిమాటారులాగుంటారు!

నాంచా: మా సత్తిగాడికి తగిందేనంటావా?

ఏసు: ఎంతమాట! సూడముచ్చటెయ్యరండీ జంట!

నాంచా: ఒరేయ్ ఏడుకొండలూ! నువ్వుకూడా మా అన్నయ్యకు నచ్చజెప్పాలిసుమా!

ఏసు: అంతకంటేనా అప్పన్నగోరూ!

నాంచా: మా చెట్టునకాసిన జాంపళ్లు తెచ్చాను. నాలుక్కాయలిస్తాగాని తీసుకెళ్ళి పిల్లలకు పెట్టుకో.

ఏసు: సిత్తం.

నాంచా: సరే, లోపలకెళదాం నడువ్. నారాయణయ్యకు నైవేద్యం పెట్టాలిగా మరి!

ఏసు: సిత్తం. తప్పేదేంవుంటుండీ.

(ఇద్దరూ లోనికెడుతూంటారు. రామానుజయ్య హడావుడిగా బయటనుండి వస్తాడు.)

రామా: (బిగ్గరగా) ఒరేయ్ ఏడుకొండలూ!

ఏసు: నే నిక్కడే వుండాను బాబూ!

రామా: బండొచ్చేటయమయ్యింది. వాళ్ళొస్తార్రా!

ఏసు: ఓరు బాబూ?

రామా: రెడ్డొచ్చి మొదలాడన్నట్లుంది! ప్రొద్దుట్నుండీ చెప్పిందేమిట్రా?

ఏసు: గెపితిలేదు బాబూ!

రామా: ఎందుకుంటుంది; వళ్లు క్రొవ్వితేసరి! మాధయ్యగారొస్తారని చెప్పలేదట్రా?

ఏడు: సిత్తం. మరిసిపోయానండి.

రామా: ఏడవలేకపోయ్యావ్.

వాంచా: మాధవయ్యగారెవరన్నయ్యా?

రామా: (తడబడుతూ) ఆయనా...ఆయన...ఆయ నొక స్నేహితుడులే (ఏడు కొండలుతో) ఒరేయ్! ఆ మంచముదీ లోపపెట్టి, రెండు కుర్చీలు అవీ తెచ్చివెయ్యి. ఆఁ, చూడు వాంచారమ్మా! కాస్త ఇల్లు వాకిలీ శుభ్రంగా తుడిపించమ్మా. నేను స్టేషనుదగర కెదుతున్నాను. (ఆదుర్దాగా వెళ్లిపోతాడు.)

వాంచా: (అర్థంగాని మొహంపెట్టి అలాగే నిలబడి వుంటుంది.

ఏడు: (కుర్చీలు తెచ్చి సర్దుతూంటాడు.)

వాంచా: ఒరేయ్ ఏడుకొండలూ! ఈ మాధవయ్య దేము డెవ్రరా?

ఏడు: మీకు తెలవదేంటప్పమ్మగోరూ? మాధవయ్య గోరంటే మా పెద్ద మోతుబరిలే! ఏడు తాలూకాల కెనురులేదు. నచ్చులకి నచ్చులు మూలుగుతున్నయంట.

(హడావుడిగా అంతా సర్దుతూంటాడు.)

వాంచా: (అనుమానంగా) అయితే ఇంతకీ ఆయనెందుకొస్తున్నాడు?

ఏడు: మీకు తెలవదేంటండీ! ఆయనండి పిల్లలతండ్రి గారుండీ!

వాంచా: (విసుగా) సరీగాచెప్పి చావరా?

ఏడు: ఇంకా సెప్పేదేముందప్పమ్మగోరూ! సమందం కాయం సేసుకోటాని కొత్తుండారు.

వాంచా: ఆఁ!

ఏడు: అవునుండీ. మన సత్తెం బాబుగోరి కాయన కూతుర్నిత్తారంట.

వాంచా: నిజంగా నేనా ఏడుకొండలూ (ఆదుర్దాగా).

ఏడు: ఒట్టు! మీతోడు అప్పమ్మగోరూ!

నారా: (లోపలనుండి వస్తూ) ఏమిట్రా ఏడుకొండలూ హడావుడి?

ఏడు: ఇయ్యాలో రొత్తున్నారుబాబూ!

నారా: ఇయ్యాలవారెవరు?

ఏడు: మనసత్తెమయ్యగోరికి కాబోయ్యే మామగోరుండీ. మాదవయ్యగోరని, మా పెద్ద మోతుబరిలే! ఆఁ.

నారా: ఆఁ! ఏమిట్రా నువ్వు చెప్పేది నిజమేనా?

ఏడు: అవునుబాబో. ఇప్పుడేవత్తారు సూద్దురుగా.

వాంచా: (దుఃఖస్వరంతో) చూశావా నారాయణయ్య బావా? మా అన్నయ్య నాకెంత ద్రోహం చేస్తున్నాడో!

నారా: నేనెవరికి చెప్పుకోను వాంచారమ్మొదినా? (కుర్చీలో కూలబడతాడు.)

ఏడు: (నవ్వుతూ) చకల్లకోకల్లు చెప్పుకోండి.

నారా: ఛ! నోర్ముయ్ వెధవగాడిదా! కొంపలు మునిగి మేమేడుస్తుంటే నీకు నవ్వులాటగావుందే!

ఏడు: సిత్తం. (లోనికెడతాడు)

వాంచా: చూడు నారాయణయ్య బావా.

నారా: ఏమిటి వాంచారమ్మొదినా?

వాంచా: సత్తిగాడు నాకా స్వయాన అన్న కొడుకు.

నారా: నాకు స్వయాన చెల్లెలి కొడుకు.

వాంచా: అవునా? మరివాడు నాకయినా అల్లుడు కావాలి; లేదా...

నారా: నాకయినా అల్లుడు కావాలి!

వాంచా: అంతేగాని పరాయికి పోవటం బాగుంటుందంటావా?

నారా: ఏ గాడిదంటాడు? అన్నవాణ్ని చెప్పు తీసుకొట్టాలి.

వాంచా: మరి మా అన్నయ్య ధోరణిచూస్తే యిలా వుంది.

నారా: ధోరణేముందిలే! వేలకు వేలు కట్నాలొస్తుంటే...

వాంచా: అందుకని అయినవాళ్ళని వదులుకొంటాడా?

నారా: ఆ మాట మీ అన్నయ్యనే అడుగు!

వాంచా: అడక్క నాకేం భయమా? నిలేసి మరీ అడుగుతాను.

నారా: అలాగన్నావ్ బాగుంది. కావాలంటే నేను కూడా నీకు తోడు నిలబడతాను.

వాంచా: నీకు చెప్పొచ్చేది అదే.

నారా: ఏదీ?

నాంచా : ఇప్పుడు మన మిద్దరం ఒక్క మాట మీద నిలబడి, ఆవచ్చే మాధవయ్యగారితో అన్నయ్య వియ్యమందకుండా చూడాలి.

నారా : ఓ! తప్పకుండా. గట్టిగా నిలబడి అడుగుదాం. అడుగుదా మేమిటి, పోట్లాడుదాం.

నాంచా : అలా జేస్తే తర్వాత మన విషయం...

నారా : ఆఁ, దానికే మొచ్చేలే! నీ పిల్లయితే వకటి వా పిల్లయితే వకటీనా నాంచారమ్మొదినా?

నాంచా : నీ కడుపు చల్లగా నూరేళ్ళు బ్రతుకు నారాయణయ్య బావా!

నారా : సరేగాని, నాంచారమ్మొదినా! నా కడుపులో దేముడు గోలపెడుతున్నాడు. అన్నగత ప్రాణిని మరి!

నాంచా : అయ్యో! నా మతిమండిపోను. వెధవ సోదిలోపడి ఆ మాటే మరిచిపోయాను. పదపద. (ఇద్దరూ లోనికి వెడతారు. కొంచెమాగి బయట నుండి రామానుజయ్య, ఆయన వెనుక నే పేరయ్య వస్తారు. పేరయ్య వేషం చెప్పులు, చంకలో చింకి గొడుగు, చేతిలో సంచీ, చింకి కోటు, కొద్దిగా మాసినగడ్డం.)

రామా: రాండి. రండి. ఇలా కూర్చోండి.

పేర : (కుర్చీ మీద కూర్చుంటాడు. ఏడు కొండలు లోపలనుండి వస్తాడు.)

రామా: (బిగ్గరగా) ఒరేయ్ ఏడుకొండలూ!

ఏడు : నేనిక్కడే వుండానుబాబూ!

రామా: ఆ సంచీ అదీ లోపల పెట్టు.

ఏడు : సిత్తం. (పేరయ్యవంక చూచి) దండాలు మాధవయ్య గోరూ!

పేర : (వెకిలిగా నవ్వుతూ) నేను మాధవయ్యగారికి స్వయాన బావమరిదిని. నా పేరు పేరయ్యంటారు.

ఏడు : అట్టాగా? చమించండి బాబూ! మా అయ్యగోరు మాధవయ్యగారొత్తారంటేను...

పేర : అవును. వారు రాత్రిబండిలో తప్పక రాగలరు

ఏడు : సిత్తం.

రామా: నువ్వెళ్ళి పేరయ్యగారికి వేడినీళ్ళు తోడరా ఏడుకొండలూ! (లోనికి వెడుతాడు)

ఏడు : సిత్తం (వెళ్లిపోతుంటాడు)

పేర : ఇదుగో కొండలూ! (నెమ్మదిగా పిలుస్తాడు.)

ఏడు : నాపేరు ఏడుకొండలండీ!

పేర : ఆఁ అదే అదే. నాకు సరిగా గుర్తులేదులే, యేమీ అనుకోకు.

ఏడు : పరవాలేదు లెగండి.

పేర : ఇదుగో అబ్బాయ్! మాట. (ఒళ్ళు గోక్కుంటూ ఉంటాడు)

ఏడు : అయ్యా.

పేర : ఇలా దగ్గరగా రా.

ఏడు : (దగ్గరగా వెళతాడు)

పేర : నీళ్ళు కొంచెం వేడి జాస్తిగా వుండాలి సుమా! (నెమ్మదిగా చెబుతాడు)

ఏడు : హీ హీ తావరగా నుండేంటి పేరయ్యగోరూ!

పేర : హుష్! బిగ్గరగా అనకోయి బాబూ! నువ్వేనో మంచివాడివని చెప్పుకొంటే...

ఏడు: పరవాలేదు లెగండీ. (సంచీ తీసుకొని వెడుతాడు)

రామా : (లోపలనుండి పొగాకుతో వస్తాడు.) చుట్ట కాలుస్తారా?

పేర : వకప్పుడు కాల్చేవాళ్ళలో వాడి నేలెండి (జేబులోనుండి పొడుం డబ్బి తీసి) ప్రస్తుతం ఈ సంఘంలో సభ్యుడినయ్యాను. (పట్టు పీలుస్తాడు)

రామా: మాధవయ్య బావగారుకూడా ఈ బండిలో నే వసారనుకొన్నాను. (చుట ముట్టిస్తాడు)

పేర : తప్పక వచ్చివుండే వారేనండి. అనుకోకుండా రాత్రి మంత్రిగారు దయచేశారు ఎలక్షన్‌సీజన్ గదండీ! వారిని సాగనంపే వరకూ వుండాలిగా మరి?

రామా: అయ్యో కాదు మరి! పెద్దవారితో పనయ్యే. రాత్రికయినా తప్పక వస్తారంటారా?

పేర : మా మాధవయ్య బావ మాట తప్పటం, అటు సూర్యుడటు పొడిచే నే!

రామా : చిత్తం చూడండి పేరయ్యగారూ!

పేర : అయ్యా!

రామా : మా అబ్బాయినిగురించి నే చెప్పుకోవటం అంతగా బాగుండదనుకోండి—

పేర : ఫర్వాలేదు; సెలవివ్వండి.

రామా : నిజంగా మావాడు బుద్ధికి బృహస్పతి అంటే నమ్మండి.

పేర : చిత్తం ఊరు గొప్ప గోడలే చెబుతాయిగదండి!

రామా : ఇక అందం విషయంలో......ఆ విషయం నేను చెప్పనలవలేదు. రండి కావాలంటే అబ్బాయిఫోటో ఇక్కడేవుంది.

పేర : అక్కర్లేదు కూడా. మిమ్మల్ని చూస్తే అబ్బాయి రూపం నాకళ్లల్లో మెదులుతోంది సుమండి! ఆ బంగారు ఛాయ, ఆ విశాలమయిన నుదురు, చెంపకు చారడేసి కళ్ళు ఆ ఒడ్డు పొడుగూ ఒహో!

రామా : (పొంగిపోయి) చూచినట్లుగానే వర్ణించారు.

పేర : మరేమి టనుకొన్నారు మన బుర్రంటే! కర్మ గాలి ఈరోజు నీ స్థితి కొచ్చానుగాని. చిన్నప్పుడు మా తాతగారంటుండే వాడు— "ఒరే పేరినీడూ! నీ తెలివి తేటలముందురాజాజీ కూడా పనికిరాడురా! నీరాతబాగుంటే, స్వతంత్ర మొచ్చిన తర్వాత నువ్వ తప్పక మంత్రి వయితీరతావురా" అని.

రామా : అవును. అంతటి అర్హులు గాకపోలేదు.

పేర : అదృష్టరేఖ మనచేతిలోనుండి తొలగిపోయి యిలా ఏడుస్తున్నాను.

రామా : ఇప్పుడు మాత్రం తమ కొచ్చిన లోటేమిటి లెండి.

పేర : సరే, అవన్నీ తరువాత ముచ్చటించుకొందాం. (పొడుం పట్టుపీల్చి) ఇక అసలు విషయానికి వద్దాం. రామానుజయ్యగారూ! మన స్థిర చరాస్తుల భోగట్టా కొంచెం యిస్తారా?

రామా : తప్పకుండా. నవరత్న ఖచితమయిన సుక్షేత్రం వకనలభై ఎకరా లుందండి.

పేర : అయ్యా!

రామా : పోతే రెండెకరాలుమామిడితోట, ఈ ఇల్లు..

పేర : ఊఁ సెలవివ్వండి (బుర్రాడిస్తాడు.)

రామా : ఏదో తమ దయవల్ల కొద్దో గొప్పో నిలవ లోనే వున్నామనుకోండి.

పేర : సంతోషం.

రామా : క్రిందటి సంవత్సరం సరిగ్గా ఈరోజుల్లోనే మా ఇంటావిడ దేహం చాలించింది.

పేర : విచార కరమయిన విషయం.

రామా : అందుచేత వాడినొక ఇంటివాడిని చేస్తే భారం తీరిపోతుంది. ఆ తర్వాత రామాకృష్ణ అనుకొంటూ పోయిగా......

పేర : కాదుమరి!

రామా: చూడండి పేరయ్యగారూ!

పేర : చిన్నవాణ్ని. తమ్ముడూ అని పిలిచినా యిబ్బందిలేదు.

రామా: ఏదో లోకాచారా న్ననుసరించే గాని, కట్నాలు కానుకలు విషయంలో నాకంతగా పట్టింపులేదు సుమండీ.

పేర : చిత్తం.

రామా: డబ్బు శాశ్వతమా చెప్పండి? గుణగణాలు, సాంప్రదాయాలు ముఖ్యం గాని.

పేర : ఎలాగయినా తెలిసినవారు.

రామా: ఈమధ్య మరీ వచ్చేపొయ్యే సంబంధాలకు తెంపులేకుండా వుంది సుమండీ! నలభై వేలిస్తామని, యాభై వేలిస్తామనీ ...... డబ్బొస్తోంది గదా అని అడ్డమయినవాళ్ళతో చేయి కలుపుతామా!

పేర : ఛాఛా! అందులోనూ తమరా?

రామా: మాధవయ్యగారి మంచి చెడ్డలు విన్న తర్వాత నాకు, అసలు వేరే సంబంధం వేపుకు మనసు పోవటం లేదు.

పేర : చిత్తం.

రామా: చూడండి తమ్ముడుగారూ! మనలోమాట...

పేర : నిరభ్యంతరంగా సెలవివ్వండి.

రామా: ఇలా అడుగుతున్నందుకు మరోవిధంగా అనుకోకు—

పేర : వ్యవహారం నిర్మొహమాటంగా వుండాలనే వాళ్ళ జాబితాలో నేను ప్రథముణ్ణి.

# పిట్టపోరు

రామా: అఁ, మనబావగారు...ఎంతవరకూ తూగగలరంటారు?

పేర : మీ అంకె చెప్పండి?

రామా: వారి ఉద్దేశ్యం తెలియాలిగా?

పేర : చూడండి అన్నయ్యగారూ! ఇదంతా మోజును బట్టి వుంటుందిగాని ఈ పెళ్ళిళ్ళ మార్కెట్టులో ధరలకు పరిమితేమిటి?

రామా: బాగా అన్నారు.

పేర : మీ హోదా ననుసరించి, మీకు చిన్నతనం లేకుండా, మీరు తృప్తిపడేలా మా బావతో పలికించేవాణ్ణి నేనున్నానుగా! నన్ను కాస్త కనిపెట్టి వుండాలిగాని...

రామా: అలాగన్నారు బాగుంది. ఇక నే నేం మాట్లాడను.

పేర : ఇప్పుడు చెప్పండి మీ ఉద్దేశ్యం?

రామా: ఏమయినా ఒక ముప్ఫయివరకూ...

పేర : ఖాయం.

రామా: ఏమిటి? (పొంగిపోతాడు.)

పేర : ముప్ఫయికి చిల్లిగవ్వ తక్కువగాకుండా పలికించటం ఖాయం! మరి నామాట...(నసుగుతాడు.)

రామా: (సంతోషంగా) ఫర్వాలేదు. అడగండి.

పేర : పెద్దలు! తమరే సెలవివ్వటం బాగుంటుంది.

రామా: (చిరునవ్వుతో) ఒకటి! సరా?

పేర : పిల్లలు గలవాణ్ణి.

రామా: నేనయినా చిన్నచూపు చూడలేదుగా?

పేర : అబ్బే ఎంతమాట! కాని......ఇంకొక అర కోరదామనుకొన్నాను.

రామా: సరే. అలాగే.

పేర : (సంతోషంగా పొడుంపీల్చి) ఇంకెందుకు లగ్నం నిశ్చయించుకోవటమే తరవాయి...... హాచ్చి (తుమ్ముతాడు.) కాని ఒక్కమాట.

రామా: చెప్పండి.

పేర : వ్యవహారమంతా సవ్యంగా నేను నడుపుకొస్తాను. మీరుమాత్రం తొందరపడకండి.

రామా: (నవ్వుతూ) తొందరా? అది మన ఇంట్లో వున్న ఏడుకొండలకూడా లేదే!

పేర : చిత్తం.

రామా: నాకు జపంచేసుకొనే అలవాటొకటుంది. మీరు కొంచెం విశ్రాంతి తీసుకోండి: ఒరేయ్ ఏడుకొండలూ! (అరుచుకొంటూ లోనికెళ్తాడు).

నారా: (నెమ్మదిగావచ్చి) నమస్కారమండీ

పేర : నమస్తే. తమరు......

నారా: రామానుజయ్య నాయుడిగారికి స్వయానా బావమరిదిని లెండి...మాచెల్లెలనే వారికిచ్చాం.

పేర : సంతోషం.

నారా: చూడండి. మీ పేరేమిటో నాకు తెలియదుగాని-

పేర : నాపేరు పేరయ్యంటారు.

నారా: ఇదుగో పేరయ్యగారూ! మీకు తెనాలికి బండెన్నింటికి?

పేర : నాలుగింటికి కనుకొంటాను. ఏం? మీరా బండికి వెడతారా?

నారా: నాకా గ్రహచారం పట్టలేదుగాని, మీరు వెంటనే ఫోంచేసి బయలుదేరితే బాగుంటుంది.

పేర : (తెల్లబోయి) అంటే......

నారా: మీరిక్కడనుంచి వెంటనే వెళ్ళిపోవాలి.

పేర : హీ హీ! సరసమాడుతున్నారా? (వెకిలిగా నవ్వుతాడు.)

నారా: (తీవ్రంగా) నిజంగానే అంటున్నాను.

పేర : అవుళ్లెండి. మనిద్దరం వరసకు బావమరదుల మవుతాం. అనండి అనండి ఫర్వాలేదు. (నవ్వుతాడు.)

నారా: (స్థాయిపెంచి) పేరయ్యగారూ! పరిహాసం కాదు.

పేర : (తగ్గి) చిత్తం. నాకేం అర్థంగావటం లేదు.

నారా: లేకపోతే, పిల్లడికి మేనరికముండగా, తగుదునంటూ పిల్లనివ్వటానికొచ్చారా?

పేర : (అర్థంగానట్లు చూస్తుంటాడు.)

నారా : ఏం అర్థంగాలా? విపులంగా చెబుతా వినండి నేను పిల్లవాడికి మేనమామని. నాదగ్గర పెళ్ళికొచ్చిన పిల్లవుంది. మా అమ్మాయి పుట్టిందగ్గర్నుండీ, మా సత్యానికనే పేరుపెట్టాం.

ఇప్పుడు మా బావ డబ్బుకోసం గడ్డితిని, మీమీ సంబంధాలు చూసున్నాడు దీనికి పిల్లవాడి ఆమోదముద్ర ఏమాత్రం లేదు. వాడెప్పటికీ నా అల్లుడే! కాన మహాశయా, మీరు వచ్చిన దారినే దయచెయ్యండని చెబుతున్నాను.

పేర : మరి...... (ఏదో చెప్పబోతాడు)

నారా : (సీరియస్‌గా) మరీ లేదు గిరీ లేదు. వచ్చినందుకు సుష్టుగా భోంచేసి బండెక్కండి. లేదా... (పళ్లు బిగించి పిడికిలి చూపుతాడు.)

పేర : (వణుకుతూ) అలాగేనండి.

నారా : లోనికి రెండడుగులు వేసి, వెనక్కు తిరిగి) పేరయ్యగారూ!

పేర : అయ్యా!

నారా : మీరు భోంచేసేసరికి జట్కా వచ్చి వాకిట్లో వుంటుంది. మీరు మా బావతో ఈ గొడవేమీ చెప్పకుండా...... ఏం తెలిసిందా? (గద్దిస్తాడు)

పేర : చిత్తం. విపులంగానే చెబుతున్నారుగా! తప్పకుండా ఎక్కుతాను.

నారా : (దగ్గరగా వచ్చి) మా బావతో ఈ విషయం చెప్పారో... మీకు మరి తెనాలిజేరే ఆశ వుండదు.

పేర : (భయపడుతూ) చి. చిత్తం. అంతవరకూ అక్కర్లేదులెండి. (లోపలనుండి నాంచారమ్మ కంఠం వినిపిస్తుంది.)

నాంచా : అదీ చూస్తా. నా కంఠంలో ఊపిరుండగా ఆ ఇచ్చేవాడెలా యిస్తాడో; చేసుకొనేవాడెలా చేసుకొంటాడో.

రామా : (లోపలనుండి) ఇదుగో నాంచారమ్మతల్లీ! నీకు పుణ్యముంటుంది గాని, పరాయి పెద్దమనిషి ముందు నా పరువు తీయబోకు.

నాంచా : (బిగ్గరగా) ఎవరుంటే నాకేం భయమా? ఆ పెద్దమనిషినే అడుగుతాను; ఇది న్యాయమే నేమో?

పేర : (నారాయణయ్య వంక చూచి, ఆ గొడవేమిటన్నట్లు సైగజేస్తాడు.

నారా : పిల్లవాడి మేనత్త. ముందు నిన్ను సాగనంపితే తర్వాత ఆ విషయం చూచుకొంటాను. మీరు మాత్రం ప్రయాణసన్నాహంలో వుండండి. (బయటకు వెళ్ళిపోతాడు.)

పేర : హమ్మయ్య! (కుర్చీలో చతికిలబడతాడు)

నాంచా : (మెరుపులా వచ్చి) ఇదుగో ఏమయ్యా పెద్దమనిషీ! నువ్వేం ఆడపిల్లల్ని కనుక్కోలా? నీ పిల్లలాంటిదిగాదూ నా పిల్లమాత్రం? నీకేమయినా జ్ఞానముంటే, మేనరిక ముండగా పిల్లనిస్తారని వచ్చావా?

పేర : (ఇంతసేపూ హడలిపోతుంటాడు. కొంచెం తేరుకొని) ఇదుగో తల్లీ! భవానీదేవి!

నాంచా : నా పేరు నాంచారమ్మ.

పేర : ఏ అనాచారమ్మవయితే నాకేంగాని, మీ గొడవలేమీ నాకు తెలియవు. నా బుద్ధి గడ్డితిని ఇక్కడకు వచ్చాను. వచ్చినందుకు బాగా శాస్తి జరిగింది. దయచేసి ఇన్నేమీ అనకండి తల్లీ! నేనిప్పుడే వెళ్ళిపోతున్నాను.

నాంచా : వుంటానంటేమాత్రం వుండనిచ్చేదెవరే! (లోపలకు చూస్తూ) ఒరేయ్ ఏసుకొండలూ!

ఏసు : (లోపల్నుండి) ఓయ్ వత్తున్నా. (వచ్చి) ఏంటప్పమ్మగోరూ?

నాంచా : లోపల పేరయ్యగారి సంచీ వుందిగావాలు. తెచ్చి వారికివ్వు.

ఏసు : దిరీసు మాగుసుకుంటార బాబూ?

నాంచా : ఏదోవకటితగలడతార్లే, నీకెందుకు; తెచ్చివ్వు

ఏసు : (పేరయ్యతో) ముందు తానం సెయ్యండీ.

పేర : (ఏదో చెప్పబోతాడు. కాని, నాంచారమ్మ వంక చూచి ఆగిపోతాడు.)

నాంచా : తెచ్చివ్వరా అంటుంటే...(గదమాయిస్తుంది)

ఏసు : సిత్తెం. (అనుమానంగా లోనికెడతాడు.)

పేర : (గొంతు సవరించుకొని) ఇదుగో కనకదుర్గమ్మగారూ!

నాంచా : నా పేరు నాంచారమ్మయ్యా బాబూ!

పేర : ఏదయితేంలెండి. కాని ఒక్కమాట.

నాంచా : ఏమిటది?

పేర : నేను వెళ్ళిపోవటం ఎలాగూ ఖాయమనుకోండి. కాని...

నాంచా : కాని?

పేర : పన్నెండు దాటుతోంది-ఇది మా స్టే పల్లెటూరు భోజన హోటళ్ళేమీ యిక్కడ వున్నట్లు లేదు-అందుచేత...

నాంచా : (తీవ్రంగా) అందుచేత ?

పేర : అహ ఏం లేదు...

నాంచా : ఇదుగో పేరయ్యగారూ ! ఈ తంతులన్నీ నాకు తెలుసుగాని, ఇలా దారిన బొయ్యే దానయ్యలందర్నీ మేపితే, రేపు నా కూతురు బొచ్చెపట్టుకు తిరగాల్సిందే ! ఆ పప్పులేం ఉడకవుగాని దయచెయ్యండి.

పేర : చిత్తం. భోజనాని కిబ్బందని...

నాంచా : మరేం ఫర్వాలేదు. ఒక్క పూటకేం పుట్టి మునగదులే. (ఏడుకొండలు సంచీతో వస్తాడు.)

నాంచా : (పేరయ్యతో) తీసుకోండి.

పేర : (తీసుకొని లోనికి చూస్తూంటాడు.)

నాంచా : ఒండికి టయమవుతోందంటే, ఇంకా అటు జూస్తా వేమయ్యా ?

ఏడు: ఏంటి పేరయ్యగోరూ ఎల్లిపోతారా?

నాంచా: నువ్వు నోరు మూసుకొని లోపలి కెళ్ళరా ఏడుకొండలూ.

ఏడు: సిత్తం. (లోనికెళతాడు.)

నాంచా: ఇక కదలవయ్యా దేముడా.

పేర : అహ. ఏం లేదు. నాయుడుగారితో చెప్పి పోదామని.

నాంచా: ఏమక్కర్లా. నే చెబుతాల్లే వెళ్ళు. ఆయన జపంమీదున్నాడు.

పేర : అలాగే (నెమ్మదిగా వెళుతూంటాడు)
(లోపలనుండి రామానుజయ్యగారు ఎదుర్దాగా వస్తాడు. ఆయన వెనకనే ఏడుకొండలు వస్తాడు.)

రామా: ఆఁ ఆఁ! అదేమిటండీ పేరయ్యగారూ! ఎక్కడికి?

పేర : (ఆగి) ఎక్కడికో వెళ్ళే గ్రహచారం నాకేం బట్టింది? నా ఇంటికె వెళుతున్నాను. (వెళ్ళిపోతాడు.)

రామా: (దగ్గరగా వెళ్ళి బతిమాలుతూ) మా అపరాధమేమయినా వుంటే మన్నించండి.

పేర : మీ తప్పేముంది బాబూ! ఈ ఇంటికి రావటం నాదే తప్పు. సెలవు. (వెళ్ళిపోతుంటాడు.)

రామా: (చెయ్యి పట్టుకొని) ఆగ్రహించకండి. విషయమేమిటో చెప్పండి. (నాంచారమ్మతో) ఏమిటమ్మాయ్ ఇదంతా? నువ్వేమైనా అన్నావా?

నాంచా: ఏమన్నా అనటమేం? వెళ్ళిపొమ్మన్నాను.

రామా: ఆఁ!

నాంచా: ఏం ఎందుకనను? నా కూతురు సుఖం చెడగొట్టటానికి తయారవలా ఈ పెద్దమనిషి?

రామా: (పట్టలేని కోపంతో) ఛా! నోర్ముయ్. నా ఇంటి కొచ్చిన పెద్దమనిషి నవమానిస్తావా? (పేరయ్యతో) పేరయ్యగారూ! మీకు కావలిసింది నేను. వ్యవహారమంతా నాది. ఎవరేమంటే మీ కెందుకు? మీరు వెళ్ళకండి.

పేర : ఇంత అవమానం జరిగిం తర్వాత......

రామా: అందుకు నన్ను క్షమించండి. (చేతులు పట్టుకొని) ఇవి చేతులుగావు.

పేర : ఆఁ ఆఁ! అంత మాటనకండి. పెద్దలు! అయినా కుర్రవాడికి మేనరికముండగా......

రామా: అవన్నీ మీ కెందుకు? నా ఇష్టమయి నేను పిలిచానుగా!

పేర: చిత్తం.

నాంచా: అయితే నువ్వు సత్తిగాడికి నా పిలను చేసుకోవట్టా అన్నయ్యా? నన్నింత మోసం జేస్తావా? (ఏడుస్తుంది.)

రామా: ఏమిటి మోసం? నీ పిల్లని చేసుకొంటానని ఎప్పుడయినా హామీ యిచ్చానా? పేరయ్యగారూ! మీరు లోనికెళ్ళి స్నానం చెయ్యండి. తీసుకెళ్ళరా ఏడుకొండలూ!

ఏడు : రాండిబాబూ! (పేరయ్య, ఏడుకొండలూ లోనికెడతారు.)

నాంచా : అయితే నువ్వు సత్తిగాడికి నాపిల్లని చేసుకోవన్లేటే గదురా అన్నయ్యా ?

రామా : నీ కిలాతో స్తే అలా గనుకో.

నాంచా : (దుఃఖస్వరంలో) అయితే ఈ నిముషానే, నీ వాకిట్లోనే, ఈ కాస్త ప్రాణం తీసేసుకొంటా. ఇంకా బ్రతుకెందుకు ?

నారా : (బయటనుండి వచ్చి) ఆఁ ఆఁ! అదేమిటే నాంచారమ్మొదినా; అలా దిగజారిపోతావేం చచ్చేం సాధిస్తావ్ ?

నాంచా : ఇంకా నే బ్రతికేందుకు నారాయణయ్య బావా ? నా అన్నకే నేను విషమయిపోయ్యాను ! (ఏడుస్తుంది.)

నారా : ఏమిటి విశేషం బావా ?

రామా : .........(మాట్లాడడు. కుర్చీలో కూర్చొని చుట్ట ముట్టిస్తాడు).

నారా : ఏం బావా మాట్లాడవు ?

రామా : ఏం మాట్లాడాలి ?

నారా : మీ చెల్లెలు గొడవేమిటా అని ?

రామా : గొడవేముంది ? నువ్వే చెప్పవోయ్ పెద్దమనిషివి. నా ఇంటికొచ్చిన పెద్దమనిషి నవమానించటం సబబేనా ?

నారా : ఎవర్ని ?

రామా : ఆ పేరయ్యగారు, నాతో సంబంధం స్థిర పర్చుకొంటానని కొచ్చారని, ఆయన్ని నానా మాటలు అని, ఇంటినుండి వెళ్ళిపొమ్మంటుందా? ఇదేమయినా సబబేనా !

నారా ఆదేమిటి నాంచారమ్మొదినా ! అంతతొందర పడితే యెలా ?

నాంచా : నువ్వూ అలాగే అంటావేం నారాయణయ్య బావా ? మనిద్దరం అనుకొన్నదేగా ?

రామా : ఏమిటి ? ఇందులో నీ పాత్రకూడా వుందా నారాయణ మూర్తి ! సరే ! చూస్తాను. మీరంతా తన్నుకుచచ్చినా సరే; నా కొడుక్కి మాధవయ్యగారి సంబంధమే ఖాయం.

నారా : కాస్త ఆలోచించి మాట్లాడుబావా ? అంతా నీ ఇష్టమే నేమిటి.

రామా : కాక ? మీ ఇష్టమా ? నాకొడుకు పెళ్ళికి...

నారా : అదే నీ కొడుకు ఒప్పుకోవద్దా అని.

రామా : నా కొడుకు నా మాట కాదంటాడా ?

నారా : సరే. అదీ చూస్తాను. పద నాంచారమ్మొదినా.

నాంచా : ఎక్కడికి ?

నారా : ఈయనతో మనకేమిటి ? అసలువాడు వాడినే అడుగుదాం. సత్తిగాడిదగ్గిరకే వెడదాం పద.

రామా : వెళ్ళండి. ఎక్కడికయినా వెళ్ళండి. ఎవరెలా చచ్చినా సరే! నా కొడుక్కి మాధవయ్యగారి సంబంధమే ఖాయం.

నారా : సరే నేనూ చూస్తాను. నువ్వెలా ఈ పెళ్ళి జేస్తావో ? (లోని కెళతాడు పేరయ్య. ఏడు కొండలు లోపలనుండి వస్తారు.)

రామా : ఇదుగో పేరయ్యగారూ !

పేర : బాబూ !

రామా : రాత్రి బండికి మాధవయ్య బావగారొస్తే సరే ! లేకపోతే రేపుదయమే మనం తెనాలి వెడదాం.

పేర : చిత్తం

రామా : అక్కడే వ్యవహారం పైసలు జేసుకొని, ముహూర్తం పెట్టిద్దాం. ఈ నెలలో పెళ్లి జరిగి తీరాలి.

పేర : అలాగే !

రామా : రామానుజయ్యనాయుడంటే అల్లాటప్పఅను కొంటున్నారు! నా కొడుకు పెళ్ళికి కూడా నా ఇష్టం కాదట! ఒరేయ్ ఏడుకొండలూ!

ఏడు : నా నిక్కడే వుండాను బాబూ!

రామా: పోస్టాఫీసుకెళ్ళి, ఒక కవరుతీసుకరా. వెంటనే రమ్మని అబ్బాయికి వుత్తరం రాయాలి. ఇంద. (చిల్లరతీసి యిస్తాడు) (ఏడుకొండలు వెళ్ళబో తుంటాడు)

ఒరేయ్ ఏడుకొండలూ!

ఏడు : అయ్యా!

రామా : వద్దులే రా. కవరయితే లేటవుతుంది. ఏకంగా వైరిద్దాం.

ఏడు : సిత్తం.

నారా : (లోపల నుండి సంచీతో వచ్చి) నేవెడుతున్నా నాంచారమ్మొదినా.

నాంచా : నేను మాత్రమిక్కడెందుకు? నేనూవస్తాను. వుండు కలిసే వెళదాం. (లోనికెళ్ళుతుంది)

రామా : వెళ్ళండి. నిక్షేపంగా వెళ్ళండి. నన్నేం బెదిరిస్తారా?

ఏడు : అదేందిబాబూ! సెల్లమ్మగోరు.....

రామా : ఏడుకొండలూ!

ఏడు : అయ్యా!

రామా : నువ్వు వోరయూసుకో కాస్సేపు.

ఏడు : సిత్తం.

పేర : కాని చూశారు అన్నయ్యగారూ!

రామా : ఏమిటది?

పేర : తొందరపడి అయిన వాళ్ళను......

రామా : మీకు తెలియదూరుకోండి పేరయ్యగారూ!

పేర : చిత్తం.

(వాంచారమ్మ ట్రంకుతో తిరిగి వస్తుంది.)

వాంచా : పద నారాయణయ్య బావా. తోడబుట్టిన దాన్ని ఉసూరుమనిపించి ఏం బావుకుంటాడో చూస్తాను.

ఏడు : భోజనం సెయ్యండి అప్పమ్మగారూ!

వాంచా : ఇంకా ఈ కొంపలో గంగ ముడతానట్రా!

రామా : మంచిది. (నారాయణయ్య, వాంచారమ్మ వెళ్ళబోతుంటారు. బయటనుంచి పోస్టుమేన్ కేక వినిపిస్తుంది.) నారాయణయ్య, వాంచారమ్మను ఆగమని సైగ జేస్తాడు.

రామా: వుత్తరమేదో వచ్చింది లాగుంది చూడరా.

ఏడు: (బయటకెళ్ళి కవరుతో తిరిగొస్తాడు) ఇదుగోండి.

రామా: (అందుకొని, పరిశీలించి) అబ్బాయే రాశాడు!

ఏడు: ఏం రాశారు బాబూ?

రామా: ఉండరా చదవందే!

(చింపి చూస్తాడు. ఒక ఉత్తరం, ఫోటో వుంటయ్. ఆదుర్దాగా ఉత్తరం చదివి) కొంప మునిగిందిరా ఏడుకొండలూ!

(బిగ్గరగా అరచి కూలబడతాడు.)

ఏడు: ఏంది బాబూ!

వాంచా: ఏమిట్రా అన్నయ్యా?

నారా: ఏం జరిగింది బావా?

పేర: ఏమిటండీ విశేషం? (అంతా ఆదుర్దాగా దగ్గర కొస్తారు)

రామా: ఏం చెప్పను నారాయణయ్యా! నీ అల్లుడు నాకొంప నిలువునా ముంచాడు.

నారా: ఏం జరిగింది బావా?

రామా: ఏం జరగకూడదో, అదే జరిగింది. యిటు చూడు. (లెటరందిస్తాడు.)

నారా: (అందుకొని లోలోపలే గబగబా చదివి) ఆరి పిడుగా! ఎంతపని జేశావురా!

వాంచా: ఏమిటి నారాయణయ్య బావా?

ఏడు: సైకి సదవండి బాబూ.

నారా: ఇంకా చదివే దేముందిరా ఏడుకొండలూ! మా సత్తెంబాబు ఒక కాలేజీ పిల్లని ప్రేమించి పెళ్ళి చేసుకొన్నాడట! ముందుగా చెపితే వాళ్ళ నాన్న వప్పుకోడని పెళ్ళయింతర్వాత వుత్తరం రాశాడు.

ఏడు: ఆఁ!

వాంచా: నిజంగానా నారాయణయ్య బావా?

నారా: నీమీద ఒట్టు. వాంచారమ్మొదినా ఇదుగో ఫోటో కూడా పంపాడు.

వాంచా: కొంప ముంచావు కదరా సత్తిగా! (ఘోల్లు మంటుంది.)

పేర: కాలమే మారిందిలెండి, ఈకాలంలో ఇలాంటివి సహజంగా జరిగిపోతూనే వున్నాయి.

ఏడు: మొత్తానికి పిట్టపోరూ పిట్టపోరూ పిల్లితీరిసింది లెండి బాబూ! [తెర]


## ఆర్ష రసాయనశాల

## ముక్త్యాల, (కృష్ణా)

(స్థాపితము 1925.)

ప్రశస్తాయుర్వేదౌషధముల నిలయము. ఏ మందు కావలసినను మాకు వ్రాయుడు. నమ్మకమైనవి లభింపగలవు.

ఆయుర్వేదభూషణ

వేటూరి శంకరశాస్త్రి,

ఎ. ఎం. ఏ. సి.,

Consulting Physician

# ఉపగూహనము

శ్రీ శివశంకరశాస్త్రి

## పూర్వార్థము

౧

ఎవరో యొక 'చోటుకాదు
ఇటీవలను జెప్పినట్టి
గాథ ననుసరించి యల్లు
కథన కావ్య మీ రచనము.

సత్యమైన, కాకున్నను
సంఘటనలు విన్నవారి
పెదవులపై దరహాసం
బుదయించుటయే తథ్యము.

సంఘటనం బాదియందు
సరసముగా సాగె, కాని
మధ్యమార్గమందు మిగుల
మందముగా నడచుచుండె.

వివిధగతుల రాగగాథ
విచిత్రముగ నొక్కనాడు
పరిణయోత్సవమ్ములోన
పరిసమాప్తి నొందెనంట!

౨

మంథెనాగ్రహారమందు
మహీసురుల వంశమందు
పుట్టినాడు యోగ్యుడైన
పురుషోత్తమశర్మాఖ్యుడు.

ఆంగ్లవిద్యతో పాటుగ
అధ్యయనము చేసినాడు
తండ్రికడనె కొంత కొంత
తైత్తిరీయసంహితలో.

వేదములో వర్ణితమౌ
వివిధదేవతాకృతులను
చిన్ననాటనుండి యతడు
చేయుచుండు మృత్తుతోడ.

పాఠశాలలోని విద్య
పరిసమాప్తి నొందె నంత
అవల నేమి చేయవలయు
నన్న చర్చ సాగజొచ్చె.

అంతలోన తండ్రి పోయె
అమ్మ చిన్ననాడె చనియె.
మిగిలె బంధువర్గమందు
మేనమామ యొక డతనికి.

మంథనలో పెంకుటిల్లు
మంచి పంటభూమియు గల
వతనికి, లేదేమాత్ర
మార్థికమ్ముగా లోపము.

అగ్రహారమందు కలరు
అయిదునూర్ల పట్టభద్రు
లందుచేత మేనమామ
ఆ చదువే చదువు మనియె.

అతడు పట్టభద్రుడైన
ఆత్మజాత నిచ్చి పెండ్లి
వైభవమ్ముతోడ జేయ
వచ్చు ననుచు మామకోర్కె.

3

మేనమామ కూతురైన
మీనాక్షీదేవి మీద

శర్మ కెపదలోన చెప్ప
శక్యముకానట్టి ప్రీతి.

అనుదినమ్ము వీక్షించెడి
యభ్యాసమువలన ప్రీతి
కలిసిపోయె మానసములు
క్రమముగా నుభయులకును.

చనవువలన నడుమనడుమ
చమత్కారవాక్కు లాడి
గూఢముగా ముద్దులాడు
కుమారి చెక్కిళ్ళ నతడు.

ఎదుగుగా నరుగుదెంచు
నేని మేనమామకూతు
రుల్లాసముతో నలతిగ
నుపగూహన మాచరించు.

పిన్నవారి రాగసరణి
పెద్దల కభిమతమె కాన
పరిణయమ్ము నిశ్చయ మని
భావించిరి బంధుజనులు.

ఆమె జనని వాంఛితంబు
ఆయేడే పెండ్లిచేయ
మేనల్లుని చదువు ముగియు
మీద చేయ తండ్రి తలపు.

౪

పంపినాడు మేనమామ
భాగ్యనగర కలాశాల
లోన జేరి చదువు మనుచు
మేనల్లుని మంచినాడు.

అచటి కలాశాలలందు
అలభ్యమైపోయె తావు
చిత్రకళాశాలలోన
చేరినాడు తుదకు శర్మ.

శక్తికొంత, ప్రీతికొంత
స్వతస్సిద్ధముగనె యుండు
కారణమున శిల్పకళను
కడువడిగా నేర్పు కలిగె.

అచటి యొజ్జలెల్ల సిద్ధ
హస్తులైనవార లగుట జేసి
సహాధ్యాయులైనవారు
శ్రద్ధధాను లగుటవలన—

చిత్రకళాశాలలోని
జీవిత మాతనికి మిగుల
ఉద్బోధక ముత్తేజక
ముల్లాస ప్రదము నయ్యె.

చలికాలపు సెలవులలో
స్వగ్రామము చేరువరకు
ఈ విద్యాభ్యాసచరిత
మెవ్వరికిని తెలుప డతడు.

నిజము తెలిసి మేనమామ
నివ్వెరపా టొంది యపుడు
కొంతవడికి తెప్పరిల్లి
కోపముతో ననియె నిట్లు:

"కులీనోర్వీ సుతుడ వీవు
కులాలుండ వయినావా!
భావికాలమందు రాతి
పనివాడవు కానుంటివ!

ఉన్న యెడల నీ తండ్రియె
ఒప్పునొకో దీనికి? నీ
విద్యావిషయములో నిక
విడిచినాను నా బాధ్యత!"

విరసవాక్యములకు శర్మ
విమనస్కుం డగుచు పోయి

గోదావరీతీరంబున
కొంతతడవు విశ్రమించె—

కాంచి శిథిల విగ్రహములు
గౌతమేశ్వరాలయమున
స్వామి దర్శనమ్ము చేసి
సదనమునకు జేరినాడు.

"ఇంత ప్రొద్దుపోవువరకు
ఎచట తిరిగినావు బావ?
అటులున్నా వెందుల?" కని
ఆదరముగ నడిగె కన్నె.

"మీ నాయన యే మనెనో
మీనా, విన్నావు కదా
చెప్పుము నీవైన నిజము,
శిల్పవిద్య దూష్యంబా?"—

అ మాటల కర్థోక్తినె
అనునయసుస్వరముతోడ
"తనకు నచ్చు కార్యము నే
తత్పరతం జేయదగును.

"నాన్నమాట కేమి కాని
నా ప్రతిమను చేయుదువా?
మిగుల ప్రీతి శిల్ప" మనుచు
మీనాక్షీదేవి పలికె.

బాలపలుకు నమాయికపు
భాషణముల తెప్పరిల్లి
చిరునగవున శర్మ యామె
చెక్కిళులను ముద్దాడెను.

౩

మేనమామ, మేనత్తయు
మీనాక్షీదేవి కూడ
వారించుచు నున్న వినక
స్వగ్రామము విడిచె నతడు.

నిజకళ పురుషోత్తముండు
నిష్ఠతోడ నభ్యాసము
చేయుచు నక్రమముగాను
సిద్ధహస్తు డగుచుండెను.

భారతీయ శిల్ప చరిత
పౌరాణికగాథావళి
పాశ్చాత్యకలాచరిత్ర
పఠియించుచునుండె నతడు.

చేతినిండ ధన ముండుట
చేత ప్రసిద్ధాలయములు
కళాక్షేత్ర దర్శనమ్ము
కావించును సెలవులలో.

చిత్రలోకవిహారణంబు
చేయు నతని కప్పుడపుడు
మీనాక్షీదేవి రూపు
మెలగుచుండు స్మృతిపథమున.

౪

అచట మంథెనాగ్రహార
మందు తల్లి తమ తనూజ
పరిణయోత్సవమ్ముగూర్చి
భర్తను త్వరపెట్టుచుండె.

"అన్వేషణ చేయుచున్న
ననుగుబిడ్డ పెండ్లికొరకు
యోగ్యుడైన వరుం డిచట
ఒకడు కూడ కానరాడు."

"మేనల్లుడు చెంతనుండ
మీనాక్షికి వేరే వరు
డెందులకో? మీ వాక్కులు
ఎప్పుడు చిత్రముగ నుండు!"

అనెడి భార్యభాషణముల
కడ్డు వచ్చి భర్త యనియె :

"బొమ్మలు చేసెడివానికి
పుత్రిక నెట్లీయగలను!"

"ఇదియా మీ సందేహం,
బింకేమో యనుకొంటిని.
పురుషోత్తమశర్మ కేమి
భూలోపమ, ధనలోపమ?

చేయవచ్చు సంపాదన
శిల్పకలామూలమ్మున
మంచిపేరు వచ్చు ననుచు
మన మీనాక్షమ్మ మతము."

ఇట్లు భార్య ప్రతివచనం
మ్మిచ్చినంత, యజమానుడు
ఏమి యనక శిరసు మాత్ర
మిట్టటు కదలించినాడు.

౨

పెట్టెలతో బుట్టలతో
పెద్దపెద్ద యట్టలతో
స్వగ్రామమునందు దిగుచు
స్వగృహమ్ము చేరె శర్మ.

పరిసమాప్తి చేసి విద్య
భాగ్యనగర కలాశాల
విడిచి వచ్చి మంథెనలో
విశ్రమింప దలచినాడు.

ఎనిమిదేండ్ల నారాయణ
ఎగురుచు నుల్లాసమునను
అమ్మ, బావ వచ్చినాడె
అనుచు తల్లితోడ జెప్పె.

"నాకు చేయితీరలేదు—
నారాయణ, మీనాక్షీ,
బావను పిలుచుకు రండని
పంపె జనని ప్రీతితోడ.

తెచ్చుకొన్న వస్తుచయము
తీర్చిదిద్ది, వారి వెంట
ప్రక్క వీథిలోని మామ
భవంతికిం జేరె శర్మ.

మేనత్తకు పట్టుచీర
మీనాక్షికి నారాయణ
కెన్నెన్నొ వస్తువులను
ఏర్పరించి యిచ్చినాడు.

కుశలాదిక మడుగు వెనుక,
గోదావరి కేగి వత్తు
అట్టె ప్రొద్దుపోవకుండ
నని పురుషోత్తము డరిగెను.

భోజనార్థ మతని బిలువ
బోయినపుడు రాత్రి కన్య,
"ఉండుండుము మీనాక్షీ,
ఒక్కదాని మరిచినాను"—

అని యతండు పేటి తెరచి
అందలి ముత్తెముల దండ
దీసి యామె కంఠంబున
వేసి యప్రయత్నముగా—

వెనుకకు రెండడుగు లేసి
వీక్షించుచు నామె మోము
చిరునగవున ముందు కరిగి
చెక్కిలి ముద్దాడినాడు.

"పెద్దదాన నయినా" నని
పిల్ల పలుక లజ్జతోడ,
ఉల్లాసముతో నతండు
ఉపగూహన మొనరించెను.

౩

అత్త భాగ్యనగరవార్త
లడిగి, పెరుగు వేయువేళ

ప్రస్తావన చేసి నతని
పరిణయప్రవృత్తిగూర్చి.

కొంచె మవల గదిలోపల
గూరుచున్న మీనాక్షీ
దేవి యాక్షణమ్ము నందు
తేరి చూచుచుండె నతని.

"ఇంక నేను స్వతంత్రముగ
నెచటనైన నుండవచ్చు.
కాని మహానగరమందె
కాపురంబు లాభకరము.

"ఇంతవరకు లేదు కాని
యిపు డిపుడే మనసు పెండ్లి
మీది కోరగుచున్న దనుచు
మీనాక్షిని జూచినాడు.

తృప్తితోడ లజ్జతోడ
దీపించెను కన్నెమోము.
జననియు గ్రహియించి వారి
సరణి మురిసిపోయె లోన.

౯

కరీంనగరు కరిగి మరల
గ్రామమునకు వచ్చినట్టి
భర్తతోడ బిడ్డపెండ్లి
ప్రస్తావన చేసె భార్య.

"పట్టణాన రకరకాల
పడతుల నీక్షించునట్టి
అందగాడు పురుషోత్తము
డమ్మాయిని పెండ్లాడునె?"

"మీ రెరుగరు కాని స్వామి,
మీనాక్షీ పురుషోత్తము
లన్యోన్యము ప్రీతిమగ్ను
లయినా రని నాకు దెలియు."

"పెండ్లి కింత త్వరయేటికి?
బిడ్డకు—సి కెరుక లేద?
వడసారము పదునాలుగు
వత్సరాలు నిండలేదు."

శర్మవిషయ మన్నమున్న
చాల బిగిసియున్న భర్త
మెత్తబడుట చూచి భార్య
మిక్కిలి సంతోషపడియె.

భారతీయచిత్రకలా
ప్రదర్శనము జరుగగలదు
నాల్గునెలల గడువులోన
నాగపురిని అనుచు దెలిసి.

పత్రికలో ప్రకటనమ్ము
ప్రమోదమ్ము గూర్చ, శర్మ
పంప నెంచె శిల్పమూర్తి
ప్రదర్శనకు అవధిలోన.

వివరించుచు శిల్పకళను
విగ్రహంపు లక్ష్యముగా
మీనను కూర్చుండబెట్టి
మేనత్త ననుజ్ఞ వేడె.

కొంత బెరుకుతోడ మీన
కూరుచుండె గాని, తొలుత
సిగ్గు వీడుకొలది నతడు
చెప్పు భంగి వహియించెను.

"నీ ముఖమ్ము మీనాక్షీ,
నిండుదైన, ఇంచుకంత
దగ్గరదై కన్నుదోయి
తగ్గించెను సౌష్ఠవమ్ము"

అని కొలతలు తీసికొనుచు
ఆన్యమండలమున కతడు

# ఉపగూహనము

ప్రారంభము చేసె నామె
ప్రతిరూపము మృత్తికతో.

నిర్మాణము ముగిసినంత
నీ భంగికి మెచ్చితినని
అతడు మీన చెక్కిళ్ళను
అలతిగ ముద్దాడినాడు.

మీన బాహులతిక లతని
మెడకును పెనవేసి కనులు
మూసి యతని పెదవులపై
ముద్దుగొనియె దీర్ఘముగా.

ఎటనుండియొ వచ్చినట్టి
యెనిమిదేండ్ల నారాయణ
సంభ్రమమున గాంచి, పోయి
జననితోడ జెప్పినాడు.

"అక్కకు బావకును పెండ్లి
అగును రెండు నెలలలోనె,
భార్యాభర్తలు వారలు :
పసివాడవు నీ కేటికి?"—

అనుచు తల్లి మందలించి,
ఆవల నేకాంతమందు
పుత్రికతో, నిన్ను తాక
బోవకీరు బావ ననియె.

అన్యదృష్టి లేక శర్మ
అధికనిష్ఠతోన శిల్ప
నిర్మాణమునందు భూరి
నియుక్తాంతరంగు డయ్యె.

స్వచ్ఛచంద్రకాంతశిలా
శకల మతని టంకపాతికి
అనుదినమ్ము రమ్యదేవ
తాకారము దాల్పసాగె.

శిల్పమూర్తి పరిసమాప్తి
చెందినపుడు మీనాక్షీ
దేవి అక్కజంబుతోడ
దీని నామ మే మనియెను.

నీ పేరే యనుచు నామె
నిద్దపు చెక్కిళ్ళమీద
ఒలికించుచు ముద్దు, లామె
నుపగూహన చేసినాడు.

భద్రము కావించి మూర్తి,
"ప్రదర్శనమునందు నాకు
బహుమానము వచ్చునేని
ప్రణయినికే అర్పణంబు"—

అనుచు సరససూక్తు లాడి
ఆవల తద్విగ్రహమును
వ్యవధిలోనె నాగపురికి
స్వయముగ గొనిపోయినాడు.

అవల 'ఉషోదేవత కే'
అఖిలభారతీయ కళా
ప్రదర్శనమ్మునందు ప్రథమ
బహుమానం బిచ్చినారు.

స్వర్ణపతక మొకటి, రెండు
సహస్ర రూప్యముల ధనము
పురుషోత్తముడను శిల్పికి
పురస్కార మని తెలిసెను.

విశాలాంధ్ర దేశమందు
విశ్రుత గోదావరితట
నికట మంథెనాగ్రహార
నివాసి యీ శిల్పి యనిరి.

పత్రికలం దీ వార్తలు
పఠియించుచు మేనమామ

హర్ష మొందె ప్రసిద్ధాంధ్రు
డల్లుడు కానున్నాడని.

"మేలమాడినాడ నాడు
మీనా, నీ తోడ ప్రతిమ
కుషోదేవతాభిధాన
ముంచితి : వైదికుడ కదా!"

"నీకు పెండ్లి యెపుడు బావ!"
"నెలలలోనె యనుచు నతడు
ఉత్సుకత్వ మొంది యామె
నుపగూహన చేసినాడు.

"నీకు రొమ్ము బిగుతు లేదు,
నేత్రమ్ముల నందు లేదు,
ఉండు నేని నీవు మీన,
ఉషోదేవతాకృతి వే!"

అనెడి శిల్పి వాక్కులలో
ననురాగము గ్రహియింపక
అవ్యక్తంబైన భీతి
నా ముద్దియ యులికిపడియె.

వివాహమ్ము చేయ మామ
వేగిరపడుచున్న, శర్మ
"త్వర యేటికి మామయ్యా,
తాళు డించుకంత" యనును.

ఎందులకో మీన యతని
యెదుట బడుటయైన గాని
మాటలాడుటైనగాని
మానుకొనియె నాటనుండి.

శర్మకు సన్మానసభలు
జలసాలును మెండాయెను.
నడచుచుండె నిండుహర్ష
కల్లోలములో దినములు.

హాటకపతకమ్ము ద్రవ్య
మతని చేతి కందినపుడు
మేనమామ యింటి కరిగి
మీనాక్షి దేవి కతడు——

పెద్దవారు చూచుచుండ
ప్రీతితోడ సమర్పింప
యత్నింపగ పురుషోత్తము,
డామె నతని వారించెను.

తప్పు తప్పు స్వీకరించు
తల్లియని తల్లి పలుక
అలుక కన్య నివారింప
నప్రతిభుండయ్యె శర్మ.

ఇది యంతయు గమనించుచు
ఎనిమిదేండ్ల నారాయణ
ఒక్కసారి పెద్దలగని
బిక్క మొగము వేసినాడు.

ఉ త్త రా ర్ధ ము

౧

ఆవల నొక వారమునకు
హనుమకొండనుండి వారి
చుట్టాలు వివాహోత్సవ
శుభలేఖను బంపినారు.

సంబరపడి మేనమామ
సకుటుంబముగా నచటికి
జనుకోరికతోడ చాల
సన్నాహము చేసినాడు.

అచట పెండ్లియైన పిదప
ఇచటను మన యింటిలోన
పెండ్లికి ఆ బంధుజనుల
పిలుతమనియె యజమానుడు.

మీనాక్షీ దేవి ముఖము
మిక్కిలి విప్పారె, కాని
శర్మవదనబింబ మందు
సంతోషపు చిన్నె లేదు.

హనుమకొండ కతని గూడ
నాహ్వానము చేసినారు
పెద్దవారు, కాని యతడు
భీష్మించిన యట్లుండెను.

ఎనిమిదేండ్ల నారాయణ
యీవల కాతనిని బిలిచి
అక్క నిన్ను పిలువ మన్న
దొక్కసారి యని చెప్పెను.

దరహాసముతోడ మీన
"తప్పక రావలెను బావ!
హనుమ కొండలోని పెండ్లి"
కని యాతని దేరిచూచె.

శర్మ క్రింది చూడ్కితోడ
సరే యనుచు శిరము ద్రిప్పి
పెండిలిపయనము కోసము
పెట్టెలు సవరించినాడు.

బావకూడ హనుమకొండ
బయలుదేరు చున్నాడని
నారాయణ చేసినాడు
నాట్యము సంతోషముతో.

వేడుకలను సంబరముల
విందులలో పాటలలో
గడచిపోయె అయిదునాళ్ళు
క్షణప్రాయ దీర్ఘంబై.

మీరందరు రావలయును
మీనాక్షి వివాహమునకు
మా యింటికి త్వరలోనే
మంథె న్నాగ్రహారమునకు.

అనుచు మేనమామవారి
నాహ్వానము చేసి, అవల
శర్మముఖము విలోకించి
సంతృప్తిం జెందినాడు.

బంధు జనములో నొక్కరు
పాలంపేట శివాలయ
మచ్చటి రామప్ప చెరువు
నవశ్యముగ చూత మనిరి.

శిల్పసార భూతమైన
శివాలయము, సరోవరము
నిష్ఫలములు చూడనట్టి
నేత్రము లన్నాడు శర్మ.

అవకాశము లభియింపక
అతడు పోయిచూడలేదు.
వివిధ శిల్ప చిత్రమ్ములు
వీక్షించెను పత్రికలో.

సమ్మతించి తెల్లవారు
జామున నే కొందరందు
బయలుదేరినారు పెద్ద
బస్సున పాలంపేటకు.

ఒక్కించుక ములుగులోన
ఉపాహార పానీయము
లారగించి, అశ్రమముగ
చేరినారు పాలంపేట.

పాకకృత్యమునకు నచటి
బంగాళాయందు కొంద
రాగినారు, ఘనపురమున
కరిగినారు శర్మాదులు.

గణపవరము వికృతమగుచు
ఘనపురముగ మారిపోయె.

అచట శిథిల మగుచునున్న
అలయములు చూచినారు.

మెట్లు దిగెడివేళ నొకట
మీనాక్షీ పాదరక్ష
జారిపోవ, పడకుండగ
శర్మ నామె నాదుకొనియె.

తొమ్మిది దేవాలయాలు
నెమ్మదిగా వీక్షించుచు
మరలి వచ్చినారు వారు
మధ్యాహ్నము బంగళాకు.

భోజనములు చేసి పిదప
పురుషోత్తమ శర్మాదులు
ఆదిలోన తటాకమ్ము
నవలోకింపగ నేగిరి.

జలాశయము విశాలమ్ము
సహజముగా నేర్పడినది
రాతితోడ కట్టకొంత
రామోజీ కట్టించెను.

ఒక్క ప్రక్క చిన్న లంక
యున్నది యా సరసులోన.
పాదపములు గోపజనము
పశుగణంబు కానవచ్చె.

అదిగదిగో మొసలి యనుచు
అరచినాడు నారాయణ.
పులులిచ్చట దిగు ననుచును
పురుషోత్తమశర్మ పలికె

తటము మీది యాలయములు
తటము క్రింద పచ్చచేలు
పరిశీలన చేసి కొండ
ప్రక్కగ దిగ సాగినారు.

2

సవిధమునం బారుకాల్వ
జలములోన కాళ్లు కడిగి
శివాలయ ప్రాంగణమ్ము
చేరినారు శర్మాదులు.

ఆర్ష శాఖవారు చుట్టు
నడవిని కొట్టించి వేసి
మందిర సంరక్షణకై
మరమ్మతులు చేసినాడు

అప్పటికిని మిగిలియున్న
వాలయమ్ములోని ప్రతిమలు
నియమిత దేశమ్ములందు
నిబద్ధములు కాక కొన్ని.

ప్రదక్షిణము చేసి శర్మ
ప్రథమమందు దేవళమున,
కానల సవిమర్శముగా
నవలోకింపంగ సాగె.

3

పెట్టియున్న దొక్కమూల
చెట్టు ప్రక్క గుట్ట వెనుక
కళలూరెడి చామర
గ్రాహిణీ విగ్రహమ్ము.

మెరుగు లీను నల్లరాయి
మిగుల పేర్పుతోడ నెవరో
శిల్పి మలచి రమ్యముగా
చేసినాడు విగ్రహంబు.

మణిమేఖల నగ్నమూర్తి
మధ్యదేశమందు వెలయ,
సన్నని మంజీరమ్ములు
చరణంయుగళియందు పొలుచు.

ఉరోజములు పీనమ్ములు
నుత్తుంగమ్ములు, హారము

విరుకు సందునుండి కాంచె
మీవలకును ప్రేలుచుండు

హస్తములను కంకణమ్ము
లంగదములు బాహువులను
తాటంకమ్ములు కర్ణ
ద్వయమున నొప్పారు చుండ.

కేతకీ సుమ నివహమ్ము
కేశబంధమందు, దనర
అంగుళీయ భూషితహ
హస్తమందు చామరమ్ము.

త్రిభంగిలో మలచి యున్న
స్త్రీ మూర్తిని చూచిచూచి
ప్రతిహాసము కాగి తమ్ము
పైనాతడు విఖియించెను.

ధనుర్లస్తకంబుబోలు
తచ్ఛిలా విగ్రహమ్ము
పెదవులపై నలతి ముద్దు
పెట్టుకొన్నవాడు శిల్పి

సుందర విగ్రహము నతడు
చూచి చూచి తనివితీర
ఉత్సుకుడై యొక్కసారి
ఉపగూహన మాచరించె.

ఏ మూలనో యొదిగియున్న
యెనిమిదేండ్ల నారాయణ
చూచినాడు శిల్పి చేయు
చుంబనోపగూహనముల.

సవ్వడి లేకుండ వచ్చి
శర్మ భుజము తట్టినాడు

చిరునగవున "అక్కతోడ
చెప్పెద"నని బెదరించెను.

ఉలికిపాటుతోడ శర్మ
ఉవ్వెత్తుగ లేచి, రెండు
చేతులు పట్టుకొని వాని
సిగ్గుతోడ బతిమాలెను.

నారాయణ చిరునగవున
"నన్ను కాదు మా అక్కను
బతిమాలెను పక్షములో
బయటపెట్ట రహస్యమును.

"ఆలస్యము కాకుండగ
అక్కను పెండ్లాడ వలెను.
పద, పోవుద" మనుచు వెంట
బావను గొని పోయినాడు.

ఏదో విగ్రహము వంక
వీక్షించెడి మీనతోడ
"అక్కా, నిను పెండ్లియాడ
అరుదెంచెను బావ" యనియె.

ఛీ పో యని యా కన్నియ
చిన్నవాని మందలించె:
ఎనిమిదేండ్ల నారాయణ
ఎగిరి గంతువేసి చనియె.

ఇటునటు వీక్షించి శర్మ
ఎవ్వరచట కానరామి
ఉల్లాసముతోడ కన్య
నుపగూహన మొనరించెను!

# తేలు కుట్టిన పాము

‘కొలకలూరి’

సూర్యుడు పడమట జారిపోయాడు. చీకటి మెల్లగా చేతుల్ని భూమిమీద కప్పింది. చీకటి పరిపాలన ప్రారంభం.

లోతైనలోయ. లోయకు రెండు ప్రక్కలా ఉన్నతమైన నల్లరాతి పర్వతాలు, ఆ పర్వతాలను కలుపుతూ రైలు బ్రిడ్జి. క్రింద భయంకరమైన లోయ.

చాలా దూరంలో కూతేసిన రైలు ముందులైటు బ్రిడ్జిమీదపడిన మరుక్షణంలోనే రైలు బ్రిడ్జిమీదకు వచ్చింది.

బ్రిడ్జిచుట్టు చీకటి దట్టంగా క్రమ్మివుంది. ఇంజన్ ముందుభాగంలో లైటు వెలుగుతోంది. వెలుగు చీకటిని తరిమివేసింది. వెంటాడింది. దాటిపోయింది. మరుక్షణంలో లోయపైన దట్టమైన చీకటి.

రైలు బ్రిడ్జీదాటి, కొండ శిఖరం విడిచిపెట్టి, ప్రక్కనున్న లోయలోనికి కొండను చుట్టుకొని మెలికలు తిరుగుతూ దిగుతోంది. లోయచుట్టూ చెట్లు పెరిగాయి. పుట్టమీదనించి ప్రక్కనున్న పచ్చిక తప్పుకుంటూ దిగిపోయే పాములాగా రైలు దిగిపోయింది.

రైలు బోగీలు అన్నీ చీకటిగా వున్నాయి. దాదాపు అన్నిపెట్టెలు నిశ్శబ్దంగా వున్నాయి. ఒక్కచోట మాత్రం సన్నగావెలుగు. ఇంజను తరవాత మూడవ బోగీలో, మూడవ కంపార్టుమెంటులో లైటు.

అది మొదటిక్లాసు కంపార్టుమెంటు. తలుపుల్లో ఒకటి లాక్ చేసివుంది. మరొకటి బోల్టుచేయబడింది.

కంపార్టుమెంటులో రెండు లైట్లు వెలుగుతున్నాయి. మూడు ఫానులు తిరుగుతున్నాయి. ఉన్నవి మొత్తం ఆరు బెర్తులు. పైనమూడు. క్రింద మూడు. పైన ఏదో సామానుంది. క్రింద ఎదురుగా రెండు బెర్తులు. ప్రక్కగా ఒక బెర్తు, మరొకప్రక్క రెండు తలుపులకు త్రోవలు. ప్రక్క బెర్తుమీద లెదర్ బేగ్, మరేవో వున్నాయి. ఎదురు బెర్తుల్లో ఒకదానిమీద పుస్తకాలు, మరొకదానిమీద పడక.

పుస్తకాల బెర్తు దాదాపు ఖాళీగావుంది. ఉన్న చిన్నచిన్న పుస్తకాలు పత్రికలు ఫాను విసురికి మెల్ల మెల్లగా డ్యాన్సుచేస్తున్నాయి. పడకమీద ఒక వ్యక్తి పడుకొనివున్నాడు. ఆరోగ్యమైనశరీరం. వ్యాయామం చేసిన దేహం.

కంపార్టుమెంటు ఒకప్రక్కగా బట్టలున్నాయి. అవి కాకీ బట్టలు. వాటిక్రింద పెద్దసైజు బూటులున్నాయి.

లెదర్ బేగ్ పైన ఒక బెల్టువుంది. అలాంటి బెల్టు సాధారణంగా అందరూ వాడలేరు. అక్కడే మరొక్క హేట్ వుంది. చాలా ఖరీదైంది. అంతకంటే విలువైంది. హేట్ ముందు నొసటిపైనవుండే భాగంలో ఏదో ప్రభుత్వం గుర్తువంటి ముద్రవుంది. దానికి రెండువైపుల ఏదో అలంకరణవుంది.

వ్రేలాడుతున్న షర్టుకిముందు భాగంలో ఏవో మెడల్సు వున్నాయి. వాటిపైన ఏవో రంగు రంగు రిబ్బన్లున్నాయి. రంగు దారాల కలయికతో ఏవో తాడు షర్టుకి కుడిచేతి భుజందగ్గర చుట్టివుంది. ఏవో అక్షరాలు కూడా భుజంపైన కుట్టబడి వున్నాయి.

ఆ వ్యక్తి నిద్రపోతున్నాడు. పైన లైట్లు వెలుగుతున్నాయి. ప్రక్కనే ఫానులు తిరుగుతున్నాయి.

ఎదురుగావున్న బెర్తుమీద ఏవో పుస్తకాల చెల్లాచెదురుగా పడివున్నాయి. గాలికి నృత్యం నేర్చుకుంటున్నాయి.

లైట్లు వెలుగుతున్నాయి. వెలుతురు ప్రసరిస్తున్నాయి.

ఫానులు తిరుగుతున్నాయి. గాలి పంచుతున్నాయి.

ఎదురు బెర్తుమీద పుస్తకాలు ఎగిరి పడుతున్నాయి. ఏదో పత్రిక అట్టమీది బొమ్మ స్పష్టంగా కనబడుతోంది.

# తేలుకుట్టిన పాము

ఒక స్త్రీ!

సన్నని బట్ట తడిసి శరీరానికి అతుక్కుపోయింది. వెంట్రుకలు పిరుదులు దాటివున్నాయి. శరీరమంతా తడిసివుంది. చంకలో నీరు పొలికిపోయే బిందె

వెనుకగా రెండు కొండలు. కొండలమధ్యగా సెలయేరు. సెలయేరు ప్రవహించిన ప్రదేశంలో పచ్చనిగరిక, పచ్చగరిక మీద ఒక కాలు. సెలయేటిలో మరొక్క కాలు. చూపులు ఏదో పశువుమీద.

కిటికీ ఒకటి తీసివుంది. బయటనించి గాలి బలంగా వీచింది. దానికితోడు ఫానులు తిరుగుతున్నాయి. గాలియుద్ధృతంగా వస్తూవుంది. పత్రిక పడిపోయింది.

మరొక్క పత్రిక మరొక్క బొమ్మ.
లైట్లు వెలుగుతున్నాయి.
ఫానులు తిరుగుతున్నాయి.
కిటికీలోంచి గాలి వస్తూనేవుంది.

ఒక యువతి. మరొక్క యువకుడు. యువకుడు పట్టలేని తమకంతో యువతిని పట్టుకొని ముద్దుపెట్టుకుంటున్నాడు. ఆమె అతన్ని గుండెలవైపు ఒత్తుకొంటోంది.

యువతి నడుం వంగిపోయింది. యువకుడు ముందుకు తూగిపోయాడు.

యువకుని చేతులు యువతి తల నలిపేస్తున్నాయి. యువతి చేతులు యువకుని వీపు పిండేస్తున్నాయి.

బుస్సున కిటికీలోంచి గాలి కంపార్టుమెంటులోకి వచ్చింది. టప్పున పత్రిక లేచి క్రిందపడింది.

బెర్తుక్రింద పడిపోయిన పత్రిక ఒక బాండు పుస్తకం అట్ట తొలగించి మరీ పడిపోయింది.

లైట్లు వెలుగుతూనే వున్నాయి.
కిటికీలోంచి గాలి రావటం లేదు.

ఫాను గాలికి బాండు పుస్తకం పేజీలు ఫెటఫెటా కొట్టుకుంటున్నాయి.

ఏ పేజీకూడా పూర్తిగా కనిపించటం లేదు. కాగితాలు లేస్తూ పడుతూవున్నాయి ఒక పేజీలో ఒక బొమ్మవుంది. బొమ్మక్రింద ఏవో నాలుగుమాటలు వ్రాసివున్నాయి. బహుశా అది వివరణ కావచ్చు. ఆభాష ఏదో తెలియలేదు.

ఒకబొమ్మ కనిపించింది. స్పష్టంగా కనబడక ముందే ఫాన్ గాలికి కాగితం తిరిగిపోయింది. లీలగా ఆ బొమ్మగుర్తుంది. ఏదో ప్రత్యేకత ఆ బొమ్మకుంది. ఏదో ప్రపంచ జన్మానికి సంబంధించిన బొమ్మ. అదే కావచ్చు! చెడ్డబొమ్మ. వయస్సులో వున్న స్త్రీ పురుషుల బొమ్మ. ఒకభంగిమ.

కిటికీలోంచి వెనక్కొట్టిన గాలితోలింది. బాండు పుస్తకం అట్ట టప్‌న లేచిపడింది. ఫాన్ గాలికి మళ్ళీ అట్టలేవలేదు.

పడకమీద వ్యక్తి రాత్రివస్త్రాల్లో వున్నాడు. కొంచెం కదిలాడు. చేతులుచాచి కాళ్ళదగ్గర దుప్పటి ముఖం వరకు లాక్కున్నాడు.

బైటి గాలి కిటికీలోంచి సన్నగా వస్తుంది.
ఫానులు మామూలుగా తిరుగుతున్నాయి.
లైటు నిర్వమగతిగా వెలుగుతోంది.
అతను నిద్రలోంచి లేచాడు.

కళ్ళు తెరిచాడు. మరుక్షణంలో మూసుకున్నాడు. ప్రక్కకు తిరిగాడు. చెయి ముఖం దగ్గరకు తెచ్చుకున్నాడు. కళ్ళు తెరిచాడు. చేతిగడియారం చూచుకున్నాడు. కిటికీవైపు చూశాడు. తీసివుంది. లేచాడు. కిటికీ మూశాడు. తలుపుదగ్గరకు పోయాడు. లాగి చూశాడు. వేసివుంది. గదంతా కలయజూశాడు. బాత్ రూంలోకి పోయాడు. లైటు వేసి వచ్చాడు. బెర్తుమీద చూశాడు. పడకమీద పిస్తలుంది. పైకితీసి చూశాడు. తాళం వేసివుంది. తలగడక్రింద పెట్టుకున్నాడు. పడుకున్నాడు. దుప్పటి కప్పుకున్నాడు.

కొద్ది సెకండ్లకాలం గడిచిపోయింది.

దుప్పటి తొలగించివేశాడు. కిటికీవైపు చూశాడు. తలుపువైపు చూశాడు. పిస్తలువైపు చూశాడు, దుప్పటి కప్పుకున్నాడు.

కొంచెంసేపు గడిచిపోయింది.

పడకమీద అటూ ఇటూ దొర్లాడు. నిద్ర పట్టలేదు. దుప్పటి తొలగించి పడుకున్నాడు. నిద్ర పట్టలేదు. ముసగర దీసుకొని మోకాళ్లలో తల జేర్చి పడుకున్నాడు. నిద్ర పట్టలేదు. ప్రక్కకు తిరిగి పడుకున్నాడు. బోర్ల పడుకున్నాడు. వెల్లకిలగా పడుకున్నాడు, నిద్ర పట్టలేదు. లైటార్పాడు. ముఖానికి ముసుగు పెట్టుకున్నాడు. నిద్రపట్టలేదు.

దుప్పటి దూరంగా పారేశాడు. లైటు వేశాడు. లేచి కూర్చున్నాడు.

మళ్ళీ ప్రయత్నించాడు. పడుకున్నాడు. మరొక్క ప్రక్కకు తిరిగాడు. ఇంకొక్క ప్రక్కకు తిరిగాడు. వేరొక ప్రక్కకు తిరిగాడు. నిద్రపట్టలేదు.

లేచాడు.

ఎదురు బెర్తుమీద కూర్చున్నాడు. అక్కడేవో పత్రికలూ—పుస్తకాలూ చూశాడు. తీసుకున్నాడు. విడిచిపెట్టాడు. మూలకు తిలజేర్చి కళ్లు మూసుకున్నాడు. నిద్రపట్టలేదు.

నిద్రపట్టలేదు. తృప్తికలగలేదు. బాధ అతని ముఖంలో లేదు. విసుగుదల లేదు. నిజానికి ఎంతో చీకాకు పడవలసిందిప్పుడే. కాని అదేమి లేదు. ఏదో మధురమైన అనుభూతి కలిగినట్లు, ఏదో విచిత్రమైన విధి విధానం జరుగుతున్నట్లు, ఏదో బలవత్తరమైన ఆనందంయొక్క అగ్రస్థాయి అనుభవం ముఖంలో కనిపిస్తోంది.

ఎదురు బెర్తుమీద కొన్ని, క్రింద కొన్ని పుస్తకాలూ, పత్రికలూ వున్నాయి. ఏవో పత్రికలు చూశాడు. ఏవో పుస్తకాలు చూశాడు. ఏవో పత్రిక తీసుకొని చూచి అక్కడే పడేశాడు.

మరొక పత్రిక పుచ్చుకున్నాడు. ఏదో సినిమా పత్రిక. అన్నీ ఆడబొమ్మలే.

తీసి చూస్తున్నాడు.

ఒక తార, నిక్కరు వేసుకొని బీచ్‌లో కూర్చుంది.

మరొక తార, కుక్కను ముద్దు పెట్టుకొంటోంది.

పేజీలు త్రిప్పుతున్నాడు.

ఒక తార జీవితచరిత్ర సచిత్రంగా ఆ పత్రికలో వుంది. ఆ పేజీలోనే అతనొకమాట ఎప్పుడో వ్రాశాడు. ఆమె అతని అభిమాన తార. కొన్ని బొమ్మలున్నాయి. భర్తతో బజారుకు పోతోంది పిల్లలకు అన్నం పెడుతోంది. పార్కులో కూచుంది. పడుకుని పుస్తకం చదువుతోంది. తల దువ్వుకుంటోంది. అందంగా అలంకరించుకొంది. బట్టలు మార్చుకొంటోంది. గుర్రంమీద కూర్చుంది. పాట పాడుతోంది. నృత్యం చేస్తోంది.

అతను చాలాసేపు చూశాడు.

పేజీలు తిప్పుతున్నాడు.

సినిమా తార, కత్తి పట్టుకొని కదలకుండా గుర్రం మీద రణరంగానికి వెడుతోంది.

ఏదో సినిమాలో ప్రేయసీ ప్రియుల మాటలు. ప్రథమ సమాగమం.

రాబోయే సినిమాలో క్రొత్తతార.

వందవాయిక పాత్రలు నిర్వహించిన ప్రసిద్ధ తార.

పత్రిక మూసి బెర్తుమీద పడేశాడు

మరొక్క పత్రిక పుచ్చుకొని, పడకమీదకు పోయి, పడుకుని, దుప్పటి కప్పుకొని చదవటం మొదలు పెట్టాడు. పదినిమిషాలు చదివిన తరవాత ప్రక్కన పడేసి, దుప్పటితలదగ్గరకు లాక్కొని నిద్రపోబోయాడు.

అప్పటిదాకా తలదగ్గర అంచుని ఆనుకొనివున్న పుస్తకం జారి క్రిందపడింది.

పుస్తకం సైజులో చిన్నది. పేజీల విషయంలో పెద్ది.

అతను దుప్పటి తొలగించిచూశాడు. పుస్తకం చేతికితీశాడు. అది చిన్న నోట్ బుక్. మధ్యగా పెన్సిలుంది.

అట్టమీద పేరువుంది. అది అతని పేరు కావచ్చు. పేరు అర్థం కావటంలేదు. ఏ భాషో తెలియదు.

పుస్తకం తెరిచాడు. అది డైరీ.

డైరీ ఒక్కసారిగా తెరిచాడు. పెన్సిల్ వున్న చోటు తెరుచుకుంది. పెన్సిలు కుడివైపు ఏమీ వ్రాయలేదు. ఎడంవైపు ఏదో వుంది. అది ప్రపంచ భాషలో వుంది. తెలుస్తోంది.

అది అతని ప్రయాణం విషయం. హెడ్ క్వార్టర్సునుంచి స్వగృహానికి బయలుదేరాడు. ప్రయాణం మూడురోజులనాడు మొదలు. మూడురోజులవరకు వుంటుంది.

డైరీ కుడివైపుకు తిప్పాడు. తెల్లకాగితాలు. ఎడంవైపుకు తిప్పుతున్నాడు. ఒక్కొకచోట చాలా చాలాసేపు చూడటం, మరికొన్నిచోట్ల వెంటనే తిప్పటం చేస్తున్నాడు.

ఎడంవైపు డైరీపుటలు రెండో మూడో తిప్పాడు.

# తేలు కుట్టిన పాము

అది హెడ్ క్వార్టర్సునుంచి వ్రాసింది. తనకు మూడు నెలలు సెలవు దొరికింది. స్వస్థలానికి బయలు దేరుతాడు.

మళ్ళీ నాలుగుపుటలు తిప్పాడు.

ఆ పుటలో విషయం కొంచెం మాత్రమే కనబడింది. పూర్తిగా కనబడకముందే త్రిప్పి వేశాడు. అందులో విషయం.

ఏదో నిర్ణయం. హెడ్ క్వార్టర్సుకి పోవాలి. సెలవు తీసుకోవాలి. ఇంటికి వెళ్ళాలి. పెళ్ళి చేసుకోవాలి.

మరికొన్ని డైరీపుటలు తిప్పాడు.

అక్కడ తారీఖుమట్టూ ఎర్రసున్నలు మూడు క్రమంగా పెద్దవి వున్నాయి.

పడకమీద పడుకున్న అతనిముఖంలో కొంచెం మార్పువచ్చింది. విషణ్ణత్వం కలిగింది.

అది తను చేసిన ఒక నేరం. ఆ విషయం అధికారులకు తెలిసింది. కాని అధికారయుతంగా తెలియలేదు. చివాట్లు వచ్చాయి. రావలసినవిధానంలో రాలేదు. అది తను ఒక స్త్రీ వెంటపడటం. అది నిరాకరించటం.

మరికొన్ని డైరీపుటల్ని తిప్పివేశాడు.

ఒకచోట పచ్చగీతలు డైరీపుటలో హెడ్డింగు క్రింద మూడు, వరుసలుగా అండర్ లైన్సు చేయబడ్డాయి.

అతని ముఖంలో తృప్తి నృత్యం చేసింది. దాన్ని అతను చాలా సేపు చూచుకున్నాడు.

అది తన హృదయం కోరి నేసిన పని. దానిని అందరూ ఘనకార్యమన్నారు. ఆఫీసరు రేంక్ ఇచ్చి సత్కరించాలనుకున్నారు. ప్రభుత్వం డబ్బు పెంచి గౌరవించాలనుకుంది. అతను తన కర్తవ్యమేమిటో నిర్వహించానని వ్రాసుకున్నాడు.

మరి రెండుపుటలు తిప్పివేశాడు.

అక్కడొకపుటలో నిండుగా, చక్కగావున్న చేతివ్రాతతో కొంత విషయంవుంది.

'ఈ నాడు నా జీవితం ధన్యం. మానవుడినైనందుకు మాతృభూమికి చేయగలిగినంత చేశానని హృదయం ఆనందంతో పరవళ్ళు తొక్కుతోంది. వైరుల వునికి తెలుసుకున్నాను. స్థావరాలు కనిపెట్టాను!

మరి నాలుగుపుటలు తిప్పాడు.

అది వైరులు యుద్ధం చేస్తున్న విషయం వైనం. వైరులు అనుకోని సమయాల్లో ఎక్కడినుంచో వచ్చి అకస్మాత్తుగా దోచేస్తున్నారు. సైనికులు చాలామంది చనిపోతున్నారు. తన సైన్యంలో వాళ్ళుకూడా చనిపోయారు.

మరికొన్ని పుటలు తిప్పాడు.

తను సైన్యంతో వైరులు కొల్లగొడుతున్న స్థలానికి పంపబడ్డాడు.

మరికొన్ని పుటలు తిరగవేశాడు.

'నన్ను ఆ ప్రాంతానికి పంపితే బాగుంటుంది. ప్రభుత్వం పంపుతుందో లేదో. పంపితే నా శక్తి సామర్థ్యాలమీద మరొక్కసారి విశ్వాసం కలగవచ్చు.'

డైరి పుటలు తిరుగుతున్నాయి. మరికొన్ని తిరిగి పోయాయి. కొన్ని చోట్ల ఎర్రగీతలు, కొన్ని చోట పచ్చగీతలు చాలా వున్నాయి. డైరీలో చాలా గీతలు వున్నాయి. ఎర్రగీతలకంటే డైరీలో పచ్చగీతలు ఎక్కువ.

మరికొన్ని పుటలు తిప్పబడ్డాయి.

ఒక పుటలో పుటకు సరిపడే పచ్చగీతలూ, ఎర్రగీతలూ వున్నాయి. ఒక ఇంటూ మార్కు వుంది. దానికి నాలుగు మూలల్లో నాలుగు ప్లస్ మార్కులు వున్నాయి. ఆ మార్కులన్నిటినీ చుట్టుతూ ఆ పైన ఒక పెద్ద సున్న వుంది.

ఇంటూ మార్కు పచ్చగీతలు. ప్లస్ మార్కు ఎర్రగీతలు సున్నకు పచ్చగీతతో ఒక చుట్టు. ఎర్రగీతతో ఒక చుట్టు వున్నాయి. సున్న ఎర్ర, పచ్చగీతల కలయిక.

దానిక్రింద ఒకే ఒక్క లైనులో ఏదో వివరణ వుంది. ఆ వాక్యంలోని మొదటిమాట ఏ భాషలోనిదో తెలియదు. తర్వాత ఈజ్ ఈక్వల్ టూ వుంది. ఆ పైన మైనస్ వుంది. దాని ప్రక్కనే దేవుడు అనే మాట ఇంగ్లీషులో వ్రాయబడివుంది. ఈ వివరణఅంతా మామూలు సిరాతోనే.

మరికొన్ని పుటలు తిరిగిపోయాయి. మొట్టమొదట పేజీలో ఏదో చాలా వ్రాయబడి వుంది. అక్షరాలు చాలా చిన్నవిగా వున్నాయి.

డైరీ మొదటి పేజీలో మొట్టమొదటనే ఏదో వ్రాసుకున్నాడు.

అది అతనికి డైరీ విషయంలోవున్న అలవాటు. డైరీ కొత్తది మొదలు పెట్టబోయేముందు, మొదటినించి తన జీవిత చరిత్ర వ్రాసుకుంటాడు.

ఆ వాక్యం తరవాత చాలా వుంది. అది అతని సంగ్రహ జీవిత చరిత్ర.

తను పుట్టి పెరిగిన వూరు పల్లెటూరు. తల్లిదండ్రులు అమాయకులు. చదువు సంధ్యలు లేనివారు. తను బీదకుటుంబంలో పుట్టాడు. చదువు హైస్కూలు గోడలు దాటలేదు. తింటానికి తిండిలేదు. వుంటానికి యిల్లు లేదు. కట్టుకోడానికి బట్టలేదు. దుర్భరమైన పరిస్థితి. తల్లిదండ్రుల్ని విడిచిపెట్టాడు. సైన్యంలో చేరాడు. ఇంటికి డబ్బు పంపుతూనే వున్నాడు. నానాదేశాలు తిరిగాడు. లోకజ్ఞానం చాలా వుంది. లోకంతో అనుభవం బాగా పొందాడు. తనకు అలవడిన ఒక మంచి నడవడిక పరిస్థితులకు అనుగుణంగా ప్రవర్తించటం. తను సైన్యంలో చేరి పన్నెండు సంవత్సరాలు. చేరిన మొదట్లో సామాన్య సైనికుడుతను. క్రమంగా వృద్ధిపొందాడు. ఇప్పుడు పెద్ద ఆఫీసరు. ముందు ముందు హోదా పెరగవచ్చు. సైన్య పాలనంలో తనకు మంచి స్థానం వుంది. చాలా తక్కువ చదువు. అనతికాలంలో ఇంత పెద్ద హోదా. చాలా గొప్ప విషయం. తను పొందిన అధికారం తనకున్న యోగ్యతలతో మరెవ్వరూ పొందలేదు. అది తన అదృష్టం. కాకపోతే వ్యక్తిత్వంలోని మహాత్తర పురుషత్వం. దేశానికి సేవచేస్తున్నానని అతని విశ్వాసం. తనలో ఆ మధ్య ఒకరకమైన వింతభావం కలిగింది. కొన్నాళ్లవరకు తనలో వచ్చిన పరిణామం అర్థం కాలేదు. ఆ తర్వాత తెలిసింది. శరీరస్పందన అని. శరీరం ఏమిటో కోరుతోంది. అప్పుడతను తెలుసుకున్నాడు. తను పెండ్లి చేసుకోవాలిసిన అవసరం కలిగిందని. ఇంటికి పోయి పెండ్లి చేసుకుంటానని ప్రభుత్వాన్ని కోరాడు. పోవటానికి ఒప్పుకోలేదు. పైగా కోరింది, ఒక్క ఆరునెల్లు ఆగవలసిందని. తను సరేనన్నాడు. ఆగిపోతున్నాడు.

చదువుకున్న డైరీమూసి తలగడక్రింద పెట్టుకున్నాడు. మెల్లగా కన్నుమూశాడు. మాగన్ను నిద్ర పట్టుతోంది.

ఫానులు వేగంగా తిరుగుతున్నాయి. లైట్లు నిద్రపోతూ వెలుగుతున్నాయి. కాగితాలూ పుస్తకాలూ కదలాడుతున్నాయి.

ఏదో హిల్-స్టేషన్లో రైలుఆగింది. వెంటనే బయలుదేరింది. అతను ప్రక్కకుఒత్తిగిలి పడుకున్నాడు. రైలు సాగిపోతోంది.

ఉన్నట్టుండి విచిత్రంగా ఒకశబ్దం వినవచ్చింది. అది అవ్యక్తంగానూ మధురంగావుంది, కొండరాళ్ళు దొర్లుతుంటే వచ్చే సెలయేటి శబ్దంలాగావుంది. కోకిలలు పాడుతుంటే వినవచ్చే కోకిలపిచ్చులాగావుంది. గొంతు పిసుకుతుంటే వినవచ్చే యువతి పిలుపులాగా వుంది.

అతను మరోప్రక్కకు తిరిగి పడుకున్నాడు.

మళ్ళీ అదేశబ్దం వినవచ్చింది. వెంటవెంటనే మూడుసార్లు వినబడ్డది.

అతను టక్కున లేచి కూర్చున్నాడు.

ఆశబ్దం మళ్లీవిన్పించింది.

పడుకున్న కొంచెంసేపట్లో మునుపటిశబ్దం మళ్ళీ వినవచ్చింది.

చప్పున పైకి లేచాడు. పిస్టలు పైకెత్తాడు. తాళం వేసివుంది. తాళంతీశాడు. కిటికీలవైపు తలుపువైపు వరుసగా చూచాడు. చేతిలో పిస్టలు చూచుకున్నాడు.

శబ్దం మళ్ళీ వినపళ్ళేదు.

పిస్టలు తాళం వేయకుండా ఒకచోటపెట్టాడు. పడకమీద కూర్చున్నాడు. పడుకోబోయాడు.

ఏదో గుర్తుకొచ్చింది. పడుకోబోయేవాడు తలగడ వెతికాడు. డైరీ బైటకితీశాడు. పుటలు వేగంగా తిప్పాడు. దేనికోసమో గాలించాడు. చివరకు దొరికింది. ముఖం వికసించింది.

టక్కున పిస్టలుపుచ్చుకున్నాడు.

డైరీనింకోకమారు చూశాడు. పిస్టలునొక్కమారు వత్తిపట్టి పుచ్చుకున్నాడు.

లేచాడు. బైటచూశాడు. ఏమీకన్పించలేదు. మెదలకుండా తిరిగివచ్చి బెర్తుమీదకూచున్నాడు.

మరేదో గుర్తుకొచ్చింది. చప్పునలేచి మరో మూలమీద కూర్చుని టైంచూసుకున్నాడు.

మరుక్షణంలో రైల్వేగైడ్ బైటకితీశాడు. 'ట్రెయిన్' నెంబరు చూశాడు. టైం చూశాడు. టైమూ, నెంబరూ తీసి తిన్నగా స్టేషను పేరు చూశాడు. మరి కొన్ని ప్రక్క స్టేషనులు చూశాడు.

వెంటనే పైకిలేచి లెదర్ బేగ్ లోంచి మేప్ తీసి దాన్నివిప్పుతూ పడక బెర్తుదగర కొచ్చాడు.

కూర్చున్నాడు. మేప్ లో ఒకచోట వేలు పెట్టాడు. అది ఒక వూరుపేరు. దానిమీద అతని వ్రేలు.

రైల్వే గైడ్ లో మునుపు స్టేషనుపేరు మళ్ళీ చూచి, ఎదురుగా పైగావున్న నెంబరూ టైమూ చూశాడు. తన చేతిగడియారం చూచుకున్నాడు.

మేప్ లో ఆవూరుమీద పెన్సిలుతో గుండ్రంగా సున్న చుట్టాడు. మరుక్షణంలో డైరీవిప్పి, ఆవూరుపేరు చుట్టు ఒకసున్న చుట్టివేశాడు.

అతనిముఖం వికసించింది. వెలుగురేఖలు కనిపించాయి.

# తేలు కుట్టిన పాము

పిస్టలు పట్టుకూర్చున్నాడు. చుట్టూ చూశాడు. కిటికీలు వేసివున్నాయి. తలుపు వేసివుంది. బాత్ రూం తలుపు తీసివుంది. లోపల లైటు వెలుగుతోంది. కంపార్టుమెంటులో లైట్లు వెలుగుతున్నాయి. ఫాన్లు తిరుగుతున్నాయి.

మునుపటి శబ్దం మళ్ళీ వినబడింది. మొదటిసారి కంటె కొంచెం పెద్దది.

ట్రిగ్గర్ నొక్కబోయాడు. ఎందువల్ల ఆగిపోయాడో తెలియదు గాని ట్రిగ్గరు నొక్కలేదు.

శబ్దం మళ్ళీ వినబడింది. మునుపటికంటె బాగా పెద్దగా వినవచ్చింది. కొంచెం స్పష్టంగా వుంది. ఎవరో పిలుస్తున్నట్లుంది.

ఈసారి ట్రిగ్గర్ నొక్కటానికి ప్రయత్నం చెయలేదు.

మళ్ళీ అదే శబ్దం. ఆ గొంతుక ఆడ గొంతుకలా వుంది.

పిస్టలు దూరంగా పెట్టాడు. తలుపు తీయబోయాడు. వెనుదిరిగి వచ్చాడు. పిస్టలు పుచ్చుకున్నాడు. తలుపు దగ్గరకు పోయాడు.

తలుపు తీయబోయాడు. పిస్టలు చేతిలో చూచుకున్నాడు. తలుపు తీశాడు. దూరంగా నిలబడ్డాడు.

ఒక అరుపు వినిపించింది. సౌమ్యంగా మృదువుగా, హాయిగ వుంది.

ముందడుగు వేయబోయాడు. వెంటనే వెనక్కు తగ్గాడు. రెండడుగులు వెనక్కు వేసి నిలబడ్డాడు.

అదే అరుపు మెత్తగా, జాలిగా వినిపించింది.

అతను అక్కడే నిలబడ్డాడు.

ఒక ఆడది లోపలికి వచ్చింది. వయస్సు ఇరవై వరకు వుండవచ్చు. చంకలో ఒకపిల్ల వుంది. ఆ పిల్లను ఆమె శరీరాన్ని కలుపుతూ ఒకగుడ్డ వుంది. ఆమె చేతులతో ఆ పిల్లను పట్టుకోవాల్సిన అవసరం లేదు.

కళ్లలో ఏదో నిషావుంది. ఆ నిషావెనుక విషాదముంది. ముఖం సామాన్యంగా వున్నా చూస్తే జాలి కలుగుతుంది. ఏవో కవళికలు బిడ్డనీ, హృదయాన్ని కలవర పెడతాయి. కళవళ పడతాయి.

బట్టలు ఖరీదు తక్కువ. కట్టు కుదిరిగ్గావుంది. అవయవాలు కట్టులో ఒదిగిపోయి అందముగా వున్నాయి. ముఖం గుండ్రంగా ముద్దుగావుంది.

నొసట బొట్టు లేదు. మెళ్లో తాళి లేదు. చేతులకు గాజులు లేవు. ఆమెది స్వతహాగా సన్నని శరీరం. కాని కొంచెం లావుగావుంది. తగినలావు. చక్కని రూపం. భయంకరమైన బీదతనం. బట్టలు చిరిగివున్నాయి. జుట్టుకు నూనె లేదు. కాని దువ్వుకొంది. మనిషిలో ఏదో విరక్తి, నిస్పృహ చెందినట్లు ముఖం వ్యక్తమాతుంది.

లోపలికి వచ్చిన వెంటనే కాళ్లమీద పడింది. గట్టిగా పట్టుకుంది. వదలేదు.

క్షణంలో వదిలించుకొని దూరంగా జరిగి పిస్టలువైపూ, ఆమెవైపూ చూస్తున్నాడు.

ఆమె అతనివైపు బాధగా చూచింది. పిల్లవైపు, తన డొక్కవైపూ చూపింది. ముఖంలోకి చూస్తోంది.

అతనేదో అడిగాడు. ఆమెకది అర్థం కాలేదు. అందుకనే జవాబు చెప్పలేదు. ఏదో కాగితం తీసి ఇచ్చింది.

తీసుకున్నాడు.

ఆ కాగితంలో ఏదో ప్రింటుచేసిన విషయం వుంది. రెండురకాల ప్రింటు కనిపిస్తోంది. రెండు భాషలు. ఒకటి ప్రపంచభాష. మరొకటి ప్రాంతం భాష. ఆ ప్రాంతం భాష అతనికి తెలియదు. ప్రపంచం భాషలోని విషయం చూస్తున్నాడు.

ఈ కాగితం తెచ్చిన మనిషి మూగది.

ఆమెవైపు చూశాడు. ఆమె నాలుక చూపింది. నాలుక మామూలుకంటే చాలా లావుగా వుంది. చెవిటిది.

ఆమెని చూశాడు. ఆమె అతన్ని చూచింది. ఆమె చెవుల్లో చేతి వేళ్ళు పెట్టుకొని త్రిప్పి, చేతి వేళ్ళు బైటకితీసి అటూ ఇటూ తిప్పింది.

గౌరవమైన కుటుంబంలో పుట్టి పెరిగింది.

ఆమెవైపు చూశాడు, ఆమెలో అభిజాత్యం యిప్పుడు లేదు. కాని అంతకంటే అత్యున్నతమైన ఏదో అజ్ఞాతశక్తి ఆముఖంమీద మామూలుగా కనబడే తెరలవెనుక అవ్యక్తంగా కదలాడుతోంది.

భర్త యుద్ధంలో చనిపోయాడు.

అతని కళ్ళలో ఏదో విచిత్రమైన భావ సంచలనం కలిగింది. కొంచెంసేపటివరకు చేతిలో కాగితం చూడలేక పోయాడు.

యుద్ధం దెబ్బతో ఆమె నాశనమైంది. ఆస్తి పాస్తు లేమీ లేవు.

ఆమెకళ్ళు చూశాడు. ఆ నయనాలు సజలాలు.

ఇద్దరు పిల్లల్ని పోషించాలి. దిక్కులేని వాళ్ళు.

పిల్లవైపు తేరిపార చూశాడు. పిల్ల ఏడవటం లేదు.

ఆమె పిల్లను తీసి చూపింది. ఆపిల్ల నిద్ర పోతోంది.

ఈ కౌగిలం చూచినవాళ్ళు తమకు తోచినంత ధర్మం చేయండి.

కౌగిలం మడిచి ఆమె కిచ్చాడు. అతనిచ్చిన కౌగిలం పుచ్చుకుంది.

అతను జేబులో చేయి పెట్టుకున్నాడు. ఆమె ఆశగా జేబువంకా చేయివంకా చూస్తోంది.

అతనేదో నాణెం యిచ్చాడు. పుచ్చుకుంది. తృప్తిగా కళ్ళుమూసుకుంది.

అతను లేచాడు.

ఆమె లెప్పుకుంది.

రైలు పోతోంది. బైటికి చూశాడు. అతనివీపు చూచిందామె. రైలు ఆగేందుకు దగ్గర్లో ఏమీ స్టేషను లేదని నిర్ణయించుకున్న తరవాత తలుపు వేసివచ్చి కూర్చున్నాడు. ఆమె తృప్తిగా గాలి పీల్చుకొంది.

తిరిగి పడక బెత్తు ఎగరకు వచ్చాడు.

ఆమె కదలకుండా ఫాన్ వైపు చూస్తూ నిలబడింది.

ఆమెకు కునుకు వచ్చేట్టుంది. పసిపిల్ల నిద్ర పోతోంది.

అతను టవల్ తో పడక దులిపి, పడుకొని దుప్పటి ముసుగుతిన్ని పడుకున్నాడు. ఆమె వైపు తిరిగి చూస్తున్నాడు.

ఆమె పసిపిల్లను క్రింద పడుకోబెట్టి పుస్తకాలూ, పత్రికలూవున్న బెత్తు కానుకొని కూర్చుని, పిల్లని చిచ్చుకొడుతూ కునుకుతోంది.

ఆమె పిల్లని చిచ్చుకొడుతూనే ఆపింది. ఆమె చేయి పిల్లమీదే వుంది. మెల్లగా కళ్ళుమూసుకుంది. బెత్తు కానుకుంది.

ఆమె కునుకుతూ కునుకుతూ కునుకులో కళ్ళు తెరచింది. అతని వైపు నెమ్మదిగా శబ్దం కాకుండా తలెత్తి చూచింది. అతను చూస్తూవున్నాడు. ఆమె నెమ్మదిగా చూపు మరల్చుకొంది.

ఆమె నిద్రపోవటానికి ప్రయత్నం చేస్తూవుంది.

అతనికి నిద్రపట్టే సూచన కలుగుతోంది.

ఆమె నిద్రపోయిందనుకున్నాడు. మెల్లగా దుప్పటి కప్పుకొని కళ్ళు మూసుకున్నాడు.

ఆమె నెమ్మదిగా కళ్ళు తెరిచి, అతన్ని చూచి, పిల్లమీద చేయితీసి వేసి కళ్ళుమూసుకొని నిద్రపోయింది.

ఆమె చూచిందని అతనికి తెలియదు

ప్రక్కకు తిరిగి పడుకున్నాడు.

కొంచెం సేపటి తరువాత ఏదో స్టేషన్లో రైలాగింది. అతనికి నిద్రపటలేదు. ఆమె నిద్రపోతోంది. లేచి తలుపుదగ్గరకు పోయాడు. బైటికి చూశాడు. బండి బయలుదేరింది. స్టేషను దాటింది. సాగిపోతూనే వుంది. అతను అక్కడే నిలబడివున్నాడు. ఆమెవైపు చూశాడు బైటికి చూశాడు. అటూఇటూ చూశాడు. ఆమెదగ్గరకు పోయాడు. చల్లగా ఆమెమీద చేయి వేశాడు.

నరాలు బుస్సున పొంగాయి. కండరాలు మత్తుగా మూలిగాయి. బుద్ధి చమక్ చమక్ మంది. వళ్ళు సుఠుక్ సుఠుక్ మంది. గుండె గుబుక్కు గుబుక్కున కొట్టుకుంది.

ఆమె లేవలేదు.

మళ్ళీ చేతితో తట్టాడు.

శరీరమంతా దిమ్మెత్తిపోయింది. మెదడు కరెంటుషాక్ తిన్నట్టయింది. మనస్సు పని చేయటం మానుకుంటోంది. వళ్ళు జలదరించింది. స్వాధీనం తప్పిపోతోంది.

ఆమె లేవలేదు.

తట్టటానికి మళ్ళీ ప్రయత్నం చేశాడు.

తటి లేపదల్చుకుని చేయి మీద వేశాడు. అంతే చేయి పైకితీయలేదు. తీయలేక పోయాడు. శరీరాన్ని అంటుకుపోయింది. పైకిరాలేదు.

వీపుమీద చేయి వీపుమీదే ఎంతో కాలం నిలవలేదు.

రైలు ఏదో స్టేషన్లో ఆగింది.

అతను తత్తరపోయాడు. చేయి వీపునుంచి తీసి వేశాడు. దూరంగాజరిగి నిలబడ్డాడు.

ఆమె నిదానంగా కళ్ళు తెరిచింది.

అతను చేతులు నలుపుకొంటూ దూరంగా, మౌనంగా, నిర్లిప్తంగా నిలబడ్డాడు.

ఆవిడకళ్ళు ఏమిటీ అన్నట్లు ప్రశ్నిస్తూ అతని వైపు చూశాయి.

అతని చేతులు ఏముంది ఏమీలేదు అన్నట్లు చిత్రమైన భంగిమల్లో జవాబు చెప్పటానికి ప్రయత్నం చేశాయి.

ఆమె ముఖంలోకి చూడలేకపోయాడు. ప్రక్కకు తిప్పుకున్నాడు. బైటికి చూశాడు.

# తేలు కుట్టిన పాము

ఆమె తూర్పు వైపుకి చూచింది. రైలు ఆగివుంది. ప్లాటుఫారం కనబడుతోంది:

అతను చేతులు తిప్పుతూ ఏమో చెప్పాడు. చెప్పిందేమిటో తెలియదు కాని చేతులు తిప్పినందు వల్ల తెలిసింది. దిగిపొమ్మనటం.

ముఖంలోకి చూచింది. అతని ముఖం కనిపించటం లేదు. అతని చేతులు నిర్విరామంగా పనిచేస్తున్నాయి.

చేతుల వైపు ప్లాటుఫారం వైపు చూచింది. విషయం అర్థం చేసుకుంది. పిల్లవైపు చూచింది. పిల్ల గాఢమైన నిద్రలో వుంది.

ముఖంలోకి చూసింది ముఖం కనిపించింది. నల్లగా వుంది. ఆమె నమస్కారం చేసింది. పిల్లను చూపింది. ప్లాటుఫారం చూపింది. తల వూపుతూ తనక్కడ దిగలేనట్టు గోణిగింది. మొర పెట్టుకుంది. ప్రతిమాలుకుంది. చేయి ముందుకు చూపింది. మరొక స్టేషన్లో దిగుతానని తెలుపుకుంది.

అతని వ్యక్తిత్వంలోని ఒక సుగుణం ఇక్కడ పనిచేసింది. కాని యిప్పుడది దుర్గుణం. అది అతని పట్టుదల. దిగిపొమ్మని బలవంతం చేశాడు.

ఆమె ఏడ్పుకు సిద్ధమయింది. కాళ్ళు పట్టుకుంది ప్రతిమాలుకొంది. కంటనీరు పెట్టుకొని వేడుకుంది. నానావిధాల ప్రయత్నించింది.

అతనికి దయ కలిగినట్లుంది. మరి బలవంతం చేయలేకపోయాడు. మెదలకుండాపోయి బెర్తుమీద కూర్చున్నాడు.

రైలు బైలుదేరింది.

పిల్ల దగ్గరకు జరిగి కూర్చుంది. పైటకొంగుతో కంటినీరు తుడుచుకొంది. అతనివైపు చూచింది. మెల్లగా కళ్ళు మూసుకునేందుకు ప్రయత్నించేస్తోంది.

ఎదురు బెర్తుమీద ఆమె ప్రక్క పత్రికలు చూస్తున్నాడు.

స్త్రీ!

చంకలో బిందె

బిందెనిండుగా నీరు.

నీరు వొలికిపోతోంది.

పల్చని చీరె.

చీరె తడిసిపోయింది.

ప్రక్క రెండు కొండలు. కొండలమధ్య సెలయేరు. ఒడ్లను వొరుసుకుంటూపోయే ప్రవాహం.

స్త్రీ—నీరు వొలికిపోయే బిందె—తడిసిపోయిన పల్చని చీరె—కొండలమధ్య సెలయేటి ప్రవాహం.

అతను లేచాడు. ఆమె పిల్లమీద చేయిపెట్టి కునుకుతీస్తోంది. ఆమెవైపు చూశాడు. రెండు నిమిషాలు నిర్లిప్తంగా నిలబడ్డాడు. తిరిగిపోయి పడుకున్నాడు. దుప్పటి ముసుగు పెట్టాడు.

ఆమె తల కొంచెం పైకెత్తింది అతన్ని చూచింది, తృప్తిగా కళ్ళు మూసుకుంది.

అతనికి నిద్రపట్టటం లేదు. లేచాడు.

ఆమె నిద్ర పోతోంది. శబ్దం చేశాడు. మరీ పెద్దగా చేశాడు. లేచింది. పత్రిక చూపాడు. ఇవ్వమని అడిగాడు.

పత్రిక చూచింది. అట్టమీద బొమ్మ చూచింది.

తనలో తాను నవ్వుకుంది.

అతను తనవైపు చూస్తున్నాడనుకున్నప్పుడు. నవ్వాపి, పత్రిక అతని కిచ్చింది.

అతను పుస్తకం చూస్తున్నాడు.

పుస్తకం చూడటంలో నిమగ్నుడైపోయాడనుకుంది.

ఆమె మెల్లగా నవ్వుకుంది.

నవ్వుతోందని అతను తేలిగ్గా తెలుసుకున్నాడు.

పుస్తకం పుటల్లో యిరుక్కుపోయాడు.

ఆమె నిద్రాదేవి ఒడిలో ముడుచుకు పడుకొంది.

రైలు సాగిపోతోంది.

అతను పుస్తకం చూడటం పూర్తయింది.

ఆమెకు నిద్రపట్టటం జరిగిపోయింది.

అతనికి నిద్ర పట్టటం లేదు. చదవటానికి బుద్ధి పుట్టటం లేదు. లేచాడు. తలుపుదాకా పోయాడు. వెనుదిరిగి వచ్చాడు. శబ్దం చేయకుండా కూర్చున్నాడు. అరక్షణంలో లేచాడు. తలుపుదగ్గరకు పోయాడు. వెనువెంటనే తిరిగివచ్చి బెర్తుమీద కూర్చోబోయాడు. కూర్చోబోతూ లేచాడు. కిటికీదగ్గరకు పోయాడు. తీశాడు. మరోక్షణంలో వేశాడు. బెర్తుదగ్గరకు వచ్చాడు. కూర్చున్నాడు.

ఆమె కూర్చుని నిద్రపోతోంది.

దగ్గరకు పోయాడు. ప్రక్కన పిల్ల నిద్రలో వుంది. పిల్ల వయస్సు చాలా తక్కువ. పిల్లవైపు వెర్రిగా చూశాడు చూడటమే గాని ఆలోచనకు ఆకళ్ళ రేఖల్లో తావులేదు ఏదో విసుగుదల ముఖంలో చూపిస్తూ పిల్లవైపు చూచే చూపులో కోపం మిళితం చేస్తూ లేచి బెర్తుమీద కూర్చున్నాడు.

ఏదో ఉత్తేజంతో మళ్లీ లేచాడు. ఆమె దగ్గరగా పోయాడు. వెనగ్గా నిలబడ్డాడు. తదేకధ్యానంతో ఆమెముఖంలోకి చూశాడు. ఒళ్లు చుర్రుమంది. వెంట్రుకలు నిక్కబొడుచుకున్నాయి.

శరీరంలోని అన్ని అవయవాలను పరీక్షగా చూశాడు. తన్మయుడైపోయాడు.

ఆమెదగ్గరగా వీపుప్రక్కగా, మునిగాళ్లమీద మెల్లగా కూర్చున్నాడు.

ఆమె కదలకుండా నిద్రపోతోంది.

ఆమె రెండు భుజాలమీద చేతులు వేశాడు. మెల్లగా పట్టుకున్నాడు. గట్టిగా నొక్కాడు.

ఆమె లేవలేదు. గాఢంగా నిద్రపోతోంది. బ్రహ్మాండమైన నిద్రాదేవి పరిష్వంగం.

అతను క్రిందు మీదౌతున్నాడు. ఒళ్ళు తెలియటంలేదు. మునిగాళ్లమీద నిలబడలేక పోయాడు. తూలాడు. ముందుకు పడిపోయాడు.

ఆమె లేచింది.

అతను తత్తరపోయి లేచాడు. దూరంగా నిలబడ్డాడు.

అతని కాళ్లు పట్టుకుంది, బ్రతిమాలుకుంది. బలవంతం చేయవద్దంది. మరొక్క స్టేషనులో దిగుతానంది.

ఏదో స్టేషన్లో రైలు ఆగింది.

లేచిపోయి బెర్తుమీద కూరున్నాడు. నిద్ర పట్టటం లేదు.

చెక్కిలి కింద చేయిపెట్టుకొని కదలకుండా కూర్చుంది. బైటికి చూస్తోంది. నిద్రపట్టట మాగిపోయింది.

ఆమె వైపు చూశాడు. తలవంచుకుంది.

అతని వైపు చూచింది. కిటికీలోంచి చూస్తున్నాడు.

అతనామె వైపు చూశాడు. ఆమె అతని వైపు చూచింది. అతనేదో మాట్లాడబోయాడు. ఆమె ఏదో చెప్పబోయింది. పుస్తకం చూపాడు. ఇవ్వమని అడిగాడు.

పుస్తకం అట్టమీద హీరో హీరోయిన్‌ని ముద్దు పెట్టుకున్నాడు. ఒళ్ళు తెలియని తమకం. పుస్తకం తెచ్చియిచ్చింది. పుచ్చుకున్నాడు.

అట్టమీద బొమ్మ చూస్తున్నాడు

అట మీద బొమ్మవైపూ, అతని ముఖం వైపూ ఆమె సమీక్ష చేస్తోంది.

తనముఖం చూసున్నాడని తెలుసుకున్న ఆమె కూర్చునేందుకు పోబోయింది.

పైకి లేచాడు.

నిటారుగా నిలబడి వుంది.

కొంచెం కొంచెం కదిలాడు.

కదలకుండా వుంది.

దగరగా పోయాడు.

దూరంగా పోలేదు,

చేతులు మీద వేశాడు,

కొదన లేదు.

బిగువుగా పట్టుకున్నాడు.

వీలైనట్లు పట్టుకోనిచ్చింది.

ఎదురుగా తిప్పుకున్నాడు.

సునాయాసంగా తిరిగింది

భుజాలు గట్టిగా నొక్కాడు.

పట్టుగా వూపాడు.

మెల్లగా మీదకు వ్రాలింది.

సెమ్మదిగా ముఖంలోకి చూశాడు,

ముఖం గులాబి పువ్వులాగా విచ్చుకుంది.

పట్టరాని తమకంతో ఆమెను పట్టుకొని పెదవుల దగ్గరకు మృదువుగా లాక్కున్నాడు.

అలవిగాని ఉత్సాహంతో, ముప్పిరిగొనే ఆనందంతో, పెదాలు అందించింది.

అతని వీపు ఆమె చేతి వత్తిడికి నలిగిపోయింది.

ఆమె పెదిమ గంటు పడింది.

అతను విడిచిపెట్టాడు.

ఆమె పట్టు తప్పుకుంది.

బెర్తుమీద కూర్చున్నాడు.

పాపదగ్గర కూర్చుంది.

ఏదో స్టేషనులో రైలు ఆగింది. రైలు ఆగినప్పుడు అతనేమీ చేయలేదు. ఆమె మరొక్క స్టేషనులో దిగుతానని బ్రతిమాలలేదు. రైలు సాగిపోతోంది.

ప్రక్క బెర్తుపై పుస్తకాలలో బొందుపుస్తకం పైకితీసింది. ఒక్కొక్క బొమ్మ రెండు మూడు నిమిషాలసేపు చూచింది ప్రతిబొమ్మకూ ఆమెలోంచి ఉత్సాహమూ, ఉద్వేగమూ పరవళ్ళుతొక్కుతోంది.

ఆమె బొందు పుస్తకం బొమ్మలు చూడటం అతను చూశాడు. సంతోషంతో ముఖం వికసింపచేసు

కోవటం కనిపెట్టాడు. పట్టలేని ఆనందాన్నీ, అలవి గాని అనుభూతిని పొందటం అర్థం చేసుకున్నాడు.

ఆమె దాన్ని చూడటం పూర్తయింది. పుస్తకం పూర్తిగా చూచేవరకు ఆమె తల యెత్తలేదు. ఆమె పుస్తకం పూర్తిగా చూచేదాకా అతనూ తలెత్తలేదు. ఆమె ముఖం చూస్తూనే వున్నాడు.

ఆమె తలెత్తిన మరుక్షణంలో అతను తలదించుకున్నాడు.

ఆమె మళ్ళీ పుస్తకాన్ని చూడటంలో పూర్తిగా నిమగ్నురాలయింది.

ఆమె ముఖాన్నీ, మార్పుల్నీ నిరంతరం పరీక్షిస్తున్నాడు.

ఆమె తలెత్తింది.

చూపులు మరల్చుకొన్నాడు.

పుస్తకం పుచ్చుకొని లేచింది.

ఆమెవైపు చూశాడు.

దగ్గరగా వచ్చింది.

లేచి నిలబడ్డాడు.

పుస్తకం చేతిలో పెట్టింది.

ఇచ్చేపుస్తకం పుచ్చుకున్నాడు.

ఒక బొమ్మను చూపింది.

చూపేబొమ్మ చూశాడు.

ఆ బొమ్మ....ఒక యువతి...ఒక యువకుడు... ఒక చిత్రభంగిమ.

ఆమె మునుపటి స్థలంలో పిల్ల ప్రక్కగా కూర్చుంది. పుస్తకం చూశాడు. ఆమెను చూశాడు. బొమ్మ చూశాడు. లేచాడు. కూర్చునేవుంది.

దగ్గరకు పోయాడు. రెండో బెర్తుమీద కూర్చోబెట్టాడు. లైట్లు ఆరిపోయాయి.

మరో నిమిషంలో వచ్చాడు.

బెర్తుమీద పుస్తకాలు నలిగిపోయాయి. తీసి క్రింద పడేశాడు.

ఆమె ఏదో చెప్పబోయింది.

అతను వినిపించుకోలేదు.

ఆమె ఏదో చెబుతోంది. చేతులతో సైగ చేస్తోంది లైట్లవైపు చూపింది.

అతను ఆమె చేతులవైపూ లైట్లవైపూ చూశాడు. అతనికేమీ అర్థం కాలేదు.

మళ్ళీ ప్రయత్నించింది.

అతను అర్థం చేసుకొనడానికి ప్రయత్నం చేయటంలేదు.

లైట్లవైపూ స్విచ్‌లవైపూ చేతులు చూపింది.

అతను ఆ వైపు చూశాడు.

ఆమె అవునన్నట్టు తల వూపింది.

మెల్లగా లైటు పట్టుకున్నాడు.

తల నిరసనగా ఆడించింది.

వచ్చి, చేతులు పట్టుకున్నాడు.

కాదన్నట్లు నెట్టింది.

పోయి, స్విచ్ తాకాడు.

ఉత్సాహంగా తల వూపింది.

వెయ్యి ఏనుగులబలంతో ఉత్సాహంతో లైటు స్విచ్ ఆఫ్ చేశాడు. వెంటనే వేశాడు. ఆమె ముఖం వైపు చూశాడు. ముఖంలో యిష్టం లేకపోవటం స్పష్టం. లైటు తగ్గించాడు.

బెర్తుదగరకు వచ్చాడు.

ఆమె లేదు!.!!

చేతులతో తడిమాడు. పూర్తిగా వెదకాడు. ఆమె కన్పించలేదు.

లైటు వేశాడు.

మూడో బెర్తుమీద పడుకొనివుంది. అటు చూశాడు. సన్నగా నవ్వుతోంది.

మళ్లీ లైటు తగ్గించాడు. బెర్తుదగ్గరకు పోయాడు. కూర్చున్నాడు. పట్టుకున్నాడు. చేతిలో ఏ ముంది?

ఆమె లేదు!!

బెర్తు గాలించాడు. చేతులకు తగల్లేదు...

లైటు వేశాడు.

తన పడకమీద పడుకొని నవ్వుతోంది సన్న సన్నగా, మెల్ల మెల్లగా, కొల్ల కొల్లగా.

లైటు తగ్గించివెళ్ళాడు.

బెర్తుమీద చేయి వేశాడు. పిస్టలు దొరికింది. దూరంగా జాగ్రత్తగా పెట్టాడు. ఆమెకోసం చేతులు చాపాడు.

ఆమె లేదు!

లైటు వేశాడు.

లేచి నిలబడివుంది మూడు బెర్తులమధ్య.

ఆమెవైపు చూశాడు. అతనివైపు చూచింది. కూర్చోమన్నట్లు ప్రవర్తించాడు. తన బెర్తుమీద కూర్చుంది.

నవ్వాడు. మృదువుగా హెచ్చరించాడు. ఇక తప్పించుకోదనుకున్నాడు.

లైటు తగ్గించాడు.

బెర్తుమీదికి పోయాడు.

ఆమె లేదు!!!

చేతులతో వెతికాడు. చీకటిని చీల్చి చూశాడు. ఆమె లేదు.

లైటు వేశాడు.

మూడు బెర్తులమధ్య నిలబడివుంది.

పట్టుకున్నాడు. లైటు తగ్గించాడు. తన పడక బెర్తుమీదికి తీసుకొచ్చాడు.

రైలు సాగిపోతోంది.

కొంచెం సేపున్న తరవాత......రైలు ఆగింది.

విస్సత్తుపుగా లేచాడు. మెల్లగా తూలుతూ పోయి లైటు వేశాడు. తిరిగివచ్చి బెర్తుమీద కూర్చున్నాడు.

పడకమీద ఆమె పడుకొనివుంది. లేపాడు. లేచింది. పడుకున్నాడు. ఎదురుబెర్తు చూపించాడు.

పిల్ల క్రింద పసుపు నేవుంది. పిల్ల ప్రక్కగా పిస్టల్ వుంది.

లేచిపోయి పిస్టలు పుచ్చుకొని తిరిగివచ్చి పడకమీద మేను వాల్చాడు.

ఆమె పిల్లతో ఎదురు బెర్తుమీద పడుకుంది.

నిద్రపోతూ ఆమెవైపు చూశాడు. ఆమె నిద్రపోయిందనుకున్నాడు. నిద్రపోబోయాడు. ఆమె కూర్చుంది. అతను లేచాడు, కూర్చున్నాడు. అతని వైపు చూచింది. అతను పర్సుతీసి, ఏదో నోటు ఆమె చేతిలో పెట్టాడు. తీసుకుంది. దాచుకుంది. ఆమె ముఖంలో సంతోషం చూశాడు.

ప్రక్కనే కూర్చున్నాడు. చేతులతో నెట్టింది. కాళ్ళతో నెట్టింది. గొణిగింది. ఏడ్చింది. ఇష్టంలేదు. ఎందుకో తెలియదు. కోపంతో లేచిపోయి పడుకున్నాడు.

మెల్లగా కునుకులో పడ్డాడు.

ఏదో స్టేషనులో రైలు ఆగింది.

వీపు చరిచినట్లు విచిత్రంగా మెలకువ వచ్చింది.

లేచాడు. ఎదురు బెర్తుమీద చూశాడు.

ఆమె లేదు!!!

వాకిట్లోకి పోయాడు. చూశాడు. ప్లాట్ ఫారం మీదలేదు. స్టేషనులో లేదు.

ఆమె దూరంగావున్న ఓవర్ బ్రిడ్జికి కొంచెం దూరంగా కంకరరాళ్ళ ప్రక్కగా బొగ్గుగుట్టల చేరువలో మూడు లైన్లు చీలేచోట, ఎటు వాగను వెళుతుందో తెలియనిచోట, ఎదురుగా వచ్చే గూడ్సు షెడ్ పహారా పోలీసుని తప్పుకొని, చంకలోవున్న పిల్లతో మురుగుకాలువ దాటుతోంది. వాగన్లు దాటింది. షెడ్ దాటింది. ఫెన్సింగులోంచి దూరింది. తారు రోడ్డెక్కింది.

ఎప్పట్నుంచి అక్కడ ఆ ఆడమనిషి నిలబడి వుందో కాని ఈమె రోడ్డెక్కేసరికి ఆమె ఎదురుగా వచ్చింది.

ఈమె రెండు నిమిషాలసేపు ఏమేమో మాట్లాడింది. ప్రక్కనే వెలుగుతున్న మునిసిపాలిటీ లైటునీడలో ఆమె మాట్లాడుతున్నట్లు అతను స్పష్టంగా గమనించాడు.

ఆమె ఏమిటో అడిగింది. ఈమె నవ్వుతూ ఏమిటో చెప్పింది. నవ్వుదొంతరలు వాళ్ళ మధ్య చాలా ఎత్తుగా నిలచాయి.

అతని కళ్ళు మెరిశాయి, విచిత్రంగా కదిలాయి. మెల్లగా నవ్వు పెదాలమీద కదిలింది. ఈమే!!! అనుమానం లేదు.

ఆమె ఎందుకో చేతులు చాపింది.

ఈమె పిల్లని అందించింది!!

ఆ పిల్ల కంపార్టుమెంటులో ఏడ్వలేదు. ఎందుకేడ్వలేదూ? ఎందుకేడుస్తుంది? ఏడవదు.

ఆమె ఎందుకో చేయి చాపింది.

ఈమె తను యిచ్చిన నోటు ఆమెకిచ్చింది!!

గారు విజిల్ వూది జెండా వూపాడు.

ఆమె పిల్లను తీసుకొని నోటు దాచుకొని వెళ్ళిపోయింది.

ఈమె వెనుదిరిగి తను దిగివచ్చిన మునుపటి కంపార్టుమెంటు వైపు చూచింది.

ఆమె చూచింది.

అతను చూశాడు.

ఆమె రోడ్డుమీదికి పోయింది.

రైలు కూతేసింది.

ఏదో టాక్సీవచ్చింది. ఆమె రోడ్డుమధ్యకు పోయి ఆపింది.

టాక్సీ ఆగిపోయింది. ఏమో మాట్లాడింది. ఎక్కి కూర్చుంది.

రైలు బైలుదేరింది.

టాక్సీ సాగిపోతోంది.

రైలులోంచి చూశాడు.

టాక్సీలోంచి చూచింది.

రెండూ రెండు ధ్రువాలకు ప్రయాణమై వెళ్ళిపోయాయి.

తలుపు వేసి లోపలికి వచ్చాడు. పిస్తలు భద్రం చేశాడు. పడకమీద కూర్చున్నాడు.

హోల్డాలులో చేయిపెట్టి వెతికాడు,

పర్సు కనబడలేదు! పర్సు పోయింది!! ఆమె తీసుకుపోయింది!!!!

చప్పున పైకి లేచి లెదర్ బేగ్ మూతతీసి చూశాడు. అందులో డబ్బు మాత్రం వుంది!

తిరిగివచ్చి పడకమీద కూర్చున్నాడు.

మరుక్షణంలో లేచి బయటికి చూశాడు. ఏమీ కన్పించలేదు.

టైం చూచుకున్నాడు.

రైల్వేగైడు తీసి, టైమూ, నెంబరూ, చూచి స్టేషను పేరు చూశాడు!!

మరొకసారి ఆ స్టేషను పేరు చూశాడు. మేప్ తెచ్చాడు. మేప్ మీద ఆ పేరున్నచోట పెన్సిల్ తో సున్న చుట్టాడు!!

డైరీ బైటికి తీశాడు.

పెన్సిల్ తో ఏదో వ్రాశాడు. నొసలుముడిచి నొసటిమీద అరచేత్తో రాసుకుంటూ కళ్లు కుంచించుకొని కొంచెంసేపు ఆలోచించాడు. మళ్లీ కొంచెంసేపు ఏమో వ్రాశాడు.

హోల్డాలులోంచి పెన్ను తీసి దాని క్రింద రెండుగీతలు గీశాడు. అవి ఎర్రగీతలు!!

పెన్సిలుతో ఏమో వ్రాశాడు. ముఖం వికసించింది. మీసంమీద చేయివేసుకొని ఠీమాగా సవరించుకొన్నాడు.

హోల్డాలులోంచి పెన్ను తీసి దానిక్రింద మూడుగీతలు గీశాడు. అవి పచ్చగీతలు!!

డైరీ ఒకపుట తిప్పాడు. తరువాత కాగితంమీద పుటకు సరిపడే ప్లస్ మార్కు పచ్చ యింకుతో వేశాడు. ప్లస్ మార్కు నాలుగుమూలల్లో నాలుగు ఇంటు మార్కులు వేశాడు. ఆ మొత్తానికి రెండు సున్నలు చుట్టాడు. ఒకటి పచ్చనిది. మరొకటి ఎర్రనిది. దానిక్రింద పెన్సిలుతో ఒక వాక్యం వివరంగా వ్రాశాడు. మొదటిమాట తెలియదు. ప్రక్కనే ఈక్వల్ టూ వుంది. ఆ తరువాత ప్లస్ యింటూ ప్లస్ స్త్రీ అని వ్రాసి డైరీ మూశాడు.

బైటకు చూశాడు. రైలు లోయలోంచి కొండ ఎక్కుతోంది. ఎదురుగా మరో కొండలో రైలు పోయేందుకు సొరంగం వుంది.

తిరిగివచ్చి కూర్చున్నాడు. బయటకు చూస్తున్నాడు.

రైలు సొరంగంలోంచి వెళుతోంది!

చీకటి పటుటకు పారిపోయింది. తూర్పున లేత రేఖలు ఉదయించాయి. చీకట్లు తెలవారాయి. తూర్పున ఉదయించాడు సూర్యుడు.


ప్రమాద రక్షణకు ప్రశస్తమైనది భీమా

ఎప్పుడు ఏ ప్రమాదం వచ్చేదీ, ఏ క్షణం ఎలా ఉండేదీ తెలియని ఈ దినాలలో

* అగ్ని * మోటార్‌కారు * కార్మిక నష్టపరిహారం * నౌక

* ఫయడిలిటీ గ్యారంటీ మొదలైన భీమాలకు

మాతో సంప్రతించండి.

యునైటెడ్ ఇండియా ఫైర్ అండ్ జనరల్

ఇన్సూరెన్సు కంపెనీ,

"బాంబే లైఫ్ బిల్డింగ్స్"

9, బ్రాడ్వే, మద్రాసు. 1.

Telephone: 4241, Telegrams: "UNIGEN"

బ్రాంచీలు:

విజయవాడ - బెంగుళూరు - బొంబాయి - కలకత్తా - న్యూఢిల్లీ - పాట్నా

కొలంబో - సింగపూరు - కోయంబత్తూరు - జాకార్తా.

# సుప్తదీర్ఘిక

శ్రీ మల్లంపల్లి శరభయ్య

కొల నిమ్మెయి; కరణములను
నలుగుల తెరు వడఁచి యే ననాదిమ నిద్రా
జలముల నంచులు మోవఁగ
నిలువు నిలువు దాఁక లోన నింపితి దీనిన్.

వివృత కరణ సరణి శివ! జగత్ప్రత్యయ
మలినవారి నిగిడి కలఁగు నేమొ
కొలను, విమల కమల కుముద కందప్రతా
నాభిరామ జఠర మని తలంచి;

చిరతమో జలౌఘ శిశిర తమ స్పర్శ
మునిఁగి యణఁగె కరణములు తమంత
ఈఁద తాఁకి గూటియెద పులుంగుల వోలె
నెగయరాక తెలివియెల్లలందు.

అలవియగునె! నాకు నస్వప్నమౌ నిద్ర
విరియు నొక్కొ కమలవీధి యందు!
లయ విధాయి రయ చలత్ జలభ్రమములందు
వివృతవక్త్ర నక్ర విహృతులందు.

అరిగి యరిగి లోని కబ్జనాళాంతర
విమల గర్భశయ్య విశ్రమింతు
అలమి యచట నన్ను నస్వప్నమౌ నిద్ర
విరియుగాక కమల విపిన మందు.

# కారల్ మార్క్స్ ఆర్థిక సిద్ధాంతాలు

శ్రీ బులుసు వెంకటసుబ్బారావు

నవీన సామ్యవాదసిద్ధాంతాలకి మూలపురుషుడు కారల్ మార్క్స్ అనే విషయం నిర్వివాదమైనది. ఈనాడు 'మేము సామ్యవాదులం, భారతదేశంలో సామ్యవాదం విజృంభించి అధికారం చేకొన్ననాడే సర్వతోముఖాభివృద్ధి లభ్యం కాగలదు' అని పైపైగా ఉపన్యసించేవారెందరో మార్క్స్ ఆర్థికసిద్ధాంతాలను అసలు అవగాహన చేసుకునేందుకే ప్రయత్నించరు. 'కారల్ మార్క్స్ సిద్ధాంతాలప్రకారం రష్యా అభివృద్ధి చెందింది. అలాగే మనదేశంకూడా పొందుతుంది. కాబట్టి మీ ఓట్లు మాకే' అని గట్టిగా కేకలు పెట్టడం తప్పితే మరేమీ తెలియనివారు నేడు ఆంధ్రదేశంలో చాలామంది ఉన్నారు. మనం సామ్యవాదాన్ని బలపరిచేముందుకాని, లేక త్రోసివేసేముందుకాని మార్క్స్ సిద్ధాంతాలను కనీసం విహంగమదృష్టితోనైనా పరిశీలించడం అత్యవసరం.

మార్క్స్ బహుముఖప్రజ్ఞాధురీణుడు. ఆయన ఒక గొప్ప తత్త్వవేత్త. చరిత్రకారుడు. సంఘసేవకుడు. ఆర్థికశాస్త్రజ్ఞుడు, రాజనీతిజ్ఞుడు, అఖండమైన తర్కప్రతిభ కలవాడు. తనకు ముందు కల పెట్టుబడిదారీ, సామ్యవాదాల, ఆర్థికవిజ్ఞాన సంప్రదాయం అంతా పరిశీలించి, ఆ భావములతో సమ్మిళితంచేసి ఒక అపూర్వమయిన నూతనతత్త్వాన్ని ఆయన సృజింపగలిగాడు. ఈ తత్త్వం మహోత్కృష్టమైనదని కాని దోషరహితమైనదని కాని ఎవరూ అనరు. కాని అది ప్రదర్శించిన ప్రభావం అనల్పమైనది. సాంఘిక పురోభివృద్ధికి ఆయన ఒక నూతన పథకాన్ని తయారు చేసి తదాచరణకు ఎన్నో సలహాలు వెల్లడించాడు. ఆ పథకమే కమ్యూనిజం, సోషలిజం రూపాలను తాల్చిన సామ్యవాద స్వరూపం. అతివిశాలము, కఠినము, అయిన ఆయనసిద్ధాంతం ఆయన అనుచరులచేత విమర్శకులచేతకూడ కొంతవరకు అపార్థం చేసికోబడింది. ఈ ప్రణాళిక అంతా ఏదో పిచ్చిఊహ అని కొందరు విమర్శకుల అభిప్రాయం. ఆయన శిష్యులు మార్క్స్ సిద్ధాంతాలు అనేకవిధాలుగా అర్థంచేసికొని అనేక తెగలుగా విడిపోయారు.

మార్క్స్ తత్త్వాన్ని పరిశీలించేముందు ఆయన జీవితవిశేషాలు ఒకసారి పరిశీలించి చూద్దాం. జర్మన్ జ్యూ జాతీయులైనదంపతులకు మార్క్స్ జనించాడు. ఆయన తల్లిదండ్రులు తర్వాత క్రైస్తవ మతావలంబకులయ్యారు. జర్మన్ విశ్వవిద్యాలయాలలో చదివి ఆయన ప్రఖ్యాత జర్మన్ తత్త్వవేత్త అయిన హెగెల్ సిద్ధాంతాలు జీర్ణించుకొని తత్త్వశాస్త్రంలో డాక్టర్ పట్టా సంపాదించాడు. తరువాత కొన్నాళ్ళాయన పత్రికాసంపాదకుడుగా పనిచేశాడు. ఆయన విప్లవాత్మకమైన రచనలవలన పత్రిక నాటి ప్రష్యన్ నియంతలచే అణగద్రొక్కబడింది. ఆ తరువాత తను ప్రేమించిన జెన్నీ వాన్ వెస్ట్‌ఫాలెన్ అనే జమీందారీ వంశానికి చెందిన యువతిని వివాహమాడి మార్క్స్ పారిస్‌కు పయనమయ్యాడు.

పారిసునగరంలో ప్రౌఢాన్ మున్నగు విప్లవాత్మక సామ్యవాద రచయితల సాంగత్యం ఆయనకు లభించింది. వారితో ఎన్నో విషయాలు చర్చించి వారి వాదాలు ఖండించాడాయన. వారి సిద్ధాంతాలు, విధానాలుకూడ లోపభూయిష్ఠంగా కనిపించాయి మార్క్స్‌కు.

ఆ సమయంలోనే మార్క్స్‌కు జీవితాంతము అత్యంతాప్తుడుగా తోడునీడగా మెలిగిన ఫ్రెడరిక్ ఏన్‌జల్స్‌తో పరిచయం కలిగింది. మాంచెస్టరులో బట్టలమిల్లుల అధికారి, కోటీశ్వరుడు అయిన ఒక ఆసామీకి పుత్రుడు ఏన్‌జల్స్. పిమ్మట పత్రికలలో విప్లవాత్మకమైన వ్యాసాలు చూసి ప్రష్యాప్రభుత్వ నిరంకుశ దుష్టహస్తం మార్క్స్‌ను అణచివేయ యత్నించింది. మార్క్స్ ఫ్రాన్సునుంచి బెల్జియంలో స్థిరపడ్డాడు.

పందొమ్మిదవ శతాబ్దంలో నాలుగవ దశాబ్దం చాలా విప్లవాత్మకమైనది. 1848 లో ఫ్రాన్సులో చాలా అల్లకల్లోలాలు జరిగాయి. లూయి ఫిలిప్స్ చక్రవర్తి పదవిచ్యుతుడయ్యాడు. విప్లవజ్వాలలు జర్మనీఅంతటా అలముకున్నాయి. దానికి తోడు నిరుద్యోగంతోను, వేతనాల తగ్గింపులతోను బాధపడుతున్న కార్మికులు తిరుగుబాటుకు సిద్ధమయ్యారు. అన్ని వర్గాలలోను ప్రభుత్వంమీద అవిశ్వాసం, అసంతృప్తి, ప్రబలాయి. "న్యాయసంఘము" అనే రహస్యమైన అంతర్జాతీయసంస్థ కార్మికులను కూడగట్టుకొని విప్లవానికి నాయకత్వం వహించడానికి పూనుకొన్నది. తమ ఆశయాలు, విప్లవసిద్ధాంతాలు,

గ్రంథస్థం చేయవలసిందిగా మార్క్సును, ఏంజెల్సును ఆ సంఘం కోరింది. దాని ఫలితమే విశ్వప్రఖ్యాతమైన "కమ్యూనిస్టు మేనిఫెస్టో."

కార్మికులకు, పెట్టుబడిదారులకు నడుమనున్న కలహాన్ని విశదీకరించి, ఈ సమరంలో అంతిమ విజయం కార్మికపక్షానిదేనని, ఈ విజయానంతరం, ఉత్పత్తి సాధనాలన్నీ కార్మికులకు లభించి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు నెలకొల్పబడతాయనీ ఈ గ్రంథం వ్యక్తంచేసింది. విశ్వశ్రామికులంతా ఏకమై పెట్టుబడిదారీ విధానాన్ని నాశనంచేసి పురోభివృద్ధి సాధించవలసిందిగా కోరింది.

కాని అన్నింటికన్నా ఆశ్చర్యకరమైన విషయమేమంటే, ఈ హింసాయుత విప్లవంవలన ఏ లాభాలు వస్తాయని మార్క్సు కార్మికులకు ఆశ పెట్టాడో అవన్నీ ఏ విప్లవం లేకుండానే పెట్టుబడిదారీ వ్యవస్థ అవలంబించిన దేశాలు సాధించగలిగాయి. అమెరికాలోని కార్మికుడు కమ్యూనిస్టు చైనాలోని కార్మికుని కన్న సౌఖ్యంగా ఉన్నాడనడం అతిశయోక్తి కాదు. అయితే అట్టి సౌకర్యాలు పెట్టుబడిదారీ దేశాలలో ఎన్నటికీ కలగజాలవని మార్క్సు సంపూర్ణంగా విశ్వసించాడు. అయితే ఆ నాటి దేశకాల పరిస్థితులు ఆయన సిద్ధాంతాన్ని బలపరిచాయి.

అటుపిమ్మట త్వరలోనే ఐరోపాలో విప్లవాలు మాటుమణగిపోయాయి. రాజరిక వాదులు తిరిగి అధికారంలోనికి వచ్చారు. అందువలన మార్క్సు బెల్జియం విడిచిపెట్టి లండను ప్రయాణమయ్యాడు. ఆయన శేషజీవితమంతా లండను మహానగరంలోనే గడిచింది. "కమ్యూనిస్టు మేనిఫెస్టో"లోని సిద్ధాంతాలు, బలపరుస్తూ, తదనుకూలంగా నూతన సిద్ధాంతాలు ప్రతిపాదిస్తూ ఆయన ఇక శేషజీవనం అంతా అక్కడ గడిపాడు. ఆ కాలంలోనే ఆయన "పెట్టుబడి" (Das Kapital) అనే ఉద్గ్రంథం రచించాడు. ఈయన పరమపదించిన తర్వాత ఏంజెల్సు ఈ గ్రంథం మూడుభాగాలు, 1895 నాటికి ముద్రించాడు. మార్క్సు మూలసిద్ధాంతాలన్నీ మొదటిభాగంలో సంగ్రహీకరింపబడినాయి.

ఇక మార్క్సు ప్రతిపాదించిన ఆర్థికసిద్ధాంతాలు పరిశీలిద్దాం.

మార్క్సు అంతటి విప్లవ రచయితకూడా కొంతవరకు సాంప్రదాయికులయిన ఆర్థికశాస్త్రజ్ఞుల అడుగుజాడల్లోనే నడవడం గమనార్హం. ఈ విషయాన్ని "కేపిటల్" సువిదితం చేస్తుంది. సాంప్రదాయిక శాస్త్రజ్ఞులవలెనే మార్క్సుకూడ కొన్ని ప్రాథమిక విషయాల పరిశీలనవలన, ఆలోచనాశక్తివలన నూతనాంశాలను గ్రహించే తార్కిక విధానాన్ని అవలంబించాడు. అందువలన మనం మార్క్సు సిద్ధాంతాలను విమర్శించామంటే తదాధారభూతమైన సాంప్రదాయిక విజ్ఞానాన్ని విమర్శిస్తున్నామన్నమాట. మార్క్సు సిద్ధాంతాలు దోషభూయిష్ఠములైతే సాంప్రదాయిక సిద్ధాంతాలుకూడా కొంతవరకు దోషభూయిష్ఠములే. ఆయన ఉపయోగించిన తార్కిక విధానం అసంబద్ధ విషయాలకు దారితీస్తే, సాంప్రదాయిక విధానంకూడా కొంతవరకు అట్టిదేఅయి తీరాలి. అన్నివిధాలా మార్క్సు సాంప్రదాయిక ఆర్థిక శాస్త్రవేత్తే. కాని ఈయనకు వారికి కొంత భేదం ఒకటుంది. తమ విజ్ఞానాన్ని, తార్కిక ప్రతిభను వారు పెట్టుబడిదారీ విధానాన్ని బలపరచేందుకు ఉపయోగిస్తే, మార్క్సు ఆ వ్యవస్థ నాశనం చేయడానికే ఉపయోగించాడు!

తన పూర్వులవలెనే మార్క్సు, వస్తువుల విలువలు వానిని తయారుచేయడంలోని శ్రమపై ఆధారపడి వుంటాయని విశ్వసించాడు. దీనినే శ్రమసిద్ధాంతం (Labour Theory) అంటారు. రికార్డో మున్నగు ప్రఖ్యాత ఆర్థిక తత్త్వవేత్తలు ఈ సిద్ధాంతాన్నే బలపరిచారు. రికార్డో శ్రమ సిద్ధాంతానికి క్రొత్తగా చేర్చిన అంశం ఒకటుంది. అదేమంటే ఈ శ్రమ సాంఘికోపయోగకరంగా ఉండాలని. మారకపు విలువను, గిరాకీఎక్కువైనకొలది డబ్బురూపకంగా మార్చాలి. ఈ ద్రవ్య వ్యవహారంలో చాలా చిక్కులు ఉన్నాయి. మార్క్సు మారకపు విలువల సిద్ధాంతం ప్రకారం ఒకడు కొంతధర పెట్టి ఒక వస్తువు కొన్నాడంటే, ఆ వస్తువునందు నిక్షిప్తమైన సాంఘికోపయోగకరమైన శ్రమపరిమాణాన్ని కొన్నాడన్నమాట!

కాని పెట్టుబడిదారుని (Capitalist) పట్ల ఈ సిద్ధాంతం వర్తింపదు. వస్తువులను అతడు తన స్వంత ఉపయోగానికి అంటే వాడుకొనడానికి కొనడు. అధిక మయిన ధరకు విక్రయించడానికి కొంటాడు. ఉదాహరణకు, ఒక మిల్లుయజమాని, మిల్లు, యంత్ర పరికరాలు, పారిశ్రామికుల "శ్రమ"కొనడానికి వెచ్చించిన మొత్తం ధర, ఆయా పరికరాలలో నిక్షిప్తమైన శ్రమ పరిమాణం, పారిశ్రామికుల శ్రమ పరిమాణం కలిపితే వచ్చే మొత్తానికి సమానమౌతుంది. అతడు తయారుచేసే ఉత్పత్తిని ఈ మొత్తం వ్యయాన్ని ఎక్కువ ధరకు అమ్ముతాడు. తాను ఖర్చుచేసిన దానికంటె అధికభాగాన్ని అతడు విక్రయం ద్వారా పొందుతాడు. ఈ అధికభాగమే అతని లాభ భాగము. ఈ మిగులునే మార్క్సు "సర్ప్లస్ వేల్యూ" అని వ్యవహరించాడు.

# కారల్ మార్క్స్ ఆర్థిక సిద్ధాంతాలు

ఇక మార్క్సు వేతన సిద్ధాంతం (Theory of wages) కూడా సాంప్రదాయిక పంథాలోనే సాగిపోయింది. కార్మికుడు సరిగ్గా బ్రతకడానికి అంటే చనిపోకుండా ఉండేందుకు తగు మాత్రం వేతనాన్ని పెట్టుబడిదారునివలన పొందుతాడు. అంతేకాని తాను ఉత్పత్తిచేసిన దానికి పూర్తి విలువను పొందజాలడు. అతని శ్రమవలన వచ్చినలాభభాగము పెట్టుబడిదారుడు తీసుకుపోతాడు. ఈ విధంగా శ్రామికుని అన్యాయంచేసి అతనికి చెందవలసిన మిగులుతానే తీసుకుంటాడు పెట్టుబడిదారుడు. మార్క్సు దృష్టిలో ఇది ఒకవిధమైన సాంఘిక దౌర్జన్యము. క్రింది ఉదాహరణము మార్క్సు భావాన్ని వెల్లడిస్తుంది. కార్మికునికిచ్చే కనీసపు వేతనము విలువ శ్రమదృష్ట్యా చూస్తే ఒక అర్థరోజు శ్రమ పరిమాణానికి సమానమనుకుందాం అంటె పెట్టుబడిదారుడు ఒక అర్థదినపు పరిమాణముగల శ్రమ కనీసపు వేతనరూపంలో శ్రామికునికిస్తూ ప్రతిఫలంగా ఒకపూర్తిరోజు శ్రమ ఫలితమైన వస్తువు పొందుతాడు. శ్రామికుని ప్రయాసతో ముందుకున్న రెట్టింపు ఉత్పత్తి పెరిగేవిధంగా నూతన యాంత్రిక సాధనలను పెట్టుబడిదారుడు ప్రవేశపెట్టెననుకుందాం దీనివలన ఉత్పత్తి రెట్టింపైనా, అతడు వేతనాలను మాత్రం ఏవిధంగాను పెంచడు. లాభభాగాన్నంతని తనకే అట్టేపెట్టుకొంటాడు. తిరిగి ఈ లాభాన్నంతా ప్రోగుచేసి దాన్ని పెట్టుబడిగా తయారుచేస్తాడు. కార్మికులను ఈవిధంగా అన్యాయంచేసి లాభాలను ఆర్జించకపోయినట్లైతే పెట్టుబడి నిర్మాణం వీలుపడదు. ఇలాగని మార్క్సు పెట్టుబడిని, యాంత్రిక పరికరాలను, శ్రామికులను నిరసిస్తున్నాడని తలచకూడదు. కాని ఈ ఉత్పత్తి సాధనాలను పెట్టుబడిదారుని స్వంత ఆస్తిగా పరిగణించరాదని ఆయన వాదం. ఈవిధంగా సాంప్రదాయిక మార్గపు విలువల సిద్ధాంతాన్ని, వేతన సిద్ధాంతాన్ని తన భావాలలో సమన్వయపరచి పెట్టుబడిదారీ వ్యవస్థపై ఆయుధంగా ఉపయోగించాడు మార్క్సు.

ఇటువంటి ప్రయత్నాన్నే మార్క్సుముందు చేసి కొంత విజయం సాధించినవాడు జోహాన్ కార్ల్ రాడ్‌బెర్‌టస్ (1805-1875) అనే జర్మన్ ఆర్థిక శాస్త్రవేత్త. అయితే మార్క్సంత స్పష్టంగాను, విస్తృతంగాను తార్కికంగాను ఈయన సిద్ధాంతీకరించలేక పోయాడు.

చారిత్రిక పరిణామాన్ని గురించి మార్క్సు వెలువరించిన భావాలు అతడు హెగెల్ తత్త్వప్రభావానికి ఎంతగా లోనయ్యాడో విదితం చేస్తాయి. హెగెల్ తత్త్వ ప్రకారం మానవసంఘ పరిణతి ద్వంద్వ విషయ పరస్పర సంఘట్టన పూర్వకమైనది. స్థూలంగా ఈ తత్త్వాన్నే తీసుకొని చారిత్రక పరిణామానికి ప్రయోగించాడు మార్క్సు. దీనికే ద్వంద్వ సంఘర్షణాత్మక భౌతిక వాదము (Dilectical-materialism) అనిపేరు. ప్రథమంగా ఒక సంఘము క్రింద ఏర్పడి మానవులు పరస్పర సహకారంతో మెలగేవారు. స్వేచ్ఛా సమానత్వాలు ఆ ఆదిమ సంఘంలో నెలకొని ఉండేవి. కాని కాలక్రమేణ ధనం, అధికారం హస్తగతం చేసుకునే యత్నంలో తగాదాలు, కొట్లాటలు, పరస్పర వైషమ్యాలు ఏర్పడినాయి. ఆ సంఘం అనేక తెగలుగా చీలిపోయింది. ఈ తెగలు ఒకదానితో ఒకటి పోరాటం సలిపే కొల్లగొట్టేవి. శాంతి సమానత్వాలు నాశనమయ్యాయి. యుద్ధ పరికరాలు, యంత్రాలు కనుగొనబడ్డాయి. పూర్వపు శాంతి కాముకత, సర్వాదరణ పరాయణత్వం అడుగంటాయి. తదనుగుణమైన సాంఘిక పరిస్థితులు దానితో ప్రబలము కాజొచ్చాయి.

ఈ విధమైన కల్లోలాన్ని, దౌర్జన్యాన్ని పోగొట్టడానికి నూతన సంస్థలు, నూతన భావాలు అవసరం. దౌర్జన్యంవలన, కల్లోలంవలన లాభపడేవారు ఏ మార్పులను అంగీకరించక ప్రాతవిధానాన్నే బలపరుస్తారు. కాని వారి దౌర్జన్యాలను, అన్యాయాలను బాధపడే కార్మికులు ఎంతో కాలం సహనంగా ఉండలేరు. పరస్పర విరోధులయిన ఈ రెండు తెగలకు కలహం సంభవిస్తుంది. ఈ పరిస్థితి క్రమంగా తీవ్ర సంఘర్షణకు దారితీసి అంతంలో ఒక నూతన సాంఘిక వ్యవస్థను జనింపజేస్తుంది. తరతరాలుగా తమను పీల్చి పిప్పిచేస్తున్న పెట్టుబడిదారుల నిరంకుశత్వంనుండి విడివడి శ్రామికులు తమకు సౌఖ్యకరమైన నూతన రాజ్యాంగాన్ని. నూతన సాంఘిక నియమావళిని తయారు చేసుకుంటారు.

ఇదంతా చాల శాస్త్రీయమైన భావమని మార్క్సు విశ్వసించాడు, డార్విన్ పరిణామ సిద్ధాంతం వలెనే ఇది అతితార్కికము, అతిసహజము అయిన సిద్ధాంతమని ఆయన అభిప్రాయం. సాంఘిక పరిణామము ఏదో ఒక్కరోజులో జరిగిపోయేది కాదనీ, అది చరిత్రగమనం వలన సిద్ధించేదనీ మార్క్సు విశ్వసించాడు. ఈవిధమైన శాస్త్రీయ తర్క విధానమే తన సామ్యవాద సిద్ధాంతానికి ఒక ప్రత్యేకత కలిగించి అంతకుముందున్న భావాలను మించిందని మార్క్సు పేర్కొన్నాడు.

ఈవిధమైన చారిత్రిక పరిణామాన్ని విస్మరించి ఏదో బ్రహ్మాండమైన విప్లవాన్ని గురించి కలలుకనే తత్త్వజ్ఞులను మార్క్సు తీవ్రంగా నిరసించాడు. చారిత్రకంగా పరిస్థితులు పరిపక్వస్థితిలోనికి రానిదే ఏదో విప్లవాన్ని లేవతీసి ప్రభుత్వాన్ని కూల

ద్రోయమని మార్క్సు తన జీవితంలో ఎన్నడూ ఉపదేశింపనేలేదు. ఐతే ఆ పరిపక్వస్థితి వచ్చినతరువాత అహింసాయుతంగా పెట్టుబడిదారీ విధానాన్ని తొలగిద్దామంటే సాధ్యమయే విషయం కాదని ఆయన ఊహ. ఆ పరిస్థితులలో తరతరాలుగా దురవస్థలో ఉన్న కార్మిక వర్గమంతా తిరుగుబాటుచేసి విప్లవంలో విజయాన్ని సాధిస్తుంది. పెట్టుబడిదారీ విధానానికి ప్రారంభంలోనే పతనం ఎన్నటికీ సంభవింపదు. దాని ఉచ్ఛస్థితి వచ్చిన తరువాత దానివలన అన్నీ కష్టనష్టాలే కాని ఏవీ ఉపకారం లేదని ప్రజలు తెలిసికొన్న తరువాతనే దానికి పతనం సంభవిస్తుంది. ఈవిధంగా పెట్టుబడిదారీ విధానపు పతనము, కార్మిక రాజ్యాంగవ్యవస్థ నిర్మాణము చాల సహజంగా, పరిణామాత్మకంగా జరుగుతాయి.

ఈ పరిస్థితులలో సామ్యవాద నాయకుల కర్తవ్యం ఏమిటో కూడా మార్క్సు ఉపదేశించాడు. పీడిత కార్మికవర్గానికి వారిబాధలకు హేతువేదో తెలిపి, వారి తిరుగుబాటుకు సర్వవిధాల చేయూతనొసగి వారికి తగు సలహాలనివ్వడమే నాయకుల కర్తవ్యం.

తన సిద్ధాంతాల శాస్త్రీయతను నిరూపించుకొనడానికి అవి ఆచరింపబడితే ఏమిజరుగుతుందో ముందుగానే సూచించాడు కార్ల్ మార్క్సు. కార్మికులసంఖ్య క్రమముగా పెరిగిపోవడం, పెట్టుబడిధనమంతా కొందరు వ్యక్తులహస్తాలలో కేంద్రీకృతం కావడం ప్రథమంగా జరుగుతుంది. కార్మిక వర్గానికీ ("Proletariat") పెట్టుబడిదారులకు నడుమ సంఘర్షణవృద్ధి అవుతుంది. ఈ సంఘర్షణలో కార్మికవర్గం రెండువిధాలుగా విజయాన్ని సాధింపవచ్చును. ఒకటి ప్రజాస్వామ్య పద్ధతులద్వారా ఎన్నికలలో గెలిచి అధికారాన్ని హస్తగతం చేసికొనడం, రెండవది విప్లవాన్వితంగా పెట్టుబడిదారులను సంహరించడం. ప్రథమశాంతి మార్గంద్వారా విజయం ప్రజాస్వామ్య దేశాలలో జరగడానికి కొద్దిగా అవకాశం ఉందని మార్క్సు సూచించినప్పటికీ, ఆ విధానంపైన ఆయనకు నమ్మకం లేదు.

పెట్టుబడిదారీ వ్యవస్థ పరిపక్వమునందినకొలది కార్మికవర్గమునకు కష్టనష్టాలు ఎక్కువౌతాయని మార్క్సు తెలియజేశాడు. క్రమంగా పెట్టుబడిదారులు అధికలాభాలనాశించి శ్రామికుల వేతనాలను తగ్గించి, వారు చేయవలసిన పనిని కష్టతరం చేస్తారు. రానురాను ఉత్పత్తి పెరిగిపోవడం, గిరాకీ తగ్గిపోవడం సంభవిస్తుంది. తమవద్ద పెరిగిపోతూన్న పెట్టుబడిధనంతో లాభాలకోసం తహతహలాడే ధనికులు ఏమిచేయాలో తోచక ఈ విధానాన్ని అన్నిరంగాలకు వ్యాపింపచేస్తారు. వ్యవసాయంలోకూడా ఈవిధానం ప్రబలమౌతుంది. భూమిఅంతా కొంతమంది పెట్టుబడిదారుల వశమై తదితరులంతా కేవలం కార్మికులౌతారు. ఈ రంగంలోకూడా పెట్టుబడి హెచ్చైన కొలదీ లాభాలు తగ్గిపోతాయి. ఈవిధంగా ఒకవంక నిర్విరామంగా పోగుపడుతున్న పెట్టుబడి ధనం, తీవ్రంగా పడిపోతూన్న గిరాకీ, —వీనికితోడుగా ఆర్థికరంగంలో తీవ్రసంచలనం కలిగించే పాటుపోట్లు ఎక్కువై కష్టపరిస్థితులకి దారి తీస్తాయి. కార్మికవర్గం సహనం పూర్తిగా కోల్పోయి అఖండవిప్లవానికి ముందంజవేస్తుంది. ఆ మహావిప్లవ సంగ్రామరంగంలో పెట్టుబడిదారుడు సంపూర్ణంగా నాశనం చేయబడతాడు. అధికారం, ధనం, అన్నీ కార్మికుని వశమౌతాయి. ఈ విధంగా, తనలో అంతరంగికమైన తీవ్రమైన దోషాలమూలంగానే పెట్టుబడిదారీ వ్యవస్థ దారుణపతనం పొందుతుంది. అంతా సహజ చారిత్రిక పరిణామం. దీనినెవరూ ఆపలేరు. ఇదే భవిష్యత్తునుగూర్చిన మార్క్సు ఊహాచిత్రం.

పెట్టుబడిదారీ విధాన వినాశనం, కార్మికపక్ష విజయం సిద్ధించినతరువాత విశ్వశాంతి, మహాసౌఖ్యం-ఇంకా ఏవేవో వాటంతటవే కలుగుతాయి అని అనడమే కాని తత్సాధనకు ఏ నిర్ణీతప్రణాళికను మార్క్సు సూచింపలేదు. ఆ స్థితిలో రాజ్యాంగాన్నిగూర్చి, ప్రభుత్వాన్నిగూర్చి, ఆయన కొంతవంకే పేర్కొన్నాడు. అపుడు కార్మికపక్ష కార్యనిర్వాహకవర్గమే ప్రభుత్వంగా వ్యవహరింపకలదట. విరోధిపక్షం సర్వనాశనమవడంవలన దీనికి సర్వనియంతృత్వాధికారాలు వస్తాయి. దీనినే మార్క్సు కార్మికపక్ష నియంతృత్వము ("Dictatorship of the proletariat) అని వ్యవహరించాడు. కాని ఈ నియంతృత్వంకూడ అట్టేకాలం ఉండదు. సంపూర్ణమైన సామ్యవాద స్థితి రాగానే ఈ రాజ్యాంగమంతా దానంతటదే సహజంగా అదృశ్యమౌతుంది. తిరిగి ప్రజలలో స్వేచ్ఛా సమానత్వాలు, పరస్పర సహకారం తలలెత్తుతాయి. వర్గవిభేదాలు, పరస్పర కలహాలు లేని ఆ కార్మిక మహా వ్యవస్థలో మానవుడు సర్వసుఖాలననుభవిస్తాడు. ఈ విధమైన ఊహాచిత్రమే కాని ఒక విధమైన నిర్ణీత ప్రణాళికల మార్క్సు సూచింపలేదు. సామ్యవాద వ్యవస్థలో ధరల నిర్ణయం ఏ విధంగా జరుగుతుంది? పెట్టుబడి ఏ రంగాలలో ఏ పద్ధతులలో ఉపయోగింపబడుతుంది? ద్రవ్యోల్బణాది దుష్టశక్తులు ఏ విధంగా అదుపులో పెట్టబడతాయి? ద్రవ్యము, లాభములు ఏ పరిమాణాలలో పంపకం చేయబడతాయి? అనే ప్రశ్నలకు మార్క్సు సమాధానాలు సూచింపనైనా లేదు. అయితే ఈయన సిద్ధాంతాలవలన కార్మిక పక్షానికి ఒక గొప్ప ఆధారం లభించింది. ఏ విధంగా వ్యవసాయ దారులకు ఫ్రెంచి ఫిసియోక్రాట్ ఆర్థిక విజ్ఞా

నుల కృషి చేయవలసి వచ్చిందో, ఏ విధంగా పెట్టుబడి దారులకు సాంప్రదాయిక ఆర్థిక శాస్త్రజ్ఞుల సిద్ధాంతాలు ప్రోత్సాహాన్ని కలుగజేశాయో, అట్టి విధంగానే కార్మిక పక్షానికి మార్క్స్ రచనలు అధిక బలాన్ని చేకూర్చాయి.

ఈ విధంగా మార్క్స్ ఆర్థిక శాస్త్ర సిద్ధాంతాలను సింహావలోకనం చేసుకొన్న పిదప తత్ప్రామాణికత్వాన్ని పరిశీలిద్దాం.

ఏ ఆర్థిక సిద్ధాంతాలను ఆధారంగా చేసికొని మార్క్స్ శిష్యులు సామ్యవాద తత్త్వాన్ని విప్లవాత్మకంగా ప్రపంచ విస్తృతం చేయాలని నడుము కట్టుకున్నారో, ఆ తత్త్వంలోనే అతి ప్రాథమికమైన దోషాలుండడం గమనార్హం.

మార్క్స్ సగర్వంగా విశదీకరించి అతి శాస్త్రీయమని చాటిన చారిత్రక పరిణామ వాదము అసత్యమైనది. ఆయన ఊహించినట్లు, పెట్టుబడిదారీ విధానం ఎంతో పరిపక్వస్థితినందిన అమెరికా సంయుక్త రాష్ట్రములవంటి దేశాలలో సహితం వ్యవసాయం పారిశ్రామికం చేయబడి, కొద్దిమంది పెట్టుబడి దారుల హస్తాలలో భూమంతా కేంద్రీకరింపబడ లేదు. పైగా, ఆయా దేశాలలో ప్రభుత్వాలు చేసిన భూసంస్కరణములవలన వ్యవసాయరంగంలో అనేక మార్పులు వచ్చాయి. భూమి కొలదిమంది పెట్టుబడి దారుల చేతులలో కేంద్రీకరింపబడటానికి మారుగా శాసనములవలన ఎంతగానో వికేంద్రీకరింపబడి చిన్న చిన్న రైతులకు ఆర్థిక పటుత్వం కలిగించింది. ఈవిధంగా జరగగలదని మార్క్స్ మేధాశక్తికి ఊహాతీతమైంది.

పెట్టుబడిదారీ వ్యవస్థ పురోగమించినకొలదీ, కార్మికుల సంఖ్య అత్యంతాధికమై అన్ని వర్గాలను అధిగమిస్తుందని మార్క్స్ ఊహించాడు. కాని చరిత్ర గమనం దీనినికూడ అసత్యమనే నిరూపించింది. కాలక్రమాన వృత్తి విద్యల మూలంగాను, చిన్న చిన్న వర్తకములమూలంగాను, ఇతరమైన ఉపాధులమూలంగాను జీవనాన్ని సాగించేవారి సంఖ్య పెరుగుతోందే కాని దేశమంతా కార్మికులతో నిండిపోవడం లేదు.

కార్ల్ మార్క్స్ ఊహాచిత్రణంలో అన్నిటికన్నా ముఖ్యమైన దోషము పెట్టుబడిదారీ వ్యవస్థ వృద్ధి చెందినకొద్దీ కార్మికుల కడగండ్లు అధికమౌతాయని. మార్క్స్ చేసిన వర్ణనమంతా అతిశయోక్తి అని కొన్ని ఆధునిక పెట్టుబడిదారీదేశాలు నిరూపించాయి. బాగా వృద్ధిచెందిన పెట్టుబడిదారీ దేశాల్లో మార్క్స్ చెప్పినట్లు వేతనాలు తగ్గిపోయి, కార్మికులంతా కడగండ్లపాలు కాలేదు. వారి జీవనప్రమాణాలు రోజు రోజుకీ పెరుగుతున్నాయి. అమెరికావంటి పరిపక్వ స్థితి నందిన పెట్టుబడిదారీ విధానము గల దేశాలలో స్వంతకార్లలో సుఖంగా తిరిగే కార్మికులను చూస్తే మార్క్స్ ఊహాచిత్రం ఎంత వాస్తవికతా రహితమైనదో తేలుతుంది.

ఇక మార్క్స్ పరిణామ సిద్ధాంతంలో మరొక ఘోరమైన అసత్యాంశం ఒకటి ఉన్నది—కార్మిక విప్లవం, బాగా పరిపక్వత నందిన పెట్టుబడిదారీ దేశము లందే సంభవిస్తుందని ఆయన ఊహ. ఇదికూడా సత్యదూరమని చరిత్ర నిరూపించింది. పంతొమ్మిదివందల పదిహేడవ సంవత్సరంనాటికి రష్యాదేశంలో పెట్టుబడిదారీ విధానం అసలు ప్రారంభదశలో నయినా ఉందా అన్న విషయం సందేహాస్పదం. అలాగే విప్లవం నాటికి చైనాలో పారిశ్రామికాభివృద్ధి ఏ మాత్రం లేదు. ఈ దేశాలలో విప్లవాలను రాజకీయ విప్లవాలంటే కొంత సబబుగా ఉంటుంది! ఇంక అటు వంక బాగా పరిపక్వ స్థితిలోనికి వచ్చిన పెట్టుబడిదారీ వ్యవస్థలలో—ఉదాహరణకు అమెరికాలో అసలు సామ్యవాద మహావిప్లవ ప్రసక్తే లేదు!

ఈ దోషాల నటుంచి ఆర్థికశాస్త్ర విజ్ఞానిగా కారల్ మార్క్స్ స్థానం పరిశీలిద్దాం. కార్మికుల కష్టాలను చూచి అత్యద్భుతంగా వ్రాసిన ఆయన విప్లవాత్మకమైన వ్యాసాలు, గ్రంథాలు, పలుతీర రాజకీయ మహాప్రభంజనాలను పురికొల్పాయి. ఆయన సిద్ధాంతాల నాధారంగా చేసికొని అనేక నూతన రాజకీయ పక్షాలు పైకివచ్చి చాలా అలజడి కలిగించాయి. అయితే ఈ విప్లవాలు ఆర్థికశాస్త్ర రంగంలో ఏమాత్రం నూతన వికాసాన్ని కలిగించ లేకపోయాయని తెలుపవచ్చును. సాంఘిక పరిణామ విజ్ఞానానికి మార్క్స్ సిద్ధాంతం ఒక అమూల్యమైన చేర్పు. అయినప్పటికీ కేవలం ఆర్థికశాస్త్ర దృష్ట్యా దానికి అంత గొప్ప విలువ లేదు. మార్క్స్ ప్రతిపాదించిన మారకపు విలువల సిద్ధాంతం, వేతన సిద్ధాంతం—అన్నీ కూడా ప్రాచీన శాస్త్రజ్ఞులు చాలావరకు కూలంకషంగా చర్చించినవే కాని క్రొత్తవేమీ కావు.

ఈ విధంగా నిష్పాక్షిక మయిన ఆర్థికశాస్త్ర దృష్టితో చూస్తే కార్ల్ మార్క్స్—కీన్సు, రికార్డో, మార్షల్ మొదలైన ఆర్థిక శాస్త్రవేత్తల తరహాకు చెందినఆర్థిక శాస్త్రవేత్త కాదని చెప్పవచ్చును.

# మొక్కుబడి

## 'మంజీర'

వనపతి నాయుడుగారిని గురించి, అందరు అనేక విధాల చెప్పుకుంటారు. ఈ పెద్దమనిషి గురించి చెప్పేటప్పుడు, నా పాతస్నేహితుడొకడు తనముఖం చాటంత చేసుకొని, ఆయన చాలా మంచివాడనినీ, ఆయనకు ఆయనే సాటి అనినీ అలాంటి ఘనుణ్ణి మరొకణ్ణి తన జీవితంలో చూడలేదనీ, చూడబోడనీ, కాచి వడబోసినట్లు చెప్పాడు. ఇంత పాత స్నేహితుడు అంత గొప్పగా చెప్పుతూంటే కాబోసు అనుకున్నాను. కాదనడానికి దమ్ములేవు సరికదా. వాడు నా చెవి నులిమిపుచ్చుకుని బోధించగల అర్హతగల స్నేహితుడు మామూలుగా బీదవాళ్ళు చెప్పడంచూస్తే "ఇంత దుర్మార్గుడా!" అనిపిస్తుంది. మొత్తంమీద ఆయన మంచివాడు, మంచివాడని, పెద్దమనుష్యులు చెప్పినా, ఆయన్ని మరోరకం మనుష్యులు ఎంతో చెడవాడంటూ వాపోవడం వింటూంటే యీ మంచి చెడ్డల కేమయినా అర్థముందా అనిపించేది. ఈ పైవిషయాన్ని ప్రాతిపదికగా తీసుకుని యోచిస్తే, ఒకనిర్ణీతమయిన పరిస్థితులలో ఉన్న ఒకవ్యక్తి దృష్టిలో ఏదయితే మంచిదో, అదే మరోపరిస్థితులలో ఉన్న ఇంకొకడి దృష్టిలో చెడుగా కనిపిస్తుంది. నామట్టుకు నేను యీ వస్తువు చెడ్డది, యీపని మంచిది అని స్థిరపరచలేను. అందుచేతనే కాబోలు నాయుడుగారిని గూర్చి నేను ఏ అభిప్రాయానికీ రాలేకపోయాను. ఆయన మంచిచెడ్డలు గ్రహించాలంటే, ఆయన సంగతి సందర్భాలు గ్రహించాలి.

వెంట్రుకలన్నీ తెలగా నెరిసిపోయి, కళ్ళకు సులోచనా లలంకరించినా, మనిషి పిడుగులాఉంటాడనడానికి సందేహంలేదు. మాటలాడుతూంటే పిట్టలు నీళ్ళు త్రాగవు! చాలాకాలంగా గుమాస్తాపని చేస్తున్నాడు. ఎప్పుడూ ఒకటే వేషం. ఆ జారిపొయ్యే పంచకట్టు, చొక్కాకన్నా చిన్నకోటూ ఆయనా, నడుస్తూంటే జాలేస్తుంది. ఆయన ఎన్నాళ్ళ బట్టి గుమాస్తాపని జేస్తున్నాడో ఆయనకే తెలీదేమోకూడా నిజానికి!

మొన్న ఈమధ్య ఒకాయన వచ్చాడు. ఆ మహానుభావుడు సైకిలుమీదే హిందూదేశం అంతా తిరిగేస్తాడు! అలా మన హిందూదేశాన్ని ఉద్ధరించేశాక, ప్రపంచమంతా చుట్టేసి చక్కా వస్తాడుట! సోముకొసుగుడిలాగ! రోజూ సరాసరి 15 మైళ్ళు సైకిలు త్రొక్కుతాడట! అదీ ఆయన ఘనత! ఆ మహనీయ వ్యక్తిని ఆ రోజున సందర్శించడానికి వచ్చినంతజనం ఆవూళ్లో దేవుడి పెళ్ళిన్నా రారు. రోజుకు 15 మైళ్ళు సైకిలు త్రొక్కడమనేదేదో మానవాతీత కార్యంలాగ ఎంచేసి ఆ సైకిలుగాడికి హాహాకారాలతో స్వాగతగీతులు పాడి రెండుపూటలా మేపి, కొంత దక్షిణ కూడా ఇచ్చి పంపారు, ఊరిపెద్దలు. ఆ లెక్కని చూస్తే నాయుడుగారు రోజుకు చులాగ్గా 15 మైళ్ళదూరం నడుస్తారు. అంటే తిన్నగా రోడ్డుమీదగాకపోయినా ఇంటినుండి ఆఫీసుకు, ఆఫీసులో అధికారివదకు అరవైసార్లు, ఆ పైన ఇంటి వ్యవహారాలు కొల్లలు! ఈ తిరగని దూరం తక్కువేం ఉంటుందా ఏమిటి? ఎవడూ లెక్కేసి చూచుకోడుగాని ఇంత తిరుగుడు తిరుగుతూ, ఆఫీసులో తలబద్దలయ్యేలాగ చాకిరిచేస్తూ ఇప్పటికి పాతిక సంవత్సరాలు గడిపాడే! ఈయన పోతూంటే, హాహాకారాలు లేవు సరికదా, ప్రక్కన తిట్టకుండాను, వెక్కిరించకుండాను ఉంటే అంతేచాలు! అదలాగు. ప్రపంచ ధోరణి ఇంతేనేమో! ఇన్నేళ్ళనుండి పని జేస్తున్నా ఆయన ఉద్యోగంలో యెమీ యెదుగూ బొదుగూ లేదు. కాని ఆయన సంసారంమాత్రం అపారంగా పెరిగిపోతూంది. ఏడాదికో నోరు అన్నంకోసం తెరుచుకుంటూంది. నాయుడుగారి ఉద్యోగం మామూలే. ఆడపిల్లలు యెదిగి పెద్దవాళ్ళయ్యారు; ఆ పైన తోడివాళ్ళంతా ఏదో తమాషాగా విసురుతున్నారు కటువుమాటలు. ఆ విసరటంలో ఉన్న అందం ఏమిటంటే, సరిగా నాయుడుగారి చెవిలోనే దూరుతున్నాయవి! నాయుడుగారు ప్రపంచంతో చేయీ చేయీ కలిసిపోయే మనిషి. ప్రపంచానికి అడ్డుతిరగడు. ఎవడయినా అడ్డొస్తే సహించలేడు. అందరూ అంతే ఎవరో కొందరు తప్ప. ఇక ఊరుకుంటే తనకున్న పరువూ ప్రతిష్ఠ కాస్తా కొట్టుకుపోతాయేమో ఆనిందా ప్రవాహంలో నని ఆయన భయం. వెతికి వెతికి చాలా తెలివైనవాళ్లు, గొప్పవాళ్లు, తన పిల్లలకు తగినవాళ్ళూ, అల్లుళ్ళనుఅనుకున్న యువకచక్రవర్తులను ఎంచిఎంచి, తనకున్న స్థిరచరాస్తుల తెగనమ్మగా వచ్చిన ధనంతో కొని పారేశాడు! ఆ యువకరత్నాలుకూడా తమకు తగిన విలువ దొరికిందిగదా అన్న ఆశతో ఉబ్బితబ్బిబ్బై ఆ

లంచామణులను చేపట్టారు. ఆ దెబ్బతో నాయుడుగారింట్లో సిరీ, సంపదకూడా ఖాళీ అయినాయి. అయినా నాయుడుగారి ఆనందానికి మేరలేదు. తను ప్రపంచాన్ని సంస్కరించాడు. ఇంట్లో దమ్మిడీ లేదు. కరువు రోజురోజుకూ పెరుగుతోంది. అమెరికా ఐశ్వర్యంలాగ. ధరలు పదిరెట్లు అయాయి. కాని నాయుడుగారి జీవితం మామూలే. కష్టం మామూలే. ఆ అని అడగడానికి వీల్లేదెవరికీ. కాని తనకళ్ళముందు, ఉద్యోగంలో చేరినవాళ్ళు, తనవద్ద పని నేర్చుకున్న వాళ్లు పెద్ద పెద్ద ఉద్యోగస్థులయి పోతున్నారు. వాళ్ళల్లో ఉన్న విశేషం, తనలో లేని శక్తి ఏమిటి చెప్మా అనుకున్నాడు నాయుడుగారు.

ఈ విషయం గురించి పరిశోధనలు చేయటం మొదలు పెట్టారు. దాని అంతూ కనిపెట్టారు. అన్నిటికీ మూలం ఏమిటో గ్రహించారు. తన ఈ ఆఖరి దశలోనయినా నాలుగురాళ్ళు సంపాయించకపోతే తన పిల్లలగతి యేంకాను! తన వృద్ధాప్యంలో, యింత గింజుకునే లోకం, ఒక కాని యిస్తుందా తను చేతులు జోడించి దీనంగా ప్రార్థిస్తూంటే? అయినా ప్రపంచానికి అనుగుణంగానే నడుచుకోవాలి మరి. ఈ విధమయిన ఆలోచనలు ఆయన మెదడులో ప్రవేశించి వృద్ధిపొందిన కొద్దీ, ఇంట్లో ఆర్థిక ప్రతిష్టంభన రెట్టింపు యింది. జీవితం సుఖంగా, హాయిగా, సాగాలంటే ఎలాగో అలాగ డబ్బు గణించి తీరాలి అనే ఉద్దేశ్యంలోకి వచ్చేశారు నాయుడుగారు. అదే మానవ ప్రవృత్తిలోని విచిత్రం. ఒకసారి తనకు కావలసిన విషయం మనస్సులో స్థిరపడిందా, దాన్ని ఎలాగో ఒకలాగ, హిమాలయ ప్రమాణమయిన అటంకాలొచ్చినా సాధిస్తుంది. ఆ సుస్థిరమనః ప్రవృత్తే కావాలి! రావాలి! దాన్ని నాయుడుగారు సాధించగల్గారు. అలా ఊరికే అనుకున్నంత మాత్రంలోనే ఆ అచలత్వం రాదు. చుట్టూ ఆవరించిన పరిసితులు కూడా సముకూరాలి.

మగపిల్లల చదువు, యింట్లో తిండి, యింటద్దె, అందరికీ బట్టలు, మనస్సుకు వినోదం, ప్రశాంత వాతావరణం అన్నీలోటే ఈ జీవితంలో! అన్నీ చిక్కులే!

నాయుడుగారి జీవితం యీ చిక్కులమయం అయింది. ఆయన సంసారంలో ఉన్న వ్యక్తుల జీవితాలన్నీ మెలివేసుకుపోయి, చిక్కుపడిన దారపుండలా తయారయాయి. ఒక్క ముడిలో యిమిడింది చిక్కంతా. అదే డబ్బు! అది సంపాదించి తీరుతాననుకున్నాడు, తనలో తను. ఇదివరలోనే యీ అభిప్రాయాన్ని తనకు కలగజేయనందుకు ఆ భగవంతుణ్ణి పూర్తిగా చివాట్లు పెట్టారు. భగవంతుడి కా తెలివి కలగకపోయినా, తీరంటిట తనకు కలిగినందుకు, లోలోన తన్నుతాను అభినందించుకొని, అప్పుడప్పుడు రొంగున తిరిగే తన లోలోపలి అంతరాత్మ గొంతుకోసి చంపి పారేశాడు నాయుడుగారు!

డబ్బు రాబట్టడం ఆరంభించారు. డబ్బుతోపాటే అలాగే గౌరవం పెరుగుతోంది. డబ్బు వచ్చినకొద్దీ నాయుడుగారికి ధనతృష్ణ అధికమించింది. ఏ పనయినా ప్రతిఫలం ముట్టకుండా ఏ దగ్గు చేయ్యలేని అనే స్థితిలోకి వచ్చేశారు. పెద్దయినా, చిన్నయినా, ఎవరయినా. ఏ పనయినా, తన విధయినా, ఏ మయినా సరే, డబ్బు లేందే నాయుడుగారి వద్ద పరిష్కారం కల్ల అనే ఖ్యాతి గడించారు ముందావారు!

కష్టజీవులకిది కష్టంగా ఉన్నా, దొంగ వ్యాపారులు, నోటెడీ వర్తకులు, మొదలైన పరాన్న జీవులకు మాత్రం కన్నతండ్రిలా కనుపించే వారు! నాయుడుగారికి కావలసింది అదే. అది నిర్విఘ్నంగా సాగిపోతూంది. నాయుడుగారికి ఎక్కడ చూచినా తనలాంటివాళ్ళ సంఖ్యే హెచ్చుగా కనిపించేది. ఈ డబ్బున్న ఘరానా మనుష్యుల జీవితాలు తరచిచూస్తే, తనచేసేది ఏమీ కాదు అని సమర్థించుకునేవాడాయన!

అవంతా యెందుకెక్కని, తనలాంటి విషయాలు బయటపెట్టకూడదు. ఆ వేళ ఆవల బజారు కోమటిని గురించి, తనయజమాని తనకేతే. అంతపని చేయించాడు కదా. తనుకక్కుర్తిపడితే తప్పించుకో తెలీలేదు. తను యిన్నాళ్ళు కానీ పుచ్చుకోకుండా పనిజేసే సానుభూతి జూపిన అసామీ ఎవడూ లేడు. ఈ రోజున నాలుగురాళ్ళు సంపాయించి, ఘరానాగా తిరగ్గానే అంతా గౌరవమే!

ఎవరయినా నాయుడుగారిదగ్గర నీతి నిజాయితీల గురించి ఇప్పుడు మాట్లాడితే పెదవులు విరిచి చల్లగా సమాధానం చెప్తే ఒప్పుకుని తీరవలసిందే "చూడండీ, నీతి, నియమం ఉండడం మంచిదే. మనజీవితంలో అటువంటి పవిత్ర ధర్మాలు కలిగి ఉండవలసిన ఆవశ్యకత ఎంతయినా ఉంది. ఎలాంటి నియమాలకయినా ఎల్లలుండడం అవసరం. మన ప్రపంచమంతా పుచ్చిపోయింది. పాడయిపోయింది. నీతి నియమాలు పాటించేవాళ్ళు చాలా అరుదయిపోయారు. అలాంటి సమయంలో ఒకడూ, యిద్దరూ మడికట్టుకూర్చుని, నీతి నియమాల్ని, ఉద్దరిస్తామంటే లాభంలేదు. సరిగదా అన్యాయలోపడి మునిగి చక్కాపోతరు. అందుచేత బుద్ధిమంతుడయిన వాడెప్పుడూ, ఒకచేత్తో ఆ మాయను అసరాగా తీసుకుని, రెండోచేత్తో దాన్ని చెండాడాలి. అంతేగాని మాయమాయ అని అఘోరిస్తే లాభం ఏమిటి?" అంటాడు ధీమాగా.

ఏది ఎలాగున్నా యిప్పుడుమాత్రం నాయుడు గారికి కొంచెం గౌరవం మర్యాద కలిగాయి. వూళ్ళోపెద్దలూ, మోతుబరులూ, నమస్కారాలు జేస్తున్నారు. నాయుడుగారు చాలా సంతోషంగా, ఆనందంగా కాలం గడుపుతున్నారు. దానధర్మాలు చేస్తున్నారు. పెద్దవాళ్లు చిన్నవాళ్లు ఇప్పుడు దానకర్ణుడు అన్నంతవరకు కూడా పొగిడేస్తున్నారు నాయుడుగారిని.

## 2

సరిగ్గా యీ రోజుల్లోనే నేను నాయుడు గారి దాతృత్వం, కీర్తి విని, ప్రక్కనున్నా యింత వరకు కనిపెట్టలేక పోయినందుకు విచారించాను. నా కష్టసుఖాలు, బాధలు, ఆయనకు బాగా తెలుసు. ఆయన ఆఫీసులో ఏదో గుమాస్తాపని ఖాళీగా ఉందని తెలిసి వేయించమని అడిగితే—పొరుగువాణ్ణనేనా చూడకుండా నిక్కచ్చిగా అడిగాడే లంచం! ఆఖరుకి ఆఫీసరుని బ్రతిమిలాడినా లాభం లేదనీ, ఈయనవల్లనే అవుతుందనీ బంట్రోతు కూడా స్పష్టంగా చెప్పేశాడు పావులా పుచ్చుకున్న తరువాత ఆయన కాళ్లా వేళ్లాపడి బ్రతిమిలాడి నెలనెలా పదిచొప్పున యిచ్చుకుంటానని ఆ నౌఖరీలో చేరాను.

ఆయనమాత్రం నాదగ్గర డబ్బుపుచ్చుకోడం చేతో, మరెందుచేతో గాని. నాయందమితవాత్సల్యం ప్రకటించేవాడు. తీరిక సమయాల్లో గుమాస్తాయొక్క గురుతర బాధ్యతలు, కష్టసుఖాలు, ఆర్థిక సమస్యల గూర్చి సమగ్రంగా ఉపన్యాసాలు దంచేసేవాడు.

ఇంకా సంతోషంగా ఉన్నప్పుడు "చూడ్రా అబ్బాయీ! నీదగ్గరేదో పదిరూపాయలు పుచ్చుకుంటున్నానని బాధపడకు. అది గుమస్తా ఉద్యోగ ధర్మం. పైపెచ్చు మననియమం. అసలీ గుమస్తాగాడి కింతతక్కువ జీతమియ్యడం ఎంచేతో తెలుసా. అంచేతే, అంతే, అలా ఉండకపోతే యీ గుమస్తా గిరీవదిలేసి, సంసారం సాగరంలో తోసేసి సన్యాసం పుచ్చుకోడం మేలు. తెలిసిందా. ఈ కిటుకు లన్నీ తెలుసుకుని నీ ఉద్యోగం సక్రమంగా నిర్వర్తించావా అందరికీ మంచివాడివే. నీ ఆఫీసరు కూడా ఆనందిస్తాడు. లేకపోతే చాలావిచారించవలసిన పరిస్థితుల్లో పడి చిక్కుపోతావు. అవగాహనచేసుకో నాయనా!" అంటాడు.

అన్నిటికీ నేను చేతులు జోడించి తాళం వేస్తూండడం మొదలుపెట్టాను. అందుకే గాబోలు నాయుడుగారు నేనంటే పడిచచ్చిపోయేవాడు. నేనంటే ఆయనకు ఎక్కడలేని తెలివితేటలూ ఊడి పడేవి. మన బ్రహ్మాండ నాయకులకు పయితంలేని వక్తృత్వపటిమ చక్కావచ్చేది. ఆయన యెప్పుడయినా ఆహ్లాదంగా ఉన్నప్పుడు నే కనపడితే చాలు. కూర్చోమని కప్పు కాఫీయిచ్చి మొదలెడతాడు.

"ఇలా చూడరా అబ్బాయీ (నేమాస్తూనే ఉంటాను లెండి) (బ్రిటిషువాళ్ళు మనదేశం దోచుకుందుకు వచ్చారు. వాళ్ళకు బలం వుంది. దేశం దేశాన్ని దోచేసుకు నేవారు మన నోళ్ళు నొక్కి. అదే న్యాయం అయింది. వాళ్ళని తరిమేశాం నీతో బ్రహ్మాండమయిన ఉద్యమాలు నడిపి. ఆ ఉద్యమాలో చచ్చినవాళ్ళూ, త్యాగంచేసినవాళ్ళూ యెవరు? నువ్వూ నేనే. అయినా యిప్పుడు నీకూ నాకూ ఏముంది? యిదివరకేముందో అదే నీకూ నాకూ. ఓకానీ ఎక్కువివ్వాలంటే యెక్కడలేని ఆర్థిక సమస్యలు, విదేశాంగ వ్యవహారాలు అడ్డంవస్తాయి. కానీ యీ పరిశ్రమాధికారులూ, భూస్వాములు, గుత్తవర్తకులు పెట్టుబడిదారులూ ఎలా డబ్బు చేసేసుకుంటున్నారో! ఇళ్ళమీదయిళ్ళు, కారమీదకారు, నూటమీద నూట్లు విలాసాలు, సరదాలు, పెళ్ళాలు, బిడ్డలు అన్నీని. ఇవన్నీ చట్టసమ్మతాలే? న్యాయమైనవే? ధర్మసంబంధాలే? నువ్వూ నేనూ అనడానికి వీల్లేదు. నువ్వు "ఆ" అన్నావంటే చట్టవిరుద్ధం. నువ్వూ, నీ ఉద్యోగం, నీ బ్రతుకు కూలిపోతాయి. మాడిమసి అవుతాయి. అంచేత నీచాతనయినంతవరకు నువ్వూ దోచుకుంటూండు. ఇది పరమరహస్యం సుమా! మనయిద్దరి మధ్య అంతరంగిక సంభాషణమాత్రమే. ఎటొచ్చీ వాళ్ళకు నీకూ తేడా ఏమిటంటే చట్టం వాళ్లని రక్షిస్తోంది నన్ను భక్షిస్తోంది అంతే."

"ఈపరిస్థితు లున్నంతవరకూ నువ్వూ నేనూ ముడిగట్టుకు కూర్చుంటే నశించిపోతాము. అయినాగాని మనము చేసేది ఓలెక్కా ప్రైవాటితో పోలిస్తే. ఈ సొంతవ్యాపారాలు, పరిశ్రమలు, డబ్బుచేసుకోడాలు, ఉన్నంతవరకు, నన్ను నువ్వు, నిన్ను మరోడూ, మనందర్నీ యింకోడూ కొల్లగొట్టుకోడం ఎలా పోతుంది. ఏరూపంలోనైనా ఒకణ్ణి మరోడు పీడించుకు తినడాన్ని ఈ సంఘం సమర్థిస్తూ, చట్టాలు రక్షిస్తూ ఉంటే యీ దగాలుపోవు. ముడిగట్టుకు మూర్ఖులా నువ్వూ నేనూ కూర్చోడం చట్టవిరుద్ధం అది నేరమే!" అని ముగించేవాడు ఉపన్యాసం.

ఆయన చిరునవ్వూ అప్పటి ప్రవర్తనా చూసే తన్ను తాను మెచ్చుకుంటూ ఉంటాడని తేలికగా అర్థమవుతుంది. నాకు మాత్రం అది వింటూన్నప్పుడు అంతా సమంజసంగా నే కన్పించేది.

స్వార్థంకోసం ఒకడిని మరోడు దోపిడిచేసుకోడాన్ని అంతుచేసి, కష్టపడేవాళ్ల శ్రమకు తగిన

మనపర్లోన్తై ఫలహారం మాత్రమే. మధ్య మధ్య ఏకాదశీ ఉపవాసాలు, పూజలు యింటిదగ్గర భక్తులందరినీ పోగుజేసి భజనలు గూడా చేయించడం మొదలు పెట్టాను. కనిపించిన దేవుడి గుడికల్లా నమస్కారం పెట్టాను. కనిపించని దేవుణ్ణి భక్తితో కొల్వడం ఆరంభిచాను. ఆఖరికి ఆ కేసులో నాయుడు గారికి జీవితాంతం ఖైదు వేయించేందుకుగాను ఆ భగవంతుడికి నా తలమీద వెంట్రుకలు, గడ్డము మీదుగట్టి మొక్కుకున్నాను.

నాయుడుగారి కేసునుగురించి చాలా ఆత్రుతతో తెలుసుకుంటున్నాను. ఈ మధ్య ఆయన కేసు గురించి వింటూంటే నాకు చాలా విచారం, కోపం, పొడుచుకువచ్చాయి. "ఇంత భక్తితో కొలుస్తున్నా, భగవంతుడికి దయలేదా!" అనుకున్నాను. దేవుడు నమ్మిన వాళ్ళను మోసం చెయ్యడుట. ఏదో వేషం వేసుకునయినా సరే వచ్చి భకులని రక్షించి తీరతాడని ప్రతిస్మృతులు ఘోషిస్తున్నాయి. అయినా నేడో రేపో తేలుతుంది దేవుడి సంగతి!" అనుకునే వాడిని.

ఒక్కొక్కసారి నాయుడుగారి ప్లీడరుగారి సంగతి వింటూంటే, అసలు దేవుడనేవాడు ఉన్నాడా అనే సందేహానికి గూడా తావొచ్చింది. నాయుడు గారి ప్లీడరు అఖండ ప్రతిభావంతుడట! చాలా గట్టివాడట. ఎదుట వారిని తినేస్తున్నాడుటంతే! అతడు అడ్డు ప్రశ్నలో అఖండుడట. ప్రతికక్షులు ఆయన యక్ష ప్రశ్నలకి జవాబు లీయలేక పరుగు లంకించుకున్నారట! యివీ వార్తలు!

దేవుడి మీద కోపం ముంచుకు వచ్చింది. "అయినా నేడో రేపో తేలుతుంది దేవుడి సంగతి అప్పుడు చెప్తాను. ప్రపంచం అంతా చాటేస్తాను. తర్వాత చూసుకుంటా" ననుకునేవాడిని నేను. అలాగే తేలింది. దేవుడున్నాడా లేడా? అనే ప్రశ్నకు నిలువు జవాబు.

నాయుడుగారికి ఆరునెలల కఠిన కారాగార వాసం విధించారు.

"రక్షించావు దేవుడా!" అని వేయినమస్కారాలు చేశాను. చేసిన పూజలు పెట్టిన నమస్కారాలు ఊరికే పోతాయా!

ఇంక దేవుడి మ్రొక్కు మంచిదిి చూసితీర్చాలి. వెంటనే బయలుదేరి వెడదామనుకున్నా. కాని చాలా రాత్రి కావడంవల్ల మానేశాను. మరునాడుదయాన్నే బయలుదేరి పురోహితుడి యింటికి వెళ్ళాను. చెంగుర్తి అడవిలాంటి నా గడ్డాన్ని వదలిపెట్టడానికి తయారవడం కష్టంగానే ఉంది.

అయినా యిది భగవంతుడితో వ్యవహారం. ఆయన ముందా మనదాటులు. విచారంతో గడ్డాన్ని, ప్రేమతో హిమాచలాలాంటి నా బుర్రతడుముకున్నాను. ఆ విచారంలో నా కళ్ళలోనుండి ఒకటి రెండు అశ్రుకణాలు దొర్లాయేమో నాకు తెలీకుండా. ఇలా నాలో నేను బాధపడుతూంటే, శాస్త్రిల్లుగారు తమ బాతాఖానీ మొదలుపెట్టారు.

"మాశారా" అన్నాడాయన నన్ను చూడగానే.

"ఆ! ఏమిటీ" అంటూ ఉలిక్కి పడి ముందు వెనకా చూశాను.

"ఏమీ లేదులెండి" అన్నాడు తాపీగా. ఆసమాధానం చూచేసరికి నావళ్లు మండింది.

"ఏమీ లేకపోతే ఏం చూడమన్నావయ్యా!" అన్నా విసుగ్గా.

"అబ్బే! ఏమీ లేదు. ఆ ముసలిముండా వాడు చాలా మంచివాడు."

"ఆ ముండావాడెవరో కాస్త సెలవిద్దురూ బాబూ."

"ఆ నాయుడుగారండీ! చాలా సజ్జనుడు. తమకు యీ ఉద్యోగం ఆయనే వేయించారుటగా! ధర్మాత్ముడు."

"అదే తమబోటి పెద్దలు చెప్పుకుంటున్నారీ ఊరిలో" అన్నా కోపం పట్టలేక.

"మంచివాడికే కష్టాలన్నీను" అని పెదవి విరిచి, బల్లి అరిచినట్లు చప్పుడు చేసి "ఇంకేమిటిలెండి లాభం! ఉద్యోగమూ పోతుంది. శిక్షను అనుభవించాలి" అన్నాడు తన సానుభూతి యూనత్తూ మాటలద్వారా నే గాకుండా ముఖంద్వారా గూడా ప్రకటిస్తూ.

"అవునంతే మరి!"

"అయినా పెద్ద కోర్టు కెడుతాడుటలెండి."

"అయితే యింకా నాశనమవుతాడట!" అన్నా నా అసూయ కప్పిపుచ్చడానికి ప్రయత్నం చేస్తూనే.

"ఏమో మరి"

"పెద్దకోర్టు కెళ్ళడం అనవసరం. ఏదో ఓ చిల్లి గవ్వ యింట మిగిలితే అది ఖర్చు చేసుకోవడంఒక్కటే జరుగుతుంది"

"నేనూ అదే చెప్పాలనండి. నాదగ్గరకు నిన్న వస్తే."

"చాలాసేపయింది వెళ్ళొస్తా" నంటూ ఓ నమస్కారం ఆయన మొహాన్ని కొట్టేసి బయలుదేరాను యింటివైపు.

పాపం నేనెందుకు వచ్చానో ఎంచేత వెళ్ళిపోతున్నానో అర్థం అవకగాబోలు శాస్త్రిలుగారు అలాగే నిలబడిపోయారు నిశ్చేష్టంగా. "ఇదే దేవుడి పరీక్ష" అనుకుంటూ యిల్లు చేరాను, మిగిలిన ఆఫీసు పని ముగించడానికి.

## 3

నాయుడుగారి సంగతేమీ తెలీడంలేదు ఆఖరుకు ఆయన కుటుంబం గూడా మావూరు వదిలి ఆయన బావమరిది గారింటికి పోయిందిట. ఆయనను గూర్చి నేను చాలా వాకబు చేశాను. కనిపించిన ప్రతివ్యక్తిని ప్రశ్నించాను. ఒక్క సెలవుతీసుకుని స్వయంగా వెళ్ళడం తప్పించి మిగతా పని అంతా చేశాను. తెలిసి యేడిస్తేగా. విసుగెత్తి పోతేపోనీ అని ఊరుకున్నాను. ఆఖరుకి పోష్టలు శాఖవారికిగూడా ఆయన చిరునామా తెలీదుట! జైలుకుపోయి ఉంటాడనుకున్నాను.

ఈ మధ్య నాకు యీ ఉద్యోగం ఖాయంచేసినట్లు ఆర్డర్లుకూడా ఇచ్చేశారు. నా అదృష్టానికి ఎంతో సంతోషించాను. ఆఖరుకి సత్యనారాయణ వ్రతం కూడా చేయించాను. ఇక కాస్త మంచి ముహూర్తం చూసి యీ జుత్తు మొక్కుబడికూడా తీర్చిస్తే బాగుండుననుకున్నా. మనం అనుకున్నంతా జరిగింది.

ఆ నాయుడు పత్తాలేదు. పాపం జైలుకుపోయి ఉంటాడు!

కాస్త వేగంగా యీ వైభవంకూడా తీర్చేస్తే యిక ముప్పుండదని, ఆ శాస్త్రులగారిచే తిరపతిలో మొక్కుబడి తీర్చుకోడానికి ముహూర్తం ఏర్పాటు చేయించాను. ఏదో వేగంగా అవుతుందని నేను ఆలోచిస్తుంటే వాడి సొమ్ముపోయినట్లు శాస్త్రి నాలుగు రోజు లాలస్యంగా యెంచాడా మంచిరోజు. కొందరు చుటాలనీ, పక్కాలనీ పిల్చేశాను సంతోషంకొద్దీ. పోనీ దేవుణ్ణిచూసి పోతారని!

మా బావగారినిచూచి చాలా కాలం అయింది. వెధవ ఉద్యోగాలు! ఎంతెంతదూరాలు పోతున్నారు ప్రజలు. అంతదూరం అయినా ఆయన యెలాగయినా కష్టపడివచ్చి నా మొక్కుబడి మహోత్సవం చూసి పోతానని ఉత్తరంముక్క రాశాడు. ఆయన్ని చూసి కూడా చాలా కాలం అయింది. ఆయన రూపురేఖలే మరచిపోయాను పూర్తిగా.

ఈ శుభవార్త చెప్పడానికి నా భార్యని పిలిచాను. ఆవిడ హంసయానంతో వచ్చేరాడంతోటే యీ వార్త చెప్పాను. ఎంతో ఆప్యాయంగా "మీ అన్నను చాలాచాలా చూడాలనిఉంది." అన్నాను.

"బాగానేఉంది మీరు చూడలేదాయేమిటి నా పెళ్ళికి" అంది. కాస్త సిగ్గు అభినయిస్తూ.

"ఎంతకాలమయిందో ఆయన్ని చూచి? పని తొందరల్లో వస్తాడో రాడో!"

"మొన్న మా పుట్టింటికి వెళ్ళినప్పుడు చూశాను నేను. వాడూ మీలాగే ఏదో మొక్కుబడని గడ్డం పెంచి ఆనవాలు పట్టడానికికూడా వీల్లేకుండా మారిపోయాడు. ఎంతపని తొందరలోఉన్నా నన్నయినా చూడడానికి రాకపోతాడా?"

"అయితే ఆయనకుకూడా ఏదో మొక్కుబడి ఉన్నదన్నమాట మనలాగే! ఎందుకో ఆ మొక్కుబడి?"

"ఏమో ఎవడికి తెలుసు మీ మొక్కుబడులు మీరూను!"

"వెళ్ళు నీపని నువ్వు జూసుకో" అన్నాను ఆమె విసిరిన మాటలకు కాస్త కోపం తెచ్చుకుని. ఆమె విసురుగా లోపలకు వెళ్ళిపోయింది.

మరునాడువయంముహూర్తం దగరకొస్తున్నా మా బావగారు రావడం కనపడ్డంలేదు. నాకాయన మొక్కుబడి ఎందుకో తెలుసుకోవాలని తహతహ! ఆ గడ్డం కోసం నాగడం ఇంతగా ఓపికపటడం నాకే ఆశ్చర్యం వేసింది. గడ్డానికి గడ్డానికీమధ్య ఎంత సామరస్యం వుంది! రోడ్డువైపు కన్ను మూయకుండా చూస్తున్నాను. ఆగడ్డంకోసం చాలా మారాంపెడుతోంది మనస్సు. ముహూర్తం ఘడియలు సమీపిస్తున్నాయి. అయినా జాడలేదు. "ఇంక లేవండిబాబూ!" అంటూ అరిచాడు పురోహితుడు ఏదో మునిగిపోయినట్లు. గడ్డం కోసం ఎదురుచూస్తున్నా ఘటం లేవక తప్పింది కాదు.

ఇలా లేచానో లేదో, దూరంలో గుఱ్ఱంబండి చప్పుడయింది. తొంగిచూద్దునుగదా బండిలోంచి గూడా ఓగడ్డం నావైపే తొంగిచూస్తోంది. సరీగా గుమ్మంముందు ఆగింది. నాగడ్డం ఆనందంతో ఊగిపోయింది, ఆయన బండి దిగీదిగడంతోనే "వచ్చారా" అంటూ ఆనందాతిరేకంతో ఆలింగనం చేసుకున్నాను.

ఆప్యాయంగా గడ్డాలుగూడా కలిసిమెలిసి కొంచెం చిక్కుపడి చాపలా అల్లుకున్నాయి ఒకదానితో ఒకటి!

మావాళ్ళంతా ఆశ్చర్యంతో చూస్తున్నారు.

మా ఆవిడకూడా గబగబావచ్చి ప్రక్కన నిలబడింది.

మళ్ళీ "క్షేమంగా వచ్చారా!" అన్నా హర్ష పులకిత గాత్రుడనై.

"ఆవచ్చానండీ" అన్నాడాయన వర్షంచిలికినట్లు.

"అయితే బావగారూ!" అన్నాను. ఆయన మొక్కుబడిసంగతి అడుగుదామని.

"ఇంకా నన్ను గుర్తుపట్టలేదటండీ" అనికాయన—

"ఆయన మీ బావగారు కాదండీ" అని నా చెవిలో మాటవినడం, అనడం ఒకేసారిగా జరిగాయి.

ఆశ్చర్యంతో పరిశీలించిచూద్దును. యింకెవరు? మా గురువుగారు! నాయుడుగారే!

"మీరా!" అన్నాను దిగ్భ్రమచెంది.

"నే నేనోయి. కేసు గెల్చాను వచ్చి చెడి" అన్నాడాయన ఆనందబాష్పాలు రాలుస్తూ.

నా ప్రాణంమాత్రం అలా మిన్నంటె యెగిరి పోయింది!

"నాపోషింగాండ్ల ధరకూడా ఇచ్చేశారు!" అన్నాడాయన సంతోషంగా.

నాపరిస్థితి జ్ఞాపకంవచ్చి ఆయన్ని పీక పిసికేద్దామా అన్నంతకోపము, అసూయ పుట్టుకొచ్చాయి ఆఉద్రేకంలో యేమీ మాట్లాడలేకపోయాను.

"ఇంత క్రొత్తవాడవుగదా! నీ కెలా యిచ్చారోయి నాఖాళీ ఉద్యోగం?"

"తమ చలవవల్లనే. నేను మీ అడుగుజాడల్లో నడిచాను. అంతే!"

ఆయన కూడా లేత నవ్వులు పెదవుల్లోంచి వదులుతూ ఓ కాయితం ఇచ్చారు, నన్ను చూడమంటూ. ఆయనకు అధికారపని యిచ్చారట. నన్ను మాత్రం ఆ పెద్దమనుష్యులు పదవిలోంచి తీసెయ్యలేదు. అదే పదివేలనుకున్నాను.

"ఈ గడ్డం, యివంతా యేమిటి" అన్నాడాయన.

"తమర్ని యీ చిక్కులనుండి తప్పించేందుకుగాను దేవుడికి మొక్కుబడి" అన్నాను.

"సెబాష్ ఇవంతా దేవుడివదయే సందేహమేమిటి? నేగా యీ కేసునుండి బయటపడెయ్యాలని ఆదేవుడికి మొక్కుకున్నాను."

"అయితే యీ శుభముహూర్తాన్నే మనం యిద్దరం యీ మొక్కుబడులు తీర్చుకుందాం రండి" అన్నాను నవ్వుతూ.

"అలాగే పదవోయి" అన్నాడాయన.

"అయితే గురువుగారూ! కొంపదీసి మిమ్మల్ని మరోకోర్టుకు లాక్కెళ్ళి మళ్ళీ మరోలా తీర్పు చెప్తారేమో!" అన్నా సందేహంతో.

"అదంతా ప్లీడర్లకి తెలుసునోయ్. మన తీర్పుకిక తిరుగులేదు తెలుసునా! యిదే దీనికి ఉన్నత న్యాయస్థానం!" అన్నాడాయన ధీమాగా.

రాబిన్ హుడ్
ప్రపంచ మంతటా
మన్నన పొందినది
ROBIN HOOD
A SEN-RALEIGH Product
SRC-52 TE

# కుండలినీశక్తి: కొన్ని అనుభూతులు

శ్రీ వాసిరెడ్డి పార్థసారధి

వర్షములు వెనుకపట్టి, శరదృతువు ప్రవేశించినది. ప్రొద్దు కూకింది. రేడియోవార్తలు చెప్పటం పూర్తయింది. మామూలు ప్రకారము రామాలయంలో ధ్యానం చేసుకుంటున్నాను. అంతా నిశ్శబ్దంగా ఉన్నది. హఠాత్తుగా, ఆకాశం వైపున ఫెళ్లున మెరిసింది! పెద్దగా ఉరిమి, పిడుగు పడబోవునప్పుడు మేఘములలో మెరిసినట్లుగా తీగమెరపు మెరిసింది! అది కళ్లుమూసిలేనంత తీవ్రంగా వుంది! మెరుపు వెంట పిడుగుపడుతుందని భయంకలిగి, ఆ అపాయంనుండి పారిపోదామని లేచి నిలుచున్నాను. నిలుచోవడంతోనే స్పృహ వచ్చింది. నేను ఉన్నది దేవాలయంలో. పైన కప్పు ఉన్నది, అక్కడ ఆకాశమూ లేదు మేఘములూ లేవు మెఱవటానికి. బైటకూడా ఆకాశం నిర్మలంగా ఉన్నది. నాకు కనుపించినది, అచ్చంగా మేఘములలో మెరియు మెరుపే. ఇదేమిటా అని చింతించుకున్నాను. దీనిని గురించి పెద్దలను అడిగి తెలుసుకున్నాను. అనుభవజ్ఞులు వ్రాసిన గ్రంథములను పరిశోధించాను. ఇందువల్ల కొన్ని అనుమానములు కలిగినా, కొన్ని శాస్త్ర సత్యములు సేకరించకలిగాను. జస్టిస్ వుడ్‌రాఫ్ కుండలినీయోగము, ఉపనిషత్తులు, తంత్రశాస్త్రములు, పురాణములు, శాస్త్రీయదృష్టితో పరిశీలించి గొప్పగ్రంథములు వ్రాశారు. జ్ఞానదేవులు, రామకృష్ణపరమహంస, వివేకానందస్వామి, లెడ్‌బీటరు, అనిబిసెంటు, అరవిందులు కుండలినీ శక్తిని స్వయంగా దర్శించి, వారి అనుభవాలు ప్రవచించారు. ఇంకా అనేక భారతీయులు, పాశ్చాత్యులు కూడా ఇట్టి దర్శనములను పొంది, వాటిని ప్రపంచమునకు చెప్పారు. ఇవి నేటి సత్యాన్వేషకులైన శాస్త్రజ్ఞులకు సాధకులకు ఉపయోగపడునను ఉద్దేశ్యంతో క్లుప్తంగా మనవి చేస్తాను.

వెన్నెముకను, యోగశాస్త్రంలో బ్రహ్మదండమని, మేరుదండమని, వీణాదండమని పిలుస్తారు. వెన్నెముకలో, తామరకాడలో సన్నని కాలువగా ఉన్నట్లు, వెంట్రుకవాసి సన్నని కాలువ ఉన్నది. వుడ్‌రాఫ్ అది సాలీడుదారంవలె ఉన్నదని వ్రాశారు. దీనిని సుషుమ్నానాడి అని అంటారు. వెన్నెముకను ఆధారం చేసుకుని కొన్ని చక్రములున్నవి. ఎలక్ట్రిసిటీ తీగెయందు, దీపపు బల్బులున్నట్లు కొమ్మయందు పుష్పములున్నట్లు ఉన్నవి. ఈ చక్రములను పద్మములని కూడా పిలుస్తారు. నాడులు, చక్రములు చాలాసూక్ష్మములైనవి సూక్ష్మలోకములనుండి, శక్తులను గ్రహించి, ఇది శరీరమునకు అందచేయుచుండును. ప్రతిచక్రమునకు కొన్ని రేకులు, వర్ణములు, బీజాక్షరములు శక్తులు, దేవతలు అక్షరములు, వాహనములు, ఆకారములు, తత్త్వములు వేరువేరుగా ఉన్నవి. వెన్నెముక మూలములో, మలమూత్ర స్థానముల మధ్య మూలాధారమనే చక్రమున్నది. ఇది 4 రేకులు, పృథివీ తత్త్వము, గణేశదేవత, లాంబీజము, ఢాకినీశక్తి, పసుపువర్ణము కలిగి ఉన్నది.

జననేంద్రియంవద్ద స్వాధిష్ఠానమనే చక్రం ఉన్నది. ఇది 6 దళములు, జలతత్త్వం బ్రహ్మదేవత, వంబీజం, శాకినీశక్తి, తెలుపువర్ణము కలిగి ఉన్నది.

నాభివద్ద మణిపురమనే చక్రమున్నది. ఇది 10 రేకులు, అగ్నితత్త్వం, రంబీజం, లాకినీశక్తి, విష్ణుదేవత, నిప్పురంగు కలిగివున్నది. హృదయంవద్ద అనాహత చక్రం వున్నది ఇది 12 దళములు, వాయుతత్త్వం, ధూమవర్ణం, శంబీజం, కాకినీశక్తి, శివుడు దేవతగా కలిగిఉన్నది.

కంఠంవద్ద విశుద్ధచక్రం ఉన్నది. ఇది 16 రేకులు, ఆకాశతత్త్వం, తెల్లనివర్ణం, హంబీజం, శాకినీశక్తి, దుర్గాదేవత కలిగి ఉన్నది.

భ్రూమధ్య ఆజ్ఞాచక్రమున్నది. ఇది 2 దళములు, మనోతత్త్వం, ఓం బీజం, హాకినీశక్తి, ఆత్మదేవత కలిగి ఉన్నది. శిరస్సుపైన, శిఖ (నడినెత్తిన జుట్టుముడి) క్రింద సహస్రార పద్మం వున్నది. ఇది వెయ్యి దళములు, ఆత్మతత్త్వము అవ్యక్త ప్రణవబీజం, కామేశ్వరీ కామనాథులు దేవతలుగా కలిగి వున్నది.

చక్రములలో దళములు మొదలైన వాటిలో కొన్ని అభిప్రాయభేదము లున్నవి. యోగకుండలినీ ఉపనిషత్తులో అనాహత చక్రమునకు 16 దళములని. ధ్యానబిందూపనిషత్తు శాండిల్యోపనిషతులలో మణిపుర చక్రమునకు 12 రేకులున్నవని వ్రాశారు. స్వాధిష్ఠానచక్రము, నాభికిప్రక్కగా, ప్లీహంవద్దనున్న

దని లెడ్ బీటరు వ్రాశారు. 1696 లో జర్మన్ క్రిస్టియన్ గీఫ్ చెల్ అను యోగసాధకుడు కూడా ఇట్లే వ్రాశాడు. 7 గ్రహములను, 7 చక్రములకిచ్చాడు. చక్రములు వెన్నెముకకు, బొంగుకు కణుపులున్నట్లున్నవనీ, చక్రములు సుషుమ్నా నాడిలోపల ఉన్నవని కొందరు వ్రాశారని జస్టిస్ ఉడ్ రాఫ్ వ్రాశారు.

మూలాధారచక్రంలో, త్రికోణ ఆకారం ఉన్నది. దీనిలో స్వయంభువనే లింగం ఉన్నది. స్వయంభూలింగం చుట్టూ 3½ చుట్లు చుట్టుకుని, తల సుషుమ్నా నాడిలో వుంచి ఒక సర్పశక్తి నిద్రిస్తున్నది. ఈమెయే మన కుండలినీ మహాశక్తి. సృష్టి, స్థితి లయములకు ఆధారభూతమైన మహాశక్తి ఈమెయే. భక్తులు ఉపాసకులు ఈమెను దేవి అని స్తోత్రం చేసి, వారి వారి అనుభూతుల ప్రకారం అనేక పేర్లతో పిలిచారు. కాళి, దుర్గ, ఆదిశక్తి, రాజేశ్వరి, త్రిపురసుందరి, మహాలక్ష్మి, మహాసరస్వతి, మహాశక్తి అన్నారు ఈ మహాశక్తిని. ఇవి ఆమె సార్థక నామములు. ఈశక్తి ఆకార గమనాలను పట్టి కుటిలాంగి, భుజంగిని, శక్తి, ఈశ్వరి, కుండలి, అరుంధతి అన్నారు. చుట్టలు చుట్టుకుని ఉన్నందువల్ల కుండలినీ అనీ, ఇడా పింగళ నాడులు ఈమెకు కుండలములవలె ఉన్నందున కుండలిని అనీ వంకర నడకవల్ల కుటిలాంగిఅనీ. అన్నారు. పాము తలమీద కొట్టగా బుస్సుమనే శబ్దం చేస్తూ లేచును. ఇట్లే కుండలిని వత్తిడిచేయగా లేచి, ఆశబ్దం చేయును కనుక భుజంగినీ అన్నారు. దివ్యజ్ఞాన సమాజాధ్యక్షులు శ్రీ అరండేలు, కుండ్ అనగా అగ్ని అని, అగ్ని స్వరూపిణి కనుక కుండలినీ అని అన్నారు. శబ్దమునకు ఆధారభూతురాలు కనుక, శబ్దబ్రహ్మ అని, మహాసరస్వతి అని అన్నారు. వాక్కు మూలచక్రం నుండే పుట్టుతున్నదని కౌళులంటారు. కాని శిరస్సులో సంకల్పం కలిగి, మూలాధారంలో వాయురూపం దాల్చి వాక్కుగా వచ్చునని సమయులంటారు. కుండలిని మంత్రమయి, జ్యోతిర్మయి. మంత్రములు స్థూలరూపాలు, తేజస్సుసూక్ష్మరూపం. జీవుల ఉచ్ఛ్వాస నిశ్వాసములు కుండలినీవల్లనే జరుగుచున్నవి. అందువల్ల ఈమె సమస్త ప్రపంచమునకు జనని. అక్షరములన్నియు ఈమె యందే ఉన్నవి. మంత్రములన్నియు ఈమెయందున్నవి. మంత్రములనగా పాశ్చాత్యులకు యథార్థమైన భావం తెలియదని జస్టిస్ వుడ్ రాఫ్ వ్రాశారు. పాశ్చాత్యులు మంత్రములనగా ప్రార్థనలని అనుకుంటారు. ఇది పూర్తి తప్పు. ప్రార్థన వేరు, మంత్రం వేరు, మంత్ర మనగా శబ్దశక్తి. మంత్రం చైతన్యవంతమూ శక్తివంతమైనది. మంత్రముచేత ఒక మనిషిని చంపావచ్చు, బ్రతికించావచ్చని జస్టిస్ వుడ్ రాఫ్ వ్రాశారు. తేలు పాము కాటులను మంత్రంచేత చికిత్స చేయటం అందరూ ఎరిగినదే. మంత్రోచ్చారణ వల్ల చైతన్యం, శక్తి కలిగి దేవత ఉద్భవిస్తుంది. రెండు పెదిమలు శివశక్తులు. రెండు పెదిమల కలయికవల్ల, శివశక్తుల సంయోగంవల్ల జనించిన దీ దేవత. కుండలినీ అష్టప్రకృతి రూపిణి. పృథివి, జలం, అగ్ని, వాయువు, ఆకాశం, మనస్సు, బుద్ధి, అహంకారము ఎనిమిది ఈమె రూపములే. కౌళులు ఈమెను అంతరంగిక స్త్రీ అంటారు. కాని స్త్రీ వుండగా బాహ్య స్త్రీ అనవసరం అంటారు వీరసాధకులు. కుండలిని మేల్కొన్నప్పుడు కుమారి అనీ, అవాహనం చేసినప్పుడు యోషిత్ అనీ, సహస్రారం చేరినప్పుడు పతివ్రత అనీ అంటారు. మూలాధారంవద్ద ఈమెను కామేశ్వరీ అంటారు. కౌలులు కుండలినిని మేల్కొల్పకుండానే, మూలాధారంవద్దనే పూజచేస్తారు. భౌతిక సుఖముల కోసం, సమయులుకూడా ఇక్కడే ఈమె పూజ చేస్తారు. కామములను ప్రసాదించునుగనుక కామేశ్వరీ అన్నారు. విశ్వకుండలిని సూర్యభగవానుడు. గాయత్రీ మంత్ర మీ కుండలినీధ్యానమే. voice of silence అనే గ్రంథంలో కుండలినిని ఆగ్నేయశక్తి అని పిలిచారు. యథార్థంగా, ఇది ద్రవంవంటి నిప్పువలె ఉండి. మేల్కొని పైకి నడచునప్పుడు సుడివలె చుట్టి, చుట్టి పైకిపోతుందని వ్రాశారు. భిక్షువు కుండలినీ భౌతికమైనదని వ్రాశాడు.

శంకరాచార్యులవారు కుండలినిని, బ్రహ్మశక్తియని ఆనందలహరిలో స్తోత్రం చేశారు. వీరూ, వీరి గురువు గౌడపాదులు కుండలినీ దర్శనంపొంది, ఆమెను స్తోత్రం చేశారు. గౌడపాదులు సుభగోదయములోను శంకరాచార్యులు అనందలహరిలోను వారు పొందిన అనుభూతులనుగురించి వ్రాశారని వలభాచార్యుల వారి పుత్రుడు కృష్ణమార్యులు వివరించారు.

నాడులనగా నరములుకావు. ఇవి ప్రాణశక్తి ప్రవహించేసూక్ష్మమైన గొట్టాలు. నడ్ అనే ధాతువు నుండి నాడీశబ్దం వచ్చింది. నడ్ అనగా నడచుట. నాడులన్నిటిలో ముఖ్యనాడి సుషుమ్న. ఇది వెన్నెముక మధ్యలో, మూలాధారంనుండి సహస్రార చక్రంవరకు కాలువగా ఉన్నది. భూతశుద్ధి తంత్రములో సుషుమ్నా నాడిలో 3 కోశములుగా, 3 నాడులున్నవని వ్రాశారు. సుషుమ్నా నాడి, తమోగుణం, అగ్నితత్వం కలిగి ఎర్రగా ఉన్నది. సుషుమ్నా నాడిలో రజోగుణం కలిగి, తేజోవంతమైన వజ్రిణి అనే నాడి ఉన్నది. వజ్రిణీ నాడిలో సత్వగుణం కలిగి, పాలిపోయిన రంగు కలిగిన చిత్రిణి అనే నాడి ఉన్నది. చిత్రిణీ నాడిలో, త్రిగుణాతీతమైన బ్రహ్మనాడి ఉన్నది. యోగశిఖోపనిషత్తులో, ప్రపంచమంతా

ఈ సుషుమ్నా నాడిలో అంతర్గతమై ఉన్నదని వ్రాశారు. సుషుమ్నానాడి సర్వతోముఖమైన దవుటచే. సర్వగ అని అన్నారు సుషుమ్నానాడి ఊర్ధ్వ మూలం కలిగి, అనేక శాఖలు కలిగివున్నది దీనినుండి డెబ్బదిరెండు వేల నాడులు శరీరమంతటా వ్యాపించి ఉన్నవి. భగవద్గీతలో అశ్వత్థవృక్షమున కిచ్చిన వర్ణన, ఈ సుషుమ్నానాడి కిచ్చినట్లున్నది. అశ్వత్థవృక్ష మనగా సుషుమ్నానాడియే నని నా అభిప్రాయం. భగవద్గీతలో, ఆదిలో వ్రాయబడ కొన్ని విషయాలు తీసివేయబడి, ఆదిలో లేని కొన్ని నూతన విషయాలు చేర్చారంటారు. ఇందులో ఊర్ధ్వమూలం, అధశ్శాఖం అని సుషుమ్న వర్ణనవున్నది. కాని కుండలినీ అనే శబ్దంలేదు. జ్ఞానేశ్వరుడు భగవద్గీత 6 వ అధ్యాయంలో కుండలిని గురించి చెప్పారు. ఒక్కొక్కరు, వారి వారి అనుభవముల ప్రకారం అనేక పేర్లతో పిలిచారు సుషుమ్నానాడిని. ఈ నాడి నే శూన్యపదవి, బ్రహ్మరంధ్రము, మహాపథము, శ్మశానము, శాంభవి, మధ్య మార్గము, సరస్వతి అని పిలిచారు. ఇది శివస్వరూపిణి. మంత్రస్వరూపిణి, ప్రాణస్వరూపిణి, జ్యోతిస్వరూపిణి. ఇది కదలగానే జ్యోతిర్దర్శనములు కలుగును.

డాక్టరు రేల్ సుషుమ్నానాడి వేగస్ నర మన్నారు.

## ఇడా పింగళా నాడులు

సుషుమ్నానాడి తర్వాత ముఖ్యమైన నాడులు ఇడా పింగళా నాడులు. ఇవి వెన్నెముకను ఆశ్రయించి వున్నవి. వెన్నెముకకు కుడిప్రక్కన పింగళానాడి, ఎడమవైపున ఇడానాడి ఉన్నది. కుడిముక్కున నడచునది పింగళానాడి. ఎడమ ముక్కున నడచునది ఇడానాడి. పింగళానాడియందు సూర్యుడున్నాడు. ఈ నాడి ఆడునప్పుడు వేడిచేయును. ఇడానాడి యందు చంద్రుడున్నాడు. ఈ నాడి నడచునప్పుడు చల్లదనం చేయును ఈ రెండు నాడులు కాలమును తెలియచేయును. సుషుమ్నానాడి కాలమును మ్రింగును. యోగసాధన సుషుమ్నానాడి నడచునప్పుడు చేసిన సమాధిసిద్ధి త్వరగా లభించును. సమాధిలోనివారికి కాలం తెలియదు. నాడులను స్వాధీనం చేసికొన్న వారు, తమ కర్మ ఫలితములను తమ ఇష్టం వచ్చినట్లు తిప్పగలరు. యమధర్మరాజును ధిక్కరించిన సిద్ధులున్నారు ఈ నాడు కూడా. కుండలిని సహస్రారం చేరుటకు త్రిగ్రంథులను భేదించవలసి వున్నది. మూలాధారమువద్ద బ్రహ్మగ్రంథి ఉన్నది. మణిపూరము వద్ద విష్ణుగ్రంథి ఉన్నది. విశుద్ధవద్ద రుద్రగ్రంథి వున్నది మాయాశక్తి ఈ 3 గ్రంథులవద్ద బలంగా వున్నది. కాని మణిపూరచక్రంవద్ద ఎక్కువ బలంగా ఉన్నది. ఈ గ్రంథులను భేదించునప్పుడు భరించరాని బాధ కలుగును భస్త్రికా ప్రాణాయామంవల్ల గ్రంథిత్రయమును భేదించవచ్చును.

సుషుమ్నానాడి ఊర్ధ్వమూలం కలది. అనగా దీనికి మూలం సహస్రారచక్రంలో వున్నది. సహస్రార చక్రమునుగురించి తెలిసికొనుట చాలా ముఖ్యం.

## సుధాసింధువు

సహస్రారచక్రము అధోముఖమైవున్నా, దాని కర్ణిక ఊర్ధ్వముఖంగా ఉన్నది. ఇక్కడ శ్రీచక్రమున్నది. ఇదే ప్రకృతి స్వరూపిణి. మహాలక్ష్మి. ఇక్కడ చంద్రమండలమున్నది. దీనిలో గురుపీఠమున్నది. ఈ గురుపీఠమును, హంసపీఠమని, మణిపీఠమని అంటారు. గురువు, హంస ఇందులోనే వున్నారు. సిద్ధులు ధ్యానం చేయవలసింది ఈ గురువునే. ఇది మణివలె దేదీప్యంగా మెరుస్తూ వుంటుంది. ఈ పీఠమందు గురువు ఆసీనుడై, ముక్తినిస్తుంటాడు. గురువు ఆజ్ఞలు ఆజ్ఞాచక్రంవద్ద వినపడుతూంటవి. కనుక దానిని ఆజ్ఞాచక్రమన్నారు. సహస్రారంలో ఉన్న చంద్రమండలమును బిందుస్థానమంటారు. ఇదే సుధాసింధువు. ఇక్కడనుండే అమృతము వర్షించుచుండును. కుండలిని మేల్కొని సహస్రారం చేరి, అందులోని చంద్రుని కాటువేయును. అప్పుడు చంద్రునినుండి అమృతం క్రిందికి ప్రవహించును. ఆజ్ఞాచక్రం వద్ద ఇంకొక చంద్రుడున్నాడు. పై అమృతం ఈ చంద్రుని తడుపును. ఇక్కడినుండి అమృతముశరీరమునంతటిని తడుపును సహస్రారంలోని చంద్రునికి 16 కళలున్నవి. కళఅనగా పరమాణువు. ఈ 16 కళలలో, 15 కళలు కాలమును తెలుపు నిత్యతిథులు. మిగిలిన 16 వ కళ, వృద్ధి క్షయంలేనిది విభాగము లేనిది. దీనిని ధ్రువకళ అంటారు. ఇదే ఆత్మకల, చిత్కళ, త్రిపురసుందరి ఇదే బైందవస్థానము. పార్వతీ పరమేశ్వరులు ఐక్యమగు చోటు ఇది. ఇదే విశ్వాత్మతో జీవాత్మ కలియుచోటు, సచ్చిదానందము కలుగుచోటు. సిద్ధులుకోరే ముక్తి కాంతను పొందుచోటిది. సహస్రారం దగ్గర బ్రహ్మరంధ్రం ఉన్నది. దీనిని దశమద్వార మంటారు. శరీరంలో బ్రహ్మ ప్రవేశించుచోటిది. ముక్తులు, శరీరం నుండి వెడలు చోటూ ఇదే. ఇక్కడ శూన్యసితి వున్నది. నిర్వికల్ప సమాధి కలుగుచోటు ఇదే. శ్రీ అరవిందులు ఊర్ధ్వమనస్సు Over mind సహస్రార చక్రంలోను, లోమనస్సు Inner mind ఆజ్ఞాచక్రంలోను ఉన్నదని వ్రాశారు. సహస్రార చక్రం Pineal gland దగ్గర, ఆజ్ఞచక్రము Pitutary gland దగ్గర

ఉన్నవి వీటివల్ల మానవునికి ఆరోగ్యబలములు కలుగుచున్నవని శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు.

కామేశ్వరీ కామసాధకుల సంయోగానందము నిచ్చునది కనుక, అన్ని యోగములలోను కుండలినీ యోగం చక్రవర్తి వంటిది.

## కుండలీ సాధన

కుండలినిని మేల్కొల్పుటకు అనేక సాధనలున్నవి. ఇది నాగుపామును, లేవగొట్టుటవంటిది తెలిసినవారు లేనిచో పామువల్ల యెంత అపాయమో అట్లే ఇది. గురువుకు దయకలిగినప్పుడు, వారి దృష్టి వల్లగాని, స్పర్శవల్లగాని సిద్ధి కలుగును. ఇట్టి సిద్ధినిచ్చువారు ఇప్పటికీ ఉన్నారు.

శ్రీ రామకృష్ణ పరమహంస వివేకానందుని కిట్లే సిద్ధి ప్రసాదించారు.

కుండలినిని చైతన్యవంతం చేయుటకు ముఖ్యంగా నైతిక బలం వుండాలి. యమ నియమాలు ముందు ఆచరించాలి. నైతికశక్తి లేక, కుండలిని చైతన్యవంతి మైనప్పుడు, అది ఆ వ్యక్తిని భ్రష్టుని చేయును. ఆ వ్యక్తి కామక్రోధముల పాలవును. కుండలినీ సాధనకు శరీర, ప్రాణ, నాడీ, మనో, బుద్ధులు శుద్ధులు కావాలి. శరీరశుద్ధికి ఆసనములు కొన్ని సాధించాలి. ప్రాణ, నాడీ శుద్ధులకు ప్రాణాయామం చేయాలి మనస్సుకు త్రాటకం వగైరాలు చేయాలి. ఆసనముల విషయంలో పతంజలికీ, హఠయోగమునకు అభిప్రాయభేదము లున్నవి. సుఖంగా కూర్చొనుటకే ఆసనమని పతంజలి అభిప్రాయం. కుండలినిని మేల్కొల్పుటకే ఆసనములని హఠయోగము చెప్పుచున్నది. ఆసనములలో సిద్ధాసనము శ్రేష్ఠమైనదని అందరి తలంపు. కుండలినిని మేల్కొలుపుటకు ముఖ్యము, మూలస్థానము పైకి కుంచించుట—సిద్ధాసనంలో ఒక మడమతో ఈ మూలస్థానమును ఒత్తిపెట్టి రెండో మడమతో నాభి, జనేంద్రియముల మధ్యస్థానములను ఒత్తిపట్టవలెను. ఈ పై స్థానమును కందస్థాన మంటారు. నాడులకూడలి ఇది. సిద్ధాసనంలో నాభిని లోనికి లాగిపట్టి, మెడ హృదయం పైకి వంచి, లోనిగాలిని బైటికిపోకుండా బిగపట్టవలెను. లోపల ప్రాణా అపానవాయువుల కలియిక వల్ల అగ్ని పుట్టి కుండలిని మేల్కొంచును. సిద్ధినిచ్చు ఆసనం కనుక సిద్ధాసన మన్నారు. దీనిచే ముక్తినిచ్చునది కనుక ముక్తాసనమనీ, రహస్యంగా వుంచవలసింది కనుక గుప్తాసనమని అన్నారు. జ్ఞానదేవు ఈ ఆసనమునకు గొప్ప ప్రాముఖ్యమిచ్చి దీనినే వజ్రాసనమని అన్నాడు.

కుండలినిని మేల్కొల్పుటకు ముఖ్యాయుధము వాయువు. కొందరు అగ్ని, వాయువు, మంత్రి మంటారు. నా వుద్దేశ్యం, గాలిలోని ప్రాణవాయువు అగ్నియే. దాన్నివల్లనే అగ్ని పుట్టును. శబ్దమునకు, మంత్రమునకు కూడా వాయువుమూలము.

ఉచ్ఛ్వాస నిశ్వాసలను ప్రేరేపించునది కుండలిని. ఈ ఉచ్ఛ్వాస నిశ్వాసలతోనే కుండలిని మేల్కొలుపవచ్చును. హంసమంత్రంలోని, హంశబ్దంతో గాలిని లోనికి పీల్చి, కుండలినిని గట్టిగా తాకుతున్నట్లు శబ్దంతో గాలిని బైటికి వదలుతూ అధోముఖమైన మూలాధారచక్రం ఊర్ధ్వముఖమౌతున్నట్లు భావించాలి. లోపలకు పీల్చిన వాయువు కుంభించి, జాలంధర బంధంతో గాలిని బైటికి పోకుండునట్లు బంధించాలి. అప్పుడు అది ఎటూ దారిలేక, సుషుమ్నా నాడిలో దారిచేసుకొని ప్రవేశించును. ఇట్లు ప్రవేశించిన వాయువు, మనస్సు సుషుమ్నా నాడిలో లయమగును. ఇదే సుఖప్రదమైన మనోన్మని. ఈ విధంగా కుండలినిని వత్తిడితో మేల్కొలిపినతర్వాత కుండలినిని పైకి తీసుకపోవుటకు భస్త్రికా ప్రాణాయామం చేయవలెను.

దీనికి ఇంకా అనేకమైన సాధనలున్నవి మహావేధ, మహాముద్ర, శక్తిచాలనము, వజ్రోలి, కేవల కుంభకము, ఖేచరి, త్రాటకం, నేతి, నౌలి, కపాలపాత, భస్త్రి జాలంధర, ఉడ్యాణ మూలబంధములు మొదలయినవికూడ ఎక్కువ ఉపయోగించును.

## మంత్రశక్తి

మంత్రమువల్లకూడా కుండలినిని లేపవచ్చును. మణిపూరచక్రము అగ్నితత్వం కలది. మణివంటి తేజస్సు కలది కనుకనే ఈ చక్రమును మణిపూర మన్నారు. ఈ చక్రం అగ్నిస్వరూపి కనుక, కొందరు ఇక్కడ కుండలిని వున్నదంటారు. అగ్నిస్వరూపిణియైన ఈ చక్రంలోని బీజాక్షరము రం. రం వహ్నిబీజము, రం వహ్ని బీజముగా ప్రపంచంలోని అనేక దేశాలలో, అనేక కాలములలో భావించారు. ఈజిప్టు పూర్వీకుల మంత్రము ర-మక్-హోటెప్ అనీ ఇందులో, ర అక్షరము, సూర్యస్వభావం కలదని, పాల్ బ్రంటన్ వ్రాశారు. టిబెట్టువారు, కొండలమీద కటికిచలిలో, రం బీజాక్షరమును జపిస్తూ అగ్ని పుట్టించి, దిగంబరులుగా ఉండకలిగారు. ఇటి రం బీజమంత్ర ఉచ్చారణతో అగ్నిని పుట్టించి, కుండలినిని లేవకొట్టవచ్చు.

ఇచ్ఛవల్లకూడా కుండలినిని లేపి పైకి తీసుకుని పోవచ్చని లెడ్బీటరు వ్రాశారు.

కుండలినిని లేవగొటటం తేలికే గాని, దానిని పైకి తీసుకునిపోయి, సహస్రారంలో వుంచుట తేలిక కాదు

# కుండలినీ శక్తి: కొన్ని అనుభూతులు

అది మణిపురంవరకువచ్చి తిరిగి క్రిందికి పోవచ్చును. మణిపురమునకు కుండలిని చేరినట్లు సాధకునకు కొన్ని గుర్తులు కనుపించును. నక్షత్రములు, మినుగురు పురుగులవంటి జ్యోతులు కనుపించును.

కుండలిని మేల్కొని మూలాధారచక్రమును విడిచి పైకిపోవునని కొందరు అంటారు. కొందరు అసలు కుండలిని మూలాధారంలోనే ఉంటుందనీ దాని జ్యోతియే పైకి వెళ్ళునని అంటారు. కుండలిని ఒక్కొక్క చక్రమును విడిచి పైకిపోవునప్పుడు, ఆయా చక్రములలోని తత్త్వములను, వేడినీ గ్రహించి పైకిపోవును. ఈ విధంగా క్రింది 5 చక్రములలోని పంచభూతములను, ఆజ్ఞలోని మనస్సును, తనలో లయింపచేసికొని ఇది సహస్రారంచేరును. ఇట్లు లయింపచేసికొనుటకే లయకర్మ అనీ, లయ యోగమనీ అంటారు. అధోముఖములైఉన్న చక్రములన్నీ, తిరుగుడు పువ్వు సూర్యుడు ఎటుంటేఅటు తిరిగినట్లు, పైన వున్న కుండలిని వైపుకు తిరుగును.

## అనుభూతులు

కుండలిని మేల్కొన్నట్లు సాధకునికి కొన్ని గుర్తులు కనుపించును. ఆనందము, కంపం, ఉత్థానం, ప్రకోపం, నిద్రలు కనుపించును.

పైకివెళ్లిన కుండలిని క్రిందికి దిగివచ్చునప్పుడు, చక్రములలో తాను గ్రహించిన వాటి నన్నిటిని తిరిగి ఇచ్చివేస్తూ మూలాధారమునకు చేరును. దానితో శరీరము ఉష్ణహీనమై, కట్టెవలె ఉండును. కుండలిని క్రిందికిరాగానే ఉష్ణము కలుగును. దీనిని సృష్టికర్త అంటారు. కుండలినీ సహస్రారం చేరినప్పుడు, అనేక మందికి, అనేక అనుభూతులు కలిగినవి. ఇందులో జ్ఞానేశ్వరుడు పొందినది ముఖ్యం. ముందు వీరి అనుభూతులను మనవిచేస్తాను.

## జ్ఞానదేవుని అనుభూతి

సిద్ధాసనపీఠనవల్ల కుండలినీమహాశక్తి మేల్కొని, మణిపురచక్రము చేరును. ఇక్కడ గొప్ప అలజడి చేయును. ఇందుకు భయపడకూడదు. అక్కడఉన్న మేదోమాంసరక్తములను ఇది హరించును. దీనివల్ల జబ్బుచేయును. ఈ జబ్బు కుండలినియే నయం చేయును. ఉడ్యాణబంధంవల్ల, కుండలి మణిపుర చక్రంవద్ద బిగించబడి ఉండును. మణిపురచక్రంలోనికి చేరిన కుండలిని, విద్యుత్కిరణంవలె, అగ్నిజ్వాలలు గల గొలుసులవలె, మెరుగుపెట్టిన సువర్ణపాచికవలె ప్రకాశిస్తూండును. ఇక్కడనుండి, కళ్ళు విరుచు కున్నట్లులేచి, హృదయంలో మాంసం కొద్దిగాను, శరీరములోని మాంసము మరికొంచెము తిని, దప్పిక కలిగి ఉండును. ఇందుచేత రక్తం మొదలైన సప్తధాతువులను ఒక్కచుక్కలో త్రాగివేయును. అప్పుడు శరీరం శుష్కించును. ముక్కువెంట విడుచు 12 అంగుళాల వాయువు కూడా నశించును. సూర్యచక్రం మిగులును. అప్పుడు కుండలిని విషం కక్కును. ఈ విషం ప్రాణ వాయువుకు అమృతప్రాయంగా వుండును ఇందు చేత ప్రాణం నిలిచివుండును. అంతకుపూర్వము, గ్రీష్మంలో వున్నట్లున్న శరీరము చల్లబడును. కుండలిని తాను భక్షించిన స్థానములకు తిరిగి శక్తినిచ్చును. ఇడాపింగళలు ఏకమౌను. త్రిగ్రంధులు ఛేదించబడును. షట్చక్రములమీది ఆవరణ తొలగును. బుద్ధి చాంచల్యంపోవును. చంద్రుని అమృతవర్షం కుండలిని నోటపడి, అవయవములకు వ్యాపించును. శరీరమునకు బంగారు కాంతివచ్చును. ఆనందసుఖములు కలుగును. యౌవనవంతుడగును నూతనంగా గోళ్లు వెంట్రుకలువచ్చును. తర్వాతకుండలిని అనాహతచక్రంలో ప్రవేశించును. అప్పుడు అనాహతశబ్దములు వినిపించును. తర్వాత మిగిలిన ప్రాణవాయువును మ్రింగును. ఇప్పుడు నాదం వినిపించదు. తేజస్సు కనుపించదు. సంకల్ప వికల్పాలు లేవు. అతని ఎదుట అణిమాదిసిద్ధులు నిలుచును. పృధివి జలాగ్నులు నశించగా వాయువు వుండును. శరీరము వాయుపూరితమౌను. అప్పుడు సాధకుడు ఆకాశగమనం చేయును. కుండలిని పేరుపోయి మారుతం అనే పేరువచ్చును. తర్వాత జాలంధరబంధం విడువగా, కుండలిని బ్రహ్మస్థానమైన సహస్రారచక్రం చేరును. సోహంభావంతో బ్రహ్మభావం కలుగును.

జ్ఞానదేవు కుండలిని సహస్రారం చేరుట, పాము కాటువలె వర్ణించాడు. భగవద్గీతలో అర్జునుడు శ్రీకృష్ణ భగవానునితో 'విశ్వరూపమనే సర్పం కాటందినందున శరీరము నిర్జీవంకాకుండా విషవేగం తగ్గించుటకు కావలసినశక్తి నీయందున్నదని అన్నాడు. ఇంతకూ ముఖ్యం భగవానుని కరుణ ఇది లేనప్పుడు ఎంతటి సాధన నిర్జీవంవలె ఉండును.

## శ్రీ రామకృష్ణుని అనుభూతి

శ్రీ రామకృష్ణ పరమహంస తనకుండలినీ సిద్ధి అనుభవాలను ఈ విధంగా చెప్పారు. కుండలినీ కదలగానే, ముందు పాదములలో ఏదో ఝల్లుమనిపోతున్నట్లుండును. ముందు అది చీమలబారువలె నడచును మెల్లగా. తర్వాత కప్పగంతులు వేసినట్లు వేస్తూ నడచును. తర్వాత పాము మెలికలు తిరిగి వచ్చునట్లు నడచును. పక్షివలెదూకును. కోతివలె కొమ్మమీద నుండి ఇంకొక కొమ్మమీదకు దూకినట్లు దూకును. కుండలినీ అనాహతచక్రం చేరుకు నేవారకు మాట్లాడ వీలుండును. తర్వాత మాట కట్టుపడుతుంది. అనాహతి చక్రం చేరినప్పుడు దివ్యజ్యోతులు కనుపించును. వాటినిచూచి ఆనందాశ్చర్యములు పొందును. ఆజ్ఞా చక్రం చేరినతర్వాత భయమనేదివుండదు. ఆజ్ఞాచక్రం

సహస్రార చక్రం మధ్య సన్నని హారవుండును. సహస్రారం చేరిన తర్వాత స్పృహవుండదు. వారికి పక్షి భాష తెలియును. దేవతా దర్శనములు లభించును. బాలస్వభావం కలుగును శరీరం సువర్ణచ్ఛాయ పొందును. కుండలిని సహస్రారం చేరినప్పుడు, యోగగ్రంథములలో చెప్పబడ్డవన్ని వీరు దర్శించారు ప్రపంచమంతా జ్యోతిర్మయమైనట్లు ఒకొక్కసారి ప్రపంచమంతా పాదరస సముద్రంవలె వున్నట్లూ. ఇంకొకసారి ప్రపంచమంతా తెల్లటివెండివంటి జలంలో వున్నట్లూ, ఇంకొకసారి ప్రపంచమంతా దీపములతో వెలుగుతున్నట్లు కనుపించేది. ఒకొక్క అనుభూతి పూర్తికావటంతోనే, ఇంకొకటి వచ్చేది. ఇదంతా యంత్రం తిప్పుతున్నట్లుండేది. ఆ కాలములలో తనకొరకు భోజనం చేయలేదు. కుండలినీ దేవికి నైవేద్యం పెట్టేవారు. ఇట్టి సమాధివల్ల మనస్సు శరీరములు కొన్ని రోజులవరకూ, తుపాతునకపై నట్లుండేవని చెప్పారు.

20 వ శతాబ్దములో కొందరు పాశ్చాత్యులకు ఇట్టి అనుభూతులు కలిగిన నిదర్శనము లున్నవి.

డాక్టరు రిచార్డు మారిస్ బక్కు ఇట్టి దర్శనములను పొందిన వారిని గురించి ఒక గ్రంథం వ్రాశారు. బక్ సొంత అనుభవమిట్లున్నదని వ్రాశారు. ఒక ప్రళయాగ్ని, తానున్న పట్టణమును తగులపెట్టితూ వున్నట్లు కనుపించింది. తీరా నిదానించి చూచువరకు ఆ అగ్నిజ్వాలలు తనలోనే వున్నటు కనుపించినవి.

థియోడార్ స్టువార్టు అను ఆమె తనను కళ్ళు జిగెల్ మనిపించు మంటలు చుట్టి ముట్టినట్లు ఒక ఆధ్యాత్మిక శక్తి తనను పైకి లేపుతున్నట్లు తను శరీర జ్ఞానావరణ దాటినట్లు అనుభూతి పొందింది. బెన్సన్ తన కళ్ళు మిరుమిట్లు గొలిపే మంటలు తన శరీరాన్ని చంపినట్లు తనకు అవ్యక్తానందం కలిగినట్లు చెప్పాడు.

వివేకానందుడు తన తల వెనుక హఠాత్తుగా గొప్ప కాంతి కనుపించగా, తనను తాను మరిచి నిర్వికల్పసమాధి పొందినట్లు చెప్పారు.

మా పూర్వులు వాసిరెడ్డివారు శివపూజా దురంధరులనీ సిద్ధపురుషులనీ పేరు పడ్డవారు. మా నాయనమ్మ గారు తరిగొండ వెంకమాంబగారి శిష్యురాలు. నాయనమ్మగారి శిష్యులు నా తండ్రి గారు వీరిద్దరూ నిర్వికల్ప సమాధిసిద్ధులు. వాసిరెడ్డి వారి వంశచరిత్రలో నాగ్గవవంతు గ్రంథంలో యోగమునుగురించి గద్యపద్యములతో వ్రాశారు నా తండ్రిగారు.

1930 సంవత్సరములో నేను రాయవేలూరు జైలులో వుండగా ఆసన ప్రాణాయామాలు అభ్యసించాను. వీటివల్ల నాకు ఉపయోగం కలిగింది. యోగగ్రంథములను, ముఖ్యంగా విశ్వదాత కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారి వద్ద జసిస్ వుడ్ రాఫ్ వ్రాసిన కుండలినీ అనే గ్రంథరాజమును చదివాను. జెయిలునుండి విడుదలైన తర్వాత సాధన తీవ్రంచేసి భస్త్రిక, ఉడ్యాణములను అభ్యసించాను. ఇవి బాగా లాభించినవి. రెండవ ప్రపంచయుద్ధం రాబోవు నాటికి, ప్రకోపం కలిగింది. ధ్యానంలో కూర్చున్నప్పుడు నాడీ ప్రకోపం కలిగి, అమాంతం, ముందుకు పడవేసేది. ఒకరాత్రి మేడమీద మంచంలో పండుకుని నిద్రపోతున్నాను బంతి లేచినట్లుగా, నా శరీరం పైకిలేచి, మంచం క్రింద పడింది. భూకంపం వచ్చి నన్ను క్రిందికి నెట్టిందని భ్రమపడ్డాను. భూకంపంవల్ల మేడ కూలి చనిపోతానేమోనని భయం కలిగింది. దగ్గరేవున్న కిటికీగుండా క్రిందకు దూకుదామని లేచాను. అప్పటికి స్పృహ బాగా వచ్చి, అది భూకంపం కాదు, నాడీకంపం అని తెలిసింది. ఆగస్టు నెలలో జలుబు జ్వరం తీవ్రమైనది. 1951 లో కళ్ళు తెరిచివుండగానే మిణుగురు పురుగులవలె నక్షత్రాలు కనుపించినవి. శివానందస్వామి కళ్ళు మూసుకున్నప్పుడు ఇటు కనుపిస్తవని వ్రాశారు. రామాలయంలో ఆ తరవాత మరికొన్ని అనుభూతులు కలిగాయి.

ఈ వ్యాసం ఆరంభంలో అవి వ్రాశాను.

కుండలినీ మేల్కొన్న తర్వాత 40 రోజులు సాధకుని నిస్సత్తునిగా చేయునని పెద్దలు చెప్పారు. ఇట్టి ప్రకాశం మానవుని ఊపి రోగినిచేయును. అని బిసెంటు ఇట్టి ప్రకాశమును భరించుటకు, సాధకుని మొదటనే బలపర్చవలెనన్నారు. లెడ్ బీటరు ఈ ప్రకాశము, సూక్ష్మశరీరమును భంగపరిచి, సాధకుని పిచ్చివానినిగా చేయునని వ్రాశారు.

చక్రములు కూడా తేజోవంతంగా వుండునని లెడ్ బీటరు వ్రాశారు. చక్రములను ఏమాత్రం దివ్యదృష్టి వున్నా చూడవచ్చును. మామూలు మనిషి చక్రములు తేజోరహితంగా, 2 అంగుళాల వలయంలో కనుపించును. సిద్ధునిలోని చక్రములు వీటికి రెట్టింపుగా చిన్న సూర్యునివలె. మంటలు మండుతూ సుళ్లు తిరుగుతున్నట్లు కనుపించును. చక్రములలోని దళములు, సుళ్లుతిరగే అగ్నిచలనములు. కుండలినిని స్వాభావికంగా మేల్కొల్పుట శ్రేయస్కరం. హఠంచేత మేలుకొలపడం అపాయము. ఇందుకు క్రియాయోగములోని తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వర ప్రణిధానములు చక్కటి మార్గములని లెడ్ బీటరు వ్రాశాడు. పుటమువల్ల బంగారము మేలిమైనట్లు, తపస్సువల్ల మానవుడు మలినరహితుడౌను. వేదాధ్యయనంవల్ల మానవుడు ద్విజత్వం పొందునని వివేకానందస్వామి అన్నాడు. ఇట్లే అధ్యయనమువల్ల మానవుడు దివ్యత్వం పొందును. ఇట్లే హృదయకవాటము తెరిచినవారు దివ్యత్వం పొందుతారు.

# జీవిత మాధుర్యం

శ్రీ మల్లాది సత్యనారాయణ

జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు ప్రతి మానవునకు మంచిరోజులు వస్తాయనీ అప్పుడే జాగ్రత్తగా ఆ మంచిరోజుల్ని సద్వినియోగం చేసుకున్నవాడే నేర్పరి అనీ అయితే ఆ మంచిరోజులకోసం నిరీక్షణ ఓర్పు చాలా అవసరం అనీ గోపాలానికి తెలియకపోలేదు. అయితే కాలగర్భంలో కొన్ని సంవత్సరాలు కలిసిపోయి యెప్పుడు చూచినా గొర్రెకు బెత్తెడుతోక అన్నట్లు యెదుగూ బొదుగూ లేని తన జీవితాన్ని తలచుకుంటూంటే మంచిరోజులు వస్తాయన్న నమ్మకం కాస్తా నశించింది గోపాలానికి. నశించిపోవడమే కాకుండా ఆ మంచిరోజులు అన్నపదం ఎవరినోటి వెంటనైనా వినపడ్డప్పుడల్లా యెవరికి మంచిరోజులు అనే ప్రశ్న వెనువెంటనే వెలువడేది. కాని ఆ ప్రశ్నకు సమాధానం తనలోపలే అణగిపోయేది.

సంవత్సరం పొడుగునా వాన అనక వరద అనక, ఎండనక కొండనక, పురుగనక పుట్ట అనక, రెక్కలు ముక్కలుచేసుకుని పొలం పండించిన వానికి యెంత నిరీక్షించినా మంచిరోజులు రావు. భూమిగల ఖామందుకు యెప్పుడూ మంచిరోజులే వస్తూంటాయి. పగలు పన్నెండుగంటలూ రక్తం ధారపోసి మిల్లులో పనిచేసే కార్మికుడు ఎంత నిరీక్షించినా యెంత ఓర్పు వహించినా మంచిరోజులు రావు. మిల్లు యజమానికి మూడువందల అరవైనాలుగురోజులూ మంచిరోజులే.

కష్టపడేదొకడు అనుభవించేది యింకొకడు అనే సిద్ధాంతం వేళ్ళుపాతుకు పోయిన మనదేశంలో అందరికీ మంచిరోజులు యెప్పుడూ రావు. కొందరికే వస్తూంటాయి. అందుచే గోపాలానికి ఆ మంచిరోజులు అన్నమాట వింటే హేళనగా ఉంటుంది.

షాహుకారు వెంకటసుబ్బయ్య యిచ్చిన ఆర్డరు ప్రకారం సరుకు కొనడానికి తెల్లవారుఝాముబండికే బయలుదేరే నిమిత్తం షాహుకారిచ్చిన యెనిమిదివందల రూపాయలు జాగ్రత్తగా జాలెం సంచిలో భద్రపరచి నడుం చుట్టూ కట్టుకొని బయలుదేరి యింటికి వస్తున్న గోపాలానికి ప్రొద్దుటినుంచి తిండిలేనందున కళ్లుతిరుగుతున్నాయి తన తిండిమాట దేవుడెరుగు. చంటిపిల్లకి ప్రొద్దుటినుంచి పాలులేవు పాలడబ్బా నిన్ననే అయిపోయింది. ఈ సాయంత్రం పాలడబ్బా కొనుక్కువెళ్ళకపోతే యీ రాత్రి పిలని పట్టుకోగలగా? పాలడబ్బామాట తలపునకు వచ్చేసరికి గుండె గుభేలుమంది. ఏం పెట్టికొంటాడు పాలడబ్బా. నెలాఖరు అయి ఒకటవ తేదీ వస్తేనే కాని షాహుకారు వెంకటసుబ్బయ్య జీతం యివ్వడు. ఇవ్వడు అంటే షాహుకారు దేమీ తప్పులేదు. ఎందుచేతనంటే గోపాలం షాహుకారు చుట్టూ పని యిప్పించమని తిరిగినప్పుడే షాహుకారు వెంకటసుబ్బయ్య కొన్ని షరతులు జాగ్రత్తగా విధించి గోపాలంచేత సంతకం చేయించుకున్నాడు. అప్పటికి ఆమోదించి ప్రవేశించాడు గోపాలం.

నెలలో మధ్యగా యెప్పుడూ జీతం తాలూకు డబ్బులో కొంతకూడా అడగడానికి వీలులేదు. నెలా పూర్తి అయ్యాక ఒకటవ తేదిని పూర్తిగా జీతం యిచ్చే షరతు మొదటిది.

ఇక రెండవది గుమాస్తా సంఘాలలో చేరడంగాని సమ్మెలలో పాల్గొనడంగాని యెంతమాత్రం కూడదు.

మూడవది. ఇష్టం లేకపోతే పనిమానివేయడం తప్ప జీతం పెంచమని యెప్పుడూ అడగకూడదు.

నాల్గవది. లేబరాక్టు రూల్సు అంటూ ఆదివారాలు పనిమానడానికి వీలులేదు. ఎంత అత్యవసరమైన పని అయినా షావుకారు పర్మిషను తీసికొననిదే మానడానికి వీలులేదు.

అయిదవది. పని యేమాత్రం తృప్తికరంగా లేకపోయినా గోపాలాన్ని పనిలోనుంచి తప్పించెయ్యడానికి నోటీసులతో నిమిత్తంలేకుండా పూర్తిహక్కులు షావుకారుకున్నాయి.

ఆరవది. నెలజీతం అరవై రూపాయలు అయినప్పటికి షావుకారు అంకెలు యెంత యెక్కువగా వేసి సంతకం పెట్టమన్నా గోపాలం సంతకం పెట్టి తీరాలి.

ఇన్ని షరతుల కంగీకరించి ఉద్యోగంలో ప్రవేశించిన గోపాలం యీ రోజు యింట్లో బియ్యంలేక పస్తుపడుకోవలసి వచ్చినా. చంటిపిల్లకు పాలడబ్బా లేకపోయినా షావుకారుని యేమని అడుగుతాడు? కనీసం చెప్పడంకూడా తన అసమర్థతను సూచిస్తుందని చెప్పలేదు.

ఎన్ని మరతులు బిగించినా ఆ నాటి ఆదుర్దా కొద్దీ గుమాస్తాపనికి ప్రవేశించాక యీనాడు షావుకారు దయతలచలేదని అఘోరించి వాళ్ళదగ్గఱ వాళ్ళదగ్గఱ షావుకారు యిట్లా చేస్తున్నాడని చెప్పుకోవడం కూడా పొరబాటేనని గ్రహించిన గోపాలం యెవ్వరితోనూ యేమీ చెప్పకూడదనుకున్నాడు.

ఈ రోజు యేనిమిదివందల రూపాయలు మొలలో వున్నాయి. ఒక రూపాయి పెట్టి పాలడబ్బా కొని నాలుగురూపాయల బియ్యంకొని యింటికి పట్టుకువెడితే... ఈ అయిదురూపాయలకి యేం జమాఖర్చు చెప్పాలి. ఒకటవతేదీ యింకా పదిరోజులకి గాని రాదాయెను. వెనక ఒకటవతేదీ ముప్ఫయి రోజులు గడిస్తేనేగాని రాదుగదా. ఈ ముప్ఫయి రోజులయినా బురదపాము పందంగా నడుస్తాయి. కనిపెట్టుకుకూర్చున్న ఆ ఒకటవతేదీ వస్తుందన్నమాటేగాని త్రాచుపాములా జర్రున జారిపోయి ఊరుకుంటుంది. పదిహేను రోజులకోసారి ఒకటవ తేదీ వస్తూంటే బాగుండు ననిపించింది గోపాలానికి. ఏమయినాసరే బియ్యం పాలడబ్బా కొనుక్కువెళ్ళడానికే నిశ్చయించుకున్నాడు. లేకపోతే యెట్లా? తనేదో ఉద్ధరిస్తాడని జీవితాంతం పోషిస్తాడని నమ్మి మెడలో పుస్తెకట్టించుకున్న భార్యకు బియ్యం తేలేకపోయానని ఏ ముఖంపెట్టుకు చెబుతాడు.

ఇంతకీ పెద్దవాళ్ళకి బుద్ధిలేదు. చిన్నతనంలోనే గుదిబండని మెడకేసి వాళ్ళబాధ్యత వాళ్ళు తీర్చుకుంటే సరేననుకున్నారుగాని తరువాత వచ్చే గోపాలం బాధలు కొంచెమేనా గమనించగలరా? అయితే ఒకటి. కాలమానపరిస్థితినిబట్టి ఇప్పుడెంత తెచ్చినా చాలడం లేదుగాని గోపాలం చిన్నతనంలో వాళ్ళనాన్న యెలిమెంటరీ స్కూలు మాస్టరీ చేసేటప్పుడు నెలకు పదుహేడున్నర జీతం యిచ్చేవారు. ఆ డబ్బుతో నలుగురు పిల్లలతో సంసారాన్ని యీదుతూ అప్పుడప్పుడు ఒక్కొక్క కాసు బంగారం (అప్పుడు కాసెంత? పదమూడున్నరేగా) కొని గోపాలం తల్లికి చెల్లెళ్ళకి మురుగులనీ మెళ్ళో యేవో ఆంజనేయ బిళ్ళలనీ చేయిస్తూఉండేవాడు. ఇప్పుడు గోపాలానికి షావుకారు నెలకు అరవైరూపాయలు యిస్తాడు. తాను భార్య యిద్దరు పిల్లలు బ్రతకడం కష్టం అయిపోతోంది. ఇరవయ్యో తారీఖునకు చచ్చి చెడి యీడ్చుకొస్తున్నాడు. అక్కడినుంచి నెలాఖరు వరకు రోజూ యేకాదశులు, శనివారాలు, కార్తీక పౌర్ణములు. ఎవరినీ చెయిచాచి అడగలేడు. గోపాలం చిన్నతనంలో "ఈ రోజుల్లో పెళ్ళాన్ని పోషించుకోలేనివాడెవడు?" అనేవారు. అప్పుడు జీవితం అంత తేలికగా ఉండేది. ఇప్పుడెంత బరువైందో గోపాలం లాంటివాళ్ళకే తెలుస్తోందిగాని తక్కినవాళ్ళకేం తెలుస్తుంది.

తనూ తన భార్య ఏ పస్తులు పడుకునో జీవితాన్ని గడిపేద్దామనుకుంటే వీలులేకుండా ఇద్దరుపిల్లలు కూడాను. గోపాలం దరిద్రానికి సాయం భార్య కాపరానికి వచ్చి యిరవైయేళ్ళయితే యిప్పుడు పుట్టుకొస్తున్నారు పిల్లలు, ఏది తక్కువయినా పిల్లలు పేచీ పెడ్తారు కదా. వాళ్ళకేం కావాలి సంసారంలోని బాధలు. పెదపిల్ల బృంద చూచినదల్లా కావాలని యేడుస్తుంది. ఇంక చంటిపిల్ల కళన్నీ తెలియవు. పాలు లేకపోతే యేడుస్తుంది. పస్తు పడుకునే తల్లిదగ్గర పాలెలా ఉంటాయి?...

పిల్లల భవిష్యత్తుకోసం బల్లలుగుద్ది ఉపన్యాసాలిచ్చే అగ్రనాయకులు చేసిందేమిటి? గట్టిగా అడిగితే తిండి పెటలేనప్పుడు యెందుకు కనాలి? సంతాన నిరోధానికి అనేక సాధనాలున్నాయిగా? ఆచరణలో పెట్టకూడదా అంటారేగాని జీవన పరిమాణం హెచ్చినందువల్ల తిండి పెటలేకపోతున్నాడనే ఆలోచనే రాదుగా. జీవన పరిమాణం హెచ్చడానికి కారణం ఏమిటీ అంటే స్వతంత్రం వచ్చింది గనుక దేశంలో అన్ని విషయాలు సక్రమపద్దతిలో సర్దుకునేసరికి కొంతకాలం పడుతుంది. 'మేమూ మా శాయశక్తులా తంటాలు పడుతున్నాము. పంచవర్ష ప్రణాళికలు అమలుపరుస్తున్నాం. ఒక్కొక్క రాష్ట్రానికి రెండు, మూడు విశ్వవిద్యాలయాలు స్థాపించి విద్యాభివృద్ధి చేస్తున్నాం' అంటారేగాని దిగమింగుడు దేవతలు అంతుల్లేకుండా యెంత మింగేస్తున్నారో, ఎందఱు పానకాలరాయుళ్ళు పానకంలాగ తాగేస్తున్నారో, ఎంత దుబారా ఖర్చులక్రింద కేళీవిలాసాలక్రింద ఖర్చవుతోందో, ఎన్ని అనవసరమయిన టియ్యే బిల్లులు ప్యాసవుతున్నాయో? తెలియదు గనుకనా? అందరికీ తెలుసు? అయితే...? క్వశ్చన్ మార్కు. అది సాల్వుకాని సమస్య. పైకి చెప్పుకోడానికి వీలులేని సహస్ర వర్షప్రణాళిక. తెలిసికూడా తెలియనట్టు నటించవలసిన రాజకీయ రహస్యం. బయటపెడితే మొదటికే మోసం వచ్చే చిదంబర రహస్యం...మనకెందుకు పోనివ్వండి.

అనేక ఆలోచనలు బుర్రలో పరుగెడుతున్నాయి గోపాలానికి. పాప బోసినోటితో నాన్న పాలడబ్బా తెస్తాడని ఎదురుచూస్తూ ఉంటుంది. వట్టి చేతుల్తో తాను వెడితే పాలడబ్బా కూడా కొనలేనివాడవు నన్నెందుకు కనాలి? నందనోద్యానవనం కావలసిన నా జీవితాన్ని మొలకెత్తేసరికే తుంపెయ్యదలుచుకున్నావా?

నాకు జన్మనిచ్చిందెందుకు? నాకా జన్మనిచ్చిన నిన్నేం బ్రతికనీలేకే?' అని అడుగుతుందేమో ?

ఉదయం బయలుదేరి యింట్లోంచి వచ్చేటప్పుడు పెద్దపిల్ల బృంద "నాన్నగారూ! వాళ్ళపాప ఎక్కి కూచుంటే ... ఊ... ఊగుతోంది...అలాంటి ఊగే గుర్రాన్ని నాకు పట్టుకు రాలూ" అంది. కళ్ళు కష్టంపడి, గోపాలం అల్లాగే లేమ్మా అన్నాడు అదెంత పని అన్నట్టు. ఆ గుర్రాన్ని కొనడం గోపాలానికి సాధ్యమా? అప్పుడే కొననని చెబితే తీరిపోను గా. ఆశ పెట్టుకు యెదురు చూడదు గా పిల్ల. పిల్లని ఊరుకో బెట్టడానికి అల్లాగే అనడం తరువాత పిల్లని నిరాశలో ముంచెత్తి నీరసింపచెయ్యడం ఇదీ మనబాలల భవిష్యత్తు.

ఎందుకింత నైరాశ్యం. మొలలో యెనిమిది వందలున్నాయి. ఏమైనాసరే ఖర్చుపెట్టి కావలసినవన్నీ కొనుక్కు వెడతానని గబగబ నడుస్తున్నాడు.

"ఇతరుల సొమ్ము ఖర్చుపెట్టడానికి నువ్వెవరవోయి. నిన్ను నమ్మి వ్యాపారం చేసుకు రమ్మని సాహుకారు నీచేతికి డబ్బు యిస్తే ఖర్చుపెడతావా? ఇదేనా న్యాయం? ఒకటవ తేదీ వచ్చేసరికి అరవై రూపాయలు చేతిలో పోస్తున్నాడే. అల్లాంటి సాహుకారుని అన్యాయం చేస్తావా?" అని అంతరాత్మ ఘోషించింది. ఆ సంచిలోంచి ఒక్క రూపాయికూడా తీయకూడదనుకున్నాడు.

అల్లాగే నీరసంగా కాళ్ళీడ్చుకొంటూ వస్తున్నాడు. ఎదురుగా ఫుట్ పాత్ మీద ఒక పంజరంలో చిలుకను పెట్టుకొని ఏవో కొన్ని మడతలతో ఉన్న కాగితాలు ఎదర పెట్టుకొని ఒక ఆసామీ" పక్షి పలుకుతుంది నీభవిష్యత్తు రా తమ్ముడూ" అంటున్నాడు.

గోపాలం యేమీ తోచక ఆపక్షి యేం చెబుతుందోనని యాంత్రికంగా నడిచి అక్కడికి వెళ్ళాడు. ఆ ఆసామీ అణా యిమ్మన్నాడు. జేబులో యెప్పటినుంచో ఒక చిల్లి కాని ఒక నయాపైస స్నేహం చేస్తున్నాయి. పాత క్రొత్తల కలయికలో దాస్య స్వతంత్రాల కలయిక కాలం అన్నట్టున్న ఆ చిల్లికాని ఆ నయాపైసల స్నేహాన్ని అమాంతంగా విడదీసి చిల్లికాని యిస్తానన్నాడు. పాపం యెందరి భవిష్యత్తైనా చెబుతాడు గాని తన భవిష్యత్తు తనకే తెలియని ఆ ఆసామీ ఆ చిల్లికానీకే కక్కుర్తిపడి తీసికొని చిలకని పంజరంలోంచి బయటికి తీశాడు.

"అమ్మయ్య! నా చిల్లికానీ ధర్మమా అంటూ ఈ రెండు నిమిషాలేనా స్వతంత్రం యిచ్చాడు పాపం ఆ చిలకకి అని సంతోషించాడు గోపాలం. కాని ఆ వెను వెంటనే ఎగరడానికి వీలులేకుండా చాటుగా రెక్కలు కత్తిరించి బహిరంగంగా స్వతంత్రంయిచ్చానని చూపించే ఆ ఆసామీ మోసం చూస్తే పాపం గోపాలానికి యేవేవో జ్ఞాపకం వచ్చాయి. ఆ జ్ఞాపకం వచ్చినవన్నీ పైకి చూపించడానికి వీలులేని ఆణిముత్యాలు. చూపిస్తే యేదో వంక పెట్టి యేదూవలు లెక్క పెట్టించే పరమసత్యాలు.

ఆ చిలుక కాగితాల మడతలలోని ఒక మడతను ముక్కుతో లాగింది. ఆ ఆసామీ మడతవిప్పి చదవడం మొదలుపెట్టాడు.

"నీకు యిప్పుడు చాలా మంచిరోజులు. నీ ఆలోచనలు న్యాయంవైపునకే మొగ్గుచూపుతాయి. నీ పవిత్రతే నిన్ను కాపాడుతుంది. కంగారుపడి బురదలో అడుగువెయ్యకు. వేశావా జీవితాంతం వదలదు" అని చదివాడు.

ఎక్కడలేని కోపంవచ్చింది గోపాలానికి. ఏమాటంటే కడుపు రగిలిపోతుందో అదే యిక్కడ కూడా ప్రత్యక్షమైంది. ఇప్పుడు చాలా మంచిరోజులట అందుకే కొంపలో బియ్యంలేవు అప్పిచ్చే దాతా లేడు. అరువిచ్చే సాహుకారూ లేడు. ఎవరికి మంచిరోజులు ... నాకుకాదు. మంచిరోజులు మా సాహుకారుకు వచ్చాయి. ముందెన్నో గాబోతున్నాయి. నెలరోజుల క్రితం లెక్కలుచూచుకోగా వ్యాపారంలో పన్నెండు వేలు లాభంవస్తే యీ నాలుగు రూపాయలు పెట్టి చొక్కా కుట్టించుకోమని యివ్వలేకపోయాడు. ఇక నాకు మంచిరోజులేవిటి?...

వెధవరాతలు వీడూను. ప్రతీ కాగితం మడతలోను యిల్లాగే రాసివుంటుంది. బహుశః వీడిదగ్గరికి వచ్చినవాడికల్లా మంచిరోజులు వస్తూనే ఉంటాయి. కాని వీడికిమాత్రం మంచిరోజులు రావు కాబోలు. వస్తే వీడికీ ఫుట్ పాత్ మీద నివసించే ఖర్మంయేవిటి? మంచిరోజులమాట యెట్లాఉన్నా పిల్లయేడిస్తే కనీసం కాసిన్ని బటానీలేనా కొనిపెట్టకుండా చిల్లికానీకి మాత్రం ఖరాబుపట్టింది. బుర్రగోక్కుంటూ రెండు కాళ్ళకి బుద్ధిచెప్పి గోపాలం ఘటాన్ని యింటికి నడిపిస్తున్నాడు.

అదే ఫుట్ పాత్ మీద పెద్దచెయ్యి బొమ్మఉన్న అట్టఒకటి పెట్టుకుని ఏవో పెద్ద పెద్ద గ్రంధాలు దగ్గర పెట్టుకుని కూర్చున్నాడొక పెద్దమనిషి. పెద్దతలపాగ, కోటు, ఆ కోటుకి నాలుగు మెడల్సు. (బంగారానివో గిల్టువో చెప్పవేం అనుకోండి) వేషంమాత్రం హంగు

గానే ఉంది. అగరువత్తుల సువాసనలు ఆఘ్రాణిస్తూ హస్త సాముద్రికశాస్త్రంలో ఆరితేరిన మొనగాడిలా ఎఱ్ఱటికుంకం బొట్టుతో ఆకర్షిస్తున్నాడు గోపాలం లాంటి అసహాయుల్ని.

పక్షిపలికే భవిష్యత్తుకోసం ఆశించిన గోపాలాన్ని చూశాడు. పడింది తనవలలో పిట్ట. పట్టింది వాడి డబ్బులకు ఖగాబు అనుకున్నాడు ఒకచేత్తో కోరమీసాన్ని దువ్వుతూ హస్తసాముద్రికం చెబుతాం సార్ అన్నాడు గోపాలాన్ని చూచి.

చిరాకు వచ్చింది గోపాలానికి "వీడూ మంచి రోజులనే చెబుతాడు. చెడ్డరోజులని చెబితే రాగి పైసా యివ్వడు యెవ్వడూను. ఇదొకరకం బ్రతుకు తెరువు" అనుకుని సమాధానం చెప్పకుండా తలవంచుకు తొందరగా నడుస్తున్నాడు.

తనలో తనకే నవ్వువచ్చింది. "మంచి రోజులట మంచి రోజులు" అనుకున్నాడు మరోసారి. అంతలోనే ఎవరో వీపుమీద చరిచి ఏదో చెబుతున్నట్టయింది.

"అవును. నీకు మంచి రోజులు గనుకనే నీ షావుకారుకు పన్నెండువేలు లాభం వచ్చింది నీ షావుకారుకు లాభంరాక నష్టంవచ్చి ఉంటే వ్యాపారమే మానివేసిఉండును. అప్పుడు నీగతి యేమవుతుంది. గుమాస్తా పనికోసం ఎక్కే గుమ్మం దిగే గుమ్మం జ్ఞాపకముందా? ఆ అవస్థనుండి తప్పించాడు నీ షావుకారు. లాభం వచ్చింది గనుకనే మళ్లీ వ్యాపారం సాగించాడు. కనుకనే ఏ నెల అగ్వై ఆనెల ఎగగొట్టకుండా యిస్తున్నాడు. పన్నెండువేలు లాభంవస్తే చొక్కా కుట్టించలేదని బాధపడుతున్నావా? అటా ఎందుకు ఆశించాలి? అరవై రూపాయల జీతానికి చాకిరీచేస్తానని కుదిరావు. నీ షావుకారుకు నష్టం వచ్చిఉంటే నీ జీతంలో ఒక్క రూపాయి తగించుకుందుకు నువ్వు ఒప్పుకుంటావా? నీ యజమాని బాగుండాలని కోరుకో. పొదుగు పిండి పాలు త్రాగడానికే ప్రయత్నించు. పొదుగుకోసి పాలు త్రాగడానికి ప్రయత్నించకు. నీలాటి గుమాస్తా నీ షావుకారుకు యెదురు తిరిగి యేం చెయ్యగలుగుతున్నాడు. కోర్టులచుట్టు తిరుగుతున్నాడు. లేబరాక్టు యేదో ఉద్ధరిస్తుందని. బ్రతుకు తెరువుకు కావలసింది సామరస్యంగాని యాక్టులు, కోర్టులు గావు. మళ్ళీ ఎవడైనా గుమాస్తాగా పెట్టుకున్నాడా? ఎందుకు పెట్టుకుంటాడు? వెర్రివాడా! న్యాయంగా నీకు రావలసినదానికే ప్రయత్నించు. అన్యాయంగా ఒక్క కాని కూడ ఆశించడానికి ప్రయత్నించకు. కష్టాలు వస్తాయి. నిగ్రహించుకోవాలి. అప్పుడే ఓర్పు చూపించాలి కష్టాలుకూడా ఉన్నప్పుడే సుఖాలయొక్క విలువ తెలుస్తుంది. అప్పుడే నిజమైన జీవితమాధుర్యాన్ని అనుభవించగలుగుతాడు మానవుడు."

వెనక్కు తిరిగి చూచాడు గోపాలం. ఎవ్వరూ లేరు. ఆలోచించాడు. తనహృదయమే తనకు చెప్పిందనుకున్నాడు. తనకు వినిపించిన మాటలన్నీ యదార్థమే ననుకున్నాడు. పొదుగుపిండి పాలుతాగాలి గాని కోసుకుతాగడం పొరబాటే ననుకున్నాడు. కష్టాలున్నప్పుడే సుఖాలయొక్క విలువ తెలుస్తుందనుకున్నాడు. ఈ రెండు విషయాలు శిలాక్షరాల్లా హృదయంలో నాటుకుపోయాయి గోపాలానికి. మననం చేసుకుంటూ కాళ్ళీడ్చుకుంటూ ఘటాన్ని యింటికి జేరశాడు.

తండ్రి రాకకోసం ఎదురుచూస్తూ వీధిగుమ్మాన్ని పట్టుకు నిలుచున్న బృంద తండ్రిరాగానే కాళ్ళకు చుట్టుకొని "నాన్నగారూ! నాకు గుల్లం పట్టుకు వచ్చారా?" అంది. ఏం చెప్పాలో తెలియలేదు గోపాలానికి. కళ్ళనీళ్ళు తిరిగాయి. కనిపెట్టింది భార్య సుగుణ. బృందని చంక నెత్తుకుంది.

ఓహో అదేమిటామాట!
సంతానం కుళ్లి కృశిస్తూ ఉంటే తల్లికి క్షోభ కాదూ?
భారతీ-భారతాంబ బొల్లి, సమస్త చర్మవ్యాధులచే పీడింప బడుచున్న తన సంతానం కోసం ఎంత విచారిస్తూ ఉందో?
(స్థాపితము 1920 సం॥రం)
ఇదుగో మా చిరకాల అనుభవంతో ఇస్తూ ఉన్న అభయం.
మాకు నేడే వ్రాయండి
రెడ్డి అండ్ కో.,
గోపాలపురం. (తూ.గో.జి)

# జీవిత మాధుర్యం

"ఛీ! అల్లాంటి గుర్రం యేంబాగుంటుంది. దాని మీదనుంచి పడిపోతే దెబ్బ తగులుతుందమ్మా" అంది.

"ఎందుకు తగులుతుంది."

"ఆ గుర్రం పడగొట్టేస్తుంది."

"ఎందుకు పడగొడుతుంది? మరి వాళ్ళపాపని పడగొట్టిందేం"

"దానికి కోపం వచ్చినప్పుడు పడగొడుతుంది"

"ఎప్పుడొస్తుంది కోపం?"

"ఎప్పుడో వచ్చేస్తుంది. ఇంకా కావలిస్తే నాన్న గారిని అడుగు." అంది భర్తని బాధాసముద్రంలోంచి కాస్త మేల్కొల్పాలని.

"ఏవండి నాన్నగారూ! గుర్రానికి కోపం వొచ్చి పడగొడుతుందా?" అంది బృంద, కూర్చున్న తండ్రి ఒళ్లోకెక్కి చొక్కా గుండీలు సర్దుతూ.

"అవునమ్మా" అన్నాడు గోపాలం. సుగుణ మాదిరిగా సర్ది చెప్పేవిధానం తనకు తోచలేదను కున్నాడు.

"అయితే నాన్నగారూ! వెదవగుర్రం మనకొద్దు" అంది బృంద బుంగమూతి పెట్టి తండ్రితో.

జాలేవేసింది గోపాలానికి. సిగ్గూ వచ్చింది తన అసమర్థతకు.

బిడ్డల కోర్కెలు తీర్చలేనివాళ్లు ఎందుకు కనాలి. కని వాళ్ళ ఆశల్ని సమూలంగా నాశనంచేసి వారి పురోభివృద్ధి నెలా అరికడుతున్నారో యీనాడు అర్థమెంది గోపాలానికి. తనకీ పాఠం నేర్పిన బృందను ఒక్క ముద్దు పెట్టుకున్నాడు.

మరి యీముద్దో అని రెండోబుగ్గ చూపించింది బృంద. బాగంతా మటుమాయమయి రెండో ముద్దు కూడా పెట్టుకున్నాడు.

క్షణకాలం జరిగిపోయింది.

"సుగుణా! కాసిన్ని మంచినీళ్ళు అందు కుంటావా?"

"కొంచెం మజ్జిగ దాహం తాగరాదూ ఉప్పువేసి యిస్తాను."

"మరి నువ్వుకూడా తాగవు? ఇవ్వాళటికి ఇదరం చెరో కాస్త ఆ మజ్జిగ తాగి పడుకోవలసిందే. క్రిందటి జన్మలో ఎవరినోటిముందు అన్నమో లాగేశాం. ఈజన్మలో తిండికి మొఖంవాచాము" అన్నాడు కన్నీళ్ళతో గోపాలం.

'అదేమిటండీ ఇంతమాత్రానికే...మీరే కంట తడిపెడితే నేనేమైపోవాలి చెప్పండి...మనమాటకేం పాపం పాపకి ప్రొద్దుటినుంచీ పాలులేవు"

"అవును కనసంమాత్రం కన్నాము. గుక్కెడు పాలు పొయ్యలేకపోతున్నాం. మనలాంటి గర్భ దరిద్రుల కడుపున యెందుకుపుట్టాలి మరి బృంద నేలా ఊరుకోబెట్టావు."

"నిన్నవంటగా గిద్దెడుబియ్యం మిగిలాయి అవి వండి దానికిపెట్టాను."

"మంచిపని చేశావు పాపకి పాలులేవు."

"పాపం ఆ యెదరింటివారి లక్ష్మి క్షణంక్రితం వచ్చింది. ఏవోమాటల సందర్భంలో పాలడబ్బా అయి పోయింది. తేవాలి అనిచెబితే పాపం వాళ్ళ పాల డబ్బాలో పాలుకలిపి పట్టుకువచ్చి యిచ్చింది. యిప్పుడే"

"మరి పట్టించావా"

"ఏదీ? ఆవిడా వెళ్లింది. మీరూవచ్చారు. మీకు మజ్జిగయిచ్చి పాపకి పాలు పట్టిస్తాను. అని తొందర గా నే వంటయింట్లోకి వెళ్లిపోయింది.

'సుగుణా' అన్నాడు కన్నీళ్లతో గోపాలం.

'ఏవండీ' అని దగ్గరకు వచ్చింది. చూచింది. "ఏమిటండీ అది చిన్నపిల్లాడిలా" అని కళ్లనీళ్లు తుడుచు కుంది.

"ఇంత అసమర్థుడైన భర్తను కట్టుకుని యేం సుఖ పడుతున్నావు సుగుణా"

"అబ్బ!......ఏంమాటలండీ అవి.

"కూటికికూడా గతిలేని కాపరం ఎందుకొచ్చిన కాపరంరా అనుకుంటోందికదు నీ మనస్సు సుగుణా."

ఆ మాట బాణంలా గుచ్చుకుంది సుగుణ హృద యానికి, తీక్షణంగా చూచింది భర్తవంక "నేను బ్రతికుండడం మీ కిష్టంలేదా!" అంది బాధగా.

"లేదులే సుగుణా. వెళ్ళి మజ్జిగ పట్టుకురా. చెరో గుక్కెడు తాగుదాం."

"ఇంకెప్పుడు అలాంటి మాటలననని ప్రమాణం చెయ్యండి."

"లేదులే సుగుణా. వెళ్ళి మజ్జిగ తీసుకురా."

కన్నీళ్ళతోనే వంటయింటి నుమ్మంలోనికి వెళ్ళింది. పిల్లి మూతి నాకుకుంటూ యెదురుగా వచ్చింది. సుగుణ చూచింది గుండె గుభేలుమంది. మూత పడగొట్టి మజ్జిగ కాస్తా పిల్లి తాగేసింది. కళ్ళ నీళ్లు గిర్రున తిరిగాయి. అక్కడే కూలబడింది. ప్రొద్దుటినుంచీ యిద్దరికీ తిండిలేదు. భర్త యింటికి వచ్చాక ఒక వేళ బియ్యం దొరక్కపోతే యిద్దరూ చెరో గుక్కెడు ఆ మజ్జిగ త్రాగి యీ రోజు గడప వచ్చుననుకుని, మధ్యలో ఆకలిబాధ అణుచుకోలేక పోయినా, మజ్జిగ త్రాగకుండా అల్లాగే అట్టే పెట్టింది భర్తకు పట్టుకు వస్తానని చెప్పి లోపలికి వచ్చింది. ఏ ముఖం పెట్టుకు భర్త దగ్గరకు వెడుతుంది? ఏమని చెబుతుంది?

పాప పాలులేక తొట్టెలో ఏడుస్తోంది. ఎంత సేపటికి మజ్జిగ తీసుకు రాకపోవడంచేత గోపాలం 'సుగుణా!' అన్నాడు. జవాబు రాలేదు. ఉదయం నుంచీ భోజనం లేకపోవడంచేత కళ్లు తిరిగి పడిపోయి ఉంటుందేమోనని కంగారుపడి వంటయింట్లోకి వచ్చాడు. సుగుణ ముఖం రెండు చేతులలో మూసుకుని ఏడుస్తొంది.

'ఏమిటే సుగుణా' అన్నాడు భయంగా.

'పిల్లి మజ్జిగ కాస్తా తాగేసింది' అంది యేడుస్తూ సుగుణ.

ఇంతమాత్రానికే యేడుస్తారా? పానీలే పాప యేడుస్తోంది ఆపాలు కాసిన్ని పొయ్యరాదూ?" అన్నాడు.

లేచింది సుగుణ. పాలగ్లాసు తీసుకుంది. పట్టుకు వచ్చింది. పాపని లేవదీసి పాలుపొయ్యటం కోసం కాళ్లమీద పడుకోబెట్టుకుంటోంది. పాప చేతులు కాళ్లు కొట్టుకుని యేడవడంలో చెయ్యితగిలి ఆ పాల గ్లాసు పడిపోయింది.

అయ్యోయ్యని అరిచింది సుగుణ. తల గోడకేసి కొట్టుకు యేడుస్తోంది పిల్లకి ఆ పాలుకూడా పట్టలేక పోయా నేనని.

గోపాలానికి నవ్వు ఏడుపు రెండూ కలిసే వచ్చాయి. కళ్ళవెంట కన్నీరు కారుస్తూ నవ్వుతున్నాడు.

ఏడుస్తూ నే యెందుకు నవ్వుతున్నారంది సుగుణ.

"ఎందుకా? జీవిత మాధుర్యం అంటే యేమిటో యీనాడు తెలుసుకున్నాను నాను జీవితపు లోతుల్లో ఉండే అందం కనిపిస్తోంది సుగుణా! ఎంత విచిత్రమైన సంఘటన. మనజీవితాంతంవరకు మరచిపోగలమా? కష్టాలున్నప్పుడే సుఖాలయొక్క నిజమైన విలువ తెలుస్తుంది సుగుణా. జీవితపు లోతుల్ని తరచి చూచిన వాడే నిజమైన జీవిత మాధుర్యాన్ని పొందగలుగుతాడు. సుగుణా! నిజమైన జీవిత మాధుర్యం అనే పదానికి సరియైన అర్థం ఈ మన విచిత్రసంఘటనే సుగుణా!" అన్నాడు.

సుగుణను యేం అనాలో తెలియక గ్రుడ్లు వప్పగించి చూస్తోంది గోపాలంవంక.

కాళ్లమీదఉన్న బోసినోటి పాప చైతన్య రహితయైఉన్న సుగుణ కాళ్ళమీదనుంచి దొర్లిపోయి ఒలికిన పాలల్లోపడి రెండు చేతులతో తపతప కొడుతోంది. అవ్యక్తమైన ఆనందంలో బోసినోటితో కలకల నవ్వుతూ తల్లివంక చూస్తోంది.

ఆ చూపులతో తేరుకున్న సుగుణ ఒక్కసారి పాపను తీసికొని గుండెలకు హత్తుకుని చిరునవ్వు నవ్వింది.


ప్రముఖపత్రికలూ, ప్రఖ్యాతసాహితీపరులూ ప్రశంసించిన

ఉత్తమ గ్రంథాలు

1. సంజప్రణయం: పదికథలూ, గల్పికలు.
రచన: పూషా: వెల 0-50 న. పై.
2. పారిజాతం: నేటి ప్రఖ్యాత కథకుల పదకొండు కథలు. వెల రు 1-25 న. పై.
3. తెరమెరుగులు: (ఐదు ఉత్తమ నాటికలు) కుక్కపిల్ల దొరికింది (రావికొండలరావు); దొంగ (పోతుకూచి సాంబశివరావు); తెల్లవారింది (హితశ్రీ); తెరమరుగు నీడలు (కొండముది శ్రీరామచంద్రమూర్తి); త్రీలకు ప్రత్యేకం (అంగర సూర్యారావు). వెల రు 1-50 న. పై.

శోభా ప్రచురణలు, విజయనగరం సిటీ.

సరిక్రొత్త ఉపయోగమైన పుస్తకములు

వ్యవసాయము - ఇంజనీరింగు, వైద్యము, యింకా అనేక విషయములపై మా వద్ద గలవు కేటలాగు ఉచితము. ఇంగ్లీషులో వ్రాయండి.

N. K Paul & Sons, Post 12202, Calcutta-5.

# కలగూరగంప

## ఆచార్య శిశిరకుమార్ మిత్ర

శ్రీ ఆర్. ఎల్. ఎన్. శాస్త్రి



యిటీవల బ్రిటిష్ రాయల్ సొసైటీవారు యిద్దరు ప్రముఖ భారతీయ భౌతిక శాస్త్రవేత్తలను సభ్యులుగా నెన్నుకొనిరి. వీరిలో ఒకరు ఆచార్య ఎస్. ఎన్. బోస్. వీరు చాలకాలము కలకత్తా విశ్వవిద్యాలయము ఆచార్యులుగానుండి, ప్రస్తుతము విశ్వభారతి శాంతినికేతనమునకు ఉపాధ్యక్షులుగానున్నారు. రెండవవారు ఆచార్య శిశిర కుమార్ మిత్ర.

శ్రీ శిశిర్ కుమార్ మిత్ర కలకత్తాలో 1890 లో జన్మించిరి. భగల్పూర్ కళాశాలయందును, కలకత్తా ప్రెసిడెన్సీ కళాశాలలోను విద్య నభ్యసించిరి. 1919 లో కలకత్తా విశ్వవిద్యాలయమువారు వీరికి D.Sc. పట్టము నొసగిరి. ఆ సంవత్సరములోనే వీరు పారిస్ విశ్వవిద్యాలయమునకేతెంచి 1923 లో స్వదేశమునకు తిరిగివచ్చిరి. వెంటనే కలకత్తా విశ్వవిద్యాలయములో భౌతికశాస్త్రశాఖలో ఖైరా ప్రొఫెసర్‌గా నియమింపబడిరి. నిస్తంతిప్రసారము (వైర్లెస్ కమ్యూనికేషన్స్) దేశములో ముందు ముందు వేగముగ అభివృద్ధి పొందగలదని ఆచార్య మిత్ర ఆ రోజులలోనే గ్రహించి, వైర్‌లెస్ శాస్త్రమును పెద్ద తరగతులలో బోధించుట మొదలిడిరి. అంతేకాక వారు ఆ శాస్త్రములో పరిశోధనలు కూడ మొదలిడిరి. 1935 లో వారు సర్ రాష్ బెహారీఘోష్ ప్రొఫెసర్‌గా నియమింపబడి, నవంబరు 1955 లో రిటైర్ అగువరకు ఆ పదవియందే యుండిరి.

భారత ప్రభుత్వమునకు చెందిన కౌన్సిల్ ఆఫ్ సైంటిఫిక్ అండ్ యిండస్ట్రియల్ రిసర్చి వారిచే రేడియో పరిశోధన సంఘమును స్థాపించజేయుటకు ఆచార్య మిత్ర కారకులు. ఈ సంఘటనమునకు ప్రప్రథమ అధ్యక్షులుగా వీరు 1943-48లో పనిచేసిరి. వీరి నాయకత్వమున కలకత్తా విశ్వవిద్యాలయములో 1949 లో రేడియో ఫిజిక్స్ అండ్ ఎలక్ట్రానిక్స్ శాఖ నెలకొల్పబడెను

ఆచార్య మిత్ర మనదేశములో రేడియోకు సంబంధించిన పరిశోధనలలో అగ్రగణ్యులు. వారు యువకులకు, తమ శిష్యులకు ప్రోత్సాహము నిచ్చి సహాయము చేయుటలో ఉదారబుద్ధి కలవారు.

వీరు Upper Atmosphere అను గ్రంథమును రచించిరి. ఈ విషయమును గురించిన గ్రంథము యిది యొక్కటే యగుటయేగాక అనేక అంశములలో యిది స్వతంత్ర రచనగా ప్రపంచ ఖ్యాతినొందినది. యిటీవల దీనిని రష్యన్ అకాడమీ ఆఫ్ సైన్సెస్ వారు రష్యను భాషలోకి తర్జుమా చేయించి ప్రచురించిరి.

ఆచార్య మిత్ర 1955 లో భారత విజ్ఞాన పరిషత్తు (Indian Seience congress) నకు అధ్యక్షత వహించిరి. భారత విజ్ఞాన వార్తాసంఘమునకు కూడా అధ్యక్షులు. ఈ సంఘమువారు "విజ్ఞానము-సంస్కృతి" (Seience and Culture) అను యింగ్లీషు మాసపత్రికను ప్రచురించుచున్నారు. అంతర్జాతీయ జియోఫిజికల్ ఇయర్ తాలూకు భారత జాతీయసంఘమునకు ఆచార్య మిత్ర సభ్యులు. అనేక భారతీయ, విదేశీయ వైజ్ఞానిక పత్రికా సంపాదక వర్గములలో సభ్యులు. మన దేశములో యిటువంటి ప్రఖ్యాతిగాంచిన శాస్త్రజ్ఞులుండుట మనందరికీ గర్వకారణము.

# గీర్వాణ కవయిత్రి విజ్జిక

'మ ధు ర వా ణి'

సంస్కృత కవయిత్రులలో విజ్జికకు తారాపథమున ధ్రువునకువలె, నొక విశిష్టస్థానమున్నది. నేడు మనకు సువ్యాప్తములైన యీకవయిత్రి కావ్య కుసుమములే యిట్టి కళావిశేషములను వెలువరించుచున్నవి. తన సౌందర్యము, మేఘమాలికలతో పంతమాడుచుండెనని, సహృదయువిజ్జిక ప్రవచనము. ఇట్టి విశేషము విజ్జికా విరచితమగు నీక్రింది శ్లోకముచే సువ్యక్తమగుచున్నది.

నీలోత్పల ఘనశ్యామామ్,
విజ్జికా మా మజానతా
వృథైవ దండినా ప్రోక్తమ్
'సర్వ శుక్లా సరస్వతీ'

'నేను నీలోత్పలమువలె, మేఘమువలె నల్లనయిన దానను. వన్నెరుగక దండికవి సరస్వతీదేవి తెల్లనిదని వర్ణించెను.' ఇందుమూలమున మనకు రెండువిషయములు సువ్యక్తములగుచున్నవి. ఒకటి, శ్యామవర్ణయయ్యును, ఆమె తన సౌందర్య ప్రతిభారసికతలపై నభిమానినియైయుండెను. తాను సరస్వతియేనని నొక్కి వక్కాణించుట రెండవది. అట్టి యామె మనోహర వర్ణనలు కించిన్మాత్రముగా తిలకించుదము.

కమలినీ మలినీ దయితంవినా
న సహతే సహతేన చ సేవితుమ్ !
తి మధునా మధునా నిహితం హృది
స్మరతి సా రసపార మహర్నిశమ్

కుముదిని (కమలములుగల సరస్సు), తనప్రియుడగు సూర్యుడు కనబడనందున, వెలవెల బోవుచున్నది. వసంతమువలన, తన హృదయ నిహితసారమును స్మృతికి దెచ్చుకొని, వికల మనస్కయైనది.

సుందరియగు నొక వనితాముఖ సౌందర్యము చూడుడు, యెంత విచిత్రముగ చిత్రింపబడినదో!

కోపః స్ఫీతతరః స్థితాని పరితః
పత్రాణి దుర్గం జలమ్
మైత్రం మండల ముజ్వలం చిరమథో
నీతాశ్చతాః కణ్టకాః
ఇత్యాకృష్ట శిలీముఖేన రచనాం
కృత్వా తదప్యగ్రహీతం
యత్పద్మేన జిగీషుణాపజితం
ముగ్ధే! త్వదీయం ముఖమ్ !

ముగ్ధా! కమలము పెద్ద అట్టహాసముతో నీ విజయముకొఱకు సమరయాత్ర సలిపినది. కాని, దాని ప్రయత్నములన్నియు నిష్ఫలములైనవి. శౌర్యము, విజయసాధన సామగ్రికూడ అత్యద్భుతము. విచ్చుకొన్న దాని కోశము దానిఖజానా. నలుదిక్కుల వ్యాపించిన దాని దళములు వాహనములు, జలము దాని దుర్గమమైన దుర్గము, ఉజ్జ్వల సూర్యమండలము, దాని ప్రియమిత్రము. కంటకమునుకూడ క్రిందొనర్చినది. ఇంతే కాక శిలీముఖము (బాణము, భ్రమరము)ను సైతము లాగివేసినది. కాని యింతటి సాధన సామగ్రియున్నను, కమలముచే నేపనియు గాకపోవుట విచార్యము అగునది మాత్ర మేమున్నదిగనుక! విజయయాత్రకు బయలు వెడలిన యీ ముఖము నెవరును గెలుచుకొనలేక పోయిరి!

విజ్జిక, అనుపమాన కావ్యశక్తి విశిష్టత, కీ చిత్రణమొక నిదర్శనమైన తార్కాణము.

వర్షకాలమును నారీ విరహిణి, మార్మిక చిత్రాన్ని, భావుకురాలగు విజ్జిక, తన కవితాకుంచెతో నద్ది దిద్దినది. అటిది, యీ క్రింది పంక్తులలో గాననగును—

మేఘైర్వ్యోమ్ని నవాంబుభి ర్వసుమతీ విద్యుల్లతాభి ర్దిశో,
ధారాభి ర్గగనం వనానికుటజైః పూరై ర్వృతా నిమ్నగాః।
ఏకాం ధారయితుం వియోగవిధురాం దీనాం
వరాకీం స్త్రియం ప్రావృట్ కాల! హతాశ!
మాంప్రతికృతం మిథ్యా కిమాడంబరమ్ ?

విరహిణి వర్షర్తువులో యిలా అన్నది. 'విరహ వేదనచే తపనజెందు నాకొఱకు, నీ వెందుల కింత యాడంబరము చేసితివి? ఆకాశమున నీలమేఘము లలముకొనినవి. భూమి జలముచే పరిపూర్ణమై పోవుచున్నది. దెసలు మెరపులతో మెరసిపోవుచున్నవి. అంతరిక్షమును, జలధారలచే నిండిపోవుచున్నది. వనముల, కామోద్దీపకములగు కుటజ పుష్పముల సౌరభము వ్యాపించినది. నదులు వేగవతులై మహాప్రవాహములలో మంతనములాడుచున్నవి. ఇట్టిపరిస్థితిలో నేను విరహతాపముచే దగ్ధనైపోవుచుండ వీని యావశ్యకత యేమున్నది?'

విజ్జిక కవిత సహృదయ శిరోధార్యము.

# గ్రంథవిమర్శనము

## దేవీగానసుధ

### [ద్వితీయ సంపుటి]

శ్రీ ఓగిరాల వీరరాఘవశర్మ. గోష్పదీక్షేత్రం. కొవ్వూరు. పశ్చిమ గోదావరిజిల్లా వెల : మూడు రూపాయలు.

ఓగిరాల వీరరాఘవశర్మగారు 1947 లో దేవీగానసుధ ప్రథమభాగం ప్రకటించారు. దానికీ కృతి రెండవ భాగం. దీనిలో ఉన్నవి మొత్తం 36 కృతులు. వీటిలో కొన్ని సంస్కృతంలో రచించిన కృతులు. కృతులన్నిటిలోను చరమలక్ష్యమైన పరమారాధ్య దేవత గాయత్రీదేవి.

కేవలం గేయకవులుగాని, కేవలం సంగీత వేత్తలుగాని కృతులు రచించి కృతకృత్యు లనిపించుకోలేరు. ఈ విధమయిన రచనకు, అటు సంగీతంలోను, ఇటు సాహిత్యంలోను సముచితమయిన శక్తిసామర్థ్యా లవసరం.

కనుక నే నేడాంధ్ర దేశంలో స్వయంగా కృతులు రచించగలిగిన వాగ్గేయకారకుల సంఖ్యచాలా తక్కువ. సంగీత విద్వాంసులలో చాలా మంది త్యాగరాజాదుల కృతులకు గానకల్పనలో నే తమ కళాసామర్థ్యం వ్యక్తీకరిస్తూ అంతటితో నే సంతృప్తి పొందుతున్నారు.

ఈ రచయిత స్వయంగా కూడా వాగ్గేయ రచన కుపక్రమించారు. శ్రీ వీరరాఘవ శర్మగారి కృతులలో సహజము, శుచిఅయిన భక్తిభావం జాలువారుతున్నది. ఈ కృతులు క్రమక్రమంగా ప్రజాదరణ, విద్వాంసుల ఆదరణ పొందడానికి కృతులలో జాలువారే గానమాధుర్యమేగాక, భక్తి భావం కూడా కొంతవరకు కారణమే.

ఈ గ్రంథంలో రచయిత కేవలం కృతులే గాక, ప్రతికృతికీ, స్వరవివరణతో బాటు ఆయారాగాల లక్షణాదులు కూడా, సంగ్రహంగా పొందుపరిచారు. ఇవి సంగీత విద్యార్థులకే గాక, విద్వాంసులకు కూడా ఉపకరిస్తాయి. ఆదితాళంలో సారంగ రాగంలో రచించిన ఈ క్రింది కృతినిబట్టి వీరి రచనా ఫణితి గుర్తించవచ్చును. "నన్నుబ్రోవ నీ కన్న వేరెవ్వరున్నారు ఆపన్నరక్షణ ఇలలో! | కన్నతల్లి! ఆదిలక్ష్మి! కామేశ్వరి! తిన్నగా భావాబ్ధినాటించి దయతో | గుట్టువిడిచి పాటివరుల చెంతజేరి పొట్టకూటికై బొంకులాడగలనా! | దిట్టరివని నమ్మిక రాఘవుని రట్టుదిద్దు దీనరక్షణివి గావా"

శ్రీ శర్మగారు అత్యల్ప సంఖ్యాకులయిన నేటి ఆంధ్ర వాగ్గేయ కారకులలో పరిగణింప దగినవారు.

అన్ని విధాలా సాంప్రదాయికమయిన త్యాగరాజాదుల అడుగు జాడల్లో నడిచిపోతూ వీరు ఆంధ్రగాన సరస్వతికి కొన్ని నూతలాలంకృతు లర్పించారు.

'శాస్త్రి'.

## భారత యువజనులారా!

అనువాదకులు : కీ. శే. తత్త్వానందస్వామి. ప్రతులకు : శ్రీ రామకృష్ణమఠము మైలాపూరు మద్రాసు-4. వెల : రెండురూపాయలు.

శ్రీ వివేకానందస్వామి భారతదేశం నాలుగు చెరగులా పర్యటిస్తూ చేసిన ఆధ్యాత్మిక ప్రబోధ ప్రసంగాలు ఆ నాటికి నిర్జీవమయివున్న భారతజాతికొక వినూత్న చైతన్యం కలిగించాయి. భారతజాతి స్వాతంత్ర్యకాంక్షకు, నవజాగృతికి శ్రీ వివేకానందుని ప్రసంగాలు మేల్కొలుపు లయినాయని అన్నా అది అతిశయోక్తి కాజాలదు.

కీ. శే. తత్త్వానందస్వామి ఆ ప్రసంగాలలోని 9 ప్రసంగాలు 'భారత యువజనులారా!' అన్న గ్రంథ నామధేయంతో ఆంధ్రములోనికి అనువదించారు.

'హైందవ జీవితము వేదాంతము' 'హిందూ మతమునందలి సామాన్య సూత్రములు' మొదలైన ఈ తొమ్మిది శీర్షికల్లోను వివేకానంద సందేశం చాలా వరకు సంగ్రహంగా గంభీరంగా ప్రతిఫలిస్తున్నది.

అనువాదకులు చేసిన ఆంధ్రానువాదం శుచి అయిన గ్రాంథిక శైలిలో సాగిపోతూ ఒక్కొక్క చోట అనర్గళమయిన వివేకానంద వాగ్ధోరణి స్ఫురింప చేస్తున్నది.

హైందవ సంస్కృతి అంతరార్థం అవగాహన చేసుకోవాలంటే వివేకానందుని రచనలు పరిశీలించడం ఆవశ్యకం. అందులోను ఈ గ్రంథం వివేకానంద సందేశానికి సారభూతమయినది. 'శాస్త్రి'

## శివ తాండవము

అనువాదము: బులుసు సూర్యప్రకాశశాస్త్రి. సాధన గ్రంథమండలి, తెనాలి. వెల: ఒక రూపాయి.

శివతాండవాన్ని గురించి, కావ్యాలు, శిల్పాలు, చిత్తరువులు అనేకంగా బయలుదేరాయి. బయలుదేరుతున్నాయి. ప్రాచీనకాలంలో కూడా శివతాండవం వర్ణించే కొన్ని శిల్పాలావిర్భవించాయి.

శివతాండవానికీ, అర్ధనారీశ్వరత్వానికీ సంబంధించిన ఇతిహాసాలు, సంప్రదాయాలు చాలావరకు, శివపురాణంలో విద్యేశ్వర సంహితలోను, స్కాందపురాణంలో సూతసంహితలో ముక్తిఖండంలోను ఉన్నాయి.

శ్రీ సూర్యప్రకాశ శాస్త్రిగారు ఈ రెండు పురాణాలలోను శివతాండవానికీ అర్ధనారీశ్వరత్వానికీ సంబంధించిన మూల సంస్కృత భాగాలతో బాటు నేటి తెనుగు వివరణలు కూడా చేసి ఈ గ్రంథంలో చేర్చారు. శివతాండవ రహస్యము సంప్రదాయాలు తెలిసికోదలిచినవారికీ చిన్న గ్రంథం అవశ్యపఠనీయం.

'శాస్త్రి'

## అంతర్దర్శనము

శ్రీ ఉప్పాడ రాజారావు. ప్రతులు: హనుమంతు మోహనరావు. తిలగాము. వయా నౌపడా. శ్రీకాకుళం జిల్లా. మూల్యము 2-50 నయా పైసలు.

'అంతర్దర్శనము' అనగానే ఇది ఏదైనా ఆధ్యాత్మిక గ్రంథమనే ఊహ కలగవచ్చును. కాని ఇది అలాంటిదేమీ కాదు. ఇది ఖండకావ్యాల సంపుటి. దీనిలో స్తుతి, క్రీనీడ, స్వర్ణ శృంఖలములు మొదలయిన 27 ఖండకృతులున్నాయి. గేయాలు మొదలయిన వేవీ లేవు. అన్నీ పద్యాలే. ఐతే ఈ ఖండకావ్య సంపుటి అంతా ఒక పరిశోత్తి పంథాలో నడిచిపోతుంది.

ఈ సంపుటిలో క్రీనీడ, ఆంధ్రతేజము మొదలైన రెండు మూడు ఖండకావ్యాలలో తప్ప మిగిలిన అన్నిటిలోను ఏదోవిధంగా మోహశృంగారాదుల వర్ణన ఒక్కటే పరమలక్ష్యంగా కనిపిస్తుంది.

'ఆకాంక్ష' అనే శీర్షికలో ఒక యువతి సంతానార్థం అనేకమైన పాట్లుబడి భూతవైద్యులు మొదలయిన వారి దుశ్చర్యలకు లోనై తనశీలం కోలుపోతుంది.

ఇలాగే 'ఆత్మవంచిత' అనే ఖండకృతిలో ఒక కవి కవయిత్రిని మోహవ్యాపారానికి ప్రబోధిస్తాడు.

ఇలాగే ఈ కావ్యంలో చాలా ఖండకావ్యాలలో మోహశృంగార సన్నివేశాలు వర్ణించడమే కవి లక్ష్యంగా కనబడుతున్నది. కొన్ని కొన్ని చోట్ల అసభ్యవర్ణనలు కూడా అతివేలంగా పెల్లుపోయాయి. కేవలం ఇలాంటి అనుచిత సన్నివేశ వర్ణనమే ఈ కవి అసలు లక్ష్యమేమో!

అయితే ఈ కవి పద్యరచనలో శక్తిసంపన్నులు. తగినంత వ్యుత్పత్తి, సామర్థ్యము కలవారు. పద్యాలు నిరర్గళ ధారతో సాగిపోతాయి. ఖండకావ్య సంపుటమైనా ఈ గ్రంథం అంతా ఒక నవల చదివినట్లుగా చదువుకు పోవచ్చును.

చక్కని రచనాశక్తి కలిగిన ఈ కవిగారు వస్తువర్ణనలోను, మొత్తంమీద కావ్యలక్ష్యంలోను ఔచిత్య దృష్టి లేకపోవడం శోచనీయం. అవతారికలోని ఈ క్రిందిపద్యం వీరి రచనాశక్తికి చక్కని తార్కాణః

"సన్నుత మూర్తికిన్ బరము
    శాంతునకున్ రసభావభావనా
భ్యున్నత సత్కలానిధికి
    బుణ్యున కాంధ్ర సుపద్యహూణ భా
షోన్నత వేదికన్ గుణమహోదధికిన్
    ఘన భోగ భాగ్య సం
పన్నునకున్ వదాన్యజన
    మౌళికి నాశ్రిత పక్షపాతికిన్"

—శాస్త్రి.

Printed & Published For Nageswara Rao sEtates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad.



## 1893 నుంచి జలుబులకు

# అమృతాంజనము

ఇప్పటికి మూడు తరాలనుంచీ అమృతాంజనం జలుబులనుండి శీఘ్రమైన విముక్తికోసం వాడబడుతున్నదని అంద రికీ తెలిసిన విషయమే.






అమృతాంజన్ లి., మద్రాసు 4. మరియు బొంబాయి 1, కలకత్తా 7.

AL.57.2 Tel.

ప్రతి ఆదివారం రాత్రి 6-30 గం॥ లకు 41 మీటర్ల మీద రేడియో సిలోన్‌లో దక్షిణ లన్నింటిలో వెలువడే ప్రోత్సాహిక కళాకారుల ప్రోగ్రామ్, అమృతాంజన్

# భారతి

సాహిత్య మాసపత్రిక



సెప్టెంబరు 1958

వెల ఒక రూపాయి

# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

సెప్టెంబరు 1958

సంపుటము: 35 : : సంచిక 9

విడిపత్రిక వెల ఒక రూపాయి

# అమృతాంజనము

ఏమగు తలనొప్పులనుకూడా

క్షణంలో
ఉపశమింపచేస్తుంది



లక్షలాది ప్రజలు 1893 నుంచి దేశమంతటా అమృతాంజనాన్ని వాడుతున్నారు. అమృతాంజనము బెణుకులు, వాపులు, తలనొప్పి, పళ్లపోటు, జలుబులు, దగ్గులు మొదలైన వాటిని ఉపశమింపచేస్తుంది.

అమృతాంజనము
అన్ని నొప్పులకు
దివ్యామృతము.






అమృతాంజన్ లిమిటెడ్.
మద్రాసు-4, బొంబాయి-1. కలకత్తా-7.

ప్రతి ఆదివారం రాత్రి 6-30 గం॥ లకు 41 మీటర్ల మీద రేడియో సిలోన్‌లో దక్షిణ భారతభాషలన్నింటిలో వెలువడే ఔత్సాహిక కళాకారుల ప్రోగ్రామ్, అమృతాంజలి వినండి.

# విషయానుక్రమణిక

## సెప్టెంబరు 1958

# కరుణాలహరి

శ్రీ బూర్గుల రామకృష్ణరావు

* గతసంచిక తరవాయి *

హరినీలస్థగితావనీతలమునం దందాలకందమ్మునై
వరబృందావనవాటికన్ పరమశోభాపేటికన్ దృశ్యమై
హరనానామణిమండపాగ్ర విబుధోద్యత్ పూజమూలమ్మునన్
బరమమ్మైన యొయారి మామక వచో మత్తేభ సంచారిణిన్.

శిరమం దూగెడు కేకిపించియముతోఁ జెల్వైకనద్రత్నసుం
దర కోటీర వికుంచి తాగ్ర లలితోద్యత్కుంతలాక్రాంతమై
స్ఫురదానీల విలోలఖేలదలకస్ఫూర్జల్లలాటేందు సుం
దరమై, శ్రీ శరదిందు బింబరుచి చందం బొప్ప నెమ్మోమునన్.

దళదంభోజపలాశలోచనము నుద్యత్పక్వ బింబాధరా
కలితస్మేర శుచిస్మితాకలిత తద్దంతావళీకాంతి సం
కులితాశాంబర, మిందుపాండురలసద్గండస్థలీలోలకుం
డలమున్ మౌక్తిక మంజరీ మధుర కర్ణశ్రీక సుశ్లోకమున్.

ఉరమై గుండ్రతనమ్మునన్ గలిగి యెంతో యొప్పు ముత్యాలహా
ర రుచిం గుల్కెడు కంఠదేశ మటుపై రమ్యేంద్రనీలావనీ
ధరరోచిన్ జకితమ్ము సేయు పరమోదార ప్రభాపూర మ
వ్వరలక్ష్మి శుభమందిరాయిత మహావక్షఃస్థలాదిప్రమున్.

చరణాబ్జమ్ముల నానఖస్ఫురణ మాక్రాంతంబు జీరాడుచున్
వరభోగీంద్ర సమానదోర్యుగమునన్ వాసించి వ్రేలాడుచున్
వరవర్షాభ్రము దట్టమై మెఱపుదీవం దాల్చు చందంబు దో
ప, రహిన్ ఫుల్లవనామలస్రజము శోభల్ నించు సౌందర్యమున్.

మణిమత్కంకణ కాంతిమాంసలము, శుంభత్ఫుల్లపద్మారుణా
రుణ, మాశ్రాంతనతాశ్రితోద్ధరణమై రూపించు హస్తద్వయిన్
గణుతిన్ రత్నమయాంగుళీయకవిభా కల్యాంగుళిన్ వేణు పూ
రణముం జేసి యశేష జీవుల మనోరాగశ్రుతుల్ గాంచునున్.

ఉదరోద్యద్ద్యుతినిమ్నగాలహరియై యొప్పారు నూగారు ను
న్మదగోపీ నయనానుకర్షణ సునిమ్నంబైన యన్నాభి యొ
ప్పిదమై బంగరు సీరునన్ దొలఁకు నాపీతాంబర శ్రీప్రభా
మృదులమ్ముల్ మఱి యూరువుల్ గులుకు నామేలైన సౌభాగ్యమున్.

లలిత శ్రీమణినూపుర శ్రుతిజటాలంబైన జంఘాయుగ
మ్మలఘుస్పర్థి ముఖస్థ దంతివరహస్తాగ్రైక జంఘాలమం
జులజంఘాయుగ దివ్యవైభవమునై శోభిల్లు చిద్బింబమున్
కులిశమ్మంకుశమంబుజమ్ము మఱి శంఖున్ జక్రమున్ గేతన
మ్ముల రేకల్ గులుకంగ కోమలములై ముద్దుల్ పిసాళించు మం
జులముల్ పాదతలంబులున్ జెలఁగు మేల్ సొంపున్ నిగారింపునన్
దొలుకన్ బ్రహ్మశివాది దేవమకుట స్తోమాగ్రరత్నప్రభా
కలిత శ్రీనఖ చంద్రికావిదళిత క్షోణీజనక్షోభమై.

చెలువౌ పాదయుగమ్మునుం గల కృపాశృంగారమాకారమున్
కలలో నిద్దురలోన మేల్కొలుపులో గన్గొందుగా కింటిలో
వెలి రాదారుల దారులం దదియ యోవిశ్వేశ! నీమూర్తి క
న్నులలోఁ గట్టిన యట్లు చిత్తమున నెంతో హత్తినట్లయ్యెడిన్.

నవఘన నీలిమద్యుతి కన న్నమనీయ మశేషవేదవై
భవకమనీయ మాసొబఁగు పాపగతిం బడిపోవు నన్ను సం
భవ మిదియౌను గాదనక మక్కువ కన్నులనేని యబ్బి మా
నవ పరమాణువున్ నను సనాథుని జేయునుగాక యిప్పుడే.

హరి! నీకున్ బ్రణమిల్లి కోరెదనురా హా! అంజలింబట్టి నే
వరమీ యొక్కటిగాగ నొక్కటి ప్రభూ! వద్దెందునున్ జన్మ, మీ
శ్వర! పుట్టింతువొ భూమి దున్నుకొను నవ్వారింటఁ బుట్టింపు సుం
దర గోవిందపదారవింద మధుమత్తంబైన చిత్తమ్ముతో

అమృతస్యంది వచోవిలాసమును నానందించినా వైన! స్వ
ప్నమునం దైనఁ దలంప నీకృప యహంభావాన సిగ్గింత లే,
దమిత మ్మీయపరాధమున్ గనక నన్నాత్మీయుగా గొన్న నీ
కు మరేదీ దయసాటి? మత్తులను, నాకున్ సాటి యేదీ ప్రభూ!

# కరుణాలహరి

పాతాళంబున కేగుమా సురపురిం బాలింపుమా మేరువుం
వాతూలోద్గతి నెక్కుమా జలధులం బాహుద్వయిం దాటుమా
చేతస్సక్తములైన యాశలవి నిశ్శేషమ్ముగా వీడవో
భూతవ్యాధిజరాజ్వరాహత! సుఖంబుం గోరి తేనిం మదిన్,
ప్రీతిం గృష్ణరసాయనమ్ము గొనుమా! వేరే శ్రమ మ్మేటికిం

పాపమహీధరమ్ములకు వజ్రము, జన్మ రుజాభిఘాత సం
తాప సుసిద్ధభేషజము, 'దంభ' తమఃపటలార్క బింబముం
వ్యాపృత దుఃఖభూరుహ దవాగ్నికలాపము! 'కృష్ణ' నామమీ
శా! పరనిర్వృతి ప్రకట సాధకపాటము పొల్పు నున్నతిన్

ఘనవిషకూటవీ శిఖి శిఖావితతిం వికలత్వ మొంది నా
మన మిటు మాధురీ పరమ మందిరమందు ముకుంద ముగ్ధ మో
హనవదనేందుబింబమున నంచిత చారు చకోరవృత్తి చే
ననిమిషభావ మొంది యమృతాప్లుతమై ఖిలసిల్లుఁ గావుతన్

అమరతరంగిణీ పులినమందు సుఖాసనముండి కన్నులం
దమరిచి యోగముద్ర, విషయమ్ము లదల్చి, హరించిలోని సం
తమసము సత్సుఖాత్మక సుధారస నిర్ఝరి నన్నవాంబుదో
త్తమరుచిఁ జిత్కళిన్ మునిఁగి ధన్యుఁడ నౌటది యెన్నఁడో కదా!!

# వసంతరాజీయము

శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావు

'వసంతరాజీయము' రెడ్డిరాజగు 'కుమారగిరి' చే (క్రీ. శ. 1386-1402) రచింపబడిన నాట్యశాస్త్రగ్రంథము. ఈ కుమారగిరిరెడ్డికి 'వసంతరాయలు', 'కర్పూరవసంతరాయలు' అను బిరుదులు కలవు. ఈ బిరుదులను బట్టియే అతని నాట్యశాస్త్రము 'వసంతరాజీయ' మనబడింది.

ఈ వసంతరాజీయము గ్రంథ మంతయును లభింపకపోవుట ఆంధ్రుల దురదృష్ట మని చెప్పక తప్పదు. ఈ గ్రంథమునుండి ఆయా వ్యాఖ్యాతలు తమ తమ వ్యాఖ్యానములందు ఉదాహరించిన లక్షణ శ్లోకములను పట్టి దీని స్వరూపమును మాత్రము కొంత ఊహించుటకు వీలగుచున్నది.

'వసంతరాజీయ' మను పేర శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు 'పాతక్' స్మారక సంచికలో ఒక ఆంగ్లవ్యాసమును ప్రకటించినారు. ఆ వ్యాసమునందు రెడ్డిరాజుల చరిత్ర వివరింపబడినది; అంతమున మాత్రము వసంతరాజీయమందలి తొమ్మిది శ్లోకములు ఉదాహరింపబడినవి. శ్రీమాన్ కృష్ణమాచార్యులుగారు కూడ తమ 'సంస్కృతవాఙ్మయ చరిత్ర'లో ఈ శ్లోకములనే ఉదాహరించియున్నారు.

ఇప్పుడు నే నింకను చాల శ్లోకములను సేకరించినాను. వానిని సహృదయుల పరిశీలనార్థము నివేదించుటకే ఈ నా ప్రయత్నము.

వసంతరాజీయ శ్లోకములను తమ తమ వ్యాఖ్యానములం దుదహరించిన వారిలో కాటయవేముడు ముఖ్యుడు. కాటయవేముడు కుమారగిరియొక్క బావమఱది. ఇతడు కాళిదాస ప్రణీతము లగు మూడు నాటకములకును 'కుమారగిరి రాజీయము' అను పేర వ్యాఖ్యలను రచించెను. వసంతరాజీయశ్లోకములను పేర్కొనిన రెండవ వ్యాఖ్యాత తిమ్మరుసు మేనల్లుడగు నాదెండ్ల గోపమంత్రి. ఇతడు కృష్ణమిశ్రుని ప్రబోధచంద్రోదయమునకు 'చంద్రిక' అను వ్యాఖ్యను రచించెను. వ్యాఖ్యాతృచక్రవర్తి యగు మల్లినాథసూరి శిశుపాలవధవ్యాఖ్యలోను, వాని కుమారుడగు కుమారస్వామి ప్రతాపరుద్రీయ వ్యాఖ్యలోను వసంతరాజీయమునుండి చెరియొక శ్లోకమును పేర్కొనియున్నారు. నేను చూచినవి ఇవి మాత్రమే. ఇంకను ఎందఱు వ్యాఖ్యాతలు వసంతరాజీయ శ్లోకములను పేర్కొనిరో తెలియదు. పరిశోధకు లింకను పరిశీలింపవలసియున్నది.

నేను పరిశీలించిన పై వ్యాఖ్య లన్నియును ముద్రితములే. వాని వివరముల నీ క్రింద నొసంగుచున్నాను.

1. కాటయవేముని అభిజ్ఞాన శాకుంతల వ్యాఖ్య—దీనిని శ్రీ సి. శంకరరామశాస్త్రిగారు ప్రకటించినారు. (అభిజ్ఞాన శాకుంతలము—బాలమనోరమా ప్రెస్, మద్రాసు, 1947.)

2. కాటయవేమునిమాలవికాగ్నిమిత్రవ్యాఖ్య—దీనిని శ్రీ ఎమ్. ఆర్. కాలేగారు ప్రకటించినారు. (మాలవికాగ్నిమిత్రము— గోపాల్ నారాయణ్ అండు కో, బొంబాయి, 1922).

3. కాటయవేముని విక్రమోర్వశీయవ్యాఖ్య—దీనిని శ్రీ చారుదేవశాస్త్రిగారు ప్రకటించినారు. (లాహోరు, 1929).

[పై వ్యాఖ్యలను మఱికొందఱుకూడ ప్రకటించినారట. అవి నాకు లభ్యము కాలేదు.]

4. గోపమంత్రి ప్రబోధచంద్రోదయవ్యాఖ్య—దీనిని శ్రీ వాసుదేవశర్మగారు పరిష్కరించినారు. (ప్రబోధచంద్రోదయము—నిర్ణయసాగర ముద్రణాలయము, బొంబాయి, 1928).

5. మల్లినాథసూరి శిశుపాలవధ వ్యాఖ్య—(శిశుపాలవధము — నిర్ణయసాగర ముద్రణాలయము, 1917).

6. కుమారస్వామి ప్రతాపరుద్రీయ వ్యాఖ్య—దీనిని శ్రీ కె. పి. త్రివేది ప్రకటించెను. (ప్రతాపరుద్రీయము—బొంబాయి, 1909).

# వసంతరాజీయము

పై వ్యాఖ్యాతలు నలుగురును తెలుగువారే అగుట గమనార్హము.

కాటయవేముని శాకుంతలవ్యాఖ్యయొక్క వ్రాతప్రతి యొకటి (నం. 1864) కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తులో కలదు. నేను దానినికూడ పరిశీలించినాను. శ్రీ శంకరరామశాస్త్రి గారు శాకుంతల వ్యాఖ్యాన ప్రారంభమందలి 19 శ్లోకములను ఏలనో ప్రకటింపలేదు. శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి గారు మాత్రము వీనిని 'రెడ్డి సంచిక'లో ప్రకటించియున్నారు (పుటలు-354-356).

కుమారగిరిరెడ్డి విలాసపురుషుడనియు, అతని బావమఱదియును, మంత్రియును అగు కాటయవేముడే రాజ్యభారమును వహించి పరిపాలనమును కావించెననియు చరిత్ర తెలుపుచున్నది. శాకుంతల వ్యాఖ్యాన ప్రారంభశ్లోకములు ఈ అంశములనే విశదీకరించుచున్నవి.

కుమారగిరిరెడ్డియును, కాటయవేముడును గొప్ప సంస్కృత పండితులు. కుమారగిరిరెడ్డి నాట్యశాస్త్రవేత్తయై నాట్యశాస్త్రమును రచింపగా, కాటయవేముడా నాట్యశాస్త్రము నాధారముగా చేసికొని కాళిదాసు నాటకములు మూడింటికిని వ్యాఖ్యలు రచించియున్నాడు. ఈ వ్యాఖ్యలు మనోహరములు, ప్రమాణములు అని విమర్శకులచే ప్రశస్తి లందినవి. వసంతరాజీయము లభించియున్నచో అదికూడ ఇట్టి ఖ్యాతిని పొందియుండెడిది. ఇంచుమించుగా సమకాలికములైన కాటయవేముని వ్యాఖ్యలు లభించి, ఆ వ్యాఖ్యలకాధారమైన వసంతరాజీయము లభింపకపోవుట ఆశ్చర్యముగా నున్నది.

నేను చరిత్రజోలికి పోక, నా వ్యాసమును వ్యాఖ్యాతలుదాహరించిన శ్లోకములకే పరిమితమును చేసికొని, వసంతరాజీయ స్వరూపమును సూచించుటకు మాత్రమే ప్రయత్నింతును.

కుమారగిరిరెడ్డి వసంతోత్సవ వైభవమును అనవేముని 'ద్రుజ్జరందానశాసనము' (క్రీ. శ. 1371) ఈ క్రింది విధముగా వర్ణించుచున్నది (శ్రీ మల్లంపల్లివారి 'History of Reddi Kingdoms' చూడవలెను. పుట-472).

వసంతరాయశ్చ వసంతకేలౌ
కస్తూరికారేణుచయాంబువాహాః
శీఘ్రం హిమాంబు ఘనవర్షధారా
కర్పూరఖండాః కరకా వికీర్ణాః ॥

—(పై శ్లోకమందు 'రాయశ్చ' అనుచోట 'రాయస్య' అని ఉండుట సమంజసముగా నుండును) "వసంతరాయలరెడ్డియొక్క వసంతకేళియందు కస్తూరికా రేణు సమూహమే మేఘమును, హిమాంబువులే వర్షధారలును, కర్పూరఖండములే వడగండ్లును అగుచున్నవి."

పై శ్లోకమును శ్రీనాథు డనుసరించినట్లు శ్రీ మల్లంపల్లివారే ఉట్టంకించియున్నారు—

తే॥ బహుళ కస్తూరికా మేఘపటలమునకు
శీకరాసార మయ్యె గొజ్జంగనీరు
వలుద వడగండ్లు నయ్యె వర్షమునకుఁ
గామినులు చల్లు కర్పూరఖండ వితతి.

—(భీమఖండము-3 వ ఆ, 124 ప.)

ఇట్లు వసంతోత్సవప్రియుడైన కుమారగిరిరెడ్డి సర్వరాజ్యభారమును కాటయవేమునిపై పెట్టి, తాను విలాసముగా కాలమును గడిపినవాడట—

భాగ్యం నామ సమగ్ర మాస్తృతమతిస్నేహైక పాత్రం యతో
వీరం కాటయవేమ ముద్ధతరిపుధ్వంసే నియుజ్య స్వయమ్
నిత్యం నందతి నర్తనై రభినవైః కాంతైర్వసంతోత్సవైః
సంతానాభ్యుదయైః కుమారగిరిభూపాలో నృపాలోత్తమః

—(మాలవికాగ్నిమిత్రవ్యాఖ్య ప్రారంభ శ్లోకము)

"కుమారగిరి ప్రభువు అదృష్టమే అదృష్టము; ఏలనన స్నేహపాత్రుడును, వీరుడును అగు కాటయవేముని శత్రునాశనమందు నియోగించి తాను నిత్యమును అభినవములగు నర్తనములతోను, మనోహరములగు వసంతోత్సవములతోను, సంతానాభ్యుదయములతోను సంతసించుచున్నాడు."

కుమారగిరిరెడ్డి ఆస్థానమందు 'లకుమాదేవి' అనెడి నాట్యప్రవీణురాలుండెననియు, ఆమె కుమారగిరి ప్రభువు రచించిన నాట్యశాస్త్రమందలి రహస్యములను అభినయించి వన్నెకూర్చెడిదనియు కాటయవేముడు పేర్కొనెను—

జయతి మహిమా లోకాతీతః కుమారగిరి ప్రభోః
సవిసలకుమా దేవీ యస్య శ్రియా సదృశీ ప్రియా
నవ మభినయం నాట్యార్థానాం తనోతి సహ
ప్రదా
వితరతి బహూ నర్థా నర్థి వ్రజాయ సహస్రశః

—('రెడ్డి సంచిక'—పుట—354; శ్రీ వేటూరివారి శృంగారశ్రీనాథము — పుట—57 కూడ చూడవలెను)

"ఏ కుమారగిరి ప్రభువుయొక్క సిరితో సదృశురాలగు లకుమాదేవి సభలలో నాట్యశాస్త్రార్థములకు వేలకొలది నూతనాభినయములను చేయుచు అర్థిబృందమునకు వేలకొలది ధనములను దానము చేయుచున్నదో ఆకుమారగిరి ప్రభుని మహిమ లోకాతీతమై వర్ధిల్లుచున్నది."

ఈ కుమారగిరిప్రభువు భరతాదుల నాట్యశాస్త్రములను చక్కగా పరిశీలించి వసంతరాజీయమును వ్రాసెననియు, ఆ వసంతరాజీయము ననుసరించి తాను కాళిదాస నాటకత్రయమునకు వ్యాఖ్యను రచించుచున్నట్లును కాటయ వేముడు చెప్పకొనెను...

మునీనాం భరతాదీనాం భోజాదీనాం చ భూభుజామ్
శాస్త్రాణి సమ్యగాలోచ్య నాట్యవేదార్థ వేదినామ్
ప్రోక్తం వసంతరాజేన కుమారగిరిభూభుజా
నామ్నా వసంతరాజీయం నాట్యశాస్త్రం
యదుత్తమమ్॥

తత్రోక్తేనైవమార్గేణ దర్శితాశేష లక్షణమ్
కవినా మాత్రిణో మంత్రీ కాటభూపతినూభః
పోటయం వేమవిభుః కుమారగిరిణా రాజ్ఞా
నియుక్తః కృతీ
నాట్యానాం త్రితయం కృతం కృతధియా
శ్రీ కాళిదాసేన యత్
తస్యోద్దీర్ఘరసార్ద్రకస్య రసికః శాకుంతలాదేస్స్వయమ్
వ్యాఖ్యానం కురుతే కుమారగిరిరాజీయాఖ్య
మస్త్రైహితమ్

—(చూ. 'రెడ్డి సంచిక'—పుట 356)

"నాట్య వేదార్థ విదులైన భరతాదిమునులయు, భోజాది భూపతులయు శాస్త్రములను చక్కగా పరిశీలించి 'వసంతరాజు' అనబడెడి కుమారగిరిభూపతి 'వసంత రాజీయ' మనెడి ఉత్తమ నాట్యశాస్త్రమును రచించెను. అందు చెప్పబడిన మార్గము ననుసరించియే రాజాజ్ఞానుసారముగా, కాటయ వేముడు, ప్రజ్ఞాశాలియైన కాళిదాసుచే రచింపబడిన రసనిధులగు మూడు నాటకములకును 'కుమారగిరిరాజీయము' అను పేర వ్యాఖ్యానమును చేయుచున్నాడు"

కాటయ వేముడు మొట్టమొదట శాకుంతల వ్యాఖను రచించినట్లు కన్పట్టుచున్నది. అందలి లక్ష్యము కొల్ల లక్షణశ్లోకములను పేర్కొనియుండెను. కాని మాళవికాగ్నిమిత్రమందు "నాంద్యాదిలక్షణంతు శాకుంతల వ్యాఖ్యాన ఏవాభిహితం" (నాంద్యాదుల లక్షణములు శాకుంతల వ్యాఖ్యానమందే చెప్పబడినవి) అని అని వేసినాడు. అందుచేత శాకుంతల వ్యాఖ్య మొదటిదియును, మాలవికాగ్నిమిత్రవ్యాఖ్య రెండవదియును అగుచున్నవి. దీని తరువాత విక్రమోర్వశీయ వ్యాఖ్యను రచించియుండును.

కాటయ వేముని వ్యాఖ్యలందు నాట్యశాస్త్రమునకు సంబంధించిన అనేక లక్షణ శ్లోకములు ఉదాహృతములైనవి. వానిలో కొన్ని శ్లోకములకు మాత్రమే 'యథోక్తం వసంత రాజీయే', 'తథాచోక్తం వసంత రాజీయే', 'తదుక్తం వసంతరాజీయే', 'తల్లక్షణంతు వసంతరాజీయే' అని స్పష్టముగా నున్నది. కావున ఇట్లు చెప్పబడిన శ్లోకములన్నియును వసంతరాజీయములోని వనుట నిర్వివాదము. ఇంక తక్కిన శ్లోకము లెచ్చటివో చెప్పబడలేదు; ఆశ్లోకములలో కొన్నింటికిముందు 'తదుక్తం'. 'యథోక్తం', 'తథాచోక్తం' 'తథోక్తం' అనియు, కొన్నింటికి వెనుక 'ఇత్యుక్తత్వాత్', 'ఇత్యుక్తేః', 'ఇతి' అనియు కలదు. ఆ శ్లోకములు కూడ వసంత రాజీయములోనివే యని నేను సకారణముగా ప్రతిపాదించుచున్నాను.

నాట్యశాస్త్రేతర విషయములకు లక్షణ శ్లోకములను ఉదాహరించునప్పుడు కాటయ వేముడు ఆగ్రంథ నామమును కాని, తద్గ్రంథకర్తృనామమును కాని తప్పక పేర్కొనినాడు. ఉదా.— యథాచోక్తం 'త్రిపురాసుర సింధౌ' "అరవింద మశోకంచ చూతంచ నవమల్లికా నీలోత్పలం చ పంచైతాని ప్రకీర్త్యంతే పంచబాణస్య సాయకాః" (శాకుంతల వ్యాఖ్య - పుట 144). ఎచ్చటివో పేరు చెప్పకయే ఉదాహరించిన శ్లోకములు వసంతరాజీయ మందలివి కాక ఇతర గ్రంథములందలి

అయినచో పై విధముగానే కాటయవేముడు మూలములను పేర్కొని యుండెడివాడు. అట్లు పేర్కొని యుండకపోవుటచేత ఆ శ్లోకములు ఇతర గ్రంథములలోనివి కావనియు, అవి యెల్ల వసంతరాజీయములోనివే అనియు భావించుచున్నాను. "తత్రత్యోక్తే నైవమార్గేణదర్శితా శేషలక్షణం. వ్యాఖ్యాస్యంకుశ్రుతే" అని కాటయవేముడు స్పష్టముగా చెప్పుకొని యుండుట నా ప్రతిపాదనమునకు బలమొసంగు చున్నది.

కావున కాటయవేముని వ్యాఖ్యలందలి నాట్యశాస్త్ర సంబంధి శ్లోకము లన్నియును వసంతరాజీయములోని వనియే తలంచుట సమంజసము. తక్కిన రెండువ్యాఖ్యల విషయ మెట్లున్నను మొట్టమొదట వ్రాయబడిన శాకుంతల వ్యాఖ్యయందలి లక్షణశ్లోకము లైనను తప్పక వసంతరాజీయము నందలివే అని నేను విశ్వసించుచున్నాను. ఈ శ్లోకముల నన్నింటిని నాట్యశాస్త్రము, దశరూపకము, ప్రతాపరుద్రీయము, సాహిత్యదర్పణము, నాట్యదర్పణము, భావప్రకాశము మొదలగు నాట్యశాస్త్ర గ్రంథములందలి శ్లోకములతో చాలవఱకు సరిచూచినాను; ఇవి భిన్నములుగా నున్నవి. అందుచే ఇవి వసంతరాజీయములోనివే అని మఱింత నిశ్చయముగా చెప్పగలుగు చున్నాను. కొన్ని శ్లోకార్థములు మాత్రము (ఉదా: బీజలక్షణము మొ) దశరూపక, ప్రతాపరుద్రీయాది శ్లోకములతో సంవదించుచున్నవి; అనేక నాట్యశాస్త్రగ్రంథములను పరిశీలించియున్న కుమారగిరి తనకు నచ్చిన లక్షణములను అచ్చటచ్చట అట్లే పొందుపఱచియుండును. అసలిట్టి పోలికలు ప్రతిగ్రంథమునందును కలవు. కావున పైశ్లోకములు వసంతరాజీయమందలివే అనుటకు ఇట్టిపోలికలు ప్రతిబంధకములు కాజాలవు.

ఇప్పుడింక వసంతరాజీయ శ్లోకములను ఒక క్రమములో పేర్కొందును. వీనిని కొన్ని శీర్షికల క్రింద విభజించియున్నాను. అవి ఏ వ్యాఖ్యానము నందలివో కూడ పరిశీలించియున్నాను. మొత్తము శ్లోకసంఖ్యను కూడ గణించినాను; కొన్నిశ్లోకములు, శ్లోకపాదములు ఒకవయసలోనివి కాకపోయినను, సౌలభ్యార్థము మొత్తము, సంఖ్యను గణించియున్నాను. 'వసంతరాజీయ మందలివి' అని స్పష్టముగా చెప్పబడిన శ్లోకములకు శ్లోకపాదములకు గుర్తులు పెట్టినాను.

## నాంది

* ప్రథమః పూర్వరంగశ్చ తతః ప్రస్తావనేతి చ।
ఆరంభే సర్వనాట్యానా మేత త్సామాన్య మిష్యతే॥
* యన్నాట్యవస్తునః పూర్వం రంగవిఘ్నోపశాంతయే।
కుశీలవాః ప్రకుర్వంతి పూర్వరంగః సకీర్తితః॥ 2
* యద్యప్యంగాని భూయాంసి పూర్వరంగస్యనాటకే।
తేషామవశ్యం కర్తవ్యా నాందీ నందీశ్వరప్రియా॥ 3
* ఆశీర్నమస్క్రియారూపః శ్లోకః కావ్యముఖోదితః
నాందీతి కథ్యతే తస్యాం పదాది నియమోఽపివా॥ 4
* మాంగల్యారంభ చక్రాబ్జ కోక కైరవశంసినీ।
నాందీ పదై ర్ద్వాదశభి రష్టాభి ర్వాప్యలంకృతా॥ 5

—(శాకుంతలవ్యాఖ్య పుట. 2)

కావ్యార్థ సూచనం కైశ్చి న్నాంద్యామేవ నిరూప్యతే

—(శా. వ్యాఖ్య-పుట. 2)

[పై అయిదు శ్లోకములకును ముందు 'యథోక్తం వసంతరాజీయే' అని కలదు. కావున ఇవి అన్నియును వసంత రాజీయములోనివే అని స్పష్టపడుచున్నది. పైవానిలో "యన్నాట్య వస్తునః...సకీర్తితః" అను శ్లోకమును 'యథా వసంత రాజీయే' అని చెప్పి మల్లినాథసూరి శిశుపాలవధ వ్యాఖ్యలో ఉదాహరించియున్నాడు (2 వ. సర్గ, 8 వ. శ్లోక వ్యాఖ్యలో) దీనిని శ్రీ వేంకటరావుగారు పేర్కొనియున్నారు. "యద్యప్యంగాని...నందీశ్వర ప్రియా" అను శ్లోకమును 'అనేనైవాభిప్రాయే ణోక్తం వసంతరాజీయే' అని చెప్పి గోపమంత్రి ఉదాహరించియున్నాడు. (ప్రబోధ చంద్రోదయము - పుట 7) దీనినికూడ శ్రీ వేంకటరావుగారు పేర్కొనిరి.

## నేపథ్యము

కుశీలవ కుటుంబస్య స్థలీ నేపథ్య మిష్యతే॥ 6

—(శా. వ్యాఖ్యా. పుట. 2)

## ఆముఖము

సూత్రధారో నటీం బ్రూతే మారిషం వా విదూషకమ్।
స్వకార్య ప్రస్తుతాక్షేపి చిత్రోక్త్యా యత్తదా స్తథా॥ 7
ఆముఖం తత్తు విజ్ఞేయం నామ్నా ప్రస్తావనాపి సా।
—(శా. వ్యాఖ్య – పుట. 4.)

## ప్రరోచన

నియోజనం ప్రయోజ్యస్య నిర్దేశో దేశకాలయోః॥ 8
కావ్యార్థ సూచనక్త్యైః సూక్తైః సభాయాశ్చిత్తరంజనమ్
కవికావ్య నటాదీనాం ప్రశంసా తు ప్రరోచనా॥ 9

—(శా. వ్యాఖ్య. పుట. 2)

## ఉద్ఘాత్యకము (వీథ్యంగము)

* సూచీ ప్రస్తుతార్థస్య యా ప్రశ్నోత్తర మాలికా
ఉద్ఘాత్యక మితి ప్రాహు స్తదేత న్నాట్యవేదినః

[ఇది కాకినాడ సాహిత్య పరిషత్తులోని వ్రాత ప్రతిలో మాత్రమే ఉన్నది. ఈ శ్లోకమునకు ముందు 'తథా వసంతరాజీయే' అని కూడ కలదు. ఈ మాట కాని, ఈ శ్లోకముకాని ముద్రిత వ్యాఖ్యలో లేనే లేవు ఇది సంపాదకుని పొరపాటో, లేదా నాకిక దొరికిన వ్రాతప్రతిని వ్రాసిన లేఖకుని పొరపాటో తెలియదు. ముద్రిత వ్యాఖ్యలో "...ఉద్ఘాత్యకం నామ వీథ్యంగముక్తం భవతి" అని మాత్రమే కలదు.

(శా. వ్యా. పుట 5]

## ప్రయోగాతిశయము

ఏషో౽య మిత్యుపక్షేపాత్ సూత్రధార
ప్రయోగతః
భవేత్పాత్ర ప్రవేశో యః ప్రయోగాతిశ
యోహి సః 11

(శా. వ్యాఖ్య పుట 6)

## భాషా విధానము

స్త్రీ విదూషక బాలానాం శూద్రాణాం
ప్రాకృతం వచః |

(శా. వ్యాఖ్య పుట 3)

ప్రాయేణ ప్రాకృతస్థానే శౌరసేనీ విధీయతే॥12

(శా. వ్యాఖ్య. పుట 3)

మ్లేచ్ఛాంత్యజ పిశాచాదౌ పైశాచీ వాపి మాగధీ

(శా. వ్యాఖ్య పుట 135)

## సంబోధన విధానము

విప్రామాత్యాగ్రజా స్త్వార్యా నటీసూత్ర
కృతౌ మిథః॥ 13

(శా. వ్యాఖ్య-పుట 2)

[ముద్రితమైన శాకుంతల వ్యాఖ్యలో ఈ శ్లోక పాదమునకు ముందు 'తథోక్తం' అనిమాత్రమే కలదు. కాని కాకినాడ సాహిత్య పరిషత్తులోని వ్రాత ప్రతిలో 'తథాచోక్తం వసంతరాజీయే' అని యున్నది. కావున ఇది వసంతరాజీయములోనిదే అనుట స్పష్టము.

స్వామీ త్యేవేతి నృపతి ర్భృత్యై ర్భర్తేతి
చాధమైః |

(శా. వ్యాఖ్య. పుట 44)

హలా తో భద్రముఖే త్యేవం మతే రాజ్ఞి
సుతే౽నఘా॥ 14

## అర్థోపక్షేపకములు

ద్వేధా వస్తు విభాగః స్యాత్ త్రికాశః
సూచ్య ఇత్యపి |
నీరసో౽నుచిత స్తత్ర సూచ్యః స్యా ద్వస్తు
విస్తరః॥ 15

దూరాధ్వానం వధం యుద్ధం రాజ్యదేశాది
విప్లవాన్|
సంరోధం భోజనం స్నానం సురతం చాను
లేపనమ్॥ 16

అంబర గ్రహణాదీని ప్రత్యక్షాణి న నిర్దిశేత్ |
అర్థోపక్షేపకైః సూచ్యం పంచభిః
ప్రతిపాదయేత్ ॥ 17

అర్థోపక్షేపకాణిస్యుః విష్కంభశ్చ ప్రవేశకః|
చూలికాంకావతారశ్చ తథాంకముఖమిత్యపి॥ 18

(—శా. వ్యాఖ్య-పుటలు-33-34)

అంక శేష కథాంశానాం భూతానాం
భావినా మపి|
సంక్షేపేణ సముస్తానాం విష్కంభః సూచనా
భవేత్ ॥ 19

శుద్ధో మిశ్రస్తు తద్భేదౌ మధ్యపాత్ర ప్రయోజితః
శుద్ధో భవతి, మిశ్రస్తు నీచపాత్ర ప్రయోజితః॥ 20

ప్రధానాదపరం మధ్యం నాయకాదే
రుదాత్తవాక్ |
నీచం స్యాదనుదాత్తోక్తి నారీ పరిజనాదికమ్॥ 21

* అంక యోర్మధ్యవత్ నీచ మధ్యపాత్ర ప్రయోజితః|
శుద్ధో భవతి మిశ్రస్తు నీచపాత్ర ప్రయోజితః
విష్కంభ ఏవ నాట్యజ్ఞైః ప్రవేశక ఇతిస్మృతః 22

—(శా. వ్యాఖ్య పుట. 38)

[కాకినాడ సాహిత్యపరిషత్తులోని వ్రాత ప్రతియందు ప్రవేశకలక్షణనిరూపణమునందు 'తల్లక్షణంతు వసంతరాజీయే' అని ఉన్నది; కావున ఇది వసంత రాజీయములోనిది అనుట స్పష్టము. ఆ వ్రాత ప్రతియందు ప్రవేశక లక్షణము "అంకయో ర్మధ్యవర్తీ చ నీచపాత్ర ప్రయోజితః। విష్కంభ ఏవ నాట్యజ్ఞైః ప్రవేశక ఇతి స్మృతః" అని ఉన్నట్లు గుర్తు. అట్లు అచ్చట లేక పోయినను ఈవిధముగా నుండుట సమంజసము]

నేపథ్యాంతః స్థితైః పాత్రైః చూలికార్థస్యసూచనా।
విష్కంభాదిషు చాంతే వా ప్రయోగోఽస్యాః
ప్రకీర్తితః॥ 23

— (శా. వ్యాఖ్య పుటలు 84;77)

అంకాంతపాత్రేణాంకాస్య ముత్తిరాంకార్థ
సూచనా।

—(శా. వ్యాఖ్య. పుట 110)

[అర్థోపక్షేపకములను వివరించెడి పై శ్లోకము లన్నియును ఇంచుమించుగా వరుస శ్లోకములు (continuous verses) వాని మధ్యలో ప్రవేశకలక్షణము వసంత రాజీయము లోనిదైనప్పుడు తక్కినవి కూడ వసంతరాజీయములోనివే అని తలంచుట అసమంజసము కాదు.]

## ఆకాశభాషితము

అప్రవిష్టై ర్య ఆలాపః స ఏవాకాశభాషితమ్॥ 24
ఏష ప్రయోజ్య ఆకాశే లక్ష్యం బద్ధ్వే
త్యనంతరమ్।
కిం బ్రవీషీతి వచోఽనూద్య పశ్చాత్కార్యం
తదుత్తరమ్॥ 25

(శా. వ్యాఖ్య. పుట 61)

## అంకము

అంకో బీజబిందు సమన్వితమ్......।

(శా. వ్యాఖ్య. పుటలు 40; 59)

పంచాది దశ పర్యంతమంకాః కార్యా యథో
చితమ్॥ 26

(శా. వ్యాఖ్య పుట 3)

.........తేషా మంతే చ నిర్గమః (తేషామ్= అంకములు)।

(శా. వ్యాఖ్య. పుట. 36)

## పతాకాస్థానకము

* పతాకాస్థానకం ప్రాహు ర్భావినోఽర్థస్య
సూచనమ్॥ 27
చతుర్భిః కారణైరేవ చతుర్ధా పరికీర్తితమ్।
* సహసైవార్థసంపత్త్యా విమర్శానునిర్ణయాత్॥ 28
తుల్యేన సంవిధానేన తథాతుల్య విశేషణాత్।

(శా. వ్యాఖ్య. పుట 9)

[ముద్రిత ప్రతియందును, వ్రాతప్రతియందును కూడ 'యథోక్తం వసంతరాజీయే' అని కలదు. ముద్రింపబడిన ప్రతిలో 104 వ. పుటలో ఈ శ్లోకములు మరల ఉదాహృతములైనవి. కాని అచ్చట 'తథోక్తం' అని మాత్రమే ఉన్నది; ఇది పొరపాటు అయి యుండును. ఇవి రెండును వసంతరాజీయము లోనివే అనుట స్పష్టము.]

## ఆత్మగతాదులు

అశ్రావ్యం నియతశ్రావ్య మపచ్ఛాన్నిత్య
మితి త్రిధా॥ 29
అశ్రావ్య మన్యై రజ్ఞాత మాత్మన్యేవ స్థితం విదుః।
తదాత్మగత మిత్యుక్త్వా నాట్యజ్ఞం గ్య
నివేశయేత్॥ 30
* అర్ధస్త్వేకేన విజ్ఞేయో నియత శ్రావ్య ఇష్యతే।
ద్వివిధః సపరిజ్ఞేయో జనాంత శ్చాపవారితమ్॥ 31
గుహ్యో గుహ్యేతర శ్చేతి జనాంతో
ద్వివిధో మతః।
స్యాజ్జనాంతిక మిత్యుక్త్వా వాచ్యః పూర్వ
స్తథాపరః॥ 32
కర్ణ ఏవమిత్యుక్త్వా జ్ఞాప్యః పశ్చాత్సంగతేః।
సర్వై రాకర్ణనీయార్థః శ్రావ్యఇత్యభిధీయతే॥ 33
ఏతం ప్రకాశ మిత్యుక్త్వా తయోరంతే ప్రయో
జయేత్।

—(శా. వ్యాఖ్య-పుటలు-22-23.)

["అర్ధస్త్వేకేన ... జనాంతశ్చాపవారితః" అను శ్లోకమునకు ముందు మాలవికాగ్నిమిత్రవ్యాఖ్యలో 'యథోక్తం వసంతరాజీయే' అనియున్నది (పుట. 26) కావున ఇది వసంతరాజీయములోనిదనుట స్పష్టము. పై శ్లోకములు ఇంచుమించుగా వరుస శ్లోకములు.

అందుచే ఇవి యెల్లవసంత రాజీయము లోనివే అని తలంచుట అసమంజసము కాదు ]

* పరైరలక్ష్యవ్యాపారే కథితో౽ర్థో౽పవారితః॥ 34
ఉక్త్వా(ప్రా)గపవార్యేతి పశ్చాదేనం ప్రయోజయేత్ ।
—(మాల. అగ్ని. వ్యాఖ్య-పుట-26)

[శాకుంతలవ్యాఖ్యయందు లేని అపవారితలక్షణము మాలవికాగ్నిమిత్రవ్యాఖ్యయందు కలదు. "అర్థస్త్వేకేన..." అను వసంతరాజీయ శ్లోకము నుదాహరించి, 'అత్ర' అని చెప్పి పై శ్లోకమును కాటయవేము డుదాహరించెను. కావున, సందర్భమునుపట్టి ఇదియును వసంతరాజీయములోనిదే అనుట నిర్వివాదము.]

## అంగిరసము, అంగరసములు

* వీరో౽రసో భవేదంగీ వీరశృంగారయోర్ద్వయోః॥ 35
అంగాన్యన్యేరసాః సర్వేభవేన్నిర్వహణో౽ద్భుతః।
—(విక. ఊర్వ. వ్యాఖ్య-పుట. 42)

['తథాచోక్తం వసంతరాజీయే' అని ఈ శ్లోకమునకు ముందు కలదు. కావున ఇది వసంతరాజీయములోనిదే.]

## సంచారి భావములు

* ఇష్టార్థవిరహ-వ్యాధి-నిందాప-దావమానసైః॥ 36
దారిద్ర్య-తాడ-నాక్షేప-పరవృద్ధ్యవలోకనైః ।

* నిష్ఫలత్వమతిర్నృణాం నిర్వేదో జీవితాదిషు॥ 37
అంతర్బాష్పోద్గమధ్యాన నిశ్శ్వాసస్యావమానసైః ।

* దైన్యగద్గదనైవర్ణ్యై రభినేయోభవేదయం॥ 38

* హర్షోమనస్సముల్లాసో గురుదేవమహీభుజామ్ ।
ప్రసాదాత్ప్రియసంగాచ్చ భవేదిష్టార్థ
లాభతః॥ 39

* ముఖనేత్రప్రసన్నత్వప్రియోక్తి పులకోద్గమైః।
దానత్యాగ శరీరంభై రభినయోభవేదయం॥ 40

* ఇష్టాలాభాదిష్టనాశాదనిష్టాప్తేశ్చ దైన్యతః।
చిత్తస్యైకాగ్రతా చింతా...
......స్మరణం చానుపస్కృతిః॥ 41

* సంతాపోచ్ఛ్వాస నిఃశ్వాసా మాంద్య మింద్రియ
కర్మణాం ।
అధోముఖత్వ మిత్యాద్యై రభినేయోభ
వేదియం॥ 42

* అనేజస్త్వంతు మనసోదైన్య మిత్యభిధీయతే ।
మనః సంతాపదారిద్ర్య చింతౌత్సుక్యాదిభి
ర్భవేత్ ॥ 43

* అంగానా మపి శైథిల్యం దేహసంస్కార వర్జనం ।
అంచితం చ శిరస్తస్మిన్ననుభావాః
ప్రకీర్తితాః ॥ 44

(మాల. అగ్ని. వ్యాఖ్య. పుట-28.)

['తేషాం లక్షణముక్తం వసంతరాజీయే' అని చెప్పబడిన తరువాత పై శ్లోకము లన్నియును ఉదాహృతములైనవి. ఇవి అన్నియును వసంతరాజీయము లోనివనుట స్పష్టము.]

## శృంగారావస్థలు

అభిలాషః స్పృహారమ్యేదృష్టే వాలంబనే(క్ష)తే।
ఔత్సుక్యస్వేదరోమాంచ హర్ష విస్మయ
సాధ్వసైః॥ 45
చాపలస్తంభలజ్జాద్యైరనుభావైః సబోధ్యతే।
(శా. వ్యాఖ్య. పుటలు-1౯; 22)

మనస్సంయోగో౽నురాగేణ సతతం తద్విచింత
నమ్॥ 46

(శా. వ్యాఖ్య. పుటలు-35, 36)

మనోరథః స్యాత్ సంకల్పస్తత్సమాగమగోచరః।
మనోరథాశ్వాసవశాదంతః సాక్షాత్ప్రతీ
యతే॥ 47

దృశ్యమానః సంగసంకల్ప ఇతికైశ్చిదుదీరితః ।
-(శా. వ్యాఖ్య-పుట-40)

భవేద్గుణనుతిస్తస్య రూపాదిగుణకీర్తనమ్॥ /48
-(శా. వ్యాఖ్య. పుట-50)

క్రియాద్వేషో మతో౽న్యత్ర విద్వేషోభోగ్య
వస్తుషు
(శా. వ్యాఖ్య. పుట-62)

మనత్యాగస్తాపహాని రౌత్సుక్యాతిశయో భవేత్॥49
—(శా. వ్యాఖ్య. పుట-74)

## అభిసారిక

* మదేనమదనేనాపి ప్రేరితా శిథిలత్రపా ।
యోత్సుకాభసరేత్కాంతం సాభవేదభిసారికా॥50

* కులజాం గణికాం ప్రేష్యాం యథాస్థైర్యవచేష్టితైః।
రాగాతిశయసంపన్నాం వర్ణయేదభిసారికాం॥ 51
—(విక్ర. ఊర్వ. వ్యాఖ్య-పుట. 60)

[ఈ శ్లోకములకుముందు 'అభిసారికా లక్షణముక్తం వసంతరాజీయే యథా' అని కలదు. కావున ఇవి వసంతరాజీయములోని వనుట స్పష్టము. మొదటి శ్లోకమును శ్రీ వేంకటరావుగారు పేర్కొనియున్నారు.]

## వేశ్యానాయిక

వేశ్యాచేన్నాయికా రాజ్ఞః పాదవ్యాప్యా స్యాన్న మానుషీ।
—(విక్ర. వ్యాఖ్య-పుట-18.)

[ఈ శ్లోకపాదమునకు ముందు 'యథోక్తం వసంతరాజీయే' అని కలదు. కావున ఇది వసంతరాజీయములోని దనుట స్పష్టము. ఈ శ్లోకార్థమును సమర్థించు 'తథాచ భారతీయే' అని చెప్పి భరతుని నాట్యశాస్త్రములోని శ్లోకములను కొన్నింటిని కాటయవేముడు ఉదాహరించియున్నాడు.]

## కుపితనాయికల ననునయించు నుపాయములు

* సామ్నా దానేన భేదేన తథ్యోపేక్షా రసాంతరైః॥52
మానాపనయనం తాసాముపాయైః షడ్భిరాచరేత్।
—(విక్ర. ఊర్వ. వ్యాఖ్య పుట 49)

ఈ శ్లోకమునకు ముందు 'యథోక్తం వసంతరాజీయే' అని కలదు. కావున ఇది వసంతరాజీయములోని దనుట స్పష్టము.]

## నృత్తారంభోచితావస్థానము

* అంగస్య చతురస్రత్వం సమపాదౌ లతాకరౌ॥ 53
ఆరంభే సర్వనృత్తానామేతత్సామాన్యమిష్యతే।
—(మాల. అగ్ని. వ్యాఖ్య—పుట. 26)

[ఈ శ్లోకమునకు ముందు 'తథాచోక్తం వసంతరాజీయే' అని కలదు. కావున ఇది వసంతరాజీయమందలిదే అనుట స్పష్టము.]

## కపోత హస్తము

కపోతః ప్రాంతసంశ్లేషా దన్యోన్యం సర్పశీర్షయోః॥ 54
—(శా. వ్యాఖ్య. పుట 144)

## నైపథ్య భేదములు

(చతుర్విధాహార్యాభినయములు)—
పుస్తం ప్రదర్శితం నాట్యే విమానాద్రివనాదికమ్।
కుండలాదివిభూషాంగరచనా త్వనులేపనమ్॥ 55
సంజీవః పశుపక్ష్యాదిప్రాణినాం రూపధారణమ్।
—(శా. వ్యాఖ్య-పుట. 3)

## విష వేగములు

* వైవర్ణ్యం వేపథుర్దాహః ఫేనః స్కంధస్య భంజనం॥ 56
దుఃఖం జాడ్యం మృతిశ్చేతి విషవేగాః స్యురష్టధా।
—(మాల. అగ్ని. వ్యాఖ్య-పుట. 69)

[ఈ శ్లోకమునకు ముందు 'విషవేగాస్తు వసంతరాజీయే కథితాః' అని కలదు. కావున ఇది వసంతరాజీయమందలిదే.]

## అధర భేదములు

* వివర్తితో వికాసీచ విసృతశ్చ విగూహితః॥ 57
ఆయతో రేచితోత్కృష్టః సందష్టశ్చ సముద్గకః।
* కంపితశ్చేతి నాట్యజ్ఞై రధరో దశధామతః॥ 58
తత్ర –
* ప్రసారితో విసృష్టాఖ్యోఽనాదరే దర్శితార్పణః।
(శా. వ్యాఖ్య పుట - 185)

[ఈ శ్లోకములకు ముందు 'యథోక్తం వసంతరాజీయే' అని కలదు. కావున ఇవి వసంతరాజీయమందలివే.]

## ధ్రువా భేదములు

* సూచనే పాత్రభేదానాం తత్స్వభావార్థసూచనీ॥
యా గీతిః సా ధ్రువా తుల్యసంవిధానవిశేషణే।
* ప్రావేశిక్యాక్షేపికీ చ తథా ప్రాసాదికీతి చ॥ 60
నైష్క్రామికీ చాంతరీ చేతి తాసాం లక్షణముచ్యతే।
* ప్రవేశసూచకా యా తు ధ్రువా ప్రావేశికీ మతా॥ 61
ప్రసంగమధ్యేఽన్యార్థస్య క్షేపాదాక్షేపికీ మతా।
* ప్రాసాదికీతు పాత్రాణాం వ్యాకులానాం ప్రసాదనాత్॥ 62
నిష్క్రామసూచికాయాం తే ధ్రువా నైష్క్రామికీ భవేత్।
* విషాదే విస్మృతౌ క్రోధే ప్రమాదే సంభ్రమే మదే॥63

దోషప్రచ్ఛాదనాద్దా ఏ గీయతే యాతు సాంతరీ
—(ప్రబోధ. చం. వ్యాఖ్య-పుట-101)

['తన్నోక్తం వసంతరాజీయే' అని పేర్కొని పైశ్లోకములను గోపమంత్రి ఉదాహరించెను. కావున, ఇవి వసంతరాజీయమందలివే అనుట స్పష్టము. శాకుంతల వ్యాఖ్యలోకూడ కాటయవేముడీ శ్లోకముల నుదాహరించెను. (పుట-112) కాని, అచ్చట 'యథోక్తం' అనిమాత్రమే కలదు. ఇది పొరపాటు. ఈ రెండింటికి పాఠభేదములుకూడ నున్నవి. కాటయవేముని పాఠము నే సరియైనదానినిగా గ్రహించుట సమంజసమగును. ఈ శ్లోకములను శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు పేర్కొనియున్నారు.]

## కార్యావస్థలు

ఆరంభయత్న ప్రాప్త్యాశా నియతాప్తి ఫలాగమాః॥ 64
ఔత్సుక్య మాత్ర మారంభః ఫలలాభాయ భూయసే।
—(శా. వ్యాఖ్య. పుట-17)
ప్రయత్నస్తు ఫలప్రాప్తౌ ప్రవర్తన ముపాయతః॥ 65
—(శా. వ్యాఖ్య-పుట. 43)
ఉపాయాపాయశంకాభ్యాం ప్రాప్త్యాశా కార్య సంభవః।
—(శా. వ్యాఖ్య. పుట. 82)
అర్థస్యాభావతః ప్రాప్తి ర్నియతాప్తిః సునిశ్చితా॥ 66
—(శా. వ్యాఖ్య. పుట. 153)

## అర్థ ప్రకృతులు

స్తోకోద్దిష్టః కార్యహేతో ర్బీజం విస్తార్యనేకధా।
—(శా. వ్యాఖ్య. పుట. 15)
వస్తునః సతివిచ్ఛేదే బిందు రచ్ఛేద కారణమ్॥ 67
—(శా. వ్యాఖ్య. పుటలు-36; 79)
పతాకా సంభవే బీజం బిందువా విన్యసే త్సుధీః।
—(శా. వ్యాఖ్య. పుట-84)
కథాంతర ప్రసంగేన ప్రకరీ స్యాత్ ప్రవేశభాక్॥ 68
—(శా. వ్యాఖ్య. పుట-141)
కార్యం త్రివర్గ స్తచ్ఛుద్ధమేకానేకానుబంధి చ।
—(శా. వ్యాఖ్య. పుట-196)

## ముఖసంధ్యంగ లక్షణములు

[సంధి, సంధ్యంగ లక్షణముల నెల్ల శాకుంతల వ్యాఖ్యనుండియే గ్రహించితిని. లక్షణముల చివర కుండలీకరణములందు పుటల సంఖ్యల నొసంగియున్నాను.)

బీజన్యాస ముపక్షేపః (పుట 19), తద్బాహుల్యం పరిక్రియా (పుట 19)॥ 69
తస్యదార్ఢ్యం పరిన్యాసః (పుట 25), గుణజ్ఞానా ద్విలోభనమ్ (పుట 28)।
యుక్తిః సంశయితార్థస్య నిర్ణయః పరికీర్తితః (పుట 28)॥ 70
అర్థానా మనుకూల్యేన సుఖాప్తిః ప్రాప్తి రిష్యతే (పుట 33)।
యద్బీజస్యానుసంధానం తత్సమాధాన మిష్యతే పుట 35॥ 71
సుఖదుఃఖ విధానం యద్ విధానం పరికీర్తితమ్ (పుట 27)।
పరిభావ ఇతి ప్రాహు రద్భుతార్థస్య దర్శనమ్ (పుట 27)॥ 72
ఉద్భేదః సపరిజ్ఞేయో యత్తు గూఢార్థ భేదనమ్ (పుట 28)।
కరణం ప్రకృతారంభః (పుట 30), భేదః ప్రోత్సాహనాభివేత్ (పుట 30)॥ 73

## సంధ్యంగక్రమత్యాగము—

యథోచితం ప్రయోగః స్యాదంగానాం నక్రమో మతః (పుట 25)।

## ప్రతిముఖ సంధిలక్షణము—

లక్ష్యాలక్ష్య స్తదుద్భేదో యత్ర ప్రతిముఖంతు తత్ (పుట 43)॥ 74

## ప్రతిముఖ సంధ్యంగములు-13

విలాసః-పరిసర్పశ్చ-విధూతం-శమ-నర్మణీ।
నర్మద్యుతిః-ప్రగమనం-నిరోధః-పర్యుపాసనమ్॥ 75
వజ్రం-పుష్పం-పరిన్యాసో-వర్ణసంహార ఇత్యపి (పుట 43)

## ప్రతిముఖసంధ్యంగ లక్షణములు

ఇష్టార్థవిషయో మోహో విలాస ఇతిమన్యతే (పుట 50)॥ 76
పరిసర్ప ఇతి ప్రాహు ర్దృష్టనష్టానుసర్పణమ్ (పుట 62)
విధూతమారతిః (పుట 62) తచ్ఛాంతిః శమ ఇత్యభిధీయతే (పుట 67)॥ 77

పరిహాసవచో నర్మ యచ్చోచిత ముదీరితమ్ (పుట 51)।
దోషప్రచ్ఛాదనార్థంతు వచో నర్మద్యుతి ర్మతా
(పుట 51) 78
యత్నోత్తర కృతాం వాచ మాహుః ప్రగమనం బుధాః
(పుట 73)।
నిరోధోహి నిరోధః స్యాత్ (పుట 76), సాంత్వనం
పర్యుపాసనమ్ (పుట 72)॥ 79
వజ్రం ప్రత్యక్షనిష్ఠురం (పుట 62), పుష్పం విశేష
వద్వాక్యమ్ (పుట 64)।
ఉపపత్తియుతంవాక్య ముపన్యాసం ప్రచక్షతే
(పుట 72) 80
బహుపాత్ర సమాహారో వర్ణసంగ్రహః... (పుట 78)।

## గర్భసంధి లక్షణము

సగర్భో దృష్టనష్టస్య యత్ర బీజస్య మార్గణమ్।
(పుట. 88) 81

## గర్భసంధ్యంగములు 12

అభూతాహరణం, మార్గో-రూప-ఓదాహరణ-క్రమాః
సంగ్రహ-శ్చానుమానంచ-తోటక-కాధిబలే అపి॥ 82
ఉద్వేగ — సంభ్ర — మాక్షేపా — ద్వాదశాంగాని
తస్యచ (పుట 84)।

## గర్భసంధ్యంగ లక్షణములు

అభూతాహరణం ప్రాహుః కపటోపాయకల్పనమ్
(పుట. 90)॥ 83
తత్త్వార్థకథనం మార్గః (పుట. 91), రూపం వితర్కవ
ద్వాక్యం (పుట. 117)।
* ఉత్కర్షేణాన్వితంవాక్య ముదాహరణ మిష్యతే
(పుట. 120)॥ 84.
చింత్యమానార్థ సంప్రాప్తిః క్రమ ఇత్యభిధీయతే
(పుట. 95)।
సంగ్రహః సామదానాభ్యాం వశీకరణ ముచ్యతే
(పుట. 105)॥ 85
ఊహాచ్ఛ లింగతః సమ్య గనుమాన మితి స్మృతమ్
(పుట. 99)।
సంరంభవచనం యత్తు తత్తోటక ముదీరితమ్ (పుట.
125)॥ 86

వంచనాదిభిబలమ్ (పుట-128), భీతిరుద్వేగకారిణీ
పుట. 131)।
శంకాత్రాసౌ సంభ్రమా ద్యౌ (పుట. 124), ఆక్షే
పోబీజయోజనమ్ (పుట. 134)॥ 87

('ఉత్కర్షేణాన్వితం వాక్యముదాహరణ మిష్యతే' అనెడి పై ఉదాహరణ లక్షణమునకు ముందు 'యథోక్తం వసంతరాజీయే' అని కలదు. పై శ్లోకము లన్నియును వరుసశ్లోకములు. వీనిలోని ఒకపాదము వసంతరాజీయములోని దైనప్పుడు తక్కినవి కూడ వసంతరాజీయములోనివే అని తలంచుట అసమంజసము కాజాలదు. అన్నిచోట్లను ఇట్లు లేక పోవుటకు కారణము లేఖకుల పొరపాటు కావచ్చును; లేదా మాటిమాటికిని 'యథోక్తం వసంతరాజీయే' అనుచు వ్రాయుటకు నిజముగా కాటయవేముడే బద్ధకించి ఉండవచ్చును జ్ఞాపకార్థము అప్పటప్పట మాత్రము వసంతరాజీయమును పేర్కొనెను, తలంచుట సమంజస మగును ఇంతకును వసంతరాజీయ మార్గము ననుసరించియే తాను వ్యాఖ్యానించుచుంటినని మొదటనే చెప్పినాడుగదా.

మాటిమాటికిని 'వసంతరాజీయమునుండి' అని వ్రాయుటకు లేఖకులుకూడ బద్ధకించి యుందురనుటలో సందేహము లేదు. వారు కొన్ని శ్లోకపాదముల నే వదలివేయుట 'ఉపోద్ఘాతము' విషయమున గుర్తించి యున్నాము.

కావున సంధి. సంధ్యంగ నిర్వచనము లన్నియును వసంతరాజీయములోనివే అని తలంచుచున్నాను.

## విమర్శసంధి లక్షణము

యత్ర విమృశ్యతే మోహో ద్వ్యసనాద్వా
విలోభనాత్ ।
గర్భ నిర్భిన్న బీజార్థః సోఽవమర్శ ఇతి
స్మృతః (పుట. 158) ॥ 88

## విమర్శ సంధ్యంగములు 13

అపవాదశ్చ-సంఫేటో-విద్రవ-ద్రవ-శక్తయః।
ద్యుతిః-ప్రసంగ-శ్ఛలనం-వ్యవసాయో-
విరోధనమ్॥ 89
ప్రరోచనం-విచలనం-మాధానం చ త్రయోదశ
(పుట. 153)।

## విమర్శ సంధ్యంగ లక్షణములు

అపవాదస్తు దోషాణా ముద్ఘాటన ముదీర్యతే
(పుట 152)॥ 90

సంఫేటః సహి విజ్ఞేయో యద్రోషపరుషం వచః
(పుట 172)।

విద్రవః కథ్యతే బంధువధసంతాడనాదికః
(పుట 171)॥ 91

ద్రవ ఇత్యుచ్యతే తత్ జ్ఞైస్తిరస్కారో మహాత్మనామ్
(పుట 172)।

విరోధశమనాచ్ఛక్తిః (పుట 178)। తర్జనోద్వేజనే
ద్యుతిః (పుట 163)॥ 92

గురుకీర్తనం ప్రసంగః (పుట 174)। ఛన్నం
స్యాద్వ్యాజ కల్పితమ్ (పుట 175)।
వ్యవసాయః స్వశక్తితః (పుట 173)। సంరంభాద్వా
విరోధనమ్ (పుట 171)॥ 93

యథా ప్తదర్శనా ద్భావిదర్శనం సా ప్రరోచనా
(పుట 169)।

వికత్థనాద్యవలనమ్ (పుట 172) ఆదానం కార్య
సంగ్రహః (పుట 174)॥ 94

## నిర్వహణ సంధిలక్షణము

బీజవంతో ముఖాద్యర్థాః విప్రకీర్ణా యథా యథా।
ఏకార్థ్య ముపనీయంతే యత్ర నిర్వహణం హితత్
(పుట 184) 95

## నిర్వహణ సంధ్యంగములు—14

సంధి-ర్విరోధో-గ్రథనం-నిర్ణయః-పరిభాషణమ్।
ప్రసా-దానంద-సమయాః-కృతి-ర్భా-షోప
గూహనే॥ 96
పూర్వభా-గోపసంహారే-ప్రశస్తిశ్చ చతుర్దశ
(పుట. 184)।

## నిర్వహణ సంధ్యంగ లక్షణములు

సంధిస్తు బీజోపగమనం (పుట. 184), కార్యా
న్వేషో విరోధఃస్యాత్ (పుట. 188)॥ 97

గ్రథనం సంనిబంధనం (పుట 189), అనుభూతార్థ
కథనం నిర్ణయః (పుట. 189)।

పరిభాషా మిథోజల్పః (పుట 191), ప్రసాదః
పర్యుపాసనమ్ (పుట. 195)॥ 98

ఇష్టార్థసిద్ధి రానందః (పుట. 197), సమయో దుఃఖ
నిర్గమః (పుట. 195)।

స్థిరీకరణ మర్థస్య లబ్ధస్య కృతిరిష్యతే
(పుట. 201)॥ 99

బహుమానాది సంప్రాప్తి ర్భాషేతి పరికీర్తితా
(పుట. 202)।

అద్భుతార్థస్య సంప్రాప్తి రుపగూహన ముచ్యతే
(పుట 190)॥ 100

పూర్వభావః సవిజ్ఞేయో యత్తు కార్యప్రదర్శనమ్
(పుట 192)।

వరాప్తే రుపసంహారః (పుట. 203), ప్రశస్తిః శుభ
శంసనమ్ (పుట. 204)॥ 101

## ఒంటిబ్రాహ్మణుని శకునము

* ధృతాతపత్రః శుభశుక్లవాసాః
పుష్పార్చిత శ్చందన చర్చితాంగః।
విప్రః శిఖావాన్ కృత భోజనశ్చ
దదాతి స్పృష్టః పథిసర్వసిద్ధిమ్॥ 102

—(కుమారస్వామి ప్ర. రు. వ్యాఖ్య పుట. 173)

[ఈ శ్లోకమునకు ముందు 'వసంతరాజీయే ఉప్యుక్తమ్' అని కలదు. ఇదియును వసంతరాజీయ మందలిదే అనుట స్పష్టము. దీనిని శ్రీ వెంకటరావు గారు పేర్కొనివారు.]

ఇంతవఱకును మొత్తం 102 శ్లోకములను, సరిగా చెప్పవలెనన్నచో 204 శ్లోక పాదములను, ఉదాహరించియున్నాను. వీనిలో వసంతరాజీయమునందలివని స్పష్టముగా చెప్పబడిన శ్లోకములు 32; శ్లోకపాదములు 6. (కాగా మొత్తము శ్లోకపాదములు 70. ఈ శ్లోకములకు, శ్లోకపాదములకును '*' ఇట్టి గుర్తును పెట్టియున్నాను)

పైన పేర్కొనిన కారణములను పట్టి పైశ్లోకములన్నియును వసంత రాజీయమునందలివే యని నిస్సంశయముగా చెప్పవచ్చును. ఈ నా ప్రతిపాదనమునకు సహృదయులే ప్రమాణము. మాలవికాగ్నిమిత్రవ్యాఖ్యయందును, విక్రమోర్వశీయ వ్యాఖ్యయందును పేరు చెప్పకయే పేర్కొనబడిన లక్షణ శ్లోకము లింకను అనేకములు కలవు. వానిని ఇంకను పరిశీలింపవలసి యున్నది.

# వసంతరాజీయము

తెలుగుదేశపు నాలుగు మూలలను సరిగా గాలించినచో 'వసంత రాజీయము' యొక్క వ్రాతప్రతులు తప్పక లభింపగలవని ఆశించుచున్నాను. అవకాశము లున్నవారికి ఆసక్తి లేదు, ఆసక్తి కలవారికి అవకాశములు లేవు. ఇదీ నేటి పరిస్థితి. లభించని వసంత రాజీయము మాట ఎట్లున్నను, లభించిన కాటయవేముని వ్యాఖ్యలనైనను నిర్దుష్టముగా పరిష్కరించి ప్రకటించుటకు తెలుగుదేశమున ప్రయత్నమే జరుగలేదు. ఇంక జాయపసేనాపతి 'నృత్తరత్నావళి' ఇంతవఱకును అముద్రితముగానే ఉండుట ఆంధ్రుల కవమానము. సహృదయులు డా. వి. రాఘవన్ గారు దీని సంపాదకత్వమును వహించి, జూలై, 1966 లో సుమారు 200 పేజీలను ముద్రించినారు. కాని, ఇది నేటివఱకును ప్రకటితము కాలేదు; ఏమైనదో తెలియదు. తెలుగువారికి గర్వకారణములైన ఇట్టి అమూల్యగ్రంథములను వెలుగులోనికి తెచ్చుటకు పూనుకొనుట సహృదయులైన పెద్దల, ముఖ్యముగా సాహిత్య, సంగీత నాటక అకాడమీలలోని కవి, పండితుల కనీసధర్మము. ఈ వ్యాసమును చదివి సలహాల నొసంగిన శ్రీమాన్ ఎస్. టి. రామానుజాచార్యుల గారికి కృతజ్ఞుడను.

# అంతర్వాహిని

## 'హితశ్రీ'

* గత సంచిక తరవాయి *

### 4

వాకిట్లో జట్కాబండి ఆగిన చప్పుడు విని గోపీ పరుగెత్తుకొచ్చి గేటుతలుపు తీసి సంతోషంగా కేక పెట్టాడు.

"అన్నయ్యొచ్చాడమ్మా."

విశ్వం చిరునవ్వుతో వాడివైపు చూసి "ఏరా గోపీ, కులాసాగా ఉన్నావా?" అన్నాడు.

గోపీ తల ఆడించాడు. వరండాలోకి విశ్వం వచ్చేసరికి వరసగా అందరూ ఇంట్లోంచి బయటికొస్తున్నారు.

"ఏరా విశ్వం, పరీక్షలన్నీ బాగా రాశావా?" అన్నారు రంగనాథంగారు.

"ఆ: సెకండ్ క్లాస్ తప్పక వస్తుంది."

"అదేమిటిరా, అలా సగమైపోయావు? పాడు పరీక్షలు." అంది విశ్వం తల్లి.

"ఇంక పరీక్షల గొడవ లేదుగా." అంది పద్మ.

"ఓహో పద్మావతమ్మగారా? నీతో పోటీకైనా హిందీ పరీక్షలకి కూచోకుండా ఉంటానా?"

"హిందీ పరీక్షలకే లేకపోతే డ్రాయింగ్ పరీక్షలకికూడా కూచో, నాకేం పోయింది మధ్య?"

"థాంక్స్. పర్మిషన్ ఇచ్చావుగద."

చిరునవ్వుతో లోపలికొచ్చాడు విశ్వం. హాల్లో శ్రీనివాసరావు రేడియో వింటూ కూర్చున్నాడు.

"ఓ. డాక్టరుగారా! నమస్తే."

"కూర్చోవోయ్ విశ్వం." వాల్యూం తగ్గిస్తూ అన్నాడు శ్రీనివాసరావు.

మా ఇంట్లో మాకు నువ్వు మర్యాద చెయ్యక్కర్లేదులే."

"ఎవరిల్లయితే ఏం, బంధువు బంధువే."

"డాక్టర్ గారికి మందులసంగతికంటే మర్యాదల సంగతే బాగా తెలుసల్లే ఉంది."

"మన తెలుగుదేశంలో కొత్తగా పెళ్ళయినవాడికి ముందు ముఖ్యంగా తెలిసేది అదేగా!"

ఇద్దరూ నవ్వారు.

"పండక్కి రావటానికి వీలుండదేమో నని రాశావుటగా. ఎలా వీలయింది?"

"పండక్కి రాకపోతే చాలా కష్టపడాలిసొస్తుందని చుట్టపక్కాలు సలహా ఇచ్చార్లే—అందువల్ల వీలయింది." అన్నాడు శ్రీనివాసరావు ఓరగా పద్మవైపుచూసి. పద్మ ఇదేమీ విననట్టు దొంగ వేషం వేసి లోపలికి జారుకుంది.

"ఏమిటి గిరాకీ?" అన్నాడు విశ్వం నవ్వుతూ.

"గ్లాస్గో పంచెలూ మొదలైనవి పండగ తప్పించి మరీ వొచ్చావు. ఏమిటో కారణం?"

విశ్వం జరిగిన సంగతి చెప్పాడు. ఇంతలోకే గోపీ వొచ్చి "అన్నయ్యా, స్నానంచేసి వొస్తే అమ్మ కాఫీ ఇస్తుందట." అన్నాడు. "రేడియో వింటున్నట్టున్నావు. నిన్ను ఇబ్బంది పెట్టను లే. కాసేపాగి పునర్దర్శనం చేసుకుంటాను." అని విశ్వం లేచినుంచున్నాడు. "నేనూ అలా కాసేపు బయటికి వెళ్లొస్తాలే. మధ్యాహ్నం తీరిగ్గా ఒకళ్ళనొకళ్ళం విసిగించుకోవచ్చు" అని శ్రీనివాసరావు బయటికి నడిచాడు.

విశ్వం స్నానంచేసి, కాఫీ తాగి పేపర్ ముందేసుకుని వార్తల శీర్షికలు చూస్తున్నాడు. గోపీ అతనికి దగ్గర్లోనే చాప వేసుకు కూర్చుని లెక్కలు చేసుకుంటున్నాడు.

"గోపీ, బావేరి?"

పద్మ కంఠం విని విశ్వం తలెత్తాడు.

"బజారుకి వెళ్ళాడు" చెప్పాడు గోపి.

"ఎందుకూ?"

"ఏమో?"

"ఏమో" ఏమిట్రా? ఏమైనా కావాలేమో, 'నేను తెచ్చిపెడతానులే బావా' అనకూడదూ? ఫర్స్టు ఫారం చదువుతున్నావు గాని......"

"అయినే బావ అంత చదువుకున్నాడు కదా, అడక్కుండా తనే చెప్పకూడదా ఏమిటక్కయ్యా?"

గోపి ఎదురు ప్రశ్నకి విశ్వానికి నవ్వొచ్చింది.

"డాక్టర్ గారికి కోపం వొచ్చింది" అన్నాడతను.

"కోపమా!" అంది పద్మ తెల్లబోయి.

"అవును అంటే ఆగ్రహం."

"ఎందుకూ?" కొంచెం బెదురుగా అంది.

"కాఫీ ఇవ్వలేదని."

"ఎందుకివ్వలేదు. నేనేగా ఇచ్చిన దాన్ని."

"అయితే ఏమీ తోచక ఇంకోసారి కాఫీ తాగి రావటానికి బజారుకి వెళ్లి ఉంటాడు."

పద్మ గ్రహించింది.

"వేళాకోళమేనా. నిజమేమోనని హడలి పోయాను."

"ఎందుకంత భయం?"

"భయం దేనికీ?"

"మరి హడిలిపోయానన్నావేం?"

"మాటవరసకి అన్నాను."

"దాస్తావేం? పద్మా, నిజం చెప్పాలంటే ఈ ఆడవాళ్లకి బుద్ధిలేదు. మొదట మొదట నేర్పుతారు. తరవాత ఏకు మేకై ఊరుకుంటుంది. ప్రతి చిన్నదానికీ భర్తగారికి కోపం వస్తుందేమోనని బెంగపడిపోతారు. చివరికి అదే ఖాయమైపోతుంది. ముందు జాగ్రత్తకి చెబుతున్నాను. పూర్వపురోజులు పోయాయి. ఈ రోజుల్లో కావాలిసింది అన్నిరంగాల్లో అందరికి సమాన హక్కులు. సమతా రాజ్యస్థాపన జరగాలంటే ఎవరి హక్కులు వాళ్లు తెలుసుకుని అవి సిద్ధించేవరకూ విశ్రమించకూడదు. ఈ చివరిమాటలు నావి కావులే. ఇదిగో, ఈ మూల మహిళా మహోదయసంఘ వార్షిక సభలో ప్రసంగవిశేషాలు చూడు."

గంభీరంగా ప్రారంభించి వ్యంగ్యోక్తితో ముగించిన విశ్వంవైపు బిత్తరపోయి చూసింది పద్మ.

"ఏమిటన్నయ్యా నీ గొడవ, భలేవాడివిలే" అనేసి ఆమె మేడ మీదికి వెళ్ళిపోయింది.

గోపి ఈ గొడవ పట్టించుకున్నట్టు లేదు. వాడు పెదవులు బిగించి కలం గడ్డం కింద పెట్టుకుని దీర్ఘాలోచనా తత్పరుడై ఉన్నాడు. ఆ భంగిమ చూసి విశ్వం అడిగాడు.

"ఏమిట్రా గోపీ ఆ ఆలోచన?"

గోపి ఆ ప్రశ్నకి ఆలోచన నించి తేరుకుని విశ్వం వైపు చూసి అన్నాడు.

"x విలువ తప్పిందన్నయ్యా."

"ఏదీ ఇలా తే."

గోపి దగ్గిరికొచ్చి లెక్క చేసిన పుస్తకం విశ్వానికిచ్చాడు.

"గోటితో పోయేదానికి గొడ్డలి దేనికిరా? ఈ లెక్క x పద్ధతిలో చెయ్యక్కర్లేదు. కొన్న ఖరీదు 100 అనుకో చిటికెలమీద వచ్చేస్తుంది ఆన్సర్."

గోపి అనుమానంగా విశ్వంవైపు చూశాడు.

"మా మేష్టరుగారు x పద్ధతిలో చెయ్యమని చెప్పారే!"

"ఆయన ఎవరోగాని ముక్కు చూపించమంటే తలవెనకనించి చెయ్యి పోనిచ్చి చూపించేట్టున్నాడే."

గోపీకి కొంచెం నవ్వొచ్చింది.

"రంగారావు మాష్టరుగారన్నయ్యా"

"ఏ రంగారావు?"

"నీ స్నేహితుడేటగా."

విశ్వం కొంచెం ముఖం చిట్లించి "ఓహో, వాడా!" అన్నాడు.

"రంగారావు మాష్టరుగారు నిన్ను చాలాసార్లు అడిగారు."

"నా క్లాసుమేటేలే."

"ఆయనకి లెక్కలు బాగా వొచ్చు. బలేబాగా చెప్తారుకూడా."

"సరేలే. నేను చెప్పినట్లు ఈ లెక్క చెయ్యి."

అయిష్టంగా పుస్తకంవైపు చూశాడు గోపి.

"ఏమిట్రా నీ సందేహం? నేను మీ మాష్టరుకంటే అయిదు క్లాసులు ఎక్కువ చదివాను, తెలుసా?" అన్నాడు విశ్వం.

గోపీకి ఆశ్చర్యం వేసింది. అన్నయ్యా అబద్ధం చెబుతున్నాడని అతివనుకోలేదుగాని ఆ విషయం అతనికి నమ్మ తగిందిగా కనిపించలేదు. ఆ పని మనసుకి చదువుల్లో తేడాలు తెలియావు మాసరుగారు సునాయాసంగా బోర్డుమీద లెక్కలు చేసేస్తుంటే అదో విధమైన అభిమాన పూర్వకమైన గొప్ప అభిప్రాయం ఆయనమీద గోపీకి ఏర్పడ్డది.

తను చెప్పిన పద్ధతిలో లెక్క ఎలా చేయాలో వివరించి ఆ ప్రకారం చేసి మాస్టరుగారికి చూపించమని చెప్పి మేడమీదికి వెళ్లాను విశ్వం.

వాకిలి తెరకి కాబోలు తెల్లటిగుడ్డమీద రంగు దారాల్తో కుడుతూ పందిరిమంచంమీద కూర్చుంది పద్మ.

"ఏమిటి పద్మా ఆ డిజైను?"

"పద్మ వెనక్కి తిరిగిచూసి, రేఖాచిత్రాన్ని చూపిస్తూ "మామిడిచెట్టుమీద కోయిల" అంది. ఆ బొమ్మ తీక్షణంగా చూసి అన్నాడు విశ్వం.

"వేపచెట్టుమీది కాకికదూ?"

"కాదు. సరిగా చూడు" అంది పద్మ అమాయకంగా.

"మరి ఆ మాటలు కింద రాయలేదేం?"

"ఎందుకూ?"

"లేకపోతే ఎలా తెలుస్తుంది?"

విశ్వం కళ్ళలోకి చూసింది పద్మ. అతను నవ్వాపుకుంటున్నాడు. అప్పటికి తెలిసిందామెకి అతని మాటల్లోని వ్యంగ్యం.

"పోదూ గొడవ" అంది విసుగ్గా.

"ఎవరిదీ మహా చిత్ర శిల్పం?"

"నేనే వేశాలే."

"నువ్వా?"

అటువంటి పొరపాటు పని పద్మ ఎప్పుడూ చెయ్యదని అతనికి బాగా నమ్మకం ఉంది. డిజైన్లకి కార్బన్ కాపీలు తియ్యటానికి పైమెట్టు ఆమె ఊహకి అతీతం. ఆలోచించగా విశ్వానికి అకస్మాత్తుగా తట్టింది.

"ఓ, డాక్టరుగారి చిత్రకళానైపుణ్యం కాబోలు. అవునా?"

"కాదులే" అంది పద్మ.

"నాకు తెలుసులే."

"తెలిస్తే సరే. పద్మ పనిచేసుకోనీ."

దృఢపడిపోయింది అతని అనుమానం. చూస్తూ చూస్తూ పద్మ శ్రమంతా బూడిదలో పోసిన పన్నీరు కానివ్వటం అతని కిష్టంలేదు.

"ఫస్టుక్లాసయిన బొమ్మ నేను వేసిపెడతాలే. పాపం డాక్టరుగార్ని ఎందుకు అవస్థ పెట్టావు?" అని పద్మ సమాధానంకోసం కూడా ఎదురు చూడకుండా ఆమె చేతిలో ఫ్రేంలాక్కుని, శుద్ధ పరిచేసి తనకి చిర పరిచితమైన రేఖాచిత్రం 'మామిడిచెట్టుమీద కోయిల' త్వరత్వరగా గీశేశాడు.

"ఎలా ఉంది?"

"ఎన్ని సార్లు వేసినా అదేగా?"

తెల్లబోయాడు విశ్వం. "ఏతేమాత్రం?" అన్నాడు.

"సరేలే, ఇలా ఇవ్వు" అంది పద్మ.

"సరైన రంగుదారాలతో కుడితే ఫస్టుగా ఉంటుంది. డాక్టర్ హడిలిపోవాలిసిందే" అని వెనక్కి తిరిగి వెళ్ళబోతూ గదిలోని నిలువుటద్దంలో చూసుకుని అదిరిపడి పద్మ వైపుతిరిగి "ఇదేమిటి పద్మోయ్, ఈ పందొమ్మిదో శతాబ్దపు అలంకారం?" అన్నాడు. అదేమిటోనని పద్మ వెనక్కి చూసింది. నిలువుటద్దం చూపించాడు విశ్వం. అది పూర్వం గోడకి జేరగిలవేసి ఉండేది. ఇప్పుడు గోడ నించి ముందుకు వంగి ఉండటంచూసి విశ్వం ఆశ్చర్యపోయాడు. వెంటనే దాన్ని మళ్లీ వెనకటి స్థితిలో ఉంచటానికి ప్రయత్నించసాగాడు.

"హెయిర్‌కటింగ్ సెలూన్‌లోలాగా గోడకి జేరవెయ్యటమేమిటి? అలా ముందుకి ఉంటేనే బాగుంటుంది." అంది పద్మ విసుగ్గా.

అద్దం అలా వొదిలేసి ఆశ్చర్యంగా విశ్వం పద్మ ముఖంలోకి చూశాడు.

"హెయిర్‌కటింగ్ సెలూనా? అక్కడ ఎలా ఉంటుందో నీకేం తెలుసు?"

పద్మ మాట్లాడలేదు. వెంటనే విశ్వానికి అర్థమైంది. ఇది డాక్టర్‌గారి అభిరుచి కాబోలు. అభిప్రాయాలు ఆడవాళ్లు ఎంత త్వరలో మార్చుకుంటారు,

మరేమీ మాట్లాడకుండా విశ్వం మేడదిగి హాల్లోకి వచ్చాడు. గోపీ అక్కడ లేడు. పుస్తకాలు మాత్రం చాపమీదనే ఉన్నాయి. లెక్క ఎలా చేశాడో చూడాలని పుస్తకం తెరిచాడు విశ్వం. అతని ఆశ్చర్యానికి మేరలేదు. ఆ లెక్క x పద్ధతిలోనే మళ్లీ చెయ్యబడి ఉంది. తను చేసి చూపించిన నమూనాకోసం పుస్తకంలో వెతికాడు విశ్వం. అదెక్కడా కనిపించలేదు. విశ్వం కిటికీలోంచి బయటికి చూశాడు. ఓమూల ఓ కాగితం ఉండ కనిపించింది అది చూడగానే విశ్వానికి నవ్వొచ్చింది. "ఓరి వెధవా!" అనుకున్నాడు. ఈ విషయం పద్మకికూడా చెప్పి ఆమెని పొట్ట చెక్కలయ్యేట్లు నవ్వించాలనుకున్నాడు. సరాసరి మేడమీదికి వెళ్లాడు.

పద్మ అల్లికపని చేస్తూనే ఉంది. విశ్వం తొంగి చూశాడు. అది తను వేసి ఇచ్చిన బొమ్మ కాదు. పద్మ అంతకిపూర్వం కుట్టటానికి ప్రారంభించిన చిత్రం. విశ్వం బుర్ర గోక్కున్నాడు. ఏం మనుషులు వీళ్లందరూ? విచక్షణాజ్ఞానం ఉపయోగించరేం? యుక్తమేమిటో తెలుసుకోవటం కూడా ఇష్టం ఉన్నట్టు లేదు. మాటిమాటికి ఆశ్చర్యపోవటం తనవంతవుతోంది. ఇంతకీ మనుషుల భావాలు చిత్రమైనవి.

విశ్వం పద్మతో మాట్లాడకుండానే వెనక్కి తిరిగి మేడదిగి మళ్లీ హాల్లోకి వచ్చేశాడు. అక్కడ రంగనాథంగారు కూర్చుని వున్నారు. విశ్వాన్ని చూడగానే ఆయన అన్నాడు.

"ఒరే విశ్వం, బావ రేపు వెడతానంటున్నాడు. సాయంత్రం బజారుకివెళ్లి ఖరీదైన మంచి సూటింగ్ క్లాత్ సెలెక్ట్ చేసి తీసుకువస్తావా? అతనికి మరీ మొహమాటం. షాపుకి వెళ్లినచ్చింది చూడమంటే ఒప్పుకోడు. నువ్వే వెళ్ళి ఆ పనేదో చూడు కాస్త."

"అలాగే నాన్నా." అన్నాడు విశ్వం.

## 5

"కాలం సాగిపోతోంది. పనులు జరిగిపోతున్నాయి. గుమాస్తాలు రాస్తున్నారు. రైతులు పొలం దున్నుతున్నారు. పంట పండిస్తున్నారు. శ్రామికులు శ్రమించి స్వేదజలం వర్షిస్తున్నారు. పెద్ద ఉద్యోగులు హుంకరిస్తున్నారు. ఫ్యాక్టరీల గొట్టాలు పొగ విడుస్తున్నాయి. మంత్రులు తిరుగుతున్నారు. నాయకులు అరుస్తున్నారు. విద్యార్థులు పుస్తకాలు తిరగేస్తున్నారు. పండిన ధాన్యం ఎక్కడో ఉడుకుతూనే ఉంది. ఇలా పనులు జరిగిపోతూనే ఉన్నాయి. కాలం గడుస్తూనే ఉంటుంది. కాలగమనం చూడగలిగినవాళ్లు చూస్తూనే ఉంటున్నారు. లేనివాళ్ళు నిర్లక్ష్యంగా కళ్ళు మూసుకుంటూనే ఉన్నారు. ప్రపంచంలో పుట్టి పెరిగిన ప్రతివాడూ ఏదో పనిచేస్తూనే ఉన్నాడు.

నహి కశ్చిత్ క్షణ మపి జాతు తిష్ఠత్యకర్మకృత్
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః

అన్నాడు గీతాకారుడు.

కాని ప్రతిపనీ మనిషి అభ్యున్నతికే జరగటం లేదు. మనిషి ఇంకా గొప్పగా బతకటానికి ఉపకరించే పనుల్ని కాలం మింగివేస్తోంది. వాటికి బదులు మనిషిని కిందికి లాగే పనుల్ని కాలం ఇప్పుడు మనకిస్తోంది.

కాలం వెనక్కి తిరగదు. చేసిన పనుల్ని చెరపలేము. క్షణక్షణమూ జీవితం ఖర్చయిపోతోంది. ఆ క్షణము జరగాలిసిన పని ఏమంటే, మానవజీవిత ప్రమాణాన్ని అన్నిరంగాలలో కొన్ని మెట్లు పైకిలాగే ప్రయత్నం. నేను ప్రపంచం మొత్తంమీద జరగాలిసిన పని ఇది ఒక్కటే. ఇది ఎలా సాధ్యపడుతుందో చూద్దాం..."

మైదానంలో ఒక సాంఘిక సేవాపరుడు ఉపన్యసిస్తున్నాడు. ఉపన్యాసాన్ని మొదటినుంచీ శ్రద్ధగా వింటున్నాడు విశ్వం. అప్రయత్నంగా అతనిలోని చిలిపితనం తలెత్తింది. ఉపన్యాసకుడు ఉపన్యాసాన్ని వెంటనే కొనసాగించకుండా కొంతసేపు ఆగి నాలుగుదిక్కులా చూస్తున్నాడు.

"కాలం సాగిపోతోంది" అన్నాడు విశ్వం గట్టిగా విద్యార్థిదశలోని కొంటెతనంతో.

"ఇప్పుడు కాలాన్నిగురించి మాట్లాడిన దెవరో నాకు చూడాలని వుంది" అన్నాడు ఉపన్యాసకుడు.

విశ్వం ధైర్యంగా లేచి నిలబడ్డాడు. అలా అన్నందుకు అతను కొంచెం విచారించక పోలేదు. కాని ఒకపని చేసిన తరవాత దానిఫలితం అనుభవించడానికి అతను వెనుదియ్యడు.

"దయచేసి మీరు ఒకసారిలా వస్తారా? మీతో రెండు విషయాలు మాట్లాడాలి."

విశ్వం అతనికి దగ్గరగా వెళ్ళాడు.

"మీ పేరు?"

"విశ్వేశ్వరరావు."

"కాలం సాగిపోతోంది అనే విషయం ఇంతకు ముందు మీకెప్పుడైనా స్ఫురించిందా?"

"స్ఫురించకుండా ఉండటానికి అదేం కొత్త సంగతి కాదు గదండీ!" కొంచెం నవ్వుతూ అన్నాడు విశ్వం.

"అప్పుడు మీ భావాలు ఎలా వుండేవో చెప్ప గలరా?"

"నిన్న, ఇవాళ, రేపు—ఇదే కదా కాలం అంటే, అనిపించేది నాకు. ఒక్కొక్కప్పుడు కాలం మీద ఏమైనా కవిత్వం రాద్దామని ఉండేది. కాని సరైన భావాలు రాకపోవటంవల్ల రాయలేదు."

"మీ వయసెంత?"

"ఇరవై రెండు"

"ఈ ఇరవై రెండేళ్ల కాలంలో ఎన్నో పనులు చేసి ఉంటారు మీరు."

"అవును, మరి."

"ఇన్ని సంవత్సరాల్లో మీరు చేసిన అతి ముఖ్యమైన పని ఒకటి చెప్పగలరా?"

విశ్వం ఆలోచించాడు.

"ఏదైనా సరే, మీరు గుండెమీద చెయ్యి వేసుకుని ఫలానా ఘనకార్యం చేశానని చెప్పగల ఒక్క పని, కనీసం ఒక్క మంచి పని చెప్పండి చాలు."

విశ్వం నుదుటిమీద స్వేదబిందువులు చేరాయి. ఒక్క మంచి పని...తను ఒక్క మంచి పని కూడా ఇంతవరకూ చెయ్యలేదా? గొప్ప పనికాక పోవొచ్చు- కాని కనీసం ఒక్క మంచి పని...

విశ్వం తలవంచుకున్నాడు నిరుత్తరంగా

"పోనీ కనీసం అలాంటి పనిఏదైనా చెయ్యాలను కున్నారా?"

"ఎందుకనుకోలేదు" అన్నాడు విశ్వం తెప్పరిల్లి

"ఏమిటదీ?"

విశ్వానికి పచ్చివెలక్కాయ నోట్లో పడ్డట్టయింది. ఎంత ఆలోచించినా ఏమీ తట్టటంలేదు.

"ఒక్క ప్రశ్న అడుగుతాను. తడుముకోకుండా సమాధానం చెబుతారా?"

"అడగండి."

"మీ జీవిత లక్ష్యం ఏమిటి?"

ఏమిటి తన జీవిత లక్ష్యం? శూన్యంగా చూశాడు విశ్వం.

"మీకు ప్రత్యేకించి ఏమీ లక్ష్యం లేదన్న మాట?"

తను పూర్తిగా పరాభవం పొందాడు. కాని పరాభవం కంటె కూడా తన నిష్ప్రయోజకత్వం అతన్ని బాధపెట్టింది. ఇటువంటి ప్రశ్నే తనలో ఎప్పుడూ ఉదయించలేదు.

ఎంత భావదారిద్ర్యం!

ఉపన్యాసకుడు విశ్వం భుజం తట్టి అన్నాడు. "జరిగిన కాలంలో మీరేమీ చెప్పతగిన పని చేసిఉండక పోవొచ్చు. పరవాలేదు. రాబోయే రోజుల్లో మీరు తోటివాళ్లు నిర్విణ్ణులయే మహాకార్యాలు చెయ్యవచ్చు. కావలసిందల్లా చెయ్యాలనే ఉత్సాహం, కోరిక ఉండటం. జీవితంలో ఒక లక్ష్యాన్ని ఏర్పరచుకోవటం. గమ్యం చేరుకోటానికి నిజాయితీతో ప్రయత్నించటం, అంతే."

"కృతజ్ఞుడిని" అన్నాడు విశ్వం.

"మీకేమైనా మాట్లాడాలిసిన విషయాలుంటే తరవాత మిమ్మల్ని కలుసుకుంటాను. ఇదిగో నా అడ్రసు." ఒక చిన్న కార్డు విశ్వానికిచ్చాడు ఉపన్యాసకుడు. విశ్వం అది స్వీకరించి సెలవు తీసుకుని బరువుగా అడుగు వేసుకుంటూ పైదానందాటి బజార్లో ప్రవేశించాడు. ఇప్పు డతని మనసులో విచారం లేదు. తను త్వరలోనే మేల్కొన్నాడు. అసలు తన జీవితం ప్రారంభమయే తరుణంకూడా అదే. తన అస్తిత్వాన్ని తను సార్థకం చేసుకోగలడు.

బజార్లో నడుస్తున్నాడు విశ్వం. బజారంతా అతనికి కొత్తకొత్తగా కనిపించసాగింది ఆరోజున. ప్రతి వ్యక్తి శ్రమపడుతున్నాడు ధనసంపాదనకి. శ్రమకి తగిన ప్రతిఫలం మాత్రం అందరికీ ముట్టదు. చిన్న చిన్న దుకాణదారులు రోజంతా శ్రమపడి వస్తువుల అమ్మకంకోసం నానాబాధలూ పడుతూండటం తను చాలాసార్లు గమనించాడు. శక్తిలేని కొనేవాళ్ళు అతని కళ్ళలో ఎప్పుడూ మెదుల్తూనే ఉంటారు. ఏమిటి దీనికి విరుగుడు? ఆలోచిస్తున్నకొద్దీ అతను నిరుత్సాహ

పడ్డాడు. ప్రభుత్వాల్నే ఊపివేసేసమస్య అది. సామాన్యుడు తనేం చెయ్యగలడు?

"పాలిష్ వెయ్యమంటారా బాబూ బూట్లకి?" అడుగుతున్నాడు కుర్రాడు జాలిగా. తన కవసరం లేదు. కాని వాడికుంది. జాలివేసి, వెయ్యమని రెండు కాలిచ్చాడు.

ఇలాగే ప్రతివాళ్ళూ తనని ఏదో అభ్యర్థిస్తే? తను జమీందారు కాడు. దిగకుండానే లోతు తెలిసే విషయం ఇది.

జాలైతే తనకి పుట్టెడు ఉంది. ఆ మాటకొస్తే అందరికీ ఉంటుందేమో. కాని హస్తాలు శూన్యం.

సంజచీకట్లు అలముకుంటున్నాయి. తిరిగి తిరిగి విశ్వం తను ఎరిగిన బట్టల దుకాణంలోకి వెళ్ళాడు.

"ఏం కావాలండీ?"

విశ్వం సమాధానం చెప్పేలోపుగా వెనక నించి బతిమాలుతున్న స్వరం వినిపించి వెనక్కి తిరిగి చూశాడు మాసిపోయిన గడ్డంతో, చిరిగిపోయిన దుస్తులతో, రేగిపోయిన జుట్టుతో, గుంటలుపడిన కళ్ళతో ఒకవ్యక్తి కనిపించాడు. దీనాతిదీనంగా అతను ప్రాథేయపడుతున్నాడు.

"మూడు రోజుల్నించీ తిండి లేదండి. దయచేసి ఏమైనా ఇప్పించండి."

అతను అడుక్కుంటున్నా అభిమానం అతని ముఖంలో ప్రస్ఫుటమౌతూనే ఉంది.

విశ్వం అతనివైపు పరకాయించి చూశాడు. ఆ వ్యక్తికి అంగలోప మేమీ లేదు. బీదతనం మాత్రం మూర్తీభవించినట్లు ఉంది. ఎంతమంది లేరు అలాంటి వాళ్ళు? ఈ వ్యక్తి ప్రత్యేక మేమిటి? విశ్వానికి జాలికలగ లేదు.

"వెళ్ళు" అన్నాడు.

ఆవ్యక్తి వెళ్ళలేదు. మరింత ప్రాథేయపడసాగాడు. అడుక్కోవటం! పైగా బతిమాలుకోవటం! విశ్వానికి ఒళ్ళు మండింది.

"మనిషిని మనిషి అడుక్కోవట మేమిటయ్యా? అభిమానం లేదూ? ఏదైనా పని చేసుకోకూడదూ ఇలా ముష్టికోసం తిరక్కపోతే?" కర్కశంగా అన్నాడు విశ్వం.

"పని దొరక లేదండి" హీనస్వరంతో అన్నాడా వ్యక్తి.

"దొరక్కపోతే దొరికేచోటుకి వెళ్ళాలి."

"దయచేసి తమరేదైనా ఇప్పించండి."

తను ఇప్పించాలిట. తనదగ్గిర ఉద్యోగాలు కుప్పపోసి ఉన్నట్టు!

"చాల్లేవెళ్ళు" కసుక్కున్నాడతను.

దుకాణదారు కూడా వెళ్ళగొట్టటానికి సిద్ధమయాడు. ఆ వ్యక్తి నిర్లక్ష్యంగా వాళ్ళవైపు చూసి వెళ్ళిపోబోతూ విషాదంగా అన్నాడు.

"మీరు పని చూపించలేరని నాకు తెలుసు. అడుక్కుంటూ ప్రతిపూటా బతుకు వెతుక్కోకపోతే చావరాదా అని మీ అభిప్రాయం. అదే మంచిది అవును. కాని... కాని ఎవటివాడి ప్రాణం ఎంత చులకన! ఎంత చవక..."

దుకాణంలోని వాళ్ళందరూ స్తబ్ధులయారు. ఇతనెవడో మామూలు బిచ్చగాడిలా లేడు. స్వచ్ఛంగాకూడా మాట్లాడుతున్నాడు.

విశ్వం హృదయం ఆర్ద్రమైంది. తను మాటలు జారాడు. విసుక్కున్నాడు. ఏమీ చెయ్యలేకపోతే ఊరుకోవొచ్చు. కాని అతని హృదయం గాయపరిచాడు, కొంపతీసి అతను సూచించినట్లు ఏ అఘాయిత్యమో చెయ్యడుగద! లేనిపోనిది తన మెడకి చుట్టుకుంటుందా పాపం. కాని తనేం సహాయం చెయ్యగలడు. ఒకపూట తిండికి ధర్మం చెయ్యగలడు. తరవాత...

ఆ సమయంలోనే ఒక స్త్రీ దుకాణంలోకి వస్తోంది. ఆ అమ్మాయినికూడా అతను అడుగుతాడని చూశాడు విశ్వం. కాని తలెత్తికూడా చూడకుండా ఆ వ్యక్తి వెళ్ళిపోతున్నాడు. ముచ్చెమటలు పోశాయి విశ్వానికి. అతనిశరీరం కంపించింది.

"ఇదిగో. ఏమయ్యోయ్." అని కేక పెట్టాడు. అప్రయత్నంగా అతను వెనుదిరిగి చూశాడు. విశ్వం మళ్ళీ పిలిచాడు. అతను తటపటాయిస్తున్నాడు.

ఆ స్త్రీ దుకాణంలోకి వచ్చింది. విశ్వం అది గమనించలేదు. అతని దృష్టిఅంతా ఆవ్యక్తిమీదే ఉంది.

విశ్వం మనసులో ఏదో మెరుపులా మెరిసింది. ఒక్క మంచిపని...

తను ఇంతవరకు చెప్పదగిన మంచిపని ఒక్కటి కూడా చెయ్యలేదు.

ప్రాణం నిలపటం మంచిపనే కదూ!

విశ్వం ఇంకేమీ ఆలోచించలేదు. ఆ వ్యక్తిని మరోసారి పిలిచాడు. అతను ఏమనుకొన్నాడో గాని ముందుకినడిచి విశ్వందగ్గిర నిలబడ్డాడు. విశ్వం ట్రౌజర్ జేబులోంచి వందరూపాయల నోటు తీసి అతని కందిస్తూ అన్నాడు.

"ఇదిగో, తీసుకో, పని చూపించలేను, నిజమే. కాని ఈ వంద రూపాయలతో ఏ కిళ్ళీ దుకాణమో తెరిచి ఏదోవిధంగా పొట్టగడుపుకో వొచ్చేమో. ఏమంటావు?..."

ఆ వ్యక్తి తెల్లబోయాడు. దుకాణంలోనివాళ్ళందరూ ఆశ్చర్యంగా విశ్వంవైపు చూశారు. "వంద రూపాయలే!" అని గుసగుసలు విశ్వానికి వినిపించాయి. ఆ అమ్మాయి విశ్వంవైపు తలెత్తిచూసి, మళ్ళీ ఇంకోసారిచూసి అర్థంకానట్టుగా ముఖం పెట్టింది.

విశ్వం గర్వంగా నుంచున్నాడు. అమరావతి శివలింగంలా తను పెరిగిపోతున్నట్టనిపించిందతనికి. తన దగ్గరున్నవాళ్లందరూ మరుగుజ్జుల్లా అవుతున్నారు.

"తీసుకోవేం!" దర్పంగా అన్నాడు విశ్వం.

ఆ వ్యక్తి ఒక్కక్షణం విశ్వం కళ్ళలోకిచూసి తర్వాత చుట్టూచూసి "వొద్దులెండి" అనేసి గబగబ బయటికి నడిచిపోయాడు.

కొద్దిక్షణాలవరకూ ముందుకి జాపిన చేతిలోని వందరూపాయల నోటు రెపరెపలు చూస్తూ అలాగే ఉండిపోయాడు విశ్వం. అది స్వీకరించబడలేదు.

"అదేమిటండీ అంత మొత్తమా?" అన్నాడు దుకాణదారు, విశ్వంవైపు వింతచూపులు చూస్తూ.

విశ్వం ప్రత్యుత్తరం ఇవ్వలేదు.

"ఏం చూపించమంటారు?" వ్యాపారం విషయంలోకి దిగాడు దుకాణదారు.

"గాబర్డీన్ సూటింగ్ చూపించండి."

విశ్వంవైపు ఆ అమ్మాయి మళ్ళీ చూసింది. యథాలాపంగా అటువైపే చూసిన విశ్వం ఆమె ఉనికిని అప్పటికి గుర్తించాడు. ఎక్కడో చూసిన రూపం అని అతనిమనసులో లీలగా అనిపించింది. ఆలోచించగా జ్ఞప్తికివచ్చింది. తను ఇంటర్మీడియేటు చదువుతున్నప్పుడు కాలేజీకి వెళ్ళేసమయాల్లో స్కూల్ కి వెళుతూ ఆ అమ్మాయి తనకి అప్పుడప్పుడు ఎదురయేది! ఎవరో ఆమె! ఇప్పుడేం చేస్తోందో. పూర్వం తను చూసినప్పటికంటె ఇప్పుడు పొడుగెదిగింది. కొంచెం బొద్దుగాకూడా ఉంది.

బిల్లుచెల్లించి విశ్వం ప్యాకెట్ తీసుకుని బయటికి వచ్చాడు. అతని మనసులో మళ్ళీ తను ధర్మంచెయ్యబోయిన దృశ్యం మెదిలింది. అతనెందుకు తిరస్కరించాడు? భయపడిఉంటాడా? అంత మొత్తం అతనెప్పుడూ చూడలేదేమో? పోలీసులు లాక్కుపోతారనుకున్నాడేమో? తను కావాలని అందరిఎదటా ఇస్తున్నప్పుడు భయందేనికి? తను ఇవ్వాలిసినవిధంగా ఇవ్వలేదేమో ఒకవేళ? అంతకంటె తనేంచెయ్యగలడు. ఎవరూ చూడకుండా అతని చొక్కా జేబులో పెట్టాలా? బతిమాలి తీసుకోమని నచ్చచెప్పాలా? అవసరం ఉన్నవాడే బెదిరిపోతే తనసంగతేమిటి? ఏమైతేఏం, ఇప్పుడతను ఒకవేళ ఏ అఘాయిత్యం చేసినా తనకే బాధ్యత లేదు.

విశ్వానికి ఎందుకో సంతృప్తిగా లేదు. తనేదో పొరపాటు చేశాడేమో! తనలో బహుశా ఏదో లోపం ఉండిఉంటుంది. అకస్మాత్తుగా అతనికి ఒక విషయం తట్టింది. ఆ వ్యక్తిని ఎలాగైనా ఆ దీనావస్థనించి తప్పించి సహాయం చెయ్యాలనే దృష్టి తనలో లేదు. ఒక మంచి పనికోసం-ఒక ఘనకార్యం తనూ చేశాడనే మానసిక తృప్తికోసం తను బాహాటంగా అందరి ఎదటా తన ఔదార్యాన్ని ప్రదర్శించాడు! సిగ్గుచేటు!

విశ్వం ముఖం మలినమైంది. ఆ వ్యక్తి తనని చెప్పుతో కొట్టినా ఇంత బాధపడేవాడు కాదు తను.

మరో ఊహకూడా వెంటనే తట్టిందతనికి. ఆ అమ్మాయి ఈ ఆర్భాటమంతా చూసి ఏమనుకుందో! తను బాగా డబ్బుగలవాడని అనుకుని ఉంటుంది. ఆ గాబర్డీన్ సూట్ తనకోసం కాదని ఆమెకి తెలియదు. పాపం. ఆమె తనవైపు చూడటం తను కనిపెట్టకపోలేదు. తను ఫలానా అని ఆమెకి తెలుసో, తెలియదో!

ఉన్నట్టుండి విశ్వానికి ఓ అనుమానం కలిగింది. తను ఈ హడావిడంతా ఆమె దృష్టిని ఆకర్షించటానికి చేశాడని దుకాణంలోని వాళ్లు అనుకున్నారేమో! కొంపతీసి ఆ అమ్మాయికూడా అలా అనుకోలేదుగద!

విశ్వానికి ముచ్చెమటలు పట్టాయి. తను పొరపాటు చేశాడు. ఒకవేళ ఆ వ్యక్తి ఆ వందరూపాయల నోటు తీసుకుని ఉంటే ఉట్టి చేతుల్తో ఇంటికి వెళ్లవలసి వచ్చేది. ఇంట్లో అడిగితే ఏంసమాధానం చెప్పేవాడు? దానిమీద ఎంత గొడవ జరిగేది? తన పరిస్థితేమిటో వాళ్లకేం అర్థమవుతుంది? ఇంకా నయం! ఆ వ్యక్తి తనకి మేలేచేశాడు. ఛ, తను పొట్టి తొందరమనిషి!

## 6

రంగనాథంగారు ఇరవై ఏళ్ళు అఖండంగా హెడ్మాష్టరు గిరీ వెలిగించి రిటైరయ్యారు. ఆయనకి విశ్వం, పద్మ, గోపీ ముగ్గురే సంతానం. కిందటి మాఘ మాసంలోనే పద్మకి వివాహం జరిగింది ఆమె భర్త శ్రీనివాసరావు ఎం. బి. బి. ఎస్ ప్యాసై హౌస్ సర్జన్‌గా ఉండి ఆమధ్యనే హైదరాబాద్‌లో ప్రాక్టీసు పెట్టాడు. ఆనర్స్ చదువుతున్నప్పుడు విశ్వానికి అతని పరిచయం లభించింది. ఆ పరిచయమే తరవాత బాంధవ్యంగా మారింది.

ఆరోజున శ్రీనివాసరావు ప్రయాణం నిశ్చితమైంది. అనుకోకుండా పద్మకూడా అతనివెంట వెళుతోంది ఈసారి. పెళ్ళి అయిన తరవాత అత్తవారింటికి వెళ్ళటం ఆమెకిదే మొదటిసారి. ఎవరూ తోడు కూడా వెళ్ళటంలేదు. విశ్వాన్ని ఆహ్వానించాడు శ్రీనివాసరావు కాని "కాపరం పెట్టిం తరవాత చూడటానికి వస్తాలే" అన్నాడు విశ్వం.

బండి ఎక్కబోయేముందు తల్లిదండ్రులతోపాటు తనకి కూడా నమస్కారంచేసి పద్మ సెలవు తీసుకుంటూంటే విశ్వం హృదయం ద్రవీభూతమైంది. పద్మ తనకెప్పుడూ నమస్కారం చెయ్యలేదు ఇదివరదాకా. పద్మని కవ్వించి, నవ్వించి అల్లరిచెయ్యటం తనకి సరదాగా ఉండేది. అదికూడా ఉడుక్కోకుండా అంతకంటె ఎక్కువగా తనని కవ్వించేది. అకస్మాత్తుగా, తమ ఇద్దరిమధ్యా ఇన్నేళ్ళనించీ అణగి ఉన్న ప్రేమభావం పెల్లుబికింది. పద్మ ఈరోజున తనని గౌరవిస్తోంది. దాని జీవితంలో మరో అధ్యాయం ప్రారంభమైంది. కొన్ని క్షణాలు జీవితంమీద మహా ప్రభావం కలిగిఉంటాయి. ఈ దృశ్యం తన జీవితంలో ఎప్పుడూ మరవలేడు. నవ్వులాటకైనా పద్మని ఇక తను కవ్వించలేడు. వేళాకోళమైనా ఆమె చిన్నబుచ్చుకుంటే తన హృదయంలో మానని గాయం తగుల్తుంది. కొన్ని మైళ్ళదూరంలో, మరో వాతావరణంలో పద్మ పరిస్థితుల్ని సరిపెట్టుకుని జీవితం గడపాలి. తన అభిరుచుల్ని అవసరమైతే మార్చుకోటానికి సిద్ధపడాలి. ఆ క్షణంలో విశ్వం మనసులో వింతకోర్కె కలిగింది. పద్మకి జీవితకాలంలో తనేదైనా ఒక్క సహాయమైనా చెయ్యగలిగితే తన హృదయంలోని అవ్యక్తమైన ఏదో ఆరాటం. అస్పష్టమైనబాధ తగ్గి తనకి ప్రశాంతత కలుగుతుంది.

ఈ ఆలోచనరాగానే విశ్వానికి వెంటనే నవ్వకూడా వచ్చింది. ఆమెకి సహాయం చెయ్యాలనేకోరిక బాగానే ఉంది కాని ఆ అవసరం పద్మకి ఎందుకు కలగాలి!

దంపతుల్ని స్టేషన్‌దాకా సాగనంపటానికి విశ్వం, గోపీ స్టేషన్‌కి వెళ్లారు. శ్రీనివాసరావు ఎంతో హుషారుగా మాట్లాడుతున్నాడు. కాని విశ్వం మనస్సు అంత బాగా లేదు.

గంట మోగింది. గార్డు ఈలవేశాడు. జండా ఊపుతోంది. ఇంజన్ కేక వేసింది. రైలు కదలబోతోంది.

పద్మ కేదైనా ఇవ్వాలనిపించింది విశ్వానికి. పత్రికల కుర్రాడు ఇంతలో అటువైపు వచ్చాడు. ఏవో కొన్ని పత్రికలు కొని పద్మకిచ్చాడు.

"ఎందుకన్నయ్యా ఇవన్నీ?"

"కాలక్షేపం ఔతుందిలే, ఉండనీ."

ఆ ఇవ్వటంవెనకాల హృదయం మూగభాష ఇద్దరికీ అర్థమౌతూనే ఉంది.

రైలు కదిలింది.

"వొస్తాబాబూ, గోపీ," అంది పద్మ గాద్గదికంగా.

వాడికి హృదయంలో కెలికినట్టయింది. బెంగచూపులు చూశాడు. తనేదైనా తెలియక తప్పుచేస్తే, అమాయకంగా ఏదైనా అడిగితే "వెధవా, థర్డ్‌ఫారం వెలిగిస్తున్నావు గాని..." అని చనువుగా మందలించేవాళ్లు అక్కయ్యతప్ప ఇంకెవ్వరూ లేరని వాడికి తెలుసు. ఇంక అలా అనటానికి అక్కయ్యదగ్గర ఉండదు!

వాడి కళ్లల్లో నీళ్లు తిరిగాయి.

శ్రీనివాసరావు చెయ్యి ఊపాడు.

విశ్వం రుమాలు ఊపాడు.

క్రమంగా రైలు దూరమైంది.

గోపి చెయ్యిపట్టుకుని విశ్వం స్టేషన్‌బయటికి వచ్చాడు. ఇలాంటి వీడ్కోలు దృశ్యాలని తను పూర్వం "సెంటిమెంటల్ ట్రాష్" అని తోసేసేవాడు. ఈ రోజున అతని నేత్రాలు చెమ్మగిల్లాయి. అతనేమీ ఆలోచించటంలేదు. హృదయం బరువుగా ఉంది.

మార్గమధ్యంలో ఒక్కసారిమాత్రం విశ్వం, గోపీ మాట్లాడుకున్నారు.

"అక్కయ్య మళ్ళీ ఎప్పుడు వస్తుందన్నయ్యా?" అన్నాడు గోపి.

"తొందరగానే వొస్తుంది." అన్నాడు విశ్వం. ఆ సమాధానం వాడికి తృప్తిగాలేదు. ఉండదని విశ్వానికీ తెలుసు.

"ఈ దేశంలో మగవాడు తన ఆధిక్యత రుజువు చేసుకోటానికి ప్రయత్నిస్తాడు. బహుశా ఎక్కడైనా అంతేనేమో. తేడా అనేది ఉంటే తరతమాల్లోనే! కాని, శ్రీనివాసరావు మంచివాడే" అని సమాధాన పడ్డాడు విశ్వం.

ఇంటికివచ్చి భోజనాదులు ముగించుకుని తీరిగ్గా పడకకుర్చీలో పడుకుని పేపరుచూసి, చేసేపనిలేక నిద్రపోవాలని కళ్లు మూసుకున్నాడు విశ్వం. కాని నిద్రవచ్చే సూచన లేదు. సరదాగా మాట్లాడుతూ కాలక్షేపం చెయ్యటానికి పక్క లేదు. గోపి ఎప్పుడూ తోటపిల్లలతో ఆడుకుంటూనో, చదువుకుంటూనో ఎక్కడో ఉంటాడు. ఇక తనకి కావలసినంత తీరిక. ఫలితాలు తెలిసి ఉద్యోగం ఏదైనా వచ్చేదాకా రోజంతా విశ్రాంతే. ఈ సమయం వృథా పోనీయకుండా ఏదైనా చెయ్యాలని అనుకున్నాడతను. వెంటనే "జీవిత లక్ష్యం" సంగతి జ్ఞాపకం వచ్చిందతనికి. తన జీవితలక్ష్యం ఏదైతే బావుంటుంది?

బొమ్మలు వెయ్యటంలో తనకి అభిలాష కొస్తో కూస్తో ఉంది. స్కూల్లో డ్రాయింగు పరీక్షల్లో తనకి మంచిమార్కులే వచ్చేవి. పక్షులూ, జంతువులూ తనకి కరతలామలకం. మనుషుల బొమ్మలుకూడా కొంచెం జాగ్రత్త తీసుకుంటే బాగానే వెయ్యగలడు. చిత్రలేఖనం కృషిచేస్తే తను అందులో పేరు సంపాదించుకోగలడేమో! కాని దానికి ఎంతో శ్రమా, ఓపికా, కాలమూ కావాలి. తన కెటువంటి ఉద్యోగం వస్తుందో! నేర్చుకుని కూడా బొమ్మలు వేసుకోటానికి తీరిక దొరకని ఉద్యోగమైతే ఆశాభంగం అవుతుంది. అయినా తను నిరుత్సాహపడకూడదు సాధకం చెయ్యాలి. తను గొప్ప చిత్రకారుడు కావాలి.

ఈ ఊహ కలగగానే దానిని ఆచరణలో పెట్టాలనే సంకల్పం దృఢమైందతనికి. తన అదృష్టంకొద్దీ ఆ ఊళ్ళోనే ప్రఖ్యాత చిత్రకారుడు ఒకాయన ఉన్నాడు.

విశ్వం ఆలస్యం చెయ్యకుండా ఆ సాయంకాలమే ఆయన దగ్గిరికి బయలుదేరి వెళ్ళాడు. ఆ చిత్రకారుడు అదృష్టవశాత్తూ తన స్టూడియోలోనే ఉన్నాడు ఆ సమయంలో. చిత్రలేఖనంలోని తన ఉబలాటమూ, కుతూహలమూ ఆయనకి తెలియచెప్పి సహాయం అర్థించాడు.

ఆ చిత్రకారుడు విశ్వాన్ని పరిశీలనగా చూసి ఒక తెల్లకాగితం, పెన్సిలూ ఇచ్చి అన్నాడు.

"కోడిగుడ్డు బొమ్మ వెయ్యండి."

విశ్వం క్షణంలో గీకేశాడు.

"సున్నా చుట్టండి."

విశ్వం సున్నా అనబడేది చుట్టాడు.

"ఈ రెంటికీ తేడా ఉన్నట్టులేదా!" అన్నాడు చిత్రకారుడు నవ్వు పెదవులోంచి చిందిస్తూ. విశ్వం చిన్నబుచ్చుకున్నాడు. అతనలా తనని పరీక్షిస్తాడని తను అనుకోలేదు.

"ప్రాక్టీసు చెయ్యలేదు గదండీ" అన్నాడు.

"నా సలహా విని మీ రీ ప్రయత్నం విరమించుకోండి."

"ఎందుకండీ?"

"మీకు బొమ్మలు వెయ్యటం రాదు."

అలా ఆయన కుండబద్దలు కొట్టినట్టు నిర్మొహమాటంగా అంటే విశ్వానికి ఆశ్చర్యంతో బాటు ఆగ్రహంకూడా కలిగింది.

"నేను వేసే బొమ్మలు మా డ్రాయింగ్ మాస్టరుగారు మెచ్చుకున్నారండీ." అన్నాడు తమాయించుకుని.

"నేను డ్రాయింగ్ మాస్టర్ని కాదుగా."

"ప్రాక్టీసు చేసినా రాదంటారా?"

"ఉహుఁ. మీకు ఫ్రీ హాండ్ లేదు."

విశ్వం ముఖంలో నిరాశ తాండవించింది. 'ఇకేమిటిలా నిరుత్సాహపరుస్తాడేం ఈయన' అనుకున్నాడు.

"ఏదైనా బొమ్మ వేస్తాను, చూస్తారా?"

చిత్రకారుడు అయిష్టంగా ముఖం పెట్టాడు. అది అంగీకారమే ననుకుని విశ్వం కోయిలబొమ్మ గీశాడు.

"ఎలా ఉందండీ?" అని ఆశగా ఆయనవైపు చూశాడు, తప్పక మెచ్చుకుంటాడని భావిస్తూ.

అతను చిన్నగా, పొడిగా నవ్వాడు.

"చిత్రలేఖనం బదులు మరేదైనా చేస్తే మీ కాలం వృథా కాదు." అన్నాడు.

"అంతేనా?"

"మీమీద నాకేమీ ద్వేషం లేదు. ఫ్రీహాండ్ లేదని చెప్పాను, అంతే."

"మనిషి పుట్టగానే అక్షరాలు రాయటం రాదు కదండీ."

"అవును. ఇప్పుడా సంగతెందుకు?"

"నేర్చుకుంటే ఏదైనా వొస్తుందని చెబుతున్నాను. కాపీలు రాసినవాడు గుండ్రటి అక్షరాలు రాస్తున్నాడు. మీరైనా ఉన్నట్టుండి అమాంతంగా ఈ విద్య మీకు వొచ్చని తెలుసుకున్నారనుకోను."

"నన్ను మీరపార్థం చేసుకుంటున్నారు."

"అయితే క్షమించండి. కాని నా మాటలు నిజమని మీకు రుజువు చెయ్యగలను. సెలవు."

ఆయన ప్రత్యుత్తరానికి ఎదురు చూడకుండా విశ్వం చరచర వెళ్ళిపోయాడు. ఆ నాటినించీ అహోరాత్రులు శ్రమపడి, పుస్తకాలు చదివి తెలుసుకుని, అభ్యాసం చేసి రేఖాచిత్రాలు సునాయాసంగా గియ్యటం నేర్చుకున్నాడు. స్వశక్తిమీద అతనికి నమ్మకం ఏర్పడ్డది.

ఓ రోజు సాయంత్రం మళ్ళీ ఆ చిత్రకారుడి దగ్గిరికి వెళ్ళాడు.

"మళ్ళీ వచ్చారేం?" అన్నాడాయన విశ్వాన్ని గుర్తుపట్టి.

"శిష్యరికంకోసం కాదులెండి; రుజువుకోసం." అనేసి కాగితం ఆయనముందు పెట్టి ఓ సున్నా గీశాడు.

"ఇదిగో మీ సున్నా. ఇంకా కొన్ని కావాలా? ఒకటి, రెండు, మూడు—" చిన్నవీ, పెద్దవీ వరసగా కొన్ని సున్నాలు గీశాడు విశ్వం. ఆయన ఆశ్చర్యంగా వాటివైపు చూశాడు.

"అలా తెల్లబోకండి మరి. నాకు ఫ్రీ హాండ్ లేదుగా." వ్యంగ్యంగా అనేసి వెళ్ళిపోబోయాడు విశ్వం. తటాలున చిత్రకారుడు అతని బుజంమీద చెయ్యేసి ఆపాడు. చిరునవ్వు నవ్వాడు.

"థేంక్స్" అన్నాడు.

విశ్వంకోపం ఇంకా పోలేదు.

"సెలవిప్పించండి" అనేసి వెళ్ళబోయాడు.

"నిన్ను ఆశీర్వదిస్తున్నాను." అన్నాడాయన. విశ్వం వెళ్ళలేకపోయాడు. ఓటమిని అంగీకరించి తనని ఆశీర్వదించిన అతని సహృదయత్వం విశ్వంకాళ్ళకి బందాలు వేసింది.

"తొందరపడి ఆవేశంగా మాట్లాడాను. క్షమించండి."

"ఫరవాలేదు. నా దగ్గిర తెలుసుకోవాలిసింది ఏదైనా ఉంటే నీ ఇష్టం వచ్చినప్పుడు నిరభ్యంతరంగా రావొచ్చు. చాలా సంతోషిస్తాను." అన్నాడు చిత్రకారుడు. అతని హృదయ వైశాల్యం విశ్వంలో భావోద్రేకం కలిగించింది.

"మహద్భాగ్యం." అన్నాడు.

"వెళ్ళిరా ఇంక." సెలవిచ్చాడు చిత్రకారుడు.

తేలికపడ్డహృదయంతో విశ్వం సెలవుతీసుకున్నాడు. కాఠిన్యం వెనకాలనే ఎంత మృదుత్వం ఉంటుంది! అదే ఆ కళాకారుడి సందేశం అనిపించింది విశ్వానికి.

## 7

నవ్యనాటకసంఘం అనే సంస్థకి ఆ రోజున ప్రారంభోత్సవం జరుగుతోంది. దానికి కార్యదర్శి రంగారావనే యువకుడు. స్కూల్ టీచర్. అతను

విశ్వంతో ఎస్.ఎస్.ఎల్.సి. దాకా కలిసి చదివాడు. తరవాత విశ్వం కాలేజీ చదువుకీ, రంగారావు సెకండరీ ట్రయినింగ్ కీ వెళ్ళారు. అయినా ఇద్దరిదీ ఒకే ఊరు కావటంవల్ల తరుచు కలుసుకుంటూ తమ స్నేహాన్ని వర్ధిల్ల చేసుకుంటూ వచ్చారు. రంగారావు బాగా పాడగలడు. అతనికి నాటకాలంటే మొదటి నించీ సరదా. తోటివాళ్ళని కొందర్ని కూడగట్టుకుని నాటక సంఘం స్థాపించాడు. విశ్వానికి నాటకాలలో అంత అభిరుచి లేదు. అయినా రంగారావు ప్రోద్బల ప్రోత్సాహాలవల్ల సంఘంలో అతను కూడా సభ్యుడయ్యాడు. ప్రారంభోత్సవానికి వచ్చేవరకూ సంఘంలోని ఇతర సభ్యుల్ని గురించి విశ్వానికేమీ తెలియదు. ముఖ్యసభ్యుల్ని రంగారావు అంతకి కొంచెం ముందే పరిచయం చేశాడు.

పెద్దల ఉపన్యాసాల తరవాత ముఖ్యసభ్యులు కొందరు ప్రసంగాలు చేశారు. కళామయ జీవితానికి ఆ రోజున తమని అంకితం చేసుకుంటున్నామనీ, కళని ఉద్ధరించటమే తమ జీవితాశయమనీ అందరూ ఉద్ఘాటించారు.

తరవాత వినోదవిజ్ఞానదాయకమైన కార్యక్రమం ప్రారంభమైంది. అందులో మొదటి అంశం రంగారావు గానం.

అతను శ్రావ్యంగా పద్యాలు పాడుతుంటే సభికులు తన్మయులై వింటున్నారు. తనకి పద్యం పాడటం రానందుకు విశ్వం ఆక్షణంలో మిక్కిలి విచారించాడు. మంచి పాట విన్నప్పుడు అనుకరించాలనే తన అభిలాష ఈ జీవితంలో తీరదు. తను ఆ విషయంలో చేసిన వివిధ ప్రయత్నాలు గుర్తొచ్చాయి విశ్వానికి. తన స్వరం తనకే అసహ్యంగా వినిపించేది. ఓసారి బీచివొడ్డున ఒంటరిగా ఉన్నప్పుడు భావావేశంతో తను గొంతెత్తి ఏదో పద్యం రాగయుక్తంగా అనబోయినప్పుడు తన స్వరం సముద్రపు ఘోషతో, రైలుబండి ఇంజను కేకతో తులతూగి చుట్టుపక్కలవాళ్ళకి భయకారణం కావటం తనెప్పుడూ మర్చిపోలేడు. రంగారావు ఒకసారి ఏ పాటవిన్నా తుచ తప్పకుండా అదే వరసన సాహిత్యంతోసహా మళ్ళీ అనగలడు. రంగారావుమీద తనకి కొంచెం అసూయ జనిస్తున్నట్టు పసికట్టి విశ్వం నవ్వుకున్నాడు. తను ఆనర్స్ పరీక్ష బాగా రాశాడని విన్నప్పుడూ, తన బొమ్మలు చూసినప్పుడూ రంగారావులో కలిగిన ఈర్ష్యాభావం తను గ్రహించకలిగాడు. అయితే ఇలాంటి భావాలకి విలువ ఇవ్వటం అనవసరం. ఈర్ష్య అనటం కంటె అసంతృప్తి అనటం సముంజసం. అవతలివాడికి ఉందని ఏడవటం ఈర్ష్య. తనకి లేదని విచారించటం అసంతృప్తి. చాలా మంది మనుషులు బహుశా ఈ రెండో తరగతికే చెందుతారు. ఈ భేదం గమనిస్తే మనుషుల్ని ఇంకా బాగా అర్థం చేసుకోటానికి వీలుంటుంది.

విశ్వం ఇలా ఆలోచిస్తుండగా రెండో అంశం ప్రారంభమైంది వెంకటేశ్వరరావు అనే నటుడు నటనలోని వివిధ అంశాలను సోదాహరణంగా వివరించి చివరికి ఏకపాత్రాభినయం చేసి ప్రేక్షకుల మన్ననల్ని అందుకున్నాడు.

ఆ తరవాతదే విశ్వం ప్రోగ్రాం. "మానవత్వం" అనే పేరుతో అతను ఒక చిన్న గేయం గానం చేశాడు. రాగం జోలికి పోకుండా ఆవేశంగా చదువుతూ తన్మతానే మర్చిపోయి అక్కడక్కడ చిన్న వ్యాఖ్యానాలు కూడా చేశాడు. చివరికి—

అనిమిషత్వం నా ఆశ

మానవత్వం నా శ్వాస

అనే పంక్తులు ఉద్రేకంగా హెచ్చుస్థాయిలో అని కూర్చున్నాడు. సభికులు చప్పట్లు కొట్టారు.

కార్యక్రమం అయిపోగానే చాలామంది విశ్వం గేయాన్ని ప్రత్యక్షంగా మెచ్చుకుని అతనిని అభినందించారు. విశ్వం వాళ్ళ మెచ్చుకోలుకి సంతోషాశ్చర్యాలు పొందాడు. తను అప్పుడప్పుడు గేయాలు రాసేవాడే. కాని ఇంతవరకు ఒక్క గేయం కూడా ప్రచురించలేదు. ఏదో రాయాలని అనిపించినప్పుడు కూర్చుని నాలుగు పంక్తులు రాసేవాడు. అవి ఇతర్లు మెచ్చుకుంటారో లేదో అనే ఊహ అతని కెప్పుడూ రాలేదు. ఒక్కసారిగా అందరూ తనని ప్రశంసించటంవల్ల తబ్బిబ్బయిపోయాడు. కృతజ్ఞత చెప్పాలనే సంగతి కూడా అతనికి తట్టలేదు. రంగారావు తన గేయాలు కొన్ని వినటం, ఏదో ఒకటి ప్రారంభోత్సవ సమయంలో చదవమని బలవంతం చెయ్యటం అతను గుర్తుచేసుకొని రంగారావుకి కృతజ్ఞత చెప్పాడు.

ఆ సమయంలోనే ముఖ్యసభ్యులు కొందరు విశ్వం చుట్టూ చేరారు.

"రంగారావు గారూ, విశ్వంగారిచేత మంచి నాటకం ఒకటి రాయించాలి మీరు" అన్నాడు ఒక సభ్యుడు.

"అందులో మంచి గేయాలు తప్పకుండా ఉండాలి."

మరో సభ్యుడు తన అభిప్రాయం వెలిబుచ్చాడు.

"థాంక్స్—కాని నాకు నాటకాలు రాయటం రాదండీ" అన్నాడు విశ్వం.

"మేం నమ్మంలెండి."

"సభ్యుడివి. నువ్వే తప్పించుకోవాలంటే ఎలా?" అన్నాడు రంగారావు.

"తాహతుకి దాటిన పనులు నెత్తినేసుకుంటే ఏమవుతుందో తెలుసా?"

"అదంతా మాకు వొదిలెయ్యి."

"నాటక సంఘం నాలుగు కాలాలపాటు వర్ధిల్లాలని లేదా?"

"వంటిసాకులు చెప్పకు. నువ్వు తలుచుకుంటే రాయగలవు. అంతే." అన్నాడు రంగారావు. అందరూ అమాటే సమర్థించారు. విశ్వానికి మాత్రం గుండెల్లో గాయిపడ్డది. తనెప్పుడూ నాటకం కాదు గదా కథ కూడా రాయలేదు. ఏదో చెత్తరాసి వాళ్ళ మీదా, ప్రజల మీదా రుద్దితే ఫలితాలు సంగతి అలా ఉంచి తనకే అపచారం చేసుకున్నవాడవుతాడు. ఏం చేయాలో అతనికేం తోచలేదు. రంగారావుతో ఈ విషయం గురించి తరవాత రెండు మూడుసార్లు ముచ్చటించాడు. అతను ఉన్న సంగతి వివరం చేశాడు.

"ఒరే విశ్వం, మనకి నాటకాలు సరైనవి ఎక్కువలేవు. ఉన్నవి కూడా పాతవి" ఉద్యోగ విజయాలు"లాంటివి మనం వెయ్యబోవటం లేదు గదా! నాటక సంఘం శ్రేయస్సు కోరి నువ్వు నీచేతనైనంతలో ఏదైనా రాసివ్వు, బాగుంటే వేద్దాం."

ఇక విశ్వం ఏమీ అనలేకపోయాడు. ఆలోచించి సాంఘిక నాటిక ఒకటి రాసిచ్చాడు. అందరూ 'ఫస్టుగా ఉంద'న్నారు. రిహార్సల్స్‌కి వొచ్చిసూచనలిస్తూ ఉండమని విశ్వాన్ని అడిగాడు. విశ్వం అలాగేనన్నాడు కాని వెళ్ళటానికి అతనికి మనసొప్పేదికాదు. ఈ నాటకాల గొడవల్లో పడితే తన చిత్రకళోపాసన పూర్తిగా దెబ్బతింటుంది. చిత్రకళే తన లక్ష్యం.

ఒకరోజు రంగారావు మరీబలవంతం చెయ్యటం వల్ల ఆ సాయంత్రం రిహార్సలుకి వెళ్లాడు.

బాన్లో ఓ మూలగది అద్దెకి తీసుకుని 'నాటక సంఘం' అని బోర్డుకట్టారు. ఆ గదిలోని వాతావరణం చూసేసరికి విశ్వానికి చిరాకు వేసింది. ఉన్న సామాను చిందరవందరగా వుంది. కొందరు బీడీలు, మరికొందరు సిగరెట్లు తాగుతూ గది పొగతో నింపి కాల్చి వేసిన పీకలు గదిలోనే పారేస్తున్నారు. సభ్యులలో కూడా ఒక క్రమశిక్షణ లేదు. ఎవడి ఇష్టం వచ్చినట్లు వాడు ప్రవర్తిస్తున్నాడు. తబలా ఒకపక్కన మోగుతూనే ఉంది సభ్యులు మాట్లాడుతూనే ఉన్నారు.

"హీరోయిన్ ఎవరు వేస్తున్నారు?" అన్నాడు విశ్వం.

"వసంత అనే అమ్మాయి. అందాల బరిణలే. చూస్తే గుమ్మయిపోతావు. 'ఒక్కనవ్వే పలు వజ్రవైదూర్యాలు' అన్న కవి ఈవిడని చూశే రాశాడా అనిపిస్తుంది. ఆ కళ్లూ, ఉంగరాల జుట్టూ, వాలు జడా కపోలాలూ...ఓహో!"

అతని ధోరణి మధ్యలోనే ఆపి, "నువ్వు కూడా కవివా ఏమిట్రోయ్?" అన్నాడు విశ్వం.

"ఆ పిల్లని ఒక్కసారి చూస్తే కవిత్వం సురగులు కక్కుతూ పరుగులు తియ్యదూ?"

"అదేం అలంకారం, మహాశయా?" అన్నాడు ఒక నటుడు.

అందరూ గొల్లుమన్నారు.

"నీకు పెళ్లయిందికదురా?" అన్నాడు విశ్వం.

"అయితే ఏమండీ, రసపాయి మన రంగారావు." అన్నాడు ఒక సభ్యుడు. అందరూ మళ్ళీ గొల్లుమన్నారు.

"జాగ్రత్త రంగారావు. చెయ్యి పట్టుకు నేవు. కఠోరాణి వజ్రాదపి..."

"స్వానుభవమా స్వామీ?" అన్నాడు రంగారావు.

విశ్వం ఈ సంభాషణకి విసుక్కున్నాడు. విషయం తప్పిస్తూ అన్నాడు.

"ఆమె బాగా నటించగలదా?"

"పిచ్చివాడా? నీకు బొత్తిగా లోకజ్ఞానం లేదు. అందమైన ఆడది నటించడ మెందుకోయ్. స్టేజిమీద నిలబడితే చాలదూ? నోళ్ళు తెరుచుకుని చూడరూ జనం?"

"జనం సంగతి కాదు. ఆమె నటన సంగతి అడుగుతున్నాను."

"నాకు బాగానే ఉంటుంది ఆమె నటన."

"ఏమండీ డైరెక్టర్ గారూ?"

"గొప్పగా నటిస్తుందండీ. మొదటి నాటకంతోటే ఆమె సినీఫీల్డులో చేరిపోతుంది లెండి. అలాంటి వాళ్ళు నాటకాల్లో 'రాట్' అవుతారా?"

విశ్వం కొంచెం ఆశ్చర్యంగా అతనివైపు చూశాడు.

"నాటకాలు వెయ్యటం 'రాట్' కావటమనా మీ అభిప్రాయం? ప్రారంభోత్సవసమయంలో నాటకకళనిగురించి గొప్పగా మాట్లాడారే!"

"నా అభిప్రాయం కాదు. ఆమె దృక్పథం అదే ఐ ఉంటుంది."

"సినిమాల్లో చేరితే అంత నాజూకుగా ఉండదు లెండీ." అని విచారించాడు ఒక నటుడు.

"ఎందుకండీ?" అన్నాడు చిరునవ్వుతో మరొకడు.

"తెలిసియు దెలియని నరుదెల్ప బ్రహ్మదేవుని వశమే!"

"కవిచౌడప్ప శతకంలోని పద్యం కాదూ?"

"చంద్రరేఖావిలాపంలోదైతే మరీ రంజుగా ఉంటుంది."

"ఒరు లేయవి యొనరించిన నరవర..." అని భావగర్భితంగా తలూపాడు మరొకడు.

వాళ్లవైపు జుగుప్సతో చూశాడు విశ్వం.

"ఆమె ఇవాళ రిహార్సల్ కి వొస్తుందా?"

"ఎందుకురాదు? డబ్బిస్తున్నాంసార్."

"ఎవరైనా త్వరగా రమ్మని హెచ్చరించివస్తే బావుంటుందేమో. త్వరగా రిహార్సలు మొదలుపెడితే పెందరాళే వెళ్ళిపోవొచ్చు." అన్నాడు విశ్వం.

"అందుకే కదండీ నటేశ్వర్రావుగారు వెళ్ళారు. మరొకరు వెడితే ఆయన ఒప్పుకోరు."

"ఏం?" అన్నాడు విశ్వం అర్థంకాక.

"అదంతే లెండి. ఏం రంగారావుగారూ?"

రంగారావు 'హుఁ' అని ముఖం చిట్లించుకున్నాడు.

"నటేశ్వర్రావుకి ఎన్నిసార్లో చెప్పాను — కొంచెం జాగ్రత్తగా ఉండమని. ఎప్పుడో గాజుల చెయ్యి చెంపకుపరంబు కాకతప్పదులే."

అందరూ నవ్వారు.

"ఆమె రేటెంత?" అన్నాడు విశ్వం.

అందరూ ఒక్కసారి ముఖముఖాలు చూసుకున్నారు. వాళ్ల ముఖాల్లో ఆశ్చర్యం తాండవించింది. వాళ్లలా ఎందుకు చూస్తున్నారో విశ్వానికి తెలియలేదు.

"ఏమిటో అనుకున్నాను, నువ్వూ రసికుడివే." అని రంగారావు నవ్వాడు.

"ఏమిటి నువ్వనేది?"

"ఓయి మహానుభావా, ఆమె రేటెంతో ఇంతవరకూ తేలకనే చస్తున్నాం. కొంచెం హైక్లాసల్లే ఉంది."

"అసలామె అటువంటిదికాదేమోనండీ. చదువుకుంది కూడా."

"అవన్నీ తీసి అవతలపెట్టండి. అది వంశపారంపర్యం స్వామీ."

విశ్వానికి అర్థమైంది. 'ఛీ' అనుకున్నాడు. తన ప్రశ్న ఎంత తుచ్ఛంగా అర్థం చేసుకున్నారు. ఆ రెండో అర్థంలోనే వాళ్ళెందుకు తీసుకోవాలి. వాళ్ళ మనస్సులన్నీ కల్మషపూరితాలు. ఇదా వీరి కళారాధన. నాటక సంఘంట! వెంటనే రాజీనామా పారెయ్యాలనిపించింది విశ్వానికి. కాని అంతమందిలో ఆ పనిచేసి గొడవపడదలచుకోలేదు. రంగారావులో కూడా ఇంత నీచత్వం ఉందనుకోలేదు. కళాకారుడే. ఏం లాభం? ఒక వ్యక్తిని పరోక్షంలో చులకన చెయ్యడం ఘనకార్యమా? ఇంతమంది నాటక కళోద్ధారకులు ఇక్కడ కూడి చేసే పని అదేనా?

ఆమె ఎటువంటిదైనా కావొచ్చు. కాని ఆర్టిస్టు. ఆ గౌరవం ఇవ్వలేనివాడు ఆర్టిస్టు అనిపించు

ఉంటాడా? అందరూ చదువుకున్నవాళ్లే, మాటల్లో మాత్రం సభ్యత ఎక్కడా కనిపించదు. విశ్వానికి అక్కడ ఉండే బుద్ధిపుట్టలేదు.

"వెడతాను రంగారావు. తరవాత ఎప్పుడైనా వొస్తాలే" అన్నాడు మర్యాదకి.

అదే సమయంలో నాయికపాత్ర నిర్వహించే నటీమణి లోపలికి అడుగుపెట్టింది. "ఆమె వొచ్చిందోయ్. కాసేపు కూర్చునిపోదురుగానిలే" అని, ఆమె వైపు తిరిగి ఆహ్వానించాడు రంగారావు "రండి. రండి."

అందరూ ఆప్యాయంగా పలకరించారు.

"ఆలస్యమైందేమండీ?"

"ఒంట్లో కులాసాగా ఉందా?"

"రారేమో అనుకున్నాం."

కుశలప్రశ్నలు వెయ్యసాగారు. ఆమె కొంచెం ముభావంగా సమాధానాలు చెప్పింది. రంగారావు విశ్వాన్ని ఆమెకి పరిచయం చేశాడు.

"వీరే మన నాటిక రచించినవారు. విశ్వేశ్వరరావు. బి. ఏ. ఆనర్స్."

"నమస్తే. ఇంకా ఆనర్స్ కాలేదులెండి."

అని చిరునవ్వుతో ఆమె ముఖంలోకి చూసి అదిరిపడ్డాడు విశ్వం.

వసంత అంటే ఆమేనా? ఆరోజున గుడ్డలకొట్లో తనకి కనిపించింది. అనేకసార్లు స్కూల్‌కి వెడుతూ తనకి ఎదురైంది.

"నమస్తే" అంటూ వసంత విశ్వం ముఖంలోకి చూసి ఏదో అనబోయి మళ్ళీ మాట్లాడకుండా ఊరుకుంది. ఆమె ముఖంలో కూడా ఆశ్చర్యం ప్రతిఫలించటం విశ్వం కనిపెట్టాడు.

రిహార్సల్సు ప్రారంభమయాయి. ఆమె చక్కగా పాడుతుందని మెచ్చుకున్నాడు విశ్వం. ఆమె నటననీ, పాటనీ పదేపదే మిగతావాళ్లందరూ పోటీలుపడి మెచ్చుకున్నారు. అయితే ఇదంతా రోజూ మామూలేగనుక వాళ్ల పొగడ్తలకి ఆమె ఏమీ ఉబ్బిపోలేదు. విశ్వం అతిగా మాట్లాడక "బాగా పాడారండీ" అనీ "బాగా నటించారండీ" అన్నప్పుడు ఆమె నిజంగా సంతోషించింది.

ఆరోజుకి రిహార్సల్సు చాలించారు. బాగా చీకటి పడ్డది. వెంకటేశ్వర్రావు తోడువస్తానన్నాడు.

"అక్కర్లేదులెండి. మీరు మళ్లీ వెనక్కి ఇంత దూరం రావటం శ్రమ." అంది వసంత.

"నాకేం శ్రమలేదు."

"నేను బజారువైపు వెడుతున్నాను. రిక్షా పంపిస్తాలెండి, పోనీ" అన్నాడు విశ్వం.

"నేనూ బజారువైపే వెళ్ళాలి. దారిలో కనిపిస్తే రిక్షా చేసుకుంటాను. పదండి, పోదాం" అంది వసంత.

వెంకటేశ్వర్రావు విశ్వంవైపు కొంచెం ఉగ్రంగా చూశాడు.

విశ్వం ముందు నడుస్తున్నాడు. వసంత కొంచెం వెనకగా, పక్కగా నడుస్తోంది. ఇద్దరిమధ్యా నిశ్శబ్దం ఆవరించింది. ఏదో మాట్లాడాలనిపించింది విశ్వానికి. కాని అతనికేం మాట్లాడాలో తోచలేదు. ఆమే పలకరించింది.

"నాటిక రాసింది మీరేనంటే ఆశ్చర్యపడ్డానండీ" అంది.

"ఏం నాముఖంలో ఆకళేమీ కనిపించటంలేదా?" అన్నాడు చిన్నగానవ్వి.

"అబ్బే అదికాదండీ. మిమ్మల్ని ఎక్కడో ఇదివరకు చూశానండీ—ఈమధ్యనే"

"ఎక్కడ?"

"జ్ఞాపకం రావటంలేదు. అంతకిముందు కూడా చాలాసార్లు చూశాను. నేను స్కూల్‌కి వెడుతున్నప్పుడు మీరు..."

"కాలేజీకి వెడుతూ కనిపించేవాడిని కదూ?"

"అవును. మీరు కూడా నన్ను చూశారన్నమాట."

"చూడకేం?"

"ఆఁ—! ఇప్పుడు జ్ఞాపకం వచ్చిందండి. మీరు ...మీరు..."ఆమె ఆగింది.

"ఒక బట్టల దుకాణంలో కనిపించాను కదూ?"

"అవును. కాని అదేమిటండీ, ఎవరైనా అడుక్కునేవాళ్లకి వందరూపాయలు ఇస్తారా? భలేవాళ్లేనే."

"ఏం, ఇవ్వకూడదా?"

"మీకు బాగా డబ్బున్నట్టుంది."

"లేకపోతే ఇవ్వకూడదా?"

"అని కాదు. ఎక్కడినుంచి వస్తుంది?"

"నేను గొప్పవాడిని కాదు, నిజం చెప్పాలంటే."

"అదే నేనూ అనుకున్నాను."

"ఎలా అనుకున్నారు?"

"ధనవంతులైతే కారుండదూ? దుకాణం బయట కారేమీ లేదుగా!"

"మీకు మంచి పరిశీలనాశక్తి ఉందండీ."

"ఈమాత్రం దానికే! పొగడవలు చుకుని పొగుడుతున్నారు."

"మిమ్మల్ని ఊరికే పొగిడితే నాకేం లాభం?"

"నేను బాగా నటించానని మీరు మనస్ఫూర్తిగా అనుకుంటున్నారా?"

"లేక పోతే అలా అనటానికి నాకేం అవసరం?"

"మీరు మెచ్చుకుంటే చాలా సంతోషం కలిగిందండీ. మీకు కోపంవస్తుందేమో గాని, మీ స్నేహితులు ముఖస్తుతికోసం అలా అంటారని వాళ్ల మాటల్ని బట్టే తెలుస్తుందండీ."

"వాళ్ళు నా స్నేహితులు కారు." అన్నాడు విశ్వం ముఖం చిట్లించుకుని, హేయభావంతో. వసంత ఆశ్చర్యపోయింది.

"అలాగా? అయితే నేనుపొరపడ్డాను, సుమండీ."

"రంగారావు ఒక్కడే నాకు స్నేహితుడు. రేపు మొహం వాచేట్టు వాడిని చివాట్లు పెడతాను." అన్నాడు విశ్వం కోపంగా.

"ఎందుకు?" అంది వసంత ఆశ్చర్యంగా.

విశ్వం తన పొరపాటు గుర్తించాడు. చప్పున అతనికి వసంత ఇంతకిముందు అన్న మాటలు గుర్తొచ్చాయి.

"ముఖస్తుతి చేస్తున్నందుకు."

"ఓ అదా!" అంది వసంత.

"మరేమి టనుకున్నారు?"

"ఏంలేదులెండి."

కొంచెంసేపు మౌనంగా నడిచారు ఇద్దరు. రిక్షా కనుచూపు మేరలో ఎక్కడా లేదు.

"ఈ నాటకంలో వేస్తున్నందుకు మీ రెంత తీసుకుంటున్నారు?"

"డబ్బా!" అంది వసంత.

"ఊఁ"

వసంత కొంచెం ఆశ్చర్యపడి అంది.

"నేను నాటక సంఘంలో సభ్యురాల్నికదండీ"

"అలాగా! అయితే సరదాగా వేస్తున్నారన్న మాట."

"అవును. అదీకాక ఇదే నేను మొదటిసారి నటించబోవటం. నా శక్తి ఎంతవరకుందో తెలుసుకోవాలని ఒప్పుకున్నాను."

"పేరువస్తే ఏం చేస్తారు?"

"వీలైతే సినిమాలో చేరాలని ఉంది." అంది.

విశ్వం ఏమీ మాట్లాడలేదు. ఆ సమాధానం ఎందుకో అతనికి రుచించలేదు. వసంత మనసులో ఉన్నది మర్మంలేకుండా చెప్పే అమాయకురాలని గ్రహించాడు. నాటకసంఘంలోని వాళ్లందరూ ఆ క్షణంలో తోడేళ్ళులా అతని మనోవీధిలో కనిపించారు. అనిర్వచనీయం ఆరాటపడ్డది.

"నాటక సంఘంలో కొంచెం జాగ్రత్తగా ఉండండి"

"ఏం?"అంది వసంత ఆసక్తిగా అతనివైపు చూస్తూ.

"వాళ్ళలో కళారాధనకంటే పాడుబుద్ధులే ఎక్కువ." అన్నాడు విశ్వం. కాని వెనువెంటనే తొందరపడి అలా వాళ్ళమీద అభిప్రాయం వెలిబుచ్చినందుకు చింతించాడు. ఈ విషయాల్లో తనెందుకు అనవసరంగా కల్పించుకోటం? రొంపిలోకి దిగనేకూడదు.

వసంత ఏమిటో ఆలోచిస్తూ నడుస్తోంది ఆమె తెలివితక్కువ దేమీకాదు. ప్రపంచం పోకడలు తెలియనిదికాదు. నాటకసంఘంవాళ్ళ బుద్ధులు పసిగట్టక పోలేదుకూడా. కాని ప్రత్యేకించి విశ్వం అలా ఎందుకు హెచ్చరించాడో ఆమెకి అర్థంకాలేదు. కవిగారు అంటీ అంటనట్టుగా మాట్లాడుతున్నారు. నాటక సంఘంలో మిగతావాళ్ళకి మల్లేకాక కవిగారుమాట్లాడే మాటల్లో ఆమెకి హుందాతనం, ఆదరమూ కనిపించాయి. వందరూపాయలు ఊరికే వొదులుకోబోవటంలోనే తనకి ఆయనమనసు మంచిదని తెలిసింది. రిక్షాఏదో ఎదురుగుండా వస్తోంది ఖాళీగా.

"ఇంక రిక్షా ఎక్కండి."

"ఇంకెంతో దూరం లేదండీ మా ఇల్లు. ఇప్పుడు రిక్షా దేనికీ. నడిచేవస్తాను." అంది వసంత. నటేశ్వరావైతే తను రిక్షాలో వెడతానంటే "సరదాగా నడిచి వెడదామండీ." అనేవాడు. ఆ నటేశ్వరావుని చూస్తుంటే తనకి ఒక్కొక్కసారి అరికాలినుంట నెత్తికెక్కుతుంది. కొంచెం జాగ్రత్తగా మసులుకోమని చెప్పాలి.

"మీరు బి. ఏ. ఆనర్స ప్యాసయారా?" అందామె.

"ఇంకాలేదు. పరీక్షకి వెళ్లాను. ఫలితాలు రాలేదు."

"ప్యాసయినరోజున మీకు నేను టీపార్టీఇస్తాను. ఏమంటారు?"

"థాంక్స్. రెడీ" అన్నాడు విశ్వం నవ్వుతూ.

మాటలసందడిలో ఎంతదూరం నడిచిందీ తెలియలేదు వాళ్లిద్దరికీ. అకస్మాత్తుగా వసంత ఆగి అంది.

"ఇదేనండీ మా ఇల్లు. ఇంక వెడతాను."

"మంచిది." అనేసి విశ్వం ముందుకి సాగిపోయాడు. లోపలికి వెడుతూ వసంత నాలిక కొరుక్కుంది. తను ఇన్నిమాటలు మాట్లాడినా నాటిక గురించి ఒక్కముక్కయినా అనలేదు. తను వొట్టి మతిపిష్టిది. ఏమనుకున్నారో కవిగారు!

(సశేషం.)

# నూతనగ్రహముల ఫలప్రదత్వము

## శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు

జాతక ముహూర్తాదులలో నూతన గ్రహములకు ఇంద్ర వరుణ యములకు సహితము కొంత ఫలప్రదత్వము కలదని సోదాహరణముగా చూపుటకు ప్రయత్నించుచున్న నా వ్యాసములు సనాతన సంప్రదాయ ధురంధరులగు హోరాశాస్త్రవేత్తలు కొందఱికి రుచించినవి కావు. మంచిదే. లోకము భిన్నరుచి. ఆగ్రహముల గొడవ లేకయే, ఏ సమస్యనైనా, నిర్వహించుట సాధ్యమని వారి విశ్వాసము. అట్లే వారు నిర్వహించి కార్యకారణ సమన్వయము చేయుచున్నారు కూడా. సంతోషమే. వారిని అధిక్షేపించు శక్తి నాకులేదు. అట్టిపని అనవసరము సహా.

కాని, నూతనగ్రహములను జాతక చర్చలలో నుపయోగించుట పూజ్యులగు మన ప్రాచీన మహర్షుల పట్ల క్షంతవ్యముకాని మహాపరాధ మగునని, ఆంగ్లభాషలో విజ్ఞానశాస్త్రమున ఆచార్యపట్టము నార్జించిన ఒకానొక జ్యోతిశ్శాస్త్రవేత్త ఇటీవల నా కొక లేఖ ననుగ్రహించినాడు. ఆ మహాపరాధమేమో బోధపడకపోవుటే నా బాధ.

మన దేశములో జ్యోతిశ్శాస్త్ర సూత్రములను నిబంధించినవారు వశిష్ఠాది మహర్షులు. వారు యోగసిద్ధులు, త్రికాలవేత్తలు. వారు చెప్పబూనిన యే విషయమునుగాని అసమగ్రముగా చెప్పినవారు కారు. ఈ నూతన గ్రహములను వారు సూచించియుండలేదు, వానికి ఫలప్రదత్వ మున్నదని వారు చెప్పనూలేదు. అట్టచో, ఈ నూతనగ్రహములకు సయితము ఫలమున్నదని మన మంగీకరించి జాతకచక్రములలో వాని నుపయోగించితిమేని, ఆ మహర్షులకు వీని విషయము తెలిసియుండలేదని సిద్ధాంతీకరించినట్లగుటచే, ఆ మహనీయులకు అజ్ఞతను ఆరోపించి వారిపట్ల గొప్ప అపరాధము చేసినట్లగునుకదా? మన మహర్షుల మతమును తిరస్కరించి భిన్న సంప్రదాయముల నవలంబించుట ఘోరపాతకము కాదా?

ఆ పండితుని దృష్టి ఇది. అతని దృక్పథముతో చూచితిమేని, ఈ యభిప్రాయము సాధువనియే చెప్పవలెను. సందియము లేదు. మహనీయులగు మన ప్రాచీన మహర్షుల యోగశక్తి ప్రశంసనీయమైనది. వారి గౌరవమునకు, జ్ఞానమునకు, న్యూనత నాపాదించుట క్షంతవ్యముకాని యపరాధమే యగును. అట్టి అకార్యమునకు ఎన్నడుగాని పూనుకొనను. కాని, యీ రకపు విమర్శకుల సిద్ధాంతములో ఒక్క విశేషమున్నది. బుద్ధిపూర్వకముగనో, లేక అవిచారితముగనో, చెప్పలేము కాని, రెండు విషయములను వారు నిశ్చయముగా విశ్వసించియున్నారని విశదమగుచున్నది. ఏమందురా? మొదటిది, మన మహర్షులు జ్యోతిశ్శాస్త్ర సందర్భమున చెప్పిన సూత్రము లన్నియు తమ కిపుడు లభ్యమైయున్నవనుట. రెండవది, ఆ లభించిన సూత్రము లన్నియు తమకు అర్థమయినవనుట. ఏమో కాని, క్షమింపుడు, నా దృష్టిలో పై రెండునూ సందేహాస్పదములే.

జ్యోతిశ్శాస్త్ర సూత్రములను నిబంధించిన మన ప్రాచీనులు పదునెనమండుగురు మహనీయులని మన గ్రంథములు చెప్పుచున్నవి.

> "సూర్యః, పితామహో, వ్యాసో,
> వశిష్ఠో, ఽత్రిః, పరాశరః,
> కాశ్యపో, నారదో, గర్గో,
> మరీచి, ర్మను, రంగిరాః,
> లోమశః, పౌలిశశ్చైవ,
> చ్యవనో. యవనో, భృగుః,
> శౌనకో, ష్టాదశై వ్యైతే
> జ్యోతిశ్శాస్త్ర ప్రవర్తకాః" అని.

వీరు ఏమేమి గ్రంథములు రచియించిరో, అవి అన్నియు మన కిపుడు లభ్యమై యున్నవని చెప్పగలమా? పదునెనిమండుగురు మహర్షులు. వీరిలో ఒకరు చెప్పిన అంశమునే పదములలో, తలకట్లో, మార్చి ఇతర మహ

ర్షులు పర్వితచర్వణముగా నొకటేపాటపాడినారని చెప్పుట సాహసకార్యము. ఇతరుల మతమునకంటె భిన్నముగా తనమతమును నిరూపించనిచో, అట్టిగ్రంథకర్త ఋషియే కాడట.

"నాసా వృషి ర్యస్య మతం నభిన్నమ్."

అని మనపెద్దలే చెప్పిరి. ఈ పదునెనమండుగురు మహర్షులు ఏ ఏ భిన్నసంప్రదాయములను నిర్వచించిరో, ఏ ఏ ప్రత్యేక పద్ధతులను చూపిరో, మనకు తెలుసుకొను నుపాయము కానరాకున్నది. మహర్షి ప్రణీతము లనబడు సంహితలు ఏ మూడు నాల్గో చూడగలిగినాము. మఱి, ఇతరుల గ్రంథము లెందున్నవి? రాజకీయ విప్లవాదికారణములచే నశించినవో, లేక రహస్యముగా దాగియున్నవో, తెలియదు. ఇక, తరువాతి కాలమున.

"భూయోభిః పటుబుద్ధిభిః పటుధియాం
హోరాఫలజ్ఞప్తయే,
శబ్దన్యాయ సమన్వితేషు బహుశః
శాస్త్రేషు దృష్టేష్వపి,
హోరాతంత్ర మహార్ణవ ప్రతరణే
భగ్నోద్యమానా మహమ్.
స్వల్పం వృత్తవిచిత్ర మర్థబహుళం
శాస్త్రప్లవం ప్రారభే"

(బృహజ్జాతకము)

అని, తన కాలమునకు పూర్వముండిన గ్రంథకర్త లనేకులు రచియించిన ఉత్తమ శాస్త్రగ్రంథములు పెక్కుండినట్లు ఆచార్య వరాహమిహిరుడు చెప్పియున్నాడు కదా? ఆ గ్రంథజాల మెందున్నది? ఆశ్లేషార్థములో దక్షిణాయనము, ధనిష్ఠాదిలో నుత్తరాయణము ప్రారంభమగుచుండినట్లు పూర్వులు రచించిన గ్రంథములలో నున్నదని తన బృహత్సంహితలో అతడు వర్ణించియున్నాడు. ఆ ప్రాచీన గ్రంథములన్నియు మన కిపుడు లభించియున్నవా? మూలపరుసకు ఆలోచింపుడు. వానిలో నవగ్రహములు కాక మరి కొన్నింటిని ఎవరైన చెప్పియుండకూడదా?

'కాకా భుజంగుని నాడి' అనబడు ద్రమిళ నాడీ గ్రంథములో 'బ్రహ్మసూరి' మొదలగు కొన్ని గ్రహములు పేర్కొనబడినవని వింటిమి. మన నవగ్రహములు కాక మరికొన్ని ఆనాడీ గ్రంథ రచనా కాలములో ప్రచారములో ఉండి యుండెననుటకు సాక్ష్యము కాదా ఇది? ఇపుడు మనకా బ్రహ్మసూరి మున్నగువానినిగురించి యేమియూ తెలియదు. అసాధారణ పద్ధతిలో అత్యాశ్చర్యకరముగా ఫలాదేశము చేయుచున్న నాడీ గ్రంథము లనేకములు నానాభాషలలో చూపట్టుచున్నవి. మనకిపుడు తెలిసి వాడుకలోనున్న సూత్రముల ఆధారముతో అట్టి ఫలాదేశము చేయుట సాధ్యమని, ఎదపై చేయి వేసి, చెప్పగలిగిన సాహసవంతుడు చూపట్టడు. మరి, ఏ ఇతర సూత్రములు ఆనాడీ గ్రంథ ఫలముల నిర్వచనమునకు ఆధారమైనవో మన మెఱుగము.

ఇట్టి పరిస్థితులలో, మన ప్రాచీన మహర్షులు చెప్పిన దంతయు మన కిపుడు లభించియున్న దనుట నగుబాట్లచేటు.

పోతే, అందుబాటులోనున్న మూడు ముక్కలయినా సమగ్రముగ అర్థమైనదని చెప్పగల మహానుభావులు ఎందున్నారో, నామట్టుకు నాకు తెలియదు. బృహత్పరాశరహోరాసారమందలి లగ్నశోధన పద్ధతిని కాని, లోకయాత్ర మున్నగు విషయములను కాని, ఎవరు సాధించగలిగినారో, ఎంత ప్రయత్నించినా తెలుసుకొన లేకున్నాము. జన్మకాల నిషేక కాలముల పరస్పరసంబంధమును గూర్చి పరాశరుడు, బాదరాయణుడు మున్నగు ప్రాచీనుల మతములు భిన్నములని, కల్యాణవర్మ సూచించినాడు. ఇదే విషయమున వరాహమిహిరాచార్యుడు, సమరసింహుడు, వేరు వేరు సంప్రదాయముల నాశ్రయించిరి. వారు వ్రాసిన సూత్రముల ప్రయోగము మనవాడుకలోనికే రాలేదు. జైమినీ సూత్రముల అర్థమునుగురించి పండితులలో ఐకమత్యము కుదురలేదు. ఇట్లెన్నియో చెప్పవచ్చును.

సర్వసాధారణముగ, ఇప్పుడు వాడుకలో నున్నది పరాశర సంప్రదాయమని అందుముకదా? ఆ పరాశరుడు "తొల్లి చెప్పినను పెద్దలమాటయె కాని" తనకట్టి గ్రంథము లభించలేదని పదియవ శతాబ్దపు ప్రముఖ శాస్త్రవేత్త పరిశోధకుడు, బహుగ్రంథకర్త యగు భట్టోత్పలాచార్యుడు చెప్పినాడట. అప్పటికే ఆ గ్రంథము నశించియుండె కాబోలు! ప్రస్తుతము ప్రకటితమయి యున్న 'బృహత్పరాశరహోరాసారము' అను గ్రంథము ఒక పెద్ద కలగూరగంప. శైలి కాని, సంప్రదాయము కాని, విషయ

విభాగము కాని, ఒక గ్రంథకర్త కైవాటములో తీర్పబడినదని తోచదు. కాక, అందలి భాగములు కొన్ని అర్థమగు స్థితిలోనే లేవు. జన్మకాలము; ఆధాన కాలము, అను రెండింటికే కాక, చిత్ప్ర వేళకాలమునకు సహా జాతకము గుణించి సమన్వయము చేయుట సంప్రదాయమనియు, అది కష్టసాధ్యమనియు, ఒకానొక ప్రాచీనగ్రంథ వ్యాఖ్యాత సూచించెను. ఇది ఏదో, వ్యాసఘట్టము!.

ఇట్టి సందర్భములలో ప్రాచీన మహర్షులు చెప్పినవంతియు తమకు తెలిసియున్నదనుకొను సర్వజ్ఞంమన్యు లుండిరేని, ఎవరు వారికి సమాధానము చెప్పగలరు.

అది యట్లుండె.

అన్ని శాస్త్రములవలె యీ జ్యోతిశ్శాస్త్రము సహా పరిశోధకులగు శాస్త్రజ్ఞుల అనుభవ విశేషమువలన క్రమాభివృద్ధికి రాతగినదే యనుట యీ విమర్శకుల బుద్ధికి స్ఫురించదు. అప్పుడప్పుడు నూతనోపాయములతో సంస్కరించినపుడే శాస్త్రము వన్నెకెక్కునని చెప్పిన ధైర్యశాలి వరాహమిహిరుని ఆర్జవ దృష్టిని, భావౌదార్యమును స్మరించినచో, ఇట్టి విమర్శకుల సంకుచితదృష్టికి అది అంజనము కాగలదు. మన ప్రాచీన సంప్రదాయములలో లేని అనేకాంశములను ఆ మహాశయుడు యవనమతమునుండి స్వీకరించి జంకు లేక బాహాటముగా తన గ్రంథములో చేర్చినాడు. అతడు వర్ణించిన ద్రేక్కాణ స్వరూపములు యవనులు చెప్పినవే. కొన్ని రాజయోగాదులలో యవనుల మతమునెత్తి అతడు చూపించినాడు. అంత యేల? గ్రహముల అన్యోన్య మిత్రత్వ శత్రుత్వములను గూర్చి ప్రాచీనమతమును చెప్పుటయే గాక, దానికంటె చాల భిన్నమైన యవనమతమును సహితము తన బృహత్ జాతకములో అతడు నిరూపించినాడు. ఈ విషయములో యవన సంప్రదాయమే వరాహమిహిరునికి అభిమతమని పదునారవ శతాబ్దమువాడగు కేశవార్కుడను హోరా తంత్రవేత్త తన 'వివాహ బృందావన' గ్రంథములో—

"ఇద ముదీర్య వరాహ విరోచనో
నిజమతేనతు దూషితవాన్ పునః;
స బహు మన్యత ఏవ యథాతథం;
జయతి శాస్త్ర మిదం యవ నేష్వపి"

అని సయుక్తికముగా సిద్ధాంతీకరించినాడు. కావున నే,

మ్లేచ్ఛాహి యవనా, స్తేషు
సమ్యక్ శాస్త్ర మిదం స్థితం;
ఋషివ త్తేపి పూజ్యంతే.
కిం పునర్దైవ విద్ద్విజః?"

అని వరాహమిహిరాచార్యుడే యవనుల నెంతో గౌరవించినాడు. అతని యనంతరము సమరసింహాదులను ప్రాచీనులు సాధించిన తాజక సంప్రదాయము పాశ్చాత్యగ పారశీక భాష నభ్యసించి అందలి వాఙ్మయమునుండి సంపాదించినదే యని, మూడువందల సంవత్సరముల క్రిందనే, 'హాయనరత్న'కర్త బలభద్రుడు చాటిచెప్పినాడు. వాడుకలోనుండిన దశాపద్ధతులు చిరకాల సాధ్యములై తృప్తికరమగు ఫలములను చూపని కారణమున, యవన శాస్త్రమునుండి వర్షజాతకపద్ధతి మున్నగు ప్రయోగములను సమరసింహాదులు గ్రహించి విపులీకరించిరట.

"ప్రాయో న జాతక ఫలే
చిరప్రయోజ్యే మతిః స్ఫురతి పుంసాం;
తేనాత్ర హాయన ఫలం
ప్రకాశ్యతే తాజిక ప్రోక్తం"

అని సమరసింహుడే చెప్పినాడట.

లగ్నము, సప్తగ్రహములు అను ఎనిమిదింటికి గోచారమువలన, కలుగు శుభాశుభ ఫలములను సూచించు పద్ధతిని అష్టకవర్గ మందుముకదా? ఈ పద్ధతిలో రాహుకేతువులకు స్థానము లేదు. కాని వరాహమిహిరాదులు చెప్పకపోయినా, రాహుకేతువులకు భావఫలములను తరువాతి వారు విపులముగ వ్రాసిరి. అట్టిచో వాని స్థానములకు సయితము గోచారఫలము, లేలయుండగూడదు? వానికి ఫలములను సాధించి 'దశవర్గ' మను పేరుతో సుమారు నూరు సంవత్సరముల వెనుకనుండిన యొకానొక శాస్త్రజ్ఞుడు ప్రత్యేకగ్రంథమును రచించెననియు అది అముద్రితముగా మూలపడియున్నదనియు, కొన్ని సంవత్సరముల క్రింద ఒకానొక ప్రాచీనజ్యోతిశ్శాస్త్ర పండితుడు నాతో చెప్పెను.

పరిశోధకుల అనుభవముల మూలముగ, క్రమముగా శాస్త్రసంప్రదాయములు అభివృద్ధి నొందుచున్నవనుటకు ఇంకెన్నియో కారణములు చూపవచ్చును. ఇట్లుండగా, తృప్తికరమగు నూతన సామగ్రి పరిశోధకుల పుణ్యమున మనకు లభించినపుడు దానిని నిరాకరించుట ఏమివివేకము?

పోనిండు ప్రాచీన పద్ధతిలో ఏమార్పులు జేసినా, మహర్షులపట్ల అపచారమో అపరాధమో, చేసినట్లు మన ప్రాచీన శాస్త్రజ్ఞులు భావించెడివారా? తైత్తిరీయ బ్రాహ్మణకాలమున జ్యోతిశ్చక్రమున ఇరువది ఎనిమిది నక్షత్రములు. తరువాత ఎప్పుడో ఏమి కారణమో ఇరువదియేడు నక్షత్రముల పద్ధతి వచ్చినది.

"నక్షత్రాణాం తథాభిజిత్" అని భగవత్స్వరూపముగా భగవద్గీతలో పొగడ్తచెందిన 'అభిజిత్'

పత్రమును, శ్రుతిచోదితమైన దానిని నిరాదరించుట పాపముకాదా? యవనమతమును గౌరవించిన వరాహమిహిరుడు, ఆయవనుల నుండి అనేకాంశములను స్వీకరించిన సమరసింహుడు సహా మనమహర్షులపట్ల మహోపకారమునకు ఒడిగట్టినారని అనవచ్చును గ్రహముల దృష్టి విషయమున భిన్నమార్గము నవలంబించిన జైమిని పరాశరునికి అపచారము చేసినారనకతీరదు. అనేక విధములగు దశాంశపద్ధతులను విశదీకరించి. ఏపద్ధతి ఎట్టి జాతకముల కుపయోగించ వలయుననుటం గూర్చి పెక్కు సూత్రములు పరాశరుడు చెప్పియున్నాడని ఎఱుగుదుము. ఆసూత్రములకు జలాంజలి యిచ్చి చెప్పి, ఏ జాతకమయినాసరే,—మానవులదయినా, పశువులదయినా, కడకు సంస్థలదయినా—ఏకమూలికా ప్రయోగముగా వింశోత్తరీదశను కట్టుట అనేక స్థలములలో ఆచారముగనున్నది పరాశరునిపట్ల చూపు గౌరవమేమో యిది?

"భాస్కరే విషురేఖాయా
ఉదక్ స్థేచోత్తరాయణం;
దక్షిణస్థే తతః సూర్యే
విద్యాత్ దక్షిణాయనం."

అని భరద్వాజ మహర్షి వాక్యము. భూమధ్యరేఖకు సూర్యుడు ఉత్తరమందున్నపుడు ఉత్తరాయణము, దక్షిణమందున్నచో దక్షిణాయనము, అనుట. మకరాదిగ ఉత్తరాయణమని, కర్కాటకాదిగా దక్షిణాయనమని, మన మిపుడు వాడుచుంటిమి. ఈ మార్పు ఏల వచ్చెనో, దానికి ఉపపత్తి ఏమో తెలియ లేదని శ్రీపత్యాచార్యుడే సూచించియున్నాడు.

"దినప్రవృత్తిర్మ్రుగతా మజాదౌ,
తులాధరాదౌచ నిశాప్రవృత్తిః;
తే కల్పితే ర్యైర్మృగ కర్కటాదౌ
తత్రోపపత్తిం నవతే బ్రువంతి."

అని. ఈ యపచారము ఎవరు చేసిరో?

"చల సంస్కృతి తిగ్మాంశోః
సంక్రమోయ స్ససంక్రమః;
అజాగళస్తన ఇవ
రాశి సంక్రాంతి రుచ్యతే"

అని నిరయన పద్ధతిని హేళనముచేసి, సాయన పద్ధతియే ఉత్తమమని వశిష్ఠమహర్షి చెప్పెనట. నిరయన పద్ధతి నవలంబించువారందరు ఆ మహర్షి యభిప్రాయమును త్రోసి రాజు చేయుటచే ఆతనిని అవమానించుచున్నట్లు భావించవలసి వచ్చునుకదా?

పోనిమ్ము. ఉదాహరణ మొక్కటి చూపుట ఇట్టి చర్చకంటె హెచ్చు ప్రయోజనకారి.

ఉన్నత విద్యను ఆర్జించి, అందచందములు కలిగి, అవివాహితగా నున్న ఒకానొక తరుణి నిరయన జాతక చక్రము, నవాంశ చక్రము సహా, ఈ క్రింది నున్నవి:—

| | | | |
|---|---|---|---|
| | | కు 5-39 | ర 5-52<br>బు 14-21<br>శు 19-24<br>X 27-24 |
| రా 28-18 | (నిరయన)<br>జాతకచక్రము. | | గు 16-47 |
| శ 10-49<br>చ 0-8 | | | కే 28-18 |
| | | | I 28-43 |

| | | | |
|---|---|---|---|
| శు<br>గు | శ | | రా |
| కు<br>బు | (నిరయన)<br>నవాంశ. | | |
| చ | | | |
| కే | ర | | ల |

జన్మకాల రవి మహాదశాశేషము. 4 సం. 4 నె. 17 ది.

రాహు మహాదశలో బృహస్పతి అంతరములో ఎవడో తగిన వరుడొకడు వచ్చి. చూచి సమ్మతించి, వివాహము చేసికొందునని మాట ఇచ్చినాడు. ఈమె జాతకములో అష్టమ కుజదోషమున్నది. ఆ వరునికో నాల్గింట కుజదోషము. దోషసామ్య మున్నదని, వివాహము జరుగవచ్చునని, పెద్దలు నిర్ధరించినారు. తరువాత, ఇరుపక్షముల వారికిని, ముందు జరుగతగిన కార్య క్రమమునుగుఱించి జాబు జవాబులు క్రమముగా జరుగ

సాగినవి. ముహూర్తకాలనిర్ణయపు సందర్భమున అనుకూల్య ప్రాతికూల్యముల సంప్రతింపులు ప్రశంసలో నుండెను. నిర్ణయము జరిగి రమారమి ఆరుమాసములు గడచినవి. కొన్నాళ్ళలోనే మూడుముళ్ళు పడి శుభకార్యము జరుగగలదని చూపట్టినది. కాని, అంతలో ఏ పిల్లతుమ్మెనో, తలవని తలంపుగా, తనకీ సంబంధము అక్కరలేదని ఆవరుడు జాబు వ్రాసి పెండ్లి మాటలలో నాటకమునకు భరతవాక్యముపాడి యవనికదించినాడు. సంబంధము అక్కరలేనిచో చెప్పుటకు కారణములు కరువా? "పృష్ఠతాడనాత్ దంతభంగః" అనునట్టి కారణమేదో సూచించి చేయి కడుగుకొన్నాడా వరుడు. ఆ తరుణి మనసునకు ఇది గొప్ప దెబ్బ. ఇక, "పునః కాచన పూచన" వరాన్వేషణ కార్యమునకు మరల పూనుకోవలసిననే పాపము!

ఈ జాతకమునకు ఇటి ఫలము తాను చెప్పియుండునని మన విమర్శక మహాశయుడు తెలిపిన కారణములివి—(1)ఉభయకేంద్రాధిపత్యమువలన భర్తృస్థానాధిపతియగు గురువు, ఉచ్చుడైనా, లాభస్థానములో నుండినా 'పాపి' అయినాడట. అతని దృష్టి సప్తమ భావమునకే చెరుపట!

ఉచ్చగ్రహము కారణాంతరములచే మేలుచేయలేక పోవచ్చును కాని, చెఱుపుచేయడని వరాహమిహిరాదులు చెప్పిరి. అందులో, లాభ భావములో నున్న శుభగ్రహమే అశుభఫలము నిచ్చినచో, ఇక శుభులెవరు? కేంద్రాధిపత్యమువలన గురువు పాపియగుపట్ల, ధను, ర్మీన, కన్యా, మిధునములలో పుట్టినవారి కందరికిని గురువు పాపికావలసి వచ్చును. మారక విషయములో కేంద్రాధిపత్యము గురువునకు దోషముగా ఏర్పడవచ్చునేమో కాని, ఇతర సందర్భములలో అతడు 'పాపి' అయినాడనుట కేవలము శాస్త్రమునకే కలంకము.

"కేంద్రాధిపత్య దోషస్తు
బలవాన్ గురుశుక్రయోః"

అను 'జాతక చంద్రికా' వాక్యమునుబట్టి చేసిన విచిత్రసిద్ధాంతమిది. కేంద్రాధిపత్యము 'దోష'మనుటే ఆ గ్రంథకర్త ఆశయము కాని, ఆ ఆధిపత్యముచే గురువు 'పాపి' అగునని కాదు. ఒక చిన్న ఉదాహరణము చూడుడు. ధర్మరాజు మహాధర్మాత్ముడు, సత్యసంధుడు. ఎప్పుడో వ్యాజము పెట్టి ఒక అసత్యమాడెను. అది అతనిపట దోషమే. కాని దానిచే అతనిని పాపి అనలేము. ఈ రెండిటికిని గొప్ప భేదము కలదని సహృదయులు గ్రహించకపోరు.

(ii) పై విధముగ పాపియైన గురువు సప్తమ భావమును నిండుదృష్టితో చూచుటచే ఆ భావము పాపపంకిలమైనదట!

నా దృష్టిలో, ఇదియొక విచిత్ర సిద్ధాంతము. భావాధిపతి భావమును చూచినచో ఆ భావము చెడునని ఏ మహర్షి చెప్పినాడో తెలియదు.

"యోయో భావః స్వామి సౌమ్యాభ్యాం
యుక్తో దృష్టోయ మేధతే."

అను మొదలగు ప్రమాణములచే అట్టిదృష్టి భావపోషక మగుననుట శాస్త్ర సంప్రదాయము. వరాహమిహిరాచార్యుని ఉపలక్షణ సూత్రమిది.

"హోరా స్వామి గురుజ్ఞవీక్షిత యుతా,
నాన్యైస్తు, వీర్యోత్కటా."

(iii) అంశ చక్రములో సప్తమభావము శనికుజుల వలన పాపకర్తరి పాలయినదట! ఆ చక్రములో అష్టమాధిపతి కుజుని దృష్టి లగ్నముపై నున్నదట! శుక్రుడు ఉచ్చాంశలో నుండినా, లగ్నాధిపతితో చేరినా, కళత్ర కారకుడై సప్తమములో నుండుటచే 'కారకో భావనాశాయ' అను వాక్యమువలన భర్తృస్థానము పాడైనదట!

ఏమి సామంజస్య సాధన వైదగ్ధ్య మిది? దృష్టి, సంయోగము, పాపకర్తరి, మున్నగుయోగములు నవాంశ చక్రమున కన్వయించు సంప్రదాయము ఏ మహర్షి ప్రోక్తమో తెలిపి యుండినచో, విద్యార్థుల కెంతో యుపకరించి యుండెడిది. దృష్టిని సాధించి దానికి విలువ నిర్ణయించు సూత్రములను విధించిన శ్రీపతి ప్రముఖుల గతి ఏమి? పోనిండు. సప్తమ శుక్రునికి 'సారావళి' సత్ఫలమే చెప్పినది కదా? శుక్రుడు కళత్ర కారకుడని, పాపము, కల్యాణవర్మకు తెలియదు కాబోలు.

(iv) నవాంశలో సప్తమాధిపతి గురువు సప్తమములో స్వక్షేత్రబలము కలిగి యుండినా, శత్రువగు ఉచ్చశుక్రునితో చేరుటచే అశుభుడయినాడట!

సత్యాచార్య మతమున గురుశుక్రులు పరస్పరసమములే కాని శత్రువులు కారు. మరి యవనాచార్య మతమందో, వారు అన్యోన్య మిత్రులే. విమర్శకులు సూచించినది ఏ మహర్షి సిద్ధాంతమో? శుక్ర క్షేత్రమున గురువునకు, గురు క్షేత్రములో శుక్రునికి, శాస్త్ర గ్రంథములలో శుభ ఫలము చెప్పబడినది కాని, అశుభ ఫలము లేదు. వారొకరికొకరు శత్రువులైనచో, ఇట్టి ఫలము కలుగుననుట యుక్తి సహము కాదు. కావున నే,

"జ్యోతిశ్శాస్త్రేషు సర్వేషు
జని లగ్నే గురుః శుభః;
జీవస్య జనితౌ శత్రూ
యది, తద్యుజ్యతే కథం"

అని 'జాతక తిలక' గ్రంథకర్త గురు శుక్రుల శత్రుత్వపు సిద్ధాంతమును అధిక్షేపించినాడు.

(V) కుజుడు ఎనిమిదింట ఉండుటచే కుజ దోషమున్నది. ఇది వివాహ విషయమున మహాదోషము.

ఇచట వృషభములో నున్నాడు కుజుడు.

"సిత రాశి స్థితే భౌమే,
కుజదోషో నవిద్యతే"

అను అపవాద సూత్ర ముండుటచే, ఈ కుజ దోష మునకు గొప్ప విలువ లేదనవచ్చును. అది యట్లుండ, ఉదాహరణములు గ్రావకోరు కుజుడు అష్టమ మందున్నచో, వివాహమై క్లేశము కలుగవచ్చును కాని, వివాహ భంగమునకు హేతువు చూపట్టదు.

పాఠక మహాశయులకు ఒక్క మనవి. కలిగిన ఫలమునకు పై కారణములు ఏ విధముగా తగిన వన వచ్చునో యోచింపుడు. ఇట్టి కార్య కారణము సమన్వయమునకు ఎంత విలువ కట్టవచ్చునో, తద్జ్ఞులే ప్రమాణము.

ఈ క్రిందనున్న సాయన జాతక చక్రమును ఒక్కసారి కటాక్షింతురుగాక. నూతన గ్రహములు సయితము దానిలో చూపబడి యున్నవి.

| | | | |
|---|---|---|---|
| రా 21-12<br>భర్త 12-55 | శ 22-48 | పుణ్య 15-57<br>కు 28-33 | ర 28-46-2 |
| శ 3-43 (వ) | (సాయనము)<br>శుద్ధ జాతక చక్రము. | | బు 7-15<br>శు12-18 (వ<br>X 20-1<br>య 21-4 |
| చ 23-6 | | | దాంపత్య<br>0-56<br>గు 19-41 |
| | | I 21-37 | ఇ 5-32<br>శే 21-12 |

లగ్నము కోమలస్వభావముగల తుల. యమునితో శౌరి లగ్నాధిపతి శుక్రుడు గగనమధ్యమున ప్రకాశించుచున్నాడు. భాగ్యములో రవి. రాజయోగకారకుడు. (చతుర్థ పంచమాధిపతి) శని ప్రబలుడై వాల్గింట నుండుట. లాభస్థానములో తృతీయ (విద్యా) షష్ఠాధిపతి బృహస్పతికలడు. గొప్పవిద్య, యోగ్యమగువృత్తి, ఆర్థిక స్వాతంత్ర్యము, వినయవిధేయతలు, నైతిక ప్రవర్తనము, సాధుశీలము తెలుపుజాతిక మిది. తగిన వేతనముతో యోగ్యమైన యుద్యోగము కలదు.

ఇచట ముఖ్యసమస్య సప్తభావముకదా? సప్తమాధిపతి కుజుడు ఎనిమిదిభాగల దూరములో అష్టమభావమందేయున్నాడు. అనారోగ్యము, ఆందోళనము సుఖాభావము దీనిఫలము కావచ్చును. భావమధ్యము నకు కుజుడు దూరమందుండుటచే, ఈ ఫలములో రమారమి నూటికి యేబదివంతులకంటె హెచ్చుగా రాదు. ఉండుగాక.

సప్తమభావ మధ్యబిందువునకు సార్థకేంద్రములో మహామాయావి ఇంద్రుడున్నాడుకదా? వివాహ విషయమున జాతకురాలు వాస్తవమును కనుగొనజాలక భ్రమపాలగుటో, ఇతరులచే వంచించబడుటో, జరుగవచ్చును. ఇకపోతే, భర్తృభావమధ్యమందే నికరముగా వరుణుడు పీటపెట్టుకుని కూర్చుండియుండుట చదువరులు గమనించగలరు. ఆకర్షణము, అపకర్షణము, అను ధర్మములతో పనిసాగించు నేర్పరి వరుణుడు. కనుక నే విప్రలంభ శృంగార ప్రియుడని, విడాకుల గ్రహమని, ఇతనికి ప్రతీతి. స్వాతంత్ర్య కాంక్ష మిక్కుటమయి పరిస్థితుల మార్పునకు తగిన రీతిగా అతుకుకొని, పొంది, పొసగి, మనుస్వభావము ఇతడు నేర్పనివిద్య. అగుటచే, అతి సులభముగా అతుకులు ఊడిపోగలవు. కావుననే, శాశ్వత బంధముగా కొనసాగ తగిన వివాహపు విషయమున సామాన్యముగా వరుణ వేధదోషముగా ఏర్పడుచుండుట, ఇట్టి వరుణునికి నాల్గింటి చంద్రునినుండియు, పదింటి యమునినుండియు నిండుకేంద్రవేధ. పుట్టినింటి పరిస్థితులలో, వృత్తిపద్ధతిలో, కంకణ ప్రాప్తికైనా, లేక దాంపత్య జీవనమునకైనా, ప్రతిబంధక సామగ్రిగా ఏర్పడగలవని దీని సూచన. ఇట్టి వరుణుడు కుజక్షేత్రములో నిలిచి చండశాసనుడై నూటికి నూరువంతులుఫలమును తెచ్చి పెట్టటకు నడుముకట్టుకొని సప్తమ భావ మధ్యమందే యుండగా, అతనిని వదలిపెట్టి ఎడముగా, ఎనిమిదింట ఎక్కడనో, కూర్చుండియున్న కుజునిపట్టి రచ్చకులాగ నేల? కన్నములో కూర్చుండియున్న దొంగ కంటె దోషమువలన కానరాకపోగా, కంచె ప్రక్కన కదుపులు మేపుచుండిన కన్నమ్మ కొడుకు తుంటరి

యని వారిపైన దొంగతనమును మోపిరను సామెత యగునుకదా?

ఏ యోగములయినా తగిన దశలలో కదా ఫలించగలవు? దేవమానవదశలో లాభాధిపతి యగు చలితరవి (కర్కాటకము 22-48) జన్మవరుణుని కేంద్రవేధనం గుణోగా, వరుని ఆవాహనము జరిగెను ఆ దేరవి చలితవరుణునికి కేంద్రమునకు (కర్కాటకము 23 19) వచ్చినపుడే విసర్జనము! వరుణ దోషముగల దశలో జరిగిన ప్రయత్నపు ఫలమిది. వివాహము జరిగి విడాకుల వఱకు రానిది జాతకురాలి పుణ్యము. ఇంతనికరముగా చలితదశ వరుణప్రభావమును ప్రేలితో చూపినట్లు తెల్పుచుండగా, ఆగ్రహవేధకు ఫలము లేదనుట శాస్త్రమర్యాద అగునా?

దేవమానవదశ నట్లుంచి, ఆ వయస్సునకు 'వర్ష జాతక' మొకటుండునో చూతము గాక. అచట నయితము వరుణగ్రహప్రభావము చూపట్టవలయుకదా? ఇదే ఆమె వర్ష జాతకము.

| | | | |
|---|---|---|---|
| చ 28-17 | భర్త 24-14 | శే 17-41 | బు 13-12<br>ర 28-46-2 |
| | (సాయన)<br>వర్ష జాతకము | | శు 16-31<br>కు 29-19 |
| | | | వ 4-56<br>X 5-46<br>య 28-20 |
| శ 9-40 | I 7-12<br>రా 17-41 | ఇ 29-59 | గు 23-32 |

ఇచట లగ్నాధిపతి కుజుడు; సప్తమాధిపతి శుక్రుడు. ఈ ఇద్దఱు ఏకరాశిలోనుండినా, పదుమూడు భాగల అంతరములో ఉండుటచే, ఫలప్రదమగు సంయోగము వారికిలేదు. ఆ లగ్నాధిపతి కుజుడో, నీచపడి ఇంద్రుని కేంద్రవేధను, వరుణుని సంయోగమును, అభిలషించుచుండుట. వరుడు ఆమెను మోసగించి స్వస్తి చెప్పినాడు.

ఇచ్చట భర్తృసహమము ఎందున్నదో చిత్తగించిరేని, చదువరులకు వరుణప్రభావము కరతలామలకముగును. చలితవరుణస్థానమునందే యీ వర్షారంభకాలమున భర్తృసహమము నిలువవలయునా? జన్మకాలపు వాగ్దానమును యీవిధు వరుణుడు నెరవేర్చినాడు. ఈ సాక్ష్యము మనము సృష్టించినదికాదుకదా?

ఈ వార్షిక కేంద్రములను దైనికపద్ధతితో అనుభవవిశేషములు కలిగిన దినములకు చలింపచేసి చూతముగాక.

1. నిశ్చయము జరిగిననాడు.

వర్షారంభమునాటి నాక్షత్రకాలభుక్తి = 8-34-25
వర్షారంభమునుండి డెబ్బదిరెండు దినములకు
వార్షిక నాక్షత్రకాలవృద్ధి = 5-52-30
మొత్తము = 14-26-55
దీనికి చలితలగ్నము = 29½ మకరము

అనగా ఆనాడు చలిత వార్షిక సప్తమము (భర్త) వర్ష జాతకమందలి లగ్నాధిపతి కుజునిపైననే నికరముగ నుండుననుట. భర్తృసంపాదన కార్యమునకు తృప్తికరముగా ఆనాడు పునాది వేయబడినదికదా?

(ii) నిరాకరణ కారణము కలిగిననాడు.

వర్షారంభమునాటి నక్షత్ర కాలభుక్తి = 8-34.25
వర్షారంభమునుండి 220 దినములకు
వార్షిక నక్షత్ర కాలవృద్ధి = 17-57-5
మొత్తము. = 2-31 30
దీనికి చలిత లగ్నము 9½ సింహము.

ఆనాడు వరుణమహాశయుడు సింహరాశిలో 9-20 లో యుండెనని విన్నచో, పాఠక మహాశయులు ముక్కుపై వేలిడుకొనగలరు. చలితలగ్నము పోయి పోయి ఆనాడు వరుణునినే చేరుకోవలయునా? వరుణుడు పూనుకొన్న కార్యము నెరవేర్చుటకు ఇంతకంటె తగినదినము ఎందు లభించగగు?

"సంపూర్ణ దృష్ట్యా తు దినే ఫలం స్యాత్ ।
యోగస్థితే కాంశె సమాగమోక్తిః ॥"

అను యాదవసూరి సూత్రమును ఎంత స్పష్టముగా అన్వయించు చున్నదో చదువరులు గమనించగలరు. ఇది కూటసాక్ష్య మనగలమా?

మరియొక్క మాట. ఉద్దేశభంగపు జాబు వచ్చిన దినమునకే దైనిక జాతకమును సాధించినచో, దైనిక

చతుర్థము (పరిణామము) జాతకురాలి జన్మకాలపు ఇంద్రస్థానమందే (కన్యారాశిలో 6 వ భాగ) నిలిచి యుండగలదు. వరుడామెను మోసగించినాడు. ఇంద్రమాయ ఇట్లు పరిణమించి మబ్బుగా తేలిపోయినది. బహుశః ఇతర వ్యామోహమునకు చిక్కి అతడిట్లు వర్తించెనేమో?

ఇంద్రా వరుణ గ్రహములకు ఫలమున్నదో లేదో, మన విమర్శకుల కంటికి కానరాకపోయినా, పాఠక మహాశయులే తేల్చగలరు.

ఇంత చాలును. ఇతరుల, అందులో పండితుల, అభిప్రాయములను విమర్శించుటకాని, వాద ప్రతివాదములకు దిగుటగాని, నాకు రుచించదు. దానికి వలసిన యోగ్యత సహితము నాకు చాలదు కూడ. సామాన్య విద్యార్థులు గమనించి ఆలోచించదగిన సమస్యలు కొన్ని ఇందున్న కారణమున యీ విమర్శని విషయము ఇచట ప్రస్తాపించవలసి వచ్చినది. చదువరులు మన్నింతురుగాక.

ఒక్కమాట. గుప్తవరుణ దశాకాలమున జాతకురాలు చేసిన పురుషకారము విషముఫలములో పర్యవసానమయినది. ఆ ప్రయత్నము వివాహ రూపమున ఫలించకపోవుట జాతకురాలి పూర్వ సుకృత ఫలమనుటకు సందేహములేదు. గొడ్డలికి ప్రసక్తి లేక, గోటితోనే తొలగిపోయినది పీడ. లగ్న సప్తములపై శుభదృష్టిగల గురువు లాభస్థానమందున్నాడు. వివాహమై విడాకులు వెతకుకొను అవసరము లేకుండ ఆ మహానుభావుడు జాతకురాలిని కాపాడినాడు. 1959 ఫిబ్రవరి మార్చి ప్రాంతములో కొన్ని శుభవేళలు వచ్చును. ప్రయత్నానుసారముగ అప్పుడు వివాహ మంగళము సుఖప్రదముగ నెరవేరగలదు. అట్లనుగ్రహింపుమని భగవంతుని ప్రార్థింతముగాక!

"మమ యదిహ సదుక్తం సజ్జనైః క్షమ్యతాం తత్."

# వరదవెల్లువ

## శ్రీ బలివాడ కాంతారావు

వానలు కురిశాయి. సెలయేళ్లు పొంగి, నదిలో కలిశాయి. ఏరు ఒడ్డు కూల్చుతూ చెట్లు పెకలించి, వరదలో వందలాది ప్రాణులను కలుపుకొని వుప్పొంగి పోతూ హోరుమంటూ దిగువకు దిగజారిపోతూంది అది ఉవ్వెత్తుగా పొంగిన వరద వెల్లువ!

తెలతెల వారే సమయం! దిగువున ఒక గ్రామంలో తెప్పలతో యీది కర్రలు తీసేవాళ్ళలో ఒకడు కర్ర అనుకొని శవాన్ని ముట్టుకున్నాడు. ఒళ్లు జలదరించింది! ఒడ్డుకు ఆయాసంతో చేరుకున్నాడు. ఆ శవం అలా కొట్టుకొని పోతూ పోతూ ఆ గ్రామానికి దక్షిణంగా రెండుమైళ్ళల్లో ఉన్న పర్రలో ఒక తుప్పకు చిక్కుకుంది. ఏటి సత్తువను మేటియైన జలధి లాగుకున్నది. సాయంత్రం అయేసరికి వరద నీరు తగ్గనారంభించింది. తెల్లవారేసరికి ఆ శవం ఆగినచోట లేదు. రాత్రంతా నక్కలే కాక, తెల్లారేసరికి రాబందులుకూడా కోల్లలుగా చేరి ఫలహారం చేశాయి. మిగిలింది అస్థిపంజరం. పర్రలో చేరి చెత్తను పూడ్చుకొనటానికి వెళ్ళినవాళ్ళలో సంచలనం బయలుదేరింది. గ్రామాధికారుల చెవులకు యీ వార్త చేరగానే పోలీసులు రావటం జరిగింది!

ఈ యెముకలగూడు శవపరీక్షకు పట్నం పోయింది.

“అయ్యో! పాపం! ఎంత పెద్దింటి యిల్లాలో! కాలుజారి పడివుంటుంది. బలవంతం చావైతే నగలన్నీ యెందుకు పెట్టుకుంటుంది...” ఇలా వూళ్లో తలోలా అనుకున్నారు. ఆమెనుగురించి వారం రోజులవరకూ మనిషో వార్త తెచ్చేవారు. అన్నీ నమ్మదగ్గట్టుగానే వుండేవి.

పోలీసు స్టేషనుకు మొగుడన్న మనిషి రాగానే అసలు సంగతి ఆయనవలన కాకండా వెంటవున్న వారి వలన తెలిసింది.

“ఆ మొగాడు...రామరామ. ఆ యేడుపు... చూడలేం! అంతటి వాడి పరువు పూర్తిగా తియ్యాలనే నగలతో యీపని చేసిందిగా!”

“అలాంటి వానికి యిలాంటి చావుగాక మంచి చావొస్తుందా?”

ఇలా మనిషోలా అనుకున్నారు. విన్నవాళ్ళు వినంతాన్ని మరికొందరితో చెప్పుకున్నారు. ఆకొందరు మరికొందరితో చెప్పారు. ఇప్పటికీ ఆ చుట్టుపట్ల రేవు ఆపది దిగజారినా యీమె కథే చెప్పుకుంటారు!

ఆమెపేరు రాజమ్మ. మహారాణికివుండే ఠీవితో శరీరం పొందికతో వుండేది. ఆకళ్ళల్లో యేదో గంభీరమైన మెరుపు. ఆ శరీరచ్ఛాయలో పసుపురంగు కలిసింది! పెద్దింటిపిల్ల. తండ్రికి నూరెకరాల పొలం — ఒక్కర్తే కూతురు. అత్తవారి ఆస్తి రెట్టింపు. భర్త ఉదారుడు. చెయ్యి చాచకుండా యిచ్చినదాత. ఏ సత్కార్యంలోనైనా అతనే! పొలంగట్టున నిలుచున్నాడంటే యెడ్లజతలు కూడా నమ్రతతో వుత్సాహంతో పనిచేసేవి. ఆ శాంత గంభీరస్వరం ఆలించి పాటించేవారే అందరూ! అలాంటి మకుటంలేని మహారాజు భార్యగా వచ్చింది. యిద్దరుబిడ్డల తల్లిఅయింది. అయినా ఆమె నిత్య యౌవని — లోతైన చెరువుమధ్యలో పద్మంలా ఆమె యెవరికీ అందలేదు — బహుశః భర్తకుకూడా చేమోనని కొన్నాళ్ళకిగానీ అతడు పోల్చుకోలేక పోయాడు.

పైకి పద్మంలా అగుపించినా లోన కట్టె కాడలా ఆమెలో యేదో కఠినత్వం, ఆ దిగువ బురదలా యేదో మలినం...ఆమె హృదయంలో దాగుంది. పురుషుల మీద ఒక నీరసభావం ఏర్పడింది. తనకు తెలియని గర్వం ఆమెకు వెగటుగా అంటుకుంది.

బ్రతుకు తెరువుకోసం చేపలుపట్టడానికి చెరువు మధ్యకు చేరిన జాలరివానిలా సిమ్మన్న వీళ్లయింట్లో నౌకరుగా చేరాడు. ఇద్దరుపిల్లలతండ్రి పెళ్లాం సన్నంగా నల్లగా పెద్దబుట్టలాంటి రెలతో అసహ్యంగా వుంటుంది. వ్యవసాయపు కూలిపని చేసుకొని ఆమె, భర్త యీ పెద్దయింటిలో నౌకరీచేసి, తెచ్చుకున్న ధాన్యంతో కాలంగడవాలి. సిమ్మన్నకు ప్రక్కవా

కోరుకున్నది అక్కర్లేదు. ఒకడి జోలికిపోడు— ఒకడిచేత ఒకమాట అనిపించుకోడు. మొగవాళ్లకుండే పౌరుషాలు లేవు, మోటుదనం లేదు. బహు నెమ్మదైన మనిషి. ఇంటియజమాని వీడి వినయాన్ని మంచినీ గౌరవించాడు. ఎవరికీ యివ్వని స్వతంత్రం ఇచ్చాడు. ఇంటి యిల్లాలికి, సిమ్మన్నలో మిగతా మగవాళ్లలో లేని అందమేదో అగుపించింది. ఇన్నాళ్లూ తను కోరుకున్నదేదో దొరికినట్లు, ఎదురుచూస్తున్న మనిషి వచ్చినట్లు, స్త్రీమూర్తి ఆమె కంటికి సిమ్మన్నలో గోచరించింది—

పద్మం, కోరి జాలరివాని భుజానికి తాకింది. బ్రతికినబ్రతుకు తలుచుకుని జాలరి అది తప్పించుకొని చేపలు పట్టుకోసాగాడు. బాగా విప్పారి భ్రమ పెట్టింది ఆ ముగ్ధ. ఆ అందాన్ని చూడగానే జాలరిలో దాగున్న, అణచుకుంటున్న రసానుభూతి పొంగి పొరిండి. అప్పటికీ ప్రయత్నించాడు కానీ యెదురీద లేకపోయాడు. ఆప్యాయంగా ఆ పువ్వు తాకి చేతులతో చుట్టివేశాడు హృదయానికి హత్తుకున్నాడు. తుమ్మెద ఝుమ్మంటూ వచ్చి వెంట తరిమింది. ఆలుబిడ్డలను, బ్రతుకు తెరువును మరచిపోయి ఖిన్నవదనంతో చెరువుగట్టుమీద సమయంకోసం వేచివున్నాడు. చీకటిపడింది. తుమ్మెద అప్పటికి గానీ పద్మాన్ని వదల్లేదు. మెల్లగా చెరువులో దిగి యీదుకుంటూ వెళ్ళాడు. నక్షత్రపు వెలుగులో అర్ధనిమీలిత నేత్రయై యెదురుచూస్తున్న ప్రేయసి దగ్గరకు వెళ్ళాడు. ఆమె యేడ్చింది. ఆ యెడబాటు సహించరానిది. నెమ్మదిగా అన్నది. "మాదు యీ చెరువులో బురదా, తుప్పలూ ఎండ్రలూ, కప్పలూ, జలగలూ తప్పించి యింకేమీ లేవు నీ వెంతకాలం యీలాగైన నీటిలో యీ జలచరాలమధ్య యీదుకొనివుండగలవు? అందరికీ యీ నీరూ, యీ గాలీ, యెంతో గొప్పలావున్నా నాకు మాత్రం అసహ్యం అయింది. పదపద యెక్కడికో పోదాం...స్వతంత్రంగా నీతో వుండగల చోటికి పోదాం;" అంది చీకటి భయం భయంగా వుంది. ఏ సమయంలో యే జంతువైనా హాని చెయ్యవచ్చు. కోరివలచి వస్తోంది సుందరి—ఎన్ని జన్మలెత్తాలి యిటు వంటి పుష్పాన్ని స్పృశించడానికి? పువ్వును కాడతో బురదనుంచి పైకెత్తాడు. చుట్టూనీరు కల్మషమైంది. ప్రక్కనేవున్న రెండుమొగ్గలు కావుమన్నాయి. పువ్వును పట్టుకొని ఒక మారుమూలలో వున్న కుగ్రామానికి తీసుకపోయి ఒక గృహంలో దాచాడు. ఆ అందాన్ని అనుభవించాడు. రానురాను పువ్వు వాడిపోజొచ్చింది. ఆ కంటికి పసందుగా అగపడటం లేదు. జాలరికి పెళ్ళాం పిల్లలు జ్ఞాపకం వచ్చారు. కొల్లలుగా చేపలుయిచ్చి అభిమానం చూపించిన ఆ చెరువు జ్ఞాపకం వచ్చింది. అయ్యో ఆ చెరువుమధ్యలో అంత అందంగా వున్న పువ్వునా నేను పీకివేశానని మథన పడసాగాడు. తిరిగి ఆ పువ్వును ఆ చెరువులో వేసి క్షమాపణ వేడుకోవాలనుకున్నాడు. తనవునికి త్రోవే పోయే ఒక మనిషికి తెలియజేశాడు.

ఒకనాడు తెల్ల తెలవారు సమయాన్ని యింటిముందు జోడెద్లబండి ఆగింది. ఆమె అందులోనించి దిగిన భర్తను. పెద్దలను, తన బిడ్డలను చూచింది. సిమ్మన్న గజగజ వణకనారంభించాడు. ఆమెకళ్ళు పగడాల్లా మెరుస్తున్నాయి. మనసును పాషాణంచేసుకుంది. అమ్మా అంటూ కావుమని పిల్లలు దగ్గరకు పరుగెత్తుకొచ్చారు. ఆ రాయి కదలేదు. మెదల్లేదు. ఆ దృశ్యంచూసిన సిమ్మన్నకు కళ్లల్లో నీళ్లు గిర్రుమని తిరిగిపోయాయి. ఆ పద్మం కాగితంతో చేసి యెవరో చెరువులో వేసి తనను మభ్యపరచినట్లనిపించింది, ఆమెభర్త పిల్లలను చేరదీసి "ఇంకా ఇంటికి రావా?" అన్నాడు ఆగొంతుకలో మర్యాద వుట్టిపడుతోంది. ఊర్లో ప్రజ మూగిపోయారు. "రాను" అంది రాజమ్మ కటువుగా. భర్త కాస్త దగ్గరగా జరిగి "నన్ను గురించికాదు. ఆరోజునుంచీ యీపిల్లల యేడుపు వినలేక పోతున్నాను. అన్నీ యివ్వగలను గానీ...... తల్లిప్రేమ యివ్వగలనా... వీళ్లమీదైనా కనికరం చూపించి తిరిగి రావా రాజమ్మా?"

అతని మర్యాద, ఓరిమి, ఆమెకు కనిపించలేదు. వినిపించలేదు. "అన్ని వయులుకో నేవచ్చాను. నీ వెవ్వరో నే నెవరో...!" అంది.

"అంతేనా..." అన్నాడు.

అతని మాటలా పాషాణాన్ని కరగించకపోగానే ఆ గుంపులో ఒక వయసు మళ్ళిన వ్యక్తి ముందుకు వచ్చి "ఇల్లు వదలిన యిల్లాలు, చెట్టువదలినకోతీ ఒక

టమ్మా! అన్నిటికీ సెమించిన ఆ మారాజుకో యేదు రాడతావు...?"

ఆమె యెర్రగించి చూసింది. శరీరమంతా పౌరుషంతో మండుకుపోతూంది. "నాకు వీళ్ళెవరూ తెలీదు. నాకు తెలిసినవాడు అదుగో...వాడొక్కడే...మీరంతా పొండి...పోతారా లేదా?" ఆమె కసిరి వేసింది. ఆమె నిప్పులు కక్కుతూంటే సిమ్మన్న కూడా త్రుళ్ళి పడి భయపడ్డాడు. ఆ ముగుసలి గంభీరమైన గొంతుక మళ్ళీ వినిపించింది. "ఓ అమ్మా! ఇప్పుడు ఒళ్లు బింకంతో వున్నావు. నీకేమీ తెలిసిరాదు. దేవుడూ లేడు! నీతీ లేదంటావ్. కాస్త వాడిపోగానే నీ దరికి ఏదూ చేరదు. ఎక్కడో మారుమూలల్లో గతిలేక చచ్చి నక్కలచేత, కుక్కలచేత, రాబందులచేత పీకించుకుంటావ్?"

"నేను చచ్చాక నాకేమైతేనేం? నేను చూడొచ్చానా? నాకు సిమ్మన్నతోనే బ్రతుకూ చావూనూ! వాడి చేతులతో నన్ను పొడిచినా నేను సంతోషంగా చచ్చిపోతాను. ఈ లోకంలో వాడొక్కడు తప్పించి నాకింకెవరూ లేరు."

అంటూ ఆమె అక్కడనుంచి గబగబ కదిలిపోయింది. చుట్టూ మూగినవాళ్లు 'ఛీ ఛీ' అన్నారు. తుప్పున వూశారు. "అది, మనిషి కాదు పసువు!" అన్నారు. "దానికైనా కొంత నీతుంటాది. దీనికి లే"దన్నారు. నానా దుర్భాషలూ ఆడారు. ఒక మూల తలపట్టుకొని కూర్చుండిపోయిన యజమానిని చూడగానే సిమ్మన్న దగ్గరగాపోయి కాళ్లు పట్టుకొని వలవలా యేడ్చేశాడు.

"నా నౌఖరుగా వుండొద్దు. నాతో సరిసమానంగా వుండు" అన్నాడు సిమ్మన్న గతుక్కుమన్నాడు. అతని పాదాలొత్తడానికి పనికొస్తాడాతను... యెన్ని అంతస్థులు తేడా!

"నీకు కొంతపొలం యిస్తాను. దున్నుకొని హాయిగా బ్రతకండి!"

ఈ మాటలు సంతోషంతోపాటు భయాన్ని కూడా రేకెత్తించాయి. ఎందుకో గుండె దడపట్టుకుంది. యీ భూమి యిచ్చి తన పిల్లాపాపతో బ్రతకమనలేదే! ఈమెతోనా? ఈ రాయితోనా తన కాపరం? వద్దని చెప్పబోయాడు. చెప్పలేకపోయాడు. అంతదూరంలో నున్న ఆమెను చూడగానే తనకు భయం వేసింది. పివంగిని చూచినట్లయింది. మొగుడు నిల్చున్నాడు. "రండి! ఇటుగా బండియెక్కండి" అన్నాడు. ఆ గంభీర శాంత స్వరాన్ని పాటించే అలవాటుకొద్దీ సిమ్మన్న బండివేపు నడవగానే ఆమె ఆపడానికి పరుగెత్తుకు వచ్చింది. "వద్దు వద్దు...మళ్ళీ ఆ నరకానికి వెళ్ళొద్దు మనం...ఇక్కడే యిలాగ వుండిపోదాం. ఒక్కసారే యిద్దరు ఇక్కడే చచ్చిపోదాం!"

ఆమె ధాటికి సిమ్మన్న జంకిపోయాడు. కాళ్లు కట్టికన్నట్లు నిల్చుండిపోయాడు. ఆమె భర్త ఒకసారి ఆమె వేపు యెగాదిగా చూశాడు. ఆమె శరీరం జలదరిస్తోంది. కోపంలో కంపిస్తోంది మతిచెడిన మనిషిలా కొద్దిగా పిచ్చిచేష్టలు అగపడ్డాయ్. అంతమందిలో సిమ్మన్న చెయిపట్టి లాగే ఆమె సాహసాన్ని చూసి పౌరుషాన్ని ఆపుకోలేక పోయాడు. బిగ్గరగా "వాణ్ణి త్రాళ్లతో కాళ్లు చేతులూ కట్టి బండిలో వెయ్యం"డని హుకుం జారీ చేశాడు.

ఆ ఆజ్ఞ అరనిమిషంలో శిరసావహించడం జరిగింది. బండి కదిలిపోతోంది. ఆమె యెంత గుంజాటన పడినా లాభం లేకపోయింది. ఊళ్లోవాళ్లు వున్న సామానులు బయట పడవేసి "నీలాంటి నీచురాలు మా వూళ్లో వద్ద"ని కేకలు వేశారు. ఆమెకీ కేకలేవీ వినిపించలేదు. బండి వెనుక పరుగెత్తింది. కొంత దూరం పోయాక భర్త బండి ఆపించి "మీదికి రా!" అన్నాడు.

"నే రాను...సిమ్మన్న కట్లు విప్పు...ఎక్కడికో పోతాం!"

మళ్ళీ బండి తోలించాడు. ఎంత బ్రహ్మాండమైన యెండ...పొలాల త్రోవలోనుంచి యెడ్లబండి పరుగులెడుతోంది. ఆమె కాళ్లు బొబ్బలెక్కిపోయాయి. స్నానం చేసినట్లు చెమట కారుతోంది. దాహం బ్రహ్మాండంగా వుంది. కాళ్లు పట్లుతప్పి పీకేస్తున్నాయ్. శరీరమంతా కందిపోయింది. విరబోసిన జుత్తుతో వున్నకొద్ది శక్తితో బండివెనుక పరుగెడుతోంది... అదిగో ఊరు! ఒళ్లు స్వాధీనంతప్పుతోంది. ఎదురుగా బండి రెండు బళ్లుగా అగపడి...మసగ మసగ్గా...అగుపించి...ఒక్కసారి మాయమైపోయింది. బండి ఆగింది. మొగుడు మూర్ఛపోయిన రాజమ్మను బండిమీద వేశాడు. నీరు చల్లాడు. ఆమెకు తెలివివచ్చే

సరికి చాల రాత్రయింది. మాట రాలేదు. తను ఎక్కడ వున్నదీ సరిగా గుర్తు రాలేదు. ఆకలి వేస్తున్నట్టు సైగ చేసింది. కడుపునిండాక సతువ వచ్చింది కానీ ఒళ్లంతా పట్లు దేరినట్లుంది. చుటూ మూగివున్న స్వజనంవైపు చూడకుండా బోర్లపడి పడుకుంది. తెలివి వున్నా నిద్రలో వున్నట్లే నటించింది. ఆ రాత్రంతా తన కాళ్ల వేపు యెవరో కుర్చీమీద కూర్చున్నాడు. అప్పు డప్పుడలా విసుగుతున్నాడు చిన్న పిల్లవాడు యేడు స్తుంటే వెళ్లి జోకొడుతున్నాడు. ఆమె వుదయం లేచే సరికి కుర్చీమీద కూర్చొనే కునుకుతున్న భర్త అగుపించాడు.

'మళ్ళీ యీ కైదులో యెందుకు వేశావ్ దేముడా!' అనుకుంది. ఎవరితోనూ మాటాడ లేదు. ఎవరు మాటలు కలుపుతున్నా ముఖం త్రిప్పివేస్తోంది తనకు కావలసినవన్నీ అడ క్కుండా దగరకు వస్తున్నాయ్. ఎప్పటికి చీకటి పడుతుందని యెదురు చూసింది. చీకటిపడింది. నడి రాత్రి...కదలడానికి వీలులేకండా భర్త కాపలా కాస్తున్నాడు...ఒకటి రెండుసార్లు లేవటానికి ప్రయ త్నిస్తే మొగుడు యేంకావాలన్నాడు. జవాబు చెప్ప కుండా పడుకుంది. ఈలోగా వురుములు ప్రతిధ్వని స్తున్నాయి. లేచి భర్తవేపు చూసింది. అలా కుర్చీ మీద కూర్చొనే చిన్న కునుకు నిద్దరపోతున్నాడు. కదులుదామనేసరికి దబదబ వర్షం ముంచుకొచ్చింది. ఆ వానజల్లుకు లేచిపోయాడు. కూర్చున్న రాజమ్మను చూచి "నిద్దర రాలేదా" అన్నాడు.

జవాబులేదు కానీ అలా ఆమెవేపు దృష్టి సాగించి చూశాడు. అతనిలో యేదో భావుకత్వం పొంగిపొరలింది. ఆమెపై సహజంగా తనకున్న అను రాగం పుష్టించింది. కనికరం వేసింది. అరచేతిని ముడిచి కుడి అరచేతితో ముడిచిన తనచేతిని లాలిస్తున్నట్టు నిము రుతూ..."యేదోతప్పు చెయ్యకపోతే మనిషెలా అవు తాడే...నీకు ఎందులోనో లోటు చేసివుంటాను... చందమామకి మచ్చవున్నా చూచేవాళ్ళకి ఒళ్ళు పులక రిస్తుందిగా...ఏమంటావ్!"

ఆమెవికారంగా "గంగలో దూకుతానంటాను!" అంటూ మళ్ళీ జేరబడిపోయింది.

"నీవు మంచివానివే...నీనోటంట అలాంటి మాటలు రాస్యానికైనా రాకూడదు!"

"నీకే అంతానిజం...నాదే అంతా అబద్ధంలే... ఊరుకో" అంది.

ఈవాగును పట్టి పాములపెట్టెలో పెట్టినా యింకా మచ్చిక చేయలేక పోతున్నానని పాములవాడు చిరుకుక్కమన్నాడు.

ఆ మరుచటిరోజు మధ్యాహ్నం అయేసరికి ఆ వూరికి ఆనుకుని ఉత్తరదక్షిణాలుగా పారేయేరు ముంచుక వచ్చింది ప్రవాహం రానురాను పెద్దదై చీకటిపడే సరికి యేరు రెండు ఒడ్డులకు అంటుకొని పారుతోంది. హోరుమనే శబ్దం మైలుదూరం వినిపిస్తోంది. వానలవల్ల చెరువులు నిండాయ్, కప్పలు బెక బెక డప్పులు కొడు తున్నాయ్. కాలవలు నిండి పొలాల్లోపారి వుభాలు మొదలు పెట్టించాయ్. పనిపాట్లలో జోక్యం చేసుకో కండా భర్త యింట్లో నేవున్నాడు. ఆమె ఆ రోజున లేచి తల దువ్వుకుంది. చీర మార్చింది. ఒంటినిండా నగలూ ముఖంనిండా బొట్టు పెట్టుకుని పేరంటాలులా పసుపు రాసుకొని తయారయ్యింది. ఆమెలో మార్పును చూచి భర్త సంతోషపడ్డాడు. ఆరాత్రి తనకు కంటి నిండుగా నిద్దరపట్టింది.

సిమ్మన్న ఒంటిగా తన యింటివాకిట మంచం వేసుకొని పడుకున్నాడు. కొంతవరకూ పిల్లలు తనమీద సవారీచేసి సంతోషపెట్టి యింట్లో నిద్దరపోయారు. తర వాత పెళ్ళాం మాట్లాడి చాలా రాత్రయిందని పోయి ఇంట్లో పడుకుంది. చీకటిగావుంది. ఆకాశాన్ని నక్ష త్రాలు మెరుస్తున్నాయ్. దగ్గరగావున్న యేటి గంభీర మైన అరుపు వినిపిస్తోంది. సిమ్మన్నకు నిద్దర రావటం లేదు. తన యజమాని...రాజమ్మ...అంతా జ్ఞాపకం వస్తున్నారు. యజమాని వుదారస్వభావం తలుచు కుంటుంటే ఒళ్ళు పులకరిస్తోంది. మనసులోనే దేవు డితో సమానమైన మారాజని మొక్కుకుంటున్నాడు. రాజమ్మ సౌందర్యమంతా కళ్లకు కట్టింది—ఎక్కడి కండ అక్కడ—ఎంతో పొందికైన ఒళ్ళు—మంచి సారా త్రాగినట్లుంది ఆమెతో సంసారం! ఆ క్షణం లోనే తన పెళ్ళాం తలపుకొచ్చింది. ఇద్దర్నీ పోల్చు కోవటం జరిగింది. ఇదా వుత్తి యెర్రిబాగులది— మెత్తనిముద్ద—అది తాగకండా నా కెన్నిసార్లు గంజి పోసింది. దీని ఒళ్ళు కోస్తే అంతా మంచే! అభి మానమే! కాకపోతే సవితిని పట్టుకొని వూరూరా తిరిగావెందుకు? యింటికి తేలేకపోయావా అని అడుగు

తాదా? "నీకోసం అంత బ్రతుకూ కాలదన్నింది. నీతో నేను సుఖపడ్డాను. అదీ సుఖపడనీ—దాన్నో సెల్లెల్లాగ సూసుకుంటాను—దాని కింత సేస్తాను—" ఇలాగన్నాడే యిదెక్కడ? కన్నకడుపులో పుటిన పిల్లలు అమ్మా అని యేడిసి మీదికొస్తే కదలేదు. మెదల్లేదు అదెక్కడ? అది మనిషిపుట్టుక పుట్టలేదు. దాన్ని కొస్తే అభిమానమే లేదు. అలాంటిది నాయింటి కొస్తే పులిలాగ నన్నూ మింగేస్తాది—దాని కడుపులో ఒక పిల్ల పుట్టే నా పిల్ల పీకలు పిసికేస్తాది! దానికి వూళ్లోనే చోటు యివ్వకూడదు. మూడు ముల్లూ కట్టానా రండనో మొండనో భరించడానికి? దానికీ నాకు సమ్మంధం యేం వున్నాదని యిలా ఆలోచించుకుంటూవుంటే యెవరో అతనిమీద చెయ్యి వేశారు. గతుక్కుమని తలెత్తేసరికి రాజమ్మ సింగారించుకొనివచ్చిన కామినీదేవతలావుంది. పదపద అన్నది తొందరగా. 'రాను' అని చెప్పటానికి నోరు కదల్లేదు. లేచాడు. ఆమె గబగబ నడుస్తోంది ముందుకు. మెల్లగా అడుగులు వేస్తున్న సిమ్మన్నను చూచి ఆగి "దా" అని పిల్చింది. గబగబ తనకు తెలియకుండానే కాళ్ళు కదలిపోయాయి.

ఊరు దాటాగా. చుక్కల వెలుగులో యేటిఒడ్డు వెంబడే త్రోవలో పోతూనే వెనుకవున్నవాడిని ముందు నడవమని ఆమె త్రోవ తప్పుకుంది. ముందుకు నాలుగు అడుగులు వేసి ఆగి ధైర్యం చిక్కబట్టుకొని యెక్కడికి అన్నాడు ఆమె సహజగంభీరస్వరంతో "నీ వెంకనే వస్తాను...ముళ్ళత్రోవకానీ...యిసక దిబ్బలుకానీ...గంగలోనికిగానీ...గగనానికి గానీ...నరకానికైనా....నీతోనే వస్తాను...తీసుకుపో..." అంది.

సిమ్మన్నకు కాళ్లు సరిగా ముందుకు పడటంలేదు. ఆమెయందు అనురాగంకంటే అతీతమైన బంధనం తనను వెనుకకు లాగుతోంది. ఆడమనిషిలోవుండే మానవత్వం తలుపుకువచ్చి యింటివేపు తిరిగి పరుగెత్తమని ప్రోత్సహిస్తోంది. పిల్లలపై కన్నతండ్రికి సహజంగా వుండే మమకారం మనసులో మథనం చేస్తోంది. ఈ బెబ్బులిని యెలా విడిపించుకోవటం—తన నిర్మలమైన బాటకు అడ్డుగా కాసింది. దోచుకుంటూ కలుపుకుంటూ బొబ్బలు పెడుతూ కదులుతున్న యేరు ప్రక్కనే వుందని స్ఫురించింది. మనసు కఠినమైంది. కార్య నిమగ్నుడై ఆగాడు.

ఆమె అతని భుజంమీద చెయ్యివేసి "చీకటని భయంగా వుందా?" అంది

"లేదులే..." అన్నాడు.

"పాము లుంటాయనా? అది నిన్ను కరిస్తే—నేనూ కరిపించుకుంటానులె...పద...పద...!" ఆమె కదలని అతనిని, తన అందమైన బాహువులతో చుట్టివేసింది. ముఖంలో ముఖం పెట్టింది. సిమ్మన్నలో సంచలనం కలిగింది. ఆ నిశిలో నిశాచరుడయ్యాడు. పువ్వు పూర్తిగా నలిపివేసి ఉద్రేకంతో ఒక్కసారి గంగలోనికి త్రోసివేశాడు! తిరిగి యేమి తెలియనట్లు యింటివేపు నిద్రపోడానికి పరుగెత్తాడు.

రాజమ్మ చనిపోయి ఒక దశాబ్దం గడిచింది. ఆ గ్రామం వెళ్లేవాళ్ళకి యేటిఒడ్డున ఒక మనిషి కనిపిస్తాడు. యేటివేపు చూపిస్తూ "నన్ను రమ్మని పిలుస్తున్నాది! మీకు వినపడలేదా రాజమ్మ పిలుపు...అదిగో...అదిగో!" అంటాడు. ఆ చుట్టుపట్లవున్న వాళ్ళు "పిచ్చి సిమ్మన్న బాబూ, రేయీ పగలూ అదే మాట...అక్కడే వుంటాడు!" అంటారు.

# కౌటిల్యుని అర్థశాస్త్రము

శ్రీ సి. వరహాలరావు

ప్రాచీన హైందవ రాజనీతి శాస్త్ర చరిత్రలో కౌటిల్యుని అర్థశాస్త్రం అత్యంత ప్రధాన స్థానాన్ని ఆక్రమిస్తుంది. కౌటిలీయం, మన రాజనీతి శాస్త్రంపాలిట మహోన్నత భాండాగారం. దీన్ని రచించినవాడు కౌటిల్యుడు లేక చాణక్యుడు. ఇతడు తక్షశిలానగరంలో జన్మించాడని కొందరు, ద్రవిడ దేశస్థుడని మరికొందరు ఊహిస్తున్నారు. ఇతడు ఆంధ్రుడనే ప్రవాదంకూడా ఉంది. ఏది ఏమైనా, ఈయన జన్మస్థానం యిది అని చరిత్రపండితులు యిదమిత్థంగా తేల్చలేదు. ఈయన వేదవేత్తయే గాక నాటికాలపు విద్యలన్నిటినీ, సమగ్రంగా అభ్యసించిన వాడు. తక్షశిలావిశ్వవిద్యాలయంలో విద్యార్థిగావున్న దినాల్లోనే కూటముద్రలు (దొంగ నాణెములు) తయారుచేసేవాడనీ, 'గుంటనక్క'వంటి తెలివితేటలుగలవాడనీ ప్రతీతి. "ముద్రారాక్షస" నాటక కర్తయైన విశాఖదత్తుడు "కౌటిల్యః కుటిలమతిః" అని ఒక పాత్రచే యీయన శీలాన్ని అభివర్ణింప జేశాడు.

కౌటిల్యుడు "అర్థశాస్త్రాన్ని" క్రీ. పూ. 300 ప్రాంతాల రచించి వుంటాడు. కాంతిలోకి వచ్చిన నాటినుండీ యీ మహాగ్రంథం కీర్తి చంద్రికలు, సూర్యకిరణాల్లాగ దశదిశలకి వ్యాపించాయి. క్రీ. శ. 8 వ శతాబ్దంలో జీవించిన కామందకుడు తన "నీతిసారం"లో కౌటిలీయ ప్రాశస్త్యాన్ని వేనోళ్ళ ప్రశంసించాడు. శాస్త్రాంబుధిలోనుండి కౌటిలీయమనే రాజనీతి శాస్త్రామృతాన్ని ఉద్భవింప జేసిన మహోన్నత ప్రతిభాశాలిగా కౌటిల్యుణ్ణి వర్ణించాడు. క్రీ. శ. 8 వ శతాబ్దంలో జీవించిన భవభూతి తన 'మహావీరచరిత్ర'లోను, భవభూతికి 50 సంవత్సరాలకు పూర్వమున్న మహాకవి దండి తన 'దశకుమార చరిత్ర'లోను, క్రీ. శ. 5 వ శతాబ్దంలో వ్రాయబడిన 'నారదస్మృతి'లోను, కౌటిలీయార్థశాస్త్రం ప్రస్తావించబడడం గమనార్హం. న్యాయభాష్యము క్రీ. శ. 850 లో వ్రాయబడిన 'యాజ్ఞవల్క్యస్మృతి'లాంటి ధర్మశాస్త్రగ్రంథాలు, మేధాతిథి, మల్లినాథుడూ వంటి సుప్రసిద్ధ వ్యాఖ్యానకారులూ, కౌటిలీయాన్ని పేర్కొన్నారు. ఇంతమంది మహామేధావుల, ఉద్దండ పండిత ప్రకాండుల దృష్టి ఆకర్షించిన యీ గ్రంథం కొంతకాలం అదృశ్యమైపోయింది.

మౌర్యచంద్రగుప్తుని ఆస్థానంలోవున్న గ్రీసు రాయబారి మెగస్తనీసు, తన 'ఇండికా' గ్రంథంలో చంద్రగుప్తుని గూర్చి విశేషమగు సమాచారాన్ని అందించి, మౌర్యసామ్రాజ్యాన్ని స్థాపించి, చంద్రగుప్తుని ప్రధానామాత్యుడుగావుండి, దైనందిన రాజ్యకార్య నిర్వహణలో పాల్గొనిన కౌటిల్యుని పేరును పేర్కొనకపోవటం నిజంగా ఆశ్చర్యకరమైన విషయమే! దీన్ని ఆధారంగా చేసికొని, కొందరు పాశ్చాత్య, భారతీయ పండితులు కౌటిల్యుడు పుక్కిటి పురాణానికి చెందిన వ్యక్తి అనే నిర్ణయానికి వచ్చారు. ఐతే వారి సందేహాలు, నిర్ణయాలు, నిరాధారాలని చరిత్ర రుజువుచేసింది.

కొన్ని శతాబ్దాలాదిగా ప్రాచీన హైందవ రాజనీతి శాస్త్రం పాలిట కామధేనువులా ఉన్న 'అర్థశాస్త్రం' కొంతకాలం మరుగునపడిపోయి, 20 వ శతాబ్ది ప్రారంభంలో, 1900 ప్రాంతాన డాక్టరు శ్యామశాస్త్రిచే కనుగొనబడింది. ఆయన యీ గ్రంథంలోని కొన్ని భాగాలు ఇంగ్లీషు భాషలోనికి అనువదించి ప్రచురించారు. దాంతో యూరపియన్ పండితులు, ప్రత్యేకంగా జర్మన్ సంస్కృత విద్వాంసులు, దీన్ని అధ్యయనం చేసి పరిశోధనలు ప్రారంభించారు. అంతదాకా, ప్రాచీన హైందవులకు స్వతంత్ర అర్థశాస్త్రమంటూ, ఒకటి లేదని ప్రచారం చేసిన యూరపియన్ పండితుల దృక్పథంలో కౌటిలీయ పునర్దర్శనం విప్లవాత్మకమగు మార్పును తీసుకువచ్చింది. అంతేగాదు; కౌటిలీయానికి పూర్వము, తదనంతరము ఎన్నో రాజనీతిగ్రంథాలు వ్రాయబడ్డాయి. అవన్నీ కౌటిలీయంలా, ఏదో ఒకనాడు వెలుగులోకి రాకుండా మానవని ఆశిద్దాము.

కౌటిల్యుడు 'అర్థశాస్త్రాన్ని' రచించేందుకు సూత్రశైలి ఉపయోగించాడు. అందుచేత, ఆయన అభిప్రాయాలు అతినిగూఢంగా కన్పిస్తాయి. గ్రంథంలో వుపయోగించిన పరిభాష, తక్కిన సంస్కృతగ్రంథాల్లోగానీ, నిఘంటువుల్లోగానీ కన్పించదు. కౌటిల్యుని పిదపవచ్చిన గ్రంథకర్తలు ఎవ్వరూ ఆయనలా రాజ్యపాలనకు సంబంధించిన విషయా

లన్నిటినీ విపులంగా వివరించలేను. కౌటిలీయంలో ఉన్న అధ్యక్ష ప్రచార ధర్మస్థీయ యోగవృత్తాది అధికరణాలను గూర్చిన ప్రకరణాలవంటివి కామందకుని "నీతిసారం"లో గానీ, శుక్ర "నీతిసారం"లో గానీ లేవు. కాబట్టి రాజ్యాంగతంత్రం గూర్చి ప్రాచీన శాస్త్రవేత్తలు చేసిన సిద్ధాంతపఠనానికి కౌటిలీయమే ప్రధానమైన ఆధారం

కౌటిలీయం అవతరణ కాలం నాటికి భారతదేశంలోని వివిధపరిస్థితులు అస్తవ్యస్తంగా తయారయ్యాయి. మ్యాసిడోనియా దేశస్థుడయిన అలెగ్జాండరు, ప్రపంచాన్ని జయించాలనే వాంఛతో జైత్రయాత్ర ప్రారంభించాడు. పారసీక సామ్రాజ్యాన్ని తన పాదాక్రాంతం చేసికొని, హిందూకుష్ పర్వతాలు దాటి, క్రీ. పూ. 326 లో భారతదేశంపై దండెత్తాడు. ఆ నాటికి, ఉత్తర భారతదేశంలో చిన్న చిన్న రాజ్యాలు అసంఖ్యాకంగా వున్నాయి. అనాయకులై, నిరంతరం కలహంతప్ప మరో వ్యాపకం లేని రాజులు, భోగభాగ్యాలనుభవిస్తూ, బతుకున్న రోజులవి. పంజాబ్ చిన్న చిన్న భాగాలక్రింద చీలిపోయింది. దేశం ఐక్యము, క్షేమము మరచి, విదేశశత్రువు దేశ స్వాతంత్ర్యాన్ని దొంగిలించ సిద్ధపడ్డప్పుడుకూడా. నాటి క్షుద్రులైన రాజులు, (పురుషోత్తముడువంటి రాజులు తప్ప) పరస్పరం కుత్తుకలు త్తెరించుకొనే యత్నంలో ఉన్నారు. అలాంటి పరిస్థితులలో అలెగ్జాండరు దండెత్తాడు. అలెగ్జాండరు దండయాత్ర భారతదేశ రాజకీయాకాశాన్ని తాత్కాలికంగా ఆవరించిన కారుమేఘం. ఇది వెంటనే అదృశ్యమైంది.

గ్రీకు దండయాత్ర కొన్ని సత్ఫలితాలనేకాదు కొన్ని దుష్ఫలితాలనుకూడా కలుగజేసింది. గ్రీకు దండయాత్రా ఫలితాలు, హిందూసంఘం ఆచార వ్యవహారాలను కొంతవరకు కళంకితం చేశాయి. కొందరు రాజవంశస్థులు, గ్రీకు సేనాధిపతులకు తమ కన్యలనిచ్చి వియ్యమొందారు. మౌర్య చంద్రగుప్తుడు, సెల్యూకస్ కూతురును వివాహమాడాడు. దీని ఫలితంగా హిందూ సంఘంలో వర్ణసాంకర్యం ప్రారంభమైంది. వైదిక మతానికి దుర్దశ ప్రాప్తించింది. నాటి కాలంలో, దేశంలో జైన బౌద్ధాలు ప్రజాభిమానాన్ని చూరగొన్నాయి. కౌటిల్యుని కాలం నాటికి, మగధరాజ్యాన్ని నవనందులు పాలిస్తున్నారు. నందులలో చివరివాడైన ధననందుడు ప్రజాద్రోహిగా తయారై, ప్రజల్ని హింసించడం జరిగింది. అలాంటి పరిస్థితులలో, ప్రజాకంటకంగా తయారైన నందరాజులపాలన తుదముట్టింపజేసి, వైదికమతాన్ని పునరుద్ధరించేందుకు, కౌటిల్యుడు కంకణం కట్టాడు. మహాశూరుడైన చంద్రగుప్తుడు, అనన్య సామాన్య ప్రతిభాశాలీ, అఘటనఘటనా రాజనీతి శాస్త్రపారంగతుడైన కౌటిల్యుడూ కలిసి, బ్రహ్మాండమైన సైన్యాన్ని సమకూర్చి, నందులను ఓడించారు. మగధరాజ్యాన్ని వశపరచుకొన్నారు. ప్రాచీన హైందవ రాజకీయాకాశంలో మిణుకు మిణుకు మంటూ, అప్పుడప్పుడు దివ్యకాంతితో ప్రకాశించిన ఆదిమ గణ సంఘాలు కాలక్రమేణా మౌర్య సామ్రాజ్యంలో సైనిక శక్తి సహాయంతో కబళించివేయబడ్డాయి. ఈ విధంగా, భారతదేశ చరిత్రలో, మొట్టమొదటిసారిగా, సువిశాలమైన మౌర్య సామ్రాజ్య అవతరణం జరిగింది.

## కౌటిల్యుడు : వైదికధర్మపరత్వం

కౌటిల్యుడు వైదికమతంపై అధిక తీవ్రమయిన అభిమానం చూపాడు. ఈతని వైదిక ధర్మపరత్వానికి కౌటిలీయార్థశాస్త్రంలోనే ఎన్నో నిదర్శనాలున్నాయి. కామందకుడు కౌటిల్యుని శాస్త్ర పాండిత్యాన్ని, వైదిక ధర్మపరత్వాన్నీ, అసాధారణ ప్రతిభనీ యీ విధంగా ప్రశంసించాడు:

"వంశే విశాల వంశ్యానాం ఋషీణా మివ భూయసాం
అప్రతిగ్రాహకాణాం యో బభూవ భువి విశ్రుతః
జాతవేదా ఇవార్చిష్మాన్ వేదాన్ వేదవిదాం వరః
యోఽధీతవాన్ సుచతురః చతురోఽప్యేక వేదవత్
యస్యాభిచార వజ్రేణ వజ్ర జ్వలన తేజసః
పపాత మూలతః శ్రీమాన్ సుపర్వా నందపర్వతః
ఏకాకీ మంత్రశక్త్యా యః శక్త్యా శక్తిధరోపమః
ఆజహార నృచంద్రాయ చంద్రగుప్తాయ మేదినీమ్
నీతిశాస్త్రామృతం ధీమాన్ అర్థశాస్త్రమహోదధేః
సముద్ధర్తా నమస్తస్మై విష్ణుగుప్తాయ వేధసే"

అప్రతిగ్రాహకమైన ఉత్తమ ఋషి వంశంలో వుద్భవించి, నేర్పుతో నాలు వేదాలనీ ఒకే వేదంలా అధ్యయనం చేసి, సర్వశాస్త్ర నిష్ణాతుడై, పవిత్ర జీవనమున యాగాగ్నిలా ప్రకాశించి, ఆర్య ధర్మ రక్షణకొరకు విదేశీ విజృంభణాన్ని అరికట్టి, అద్భుత మంత్ర సామర్థ్యంతో, నందపర్వతాన్ని, దేవ సేనానిలా ఒంటరియై స్వశక్తిచే నిర్మూలించి, మౌర్య చంద్రగుప్తునికి చక్రవర్తిత్వాన్ని సాధించి, అర్థశాస్త్రాంబుధినుండి నీతిశాస్త్రామృతాన్ని పుట్టింపజేసిన మహోన్నత ప్రతిభాశాలిగా, కౌటిల్యుణ్ని, కామందకుడు ప్రశంసించాడు. వైదికధర్మరక్షణ, మౌర్యసామ్రాజ్య స్థాపన తత్పరిపాలన ఇవే కౌటిల్యుని ప్రధానాశయాలు. అందుకనే తాను రచించిన అర్థశాస్త్రంలో వేదాలను, చాతుర్వర్ణ్య చతు

ఆశ్రమాలకు ఎక్కువ ప్రాముఖ్యాన్నిచ్చాడు. రాజ్యాన్ని పరిపాలించే రాజకుమారులు, చిన్నవాటి నుండీ వేదవిద్యలు, వర్ణాశ్రమ ధర్మసూత్రాలు, అధ్యయనం చేయాలని, నిర్దేశించాడు. రాజకుమారుడు ప్రాతఃకాలాన హస్త్యశ్వ, రథ ప్రహారవిద్యలు అభ్యసిస్తూ మధ్యాహ్నం పూట మహాభారత రామాయణేతిహాసాలని వింటూ శాస్త్రాలలో శిక్షణ పొందాలంటాడు. నాలుగు వర్ణాలు కలిగి, నాలుగు ఆశ్రమాలు కలది లోకమని చెప్పాడు. ఇలాంటి లోకం రాజదండంచే పరిపాలించబడి 'స్వధర్మ కర్మాభిరతమై తమ తమ మార్గాల్లో ప్రవర్తించుచున్న' దంటాడు. హిందూసంఘమందలి నాలుగు వర్ణాలకు చెందిన ప్రజలు ఈ క్రింది వృత్తుల్ని స్వీకరించాలంటాడు. బ్రాహ్మణునికి అధ్యయన అధ్యాపన యజన యాజన ప్రతిగ్రహములు, క్షత్రియునికి అధ్యయన యజన యాజన ప్రతిగ్రహములు, వైశ్యునికి అధ్యయన యజన యాజన దానకృషి పాశుపాల్య వాణిజ్యములు శూద్రునికి బ్రాహ్మణ క్షత్రియ వర్ణాల శుశ్రూష, వార్తా కారుకుశీలవకర్మలు స్వధర్మాలు. 'స్వధర్మము ననుసరించుట స్వర్గమోక్షములకొరకే' నని ఖండితంగా చెప్పాడు. స్వధర్మాన్ని అతిక్రమిస్తే వర్ణసాంకర్యంవల్ల లోకం నశిస్తుంది కాబట్టి ప్రభువు ప్రజల్ని స్వధర్మాన్నుండి దూరం కానివ్వరాదు. స్వధర్మ పరిపాలకుడు, ఆర్య మర్యాదా వ్యవస్థాపకుడు, వర్ణాశ్రమ ధర్మస్థితికర్త ఐన రాజు ఇహపర సుఖాలు పొందుతాడు. అప్పుడు లోకం త్రయి (మూడు వేదాలు) చేత రక్షించబడి వృద్ధిచెందగల"దని చెప్పాడు. 'లోకంలోని చాతుర్వర్ణ చతురాశ్రమాలను, నాశనమవడానికి సిద్ధమైన స్వధర్మాలను, రక్షించడంచేతనే రాజు ధర్మపాలకుడవుచున్నాడు' (ధర్మస్థేయం—అర్థశాస్త్రం) హిందూ సమాజమందలి ప్రజలలో ఐకమత్యభావాన్ని నెలకొల్పేందుకు, వర్ణవ్యవస్థ ప్రవేశపెట్టాలని కౌటిల్యుడు నిర్దేశించాడు. ఈ వర్ణవ్యవస్థ కుంటుబడితే లోకజీవితం సంక్షోభంలో పడిపోతుందని చెప్పాడు. ప్రజాజీవితం సంక్షుభితం గాకుండా వుండేందుకు, ప్రజలు ఐహికాముష్మిక సుఖాలుపొందేందుకు రాజు వర్ణాశ్రమ ధర్మాన్ని రక్షించాలి. అలా కాపాడకుండా వర్ణ సాంకర్యాన్ని ప్రోత్సహించి, ధర్మశాస్త్రాలని తిరస్కరించితే, రాజు పదవిభ్రష్టుడు చేయబడతాడు.

## కౌటిల్యుడు : పూర్వశాస్త్రకారులు

'అర్థశాస్త్రం' అనే పేరుతో రాజధర్మాన్ని విపులంగా వివరించే గ్రంథరాజాన్ని వ్రాయడం. శాస్త్ర సిద్ధాంతాల ననుసరించి. దిగంత విశ్రాంత మైన మౌర్య సామ్రాజ్యాన్ని చంద్రగుప్తుని సహాయంతో స్థాపించడం, యీ రెండు కారణాలవల్ల, కౌటిల్యుడు ప్రాచీన హిందవార్థ శాస్త్ర చరిత్రలో అగ్రగణ్యుడైన శాస్త్రవేత్తగాను, భారతదేశ చరిత్రలో ఒక మహామహుడుగాను, పరిగణింపబడుతున్నాడు. శాస్త్ర సిద్ధాంతాలను ప్రతిపాదించడంలోనే గాకుండా, వాటి మంచిచెడ్డలు ఆచరణలో నిర్ధారణ చేయడంలో కూడా, కౌటిల్యుడు అనన్య సామాన్యమైన ప్రజ్ఞను ప్రదర్శించాడు. అతడు పూర్వ శాస్త్రవేత్తల సిద్ధాంతాలు, సూత్రాలు, కొంతవరకు అంగీకరించాడు. కొన్ని సందర్భాలలో, ఆ సిద్ధాంతాలకు కొన్ని తీవ్ర సంస్కరణలుకూడా చేశాడు మరికొన్ని సందర్భాలలో మూలసిద్ధాంతాలు ఖండించి సంపూర్ణముగ స్వతంత్ర సిద్ధాంత ప్రతిపాదన కుద్యమించాడు

కౌటిల్యునికి పూర్వమున్న శాస్త్రవేత్తలు ప్రతిపాదించిన సూత్రాలు, ధర్మమనే ఉక్కుచట్రంలో బంధింపబడ్డాయి. పూర్వ శాస్త్రకారులు "అర్థం" కంటె ధర్మాన్నిగూర్చి అధికంగా చెప్పారు. ఆ ధర్మశాస్త్ర నియమాలకు అర్థశాస్త్ర సూత్రాలు కట్టుబడి వుండాలని, నిర్దేశించారు. కాలచక్రం గిర్రున తిరిగింది. పరిస్థితులు మారిపోయాయి. పూర్వం చెప్పబడిన ధర్మ సూత్రాలు కాలానుగుణంగా మారుతున్న పరిస్థితుల కనుకూలంగా మారక, యాంత్రికంగా తయారయ్యాయి. అలాంటి పరిస్థితుల్లో, మారుతున్న కాలానికి అనుగుణంగా అర్థశాస్త్ర సూత్రాలను కొన్నిచోట్ల సంస్కరించాడు. కొన్ని విషయాల్లో మూల సిద్ధాంతాలే మార్చాడు. ఉదాహరణకు—కౌటిల్యునికి పూర్వమున్న ధర్మశాస్త్రకారులు విధవా వివాహాలుగానీ, వివాహబంధ విమోచనాన్నిగానీ అంగీకరించలేదు. కాని కౌటిల్యుడు కాలానుకూలంగా, వివాహ బంధ విమోచనం, ప్రోషిత భర్తృకలకు, మృత భర్తృకలకు పునర్వివాహము, ఋతుమతికి స్వయంవరణము యిత్యాది తీవ్రసాంఘిక సంస్కరణలు హిందూ సంఘంలో అతి ధైర్యంగా ప్రవేశపెట్టాడు. దైనందిన రాజ్యపాలనలో కాకలు తీరిన, రాజనీతిజ్ఞుడుగా వ్యవహరించాడు.

రాజ్య పాలనా రంగంలో కూడా అతడు మార్పులు ప్రవేశపెట్టాడు. రాజులు తమ రాజ్యాలలో గూఢచారి దళాలను ఏర్పరచాలనీ, భేదోపాయాలచే శత్రువును మోసగించి తెగటార్చాలనీ, శత్రురాజులకు వ్యతిరేకంగా ఆ రాజ్య ప్రజలలో ద్వేషం కలుగజేయాలనీ చెప్పాడు ఈ "కుటిల" మార్గాలు, పరంపరానుగతంగా వస్తున్న ధర్మసూత్రాలను నిలువునా ఖూని

# కౌటిల్యుని అర్థశాస్త్రము

చేస్తాయని పూర్వ పండితులు తలచి, ఆయనపై కత్తులు నూరారు. కౌటిల్యుడు రాజ్యపాలనా సౌష్ఠవాన్ని పటిష్ఠం చేసేందుకు ప్రవేశపెట్టిన సంస్కరణలు, సూచించిన నూత్న మార్గాలు ప్రాచీన ధర్మశాస్త్ర వేత్తల యాంత్రిక సూత్రాలకు వ్యతిరేకంగా తయారయ్యాయి. కరువు కాటకాలు నివారించేందుకు, రాజ్యంలో విప్లవం, శత్రుదండయాత్ర, మొదలైన అత్యవసర పరిస్థితులు హఠాత్తుగా సంభవించినప్పుడు, ప్రభుత్వ కోశంలో ధనం లేకపోతే సంపన్నుల నుండి బలవంతంగా డబ్బు గుంజడం, దుర్మార్గుల పొలాలను బల ప్రయోగంతో స్వాధీనం చేసుకోవడం, ప్రజల మూఢమత విశ్వాసాలను ఆసరాగా తీసుకొని అధర్మమార్గాలద్వారానైనా ధనం సంపాదించడం - యివి రాజ్యం యొక్క శాంతి భద్రతల దృష్ట్యా, సుస్థిరతదృష్ట్యా అత్యవసరమని కౌటిలీయంలో స్పష్టంగా ప్రతిపాదించాడు. కాని ధర్మశాస్త్రకారులు యీ ప్రతిపాదనలపై విరుచుకుపడ్డారు.

ధర్మగ్లాని కలుగుతుందని, కారాలు మిరియాలు నూరారు. ఐనా వారి విమర్శలకే, ఆవేశ కావేషాలకీ యిసుమంతైనా లెక్క చేయకుండా నల్లేరుపై బండిని తోలినట్లు తన మార్గాన తాను ప్రయాణించాడు చాణక్యుడు!

వాస్తవిక రాజకీయరంగంలో అధికార దాహంలో వుండేవారు ఎలా వ్యవహరిస్తారో కూడా విశదీకరించాడు. ఈ ప్రవర్తన న్యాయబద్ధమా, ధర్మబద్ధమా అనే మీమాంసకు అతడెట్టి ప్రాధాన్యం యివ్వలేదు. శత్రువులను ఓడించడంలో మోసం, అసత్యప్రచారం, కుట్రలూ, కుహకాలూ,— యివన్నీ ఉపయోగించదగిన సాధనాలనే కౌటిల్యుని అభిప్రాయం. ఈ సందర్భంలో ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్యగారి అభిప్రాయాలను యిక్కడ ఉల్లేఖిస్తాను. "చాణక్యుని ప్రపంచము వాస్తవిక ప్రపంచముగాని, ఆదర్శ ప్రపంచముగాదు. రాజులు ఎట్టి మార్గముల ననుసరించుచుండెడివారో వివరించుటయే అతని ఉద్దేశ్యము. న్యాయాన్యాయములు, ధర్మాధర్మములు విధించుటకు అతడు ప్రయత్నించుటలేదు. అతని గ్రంథమును, అందులోని సూత్రములను విమర్శించువారు ఈ విషయమును జ్ఞాపకముంచుకొనవలయును. శత్రువును మోసపుచ్చి ఓడించుట న్యాయమా అన్న విషయమును అతడు వివరించుటలేదు. శత్రువును వంచించి వశపరచుకొనుట సర్వసాధారణమని నిరూపించుటయే అతని ఉద్దేశ్యము."

ఉత్తమ లక్ష్యమును పొందుటకు వక్రమార్గాన్నైనా అనుసరించాలని అతని మతం. రాజ్యభద్రతకే, సుస్థిరతకే ఘోరవిపత్తు వాటిల్లినప్పుడు, శత్రువును ఎదుర్కొనుటకు డబ్బు అవసరమైతే, అధర్మము, వక్రమూ, దౌర్జన్యయుతమూ ఐన మార్గం ద్వారా సంపాదించినా పరవాలేదని అతడంటాడు. దీనికొక ఉదాహరణ యిచ్చాడు. ఒక గోవును కసాయి వేటకాడొకడు తరుముకొని వచ్చాడు. ఆ ఆవు పారిపోయివచ్చి ఒక పరమ సత్యవ్రతుని ఆశ్రమంలో దాక్కున్నది. వేటకాడు పరుగెత్తుకొనివచ్చి "ఆవు యీ దారిన పోయినదా?" అని అడిగితే, సత్యాన్ని చెప్పి గోవును కసాయి కత్తికి ఒప్పగించాలా? లేక అసత్యం పలికి దాన్ని రక్షించాలా? ఆ సమయంలో ఎంతటి సత్యవ్రతుడైనా, అబద్ధమాడైనా ఆవును రక్షించడం ధర్మం, న్యాయం — అంటాడు కౌటిల్యుడు. 100 అబద్దాలాడైనా ఒక పెళ్ళి చేయమనే సామెత తెన్నుమాట! ఉత్తమ సాధ్యాలను అయుక్త సాధనాల ద్వారానైనా సాధించవచ్చు. సాధించాలి అని అంటాడు. ఈ ప్రతిపాదన ఆచరణలో చేసి చూపినవాడు, 19 వ శతాబ్దంలో జీవించి, జర్మన్ సామ్రాజ్య వాదానికి పునాదులు వేసిన అసామాన్య రాజనీతిజ్ఞుడు బిస్మార్క్. అంతకుపూర్వం క్రీ. పూ. 4 వ శతాబ్దంలోనే, మగధలాంటి అతి చిన్న రాజ్యాన్ని తన యుక్తిచే, ప్రజ్ఞచే దిగంత విశ్రాంతమైన మౌర్య సామ్రాజ్యంగా విస్తరింపజేసిన మహోన్నత ప్రతిభాశాలి కౌటిల్యుడు.

## మేక్ వెల్లి

సాధ్యాలు సాధనాలను సమర్థిస్తాయి అనే సిద్ధాంతాలను ప్రతిపాదించిన మరో రాజకీయ తత్వవేత్త—ఇటాలియన్ దేశీయుడైన నికోలో మేక్వెల్లి. ఇతడు "ప్రిన్స్" (Prince) అనే ప్రపంచ ప్రఖ్యాతి గ్రంథం రచించాడు. రాజులు తమ గమ్యాన్ని చేరుటకు, తాము వాంఛించిన లక్ష్యాన్ని సాధించేందుకు ఎలాంటి కుట్రలనైనా చేయవచ్చుననీ, మోసాలు, అసత్యాలు, దుర్మార్గాలనైనా చేపట్టవచ్చుననీ, అతి నగ్నంగా ప్రతిపాదించాడు. ఈ మార్గాలు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో నాటి 15 వ శతాబ్దపు రాజులు, రాజకీయవేత్తలు, మతగురువులు అనుసరిస్తున్నప్పటికీ, వారంతా మేక్వెల్లీ సిద్ధాంతాలను నోరారా తిట్టి కారాలు మిరియాలు నూరారు. వీరు ఏ మార్గాలనైతే రహస్యంగాను, బహిరంగంగాను, ఆచరణలో పెట్టారో, వాటని సిద్ధాంతరీత్యా సమర్థించి ప్రచారం చేయడమే మేక్వెల్లీ చేసిన 'బ్రహ్మాం

దమైన నేరం'. అందుకని నాటి క్రిస్టియన్ నీతి శాస్త్రవేత్తలు, పీఠాధిపతులు, ఆయనమీద ఒక్కుమ్మడిని విరుచుకుపడ్డారు. ఈ విషయాన్ని గూర్చి ప్రొఫెసర్ మాక్సీ యిలా గంటాడు—

"Niccolo Machiavelli is perhaps the most universally reprobated figure in the history of political philosophy; the man whose precepts are universally disavowed in principle, but regularly followed in practice. Yet Machiavelli was a moral man according to the conventions of his time and apparantly also a man of considerable culture and charm."

కౌటిల్యుని కాలం నాటికి భారతదేశంలో ప్రధానంగా ఉత్తరభారతంలో చిన్న చిన్న రాజ్యాలు అసంఖ్యాకంగా వుండేవి. రాజకీయ ఐక్యం కరిమింగిన వెలగపండులా అదృశ్యమైపోయింది. నిరంతరం అంతఃకలహాలలో యీ రాజ్యాలు కుతకుతలాడాకూడా కలహపోతూనే వున్నాయి. రాజకీయమైన ఐక్యం నశించి శాంతిభద్రతలు క్షీణించిన విపత్కర పరిస్థితులలో కౌటిల్యుడు ఉద్భవించాడు. అలాంటి పరిస్థితుల్లో భారతదేశాన్నంతటినీ ఏకచ్ఛత్రాధిపత్యం క్రిందకు తీసుకువచ్చి తద్వారా ఐక్యభారత నిర్మాణమే కౌటిల్యుని ఏకైకలక్ష్యం. ఈ మహత్తర లక్ష్యసిద్ధికే, ఆయన అర్థశాస్త్ర రచన కుపక్రమించాడు.

ఇదే విధమైన అనైక్యం, అంతః కలహాలు, శాంతిభద్రతలలేమి మేకావల్లి జీవించిన ఇటలీలో వుండేవి. అలాంటి విచ్ఛిన్నకర పరిస్థితులనుండి మాతృదేశాన్ని రక్షించి ఏకీభూతమయిన ఇటలీ సంస్థాపన కోసం మేకవెల్లి తన సుప్రసిద్ధ గ్రంథం రచన చేశాడు.

మానవస్వభావంలో అధికార దాహం అంతర్గర్భితంగా వుండుంటాడు కౌటిల్యుడు ఆ అధికార దాహంలోని కౌటిల్యాన్నీ, వంచననీ అసూయనీ కుట్రనీ ఉన్నది వున్నట్టుగా అతడు పరిశీలించి వివరించాడు. ఇదేపని మేకవెలీకూడా చేశాడు. కౌటిల్యునికి పూర్వమున్న ధర్మశాస్త్రవేత్తల దృక్పథం ఇందుకు భిన్నమైంది. అది ఆదర్శాల పుట్ట; ఆచరణకి ఎంతో దూరం. ధర్మశాస్త్రవేత్త రాజ్యాదర్శాలను, వాటిని సాధించేందుకు వినియోగించవలసిన మార్గాలను వివరించాడు. కౌటిల్యుడు దీనితో భేదించాడు. ఆదర్శప్రాయము రాజ్యాన్ని (Republic) "స్వర్గలోకంలో" సృష్టించిన ప్లేటోతో ఆయన శిష్యుడు అరిస్టాటిల్ ఎలా అంగీకరించలేదో, అలాగే పూర్వ ధర్మశాస్త్రవేత్తల జనప్రాయమైన ఆదర్శయుతమైన, కేవల ధర్మబద్ధమైన సూత్రాలనుండి కౌటిల్యుడు భేదించి, ఆచరణ యోగ్యము నాగుతున్న సమాజ పరిస్థితుల కనుగుణము అయిన మార్గాన పయనించినాడు. అర్థశాస్త్ర గమ్యాన్ని మరో మార్గం వేపు మళ్లించి, ధర్మశాస్త్రానికి తలవంచని స్వతంత్రశాస్త్రంగా నిర్మించాడు. ఇది ఆయన మేధస్సుకి ఎదురులేని తార్కాణం. అందువల్లనే కౌటిల్యుడు ప్రాచీన హైందవ అర్థశాస్త్ర చరిత్రలో అజరామరుడయ్యాడు. నాటి పండితలోకంలో అర్థశాస్త్రాధ్యయనాన్ని పురికొల్పి మరణావశిష్టంగావున్న శాస్త్రానికి తిరిగి జీవంపోశాడు. అందుకనే కామందకుడు తన "నీతిసారం"లో, కౌటిల్యుణ్ణి అవతార పురుషుడుగా ప్రశంసించాడు.

## కౌటిలీయం - అర్థశాస్త్ర నిర్వచనం

కౌటిల్యుడు అర్థశాస్త్రాన్ని యిలా నిర్వచించాడు: "అర్థం" అంటే ప్రజలతో కూడిన ఒక ప్రత్యేక భూభాగం (జనపదం). ప్రజలతో కూడిన ఒక ప్రత్యేక భూభాగాన్ని సంపాదించి, దాన్ని తామరతంపరలా అభివృద్ధిచేయుటకు అనువైన వివిధ మార్గాలను పరిశీలించు శాస్త్రమే—అర్థశాస్త్రం. (That Science which deals with the means of acquisirion and growth of territory).

"మనుష్యాణాం వృత్తిరర్థః
మనుష్యవతీ భూమి రిత్యర్థః
తస్యా పృథివ్యా లాభపాలనోపాయః శాస్త్రం
అర్థశాస్త్రం ఇతి" (అర్థశాస్త్రం—పేజి 426)

మానవులను బ్రతికేందుకు మూలాధారం అర్థం. అర్థం అంటే ప్రజలతో కూడిన భూభాగం. కాబట్టి ఆభూభాగాన్ని ఎలా సంపాదించాలో, ఎలా భద్రపరచాలో, వివరించు శాస్త్రమే—అర్థ శాస్త్రం.

రాజదండాన్ని నిరంతరం సమర్థతతో ఉపయోగించడమే "దండనీతి" అని నిర్వచించాడు కౌటిల్యుడు. ఈనీతిలో నాలుగు ప్రధాన విషయాలు గర్భీకృతమై వున్నాయి.

1. ఏదైతే లభ్యంకాలేదో దాన్ని సంపాదించడం; (అలబ్ధ లాభార్థ.)

2 ఏదైతే లబ్ధమైనదో దాన్ని భద్రపరచడం; (లబ్ధ పరిరక్షణం)

3. అలా భద్రపరచబడిన దానిని వృద్ధిచేయడం; (రక్షిత వివర్ధనం)

4 అలా వృద్ధిచేయబడిన దాన్ని తగినవారికి—అర్హులకు—పంచిపెట్టడం. (వృద్ధస్య తీర్థేషు ప్రతిపాదనం)

కౌటిల్యుడే కాదు యిలాంటి నిర్వచనంచేసింది; మనువుకూడా తన ధర్మశాస్త్రంలో పై విధంగా చెప్పాడు. భూభాగాన్ని (దండం) సైన్యం సహాయంతో సంపాదించాలని చెప్పాడు. భూభాగం (సంపాదన) తో సంబంధించినదే దండనీతి లేక అర్థశాస్త్రం అని మనువు నిర్వచనం.

## రాజ్య దృక్పథం : దాని లక్షణాలు

ప్రాచీన హైందవ అర్థశాస్త్రజ్ఞులు రాజ్యానికి ఏడు లక్షణాలు, లేక ప్రకృతులు వుంటాయని చెప్పారు. పాశ్చాత్య రాజనీతి శాస్త్రజ్ఞులు, రాజ్యానికి నాలుగు లక్షణాలుంటాయని చెప్పారు—1. జనులు 2. భూభాగం 3. ప్రభుత్వం 4. సార్వభౌమాధికారం. ఈ నాల్గవ లక్షణాన్ని బహిర్గత, అంతర్గత సార్వభౌమాధికారాలని రెండుగా విభజించారు.

మన శాస్త్రజ్ఞులు రాజ్యానికి ఏడు ప్రకృతులుంటాయని చెప్పారు. ప్రకృతులంటే రాజ్యంయొక్క సహజభాగాలనీ, సహజమైన అంగాలనీ అర్థంచేసుకోవాలి. రాజ్యంఅంటే రాజుపాలించే ప్రత్యేక భూభాగాన్ని సూచించదు. రాజు పాలించే భూభాగమే "రాజ్యం" ఐతే, ఆ రాజ్యాన్ని (State) కున్న ఏడు ప్రకృతుల్లో "రాజు" ఒక లింగంగా ఎందుకు పరిగణింపబడాలి? రాజు పాలించే భూభాగమే రాజ్యం ఐతే, ఆ భూభాగానికి "జనపదము" అనే పేరుపెట్టి దానిని ఒక స్వతంత్ర ప్రకృతిగా ఎందుకు మన రాజనీతిశాస్త్ర వేత్తలు పరిగణించారు? కాబట్టి రాజు పాలించు భూభాగం రాజ్యంకాదు. ఆ భూభాగానికి జనపదము అనే పేరు ప్రత్యేకంగావుంది. రాజ్యం అంటే ప్రభుత్వంకూడా కాదు. రాజ్యమునకు సంబంధించిన వివిధ కార్యకలాపాలను ఆచరణలో పెట్టు యంత్రము లేక కార్యనిర్వాహకవర్గమే ప్రభుత్వం. పోతే దుర్గం (Fort) కోశం (Treasury) యీ రెండూకూడా రాజ్యంయొక్క ప్రకృతులనియే మనవారి దృక్పథం. కాబటి ప్రభుత్వంగానీ, రాజు పాలించే ప్రత్యేక భూభాగంగానీ రాజ్యంకాదు. స్వామి, అమాత్యులు, జనపదం, దుర్గం, కోశం, దండం, మిత్రం—యీ యేడు అంగాలుకలిస్తే రాజ్యం ఔతుందని మన శాస్త్రజ్ఞుల దృక్పథం.

కౌటిల్యుడు తన "అర్థశాస్త్రం"లోనూ కామందకుడు "నీతిసారం" లోనూ, యీ యేడు ప్రకృతులనూ అతివివరంగా వివరించారు. ప్రస్తుతం పై ఏడు ప్రకృతులనుగూర్చి కౌటిల్యుడు చెప్పినది పరిశీలిద్దాం.

1. స్వామి: స్వామి (రాజు) రాజ్యంయొక్క అత్యంత ప్రధానమైన లక్షణం లేక భాగమని కౌటిల్యుడంటాడు. స్వామి అంటే రాజు లేక సార్వభౌమాధికారి. ఈ సార్వభౌమాధికారం ఒకనియందుగానీ లేక పెక్కుమందిలోగానీ వుండవచ్చును. ఈ స్వామికి ప్రధానంగా వుండవలసిన లక్షణాలు ఇవి:

ప్రజల్ని ఆకర్షించి వారు తన నాయకత్వాన్ని అనుసరించునట్లు చేసుకోగలగాలి. (అభిగామిక స్వభావం.)

1. ప్రజల్ని అర్థంచేసుకోగలగాలి (ప్రజ్ఞా.)

2. శక్తివంతుడై వుండాలి (ఉత్సాహ.)

3. ఆత్మసంపద కలిగినవాడై వుండాలి (ఆత్మసంపద)

4. శక్యసామంతుడై వుండాలి (తనచుట్టూవుండే వ్యక్తులను అదుపులో పెట్టగలిగినవాడై వుండాలి)

5. క్షుద్రులుగాని మంత్రి మండలిని కలిగివుండాలి.

6. యుద్ధంచేయడానికి సంధిచేసికొనడానికీ తగిన సందర్భాన్ని గుర్తించగలిగిన చాకచక్యం వుండాలి.

పైనచెప్పిన లక్షణాలను నిశితంగా పరిశీలిస్తే, స్వామిఅంటే సామంతరాజుగాదనీ, అంతర్గత బహిర్గత సార్వభౌమాధికారాల్ని చలాయిస్తూ ఏ విదేశిరాజ్యాధికారానికీ లొంగని సార్వభౌమాధికారి అని బోధపడుతుంది.

2. అమాత్యులు:— సాధారణంగా అమాత్యుడంటే రాజమంత్రి అని అర్థం. కాని కౌటలీయంలోని మొదటి అధ్యాయాలను జాగ్రత్తగా పరిశీలిస్తే, అమాత్యపదానికి అర్థం, రాజమంత్రికాదనీ, వివిధమైనరాజోన్నతాధికారి ఐనా కావచ్చునదని స్పష్టంగా బోధపడుతుంది. అమాత్యుడు జనపదానికి చెందినవాడై వుండాలనీ, రాజ్యంపై అధికతర భక్తిశ్రద్ధలను కలిగివుండాలనీ చెప్పాడు.

3. జనపదం:—ఈపదాన్ని జనం—పదముఅని రెండుభాగాలుగా విభజించాలి. దీనికి సామాన్యార్థం, పల్లెపట్టు లేక గ్రామము. కాని అర్థశాస్త్ర పరిభాషలో దీనికో ప్రత్యేకమైన అర్థంవుంది. పాశ్చాత్యరాజనీతి శాస్త్రంలో జనులు, భూభాగంఅనేది స్టేట్ యొక్క

రెండు లక్షణాలు. కాని మన అర్థశాస్త్రజ్ఞులు ఈ రెంటిని ఒకేపదంలో యిమిడ్చి జనపదం అనే పేరును వ్యాప్తిలోకి తెచ్చారు. జనపదాన్ని కౌటిల్యుడు అత్యంత ప్రతిభావంతంగా నిర్వచించాడు. మొదటి "పదము" అనే భాగాన్ని (భూభాగం) నిర్వచించి దానికి ఉండవలసిన ప్రధానలక్షణాలు వివరించాడు. పిదప "జన" అనుదాన్ని నిర్వచించి ఒక ప్రత్యేక భూభాగమందలి జనులకుండవలసిన లక్షణాలు వివరించాడు. భూభాగమున్నచోటనే జనులు నివసిస్తారు, జనులు భూభాగమందే నివసిస్తారు కనక ఈ రెంటినీ (జన–పద) ఒకటిగానే పరిగణించి, 'జనపదం' అను పేరును వ్యాప్తిలోకి తెచ్చారు. ప్రాచీన హైందవ రాజనీతి శాస్త్రవేత్తల ప్రతిభ కిది తార్కాణం. పాశ్చాత్యుల దృష్టిలో భూభాగము జనులూ వేర్వేరు లక్షణాలతో ఉన్నాయి. ఇది యాంత్రిక దృక్పథం. కారణం? జనులు భూభాగమున్న చోటనే నివాస యోగ్యమగు ప్రదేశాలు సృష్టించుకోనగలరు. రొచ్చు ప్రాంతాలు పర్వత ప్రదేశాలు, పెద్దపులులవంటి మృగాలుండే భీకరారణ్యాలు లేని ప్రదేశం ఉత్తమ జనపదమని కౌటిల్యుడన్నాడు సస్యశ్యామలమై ఫలవంతమైన ఉత్తమ క్షేత్రములూ, ఏనుగు లేడులపలో నిండిన అరణ్యాలు జనపదంలో ఉండాలి. ఇదంతా భూభాగం లక్షణాలను గూర్చి చర్చ.

ఇక జనులను గూర్చి ఏం చెప్పాడో పరిశీలిద్దాం. జనులు శత్రు ద్వేషం కలవారై వుండాలని శక్య సామంతులై వుండాలని అంటాడు. అంతేగాదు, కర్మ శీలురైన కర్షకులతో నిండి వుండాలి. జనులు రాజు యెడల భక్తి ప్రపత్తులలో మెలగుతూ శుచిగా వుండాలి. 1 శత్రుద్వేషం 2 శక్య సామంతత 3. కర్మ శీలకర్షక 4 భక్తి శుచిత్వం—యీ నాలుగు లక్షణా గలిగిన వారై వుండాలి.

1 ప్రజలు శత్రువులను ద్వేషించువారై దేశభక్తులై రాజ్య స్వాతంత్ర్యాన్ని పరిరక్షించ నిరంతర దీక్షా కంకణులై వుండాలి.

2 పరిసర రాజ్యాలను యుద్ధరంగమందు ఎదిర్చే శక్తిసామర్థ్యాలు గలవారై వుండాలి.

3 రాత్రింబవళ్ళు కష్టించి భూమిగున్న దేశాన్ని భాగ్యవంతం చేయగలిగిన కర్మ శీలత గలిగిన కర్షకులతో నిండి వుండాలి.

4 రాజ్యం (state) యెడల భక్తి ప్రకటిస్తూ శుచిగల హృదయాలు కలిగివుండాలి. (భక్తి శుచి మనుష్యా.)

4 దుర్గం: రాజ్యమందలి నాలుగు-దిక్కులలోను యుద్ధావసరాలకోరకు శత్రు విధ్వంసనకోరకూ దుర్గాలు నిర్మించాలి. ఏ రాజు ప్రకృతి సిద్ధమైన దుర్గాన్ని నిర్మిస్తాడో ఆతడు శత్రురాజులను సునాయాసంగా నిగ్రహించగలడు. జలదుర్గం గిరిదుర్గం ఎడారి దుర్గం అటవీదుర్గం వంటి నాలుగురకాల దుర్గాలను నిర్మించాలని కౌటిల్యుడు చెప్పాడు.

5 కోశం: రాజ్యకోశం వెండి బంగారాలతో నిండి ఉండాలి. బంగారు వెండి నాణాలతో నూ, వజ్రవైడూర్య మరకతగోమేధిక పుష్యరాగాది అమూల్య రత్నసంచయంతోను కోశాగారం నిరంతరం ఘలు ఘలు మంటూవుండాలి. ఈవిధంగా వుండినప్పుడే విపరీత విపత్కర పరిస్థితులనుండి రాజ్యం రక్షింపబడుతుంది. ఈ అమూల్య సంపదనంతటినీ రాజుగాని అతని తండ్రి తాతలుగానీ ధర్మబద్ధమైన మార్గాల ద్వారా సంపాదించాలంటాడు. రాజ్య సంరక్షణ, సామ్రాజ్య విస్తరణ, కట్టుకోటకోల నిర్మాణాలు, అంతః కలహపరిహారణ, వర్తక వాణిజ్యాల అభివృద్ధి వంటి సర్వవ్యవహారాలు, రాజ్యకోశంమీదనే ప్రధానంగా ఆధారపడి వుంటాయంటాడు. కాబట్టి కోశాభివృద్ధికి రాజులు నిరంతర జాగరూకులై వుండాలని చెప్పాడు. "ధనమూల మిదమ్ జగత్" అనే పరమ సత్యాన్ని గ్రహించాడు కౌటిల్యుడు. ప్రభుత్వ యాజమాన్యాన పారిశ్రామిక శాఖలను (ప్రచార సమృద్ధి) నడిపినప్పుడు, సస్యసంపద సమృద్ధిగా వున్నప్పుడు, వర్తక వాణిజ్యాలు ఉచ్ఛదశలో వున్నప్పుడు, రాజ్య కోశం ధనకనక వస్తువాహనాలతో సమృద్ధిగా ఉండినప్పుడు మాత్రమే శత్రువులదాడిని రాజు ఎదుర్కొని జయింపగలడు వర్తకాభివృద్ధిపై కోశం, కోశాభివృద్ధిపై రాజ్య సుస్థిరతను కాపాడు సైన్యం, ఆధారపడి వుంటాయని చెప్పాడు.

బొక్కసం ఖాళీగావున్నప్పుడు శత్రుదండయాత్ర జరిగితే అధర్మమార్గాలద్వారానైనా రాజు ద్రవ్యాన్ని సేకరించాలి. విపత్కరసమయాలలో ధర్మం కార్యాచరణకు అడ్డురాగూడదంటాడు. అందుకనే కౌటిల్యుడు ధర్మశాస్త్ర నిబంధనల సంకెళ్ళనుండి అర్థశాస్త్ర సిద్ధాంతాలను బైటకీలాగి, ఆ శాస్త్రాన్ని సర్వ సమగ్రమగు స్వతంత్ర శాస్త్రంగా సృష్టించగలిగాడు.

ఫలవంతాలైన భూములపై అధికంగా పన్ను విధించడం, సంపన్నులైన వణిక్ ప్రముఖులు అమ్మే సరకులపై విపరీతంగా ప్రభుత్వ సుంకాన్ని వసూలు చెయడం, రాజు పేరట ఋణాల వసూలుచేయడం, (Forced loans and Benevolences) ప్రజల మూఢవిశ్వాసాలను, మతనమ్మకాలను, ఆసరాగా తీసి

కాని రాజ్యప్రయోజనాలకోసం డబ్బు దారుణంగా గుంజడం, ద్రోహులు, నేరస్థులైన వ్యక్తుల భూములు దాక్షిణ్యరహితంగా స్వాధీనపరచుకోవడంవంటి వివిధ మార్గాలద్వారా ప్రభుత్వకోశాన్ని అవసరసమయాల్లో తప్పక పూరించాలని గట్టిగా చెప్పాడు. చాణక్యుడు సమకాలీన ధర్మసూత్రాల అనుసరణకంటే, రాజ్య స్థిరతయే ప్రధానలక్ష్యమనీ, దానికొరకు ధర్మోల్లంఘనం జరిగినా జాగవచ్చునీ, దైనందిన పరిపాలన నిర్వహణలో అలాంటి ఉల్లంఘనం అనివార్యమనీ అంటాడు.

6. దండంలేక బలం (సైన్యం) - రాజు సైన్యం సహాయంతోనే శత్రువును ఎదురుదెబ్బతీయగలడు; రాజ్యములో శాంతిభద్రతలు సంస్థాపించగలడు. కౌటిల్యుడు ఆరువిధాలైన సైనికులను, వర్ణించాడు.

1. మౌల; (సాంప్రదాయసిద్ధమైన రాజ సైన్యం)

2. భృతక (కిరాయికివచ్చే సైనికులు.)

3. శ్రేణి (యుద్ధాలుచేసే వర్గాల సైనికులు)

4 మిత్రుడైన రాజుకు చెందిన సైన్యం.

5. శత్రురాజుకు చెందిన సైన్యం.

6 అటవీబలం (చెంచుకోయలు, నిషాదులు యిత్యాది జాతులకు చెందిన సైన్యం.)

కౌటిల్యుని గురువర్యుడు మరో వరుసక్రమంలో పై వరుసకు భిన్నంగా చెప్పాడు. ఆ వరసక్రమం యిది—1. బ్రాహ్మణ సైనికులు 2. క్షత్రియ సైనికులు 3 వైశ్య సైనికులు 4 శూద్ర సైనికులు బ్రాహ్మణ సైనికులు మిగతా సైనికులకంటే ఎందుకు అధికులంటే—వారియొక్క కాంతి (lustre) వల్లనని కౌటిల్యుని గురువు చెప్పాడు. దీనితో కౌటిల్యుడు సుతరామూ ఒప్పుకోలేదు. తన అనంగీకారానికి ఈ క్రింది కారణాలు చూపించాడు. బ్రాహ్మణ సైన్యానికి సాష్టాంగదండప్రణామం చేయుటద్వారా, శత్రు రాజు బ్రాహ్మణ సైనికుల్ని సునాయాసంగా లొంగదీయవచ్చునని కౌటిల్యుడు చెప్పాడు. యుద్ధకౌశలంలో నైపుణ్యాన్ని సంపాయించిన క్షత్రియవీరులు, బ్రాహ్మణ సైనికులకంటె నిస్సంకోచకంగా అధికులని చెప్పాడు. ఆ విధంగానే వైశ్యశూద్ర సైనికులు కూడా బ్రాహ్మణ సైనికులకంటె అధికులంటాడు.

తండ్రి తాతల దగ్గరనుండీ సైనిక వృత్తినే జీవనాధారంగా స్వీకరించి ఎలాంటి విపత్కర దీర్ఘదండయాత్రలనైనా, సహించి భరించి, కత్తిబట్టే కదన రంగంలో శత్రువును ముక్కముక్కలుగా నరుకగల క్షత్రియ సైన్యమే అద్వితీయమైన సైన్యమని కౌటిల్యుడు సిద్ధాంతీకరించాడు. పూర్వశాస్త్రవేత్తలు సైనికులను వర్గీకరించిన క్రమంలో రాజ్యసుస్థిరతకు భంగం వాటిల్లుతుందని కౌటిల్యుడు అన్నాడు.

7. మిత్ర:—మిత్రులలో రెండు రకాలు.— 1. సహజమిత్రుడు, 2. కృత్రిమమిత్రుడు. రెండవ వానికంటె మొదటివాడే సర్వవిధాలా శ్రేయస్సును కోరగలవాడని చెప్పాడు.

సూక్ష్మంగా, పైన చెప్పిన ఏడుభాగాలు లేక ప్రకృతులు ప్రాచీన హైందవ రాజ్యాంగ యంత్రానికి సంబంధించిన ఏడు అంగాలని ప్రాచీనార్థశాస్త్ర వేత్తల దృక్పథం.

## కౌటిలీయం—సామ్రాజ్యపరిపాలన

క్రీ. పూ. 322 లో మౌర్యసామ్రాజ్యం స్థాపింపబడింది. మౌర్యసామ్రాజ్య స్థాపనకు, కౌటిలీయార్థశాస్త్రం ఆవిర్భావానికి అవినాభావసంబంధం వుంది. కౌటిలీయం సహాయంలేని మౌర్య సామ్రాజ్యం పునాది లేని పేకమేడ. మౌర్య సామ్రాజ్యము లేని కౌటిలీయం నిర్జీవశాస్త్ర గ్రంథం. మౌర్యసామ్రాజ్యం బొంది, కౌటిలీయం ఊపిరి.

“సహాయ సాధ్యమ్ రాజత్వమ్, చక్రమేకమ్ న వర్తతే”—రాజ్య పరిపాలన రథ చక్రాలవంటిది. ఒక చక్రంతో రథం యెన్నడూ నడవదు. కాబట్టే రాజత్వం సహాయ సాధ్యం. సామ్రాజ్యాన్ని పరిపాలించేటప్పుడు చక్రవర్తి ఒక్కడే సర్వకార్యాలనీ నిర్వహించలేడు. అందుచేత రాజు అమాత్యుల సహాయంతో రాజ్యపాలన చేయాలి. కౌటిల్యుని నిర్వచనం ప్రకారం అమాత్యుడంటే రాజమంత్రి కాదు. ప్రతి రాజోద్యోగీ అమాత్యుడే (సివిల్ సర్వెంట్). ప్రతిభావంతుడూ, రాజకార్యదక్షుడూ, రాజభక్తియుతుడూ ఐనవాడే అమాత్యపదవికి అర్హుడు. అమాత్యులందరిలోను మంత్రులు ముఖ్యులు. రాజు నలుగురు మంత్రులతో కలిసి ఆలోచనచేసి పాలించాలి. మంత్రులేకాక ‘మంత్రి పరిషత్తు’ అనే మరోసంస్థకూడా వుండాలి. కంటికి రెప్పలా రాజును యీ పరిషత్తు కాపాడుతుంది. మంత్రులు మంత్రిపరిషత్సభ్యులూ, బహుశాస్త్రజ్ఞానానుభవంలో నిష్ణాతులై వుండాలని కౌటిల్యుడు కోరాడు. యుద్ధానికి సంబంధించిన కార్యాలను చక్కబెట్టడం, యుద్ధావసరాలకు కావలసిన సదుపాయాలు కల్పించడం, మంత్రి పరిషత్తు ప్రధాన బాధ్యతలు. దీని సభ్యులు తరచు పర్యటన చేస్తూ పరగ

కాల్లోని ప్రభుత్వోద్యోగులు తమతమ పనులు చక్కగా నిర్వహిస్తున్నారో లేదో పరిశీలించాలి. తాము తెలిసికొన్న విషయాలు రాజుకు విన్నవించడం వంటివి వీరి బాధ్యతలు. రాజు మంత్రి పరిషత్తును అత్యవసర సమయాలలోనే సమావేశపరిచి వారితో సంప్రదించాలి. వారిలో ఎక్కువమంది ఏది కార్యసిద్ధిదాయకమని సూచిస్తారో దాన్నే రాజు ఆచరించాలి. మంత్రులలో ముఖ్యుడు ప్రధానామాత్యుడు. ఇతడు రాజుకు కుడిభుజం. రాజ్యపాలనలో రాజు తర్వాత రాజంతటివాడు. రాజ్యాన్ని అపహరించ గలంతటి అవకాశం అతనికుండేది ప్రాచీన హిందూ రాజ్యానికి యుద్ధమూ, అంతర్గత విప్లవమూ, మహా అపాయకరమైనవి. యుద్ధంవస్తే రాజు వునికికే భంగం వాటిల్లుతుంది. అందుచేత, యుద్ధం, అంతర్గత విప్లవంలాంటి విపరీత విపత్కర పరిస్థితులలో రాజు తానుచేసిన దోషాలేవయినా వుంటే ఒప్పుకొని ప్రధానమంత్రిని శాంతింపజేయాలి. కాకపోతే పదవీచ్యుతి ఖాయం. నాటి రాజరిక వ్యవస్థలో ప్రధానామాత్య పదవి ప్రాముఖ్యాన్ని శ్రీ మామిడిపూడి వెంకట రంగయ్యగారు యిలా వివరించారు— "అమాత్యపదవి యింతటి గౌరవముతో అధికారముతోను, కూడుకొనిన దగుటచేతనే, ప్రభువునుండి యితనిని వేరుపరచినయెడల తమకు తప్పక జయము లభించునని శత్రువులు నమ్ముచుండువారు. రాజ్యమందలి గూఢచారు లందరిపై అమాత్యునికి నిరంకుశాధికార ముండెడిది." అందుకే కౌటిల్యుడు పురోహితుడు, ప్రధానమంత్రి ఎంతటి మహాపరాధాన్ని చేసినా, వారికి మరణదండన విధించరాదని చెప్పాడు.

## రాజకార్య నిర్వహణ

కౌటిల్యుని కాలంలో రాజకార్య నిర్వాహకులు మూడుభాగాలుగా విభజింప బడ్డారు. రాజు సమక్షమందుండి రాజ్యమంతటిపై కార్య నిర్వహణాధికారం వహించే కేంద్ర కార్య నిర్వాహకోద్యోగులు కొందరు. వారి పేర్లివి—1. మంత్రి, 2. పురోహితుడు, 3. సేనాపతి, 4. యువరాజు, 5. దౌవారికుడు, 6. అంతర్వంశికుడు, 7. ప్రశాస్త, 8. సమాహర్త, 9. సన్నిధాత, 10. ప్రదేష్ట, 11. నాయకుడు, 12. పౌరవ్యావహారికుడు, 13. కార్మాంతికుడు, 14. మంత్రి పరిషదధ్యక్షుడు, 15 దండపాలుడు, 16. దుర్గపాలుడు, 17. అంతపాలుడు, 18. ఆటవికుడు. ఈ 18 మంది ఉద్యోగులకు 18 తీర్థాలని పేరు. ప్రధానకార్యాన్ని దేనైనా ప్రారంభించాలంటే ధనం లేకపోతే అడుగు ముందుకునడవదు. అందుచేత ధన సేకరణతో, కూడుకొన్న సమాహర్త ఉద్యోగం అధికతర బాధ్యతతో కూడుకొన్నది. రాజ్యానికి ఆదాయాన్నిచ్చే ప్రధాన అంగాలు—దుర్గ, రాష్ట్ర, ఖని, సేతు, వన, వ్రజ, వణిక్పథాలు. వీటిని మంచిస్థితిలో ఉంచి బాగా వృద్ధిచేయాలి. విపత్తులేవైనా ముంచుకొస్తే, వారించేందుకే కోశాన్ని పుష్కలంగా నింపుతూండడం సమాహర్త విధి. ఈ ఏడు రకాలైన ఆదాయాల్ని వసూలుచేయడానికి ఐదు లేక పది గ్రామాలపై గోపుని నియమించాలి. ఇతడు గ్రామంలోని సాగు భూముల్నీ, బంజరు భూముల్నీ, సర్వే చేయించి వాటికి సంబంధించిన దాన విక్రయాదుల్ని, రిజిష్టర్ చేయడం, నాలుగువర్ణాలకు చెందిన ప్రజల జననమరణ లెక్కలను వ్రాయడం చేయాలి. గోపునిపై స్థానికుడనే మండలాధికారీ, అతనిపై ప్రదేష్ట అనే రాష్ట్రాధికారీ, నియమింపబడేవారు. వీరందరి సహాయంతో సమాహర్త అప్రమత్తుడై జనపదాన్ని పరిశీలిస్తూ విషయసేకరణకు గూఢచారులను, జనపదమంతా తిప్పుతూ విషయాలను గ్రహించేవాడు. యుద్ధం, దుర్భిక్షం యిత్యాది ఉపద్రవాలవల్ల కోశం ఖాళీఐతే, దేవుని వుత్సవాలు, మతకార్యకలాపాల వంటి సత్కార్యాల కోసం ధనం కావాలని మిషపెట్టి పౌరుల్ని యాచించాలి. మొదట కొంతమంది ధనవంతుల్ని ప్రోత్సహించి అధిక మొత్తాల్ని రాబట్టాలి. ఈ మొత్తాలు చూచి, పౌరజానపదులు తమ తమ ముడుపుల్ని ముట్టచెప్పేట్లు చేయాలి. యాచింపబడకుండా తమంతట తామే రాజుకు డబ్బు యిచ్చే వారికి, వారివారి మొత్తాలను దృష్టిలో పెట్టుకొని స్థాన, ఛత్ర, వేష్టన, విభూషణావంటి బిరుదులు యివ్వాలి. కోశం ఖాళీగావుంటే దేవద్రవ్యాన్నీ, ప్రేతద్రవ్యాన్నీ కూడా సంగ్రహించవచ్చునని కౌటిల్యుడు ఖండితంగా చెప్పాడు. సంకట సమయాల్లో మతవిశ్వాసాలు, మూఢాచారాలు, ప్రచారంచేసి మోసంచేసి ఐనా, బెదిరించైనా, ప్రజలనుండి ధనాన్ని రాబట్టాలి, అని ఖండితంగా, నిర్భీతిగా చెప్పాడు. కౌటిల్యుడు తన శాస్త్రంలో ప్రతిపాదించిన సూత్రాలకు, కేవల ధర్మసూత్రాలకు సమన్వయం కుదరదని వేరే చెప్పనక్కర లేదు. లక్ష్యం ఎంత పవిత్రమైనదో, దాన్ని సాధించేందుకు అవలంబించే మార్గాలు కూడా అంత పరిశుద్ధంగా వుండాలని - చాలా మంది చెప్పవచ్చు. ఐతే దురదృష్టవశాత్తూ కౌటిలీయంలో ధర్మాధర్మాలకి, మంచిచెడ్డలకీ తావులేదు. అతడు సూచించిన కూటయుద్ధాలు. భేదోపాయాలు, హింసాకృత్యాలు, మోసం, కుటిలత్వం, ధర్మశాస్త్ర వేత్తలకీ, నీతిశాస్త్ర పారంగతులకీ నచ్చకపోవచ్చు. ఆదర్శానికీ ఆచరణకీ ఎంతోదూరంవుందని గుర్తించిన కౌటిల్యుడు సర్వకుటిల

తంత్రాలను ఎత్తుగడలను దైనందిన రాజ్యవ్యవహారాలలో మొలబంటి లోతుదాకా మునిగిన పరిపాలకుడు తప్పక అనుసరించ వలసిందేనని చెప్పాడు. ఐతే ఈ దృక్పథం రామాయణ కాలంనాటికే బీజప్రాయంలో వుంది. దానిని విపులంగా వివరించినవాడు కౌటిల్యుడు. ఆదికవి వాల్మీకి రామాయణంలో ఈ విధంగా చెప్పాడు—

"నృశంస మనృశంసం వా ప్రజారక్షణ కారణాత్
రాజ్య భార నియుక్తానా మేష ధర్మస్సనాతనః

రాజ్యభారం వహించే వాళ్లకు ప్రజారక్షణమే ప్రధానం. క్రూరమైనా, క్రూరం గాకపోయినా, ప్రజారక్షణకొరకు రాజు చేసే ప్రతి పనీ, ధర్మకార్యమే—అని ఆదికవి వాల్మీకి చెప్పాడు.

ఇంగ్లండును పాలించిన ట్యూడరు వంశరాజు ఏడవ హెన్రీ, తన మంత్రులైన ఎంప్సన్, డడ్లీ, మోర్టన్‌ల, సహాయంతో, ఆంగ్లప్రజలనుండి పైవిధంగానే డబ్బు గుంజాడు. ఒకవ్యక్తి నాగరికంగా జీవిస్తే, నీవు తప్పకుండా భాగ్యవంతుడవు ఐవుండాలి గాబట్టే డబ్బు యివ్వమని బలవంతం చేసేవాడు. ఎవరైనా బీదరికంగా జీవిస్తే ఎంతో ధనం నిలవజేసి వుండి వుండాలి గాబట్టే అతడి వద్ద, గుంజేవాడు.

మహాభారతంకూడా మోసపు పెతులద్వారా డబ్బు గుంజమని సలహా యిచ్చినా కౌటిల్యునివలె నగ్నంగా ప్రజలనుండి ధనాన్ని పిండమనిమాత్రం చెప్పలేదు.

నిద్రపోయే మనిషిని యెలుక పట్టుకొని నెత్తురు పీలిస్తే ఆబాధ, అతడికి మర్నాడు మెలకువ వొచ్చిన తర్వాతగాని తెలియదు. రాజ్యాంగయంత్రంచేసే దొంగ దోపిడి అతిసున్నితంగా అంత తక్కువ బాధాకరంగా వుండాలని భారతం చెప్పింది. కౌటిల్యుడు యిలాంటి చాటు మాటు దోపిడీగాక, బహిరంగంగానే దోపిడీ చేయమన్నాడు కౌటిలీయంలో దేవద్రవ్యానికే రక్షణ లేకపోతే, మనుష్యులద్రవ్యాలకిక ఎక్కడరక్షణ?

రాజ్యంలో జనపదం, నగరం అనే రెండుభాగాలుండేవి. గ్రామాల సముదాయం జనపదం. పట్టణాలతో కూడింది నగరం. పరిపాలనా సౌకర్యంకోసం జనపదాన్ని నాలుగుభాగాలుగా విభజించాలి. కొన్ని గ్రామాలు పన్ను చెల్లించనవసరంలేనివి; కొన్ని పన్నులకు బదులు ప్రభుత్వానికి కావలసిన కూలిపని చేసేవి కొన్ని గ్రామాలు ఆయుధీయాలు. గ్రామపాలనం గ్రామికుని లేక గ్రామస్వామి లేక గ్రామవృద్ధుల అధీనంలోవుండాలి. గ్రామంలోని వివాదాలను పరిష్కరించేందుకు గ్రామవృద్ధులతో గ్రామపరిషత్తు (పంచాయతీబోర్డు)ఏర్పడాలి పది గ్రామాలకు మధ్యగా "సంగ్రహణాన్ని", రెండువందల గ్రామాలకి మధ్యగా "ద్రోణముఖాన్ని", ఎనిమిదివందల గ్రామాల నడుమ 'స్థానీయాన్ని' (రాష్ట్రనగరం) నిర్మించాలి. ప్రతి గ్రామంలోను, ఋత్విక్కు, పురోహితుడు, శ్రోత్రియులు మొదలయినవారినివుంచి, వారికి మడిమాన్యాలు ఇవ్వాలి. అన్ని ఆపదలనుండీ రాజు జనపదాన్ని రక్షించాలి.

ఒక్కొక్క శాఖకు ఒక్కొక్క అధ్యక్షుడు నియమింపబడేవాడు. పణ్యాధ్యక్షుడు, కూపాధ్యక్షుడు, సూత్రాధ్యక్షుడు, గణికాధ్యక్షుడు, నావాధ్యక్షుడు, అశ్వాధ్యక్షుడు, హస్త్యధ్యక్షుడు, రథాధ్యక్షుడు, పత్త్యధ్యక్షుడు, ముద్రాధ్యక్షుడు, వివీతాధ్యక్షుడు, సూనాధ్యక్షుడు మొదలగు అధ్యక్షులు వివిధశాఖలకు నియమింపబడి రాజ్యనిర్వహణలో పాల్గొనేవారు. ఈ విధంగా రాజధానినుండి గ్రామసీమదాకా కోటి కోట్ల కాంతులతో చక్రవర్తి అధికారం రాజ్యమంతటి నలుదిక్కులకు దేదీప్యమానంగా ప్రసరించేది.

సామ్రాజ్య నిర్వహణలో పాల్గొనే రాజోద్యోగుల లంచగొండితనాన్ని గూర్చి కూడా కౌటిల్యుడు వివరించాడు. రాజోద్యోగులు తమ ఆదాయాన్ని వృద్ధిపరచుకొన్నారంటే వారు జనపదాలను విపరీతంగా తినివేశారనీ, అలా అపహరించినధనాన్ని తిరిగి కక్కేటట్లుచేసి వారిని మరో వుద్యోగంలోకి మార్చాలని కౌటిల్యుడు చెప్పాడు. "నాలుకచివర నుండే విషాన్ని గానీ, తేనెను గానీ. ఆస్వాదించకుండా వీలుపడనట్లు, అర్థాధికారికి రాజద్రవ్యాన్ని కొంచెమైనా దొంగిలించకుండుట కష్టం. నీటిలోవుండే చేపలు ఎవరికీ తెలియకుండానే నీరుతాగునట్లు కార్యవిధులలో నియమింపబడే వుద్యోగులు ఎవరికీ తెలియకుండానే డబ్బును దొంగిలిస్తారు." అని అంటాడు. ఆకాశాన పయనించే పక్షులగమనాన్నైనా తెలుసుకోవచ్చునుగాని, ప్రచ్ఛన్న భావులై సంచరించు రాజోద్యోగుల ప్రవర్తన తెలిసికొనడం కష్టతరం. సమాహర్త (Collector - general of Taxes) వంటి వుద్యోగాలు చేసేవారిని రాజు నిరంతర జాగరూకతతో పరిశీలిస్తూ వుండాలని కౌటిల్యుడు చెప్పాడు. ఉద్యోగులకు పెద్దపెద్ద జీతాలిస్తే లంచాలు పుచ్చుకోక, రాజ కార్య నిర్వహణలో నిమగ్నులౌతారని ఆయన అన్నాడు.

కౌటిల్యుడు పండితుడు మాత్రమే కాదు. అసాధారణమైన లౌకిక వ్యవహారానుభవం కలవాడు. సువిశాలమైన మౌర్య సామ్రాజ్యాన్ని పరిపాలించేం

గుకు అనువైన మార్గాన్ని ప్రవేశపెట్టడానికి కౌటిల్యుడే నిస్సంకోచంగా బాధ్యుడు. అంతేగాక స్వయంగా రాజనీతిని, రాజకార్య నిర్వహణను నిర్వహించాడు. కామందకుడు, తదితరులు పండితులు మాత్రమేగాని ఇలాంటి వ్యవహారానుభవం కలవారు కారు.

దండప్రయోగంలో కౌటిల్యుడు మధ్యే మార్గాన్ని అవలంబించాడు. ఉద్వేజనీయమైన తీవ్ర దండంగానీ, పరిభవకారియైన మృదుదండంగాని కూడదనీ, యథార్హ దండమే దండమని చెప్పాడు. దండం ప్రజలకు ధర్మార్థకామము లిస్తుందని చెప్పాడు. ప్రభుత్వానికి దండమూ, దండనాధికారమూ ప్రధాన లక్షణమని చెప్పాడు. దండం లేకపోతే మాత్స్య న్యాయం ఉద్భవించి బలవంతుడు దుర్బలుణ్ణి నాశనం చేసాడు. దండధరునిచే (రాజుచే) రక్షింపబడి బలహీనుడు భద్రత పొందుతున్నాడు. చతుర్వర్ణ చతురాశ్రమాలు గలిగిన లోకం రాజదండంచే పరిపాలింపబడి స్వధర్మాన్ని ఆచరిస్తూ తమ తమ మార్గాలలో ప్రవర్తిస్తూ ఉంటుంది.

కౌటిల్యుడు ప్రవేశపెట్టదలచిన రాచరిక వ్యవస్థ నిరంకుశమైనదనే విషయం సర్వులూ అంగీకరించినదే. "కార్య నిర్వహణలో మాత్రము ఆ కాలపు రాజులు నిరంకుశులై యుండిరి. ఉద్యోగస్థులు రాజాజ్ఞ బద్ధులు గాని ప్రజాభిప్రాయము ననుసరించినవారు కారు. రాజశాసనములు శాస్త్ర విరుద్ధము లవునా కావా యని తీర్మానించు పండితులు రాజువద్ద నౌకరులేగాని, స్వతంత్రాధికారులు కారు. కావున ప్రజలను పీడించి అక్రమముగా కార్యములొనర్చుటకా కాలపు రాజులకు జాల యవకాశ ముండెను." (ఆచార్య మామిడిపూడి వేంకటరంగయ్య.)

ఇలాంటి నిరంకుశ రాచరికం ప్రతిపాదించినా, అరాచకత్వంనుండీ, అవ్యవస్థనుండీ, విదేశీ దండయాత్రలనుండీ ప్రజల్ని రక్షించి శాంతిభద్రతలు నెలకొనేందుకు అవసరమైన కట్టుదిట్టాలెన్నో కౌటిల్యుడు ప్రవేశపెట్టాడు. ఆయన కాలంనాటి రాజకీయ సాంఘికార్థిక పరిస్థితుల స్వభావాన్ని మనం అర్థంచేసికొంటే నాటి పరిస్థితులలో ప్రజాస్వామ్య వ్యవస్థ అనేది ఊహించరాని విషయమనీ, నిరంకుశవ్యవస్థే నాటి కాలపు సమస్యలకు పరిష్కారమార్గమనేది సువిదితం. ఆ రీత్యా కౌటిల్యుడు ప్రశంసా పాత్రుడేగాని విమర్శింపతగినవాడు కాడు. ఎంతటి రాజకీయ నిరంకుశ వ్యవస్థ ప్రవేశపెట్టినా, ప్రజోపయోగకార్యాలు రాజు అతి శ్రద్ధతో చేయించవలెనని ఖండితంగా చెప్పాడు. మౌర్యుల కాలంనాటి రాజ్యాంగ విధానాన్నీ, వివిధ రంగాలలో పనిచేసే అధ్యక్షుల కార్యవిధులను మనం పరిశీలించితే, కౌటలీయం ప్రజాక్షేమంకొరకు ఎలా విధివిధానాలను నిర్వచించిందో, మనకు సులభంగా గ్రాహ్యమౌతుంది. కౌటలీయం అర్థశాస్త్రంమాత్రమే కాదు. నాటి రాజకీయ వ్యవస్థలేగాక, సాంఘికార్థిక ధార్మిక పరిస్థితులను సయితం సూక్ష్మాతి సూక్ష్మమైన వివరాలతో సహా భద్రపరచిన మహోన్నత భాండాగారం. ఇళ్ళ తలుపులకు పెట్టవలసిన యినపగడియలు, యింటి వెంకాలవుండే "అవస్కారం" (పెంటపోగు) దగ్గరనుండి మహామహీమండల పరిపాలనకు సంబంధించిన వివిధ విషయాలు సమగ్రంగా అత్యంత ప్రతిభావంతంగ కౌటిల్యుడు వివరించాడు.

కౌటిల్యుడు తన పూర్వులగు అర్థశాస్త్రవేత్తల వాదనలను కొన్నిటిని సమర్థించి, కొన్నిటిని ఖండించాడు. ఈ వాద ప్రతివాదనలను పరీక్షిస్తే, అతనిబుద్ధి ధారాళమైందనీ, విషయ వితర్కంలో స్పష్టత కోరుతుందనీ, మనం అర్థం చేసుకోవచ్చును. అతడు "అతి సర్వత్ర వర్జయేత్." అనే సూక్తిని ఎల్లప్పుడు పాటించాడనీ, అందుచేతనే దండము నాతి తీవ్రము నాతి సదయముగా వుండాలనే మధ్యేమార్గాన్ని ప్రతిపాదించాడని, మనం గ్రహించవచ్చును. యుక్తాను సాధించుటలో వ్యవహారానుకూల్యమే ప్రధానాంశంగా యెంచాడనేది స్పష్టం. క్రియాస్వరూపాన్ని బట్టి దోషాన్ని నిర్ణయించకూడదు. ఆ కార్యాన్ని చేయుటలోని ఉద్దేశాన్ని బట్టి దోషారోపణ జరగాలి. నేర స్వరూపాన్ని బట్టే గాక, నేరం చేయడంలోని వుద్దేశాన్ని బట్టి శిక్షించాలి అని అంటాడు. సాధనాలు ఎలాంటివైనా సాధ్యాలు (Ends) ఉత్తమాదర్శాలను కలిగివుండాలి. మహోన్నతాశయాలు సాధించేందుకు వుపయోగించే సాధనం దుర్మార్గమైనా, వక్రమైనా, దుష్టమైనదాని నిగా పరిగణించకూడదంటాడు. ఈవిషయంలో మేకవెల్లీకి కౌటిల్యునికి చాలదగ్గర పోలికలున్నాయి. అర్థశాస్త్రసిద్ధాంతాలు నీతిశాస్త్ర సూత్రాలకు కట్టుబడి వుండాలని చెప్పిన గ్రీకుశాస్త్రవేత్త అరిస్టాటిల్ కు, కౌటిల్యునికీ పోలికకంటే భేదమే ఎక్కువ.

కౌటిల్యుని అర్థశాస్త్రం పరిపాలనా విధానాన్ని వర్ణిస్తున్నదేగాని పరిపాలనా తత్వాన్ని దాని పరమార్థాన్ని విమర్శించుటలేదని కౌటలీయంపై కొందరు పండితులు విమర్శపెట్టారు. "రాజ్యము యొక్క బాహ్యాంగములు, బహిర్వ్యాపారము లొనగు వాని యందున్నంతటి శ్రద్ధ, దానియొక్క ఆత్మానాత్మ విచారమందతనికి లేకపోయెను. మనుష్యుని స్వభావము గ్రహించుట కతని శరీరముయొక్కయు, అవయవములయొక్కయు జ్ఞానము మాత్రమే కాక

వాని శరీరములోనుండు నాత్మయొక్క జ్ఞానముకూడా నావశ్యకమైనట్లు, రాజ్యముయొక్క స్వభావమును గురించుటకు రాజ్యతత్వముకూడా తెలిసికొను టవసరము. ఈ విభజనలేని కారణముచేత కౌటిల్యుని గ్రంథమేగాక, సంస్కృతమందలి తక్కిన రాజనీతి గ్రంథములుకూడా, పాశ్చాత్యగ్రంథముల పరిచయము కలవారికి నెక్కుడు రుచించుటలేదు. ఎన్నో విషయములలో మేకవెల్లితో కౌటిల్యుని పోల్చినను హేతువాదము అధికముగా లేకపోవుటయేగాక తన యభిప్రాయములను బలపరచు ఉదాహరణలుకూడ కౌటిల్యునిలో చాల తక్కువగానున్నవి" (మామిడిపూడి) షాడ్గుణ్యవిధులను (Six Fold Policy) రాజు చేయవలెనంటాడు. ఇందుకు కారణముగానీ, అలా చేసిన రాజుల ఉదాహరణలుగానీ యివ్వడు. అరిస్టాటిల్, మేక్ వెల్లి మున్నగు పాశ్చాత్య శాస్త్రవేత్తల గ్రంథములలో యిదియే సుగుణము ఆచార్య వెంకట రంగయ్యగారు కౌటలీయార్థ శాస్త్రంపై పెట్టిన విమర్శ సహేతుకమైనదే. ఐతే ఈ విమర్శకు జవాబు కౌటలీయంలోనే కన్పిస్తుంది.

కౌటిల్యునికి పూర్వమే "దండనీతి" అనే పేరుతో అర్థశాస్త్రం అధ్యయనం చేయబడేది. ప్రజాపతియైన బ్రహ్మ ప్రజాయోగక్షేమార్థం ధర్మ, అర్థ, కామములను సంపాదించేందుకు ఒక లక్ష అధ్యాయాలతో కూడిన బృహత్ గ్రంథాన్ని రాశాడట. ధర్మానికి సంబంధించిన అధ్యాయాలను ఆ గ్రంథంనుండి వేరు చేసి మనువు ప్రత్యేకమైన ధర్మశాస్త్రంగా రచించాడట. అర్థానికి సంబంధించిన అధ్యాయాలను బృహస్పతి వేరుచేసి స్వతంత్ర అర్థశాస్త్రంగా రచించాడట. కామానికి సంబంధించిన అధ్యాయాలను నందుడు వేరు చేసి, ప్రత్యేక కామశాస్త్రంగా వ్రాశాడట. లక్ష అధ్యాయాలు గలిగిన ఆ మహాగ్రంథంలో "దండనీతికి" (The science of politics) చెందినభాగం చాలా పెద్దదిగా వుండడంవల్ల దాన్ని విశాలాక్షుడు 10 వేల అధ్యాయాలకు, బాహుదంతుడు 5 వేల అధ్యాయాలకు బృహస్పతి 3 వేల అధ్యాయాలకు కుదించారట. తరువాత ఉశనాసుడు (శుక్రుడు) వెయ్యి అధ్యాయాలతో కూడిన గ్రంథం రచించాడట. అర్థశాస్త్రం పుట్టుకను గూర్చిన ఈ దృక్పథం, మహాభారతం, శాంతిపర్వంలోని 59 వ అధ్యాయంద్వారా తెలుస్తోంది. లక్ష అధ్యాయాలున్న దండనీతి అనే ప్రత్యేకశాస్త్రం క్రమంగా 10 వేలు, 5 వేలు, 3 వేలు చివరికి వెయ్యి అధ్యాయాలకి విశాలాక్షు, బాహుదంతి, బృహస్పతి, ఉశనాసులవల్ల సంక్షిప్తపరచబడిందంటే, ఆ శాస్త్ర అధ్యయనాన్ని గూర్చిన ఆకాంక్ష, రాహువునోటబడ్డ చంద్రబింబంలా, కరిమింగిన వెలగపండులా, క్రమంగా క్షీణిస్తూవచ్చిందని మనం గ్రహించవచ్చును. అట్టి విపత్తినుండి ఆమహాశాస్త్రాన్ని కాచి కాపాడిన ఖ్యాతి, మౌర్య సామ్రాజ్య నిర్మాత, జగద్విఖ్యాత రాజనీతిశాస్త్రవేత్త, సుప్రసిద్ధ "అర్థశాస్త్ర" గ్రంథకర్త ఐన కౌటిల్యునికి దక్కింది. ధర్మశాస్త్రకారుల మైకములోనూ, ప్రాచీన తాళపత్రగ్రంథ సంచయంలో వున్న అర్థశాస్త్రాన్ని కౌటిల్యుడు బయటికి తెచ్చి, పండితులచే, ధర్మశాస్త్రంతో సమానమైన గౌరవాన్ని సంపాదింపగలిగాడు. మరుగునపడిపోతున్న శాస్త్రాన్ని తాను కాపాడానని కౌటిల్యుడే స్వయంగా తనగ్రంథం చివరిభాగంలో చెప్పుకొన్నాడు.

తన కాలంనాటికి అర్థశాస్త్రాలు ఎన్ని వున్నాయో, ఎన్ని ఆలోచనా ధోరణులు (Schools of Thought) వున్నవో, వాటి నన్నిటిని సంక్షిప్తపరచి, అతి జాగరూకతతో క్రోడీకరించి ఒక సంహితగా రచించానని అతడే చెప్పాడు. అంటే ఆ నాటికి వ్యాప్తిలోవున్న వివిధమయిన ఆలోచనా ధోరణులు, సిద్ధాంతాలు సంక్షిప్తపరచి వాటి నన్నిటిని సంకలనం చేశాడనే నిర్ణయానికి వస్తే, అంతకంటే అవివేకం మరొకటి వుండదు. ఎన్నో అనవసర వివరాలతో నిండి, వట్టి సిద్ధాంత సంబంధమయిన వాగ్వివాదాలతో, చర్చలతో, కూడి విపరీతంగా విస్తరిస్తూ ఉన్న శాస్త్రాన్ని ఆచరణయోగ్యమై, దైనందిన రాజ్యపాలనా వ్యవహారాలకు సహాయపడేవిధంగా, ఒక మహోత్తమ శాస్త్రగ్రంథాన్ని రచించాడు. అట్టి రచనద్వారా శాస్త్రాధ్యయనాన్ని ప్రోత్సహించాడు. అందువల్లనే నాటికీ నేటికీ కౌటలీయంలోని జీవశక్తిని కాలం తన సమ్మెట పోటులతో చంపలేకపోయింది.

క్రమేపీ క్షీణించిపోతున్న అర్థశాస్త్రం అధ్యయనాన్ని తిరిగి ప్రోత్సహించాలనే దృష్టితోను, ఆ శాస్త్రానికి మరల జీవంపోయాలనే వజ్ర సంకల్పంతో, సిద్ధాంతపరమైన అనవసర వివరాలజోలికి పోకుండా, వాటికి ప్రాధాన్య మివ్వకుండా ఆచరణభాగంపైనే కౌటిల్యుడు తన దృష్టిని కేంద్రీకరించడం జరిగింది.

సిద్ధాంత ప్రతిపాదనకన్న, మహామంత్రి ఐన కౌటిల్యుని, దృక్పథంలో కార్యాచరణమే ప్రధానం. తను స్థాపించిన మహా సామ్రాజ్యాన్ని, తనచే రచించబడ్డ అర్థశాస్త్రం సహాయంచేత పరిపాలించ ప్రయత్నించాడు. కౌటలీయం తన సిద్ధాంత ప్రతిపాదన; మౌర్య సామ్రాజ్యపరిపాలన కౌటిల్యుడు చేసిన మహోన్నతప్రయోగం. అందుచేత, అతడు సిద్ధాంతచర్చకు, హేతువాదంతో కూడిన వివరాలకు

అధిక ప్రాముఖ్యాన్నివ్వలేదు. అందుకనే, కౌటిల్యుడు పరిపాలనాతత్వాన్ని విమర్శించలేదని మనం అర్థం చేసికోవచ్చు.

## కౌటిల్యుడు : అరిస్టోటల్

ప్రస్తుతం, ప్రాక్ పశ్చిమ రాజనీతి శాస్త్రిలకు సంబంధించిన మరో ప్రధాన విషయాన్ని మనం విస్మరించరాదు. మౌర్య సామ్రాజ్య స్థాపనం భారతదేశములో ఒకవైపు జరుగుతూంటే, అదే కాలంలో ప్రపంచ తత్వవేత్తలలో ఒకడుగాను, యూరపియన్ తత్వశాస్త్ర చరిత్రలో ప్లేటో పిదప అంతటి మహా మేధావంతుడుగాను, పరిగణింపబడే అరిస్టోటల్ మాసిడోనియన్ వలస రాజ్యము "స్టెగిరా"లో క్రీ. పూ. 384 లో జన్మించాడు. యూరపులో మహాసామ్రాజ్య నిర్మాత ఐన అలెగ్జాండరుకు రాజకీయ పాఠాలను బోధించాడు. అదే సమయంలో మౌర్య సామ్రాజ్య చక్రవర్తి ఐన చంద్రగుప్తుడు కౌటిల్యునివద్ద రాజకీయ శిష్యరికం చేస్తున్నాడు. 158 రాజ్యాంగాలను శోధించి సుప్రసిద్ధమైన పొలిటిక్స్ అనే గ్రంథం అరిస్టోటల్ రచించాడు. ప్రాచీన హైందవ రాజనీతి శాస్త్రం పాలిట మహోజ్వల భాండాగారమైన అర్థశాస్త్రాన్ని కౌటిల్యుడు రచించాడు. స్వయం సమృద్ధమైన 'నగర రాజ్యాన్ని' (State City) అరిస్టాటల్ ప్రతిపాదించగా, చతురంత మహీమండలం దాకా వ్యాప్తి చెందగల సువిశాల సామ్రాజ్య స్థాపనం కౌటిల్యుడు వాంఛించాడు. అరిస్టాటల్ చట్టబద్ధమైన రాజరికాన్ని, కౌటిల్యుడు నిరంకుశమయిన రాజరికాన్ని ప్రతిపాదించారు. అరిస్టాటల్ మధ్యతరగతివ్యక్తియొక్క మనసత్వం కలిగిన డెమొక్రాట్. కౌటిల్యుడు రాచరిక నిరంకుశత్వాన్ని సమర్థించిన నియంత. అందుకే కౌటిల్యుడు "అర్థశాస్త్రం" నరేంద్రులకొరకే వ్రాయబడిందని ఖచ్చితంగా చెప్పాడు. "సర్వశాస్త్రాణ్యనుక్రమ్య ప్రయోగ ముపలభ్య చ. కౌటిల్యేన నరేంద్రార్థే శాసనస్య విధిః కృతః" అని కౌటిల్యుడు చెప్పాడు. అలెగ్జాండరు సామ్రాజ్యవాదకాంక్ష గ్రీసులోని నగర రాజ్యాలను కబళించి వేసింది. మౌర్య సామ్రాజ్యవాదం, చిల్లర మల్లర రాజ్యాలనూ, అసంఖ్యాకములగు గణ సంఘాలనూ మింగివేసింది.

స్వయం సంపూర్ణ నగరరాజ్యంకొరకు అరిస్టాటల్ ఆ కాలంలో 'పొలిటిక్స్' గ్రంథరచన చేసి, అట్టిదానిని స్థాపించేందుకు తహతహలాడాడు. కాని ఆ ఆదర్శం, ఆయన కంటిముందరే పేకమేడలా కూలిపోయింది. ఒకవైపున నగర రాజ్యాన్ని గురించి అరిస్టాటల్ తన మేథస్సునంతటినీ వినియోగిస్తుంటే, మరోవైపున దిగంత విజయయాత్రా సముపార్జిత యశో ధురీణుడు, వీరాగ్రగణ్యుడు ఐన అలెగ్జాండరు సేనలు నగరరాజ్య ప్రాకారాలనే గాక, ఆ దృక్పథాన్నే మూలమట్టం చేసివేయడం జరిగింది. సామ్రాజ్యవిస్తరణ కొరకు అలెగ్జాండరు నగర రాజ్యపువాదులనే భూస్థాపితం చేస్తూంటే, అరిస్టాటల్ వంటి శాస్త్రివేత్త నగరరాజ్యాన్ని సామగ్రతముగు బూటకపు స్వయంసమృద్ధితో పునరుద్ధరించాలని సుందరమగు స్వప్నం కన్నాడు. ఆ స్వప్నం వాస్తవిక రూపాన్ని ధరించక పగటికలగానే మిగిలిపోయింది. సిటీ స్టేట్ యొక్క దహనసంస్కార క్రియలను జరిపేందుకు ఏర్పాటుచేయబడ్డ ఉత్సవాన్ని అనుసరించువాడుగానే అరిస్టాటల్ మిగిలిపోయాడు.

వెయ్యి స్తంభాలపైనిలిచిన మహోజ్వలసామ్రాజ్య సౌధాన్ని నిర్మించిన మహాశిల్పి కౌటిల్యుడు. మారుతున్న పరిస్థితులకనుగుణంగా తనను తాను మార్చుకోలేక గతంవెంట పయనించిన స్వాప్నికుడు అరిస్టాటల్. మారుతున్న దేశపరిస్థితులకనుగుణంగా అవ్యవస్థనుండి వ్యవస్థను, కల్లోలంనుండి శాంతిభద్రతలను సృష్టించి సువిశాల సామ్రాజ్య స్థాపనమనే సురుచిర సుందర స్వప్నాన్ని, నగ్నసత్యంగా మార్చిన కార్యశూరుడు కౌటిల్యుడు!

కౌటిల్యుడు తన గురువులతోను, పూర్వ శాస్త్రకారులు ప్రతిపాదించిన పెక్కు సిద్ధాంతాలతోను తాను ఏకీభవించడం లేదని చెప్పాడు. అంతేగాక ఆయన ఒక స్వతంత్రమైన రాజనీతిధోరణికి ప్రారంభకుడయ్యాడు. ఈ విషయాన్ని గూర్చి డాక్టరు భండార్కర్ యిలా అంటాడు——

"In many places where Questions of policy or administration are discussed and where the views of his predecessors are indicated, he has set forth his own with a clarity and precision which show that he was not a mere theorist or literary pedant but rather a statesman endowed with rare political insight and practical wisdom. Koutilya had a definite set of views on all the important points of policy and administration, views sufficiently numerous and characteristic to go to form a different school of polity. ("Some As) pects of Ancients Hindu Polity"–Page 23.-

## కౌటిల్యుని అర్థశాస్త్రము

కౌటిల్యుని తర్వాత అర్థశాస్త్రం ఏ విధమైన అభ్యుదయాన్నీ సాధించలేకపోయింది. క్రీ. శ. 4 వ శతాబ్దంలో కామందకుడు రచించిన "నీతిసారం", 10 వ శతాబ్దంలో సోమవాన సూరి రచించిన "నీతి వాక్యామృతం" మినహా, మిగతా గ్రంథాలన్నీ అతుకుల బొంతలు, అనుకరణలూను. పిదప, రచింపబడ్డవన్నీ, ప్రాచీన శాస్త్రజ్ఞుల ప్రాతిపదికలతోనో, ఇంకా సంక్షిప్తంగానో వ్రాయబడ్డ అర్థశాస్త్ర సంకలనాలు. ఇవి కొల్లలుగా పుట్టాయి. తత్ఫలితంగా అర్థశాస్త్రాన్ని గూర్చిన అధ్యయనం క్రమేపి క్షీణించిపోయింది. ప్రాచీన భారతంలో ఉద్దండులైన పండిత ప్రకాండులచే, మహామహులైన శాస్త్రవేత్తలచే పెంచి పోషింపబడి మూడు పూలూ, ఆరు కాయలు కాసిన హైందవార్థశాస్త్రం, తదధ్యయనం క్రమంగా నాశనమైపోయింది. కోటిసూర్యుల తేజస్సుతో వర్ధిల్లి ప్రకాశించిన ప్రాచీన అర్థశాస్త్రం కౌటిలీయాన్నే అవశేషంగా వదిలిపోయింది.

మనకీ ఒక అర్థశాస్త్రం వుంది. దానికి వేలసంవత్సరాల చరిత్ర వుంది. ఆ దీర్ఘచరిత్రలో కౌటిలీయార్థశాస్త్రం ఒక మహోజ్జ్వల గ్రంథం. మన ప్రాచీన శాస్త్రాన్నీ, దాని చరిత్రనీ కవిలికట్టల్లోనుంచి, పుస్తకభాండాగారాలలో దిక్కూ మొక్కూ లేక పడివున్న వివిధ తాళపత్ర గ్రంథ సంచయమునుండి తవ్వి తలకెత్తాలి. ఎన్నో అర్థశాస్త్ర గ్రంథాలలో పేర్కొనబడ్డ వివిధ శాస్త్రగ్రంథాలు మనకు నేడు ఎక్కడా కనిపించడంలేదు. వాటినన్నిటినీ తిరిగి పరిశోధించి, వెలికి తీయాలి. అవాడే మనం ప్రాచీన హైందవుల అర్థశాస్త్రాన్ని, దాని చరిత్రను సర్వసమగ్రంగా, సర్వాంగసుందరంగా కాంతిలోకి తెచ్చి ప్రపంచం ముందు పెట్టగలం.


# ప్రమాద రక్షణకు ప్రశస్తమైనది భీమా

ఎప్పుడు ఏ ప్రమాదం వచ్చేదీ, ఏ క్షణం ఎలా ఉండేదీ తెలియని ఈ దినాలలో

* అగ్ని * మోటార్‌కారు * కార్మిక నష్టపరిహారం * నౌక

* ఫయడిలిటి గ్యారంటీ మొదలైన భీమాలకు

మాతో సంప్రతించండి.

## యునైటెడ్ ఇండియా ఫైర్ అండ్ జనరల్ ఇన్సూరెన్సు కంపెనీ,

"బాంబే లైఫ్ బిల్డింగ్స్"

9, బ్రాడ్వే, మద్రాసు. 1.

Telephone: 4241, Telegrams: "UNIGEN"

బ్రాంచీలు:

విజయవాడ - బెంగుళూరు - బొంబాయి - కలకత్తా - న్యూఢిల్లీ - పాట్నా

కొలంబో - సింగపూరు - కోయంబత్తూరు - జాకార్తా.

# సింతసివురు

## 'రమణశ్రీ'

'సింత సివురు సిన్నది
సొగసు వయసు పిన్నది
సీకు సింత లేనిదీ
సెంత సేర నన్నదీ'

'సెం...త...సేర...నన్న...దీ'

గాలిలో తేలిపోతోన్న మాటలు, పాటలూ సింతచెట్టు చివుళ్ళని మరింత చివురింపచేస్తున్నయ్! చింతచివురు కోసుకొంటోన్న నాగులు కొమ్మల కింద నుంచి, తొంగి తొంగి చూసింది పాట వరుసల్తో వస్తోన్న వెంపు...

గొఱ్ఱెలూ, మేకలూ కాసుకొంటోన్న గొఱ్ఱెల మల్లాలమ్మ కొడుకు 'సిన్నోడు' పాడుతోన్న పాట!

'సిటారు కొమ్మని సివురుగుంది
కొయ్యగబోతే జారతంది'

నిజంగా తన వనలానే వుంది! తొలకరించిందని, చెట్టు పులకరించితే, ఆ చివుళ్ళు తను గిల్లుకుపోయి, అమ్ముకొని సొమ్ము చేసుకొంటుంది.

'సింత సివురు సిన్నదాన్ని సీమ కుట్టింది
వయసు పొగరు పిల్లదాన్ని దోమ కుట్టిందీ'

పాట విని నవ్వుకొంది. 'ఓ సబ్బో! పాడ తన్నాడు పాట. కోడె వొయసులో పొగరెక్కి...' అనుకుంటూ—

నిజంగా కండచీమలు కంప లూపి బెరుకు తున్నయ్. నిగనిగలాడుతోన్న కంటి పట్టిపెట్టుకొని కళు బయిర్లు కమ్మేలా ఐనా గోళ్ళు గిల్లడం మాన లేదు చివుళ్ళని.

అదీగాక కాయన్న మాన్యంలో చెట్టంటే, అందరికీ ఆశే! ఇక పచ్చగా పకపకలాడుతోన్న చెట్టుని చూసి, నాగు ఊరుకొంటుంది?

'నీ యిట్టం వొచ్చినట్టు కోసుకోయే పిల్లా!' అని కాయన్న అధికారం ఇచ్చాడు.

ఒడినిండా కోసుకొని చక్కా బజాగున పడి ఇన్ని గింజలకో, డబ్బులకో అమ్ముకొని ఆ రోజు వెళ్ళ మారిస్తే అదే పదివేలు! రేపటిరోజు దేవుడెరుగు!

పైకొమ్మలు కూడా ఎక్కి కోసింది......ఒడి నిండించికొని, పిటపిటలాడుతూ కిందికి దిగింది.

పొద్దు, తాటితో పులొంచి వాటాగుతోంది

రెండు వీథులు తిరిగితే చాలు...చింత చివు రంతా అఖరు...ఇంకా గరువుమీద గొఱ్ఱెల సిన్నోడు కూనిరాగం తీస్తున్నాడు.

'చొంతంగా కపిత్తం గడతాడంట! ఆడికి పుట్టిక నించీ వొచ్చును పాటలూ, పదాలు, గొల్లసుద్దులూనూ' అనుకొంటూ గట్టెక్కింది నాగులు.

'తొలకరి వరిసించీ
సింతలు సివురించీ
పచ్చిక పరిసింది
నాగులూ నీ దెవ్వూరే?'

పాట ఆగింది—పాట పాడేది తను కొనట్లు చూశాడు సిన్నోడు.

'ఏరా! సిన్నోడా!... తెగ పాట పాడతన్నావ్ నామీదే కపిత్తం గడతన్నావా?...నాదీవ్వూరే గదరా సిన్నా!'

ఒడిలో చింతకూర చేతుల్తో సర్దుతూ అంది.

'ఇయ్యాల ఏడుంటావు. రే పెక్కడుంటావో? ఎవరి కెరిక? నాగులూ!...కాయన్న సెటంతా యిరగ్గో సేశావు గందా?...సెట్టెంక్కున్నా పనికొస్తదె? నీ సేయి దగిలి...కాయన్నతో సెపుతానే! నీ పని...'

'సెపితే సెప్పుకో! సెప్పిచ్చి కొట్టుకో! సెపితే కొరతే యిస్తాడా?'

'కొరతే యిస్తాడో? కొరుక్కుతింటాడో నా కేటి తెలుస్తది?'

# సింత సివురు

'నోరు తిన్నగా రానీ పిన్నోడా! నేనలాంటి దాన్ని గాను? కేరుగున్నానని, తెగ సిల్గుతుంటావు. ఊరికే కపిత్తం గడతన్నావు!'

'నా నోటికొచ్చిన పాట పాడతాను! నీకేం?' అని వడిలో కూర తీసుకొని నవ్వుల్తూ, 'దానికేం గాని, సురవన్న మావ నిన్నొదిలి యేడకు పోయినోడు? నువ్వెన్నాళ్ళిట్టా వుంటం...' అని ఆగి, నాగులు కళ్లలోకి ప్రశ్నార్థకంగా చూశాడు. నాగులు కీ మాటలు ముసుగ్గా అంటాయి.

'ఏమో నాకేటి తెలుసు' అని గట్టు దిగి పొలాల కస్తంబడి నడక సాగింది.

'సిన్నప్పుడే పెళ్లాడిన సురవన్నమావ, సంసారం సేస్తానె. ఓ రోజు మాయమైపోనాడు... అంతు సిక్కని దూరాలకి'

సిన్నోడు నాగులు దారి నేమాస్తూ గొర్రెల్ని మేకల్ని మళ్ళించుకొంటున్నాడు.

పాతగాయం రేగినట్టుంది... మెత బావురు మంటోంది—ముక్కూ మొగానికీ నగలూ నాణాలూ లేవు... అన్నీ ముసలయ్య గోగాల్లో కరిగిపోయాయి. సురవన్న జాడ తెలియదు నేటివరకూ....

'ఎంతకాలం మగపురుసున్న ముత్తైదువనంటావు? ఆసికోసం ఎన్నాళ్లని ఎదురుసూస్తం... సింత సెట్టు బావున్నంత కాలం నీకు సింత లేదు...' అంటోంది. మనసు.

తుమ్మ తోపులోంచి, వీస్తోన్న ఈదర గాలి, వర్షించబోయే మబ్బుల తొందర...

వయ్యారంగా కనుపర్సగా ఉయ్యాల లూగుతూన్న జొకుముళ్ళు... దాటుకొంటూ వడిలో కూర మప్పితంగా సద్దుకొని, రైలు గేటు దాటింది.

'ఎంతకన్నా తగ్గావోడే! ముగ్రాలమ్మ కొడుకు. యిసిరి యిసిరి... ఎంత మాటన్నాడు... మారు మనవు సేసుకోమని, మనసు మార్చుకోమని... మా యిదౌతున్నాడు... గూడెంలో వోళ్ళు—సురవన్న మావకోసం ఎదురు సూసి, ఎదురుసూసి పేనాలన్నా యిత్తా గాని, మనువు సేసుకోను... మొగోణ్ణి నమ్ముకు సెడ్డమన్న దెవరు? మరొక్కత్తె ఎదురుగా అనితే సాలు... తన్నొదిలి పారిపోతాడు...... మనువు సేసుకొన్నావోడు మాయలోడైతే బతుకు మరేంగాను"

కాపేలమ్మ గుడిదగ్గరి కొచ్చింది. గుడిలో అమ్మవారికి వంగి వంగి మొక్కింది. 'సురవన్న మావని దూరంసెయ్యకు తల్లీ!' అని......

తల్లి, 'సేమంగా లింటాలే' అన్నట్టు సూసింది దయామయంగా. సుడిగాలిలాగా సింగనాయుడి చెట్టు కింద ఒకక్షణం కూర్చొని, లేచి, నడుం నడమాకొంటూ పక్కలిపడింది......

'అమ్మా! చింతకూర...' అని ఆగింది సుబ్బమ్మ ముందు... ఇంటావిడ 'అత్తే! బొలుగా తక్కువ పెడుతున్నావు! కొనాలా పెట్టాలా? ఊరికే నే వచ్చిందనుకోకు? ...... మరింత పెడితే నీసొమ్మేం పోయింది?' అంటోంది—చేయి తెచ్చి ఓయ్యం వేసి కూర పెట్టించుకొంటూ.

ఇళ్లల్లో వాళ్ళనా గొణుక్కుంటున్నారు.

'అత్తే వాళ్ళకి పెళ్ళీ పెడాకులూ ఏమిటే? వత్తి పసువులు...'

ఇంటావిడ పగలబడి నవ్వుతోంది.

నాగులు చెవుల్ని కొరుకుతున్నయ్ వాళ్ళ మాటలు...

నీతికీ, నిజాయితీకి తనేం తక్కువకాదు...

త్వరగా, కూర పూర్తిచేసి సంత చేసుకొని, గుడిసెకి మళ్ళింది.

ఆకాశం మబ్బుపట్టి మరింత చీకటి పెంపొందుతోంది. చిన్న చిన్న తుప్పరపడి. నాగులు వంటిమీదబట్టలు తడిసి, ముడుచుకుపోతున్నయి. ఎదురుగాలి ముఖాన్ని మొత్తుతోంది. చలిగాలికి ముడుచుకొన్న పెదవులు వణుకుతున్నయి. ఎదురొస్తోన్న పసువుల్ని, పసుల కాపరుల్ని తప్పుకొంటూ, మళ్లా గుడిసగ్గిరి కొచ్చేసరికి ముసురు మరింతగా విసురుతోంది. ఐనా, గేటుదాటి రైలుపట్టాలవెంట నడిచి, ఆలోచనల ముళ్ళు విప్పుకొంటూ గూడు చేరేసరికి, సుడ్డిదీపం వెలిగించమని ముందుకొస్తోంది.

తుక్కునులకమంచంమీద ముసలయ్య ఖళ్లుఖళ్లున దగ్గుతూ, 'ఏటే నాగూ? గిరసన్నాలేంది దీపమేం ఎలిగిత్తావు?... సంతసేసుకొచ్చావా?' అన్నాడు.

'ఆఁ' అంది.

'ఏడన్నా ఊరుతున్నారా? ఊసిస్తే మన ఏడుపు కొంత తీరది'

'ఆకు లెవగందే యేం వూడుత్తాయి? బోరింగులున్నా వోళ్ళు మాతరం, అరకలు గడతన్నారు...'

'ఎంతకాలం సింతసివురుమీన బతుకుతాం! నువ్వు మనువుసేసుకో! ఓ లాస్తది...దాంతో కాలక్షేపం సెయ్యొచ్చు...ముద్దూ ముచ్చటా తీరతది. ఇంకా గురివిగాడొచ్చేది నేదు...'

అని ఆగాడు. మళ్ళీ దగ్గు లంకించుకొంది.

మంచం మన్నమైపోతన్నాడు ముసలయ్య... ఉన్నన్ని రోజులూ కమతంలో కాపుదనాలుండి, పేరుదెచ్చుకొని, చివరికిలా చావుబతుకుల మధ్య వేలాడుతున్నాడు. అడుగుబడుగూవున్న చమురుపీల్చి దీపశిఖ వెలుగుతోంది. నాగులు రాజబెట్టినపొయ్యి ఆకలిగొన్న కడుపులా రగుల్తోంది.

గురివిగాడు పోయిన్నాటినించీ, బతుకు బండలైపోతన్నాది. కూటికీ కమ్మకూ మొగం వాసిపోనాం...ఏటి పోగాలమో, ఆడుపోనాడు ఏలినాటిశని బట్టుకొని యేడిపిస్తన్నాది...' అని గొణుక్కుంటున్నాడు ముసలయ్య.

'మనువుసేసుకో! మనువుసేసుకో!' అని గుండెల్లో గుళ్లు కట్టుకొని పోరుపెడుతున్నాడు ముసలయ్య. నాగులకీ మాటలు వళ్లు మండిస్తున్నయ్!

ఏటిలోకం ... సిగూసెరం నేదు గూడెం వోళ్లకి...చొక్కాలు మార్చుకొన్నట్టు మార్చుకోడం ఏటిబతుకు?...' అని యీసడించుకుంది.

మంచంమీద ముసలయ్య నిద్రపోతున్నాడు. గుడిసెముందు చీకటిపక్షి వర్షంలో తడుస్తూ టెపటెపలాడుతూ ఎగురుతోంది!

## 2

'మారుమనువు సేసుకొని మనుసులిరుసుకొని, ఏటి బతికేది కాయన్న బాబుగోరూ!'

తిరిగి చివురించిన చెట్టెక్కుతూ అందినాగులు.

కాయన్న పిరగాళ్లకు నీరు పెడుతున్నాడు. పాలికాపు దూరంగా పల్లంమడికి నీరు పొంగకండా గట్టు సరిజేస్తున్నాడు.

కాయన్న నాగులు మారుమనువునిగురించి అడిగినట్టున్నాడు జవాబు చెబుతూ చెట్టెక్కుతోంది.

'సెటంతా నువ్వే యిరిసేనాగున్నావే! సింతలు పండకపోయేనో, నీతోలాలుస్తా!' అన్నాడు వెటకారంగా...

'నానొక్కదాన్నేనేటిబాబూ! నా పిల్లాజెల్లా ముంగుతిరంఅంతా నీ సెట్టమీనే బతుకతాం... నీ పేరు సెప్పుకొండి' అంది ... చెట్టుకొమ్మమీద సర్దుకొని...

వంట్లో నలతగా వుందేమో నీరసంగా వచ్చింది మాట...

'పేనం బాగోలేదు...ఐనా తప్పదు ...ముసలయ్యకింత గంజి పొయ్యకపోతే, గింజుకొంటాడు' అనుకొంటూ.

సెట్టెక్కినందుకు నాకేటిస్తవే? సింత సివురు సిన్నదానా?' అన్నాడు కాయన్న.

దొరబాబులు మీకు వానించేటి కావాలి? వోళ్ళు కాసితాలా? మనులు కాసితాలా? నీబానివలం పాలించేవోళ్ళు మీరూ...ఆలించే వోళ్లం మేమూ... మీ మాట సట్టం గాదా బాబులూ"

'ముసలయ్య కెలాగున్నదే?'

'ఎలాగున్నదేటి బాబూ! గుమ్మంలో కాసుక్కూచున్నది సావు'

'పాపం! కమత మున్నంతకాలం యిస్సాపంగల కుక్కలా పడుండేవోడు...ఒక్కమాట పడేవోడు గాడు, పౌరుసంగా బతికేవోడు—'

వర్షించి మెరిసే మబ్బు, కొమ్మ మీదవాలి నటించింది నాగులు! కోకిల కూస్తున్నట్టు ... పుల్లని చింతచివురు నవ్వుల్తాన్నట్టు ...కోడెగాలి వీస్తున్నట్టు ...అనిపిస్తోంది కాయన్నకి.

మడిలోకి నీరుమళ్ళిస్తూ గుండె కుదురుచేసుకొంటున్నాడు. పాదరసంలా పాకుతోంది మనసు పరిసరాల మీదికి.

ఎందుకో చిన్నదానితో మానసిక వ్యభిచారం? తన అంతస్తేమిటి? దాని పరువెక్కడ? వాసనచూడ్డానికైనా తగని వస్తువు.

'బాబూ నీబానిసని'

తనబానిస ..తన కోర్కెలు తీర్చగలబానిస...

# సింత సివురు

చింత చివురు కోసుకుపోయేదాకా అలా నే మాట్లాడుతుంది గట్టిదిగాక, 'బోడి కాయన్నా!' అని పగలబడి నవ్వుతూ పారిపోతుంది!

నాగులుకి ఎడురెండ ముఖంమీద కొడుతోంది. పొద్దున్నింకా చదిగంజి తాగక, వంట్లో నీరసంగావుండి శరీరమంతా సెత్తుగుమరుతోంది.

కళ్లు తిరుగుతున్నయ్. కాళ్లు లాగుతున్నయ్... చింతచివురులు లోకువగట్టి వేళ్ళని తోసిపారేస్తున్నయ్...

గభీల్మని పడిన చప్పుడు వినిపించకండా నే, కాయన్న చెట్టుకిందికి లంఘించి ఒక్క ఉదుటన పట్టుకొన్నాడు నాగుల్ని...

నాగులు కాయన్న చేతుల్లో వాలిపోయింది అర మోడ్పుకనుల్లో సొగసులు బంధించుకొంటూ.

'హోసి నీ యిల్లువల్లా బంగారంగానూ! కళ్లు తిరుగుతుంటే యెక్కకపోతే యేమే? పాపం దెబ్బ తగిలిందా?'

నాగులువళ్ళు చెప్పిపోయింది కాయన్న స్పర్శకి. కళ్లు సిగ్గుతో తడిసి నానిపోయాయి. ఇంత వళ్లు తెలియకండా పడిపోయినందుకు శపించుకొంది.

కాయన్న కామోద్రిక్తమైన వేళ్లు ఆ వంటి చిరువేడిమీద పరవశం పొందుతున్నాయ్! కళ్లల్లో ఆశ కోరగా మాస్తోంది. యౌవనందిగజారుతోన్న ముఖం... పెదవుల్లో పేరుకొన్న కోరిక...

ఆచూపుల అర్థాన్ని భరించలేక గ్రామలా రోజుకూ, లేచి దూరంగా నిలబడింది.

"కాయన్నబాబూ! నావొళ్లు ముట్టకండి! నాను పాపం సేసుకుపుట్టాను. నాది యెనవజల్మ... నాకరమాన నన్ను పోనీండి! నాయాసాన నన్ను బతకనీండి!... మీరు దొరబాబులు.. మాకూ మీకూ సానాదూరం.. మీసింత పుణ్యానా అని యిన్ని గంజినీళ్ళు కాసుకు తాగుతున్నా...అయి కూడా తాగనీరా? నీతిగా నీమంగా బతకనీరా? అంతా ఒకలాంటోళ్లే ఉంటారను కోకండి! నన్ను కాల్సుకు తింటే, మీకేటి లాబం? నన్ను కొట్టండి...సంపండిగాని, మీరు ఈ రోజు సేసిన పని మంచిదిగాదు బాబూ!

కాయన్న నాగులికి దగ్గరగావచ్చి 'ఏంటె నాగులూ అంతపాఠం సదివావు నే నేటన్నానని...నిన్ను చెట్టు దరికి రావొద్దన్నానా? అమాతిరం నాకూ దెల్సులే?'

ఏటి మీకు దెలిసింది? బాబూ! మా వొంటి రగతం పీలిసి తాగడవేనా? పాలికాపోళ్ళ కండలు కరిగిపొయ్యేలా పన్లు సేయించుకొని. కాలికింద సెప్పుల్ని తొక్కినట్టు తొక్కడవేనా? జాతీ నీతీ లేకుండా బతకడవేనా? నిప్పులా బసుకుతున్నాను... నా కురవన్నకోసం ఎదురుతెన్నులు నూస్తన్నా... పాలికొచ్చినయ్! పల్లెత్తుమాట బవలా...ఇంత కాలం నూసన్నా! ఎప్పుడో తప్పుజారతాగ... ఖామంగులు...'

కారుమేఘం కమ్ముకొంటుంది ... ఇంతలో యెండ...

అంతలో వర్షం...ప్రకృతి వైచిత్ర్యంలో రహస్యమే అంత!— కాయన్న బుసగొడుతున్నాడు. ఏమీ చేయ లేక...

ఎన్నిమాటలు నేర్పింది చిలక!...

'సిన్నోడు సింతనిప్పు! అడు నూశాడో కపిత్తం గట్టి పాటపాడతాడు. నే తొలిగిపోతా...'

అనుకొని అడుగుల్లో అడుగు వేసుకుంటూ గట్టెక్కింది.

నీటిలో ముడి మునిగిపోయింది. దూరంనించి పాలికాపు కేక లేస్తున్నాడు

'అరరె! ముడి మునిగిపోయిందే! ఇంతా సేసి యిదా?' నాగుల్ని తిట్టుకొంటూ కాయన్న చెట్టు కింద చతికిల పడ్డాడు.

సిన్నోడి మేకలూ, గొర్రెలూ గడువెక్కుతున్నయ్ మేతలకి. నీరునిలిచిన కళ్ళతో నీరు నిలిచిన మళ్లవైపుచూస్తూ. .నాగులు గట్టుమీద నిలబడి దిక్కులు మాస్తోంది.

మెట్టుమీద సిన్నోడు వదురుబోంగు ఊగుతున్నాడు తుమ్మచెట్టులా నిలిచి...అడిబతుకే అతుకులేంది! గొర్రెల్ని, మేకల్ని మేపుకొని, మందచేసి అమ్ముకొంటాడు. డబ్బుకుడబ్బు చేసుకొంటాడు— సినబతుకు ఎండిపోయిన పొదుగులో ఏదో వెతుకుతోంది. విప్పరాని ముళ్లతో, ముళ్లదారిలో, చీకటిలో వొడీపంకోసం వెదుకుతోంది.

'ఈరోజు పస్తే! కాయన్న పున్నెమా' అని అనుకొంటూ ముందుకు నడిచింది. తుమ్మతోపుదగ్గర సిన్నోడెదురొచ్చాడు.

'సింతసివురు సిన్నాదానా? ఏ మొగోడి చేతుల్లో యెల్లిపోతన్నావూ? కాయన్న సెప్పేటెక్కనివ్వలేదో?' అన్నాడు.

'పోరా! నీకంతా యెటకారం!' అంటూ తప్పించుకొంది.

'నాకు దెలుసులే! రహశ్యం!' అంటూ ముందుకు సాగాడు.

'సింతసివురు చిన్నది
ఎంతో హుషాలు తున్నదీ'
'సం...త...సము...లు...తు...న్న...దీ'

సినోడి మాటలు చెవుల్ని జోరీగల్లా కొరికి పారేస్తున్నయ్! నాగులు వంచిన మొఖమెత్తకండా ముందుదారి వెతుక్కుంటూ గుడిసెవెంపు నడిచింది.

## 3

పొద్దు వాలిపోతోంది.

పొయ్యి మంటుతూన్నట్టుంది ఆకాశం ..పొగ మారిన గోడల్లా మేఘాలు...పొగలుపొగలుగా ఊగుతున్నయ్!

నాగులు గట్టెక్కి చెట్టువైపు చూసింది.

చెఱకుతోట కాల్చిన మంటలు పొగలకి చివురు చివురంతా నల్లగా మాడిపోయివుంది.

నిన్న జరిగిందప్పుడే యెటికి లేదా?'

మళ్ళీ మనసు వెనక్కి మళ్ళింది.

పాలెంనించి మరియమ్మ వచ్చి తన కొడుకుని మనువు చెసుకోమని బతిమిలాడింది.

'నా కొడుకిని సేసుకోయే కోడలా! బంట్రోతు పని. ఇచ్చి జీతం రాళ్ళు. నిన్ను కోరి కోరి చేసుకొంటా నంటన్నాడు...కాదనమాకు...సక్కా చిలకా గోరింకల్లా కాపరం సేసుకొందురు గాని...'

'ససేమిరా' వల్లకాదంది. 'అంతా దగా! యెదవలు! నేనీ జన్మలో సేసుకోను'

అని ఖంపె బద్దలు కొట్టినట్టు పొమ్మంది.

ముసలయ్య పోరుపెట్టాడు. చావు సిద్ధమైనా...

ఐనా సరే!

'మొగోళ్ళని నమ్మకు!' అంటోంది మనసు.

'ఎవర్నీ నమ్మక యేమిటి సేసేది?' అంటోంది వయసు.

'ఆడివిగాసిన యెన్నెల సేయకు!' అంటోంది సొగసు. నిన్నట్లా కడుపులో కాళ్ళెట్టుకు నే పడుకొంట! ముసలయ్య రాత్రంతా ఒహాటే బాధ!.

ఆ బాధ చూడలేక యేడ్చింది...కడుపు కన్నీరు తాగింది. ఏంపనులూ దొరకని ఈ రోజుల్లో ఆదరువైన చెట్టు తన్ని చూసి తిరిమేస్తోంది. ప్రతిఫలం ఆశిస్తోంది.

చివరికి, చెట్టూ తనలాగే మాడిపోయింది.

దీనంగా దిక్కులు చూస్తోంది.

గట్టుదిగి తిన్నగా చెట్టు దగ్గరకొచ్చింది నిన్నటి పచ్చదనం మచ్చుకైనా లేకండా పొగమారిపోయింది. కాలిన అవయవముల్లా ఆకులు అల్లలాడుతున్నయి....

'నామీద యీసు, సెట్టేంసేసిందని. దానిమీద బడ్డాడు? కాయన్న?'

తలలో మెలుస్తోన్న తలపులతో క్రుంగిపోతోన్న సంజెవైపు చూస్తోంది. కన్నీటిబొట్టు విడులుస్తోన్న మేఘాలు! తుమ్మతోపు కాలిపోతోన్నట్టు పొగలు పొగలుగా మూసుకుతోన్న చీకట్లు!

సినోడి అలికిడెక్కడా లేదు. అప్పుడేమందని మళ్ళించుకు పోయుంటాడు.

'సింతసెట్టు ఆడిపాటకి సంగీతం పాడేది. నాకు యీ బతుకుమీద యిరక్తి పుడతిన్నాది.'

గళ్ళలో అరకలు కట్టిన జాడలు నీడలుగా పరచుకొన్నయ్. ప్రేమకోసం పలవరిస్తోంది ప్రకృతి...

ఎవర్నో పోగొట్టుకొని, ఎదురు చూస్తోన్నతను, ఈ సంజె చీకట్లో మరుగున పడిపోయినతను.

తనకో విషయం పొద్దున్నే తెలిసింది.

రహస్యపుటరలో దాచుకొంది—

గువన్న మావ పట్నం వచ్చాడన్నారెవరో?

'పరిహాసంగా' అనుకొని వూరుకొంది.

'ఒక్కసారన్నా సూసేందుకు రాడా? తననీ ముసలయ్యనీ

'రాడు! ఏ మొఖం బెట్టుకో నొస్తాడు? దేన్నో మనువుసేసుకొని...' గుండె చేదుగా మారింది.

'వస్తే రాకూడదా?'

'వచ్చి యెనకటిట్టు నే కళ్ళుయూస్తే?'

## సిం త సి వు రు

'ఎంచక్కా వుంటది! ఇంతవయసూ ఓసారి పులకరించిపోతది'—ఊహాలు పోతోన్న నాగులు కళ్లు పాకల్లోకి పోతోన్న దారిలో మనుషులు నడక పసిగట్టి ఆవైపే నిగిడించి చూస్తోంది.

ఎవరో ఎలుగెత్తిన పిలుపు...

ఆపిలుపు తనకి వినిపించడం లేదు.

చీకట్లు కమ్ముతోన్న తనకళ్ళకి సంజె ఎఱ్ఱని పెనవులు చప్పరిస్తోన్న చప్పుడులాంటి భావం—

ఆడెవరో మిలిటేరి సిపాయి...

తిన్నగా తొంకించకే వస్తావున్నాడు భయం భయంగా ముడుచుకుపోతోంది శరీరం...

ఎవరోవాడు? తన్నెత్తుకుపోయే రాక్షసుడు!

'ఆడది కంటబడితే సాన...గెవర్లా తన్నుకుపోతారు సిపాయీలు' అని చెపుతుండేవాడు ముసలయ్య...

అందరూ కళ్ళముందు మెసిలారు...ముసలయ్య, గొర్రెలసినోడు....శాయన్న....గురవన్నమావ.... అందరూ?

దగ్గిరికి కలువపూవులా ముడుచుకుపోయింది. చీకట్లో వెన్నెల్లా విగుస్తోన్న జీవితం—

'నే నే... నే నే...భయపడతావేం?' అన్నాడు సిపాయి.

గొంతు మాంసంముద్ద మింగుతోన్నట్టు వినిపించింది.

సిపాయిని, నిండుగా కళ్లెత్తిచూసింది. బావుకుమన్నది.

'పిచ్చిదానా! అంతహడలెందుకే! నిన్నేం మింగేసేరాక్షసుణ్ణా? ఒక్కసారి కన్నెత్తిమాడు! అంత బేజారెత్తి పోతావేం?......నీకే విచారమూ వొద్దింక...'అన్నాడు సిపాయి చనువుగా...

'మాఅయ్య సావుబతుకుల్లో వున్నాడు! నువ్వెరవో నేనెరగను పో! అంతా ఐపోవాక యెందుకొస్తి?'

అంది గొంతుపెగుల్చుకొని...

బొడ్డుమీసాలు, బలిసినవొళ్ళూ, కండలుదిరిగిన జబ్బలూ...తూపుల్లాంటి చూపులూ...ఈడేనా?... ఈడేనా?..

సిపాయి, సిపాయిలా గద్దించాడు.

'వాకవతల టయింలేదు. ఈబండికెళ్లిపోవాల.. పోకపొయ్యేనో? ఉద్యోగం ఊడిపొద్ది...ఊఁ బయల్దేరు...'

నాగులు లేచింది. అతనివెంటబడింది బతికదానికి.. ఎంతదూరంనించి వొచ్చాడో ఈసిపాయి మావఁతన్ని వెదుక్కుంటూ...

చీకటి యిరువుర్ని కౌగలించుకొంటోంది...నక్షత్రాలు కన్నుగీటుతున్నయి...కీచురాళ్ళ సంగీతం... చెవుల్ని బూజులుపుతోంది...

గరువుమీదకెక్కి చింతచెట్టువైపు చూసింది. చీకట్లోమునిగిపోయింది. గటకస్తం బడ్డాగా. నల్లని మళ్ళలో నీళ్లు నక్షత్రాల కాంతికి తళతళలాడుతున్నయ్!

గోట్టుమీదకొచ్చాగా.

'మాఅయ్యసంగతీ...'

'ఇడ్డీనాడే పోయాడు. నువ్వెలారాంగానే, కళ్లుమూసుకొన్నాడు... నేను గూడెంలో కెళ్ళేసరికి అందరూ చెప్పుకొంటున్నారు. నువ్విక్కడున్నావని వచ్చాను. ఎంతోటయింలేదు. బండివచ్చేవేళ...జాగుచేశావో, బండిజారిపొద్ది...'

'నేనురాను మావాఁ! నన్నిడిచిపెట్టు... నా బతుకు నాకొదిలెయ్!'

కన్నీళ్ళు తెలియకండా ధారాపాతంగా వర్షించాయి.

సిపాయి గురువన్న నాగులు చేతులొడిసిపట్టి, విడిచిపెట్టకండా లాక్కెళుతున్నాడు...

తనవలపుచింతలు అందంగా చివురించడానికి వెడుతున్నది సిపాయిగురువన్నతో ...ఆచింతలు చివురించినపుడే తనకోర్కెలగోళ్లు ఎలుపెక్కుతయ్!

'సింతసివురు సిన్నదీ
సీకుసింత లేనిది'

సినోడిపాట! ఎక్కడికెళ్లినా నాగులు బతుకంతా చివురిసూనే వుంటుంది!

# భాగ్యనగర కోకిల

## శ్రీ నాయని సుబ్బారావు

౧

పదిగళము లొక్క గళమై
విదిలించినగతి సుపుష్ట విస్పష్టరవా
భ్యుదయ మనోహరగానా
స్పదమూర్తివి శ్యామల ప్రభారమ్యతనూ!

నీ నినద ప్రభావమహా
నీయరసోన్నమితమ్మయైన మూ
సీనది తట్టిలేప విక
సించిన గంధసుమ ప్రభాసితో
ద్యానవనీ బలాతిశయ
దర్పితు డాతడు పేర్చు చైత్ర యా
త్రానిరతిన్ వసంతు డమి
తప్రమదోదయ దిగ్దిగంతుడై.

అన్యవనస్థలమ్ముల నచిరకాల
మున వసంతుడు తానొక్క ముసలివాడు,
త్వద్దయాపోషిత ప్రాణధనుడు వాడు
నిత్యనూతన యౌవనాన్వితు డచట.

నీమాయ యెట్టిదో నీ
శ్రీ మధురకలస్వనమున చిగిరించినవా
రై మరులు కొంద్రు రతియును
కాముండు ననంతరూపకలనాగరిమన్.

౨

సుర్వాపై షేర్వాణీ
పర్వి చిబుకజానుయుగళ పర్యంతము, కిం
కుర్వాణ ధారితక చి
త్తార్వాయిత కింకిరాటు లచ్చటి తరుణుల్.

అరుదగు నీకలరవమున
కరఁగుదురే చార్మినార్ సిగారెట్ దమ్మున్
జరదా వేసిన బీడా
పరమార్థము వారి కింకపనివల దేమిన్.

పెల్వార్ కుర్తా వోణీ
చెల్వమ్ముల విశ్వవిజయశీలి మరుని చే
తల్వార్లు క్రొత్త బాదమ్
హల్వా రుచిఁ గాదను రతు లచ్చటి తరుణుల్.

అభవు సెగకంటి మంటల నార్పజాలు
చలువ కాటుక కడ్డీపసందు లోలయు
రెండు జడల రతీదేవు లుండబట్టి
బ్రదికి రంగసంయుక్తులై భావభవులు.

3

వారు సంస్కారశుచులైన భాగ్యవంతు
లొక్కడజ్జీ మహారథ మ్మెక్కివచ్చి
చెఱువుకట్ట బెంచీపైన చెరియొక దెస
కొలువుదీర్తురు చేతిగుడ్డలను పఱచి.

ఏకణా వేసుసెనగ పప్పెంచికొని య
తండు నగపాలు మోహంపు తరుణి కిచ్చు,
ఆమె మదనసామ్రాజ్య పట్టాభిషిక్త
యైనరీతి హసన్ముఖియై వెలుంగు.

నీవసంతాగమోన్నిద్ర నిభృతరాగ
మంజు శింజాన రమణీయ మధురగీతి
కాదు వారికి, వారు సంస్కారజడులు
వారి మోటారుహారనే వారి వీణ!

౪

కోరి మోటారుసైకిల్ షికారుపోవు
దడదడల డబడబల సిక్కుదర్పకునకు
చెవులు హాగాంతరే సురక్షితము లతని
కెమి వినపడిచచ్చు నీ ప్రేమఘోష.

జాఫరావల్లకొసలు వాల్ జడలు రెండు
రెండు గాలికి టపటపల్ రెపరెపలుగ
అతను విజయధ్వజమ్ముగ నా నతనివెనుక
సీటుపై రతి కొసరి నీపాట వినును.

పాటవిని కామపరవశోల్బణము లతివ
చూపు రాకె ట్లతని వీపు చొచ్చి గ్రుచ్చి
దూసికొని త్రోసికొనిపోయి తుదకు బవిరి
గడ్డ మాతని దొకయింత కళవళించు.

౫

అదిగొ మూడు చక్రాలవాహనము స్వీయ
విశ్వరూపదర్శన జిత విష్ణుమూర్తి,
స్వంతవాహనములు లేని జంటలకును
సరసశృంగార కేళి కాస్థానభూమి.

అతడు నారాయణుడు మహాప్రశస్త
శీధుపానాధరీకృత సీరపాణి,
కలితరథచోదనక్రియా కౌశలమున
దారుకుని మాతలిని తలదన్నినాడు.

గుమ్మటమువంటి రిక్షా
నిమ్ముగ నిలుకుకొని రతియునించు విలుతుడున్
కమ్మని నీ కోకోల్వని
బమ్మెరవోవుదు రొకళ్ళపై నొక్కరుగా.

పరభృతకుహూనినాద సంభ్రమములు వార
లొక్కరొ యిర్వురొ యన్న చిక్కుపుట్టు,
పరభృతకుహూనినాద విభ్రమము సూతు
డేకచక్రమ్ముపై సివమెత్తి యూగు.

౬

ఏలోకమ్మునుండి వచ్చితివో నీ
వెందుందువో గాన వి
ద్యాలాలిత్యకళాప్రపంచమెటు సా
ధ్యమ్మయ్యెనో నీయెడన్
త్రైలోక్య ప్రణయ ప్రసాద రచనా
ప్రత్యంతముల్ సి మహా
లీలల్ మానసమోహనమ్ములు గదా
లీలా శకుంతప్రభూ!

ఒకరాగ మ్మొకపాటగా బ్రదుకు బా
టొక్కింతయున్ దాట కం
గక సుశ్యామల కోమల ప్రభల స
య్యాటన్ తలంపింతు వీ
వొక ప ల్కొక్కశరమ్ము నొక్కనతిగా
నూర్జస్వలాంగప్రదీ
ప్తి కలాప ప్రతిపాలితాఖిల జగ
ద్వీథిన్ రఘూత్తంసమున్.

# సరిహద్దులు

శ్రీ అంగర సూర్యారావు

## పాత్రలు:

| | |
|---|---|
| లచ్చన్న | నారాయుడు |
| వెంకన్న | రుద్రయ్య |
| రాముడు | రాజయ్య |
| చిన్నయ్య | పెద్దయ్య |

చంద్రమ్మ.

(తెల తెలవారుతూవుంది. దూరాన్నుంచి మేలుకొలుపుపాట శ్రావ్యంగా వినిపిస్తోంది.

* "...తెల్లవారావచ్చె తెలియాక నాసామి
మళ్ళీ పరున్నావు లే-రా!
వేణునాదాము వీని వేగ పర్విడివస్తి
వేళాకోళమేల - లే - రా!"

మసక వెలుతురులో రంగస్థలం అస్పష్టంగా-స్వప్నంలోని దృశ్యంలా-కనిపిస్తూవుంది. ఒక పంటపొలం - పొలం మధ్య ఒక పెద్ద గట్టువుంది. పొలాన్ని - ఆగట్టు - రెండు భాగాలుగా విభజిస్తోంది. దూరాన్ని గట్టుకు యిరువైపులా రెండు గడ్డిమేట్లు - మసక వెలుగులో కొండలలా కనిపిస్తున్నై. కథ జరుగుతూవుండగా రంగస్థలం మీదికి క్రమంగా ఉదయకాంతి వస్తూ వుంటుంది. ఎడమవైపు గడ్డిమేటుకు చేరబడి వెంకన్న కునుకుపాట్లు పడుతూ వుంటాడు. పాట దూరంగాపోయి - గాలిలో కలిసిపోతుంది.)

వెంక : (కళ్ళు తెరిచిచూసి భయంతో) ఓరి దేవుడా! అప్పుడే తెల్లారి పోయింది!

లచ్చ : (నేపథ్యంలో) ఒరేయ్ యెంకన్నా!

వెంక.: (ఉలికిపడి లేచి నుంచుని) యిక్కడే వున్నాను బాబయ్యా!

(లచ్చన్న ఎడమవైపునుంచి వస్తాడు. మోకాళ్ళ వరకూ పంచె యెత్తికట్టాడు. లావుగా పొట్టిగా వున్నాడు. తలపాగావుంది. భుజం మీద తువాలు వేసుకున్నాడు. వేళ్ళకు రవ్వల ఉంగరాలు వున్నాయి.— వేషాన్నిబట్టి 'పెద్ద రైతు' అని తెలుస్తూ వుంది.)

లచ్చ : జాగర్తగా యిక్కడ కాపలా వుండరా యెదవా అంటే నిద్రపోతన్నావంట్రా?

వెంక : లేదు బాబయ్యా! తెల్లవార్లూ మెలుకూగానే వున్నాను. నాకంఠంలో వూపిరి వున్నంతదాకా (గట్టుకేసి చూపిస్తూ) ఆ అద్దుదాటి బెమ్మదేవుణ్ణయినా యివతలికి రానియ్యను.

లచ్చ : (కోపంతో) ఆ యెదవలంతా యెక మా అయ్యదగ్గిర పాలి కాపులు. ఆళ్ళకిప్పుడు కొమ్ములు మొలిసిపోయినై. గింజుకు సచ్చినా బోదె కాలవ వొదల్ను. ఒక్క నీటిసుక్క కూడా దొరకనివ్వను.

వెంక : ఆళ్ళు రాత్రంతా తిరుగుతానే వున్నారండి.

లచ్చ : ఒరేయ్ యెంకన్నా! తిరగడమే కాదురా! ఆళ్ళంతా యియ్యేళ నా మీదకి రాడానికి తయారుగా వున్నారు.

వెంక : దిక్కుమాలిన కాలం. ఒకప్పుడు తమరిపేరు సెబితే చుట్టుపట్ల మూడూళ్ళదాకా హడల్. యీ యెలక్సన్ రోజు లొచ్చిందగ్గిర్నుంచీ ప్రతీవోడూ పిల్లి కొడుకులాగ బిర్ర బిగుసుకూర్చున్నాడు. ఐదేళ్ళకిముందు లచ్చన్న కాపు పేరుసెబ్తే దిశలు తెల్లారేయి.

లచ్చు : సుబ్బయ్యగాడి కొడుకు గాదూ?

వెంక : అక్షరలక్షం బాబయ్యా!

లచ్చు : తెగమిడిసి పడేవోడు యెదవ! సూసేను. ఆలోసించేను.—యీడి పొగరిలాక్కాదని మన దూళ్లమందని—ఆడి పైరు సేలోకి ఒక రాత్రి కాసతోలించెశాను. ఒక యేడాదిలో దివాళా తీసేశాడు. పొలం తణఖా పెట్టేశాడు.

వెంక : యిప్పుడు జనం తెలివి మీరి పోయేరు బాబయ్యా! యీళ్లకి భయం భక్తుల్లేవు.

లచ్చు : (మీసం మెలేస్తూ) మన సంగతి యీ దెబ్బతో తెలిసి పోతాది.—యియేళ సరద్దు దాటేసి కాలవ తెగ్గొట్టేస్తానంటున్నాడంట.

వెంక : (ఆత్రుతతో) ఆ మాట అన్నోడెవడండీ?

లచ్చు : నారాయుడు.

వెంక : ఆ గట్టు దాటిన గాడిద కొడుకుని పట్టుకుని మేకన్నరినట్టు నరికి పారేస్తామండి.

లచ్చు: మనం అనుకున్నట్టు లేదు యవ్వారం. రంగు మారతంది. పల్లపుపొలాలోళ్లంతా యేకమై పోయేరు. మనం యిరవైనాలుగ్గంటలూ కాసుకుని వుండాలి.

వెంక: యిక్కణ్నించి అడుగు కదపటంలేదు బాబయ్యా!

లచ్చు: యీ గట్టు కాపలా కాయడం నీ వొక్కడివల్లా అవ్వదు. యెవడైనా గట్టుదగ్గిరికొచ్చేడో యెంటనే రుద్రయ్యగాణ్ణి పిలు (ఎడమవైపు తిరిగి బిగ్గరగా పొలికేక వేస్తాడు) ఓ...రి... రుద్రయ్యా!

రుద్ర: (దూరాన్నించి) ఓ...హోయ్!

[మరుక్షణంలో రుద్రయ్య ఎడమవైపునుంచి అమాంతంగా వచ్చి వాల్తాడు. పెద్ద గిరజాలతల. పొడవుగా వున్నాడు. వంపులు తిరిగిన దండలు. మోకాళ్ళవరకూ పంచె, బనీను. కోరమీసం పైకి మెలితిరిగివుంది. చేతిలో కర్రవుంది.)

రుద్ర: (వస్తూనే బిగరగా) యెవడు? గట్టుదాటిన యెదవ యెవడంట!! (చుటూ చూస్తాడు.)

లచ్చు: యింకా యెవడూ దాళ్లేదులే! (రుద్రయ్య వీపు తట్టుతూ) ఒరేయ్ రుద్రయ్యా! నువ్వు జాగర్తగా వుండాలి. ఆళ్ళంతా కూడబలుక్కున్నారని తెలిసింది. యియ్యేళ గట్టు దాటేస్తారంట.

వెంక: యెవడైనా గట్టు దాటడానికి వచ్చేడో యెంటనే నిన్ను పిలుస్తాను.

రుద్ర: నీ కేక యినగానే కాకిలా వాల్తానిక్కడ.

లచ్చు: చావగొట్టి చెవులుమూసెయ్. ఖనో స్టేషనోంటిలు ఖర్చు పెడతాను. నీకేం బయంలేదు.

రుద్ర: (హుంకరించి) నాకా బయం! ఆ యెదవలికింకా నా సంగతి తెలవసంలేదు.

వెంక: పులయ్యగాడి కాలుసరికి అరెస్టై జైలు కెళ్ళొచ్చేవ్ — నీ సంగతి తెలియకపోడమేట్రా?

రుద్ర: యీ దెబ్బతో పూర్తిగా తెలిసిపోవాల్నా సంగతి.

లచ్చు: ఒరేయ్ రుద్రయ్యా! నువ్వుమాత్రం బోదకాలవని ఒకకంట కనిపెడూ వుండాలి. మన కతంతా దాన్తోవుంది.

రుద్ర: నేనక్కడే కూర్చునుంటన్నాను.

లచ్చు: పద! పద! అక్కడికే యెల్లిపో! (వెంకన్న వైపు తిరిగి) ఒరేయ్ యెంకన్నా! నువ్విక్కణ్నించి కదలకు.

వెంక: అలాగే బాబయ్యా!

రుద్ర: యీ మద్దిని మన సేతులికి పనిలేక సులు పట్టేస్తున్నాయి. (ఎడమవైపు వెళ్ళిపోతాడు.)

లచ్చు: నేను పైపొలంలో వుంటాను. అవసరమొస్తే పిలు!

వెంక : అలాగే బాబయ్యా!

(లచ్చన్న ఎడమవైపు వెళ్ళిపోతాడు. వెంకన్న గట్టు దగరనుంచి ఎడమ చివరవరకూ తిరుగుతూ వుంటాడు. వెంకన్న ఎడమవైపు తిరిగి వున్న సమయంలో కుడి చివర నారాయుడు కనిపిస్తాడు. రెండడుగులు ముందుకు వేస్తాడు. వెంకన్న ఆకస్మికంగా తిరిగి చూస్తాడు.)

వెంక: (బిగ్గరగా) ఆగక్కడ! గట్టుదాటేవో నీ తలకాయ నీది కాదు.

నారాయుడు: (నిర్లక్ష్యంగా నవ్వి) ఎందుకురా యెంకన్నా అలా ఉలికులికి పడతావ్?

వెంక: ఒరేయ్. నారాయుడూ! మన సుట్టరికాలు ఇక్కడ కాదు ఇంటికాడ.

నారా: (ముందుకు వచ్చి చేతికర్ర గట్టుమీద ఆని) నేను నా సేలో నా అద్దులో నిలబడి మాట్టాడతన్నాను.

వెంక: నీ అద్దులో నువ్వుంటే గొడవేలేదు. అద్దుదాటితేనే పేచీ.

నారా: నువ్వే నాయం సెప్పరా యెంకన్నా, బోదికాలవకి అడ్డెయ్యడం నాయమా?

వెంక: అదంతా నాకుతెల్దు. నేను తలమున్కలున్నా వోణ్ణి. నౌకిరీవోణ్ణి. పెద్దరైతేం సెబ్తే అదే సెయ్యాలి.

నారా: నాయంతో నాకేం పన్లేదంటావా?

వెంక: నాయమో, అన్నాయమో తీర్పు సెప్పడానికి వూళ్ళో పెద్దమణుసులున్నారు.

నారా: వూరి పెద్దల్లో నీతుంటే ఇన్ని తగాదాలు, పేచీలు ఎందుకొస్తాయ్‌రా యెర్రోడా!

వెంక: నువ్వు సెప్పింది నిజమే, అయినా యీ గొడవలో నేనేం సెయ్యలేను.

నారా: దేవుడు కళ్లెందుకిచ్చేడు? మంచిదారిలో నడ్డానికి. బుద్ధి ఎందుకిచ్చేడు? మంచిపనులు సెయ్యడానికి.

వెంక: నన్నేం సెయ్యమంటావిప్పుడు?

నారా: ఏం సెయ్యొద్దు. నాగ్రోజులపాటు పొలంలోకి రాడం మానెయ్. మా పని మేం సూసుకుంటాం.

వెంక: లచ్చన్నగారి నౌకరీలో వున్నంతకాలం నేను ఆ పని సస్తే సెయ్యను.

నారా: యెంకన్న బావా! మరోమాటు ఆలోసించు నువ్వూ పిల్లలుగలోడివి.

వెంక: నువ్వెంత సెప్పినా నేను యిన్ను.

నారా: లచ్చన్న తన పొలంలోంచొస్తున్న బోదికాలవకి గట్టేసేశాడు. మా పొలాల్లోకి ఒక నీటిసుక్కయినా రాకుండా సేసేడు. తను పెద్దరైతు. తన పొలానికే ముందు నీరెట్టుకోమన్నాం. తనపొలం తడిసేకే మా సేలకి నీరొదలమన్నాం. వొదలడంట. పైగా తనసెరువుకి నీరుపెట్టుకుంటాడంట. పిల్లా మేకల్తో మేం బీదోళ్ళమంతా యేమైపోవాలి? మా చిన్న మడి పండక్కరేదా? మాకు కటకోడానికి గుడ్డ లేకపోతే మానె తిండానికి తిండైనా వద్దా?

వెంక: (బాధగా) నేనేం సెయ్యలేను నారాయుడూ!

నారా: నువ్వేం సెయ్యొద్దు. తప్పుకో. నువ్వు నాక్కావలసినోడివి గనక యింత సెబుతున్నాను. నువ్వు తప్పుకుంటే సాలు. మేం గట్టు తెగ్గొట్టేస్తాం. మా సేలు తడుపుకుంటాం.

వెంక: (తీవ్రంగా) నా గొంతులో వూపిరున్నంతదాకా ఆపని జరగదు.

(కుడివైపునుంచి రాముడు వస్తాడు. వయస్సు 20 సంవత్సరాలు. నూనూగు మీసం, మల్లుచొక్కా, పంచెకట్టూ, చేతిలో కర్రా, ఉంగరాలు తిరిగి చిందరవందరగావున్న నల్లటి జుత్తు–ముఖంలో ఉద్రేకం, చురుకుతనం కనిపిస్తూ ఉంటాయి)

రాముడు: (వస్తూనే నారాయుడుతో) ఒరేయ్ బావా! నీకు బుద్ధిలేదురా, యీళ్లతో మళ్ళీ రాజీ బేరాలకొచ్చేవా?

నారా: మరోమాటు సెప్పిసూశాను. ఏమన్నా ఇంటాడేమో అనుకున్నాను.

రాము: నీ యెర్రికాని ఆళ్ళు నోటిమాటల్తో యినర్రా బావా!

వెంక: (రాముడుతో) ఒరే రాముడూ! బొడ్డూడని కుర్రోడువు! నీకెందుకురా యీ గొడవలు!

రాము: (తీవ్రంగా) యెంకన్నమావా! మీరు సేసే అన్నాయాలు మా పెళ్లికుర్రాడిక్కూడా తెలుస్తాయి. కాకి తెలగా ఉందని నువ్వెంత సెప్పినా సిన్నకుర్రోడుకూడా ఒప్పుకోడు.

నారా: ఆ కరువుమాటు కచ్చితంగా లచ్చన్న కాపుని నిలదీస అడుగుతాను ఒప్పుకుంటాడా! సరేసరి! లేదా...

రాము: (మధ్యలో అందుకొని బిగరగా) ఒప్పుకోడు. తగినబుద్ధి సెప్పేదాకా ఒప్పుకోడు. యేడాది

కిలిం మన పొలం పదిగజాలు కలిపేసుకున్నాడు. రాత్రికి రాత్రి సరిహద్దులు మార్చేశాడు. అంత అన్యాయం సేసినా మనం అప్పుడు నోరెత్త లేకపోయాం.

నారా: తీరూసెప్పే పెద్దమనుషులుకూడా అన్యాయానికి ఒడికట్టేరు.

రాము: యెంకన్నమావా! యిప్పుడైనా తెలుసుకో! మీ పెద్దరైతులరోజు లెల్లిపోయినై. యింక అల్లె ఆటలు సాగవ్. సిన్నరైతుల మంతా యేకమై పోయాం. సరిహద్దులు సెరిపేశాం. ఉమ్మడి యెవసాయం సేసుకుంటున్నాం.

నారా: యీమాటు నష్టమొచ్చినా కష్టమొచ్చినా ఒకడికి రాదు. అందరికీ వస్తాది. అందరూ ఒకతాటిని నిలబడతారు.

రాము: మీ లచ్చన్నలాంటి పెద్దరైతులు దండుం దొచ్చినా మేం జంకం. ఒకే మాటమీద నిలబడతాం.

నారా: యెంకన్న బావా! నువ్వుకూడా యెందుకీ గొడవలో యిరుక్కుంటావ్? రా! మాతో కలిసిపోయి యెవసాయం సేసుకో. మాతో పాటు కలో గంజో తాగు. యీ రక్తంకూటికి ఆశపడక.

వెంక: ఒరేయ్ నారాయుడూ! నీపాటె నాకు తెల్దనుకోకు. యీ నౌకిరి నేను కుదుర్చుకున్నది కాదు. మాతాత ముత్తాతలదగ్గిర్నుంచి వస్తంది.

రాము: మీ తాత ముత్తాత లెలాగున్నారో నువ్వూ అలాగే వుండామనుకుంటున్నావా? నీ బతుకు ఆల్లకంటే కొంచెమైనా మెరుగ్గా వుండొద్దా?

వెంక: యీ బతుకిలాగ ఎల్లిపోతేసాలురా రాముడూ!

నారా: యెంకన్న బావా! మరోమాటు సెబుతున్నాను. నామాట యిను రెండ్రోజులపాటు నువ్వు పని మానేసి యింట్లో కూర్చో. నీలాంటి మంచోడు యిలాంటిగొడవల్లో సిక్కుకోడం నాకిష్టం లేదు. అందుకని యింత సెబుతున్నాను.

వెంక: నువ్వెంతసెప్పినా నాపని నేను మానను. మా రైతు యేంసెబ్తే అదే సెయ్యాలి నేను. యీగట్టు కాపలా కాయమన్నాడు. అదే సేస్తన్నాను.

రాము: (కోపంతో) ఒరేయ్ బాబా! యిక నోటిమాటల్తో పనులవ్వవురా! (బిగ్గరగా) యిదిగో! యెంకన్నా సెబుతున్నాను. బోగుకాలవకి మీరేసినగట్టు ఈరోజు జబర్దస్తీగా తెగ్గొట్టేస్తాం. యేమౌతాదో చూస్తాం.

రుద్రయ్య: (బిగ్గరగా కేకలువేస్తూ ప్రవేశిస్తాడు.) ఒరేయ్! ఒరేయ్! యెవ్రాలక్కడ? గట్టు తెగేసే మొనగాడెవ్డ్రా అంట! (ముందుకు ఒక్కదూకుదూకి పొలంగట్టుమీద చేతికర్రతో ఒక్కటి కొడతాడు.)

రాము: (గట్టును సమీపించి కోపంతో) నేన్రా!

రుద్ర: ఒరేయ్! నీకు మాతిమీద మీసముంటే గట్టు దాటరా చెబ్తాను.

రాము: ఇయ్యాళ నువ్వో నేనో తేలిపోవాలి.

(రాముడు బిరబిరా గట్టుదాటబోతాడు. నారాయుడు రాముణ్ణి రెండుచేతుల్తో పట్టుకొని వెనక్కి లాగేస్తాడు)

రుద్ర: ఒరేయ్! మీతండ్రీకొడుకులిద్దరూ యేకమై కాలవగట్టు తెగ్గొడదామనుకున్నార్రా! (సగర్వంగా) జాగర్త! యీ రుద్రయ్యగారు యిక్కడున్నాడని గ్యాపకం వుంచుకోండి.

నారా: (కోపంతో) యేట్రా: పూటకునీకొడీ తెగ మిడిసిపడతన్నావ్?

రుద్ర: ఒరేయి గట్టుదాట్రా! నీ తలకాయ తియ్యకపోతే నాపేరు రుద్రిగాడు కాదు.

(నారాయుడు, రుద్రయ్య సరిహద్దుకు యిరువైపులా దగ్గరగా నిలబడతారు)

నారా: ఒరేయ్ యెదవా! నాయంకోసం ఆలోసిసన్నాంరా. మేం గట్టుదాటం కొని తేవాలంట్రా? సెనంపట్టదు.

రుద్ర: ఒరేయ్ 'నేను ప్రతిగ్న చేస్తన్నాన్రా' అద్దు దాటిన యెదవకి తలకాయతీసి బూమిలో మొరేస్తాను.

(కుడివైపునుంచి తొందరగా చిన్నయ్య, పెద్దయ్య ప్రవేశిస్తారు. యిద్దరిచేతుల్లోనూ

క్రలువున్నాయి. వేషాన్నిబట్టి చిన్న రైతులని తెలుస్తోంది.)

చిన్నయ్య: (ఒక్క దూకు దూకి నారాయుడు ప్రక్కను నిలబడి) తలకాయితీసి మొలేసీ మొనగాడెవ్రడా?

పెద్దయ్య: (ముందుకువచ్చి) ఒరేయ్ రుద్రిగా, నాయంగా సెబ్తే యింటాంగాని 'తన్నుతాం దున్నుతాం' అంటే మేమంత తీసిపోయేమను కున్నావంట్రా!

వెంక: (సమాధానంగా) ఒరేయ్, రుద్రయ్యా 'నువ్వెళ్లిపో' నువ్వుంటే యింకా గొడవ ముదిరి పోతాది. యీళ్లు అడ్డుదాటరులే. నేను సూసు కుంటాను యెళ్లు.

రుద్ర: (విధిలేక) యేదో పెద్దోడువు నువ్వుసెప్పేవని వూరుకుంటన్నాను. యీళ్లు గట్టుదాటితే నన్ను పిలు, ఒకొక్కణ్ణీ కప్పెట్టేస్తాను.

(ఎడమవైపు వెళుతూవుంటాడు.)

రాము: పోరా, కుక్కా,

చిన్న: (హేళనగా) దుగ్గచ్చి!

(రుద్రయ్య గత్యంతరంలేక వాళ్లికేసి కోపంగా చూసి వెళ్లిపోతాడు.)

పెద్ద: ఒరేయ్, యెంకన్నా, ఆళ్లకి బుదిలేకపోతే నీకైనా వుండక్కర్లేదంట్రా, గవర్నమెంటు కాలవకి లచ్చన్న అడ్డేస్తాడా? మాకు నీళ్లు రాకుండాసేస్తాడా? ఆడి పొలాలు బంగార మయిపోవాలా? మా పొలాలు మట్టయి పోవాలా?

చిన్న: మేంమాత్రం పన్నులు కట్టడంలేదంట్రా?

రాము: మునసబు కర్ణాలు పొలాలు పండినా పంపేక పోయినా ముక్కుపిండి డబ్బుకనూలుసేస్త న్నారు.

చిన్న: ఆళ్లి మామ్మాళ్లతో సయిశం నిలదీసి కనూలు సేస్తున్నారు.

నారా: డబ్బున్న మారాజులు డబ్బుజల్లేసి పండినా పండలేదని రాయించుకుంటున్నారు. శిస్తు తగ్గించుకుంటున్నారు.

పెద్ద: యీ పల్లెటూళ్లలో పెద్దమారాజులు సేస్తున్న అన్నాయాలు యిన్నీ అన్నీ కావు జబర్దస్తీగా సరద్దులే మార్చేస్తున్నారు.

నారా: అన్నాయాలకి ఒడిగట్టినోళ్లని బగమంతుడు కనిపెడతా వుంటాళ్లే!

పెద్ద: అదెలాగా తప్పదు. యెనకటికి 'హిట్లేర్' యేంజేశాడు? దేవుడిచ్చిన సముద్రానికి, ఆకాశానికి, బూమికీ అన్నిటికీ అడ్డులు పెటేశాడు, సివరికి బస్మాసురుళ్లాగా బూడిదై పోయేడు.

చిన్న: యిప్పుడా లచ్చన్నకికూడా అలాంటికాస్తే అవ్వాలి.

రాము: అదెలాగా దేవుడాసిపెట్టిందే.

నారా: పదండి పోయి ఆలోసిద్దాం. మనోళ్లందరూ యేమంటారో యిందాం.

చిన్న: యిస్యేళతో కాలవనీటి సంగతి తేల్సె య్యాలి. లేకపోతే మనం మట్టిగట్టుకుపోతాం.

రాము: డబ్బు మూటగట్టి దాస్తన్నాడు, అలాగే నీళ్లనుకూడా తన సెరువులో దాసుకుందామను కుంటన్నాడు లచ్చన్న.

నారా: గవర్నమెంటు పోలా ల్లాగేసుకుంటారని తేలగానే...

రాము: (మధ్యలో అందుకొని) గింజుకు సచ్చి పోయేడు.

చిన్న: కొడుకులపేర్ని, కూతుళ్లపేర్ని, మనమలపేర్ని పొలాలన్నీ సర్దేశాడు.

నారా: సివరకి పిసరుబూమి కూడా పైకిపోడానికి దారి లేకుండా సేశాడు.

పెద్ద: డబ్బున్న మారాజులేం జేసినా అలా సెల్లి పోతాది. (యింతవరకూ తలవంచుకొని విచా రంగా ఆలోచిస్తున్న వెంకన్నతో) యెంకన్నా. మేం యెళ్తున్నాం. లచ్చన్నగారితో మరోమాటు సెప్పు. నీళ్లు మర్యాదగా వొదిలి పెడతాడో...

చిన్న: (మధ్యలో అందుకొని) వదిలిపెట్టమను. లేదా

రాము: యీ రోజు పొద్దుకూకేసరికి మేమే కాలవ గట్టు తెగ్గొట్టేస్తాం.

పెద్ద: (అందరితో బిగ్గరగా) పదండిరా! పదండి!

చిన్న : యింక పూగుకోడానికి యీల్లేదు.

రాము: యీ రోజుతో తేల్చేద్దాం

నార: యెంకన్న బావా! ఆలోసించుకో! నువ్వే బురదలోంచి తప్పుకో!

(రాముడు, నారాయుడు, చిన్నయ్య, పెద్దయ్య కుడివైపు నిష్క్రమిస్తారు. వర్షంకురిసి వెలిసి నట్లయ్యింది. అంతా నిశ్శబ్దం. వెంకన్న ఒక్కడూ దిగులుగా యేదో ఆలోచిస్తూ అటూ యిటూ తిరుగుతున్నాడు. ఆ ప్రశాంతతను చీల్చుకొని దూరాన్నుంచి పాట వినిపిస్తోంది.

* "ఓ...ఓబలేసుని కొండల నడుమా
యెద్దులతో లే ముద్దుల మరిదీ
దాపటెద్దుకు దప్పికాయెనురా...ఓ..."

యెద్దుల మువ్వలధ్వని వినిపిస్తుంది. "ఒరేయ్! యెలపటెదా న్నొక పెయ్యరా!" "దాపటెద్దు నొకటి పొడు." "ఓ...ఓరి మల్లయ్యా!... ఆగితె నిలా వళ్లించరా!"—అని కేకలు విని పినూ వుంటాయి. — ఒక చేత్తో అన్నంముంత పట్టుకొని ఒయ్యారంగా ఎడమవైపునుంచి చంద్రమ్మ వస్తుంది. వయస్సు 15 సంవత్సరాలు. జుత్తు చిందరవందరగా ముఖంమీద పడుతోంది. ముఖంలో చురుకుతనం కనిపిస్తోంది. పరికిణీ, ఓణీ, జాకెట్టు వేసుకొంది).

చంద్ర: (వస్తూనే) ఒరేయ్ అయ్యా! నే నొస్తుంటే నేం...దారిలో నేం...

వెంక : (ఆత్రుతతో) యేమయ్యిందే తల్లీ?

చంద్ర : ఆ కొండయ్యగాళ్లేదూ?

వెంక : (కోపంతో) యేం! యేం జేశాడు?

చంద్ర : ఆబోతు-నేం ... దుర్రుచ్చికొట్టి తోలేశాడు.

వెంక : (నవ్వుతూ) అంతేనా!

చంద్ర : అప్పుడా ఆంబోతు యేం జేసిందనుకున్నావురా అయ్యా!... ముందు కాళ్లు రెండూ పైకెత్తేసి లగావు తీసేసింది. అడ్డొచ్చిన సెట్టుల్నీ, పుట్టల్నీ కుమ్మేసిందీ.

వెంక : కొంటెదద ఆ కొండిగాడు సేసేయన్నీ అలాంటిపన్లే.

చంద్ర : అప్పుడె నేం జేసి వస్తున్నావ్. పొలంగట్టు వొదిలేసి పుంతలోంచొచ్చేను.

వెంక : అందుకే ఆల్సింగా వొచ్చేవ్. పోన్లే అమ్మా! సుట్టు తిరిగి రావడమే మంచిదయింది.

చంద్ర : (ముంత తండ్రి చేతికిస్తూ) ఒరేయ్ అయ్యా! యియ్యాళ సద్దికూటిలోకి ఊరగాయ ముక్క లేదురా. కోమటమ్మ కొట్టుకెళ్లేసింది.

వెంక : (ముంత తీసుకొని) పోన్లే, నేను సద్దికూడు తినొచ్చేదాకా యిక్కడే కూచో. యీగట్టు కేసి సూస్తా వుండు.

చంద్ర : గట్టుకేసి సూడ్డం యెందుకురా అయ్యా! అదెక్కడికైనా పారిపోతాదేంటి?

వెంక : నీకు తెల్దులే, అది ఆళ్లకే మనకీ అద్దు. యెక్కడికీ కదలకుండా కూర్చో.

(వెంకన్న ముంత తీసుకొని ఎడమవైపు వెళ్ళిపోతాడు. చంద్రమ్మ చుట్టూ చూస్తూ యేం తోచక అటూ యిటూ తిరుగుతుంది. కోకిలను అనుకరిస్తూ "కోయ్...కోయ్..." అని కూత కూస్తుంది. తనలోతను నవ్వుకుంటుంది. ఉత్సాహంతో పాట పాడుతూ వుంటుంది.)

చంద్ర : (పాట) ఇసుక నదిలో దూరి బుసలుకొట్టింది
పాడుతూ కోయిలా పరుగులెత్తింది.
ఆడుతూ ఆ నెమలి అలిసిపోయింది.
నవ్వుతూ మా అయ్య బువ్వతిన్నాడు.

(పాట మధ్యలో కుడివైపునుంచి నెమ్మదిగా రాముడు ప్రవేశిస్తాడు. చేతికర్రమీద గడ్డం ఆని చంద్రమ్మకేసి కోరచూపులు చూస్తూ వుంటాడు)

చంద్ర : (రాముణ్ణి చూడగానే) యేరోయ్, రాముడూ ఆవదంతాగి నోళ్లా మొకం అలా పెట్టుకున్నావేం?

రాము: (కోపాన్నభినయిస్తూ) ఏయ్ పిల్లా! నువ్వు నాతో మాట్లాడకు.

చంద్ర: (వెంటనే) నీతో మాట్లాడకపోతే నాకేం నష్టమా?

రాము: మీ బాబుకీ మాకూ పేచీ మాంచి పాకంలో పడింది. తెల్సిందా?

చం(ద: మా బాబుకీ మీ బాబుకీ ఏఁవీ వుంటే వుంటేనియ్. మద్దిని నీకూ నాకూ యెందుకూ అంట—యీ మాటి తిప్పుకోడాలు.

రాము: మీ బాబు సాలా అన్నాయానికి వొడికట్టుకున్నాడు.

చం(ద: (కోపంతో) అలాంటి కజ్జాకోరుమాటలు నాతో సెప్పకు. నుంచినుంచి మల్లిపువ్వులు కురించి. దోరదోర జాంకాయలుకురించి నాతో యెంతసేపైనా సెప్పు యింటాను.

రాము: చం(దమ్మా! కచ్చితంగా సెప్పేత్తన్నాను యినః. యియ్యేళనుంచి నీకూ నాకూ మాటల్లేవు.

చం(ద: (ఒక్క దూకుదూకి — చెంగున సరిహద్దు దాటేసి రాముణ్ణి చెవిపట్టుకొని) యేది? నువ్వు నాతో మాట్లాణ్ణని పెమాణకం సెయ్యి.

రాము: (ఉలికిపడి చెవి విడిపించుకొని) యేయ్ పిల్లా! కొంపతీసేశావు. సరిహద్దు దాటేశావు!

చం(ద: (తేలిగ్గా) అలాంటి అద్దులు యీ పైవాటకేను. నాకు అడ్డేంటంట! లెగమాణ్ణి గట్టు దాటకుండా సెయ్యగలవా?

రాము: మెళ్ళో పలుపు తాడేసి కట్టేస్తేసరి.

చం(ద: యెంతసేపు కట్టగలవేంటి?

రాము: యెంతసేపైనాసరే!

చం(ద: పోదూ! పట్నపోళ్లలాగ పూసులుమాత్రం సెబుతావ్ (రాముడి చెయ్యిపట్టుకు లాగుతూ) దా! దా! మా వుసిరిసెట్టుకాడ కెల్దాం.

రాము: మీ అద్దులోకి నేరాను.

చం(ద: నువ్వు రాకపోతే యేంశేస్తానో తెలిసిందా?

రాము: యేంజేస్తా వేంటి?

చం(ద: పోగరుమోతుయెద్దుని యీడ్సుకెళతారు సూశావా? అలాగ ముక్కుకి తాడేసి యీడ్సుకెళతాను. (గట్టువరకూ చెయ్యిపట్టుకొని లాక్కెడుతుంది.)

రాము: (ఉపాయం ఆలోచించి) సూడే చం(డీ! (కుడివైపు చూపిస్తూ) అదుగో! ఆ నేరేడుసెట్టు సూడు! నల్లగా — దాక్షపళ్లలాగ — యెంతరంగా వున్నాయే నేరేడుపళ్లు...

చం(ద: (ఉత్సాహంతో అటుచూస్తూ) మరి నువ్వు సెట్టెక్కి కోస్తావా?

రాము: నేను సెట్టెక్కి కొమ్మలు దులుపుతాను. నువ్వు కిందపడ్డ పళ్ళు యేరి మూటగట్టు.

చం(ద: అయితే పద!

(రాముడూ చం(దమ్మా చెయ్యీ చెయ్యీ పట్టుకొని కుడివైపు వెళుతూ వుంటారు. అంతలో పాటవిని వెనక్కి తిరిగిచూస్తారు రాజయ్య హుషారుగా యీలేసి పాటపాడుతూ (పవేశిస్తాడు. మోకాళ్లవరకూ పంచె, చేతిలో క(ర, పైమీద పంచె—వయస్సు 80. సంవత్సరాలు.)

రాజయ్య: * రూపాయి కావాలా పిల్లా
రూపాయి సిల్లర కావాలా?

చం(ద: (నవ్వుతూ) ఓసి రాజియ్యమావాఁ! నువ్వంట్రా!

రాము: (నవ్వుతూ) బలే! బలే పాట పాడావురా!

రాజ: యెక్కడికిరోయ్! పిల్లా పిల్లోడూ బయల్దేరేరు!

చం(ద: నేరేడు సెట్టుకాడకి! నువ్వుకూడా వస్తేరా!

రాజ: మీ యిద్దరికీ మద్దిని కుదిక్కరలాగ నేనెందుకు? యెల్లండా బాబా యెల్లండి! తిరగండే పిల్లా తిరగండి! యిది వయసురా బాబా! యిది పోతే మళ్లీరాదు. ఒకసాటు పొంగి సల్లారిన పాలు—యింకోసాటు పొంగవ్.

రాము: యేం వాగుతావ్ రా వసపిట్టలాగ! రాముడు చం(దమ్మ కిలకిల నవ్వుతూ కుడివైపు వెళ్లిపోతారు. రాజయ్య తిరిగి పాటపాడుతూ వుంటాడు.

రాజ: (పాట)

రాజమం(డీ యెళ్లా నేలా
రంగుబట్టా కట్టా నేలా
రమణీ నిన్నూ మరువా లేనే
రావే రావే నా యెంటా!

(ఎడమవైపునుంచి చేతులు తుడుచుకుంటూ వెంకన్న (పవేశిస్తాడు.)

వెంక: (వస్తూనే) యేఁవోయ్ రాజియ్యా! యియ్యేళ రావని రైతుదగిర సెలవు పుచ్చుకున్నావ్. మళ్లా దిగబడ్డావేం?

రాజ: మా యింటిదాన్తో యెక్కళ్లేని గొడవా వచ్చి పడిపోయిందిరా!

* ఈ గుర్తుకలవి జానపద గేయాలు.

వెంక : యేం? యేమయ్యింది?

రాజ : ఒక్క పూటైనా సుఖంగా యింట్లో కూచోలేక పోతున్నానంటే నమ్ము.

వెంక : సుకంగా కాపరం సేసుకోక దెబ్బలాటలెందుకురా?

రాజ : మద్దిని నేనేం జేశా(నా బాబూ! నువ్వు సెప్పంటావ్? — అసలు బస్తీపిల్లని పెళ్లి సేసుకోడం నాదే బుద్ధితక్కువ.

వెంక : యేం జేసిందేంటి?

రాజ : దాని షోకు, దాని యవ్వారం, దాని కులుకు — అంతా దాని గోడవే! మద్దిని నేను మట్టి గొట్టుకుపోయినా దానికేంపట్టదు. నా కష్టంతో దానికి సుబ్రమైన పంచలైతే ఒకటైనా లేదు. దానికి సుక్కల సీరలు, సారల సీరలు, పే...ద్ద— పే...ద్ద అంచులున్న సీరలు యేం కొనమంటే అయ్యే కొనేశాను. కొన్నాళ్ళు జబ్బల్దాకా సేతులున్న జాకెట్లు కావాలంది. అలాగే తెచ్చాను. మూణ్ణెల్లు తిరక్కుండా పొట్టి సేతుల జాకెట్లు కావాలంది. పదిరూపాయిలప్పుసేసి మూడు కుట్టించాను. సాలదంది. యేం సెప్పకో(నా నా కత, సెవ్వులో జోరీగలాగ యింట్లో ఒకటేపోరు!

వెంక : కొంచెం నచ్చజెప్పలేకపోయేవంట్రా నీ పెళ్ళానికి.

రాజ : అయ్యో బాబోయ్! నచ్చజెప్పడమే, కాటకుక్కలాగ మీదపడిపోదూ!

వెంక : యెంత సెమటోడ్చి కష్టపడినా మన కొచ్చే రాబడి తక్కువ. దుబారా కర్సులు సేసేస్తే గంజిలోకి మెతుకు కూడా దొరకదు.

రాజ : (కోపంతో) దాన్ని కాదురా అనడం! దాన్ని అలాగ తయార్సేసిన దాని బాబుని అనాలి.

వెంక : మీ మావఁ అలాగే సేసేడంటావా?

రాజ : మా మావఁ పట్నంలో జట్కా తోల్తాడు. ఆడికి యిదొక్కత్తే కూతురు. జానకు పిల్లవగ్గర్నుంచి దానికి కాఫీ హోటేళ్ళు, సినిమాలు, షోకులు అన్నీ మప్పేశాడు. సిన్నప్పట్నుంచీ దాన్నలా తయారుసేసి నామీదకి తోలేశాడు.

(కుడివైపునుంచి చిన్నయ్య, పెద్దయ్య వస్తారు. పరిహాసం సేస్తూ వచ్చి ఆగిపోయి మాట్లాడతారు.)

పెద్ద : ఒరేయ్ వెంకన్నా! సూశావా?

వెంక : లేదు.

చిన్న : అయితే మేమే సూస్తాం. రా లచ్చన్న గార్ని ఒకమాటు పిల్చుకురా!

రాజ : యేరా! సిన్నయ్యా! మా రైతుతో నీకేం పని?

పెద్ద : పూసలు పెట్టుకుంటే పనులు తెమలవ్. యెళ్ళి సెప్పరారా వెంకన్నా! ఆయ నిక్కడి కొచ్చినా సరే! లేదంటే మేమే అక్కడి కొస్తాం.

రాజ : (వెనక్కు తిరిగి ఆశ్చర్యంతో) యేటి పెద్దయ్యా! నీక్కూడా మా రైతుతో పని తగిలిందేంటి?

వెంక : నే వెళ్ళి మా రైతో సెప్తాను. మీరు హద్దు దాటమని మాటివ్వాలి పెద్దయ్యా!

పెద్ద : రాజీకేరాని కొచ్చినప్పుడు యెందుకు దాటతాంరా! యెళ్ళిరా!

వెంక : ఒరేయి రాజయ్యా! నే నొచ్చేదాకా నువ్విక్కడే వుండు. (ఎడమవైపు వెళ్ళిపోతాడు.)

చిన్న : (కోపంతో) ఆడి అప్పట్నుంచి వస్తుంది కండా అని కొలవకి అడ్డేస్తాడా? కాక ఆడి బాబుగారి దనుకున్నాడో యేంటో!

పెద్ద : తొందరెందుకురా సిన్నీ! వుండు. అడ్డిరానియ్.

రాజ : ఒరేయ్ పెద్దయ్యా! నే న్సిన్నప్పట్నుంచీ సూస్తున్నాను. లచ్చన్న రైతు తప్పులేని రోజే లేదు. యీ రైతని మా రైతు మాటనే సెప్పడూ అట్లు. న్యాయం న్యాయమే! అన్యాయం అన్యాయమే.

చిన్న : ఆడు సేయించీ అన్యాయాలు నువ్వు సూస్తున్నావ్ గందా!

రాజ : సూడక పోడయేంట్రా బాబూ! పక్క పొలాలోళ్ల దూళ్లని బందెలదొడ్లో పెట్టించేసేడు. పండిన పొలాల్ని పాడు సేయించేసేడు. ఎదురు సెప్పినోళ్ళని సెట్టుకు యిరిసికట్టి కొట్టించేసేడు,

పెద్ద : అలాంటోడి దగ్గర నువ్వు నౌకిరీకెందుకుంటున్నావ్?

రాజ : గతిలేక వుంటన్నాను. యెక్కడైనా మంచి పన్లొరికితే యిది వొదిలేసాను.

చిన్న : మాపన్లోకిరా! మా రైతుయిచ్చే దానికంటే ఒక కొటాబసాడోళ్లు యెక్కువిస్తాం.

పెద్ద : నూసొక్క, యిలాంటిబేరం మళ్ళీ దొరకదు.

రాజ : (మెత్తబడి) యీ తొలేకాశి (తొలియేకాదశి) దాకా నకు సెలవుంది. అది అయిపోగానే యిక్కడ పని మానేస్తాను.

(ఎడమవైపునుంచి ముందు వెంకన్న వస్తాడు. వెనుక రుద్రయ్య కేకలువేస్తూ దూకుడుగా వస్తాడు.)

రుద్ర : (వస్తూనే బిగ్గరగా) యెవ్వడ్రా? రాజీబేరానికి కొచ్చిన మొగోడెవ్వడ్రా అంట!

(రుద్రయ్య వెనుక లచ్చన్న వస్తాడు)

చిన్న : (ముందుకు వచ్చి రుద్రయ్యతో) మద్దిని నువ్వొంగుకురా కుక్కలాగ మొరుగుతావ్?

రుద్ర : ఒరేయ్, నోరు మెదిపేవంటే కజ్జాతీసేస్తాను.

లచ్చ : సెణం ఆగరా రుద్రిగా, (పెద్దయ్యతో తీవిగా) యేం పెద్దయ్యా! నువ్వియ్యేళ పెద్దరైతువైపో యేవన్నమాట, బోర యిగసు కొచ్చేవేంటి సంగతి?

పెద్ద : బాబయ్యా! మేమెక్కడ? తమరెక్కడ? మేం పెదరైతులం — సచ్చినా — అవ్వలేం.

లచ్చ : పిదుసుంచాలు, యోకరం, యోకరంనరవున్న సిన్నా పిరకూ రైతుల్నందర్నీ యేకం జేశావ్. సరే, నేనేవే అనుకో, అల్లందర్నీ నా మీదకి తోల్తున్నావా?

పెద్ద : నేనేం సెయ్యలేదు బాబయ్యా!

చిన్న : ఒకళ్ళు సేసేదేంటి? సీకట్లోంచి అల్లంతట అల్లే యెలుగులోకొచ్చేరు.

లచ్చ : (మీసంమీద చెయ్యేసి) ఒరేయ్ మీలాంటి యెదవలు లచ్చమంది యేకమైనా యీ లచ్చన్నకు తిరుగులేదు. తెలిసిందా?

పెద్ద : ఆ పట్టింపులు ఆ పౌరుషాలు మా కెందుకు బాబూ! (సంభాషణ జరుగుతూ వుండగా వెంకన్న, రాజయ్య, రుద్రయ్య, లచ్చన్న గట్టుకు యివతలవైపు — పెద్దయ్య, చిన్నయ్య అవతల వైపు నిలబడి ఒకరికేసి ఒకరు తీవ్రంగా చూస్తూ వుంటారు.)

చిన్న . మీరు బోదికాలవకి అడ్డు తీసేస్తే సాలు.

లచ్చ : నా పొలాలన్నీ నిండాలి.

పెద్ద : మీ సేలకి నీరు — మొన్నటికే — ఎక్కిపోయింది.

లచ్చ : నా సేలు నిండాలి. నా సెరువు నిండాలి — అందాకా గింజుకు సచ్చినా నీరొదల్ను. మద్దిని నువ్వెవడివ్ రా నాకు సెప్పేవోడువ్?

చిన్న : మా పొలాలకు నీరు అక్కర్లేదా? యెండి పోయి నష్టం అయిపోవాలా?

లచ్చ : యేరా? తల తిరుగుతుందేంటి?

పెద్ద : (సమాధానంగా) లచ్చన్న బాబూ! (కుడివైపు చూపిస్తూ) ఆ పొలాలకేసి సూడండి ఆటికి అల్పంగా నీరడితే అయ్యింక బతికవ్. యీ యేడు వానదేవుడుకూడా మామీద పగపట్టేడు. నాల్రోజులపాటు నీరొదలండి.

లచ్చ : నా అవసరం తీరేదాకా నే నొదల్ను.

చిన్న : (వ్యంగ్యంగా) తమరు మర్యాదగా వదుల్తారన్న ఆశ నా కేనాడూ లేదు.

లచ్చ : (కోపంతో) యేరా? ఒళ్ళు కొవ్వెందేంటి?

రుద్ర : (కళ్ళెరజేసి) కొవ్వణిసెయ్యగల్ను జాగర్త!!

చిన్న : (నిర్లక్ష్యంగా) పోరా కిరాయెదవా! అసలోడి కంటే కిరాయోడికి ఉలుకెక్కువ!

రుద్ర : లచ్చన్న బాబూ! మీరు "ఊం" అంటే సాలు. యెదవని గుండెల్తీసేస్తాను.

లచ్చ : ఆగరా రుద్రిగా! యిలాంటి గోచీపాతగాళ్ళ కంట్రా మనం జడిసేది. (తీవ్రంగా) ఒరేయ్ పెద్దయ్యా! నేను కచ్చితంగా సెబుతున్నాను యిను. మీ పొగరణిగేదాకా సుక్క నీరుకూడా వొదల్ను!

పెద్ద : పొండ్రా, మీ దిక్కున్న కాడ సెప్పుకోండి.

రుద్ర : (వినయంగా) లచ్చన్న బాబూ! తమరు మాలాంటి బీదోళ్ళతో పంతం పడితే మేమె తీసిపోతాం. మా పల్లపు పొలాలోళ్ళంతా నన్ను తమ కాడికి పంపితే వచ్చాను.

లచ్చ : నిన్ను రాయబారానికి పంపేరా?

రాము: (ఉత్సాహంతో) దొరికి పోయేవ్! నువ్వే ఓడిపోయేవ్!

చంద్ర: రెండుమాట్లు నువ్వోడిపోతే ఒకమాటు నే నోడిపోయాను.

(యిద్దరూ ఒక్కసారి నవ్వుతారు—ఎడమ చివర రుద్రయ్య కనిపిస్తాడు. యిద్దరూ అతని చూడరు. రుద్రయ్య తల ఒకసారి పంకించి—చేతికర్ర సాపుచేసి—నెమ్మదిగా గడ్డిమేటు వెనక్కి వెళ్లి దాక్కుంటాడు.)

రాము: చంద్రీ!

చంద్ర: యేం రామావాఁ అలా సూస్తన్నావ్?

రాము: అబ్బెబ్బే యేం లేదే! రేపు పొద్దుపొడిసే సరికి వస్తానని మాటియ్యి.

చంద్ర: నే నెందుకు రావాలి?

రాము: (కుడివైపు చూపిస్తూ) అదుగో! ఆ తాటితోపు యెనకాల జాంతోట వుంది సూశావా?

చంద్ర: చూశాను.

రాము: ఆ తోటని మా సిన్నతాత కౌలుకి పుచ్చుకున్నాడు. రేపొద్దున్నే అక్కడికెల్దాం.

చంద్ర: (ఉత్సాహంతో) ఓ! అయితే వస్తాను.

నెమ్మది నెమ్మదిగా వెలుగు తగ్గుతుంది ముందు మెరుపు కనిపిస్తుంది. తరవాత ఉరుము వినిపిస్తుంది.)

రాము: (ఆకాశం కేసి చూస్తూ) సూడే చంద్రీ! ఆకాశమంతా మసిపూసేసినట్టు యెంత నల్లగావుంది.

చంద్ర: యిలాంటప్పుడు వానొస్తే—బలే సరదాగా వుంటాది.

రాము: అదుగో! అప్పుడే గాలిదుమారం మొదలయ్యింది. మబ్బులు దూదిపింజలలా సెదిరిపోతున్నాయ్. వాన కురిసేయోగం లేదు. (విషాదంగా కుడివైపు చూస్తూ) ఆ సేలన్నీ నీరులేక యెలా గండిపోతన్నాయో సూడు! (ఆకస్మికంగా జ్ఞప్తికి వచ్చినట్లు) అరెరె, మీ అద్దు దాటేసేనే! చంద్రీ! నేనింక పోతాన్లే! (త్వరితగా కుడివైపు వెళుతూవుంటాడు.)

చంద్ర: (అతని చెయ్యి పట్టుకొని ఆపుచేసి) అద్దులు మీ అయ్యకీ మా అయ్యకీని. నీకూ నాకూ అద్దులేంటి! యిక్కడే వుండు. నెన్నీకో తాయిలం తెచ్చి పెడతాను. (ఎడమవైపు వెళ్లిపోతుంది)

రాము: (ఆమె సెయ్యి పట్టుకొని) అదేంటో సెప్పు.

చంద్ర: నే సెప్పను.

రాము: నువ్వు సెప్పకపోతే నేను పోనివ్వను.

చంద్ర: అయితే నువ్వు సెప్పుకో సూద్దాం.

రాము: పకోడీ.

చంద్ర: కాదు.

రాము: తాటికాయి.

చంద్ర: ఊఁహూఁ!

రాము: కర్రపెండ్లంగుంప.

చంద్ర: అదీ కాదు.

రాము: మరింకేంటో సెప్పు!

చంద్ర: (అతని చెయ్యి విడిపించుకొని కిలకిలనవ్వుతూ) నువ్వు సెప్పుకో లేకపోయేవు. యీత ముళ్ళు. సిటికలో వస్తాను.

(చంద్రమ్మ ఎడమవైపు పరుగెత్తుకుపోతుంది. రాముడు ఆమె పోతున్నవైపు పరవశత్వంతో చూస్తూ వుంటాడు. గడ్డిమేటు వెనకనుంచి రుద్రయ్య నెమ్మదిగా ముందుకు వస్తాడు)

రుద్ర: (ఒక్కదూకు దూకి) ఇంకెక్కడికి పోతావ్ రా యెదవా! (కర్ర రెండు చేలుతో పైకెత్తి రాముడి బుర్రమీద కొట్టేస్తాడు)

రాము: (బిగ్గరగా) ఓ...రి బాబా! సచ్చిపోయాన్రా! (కూలబడిపోతాడు. తల, ముఖం రక్తంతో తడిసిపోతాయి)

రుద్ర: (బిగ్గరగా) ఒరేయ్! అద్దు దాటిన యెదవని కైమా సేసేస్తాన్రా.

(మళ్ళీ కర్ర పైకెత్తాడు—అమాంతంగా కుడివైపునుంచి నారాయుడు, ఎడమవైపునుంచి వెంకన్న కర్రలు తీసుకొని వస్తారు.)

నార: (ముందుకు దూకి) ఆగరా! ఆగరా రుద్రిగా! యియ్యేళతో ను వ్వాకరువు.

(నారాయుడు కర్ర యెత్తుతాడు. రాముడు కూడా వెంటనే లేచిపోయి కర్ర పైకెత్తుతాడు)

రుద్ర: (కర్ర పైకెత్తి) ఒరేయ్! యెంకన్నా! ఊఁ! కొట్టూ! కొట్టూ! ఆలోసింపకు.

("తన్నరా తిన్ను" "పాతెయ్యరా! పాతెయ్యి" అంటూ వీరావేశంతో కేకలు వేస్తూ అటు ఇద్దరు ఇటు ఇద్దరూ కర్రలు యెత్తుతారు. అంతలో

కేకలు వేస్తూ చంద్రమ్మ మెరుపులా వచ్చి ఇరు పక్షాల మధ్యా నిలబడుతుంది.)

చంద్ర: (వస్తూనే బిగ్గరగా) ఆగండి! ఆగండి! మీరు మనుసులా? పసువులా?

(అందరూ మంత్రముగ్ధులలా ఆగిపోతారు)

చంద్ర: (రాముడి మెడచుట్టూ చేతులు వేసి) యెవ్రడా మావా! నిన్నిలా కొట్టినోడెవ్రడా?

గ్ర: (మీసంమీద చెయ్యేసి) అడ్డు దాటితే కొత్త తానా పాతేస్తానా?

చంద్ర: (కోపంతో గుద్రయ్యకేసి తిరిగి) సచ్చినోడా! నీ సేతులిరిగిపోను! యెంత దెబ్బ కొట్టేవ్ రా! నా మావ రాను మొగ్గోడంటే నేనే తీసుకొచ్చేను అమ్మో! అమ్మో! యెంత దెబ్బ! నా మూలాన్ని యెంత దెబ్బ తినేశావ్ రా రాముడూ! (పైటచెంగు చింపి రాముడి ముఖాన్ని వున్న రక్తం తుడుస్తూ వుంటుంది)

గ్ర: (కోపంతో కర్ర చంకను పెట్టుకొని) ఒరేయ్! యెంకన్నా ఇదంతా నువ్వు సేయిస్తన్నావ్. నీ పిల్లని అడ్డోసి వొదిలేశావు. యీ యెదవలందర్నీ మన అడ్డులోకి రానిచ్చావ్. తొందర పడకు! లచ్చన్న రైతుని పిలిసి నీ పొగరణిగిస్తా.) (బిరబిరా ఎడమవైపు నిష్క్రమిస్తాడు)

రా: (కోపాన్ని ఆపుకుంటూ) తప్పు మనదై పోయింది. లేకపోతేనా! ఆ యెదవ అంతు సూసేద్దును. పదరా! పద!

(రాముణ్ని రెక్క పట్టుకొని కుడివైపు తీసుకుపోతూ వుంటారు. చంద్రమ్మ రాముడికేసి జాలిగా చూస్తూ వుంటుంది. రాముడు 'ఫరవా లేద'న్నట్లు చిరునవ్వుతో ఆమెకేసి చూసి నిష్క్రమిస్తాడు.)

వెంక: సూడే తల్లీ! నువ్వన్నీ యిలాంటి గుడుకుపనులే సేస్తుంటావ్! ఇంటికెల్లిపో! ఇంక ఇక్కడుండకు. పెద్ద రైతొస్తాడు.

చంద్ర: (విషాదంగా) ఒరేయ్ అయ్యా!

వెంక: (ఆత్రుతతో) ఇక ఆల్సెంసెయ్యకే తల్లీ! (ఖాళీగిన్నెలు తీసుకువచ్చి కూతురికి యిస్తాడు. చంద్రమ్మ కుడివైపు దిగులుగా ఒకసారిచూసి ఎడమవైపు నిష్క్రమిస్తుంది. వెంకన్న తీవ్రంగా ఆలోచిస్తూ తిరుగుతూ వుంటాడు. (కిందపడి వున్న చెరకుపళ్ళుకూడా చూస్తాడు. పైకితీసి, ఒకసారి చూసి— గడ్డి మేటు ప్రక్కకు విసరతాడు. ఎడమవైపునుంచి రాజయ్యవస్తాడు.)

రాజ: (వస్తూనే) యేంట్రా యెంకన్నా? గుద్రిగాడు అంబోతులాగ రంకె లేసుకుంటా యెల్తన్నాడు.

వెంక: (కోపంతో) అడు గుద్రిగాడు కాదు మనిషిని గాదు

రాజ: 'బుర్ర బద్దలు కొట్టేశాడు' అని మీసం తిప్పేడు నన్ను సూసి. 'యెవడినిరా' అన్నాను. నా మాట యినిపించుకుంటే కాదూ!

వెంక: కుర్రోణ్ని కొట్టడానికి సేతు లెలాగ ఆడినియ్యో.

రాజ: యే కుర్రోడు?

వెంక: రాముడు.

రాజ: అరెరె! ఆ కుర్రోణ్ని కొట్టాడ్రా?

వెంక: ఆడుమనిషైతే కాదూ? గ్యానంలేని యెదవ.

రాజ: లచ్చన్నగారి బూమికోసం మనం మద్దిని కొట్టుకు సస్తన్నాం.

వెంక: అంతేరా బాబా! పెద్ద మారాజులు సల్లగానే వుంటారు. మద్దినున్న మాలోళ్ళే కొట్టుకు సచ్చేది.

రాజ: మీద లేకు యేముయ్యిందో సూశావ్ కాదూ! ఎలక్సన నాటినుంచి పెద్దరైతులు రామసామి గారు, పనసన్న గారూ ఒకళ్లమీద ఒకళ్ళు పగ పట్టుకున్నారు. ఆళ్ళిద్దరూ సంచులుమూటలు యిచ్చేసి డబ్బు జల్లేశారు. కనుపులో దల్ల కదలకుండా యిద్దరు మారాజులూ యెవరి మేడలో ఆళ్ళే కూకున్నారు. యింక మద్దినున్నారు కాదూ మనకిరాయి యెదవలు? వాలు కురు వాక్కు సచ్చారు. పదిమందికి కాళ్ళూ సేతులూ పోయినై ముప్పాతికమంది సావు దెబ్బలుతిని ఆసపత్రి పాలైపోయేరు. పావగా మిగిలినోళ్ళని పోలీసులు పట్టుకుపోయేరు. సుదివి సచ్చిపోయినోళ్లెవళ్ళు?

వెంక: సచ్చిపోయినోడెప్పుడూ మాలోడే!

రాజ: యియ్యాళ పెద్దరైతులనుకున్నావోళ్ళంతా ఎన్నో అన్యాయాలుసేసి భూములు పెంచుకున్నారు. అప్పులియ్యడం, వడ్డీలకు వడ్డీలు

పెంకెయ్యాపెం...ఆ కరువుకి ఆడేసున్న బూమీ పుట్రా లాగేసుకోడం.

వెంక : పెద్దోళ్ళగొడవలు మనకెందుకు పోనియ్యరా!

రాజ: సివరికి మిగిలిపోయాది మంచీ సెడ్డా! సచ్చిపోయాటప్పుడు తనకూడా పిడికెడు బూమి పట్టికెళ్ళలేడుగందా! బూమిమీదవున్న వాళ్ళలో జులూ సేసిమిడిసి పడతారు. బోరయిగుడుకు తిరుగుతారు. నిన్నగాక మొన్న సచ్చిపోయిన యెంకటసామిగార్ని సూడు. ఆయనకి యెన్ని లోగిళ్ళు! ఎంత పొలం! యెన్ని తోటలూ! కూడా యేమన్నా మోసుకెళ్ళగలిగేడా?— నరసయ్యగార్ని సూడు! కూలోళ్ళనికన్న కొడుకుల్లాగ సూసుకున్నోడు మా రాజు. ఆయన సేతులమీద ఎందరు పాలికాపులకో పెళ్ళిళ్ళు సేయించేడు. ఆయన సచ్చిపోయినప్పుడు అందరూ బోరున యేడిశారు. ఆ మారాజు సచ్చి యేళ్ళైనా కానున్నాడో యిప్పుడికే ఆయన్ని గ్యాపకంచేసుకోనిరోజు లేదు.

వెంక: యేంట్రా! యేదాంతంలో పడ్డావ్?

రాజ: నేనీ మద్దిని శాస్తుల్లుగారింటికెళ్ళి పురాణం యింటన్నాన్లే. యేం నీతులూ! యేం దర్మాలు! అన్నీ తెలుసుండీ మనుషులెందుకు అగ్నేనంలో పడతన్నారా...

(ఎడంవేపునుంచి బిగ్గరగా కేకలు వేస్తూలావుపాటి కర్ర తీసుకొనివస్తాడు రుద్రయ్య.)

రుద్ర: (ఎడమవైపు తిరిగి) ఒరేయ్! యెదవల్లారా! కదలండిరా! ఆల్సెం సెయ్యకండిరా, కర్రలు, కొడవళ్ళు, గునపాలు, గొడ్డళ్ళు-సేతికి యేది అందితే అదే పట్టుకరండ్రా!

లచ్చు: (నాలుగు చేతికర్రలు భుజంమీద వేసుకొని బిగ్గరగా కేకలు వేస్తూ వస్తాడు) రండ్రా! రండి! గట్టు పొడుగునా నిలబడండి. గట్టుమీదకొచ్చిన యెదవని బలేసెయ్యండి. మీకేం బయ్యంలేదు. యెనకాల నేనున్నాను. పనొస్తే పదోందలు కిర్సు పెడతాను.

రుద్ర: యియ్యాళ సిన్నిగాణ్ణి, నారిగాణ్ణి బలేస్తాను. అడ్డొచ్చిన యెదవని నరికి పొలానికి పోలేస్తాను.

లచ్చు: (ఒక కర్రతీసి వెంకన్నకుయిస్తూ) ఒరేయ్ యెంకన్నా! యీ కర్ర పుచ్చుకో! యెనకాడకు. మీ బాబులాగ పౌరుషానికి నువ్వు కూడా పేరు తెచ్చుకో.

వెంక: (విధిలేక తన చేతిలోనికర్ర క్రిందపారేసి పెద్ద కర్రతీసుకొని దిగులుగా నిలబడతాడు.)

లచ్చు: (బిగ్గరగా) ఒరేయ్! రాజిగాయ్!

రాజ: (ఉలికిపడి) బాబయ్యా!

లచ్చు: బెల్లంకొట్టిన రాయిలాగ పలకవేంరా! యెదవా! నీ సేతులోకర్ర అవతల పారెయ్యి.

రాజ: ఎందుకు బాబయ్యా?

లచ్చు: (కర్రయిస్తూ) యీ కర్రతో సరిగా యెత్తి కొట్టేవంటే బుర్ర సెక్కలైపోతాది.

రాజ: (భయంతో గుటక వేసి) యెవర్ని కొట్టాలి బాబయ్యా!

లచ్చు: (కోపంతో) కళ్ళుమూసుకుపోయినయ్యేంట్రా? కనబడ్డంలేదూ? అలాగ ముందుకుసూడు. పల్లపోళ్ళలోళ్ళు యెలాముందుకు దూసుకొస్తున్నారో!

(నేపథ్యంలో కేకలు, అరుపులు, మనుషుల అడుగుల సవ్వడి. ఎద్దుల మువ్వల ధ్వని ఉధృతంగా వినిపిస్తాయి.)

రుద్ర: ఒరేయి రాజిగా! నువ్వు కర్రపట్టుకొని నాయెనకాలే నిలబడు!

లచ్చు: అగ్గుదాటినోణ్ణి పట్టుకుని బుర్రకి అడ్డంగా ఒక్కటేపెట్టు.

రాజ: (భయంతో గుడ్లుతిప్పి వెనక్కితిరిగి లచ్చన్నతో) బాబయ్యా! నాలుక్కాలాలుపాటు సుకంగా బతకాలని తమరిదగర నౌకరీకున్నాను. అంతేగాని బుర్రలు బద్దలుకొట్టుకోడానికి లేను. బాబయ్యా! కొత్తగా పెళ్ళయినోణ్ణి. పదికాలాలపాటు బతకవలసినోణ్ణి. తమరి నౌకరీకి ఒకదణ్ణం. తమకి ఒకదణ్ణం. నాకు సెలవిప్పించండి బాబయ్యా!—యింతకీ యియ్యాళ లేసిన యేళాయిశేషం అలాంటిది. యింటిదాన్తో పోట్లాడి యిక్కడికొచ్చిపడ్డాను. యెనకటికి యెవడో నాలాంటోడే యింటిలో గోలగా వుందని సంతలో కెళ్ళేడంట!!

(ఎడమవైపు వెళ్ళిపోతూవుంటాడు.)

లచ్చ: (ఆశ్చర్యంతో) హోరిగానిదికొడకా! యెంత పనిచేశావురా!!

వెంక: (బిగ్గరగా) ఒరేయ్ రాజయ్యా! ఆగు!

రాజ: (ఉలికిపడి ఆగి వెనక్కి తిరిగి బిక్కు బిక్కుమంటూ చూస్తూ) యెందుకురా యెంకన్నా?

వెంక: (రాజయ్య భుజంమీద చెయ్యివేసి) నాకంటే నువ్వే నయం. వున్నమాటపైనే వున్నావు. సాహసం చేసి యెలిపోతున్నావ్ (లచ్చన్నతో) బాబయ్యా! నాకుకూడా సెలవిప్పించండి పోతాను. నేను నౌకరీకోసం బుర్రలు బద్దలు కొట్టలేను (చేతిలో కర్ర క్రింద పారేసి) సెలవ్ బాబయ్యా! సెలవ్!

రాజ: వసాం! బాబయ్యా! వసాం!

(వెంకన్న రాజయ్య ఎడమవైపు నిష్క్రమిస్తారు)

లచ్చ: (కోపంతో పళ్ళుబిగించి) యెంతటగా! యెంత దగా! యీళ్ళని వొదులుతానా!

రుద్ర: (ఆగ్రహంగా) నేనుండగా తమరికి భయమెందుకూ? మన పాలికాపులు యింకా పాతికమంది వున్నారు. ఆళ్ళూ నేనూ కలిసి రక్తాలు యేరులు కట్టిస్తాం. చూస్తా వుండండి. మన తడాఖా!

లచ్చ: (ఎడమవైపు చూస్తూ ఖంగారుగా) యెంకన్నగాడు రాజిగాడు కలిసి మన పాలేర్లతో యేటో మాట్లాడతన్నారు.

రుద్ర: (ఎడమవైపు చూసి భయంతో) యీ యిద్దరు గాడిది కొడుకులూ కలిసి కొంప ముంచేశారు. మన పాలికాపులందరూ ఆళ్ళ యెనకాల పోతన్నారు.

లచ్చ: నువ్వు సప్పున వెళ్ళి ఆళ్ళని మళ్ళించుకురా.

రుద్ర: తమరుకూడా రండి.

లచ్చ: (బిగ్గరగా ఒక్కొక్కళ్ళ పేరు పెట్టి పిలుస్తాడు జవాబు రాదు) ఓ...రి...అబ్బయ్యా...ఓ... యెల్లయ్యా...

రుద్ర: (బిగ్గరగా) ఓ...రి...కొండిగా...ఓ...రి... సత్తియ్యా...

(లచ్చన్న రుద్రయ్య ఎడమవైపు వెళ్ళబోతూ వుంటారు.—యింతిలో పెద్ద కోలాహలం వినిపించి వెనక్కి తిరిగి చూస్తారు. ముందు చిన్నయ్య. నారాయుడు. తలకి కట్టుతో రాముడు, పెద్దయ్య యింకా చాలామంది రైతులు మహా సముద్రంలా సరిహద్దు దాటేసి వస్తా వుంటారు. అందరి చేతుల్లోను కర్రలు, బరిసెలు, పారలూ వుంటాయి.)

రాము: (బిగ్గరగా) ఒరేయ్! రుద్రిగా! రావేరా!

రుద్ర: (బోనులో పులిలాగ కోపంతో) తొందర పడకండ్రా!

చిన్న: (హేళనగా) రుద్రిగచ్చి!

లచ్చ: (అవమానంతో. కోపంతో) ఒరేయ్! ఒరేయ్! మిమ్మల్ని వొదులుతాననుకున్నార్రా? (మీసం మెలేసి) మిమ్మల్ని మూడు కోర్టులు సుట్టూ తిప్పి. మీనెత్తిన సెరువుల కిళ్ళు తగిలించకపోతే నా పేరు లచ్చన్నే కాదు. రారా! రుద్రిగా!

(లచ్చన్న, రుద్రయ్య ఎడమవైపు వెళ్ళిపోతూ వుంటారు. రైతులు బిగ్గరగా కేకలువేస్తూ సరిహద్దు దాటుతూ వుంటారు. "మాకు నీళ్ళు కావాలి!" "మాపొలాలు పండాలి!" "మా కడుపులు నిండి తీరాలి!" "మా నోటికాడ అన్నం వూరుకోం!" "పదండ్రా! పదండి." అంటూ కేకలువేస్తూ రైతులు ముందుకు సాగుతూ వుండగా తెర.)


బొల్లి

సమస్త చర్మవ్యాధులు

మేహ పొడ, స్పర్శజ్ఞానములేని మచ్చలు, సెగ, సవాయి మొదలగు సుఖవ్యాధులు ఇంద్రియ స్ఖలనము, స్వప్నదోషము, స్త్రీల ఋతుదోషములు, మూర్ఛ, మూలశంఖ, అజీర్ణము. మొండి దగ్గులు మొదలగు వ్యాధులకు అమోఘమైన చికిత్స. 1920 లో స్థాపింపబడి 38 సం॥లు ఏకదాటిగా సేవ చేయుచున్న ఏకైక కంపెనీ రెడ్డి అండ్ కో యని తెలుసుకోండి. ఇతర నకిలీ కంపెనీలు, చూచి మోసపోకండి మా ఔషధములనే సేవించి శాశ్వత ఆరోగ్యమును బడయండి మీ ప్రాణముతో చెలగాటమాడకండి. నేడే మా క్యాటలాగుకొరకు వ్రాసి తెప్పించుకోండి. క్యాటలాగు, సలహా ఉచితం.

రెడ్డి అండ్ కో (రిజిష్టర్డు)

గోపాలపురం

తూర్పుగోదావరిజిల్లా, ఆంధ్రప్రదేశ్.

# స్వర్గీయ శ్రీ భమిడిపాటి కామేశ్వరరావు

శ్రీ పి. గణపతిశాస్త్రి

భమిడిపాటి కామేశ్వరరావుగారి స్వర్గమన వార్త సాహిత్యారాధకులనేగాక సమస్తాంధ్ర ప్రజానీకాన్నీ ఒక్కుమ్మడిగా విషాదంలో ముంచివేసింది.

కామేశ్వరరావుగారు సుమారొక సంవత్సరం నించీ వ్యాధిగ్రస్తులై ఉన్నారన్న విషయమే చాలా మందికి తెలియదు! ఇటీవల వారు కొంచెం కోలుకుంటున్నారనీ, తిరిగీ ఆరోగ్యవంతులై ఇతోధికంగా సాహిత్యారాధన చెయ్యగలరనీ కొందరు మిత్రులాశించారు. అయితే విధి బలీయం! హాస్యబ్రహ్మ అస్తమయంతో అధునాతనాంధ్ర సారస్వతాకాశంలో దేదీప్యమానమైన ఒక మహాతార కాలసముద్ర గర్భంలో కలిసి అదృశ్యమైపోయింది!



## జీవిత సరణి

భమిడిపాటివారు జన్మించినది పశ్చిమ గోదావరి జిల్లా భీమవరం తాలూకా అకివీడు గ్రామంలో. తండ్రి వరసావధానులుగారు గొప్ప వేదవేత్త. వైదిక కర్మనిష్ఠాపరులు. వరసావధానులుగారిది చాలా సామాన్య సంసారం. మొదట కామేశ్వరరావుగారికి కూడా వేదవిద్య చెప్పించాలని ప్రయత్నం జరిగిందిగాని ఎలాగయితేనేం చిట్టచివరికి ఆయన భీమవరం మిషన్ హైస్కూలులో ఆంగ్ల విద్యాభ్యాసానికి ఉపక్రమించారు. ఆ పిమ్మట కొంతకాలం వారి విద్యాభ్యాసం ఏలూరు మిషన్ హైస్కూలులోను, అటు పిమ్మట పిఠాపురం రాజావారి కళాశాలలో విద్యార్థివేతనాది సహాయాలతోను కొనసాగింది. బి. ఏ. లో వారి విద్యాభ్యాసానికి చిలకమర్తి కవి తమ గయోపాఖ్యాన నాటక ప్రదర్శనం ద్వారా సహాయం చేయించారట! ఆ తరవాత కామేశ్వరరావుగారు కొంతకాలంపాటు నరసాపురం టైలర్ హైస్కూలులోను, కాకినాడ హైస్కూలులోను, అక్కౌంటెంటు జనరలు ఆఫీసులోను ఉద్యోగం చేశారు. 1922 ప్రాంతంలో ఎల్. టి. పరీక్షలో ఉత్తీర్ణులయినప్పటినించీ, ఉద్యోగ విరమణ పర్యంతము వారు రాజమహేంద్రవరం వీరేశలింగాస్తికోన్నత పాఠశాలలోనే గణితోపాధ్యాయులుగా ఉన్నారు. ఉద్యోగ విరమణకు పూర్వం ఇంచుమించుగా రెండేళ్ళపాటు ఆ హైస్కూలుకే ఎలాగో అలాగ ప్రధానాధ్యాపకులు కాగలిగారు! సంగ్రహంగా ఇది వారి జీవిత చరిత్ర. కామేశ్వరరావుగారి జీవితం అంతా ఈవిధంగా చాలావరకు వీరేశలింగాస్తిక పాఠశాలలో గణితాధ్యాపకత్వానికే అంకితమైపోయింది. అయినా వారి లోలోపల విజృంభించే సాహితీసృజనాభినివేశానికి ఉద్యోగవిధి నిర్వహణం ఒక అంతరాయం కాలేదు.

## అవిరళ సారస్వతకృషి

1957 ఏప్రిల్ 27వ తేదినాటికి కామేశ్వరరావుగారికి షష్టిపూర్తి జరిగింది. ఇంతవరకు వారు సుమారు 30 గ్రంథాలు ప్రచురించారు. వీటిలో

ముంది కెంతో వింతగా ఉండేవి! జీవితంలో హాలాహలం అంతా ఒక ప్రక్కకి బెట్టి కళాసృష్టి వ్యాసంగంలోనే ఉత్తమహాస్యం పాలవెన్నెలలా జాలువారుతుంది.

భమిడిపాటి వారుకూడా లోకంలో హాలాహలం అంతా నిత్యము ఒక ప్రక్కకు బెట్టినట్టే కనబడేవారు! కనకనే వారి హృదయంలో పండిన పున్నమి వెన్నెల వంటి హాస్యం ఆవిర్భవించింది!

భమిడిపాటివారిది చాలా నియమబద్ధమయిన జీవితపంథా. 30 ఏళ్ళ ఉపాధ్యాయ వృత్తిలోను వారొక్కనాడు, హైస్కూలులో ఆలస్యంగా ప్రవేశించడం చూచినవారు లేరు! సామాన్యంగా కళారాధకులలో కనిపించే, గాలి ఎటు వీస్తే అటు తూలిపోయే ఆదరా బాదరా జీవిత ధోరణి అంటే ఆయనకు బొత్తిగా గిట్టించేదికాదు. ఈ కాలంలో గడియారాలు కూడా తిన్నగా నడవడంలేదు. కనక ఆయన జీవితం అంతా ఒక గడియారంలా నడిచిపోయిందని అంటే అది సరి అయిన ఉపమానం కాజాలదేమో!

భమిడిపాటివారికి ప్రాచీన సంస్కృతాంధ్రాంగ్ల సారస్వతాల యెడల చాలా ఆత్మీయమయిన అభిమానం. ఆధునికులలో గురజాడ అప్పారావుగారంటే ఆయనకు కేవలం గురుభక్తి! వారి ఇష్టాగోష్ఠి ప్రసంగాలలో కన్యాశుల్కంలోని 'ఎంపిక' మొదలైన పదాలెన్నో శరపరంపరగా దొర్లిపోతూ ఉండేవి.

పూర్వకాలంలో ప్రసిద్ధనటులను గురించీ, ఆనాటి రంగస్థలానుభవాలను గురించీ ఆయన ఎన్నెన్నో వింత వింత గాథలు చెబుతూంటే మిత్రులంతా కలకల నవ్వుతూ వినడం ఒక పరిపాటి.

ఒకసారి ఒక నటశిఖామణి 'పాకశాసనా!' అనే పదంలో 'పాక' పదానికి పసుపులపాకే అర్థం అనుకుని, ఆ 'పాక' స్వరూపం అంతా రెండు చేతులతోను అతి జాగ్రత్తగా అభినయించి చూపించాడట! ఇలాంటివే చిత్రవిచిత్రమయిన గాథ లెన్నెన్నో ఆయన ఇష్టగోష్ఠిలో దొర్లిపోతూండేవి.

'కొండుభట్టీయం' మొదలయిన గురజాడ వారి అపూర్వ రచనలు కొన్ని ఇటీవలే వెలువడ్డాయి. కాని కామేశ్వరరావుగారు వాటి వ్రాత ప్రతులు కొన్ని చాలాకాలంనించి తమ దగ్గర భద్రపరుచుకొన్నారు. సన్నిహిత మిత్రులకు మాత్రమే అవి చదివి వినిపించేవారు. గురజాడవారియెడల వారికి ఉండుకున్న ఆత్మీయత అట్టిది!

ఒక మారు ఇష్టాగోష్ఠిలో గురజాడవారి 'బిల్హణీయం' ప్రస్తావన వచ్చింది. అంతటి గొప్ప ఎత్తుగడతో ప్రారంభం అయిన ఆ నాటకం అలాగ అసంపూర్ణంగా నిలిచిపోవడం ఆంధ్రవాఙ్మయానికే తీరని లోటని ఆ సమయంలో మేము అనుకున్నాము. మిత్రులొకరు కామేశ్వరరావుగారిని ఆ నాటకం పూర్తి చెయ్యవలసిందని కోరారు. దానికి వారే అర్హులని మిగిలిన మిత్రులు అందరు అన్నారు. ఆ మాట విని ఆయన అలవోకగా నవ్వి చెయ్యెత్తి నమస్కరించారు. "ఎంత మాట! గురజాడవారి రచనలో అస్మదాదులం చెయ్యి పెట్టగలమా!" అన్నారు. ఆ సమయంలో ఆయన వినీతమూర్తి తిలకించిన మేమందరం అలాగే విస్తుపోయాము!

## పద్య పఠనం

కామేశ్వరరావుగారొకప్పుడు తమ వినూత్నపద్య పఠనధోరణితో ఆంధ్రదేశంలో ఒక పెద్ద గాలిదుమారం లేవదీశారు. మనదేశంలో రాగధోరణితో పద్యాలుచదివే వారిలో నూటికి తొంభైమంది సంగీతంలో బొత్తిగా ప్రవేశంలేనివారనీ, అందువల్ల ఇటు కవిత్వానికేగాక, అటు సంగీతానికికూడా తీరని అపచారం జరుగుతున్నదనీ, కనక, ఇంగ్లీషు, బెంగాలీ మొదలయిన భాషల్లోలాగే మన కవిత్వంకూడా సంగీతప్రసక్తి, రాగప్రసక్తిలేకుండా అర్థవంతంగా కవిత్వంలాగే పఠించాలనీ ఆయనవాదం. అదిగాక కవిత్వసంగీతాలు, వేర్వేరు భావ లక్ష్యాలు కల విభిన్నకళలనీ ఇవి కలగాపులగం చెయ్యడంవల్ల మనదేశంలో ఉభయకళలకు న్యాయం జరగడంలేదనీ ఆయన వాదించేవారు. వారిది వాదప్రతివాదాల్లో ఇచ్చిపుచ్చుకునే స్వభావం. అందుచేత, సంగీతసాహిత్యాల లోతులు చూసినవారికి రెండు కళలు సమన్వయం చేసే అధికారం ఉన్నదని ఎవరైనా అంటే—సిద్ధాంతరీత్యా ఔనని ఆయన అంగీకరించేవారు! కాని మనదేశంలో ఆచరణలోమాత్రం ఇది చాలా సకృత్తుగా జరుగుతున్నదని ఆయనవాదం. ఇది సంగీతసాహిత్యాల లోతులు తెలిసిన వారెవ్వరు కాదన లేని సిద్ధాంతం. దీనికి తార్కాణంగా వారు భీమ ఖండంలోనించీ, కాశీఖండంలోనించీ ఆంధ్ర మహాభారతంలోనించీ కొన్ని కవిత్వఘట్టాలు రాగ

కేవలం తెలుగుదేశం జాతీయ జీవితానికి సంబంధించినవేమో అని భ్రమ కలిగిస్తాయి కామేశ్వరరావుగారి అనుసరణలలోని ప్రత్యేకతవల్లే వీటికీ వినయమయిన వైశిష్ట్యం ఏర్పడింది.

ఇక 'మృచ్ఛకటికను' వసంతసేన అనీ, ముద్రారాక్షసానికి 'రాక్షసనిగ్రహణ'మనీ కొత్తపేరులు పెట్టి ఈ రెండు నాటకాలు నేటిరంగస్థలాని కనుకూలంగా సంతరించారు. కొన్ని భాసనాటకాలకు కూడా చాలావరకీ పద్ధతే అవలంబించారు. కామేశ్వరరావుగారి రూపకరచనా దృక్పథం మనకీ నాటకాలలో విస్పష్టంగా కన్పిస్తుంది. ఇవి యథామాతృకానువాదాలు కాకపోయినా అనుకరణా దృక్పథం వీటికొక విశిష్టత్వం చేకూర్చింది.

## పరిపూర్ణ జీవితం

కామేశ్వరరావుగారు ముఖ్యంగా తమ స్వతంత్ర రూపకాలవల్ల, ఇంకా ఇతర రూపకాలవల్ల, అధునాతనమయిన మన ఔత్సాహిక నాటకరంగానికి మూలపురుషులై నిలిచారు. అమూల్య హాస్యవ్యాసాలతోను, కథలతోను, ఛలోక్తులతోను, చమత్కృతులతోను, అధునాతనాంధ్రవాణికి ఎన్నెన్నో నూతనాలంకృతు లొప్పించారు.

అటు విశేషించి సికోన్నత పాఠశాలలో గణితాచార్యత్వం నిర్వహిస్తూ ఆంధ్రదేశంలో అసంఖ్యాకులయిన తమ అంతేవాసులందరికీ చిరస్మరణీయులయినారు. వారి విద్యావంశానికి చెందినవారీనాడాంధ్రదేశంలో వేలాదిగా ఉన్నారంటే అది న్యాయోక్తి మాత్రమే.

ఉదాత్తము, కరుణార్ద్రము అయిన హాస్యసృష్టి ఉన్నవారు నూటికీ కోటికీ ఒక్కరు కనిపిస్తారు. ఈ దృష్టితో వాఙ్మయసృష్టిచేసి అజరామరులు కాగలిగిన నిత్యసిద్ధపురుషు లంతకన్నా తక్కువ. ఇటువంటి వారి సాన్నిధ్యంవల్ల, సారస్వత సృష్టివల్ల నిత్యము భారభూతంగా సాగిపోయే జాతి జీవితం హాయిగా ఒక నిత్యలీలగా సాగిపోతుంది. కామేశ్వరరావుగారటువంటి ప్రష్టలకోవకు చెందిన వాఙ్మయమూర్తి!

రాజమహేంద్రవర వీధుల్లో ఒకరథంలా సాగిపోయే ఇటువంటి మహనీయవ్యక్తి ఈ హాస్యవ్యక్తి పోగానే యావదాంధ్ర సారస్వత ప్రియులకు ఏదో ఒక తీరనిలోటు ఏర్పడినట్లనిపించడం సహజం— అదేమి దురదృష్టమోగాని అసలు మన జాతిలో హాస్యదృష్టే చాలా తక్కువ. అందులోను హాస్య రచయితల సంఖ్య అంతకన్నా స్వల్పం. ఉన్న ఉత్తమ హాస్య రచయితలను వేళ్ళు మడిచి లెక్కపెట్టడం ప్రారంభిస్తే, రెండుమూడు వేళ్ళు మడిస్తే మరి నాలుగో వేలు ముడవడమే దుర్ఘటమైపోతుంది.

రాజమహేంద్రవరంలో కామేశ్వరరావుగారితో చాలాకాలం కలిసి మెలిసి తిరిగినవారికీనాడాయనలేని లోటు మరింక తీరదనే అనిపిస్తుంది. ఆయన సాహచర్య మాధుర్యమే అట్టిది!

కాని స్వర్గీయులయిన కామేశ్వరరావుగారిపాటికి గురజాడ, పానుగంటి, వేదం వెంకటరాయశాస్త్రివంటి మహామహులతో కలిసి జీవన మరణాలమీద, ఐహికలీలమీద మన ఆంధ్రజాతిమీద ఛలోక్తులు విసరుతూ తమ స్వర్గీయ జీవితాన్ని గురించి తిరిగి హాస్యధోరణి నుపక్రమిస్తారనే అనుకుందాము! ఇంకొక విధంగా, హాస్యబ్రహ్మ మృతినిగూర్చి కించపడుతున్నామంటే ఆయన హాస్యవాఙ్మయం మనం తిన్నగా ఆకళించుకోలేదన్నమాటే! అంతేకాదు! మన కసలు హాస్య దృక్పథమే అలవడలేదన్నమాట! అందుచేత స్వర్గీయ, హాస్యబ్రహ్మ భమిడిపాటి కామేశ్వరరావుగారికి హాసన్ముఖంతో జేజేలర్పిస్తున్నాను.

ప్రముఖపత్రికలూ, ప్రఖ్యాతసాహితీపరులూ ప్రశంసించిన

ఉత్తమ గ్రంథాలు

1. సంజప్రణయం: పదికథలూ, గల్పికలు.
రచన; పూషా: వెల 0-50 న. పై.

2. పారిజాతం: నేటి ప్రఖ్యాత కథకుల పదకొండు కథలు. వెల రు 1-25 న. పై.

3. తెరమెరుగులు: (ఐదు ఉత్తమ నాటికలు) కుక్కపిల్ల దొరికింది (రావికొండలరావు); దొంగ (పోతుకూచి సాంబశివరావు); తెల్లవారింది (హితశ్రీ); తెరమరుగు వీడలు (కొండముది శ్రీరామచంద్రమూర్తి); స్త్రీలకు ప్రత్యేకం (అంగర సూర్యారావు). వెల రు 1-50 న. పై.

శోభా ప్రచురణలు, విజయనగరం సిటీ.

# ఖైదీ విషాదగాథ

శ్రీ జనస్వామి కోదండరామశాస్త్రి

జైలుగంట గణగణమని ధ్వనిస్తూ గాఢసుషుప్తిలో మునిగివున్న ఆ నిశ్శబ్దజీవుల్ని కొద్ది కొద్దిగా మేల్కొల్పుతోంది. యీ నరకానికి కారణంగాగల నేరాల చరిత్రలోని విషమఘట్టాల్ని వర్ణించి ఖైదీల శ్రవణపుటాల్లో పైశాచికగానం సల్పుతూ గత స్మృతులతో వ్యధతో చితికిపోయిన హృదయాల్లో మరల కలవరపాటు కల్పిస్తున్నాయి, ఆ భయంకర ఘంటానాదాలు. గుమ్మాలకు బిగించివున్న ఇనుప చువ్వల్లోనుండా లోపలకు అరుణోదయపు లేతకాంతులు బలవంతంగా తోసుకునివచ్చి బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంటూ మెల్లిమెల్లిగా కళ్లు విప్పుకుంటూన్న ఖైదీల దేహాల్ని సులివెచ్చగా తాకుతున్నాయి. పశువులపై బాణ ప్రయోగంచేసి చివరకు అలసట చెంది కొంచెం విశ్రాంతి తీసుకునే కిరాతుని హస్తాలవలె ఘోర జ్ఞాపకాల్ని ఉత్పన్నంచేసే ఆ దారుణ ధ్వనులు ఆగిపోయినై. జైలు నౌకర్లు తాళాలు తీసి ఇనుప గువ్వల్ని ప్రక్కకు నెడుతున్నారు. అయిదు నిమిషాల తరువాత జైలు గంట మరోకమారు ధ్వనించింది. ఇక లేవండోయ్ అని భూమ్యాకాశాలు అదిరిపోయేలాగు అరుస్తూ పేము బెత్తాలు వూపుకుంటూ ఒక్కొక్క గదికి యిద్దరు ముగ్గురు పోలీసులు తయారైనారు. నిశాదేవి పైటకొంగుపై కష్టాలన్నీ మర్చిపోయిన మనసుతో నిర్విచారంగా విశ్రమించి రెండుగంటల సేపైనా కాలేదు. యీ పోలీసుల గాండ్రింపులకు ఖైదీలు దివ్యతపోధనాన్ని కోల్పోయి అంతఃపతితులైన మునీశ్వరులవలె నిద్రాదేవి కరుణ హస్తాల్లోంచి జాగ్రదవస్థలోకి ఒక్క గంతులో దూకటం జరిగింది. నిద్రమత్తు కండ్ల రెప్పల్ని నలిపివేస్తూండగా తూలిపోతూ పరమ ఖిన్నులై లేచి కూర్చున్నారు. నాలుగోవార్డు చివరి గదినుంచి ఇద్దరు ఖైదీలుమాత్రం బద్ధకంగా కూర్చున్నారు. ఒక ఖైదీ మరోకఖైదీతో నాలిక చప్పరిస్తూ యిలా అన్నాడు "ఇంకా విచారం దేనికోయ్! యీ చీకటి గదిలోనుంచి బయటపడే సుదినం రానేవచ్చిందికదా!"

తన విషాదవదనాన్ని ఒక్కతిప్పతిప్పి బాగా చూసుకుని ఆ రెండోఖైదీ యిలా జవాబిచ్చాడు. "దూరంగా జైలోంచి చూస్తే నిజంగా అది నా జీవితంలో రెండో సుదినమేమో! నన్ను ఎంతో ప్రేమగా పెంచి పెద్దచేసిన వ్యక్తిని నాచేతుల్లో చంపేవరోజు మొదటి సుదినం. నా జీవిత శేషాన్ని ఎదురొచ్చేపోవు దుర్భరావమానాల్లో ఎలా నిలవగలగాలి అనే ప్రశ్నే పెద్ద పులిలాగా నోరు తెరుచుకుని చూస్తూన్న యీరోజు రెండో సుదినం..." మోహన్ చాలాకాలంగా శ్రీకృష్ణ జన్మస్థాన నివాసానికి అలవాటు పడ్డాడు. ఇది ఎన్నోతడవో అయిదు నిమిషాలపాటు లెక్క పెట్టుకుంటేగాని అతనే చెప్పలేడు. "భాయీ, ఇటువిను. మానావమానాలు మానవుణ్ణి గట్టి సమస్యలతోను మానసిక యాతనలతోను నింపేమాట నిజమే. అందుచే వాటికి మనం బుద్ధిచెప్పాలిగాని మనకు అవి బుద్ధిచెప్పే స్థితి వరకు పోకూడదని నా అభిప్రాయం..."

రెండుమూడు నిమిషాలనుంచీ గోడచాటున నిల్చుని యీ ప్రసంగాన్ని వింటూన్న జైలు వార్డెన్ కోపావేశంతో లోపలకు వచ్చి "ఎంత గొప్ప అభిప్రాయాలురా అబ్బాయ్! నీ ఉద్దేశాలు నీతిబోధలుగా చెలామణీ అయితే యీ ప్రపంచానికి ఆయుర్దాయం మూడినట్లే. లేరా! కూర్చుని కబుర్లుచెప్తున్నావ్" అని అంటూ వాని వీపుపై ఒకతిరగ హంటర్ ప్రయోగించాడు. మోహన్ హంటర్ దెబ్బతో బాధ కలిగించోటును ఒకచేతో రాసుకుంటూ లేచి నిలబడి వార్డెన్ వంక కోపంగా చూస్తూ ముందుకు సాగిపడుతున్నాడు. ఇక వెనక లేచి నిలబడి ముందుకు వెళ్లనున్న మల్లేసువైపు చూచి వికటంగా నవ్వుతూ

"యీ దుర్బోధల్ని ఆచరణలో పెట్టావంటే మళ్లీ మళ్లీ నీ దర్శనం మాకు తప్పదు. మా మాదిరిగానే ఏదో ఒక వృత్తి చేసుకుని సుఖంగా యోగ్యతగా జీవించుకో. పరిస్థితులకు అనవసరపు ప్రాధాన్యత లిచ్చి మూర్ఖత్వాలతో ఆవేశాలకు లోనై క్రూర కార్యాలకు పాల్పడిన ఫలితంగా యిక్కడకు వచ్చి, యీ హింసలన్నీ అనుభవిస్తూండే నీలాంటి కొద్దో గొప్పో చదువుకున్న వాళ్లను చూచి విచారపడటంకంటే మేము చేయగలిందేమీ కనపడటం లేదు. త్వరగా కదులు. ఎనిమిదిన్నరకే నీ విడుదల" అన్నాడు వార్డెన్.

ఎనిమిదిన్నరకు అయిదు నిమిషాలు తక్కువ వుండగానే నాలుగొందల పదహారో నంబరు ఖైదీ మల్లేసును జైలు నౌకరు వచ్చి ఇన్‌స్పెక్టర్ గారి గదిలోకి తీసుకువెళ్లాడు. మల్లేశ్ అధికారికి నమస్కరించి ఎదురుగా నిలబడ్డాడు. ఆ అయిదునిమిషాల్లోనూ అతని విడుదలకు సంబంధించిన కాగితాలు వ్రాయడం పూర్తయింది. గోడమీద గడియారం అరగంట కొట్టగానే 'నీవు వెళ్లవచ్చు. ఇకనైనా మంచిగా బ్రతుకు.' అన్నాడు ఇన్‌స్పెక్టర్. అలాగే అన్నటు బుర్రవూపి ఆయనకు శాల్యూట్ చేసి బయటకు వచ్చాడు మల్లేశ్. జైలు ప్రాకారందాటి గేటు ముందువున్న రాజబాటపై నిలబడి ఏదో ఆలోచిస్తున్నాడు. ఒక అరగంటసేపు ఆరకంగా గడిచింది ఏడుసంవత్సరాలకాలం కఠిన నిర్బంధబాధను అనుభవించినపిమ్మట స్వేచ్ఛ లభించిందికదా అనే ఆనందం అతనిముఖంలో ఎక్కడా ప్రస్ఫుటమవటం లేదు. ఎక్కడికి వెళ్ళాలో నిర్ణయించుకోకుండానే తల వంచుకుని ముందుకు నడుస్తున్నాడు అంతకంతకు నిదాఘతాపం ఎక్కువవుతోంది శరీరం స్వేదప్రవాహంతో నిండిపోయింది. ధోవతీ చొక్కా తడిముద్దల లాగా తయారయినాయి. కడుపులో మిక్కుటంగా ఆకలిబాధ కలుగుతోంది. దప్పిక గొంతుకను ఎండింప చేస్తోంది బలహీనపడ్డ ఆ క్షీణదేహం తూలిపోతూండగా మరి యిక ముందుకు నడవలేక సమీపంలో కన్పిస్తూన్న ఒక గ్రంథాలయభవనం దగ్గరకు వెళ్ళాడు. ముందు వాలివున్న ఆ వసారాలో ఎవరూ లేరు. బాధగా కణతలు నొక్కుకుంటూ అక్కడ కూర్చున్నాడు. గతించిన జీవితకాలంలోని కొన్ని ముఖ్యఘట్టాలు అతని కండ్లముందు నృత్యం సల్పుతున్నాయి.

## 2

వెంకటేసు, మల్లేసు—వీరిద్దరూ అన్నదమ్ములు. చిన్నవాడైన మల్లేసు శైశవదశలో వుండగానే తల్లిదండ్రు లిరువురూ గతించారు. వెంకటేసు ఎంతో ప్రేమతో తన తమ్ముణ్ణి పెంచి పెద్దవాణ్ణి చేశాడు ఉన్నత విద్యావంతుణ్ణిగా చేయాలని ప్రయత్నించాడు. కాని ఆ అదృష్టం మల్లేసుకు లేక పోయింది. ఎన్నితడవలు పట్టుదలగా ప్రయత్నించి నప్పటికీ, మెట్రిక్యులేషన్ అతనిపాలిట ఎన్నటికీ దాటలేని ఒక అగాధజలధిగా తయారైంది. మల్లేశ్ నిస్పృహచెంది ఇక అజోలికే పోనన్నాడు. వెంకటేసు ఎంత ప్రోత్సాహపరిచినప్పటికీ ప్రయోజనం లేకపోయింది. 'నేను యిటూ పనికిరాక అటూ పనికి రాక రెండిందాలా పాడైపోవటం జరుగుతుంది. నాకు చదువుమీద మనసు పోవటంలేదు నేను వ్యవసాయంలోనే ప్రవేశించి నీకు అండగా వుంటాను. నీకపుడు కొంత శ్రమతగ్గుతుంది. వ్యవసాయికంగా మన యిద్దరి యొక్క కృషి కలిస్తే ఫలసాయంకూడా పెరుగుతుంది' అని అంటూ వాదించాడు మల్లేసు. చివరకు వెంకటేసు ఒప్పుకోక తప్పిందికాదు. మల్లేసు పొలంపని నేర్చుకోటం ప్రారంభించాడు. ఉన్నత విద్యావంతుడై సూటూబూటూ వేసుకుని తన తమ్ముడు ఎంతో దర్జాగా ఒక పెద్ద ఆఫీసరైవుండటం కళ్లారా చూడాలని ఎన్నివిధాలుగానో ఆశలు నింపుకున్న వెంకటేశ్, గడ్డపనుల కాలంలో ఒళ్లంతా నీరై పోతూండగా ఆయాసపడుతూ పలుగుతో తవ్వి గడ్డ విరవటం. వానాకాలంలో భోరుమని వర్షిస్తూండగా గంటలకొలది నడుమువొంచి మొక్క నాటటం మొదలైన శరీరశ్రమ ఎక్కువగా అవసరమైన యిటువంటిపనులలో పాల్గొంటూన్న మల్లేసును చూచి కంట తడిపెట్టుకునే వాడు. కొద్దికాలం గడిచినాక వ్యవసాయపుపనులకు సంబంధించిన కష్టమైనభాగాన్ని తానే నిర్వహించుకుంటూ ఏవేవో చిన్నచిన్న పనులుమాత్రం అతనికి ప్రత్యేకించాడు. ఒక సంవత్సరకాలం ఆ విధంగా గడిచింది. ఇంతలో ఆ గ్రామంలో దస్తావేజులు వ్రాసిపెడుతూ పొలాలు కొలిచిపెడుతూ మరి యితర ప్రయివేటుదారీ పనులన్నీకూడా నిర్వహిస్తూండే ఒకాయన మరణించటం జరిగింది. మళ్లా ఆ పనులకు తమ గ్రామంలోనివారినే ఒకర్ని నియమించాలని

దిగ్గయించుకున్నారు కొంతమంది భూస్వాములు. వారిన్నిటి మల్లేసు చెప్పడాని. తన తమ్ముడు యీ చెట్టు క్రింద ప్లీడరీవృత్తిలో ప్రవేశించడానికి వెంకటేసు ముందు ఒప్పుకోలేదు ఒకప్రక్కన ఆ భూస్వాముల ఒత్తిడీ మరొకప్రక్కన తనతమ్ముడు ఆ వృత్తిపై ఎక్కువమోజు కనపర్చడం—ఇందువలన వెంకటేసు అంగీకారసూచకంగా తలవూపటం జరిగింది. అందుకు తేలిగ్గా స్టాంపులవిక్రయానికి సంబంధించిన లైసెన్సు కూడా సంపాదించాడు. మల్లేస్ రెండు సంవత్సరాలలో మంచి ప్రావీణ్యతగల ప్లీడర్ కాగలిగాడు. మరొక సంవత్సరానికి ఆయన భార్య కాపురానికొచ్చింది.

మల్లేస్ భార్య వెంకటలు కొంచెం స్వతంత్రేచ్ఛ కలిగినమనిషి. వగుకు బెరుకూ లేకుండా తన మనసుకి నచ్చినట్లల్లా చేస్తూండటం, జంకూ గొంకూ లేకుండా తన నోటికివచ్చిన మాటనల్లా వాగుతూండటం— ఇటువంటి అలవాట్లను గమనించి వెంకట్ని రెండు మూడు తడవలు కొంచెం గట్టిగా మందలించాడు వెంకటేసు. ఆ మందలింపును గొప్ప పరాభవంగా భావించి ఎన్నటికైనా తన బావగారిపై పగ తీర్చుకోవాలని సంకల్పించింది వెంకటలు. అందుకై తగిన సమయంకోసం నిరీక్షిస్తూ తగిన పన్నుగడలకై అన్వేషణ జరుప ప్రారంభించింది. తోడుకోడలు తగాదాకు దిగాలని ఎంత ప్రయత్నించినా ఫలించలేదు. కయ్యానికి కాలుదువ్వే వెంకటలు తరహా చూసి ఆవిడ ముసిముసి నవ్వుల్తో 'నీకు ఇంకా చిన్నతనం వదల్లేదు వెంకటలూ!' అని అంటూండేది. యీ భగీరథప్రయత్నంలో తనభర్తనే ఒక సాధనంగా వుపయోగించ గలగటం తప్పితే మరోమార్గం ఆమెకు తోచలేదు. ఆ మార్గంలో కూడా రెండుమూడు తడవలు విఫలురాలైంది. అయినప్పటికీ ఆమె నిరుత్సాహపడి నీరు కారలేదు. గుండెలో చెదిరిపోతూన్న ఉత్సాహాన్నంతా కూడదీసుకుని అధికమైన పట్టుదలతో ఒక దారుణాస్త్ర ప్రయోగానికి పూనుకుంది. ఒక రోజున లోపలి గదిలో ఏదో వ్రాసుకుంటూ కూర్చున్న తన భర్తదగ్గరకు వెళ్ళి మహా నెమ్మదిగా ధోరణి ప్రారంభించింది.

"ఇట్లు దస్తావేజులు వ్రాసి పెట్టడం—అటు స్టాంపు లమ్మకం—ఇంకేం సంపాదన వేలలో నే వుంటుంది. కాని ఇంట్లో ఆడదానికి అణాపబ్బులు పెట్టి మల్లెపూలైనా తేవాలని వుండదుకదా?......"

"సంపాదన్నమాట వేలల్లో అక్కర్లా. కంచాల్లో వుంటేచాలు! ఆ విశేషం మనకెందుకులే అనుకున్నా వాళ్ళు ఏ పదిహేనేళ్ళయినా మంట చెప్తూంటారు. ఆ వృద్ధశం లేనివాళ్ళు రెండు మూడు గంటలసేపు నౌకరీ చేయించుకుని చేతులు జాడించుకుంటూ పోతారు. కొంతమంది వాళ్ళ పండిన ధాన్యాలలో కొద్దికొద్దిగా పంపిస్తూంటారు. గ్రామంలోని నలుగురు పెద్దలూ తెలివిగలవాడనీ సమర్థుడనీ మెచ్చుకోవటం తప్ప అంతకుమించి ఒరిగేదేమీ నాకు కన్పించటం లేదు"

"కనుక మనా తీరిక లేకుండా ఎప్పుడూ యీ పనుల్లోనే తిరుగుతూంటారాయె! తగిన సంపాదన లేనిదే యీ శ్రమంతా మనకెందుకండీ?"

"ఏదో కొంతసంపాదన వుంటుందనుకో, కైతాత్రీ గ్రామాల్లో యిటువంటి వృత్తులకు సంబంధించిన వాళ్ళ డబ్బుద్వారా రాబట్టుకోటం కష్టమే."

"డబ్బుకోసం పాడేమాత్రం ఇతరత్రా మాత్రం ఏమి కష్టమన్నట్లుంటారు?"

"ఏ పంటరోజుల్లో ఆ పంటధాన్యం ఎవరికి తోచినంతవారు మన ఇంటికి పంపిస్తూనే వున్నారు కదా?"

కనుబొమ్మల్ని విలాసంగా కదుల్చుతూ ఎదుటివాడి గుండెలో తన మాటలు నాటుకో గల ఆకర్షణతో ఇలా అన్నది వెంకటలు. "అట్లాగండీ! నా మొగుడు సంపాదించినవాటిని నాకు చూపించకపోతే చూపించకపోయె! యీ విధంగా మడిదిగల్లా రాబడి వున్నకే చెల్లి అని నాతో ఆవిడగారు ఒక్క ముక్క అయినా అన్నది కాదే! అంతవరకెందుకండీ! ముష్టి మల్లెపూల విషయంలో చూడకూడదండీ! మరేది, తోడుకోడలు మనుష్యులన్న భావన ఆవిడకు యింత వరకూ లేదనుకోండి. కనీసం ముత్తయిదుపిల్ల యింట్లో వున్నదికదా అనే కొద్ది సద్భావమైనా చూపకూడదండీ? మొగుడు బజార్నించి తెచ్చిన మల్లెపూల పొట్లం ముందుపెట్టుకొని దండలు గుచ్చి తన సిగను మాత్రం అలంకరించుకుని కూర్చుంటుందా?"

"అంత దురాసుతనంగా ప్రవర్తిస్తోందా మా వదినె?"

"నెమ్మదిగా అంటారేమిటి? ఆవిడ మాట అలా వుంచండి. ఆయన తతంగాన్ని అసలు మీరు అర్థం

చేసుకున్నారా? యీ రాతకోతల చాకిరీవల్ల మనకేమీ సంపాదన లేదని మీరే అంటున్నారు కదా? అసలు భూదేవిని నమ్మి మోసపోవటమంటూ వుంటుందా? వ్యవసాయం జోలికి మిమ్మల్ని రానివ్వకుండా పొలం పనులు మీకు అబ్బకుండాచేసి వూళ్ళో నలుగుర్నీ ఆశ్రయించి వారిచేత మీకు నచ్చచెప్పించి మీకీ చెట్టు కింద ప్లీడరీవృత్తి అంటగట్టిన మీ అన్నగారి పన్నాగపరత్వం తయినా మీరు గ్రహించారా చెప్పండి."

"ఇందులో పన్నాగమేముంటుంది? ఒకరు ఆ వృత్తి, మరొకరు ఇంకొక వృత్తి చేసుకుంటే ఆదాయం ఎక్కువ వుంటుందనే అభిప్రాయమై ఉండాలనుకుంటాను."

"అల్లాగా? మన తెలివితేటలు ఇంత తక్కువ ఎత్తులో విహరిస్తుంటేబట్టే మన ల్నితల్లి శ్రమ పడకుండా కూడా బోల్తా కొట్టించగలుగుతున్నారు అసలు కీలక మున్నదిక్కడే స్వామీ! పెద్ద కీలకమే వున్నది. మా నాన్న ఎన్నాళ్ళనుంచో మొత్తుకుంటున్నాడు. ఇక చెపా వినండి. వ్యవసాయం మన కులదేవత. నాగలీ, బండీ గున్నలు మనకు అన్నంపెట్టే దాతలు. అటువంటప్పుడు వాటికి మిమ్మల్ని మీ అన్నగారు సదభిప్రాయముతోనే దూరము చేస్తున్నారని నమ్ముతున్నారా? యీ నాలుగెకరాల పల్లె నేలపైనా తానొక్కడే ఆధిపత్యం అట్టిపెట్టుకోవాలనే తప్ప మరేమీ కాదు. ఇప్పటికైనా గ్రహించండి" మల్లేసు మరి ఒక మాట్లాడలేదు. అతని మౌనాన్ని ఆమె అర్ధాంగీకారంగా భావించి ఆనాటినుండి ప్రతి రోజూ మల్లేసును తీరికున్నప్పుడల్లా దగర కూర్చుని తన తోడికోడలు బావగార్లపైన అనేక చాడీలు చెప్తాండేది.

కొంతకాలం గడిచిన తరువాత వాటి ప్రభావం మల్లేసు మనసుపై బాగానే పనిచేసింది. ఒకరోజున గ్రామ పెద్దలందర్నీ సమావేశపరచి పంపిణీ జరిగి తీరాల్సిందేనని పట్టుపట్టాడు. "మన ఇద్దరిలో ఎవరికీ యింతవరకూ పిల్లాజల్లా లేరుకదా? మనలో ఎవరికో ఒకరికి సంతానం కలిగేటంతవరకు యీ విషయాన్ని గురించి ఆలోచించటం అనవసర మనుకుంటాను. ఇప్పుడే అవసరమని నువ్వు భావించే పక్షంలో నాకేమీ అభ్యంతరం లేదు. ఏమైనప్పటికీ చాలా ఆలోచించి చేయవలసిన పని. అందుకుగాను పదిరోజులు వ్యవధి వుంచుకోవటం మంచిది. ఈలోగా నువు మనసులో బాగా చర్చించుకున్న తరువాత నీ అభిప్రాయం తెలియచెయ్" అన్నాడు వెంకటేసు విషాదవదనంతో.

మల్లేసు అంగీకరించి ఇంటికి వెళ్ళాడు. భార్యతో విషయాన్ని వివరించి చెప్పాడు. "చూచారా! ఆయన దొంగయెత్తు! మిమ్మల్ని వదలడానికి ఆయన ఇష్టపడటం లేదు. ఏముందండీ! మీరు వేరుపడటంతో ఆయన్నించి ఒక బంగారుకొంప ఎగిరిపోయినట్టే కదా!" అన్నది వెంకులు. ఇటువంటి మాటలే చెపుతూ ఆ పది దినాల వ్యవధిలోను భాగం పంపిణీ కావాలనే దృఢ నిశ్చయాన్నుండి అతన్ని మరలనివ్వకుండా, అతనికి ఏమాత్రం సడలనివ్వకుండా కృషి చేసింది. వ్యవధి తీరిన మరుసటి దినాన గ్రామ పెద్దలందర్నీ మల్లేసు సమావేశపర్చి 'నేను బాగా ఆలోచించుకున్నాను. ఈ నిశ్చయం చాలా మంచిదనే నేను భావిస్తున్నాను' అని చెప్పాడు. పంపిణీ కార్యక్రమం ఒకగంటలో పూర్తయింది. ఫారీకత్ దస్తావేజు కూడా వ్రాసుకున్నారు. చివర్లో వెంకటేసు తన తమ్ముడివంతుకు ప్రత్యేకంగా రెండు వేల రూపాయల్ని మిగులుచూపి ఆ సొమ్మును అతని చేతిలో వుంచినప్పుడు అందరూ ఆశ్చర్యపడ్డారు. 'ఇంత డబ్బు నేనెప్పుడు సంపాదించాను అన్నయ్యా!' అన్నాడు విస్మయంగా మల్లేసు. అది నీ కష్టార్జితం తమ్ముడూ! నీకొరకై యింట్లో యితరులు అప్పు చెప్పిన గడ్డిపోచ దగ్గర్నుంచీ ప్రతిదానికి విలువకట్టి నీపేర యీ మొత్తాన్ని నిలవచేసి వుంచాను" అన్నాడు వెంకటేసు. ఇది ఒక అద్భుత కార్యంగా పరిగణించుకుని నలుగురు పెద్దలూ వెంకటేస్ సౌశీల్యాన్ని వేనోళ్ల పొగడుతూండగా వెంకులుమాత్రం "అసలు యింతకు పదిరెట్లుగా మా సంపాదన ఆయనవద్దను చేరివుంటేబట్టే యీమాత్రం తోంటిచేతిని బయటకు చూపాడు" అని అంటూ వ్యాఖ్యానించింది. ఆ తరువాత వెంకులు కక్షగా ప్రవర్తిస్తూన్నప్పటికీ ఆ అన్నదమ్ములిద్దరూ పరస్పరం సహకారంగాను ఐకమత్యంగాను వుంటూనే వచ్చారు.

## 3

సహజంగా వెంకటేసుది దయార్ద్రహృదయము. ఇతరులను త్వరితంగా ఆకర్షించగల వెంకటేస్ లోని కొన్ని సుగుణాలు అతని వ్యక్తిత్వాన్ని మెరుగు పెట్టే ప్రధానకాలుగా వుపయోగపడుతూంటాయి. భూలోక భోగ్యత్యాలైన ఉన్నతి, ధనం, అధికారం

ఈ మూడింటికోసం మానవుడు నిరంతరమూ తపన పడుతూంటాడు. యోగ్యతలేనివారికి ఉన్నతి సంఘంలో లేదనీ, అదృష్టం వరించనిదే ధనప్రాప్తి ఉండదనీ, సమర్థతా నైపుణ్యత అధికారప్రాభవానికి బాటలు వేస్తాయనీ వెంకటేశ్ భావన. ఆ మూడు అర్హతలు కూర్చుకున్న తను పరి మానవుడు సరిపే స్వల్పకృషితోనే సఫలమనోరథుడు కాగలడని అతని ఆత్మవిశ్వాసం. అతని అమంచితనంవల్లనే తమ సమస్యల్ని కూర్చి అతని సంతోషం పొందగోరి అతనివద్దకు ఎంతమంది వస్తూవుంటారు. ఫలానా మనిషి దుర్మార్గుడని ఖండనగా నిర్ణయం చేసుకోవటంలో తొందరపాటు ప్రదర్శించే కోవకు చెందినవాడు కాడు వెంకటేశ్. అందువల్లనే మల్లేశ తనపై ఎన్నో దూషణావాక్యాలను విసురుతున్నాడని ఎంతోమందివల్ల వినివుండీకూడా వెంకటేశ్ తన హృదయంలో తన తమ్మునికిగల వాత్సల్య స్థానాన్ని వీసంపాలైనా చెరపడానికి ఇష్టపడలేదు. తనవద్దకు ఏవేవో వ్యవహారాలను గూర్చి సలహాలకోసం వచ్చినవారిని తన తమ్ముడు లౌక్యవ్యవహారజ్ఞానం కలవాడు కదా అని మల్లేశ దగ్గరకు పంపగా అతను తేలికగా పరిష్కారము కాగల ఆ సమస్యలకు జటిలస్వరూపములు తొడిగి, దావాలలోకి దింపి కోర్టులచుట్టూ తిప్పి ఎంతో డబ్బు గుంజుకుని వారిని ఎన్నోవిధాల ధ్వంసం చేసినప్పుడు కూడా వెంకటేశ్ తనలో తాను పరితపించాడే కాని మల్లేశ నేమీ దూషించలేదు.

అయితే నూరమ్మ వ్యవహార విషయంలోమాత్రం వెంకటేశ్ మౌనంగా వుండలేకపోయాడు. మల్లేసు మేడప్రక్కనే నూరమ్మ ఇల్లు. ఆవిడను ఒకమాదిరి భాగ్యవంతురాలుగానే పేర్కొనవచ్చు. ప్రస్తుత ధరల ప్రకారం విలువకడితే ఆమె ఆస్తి రెండు లక్షలకు ఏవిధంగాను తక్కువ. ఆవిడకు సంతానం లేదు. దగ్గరవుండే ఇతర బంధువులుకూడా ఎవరూ లేరు. ఆ పెంకుటి భవంతిలో ఏకాకిగా జీవితాన్ని గడుపుకుంటూ భూములమీద వచ్చిన ఫలసాయాన్ని దానధర్మాలకు వినియోగిస్తూ, ఆ గ్రామంలోని కొన్ని శిథిల ధర్మసంస్థలు తమ జీర్ణస్థితిని తొలగించుకోగలిగి సౌందర్య విలసితంగా రూపురేఖల్ని దిద్దుకుని ప్రజోపకారంగా వుపయోగపడేటందుకు కారకురాలవుతూ వచ్చిన ఔదార్యవంతురాలు నూరమ్మ. కొంతకాలానికి మల్లేసు విషదృష్టి ఆమెపై వాలింది. ఒకనాటి రాత్రి మేడమీద కూర్చుని ధనసంపాదనా మార్గాలనుగురించి తీవ్రంగా ఆలోచిస్తూన్నప్పుడు అతని మనసులో 'కష్టపడి సంపాదించి ఎవడూ పెద్ద ఆస్తుల్ని కూర్చలేడు. అక్రమంగానో సక్రమంగానో ఇతరుల ఆస్తిని సంక్రమింప చేసుకోవటమే అందుకు తగిన ముఖ్యమార్గం' అని ఒక భావన దొర్లింది. ఆ మర్నాడు నూరమ్మ జిల్లా కలెక్టరుకు దరఖాస్తు వ్రాసిపెట్టమని మల్లేస దగ్గరకు వచ్చింది. "కలెక్టరు గారికి పంపే దరఖాస్తులు మామూలు కాగితాల పైన వ్రాయకూడదు. స్టాంపులు వుపయోగించాలి. వ్రాసే ముందు పెద్దలతో ఆలోచించటం కూడా మంచిది. నేను రేపు పట్నం వెళ్ళవలసి వుంది. పెద్దగారితో కూడా సంప్రదించి దరఖాస్తు పూర్తి చేసి నేనే స్వయంగా కలెక్టరుగారికి యిచ్చివస్తాను" అని చెప్పి నాలుగు దస్తావేజుల పైన ఆవిడ చేతి వేలిముద్రలు వేయించాడు మల్లేస. ఆవిడ చదువుకున్నది కాకపోయినప్పటికీ కొంత లోకజ్ఞానం లేకపోలేదు. కాని ఏ విషయాన్ని గురించయినా కుటిలంగా ఆలోచించటం ఆమె వల్లకాదు. ఆ కారణం చేతనే మల్లేస చేసిన యీ పనిలోని అంతర్యాన్ని ఆమె గ్రహించలేకపోయింది. ఆ తర్వాత రెండు మాసాలకు, తనకు విక్రయించుటకు ఒప్పుకున్న విక్రయాసి ఖరీదులోని మూడున్నరవంతుల పైకము దస్తావేజులు వ్రాయించి యిచ్చిన రోజునే పొందికూడా రిజిస్ట్రేషనుకు ఎన్నిసార్లు పిలిచినా రానందున శేషించిన ధనమును బ్యాంకులో డిపాజిట్ చేసి దస్తావేజు రిజిస్టరు చేయించుకునే ఏర్పాట్లకు పూనుకోబోతున్నానంటూ ఒక నోటీస్ ఇచ్చాడు మల్లేసు నూరమ్మకు. ఆ నోటీసు చదివించడానికి నూరమ్మ వెంకటేసు దగ్గరకు వచ్చింది. ఆ నోటీసంతా పూర్తిగా చదివి చూసుకుని అత్యంతాశ్చర్యంగా అడిగాడు వెంకటేశ్. "మా వాడికి నువ్వు పదమూడెకరాల పొలం అమ్మేవా నూరమ్మ పిన్నీ?" "అదేమిటి నాయనా! నేనేమీ ఎరుగనే" అన్నది నూరమ్మ. ఆ వెంటనే నోటీసులోని విషయాలను వెంకటేస్ విపులంగా చదివి వినిపించాడు. నోటీసులోని ఘోరమైన అసత్యాలన్నిటినీ విని నూరమ్మ మూర్ఛిల్లింది. గ్రామంలోని పెద్దలందరూ చేరారు. విషయాన్ని సావధానంగా విని చాలా పరితపించారు. మల్లేసు కుటిల స్వభావం జగమెరిగినదే! ఎవరికీ తెలియనిదేమీ కాదు. ఇదివరకు నలుగురైదుగుర్ని మోసపుచ్చాడు. ఇప్పుడు అది చాలా భారీ ఎత్తున జరిగింది. యీతడన మాత్రం మల్లేసుకు తగిన ప్రాయశ్చిత్తం చేసి తీరవల్సిందే నన్నారు గ్రామపెద్దలు. యీ సర్పాన్ని యికమీదట పాలుపోసి పెంచటం మంచిది కాదు. కనపడిన వాడినల్లా కాటువేసి గ్రామ విహారి సంచరించే ప్రమాదమున్నది గనుక లేతలోనే దాని పడగను చితకకొట్టడం అవసరమన్నారు. యీ దురంతాన్ని హర్షించి వూరుకోడానికి వీల్లేదని పట్టుపట్టారు. నూరమ్మకు జరిగిన యీ ద్రోహం తమలో ప్రతిఒక్కరికీ జరిగినట్లుగా భావించుకుని యీ ఆకా

ర్యాన్ని తుదముట్టించాలని ప్రతిజ్ఞగా మాట్లాడారు. వెంకటేశ్ మనసు కూడా చాలా బాధపడింది. మల్లేశ్ పాలిట పతనకాలం దాపురించబోతున్నది కాబట్టే సూరమ్మవంటి మహోదాత్తను, పవిత్రజీవికి ద్రోహం తలపెట్ట బూనుకున్నాడని గ్రహించాడు. ఈ సందర్భంలో తగిన కర్తవ్యాన్ని నిర్ణయించేందుకు అందరూ వెంకటేశ్ వైపు కళ్లు పెట్టుకుని చూస్తున్నారు. 'వెంకటేశూ! నువ్వు గనక యీ విషయంలో కలగజేసుకోకపోతే సూరమ్మ మునిగిపోయినట్టే' అని చుట్టూవున్న పెద్దలు పలికిన మాటలు సత్వగుణశోభితమైన అతని హృదయాన్ని సవాలు చేస్తున్నయ్. లోకానికి ఉపయోగించని మంచితనం అడవిలో వికసించిన గులాబీ పుష్పంమాదిరి వ్యర్థప్రయోజనం కలదే కదా! మల్లేశ్ తో నీకు రక్తస్పర్శ వుండవచ్చు. కాని అతనిలోని అల్పత్వం అత్యాశ. నిరంకుశత్వం. దగాకోరుతనం — వీటిలో మాత్రం నీకు ఏ విధమైన సంబంధం లేదు. పైగా నీకవి బద్ధశత్రువులు కూడాను. అందుచేత లేచి నిలబడు! అని అంటూ ఆత్మ ప్రబోధింప మొదలిడింది. ఇంతలో సూరమ్మ గుండెలు బాదుకుంటూ వెంకటేశ్ పాదాలపైపడి ఏడవటం ప్రారంభించింది. భూమ్యాకాశాలు కదిలిపోతున్నట్లనిపించింది. అతనిలోని ప్రతి రక్తాణువూ రోషావేశంలో కంపించి పోతోంది. అతని ముఖబింబం ఒక్కసారిగా సూర్యతేజంతో ప్రకాశించింది. వాక్కులలో పటుత్వం ప్రబలమవుతూ ఉండగా కొంచెం వంగి పాదాలమీద సూరమ్మను పైకి లేవతీస్తూ వెంకటేశ్ ఇలా అన్నాడు: "లేచి నిలబడు పిన్నీ. ఇక నీవు భయపడవలసిన పనిలేదు. యీ దుర్మార్గాన్ని తప్పకుండా ఎదుర్కొని తీరుతాను. ఎన్ని ఆటంకాలు వచ్చినా ఆగేది లేదు." సూరమ్మ చేతులు జోడించి నమస్కరిస్తూ ఇంటికి వెళ్లింది. ఆ మర్నాడు వెంకటేశ్ తన తమ్ముడికి కబురంపి పిలిపించాడు. తమ్ముల చెరువు గట్టుమీద వేపచెట్టు నీడన కూర్చుపెట్టుకొని చేసిన తప్పును సరిదిద్దుకోవలసిందని ఎంతో బుజగింపుగా బోధించాడు. మల్లేశ్ తన మూర్ఖత్వాన్ని విడిచాడు కాడు. చివరకు తన ప్రయత్నం విఫలమైనందునే నిస్పృహలో లేచి నిలబడాడు వెంకటేశు. మల్లేసు కూడా చొక్కా దులుపుకుంటూ లేచి నిలబడి అంతంలేని క్రోధంతో ఇలా అన్నాడు. "నువు ఎన్నటికీ నా అభివృద్ధిని మంట కలుపదల్చుకున్న అసూయాపరుడవని నా భార్య చెప్తూనే వచ్చింది. అది నేను నమ్మేను కాను. ఇప్పుడు ప్రత్యక్ష నిదర్శనంగా చూపి ఆ పరమ సత్యాన్ని లక్ష్మీస్వరూపిణిఅయిన ఈ వేపచెట్టు అనుగ్రహించింది."

దీర్ఘప్రయాణంలో అలసిసొలసి దుర్బలుడై పడమటికొండ చాటున ఒరిగిపోతూన్న సూర్యభగవానుడి వేపు నిశ్చలంగా దృష్టిబరపి ఇలా అన్నాడు వెంకటేశ్.

"నా తమ్ముడు గొప్ప విద్యావంతుడు కావాలనీ వ్యవహారదక్షతతో గణింపు పొంది కీర్తనసుమాలతో పూజింపబడాలనీ నేను చేసిన కృషిఅంతా బూడిదలో పోసిన పన్నీరుమాదిరి వ్యర్థమైపోయి చివరకు ఒక అజ్ఞానవతిఅయిన స్త్రీయొక్క వెఱ్ఱి వుపదేశాలకు దాసోహమై పోగలడని నేను స్వప్నంలోనైనా భావింపలేదు. మల్లేశ్, ఒక్కమాట చెప్తున్నాను. శ్రద్ధగా ఆలకించు నన్ను ఎన్ని దుర్భాషలాడినా వాటిని ప్రేమ వాక్యాలుగానే ఎంచుకుంటాను. అమాయకులకు దారుణద్రోహాలు జరుగుతూన్నపుడు మాత్రం నాలో రక్తం దాని వ్యక్తి ధర్మాన్ని నెరవేర్చుకుని తీరుతుంది సుమా!"

వెంకటేశ్ బోధలు మల్లేశ్ మనసును ఏ విధంగానూ మార్చలేకపోయినయ్. అతడు ముందు నిర్ణయించుకున్న పద్ధతి ప్రకారం సూరమ్మమీద దావా వేశాడు. సూరమ్మ తనకు కోర్టువారినుండి వచ్చిన సమను తీసుకొనివచ్చి వెంకటేశ్ చేతిలోవుంచి 'ఏమౌ నాయనా, ఏం చేస్తావో నీదయ." అన్నది. వెంకటేశ్ సమన్లు చదువుకున్నాడు. సూరమ్మ అతనివంక దీనంగా చూసింది. అతని మనసు ఘోరంగా గురపిలుతోంది. నేత్రాలనుండి రెండు నీటిబొట్లు రాలుతుండగా ఇలా అన్నాడు. "నేను నీకు వాగ్దానం చేసివున్నాను కదా పిన్నీ. ఆ తప్పుడు దస్తావేజును చిత్తుకాగితం మాదిరి విలువలేకుండా చేయించడానికి నాయాశక్తులా పాటుపడతాను. నా గుండెలో ఏనాడో నెలకొని ఎంతో వాత్సల్యాన్ని సహనాన్ని ఆహారంగా పొందుతూన్న 'నా తమ్ముడు' అనే పదంలోని 'నా' అనే అక్షరాన్ని తుడిచేసుకోగల్గితేగాని యీ పని సాధ్యంకాదు."

ఒక సంవత్సరం గడిచిన తరువాత ఆ దావా మునిసిఫ్ కోర్టులో విచారణకు వచ్చింది. తీర్పు విని గ్రామస్థులు నిర్ఘాంతపోయినారు. సూరమ్మ దిగులుతో కుంగిపోయింది. మల్లేసు, యీ సందర్భంలో అతనికి అండగా నిల్చిన నల్గురు గ్రామస్థులూ హర్షధ్వానాలతో విజయోత్సవం సల్పుకుంటూ వెంకటేసును అతని వైపువారినీ హేళనగా మాటాడుతున్నారు. కాని వెంకటేశ్ మాత్రం కించిత్ మాత్రంగానైనా నిరుత్సాహపడలేదు. 'ధర్మదేవత నియమబద్ధంగా నడవటానికి యిదేమీ రామరాజ్యపు కాలం కాదుగదా!' అని అంటూ నాలుక చప్పరించి పూరుకుని సూరమ్మచేత పై కోర్టులో అపీల్ చేయించాడు. నాలుగు మాసాలు గడిచిన తరువాత పైకోర్టు నిర్ణయంకూడా సూరమ్మకు వ్యతిరేకంగానే వచ్చింది. దావా ఖర్చులు, రెండు సంవత్సరాల ఫలసాయపు విలువ, ఇదంతా కలిపి పది వేల రూపాయలవరకు సూరమ్మ మల్లేసుకు చెల్లించవలసి

ఆలోచనలన్నీ దానికిచుట్టూ విహరిస్తున్నయ్. ఆలోచనల ఒత్తిడికి తట్టుకోగా కొద్దీ అతని మనసుకి గట్టిబలం కలిగింది.

"అనవసరపు ఆలోచనలతో కాలం వ్యర్థపుచ్చకుండా నన్ను ఉపయోగించడమే నీ కర్తవ్యం! మరి ఎన్నటికీ అతనివలన యిలాంటి గడ్డుసమస్యలు తిరిగి సముత్పన్నము కాకుండా నిన్ను నీవు కాపాడుకోవాలనుకుంటే నన్ను అతనిమీదకు ప్రయోగించు. మీ మీ బాంధవ్యాలతో నాకేమీ పనిలేదు. ఎవడి చేతిలో కూర్చుంటే వాడు చెప్పినట్లు చేయటమే నా విధి. ఆలోచన వాడిది. కార్యాచరణ నాది." అని ఆ కత్తి అన్నట్లు తోచింది అతనికి!

ఇందాకటినుంచీ ఊహాజనిత లోకంలో విహరిస్తూండిన మల్లేసును వాస్తవికత, బందాలేసి యీ లోకంలోకి లాగింది. 'కాలయాపన కూడదు, అనుకున్నపని వెంటనే జరిగితీరాలి' అని నిశ్చయించుకుని గోడదగ్గరకు వెళ్ళాడు మల్లేస్. ఆ వస్తువుపై హస్తాన్ని వుంచినపుడు కూడా అతని మనసు కొంచెం ఆలోచింప మొదలిడింది. కాని అవమాన వ్యథతో వుడికిపోతూన్న అతని రక్తం 'కాలయాపన చేయవద్దు. ఆలోచనలకు నీతిలేదు. అవి మనిషిని ఎటు పడితే అటు లాగుతూంటాయి' అని హెచ్చరించింది. వెంటనే ఆ వస్తువుతీసి ఒక పొడుగాటి లెదర్ బేగ్‌లో వుంచాడు. ఆ లెదర్ బేగ్‌ని బొడ్డుదగ్గర బట్టముడిలో దాచుకుని మేడమెట్లు దిగి బయటకు వెళ్ళిపోయాడు. అప్పటికి చాలాసేపు కావటం మూలాన వెంకటేస్ ఇంటివద్ద జనసందడి కొంచెం తగ్గింది. వీధిమధ్యంలో నిలబడి అపుడే వచ్చిన అయినవారును పెద్దలతో మాట్లాడుతున్నాడు వెంకటేస్. ఏ దిక్కునుంచి వచ్చాడోకూడా ఎవరూ గమనించలేదు. వెఱ్ఱి ఆవేశంతో వెంకటేస్‌మీద కురికి రెండు కత్తిపోట్లు వేసేవరకూ ఆ అయినవారున్నూ యిది హత్యాప్రమాదమని అవగాహన చేసికోలేకపోయారు. వారికి కాళ్ళాడ లేదు. మనసులు పనిచేయలేదు. కండ్లముందు జరుగుతూన్న దురంతం గుండెల్ని తీవ్రంగా కంపింపచేస్తోంది. హంతకుడు వెంకటేస్ శరీరాన్ని ఛిత్రవధ చేస్తున్నాడు. రుధిర ధారలు ప్రవహిస్తున్నాయి. నాలుగు నిమిషాలవరకూ పెద్దమనుష్యులు నిశ్చేష్టులై శిలాప్రతిమలవలె నిలబడివున్నారు. తదుపరి ముందుకు సాగివెళ్ళి హంతకుణ్ణి రెక్కలు పట్టుకుని యివతలకు లాగటానికి ప్రయత్నించారు. వెఱ్ఱిఆవేశంతో క్రూర బలంతో వూగిపోతూన్న హంతకుడు వారిని ఒకచేత్తో ప్రక్కకు నెట్టుతూ మరొకచేత్తో తనపని పూర్తిచేసుకున్నాడు. డొక్కల్లో పడ్డ పోటుతో వెంకటేస్ నేలమీదకు ఒరిగిపోగానే కత్తి దూరంగా విసిరేసి 'ఇక మీరు శ్రమపడనక్కరలేదు. నన్ను పట్టుకుని మీరేమైనా చెయ్యండి. నాకు ఇష్టమే' అని వారి ముందు నిలబడ్డాడు హంతకుడు. అపుడు గురుపట్టగలిగారు హంతకుడు మల్లేస్ అని. రెండు నిమిషాలలో మల్లేస్‌లోని వెఱ్ఱి ఆవేశం పూర్తిగా తగ్గిపోయింది. రక్తపు మడుగులో పడివున్న తన అన్న శరీరాన్ని ఒకతడవ కళ్ళు పెద్దవి చేసుకుని చూచాడు. ఎంతో వాత్సల్యపూరితంగా 'తమ్ముడూ' అని సంబోధించే ఆనోటినుండి రక్తపు బొట్లు రాలుతున్నాయి. తమ కుటుంబం కొంచెం గడ్డుకాలంలో వున్నపుడు 'విచారపడకు తమ్ముడూ! మనకు మంచిరోజులు రాకపోవు?' అని ఆదరణగా తలనిమిరిన ఆ హస్తాలు నాలుగైదు ముక్కలుగా విరిగిపడి వున్నాయి. తనయెడల అధిక దయారసం ప్రవహింపచేసిన ఆ నేత్రాలు కాంతి క్షీణములై పోతున్నయ్. తను చిన్నప్పటినుంచీ ఎంతో లాలించి బుజ్జగించి ప్రేమగా పెంచిన తన అన్న తన మూర్ఖత్వానికి బలియైపోతున్నా... మల్లేస్ హృదయంలో దుఃఖ ప్రవాహం పొంగింది. 'నా అన్నను నేనే చంపుకున్నాను' అని బిగ్గరగా విలపిస్తూ ఆ రక్తపు మడుగులో దొర్లుతున్నాడు. చుట్టూ కూర్చునివున్న పెద్దమనుష్యులవంక వెంకటేస్ ఒక్కతడవ బాధగా కండరెప్పలు విప్పిచూచి హీన కంఠస్వరంతో 'నా తమ్ముడిపై హత్యానేరం మోపకండి, యీ విషయాన్నే మరణ వాఙ్మూలంగా చెప్పామనుకుంటె నాకు వ్యవధిలేకుండా పోతోంది." అని అంటూ కళ్ళు మూశాడు. అదే ఆఖరిమాట అయింది. తర్వాత ఒక అరగంటకు పోలీసు ఉద్యోగస్థులు వచ్చారు. వారితో మల్లేస్ తానే హంతకుడని ఒప్పుకుని ఆవిధంగా వ్రాసియిచ్చాడు. అందుకు తగినట్లుగా అక్కడవున్న పెద్దమనుష్యుల సాక్ష్యాలు కూడా తీసుకుని మల్లేస్‌ని బస్తీకి తీసుకునివెళ్ళి సబ్ జైల్‌లో వుంచారు. కేసు నడుస్తూన్నపుడు కొంతమంది స్నేహితుల ప్రోద్బలంతో మల్లేస్ తన మనసును మార్చుకున్నాడు. "నేను హంతకుణ్ని కాదు. యీ హత్యతో నాకు ఏ మాత్రమూ సంబంధములేదు. పోలీసువారి హింసాకాండను భరించలేక ఆవిధంగా స్టేట్‌మెంటిచ్చానని న్యాయస్థానంలో వాదించాడు. యీ కేసునుండి రక్షింపబడాలనే పట్టుదలతో తన కుందుకున్న మేడ, రెండెకరాల భూములు—యీ రెండింటినీ విక్రయించి ఆ పైకం ఖర్చుపెట్టి పెద్ద పెద్ద ప్రయత్నాలు చేశాడు. సుప్రసిద్ధుడైన ఒక బొంబాయి న్యాయవాదిని పిలిపించి తనతరఫున వాదించుటకు న్యాయాధిపతుల ముందు హాజరుపర్చుకున్నాడు. చివరకు యీ ప్రయత్నాలన్నీ నిష్ప్రయోజనములైనాయి. కాని సెషన్సుకోర్టులో

విధింపబడిన జన్మఖైదును హైకోర్టులో ఎనిమిది సంవత్సరాల కారాగారవాసశిక్షగా తగ్గించటం జరిగింది. ఖైదులో అతని మంచినడవడికిగాను ఒక సంవత్సర కాలం తగ్గింపుచేశారు. మిగిలిన ఏడుసంవత్సరాల శిక్షా కాలము పూర్తికాగానే మల్లేస్ బయటపడ్డాడు.

## 4

జైలునుంచి విడుదలయిన మర్నాటిరాత్రి ఏడు గంటల బండికి స్వగ్రామపు రైలుస్టేషన్లో దిగాడు మల్లేస్. స్టేషన్ గేటుదాటి బయటకు రాగానే అతి సమీపంలోవున్న మూడంతస్తుల మేడ అతని దృష్టికి తగిలింది. "రాత్రి బండికి యీ ప్రదేశాల్లోనుంచి రావడానికి ఎంతో భయంగావుండేది. అటువంటిచోట యీ మేడలూ మిద్దెలూ వెలిసి ఎంత సందడిగావున్నదీ!" అని ఆశ్చర్యపడుతూ కొంచెందూరం వెళ్ళాడు. చెరువుకట్ట ఎక్కగానే విద్యుత్కాంతులతో విలసిల్లుతూ గ్రామం ఎంతో శోభగా కనిపిస్తోంది. విస్మయంగా గబగబా నడవటం ప్రారంభించాడు. పల్లెటూరు కావటంమూలాన అప్పటికప్పుడే ఎనిమిదిగంటలైనా దాటకమునుపే వీధులలో జనసంచారం తగ్గింది. నాలుగువీధులూ కలిసిన చౌకును సమీపిస్తూండగా అక్కడేదో శిలాప్రతిమవున్నట్లు దూరానికి కనిపిస్తోంది. దాని వెనుకవేపుభాగమును చూచి 'యే నాయకుని ప్రతిమో అయివుండాలి. ఈమధ్య మారుమూలలవున్న పల్లెటూళ్ళలో సైతము యీ మోజు ఒకటి హెచ్చిపోయిందని జైల్లో రామన్‌గాడు చెప్పాడు కదా!' అని అనుకుంటూన్నంతలో నే చౌకులోకి అతను రానేవచ్చాడు. ప్రతిమ ముందుభాగం వేపుకు వెళ్ళి నిలబడ్డాడు. అత్యంతాశ్చర్యంతో అతని మనసు ఉక్కిరిబిక్కిరవుతోంది. ఏ దేశనాయకుడిదో కాదు. ఆ శిలాప్రతిమ తన అన్న వెంకటేస్‌ది. ప్రతిమకు కొంచెం అడుగున బిగించివున్న రాతిఫలకంపై 'పరోపకారం కొఱకు ప్రాణదానం సల్పిన అద్భుత వ్యక్తి—వెంకటేస్' అని లిఖింపబడిన గిల్టు అక్షరాలు విద్యుత్కాంతులలో తళతళలాడుతున్నాయి. ప్రతిమపై భాగాన నాలుగు ఎలెక్ట్రిక్ బల్బులు బిగించారు. ప్రతిమ స్పష్టంగా మంచి హుందాతనంగా కనిపిస్తోంది. మల్లేస్ ఆ ప్రతిమలోకి ఏకాగ్రతతో దృష్టిబరుపుతూ నిలబడ్డాడు. తానొకవిధంగా తలిస్తే దైవం మరొకవిధంగా చేశాడు. తనకు చేసిన ద్రోహానికిగాను యీలోకంనుంచి తన అన్నను తొలగించి తీరాలని కత్తితో పొడిచి చంపాడు. ఆపనిచేసి తను తన మానవత్వాన్ని కోల్పోయాడు గాని తన అన్నను మాత్రం యీ ప్రపంచంలోనుండి పంపలేకపోయాడేమో! పైగా తనుచేసిన పనివలన వెంకటేస్ అజరామరుడై ప్రజలనుండి అనంతమైన భక్తిప్రపత్తులను పొందుతున్నాడు. అతనికీర్తి కుసుమాల సువాసనలతో గ్రామమంతా గుబాళించిపోతోంది. ముందు తరాలవారికి మార్గదర్శకుడు కాగలిగాడు. ఏదో కొద్ది ప్రపంచజ్ఞానం కలిగి సామాన్యుడుగా ఎంచబడుతూండే వెంకటేస్‌కి యింత ఔన్నత్యాన్ని కల్గించి విఖ్యాతిని ఆర్జించి పెట్టి మహోత్కృష్టతలో చేర్చింది తన ప్రతీకారవాంఛేగదా! పైకి అపకారంగా కన్పించినా కొన్ని కొన్ని దుష్కార్యఫలితాలు, వాటిని అనుభవించినవాడికి అవాంఛనీయంగా కృషిశూన్యంగా ఎంతో వున్నతిని కూరుస్తయ్. తన ద్వేషం, కక్ష తనకే చెరుపు చేసినయ్. సిగ్గుతో అవమానంతో ప్రతినిమిషమూ క్రుంగిపోవల్సిన క్షుద్రస్థితికి దింపినై. తననొక క్రూరరాక్షసునిగాను, అతనినొక దేవాంశసంభూతునిగాను లోకానికి చూపిస్తున్నాయి. మల్లేస్ అక్కడ్నించి కదలి ముందుకు వెళుతున్నాడు. కాని ఆ మెట్లమలుపు తిరగగానే మల్లేస్ కాళ్ళు ఆకస్మికంగా ఆగిపోయినై. ముందుకు అడుగుపడటంలేదు. ఆ ఎదుటి గుమ్మంలో చంకన బిడ్డనిడుకుని ఎవరికోసమో నిరీక్షిస్తూ నిలబడివున్న స్త్రీవేపు సూటిగా చూస్తున్నాడు. మిలమిల్లాడుతూవున్న పొడుగాటి వాల్జడ, ఆ జడ మొదట్లో కొద్దిగా యిరికింపబడి క్రిందకు జారిపోవడానికి సిద్ధంగా వున్న పెద్దమల్లెచెండూ, ఫేస్ పౌడర్ అద్దకంలో నలుపువర్ణాన్ని దాచుకుని నిగనిగలాడుతున్న ముఖము, పెదవులకు పూసుకున్న ఎరుపురంగు, చేతులు కదిలినప్పుడల్లా గలగలలాడే గోల్డు కవరింగ్ కంపెనీవారి గాజులు, ఆ వస్త్రధారణతీరు—సహజంగా సౌందర్యవతి కాకపోయినప్పటికీ యీ కృత్రిమపు మెరుగుల్లో ఆమెను చూచేవారికి కొంచెం చెయాపక్షి మాదిరిగా చేస్తుంది. మొదటనున్న ఎలెక్ట్రిక్ లైటుయొక్క కాంతుల్లో ఆమె ముఖం మల్లేసుకు స్పష్టంగా కనిపిస్తోంది. ఇక సందేహంలేదు. ఆ వన్నెలాడి తన భార్య అని వేరే ఎవరూ వచ్చి చెప్పనక్కరేదు. ఆ ఇంటివాకిలి ముందుకువెళ్ళి నిలబడి "ఆ బిడ్డ ఎవరు వెంకలూ?" అని అడిగాడు మల్లేస్ కొంచెం ఉత్సాహం తెచ్చుకుని.

"నా పిల్లే! నువ్వు పిలిచిన పేరు ఏడెనిమిదేళ్ళనాటిది. ఇప్పుడు నా పేరు కోమలాంగి. ఆ రకంగా గెజెట్‌లో ప్రచురణ చెయించాడు కూడాను మా ఆయన."

"ఏమిటి మీ ఆయనా! నీ పిల్లా!...మల్లేస్ మాటలు తడబడుతున్నాయి అతని కంఠస్వరం తీవ్రకంపనాన్ని పొందుతోంది.

"అసలెవరయ్యా నువ్వు? వెంకులూ అని పిలుస్తున్నావ్" అని అంటూ గుమ్మందాటి ఒక మెట్టు

క్రిందకు దిగివచ్చి మల్లేష్ ముఖాన్ని తేరిపార చూసింది. అతని ముఖాన్ని క్షణమాత్రంలో గుర్తించింది. గిరుక్కున వెనక్కు తిరిగి "ఒరే పాపిష్టివాడా? యింట్లోకి మళ్ళీ దాపురించావ్? పో! అవతలకు పో! ఖూనీలు చేసినవాడా." అని తిట్టుకుంటూ లోపలకు వెళ్ళి పెడేలున తలుపు రెక్కల్ని మూసుకుంది. నేత్రాల్లో ఉబుకుతూన్న జలబిందువుల్ని చేత్తో తుడుచుకుంటూ వెనక్కు తిరిగివచ్చి మల్లేష్ రోడ్డుపై నిలబడ్డాడు. దుఃఖాలవేడితో ఎండుకుపోయిన అతని అంతస్సు తీవ్రావేదనతో మూలిగింది. తనకు మిగిలిన యీ ఒక్క ఆశాకుసుమంకూడా నలిగిపోయింది. ఇక తనకీ ప్రపంచంలో ఎవరూ లేరు. ఏదీలేదు, సౌఖ్యం యివ్వగల ధనం లేదు. ప్రేమించగల భార్య లేదు. ఆదరించగల అన్న లేడు. కీర్తి ప్రతిష్ఠల నివ్వగల వ్యక్తిత్వం లేదు. అన్నింటినీ అందర్నీ కోల్పోయి అవమాన భారంతో తలెత్తలేక అమానుష జ్ఞాపకాల ఒత్తిడిని సహించలేక శరీరమంతా తూట్లుపడిపోయిన తనకు యింకా యీ జీవితం దేనికి? ఇంతలో శీతలవాయువులు అతని శ్రవణపుటములకు ఒక హోరుధ్వని అందింపచేసినయ్. 'ఔను, ఏటిపొంగే రోజులు కదా! ఆ నదిమాతే నాకు ఆత్మశాంతిని కల్గించగల దివ్యౌషధం' అని అనుకుంటూ ముందుకు సాగి నడవటం ప్రారంభించాడు. కాని నాలుగు ఇళ్ళు దాటగానే మనసులోకి ఏదో ఆలోచన వచ్చి అతను ఆగి నిలబడ్డాడు. ఎదురుగా అరుగుపై ఆసీనుడై యున్న వేదపండితుడు తన యజ్ఞోపవీతాన్ని పొడుగ్గా సాగతీసుకుంటూ వేదమంత్రాలు వల్లెవేసు కుంటున్నాడు. మల్లేసు ఆయనకు కొంచెం సమీపంగా వెళ్లి "శాస్త్రుల్గారూ! యీ మొత్తమీది యింట్లో కాపురమున్నావిడ ఎవరండీ?" అని అడిగాడు. వెంకులు పరిస్థితి కొంచెము తెల్సుకుందామనే ఉద్దేశ్యంతో. "ఆవిడా— ఆవిడ మొదటిభర్తతో కాపురం చేసినపుడు వెంకమ్మ. రెండోభర్తను కట్టుకున్న తర్వాత కోమలాంగి. ఐనా దానిసంగతి మనకెందుకులే. ఇప్పుడు యీ మాటలే వేనా వినిపించుకున్నదా అంటే దాని బూతుల పద్యాల కాగలేక నా వేదపన్నాలకు స్వస్తి చెప్పి ఇంట్లోనూరాలి. అటువంటి రకమంతా అంతేనయ్యా. అటావుంటేనేగాని వాళ్ళు సంఘంలో జీవించలేరు" "ఆవిడ విషయం నాకు కొంచెం అవసరమైంది. మీకు తెల్సిందేదో కొంచెం చెప్పండి అయ్యగారూ." "దానికిప్పటివరకూ రెండు వివాహాలని మాత్రం నాకు రూఢిగా తెలుసు...పాపం మొదటిభర్త మల్లేసు అని...వాడు మంచివాడే మరి...ఏం దుర్బుద్ధి పుట్టిందో ఏమో అన్నను కాస్తా కత్తితో పొడిచి చంపేశాడు. శిక్షపడి వాడు జైలుకి వెళ్ళిన మూడు మాసాలకే యిది ఒక మోటారు డ్రైవర్ని కట్టుకుని కులుకుతోంది...ఇది దాన్ని గురించి నాకు తెల్సిన సమాచారం. అసలు నువ్వెవరివి నాయనా? ఇప్పుడు నువ్వు దాని వాకిట్లోనుంచి వస్తున్నట్లుందే"

"గురుపట్టలేదా శాస్త్రుల్గారూ? నేను మల్లేసును"

"ఆఁ! నువ్వా నాయనా? నువ్వు మల్లేసువా? జైలు నుంచి విడుదలై ఎప్పుడు వచ్చావ్? దాని వాకిట్లోకి ఎందుకురా వెళ్లావ్? మల్లేస్, నువ్వు వెళ్ళవలసిన ఇలు అదికాదు. అదిగో ఆ యింటికి వెళ్ళు. ఆ మహాతల్లి నీకోసరం కాచుకుని కూర్చుంది. నీకు మళ్ళా వివాహం చేసి తన అత్తింటివంశం రూపుమాసి పోకుండా కాపాడాలని ఆతురతపడుతోంది."

మల్లేస్ మౌనంగా కదిలి ముందుకు వెళ్ళుతున్నాడు. నిజంగా తన అన్న, వదినె—వారిద్దరూ పుణ్యజీవులు. ఆమె తనభర్తను దైవసమానంగా భావిస్తూండేది. అతడు తన భార్యను ఎంతో ప్రేమగా చూసుకుంటూండేవాడు. ఆ జంటను తన దారుణ హస్తాలు విడదీసినై. ఆమె భర్తను వధించి ఆమె సుఖాలను మంటగల్పిన వాణ్ని గురించి ఎంత దయగా ఆలోచించ గలుగుతోంది? కాస్తో కూస్తో దైవత్వాన్ని సాధించి వుంటేనే తప్ప, లేకపోతే మాత్రం మానవజీవికి ఇంత శాంతి సహనాలు అసంభవాలు! మల్లేసు తన అన్న ఇంటి ముందుకు వచ్చాడు. మెల్లగా అరుగుమీదకు వచ్చి కూర్చున్నాడు. గుమ్మంలో కూర్చుని వున్న వదిన సంతోషంతో ఉప్పొంగిపోతూ లేచి నిలబడి "వచ్చావా మరిదీ? జైలు ఇన్స్పెక్టర్ గారికి వారంరోజుల క్రిందట ఉత్తరం వ్రాశాను. గురువారంనాడు విడుదల జరుగుతుందని వారు జవాబు వ్రాశారు. ఇవ్వాళ శుక్రవారం కదా. ఇంతవరకూ రాలేదేమా అని నీకోసం ఎదురు చూస్తున్నాను." అన్నది. "నా కోసం ఎదురుచూడటంలోగల నీ అభిప్రాయం నేను యింతకు ముందే తెలుసుకున్నాను వదినా! నీ బ్రతుకుబాటల్లో బడబాగ్ని సృష్టించిన యీ జన్మశత్రువుపై నీకీ దయ ఎలా కలుగుతోందమ్మా. నీ ప్రేమాభిమానాలు పొందటానికి తగిన అర్హత నేను ఏనాడో కోల్పోయినాను తల్లీ! నీ పవిత్రమూర్తిత్వానికి ఒకతడవ వినయవినమ్రుడనై నమస్కరించాలని వున్నది. కాని ఆ పరమశాంతిమూర్తిని చిత్రవధ చేసిన యీ దుష్టహస్తాల్ని జోడించి అపవిత్రం చేయలేకుండా వున్నాను..." అని అంటూ అరుగు దిగి వెనక్కు తిరిగి చూడకుండా ముందుకు చరచరా నడిచివెళుతున్నాడు మల్లేస్. అక్కడ వీధి దీపాలు లేవు. గాఢాంధకారం వికృతంగా ధ్వనిస్తోంది. బాట కిరుప్రక్కలా వున్న పెద్దపెద్ద వృక్షాలు చీకటి భూతాల్లాగా నిలబడి వున్నాయ్. ఊహాపథపు హద్దుల్ని సంకుచితపరిచే మాన

ఘని అజ్ఞానంలాగా గోదుపాముకునా బారులు తీర్చి వున్న ఆ వృక్షాలు తమ ప్రక్కలనున్న ప్రదేశాల్ని కనిపించనీయటం లేదు. గగనభాగంలో అక్కడక్కడ తెల్లగా కదుల్తూన్న నల్లమబ్బు తునకలను మహోపాయంగా తప్పించుకుంటూ నిర్మలంగా వున్న చోట్లనే మాత్రం నీటుగా నవుస్తున్నాడు అష్టమి చంద్రుడు. మానవజాతిలో ఆనాటి కానాడు విజృంభించుచు పోతూన్న అసూయా ద్వేషాల ఉద్రేకతను భూజాతి హృదయపు లోతుల్లోనుంచి బయల్దేరిన ఆక్రందన స్వరం అన్నట్లుగా, నదీ ప్రవాహం భయంకరమైన హోరుధ్వనిని సృష్టిస్తూ అనంత వేగంతో ముందుకురుకుతోంది. తనకు అడ్డుతగిలిన దానినల్లా విరగద్రొక్కి తన గర్భంలో దాచుకునే నదీప్రవాహాలయొక్క ప్రవర్తనే మానవుడికి మొదటగా అధికారం, ఆవేశం, నిరంకుశత్వాలను నేర్పి వుండవచ్చునేమో?

మల్లేస్ ఒడ్డుమీదకు వచ్చి కూర్చున్నాడు. సమీపంలోనే వున్న శ్మశాన స్థలంలో శవ దహనం జరుగుతోంది.

మల్లేస్ తన హస్తాల్ని కళ్ళముందు పెట్టుకుని తీరికగా చూసుకుంటున్నాడు. ప్రతి హస్తరేఖలోనుంచీ తన అన్న మృత్యుబాధ పడుతూన్నప్పుడు వెలువడిన సన్నటి మూలుగు ధ్వనులు వినిపిస్తున్నాయి. ప్రతి వ్రేలి చివరి కొనలోనూ కత్తి పోటుతో నిండి వున్న తన అన్న మృతశరీరం కనిపిస్తోంది. యీ రాక్షస హస్తాలవలన లోకంలో యికనైనా మరెవ్వరికీ అకృత్యాలు జరక్కుండా నదిగర్భంలో దాచుకోగల్గటమే తాను యీ జన్మములో చేయగల్గిన పుణ్యకార్యం!

తన అన్నను హత్యచేసే ముందు అతని గుండెల్ని వూపిన ఆవేశమే మరల యిప్పుడు కూడా అతనిలో ప్రవేశించింది. ఆనాడు ఆ సంకల్పంనుండి దిగజారిపోకుండా అతని మనసును ఎలాటి త్రాళ్ళతో కట్టి వేయగలిందో, యీనాడు కూడా యీ భావన నుంచి తిరిగి పోకుండా తగిన ఏర్పాటు చేసింది. అతని అధరాల సందునుంచి ఒక మందహాసం ఒలికింది. ఆ నవ్వు అతనినుండి ప్రపంచానాన్ని దూరం చేసింది. ఇక తను స్వతంత్రుడు! మల్లేస్ మహోత్సాహంగా, క్రొత్తగా ఆవిర్భవించుకొచ్చిన బలంతో లేచి నిలబడి అయిదు నిమిషాలపాటు నదిగా తను చూస్తూ మనసులో ధ్యానం చేసుకున్నాడు. తరువాత నెమ్మదిగా ఒడ్డునుంచి దిగి నదిలోకి ప్రవేశించాడు. ఏకాగ్రచిత్తంతో ముందుకు నడిచిపోతున్నాడు. నదీమాత సంతోషప్రవాహంతో అతనికి స్వాగతం యిస్తోంది. కొంచెం దూరంలోవున్న రేవులో చేపలుపడుతూ గట్టుమీద నిలబడిన ఒక సిపాయి గబగబా పరుగెత్తుకుని వచ్చి నదిలోకి దూకేడు. యీదుకునివెళ్ళి రెండు మునకలు పూర్తిఅయి మూడో మునకతో ప్రాణాలు విడవడానికి సిద్ధంగావున్న మల్లేసును భుజాలమీద వేసుకుని ఒడ్డుకు తీసుకొచ్చేడు. నీరు బాగా త్రాగి వుండటం మూలాన మల్లేసుకు కొంచెంగా స్మృతి తప్పింది. రెండెడ్ల బండీమీద వేసుకుని దగ్గరగా వున్న గ్రామపు పోలీసు స్టేషన్‌కు తెచ్చేడు. కొంతసేపటికి మల్లేస కళ్ళు విప్పిచూచాడు. ఎదురుగా సబ్ ఇన్‌స్పెక్టర్ నలుగురు పోలీసు జవాను నిలబడి వున్నారు.

మల్లేసుపై ఆత్మహత్యా నేరంమోపి పోలీసు వారు కేసుపెట్టారు. మొదటి శ్రేణి మేజస్ట్రేట్ కేసు విచారించి మల్లేసుకు సంవత్సరన్నర కఠిన శిక్ష విధించి మళ్ళా జైలుకు పంపించాడు!

ఉపయోగమైన సరిక్రొత్త పుస్తకములు
వ్యవసాయము - ఇంజనీరింగు, వైద్యము, మొదలగు అనేక గ్రంథములు. కేటలాగు ఉచితము. ఇంగ్లీషులో వ్రాయండి.
N.K Paul & Sons, Post 12202, Calcutta-5.

# తెనుగుభాష వ్యక్తిత్వ వికాసాలు

శ్రీ కొత్త భావయ్యచౌదరి

మన దేశమున నుత్తరభాషలలో లేనియందు గాని లేని, ఎ, ఒ, చ, జ, ఱ, ఁ, అను నారు ప్రత్యేకాక్షరములను గలయుండి. 36 అక్షరములతో నుండిన తెనుగుబాసయే మన ప్రాచీనబాస— ఇది క్రమముగా ఆంధ్రముగా మారిపోయినదని చెప్పుటకు చాలినన్ని నిదర్శనములు గలవు

తెనుగు బాస మొదట ద్రావిడ భాషాకుటుంబములో పుట్టినట్లు చాలమంది విజ్ఞులమతము. కర్త, కర్మ, క్రియలు వాక్యములలో వరుసగానుండుట యొక ముఖ్యసాక్ష్యము. వత్తక్షరములు శషలు లేకుండుట మరియొకటి— దీని లిపిమాత్రము బ్రాహ్మిలిపినుండి సంస్కారముతో కైకొనబడినది. దీనినే తేల్ కన్నడ లిపియందురు. ఈ లిపికి పూర్వము తెలుగుబాసకు ప్రత్యేకలిపియున్న దృష్టాంతము లేమియు బయటికి రాలేదు. బ్రాహ్మిజన్యమైన లిపినిబట్టి తెలుగు బాససంస్కృత జన్యమనుట పొసగదు. ఈ క్రింది విషయములు గూడ దీనిని రుజావు చేయును.

ఆంధ్రరాజులు క్రీస్తుపూర్వము 2 శతాబ్దులనుండి పాలించుచువచ్చిరి. వారు ప్రాకృతభాషను రాజభాషగా తీసుకొనిరి. ఆ భాషలో 40 అక్షరములున్నవి. సంస్కృతమున నింకను మరికొన్ని యక్షరములుగలవు ఆంధ్ర రాజులకాలమున తెనుగువారికాంధ్రరాజులతో హెచ్చుసంబంధములు కలిగి, వారు తెలంగాణమంతయు పాలించుటవల్ల, వారి రాజభాషలోని పదములు చాల భాగము తెనుగువారికి పట్టువడెను. ఇట్లే 3 వ శతాబ్దినుండి పల్లవరాజుల పాలననుండి సంస్కృతము రాజభాషయగుటవల్ల సంస్కృతాక్షరము లన్నియు మనభాష కలవడినవి. ఋత్వములు 13 వ శతాబ్దినిగూడ మన కలవడకుండానుండుటవల్ల మన తెనుగుబాస వ్యక్తిత్వమును నిల్పుకొనుచుండినట్లు కనబడుచున్నది. 3.7 శతాబ్దుల మధ్యనున్న తెలుగు శాసనాలలో దాదాపన్నియు తెనుగుశబ్దములే. కొది సంస్కృత శబ్దములు కనబడుచున్నవి. 7 వ శతాబ్దిని విప్పర్ల శాసనము అట్లేయున్నది. దీనిలో ద్రావిడభాషా సంప్రదాయములు (శ మొదలైనవి) కొన్ని గోచరించుచున్నవి. అప్పటినుండి ప్రాకృత. సంస్కృత పదములకు తద్భవ, తత్సమ పదములుత్పత్తియై తెనుగుబాసలో జేరి, యాంధ్రభాష యని పేరొందినవి. ఐనను తెనుగుబాస తన వ్యక్తిత్వమును నిలుపుకొనుచునే వచ్చెను. అద్దంకి, బెజవాడలలోని పూర్వ శాసనాలలో తెలుగు పదములు విస్తారముగాగల పద్యములు, దేశిఛందస్సులు, ద్విపదలు, తరువోజలు సీసములు, గీతములు మొదలుగువానితో వ్రాయబడినవి గలవు. నన్నయ, తిక్కనలే గాక, తర్వాత కవులనేకులు తమ గ్రంథములం దచ్చటచ్చట తెనుగు పద్యములను రచించి, తెనుగుభాష స్వరూపమును నిలిపియున్నారు. అయినను వారాంధ్రభాషనే తీర్చిదిద్దినారు. 12, 13 శతాబ్దులలో నుండిన పాలకురికి సోమనాథుడు తన బసవపురాణములోను, పండితారాధ్య చరిత్రలోను జాను తెనుగు వాడుచున్నానని చెప్పి, తెనుగుబాసలోని పదములను చాలభాగము నుప్పించి వాడి, భాషకు మహోపకారము చేసియున్నాడు. ఆయన వాక్కునుండి భాష యెంతో వృద్ధియయ్యె ననవచ్చును. ఏలనో తెలుగుకవులు చాలమంది 13 వ శతాబ్దివరకు ఋత్వమును గైకొనక వృత్తి యను పదము వ్రిత్తియని వ్రాయుచుండిరి. అట్టివారికి సంస్కృత భాషాపరిచయము లేకపోయి యుండును.

తెనుగుభాష యనగా దక్షిణదిక్కు భాషయని యర్థము. మొదటి శాతవాహనులు దక్షిణాధిపతులని వ్రాసుకొనిరి. దక్షిణదిక్కు ప్రజలా పేరున పిలువబడుట సహజము. అందుచే తెనుగువారనబడి రనవలెను. కాని తెలుగు, తెనుగు పదప్రయోగములు 10వ శతాబ్దికి పూర్వ శాసనములందు గన్పడుటలేదు. అట్లని అప్పుడు తెనుగువారు లేరనికాని తెలుగుభాష లేదనికాని యనరాదు. దీనికి పైన నుడివిన విప్పర్ల శాసనము, మాలెపాటి శాసనము మొదలైనవి (7వ శతాబ్ది) ప్రమాణములు.

ఇతర భాషాపదములు రాచకీయ ప్రాబల్యమున మన భాషలో జేరినకొలదిని, పవయోరభేదః, లడయోరభేదః, రలయోరభేదః, అను వ్యాకరణ సూత్రములు మన యాంధ్రభాష కావశ్యక మయ్యెను. ప్రాచీన తెనుగుభాషను నాగులు, యక్షులు, దానవులు, తెలుగులు, కోలుజాతి మొదలగువారు వాడి యుండె వచ్చును. ఇంకను గొన్నిచోట స్వచ్ఛమైన తెనుగుభాష మాటలాడెదరు

కవులు చాలమంది తమ కావ్యములలో నచ్చ తెనుగు పద్యముల నెన్నో వ్రాసిరి. 16వ శతాబ్దివరకు దానిలో ప్రత్యేక కావ్యములను రచించలేదు. ఆ శతాబ్దిని పొన్నగంటి తెలగనార్యుడను తెలగన్న "యయాతి చరిత్రము" అను అచ్చతెలుగు కావ్యము రచించి తెలుగుభాష స్వతంత్రత్వమును నిరూపించెను. తర్వాత కూచిమంచి తిమ్మకవి మొదలగు వారట్లే రచించి, తెనుగుభాషకు మహోపకార మొనర్చిరి. ఈ కావ్య పరిశీలనమువలన తెనుగుభాష మొదటి స్వరూపమును, తద్భవ, తత్సమ పదవికాసమును, నన్నయాదులు తీర్చిదిద్దిన యాంధ్రభాషకు దీనికి గల భేదములును స్పష్టముగా గనపడగలవు. "ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్" అని "దేశభాషలందు తెలుగు లెస్స" యనెడి కీర్తి యీ యాంధ్ర భాషకే తర్వాత వచ్చినది.

నన్నయభట్టునకు సమకాలికుడు గానో, కొంచెము పూర్వికుడు గానో తలపబడుచున్న నన్నెచోడుడు కూడ ఆంధ్రభాష నె తన కుమార సంభవ కావ్యములో వాడియున్నాడు గాని అచ్చ తెలుగును వాడలేదు. కాని యందలి పద్యములు అచ్చ తెలుగుమాటలతో నిండి యున్నవి. నేటి కాలమున వాడుకలో వదలిపోవు చున్న అచ్చతెలుగు పదము లెన్నో పైన నుడివిన కావ్యములలో గ్రంథస్థములై యున్నవి. వత్తక్షరములు, శవలులేని యసంపూర్ణ శబ్దాక్షర బోధిత భాషగా యున్నను, శృంగారమునందే భావకును లేని మడికారము గల్గి, ప్రత్యేకాక్షరములు 6 తో నుండుటవలన మన తెలుగు ప్రాచీనభాషాస్వాతంత్ర్యమును నిరూపించును. ఆంగ్లేయభాష 26 అక్షరములతో నుండియు నెట్లు నేటికిని సర్వవిజ్ఞానమున కాలవాలమైనదో, మన యాంధ్ర భాషయు నేడు సర్వ సంపూర్ణ భాషయై 56 అక్షరములతో విలసిల్లుచున్నను, ఆంగ్ల భాషా స్థానమును బొందలేకపోవుటకు కారణము మన వాఙ్మయము సర్వవిజ్ఞానమున కాలవాలము కాకుండుటే. ఈ లోటును భాషాసేవకులు, వాఙ్మయ విజ్ఞానసేవకులు పూర్తిచేసి, క్రమముగా మన భాష నుద్ధరింతురని నా విశ్వాసము.

# త్రిలోచనుని 'తులసీదూత' కావ్యము

## శ్రీ వేదం వెంకటకృష్ణశర్మ

వంగదేశము పలువిధకావ్యములతోబాటు 'దూతకావ్యముల'ను గూడ సృష్టించినది. వానిలో ముఖ్యములయినవి—(1) మనోదూత (కర్త ఎవరో తెలియదు); (2) మనోదూతః (వైశ్యప్రభుని మేనమామ కూడు విష్ణుదాసుడు); (3) మనోదూత (వైష్ణ దాసవంశీయుడగు రామరామశర్మ); (4) ఉద్ధవదూత (మాధవకవీంద్రస్వామి); (5) హంసదూత (అజ్ఞాతకర్తృకము); (6) పాదాంకదూత (కృష్ణనాథ సార్వభౌముడు); (7) గోపీదూత (లంబోదర వైద్యకవి); (8) పాంథదూత (గంగాతీహూరి భోలానాథుడు) మున్నగునవి. సలక్షణ సంస్కృత వాఙ్మయమున ఈ దూతకావ్యములు మిక్కిలి యుత్తమరచనలుగా బరిగణింపబడుచున్నవి.

పై దూతకావ్యములలో జెక్కు లింకను బ్రచురింపబడలేదు. పరిశోధకులు వానిని సముపార్జింప బ్రయత్నించినట్లు లేదు. భావికాలమున నేని అందు జెక్కులు వెలువడవలసియున్నది.

ఈ సందర్భమున 'త్రిలోచనకవి'—విరచిత— 'తులసీదూత'—కావ్యమొకటి పేర్కొనదగినది కలదు. అదియు ఇంతదనుక బ్రచురింపబడలేదు.

బహుశః ఇది శాలివాహనశకము 1730 ప్రాంతమున రచింపఁబడినట్లు తోఁచుచున్నది.

ఇందు వ్రాయసకాని తప్పులు విశేషముగఁ గన్పట్టుచున్నవి.

కావ్యములోని విషయము వంగభాషలో వ్రాయఁబడిన తక్కిన కావ్యములలోని వాని వంటిదే. అనఁగా శ్రీకృష్ణుఁడు బృందావనమును త్యజించి, మథురకు గాఁగఁగానే, విరహవేదనా దోదూయమాన మానసలయిన గోపికాస్త్రీల పరిదేవనము లిందు వర్ణితములు.

బృందావనము నుండి తటాలున శ్రీకృష్ణుఁ డదృశ్యుఁడగుటచే, ఆ గోపిక లాకులపాటు చెందిన స్థితి వర్ణించుటతోఁ గథ ప్రారంభించును.

"నాథే, యాతే మధుపుర మతి
క్షోభవిభ్రష్ట చిత్తా
గోపీ కాచిత్కలయతి సఖీ
రన్తర్జ్ఞా స్వమీపే,
ప్రాణత్యాగా దధికగురుతరే
త్వస్యబన్ధో వియోగే,
కేన స్థేయం ముహురితివచో
వ్యాపిలా స్తా బభాషే॥"

కొందఱు గోపికలు స్థైర్యము లేని చిత్తవృత్తితో క్రుంగిపోయిరి. మఱికొందఱు శ్రీకృష్ణుఁడు దమ్మొకక్షణమేని, విడువ నొల్లనివాఁడగుటచే, ఆమాట నే నమ్మరైరి.

"మనోపాస్మాకం జాతుం నిబిడగహనే
నూన మధునా,
వసత్యేకో నాథః సఘనఘనబృం
దద్యుతిధరః,
నచాస్మాత్ప్రేమాబ్ధిం మధుపుర మగాత్
జాతు సహసా,
సముల్లంఘ్య ప్రాణ ప్రియతమ విభుః
పీతవసనః"

ఇంకఁ గొందఱు గోపికలన్నో — ఆ బృందారణ్యమున నే అహరహము శ్రీకృష్ణుని మీఁది వలవరముతో విహరింపసాగిరి. అందొకానొక వల్లవపలనాధ "శ్రీకృష్ణుఁడు దన కెవ రత్యంత ప్రియతములని పలుకునో, నిజమున కాపలుకు విశ్వాసయోగ్యము కాని యసత్యము. కనుకనే, అట్టి యసత్యవాది వాక్యములకు వేదముల నతఁడు యోగీంద్రులు సహితము నమ్మునట్లు చేయుట మిక్కిలి యక్కజమగు కార్యము. అట్టి ప్రత్యయము వారికిఁ గలుగుటకుఁ గారణమేమన : అవి కేవలము శ్రీకృష్ణ ముఖోద్గతము లగుటయే. ఇఁక, ఆ యోగివర్గము నే యనుసరించు వారును శ్రుతుల విశ్వసించుటలో నబ్బురమేమి గలదు? — అని నిశ్చయించుకొన్నది.

"నాస్తి కించిత్ప్రియతమ భవే
గుప్త మేతత్త్వదగ్రే,
వ్యక్తం చైతన్మమతు భవతా
బంధునా పూర్వ ముక్తమ్,
శ్రుత్వా మానం వచన మధునా
బంధునా పూర్వ ముక్తమ్,
ప్రామాణ్యం తే వచసి నపున
ర్జాయతే సజ్జనానామ్."
"అప్రామాణ్యం శ్రుతిషు బహుభి
ర్మోఘతే త్వద్వచస్త్వ,
దాప్తై రంతర్వ్యతిథవనవే
వీక్ష్య దృష్టాన్తతాఖ్వ,
పశ్చాత్తేషాం కథమపి జనా
నా మపి స్వర్గహేతో,
ర్యాగే వృత్తిర్నభవతి జరా
న్నాథ, నైతత్స్వయుక్తమ్"

ఈ తెలుఁగున వాపోవు గోపికల కంట బృందావనమున నేఁపుగఁ బెరిగిన తులసిమొక్క యొండుగపడెను. వారు, దానినే శ్రీకృష్ణుని చెంతకు దూతిగఁ బంప నుత్సహించిరి. లక్ష్మీదేవికంటెఁ దులసియే శ్రీకృష్ణున కత్యంతముఁ గూర్చు ప్రియురాలనియు, నామెనే మథురానగరమున కంప నర్థించుచో, స్త్రీస్వభావ సిద్ధమగు జాలిగుండెతో నందుల కంగీకరింపఁగలదనియుఁ, దప్పక మరల శ్రీకృష్ణుని బృందావనమునకుఁ దోడ్కొని రాఁగలదనియుఁ దీర్మానించికొనిరి.

"త్వఙ్గాధిక ప్రియతమా
తులసీ శ్రియో౽పి
జానీమ ఏవ కిల జనస్వత ఏవ
తస్మాదతి ప్రియకరీ భవతీ సఖీనో
నూనం త్వయా మధుపురీ
గమనం విధేయమ్."

ఇక నొక్కయంశము ముఖ్యముగ గమనింపదగి యున్నది:— తాను అత్యంతము ప్రేమించిన పురుషుఁడు తనకుఁ దక్క ఇతరాంగనల కనుభవయోగ్యుఁడు గాఁ గూడదు. అట్లగుచోఁ బ్రాణత్యాగమున కయిన సిద్ధపడునట్టి యీర్ష్యాసూయా పరవశురాలు భారత నారీమణి. ఒక పారిజాత ప్రసూన కారణముగ జనించిన సత్య యీర్ష్య, ఆమెచే "ననవిచ్చి పుచ్చుకొన్నను మనవచ్చునె" అని శ్రీకృష్ణుని విషయమున బలికించినది. సవతిమీఁదను ఆమెకొనయుఁడగు శ్రీరాముని మీఁదనుగల మచ్చరమున కైక శ్రీరామునికి వనవాసమే విధించినదకదా! అట్టిచో గోపికల వేఁడికోలు వంగి

కరించిన శ్రీకృష్ణప్రియా, అక్రౌర్యమునకుఁబూనుట ఎంత అసంబద్ధమో, వారామె వంగుల కర్షించుటయు నంత అసంబద్ధమే యగును. ఇది విషయాంతరము. ప్రకృతము మన తెలుఁగునాటఁ గూడఁ గొందఱు స్వతంత్రదూత కావ్యరచయితలు లేకపోలేదు. ఇరువదియైదేండ్ల నాటిమాట:— తిరుపతి దేవస్థానమువారి ముద్రాక్షరశాల మునరాసున నున్నప్పుడు— దాని యధికారిగ నియమింపఁబడియుండిన శ్రీ నైవనాచార్యులుగారు ఒకరు ఒక దూతకావ్యమును రచియించిరి. నేనాతని దర్శించుట తటస్థపడఁగా, అందలి శ్లోకములను గొన్నింటిఁ జదివి వినిపించిరి. వారప్పటికే అఱువదేండ్లు దాఁటిన వృద్ధులు— అనన్యతిముగు సంస్కృత గీర్వాణమున హృదయాకర్షకముగు శయ్యలో సాగిన యా కావ్యము పేరిప్పుడు మఱచితి. కాని మన భరతఖండమునందలి సుప్రసిద్ధ స్థలముల నన్నింటిని — వారు ప్రదక్షిణముగ వర్ణించుచుఁ బోయిరి. మిక్కిలి రసవత్తరముగు ఆ కావ్యమును తిరుపతిలోని సాహిత్యవిదులు సంపాదించి ముద్రించుచో నెంతేని భాషాసేవ, దేశసేవ— చేసిన వారగుదురు.

ఆంధ్రమున వచిన వృత్తములతో మిత్రులు— సుప్రసిద్ధ సారస్వతసేవాపరాయణులు, శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులవారును 'మేఘదూత' మను పేరితో నే రచించి ప్రకటించిరి. అందు మన యాంధ్రదేశమందలి వివిధ చారిత్రక, పుణ్యస్థలములు అత్యంత మనోహరములుగ వర్ణింపఁబడినవి. తప్పక యిది తెలుఁగుజాతి ఆదరింపఁదగిన యుత్తమ కావ్యము.

ఇంకను ఈ 'దూతకావ్యము'లవంటి వెవరయిన మహారాష్ట్రమున వ్రాసిరేమో, తెలియకున్నది.

ఈ తెగకుఁ జేరిన కావ్యములు కేవలము వియోగావస్థలో నాయికానాయకుల మనోవేదనముల నుగ్గడించు శృంగారకృతులని యనఁదగును. మఱి వియోగము సయితము యొక శృంగారభేదమే గదా!— తన్ను నెడబాసిన ప్రియునకుఁగాని ప్రియుఁడు నాయికావస్థలో నెవేదనో మనువును తెగిన దూతను గని తన ప్రియురాలికి సందేశమంపును. ఏతన్మధ్యమున ఆదూత యే యే దేశములను అతిక్రమింపవలెనో. యే యే ప్రదేశముల నే యేయంతలు చూడఁదగినట్టివో వాని నన్నిటిని విస్పష్టముగ వర్ణించి చెప్పును.

ఒకవిధముగ నిది భూప్రదక్షిణము చేయువారెఱుఁగవలసిన భూగోళశాస్త్రవిమర్శన మనుటలో సందియము లేదు. అయినఁ బ్రాచీన కాలమున నది మన భారతదేశమునకే పరిమితమయినది. అంతకంటే వారికిఁ దెలిసినది.

విరహశృంగారమునే దాదాపు దూతకావ్యము లన్నియు వెలయించినను కొన్ని యంగములను భిన్నములు సహితమున్నవి; వాల్మీకి రామాయణమున సుగ్రీవుఁడు వానరసమూహములను సీతాన్వేషణార్థము నలుదెసలకుఁ బంపుచో ఆయా కందని ప్రదేశములవఱకు వారికి వర్ణించి చెప్పును. నగరగ్రామములు, దుర్గములు వగు చోటులను సూచించును. అందుఁ గొన్ని యనూహ్యములును విశ్వాసపాత్రములు గాకున్నవి.

కవికులచక్రవర్తి కాళిదాస మహాకవి కిది యొక నడిశయయి యుండవచ్చునేమో, కాని అతని పంథా వ్యాప్తము వేఱొక తప్పదు. వియోగశృంగారమునకు ప్రాధాన్య మొసఁగుటచే, నూత్నభావోల్బణోద్గత కావ్యరీతులను అతని 'మేఘదూతము'— సంతరించుకొన్నది. ఇఁక దాని తరువాతి 'దూత' కావ్యములెల్ల పిల్లవసు చరిత్రలవంటి వని నుడువుటలో నతిశయము లేదు.

ఇప్పటికిని దూతకావ్యములకుఁ గల ప్రాముఖ్యమును గుర్తించి, ప్రభుత్వ్రీయము గల పరిశోధకులిట్టివానిఁ బ్రకటించి, వాని నజరామరములుగఁ జేయుట తమ ధర్మమని గుర్తించుట శ్రేయస్కరము.


# భారతి సచిత్ర మాసపత్రిక

## ప్రకటన రేట్లు

| కవరు పేజీలు | కాజువల్ | కంట్రాక్టు |
|---|---|---|
| 4 వ కవరు పేజీ | | |
| 2 లేక 3 రంగులు | రు. 125/- | రు. 100/- |
| 2 లేక 3 వ కవరు పేజీ | | |
| ఒకే (నలుపు) రంగు | 90/- | 75/- |
| లోపలి పేజీలు | | |
| పూర్తి పేజీ | 70/- | 60/- |
| అర్ధ పేజీ | 35/- | 30/- |
| పావు పేజీ | 20/- | 15/- |

ప్రత్యేక స్థానములకు 25% అదనం.

సంవత్సరము వరుసగా 12 ప్రకటనలు చేయు వారికే కాంట్రాక్టు రేటు వర్తించును.

* కవులు, కళాకారులు, రచయితలు మొదలైన వారి ప్రకటనలు ఒక కాలం ఇంచికి కేవలం రు. 2/- చొప్పున ప్రకటించబడును.

మేనేజరు, భారతి,
మద్రాసు-1.

# గ్రంథ విమర్శనము

## పతివ్రతా చరిత్రము

ప్రకాశకులు: గవర్నమెంట్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీ, మదరాసు. వెల: నాలుగు రూపాయల ఇరవై ఐదు పైసలు.

ఇది ద్విపదరూపంలో ఉన్న 312 పుటల ఉద్గ్రంథం. దీనిధోరణి చూస్తే ఇది తెలుగులో కథా సరిత్సాగరం వంటి గ్రంథమేమోనని అనిపిస్తుంది. రచన అంతా ద్విపదలో సుసంస్కృతము, శిష్టము అయిన ప్రబంధశైలిలో సాగింది.

కథాకథనం కదిరీపతి శుకసప్తతి ధోరణిలో నడిచిపోయింది. అయితే శుకసప్తతి కేవలం శృంగార ప్రధానమయిన కావ్యం. కాని ఇది పతివ్రతామతల్లుల పునీతచరిత్ర లభిస్తుంచే సుదీర్ఘ కావ్యం. కొన్ని కథలు పేర్కొన్న ఈ కావ్యంలో కథలు కొన్ని కథాసరిత్సాగరము, ద్వాత్రింశత్సాలభంజిక, భోజరాజీయము మొదలయిన గ్రంథాలలో నుంచి సేకరించబడినట్లు కనబడుతున్నాయి.

అయితే ద్విపదలో ఈ విధమయిన కథా కావ్యం ఆంధ్ర వాఙ్మయంలో మరేది కనబడదు. ఆ విధంగా ఈ గ్రంథం ప్రాచీనాంధ్రవాఙ్మయంలో విశిష్టమయినది.

ఈ గ్రంథప్రచురణకోసం ఉపయోగించిన తాళపత్రప్రతులలో కవి నామధేయము, కులగోత్రాలు లుప్తమైపోయాయి. ఇందుచేత ఈ గ్రంథకర్తృత్వం గాని, గ్రంథకాలం గాని నిర్ణయించడానికి వీలులేక పోయిందని సంపాదకులు తెలియజేస్తున్నారు. శిష్టము. ఉదాత్తము అయిన గ్రంథశైలినిబట్టి చూస్తే గ్రంథకర్త ఇంచుమించుగా ప్రాచీన ప్రబంధకాలానికి తిరువాతివాడని నిశ్చయించవచ్చును. అయితే ఇది కేవలం ఊహామాత్రమే.

ఆంధ్రదేశంలో మారుమూల గ్రామాలలో కొన్ని చోట్ల తాళపత్రి గ్రంథాలింకా అజ్ఞాతంగా అడుగున పడి ఉండవచ్చును. మన అదృష్టవశాత్తు అటువంటి తాళపత్రి గ్రంథాలలో పతివ్రతా చరిత్ర ప్రతి కూడ ఒకటి లభిస్తే లభించవచ్చును. పాఠకు లెవరయినా ఈ విషయంలో సహకరించగలిగితే ఆంధ్ర వాఙ్మయానికి అపూర్వమైన సేవ చేసినవారవుతారు.

ప్రస్తుత పతివ్రతా చరిత్రము కవి నామాది విషయంలోనే గాక కథలలోగూడా కొంతవరకు అసంపూర్ణంగానే ఉన్నది.

అయినా గ్రంథప్రాశస్త్యాన్ని బట్టి ఇది తప్పక ప్రకటింప వలసిన గ్రంథం. ప్రకాశకులు, యథాశక్తిగా నిర్దుష్టంగా ప్రచురించిన సంపాదకులు అభినందనీయులు.

'శాస్త్రి'

* * *

## మహోదయం

### [నేపథ్యగేయ రూపకము]

జమదగ్ని. ప్రకాశకులు. శ్రీ శివానంద తరంగిణి. తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు. మునిరామ వీధి కడప. వెల. రూపాయిన్నర.

ఆంధ్రులలో అనైక్యం పరిహరించి ఐక్యం పెంపొందించడమే ఈ గేయ రూపకం లక్ష్యం. గోదావరీసీమ, కృష్ణాసీమ, పెన్నాసీమ, తుంగభద్రాసీమ, మంజీరాసీమ, తమ వైభవాన్ని చాటుతూ అహంభావాలతో ఎలుగెత్తి గానం చేస్తాయి. అయితే అర్ణవఘోష ఈ సీముల ప్రత్యేక ఘోషలన్నీ తనలో ఐక్యం చేసుకోవడానికే ప్రయత్నిసుంది. అవిధంగానే ఉద్బోధిస్తుంది. ఆకాశవాణి చిట్టచివరికి ఈ వేర్వేరు ప్రాంతీయాహంకార వేశాలు కూడదనీ ప్రత్యేక వ్యక్తిత్వం నిలుపుకుంటూ అందరు చేతులుకలిపి ఏకకంఠ్యంతో ఐకమత్యంతో మెలగాలనీ ప్రబోధిస్తుంది. సంగ్రహంగా ఈ రూపకంలో విషయం ఇది.

రచయిత దీనిలో పద్యాలతో బాటెక్కువగా గేయాలుకూడా వాడారు. ఈ గేయాలు, పద్యాలు భావానుగుణంగా నడిచిపోతూ మొత్తం రచనకు ఒక విశిష్టత చేకూరుస్తున్నాయి. పాఠశాలలోను, కళాశాలల్లోనూ ఉత్సవములలోను, సంగ్రహంగా ఉన్న ఈ నేపథ్య రూపకం గానాభినయాలకు, ఆంధ్రజాతిలో అనైక్య పరిహారణకు ఎంతయినా ఉపకరింపగలదు.

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambbu Prasad.

సిద్ధార్థ



రూ. 1.25

# గొప్ప కల్పనాసాహిత్యము



రూ. 2.75




రూ. 1.50




రూ. 1.50



రూ. 1.00

పద్యకావ్య నిక్షేపములు, నాటకాలు, యాత్రాగాథలు.

ప్రపంచమును అవగాహన చేసుకొనేందుకు సహాయపడు ఉత్తమ గ్రంథములు.




రూ. 1.50



రూ. 1.50



రూ. 2.50

రూ. 1.25



రూ. 1.00



ప్రతియింట ఉండదగిన గ్రంథాగారము. చౌక ధరలలో మంచిపుస్తకములు.

మీరు మామూలుగా కొను పుస్తక వ్యాపారివద్ద ఈ శ్రేష్ఠమైన పుస్తకములను కొనండి. లేనియెడల మాకు వ్రాయండి.

## సదరన్ లాంగ్వేజస్ బుక్ ట్రస్ట్.

3, వీట్ క్రాఫ్టురోడ్-మద్రాసు-31.

పై పుస్తకములు అన్ని అనేక ప్రత్యేక ప్రచురణకర్తలచే, లాభాకాంక్షలేని సదరన్ లాంగ్వేజస్ బుక్ ట్రస్టు వారి ఆధ్వర్యమున ప్రచురింపబడినవి.

# భారతి

సాహిత్య మాసపత్రిక



అక్టోబరు 1958

వెల ఒక రూపాయి

# భారతి




సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

అక్టోబరు 1958

సంపుటము 35 : : సంచిక 10

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## అక్టోబరు 1958

వైజయంతిమాల · పద్మిని వీరిని
అత్యున్నత స్థాయిలో చూడండి

జెమినీ చిత్రం

# విజయకోట

...తెలుగు...

# వీరుడు

అక్టోబర్ 2 మొదలు ఆంధ్ర దేశమంతటా......





# అమృతాంజనము

ఎంత భయంకరమైన
కాలి నొప్పి నైనా క్షణంలో ఉపశమింప
జేస్తుంది

లక్షలాది ప్రజలు 1893 నుంచి దేశమంతటా అమృతాంజనాన్ని వాడుతున్నారు. అమృతాంజనము బెణుకులు, వాపులు, తలనొప్పి, పళ్లపోటు, జలుబులు, దగ్గులు మొదలైన వాటిని ఉపశమింపజేస్తుంది.

అమృతాంజనము
అన్ని నొప్పులకు
దివ్యామృతము.






అమృతాంజన్
లిమిటెడ్.
మద్రాసు-4, బొంబాయి-1. కలకత్తా-7.

AL.36.4

ప్రతి ఆదివారం రాత్రి 6-30 గం॥ లకు 41 మీటర్లమీద రేడియో సిలోన్‌లో దక్షిణ భారతభాషలన్నింటిలో వెలువడే ఔత్సాహిక కళాకారుల ప్రోగ్రామ్, అమృతాంజలి వినండి.

# నిర్వేదము

శ్రీ బొడ్డుపల్లి పురుషోత్తం

ఎచ్చట నుంటివయ్య పరమేశ్వర! వీనిని కావ్యలోక మం
దిచ్చకువచ్చినట్లు విహరింపగ నీయక సేవకత్వమే
పుచ్చుకొనంగ నాజ్ఞ నిడబూన, రసాబ్ధులు నీపదమ్ములం
విచ్చిన సన్నజాజియరవిందములన్ గొలువంగ నెట్టులా॥

భాగ్యముతోడ నీచరణ పద్మములన్ సతతమ్ము గొల్వగా
యోగ్యతఁగల్గ నిచ్చిన మహోజ్జ్వల నూతన సత్కవిత్వ సౌ
భాగ్యమునం దుదాత్త రసవార్నిధి తేలెదగాని, పట్టిదా
ర్భాగ్య జగమ్మునన్ నిలువ వచ్చునె? యేకనిమేషమాత్రకై॥

ఆశయముల్ హిమాలయ శిఖాగ్రములన్ బురుడించుగాని, నన్
ఏ శని పట్టెనో మొదటి కేనియు నించుక చేరలేక, నా
యాశల నీటఁగల్పుకొని యంధుడనై యిట కూలియుంటినో
ఈశ! పరేశ!! నన్ను కరుణించి యొసంగుమ పూర్వసంస్కృతిన్॥

ఈ యెద నొక్కమారు పరికింపుము, నాదు దురంత వేదనన్
వ్రాయఁగజాల పద్యముల స్వామి! అశక్తుడ నంచు తెల్పగా
నా యభిమానమున్ వదలినాడను లే!! యిక శంక లేల, నే
నీ యనురాగ గీతకమనీయసుధారసమానెదన్ ప్రభూ॥

ఈ గుదిబండ దాల్చి యిక యెన్ని దినాలని జీవితమ్ము నే
లాగగలాడ తండ్రి? కనులం జలియించుచునుండె ప్రాణమే
లాఘుననైన బ్రోవగ తలంపనిచో నినునమ్మ యేని నే
నాగగ జాలనట్టి చలితాత్ముడ నైతినయా! పరాత్పరా॥

ఆశరదిందు చంద్రికల ఆసిక తాతలవేది జేరి నా
ఆశల నెల్ల నీకు తెలియంగ కవిత్వమునల్లి, అల్ల ఆ
కాశమునందు తారకల గానముతో శ్రుతిగల్పునట్టి భా
గ్యాశయ మబ్బునయ్య పరమాత్మ!! నిమేషపు జీవితమ్ములో॥

## భారతి

ఆశయహీన జీవితమె హాయిగ నున్నటు తోచు, వెఱ్ఱి యా
వేశము పెచ్చుమీర వినువీధిని సౌధము పైన సౌధముల్
కౌశల మొప్పగట్టితి సుఖమ్ముగ నుందమటంచు, నింతలో
రాశిగఁ జేసి యన్నిటి పరాత్పర!! రంజిలుచుందు వాత్మలోన్॥

నీవే నేనయి నేనె నీవయగుచున్ నిత్యప్రబోధమ్ముతో
భావావేశ రసైక జీవిత సముత్పన్న ప్రమోదమ్ముతో
నీ విశ్వమ్మున నుండు భాగ్య మది లేనే లేక యల్లాడు నే
నీ వాత్సల్యరసమ్ము నానుటకు తండ్రీ! ఎంతో కొట్టాడెదన్॥

జీవిత మగ్గలం బగుట జీవికయంత్రమునందు జిక్కి, నా
నా విధమైన యాతనల నల్గి కృశించితి తండ్రి! నూత్న సం
జీవని నిచ్చి సంస్కృతి విశేష సమంచిత దివ్యమార్గ సం
భావితుఁ జేయ వేడెద కృపారస వీక్షణ! సాధురక్షణా॥

నాదు జీవిత మనెడి విషాద గీతి
నీవు రచియించి నా కిడినావు గాని
శిథిల మాట ఆలాపన సేయజాల
దీ హృదయవీణ, నీవు ప్రేమించునటుల॥

ఎన్నటికినైన వికసించు నీ యెడంద
మొగ్గయని తలంచితిగాని మోసపోతి
అమిత కఠిన కర్కశహృదయమ్ముతోడ
తొడిమవఱకును దీనిని త్రుంచినావు॥

ఏమి మాటగట్టెదవు? కానిమ్ము సామి!
ఆగిపోవదు క్షణమాత్రమైన జన్మ —
ఈ విషాదాశ్రువులను జీవించువాడ
సతతమును నీదు నామసంస్మరణతోడ॥

# సుచిత్ర ప్రణయం

శ్రీ డి. బాలగంగాధరతిలక్

**పాత్రలు:** శేఖరం, రంగనాథం, రామనాథం, పంతులు, సోమయాజులు, సుచిత్ర.

## రంగము - 1

** ఒక ఊళ్లో ఒక విశాలమైన రోడ్డు. బహుశా అటువైపు మూడు నాలుగిళ్ల కన్న ఎక్కువ లేనందువలన కాబోలు ఆరోడ్డు మీద జనసంచారం చాలా తక్కువగా ఉంది. రోడ్డున ప్రక్కగా శేఖరం నిలబడి, సిగరెట్ కాలుస్తూ ఎవరికోసమో నిరీక్షిస్తోంటాడు. ఖరీదైన పాంటూ షర్టూ టక్ అప్‌లో ఉంటాడు. శేఖరం స్ఫురద్రూపి. అతనిలో ఆడంబరమూ, చొరవా తెగింపూ వ్యక్తమౌతూంటాయి. ఎంత అణచినా అణగని ఉత్సాహమూ, ఎన్ని కష్టాలు వచ్చినా నశించని ఆశావాదమూ (Optimism) అతని తీరుకీ ప్రవర్తనకీ ఒక ఆకర్షణని కలిగిస్తాయి. అతను అలాగ ఎవరికోసమో చూస్తూ నిల్చుంటే, వెనుకనుంచి అతని మిత్రుడు రంగనాథం వస్తాడు. పాంటూ బ్లౌజూ ధరిస్తాడు. శేఖరం కన్న ఒకటి రెండు సంవత్సరాలు పెద్ద.

కాలం: ఉదయం ఎనిమిదీ తొమ్మిది గంటలకి మధ్య:

రంగ: (వీపుమీద చరుస్తూ) హలో శేఖర్. ఇక్కడ నిలబడ్డావేం రోడ్డుమీద.

శేఖరం: (ఉలికిపడి) హారి నువ్వట్రా రాస్కెల్. ఇంకా యింటాయనేమో అనుకున్నాను అద్దె కోసం దండం పెడ్తున్నాడు రాత్రీపగలూ. అందువల్ల మూడురోజులనుంచీ రూమ్‌కి వైర్ హాజరు కొట్టేస్తున్నాను.

రంగ: అలాగా! అయితే ప్రస్తుత మకాం ఎక్కడ.

శేఖరం: పగలంతా జాతీయ ప్రభుత్వంవారి రోడ్లు, పార్కులు. రాత్రుళ్ళు క్లబ్బులు నీలాంటి మిత్రుల లాడ్జీలు. 'విశాలాకాశం పైకప్పు' అన్నాడు భవభూతి అనే ప్రాచీన కవి శేఖరుడు.

రంగ: (ఎగా దిగా చూసి) మంచి టిప్ టాప్‌గా ఉన్నావు ఏదైనా ఉద్యోగం దొరికిందేమిట్రా!

శేఖరం: ఎవడికావాలురా నాకు ఉద్యోగం. తలవొంచి శ్రమపడి పనిచేసే బాపతంటావా నేను ఇంతా శ్రమపడితే నెలకి ఓ ముష్టి వందరూపాయల జీతం!

రంగ: ముష్టి వందరూపాయలా ధనిః సార్వభౌమా!

శేఖరం: అందులోనూ యౌవనంలో, ఆనందంతో, ఆశలతో మిసమిసలాడే ఈ జీవితాన్ని గుమాస్తాగిరీకి బలియివ్వడం మహాపాపంరా రంగడూ! ఒరేయ్! మన లెక్క ప్రకారం నలభైఏళ్ళు వచ్చేవరకూ మానవుడు కష్టపడకూడదురా! ఆ పైన మన దేశాచారం ప్రకారం వృద్ధుడైపోతాడు కాబట్టి ఎలాగూ కష్టపడలేడు. కాబట్టి జీవితాన్ని నిరంతరసుఖప్రదం చేసుకోవాలనే థియొరీ మనం కనిపెట్టిందేలే!

రంగ: హారి నిన్ను తగలెయ్య! పూటకి టికాణా లేదు. బి. ఎ. ప్యాసై వీధులమ్మట గాడిదలా తిరుగుతున్నావు మరి నీకీ తిండీ బట్టా ఎవడు సప్లయి చేస్తున్నాడురా మరి.

శేఖరం: (సిగరెట్టు దమ్ము గట్టిగా లాగి) ఒరేయ్ రంగడూ నా జీవితసూత్రం నీకు విశదపర్చి చెప్తా

లంటే ఒకరోజు, అది నీకు అర్థంకావాలంటే ఒక సంవత్సరం, దాన్ని నువ్వు అమలులో పెట్టాలంటే ఒక శతాబ్దం పడుతుందిరా మై డియెర్! కాబట్టి మూడుముక్కల్లో చెబుతాను విను. జీవించడమనేది ఒక కళ. ఆ కళని ఆధారం చేసుకుని మూడు ఉపకళ లున్నాయి. ఒకటి అప్పుచెయ్యడం, రెండు అబద్ధాలాడడం, మూడు వేషభాషలు. ప్రస్తుత నా నిరుద్యోగ నిర్వాస నిరాహారదిశలో ఈ మూడింటిలోనూ గొప్ప ఎక్స్‌పర్ట్ నైపోయాననుకో.

రంగ: నిజం!

శేఖరం: నిజం. (విషాదంగా) యేం చెయ్యమంరా బ్రదర్. చెడ్డవాణ్ణి అనుకోకు. మనలాంటి మధ్య తరగతి యువకులకి యింతకన్న ఆస్కారం ఏముంది. గౌరవంగా స్వేచ్ఛగా జీవించేందుకు మార్గాలులేవు. అలాగ అని స్వతంత్రాన్నీ హృదయాన్నీ చంపుకొని, ఆశయాల్నీ ఆశల్నీ కట్టకట్టి సైకు కాలవలో పారేసి జీతం డబ్బులకోసం బ్రతకడమనేది–మై గాడ్–నేనూహించలేనురా.

రంగ: అవునుగాని నీకు అప్పు ఎవడిస్తాడంటా? నూట యాభైరూపాయల నికరమైన మాసిక సంపాదన వున్న నాకే పుట్టదు.

శేఖరం: అందుకే అప్పుచెయ్యడం కూడా ఒక కళ అన్నానురా మిసర్. మాటవరసకి మన ఫ్రెండు గజపతిని ఎరుగుదువా?

రంగ: తెలియకేం—ఆర్ అండ్ ఆర్ ఫరమ్‌లో పని చేస్తున్నాడుగా.

శేఖరం: వాడికి నువ్వంటే ఎంత గురీ, ఎంత గౌరవమూ, ఎంత విశ్వాసమూ ప్రయోజకుడివనీ తెలివైనవాడివనీ...

రంగ: అవునవును. పాపం వాడికి నేనంటే అమిత అభిమానం.

శేఖరం: అవునా! మొన్న నే నేం చేశానో తెల్సునా. అర్జంటు అవసరం వచ్చింది. ఒక్క పాతిక వుంటే యివ్వరా బ్రదర్, మన రంగడు నా కివ్వవల్సిన పాతికా నీకు విలియా వేస్తాను, పాపం వాణ్ణి ఈ సెలాఖరు రోజుల్లో ప్రెస్ చెయ్యడం నా కిష్టం లేదురా అని ఓ పాతిక రూపాయలు సంపాదించాను.

రంగ: (తెల్లబోయి) నేను నీకివ్వాలనా? నీ మొహానికి నాకు అప్పుపెట్టే స్తోమతుకూడా వుందా! ఏం గుండెలురా నీవి. ఎంత అబద్ధం, పచ్చి నల్లని అబద్ధం.

శేఖరం: అబద్ధం నల్లగా ఉండదురా భాయ్. జర్మనీ సిల్వర్‌లా తళతళమని మెరుస్తూ నిన్ను లోబరుచుకుంటుంది. సత్యం నిజంగా నల్లగా ఎక్కడో మూలపడి ఉంటుంది.

రంగ: ఇంత ఘోరంగా ప్రవర్తిస్తావనుకోలేదురా.

శేఖ: ఖంగారు పడకురా రంగడూ. ఆపదలందు ధైర్యమన్నాడు భర్తృహరి అనే అమెరికన్ పొయెట్.

రంగ: నేను వెళ్ళి గజపతికి నువ్వు చేసిన మోసం చెప్పేస్తాను.

శేఖ: చెప్పవూ! చెప్పినంత మాత్రాన తల తీసేస్తాడా ఏమిటి—ఇంతకీ స్నేహితులంకదా! ఔనుకాని బ్రదర్ ఒక్క అయిదు రూపాయలుంటే... (చెయ్యి చాపుతాడు.)

రంగ: (కంగారుగా) ఒరేయ్. నాకే మస్కా కొట్టుతున్నావేమిటి.

శేఖ: సారీ (నవ్వేస్తాడు.) అలవాటు చొప్పున అడిగేశాను. 'తివిరి యిసుమున తైలంబు తీయవచ్చు, కుందేటికొమ్ము సాధింపవచ్చు కానీ చంపినా చచ్చినా రంగనాథునినుండి కానీ రాలదెపుడు' అన్న లోకోక్తి ఊరికే పోతుందా.

రంగ: థాంక్స్. డబ్బుదగ్గర మనకి చాలా గట్టి అనుభవముంది మిత్రమా!

శేఖ: (ఇటూ అటూ చూసి) ఒరేయ్ రంగడూ. ఇంక నువ్వెళ్ళిపో.

రంగ: ఏం యిక్కడ నిలబడకూడదా.

శేఖ: ప్లీజ్ ఆ అమ్మాయి వచ్చే వేళయిందిరా.

రంగ: అమ్మాయా! ఎవరా అమ్మాయి? ఎవరి అమ్మాయి. తదితర గుణగణాలేమిటి. సవిస్తరంగా చెప్పు.

శేఖ: సుచిత్ర.

రంగ: సుచిత్ర! లక్షాధికారి రామనాథంగారి అమ్మాయి!

శేఖ: ఎగ్జాట్లీ.

రంగ: అయితే?

శేఖ: ఇంకా నీకు తెలియదురా రంగడూ. నువ్వే లోకంలో ఉంటున్నావో నాకు అర్థంకావడం లేదు. భవదీయుడు శేఖరంయొక్క జీవిత చరిత్రలోని యీ గొప్ప అధ్యాయాన్ని విస్మరించావని తెలిస్తే—భావి చరిత్రకారులు నిన్ను మెచ్చరురా.

రంగ: అసలు సంగతి ఏమిటో ఏడుద్దూ.

శేఖ: ఆ అమ్మాయిని నేను ప్రేమిస్తున్నాను. కాలేజీ వదలిన మరుక్షణంనుండీ యిదే మన జీవితాశయం. నువ్వొక్కడివితప్ప యీ విషయం తెలియనివాడు మన దేశంలోనే లేడు.

రంగ: అదేదో ప్రేమించడం అనే పని చేస్తున్నావని తెలుసునుగాని నీ ప్రేమకి లక్ష్యమైన దురదృష్టవంతురాలెవరో తెలియదు. అయినా, నువ్వెందర్ని ప్రేమించెయ్యచ్చును. ఖర్చు లేని వ్యవహారం.

శేఖ: ఇదా నువ్వు చెప్పేది. అసల నీకు ప్రేమంటే ఏమిటో తెలుసునా! ఆ ప్రేమించే తాహతూ, హృదయమూ నీకు ఉన్నాయా? నువ్వు కీట్సుని కృష్ణశాస్త్రినీ చదివావా? రాత్రిళ్ళు మల్లెపూలు వాసనచూస్తూ ఏడుస్తూ పక్కమీద దొర్లావా! పోనీ ఎప్పుడేనా చంద్రోపాలంభన అయినా చేశావా! కరడుగట్టిన గుండెగల నువ్వు నా ప్రేమని నిరసించడం అంధుడు సూర్యకాంతిని ఆక్షేపించినట్టు ఉంటుంది.

రంగ: నా మాటకేంకాని, ఏదేనా ఫలితం కనపడుతోందా!

శేఖ: ఆ అమ్మాయి చాలా బెట్టుగా వుంటోంది. ఎన్నో లవ్ లెటర్సు వ్రాశాను. మా నాన్నకి చెబుతాను, మా ప్రిన్సిపాల్‌కి చూపిస్తాను అని బెదిరిస్తుంది. కాని ఏ ఒక్కటీ చెయ్యలేదు. ఆవిడకి మనం అంటే యిష్టమున్నట్టు అదే దాఖలా అనుకో.

రంగ: అనవసరంగా తానుకూడా రచ్చకెక్కవలసి వస్తుందనే భయంవలన ఆమె గప్‌చిప్‌గా ఊరుకుని వుంటుంది. కాక, అది నీ మీద ప్రేమగా భావిస్తే నీ కామన్‌సెన్సునిగురించి సందేహించవలసి వస్తుంది.

శేఖ: స్త్రీ హృదయం నాకు బాగా తెలుసునురా మిస్టర్! ఆమె పైకి చూపే విముఖత, కోపం వెనుక ఎంత ప్రేమవుందో, ఆమె ప్రవర్తనా, స్వభావమూ చెప్తూనే ఉన్నాయి. ఒరేయ్ బ్రదర్! ఒక్కొక్క ఆడది ఒక్కొక్క రకం కళ అనుకో. ఎవర్ని ఎలా మీటి పలికించాలో అదొక బ్రహ్మాండమైన కళ. ఆడది మంచి గంధం చెక్కలాంటిది. గంధం చెక్కని రాయగా రాయగా గంధాన్నిస్తుంది. అలాగే ఆడదాని చుట్టూ తిరగా తిరగా ఓ ఫైన్ మార్నింగున 'ఏమండోయ్. మిమ్మల్ని నేనూ ప్రేమించేస్తున్నాను' అని చటుక్కున అనేస్తుంది

రంగ: నువ్వు వట్టి స్వాప్నికజీవివిరా శేఖరం. కథలు వ్రాయడానికి, నాటకాల్లో వేషాలు వెయ్యడానికీ పనికొస్తావుగాని లోకాన్ని అంచనా వెయ్యలేకపోతున్నావురా. ఒకవేళ ఆ అమ్మాయి అంత బుద్ధిలేనిదై నీలాంటి లోఫర్ని ప్రేమించిందే అనుకో, వాళ్ళనాన్న నిన్ను ఓ పెయిర్ ఆఫ్ టాంగ్సు (Pair of tongs) తో ఓ పురుగుని ఏరినట్టుగా ఏరి గోడ అవతలికి విసిరెయ్యడూ!

శేఖరం: ఒరేయ్ నువ్వు కుమాస్తావి. కుమాస్తా ఎవడికీ జీవితంలో రొమాన్సు నిజమౌతుందనీ, అన్నీ కాకపోయినా కొన్ని అయినా సుఖాంతం అవుతాయనీ నమ్మకం పోతుందిరా. వట్టి సినికల్‌గా అయిపోతాడు. చూడు. ఈ అమ్మాయి రామనాథంగారి ఏకైక పుత్రిక. అందులో గారబు పట్టి, అర్ధరాత్రివేళ ఆమె లేచి ఇప్పుడు నాకు సూర్యకాంతి కావాలి అంటే ఈయన తక్షణం గగనమార్గంలోకిపోయి సూర్యభగవానుణ్ణి జబ్బ పట్టుకు తీసుకు వచ్చేస్తాడంటే నమ్ము. అటువంటప్పుడు ఈమెని కాదనగలడా... అరెరె! ఆ అమ్మాయి యిటే వస్తోంది. ప్లీజ్ గెటవుట్.

రంగ: ఏదీ ఆవిణ్ణి ఒక్కసారి చూడనియ్యి.

శేఖరం: ప్లీజ్. పోరా. పోపో. (భుజం పుచ్చుకుని లాక్కుపోతూ) అబ్బబ్బ! యీ రోడ్డుమీదైనా

కొంచెం ఏకాంతం ఏడవక పోతే ఎలాగరా.

(రంగనాథం వెళ్ళిపోతాడు. సుచిత్ర ప్రవేశం. పంధొమ్మిది సంవత్సరాల వయస్సు అందం ఆకర్షణ, పెంకితనం, తెలివి అన్నీ అమరి ఉంటాయి. ఖరీదైన చీర ధరిస్తుంది రెండు జడ లల్లుకుంటుంది. చేతిలో వానిటీ బేగ్ ఉంటుంది)

శేఖరం : గుడ్ మార్నింగ్ సుచిత్రా దేవీ.

సుచిత్ర : (మురమురా చూసి)... మార్నింగ్.

శేఖరం : ఇలాగ షాపింగ్ కి బయల్దేరారా ఏమిటి.

సుచిత్ర : అది మీ కనవసరం

శేఖరం : నిజమే. కాని అనవసరమైనవాటిలో జోక్యం కలిగించుకోవడం నాకొక సరదా లెండి

సుచిత్ర : (మాట్లాడక ముందుకు వెడుతుంది.)

శేఖరం : సుచిత్రా దేవీ అన్నట్టు నా మాట. దహారవ ప్రేమలేఖ మీకు అందిందనుకుంటాను.

సుచిత్ర : అగ్నిహోత్రుడికందింది.

శేఖరం : (శోకంతో) అంతమాట అనకండీ. గుండెల్ని కాల్చేసినట్టయిపోతుంది.

సుచిత్ర : మీమీద ఏమీ యాక్షన్ తీసుకోనందుకు సంతోషించండి. మీకు వార్నింగ్ యిస్తున్నాను. మీకూ నాకూ ఏమీ సంబంధం లేదు. యిక ఉండబోదు. ఇకముందు మీ ప్రవర్తన మారకపోతే నేను తీసుకోదగిన చర్య తీసుకుంటాను.

శేఖరం : మీకు కోపంగాని సుచిత్రా, ఒకటేఒక చర్య తీసుకుంటే యీ శేఖరం జీవితం ధన్యమైపోతుంది.

సుచిత్ర : మీకు అలవాటే నన్నమాట.

శేఖరం : ఏమిటి.

సుచిత్ర : తాగుడు.

శేఖరం : (నవ్వి) మీకు చాలా కోపం ఉందండీ. కోపంలో మీరు మరీ అందంగా ఉంటారు.

సుచిత్ర : షటప్.

శేఖరం : నోరు మూస్తానే అనుకోండి, ఈ కళ్లు యీ మనస్సు యీ ప్రాణం—వీటి నెలాగండీ మూయడం. అవి మీ వెనకాలే పరుగెత్తుతాయి కదా.

సుచిత్ర : (చిన్నగా నవ్వి) ఈ రోడ్లు కాయడంతప్ప మీకు మరేమీ పనిలేదా ఏమిటి.

శేఖరం : నిజం చెప్పారు సుచిత్రాదేవీ. ఈ మధ్య పాకుకూళ్ళలో ఒకటి రెండు ఉద్యోగాలు వచ్చినా తిరగగొట్టేసాను. బి. యే ప్యాసై రెండేళ్ళయినా యీ ఊరు విడిచి వెళ్లలేక పోయాను. మిమ్మల్ని ఎక్కడ చూడలేక పోతానో అని మీరు నడిచే యీ రోడ్డు, కూర్చునే పార్కులో బల్లా, కాలేజీ గేటు—యివన్నీ పుణ్యస్థలాలంటే నమ్మండి. మీరు నాకు దేవి, దేవత...

సుచిత్ర : ఇంక కట్టిపెట్టండి.

శేఖరం : మీరు ఏమన్నా అనండి పడతాను. ప్రేమకి యింత శక్తి, యింత వేడీ ఉందని నాకు యిది వరకు తెలియదు సుమండీ. ఒకసారి వరుసగా రెండు రోజులు మీరు కనపడకపోతే మీరు కనిపించేటంతవరకూ ఏమీ తినకూడదనిపించి—మంచి నీళ్ళు మినహా ఏమీ ఆహారం లేకుండా అలా ఉండిపోయానంటే నమ్మండి. సరే, మూడవ రోజున మీరు కనిపించారు.

సుచిత్ర : (హేళనగా) పాపం అప్పుడైనా భోంచేశారా.

శేఖరం : మీరు కనిపించాక యింక భోజనమెందుకూ కడుపు నిండిపోయింది.

సుచిత్ర : మిస్టర్ శేఖరం గారూ. ఇలాగ ఉపవాసాలు చేయడానికీ యింకా గొప్ప తపశ్శక్తులు చూపించడానికీ మీలో ఏదో మాహాత్మ్యం ఉండి ఉండాలి. ఇంకా మన దేశం మిమ్మల్ని గుర్తించకపోవడం చాలా విచారకరం. కాని మీరు నన్ను యిలాగ వెంబడించడమూ, యీ అర్థంలేని వాగుడూ, మీకూ నాకూ కూడా గౌరవప్రదము కాదనీ ఉచితం కాదనీ మీకు తెలియ చెయ్యడం చాలా అవసరం. ఇదిగో మీకు మళ్ళీ చెప్తున్నాను. మీ శ్రమకి ఫలితం లేదు. మీ దారిన మీరు దయచెయ్యండి.

శేఖరం : (హతాశుడై) అంతేనంటారా.

సుచిత్ర : అంతే. ప్లీజ్. ఇక దయచెయ్యండి (విసురుగా వెళ్ళిపోతుంది.)

శేఖరం : హరి శేఖరం! నీ యీ శ్రమ అంతా వ్యర్థంరా! నువ్వు నిరుపేదవి, నిరుద్యోగివి.

నువ్వు లోఫరువి. డామ్ స్కౌండ్రల్ వి. అంతే కాని నీ హృదయం నీ ఆశయం ఎవరికి కావాలి. చదువుకున్న ఆడపిల్లలకి కూడా ధనం హోదా గౌరవం అంటే ఉన్న మోజు మనుష్యులంటే లేదు. ఈ సంఘానికి మనిషీ, మనిషికుండె కాదు కావలిసింది. ఈ సంఘం రాక్షసుల సంఘం— ఇక్కడ నాలాంటివాడికి స్థానం లేదురా, లేదు —అరె! సుచిత్ర వెళ్ళిపోయిందే! ఇప్పుడేమిటి చెయ్యడం. (తీవ్రంగా ఆలోచిస్తాడు. ఒక నిశ్చయానికి వస్తాడు.) ఈ శేఖరానికి ఓటమి అనేది లేదు. ఇదేదో చివరికంటా చూసి తీరుతాను. శేఖరం అంటే ఏమిటి? Hope forever hope. (హోప్, ఫరెవర్ హోప్.)

(గాలిలో చెయ్యి ఊపుతూ సుచిత్ర వెళ్ళిన దారినే వెళ్ళిపోతూంటే సుమారా సోమయాజుల్ని ఢీకొంటాడు. సోమయాజులికి వలభై పైబడిన వయస్సు. బట్టతలా, పాత కళ్ళజోడు, యితర బానిస చిహ్నాలు)

శేఖరం : (ఆగి.) అయ్యా! ఒక్కమాట. ఈ దారిని ఒక అమ్మాయి, ఒక అందమైన అమ్మాయి, రెండుజడల అమ్మాయి కనపడిందేమో చెప్ప గలరా.

సోమ : ఎవరునువ్వు. (కళ్ళజోడు సవరించుకుంటూ చూస్తాడు.)

శేఖ : (ఉలిక్కిపడి) నువ్వటయ్యా మహానుభావా! శెలవ్. వస్తాను.

సోమ : (చెయ్యి పట్టుకుని) ఏమయ్యా శేఖరం. యిప్పటికి దొరికావ్. నా అద్దెమాట ఏం చెప్పావు? రెండుశెలల్నుంచి నీ కోసం వీధులన్నీ గాలిస్తున్నాను.

శేఖ : నే చెప్పేదేమన్నా యివ్వవన్నావా స్వామీ. ఎటొచ్చీ ఒక్క సంవత్సరం కదా అయింది! ఇంక కొన్నాళ్ళు ఓపిక పట్టండి.

సోమ : ఇంక వీల్లేదు. నీ తియ్యని మాటలకీ మోసాలకీ యింక లొంగను. ఇన్నాళ్ళు నా యింట్లో బైఠాయించి ఒక్క నెల అద్దె యిచ్చిన పాపాన పోయావు! న్యాయం ఉందా! వాయిదా వేస్తే ఒప్పుకోను. యిచ్చి తీరాల్సిందే.

శేఖ : మీరు చెప్పేది నిజమే కాని మా గ్రామం నుంచి రావాల్సిన సొమ్ము యింకా రాలేదు. తర్వాత, చూడండి. [illegible] యుంటే [illegible] ఎప్పుడూ [illegible] వాయిదాలు [illegible] ప్రపంచం [illegible] కొద్దికి వాయిదా [illegible] ఉంటుంది. [illegible] యింకా [illegible]...

సోమ : ఈ కబుర్లకేమి [illegible] వాడు [illegible] సరంగా [illegible] అయినా [illegible]...

శేఖ : ఇప్పుడేమీ [illegible] లేదు సోమయాజులుగారూ. ఇప్పుడు ప్రతి నిముషం అమూల్యమైనది. సుచిత్ర యీపాటికి [illegible] దూరం వెళ్ళిపోయి ఉంటుంది. [illegible] ప్రేమికుడి [illegible] అడ్డు వచ్చి (వేగంగా వెళ్ళిపోతాడు.)

సోమ : సుచిత్ర! సుచిత్ర ఎవరు చెప్మా. మా జమీందారుగారి అమ్మాయి కాదుకదా. ఏమయ్యోయ్ శేఖరం. (వెనకాలే వెడతాడు.)

(రెండు నిముషాలపాటు స్టేజి ఖాళీగా ఉంటుంది. మరోవైపునుంచి సుచిత్రా వస్తుంది. వెనకాలే శేఖరం వస్తాడు.)

శేఖ : (భయం భయంగా) మిస్ సుచిత్రా దేవి!

సుచి : (ఆశ్చర్యంగా) మీ రింకా...

శేఖ : అనుసరిస్తూనే ఉన్నాను. ఛాయ ఎప్పుడూ వెంబడించే దేగా.

సుచి : (కోపంగా ముందుకు వెళ్ళుతుంది.)

శేఖ : మీ చీర చాలా బాగుందండీ.

సుచి : మీరుకూడా ఒకటి కొనుక్కుంటారా.

శేఖ : (చిరునవ్వుతో) ఈ ఎండలో మీ వొళ్ళు పసిమి బంగారంలాగ మెరిసిపోతోందండీ.

సుచి : మీకు మతిపోయిందండీ.

శేఖ : ఎగ్జాక్ట్. కరెక్టుగా డయాగ్నైజ్ చేశారు.

సుచి : థాంక్స్.

శేఖ : చూడండి. ప్రేమ గుడ్డిది అన్నారు. కాని అదే నిజమైతే మీరు నా కళ్ళకి గోజాగోజా మరీ ప్రకాశవంతంగా ఎలాగ కనపడతారు చెప్పండి. అసలు మీర్లేనిచోటకూడా మీరు కనపడతారు

కదా ఈ కళ్లకి. ఈ ప్రకృతి అంతా వసంత శోభల్ని వెలాగుస్తున్నట్టు ఉంటుంది. పచ్చి శీతాకాలంలో కూడా. ఇంక ప్రేమ గుడ్డిదెలా అవుతుంది. ఆ చెప్పిన కవి యెవడో కాని...

సుచిత్ర : పచ్చకామెర్ల వాడికి లోకం అంతా పచ్చగా కనపడుతుందిట.

శేఖరం : మీ రలాగ తీసేస్తే నే నొప్పుకోను. ప్రేమ సృష్టికి మూలం. ఆదిదంపతులు శివపార్వతుల దగ్గర్నుండి లైలా మజ్నూ రోమియో జూలియెట్..

సుచిత్ర : (చెవుల్లో చేతులు పెట్టుకొని) మీ వాగ్ధోరణి విపరీతంగా ఉంది——

(చటుక్కున వెనక్కి తిరిగి వచ్చినదారినే కోపంగా వెళ్ళుతూంటుంది.)

శేఖరం : అరె! ఇంటికేసే వెళ్లిపోతున్నారే.

సుచిత్ర : మీలాంటి పెద్దమనుష్యులు దారులు కాస్తూంటే ఏమిటి చేసేది——ఛీ, సభ్యత తెలియని ఊరు. నే నింటికే పోతాను.

శేఖరం : (రెండు అడుగులు వేసి) మళ్ళీ ఇంతదూరం నడిచివెళతారా! పోనీ రిక్షా పిలవమన్నారా.

సుచిత్ర : (మురముర చూస్తుంది.)

శేఖరం : కారుండగా మీకీ శ్రమ ఏమిటి ఖర్మం. మీ రిలా నడుస్తూంటే నాకు కాళ్లు నొప్పులు పెడుతున్నాయి. మీరు దడపె వాయిస్తారని భయంకాని మిమ్మల్ని బుజాలమీద యెత్తుకు మోసుకుపోవాలని వుంది.

సుచిత్ర : (పక్కున నవ్వి) మీకు నేనంటే భయం ఉందన్నమాట.

శేఖరం : తగనిభయం సుచిత్రా దేవీ. ఈ ప్రపంచంలో దేనికీ భయపడను——భయపడలేదు. రాత్రులు ఒక్కణ్ణీ ఊరికి దూరంగా ఏకాంతంగా కూర్చుని గడిపిన రోజులకి భయపడలేదు. దరిద్రానికీ చావుకీ భయపడలేదు. కాని మీరంటే...

సుచిత్ర : (ఆశ్చర్యంగా) మీకు వెనకాల ఏమీ లేదా.

శేఖరం : లేకేం సుచిత్రా——ఉన్నాయి వూళ్ళో అప్పులు.

సుచిత్ర : అంత పేదరికంలో ఉండి కానీ సంపాదన లేని పరిస్థితిలో మీకు పెళ్ళి ఎందుకండీ?

శేఖరం : ఎంత మాటన్నావు సుచిత్రా! ప్రేమే పెన్నిధి. ప్రేమించుకొన్న స్వప్నజీవులకు ఈ సిరిసంపదలూ ఈ భోగభాగ్యాలూ తుచ్ఛాలు కావటండీ. మీకు నేనూ, నాకు మీరూ ఉండగా మరింకేం కావాలి. ఒకరి నడుంచుట్టూ ఒకరు చెయ్యివేసి ఒకరి కళ్లలోకి ఒకరు చూస్తూ ఎన్ని యుగాలైనా గడిపివెయ్యచ్చును కదండీ.

సుచిత్ర : ఔనులెండి. మీరు మీ మిత్రులదగ్గర ఒకటి రెండూ అప్పు చేస్తూంటే, నేను పొరుగమ్మ యిరుగమ్మలదగ్గర కొంచెం బియ్యం, ఉప్పూ, పప్పూ బదులు చేస్తూంటే——

శేఖరం : మీ కేం సుచిత్రా. నువ్వు శ్రీమంతురాలివి.

సుచిత్ర : అయితే నా ధనం ఆశించి నన్ను చేపట్టాలని చూస్తున్నా రన్నమాట.

శేఖరం : కాదు కాదు సుచిత్రా! ఇక్కడ మిమ్మల్నీ, అక్కడ ఆగాఖాన్ ధనాన్నీ, రాక్‌ఫెల్లర్ ఖజానాల్నీ, ఫోర్డు మిలియన్సునీ, నైజాం భూగర్భంలో దాచిన బంగారుకడ్డీలనీ పెట్టి నీకేం కావాలని అంటే, సుచిత్రా అమిగుమిల్లు గొల్పే ధనాన్ని యిలాగ కాలితో తన్నేస్తాను. నేను ధనానికి దాసుణ్ణయితే, యిన్నాళ్లు యీవూళ్లో అవకష్టాలూ పడుతూ యిలా ఉంటానా.

సుచిత్ర: (మార్దవంగా) మీలో ఎంత త్యాగశీలమూ సహనమూ ఉన్నాయండీ.

శేఖర: (ప్లీజయి) నాపరిచయం అయిన కొద్దీ మీకు క్రమంగా నాలోవున్న యితర సుగుణ సంపద కూడా తెలియవస్తుంది.

సుచిత్ర: కాని చూడండి మిస్టర్. నా జీవితవిధానం వేరు. నాకు నిరంతరం, సౌఖ్యం, భోగం అలవాటు. ఏం కోరినా అది కాళ్లముందు పడాలి. మీకున్న ఉత్తమగుణాలు నాలో లేవని విచారిస్తున్నాను. చీరలు, నగలూ, కార్లూ, నౌకర్లూ——ఇవన్నీ నా కనీసపు అవసరాలు. కనీసం వెయ్యిరూపాయలు సంపాదించగలిగినవాడైతే, నా వివాహానికి ఆశించవచ్చును. మీకా అర్హతలు లేవని తెలుస్తూనే ఉంది. మీరు సోమరులు. స్వప్నాల్ని భోంచేస్తూ మత్తుగా నిద్రపోయే ఓ రకం గొంగళీపురుగులు. ఇంక మీరు ప్రయత్నం విరమించడం వివేకమైన పని. నమస్తే. ఇక నన్ను విసిగించకండి.

వచ్చారు. వుంటే ఏం చేద్దురూ? చెప్పేసి చక్కా వెళ్ళిపోయి, మీ ఆవిడ అమర్చివుంచిన వేడివేడి భోజనం తినేసి బహికంగా పడుకొని వుందురు. ఇప్పుడో అమ్మాయిరాలేదు. మీలో చిరాకు, కంగారు, అక్కడి మీ ఆవిడకి కించిత్ కోపం, వేడిఅన్నం చల్లారిపోవడం మీకూ మీ ఆవిడకి చిన్న కలహం—మూశారా యెంత రసోత్పాదన జరుగుతుందో!

పంతులు: (పల్లకిలించి) చిత్తం!

రామ: (ఆలోచనగా.) పంతులూ, నాకు ప్రపంచంలో ప్రాణతుల్యమైనదేదో చెప్పగలవా.

పంతులు: (మాంచి ఉత్సాహంగా) డబ్బండి.

రామ: వటప్. నువ్వు కాక మరొక డెవడైనా యిలా అనివుంటే డిస్మిస్ చేద్దును. నీ అంత బాగా వీణ వాయించేవాడూ నేర్పేవాడూ యింకొకడు యీ ఊళ్లో లేడు కాబట్టి నిన్ను క్షమించదలిచాను.

పంతులు: (భయంగా) నాదె తప్పండి. నన్ను మీరు క్షమించాలి.

రామ: నాకు ప్రపంచంలోకలా ప్రాణ సమానమైనది నా కూతురు సుచిత్ర. తల్లి పోయినప్పట్నుంచీ ఈ చేతులతో పెంచి పెద్దదాన్ని చేశాను. విద్యాబుద్ధులు గరిపాను. ఈ ధనమంతా ఆమె సుఖంకోసం, ఈ మేడలు ఆమె నివాసంకోసం, ఈ తోటలు అమె విహారంకోసం......

పంతులు: అమ్మాయిగారికి యుక్తవయస్సు వచ్చిందండి ఇంక వివాహం చేసెయ్యండి.

రామ: (హేళనగా) నువ్వు చేసుకుంటావా?

పంతులు: (కంగారుతో) నే నే...నాండి!

రామ: మరింకేం—మనం వివాహం చెయ్యడమేమిటోయ్ పంతులూ. అమ్మాయే వరుణ్ని ఎంచుకుని వివాహం చేసుకోవాలి తప్ప. ఏమంటావ్.

పంతులు: చిత్తం.

రామ: చూడు, రెండువందల సంవత్సరాల క్రితం అభిప్రాయాలంటే నాకు అసహ్యంసుమీ.

పంతులు: చిత్తం.

రామ: ఒకమనిషి సగటున ఎన్నేళ్లు జీవిస్తాడంటావ్.

పంతులు: ఒక నలభై కట్టుకోండి.

రామ: ఒక యిల్లు ఎన్నాళ్ళు శిధిలం కాకుండా ఉంటుందంటావు?

పంతులు: నూరు నూటయాభై సంవత్సరా లనుకోండి గట్టిగా కట్టిన యిల్లయితే.

రామ: అయితే చూశావు. మనిషివుండడు, మనిషి కట్టిన యిలావుండదు. అయితే ఆ బూజుపట్టిన అభిప్రాయాల్ని మాత్రం ఎందుకుంచాలీ అంట?

పంతులు: చిత్తం.

రామ: నీ కర్థమయిందా?

పంతులు: చిత్తం.

రామ: నీకర్థమయితే యీ వూళ్ళో యీ బోడిమేష్టర్గీ చేస్తూ ఎందుకుంటావు! ఏ నూడియో ఆర్గెనాన్ లోనో చేరి ఉండేవాడివి. ఇదిగో మాట. (పంతులు దగ్గరకి వస్తారు. రామనాథం మెల్లగా) అమ్మాయి నాకు చెప్పింది తెలుసునా.

పంతులు: ఏమిటండీ.

రామ: అమ్మాయి ఒక చక్కని కుర్రవాణ్ణి ప్రేమించిందిట. సమయంవచ్చినప్పుడు తనే అతని పేరూ ఊరూ చెపుతానంది.

పంతులు: అంతకంటె కావల్సినదేముందండి. శుభస్య శీఘ్రం అన్నారు పెద్దలు త్వరలోనే ఏర్పాట్లు కానిచ్చెయ్యండి.

రామ: అదే చూస్తున్నాను. త్వరలోనే - ఎందుకూ యీ వేళే ముహూర్తం పెట్టించేస్తాను. అమ్మాయిని లాలించి ఆ కుర్రవాని పేరు కనుక్కుంటాను. (జేబు గడియారం చూసి.) పంతులూ యింక నువ్వువెళ్ళు. అమ్మాయి యిప్పట్లో వచ్చేటట్టు లేదు.

పంతులు: చిత్తం సెలవిప్పించండి. (నిష్క్రమిస్తారు.) (రామనాథం తిరిగీ ఫైల్సు చూస్తోంటాడు. వడివడిగా సుచిత్ర వెనకాలే శేఖరమూ ప్రవేశం.)

సుచిత్ర: (కంగారుగా) నాన్నగారూ! చూడండి యితన్ని.

శేఖరం: (సుచిత్రకి మాట్లాడే అవకాశం యివ్వకుండా.) నమస్కారం. మీ అమ్మాయి సుచిత్రాదేవిగారు మీదగ్గర కార్యదర్శిపదవి ఖాళీగా ఉందని చెపితే...

సుచిత్ర: కాదు నాన్నా కాదు...

శేఖరం : అహఁహఁ. మీకా సంకోచం ఏమీ అక్కర్లేదు సుచిత్రా. ఏపనైనా సరే నమ్మకంగా చేస్తానండి.

సుచిత్ర : కాదు నాన్నా - వీరు నన్ను చెయ్యిపట్టుకుని...

శేఖరం : (అడ్డుపడి వేగంగా) అదికూడా చెప్పాలా సుచిత్రాదేవి. కారు వేగంగా వస్తూంటే మీ అమ్మాయిగారు రోడ్డు మధ్య పరధ్యానంగా ఉండడం చూసి చెయ్యిపుచ్చుకుని టక్కుమని యివతలకి లాగి రక్షించానండి.

రామ : (ఆతృతతో) ఎంత ప్రమాదం తప్పింది. (శేఖరం చేతులుపట్టుకుని) నీ మేలు మరువలేను నాయనా.

సుచిత్ర : అంతా అబద్ధం, అంతా మోసం.

శేఖరం : ప్రపంచమే అంత సుచిత్రాదేవీ. అబ్బే. ఆ డ్రైవరు తాను స్పీడుగా రావటంలేదనీ, హారన్ ఎన్నిసార్లు కొట్టినా మీ అమ్మాయే పెంకితనంగా రోడ్డుకి అడ్డంగా వయ్యారంగా నుంచుందనీ అన్నాడండి. రాస్కెల్. అంతా అబద్ధమూ మోసమూ. వాడు హారన్ కొట్టనే లేదు.

సుచిత్ర : (డీలా అయిపోయి తినేసేట్టు చూస్తుంది శేఖరాన్ని.)

రామ : ఈ డ్రైవర్లంతే నాయనా. నువ్వేకనక సమయానికి అక్కడలేకపోతే ఏమయ్యేదో తల్చుకుంటే-యిప్పుడే నరాలుపట్లు తప్పుతున్నాయి. అయితే నీ పేరు.

శేఖరం : శేఖరం అండి.

రామ : నిన్ను చూస్తే నాకొక సెక్రటరీ ఉండటం అవసరం అనే అనిపిస్తోంది. త్వరలో నే శుభకార్యం ఒకటి తలపెట్టబోతున్నాను. ఈ ఊళ్ళో నాకు చాలా యిళ్ళున్నాయి. వాటి అద్దెలు వసూలు చెయడానికి ఒక గుమాస్తా ఉన్నాడు కాని అతనంత సమర్థుడు కాదు. నువ్వేమో యువకుడివి శక్తిసామర్థ్యంగలవాడివి. దానాదీనా నాకు సహాయంగా.

శేఖరం : నేనయితే అద్దెలు మంచి నిక్కచ్చిగా వసూలు చేస్తానండి. ఆ టెక్నిక్ అంతా నాకు బాగా తెలుసండి.

సుచిత్ర : అంత అవసరమా నాన్నా మనకి ఒక కార్యదర్శి?

రామ : ఆఁ! అన్నట్టు అమ్మాయికి అటువంటి ప్రమాదాలు రాకుండా చూడడానికీ,...

శేఖరం : (సంతోషంగా) అమ్మాయిగారిమీద యీగని కూడా వాలనివ్వనండి. ఆవిడని కాపాడి కనిపెట్టుకుంటూ ఉంటానండి.

రామ : జీతం ఏమాత్రం కావాలోయ్.

శేఖరం : మీ చిత్తం వచ్చినంత యివ్వండి. నాకు జీతం పట్టింపులేదండి. మీవంటివారి దగ్గర కొలువుచేస్తున్న గౌరవం చాలునండి.

రామ : శభాష్! కాలానికి తగిన [illegible] ఎంత[illegible] నాయనా.

శేఖరం : మీ దయ వల్లనండి.

రామ : బాగుంది. నీకు నూటయాభై యిస్తాను.

శేఖరం : తమ కటాక్షం.

సుచిత్ర : (ఆశ్చర్యంతో) నూట యాభయ్యా...!

రామ : తక్కువంటావా తల్లీ. నిన్ను రక్షించిన వాడు కూడా. పోనీ, రెండువందలు యిస్తాను. [illegible]గా ఉంటుంది. (సుచిత్ర పళ్ళు పటపట కొరుకుతుంది. శేఖరం విజయగర్వంతో ఆమెకేసి చూస్తాడు.)

రామ : ఇదిగో శేఖరం—నాకు జీవితంలో రెండే రెండు ఆశయాలు. ఒకటి యీ ఆస్తిని అభివృద్ధి చేసి అది తరతరాలుగా నిలిచి ఉండేటట్టు కట్టుదిట్టం చేయడమూ; సుచిత్రకి విద్యాబుద్ధులు గరపి తగిన వరుడికి యిచ్చి వివాహం చేయడమూ. అల్లుడిచేతిలో కూతుర్నీ, కూతురిచేతిలో నా ఆస్తిపాస్తుల్నీ పెట్టి నేను రిటైరయి విశ్రాంతిగా ఉండదలచుకున్నాను.

శేఖరం : చాలా ఉదాత్తమైన ఆశయమండీ అది.

రామ : నేనిందాకా చెప్పానుకదూ శుభకార్యమని. మా అమ్మాయి వివాహం పదిపదిహేనురోజుల్లో జరుపబోతున్నాను.

శేఖరం : (మొహంలో రంగులు మారిపోతాయి. కంగారుగా నత్తిగా.) వి...వా...హ మండి.

రామ : మంచి వైభవంగా జరిపిస్తాను. ఆ అరేంజిమెంట్లన్నీ నువ్వే చెయ్యాలి. ఒక డిన్నర్, ఒక డాన్సు, ఒక డ్రామా. ఒక బుర్రకథ, ఒక సంతర్పణ, ఒక సంగీత కచేరీ... యింకా...

శేఖరం : (అతనికి భూమి గుండ్రంగా తిరుగుతోంది.) ఎవరండీ వ...రు...డు?

రామం : అదంతా సెటిల్ అయిపోయిందిలే. అమ్మాయి స్వయంగా వరుణ్ణి ఎంచుకుంది.

శేఖరం : సెటిల్... సెటిల్... (తూలబోయి కుర్చీని ఆనుకుంటాడు.)

రామం : ఏం — అలా అయిపోయావేమిటి.

శేఖరం : అబ్బే కొంచెం తిప్పిందండి. అంతే — మిస్ సుచిత్రాదేవీ. కొంచెం వాటర్ !

సుచిత్ర : వాటరేనా, మజ్జిగకూడా కావాలాపాపం! (వెళుతుంది.)

రాము: కూర్చోవోయ్ శేఖరం. దొడ్లో పని చేయిస్తున్నాను. ఒకసారి చూచివస్తాను. (వెళతాడు)

శేఖరం: (కుర్చీలో కూర్చుని మొహాన్ని చేతుల్లోకప్పుకుని) మైగాడ్.

సుచిత్ర: (నీళ్లతో ప్రవేశించి) ఇదిగో మిస్టర్ సెక్రటరీ, వాటర్. (గ్లాసు బల్లమీద పెడుతుంది)

శేఖరం: (కోపంగా చూసి గ్లాసుడునీళ్లూ గడగడా తాగేస్తాడు) హుం!

సుచిత్ర: (ఎదురుగా కూర్చొని) కాగితం కలం తీసుకోండి. నా మ్యారేజీకి కావలసిన వస్తువుల లిస్టు చెబుతాను.

శేఖరం: (కదలడు)

సుచిత్ర: మీకే చెబుతూన్నది!

శేఖరం: (మాట్లాడడు. కుర్చీ మరోకపక్కకు త్రిప్పుకొని కూర్చుంటాడు)

సుచిత్ర: మీకు జీతం ఇచ్చేది ఎందుకో తెలుసా? చెప్పినట్లు చెయ్యడానికి.

శేఖరం: నేను వ్రాయను.

సుచిత్ర: ఏం?

శేఖరం: నా ఇష్టం.

సుచిత్ర: మీయిష్టం మీయింటిదగ్గర. అయితే ఉద్యోగము మానెయ్యండి.

శేఖరం: నాకు ఉద్యోగం ఇచ్చింది మీరుకాదుగా.

సుచిత్ర: ఎవరైతేనేం — ఇక్కడ నా మాట రాజాజ్ఞ. లేకపోతే డిస్మిస్ చేయిస్తాను.

శేఖరం: వెధవ ఉద్యోగం. మీరు చెప్పినట్లల్లా వినడానికి నేనేమీ తమ మొగుణ్ణి కాను. వస్తాడుగా ఓ చవట పదిరోజుల్లో తమ భర్తనంటూ! వాడికి పురమాయించు నీ పనులన్నీ.

సుచిత్ర: (కోపంతో) యూ షటప్. నాకు కాబోయే భర్త నవమానిస్తె కథ చాలాదూరం వెళుతుంది. నా భర్త నాకు దైవసమానుడు. మీ అంతస్థు తెలుసుకొని జాగ్రత్తగా మాట్లాడండి.

శేఖరం: ఇక నాకు జాగ్రత్తలేదు. నాకాశ లేదు. నా గుండె మండిపోతోంది. నేను మానవుణ్ణి కాను, రాక్షసుణ్ణి. విప్లవమూర్తిని. సుచిత్రా! ఏ దేవిని నేనుసర్వస్వం అని ఆరాధించానో, ఏ దేవి నవ్వుకోసం, కరుణాకటాక్షం కోసం తల్లడిల్లిపోయానో — ఆమె నన్ను ఓ అనామకుడిలా పురుగులా విదిలించి పారేసింది. నాకింక మంచీ చెడ్డా పాపం పుణ్యం వివక్షత లేదు. ఎప్పటికైనా నా పగ తీర్చుకుంటాను. నిన్నూ నీభర్తనీ కటకట్టి గోదావరిలో ముంచేస్తాను.

సుచిత్ర: (ఫక్కున నవ్వుతుంది)

రాము: (వస్తూ) ఎందుకమ్మా అలాగ నవ్వుతున్నావు.

సుచిత్ర: 'తిరస్కరింపబడిన ప్రియుడు' అనే నాటకంలో పోర్షన్ చెబుతున్నారు నాన్నా వీరు. వీరు నాటకాల్లో వేషాలు బాగా వేస్తారులే.

శేఖరం: అవునండి. మీ అమ్మాయి చెప్పిన నాటకం వట్టి విషాదాంతం అయిపోయిందండి. అందులోని హీరోయిన్ చాలా దుర్మార్గురాలండి. వంచకురాలండి. గోముఖ వ్యాఘ్రమండి.

సుచిత్ర: హీరో అంతకన్న దగాకోర్, దొంగ, లోఫర్ ...

రాము: హీరో హీరోయిన్లు ఎటువంటి వాళ్లయితేనేం తల్లీ. ఇంతకీ నాటకం కదా.

శేఖరం: వాస్తవిక జీవితంలో కూడా ఉంటారండి అటువంటి మోసకత్తెలు.

సుచిత్ర: అటువంటి తేనెపూసిన కత్తులున్నా...

రాము: నేను మీ ఇద్దరితో నూ ఏకీభవిస్తాను. సరేనా... (సుచిత్ర కోపంగా కూర్చుంటుంది. శేఖరం అంతకన్న కోపంగా కూర్చొని టేబిలుమీద న్యూస్ పేపరు చదువుతున్నట్లుగా నటిస్తాడు. కాని అతని మొహంలోని బాధని దాచాలని ప్రయత్నం. ఇదే సమయంలో గుమాస్తా సోమయాజులు వస్తాడు. పేపరు అడ్డంగా ఉండడం వలన శేఖరాన్ని చూడలేదు; శేఖరమూ సోమయాజుల్ని చూడడు.)

సోమ: నమస్కారమండి. ఈరోజున అయిన పనుల్ని మొత్తమూ రసీదులూ చిత్తగించండి. (బల్లమీద ఉంచుతాడు)

రామ: (రసీదుల్ని చూసి) ఇంకా ఏమైనా రావల్సినవి ఉన్నాయా?

సోమ: (భయంగా) బాబూ. ఒక్కడి విషయములో మాత్రం చాలాకష్టంగా వుంది. అతను ఈ ఏడాది నుంచీ అద్దెయివ్వటం లేదండి నాలుగు రోజుల నుండి మనిషి పత్తాలేకుండా పోయాడు. గొప్ప కేటుగాడులెండి.

రామ: కేటుగాడా? అంటే?

సోమ: నీతం. అది నూతనంగా మన భాషాకోశం లోకి వచ్చిన పదమండి. మోసగాడనీ, అసలైన గిరీశం మార్కు దగాకోరనీ అర్థమండి.

రామ: (చిరాగ్గా కోపంగా) ఎంత ఇవ్వాలి.

సోమ: నెలకి రెండుగదులకీ పదిహేను రూపాయలు చొప్పున పదమూడు నెలలకి నూటతొంభై అయిందండి.

రామ: పెద్ద మొత్తమే యివ్వాలి. కుటుంబంతో ఉన్నాడా?

సోమ: రామ రామ. పరమబ్రహ్మచారి గాడండి.

రామ: అయితే రెండుగదు లెందుకు.

సోమ: మొదట నాకూ ఆ సందేహమే కలిగిందండి. చాలాకాలం వరకూ అర్థం కాలేదండి. బాకీల వాళ్ళు వస్తె లోపలిగదిలో దాక్కుంటానికి ప్రత్యేకంగా రెండవగది కూడా తీసుకున్నట్లు కనబడుతోందండి.

రామ: ఇన్నాళ్ళూ ఏం చేస్తున్నావయ్యా. ఎందుకు నాకు ముందుగా అతన్నిగురించి చెప్పలేదు అతనెవరు? ఏమయ్యాడో పోలీసుల్ని పిలిపించి పట్టించక పోయావా అంట! ఏమయ్యోయ్ సోమయాజులు, సాయంత్రం లోపుగా అతనెక్కడున్నాడో వెతికి పట్టుకుని వసూలుచేసి తీసుకురా. లేనిదే నీ జీతంలోంచి విరగ్గోస్తాను.

సోమ: బాబూ—తమరు అలాగంటె ఏంచెయ్యగలను. ఆవేషం భాషా పిలజమీందారులా వుండేవాడు. ఆ దర్జా కళ, ఠీవీ చూసి ఒత్తిడి చెయ్యలేక పోయేవాణ్ణి, ఎప్పటికప్పుడు మహానమ్మకంగా తియ్యగ నచ్చచెప్పేవాడు బాబూ. ఇంతకీ నా ఖర్మ.

రామ: అంతే నామాటకి తిరుగులేదు. సాయంత్రం లోపుగా వసూలుచేసి యివ్వకపోతే నీకు జీతం కూడా—(కోపంగా లోపలికి వెళ్ళిపోతాడు.)

శేఖరం: (వేగంగా ఆత్రంగా ఉండవగానే) నేనయితే ముక్కుపిండి వసూలు చేసేవాణ్ణి. ఏడాది నుంచి అద్దెనూలు చెల్లించక పోగానూ. ఎవరండీ ఆయన (వేగంగా తీసి సోమయాజుల్ని చూసి వెర్రిగా కేకేస్తాడు) ఓహో!

సోమ: హారి నిన్ను తగలెయ్య నువ్వా (గట్టిగా, రామనాథంగారివైపు చూసి) అయ్యా రామనాథంగారూ ఏదేనండీ ఇదే—ఇక్కడే వైతా యింటా కొటికి పోకరణం!

శేఖరం: నువ్వా మహానుభావా. నేనున్న అయిల్లు నీ స్వంతం అని చెప్పావే!

సోమ: నీతం గిరీశంగారూ. యిలెవరిదైతే నేం. అద్దె మాట ఏం చెప్పావ్.

శేఖరం: అసలు నువ్వెవరు నన్నడగడానికి.

సోమ: నేనా నేను రామనాథంగారి గుమాస్తాని.

శేఖరం: నీజీతం ఎంత?

సోమ: అదంతా నీకెందుకోయ్. నీ ముష్టిబతుకుకన్నా వెయ్యిరెట్లు నయం. నీకుమల్లే దొంగబతుకూ లంజబతుకూ కాదు మనది. వంద రూపాయలు నికరమైన జీతంనాకు. కష్టపడి చెమటోడ్చి సంపాదించినది నాయనా—ఇదేం యాచన కాదు.

శేఖరం: తగవయ్యా సోమయాజులు! నే నెవరో తెలుసా.

సోమ: తెలిసుకేం—బయల్దాయిని.

శేఖరం: నేను రామనాథంగారి సెక్రటరీని. మన జీతం నెలకి రెండువందల రూపాయలు. నీ గ్రేడు నా గ్రేడు కన్న సగంలో సగం తక్కువ. నీ సుపీరియర్ ఆఫీసర్ని కాబట్టి రెండు లెంపలూ వాయించుకొని నమస్కారం చేసి అలా నిలబడు. స్టెండ్ ఎటెన్షన్!

సోమ: వెళాకోళంగా ఉందే నీకు. జాగ్రత్త. అద్దె యిస్తావా, తోలు వొలిపించెయ్యమన్నావా. (పంచె పరిచేస్తాడు)

శేఖరం: (చొక్కా చేతులు పైకిలాగి) ఒకేయ్ గుమాస్తా రారా! నీగుండు తామనిపించేస్తాను.

సోమ: (రామనాథం రావటంచూసి) అయ్యా వీరేనండి ఆగిరీశం.

శేఖరం: నా పేరు శేఖరం.

సోము: యీ ఏడాది అద్దె ఎగ్గొట్టిన మహానుభావుడు వీరేనండి బాబూ.

రాము: ఇతనా (తెల్లబోతాడు)

సోము: పైగా మీద మీదకి వస్తున్నాడు. అయ్యా సెలవివ్వండి. ఒక్క దెబ్బతో యితగాణ్ణి భూమ్మీదకి రప్పిస్తాను.

సుచిత్ర: (ఇంతవరకూ వినోదంగా చూస్తోన్న సుచిత్ర పరిస్థితి దాటుతోందని గ్రహించి) వీరే నాన్నా వీరే...

శేఖరం: రామనాథం గారూ. నేను నిజం చెప్పేస్తున్నాను. నేను మీ అమ్మాయిని సుచిత్రని యీ రెండేళ్ళనుండీ ప్రేమిస్తున్నాను. ఆమె దయని సంపాదించాలని అన్నీ వదిలేసి యీ వూళ్లో ఉండిపోయాను. ఉబాయించి యీ సోమయ్యని మోసగించి ఏడాదినుంచీ అద్దె యివ్వకుండా కాలక్షేపం చేశాను. నేను బి యే ప్యాసయ్యాను నేను దరిద్రుణ్ని, లోఫర్ని. నిజమే. కాని ఒక్క అరగంటవరకూ సుచిత్రా దేవికోసమైనా జీవించాలనే ఆశ ఉండేది. కాని ఆ ఆశ యిప్పుడు సమూలంగా నాశనమయింది. నా మోసాన్నీ, నా అల్పత్వాన్నీ మీరు ప్రత్యక్షంగా చూసికూడా నన్ను క్షమించి మీ అమ్మాయిని నా చేతుల్లో పెట్టరు. ఇన్నాళ్ళు నేను పడిన శ్రమకీ మీ అమ్మాయి హృదయంలో సూదిమోపినంత చోటుకూడా సంపాదించుకోలేకపోయాను. అందని మ్రానికి అర్రులుచాచాను. విఫలమైన యీ ప్రేమ నన్ను దహించివేస్తోంది. నేను తెగించిన మనిషిని. నాకు చావంటే భయంలేదు కాని యీ సోమయ్య నన్ను సుచిత్రాదేవి ముందే అవమానించాడు. అది మాత్రం సహించలేను. ఈ సోమయ్యని చంపేసి మరీ చచ్చిపోతాను. గుడ్ బై సుచిత్రాదేవీ. రారా సోమయ్యా (మీదకి వస్తాడు.)

సోమయ్య: ఏం చేస్తావురా. (మీదకొస్తాడు.)

సుచిత్ర: (కంగారుగా.) నాన్నా వీరు...వీరు.

రాము: (వినిపించుకోక) ఇది యిలనుకున్నారా వడి బజారనుకున్నారా! (బల్ల గుద్దుతాడు)

సోము: ఆగండి బాబూ. వీడిపొగరు ఓ పది ఔన్సులు తగ్గించేస్తాను. మీరు చూస్తూ ఉండండి.

(ఇద్దరూ కలియబడతారు. సుచిత్ర టేబిలుమీది రూళ్లకర్ర తీసి ముందుకువచ్చి సోమయాజులు చేతిమీద కొడుతుంది.)

రాము: అమ్మాయ్ నువ్విలారా. నీ కెందుకు!

సోము: (విస్మయంతో) అమ్మాయిగారా! అబ్బ! నన్ను కొట్టారేమిటి తల్లీ.

సుచిత్ర: ఇంకా చంపేద్దును జాగ్రత్త. ఆయనెవరో తెలుసునా. ఆయనే నాకు కాబోయే భర్త.

రాము:
సోము: } —ఆఁ!
శేఖరం:

సుచిత్ర: (శేఖరం చెయ్యిపట్టుకుని.) నేను నీకిదివరకు చెప్పింది వీరినే నాన్నా.

రాము: (నమ్మలేక) యితనా! అమ్మా, నువ్వు పొరపాటుపడటం లేదుకద!

సుచిత్ర: నాన్నా. వీరినిగురించి నీకు సరిగ్గా తెలియదు. బియ్యే ఫస్టు క్లాసులో ప్యాసయారు నాన్నా.

రాము: (సందేహిస్తూ) సరీగా ఆలోచించుకున్నావా అమ్మా.

సుచిత్ర: (లాలిస్తూ) ఆయన చాలా మంచివారు నాన్నా. నామాట కాదనకు నాన్నా.

రాము: (శేఖరంతో) ఇదిగో చూడు నీ తండ్రి పేరు.

శేఖరం: బ్రహ్మానందం అండి

రాము: బ్రహ్మానందంగా ఉందోయ్. సరే నీ జీవితాశయం ఏమిటి?

శేఖరం: ఇంతవరకూ సుచిత్రాదేవిని వివాహం చేసుకోవడమండి.

రాము: ఆ తర్వాత?

శేఖరం: సుచిత్రాదేవిని ప్రతిక్షణమూ సంతోషపరచి ఆమె కదలికలో కవిత్వాన్నీ కనుచూపులో స్వరాన్నీ సృష్టించడం.

రాము: అంటే ఒక స్త్రీ కోసం నీజీవితం అంతా వ్యర్థపరుస్తావన్నమాట.

శేఖరం: నాకు కోపం తెప్పించకండి జమీందారుగారూ. సుచిత్ర సామాన్య మానవస్త్రీ అంటే నేను సహించను.

రాము: భేష్ బాగా చెప్పావు. ఇది నీ ప్రేమకి నిదర్శనం అనడానికి సందేహంలేదు. సరె, నీకు వ్యసనాలేమైనా ఉన్నాయా.

శేఖరం: చాలా ఉన్నాయండి.

సోమయ్యనీ మాస్తూ వివాహానంతర ప్రథమ దినాల్ని గడపమన్నావా. వద్దు వద్దు సుచిత్రా మన యిద్దరి ప్రేమసుధ్యా కలలసుధ్యా యీపాడు నీడలు పడకూడదు.

సుచిత్ర : (ఆలోచించి) అయితే కాశ్మీర్ పోదామా.

శేఖరం : వండర్‌ఫుల్. ఆ కాశ్మీరపు లోయల్లో.

సుచిత్ర : ఆ హిమవత్ పర్వత సన్నిధానంలో.

శేఖరం : సెలయేళ్ళ పక్కన.

సుచిత్ర : జలపాతల దిగువన.

శేఖరం : రంగు రంగుల పుష్పాల తోటలలో.

సుచిత్ర : మంచు కడిగిన తెల్లని బాటలలో.

శేఖరం : నువ్వూ నేనూ.

సుచిత్ర : అబ్బ చాలా బావుంటుందండీ. చలో కాశ్మీర్ — యిదే మన నినాదం.

శేఖరం : (కళ్ళు నులుముకుని) ఇది స్వప్నమా లేక — ఇప్పుడెక్కడున్నాను సుచిత్రా.

సుచిత్ర : లేవండి. లేవండి. భోజనానికి వేళయింది, అల్లుడుగారికి.

రామ : బాగుంది. ఈ కాలపు కుర్రవాళ్లు రాత్రిం బవళ్లు చదివి పరీక్షలు వ్రాయడం, జీవితంలో ఏ ఉద్రేకమూ వెలుగులేక ఆఫీసు కుర్చీలకి జీవితం అంకితం చెయ్యడమూ తప్ప ఏ ప్రత్యేక తనీ ప్రదర్శించ లేకపోతున్నారు. అయితే చెప్పు నీ వ్యసనాలన్నిటినీ—

శేఖరం : వాటలిస్టు చెపితే యీ రోజుకి తెమలదండి. నాకు లేని వ్యసనమేమిటో తెలుసుకోవాలని పురజను లందరూ ఒక కమిటీని వేసినట్లు తెలుస్తోందండి.

సోమయ్య : అరి పిడుగా! ఏం నదురూ బెదురూ లేకుండా చెపుతున్నాడు. జమీందారుగార్ని చూస్తే నానాలికమీద అక్షరాలు అక్షరాల్లానే గడ్డకట్టుకు పోతాయి.

సుచిత్ర: ఉత్తిది నాన్నా. వీరికి సిగరెట్ తప్ప ఏ వ్యసనమూ లేదు.

రామ : అయితే ఉన్నాయని అబద్ధం ఆడాడన్నమాట!

శేఖరం : అదేనండి నా వ్యసనం. అబద్ధం మంచి సరదాగా మంచి నీళ్ళ ప్రాయంగా ఆడగలనండి.

రామదాసం: (సడెన్‌గా పెళపెళా నవ్వి ఆపేసి తీవ్రంగా) ఏమోయ్ శేఖరం. అబద్ధాలాడడం మనిషి యొక్క గౌరవాన్నీ ఆత్మవిశ్వాసాన్నీ తేలిక చేస్తుందా. నీలాంటి ఆశయమూ లేని వాడికీ, అబద్ధాలాడే వాడికి నీతినియమం పాటించని వాడికీ ఏ తండ్రైనా తనకన్న కూతుర్ని యిచ్చి పెళ్ళి చేస్తాడంటావా.

శేఖరం : (ఈ మాటకి కంగారుపడి) చచ్చాంరా దేవుడా! (ధైర్యం తెచ్చుకొని) నేను నన్ను గురించి అంతా నిజం చెప్పేస్తాను. అబద్ధా లాడినా, ఆడంబరం చూపినా ఒకరికి హాని చేయాలనే దురుద్దేశ్యంతో కాదు. మీ అమ్మాయి కోసం. నిరాధారమైన ప్రబంధ సాగించినన్నీ, నానా బాధలు పడినదీ మీ అమ్మాయికోసం. ఆ రాత మీ యిష్టం.

రామ : సోమరాజులూ ఇలా రా! (సుచిత్రా శేఖరమూ ఆత్రుతతో చూస్తోంటారు) ఇతని అర్హతల్ని ఒకసారి పరిశీలిదాం. ఈ రెండేళ్లూ దమ్మిడీ సంపాదన లేకపోయినా దర్జాగా బతికగలిగిన నేర్పూ.

సోమయ్య : (వేలుముడిచి) ఒకటి.

రామ : ఎన్నికష్టా లెదురొక్కవలసి వచ్చినా నవ్వుతూ జీవితాన్ని సాఫీగా గడిపేసే చాతుర్యమూ.

సోమయ్య: రెండూ.

రామ: అమ్మాయి సుచిత్రకోసం ప్రాణాన్నైనా యివ్వగలిగిన తెగింపూ.

సోమయ్య: మూడూ.

రామ : అమ్మాయి యితన్ని గాఢంగా ప్రేమిండడ మనే ముఖ్యాతి ముఖ్యమైన పరిస్థితి.

సోమయ్య: నాలుగూ.

రామ: వీటన్నిటినీపట్టిమాసే నా తల్లి సుచిత్రని ఈ శేఖరానికిచ్చి వివాహం చేయడానికి నాకు అభ్యంతరం ఏమీ లేదు. మర్యాద లోపమైతే శ్రీ మీ మామగారికి కోపంవస్తుంది.

శేఖరం: ఒక్క నిముషం ఆగు. (ముందుకువచ్చి) సోదర సోదరీమణులారా. (పాంటుజేబులోంచి ఒక తావుకాగితం తీసి చూపిస్తూ) ఇక నేను తీసుకున్న చేబదుళ్ల జాబితా. ఒకఅణాకు పైనుంచి తీసుకున్న అప్పులన్నీ అకారాది విషయసూచికలో జాగ్రత్తగా రికార్డు చేయబడ్డాయి. ఈ రెండేళ్లనుంచీ నాకు కాతాలిచ్చిన కాఫీ హోటళ్లకీ, లాండ్రీషాపులకీ సోడాషాపులకీ సర్వదా కృతజ్ఞుణ్ణి. వారంరోజులలో శ్రీమతి సుచిత్రాదేవికి నాకూ వివాహం జరుగ బోతోంది. ఏతత్ వివాహానికి మీరందరూ సకుటుంబ బంధుమిత్ర సపరివారంగా విచ్చేసి మదర్పిత చందనతాంబూలాదుల స్వీకరించి వధూవరుల నాశీర్వదించి మీమీ బాకీలు వసూలుచేసుకోవ ప్రార్థన. నమస్తే.

సుచిత్ర: నమస్తే.

[సుచిత్రా శేఖరం చెట్టాపట్టాలు వేసుకుని వెళ్ళిపోతారు. తెర]

# మర్యాదలు

## శ్రీ జూనూతల వేంకటరామమూర్తి

'చదువుకున్నంతసేపూ, ఉద్యోగాలు వెలిగిస్తున్నంతసేపూ మనం ఒకళ్ళకయినా కాస్త సాయం చేస్తే జీవితంలో ఇంతింత లావాటి సమస్యలు ఉత్పన్నం కావేమో! వచ్చినా సులభంగా తేలిపోతవి!'

'పోనేమో!' పరధ్యానంలో అనేశాను.

'నేనెంతటి ముఖ్య విషయం చెబుతున్నానో నీవు అర్థం చేసుకునే స్థితిలో పూర్తిగా లేవని నమ్మలేను. కట్నాలు ఇచ్చుకోలేక పెండ్లికి వాయిదా పడుతూంటే, చాటున కన్నీళ్లు తుడుచుకుంటూ ఎంతగా గిలగిలాడుతూ, ఎందరు తపించిపోతూ మగజాతిని శపించి వేస్తున్నారో ఎప్పుడేనా ఊహించడం జరిగిందా? నేను కండ్లారా చూశాను!'

'లేదు!' అంటూ కండ్లు వాడివేపుకు తిప్పాను. నందకుమార్ కండ్లలో ఎఱ్ఱటి జీరలు – మామూలుగా ఉండేవే కనిపించాయి. కండ్లు ఎఱ్ఱటి జీరలతో ఉండటం భాగ్యచిహ్నమని వాడు తరచు అనేవాడు. కుమార్ మళ్ళీ మొదలెత్తాడు, 'కనీసం ప్రతియువకుడు కట్నం తీసుకోనని ఎందుకు తీర్మానం చేసుకోరాదూ?'

'ఈ విషయంలో ఒక చట్టంకూడా వుంది. ఇది చాల పాతపాట! ఇంతకూ నీవు తీసుకోడం జరిగిందా?'

'ఆఁ మనసా నిశ్చయించాను రేపు ఇరవై రెండు నా పెండ్లి!' అనేసి నందకుమార్, పిలుస్తున్నా వినక వెళ్ళిపోయాడు.

నేను ఆశ్చర్యంతో కూర్చుండి పోయాను!

అతి మామూలుగా వాడి పెండ్లి జరిగిపోయింది, కాబట్టి ఆర్భాటంగా నేనూ చెప్పడంలేదు. పసుపు డాగులయిన బట్టలతో, శిరస్సునుండి బియ్యం రాలుతూంటే చిరునవ్వులతో సరాసరి నా దగ్గిరకు వచ్చి, 'ఎల్లా ఉందిరా?' అన్నాడు నందకుమార్.

'ఏమిటి'

'నా పెళ్లాం!' వాడి ముఖంలో గర్వం, హోదా తాలూకు కవళికలు మెరుస్తున్నాయి!

'నీకు సరిపోతుంది!'

ఇంతలో వాడి పెద్ద బావమరది గబుక్కున వచ్చి 'ముఖ్యంగా మిత్రుల అభినందిస్తున్నాను. మీలాంటి మిత్రబృందం ఉంటంవల్లనే సంస్కరణాభిలాషలూ, స్వేచ్ఛా ప్రయత్నమూ కలుగుతుంటాయి. ఇల్లాంటి పుణ్యప్రశంసను చూసినప్పుడు నా కండ్లు చెమ్మగిల్లుతుంటాయి వీరిని నేనేమని అభినందించేది!'

'చేసిన మెప్పు చాలనూ? కొంచెం, సరదా మీ చెల్లెలు చూసుకోగలదు!' అంటూ పైకి నేను అనలేను.

నందకుమార్ ఉదాత్తమైన ఆలోచనాలు మా వేపునుండీ లోపల వేపుకు ప్రసరించాయి నేనూ అటే చూస్తున్నాను కాబట్టి, మెరుపులా తళుక్కున మెరిసిపోయిన వాడి మరదలు కనిపించింది.

'మేము చూడండి ఎంతో కష్టపడాం! ఇవాళ ఒకమోస్తరుగా నుంచోగలిగాము ఇది సంతోషంగానే ఉంది. మా నాన్న మాకోసం ఏమీ మిగల్చలేకపోయినా, ఇద్దరు పెండ్లాడాల్సిన చెల్లెళ్ళను మిగిల్చిపోయాడు. ఎంత కష్టమో ఆలోచించండి! చాటుగా, బట్టకూ జరుపుకోడమే బ్రహ్మాండమవుతూంటే, ఇంకా వేలకువేలు కుమ్మరించడం సామాన్యమా!' అని అతను ఒక నిముషం కూడా విరామం తీసుకోక, 'నందకుమార్ విశాలహృదయుడు కావడంవల్లనే, ఎవళ్ళకెంత అనిష్టమైనా తన ఆశయాన్ని చక్కగా ప్రదర్శించి కృతార్థుడైనాడు!' అని అతడు వెళ్ళిపోయాడు.

అతడి ధోరణీ, తత్త్వమూ నేను అప్పుడు బాగా అర్థం చేసుకోలేకపోయాను.

'మంచి బావమరిదినే సంపాదించావ్!'

'ఆయనకేంరోయ్! గజిటెడ్ రాంకులేదనే కానీ, సెంట్రల్‌లో అంత జీతంవచ్చే ఉద్యోగం!'

'ఆయన తమ్ముడో!'

'లీడర్షిప్ చేస్తున్నాడు!'

'అదృష్టమే! చాల బావుంది!'

'ఎక్కడి సమ్మంధం చెప్పరా! భగవంతుడు ఎక్కడెక్కడికి గీచి, ముడివేస్తుంటాడో తెలీదు. మన ఊరెక్కడా వీళ్ళెక్కడా?'

'ఔను!'

వాడూ వెళ్ళిపోయాడు. పెండ్లిలో చాల సందడిగా ఉంది, కానీ నేను ఎదురు చూస్తున్న వ్యక్తి మాత్రం కనపడలేదు. చాలసేపటినుండి ఎవళ్ళతో మాటాడుతున్నా ఆ వేపుకు చూపులుంచి చూస్తున్నాను.

నందకుమార్ చెల్లెలు ఇటు వస్తోంది. ఆమెను ఆపి, 'మీ నాన్న ఎక్కడా?' అన్నాను.

'మీకు తెలీదా? ఆయన రాలేదు!'

'ఏం?'

ఉదాసీనంగా నవ్వి హేమ వెళ్ళిపోయింది.

ఆయన రాకుండానే వీడు పెండ్లాడేస్తున్నాడా? ఇంత చేసిన ఆయన, కొడుకు ఒక ఇంటివాడు అవుతూంటె రాకపోవడం కారణం?

మౌనంతో అక్కడనుండీ లేచి ఇవతలకు వచ్చాను. స్నేహితులంతా ధూమపాన పారవశ్యంతో, చతుర్ముఖ పారాయణంలో మునిగి తేలుతున్నారు. వాళ్ళముందు లెక్కలేని కాళ్ళగజ్జెల మల్లె డబ్బులు గలగ్లాడుతున్నాయి!

'ఒరేయి! వాడు తప్పుకపోతున్నాడురా! వాడిని పట్టుకరండిరా!' అంటూ కేక వేశాడు సుబ్రహ్మణ్యం!

'రా! నాయనా! రా! ఓ పీకు పీకి, ఓ చేయి కలిపి, కాసిని డబ్బులు ఇచ్చిపోరా తండ్రీ!' అంటూ హృదయపూర్వకంగా మధుసూదన్ ఆహ్వానించాడు.

చిరునవ్వుతో వాళ్లను వదిలించుకుని గబగబా అడుగులు సాగించాను!

మండువాలో నాగరాజు సిగరెట్ తాగుతూన్నాడు.

'ఏమోయ్? మీ నాన్న రాలేదూ?'

'ఊఁ'

'ఎందుకని?'

'ఈ పెండ్లి ఆయనకు ఇష్టంలేదు. నందానికి మరో సమ్మంధం నిశ్చయం చేసుకున్నాడు. వాళ్ళు నాలుగువేలు ఇస్తామనీ, సొమ్ము పట్టింపు లేదని చెప్పారు. ఆ డబ్బుతో హేమను వదిలించుకోవాలని నిశ్చయం చేసుకుని చూస్తున్నాడు. కానీ ఈ నందగాడు ముందే బుక్ చేసుకుని పెళ్ళికి సిద్ధమైనాడు. అంతా అయిపోయాక నాన్నకు తెలిసింది. నలుగురిలో ఇవాళ ఆయన ముఖం ఎత్తుకోలేక పోతున్నాడు. ఎవడికేం? ఎవడిసుఖం వాడికి! అందరినీ పగ చేసుకుని ఏంపొంగుతాడో కాలం తేల్చవలసిన రహస్యం!' అంటూ బుసలుకొడుతూ సిగరెట్టును నేలకేసి కొట్టి బూటు కాలితో రాచి పొడిపొడి చేశాడు!

'నీవూ కోపంగా ఉన్నావన్న మాట! మరి నీకూ పెండ్లీడు వచ్చిందనుకుంటాను. నీవు ఆమెను పెండ్లాడి మీ నాన్న వ్రాలిపోయిన తలను పైకెత్తే ప్రయత్నం చేయకూడదూ!'

'ఇప్పుడల్లా పెండ్లి చేసుకోదల్చలేదు!'

'సరే! పెండ్లి చేసుకునే తలంపుందా?'

'ఊఁ!'

'మరి ఎప్పుడయితే నేం? వయస్సు నీకూ వచ్చింది కూడా! మీ నాన్న కోసమూ, హేమ కోసమూ, మీ అన్న చేయలేని పని నీవెందుకు చేయకూడదోయ్?'

'చదువు పూర్తి కావాలి!' అంటూ నాగరాజు దూసుకపోయాడు.

కోపంతో వెడుతున్న నాగరాజు వేపు చూస్తూ నందకుమార్‌కు అత్తింటి తరపున ఎంతో బలమైన ఆలంబనము చిక్కకపోతే ఇందరికి అనిష్టమయిన పెండ్లి చేసుకోడని అనుకున్నాను.

*　　*　　*

స్నేహితమంతా ఒకచోట ఉన్నప్పుడే! ఉద్యోగం పేరిట నేల నాలుగుచెరగులా ప్రాకిపోయిన స్నేహితులగురించి కొంచెం సేపయినా అనుకునేందుకు తీరిక ఈ జీవితంలో చిక్కడంలేదు. వయస్సు పెంచుకుంటూ, ఆయువు తగించుకుంటూ, దిక్కు తెలీక బ్రతకడం వల్ల పొందబోయే లాభం యోచించుకునే ధైర్యమూ, ఓపికా లేక ముందుకుపోతూ పండిపోతున్నాను.

హఠాత్తుగ నందకుమార్ వచ్చాడు. వట్టి ఎండలో పిడుగుపడితే ఎంత ఆశ్చర్యపోతామో, అంతే ఆశ్చర్యపోయాను వాడిని చూసి! వాడు మాటలు మానివేసి చూపుల్లో దీనత్వం చిందిస్తూ చూస్తున్నాడు. అంత కాలానికి కలుసుకున్న మేము మాటా-మంతీ

చూపించాల్సింది అవసరంలో నే — అన్న విషయం ఆయనకు తెలీదూ?

'నీవు రాకూడదూ?' అంటూ నందకుమార్ మళ్ళీ అడిగాడు.

పెద్దమనిషి గా నన్నెందుకు వీడు రమ్మంటాడు? అయినా నావల్ల ఏంజరుగుతుంది?

పెద్దమనిషి గా నుంచోడానికి అందరూ తయారుగానే ఉంటారు. రిక్షావాడిమొదలు అందరూ పెద్దలే-తమ విషయాలు కానంతవరకు! పెద్దమనుష్యులకు చవుక అవుతున్న రోజు లివి! నన్నూ ఓ పెద్దమనిషిగా నందకుమార్ నేటికి చేస్తున్నాడు!

సిగరెట్ కాలికాలి వేళ్ళను కాల్చివేస్తోంది, చప్పున వదిలివేశాను.

'ఏరా! నాకు సమాధానం? నాకా ఇంట్లో చోటులేకుండా పోయింది. కనీసం కనేంతకాలం చోటుకూడా వాళ్లు ఇస్తారో లేదో!'

'ఎంతఅయినా మీనాన్న! ఈ విషయం మరచి మాటాడుతున్నావు!'

'అదీ కండ్లారా చూద్దువురా!'

ఇద్దరమూ మౌనంగా అడుగులు సాగించాము.

గడపలో అడుగు పెడుతోంటే, చంద్రశేఖరయ్య మాటలు వినిపించడంవల్ల ఆగిపోయాను.

'ఏమ్మా? అయితే తొలిచూలుకూ తీసుకవెళ్లేందుకు రాలేదన్నమాట! చాలబావుందమ్మ! తల్లిదండ్రీ లేనిదానివి! ఆమాత్రం మీ అన్నకు బుద్ధిఉండఖర్లా! హుఁ పశువులు! జ్ఞానశూన్యులు!' అని ఆయన ఎందువల్లనో ఓ క్షణం ఆగాడు.

'హుఁ ఫరవాలేదు లేమ్మ! నీకు లేంవల్లా తల్లే! నేఉన్నాగా! నీ పెండ్లికి రాలేక పోయా! ఇవాళ నిష్పహాయంతో నా ఋణం తొక్కింది తండ్రినై నే కాదూ! ఈ బంధాన్ని తెంపుకోవాలని అనుకోను. రేపుపోయి హేమను పిలుచుక వస్తాను.'

నేను నందకుమార్ వేపు చూశాను. వాడిముఖం వల్లగా తెరు మళె అవుపడింది.

నేను లోపలికి అడుగులు వేశాను.

'ఓఁ రా నాయనా! రా! అవపష్టంలేదే!' అంటూ ఆయన ఆహ్వానించాడు.

'ఉద్ధారకుడు ఏడీ కనపడలేదూ? ఇక్కడకొత్త చోటుకు ఒక్కరైనా తెచ్చి వదలి షికార్లు కొడుతున్నాడా?'

'ఇక్కడే ఉన్నాడండీ' అంటూ చుట్టూ చూశాను.

నన్ను చూసి శారద లోపలకు వెళ్ళింది.

నందకుమార్ ఎక్కడా కనపడలేదు. వంటింట్లో వాడి మాటలు వినిపిస్తున్నాయి. బహుశా దొడ్డిత్రోవగుండా వెళ్ళి ఉంటాడు. ఈ ఇంట్లోకి వాడి ప్రవేశం సింహద్వారంలోంచి కాదన్న మాట!!

'నే వెళుతున్నా నమ్మాయ్! రేపు సాయంకాలంగానీ రాను' అంటూ కాళ్ళు చెప్పుల్లో ఉంచి, గావంచా ఝాడించి 'హేమను పిలుచుక వస్తానోయ్! ఆమె కూడా వస్తే తోడుగా బావుంటుంది కదూ!' అని వెళ్ళిపోయాడు చంద్రశేఖరయ్య.

ఆ పితృ హృదయం ఎంత ఆర్ద్రమయమూ, కరుణామయమూ అయిందో చెప్పడం అలా ఉంచి, తండ్రి కాబోయే నందకుమార్ ఊహించుకోలేక పోవడం విచిత్ర మనిపించింది.

నందకుమార్ నవ్వుతూ ఇవతలకు వచ్చాడు.

'నీవు రాబట్టి అలా అయింది. లేకపోతేనా!' అంటూ వాడు తన పాత దురభిప్రాయాన్ని వదలిపెట్టలేదని తెలిపాడు.

'నేను రాబట్టి ఇలా జరిగిందా? నా ముఖమేనా చూడకుండానే, నీ భార్యను ఓదార్చిన ఉదారుడికి నా సలహాలు కావాలా? ఆయనలోమంచి నీకు కనబడ్డంలేదు. ప్రతి మాటనూ, చేతనూ విమర్శాత్మకదృష్టితో చూడ్డమే కారణ మనుకుంటాను. బహుశా, నిన్ను దూరంగా తరుముతున్నదీ నీతార్కిక బుద్ధే అంటూ తెలుసుకోలేక పోతున్నావు' అంటూ నేను పైకి అనలేదు.

నిశ్చలంగా వాడి ముఖంలోకి చూస్తూ కూర్చున్నాను. 'అయితే మీబావ నామకరణానికయినా వస్తాడా?'

'ఓఁ తప్పకుండా! పాపం తీరిక చిక్కదుట.'

'నీభార్యను తీసుకవెళ్లంది తీరిక చిక్కక నేనా!'

'అబ్బె! ఏమయింది నిశ్చయంగా చెప్పడం కష్టం! ఉండు కాఫీ తెస్తాను' అంటూ ఆసంభాషణ పొడిగించడం ఇష్టంలేక వాడు లోపలకు వెళ్లాడు.

పాలేరు కుర్రాడు ఇంతలో ఓగంపలో ఏవో సామాన్లు తెచ్చి, 'అమృతం సీసా ఉందిట ఇస్తారా బాబూ! అమ్మగారికి ఇప్పుడే కావాలంటగా!' అడిగాడు.

'ఎవరు చెప్పార్రా?' అంటూ నందకుమార్ సీసా తెచ్చి ఇస్తూ అడిగాడు.

'పెద బాబు పొలెం పోతా చెప్పిండు!' అనేసి వాడు వెళ్ళి పోయాడు.

* * * *

బట్టలు కొనేందుకు నందకుమార్ బజారుకు వచ్చాడు.

'పాదపూజలు, ఎంత తల్లి దండ్రులు కాక పోయినా సాకారు గదూ, అంచేత వాళ్లకు చేయడం మర్యాదగా ఉంటుంది. తొలి కాన్పురు ఇంటికి తీసుక వెళ్లలేని వాళ్లకు ఎందుకు పొమ్మంటాడు నాన్న! అన్నిటికీ ఇల్లా చిక్కులుగా ఉన్నాయి' అంటూ నందకుమార్ నిట్టూర్చాడు.

వాడికి ఆకపిల పుట్టింది!!

'మీ బావమరిది సకుటుంబంగా విజయం చేశాడా?'

'ఆఁ కాగు వేసుక వచ్చాడోయ్! అప్పుడే వరసలూ అవీ ఇవీ తిరగవేశారు. ఆయనకు పాలుగేళ్ళ కుర్రాడు ఉంటం తమాషాగా ఉందనుకో! వాళ్ళకంతా బట్టలు పెట్టడం మంచిదికదూ? మళ్ళీ మళ్ళీ మన ఇండెకు వస్తారా?'

'అవును! తీరిక చిక్కదు!'

'ఆఁ సేవస్తానోయ్!' అంటూ వాడు బట్టలంగడిలోకి దూరాడు.

నేను కంపెనీ వేపు నడక సాగించాను.

నాకీ పాద పూజల గొడవలూ, మర్యాదలూ తెలీవు. అయినా ఈ కాలంలో ఉన్నత స్థానమే నా, తరగనంత ధనమేనా లేని ఎంత విలువగల్ల వాడికైనా గౌరవం జరగడం లేదు. లోకంలో గౌరవా లన్నీ వాళ్ళకే అయిపోతున్నాయి! అగ్ని తేజస్సుకు నివురు కప్పినట్టుగా ప్రకాశింపదగినవాళ్ళు గుప్తమే అయిపోతున్నారు. డాంబికులకూ అవకాశ్యాచారులకూ, అత్యాచారులకూ వెలలేని గౌరవాలు ఎదురవుతున్నాయి!!

నేను ఇంట్లోకి అడుగు పెట్టేసరికి ఇల్లంతా గంభీరంగా ఉంది. ఎక్కడా అలికిడి వేయడం లేదు. బంధువులతో కోలాహలం కావాల్సిన ఈ ఇల్లు బోసిపోయేందుకు కారణం?

జానకి పాపని గుండెకు హత్తుకుని చిన్నగా నవ్వింది. ఆమె కంఠంలో సంతోషం తృప్తితో కలసి మెరిసి పోతోంది. మాతృత్వ గర్వంతో, ఓ చిన్ని ప్రాణి కొత్తగా చేరినందుకు స్పర్శతో కలుగుతున్న పులకింతతో పారవశ్యంతో. ఆమె ఏదో లోకాల్లో ఉంది. ఆమె ధ్యానముద్రను నేనెంతమాత్రం భంగం చేయదలుచుకోలేదు. అది అవిచ్ఛిన్నంగా సాగాలని కోరుకుంటున్నాను!

ఆమె చప్పున తలఎత్తి చూసి సిగ్గుపడింది.

'ఊర్కోండి! నాకు బయటకు వెళ్ళాలి. మావ గారున్నారు పిలవనా?'

'ఎందుకూ? నందా ఎక్కడకు వెళ్ళాడు? ఆకుతోరణాలూ, గడపల పచ్చదనమూ కనిపిస్తాంది కానీ, కోలాహలం ఏమీ వినరాదు!'

ఆమె సన్నగా నవ్వి, 'మీకు తెలీదూ? మేనత్తగారింటో చెయ్యాలని సంకల్పం! ఈ ఇలు చాలదని వారి భయం!' అంది.

'మీ అన్నయ్య సకుటుంబ సపరివారంగా వచ్చేశారని వినికిడి! వారి దర్శనం...'

'ఎందుకు అంతగా కలవరిస్తున్నారు?'

'వారికి మీ మీద బాగా అపేక్ష ఉందని తెలిసింది. నందాను, బహుశా రాకెట్‌లో పెట్టి చాల పైకి తీసుక వెళ్ళిపోతాడని విన్నాను.'

'అపేక్ష!' ఆమె భారంగా నిట్టూర్చింది. ఓ నిమిషం మౌనంతో గడిపి, 'ఎప్పుడు అమ్మానాన్నలు పోయారో, వాళ్ళ ప్రేమలు ఎంత చిక్కనివో తెలీనే లేదు. కానీ వీరిని చూసి పితృ హృదయం ఊహించుకో గలుగుతున్నాను.' అని ఆమె ముఖం చాటు చేసుకుంది.

'నిన్ను తీసుక వెళ్ళలేదని కోపంతో అన్నావు!'

'కోపగించుకోవాల్సిన మనుష్యులు కానప్పుడు ఎవళ్లమీద కోపం?'

ఆశ్చర్యంతో ఆమె వేపునుండీ చూపులు పాప మీదకు మరల్చాను. పాప అన్నిటికీ అతీతంగా ఏదో లోకంలో ఉంది.

'చూస్తారుగా జరుగబోయే వింత!'

ఏమిటో అడగాలనుకుని నోరు తెరచేసరికి చంద్రశేఖరయ్య రానే వచ్చాడు.

'ఏం నాయనా? నుంచునే ఉన్నావు! వీరికి కాఫీ తెచ్చి ఇవ్వమ్మా!'

'ఇప్పుడేమీ వద్దు! తాగివచ్చాను!'

'అయినా తాగుదూ! తాగి ఓ పని చేసిపెట్టు నాయనా! చేస్తావా?'

తల ఊపాను.

'అయితే కొంచెం బట్టలు కొనుక్కురావోయ్! దంపతులకు పెట్టవలసిన బట్టలు! చీరె, రవికలూ లైట్ రోజ్‌లో ఉండాలె. నావి సూటాయాలో తీసుకో! మరో పంచెల చాపు పట్టు సరిహద్దుల్లో ఒకటి తెస్తే చాలు!' అంటూ డబ్బు అందించాడు అతను.

"కోటా తెస్తానే!"

"అంతే! అంతే! ఇదంతా కేవలం నటన! ఎందుకో ఆ భగవంతుడికే తెలుసు! నేనెవ్వరికీ అన్యాయం చేయబోవడం లేదని పరమేశ్వరుడు తెలుసుకుంటే నిశ్చింత" అంటూ ఆయన గబగబా వెళ్లి పోయాడు.

"తెర తీసినట్టు కొంచెం కొంచెం అర్థం అవుతూంది!" అంటూ శారద కాఫీ తెచ్చి అందించింది.

"ఊహూఁ నాకేం తెలిసింది లేదు!"

"ఓ నాలుగు గంటలు పోనీయండి! ఈ మాట మీరు అనలేరు." అని ఆమె బలహీనంగా నవ్వింది.

కప్పు క్రింద ఉంచి బయటకు వచ్చాను.

పెద్ద పొట్లంతో అతను వెళ్ళే సరికి ఇల్లు కోలాహలంతో నిండుకుని ఉంది.

చంద్రశేఖరయ్య నన్ను చూసి నవ్వి, "గావంచాలు మరిచాను చెప్పడం!" అన్నాడు.

"అవి తెచ్చాను!" అంటూ పాకెట్ అందించాను.

"చీర లైట్ రోజులో దొరికింది కాదూ? హేమను సముదాయింపలేను."

"మీ రెందుకూ? ఆమె భర్త కూడా వచ్చాడాయె!"

నవ్వుతూ అతను వెళ్ళిపోయాడు.

నామకరణానికి అంతా సిద్ధమవుతున్నారు. నందకుమార్ పెదాలమీద ఓ చిరునవ్వును అతికించుకుని ఆర్భాటంగా తిరుగుతున్నాడు. తండ్రి హోదాలోకి వచ్చాడాయె! అదెంతటి హోదానూ, సంతోషాన్నీ కలిగిస్తుందో కూడా నాకు తెలీదు!!

నందకుమార్ తన కూతురు పేరు ఎప్పుడో ఆలోచించుకుని ఉన్నాట్లుగా ఉంది అందుకే అక్కడ ఎంతమాత్రమూ ఆలస్యం కాకుండా బియ్యపు పళ్ళెరంమీద ఒంటిరాతి ఉంగరంతో రాసి, ఆ పిల్ల చెవిలో మూడుసార్లు చెప్పి నవ్వుకున్నాడు నందకుమార్!

శారద కూతురును చూస్తూ మురిసిపోతోంది.

నంబుడి పెద్ద బావగారి ప్రక్కనే నేను కూర్చుని ఉన్నాను. ఆయన కళ్ళద్దాలు తీసి, కళ్ళు నులుముకుంటూ నా వేపు చూసి, 'ఇవాళ్టి సంతోషం రేపుగదు వదలించుకునే నాటి కష్టం ఎవాళ్ళూ ఊహకు చిక్కదు.' అన్నాడు.

'నిజమే! అయినా నందా కేం? మీ రున్నారుగా! మేనరికం ఇహ కష్టమేముంది?'

ఆయన నవ్వబోయి ఎందువల్లనో ఆగి, 'అవునయితే మంచిదే కానివ్వండి! రేపటి కాలం మంచి కాదు! ఖచ్చితంగా నిశ్చయించే సాహసం నాకు లేదు! పిల్లాడు మనవాడయినా, వాడి మనస్సు మనది కాక పోవచ్చు!'

'మీ జ్యోతిషానికి ధన్యవాదాలు!'

మాటకూడా విని సహించలేని ఈ లక్ష్మణరావు రేపు కొడుకన్నా ముంగటికి వచ్చి 'ఎన్ని వేలు?' అంటూ అడగడూ?

'మీకు పాదపూజలు జరుపుతారట వస్తారా?' అంటూ ఆయన శ్రీమతి పిలిచింది.

"ఓఁ పాదపూజ! ఎందుకూ? ఈ కాలంలోనూ ఉందా?" అంటూ ఆయన పకపకా నవ్వి, 'అయినా పూర్వాచారాలు గౌరవించి పాటించేవాళ్ళను చూస్తే మటుకు నాకు సంతోషం కలుగుతుందండీ!' అని లేచిపోయాడు.

హేమ మూతి ముడుచుకుని వెళుతోంది. ఆమె వెనకాలె ఆమె భర్త వెళుతున్నాడు. ఆ ఇద్దరూ సభలోంచి ఎందువల్ల 'వాకవుట్' అవుతున్నారో నాకు అంతు చిక్కలేదు.

రామదాసుగారు ఆపి, 'ఎందుకూ ఇంత ఉడుకు?' అన్నాను.

'ఇంకా ఉండమంటావా? పురుడుపోస్తే ఆడపిల్లకు చీరఇచ్చే దోవలేదూ? తొలిచూలుకు ఇంటికి తీసుకవెళ్ళలేని పెద్దమనిషికి పాదపూజలట! వెళ్ళి,

పోగాను. స్త్రీని మాయాశక్తి అంటారే, అదివాస్తవమే!! "మహా శాయనా! ఈ కలకలం ఎల్లా శాంతించాలో నాకు తోచడములేదు. నేను భర్త గనుస్తూనే ఉన్నాను. ఆయనకు దొడ్డిత్రోవంట మర్యాదలు జరిగాయి! ఇంత ఖర్చుకు నాగరాజు నాగరాజే అయి బుస్సలు కొడుతున్నాడు. ఇంతకూ తండ్రినయిన నాకు మర్యాదలు జరగలేదు. అంతా నాదే! నాకేం జరిగేది? ఎటునకయినా నాకూ జరగడం ఉచితమే!" అంటూ చంద్రశేఖరయ్య భారంగా నిట్టూర్చాడు.

ముసలాయన ఆవేదన అర్థమయింది. తనకూ మర్యాదలు కొడుకుద్వారా జరగలేదని ఆయనదుఃఖం! దీనికి నేనేం చేయగలను?

శారద నోరు తెరిచింది 'వాళ్ళకు దొబ్బిపెట్టాలనే ఆరాటం ఆయన కెందుకు కలిగిందో తోచడము లేదు. తొలిమాలుకు ఇంటికి పిల్చుకుపోయి ఓ చక్కపెట్టేన్న ఇంగితజ్ఞానం లేకపోయాక మనం ఇవ్వాల్సిన జరూరు ఏముంది? ఎవళ్ళకుండదు పుట్టింటి నుండీ మర్యాదలు పొందాలని? నేను పుట్టిల్లు లేనిదాన్నే అయ్యానుగా!'

'ఇప్పుడేం చేయాలంటావ్? ఇంక పదినాళ్ళైనా నేను ఉండను. నేను ఉండాలనుకున్నా అల్లుడు కోడెనాగులా బుస్సలు కొడుతున్నాడా, ఉంచడు! ఈమె విషయం ఎవళ్ళు చూడాలె! కొంతకాలమేనా మరదలును వదిలిపెట్టి వెళతారేమో అడగరా అంటే నందా వినడంలేదు!'

ఇంతలో నందకుమార్ లోపలకు వచ్చి, 'ఏమిటి అతిసీరియస్‌గా ఉన్నారు? చూశావా శారదా మీ అన్నయ్యవాళ్ళు ఇప్పుడే వెళతారుట!' అన్నాడు.

'వెళ్ళనివ్వండి!'

'అన్నయ్యమీద అలిగావా?'

'పుట్టినప్పటినుండీ లేదు!'

రంగంలోకి స్వయంగా లక్ష్మణరావుగారే అవతరించారు.

'రాత్రికి వెళతాం మామగారూ!' అన్నాడు లక్ష్మణరావు!

"ఏం శారదా! మేం వెళతామే! నాల్గు నాళ్ళయినా సర్దాగా గడిపేందుకు శెలవులు దొరకలేదు. ఇప్పుడిప్పుడే నిన్ను కదిలించడమూ అంతమంచిదికాదు. ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకోమ్మా! అన్నీ తెలుసు అనుకో! ఒకసారి మావూరు రండి నందకుమార్!' అంటూ అంతలోనే నావేపుకు అతను తిరిగి 'రాత్రి ప్రయాణం చేస్తామండీ!' అని పూర్తిచేశాడు.

మళ్ళీ నాగరాజు ఆఫీసరుకు సరి ఉద్దీ అని నిరూపించుకునేందుకు వచ్చాడు.

'వదినెర తోడుగా, మీ చెల్లెలిని నాలునాళ్ళు ఉంచకూడదూ! రెండు మూడునెలలకు మీరే పిల్చుకుపోవచ్చు! పసిపిల్లతో పాపం ఆమెఏంచేసుకుంటుంది?'

లక్ష్మణరావు గంభీరంగా నిట్టూర్చి 'ఆమెకు సమ్మంధాలు వస్తున్నాయి! పెండ్లి చప్పున చేసి భారం దించుకోవాలని ఆలోచన ఉంది!' నందకుమార్‌కు ఆ సమాధానం కొంచెం కోపం కలిగించిందని, వాడి కళ్ళే చెబుతున్నాయి! బావ వేపే నిశితంగా చూస్తూ, 'తొందరగా సామాన్లూ, అవీ, ఇవీ సర్దుకోండి బావా! మీ కాలస్యం అవదూ? కబుర్లతో ఎందుకూ పొద్దుపుచ్చుకోడం? పిల్లాజల్లా తెమిలేసరికి అస్తమానం అవుతుంది!' అనేశాడు.

లక్ష్మణరావుగారి భార్య అక్కడకు వచ్చి, 'కొంచెం పెందరాళె భోజనాలు తెమిలితే పొద్దుండగానే బయలుదేరదాం!' అంది. 'వంటవాడు వెళ్ళిపోయాడు. మళ్ళీ మరొకడిని పట్టుకవచ్చి వంట చేయించేసరికి పొద్దుపోవడం జరుగుతుంది!' అన్నాడు మళ్ళీ నందకుమార్!

ఈ మాటతో ఆమె మూతి ముడుచుకుని వెళ్ళిపోయింది,

'అయితే మేం ప్రయాణం చేస్తాం!'

'ఎంతో మంచిది!'

శారద నవ్వుతూ, 'తడిస్తే గుడిసె కప్పుకోడమూ, తకి బొప్పి కడితే వంగి నడవడమూ మానవులకంతా సహజమే! కానీ త్వరలో కండ్లు తెరవడమే కోరుకోవాల్సింది!' అంది.

లక్ష్మణరావు కుటుంబంతో కారు కదిలిపోతూంటే, అందరూ బరువుదించుకున్నట్లుగా తేలిగ్గా చూస్తూ నుంచుండి పోయారు!

# వార్నిష్‌లు - రంగులు తయారుచేయుట

శ్రీ అయ్యగారి సోమయాజి

ఆయిల్ & కలర్స్ ట్రేడ్స్ జర్నల్ వాల్యూం XLVII, నెంబరు 849 పేజి 292 లో శ్రీ జే జి ఇంతోష్. "హిందూదేశము - ఆ దేశములో దొరకు అవిశనూనె. సారాయి, కర్పూరతైలము. లక్క, అవి పూస వగైరాలతో తయారు కాబడిన స్పిరిట్ వార్నిష్‌లు, నూనె వార్నిష్‌లు, రెండు రకముల వార్నిష్‌లను మనకు పంపగలదు." అని వ్రాసినారు.

సామాన్యముగా పలుచన చేయు వస్తువులుకూడ అవసరము. అవిశనూనె, రంగులు చక్కని పాళ్లలో కలిపినచో బ్రష్‌తో వ్రాయుటకు వీలేనంత చిక్కగా నుండును. గాన పల్చనచేయు, 'థిన్నరు,' అవసరము మరియు చిక్కగ రాచినచో పెయింటు చెక్క లోనికి యింకుటకుకూడ థిన్నరు సహాయపడును. థిన్నరుయొక్క భాగమునుబట్టి పెయింటును హెచ్చు లేక తగ్గ తళుకు కలదిగా చేయవచ్చును. పెయింట్సులో థిన్నరు హెచ్చుగా ఉన్నచో, పెయింటు ఆరిన తరువాత రంగు హెచ్చుగా వుండుటచేత, ఆరిన తరువాత ఫ్లాటు (Flat) గా వుండును.

పెయింటు పొరను బలపరచి కాపాడుట, రంగు, ఒపాసిటీ నిచ్చుటయే రంగు (Pigment) యొక్క ముఖ్యమైనపని.

వైట్ లెడ్, ముఖ్యముగా ఎఱ్ఱసీసం (గంగ సిందూరం) అవిశనూనె ఆర్పుటకు సహాయపడును. మరియు కాటుక మసి అవిశనూనెను ఆలస్యముగా ఆరునట్లు చేయును.

వార్నిష్‌లో అవిశనూనెవల్ల యేర్పడు పొర రెసిన్సు ముఖ్యముగా కోపాల్సు చేర్చుటవల్ల బలపడును. చెట్లనుండి కారు జిగురు రెండు రకములు 1. నీటిలో కరుగునవి. ఉదాహరణ:— తుమ్మబంక. 2. నీటిలో కరగనివి. ఉదాహరణ:— కోపాల్సు. వార్నిష్ గట్టి, తళుకు, మెరుపు అనుపొరను యిచ్చును. సామాన్లు, రైలుబళ్లు వగైరాలు అలంకరించుటకు వాడుదురు.

అవిశనూనెను బాగుగా వార్నిష్‌తో తయారు కాబడిన పెయింట్సును 'ఎనామిల్' పెయింట్సు అని పేరు. కేవలం నూనెతో చేయబడు కోటింగు (పొర) కంటే ఎనామిల్ కోటింగు హెచ్చు గట్టిదనము, చాలాకాలముండు తళుకుగల పొర నిచ్చును. ఇవి విరివిగా అలంకరణములకు వాడుదురు.

11. ఆయిలు వార్నిష్ ద్రవ్యములు. లిన్‌సీడ్ ఆయిల్ (అవిశనూనె)-మనదేశపు అవిశనూనె బాల్టిక్ నూనె తరువాత శ్రేష్ఠమైనది. సాల్వెంట్సుతో తీసిన నూనె పెయింట్సుకు పనికిరాదు.

క్రొత్తగా గానుగ ఆడిన నూనెలో మడ్డి వుండును. నిల్వయుంచినచో, ఈ మడ్డి అడుగుకి దిగును. మన దేశపు అవిశనూనె వడగట్టినచో మరికొంత మడ్డి దిగును వార్నిష్‌కు వాడునూనెను కొన్ని సంవత్సరములు నిల్వయుంతురు.

చాలాకాలం నిల్వయుంచిన నూనె చాలా పనులకు పనికి వచ్చును. తెల్లపెయింటుకు వాడు నూనెను కొంచెము సల్ఫ్యూరిక్ ద్రావకంతో బ్లీచ్ చేయుదురు.

బోయిల్డు ఆయిల్: 'మరిగించిన నూనె' అన్నంత మాత్రాన నూనెను నిజంగా మరిగించరు. ప్రస్తుతం నూనెను 150°C వరకుగాని అంతకంటె తక్కువ వేడికిగాని కాచుదురు. కొందరు వేడినూనెలోనుంచి గాలిని పంపుదురు. కాచునపుడు, "డ్రయర్సు"ను చేర్చుదురు. ఇవి లెడ్ రెసినేట్సు & లినోలియేట్సు ఆఫ్ లెడ్, మేంగనీసున్ను కోబాల్టు సాల్ట్సు కూడా ఆర్పునట్లు చేయు డ్రయర్సే.

మనదేశంలో మంచిరకం డబుల్ బోయిల్డు ఆయిలు 6 గంటలలోను, పేల్ బోయిల్డు నూనె 10 గంటలలోను ఆరును—మరిగించిన నూనె పచ్చినూనె కంటె త్వరలో ఆరును-గట్టిపొర నిచ్చును.

దిగుమతి చేసిన నూనెకంటె సుప్రసిద్ధ దేశీయ కంపెనీలు అమ్ము నూనె శ్రేష్ఠతరము. కొన్ని నూనెలు

త్వరగా ఆరవు. మరికొన్ని త్వరగా ఆరినా మంచి పొర నివ్వవు.

కల్తీ: సామాన్యంగా పచ్చినూనెలో కల్తీ వుండదు. మరిగించిన నూనెలో తరుచు కల్తీ ఉండును. తిక్కినూనెలు, చేపనూనె, పెట్రోలియం, అరిపూస వగైరాలు కల్తీలో ఉండు వస్తువులు.

కల్తీనూనె పెయింటుకు పనికిరాదు.

కల్తీనూనెలో కొంతభాగం పెట్రోలు వుండును. ఇది చౌకరకము పెయింట్సులో కూడా నిరుపయోగము.

ఆరే ఇతర నూనెలు: టంగు ఆయల్-కఱ్ఱనూనె చైనాదేశానిది. పచ్చినూనె త్వరలో ఆరును. ఆరిన తరువాత యేర్పడు పొర పెయింట్సుకు పనికిరాదు. ఇది విరివిగా వార్నిష్‌లు చేయుటకు ముఖ్యముగా అమెరికాలో వాడబడుచున్నది. ఈ వార్నిష్‌లు నీటిని చొరనీయవు గాని, చాలాకాలం మన్నదు.

చేపనూనె: పడమటితీరాన చేపనూనె పరిశ్రమ, లోగడే గలదు—ఇది చౌకగుటచేత, పనికిరాకపోయినా, తరుచు కల్తీ చేయుటకు వాడుదురు.

సోయాబీన్సునూనె: అవిశనూనె, లేక కఱ్ఱనూనెలో కలిపి యీ నూనెను పెయింటు వ్యాపారంలో వాడుదురు. ఇది త్వరగా ఆరదు. కాని అవిశనూనె చాలా గాయకంగా యున్నపుడుమాత్రం కల్తీకి పనికివచ్చును.

ఆముదం—పొగగింజల నూనె: ఈ నూనెలు పెయింట్సులో వాడబడుచున్నవి.

టర్పెంటైను - కర్పూరతైలము: కర్పూరతైలము పెయింట్సులో పల్చనచేయుటకు (దిన్నర్) క్రిందను, వార్నిష్‌లలో సాల్వెంటు క్రిందను వాడుదురు. ఇది ప్రాణవాయువును గ్రహించును. ప్రాణవాయువును గ్రహించు శక్తిగల వసువులమీద (ముఖ్యంగా పెయింట్సులో అవిశనూనెమీద) శక్తివంతమైన, 'ఆక్సడైజింగ ఏజంటు'గా పనిచేయును—Out-lines of Organic Chemistry, Page 146 F. J. Moor, 1910)

అవిశనూనెయొక్క ప్రాణవాయువును గ్రహించు శక్తి ఆ నూనెలో, "డ్రయర్సు" అనబడు వస్తువులుండుటవలన. అత్యధికమగును. ఈ విధానము ననుసరించి, మరిగించుటకు బదులు రంగును మార్పుచేయని వస్తువులను మామూలుగా టెంపరేచరుకే చేర్చి కొంత ప్రాణవాయువును అవిశనూనెచేత గ్రహింపజేసి, అవిశనూనెను వాడుటకు పనికివచ్చునట్లు చేయుదురు—తేలికరంగు చూచుటకు అను (ట్రాన్స్పేరెంటు) వార్నిష్ దీనివలన సిద్ధించును.

పై సంగతులవలన పెయింట్సులోను, వార్నిష్ లోను కర్పూరతైలము వహించు సర్వాధిక్యత గ్రహించవచ్చును.

ప్రపంచములో అమెరికా కర్పూరతైలము ప్రసిద్ధమైనది. కాని చాలా మంచిరకములైన కర్పూరతైలములు, కేవలం అమెరికా కర్పూరతై. పువాసన లేకుండుటచేతనే నిరాకరింపబడుచున్నవి.

మనదేశములో కర్పూరతైలము తొలుత 1895 వ సంవత్సరములో తయారుచేయబడినది—ఆ రకం బాగులేదు. దానిమీద గ్రంథములు అరుదు. రసెర్చి ప్రయాస. ప్రవీణులు తక్కువ.

కాని 1912 లో మన పనివారికి, "ఫ్రాన్సులోని, బోర్డో విశ్వవిద్యాలయంలో, నావల్ స్టోర్సులోని సైన్సు ఫాకల్టీవారు," కనిపెట్టిన యోగం లభించింది. ఈ యోగం ఫ్రాన్సులోని కర్పూరతైలం తయారుచేయువారికి అత్యధికమైన లాభమును చేకూర్చినది.

ఈ అనుభవంతో లబ్ధిని పొందుటకు హిందూదేశపు కర్పూరతైలము తయారుచేయువారు ముందంజవేసిరి. ఫ్రెంచిదేశపు ఆవిరిబట్టీ విధానం, 1915 లో లాహోరు సమీపాన, 'జాలో' వద్ద, పంజాబ్ పారెస్టు డిపార్టుమెంటు ఫ్యాక్టరీద్వారా పనిచేయుట ప్రారంభించినది.

నాణ్యమైన పకటోరకం కర్పూరతైలము, ప్రశస్తమైన అరిపూసను తయారుచేయు విధానమును కనిపెట్టిరి. బరేలీకద్ద యు. పి. పారెస్టు డిపారుమెంటువారు వేరొక ఖార్ఖానా పెట్టిరి. హిందూదేశపు పైనురెజిన్సువల్ల (గంగఫిరోజా) అత్యుత్తమమైన కర్పూరతైలం మనకు లభించగలదు.

(పురాణసింగుగారు—పారెస్టుబులెటీను. నెం. 24. 1913.)

ఈ విషయంమీద మరికొన్ని ప్రయోగములను బెంగుళూరులో, ఇండియన్ సైన్సు ఇన్‌స్టిట్యూటులోని డాక్టరు పొలరు దొరగారును, డేరాడూన్

లోని, Forest Research Institute లోని A J. టర్నర్ (ఇండియన్ ఫారెస్టు రికార్డు 1918 వాల్యూం 6, భాగం 6.) గారును చేసిరి.

జావాటర్పెంటైన్ అత్యుత్తమమైనది. అన్ని కర్పూరతైలములవలెనూ, అది చాలాకాలం నిలువయుండుటచేతను పాడగును (J. G. Mc Intosh Manufacture of Varnishes. Vol III. Page 110.) గారి; వేడి వెలుతురు తగలనిచ్చుటచేతకూడ పాడగును.

2. 3 వ రకాల కర్పూరతైలములవల్ల మేలుగా కొట్టుకమసి, తయారుచేసి; లబ్ధినిపొందవచ్చును.

కర్పూరతైలపు ప్రతినిధులు: కర్పూరతైలపు ప్రతినిధిలో తక్కువ వేడికి మరిగే (Low Boiling point) నూనెలు ఉన్నచో, అంటుకుపోయేఅపాయము గలదు. త్వరలో ఆవిరి అయిపోవును. ఎక్కువ వేడికి మరిగేనూనె లున్నచో పూర్తిగా ఆవిరి అవదు.

ప్రతినిధులు చౌక అగుటయేగాక, ప్రాణవాయువును గ్రహించవు. గాన నిలువయున్నచో పాడుగారేవు. ఆవిరి అయిపోయిన తరువాత మిగిలిపోవుట యుండదు.

పెట్రోలియం సంస్కృతికరము ప్రతినిధి. అవిశె నూనెను కరిగించును. వార్నిష్ చేయుటకు పనికివచ్చు గట్టి జిగుర్లుమాత్రము కరగవు గాన, దానంతటది ఒక్కటిమాత్రము, పెయింట్సు, వార్నిష్‌లు, ఎనేమిల్ పెయింట్సులలోను వాడరు. దీనిని కర్పూరతైలములో కలిపి మాత్రము వాడుదురు.

వార్నిషులలో హెచ్చుభాగము సాల్వెంట్ (Solvent) కావలసియుండుటచేతను, కర్పూరతైలము ఆవిరి అయిన తరువాత మిగులు జిగురుగాలికి పాడగు స్వభావము కలది అగుటచేతను. కర్పూరతైలములో కొంతభాగము ప్రతినిధిని వాడుట అవసరము

— తారుబట్టీలలో వచ్చు వస్తువులు వార్నిషులలో వాడదగిన మంచి సాల్వెంట్సు.

కోల్ తారు డిస్టిలేట్సులలో ఆవిరియగు స్వభావముగల వాష్పాలు, బెంజీను, ప్రత్యేకపనులకు పనికివచ్చును. బర్మాలో బెంజీను, లోగడనుంచి తయారు చేయుబడుచునే యున్నది.

రెజిను (జిగురు) చెట్లనుండి కారును: అసల్ పెయింట్సులో జిగుర్లను వాడరు. (నీటిలో కరుగునది జిగురు. ఉదాహరణ:- గుమ్మజిగురు సారాయిలో కరుగునది. రెజిను. ఉదాహరణ: కోపాల్సు) కాని వార్నిషులలో మాత్రము వాడుదురు. గాన ఎనేమిల్ పెయింట్సులో భాగంగా వుండును.

కోపాల్సు: జాంజిబారునుండి వచ్చు కోపాల్సును ప్రసిద్ధికలవి. ఫిలిప్పైన్ దీవులనుండివచ్చు 'మేనిలా కోపాలు,' న్యూజిలేండునుండివచ్చు, "కౌరి" ఉపయోగకరమైన వార్నిషు రెజిను. కాని ఆఫ్రికా కోపాల్సుకు సాటిరావు.

దామరు: తెల్లదామరు ప్రచురపరిమితిలోవుల బారు, కెనడాలనుంచి వచ్చును. (చూడుము. Oleo-resins from Hardwickia pinnata by K. Sita Rama Ayyar. Journal of Indian Institute of Science, Vol. 2, Part III, pages29-35)

రోజిన్ (అరిపూస): బజారులో దొరకు ఇండియన్ రోజిన్ అమెరికన్ రోజిన్‌వలె నాణ్యమైనది. ఇండియన్ కర్పూరతైలము. రోజిన్లకు ట్రేడ్‌మార్కు (Chir Brand) దీనిని గవర్నమెంటువారు తయారు చేయుచున్నారు. నాణ్యమునకు గ్యారంటీ యిచ్చుచున్నారు.

రోజిన్ నూనె: రోజిన్ నూనెను పెయింట్సులో వాడరు కాని రోజిన్ స్పిరిట్ మాత్రము కొంత భాగము కర్పూరతైలపు ప్రతినిధి.

లక్క: లక్కబియ్యం అనగా ముతకలక్క. దీనిని కరిగించి బిళ్ళలక్కిందపోయుదురు.

## రంగులు

బేరైట్సు: ఇది సహజంగా దొరకు బేరియం సల్ఫేట్. ఇది రంగులను పాడు చేయదు. గాఢవాస్వస్థి - రావణాస్వస్తి = ఎలకమ్మ్రపండం — పిల్లమ్మ్రదండం బాపతులోనిది — పెయింట్సులో విరివిగా వాడబడుచున్నది — ఎందుచేతననగా (1) చౌక (2) మలకవగా నూతన్మ్రగూర్చుగును. (3) రంగులను పాడుచేయదు. — దీనితో కలసినను తటస్థముగా నుండును. (4) ట్రేన్స్పేరెంటు (5) తక్కువనూనెతో (8%) మారబడును.

ఖరీదైన రంగులను కల్తీచేయుటకు వాడుదురు. తెల్లరంగులకు పటుత్వము నిచ్చును.

తరచుగా పెయింట్సులో హెచ్చుభాగముండును. నిత్యోపయోగమునకు హెచ్చు ఖరీదు గల రంగులను చౌకపరచి ప్రతివారును వాడుకొనుటకు వీలగునట్లు చేసియుందు

బేరైట్సు హెచ్చుభాగము (నూటికి 99 లేక అంతకన్న హెచ్చుభాగం) కలిపినను తయారైన పెయింట్సురూపములో మాత్రము విశేషము మార్పు చెందదు

వైట్ లెడ్ పెయింట్సు వేడి, తడి గల ప్రదేశాలలో సులభముగా కొంతకాలానికి చెరిగిపోవును. దీనిని "ఛాకింగ్" అంటారు. కాని హెచ్చు భాగము కలిపినచో, పెయింట్సుయొక్క రక్షణశక్తి తగ్గిపోవును గాన మోతాదుగా వాడవలెను.

బ్లాంక్ ఫిక్సు: ఇది కృత్రిమముగా తయారు చేయబడిన, "బేరియం సల్ఫేటు" నీటిరంగుల పెయింట్సులలో వాడుదురు.

జిప్సం: ఇదే కాల్షియం సల్ఫేటు. (చూడు. Rec g S. S. XLVI Pages 275-276-1915) మన హిందూదేశంలో వలసినంత బేరేట్సు దొరకును— కాన జిప్సం అనవసరము—

తటస్థమైన యితరరంగులు: చైనాక్లే, ఏజ్ బెస్టస్, సూక్ష్మచూర్ణీకృతమైన ఇసక ముఖ్యమైనవి.

జేగురు (Iron Oxides) రంగులు. చౌక, మార్పుచెందక పోవుట, విస్తరించుటలచే అత్యుపయోగకరమైనది.

రెడ్ ఆక్సైడ్: కాసీస సిందూరం. అనగా అన్నభేదిని వేచుటచేత సల్ ఫ్యూరిక్ యాసిడ్ వచ్చును. సిందూరం దిగబడును. ఇండియాలో విరివిగా వాడుక లేకపోయినను, విదేశాలలో ప్రాముఖ్యతవహించినది.

పచ్చరంగు (గోపీచందు): గోపీచందు దాని అంతటగాని, సున్నములో కలిసిగాని కాకిరంగుకు వాడుదురు.

ఎఱ్ఱరంగు: పచ్చరంగు వేసిన ఎరుపు వచ్చును.

వైట్ లెడ్: తడి, వేడిగల ప్రదేశాలలో క్రమేణ చెరిగిపోవును. (ఛాకింగ్) గంధక సంపుటిలు నలుపు చేయును. బేరైట్సుగాని, జింక్ వైటుగాని కలుపుట చేత వైటులెడ్—ఈవిషయములలో బాగుపడును.

ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్సు బెంగుళూరులో వైట్ లెడ్‌ను తయారుచేయుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. పాడిగా వుండు వైట్ లెడ్‌ను వాడుట హానికారి.

జింక్ వైట్: దీనిని చైనీస్ వైట్ అనికూడ అందురు. ఇది జింకు ఆక్సైడు. దీనితో చేసిన పెయింటు హెచ్చుగా వ్యాపించు స్వభావంగలది. నునుపుగట్టిగల పొరను ఇచ్చును. ఈ పొర కాల క్రమేణ పగిలేస్వభావం గలది. గాన ఈ ఒక్కటి వెలుపల వాడుటకు పనికిరాకపోయినా, మనదేశములో తగుచు యీ విధంగా వాడబడుచున్నది. దీనిని వైట్ లెడ్‌తో కలిపిన అత్యుపయోగకారి. ఇది నలుపు అవదు గాన లోపలిభాగములో వాడుటకు చాల ఉపయోగకారి. వైట్ ఎనేమిల్ పెయింట్సుకు ముఖ్యావసరము.

లితోఫోను: జింక్ సల్ఫైడ్. బేరియం సల్ఫేట్ అను వస్తువులసంపుటి. ఇంటీరియర్ పెయింటింగుకు చాలా ఉపయోగము. ఔట్ సైడుకు వాడినచో, నల్లనగును. పగులును. జింకువైట్‌తో కలిపిన చాలా బాగుండును. వైట్ లెడ్‌తో కలపకూడదు.

లిథార్జ్: మనదేశములో తయారు చేయుచున్నారు.

రెడ్ లెడ్: రెడ్ లెడ్‌లో నూటికి 25 వంతున మోనాక్సైడు ఉండును. ఇందుచేత నే రెడ్ లెడ్‌ను నూనెలో నూరినచో గట్టకట్టిపోవును.

ఆరెంజిలెడ్: వైట్ లెడ్‌ను కలరింగ్ ఫర్నేస్‌లో వేడిచేయుదురు. ఇట్లు చేసిన వైట్ లెడ్ మానాక్సైడు అయి క్రమేణ ఆరెంజిలెడ్ క్రింద మారును.

వెర్మిలిన్: ఇది ఇంగిలీకం. లోగడవలెగాక ప్రస్తుతం దీనివాడుక తగ్గిపోయినది.

వెర్మిలిన్ ప్రతినిధి: సిగ్నల్స్, ట్రేడ్ వేండ్స్ పెయింటుచేయుటకు వాడుదురు. రెడ్ లెడ్, ఆరెంజి లెడ్‌ను, ఆర్గానిక్ లేక్సుతో కల్పి తయారుచేయుదురు.

ప్రష్యన్ బ్లూ: అన్నభేదిని, సోడియం పెర్రో సైనైడ్‌తో కలిపి ఆక్సిడైజు చేయుటవల్ల వచ్చును. ప్రష్యన్‌బ్లూను హెచ్చుభాగము బేరైట్సుతో కలిపిన బ్రన్స్విక్ బ్లూ వచ్చును. ప్రష్యన్‌బ్లూను దానంతటదే వాడవచ్చును. గాని తరుచు బేరెట్సుతో కలిపి వాడుదురు.—బ్రన్స్విక్ బ్లూ తరుచు గ్రీన్ పెయింట్సు తయారుచేయుటకు వాడుదురు.

అల్ట్రామారిన్: ఇందు సోడా, ఎల్యూమినా, సిలికా, సల్ఫర్ గలవు.

క్రోంరంగులు: ఇవి లెడ్ నైట్రేట్ లేక యాసిటేట్‌ను సోడా లేక పొటాసియం బైక్రోమేటుతో

కలిపి తయారుచేయుదురు. కావలసిన రంగునుబట్టి సోడా సల్ఫేటుగాని. కాస్టిక్ సోడాగాని చేర్చుదురు. ఇవి పచ్చని పెయింట్లు చేయుటకును, విరివిగా ఆకుపచ్చరంగులు చేయుటకు వాడుదురు.

క్రోమియం ఆక్సైడు ఖరీదైన ఆకుపచ్చరంగు. స్థిరముగానుండును. బైక్రోమేటు బోరిక్ యాసిడ్ కరిగించి చేయుదురు.

ఆకుపచ్చరంగులలో హెచ్చుభాగం బ్రన్స్విక్ గ్రీన్స్. ఇవి బేరైట్సు, ప్రష్యన్‌బ్లూ, లెడ్ క్రోమేటు కల్పిన వచ్చును.

బ్రన్స్విక్ గ్రీన్సును, "క్రోంగ్రీన్స్" అనికూడ అందురు.

క్రోమియం కాంపౌండ్సుకు మూలభూతమైన క్రోమైట్ రాయి బెలూచిస్తాన్, మైసూరులో దొరకును.

నల్లరంగులు: కాటుక, తగుమాత్రం గాలిలో, నూనెలను వెలిగించుటచేతవచ్చును. ఈ మసిని ఘనీభవింపజేసి, మూసినగొట్టాలలో కాల్చుటచేత ఎక్కువైవాడున్న నూనెనుండి వేరుచేయుదురు. మంచిరకం కాటుకమసిని, "వెజిటబుల్ బ్లాక్" అను పేరుతో అమ్ముదురు.

నేచురల్ గ్యాసును అసంపూర్తిగా కాల్చుట చేతవచ్చు మసిని ఘనీభవింపచేయుటచేత, "కార్బన్" బ్లాకువచ్చును. కాటుకకంటె చాల నల్లగానుండును. కాటుక మసికన్న చాలా రెట్లు రంగునిచ్చును. పెయింటువ్యాపారులు కార్బన్ బ్లాకును, కాటుక మసిని ప్రజలను తిరుచువాడుదురు.

ఎముకలను కాల్చుటచేతవచ్చిన బొగ్గుమసిని, డ్రాప్‌బ్లాకు, లేక ఐవరీబ్లేక్, లేక బోన్‌బ్లాక్ అందురు.

కార్బన్‌బ్లాక్ మనదేశములో తయారుకావటం లేదు.

లేంప్‌బ్లాకు, కార్బన్‌బ్లాకులు మెత్తదనమునకు, తేలికకు, నూరుటకు హెచ్చుభాగం నూనెకావటం, అత్యధికంగా రంగునిచ్చుట, ఒపాసిటలకు ప్రసిద్ధి వహించినవి. వీనితో చేసిన పెయింట్లు చిరకాలం మన్నునుగాని ఆలస్యముగా ఆరును. గాన నల్లపెయింట్లలో "డ్రయర్స్" హెచ్చుగానుండును.

గ్రాఫైటునుకూడా పెయింట్లతో వాడుదురు. ఇతర రంగులలో కలిపిన బాగుండును. తుప్పు పట్టకుండా వాడు పెయింట్లతో దీనిని వాడుదురు. సహజంగా వాటన్ ఫాల్సువద్ద కృత్రిమంగా 'గ్రాఫైటు'ను తయారు చేయుదురు. ఇండియన్ గ్రాఫైటు నాసిరకం.

వార్నిష్ తయారు చేయుట: లక్కను స్పిరిట్‌లో కలిపి, "షెల్లాక్" వార్నిష్ అనియు, "ఫ్రెంచ్ పాలిష్" అనియు అమ్ముదురు. రంగువేసిన షెల్లాక్ వార్నిష్‌ను లేకర్స్ అందురు. డామర్‌ను కర్పూర తైలములో కలిపిన "డామర్" వార్నిష్ వచ్చును.

కోపాల్ వార్నిష్: అతి ముఖ్యమైనది కోపాల్ వార్నిష్. దీనినే "ఓక్", "క్యారేజి", లేక "బాడీ", వార్నిష్ అని అంటారు. "గోల్డుసైజు" కూడ ఒకరకం కోపాల్ వార్నిష్

కోపాల్ వార్నిష్ తయారు చేయుటకు మొదట జిగురును, "రన్నింగ్" చేయుట. అనగా కరిగించుట. దీనిని "సిలిండ్రికల్" పాత్రలలో కరిగింతురు. ఈ పాత్రలకు, నిప్పుమీద పెట్టుటకు తీయుటకు వీలగునటు చక్రములను అమర్చెదరు. కోపాలను కరిగించిన కొంత భాగం పొగ ఎత్తిపోవును. తగినంత తరిగిపోవును. అయినను యీ "కరిగించడం" అతి ముఖ్యం. ఇట్లు కరిగించనిచో యీ జిగురు తర్వాతచేర్చు లిన్‌సీడ్ ఆయిల్, టర్పెన్‌టైన్‌లతో కరుగదు. కరిగించిన కోపాలుకు వెచ్చచేసిన లిన్‌సీడ్ ఆయిల్‌ను చేర్చెదరు. "డ్రయర్స్" చేర్చిన బాయిలు ఆయిల్ కన్న నిల్వయున్న పచ్చిలిన్‌సీడ్ ఆయిల్ నే సామాన్యముగా వాడుదురు. కోపాలు నూనె బాగుగా కలియునట్లు కరిగించి తగుమాత్రం చల్లార్చి, టర్పెన్‌టైనుగాని, దీని ప్రతినిధిగాని జాగ్రత్తగా చేర్చెదరు. తయారైన వార్నిషు మగ్గుట (Mature)కు కొంతకాలము నిల్వయుంచి పిదప బజారులో పెట్టెదరు. కోపాల్స్‌లో పలు రకము లుండుటచేత, పలురకముల వార్నిష్ లుండును. ఈ వార్నిష్‌లను హెచ్చుభాగం రైల్వేవారు వాడుదురు. నాణ్యమైన రకములు మాత్రమే తృప్తికరముగా పని చేయును. వార్నిష్ చేయుట సులభముగా కనబడినను, నాణ్యముగా తయారుచేయుటకు ప్రత్యేక నిపుణత కేవలం చిరకాలానుభవంవలన మాత్రమే పొందవీలగును.

రోజిన్ వార్నిష్‌లు: కోపాలు వార్నిష్‌లతో పాటు, రోజిన్ వార్నిష్‌లకుకూడా విశేష వ్యాప్తి

కలదు. గాని అవి ఎండను, వానను తట్టుకొనలేవు. కేవలం రోజన్ కిరసిన్‌లో కరిగించుటవలన, ఒక నాసిరకం రోజన్ వార్నిష్ వచ్చును.

విశేష మేమిటంటే, ఇండియాలో రోజన్ వార్నిష్, "కోపాల్ వార్నిష్" అను పేరుతో అమ్మబడుచున్నది.

కోపాల్ వార్నిష్ మాదిరిగా రోజన్ వార్నిష్‌ను తయారుచేసినచో, అనగా నూనెతో సంపుటి పరచినచో చేతికి అంటుకొనే మెత్తనిపొర (Film) నిచ్చును. దీని నివారణకు, లైమ్‌చేర్చి రోజిన్‌ను గట్టి పరచెదరు. రోజిన్‌లోని ఆమ్లము (Acid) లైముతో కలసి కాల్షియం రోజినేటు అగును. గట్టిపరచుటకు ఇతర వస్తువులను కూడ వాడెదరు. రోజినేటు వార్నిష్‌లు గట్టి, తళుకుగల ఫిలిమ్స్ నిచ్చును. కోపాలు వార్నిష్‌లను కల్తీచేయుటకు వాడుదురు. రోజినేట్ వార్నిష్‌లు శాశ్వతమైనవికావు. ముఖ్యంగా నీటిని ఎంతమాత్రము సహించలేవు. త్వరలో ఆరు పెయింట్సులో హెచ్చుభాగం కాల్షియం రోజినేటు యుండును. మంచిరకం రోజన్ వార్నిష్‌లు కొంత భాగంగాని, పూర్తిగా గాని అవిశనూనెకు బదులుగా టంగ్ ఆయిల్‌తో తయారుచేయుదురు. ఇట్టివి ఇండియాలో చేయుడంలేదు.

బేక్ వార్నిష్‌లు: కోపాల్ వార్నిష్‌లో కొంత భాగము కోపాలుకు బదులుగా, "ఆస్ఫాలం" వాడి తయారుచేసిన వార్నిష్‌ను, "బేక్ జపాన్" అందురు. బ్రన్స్‌విక్ బ్లేక్ ఇటువంటిదేగాని ఇందు కోపాలు ఉండదు. ఇందు ఆస్ఫాలం, లిన్సీడ్ ఆయిలు, థిన్నర్సుమాత్రముండును.

ఒక రకం వార్నిష్ కేవలం ఆస్ఫాలంను పెట్రోలియం డిస్టిలేటులో కల్పిన వచ్చును. ఇంకొక రకం, "పిచ్" (Pitch) ని కోల్‌టార్ సాల్వెంటులో కరగించుటచేత వచ్చును. వీనిని అందమైన పేరుతో అమ్ముదురు. నీటిని చొరనీయవు. ఉపయోగకరమైన చౌకరకం పెయింట్సు యివి.

## పెయింట్సు తయారుచేయుట

ముఖ్యమైన దశలు: ముడిరంగులను పెయింట్సుకు పనికివచ్చునంత మెత్తగా నూరుట, స్టిఫ్ (ముద్ద) పెయింటు తయారుచేయుట; ఈ ముద్దను బ్రష్‌తో వాడుటకు వీలగునట్లు, "రెడీ (Ready)" చేయుట.

స్టిఫ్ (ముద్ద) పెయింట్సు: పెయింటు ఫ్యాక్టరీ హెచ్చుభాగం స్టిఫ్ పెయింటునే తయారుచేయును. ఈ స్టిఫ్ పెయింటును తృప్తికరముగా నిల్వయుంచుకొనవచ్చును.

రెడీమిక్స్‌డ్ పెయింట్సులో నూనె పయికితేరి రంగు అడుగునకు పేరుకొనును. కాని నిల్వయుంచిన యీస్టిఫ్ పెయింటును, అవసరమగునపుడు పనికి తగినట్లు థిన్నరు చేర్చి, "రెడీ" చేసికొనవచ్చును.

కేవలం రంగు, తగినంత నూనె థిన్నర్సు చేర్చుట వల్ల మంచి పెయింటు తయారు కానేరదని అనుభవం వల తేలిన విషయంగాన, "రెడీమిక్స్‌డ్," పెయింటుకు కూడా తొలుత స్టిఫ్ పెయింటు తయారుచేయుట అవసరము.

తరుచు ఈ స్టిఫ్ పెయింటు ముడి ఆయిల్‌తో తయారు చేయబడును. రంగునుబట్టి చేర్చవలసిన నూనె పరిమితి విధిగా మారుచుండును. నూరు తులముల బేరైట్సుగాని, వైటులెడ్ గాని నూరుటకు 8 తులముల నూనె చాలును. కాని కొన్ని రంగులు నూరుటకు నూటికి నూరు తులములకు పైగా కావలసియుండును నూనె.

పెయింట్సు నూరుటకు ట్రిపిల్ రోలరు మిలు మంచిది. రంగును, నూనెను పూర్తిగా కలుపుటయే దీని ముఖ్యోద్దేశ్యము.

పెద్ద పెద్ద ఫ్యాక్టరీలలో స్టిఫ్ పెయింటుకు తగినంత నూనె, థిన్నర్స చేర్చి, లోపల తిరిగే పంకులుగల గొట్టములలో వేసి, కలుదనచేసి, "రెడీమిక్స్‌డ్ పెయింటు" క్రింద తయారు చేయుదురు. ఇందు వాడు నూనె బోయిల్డ్ ఆయిల్ టర్పెంటైన్‌లో టర్పెన్‌టైన్ ప్రతినిధి తగు రీతిని కలిపినదానిని "థిన్నర్"గా వాడుదురు. కొన్ని వేళలలో కేవలం కర్పూరతైలపు ప్రతినిధిని మాత్రమే థిన్నరుగా వాడుటయు గలదు. డ్రయర్సు స్వల్ప పరిమితిలో చేర్చెదరు.

లిన్సీడ్ ఆయిలు, టర్పెంటైను, టర్పెన్‌టైన్ ప్రతినిధులు అన్నియు బజారులో దొరకును.

పెయింటు తయారుచేయుట, అనగా రంగును నూనెలో నూరుట; తరువాత తగినంత నూనె, థిన్నర్స చేర్చి బ్రష్‌తో వేయుటకు వీలగునట్లు తయారు చేయుట, తగిన మెషీనరీ, అనుభవంగల పనివారు వున్నచో పై ప్రకారం పెయింటు తయారు చేయుట కష్టమైన పనిగాదు.

గాని, జయప్రదంగా నిర్వహించుటకు తగిన మెషీనరీ, నేర్పుగల పనివారు, అనుభవంగల మేనేజిమెంటు అవసరము.

# జ్యోతిరవతరణము

శ్రీ బి. రామరాజు

వెలుగులు విచ్చుకొన్నవి, నవ పింఛ మనోజ్ఞమయూర నర్తనో
జ్జ్వల రుచిరంబులై, లలితచాలన హేలలు వాస్వరాంగ శీ
తల మృదులంబులై, ఇవము తాకని శ్రీజలజాప్త కాంతి శే
ఖల తొలిజాలులై, ఉషసికట్టిన బంగరు టంచుచీరలై.

మూగిన మల్లె మొగ్గలను మాదిరిగా, లలితేంద్ర నీల మా
లా గలిత స్ఫురచ్చికుర రమ్యముగా, తెలిసీటి ముత్తెముల్
తూగని పచ్చగడ్డికొన తూగులుగా, వెలుగుల్ వెలార్చె హం
సీగరుదంచలాకలిత చిత్ర సువర్ణ ఘృణీకలాపముల్.

ఒక పదివేల శక్రధను రుజ్జ్వల కాంతులు మెట్లు మెట్లుగా
శకలితముల్, నభమ్మపయి సాగిన నీలిమొయిళ్ళ నిండ వి
చ్చుకొనియె—దుఃఖభావ వివశుండగు జీవుని మూర్తి యద్భుతం
బు కనిన వేళ కప్పబడిపోవును తద్గత నూత్నతాక్తమై.

ఈ వెల్గుల్ జడివోలె వచ్చె-నిటులే యేకాంచెమో సేపు నా
లో విప్పారును వాసనల్, ఎడద్రవాలుఙ్ బుద్ధిసోలున్ జలే
జావాప్తంబుల నేత్రచక్రముల వేలంచుల్ తుదల్ కంటి నీ
రై ప్రేలాడును వేదనానుభవ ముగ్ధాకార పర్యాప్తముల్.

ఏవో ఊహాలు పెల్లగించుకొని యిట్లే వెల్గులోకాల సీ
మా వృత్తింజననో? పురావిదిత సౌఖ్యాస్వాద ముగ్ధంబులౌ
భావంబుల్ మలినంబులైచనెను, నా ప్రాణంబులన్ నూత్న వర్షా
విద్యుల్లతికా ముహుశ్చలనముల్ రమ్యార్ద్ర సౌగంధ్యముల్

లలితేరమ్మద్ప్రాణవీధికల హేలా జ్యోత్స్నాకాకాశ కే
లులు పారావతముల్ కలస్వనఝరీలోలమ్మలై సాగడిన్
సెల యేరై మృదుకాంతి యొక్కడు మన సీమావధుల్ దాటిక్రాం
బులకల్ గూర్చుచు బుద్ధి దేశమున క్రమ్మన్ జీవనస్వాదువై

మత్తానేకప యానలై, సురసరిన్మంజు ప్రసూనాగ్రని
ర్యత్తారుణ్య మధుద్రవ స్పృహాలు, చిత్తానంద సీమావధుల్
మెత్తం జూపుల అచ్చరల్ పరచిరా? మీనాళి పుచ్ఛచ్ఛవుల్
చిత్తాంభోరుహా నాళ కంపన మృదుస్నిగ్ధంబులౌ పైటలన్

చీకటులాక్రమించుకొని జీవన మందున మూలమూలలన్
బ్రాకి, సమస్త భావముల రమ్యతచంపి, క్షణక్షణమ్మకో
కైక మహానుభావమునిపించుచును, జీవునిలోని కాంతిధా
రా కమనీయ మార్గవితరంబుగ నిల్చును యున్నతల్పులన్

కరగిన చీకటుల్ వెలుగుగా కనిపించును కొందరజ్ఞతా
పరమ నిధానమోహులకు — బంధుర కాంతులుమాసి పోవగా
కరకర చీకటుల్ విరియు, కన్నులు మూతవడంగ చేతన
త్వరథము గోతికూలు తెగవంచిన విల్లుగ ముక్కలై చనున్

అపరోపసన్నమయూర్ధ్వి సూర్య కిరణా హంకారమున్ వార్ధి వీ
చి పురస్తాడన చిత్రవల్గనములై చెల్వొందు కాంతిచ్ఛటల్
ఎపుడో జీవితమందు కానరయి నిల్చినిల్వకుండన్ నిమే
ష పదమ్మందు మనస్సు నవ్యసుషమా స్థానంబుగా దీర్చెడున్

ఈ కాలాణువుకోసమై బ్రతుకు లెన్నో యమ్యో నా జీవిత
ప్రాకారమ్మున, చీకటింబొరలు కృత్తానల్పముల్, కాంతి వ
స్త్రా కాలంబరుదెంచె, నాయెడద ఈవర్షమ్మెనిల్చెన్ మనో
జ్ఞాకాశంబున తోడి స్పర్థపడి నవ్యాంబోధిగా నిల్వగా.

తెలియని సిగ్గుదొంతరలు దివ్యములైన పథాలలోన పా
ముల వలె జారిపోవ నవమోహన గీతము లాలపింతునా?
లలిత పయోధరాంచలములన్ నెలవంకలు దిద్ది తీర్తునా?
మలచి మనస్సులో వెలుగు మార్గములన్ పరుగుల్లుపెట్టనా?

# అంతర్వాహిని

## హితశ్రీ

* గతసంచిక తరవాయి *

## 8

పరీక్షాఫలితాలు వచ్చాయి. విశ్వం అనుకున్నట్టుగానే రెండో తరగతిలో ఉత్తీర్ణుడయ్యాడు. అతనికి ఉత్సాహంగా ఉంది. ఆ ఉత్సాహం ఎవరితోనైనా పంచుకోవాలని ఉంది: కాని తనకి అంత ఆప్తమిత్రులెవరూ లేరు. రంగారావు ఒక్కడే తనకి కొంచెం మిత్రుడనదగినవాడు. మిగతావాళ్ళందరూ పరిచయస్తులు మాత్రమే. రంగారావైనా సరీ హృదయం పంచి ఇవ్వగల మిత్రుడు కాడు. నాటకసంఘంలో చేరిన తరవాత అతనిమీద విశ్వానికున్న సదభిప్రాయం కొంతవరకు తగ్గింది. రిహార్సలుకి వెళ్ళిన రోజు తరవాత రంగారావు ఇంటికి పనికట్టుకుని వెళ్ళి తన తీవ్ర అసంతృప్తి తెలియచేశాడు. విశ్వం ధోరణికి అతను కొంచెం ఆశ్చర్యపడ్డాడు. "ఏదో తమాషాకి కబురు చెప్పుకోటమే గాని ఆమెని నిజంగా అవమానించాలని ఎవరికీ లేదు." అన్నాడు. "అటువంటి తమాషాల వెనకాల బోలెడంత విషాదం ఉంది." అన్నాడు విశ్వం. తానెవ్వరూ అంతలోతుగా ఆలోచించలేదన్నాడు రంగారావు. "అటువంటి స్వభావంకలవాళ్లు కళోద్ధారకులెప్పటికీ కాలేరు. నాటకసంఘంనించి రాజీనామా ఇస్తున్నాను" అన్నాడు విశ్వం. కాని రంగారావు నచ్చచెప్పి రాజీనామా ఇవ్వకుండా ఆపాడు. ఆ రోజునించీ విశ్వం రిహార్సల్సుకి ఇంతవరకూ వెళ్లలేదు.

ప్యాసయినట్టు పేపర్లో చూసిన తరవాత విశ్వానికి ఇంట్లో కాలునిలవలేదు. నెత్తిమీదనించి ఓ పెద్దబరువు తీసేసినట్టుంది అతనికి. స్వేచ్ఛగా బయటతిరిగి రావాలనిపించి బయల్దేరాడు. ఉత్సాహమంతా లోలోపలే అణుచుకోటం కష్టంగా ఉంది. ఆశ్చర్యం! ఇన్నేళ్లు ఎంతమందితోనో కలిసి చదివాడు. ఒక్కడూ తన హృదయానికి దగ్గరగా రాలేకపోయాడు. తిప్పి చెప్పాలంటే తను ఎవరిహృదయానికీ దగ్గరగా వెళ్లలేకపోయాడు. ఎక్కడుందో ఈ లోపం! కష్టనష్టాలలో, ఉత్సాహోద్రేకాలలో హృదయం సహవాసం కోరుతుంది. అదే తనకిప్పుడు కరువయింది.

ఆలోచిస్తూ నడుస్తున్న విశ్వం మనసులో తళుక్కున వసంత మెరిసింది. ఆమె తనకి టీపార్టీ ఇస్తానంది. తను ప్యాసయితే ఆమె కెందుకు సంతోషం! ఉదయం ఇంటిదగ్గరే ఉండి ఉంటుంది. వెడితే! ఏమనుకుంటుందో? మాటవరసకి అని ఉంటుందేమో!

మనసులో ఏమీ నిశ్చయించుకోకుండానే విశ్వం వసంత ఇంటివైపు నడిచాడు. ఇంటిముందాగి ఒక క్షణం తటపటాయించాడు. లోపల్నించి సన్నగా సంగీతం వినిపిస్తోంది. ఆమె ఇంట్లోనే ఉందన్నమాట! పాడుకుంటూ ఉంది. తను వెడితే ఆమె పాటకి అడ్డొస్తాడేమో! సంకోచిస్తూ విశ్వం ఆవరణ దాటి తలుపు దగ్గిర నుంచున్నాడు. తలుపు ఓరగా వేసి ఉంది.

"జానకీరమణ నా జతబాసి చనబోకు
మానససుమముల మనసార పూజింతు..."

మృదుమధురంగా వినిపిస్తోంది గానం.

"రహిపుట్ట జంత్రగాత్రముల రాల్గరగించు
విమల గాంధర్వంబు..."

పెద్దనగారి పద్యపాదం తలపుకొచ్చింది విశ్వానికి.

ఎంత రసానుభవంతో ఆ మాటలు అనగలిగాడో ఆ కవి!

"బాలపల్లవగ్రాస కషాయకంఠకలకంఠ వధూ కల కాకలీధ్వని"కి పాటలోని ఉత్తమమైన సాహిత్యం మెరుగు పెడుతోంది.

జావళీ వినిపించవలసిన ఇంట్లోంచి త్యాగరాజస్వామి కీర్తన వినిపిస్తోంది. ఆ కర్ణాటక సంగీతానికి తన్మయుడై ద్వారందగ్గిర అలాగే నిలిచిపోయాడు విశ్వం.

పాట పూర్తయింది. పాటకి ప్రతిధ్వనిలా వయొలిన్ మీద రాగాలాపన సన్నగా వినిపిస్తోంది. విశ్వం తెగుకొని ధైర్యంగా లోపలికి అడుగు వేశాడు. తలుపు చప్పుడు విని వసంత తలెత్తి విశ్వాన్ని చూసి ఆశ్చర్య పడి వయొలిన్ కింద పెట్టి లేచి నుంచుని "కవిగారా!" అంది.

విశ్వం చిరునవ్వు నవ్వాడు.

"మీ పాటకి అడ్డొచ్చినట్టున్నాను."

"లేదండీ. అలా కూర్చోండి." అంది వసంత.

"ఇవాళ మా పరీక్షా ఫలితాలు వచ్చాయి. నేను సెకండ్ క్లాస్‌లో ప్యాసయ్యాను" అన్నాడు. విశ్వం కుర్చీలో కూర్చుంటూ.

"చాలా సంతోషమండి." అంది వసంత.

"మరి మీ టీపార్టీ సంగతేమిటి?" అన్నాడు విశ్వం కొంచెం చనువు తీసుకుని".

వసంత ముఖంలో విస్మయం తొంగిచూచింది. "ఏం టీపార్టీ?" అంది అప్రయత్నంగా.

"మర్చిపోయారన్నమాట. నేను ప్యాసైతే మీరు టీపార్టీ ఇస్తానన్నారుగా. మరి అందుకే వచ్చాను."

వసంత ముఖం ఎర్రబడ్డది. ఆమెకి తన మాట జ్ఞాపకం వచ్చింది. ముందే ఆ సంగతి తనకి జ్ఞాపకం రానందుకు ఆమెకి కించగా ఉంది. తను ఆమాట అన్నప్పుడు చాలా మనఃపూర్వకంగానే అన్నది. తన ఇప్పటి ప్రవర్తన చూసి ఏమనుకున్నాడో ఆయన!

విశ్వం ఆమె ముఖ కవళికల్ని గమనించాడు. ఆమె వాగ్దానం మర్చిపోయి అందుకు సిగ్గుపడుతోందని గ్రహించాడు. తను అనవసరంగా ఆమె మనసుకి కష్టం కలిగించాడు.

"ఊరికే అన్నాలెండి. మీరు నిజమనుకునేరు. ప్యాసయినట్టు చెప్పి పోదామని వచ్చాను." అన్నాడు విశ్వం తన తప్పును సరిదిద్దుకోటానికి ప్రయత్నిస్తూ.

వసంత చిరునవ్వు తెచ్చుకుని, "నోటీసు ఇచ్చి పోవటానికి వచ్చారన్నమాట." అంది.

విశ్వం నవ్వాడు.

"ఇప్పుడే వస్తానుండండి" అని వసంత లోపలికి వెళ్లి కొంచెం సేపట్లో కాఫీ కప్పుతో తిరిగివచ్చి బల్లమీద పెట్టింది.

"ఇప్పటికిదే ఇచ్చుకోగలనండీ. క్షమించాలి."

విశ్వం మొహమాట పడ్డాడు. అప్పుడే బజార్లో తాగివస్తున్నానన్నాడు. ఆమె బలవంతం చేసింది. మరేమీ అనకుండా కాఫీ తాగేశాడు అతను.

"మీరు చాలా మంచివారండీ ఏదో అన్నానని అనుకోకుండా జ్ఞాపకం ఉంచుకుని వచ్చారు."

'మరి ఊరికే వచ్చేవాణ్ణని వదులుకోమంటారా?'

వసంత చిరునవ్వు నవ్వింది.

"మీరు రిహార్సల్స్‌కి రావటం లేదేమండీ? రోజూ చూస్తున్నాను."

"నాకోసమా?"

"అవును"

"ఎందుకూ?"

వసంత తెల్లబోయింది. అతనలా అడుగుతాడని ఆమె అనుకోలేదు. ఒక క్షణం అతని ముఖంలోకి చూసి అంది.

"కవిగారు కదూ? హావభావాలు ఎలా ఉండాలో సలహా ఇస్తారని."

తన అనాలోచితమైన ప్రశ్నకి ఆమె ఇచ్చిన సమాధానం విశ్వానికి నచ్చింది.

"నాకు నటనగురించి ఏమీ తెలియదు."

"తెలియకుండానే మెచ్చుకున్నారన్నమాట"

విశ్వానికి ఏమనటానికీ తోచలేదు. ఆలోచించి అన్నాడు.

"మెచ్చుకోటానికి శాస్త్ర విషయాలు తెలియాలా?"

"మెచ్చుకోదలచుకుంటే చాలు."

సంభాషణలోని ఆ చురుకుదనానికి విశ్వం ఆమెని మనసులోనే పొగిడాడు.

"పోన్లెండి మీకేమీ రాదంటాను. సరా?"

ఆమె సమాధానం చెప్పకుండా చిన్నగా నవ్వి ఊరుకుంది.

"ఇంతకీ మీరు రిహార్సల్స్‌కి ఎందుకు రావటం లేదో చెప్పనే లేదు."

"నాకిష్టం లేదు."

"ఏం?"

"ఆ వాతావరణం నాకు సరిపడదు."

"వాళ్లు మీ నాటకం పాడుచేస్తుంటే చూస్తూ ఊరుకుంటారా?"

"పాడు చేస్తున్నారా?"

"ఆ డైరెక్షన్ నాకు నచ్చదు."

"అయినా సలహాలివ్వటానికి నాటకాల విషయంలో నాకు అనుభవమేమీ లేదు."

"ఆలోచన ఉంటే చాలు. వాళ్లు ఎంతసేపటికీ ప్రజల అభిరుచుల్ని గురించే మాట్లాడుతారు. అలా ఉంటేగాని ప్రేక్షకులు మెచ్చరు అంటారు. సహజ నటనకి ఆస్కారమివ్వరు. ఇవన్నీ వాళ్లమీద ఫిర్యాదులుగా చెప్పటం లేదు. నా మనసుకి తోచింది మీకు చెబుతున్నాను. అదీ మీరు కవిగారు కనక, రిహార్సల్స్‌కి రావటం లేదు కనుక చెబుతున్నాను."

"నా నాటకం పాడయితే మీకేం నష్టం?".

వసంత అతనివైపు ఆలోచనగా చూసింది.

"అంటే మీకు అందులో ఉత్సాహమేం లేదా?"

"లేదు."

"అయినా నాటకం పాడయితే మీకు చెడ్డపేరు వస్తుంది."

"నా కంతకీముందు మంచి పేరుంటేగా!" అన్నాడు విశ్వం నవ్వుతూ.

"సామాన్యంగా అందరూ మీకు మల్లే ఉండరు".

"మనుషుల రూపాలన్నీ ఒక్కమాదిరిగా ఉండనట్టే భావాలూనూ"

"నాటకం చెడిపోతే నాటక సంఘానికి పేరుప్రతిష్ఠ లేం ఉంటాయి?"

"పోనివ్వండి పాడుసంఘం."

"మీరుకూడా అందులో సభ్యులేకదూ?"

"సభ్యుడినే కావొచ్చు. కాని దాంట్లో నాకు అభిరుచిలేదు. అదీకాక అందులోని వ్యక్తులంటే నాకు సరిపడదు. వాళ్ళకి కావలసింది నాటకకళ కాదు. తైతక్కలాడి ఏదో పేరు తెచ్చుకోటం. హడావిడి చెయ్యటం. అవాకులూ చెవాకులూ వాగటం. కొత్తఅందమైన నటి కనిపిస్తే ఆమెచుట్టూ తిరగటం. నిరాశ చెందితే, నోటికొచ్చినట్టు వాగటం. వీళ్ళకి నాటకాలూ, సంఘాలూ ఎందుకు?"

వసంత అంతా విని విశ్వం ముఖంవైపు చూసింది. విసుగుదల, ఏహ్యభావం, కోపం అతని వదనంలో ప్రతిబింబిస్తున్నాయి.

"మీరు చెప్పింది నిజమే. కాని వ్యక్తుల లోపాలు సంఘానికి వర్తింపచెయ్యటమెందుకు?"

"వాళ్లు స్థాపించిందే ఆ సంఘం."

"పెద్దలైన వాళ్లు చాలమంది ఉన్నారుగా. మీలాంటి వారు కలగచేసుకొని బాగు చెయ్యటానికి ప్రయత్నించాలిగాని కోపగించుకుని వొదిలేస్తే ఎలా?"

ఆమె మాటల్లో నిజం ఉందని ఒప్పుకున్నాడు విశ్వం.

"ఈ సారి రిహార్సలుకు వస్తారా?"

"వీలయితే!" ఇంకా నసుగుతూనే అన్నారు.

"మీరు వస్తే నాకు ధైర్యంగా ఉంటుంది"

"ధైర్యమా! అంటే?" అన్నాడు అర్థం కాక,

"ఆ వెంకటేశ్వరరావూ, డైరక్టరూ ఉన్నారే, వాళ్ల ప్రవర్తన నాకు నచ్చదండి."

కొంచెంసేపు మౌనంగా ఉండి అన్నాడు విశ్వం. "పోనీ, నాటకంలో వెయ్యటం మానెయ్యరాదూ?"

"ఎలా?" అంది వసంత నిస్సహాయంగా.

"బలవంత మేముంది. మీరేం డబ్బు తీసుకోటం లేదుగా"

"నిజమే. కాని నా భవిష్యత్తు సంగతేమిటి?"

"ఈ నాటకంతోనే ఉందా మీ భవిష్యత్తంతా?"

"ఈ సంస్థకి పెద్దల సహకారం ఉంది. ఈ నాటకంలో బాగా వేస్తే నటన జీవనోపాధిగా చేసుకుందామని ఉంది. అవకాశం కూడా దొరకవచ్చు. నాకు పెద్దచదువులేదు ఇంట్లో తింటూ కూర్చోటానికి డబ్బు లేదు. మరి ఇంక నేనేం చెయ్యగలను?"

"పెళ్లి చేసుకోండి" అన్నాడు విశ్వం హాస్యానికి అన్నట్టుగా. వసంత మాటాడలేదు. సిగ్గుపడ్డదేమో ననుకున్నాడు విశ్వం. ఆ మాట కొంతవరకు వాస్తవమే కాని ఆ సమయంలో ఆమె ముఖంలో సిగ్గుకంటే ఏదో వేదన ప్రముఖంగా కంపించిందతనికి. వసంత ఎంత సేపటికీ మారుమాట్లాడక పోవటం అతనికి అను

మానం కలిగించింది. తనమాటలు ఆమెని తప్పక గాయ పరచి ఉంటాయి. తెలివి తక్కువగా మాట్లాడాడు. ఆమెకి ఏదో సలహా ఇచ్చినట్టు ఘనంగా అన్నాడు. అందులో కొంత హాస్యధోరణి ఉన్నా ఆ అమూల్యమైన సలహా ఇవ్వటానికి తనే కావాలా?

"ఏమనుకోకండి. తమాషాకి అన్నాను," అన్నాడు విశ్వం ఊరడిస్తున్నట్టు.

వసంత ఓ నవ్వు పెదవులమీదికి తెచ్చుకొంది. కొద్దిక్షణాలు మళ్ళీ నిశ్శబ్దంగా గడిచాయి.

"మరి నేను వెళ్ళొస్తా" అన్నాడు విశ్వం, కుర్చీలోంచి లేచి నుంచుని.

"మా ఇంట్లో విందు చేస్తే వస్తారా?" అంది వసంత.

"విందా!" ఆశ్చర్యంగా ఆమె ముఖంలోకి చూశాడతను.

"అభ్యంతరం ఉంటుందా?"

"అభ్యంతరమా?...ఎందుకూ?...అబ్బే. ఏమీ లేదు. కాని...కాని ఇప్పుడు కాదులెండి. మరోసారి ఎప్పుడైనా." అన్నాడు విశ్వం.

"అంటే ఎప్పుడు?"

విశ్వానికి ఏం చెయ్యటానికీ తోచలేదు. "నేను చెబుతాగా," అని తప్పించుకునే ధోరణిలో అన్నాడు.

వసంత ఇంకేం అనలేదు. విశ్వం మరెక్కడికీ వెళ్ళకుండా సరాసరి ఇంటికి వచ్చాడు. వసంత! అనాదిగా మానవుడి స్వార్థంలో వేళ్లు పాతుకొనివున్న సాంఘిక దురాచారానికి వారసురాలు! ఆమెనుచూస్తే తనకి జాలి వేస్తోంది.

ఇంట్లోకి విశ్వం అడుగుపెట్టగానే వెంకట్రామయ్యగారి స్వరం వినిపించింది. అప్పుడే వస్తున్న విశ్వాన్ని చూసి ఆయన సంతోషంగా అన్నాడు: "ఏరోయ్, పరీక్షల్లో నెగ్గావే. నీకు మంచి ప్రజంట్ ఇవ్వాలిసిందే!"

విశ్వం చిరునవ్వుతో లోపలికి ప్రవేశించి, "ఎప్పుడు వచ్చావు మావయ్యా, ఏమిటి విశేషాలు?" అని అడిగాడు.

"ఇప్పుడేరా. విజయవాడ పనిమీద వచ్చాను. పేపరుచూస్తే మీ రిజల్ట్సు కనిపించాయి. ఎలాగో ఇంత దూరం వచ్చానుగదా, నీకు కంగ్రాట్యులేషన్స్ చెప్పిపోదామని ఇలా వచ్చాను," అన్నాడాయన.

అయితే ఆయన వచ్చిన అసలు విషయం మధ్యాహ్నం భోజనాలయింతరవాత కబుర్లలో బయటపడ్డది.

జానకిని తనకివ్వాలని ఆయన ఉద్దేశం. ఆ మాట అప్పుడప్పుడు తన చెవిని పడుతూనే ఉంది. కాని తనేమాత్రం ఆమాట ఆలోచించలేదు ఇంతవరకూ. ఇప్పుడు విషయం తేల్చుమని మావయ్య అంటున్నాడు.

జానకి!

ఆమె అంటే తనకెంతో అభిమానం.

కాని ఈ దృక్పథంలోంచి ఆమెని ఎప్పుడూ చూడలేదు.

తను జానకిని పెళ్ళిచేసుకోటంలో ఏదో అసహజత్వం ఉందనిపించింది విశ్వానికి. తను ఆమెని చిన్నప్పటినించీ ఎరిగినవాడు. ఆమెతో ఆడుకున్నాడు. ఏడ్పించాడు, ఎగతాళి చేశాడు. కలిసి అల్లరిచేశాడు. ఆమె తనకి ఆత్మీయురాలు, స్నేహితురాలు.

అప్పటినించీ ఇప్పటివరకూ తనకి ఆమె అంటే అదే దృష్టి.

కాని ఇప్పుడు మరో సంబంధం ఏర్పడటానికి సంప్రదింపులు జరుగుతున్నాయి. ఆమెని వివాహం చేసుకుంటే తను సుఖపడగలడా! ఆమె సుఖపడగలదా! జానకి అభిప్రాయ మేమిటో? మావయ్య జానకిని అడిగివుండడు. కొన్నిట్లో మావయ్య అభిప్రాయాలు తనకి నచ్చవు, తన ఇష్టం వచ్చినట్టు చేస్తాడేగాని సలహాగాని, అభిప్రాయంగాని అడగడు. పద్మ పెళ్ళప్పుడే మావయ్యకి కొంచెం కోపం వచ్చింది. ఈడు కాదని సాకు చెప్పారు, సూరి కివ్వటానికి. వాడికివ్వటం నాన్న కిష్టం లేదు.

విశ్వం ఆలోచించి "ఉద్యోగమైంతరవాత చూద్దాంలే మామయ్యా" అన్నాడు. ఆయనకి నచ్చక పోయినా ఆ సమయంలో ఏమీ అనక వెళ్ళిపోయాడు.

## 9

విశ్వం రచించిన నాటిక ఆ రాత్రి ప్రదర్శిస్తున్నారు. నాటిక పేరు "మహారాజ పోషకులు." పుర ప్రముఖులు చాలామంది విచ్చేశారు. నాటకం

ప్రారంభం కాబోతుందని మైక్‌లో ప్రకటించారు. ఆడిటోరియంలో లైట్లు ఆరిపోయాయి తెర తొలగింది.

దృశ్యం ఒక పల్లెటూరులో సమావేశాలు జరుపుకునే ప్రదేశం. సెట్ వేశారు. రంగస్థలం ఏర్పాటు చెయ్యబడ్డది—సెట్‌లో ఒక భాగంగా కొబ్బరిఆకులు, తోరణాలు కట్టారు. రెండు పెట్రోమాక్సులైట్లు కర్రలకి కట్టబడి వెలుగుతూ వున్నాయి. రంగస్థలంలోని రంగస్థలంమీదికి ఓ ముతకదుస్తులు ధరించిన వ్యక్తి వచ్చి "ఆర్యా, ఇప్పుడు 'దశావతారాలు' భరతనాట్య ప్రదర్శన జరుగుతుంది. మీరంతా దయచేసి నిశ్శబ్దంగా ఉండాలని కోరుతున్నాను" అని పక్కకి వెళ్ళిపోయాడు. రంగస్థలంమీద తబలా, హార్మోనియం, వయొలిన్ వాయిద్యాలని వాటి తాలూకు వాద్యగాళ్ళు సరిచూసుకొని శ్రుతికలుపుకుంటున్నారు. ఇంతలో గజ్జెల రవళి వినిపించింది నేపథ్యంలో. వాద్యసంగీతం ప్రారంభమైంది. ఒక ఎలజవ్వని రంగంమీదికి వచ్చి అందరికీ నమస్కరించి ప్రార్థన చేసింది.

గజ్జెలు ఘల్లు ఘల్లుమన్నాయి. తబలా లయకలిపింది. తధిత్తోం తదిగిణతోం...భరతనాట్యం ప్రారంభమైంది.

నేపథ్యంలో శ్రావ్యమైన కంఠం వినిపిస్తోంది...

మత్స్యరమున మరియంబుధిలో జొచ్చియున్న
సోమకు గ్రుంచియు
విద్యలనిడి వేదములజానకు నిచ్చితివో మత్స్యావ
తారా! ఇచ్చితివో మత్స్యావతారా!"

ముద్ర పట్టింది నర్తకి.

చప్పట్లు చరిచారు ప్రశంసా పూర్వకంగా నేపథ్యంలో ప్రేక్షకులు...

పలుమరు నిను ప్రస్తుతి సేయగ చెలగి సురలు
జలధి మధింపగ
కలిమి బలిమి యొలమితో నొసగిన కులగిరిధర
కూర్మావతార!"

కూర్మావతార ముద్రపట్టబోతోంది నర్తకి.

నేపథ్యంలో ఉచ్చస్వరం దర్పంగా వినిపించింది.

రెడ్డొచ్చె మొదలాడు.

రెడ్డొచ్చె రెడ్డొచ్చె మొదలాడు...

ఒక ఆజానుబాహువిగ్రహం రంగస్థలం మీదికి వచ్చి ఠీవిగా నుంచుంది పొన్ను వేసిన చేతికర్ర ఊపుతూ.

ఆగిపోయింది నర్తకి. ఆగిపోయారు వాద్యగాళ్ళు. ఆగిపోయింది గానం. మరికొంచెం సేపటికి మళ్ళీ గజ్జెలు ఘల్లుమన్నాయి—తకధిం తక తాహ తకిట తక......

"...విద్యలనిడి వేదములజానకు
ఇచ్చితివో మత్స్యావతారా!
నీ విచ్చితివో మత్స్యావతారా!"

మత్స్యావతార ముద్ర పట్టింది నర్తకి.

చప్పట్లు మళ్ళీ వినిపించాయి ఆ చప్పట్ల చప్పుడులోంచి గంభీర స్వరం వినిపించింది.

పంతులొచ్చె మొదలాడు
పంతులొచ్చె మొదలాడు...

మరొక వ్యక్తి రంగస్థలంమీదికొచ్చి రెడ్డి ప్రక్కన నుంచున్నాడు దర్జాగా. రెడ్డి ముఖం చిట్లించాడు.

భరత నాట్యం మళ్ళీ మొదటికొచ్చింది......

"మత్స్యరమున మరియంబుధిలో..."

నేపథ్యంలోంచి ఓ స్వరం అధికారపూర్వకంగా హెచ్చరించింది.

చౌదరొచ్చె మొదలాడు
చౌదరొచ్చె మొదలాడు

నర్తకి నిస్సహాయంగా చూసింది. పట్టబోయే ముద్ర ఆగిపోయింది.

ఠీవిగా రంగంమీదికొచ్చాడు ఒక వ్యక్తి.

పాట మొదటికొచ్చింది. గజ్జెలు లయ వేయసాగాయి.

"...విద్యలనిడి వేదములజానకు....ఇచ్చితివో మత్స్యావతారా! నీ విచ్చితివో మత్స్యావతారా!" నేపథ్యంలోంచి ఖంగున మోగింది ఓ గొంతు.

నాయుడొచ్చె మొదలాడు
నాయుడొచ్చె మొదలాడు.

రంగం మీదికి వచ్చి నలువైపులా చూసి మీసాలు మెలేసి నుంచున్నాడు మరో వ్యక్తి.

తిరిగి ప్రారంభమైంది భరతనాట్య కార్యక్రమం. నర్తకి మత్స్యావతార ముద్రపట్టే ఆరాటంతో అలాగే నిలబడి పోయింది. ఇంతలో నేపథ్యంలో ఎవరో అరిచారు. నర్తకి తెప్పరిల్లింది.

"శ్రేష్ఠి వచ్చె మొదలాడు
శ్రేష్ఠి వచ్చె మొదలాడు

ఓలావుపాటివ్యక్తి తలపాగా సవరించుకొంటూ రంగంమీదికొచ్చి నిలబడ్డాడు.

మొదలాడ సాగింది నర్తకి విసుగ్గా. ముద్ర పట్టబోతుండగా రెడ్డి అరిచాడు.

"ఇటు ఇటు."

మీంతానా ధ్యాసలో లేదు. అందరూ తమకే అభినయించాలన్నారు.

ముద్ర పట్టకుండానే నర్తకి నిలిచిపోయింది. ఎవరికి అభినయించాలి? ఎవరు గొప్ప? ఎవరుఅర్హులు?

ప్రేక్షకుల సహాయం కోరారు. తమని అభిమానించేవారందరూ తమ వెనక నిలబడాలన్నారు.

ప్రేక్షకులు ఒక్కొక్కరూ అలాగే నిలబడి పోగాగు బారులు తీర్చి.

చిత్ర మేమంటే రూపురేఖల్లో, వేషభావల్లో ఒకే పోలికగలవాడు మాత్రమే తమ తమ వరసల్లో ఉన్నారు.

తెరపడ్డది – మొదటి రంగం సమాప్తమైంది. లైట్లు వెలిగాయి.

ప్రేక్షకుల స్థానాల్లో మొదటి వరసనకూర్చున్న పెద్దల్లో సంచలనం కలిగింది. గుసగుసలు ప్రారంభమయాయి. రానురాను గుసగుసలు వాగ్వ్యాదాలుగా మారాయి. పెద పెదగా కేకలు వేసుకుంటున్నారు. ఉద్రేకాలు పెరగసాగాయి. ఈ వాదావివాదం మిగతా స్థానాల్లో వాళ్ళకి కూడాపాకింది. హాలంతా కేకలతో మారుమోగుతూ గంద్రగోళంగా ఉంది. థియేటర్ 'యాజమానులే' భయపడి పోలీసుల్ని పిలిపించారు. వాళ్ళు జనాన్ని సర్దటానికి ప్రయత్నించారు. కాని పోలీసుల్ని చూడగానే ప్రేక్షక జనసమూహం మరింత పెచ్చు మీరిపోయింది. కొందరు గ్రీన్ రూమ్‌వైపు పరిగెత్తారు.

"ఈ నాటకం ఆడటానికి వీల్లేదు" అన్నారు ఖండితంగా కొందరు.

"ఆడి తీరవలసిందే!" అన్నారు మరికొందరు మరింత పట్టుదలతో.

చేతులు కలిసేసేటి వచ్చింది. పోలీసులు కలగ చేసుకున్నారు. నాటక ప్రదర్శన ఆగిపోయింది. పోలీసులు చెయ్యగలిగిందలా నాటకసంఘంవారెవరికీ అపాయం జరక్కుండా కాపలా కాయటమే. నాటకం ఆగిపోయిందనగానే కొందరు శాంతించి ఇంటిదారి పట్టారు. వాగ్వ్యాదాలు తగ్గాయి. జనం వెళ్ళిపోసాగారు.

ఈ అవాంతరానికి విశ్వం నిశ్చేష్టుడై గ్రీన్ రూమ్‌లో తల చేతుల్లో పెట్టుకుని కూర్చున్నాడు. నర్తకి వేషంకట్టిన వసంత అలిసిపోయి పాలిపోయిన ముఖంతో కుర్చీలో కూలబడ్డది. తన ప్రథమప్రయత్నం ఇలా పరిణమించినందుకు నిరాశపడిందామె. నాటక సంఘంలోని సభ్యులు, పాత్రధారులు రంగస్థలంమీద పరిస్థితులు చర్చించుకుంటూ నిస్పృహతో పచార్లు చెయ్యసాగారు.

గ్రీన్ రూమ్‌లోఉన్న విశ్వం గొణిగాడు.

"నాటక సంఘంలో నేను సభ్యుణ్ణిగా చేరి ఉండకపోతే బాగుండేది. కనీసం నేను నాటకం రాయలేనన్నప్పుడు వాళ్ళు నన్ను వొదిలినా సరిపోయేది. ఎంత దురదృష్టం. నా సంగతి అలా ఉంచండి. పాపం, వాళ్ళ శ్రమంతా బూడిదలోపోసిన పన్నీరయింది. ఎంత అవస్థపడ్డారు! ఎంత నష్టపోయారు!"

"ఇటువంటి నాటకం ఎందుకు రాశారు?" అంది వసంత.

"బుద్ధి గడ్డితిని..."

అతనలా పశ్చాత్తాప పడటంచూసి వసంతకి జాలి వేసింది. కొంచెం అనునయ పూర్వకంగా అంది.

"అయినా ఇందులో అంత కొంపలంటుకు నే విషయ మేముంది? అనాలోచితంగా ప్రేక్షకులు తొందరపడ్డారు గాని..."

"ఉంది లేకపోలేదు, కాని ఇలా మూర్ఖంగా ప్రవర్తిస్తారని నే ననుకోలేదు. ఇంకా నయం పూర్తిగా నాటకంచూస్తే నన్ను ఊళ్ళోంచి తరిమేసే వాళ్ళేమో!"

"వాళ్లు సరిగా అర్థం చేసుకోలేదండీ."

"సహృదయత కావాలి దేనికైనా. 'అరసికాయ కవిత్వ నివేదనం శిరసిమాలిఖ' అన్నాడు. కులతత్వాల మీద సున్నితమైన వ్యంగ్య విమర్శచేస్తే కత్తులూ, కటార్లూ నూరితే నేనేంచెయ్యను! నే నెవర్నీ కావాలని తిట్టలేదు, తిమ్మలేదు. అభిప్రాయ ప్రకటన చేసే స్వేచ్ఛ ఇంకా మన దేశానికి రాలేదు."

వసంత అతనివైపు జాలిగా చూసింది.

"అందరూ మీలాంటివాళ్ళే ఉంటారా?"

"ఎవరూ ఎవరిలాగా ఉండరు. మనిషి సంకుచితంగా ఆలోచించకూడదనే నే నన్నది."

"మీది విశాల హృదయమండీ"

"తకబురు చెప్పకండి."

"మీ భావనబట్టి చెబుతున్నాను. నిజంగా నాటిక చాలా బాగా రాశారండీ. నా పాత్రే కాక నాటిక అంతా కూడా ఎన్నోసార్లు చదివాను. సాహిత్యంలో నాకు ప్రవేశం లేనిమాట నిజమే. కాని నాటిక చాలా గొప్పగా ఉందని నాకనిపిస్తోంది."

"ఫలితం చూసికూడా అలాగే అంటున్నారా? నన్ను ఊరడించటానికేనా?"

"నేనబద్ధం చెప్పటంలేదు"

"ఇంతకిముందు ఎప్పుడూ ఈ విషయం మీరు చెప్పలేదు."

"మర్చిపోయాను. చెప్పాలనే అనుకునేదాన్ని. కాని..."

"కాని...?"

"మీతో మాట్లాడుతున్నంతసేపూ ఆ విషయం నాకు గుర్తొచ్చేది కాదు. ఎందుకో తెలియదు తలుచుకుంటే ఆశ్చర్యం వేస్తుంది. సరిగా మీరు వెళ్ళిపోగానే ఆ సంగతి జ్ఞాపకం వొచ్చేది. ఎందుకంటారు?"

"నాకు మనస్తత్వశాస్త్రం తెలియదు."

వసంతి నవ్వింది.

"ఈ నాటకం పుస్తకంగా అచ్చు వేయించండీ"

"ఎందుకూ! ఈ శిక్ష చాలకనా?"

"దీంతో మీకు మంచిపేరు వస్తుందండీ."

"పేరుకోసం నేను అది రాయలేదు."

"దానంతట అదే వొస్తుంటే మీరేం చేస్తారు?"

"చెడ్డపేరొస్తే మీరు సగం పంచుకుంటారా?"

వసంతి విశ్వం ముఖంలోకి చూసింది విస్మయంతో.

"మంచిపేరొస్తే అంతా మీకే కావాలి కదూ పాపం?"

విశ్వం ఆమె ముఖంలోకి కొంచెం ఆశ్చర్యంగా చూశాడు.

ఆమె మరోవైపుకి చూసింది.

"అంతేమరి." అన్నాడు నవ్వుతూ.

"కవిగారికూడా స్వార్థం ఉందన్నమాట."

"నన్ను కవిగారు అనకండి."

"ఏం, మీరు కవులేగా?"

"కాదు. నాలో కవిత్వంలేదు. ఉంటే కాస్తా కూస్తో చిత్రకళ ఉంది అంతే."

"మీరు బొమ్మలు వేస్తారా?" ఆశ్చర్యపోతూ అంది వసంతి.

"ఏదో వేస్తాను."

"ఎప్పుడూ చెప్పలేదే!"

"నాటకం జయప్రదమైతే వస్తుకి భంగిమలో మీ చిత్రం వేసి ఇద్దామని అనుకున్నాను."

"అయితే ఇప్పుడిక కూడదా?"

"ఉత్సాహంలేదు"

"నాటకం పాడవటానికి నేనా కారణం? ఇదెక్కడి అన్యాయమండీ?"

"మీరని ఎవరన్నారు."

"మరి నాటకం జయప్రదం కావటానికీ నా బొమ్మకీ ఏమిటి సంబంధం?"

"ఏమీ లేదు," అన్నాడు విశ్వం ఆమె వాదనకి లోలోపల ఆమెని ప్రశంసిస్తూ.

"అయితే మాట నిలబెట్టుకుంటారా?"

"చూద్దాం"

"అలా అంటే కాదు"

"బొమ్మవెయ్యటం అంటే మాటలు కాదు. గంటలతరబడి మీరు మోడల్ ఇవ్వాలి. ఊరికే బలవంతం చేస్తే ఏం లాభం?"

"ఇస్తానులెండి."

"అయితే సరే."

మాటఇచ్చినప్రకారం విశ్వం ఓరోజు ఉదయం పరికరాలన్నీ తీసుకుని వసంత ఇంటికి వెళ్ళాడు. ఆమె చిత్రం తయారు చెయ్యటానికి అతను చెప్పిన భంగిమలో ఆమె నిలబడింది. రోజూ ఉదయం విశ్వం కార్యక్రమం అదే. త్వరలోనే స్కెచ్ పూర్తిచేశాడు. కాని రంగులు వెయ్యటం చాలా నెమ్మదిగా సాగుతోంది. దగ్గరఉండి వసంత ఏవో కబుర్లు చెబుతూ ఉంటుంది. విశ్వం మాటలసందడిలోపడి బొమ్మసంగతి మర్చిపోతాడు. ఇప్పుడు విశ్వం తనని 'అండీ' అని పిలిస్తే ఆమె ఒప్పుకోదు. 'కవిగారూ' అంటే విశ్వం ఒప్పు

కోను. ఈ రోజుల్లోనే విశ్వం నాటిక ఎవరో ప్రముఖులసంస్థవారు ప్రకటించారు. అనుకోకుండా దానికి బ్రహ్మాండమైన ప్రచారం వచ్చింది. కాని ఆ నాటిక ప్రదర్శన నిషేధించబడ్డది.

## 10

ఆషాఢం వల్లటిమబ్బులు చేస్తోంది ఆకాశం. తొలకరి పలకరించి వెళ్ళింది. పల్లెజనం మళ్ళీ పొలం పనుల్లోకి మళ్ళారు. నారుమళ్లు పచ్చపచ్చగా కన్నుల పండువుగా ఉన్నాయి. కాలవ వదలటంవల్ల నీటిగాలి వీస్తోంది.

వసారాలో కూర్చుని నూరి కొబ్బరితాడు పేనుతున్నాడు. సూర్యుడు నడినెత్తికెక్కి చేరుకున్నాడు నీరెండ కాస్తోంది. పనిలేకపోయినా కల్పించుకుని ఏదో చెయ్యటం నూరి కలవాటు. సామాన్యంగా అతను మర్రిచెట్టుకింది ఊకదంపుడు సమావేశాలకి పోడు. మొదట మొదట ఊళ్ళోని తోటివాళ్ళు నూరికి గర్వం అనుకున్నారు. కాని ఆమధ్యన జరిగిన కొన్ని కొన్ని సంఘటనలవల్ల వాళ్ళలో ఆ అపోహ తొలగిపోవటమే కాకుండా నూరి అంటే ఓవిధమైన గౌరవభావం కూడా ఏర్పడ్డది. ఇవేవలనే అతనివల్ల గ్రామానికి ఓ మేలు జరిగింది. ఊళ్ళో కరణంగారు తమ తండ్రిగారి జ్ఞాపకార్థం విడిచిన ఆంబోతు విచ్చలవిడిగా సంచరిస్తూ అందరికీ కంటకప్రాయంగా తయారైంది. దానిమూలాన రెండుపక్షాలు కూడా ఏర్పడ్డాయి— కరణంగారి పక్షమూ, మునసబుగారి పక్షమూ. క్రితం సంవత్సరం యీ ఆంబోతు కారణంగానే ఓ చిన్న గలాటా జరగటం, కక్షలు పెరగటం సంభవించాయి. ఈ సంవత్సరం వెంకట్రామయ్యగారి పసుపుమళ్ళు తొక్కి పాడుచేసింది ఆంబోతు. ఆ దృశ్యం నూరికంట పడింది. పాలేరు వెంకన్న 'సై' అనుకున్నాడు. కాని నూరి తొందరపడలేదు. ఆ మర్నాడే పక్క ఊళ్ళో పశుప్రదర్శనకి యీ ఆంబోతును పంపటం జరిగింది. అదిమళ్ళీ తిరిగిరాలేదు. ఊరివాళ్ళకి అది చాలారోజుల వరకూ సమస్యగానే ఉంది. పీడ వదిలిందని సంతోషించారేగాని దాని ఆచూకీ తియ్యటానికి ఎవరూ గట్టిగా ప్రయత్నించలేదు. అది అక్కడినించి తప్పించుకొని ఎక్కడికో పోయివుంటుందని అనుకొన్నారు. కరణంగారు అసలుసంగతి తరవాత బయట పెట్టారు. పశుప్రదర్శన సంఘం తరఫున ఎవరో వొచ్చి తమని బలవంతం పెట్టటంవలన తను ప్రదర్శనకి పంపక తప్పలేదనీ, తరవాత తనకి తెలిసిన ఒక మిత్రుడు దానిని సహకార సంఘానికి ఇప్పించవలసిందని వొత్తిడి చేశాడనీ, తను మిత్రుడిమాట కాదన లేకపోయాడనీ ఆయన వివరించేశాడు. ఆ తరువాత చాలారోజులకి గాని అసలు నిజం బయటపడలేదు. ఈ తంతు నడిపించింది మరెవరో కాదు. వెంకట్రామయ్యగా రబ్బాయి నూరి. కాని అతనే ఉద్దేశంతో చేశాడో మాత్రం ఎవరికి స్పష్టంగా తెలియదు. నూరికి ఊళ్లో కక్షలు సరిపడవనీ వాటిని తొలగించటానికి ఈ యుక్తి పన్నాడనీ కొందరంటే, సొంత పొలం రక్షించుకోటానికి ఇలా చేశాడని మరి కొందరంటారు. ఇవన్నీ ఊహాగానాలే. నూరినడిగితే తనకా విషయమేమీ తెలియదని విసుక్కుంటాడు. అతనేదో విధంగా ఆంబోతుని తోలివేయటం కరణంగారికీ, మునసబుగారికీ వారి అనుయాయులకీ కూడా సంతోషంగానే ఉంది తమ పరువు ప్రతిష్ఠలకి భంగం లేకుండా సమస్య పరిష్కారమైంది. నూరి ఏ పార్టీకి చెందినవాడు కాడు, అందరితో అతను సమానంగానే మాట్లాడుతాడు. అదికాక క్రితం సంవత్సరం అతను ఓ సందర్భంలో చూపిన ధైర్యసాహసాలకి అతనికి ఊళ్లో గౌరవస్థానం లభించింది. ఆ సంఘటన జరిగిన రోజున బాగా చీకటిపడి నూరీ, పాలేరు వెంకన్నా పొలంనించి తిరిగివస్తున్నారు. ఆ కాలంలో వర్షాలు కురవటంవల్ల పంటలు దెబ్బతినే సూచన కన్పించింది. కాలవ ఉప్పొంగిపోతోంది. అకస్మాత్తుగా నూరికి అనుమానం తగిలింది. కట్టకి ఇదివరలో గండిపడ్డది. ఇప్పటికీ అది సరిగా బాగుచెయ్యలేదు. తాత్కాలికంగా అడ్డం వేశారు. వరదవచ్చే సూచన కనిపిస్తోంది. ఎగువుగా నీరు ఉధృతంగా ప్రవహిస్తోంది. ఊళ్లోకి వెళ్ళి మళ్ళీ వచ్చేలోపుగా ప్రమాదం జరిగినా జరగొచ్చు. వెంకన్నతో ఆలోచించి, నూరి అతనితో సహా కాలవ ఈది అవతలిగట్టుకు చేరాడు. అటువైపు దిగువప్రదేశం అంతా అడవి. అనువైనస్థలం వెతికి ఇద్దరూ కలిసి గండికొట్టారు. నీరు బంజర్లలోకి మళ్లింది. స్వేచ్ఛగా ఊపిరిపీల్చి నూరి ఊళ్లోకివెళ్లాడు. ఆ మర్నాడు సొంతకళ్ళతో రైతులు చూసేదాకా ఈ విషయం ఎవరికీ తెలియదు. ఆరాతీసి అది నూరి పనేనని తెలుసుకున్నారు. అంతపని చేసినవాడు కిమ్మనకుండా తనేమీ చెయ్యనట్టుగా ప్రవర్తించటం

అందరికీ అత్యంతాశ్చర్యం కలిగించింది. ఎవరైనా ఈ ప్రసక్తి అతనిముందు తెస్తే అదేమీ ఘనకార్యం కాదన్నట్టు మాట్లాడతాడు.

ఇలాంటివే కొన్ని చెప్పుకోతగ్గ పేర్లు చెయ్యటంవల్ల అతనంటే ఊరివాళ్ళకి అభిమానం ఏర్పడ్డది. చిత్రమేమంటే ఇలా ఊళ్లో తనని అభిమానిస్తున్నారనే విషయం అతని ఆలోచనలోకి రాదు. ఆ విషయం అతనికి తెలియదనికాదు. ఒక విధమైన నిర్లిప్తత అతని ముఖంలో ద్యోతకమవుతుంది. ఏదో సమావేశంలో సూరిని గూర్చి ఈ మధ్యన ఎవరో ప్రశంసా వాక్యాలు పలికితే, వెంటనే లేచి అన్నాడు.

"నేనూ ఊరివాళ్ళలో ఒకణ్ణి. ఒకవేళ నే నేదైనా చేస్తే అందులో సేవాతత్పర్యమేం లేదు. నాకు అవసరమనిపించిన పనులే నేను చేశాను. ఇందులో ప్రశంసించటానికేం లేదు."

మరొక వ్యక్తి ఈ మాటలంటే మర్యాదకోసం, నమ్రతకోసం అన్నాడని సులభంగానే ఊహించేవాళ్ళు జనం. కాని ఆ మాటలు అన్నవాడు సూరి. ప్రత్యక్షంగాగానీ, పరోక్షంగాగానీ మెప్పుని సూచించే మాట ఒక్కటి పలికినా ముఖం చిట్లించుకుని చిరాకుపడే ఒకే వ్యక్తి. పొద్దస్తమానమూ పని వాళ్ళతో పాటు వొళ్ళు వొంచి చాకిరిచేసే ఆసామీ. అజమాయిషీ పేరుతో నడుంమీద చేతులు ఆన్చి దిక్కులు చూస్తూ నిలబడే కర్ర పెత్తనదారు కాదు సూరి.

పడమటి ఆకాశం ఎర్రబారుతోంది ఆ సమయంలో ఓ వ్యక్తి సూరిదగ్గిరికివచ్చి 'నమస్తే' అన్నాడు. దగ్గిర్లో ఉన్న చిరిచాపలాగి "కూర్చోండి" అన్నాడు. సూరి, ఆ వ్యక్తిని ఆ పాదమస్తకం చూసి.

"నేను కరణంగారి దగ్గిర్నుంచి వస్తున్నానండీ." కూర్చుంటూ అన్నాడతను.

"అలాగా!"

"నా పేరు వెంకటపతి. ఈ సంవత్సరం నేను బి. ఏ. ప్యాసయ్యాను. సూరిగారు మీరేనా?"

"అవునండీ." అంటూ సూరి దగ్గిర్లో ఉన్న కంచు మరచెంబులోని నీరు పంచపాత్రలో పోసి వెంకటపతి కిచ్చాడు. ఆ చల్లటి మంచితీర్థం తాగేసి అతను తను వచ్చినపని చెప్పాడు.

"కాలేజీలో చదువుతున్నప్పుడు నేను సంఘసేవ చేసేవాడినండీ. కాలేజీ సాంఘిక సేవాసమితి సభ్యుణ్ణి. మొన్న ఆమధ్యన ఈ ఊరి మట్టిరోడ్డుమీద కంకర వేసిన బృందంలో నేనుకూడా ఉన్నాను. ఈ ఊళ్లో నాకు చేతనైనంతవరకు కొన్నాళ్ళు సంఘసేవ చెయ్యాలని ఉందండీ."

"మంచిది." అన్నాడు సూరి

"ఏం చేస్తే బావుంటుందంటారు?"

"నా కా విషయాలు తెలియవే."

"మీకు తెలియకపోతే ఇంకెవరికి తెలుస్తాయి?"

"అదేమి టలా అంటారు?"

"కరణంగారు మీ విషయమంతా చెప్పారు. మీ సలహా తీసుకుని ఏదైనా చేస్తే బావుంటుందని ఆయన చెప్పిన మీదటే మీ దగ్గిర కొచ్చాను. మీరు సహాయపడతారని ఆశపడుతున్నాను."

"నావల్ల సహాయం జరిగే వీలుంటే సంతోషంగా చేస్తాను. కాని నేనేం చెయ్యగలనో నాకే తెలియదు. మీ కార్యక్రమ మేమిటో చెలవివ్వండి."

"అది తయారు చెయ్యటానికే మీ సలహా అడుగుతున్నాను."

సూరి ఆలోచించాడు. ఆ క్షణంలో అవసరాన్నిబట్టి తోచిందేదో చెయ్యటమే గాని తనింత వరకూ ఫలానా ఫలానా వ్యవహారాలు ఫలానా విధంగా చెయ్యాలని ఆలోచించి ఆ కార్యక్రమం ప్రకారం నడవటం ఎరగడు.

"మీరీ ఊళ్లో నే స్థిరపడిపోతారా?"

"ఎబ్బే, లేదండి."

"ఎన్నాళ్లుంటారు?"

"బి. ఏ. ప్యాసయ్యాను కదండీ. ఏదైనా ఉద్యోగంవస్తే వెళ్లిపోతాను. ఈ లోపల వీలైనంత వరకూ నలుగురికీ పనికొచ్చే పనేదైనా చెయ్యాలని ఉబలాటం."

సూరి పొడిగా నవ్వాడు.

"చెయ్యవచ్చు. దానికేం. కాని అర్ధాంతరంగా వెళ్ళిపోతే ఏంలాభం?"

"ఎవరికి?" అన్నాడు వెంకటపతి.

"ఊరికీ, మీకూ కూడా."

"జరిగినంత పనే జరుగుతుంది."

"అయితే సరే" అన్నాడు సూరి.

"సూరి దగ్గిర్నించి సూచనలేవి వొచ్చేట్టు లేనందువల్ల వెంకటపతే కొన్ని ఆలోచనలు వెలిబుచ్చాడు.

"యువజనులకి రాత్రిబడీ, ఆరోగ్యసూత్రాల ప్రచారమూ, వాటి ఆచరణా, సమిష్టి శ్రమదానమూ మొదలైనవి ప్రారంభిస్తే బాగుంటుం దనుకుంటాను."

"అలాగే.!"

వెంకటపతి ఉత్సాహంగా కార్యక్రమం ప్రారంభించాడు. మొదటిరోజు పెద్దల్ని సమావేశపరిచి తన అభిప్రాయాలు వెలిబుచ్చాడు. కొందరు యువకులు ముందుకొచ్చారు. తోడ్పాటు ఇస్తామన్నారు. రాత్రిబడి నెలకొల్పబడింది. పరిసరాలనీ, ఊరినీ ఎలా శుభ్రంగా ఉంచాలో ప్రచారం జరుగుతోంది. ఉద్యానవనం వెయ్యటానికి శ్రమదానం వాగ్దానం చేశారు కొందరు యువకులు.

ఈ పనులన్నీ కొత్తగా వింతగా వున్నాయి జనానికి. కొద్ది రోజుల తరవాత ఈ విషయం పాతబడి మామూలు వ్యవహార మైంది.

మొదట్లో ఉత్సాహంగా రాత్రి బడిలో చేరిన యువకులు రానురాను పల్చబడ్డారు. హాజరు తగ్గిపోతోంది రోజురోజుకీ.

ఆరోగ్య సూత్రాలు ఆచరణలో పెట్టడానికి బద్ధకం వేస్తోంది జనానికి.

పగలంతా వొళ్ళు విరుచుకుని పొలాల్లో పనిచేసిన తరవాత ఇంకా ఈ శ్రమదానానికి ఓపిక మా కెక్కడి దనసాగారు ఆరంభశూరులు.

"మా ఊళ్ళోకూడా చదువుకున్నవా రున్నారు లెండి" అని మొహం ఎదటనే వెంకటపతితో అన్నారు కొంతమంది.

"ఒకళ్ళు చెప్పాలిసిందీ, మేము వినాలిసిందీ ఏముంటాయిలెండి కొత్తగా" అన్నారు సమావేశాలకి హాజరు కావటం ఇష్టంకాక మానుకున్న జనం.

"ఇదంతా మీకోసమే." అన్నాడు వెంకటపతి కోపంగా, విసుగ్గా.

"మాకోసం మీకంత శ్రమ దేనికిలెండి!" అని ఎత్తిపొడిచారు పల్లె యువకులు.

"ఇక్కడేదో చేస్తే మీ కేదో ఉద్యోగం వస్తుం దిట, మాకు తెలుసు" అన్నారు దేశ వ్యవహారాల్లో మిడిమిడి జ్ఞానం సంపాదించిన కొందరు. వెంకటపతికి చిరాకేసింది. తను నిజాయితీతో వాళ్ళని బాగుచేదామనీ, చేతైనంతవరకు పైకి లాగుదామనీ ప్రయత్నిస్తే ఇదా ప్రతిఫలం! ఈ కోనపల్లి ప్రజలకు అహంకారం ఎక్కువ. వాళ్ళలో ఏకోశానా అర్థం చేసుకునే శక్తి లేదు. తను ఈ ఊరు విడిచిపెట్టేసి ఇంకో ఊరు వెళ్ళటం ఉత్తమం. ఇక్కడ తన కాలం వృథా చెయ్యకూడదు.

వెంకటపతి గుడారం ఎత్తేశాడు కోనపల్లి గ్రామం నించి. వెళ్ళిపోయేముందు సూరిని కలుసుకుని వాళ్ళం దర్నీ చడామడా తిట్టేసి తన కార్యక్రమం తనని అర్థం చేసుకోగల మరో పల్లెలో కొనసాగిస్తానని చెప్పాడు.

అసలు అటువంటిపల్లె ఉంటుందా?" అన్నాడు సూరి.

"నేను నిరాశావాదిని కాను. మీరు పల్లెటూరి వారయి ఉండీ పల్లె ప్రజల్ని అర్థం చేసుకున్నట్టు లేదు. వాళ్ళలో శక్తీ, ఉత్సాహమూ, పట్టుదలా లేవనా మీ ర నేది?"

"అది కాదు. మిమ్మల్ని అర్థంచేసుకోగల పల్లె ఉంటుందా అని."

వెంకటపతి కాసేపు ఆలోచించి అనుమానంగా సూరివైపు చూసి అన్నాడు.

"అయితే లోపం నాదే ననా మీ రనటం?"

"లోపం సంగతి కాదండీ. మిమ్మల్ని గురించి తెలుసుకోటానికి వాళ్ళకి అవకాశం తక్కువ కదూ?"

"పాటిమనిషిని అర్థంచేసుకోటానికి ఎంత వ్యవధి కావాలండీ?"

"మీలాంటి మనిషిని మీరు సులభంగా అర్థం చేసుకోగలరు. నేనూ అంతే. మా ఊరివాళ్ళూ అంతే. కాని మీరు మాలో ఒకరు కారుగా."

వెంకటపతి కనుబొమలు చిట్లించి సూరివైపు చూసి విచారంగా అన్నాడు: "చదువుకున్నవాడు, మీకుకూడా ప్రాంతీయ దురభిమానం ఉందన్నమాట."

సూరి ఆశ్చర్యపోయి వెంకటపతివైపు చూశాడు. అత నేదో అనబోయి మళ్ళీ వెంటనే మాటమార్చు కున్నాడు.

"జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ". కదండీ మాటల్లోంచి ఏదో అపహాస్యం ధ్వనించినట్టు వెంకటపతికి అనుమానం వేసింది. అతను పొడిగా నవ్వాడు. ఇంకా ఈ ప్రజలు ఇలాంటి దురభిమానాలతో కొట్టుకుంటున్నారు. తన సంఘసేవ వాళ్ళకేం రుచిస్తుంది!

"వెళ్ళొస్తాను." అతను సెలవు తీసుకున్నాడు.

తలుపు చెక్కపక్కన నిలబడి ఈ సంభాషణ అంతా వింటున్న జానకి వెంకటపతి గడపదాటగానే పక్కన నవ్వుతూ వసారాలోకొచ్చి అంది.

"ఎల్లన్నయ్య వేమవరం వెళ్ళొచ్చాట్ట!"

మూర్తి జానకివైపుచూసి చిన్నగా నవ్వాడు.

"అంతే మరి."

"బావకూడా ఇంచుమించు అంతే."

మూర్తి ఏదో ఆలోచిస్తున్నట్టుగా ముఖం పెట్టాడు.

"ఎలా తెలుసు?"

"మాటల్లో తెలియదూ? అయితే ఇంత అధ్వాన్నం కాదు. ఆలోచనవుంది. ఎలాగైనా తెలివిగలవాడు కదూ?"

మూర్తి మళ్ళీ ఏదో ఆలోచించి ఆమెవైపుచూసి అన్నాడు: "బావంటే నీకు అభిమానమా జానకీ?"

జానకి అతనివైపు కొంచెం వింతగా చూసి అంది: "నీకుమాత్రం లేదూ?"

కనుబొమలుముడిచి మూర్తి మళ్ళీ ఆలోచనలో పడ్డాడు. గడుసుపిల్ల జానకి. మాటల్లో తేలదు.

## 11

శ్రావణమాసం నోములకి పద్మ పుట్టింటికివచ్చింది. తోరణాలతో ఇలు కలకలలాడుతోంది. ఈ హడావిడి చూసి విశ్వం ఆశ్చర్యపోయాడు. పద్మ ఎన్నడూ పూజా పురస్కారాలు చేసి ఎరగదు. ఇప్పుడిలా అకస్మాత్తుగా ఆమె మారటానికి కారణం ఏమై ఉంటుందో ఊహించలేకపోయాడు విశ్వం. అసలామె తీరహాయే మారిపోయింది. వేషంలో, మాటతీరులో, అభిరుచుల్లో అభిప్రాయాల్లో ఇప్పటి పద్మకీ పూర్వపుపద్మకీ పోలిక లేదు. విశ్వం వాకిట్లో కూర్చుని పేపరు చదువుకుంటుండగా 'శ్రీ కృష్ణపరబ్రహ్మణేనమః' అని వినిపించి తలెత్తిచూశాడు. ఉపాదానంకోసం నిలబడి ఉన్నాడా ఆగంతుకుడు. ప్రత్యేకించి ఇటువంటి యాచన అంటే విశ్వానికి ఒళ్ళుమంట. "వెళ్ళండి" అన్నాడు ముఖం చిట్లించుకుని. కాని ఇంతలో పద్మ దోసిలినిండా బియ్యం తెచ్చిపెట్టింది. ఆయన 'కృష్ణార్పణం' అని వెళ్ళిపోయాడు.

"ఇదెప్పటినుంచి?" అన్నాడు విశ్వం ఎగతాళిగా.

"ఏది?"

"ఈ ఔదార్యం"

"ఇదికూడా ఔదార్యమేనా?"

"ఇదివరకు నీకీ అలవాటు లేదులే, అందుకని అనుకున్నాను."

"అలవాట్లు ఎప్పుడూ ఒక్క మాదిరిగానే ఉంటాయా?"

"భక్తికూడా బాగా అబ్బినట్టుందే?"

"తప్పా?"

"తప్పొప్పుల సంగతి కాదులే. ఇంత అకస్మాత్తుగా దేవుడిమీద నమ్మకం ఎలా కుదిరిందా అని!"

"ఎవరి అభిప్రాయాలు వాళ్ళవి."

"ఒక్కొక్కసారి ఇతర్ల అభిప్రాయాలే మనవి ఔతాయి కూడా."

"ఐతే ఏమంటావు?"

"అభిరుచులుకూడా అలాగే ఇతర్ల అభిరుచుల కనుగుణంగా మారిపోతూంటాయి."

"మారితే నష్టమేమైనా ఉందా?"

"నష్టమేముంది? మనవ్యక్తిత్వం మంటగలుస్తుంది. అంతే."

"బలవంతంగా మారితే."

"ఏవిధంగా ఐతే ఏం?"

"ఇప్పుడు వాదనెందుకులే."

"ఏం? అది నీ కిష్టమేగా? ఓహో, ఆ విషయంలో కూడా మార్పు వచ్చింది కాబోలు. డాక్టరు ఏమో అనుకున్నానుగాని తన అభిప్రాయాల్ని ఇతర్ల మీద బాగానే రుద్దగలడే!"

"అలాగేనా మాట్లాడేది?" అంది పద్మ చిరుకోపంతో.

"డాక్టరుగారు నా స్నేహితుడే. ఎలా మాట్లాడటానికైనా నాకు స్వాతంత్ర్యం ఉంది.

"అయితేసరే, అద్దం ఎదురుగా కూర్చుని మాట్లాడుకో. నేను పేరంటం పిలవటానికి వెళ్ళాలి."

అని పద్మ లోపలికి వెళ్ళిపోయింది. విశ్వం చిరునవ్వు నవ్వుకున్నాడు. ఎంతగా మారిపోయింది పద్మ! పూర్వం ఎరుపురంగంటే ఆమెకి అసహ్యం. ఇప్పుడు ఎరుపురంగు చీరలే ఏరుకు కడుతుంది. ఇదివరకు అంత స్వేచ్ఛగా ఇంట్లో తిరిగేది ఇప్పుడేమో ప్రతి దానికీ తడుముకుంటున్నట్టుగా ఉంటుంది. తనేమిటో చుట్టపుచూపుగా వచ్చినట్టు మాట్లాడుతుంది. ప్రతి విషయంలో డాక్టర్ ఇష్టా ఇష్టాలు సూచిస్తుంది. ఇంతగా ఆమె తన వ్యక్తిత్వాన్ని పోగొట్టుకోటం విశ్వానికి కొంచెం కష్టంగా ఉంది. ఈ మార్పులన్నీ ఎంతవరకు పద్మ తెచ్చిపెట్టుకున్నవో, ఎంతవరకు డాక్టర్ గారి ప్రభావం ఫలితాలో తనకి తెలియవు. కాని ఇలా మారటం అంత సమంజసం కాదని తోస్తోంది తనకి. పద్మ నడిగితే ఈ విషయాలు చాలా తేలిగ్గా తోసేస్తుంది. తనేం మారలేదనీ, ఒక వేళ మారినా ఆ విషయం విశ్వం చెప్పేదాకా తనకే తెలియదనీ అంటుంది.

శ్రావణమాసం అయిపోయింది. పద్మ ప్రయాణం కట్టింది. విశ్వం తీసుకొని వెళుతున్నాడు. వెళ్ళబోతూ గోపికి పదిరూపాయల నోటిచ్చింది పద్మ.

"వాడికి నువ్వివ్వట మేమిటి?" అన్నారందరూ. కాని వాడు వెంటనే ఆ నోటు నిక్కరు జేబులో దాచుకున్నాడు. అప్పుడప్పుడు అక్కయ్య తనకిచ్చిన ప్రజంటు చూసుకుంటుంటే అదో తృప్తిగా ఉంటుందని వాడికి ఆ సమయంలో అనిపించింది.

"స్త్రీలకి ఆర్థిక స్వాతంత్ర్యం లేదు" అన్నాడు విశ్వం.

"అబ్బ నువ్వూరుకో అన్నయ్యా. నువ్వు ప్రతి దానికీ వాదిస్తావు" అంది పద్మ.

విశ్వం మళ్ళీ నోరెత్తలేదు. తను వాదిస్తాడట! గంటలతరబడి తనతో పిడివాదం వేసుకుని ఉక్రోషం తెప్పించే పద్మేనా యీ మాటలు అన్నది!

హైదరాబాద్ లో డాక్టరుగారి ఇలు, ఆస్పత్రి కూడా నగరంలో ఒకమూల ఉన్నాయి. ప్రయాణపు బడలికతో కుర్చీలో కూలబడి "ఏమిటయ్యా, విసిరేసినట్టు ఇక్కడపెట్టావు మకాం?" అని రిమార్కు చేశాడు విశ్వం. శ్రీనివాసరావు నవ్వి ఊరుకున్నాడు.

ఆ సాయంత్రం శ్రీనివాసరావు తన డిస్పెన్సరీ చూపించాడు విశ్వానికి. నర్సింగ్ హోమ్ వేరచోట ఉంది. ఇలూ, డిస్పెన్సరీ, నర్సింగ్ హోమ్ అన్నీ కలిపి ఒకచోట పెట్టమని సలహా ఇచ్చాడు విశ్వం.

"అలా అయితే చిక్కులున్నాయి" అన్నాడు డాక్టర్.

"ఏమిటా చిక్కులు?"

"పొద్దస్తమానమూ యీ రోగులగొడవతో నేను సతమతమవటమే కాక పద్మకికూడా ఆ అవస్థ దేనికి?"

విశ్వం అసలువిషయాన్ని తప్పించి అన్నాడు.

"'రోగుల గొడవ' అని విసుక్కునేవాడివి నువ్వేం డాక్టరువయ్యా?"

"ఈ. ఎన్. టి. స్పెషలిస్ట్"ని డాక్టర్ చిరునవ్వు నవ్వుతూ అన్నాడు.

"అసలు ప్రశ్న తప్పించకు. రోగులకు సేవచేసే అవకాశం లభించినందుకు సంతోషంతో ఆ పని చెయ్యాలిగాని విసుక్కోటం డాక్టరైనవాడికి ధర్మం కాదు. అంతో ఇంతో సంఘసేవ చెయ్యాలనే అభిలాష ఉన్న నాలాంటివాడికి ఆ అవకాశమే దొరకదు. దొరికిన నీలాంటివాళ్లు అసంతృప్తితో బాధ పడతారు. మనుషుల చిత్తప్రవృత్తుల్ని బట్టి ఉద్యోగాలు దొరికితే ఎంత బావుంటుంది!"

డాక్టరేమీ సమాధానం ఇవ్వలేదు. చిరునవ్వు నవ్వుతూ విశ్వంవైపు చూడసాగాడు. డాక్టర్ సమాధానం చెప్పకపోవటంతో విశ్వానికి మరింత అవకాశం లభించింది తన వాగ్ధోరణి కొనసాగించటానికి.

"ఒక్క ప్రశ్న అడుగుతాను చెబుతావా? తడుముకోకుండా సమాధానం చెప్పాలి."

"అడుగు."

డాక్టర్ కళ్ళలోకి గంభీరంగా చూస్తూ బాణంలా వొదిలాడు తన ప్రశ్న విశ్వం.

"నీ జీవితలక్ష్యం ఏమిటి?"

"గొప్ప డాక్టర్ని కావటమే."

గోలులోకి బంతిని తన్నినట్టు విజయసూచకంగా చూశాడు డాక్టర్. వెంటనే వచ్చిన ఈ సమాధానానికి ఓడిపోయిన గోల్ కీపర్ లా ముఖం పెట్టాడు విశ్వం.

"ఇంకొక ప్రశ్న. ఈ పాతికేళ్ళలో నువ్వు చేసిన ఒక్క మంచిపని చెప్పు, చూద్దాం."

డాక్టర్ ఆలోచించసాగాడు. విశ్వం విజయసూచకంగా ముఖం పెట్టాడు.

"చెప్పలేవు. మరి కాదా, నీ ఇరవై అయిదేళ్ళ జీవితం స్వార్థంతో నిండిఉందన్నమాట. అంతేనా. డాక్టరుగారూ, ఈ విషయం మనసులో ఉంచుకుని మీరు రోగులతో మెసలండి."

డాక్టర్ విశ్వం బుజంమీద చెయ్యేసి నవ్వుతూ "మహా సంఘసేవకుడివనీ, సంఘోద్ధారకుడివనీ నాకింతవరకూ తెలీదే. ఒక్కసారైనా చెప్పావు కాదేం?" అన్నాడు.

ఆ మాటలు వినగానే విశ్వం ముఖం ముకుళించింది. తను చేసిన సంఘసేవ ఏమిటి? ఇప్పటివరకూ శూన్యం. 'సంవత్సరం పొడుగునా సంఘసేవ చేస్తావులే' అని ఉగాదినాడు సూరి అన్న మాటలు గేలి చేస్తున్నట్టనిపించింది విశ్వానికి.

విశ్వం హైదరాబాద్ వచ్చి మూడు నాలుగు రోజులైంది. తోచనప్పుడు డిస్పెన్సరీకో, నర్సింగ్ హోమ్‌కో వెళ్ళి రోగుల్ని పరామర్శించి వస్తుండేవాడు. ఒకరోజు సాయంత్రం డిస్పెన్సరీనించి బరువుగా అడుగులు వేసుకుంటూ ఇంటికి వచ్చాడు. అతనదోవిధంగా ఉండటంచూసి పద్మ కారణం అడిగింది. ఏం లేదన్నాడు. ఏదో ఆలోచిస్తూ వాలుకుర్చీలో పడుకున్నాడు.

డాక్టరు మామూలుగా రాత్రిపూట ఎనిమిది కాగానే ఇంటికి వస్తాడు. ఆ రోజు రాత్రి ఎనిమిది దాటినా ఇంకా రాలేదు.

"నువ్వు భోజనానికి లే అన్నయ్యా. నీకు ఆలస్యమవుతోంది. వారు తరవాత భోజనంచేస్తారు." అంది ఆమె.

"ఆకలి లేదులే" అన్నాడతను.

తొమ్మిది దాటింది.

"డాక్టర్ అప్పుడప్పుడు ఇంటికి ఆలస్యంగా వొచ్చేవాడా?"

"అవును. ఒక్కొక్కసారి పన్నెండుకూడా అవుతుంది."

"అప్పటివరకూ ఎక్కడుంటాడు."

"కొన్ని ప్రమాదపు కేసులుంటే అలాగే అక్కడే కూర్చుండిపోతారు."

"ఎవరు చెప్పారా సంగతి?"

"వారే"

"నిజమో కాదో కాంపౌండర్ని అడిగావా?" పద్మముఖం ఎర్రబారింది.

"నాకేంఖర్మం?" అంది.

"ఖర్మనాకే నే!" అన్నాడతను.

"ఏమిటి నువ్వు మాట్లాడేది?"

"డాక్టర్ గారికి నర్సుపిల్లమీద మోజెక్కిందిలే."

"అంటే?"

"నర్సంటే శ్రీనివాసరావుకి నిజంగా ఇష్టమేనా?"

పద్మ కొంచెం చిరుగా తలఊపింది.

"పద్మా, డాక్టర్ నువ్వనుకున్నంత మంచివాడు కాడు."

"చాల్లే. మళ్లీ అనకు అలాంటిమాట." అంది పద్మ కోపంగా.

"డిస్పెన్సరీలో అంతా అనుకుంటున్నారే. ఆయనకి నర్సుతో సంబంధం ఉంది. అందుకే ఆలస్యంగా రావటం."

"ఛీ." అంది పద్మ అసహ్యించుకుంటూ. "వెధవ పుకారు. అలాంటివి నువ్వెలానమ్మావు?"

"పుకారయితే మంచిదేకాని దురదృష్టవశాత్తూ అది పుకారు కాదని నా నమ్మకం. ఆయన నర్సుతో కిలకిలనవ్వటం నేనుచూశాను."

"ఆయన అందరితో అలా మనస్ఫూర్తిగా నవ్వుతూనే మాట్లాడతారు. తాడూ బొంగరంలేని మాటలు వాళ్ళు చెప్పారు. నేను నమ్మను. ముమ్మాటికీ నమ్మను. నమ్మలేను"

ఆవేశంగా అంది పద్మ. కంట కన్నీరు ఉబికింది. ఆమెవైపు జాలిగా చూశాడు విశ్వం.

"నువ్వనుకోవటం డాక్టర్ అదృష్టం. అందంలో గాని, గుణంలో గాని, తెలివిలో గాని డాక్టర్ నీకు తీసికట్టు పద్మా. డాక్టర్ బావుండడని వాడికి తెలుసు, నీకు తెలుసు, అందరికీ..."

పద్మముఖం జేవురించింది. ఆమె విశ్వం కేసి చూసింది.

"నీకేమీ తెలియదు. మనిషంటే మనసూ, మాటా హృదయమూ. అంతకంటే నాకేమీ మనిషినిగురించి తెలియదు. వారికంటే అందమైనవారు ఎవరూ లేరు."

ఈ మాటలు నెమ్మదిగా అతి సహజంగా ఏదో సత్యాన్ని చాటే విశ్వాసంతో అంది పద్మ.

విశ్వం మరేమీ మాట్లాడలేదు. ఇటువంటి పద్మని తానెరగడు. పద్మ అనే వ్యక్తి తనకి కనిపించటం

లేదు. ఏదో స్ఫూర్తి తేజస్సు విరజిమ్ముతూ సత్యం, శివం, సుందరం నిర్వచిస్తున్నట్టు అనుభూతి పొందాడు విశ్వం.

బయట ఉరుములు మెరుపులతో జోరుగా వర్షం కురుస్తోంది. రాత్రి పన్నెండు దాటింది. పద్మ, విశ్వం అలాగే తమ స్థానాల్లో ఉన్నారు. తలుపు చప్పుడయింది. పరిగెత్తివెళ్లి పద్మ తలుపుతీసింది. ఎదురుగా తడిసి ముద్దయి డాక్టరు నుంచున్నాడు.

"అబ్బ. అకస్మాత్తుగా దారిలో కొట్టింది వాన. మైలుదూరం నడవాలి సొచ్చింది. సైకిల్ ట్యూబ్ పంచర్ పడ్డది" అంటూ లోపలికొచ్చి విశ్వాన్ని చూశాడు.

"అరే, ఆదేమిటోయ్, ఇంకా అలాగే నిద్ర పోకుండా కూర్చొన్నావేం?"

"నీకోసమే." అన్నాడు విశ్వం.

"భేష్. గొప్పవాడివే. డాక్టర్ కోసం కనిపెట్టుకుని కూర్చుంటే బాగుపడ్డట్టే."

విశ్వం నవ్వు తెచ్చుకొన్నాడు. డాక్టర్ బట్టలు మార్చి పొడిబట్టలు వేసుకున్నాడు. ఆయన హుషార్‌గానే మాట్లాడుతున్నా విశ్వం మాత్రం ముభావంగానే ఉన్నాడు.

"మృత్యువుతో పోట్లాట అనుకో. ఏమవుతుందో పాపం. భయం లేదనుకుంటాను." తనలో అనుకున్నట్టుగా గొణిగాడు డాక్టర్.

"ఎవరి సంగతి?"

"ఎవరో కూలివాడు. పాపం. మందు కొనటానికి కూడా లేనివాడు. వాడిమీద కుటుంబం అంతా ఆధారపడి ఉంది. చిన్నపిల్లలు"

విశ్వం కొంచెం అపనమ్మకంగా చూశాడు డాక్టర్ వైపు. "మాకేం వార్త?" అన్నట్టు పద్మ ధీమాగా విశ్వం వైపు చూసింది.

తెలవారింది. రాత్రి వానలో తడవటంవల్ల డాక్టర్‌కి కొంచెం తగిలింది. అయినా సరకు చెయ్యక డిస్పెన్సరీకి బయలుదేరబోతున్నాడు. ఇంతలో ఎవరో ఒక పేదస్త్రీ వచ్చి, డాక్టర్ కాళ్లకి నమస్కారం చేసి భక్తాజాకీర్తనలు చెయ్యటం మొదలుపెట్టింది. దేవుడల్లే అడ్డుపడి తన భర్త ప్రాణం దక్కించినందుకు డాక్టర్ని ఆమె అనర్గళంగా దీవించసాగింది. మరొక డాక్టరయితే అలాంటోగి దగ్గర పడిగాపులుపడి ఉండి ప్రాణం దక్కించటానికి శ్రమపడడని, ఆయన ఋణం ఈ జన్మకి తీర్చుకోలేననీ స్తుతించింది. "అంతా అదృష్టం" అని డాక్టర్ ఆమెని పంపించివేశాడు.

విశ్వం పద్మవంక చూశాడు. ఆమె చిరునవ్వు నవ్వుతోంది. అతనుకూడా నవ్వాడు. "ఏమిటి కథ?" అన్నాడు డాక్టర్ అది చూసి. "తరవాత చెబుతాలే" అన్నాడు విశ్వం.

కొద్దిలో పోతుందనుకున్న జ్వరం సులభంగా వొదల్లేదు డాక్టర్‌కి. ఇన్‌ఫ్లుయెంజాలోకి దింపింది. పద్మ రాత్రింబగళ్లు సేవ చేస్తోంది. విశ్వం కూడా మంచం దగ్గిరే ఉండి కబుర్లు చెబుతున్నాడు.

ఆ సాయంత్రం ఏవో మందులుకొని తీసుకురావటానికి విశ్వం బయల్దేరాడు. బజారుకి వెళ్ళటానికి డిస్పెన్సరీ మీదగా వెళ్లాలి. డిస్పెన్సరీ ఉన్న పేటంతా ఎక్కువగా కూలి నాలి చేసుకుని బ్రతికే జనం నివసించే ప్రదేశం. విశ్వం నడుస్తుంటే డప్పులచప్పుళ్లు వినిపించాయి. జనం చాలామంది గుమిగూడారు. అదేమిటో చూద్దామని అక్కడికి వెళ్లాడతను. అమ్మవారికి జాతర జరుగుతోంది.

"ఏమిటి ఊళ్ళో బాగుండలేదా?" అనడిగాడు విశ్వం గుంపులో ఒకణ్ణి.

"కాదు బాబూ, డాకర్ బాబుగారికి ఒంట్లో సరిలేదుగదండి. జాతర చేస్తే తగ్గుద్దని మా వోళ్ళంతా చేస్తున్నాం."

విశ్వం ఆశ్చర్యపోయాడు.

"ఏ డాక్టర్? శ్రీనివాసరావుగారేనా?"

"చిత్తం. ధరమగజు. మా లేనోళ్ళకి దిక్కు. పానంపోసే దొర. ఆయన తలి కడుపు చల్లగా నూరేళ్లు బతికుండాలి."

గుంపులో కలిసిపోయాడతను. విశ్వం కళ్లు చెమ్మగిల్లాయి. ఒక్క మంచిపని చెయ్యమని డాక్టర్‌కి తను సలహా ఇచ్చాడు!

విశ్వం ఇంటికి వచ్చేసరికి చీకటి పడింది. అప్పుడే పద్మ థర్మామీటరు చూస్తూ "అమ్మయ్య," అంది. డాకర్ ఆమె వైపు చిరునవ్వుతో ప్రేమగా చూశాడు.

ఆ సమయంలోనే విశ్వం గదిలో అడుగుపెట్టాడు. ఆదృశ్యం చూసి మురిసిపోయాడు. "నిన్నేదో మంచిపని చెయ్యమని సలహా ఇచ్చాను. అది ఉపసంహరించుకుంటున్నాను డాకర్" అన్నాడు విశ్వం.

డాక్టర్ ముసి ముసిగా నవ్వాడు.

పద్మకిదేమీ అర్థం కాక విశ్వం వైపు అయోమయంగా చూసింది.

# వరాహమిహిరాచార్యుని సంఘ సంస్మరణము

## శ్రీ గొల్లాపిన్ని వాసుదేవశాస్త్రి

ఆర్య శ్రీవరాహమిహిరుని గూర్చి నా కెక్కువగా తెలియకున్ననూ అతఁడు రచించిన గ్రంథద్వయము చూచిన మీఁదట నాకు గల్గిన భావప్రవాహము నాపుకొనలేక కొన్నింటి నిందు వ్రాయుచున్నాను.

"ధన్వంతరిక్షపణకామరసింహ"

ఇత్యాది శ్లోకములవలన ఈ పండిత ప్రవరుఁడు విక్రమార్క సభాలంకార మణులలోని యమూల్యరత్నమని పండితలోకవ్యవహారము. శ్రీ విక్రమార్క నరపాలుని గూర్చి చారిత్రకుల భిన్నాభిప్రాయము లనేకములు. ఆ గోష్ఠి ఇప్పుడప్రస్తుతము. ఉజ్జయినిని రాజధానిగా నేలిన శకకర్తయై సాహసాంక మహీపాలుఁడన నొప్పిన విక్రమార్క నరపుంగవుఁడే మన వరాహమిహిరుని కాశ్రయ మిచ్చిన వాఁడని నా యభిప్రాయము.

ఇఁక నీతని సమకాలికులగు ప్రౌఢపండితులను గూర్చి వ్రాయవలయునన్ననూ గ్రంథము పెరుగును.

కాన నాకతని గుఱించి కొన్ని మాటలను వ్రాయతలంపు గల్గినది గాన ప్రకృతము ననుసరించుచున్నాను.

మిహిరుఁడు మగధదేశ బ్రాహ్మణుఁడని శ్రీ భట్టోత్పలాచార్యుఁడు బృహత్సంహితా టీకయగు వ్యాఖ్యలో "వరాహమిహిరాఖ్యో మగధద్విజః" అని లిఖించినాఁడు. ఈ విషయ మతని కెట్లు తెలిసెనో యని మనకు సంశయము కల్గును. కాని జనశ్రుతివలన నీతనికీ విషయము తెలిసియుండును. మూలమునకు తగిన వ్యాఖ్య. వ్యాఖ్యాతకు తగిన మూలము, సెబాస్. భట్టోత్పలుఁడు మాత్రము సామాన్యుఁడా? గండరగండ సకలసంహితా వ్యాఖ్యాతృశక్తి గలవాఁడనని బృహత్సంహితలో 76 వ అధ్యాయములో 645 వ పుటలో.

"ఆచార్యేణ నోక్తాని అస్మాభిర్గ్రథితాని స్తర ధియా న్న ప్రదర్శితాని. యతస్సకలసంహితాస్మాభి ర్వ్యాఖ్యాతు మారబ్ధా కేవల మధురాణాం వ్యాఖ్యా క్రియతే నచాస్మాక మత్ర తథావిధం ప్రావీణ్యం॥ అని చెప్పుకొన్నాఁడు.

"మణినా వలయం వలయేన మణిః" ఈ సూక్తి ఇంకను మెఱుఁగులు వారినట్లున్నది.

మిహిరుని ప్రతిభావిశేషములను గూర్చియు శాస్త్రనిర్ణయములను గూర్చియు వ్రాయవలయు నన్న అది యొక బృహద్గ్రంథమై పోవునని యనుకొని వాటిని మఱొక్కతూరి విస్తరింపఁదలంచి ఈతని ప్రాజ్ఞతకు వేదజ్ఞతకు లోకజ్ఞతకును మచ్చుతునకలగు నీ క్రింది శ్లోకములను సహృదయులకందించుచున్నాను. ఈతని బృహజ్జాతక బృహత్సంహితలు రెండును విజ్ఞానామృత భాండములు. సమాససంహితాదుల నీతఁడు రచించినట్లు తెలియుచున్నది. కాని వానిని చూచి యానందించు భాగ్య మెప్పుడు గలుగునో! బృహజ్జాతకము కేవలము శాస్త్రదృష్టి గలవారికిని బృహత్సంహిత యట్లుగాక శాస్త్రలోకదృష్టులకును అద్భుతానందమును గల్గించునదిగా యున్నవి. ఈతఁడు నిజమునకు మిహిరుఁడే. ఈతఁడు చూడని దేమియుండును.? చూడుఁడు. నాఁటిలోకులు స్త్రీలయెడ జరుపు వక్రములనెల్ల మిహిరుఁడు ఖండించి లోకమునకు బృహత్సంహితా స్త్రీప్రశంసాధ్యాయమున దివ్యోపదేశమిచ్చుచున్నాఁడో!.

జయే ధరిత్ర్యాః పుర మేవ సారం
పురే గృహం సద్మని చైకదేశః
తత్రాపి శయ్యా శయనే వరాస్త్రీ
రత్నోజ్జ్వలా రాజ్యసుఖస్య సారః

రాజు సమస్త భూమండలమును జయించినను వాని కందులో పురమే సారముగదా! ఆ పట్టణమున గృహము, ఆ ఇంటిలో నొకానొక ప్రదేశము (అంతఃపురము) అందులో పర్యంకము సారము. అందు సర్వోత్తమగుణ మండితయును రత్నభూషణ భూషితయును అగు స్త్రీరత్నము సారమైనది.

2. శ్లో. రత్నాని విభూషయంతి యోషా
భూష్యంతే వనితా నరత్నకాంత్యా,
చేతో వనితా హరత్యరత్నా
నో రత్నాని వినాంగనాంగ సంగమ్.

రత్నములను కాంత అలంకరించెదరు రత్నకాంతులచే యోషలు భూషింపబడరు. ఎట్లందురేని రత్నవిహీనురాలైనను అంగన మనస్సును హరించును. అంగనాంగసంగమును వదలిన రత్నము ప్రకాశింపఁజాలదుగదా.

3. శ్లో. ఆకారం వినిగూహతాం రిపుబలం జేతుం సముత్తిష్ఠతాం
తంత్రం చింతయతాం కృతాకృతశతవ్యాపార శాఖాకులం
మంత్రిప్రోక్తనిషేవిణాం క్షితిభుజా మాశంకినాం సర్వతః
దుఃఖాంభోనిధివర్తినాం సుఖలవః కాంతా సమాలింగనమ్.

హర్షామర్షాది మనసికవికారములను దాచి శత్రుబలమును జయించుటను లేచుచూ తంత్రయుల నాలోచించుచూ చేసినట్టియూ చేయుచునట్టియూ పనులను గూర్చి వ్యాకులులగు మంత్రులమాటను జరుపుచూ అన్ని యెడల సంశయాస్పదముగు చిత్తవృత్తిగలవారై దుఃఖసముద్రమున మునిగిన రాజుల కేనో కొంచెము సుఖమున్నదని చెప్పవలసియున్న కాంతా సమాలింగన సౌఖ్యమేగదా!

4. శ్లో. శ్రుతం దృష్టం స్పృష్టం స్మృతమపి నృణాం హ్లాదజనకం
న రత్నం స్త్రీభ్యోఽన్యత్ క్వచిదపి కృతం లోకపతినా
తదర్థం ధర్మార్థౌ సుతవిషయ సౌఖ్యాని చ తతో
గృహేలక్ష్మ్యో మాన్యాః సతతమబలా మానవిభవైః

వినినను చూచినను తాకినను తలంచినను మనుష్యుల కానందమును గలించునట్టి స్త్రీరత్నము కన్నను విశిష్ట రత్నమును విధాత సృజించియుండలేదు. వారికొరకే గదా ధర్మార్థములు, వారినుండియే గదా మానవుడు పుత్రుని సౌఖ్యమును పొందవలసినవాడగుచున్నాఁడు? అట్టి గృహలక్ష్ములగు స్త్రీలన్ని విధములు సౌఖ్య విధివముల చేత గౌరవింపఁదగినవారు.

5 శ్లో॥ ఏష్వంగనానాం ప్రవదంతి దోషాన్
వైరాగ్యమార్గేణ గుణాన్ విహాయ
తే దుర్జనా మే మనసో వితర్కః
సద్భావవాక్యాని న తాని తేషాం॥

అంగనాజనమునందలి గుణములను వర్జించి కొందరు వైరాగ్యమార్గ మవలంబించి దోషముల నెత్తి చూపెదరు. వారు దుర్జనుల యని నా నిశ్చయము. వారల మాటలు సద్భావయుక్తములు కావు (ఏల యనియందు రేని.)

6 శ్లో॥ ప్రబ్రూత సత్యం కతరోఽంగనానాం
దోషోస్తి యో నాచరితో మనుష్యైః
ధార్ష్ట్యేన పుంభిః ప్రమదా నిరస్తా
గుణాధికాస్తా మను నాత్ర చోక్తం.

అయ్యలారా! నిజమును తెల్పుడు. పురుషులచే ఆచరింపబడని దోషముల నంగన లెన్ని చేయుచున్నారు? అయ్యవి ఏపాటివి? ధార్ష్ట్యముచే పురుషులంగనాజనమును వెడల నడచుచున్నారు. మనువు పురుషులకన్ననూ స్త్రీలే గుణాధికులని చెప్పియున్నాఁడు. చూడుఁడు.

7 శ్లో॥ సోమ స్తాసా మదా చ్ఛౌచం గంధర్వశ్శిక్షితాం గిరం
అగ్నిశ్చ సర్వభక్షిత్వం తస్మాన్నిష్కల్మషాః స్త్రియః॥

చంద్రుఁడు స్త్రీజనమునకు శుచిత్వము నిచ్చెను. గంధర్వుఁడు సుశిక్షితమైన వాక్కు నిచ్చెను. అగ్ని సర్వభక్షిత్వము నిచ్చెను. అందుచే స్త్రీలు సువర్ణమువలె పవిత్రమైనవారు.

8. బ్రాహ్మణాః పాదతో మేధ్యాః గావో మేధ్యాశ్చ పృష్ఠతః। అజాశ్వా ముఖతో మేధ్యాః స్త్రియో మేధ్యాశ్చ సర్వతః.

బ్రాహ్మణులు పాదములు పవిత్రులు. ఆవుల పృష్ఠప్రదేశములు పవిత్రములు. మేకల గుఱ్ఱముల ముఖభాగములు పవిత్రములు. స్త్రీలు అన్నింట పవిత్రులు.

9 స్త్రియః పవిత్రమతులం నైతా దుష్యంతి కర్హిచిత్। మాసి మాసి రజో హ్యాసాం దుష్కృతాన్యపకర్షతి॥

స్త్రీల పవిత్రత అసమానమైనది. ఎప్పుడును ఎద్దానను స్త్రీలపవిత్రులుగారు. వారికిగల ఋతుధర్మము ప్రతినెల వారాచరించు పాపములను పోకార్చుచున్నది.

10. జామయో యాని గేహాని శపంత్యప్రతిపూజితాః। తానికృత్యాహతానీవ వినశ్యంతి సమంతతః॥

గృహిణులకే యింటియందు పదిసె మరదండ్ర పోదుండునో అట్టివారిచే తిరస్కరింపఁబడిన కులాంగనలు అట్టి గృహపతులను శపింతురు. వారి శాపాగ్నుల పాలగు గృహములు కృత్యా ప్రయోగములచే హతములయినట్లు పూర్తిగా నశించును. అనగా అట్టి కుటుంబములు పూర్తిగా కూలారిపోవు నను చున్నాఁడు.

11. శ్లో॥ జాయా వా స్యాజ్జనిత్రీ వా సంభవః స్త్రీకృతో నృణాం। హే కృతఘ్నాస్తయోర్నిందాం కుర్వతాం వః కుతస్సుఖమ్॥

తాను పురుషుడై ఈ లోకమున జన్మించవలెయున్న భార్యయో లేదా తల్లియో కారణమగుచున్నది.
"ఆత్మా వై పుత్రనామాసి త్వం జీవ శరదాంశతం"
అను శ్రుతివాక్యమువలన భార్యయందు తానే పుత్రాకృతిగా మానవుడు జన్మించుచున్నాడు గదా. అట్టి జన్మకారణమగు పవిత్రురాలగు స్త్రీ రత్నమును నిందించు నో దుర్జనులారా! మీ కెక్కడి సౌఖ్యము.

12. దంపత్యోర్వ్యుత్క్రమే దోషస్సమశ్శాస్త్రప్రతిష్ఠితః, నరా నతమవేక్షంతే తేనాత్ర వరమంగనాః॥

దాంపత్యధర్మము నెవ్వరుల్లంఘించినను శాస్త్రకారు లుభయులకును సమానమైన దోషమని వచించియున్నారు. పురుషులా మాటనే తలంపరు. వారికన్నను అన్నివిధముల స్త్రీలే శాస్త్రానుసరణమున మేలుగా యున్నారు.

13. బహిర్లోమాతు షణ్మాసాన్ వేష్టితః ఖరచర్మణా, దారాతిక్రమణే భిక్షాం దేహీత్యుక్త్వా విశుధ్యతి॥

అన్యస్త్రీని సేవణ చేసిన మనుష్యుఁడు బయటికి వెంట్రుకలు కనుపడునట్లుగా గార్దభ చర్మమును ధరించి ఆఱుమాసములు భిక్షమెత్తుచూ తిరుగవలయునని దారాతిక్రమణములో ప్రాయశ్చిత్తము విధింపఁబడియున్నది. అటాచరించినవాఁడా పాపమునుండి విముక్తుఁడగునని శాస్త్రరీతి.

14. నిశితేనాపి వర్ణానా మహేశె మదనాశయః త్రిశక్యానివర్తంతే నరాధైర్యేణ యోషితః.

పురుషుఁడు మారు సంగణ్యగనులైనను తనశక్తిచే కామేచ్ఛను జయింపలేడు. స్త్రీసౌవన్యో దుర్జయమగునట్టి కామేచ్ఛను ధైర్యముచే నెదుర్కొని నిరోధింప గలుగుచున్నది.

అహో ధార్ష్ట్యమసాధూనాం నిందతా మనఘాః స్త్రియః ముష్ణతా మివ చోరాణాం తిష్ఠచోరేతి జల్పతాం॥

అసాధువులగు పురుషుల దౌర్జన్యమును గూర్చి యేమందుము. దొంగ ఇంట దూరి పదార్థములను దొంగిలి పరుగెత్తి పోవుచు తన్నువెన్నంటివచ్చు గృహపతిని చూచి గుంపుగాచేరిన ప్రజాసమూహము నవలోకించి దొంగా! నిలు నిలు మన్నట్లున్నది. ఈ దుష్పురుషు లాడువారిని గూర్చి నిందించుట చూడగా, అహో ఇది ఎంతయో ఆశ్చర్యపడవలసిన విషయము.

16. పురుషశ్చటులాని కామినీనాం కురుతే యాని రహో నతానిపశ్చాత్ సుకృతజ్ఞతయాంగనా గతాసూ నవగుహ్య ప్రవిశంతి సప్తజిహ్వం॥

పురుషుడు రహస్యముగ అంతఃపురములలో స్త్రీల కనిష్ట కృత్యములను చేసి బాధించియున్నను వానినన్నింటిని విస్మరించి నారీరత్నములు కృతజ్ఞత గలవారౌటచే వారు చేసిన మేలునే దలంచి తమ మృత భర్తృశరీరములను కౌగిలించి అగ్నిలో దుముకుచున్నారు.

17. స్త్రీరత్నభోగోస్తి నరస్యయస్య నిస్స్వోపి సంప్రత్యవనీశ్వరోసౌ॥ రాజ్యస్య సారో ఽశనమంగనాశ్చ తృష్ణానలోద్దీపన దారుశేషమ్.

ఎవ్వనికి స్త్రీరత్నముతో భోగము కలదో వాఁడు దరిద్రుఁడైనను రాజే యగును. ఎట్లందురా? రాజ్యసారములు రెండు. అయ్యవి ఎవ్వి యందురా? భోజనము, అంగన. మిగత ధనాదికములు తృష్ణానలము నుద్దీపింపజేయు కట్టెలవంటివి.

18. కామినీం ప్రథమ యౌవనాన్వితాం మందవల్గు మృదుపీడితస్వనాం ఉత్ స్తనీం సమవలంబ్య యారతిః సా నధాతృభవనే స్తి మే మతిః.

సముద్గత యౌవనయౌ ప్రథమ యౌవనోద్భాసితాంగియు మందమైనట్టియు మానసాహ్లాదజనకమై

మనోహరమైనటి ధ్వనిగలట్టియూ ఉన్నత స్తనములచే నొప్పినట్టియూ స్త్రీరత్నసముప గూహనోత్పన్న సౌఖ్యము బ్రహ్మలోకములో నైన లేదని నా యభిప్రాయము.

19. తత్ర వేద మునిసిద్ధచారణై
మాన్యమాన ఇతృ సేవ్యసేవకాం,
బ్రూతిధాతృ భవనేపి కిం సుఖం?
యద్రహస్య మశలంబ్య న స్త్రియం.

ఆ బ్రహ్మలోకములో వేదములు మునులు సిద్ధ చారణాదులు గలరు. మరియును పెద్దలను సేవించు పిన్నలును పిన్నలతో సేవింపఁబడు పెద్దలును గలరు. పైన పేర్కొన్న కాంతాపరిష్వంగనసౌఖ్యము విధాతృ భవనమున గలదేమో చెప్పుము.

20. ఆ బ్రహ్మకీటాంత మిదం నిబద్ధం
పుంస్త్రీ ప్రయోగేన జగత్ సమస్తం।
వ్రీడాత్ర కా యత్ర చతుర్ముఖత్వ
మీశోపి లోభాం గమితో యువత్యాః.

ఈ సమస్త బ్రహ్మాది కీటాంత ప్రపంచము పుంస్త్రీ సమాగమజన్యమై యున్నది, ఇవ్విషయమును న్యాయముగా విచారించుపట్లఁ జయ్యేల? తిలోత్తమా సౌందర్యమును తిలకించుటకు మహేశ్వరుఁడే నాలు ముఖముల వేల్పాయెనని పౌరాణిక గాథలవలన మనకు తెల్లమగుచున్నది. ఇట్లే స్త్రీప్రశంసాధ్యాయమును ముగించి అటుపై సౌభాగ్యకరణాధ్యాయమున ఇందలి జటిల కామశాస్త్రీయ రహస్యములను తెలము చేయు చున్నాఁడు.

1. జాత్యం మనోభవకృతంసుభగస్య సర్వ
మాభాసమాత్ర మితరస్య మనో వియోగాత్.
చిత్తేన భావయతి దూరగతాపియం స్త్రీ
గర్భేణ బిభర్తిస దృశం పురుషస్య తస్య.

మనోభవకృతమగు జాత్యమగు (అసలైన) సౌఖ్య మంతయూ చక్కనివానిదే ఇతరుని దాభాసమాత్రము. దూరగతియైననూ కామిని తన మనసులో నే పురుషుని దలంచునో అటి పురుషునితో సమానమైన యాకృతిగల వానినే ఆ బిడ ప్రసవించును. అనగా వీర్య మెవ్వని దైననూ ప్రయోజనము లేదనుచున్నాఁడు. ఏలనన నీతఁడు "మనోహిమూలం హర దగ్ధమూర్తేః" అని సత్యము నొక్కమాటలో వచించియున్నాఁడు. అనఁగా జగదుత్పత్తి స్థితిలయములకు మనస్సేకారణమై నంత మరెటి బాహ్యకారణము ప్రధానము గాదనుట తెల్లమైనది.

"క్షేత్ర్యా కాండం పాదపశ్వో ప్తముక్వాయ్యాం
బీజం వా క్వాం నాన్యతా మేతియద్వత్
ఏవం హ్యాత్మా జాయతే స్త్రీషు భూయః
కశ్చిత్ సర్వం క్షేత్రయోగాద్వి శేషః

ఒకానొక చెట్టుకొమ్మనురిచి భూమిలో నాటి నీరుపోసి పెంచిన అదే చెట్టు అగును. అట్లే విత్తనము గూడ. ఇట్లు ఆత్మ స్త్రీలయందు తిరిగి ఆవిర్భవించు చున్నది. క్షేత్రయోగమునుబట్టి బీజనైరూప్యము ఒకానొకచోట గల్గును. "అజోపి సన్నవ్యయాత్మా భూతానామీశ్వరోపిసన్, ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవామ్యాత్మ మాయయా." అను గీతాశ్లోక మిచ్చట పూర్తిగా అతుకుచున్నది.

ఆత్మాసహైతి మనసా మన ఇంద్రియేణ।
స్వార్థేన చేంద్రియమితి క్రమ ఏష శీఘ్రః
యోగో య మేవ మనసః కిమగమ్యమస్తి
యస్మిన్ మనో వ్రజతి తత్రగతో యమాత్మా.

# ఆత్మహత్య

శ్రీ మంథా వెంకటరమణారావు

పాత్రలు: రామం, కమల, సరోజ, తల్లి.

## రంగం-1

** ఒక గది - స్టేజికి కాస్త ముందుకి ఒక పెద్ద మంచం చేరబడేందుకు వీలుగా- తలపక్క, వెడల్పాటి పొట్టి స్టూలు - మీద తెల్లటిగుడ్డ, మందు సీసాలు - మంచంముందు మూడు కుర్చీలు, దూర దూరంగా-వెనుక, ఒక టేబిలు- దానిమీద పెల్లుబిండా పుస్తకాలు- టేబిల్ మీద కాగితాలు పత్రికలు.

రామారావ్ మంచమ్మీద పడుకొని ఉంటాడు - డాక్టర్ అతన్ని పరీక్షచేస్తూ ఉంటాడు. వెనుక, రామారావ్ తల్లి, అతనిభార్య కమల నిల్చొని ఉంటారు.

తల్లి : ఎలా ఉంది బాబూ?

డాక్టర్ : ఫరవాలేదు...

తల్లి : ఈ వారంరోజులయి ప్రాణం ప్రాణంలో లేదు నాకు.

డాక్టర్ : నార్మల్ కి వచ్చింది...రేపూ ఇలానే ఉంటే బాధలేదు మరి...

తల్లి : మిమ్మల్నే నమ్ముకున్నాను...

డాక్టర్ : అయ్యో! ఏమీ లేదు...మరి రెండ్రోజులకి ఆఫీసుకి వెళ్ళిపోడూ? ఇది కేవలం ఫ్లూ సంబంధమయినది - ఏమయ్యా కవిశేఖరా?

రామా: మీ దయ.

డా : ఏదమ్మా...చేతులు కడుక్కోడానికి నీళ్ళిప్పించండి.

తల్లి : అమ్మా కమలా... డాక్టర్ గారికి నీళ్ళు పట్టు. (డాక్టర్, కమల వెళతారు) ఎలా ఉంది బాబూ ఇప్పుడు?

రామం: నయం...

తల్లి : ఆలోచించకుండా కళ్ళుమూసుకు పడుకో...

రామం: తోచదు.

తల్లి : అలానే అనిపిస్తుంది బాబూ - ఎప్పుడూ ఆ రాతలూ ఆ పుస్తకాల గొడవే నీకు - ఒక నిమిషం అన్నా తెరిపంటూ ఉండాలా? ఇప్పుడిలా ఒంటికొచ్చింది.

రామం: ఆ ఏంజేసేది...ఇది తీరు.

తల్లి : కాస్త తెరిపిచ్చేసరికి ఆ గొడవల్లో పడతావు...

రామం: ఎలానో ఓలా కాలం గడపాలా?

తల్లి : పోనీ ఇప్పుడన్నా ఆ ఆలోచనలు పెట్టుకోకు..

రామం: ప్రసాద్ వచ్చేడా?

తల్లి : నిన్న సాయంత్రం వచ్చివెళ్ళేడు...సరోజ కూడా వచ్చింది...

రామం: (చిరాకుగా) సరోజా?

తల్లి : ఆఁ...

రామం: ఆవిడగారెందుకు దయచేసేరు?

తల్లి : అదేమిటి నాయనా? చాలా మెత్తనయిన పిల్ల.. ఒకే ఆఫీసుకదా అని, చూసిపోదామని వచ్చింది.

రామం: ఉద్ధరించిందిలే.

తల్లి : తప్పు బాబూ - మర్యాదగా గౌరవంకొద్దీ వచ్చినవాళ్ళని అలా అనొచ్చా!

[డాక్టర్, కమల వస్తారు]

డాక్టరు : (బ్యాగ్ తీసుకుని) మూడు గంటలకోసారి టెంపరేచర్ తియ్యండి—మందు ఇయ్యడం, ఇత్యాదులు నిన్నటిలానే—

తల్లి : తిరుగు మళ్ళీ...

మనోహరమైనటి ధ్వనిగలట్టియూ ఉన్నత స్తనములచే నొప్పినట్టియూ స్త్రీరత్నసముప గూహనోత్పన్న సౌఖ్యము బ్రహ్మలోకములో నైన లేదని నా యభిప్రాయము.

19. తత్ర వేద మునిసిద్ధచారణై
మాఽన్యమాన ఇతృ సేవ్యసేవకాం,
బ్రూహిధాతృ భవనేసి కిం సుఖం?
యద్రహస్య మకలంబ్య న స్త్రియం.

ఆ బ్రహ్మలోకములో వేదములు మునులు సిద్ధ చారణాదులు గలరు. మరియును పెద్దలను సేవించు పిన్నలును పిన్నలతో సేవింపఁబడు పెద్దలును గలరు. పైన పేర్కొన్న కాంతాపరిష్వంగనసౌఖ్యము విధాతృ భవనమున గలదేమో చెప్పుము.

20. ఆ బ్రహ్మకీటాంత మిదం నిబద్ధం
పుంస్త్రీ ప్రయోగేన జగత్ సమస్తం।
వ్రీడా(త్ర)కా యత్ర చతుర్ముఖత్వ
మీశోపి లోభాం గమితో యువత్యాః.

ఈ సమస్త బ్రహ్మాది కీటాంత ప్రపంచము పుంస్త్రీ సమాగమజన్యమై యున్నది, ఇవ్విషయమును న్యాయముగా విచారించుపట్లఁ జయేల? తిలోత్తమా సౌందర్యమును తిలకించుటకు మహేశ్వరుఁడే నాలు ముఖముల వేల్పాయెనని పౌరాణిక గాధలవలన మనకు తెల్లమగుచున్నది. ఇట్లే స్త్రీప్రశంసాధ్యాయమును ముగించి అటుపై సౌభాగ్యకరణాధ్యాయమున ఇందలి జటిల కామ్య స్త్రీయ రహస్యములను తెలము చేయు చున్నాఁడు.

1. జాత్యం మనోభవకృతంసుభగస్య సర్వ
మాభాసమాత్ర మితరస్య మనో వియోగాత్.
చిత్తేన భావయతి దూరగతాపియం స్త్రీ
గర్భేఽంబి భర్తిస దృశం పురుషస్య తస్య.

మనోభవకృతమగు జాత్యమగు (అసలైన) సౌఖ్య మంతయూ చక్కనివానిదే ఇతరుని దాభాసమాత్రము. దూరగతియైననూ కామిని తన మనసులోనే పురుషుని దలంచునో అటి పురుషునితో సమానమైన యాకృతిగల వానినే ఆ బిడ్డ ప్రసవించును. అనగా వీర్య మెవ్వని దైననూ ప్రయోజనము లేదనుచున్నాఁడు. ఏలనన నీతఁడు "మనోహిమూలం హర దగ్ధమూర్తేః" అని సత్యము నొక్కమాటలో వచించియున్నాఁడు. అనఁగా జగదుత్పత్తి స్థితిలయములకు మనస్సే కారణమై నంత మరెటి బాహ్యకారణము ప్రధానము గాదనుట తెల్లమైనది.

"శక్త్యాకాండం పాదపశ్చోప్త ముక్త్వాం
బీజం వాశ్యాం నాన్యతా మేతియద్వత్
ఏవం హ్యాత్మా జాయతే స్త్రీషు భూయః
కశ్చిత్ సర్వం క్షేత్రయోగాద్విశేషః

ఒకానొక చెట్టుకొమ్మనునరిచి భూమిలోనాటి నీరుపోసి పెంచిన అదే చెట్టు అగును. అట్లే విత్తినము గూడ. ఇట్లు ఆత్మ స్త్రీలయందు తిరిగి ఆవిర్భవించు చున్నది. క్షేత్రయోగమునుబట్టి బీజనైరూప్యము ఒకానొకచోట గల్గును. "అజోపి సన్నవ్యయాత్మా భూతానామీశ్వరోపిసన్, ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవామ్యాత్మ మాయయా." అను గీతాశ్లోక మిచ్చట పూర్తిగా అతుకుచున్నది.

ఆత్మాసహైతి మనసా మన ఇంద్రియేణ।
స్వార్థేన చేంద్రియమితి క్రమ ఏష శీఘ్రః.
యోగో య మేవ మనసః కిమగమ్యమస్తి
యస్మిన్ మనో వ్రజతి తత్ర గతో యమాత్మా.

పెద్దజబ్బు తెప్పించు... నన్ను చంపు... అప్పుడా బింకం... ఆగర్వం...

తల్లి : అయ్యో తండ్రీ... (తలకొట్టుకోబోతుంది... కాని కమల ఆమెను పట్టుకుంటుంది)

కమల : పదండత్తయ్యా... మీరు పదండీ...

[ఆమెను లేవదీసి, తీసుక వెళుతుంది.]

రామం : వెళ్ళండి వెళ్ళండి...

అత్తా కోడళ్ళిద్దరూ ఒకటి!

[ఒంటరిగా ఉన్నాక చిరునవ్వునవ్వి, కూని రాగం తీస్తాడు... మళ్ళీ అంతలోనే రాగం ఆగిపోతుంది- ముఖం గంభీరతను పొందుతుంది- జుత్తులోకి వేళ్ళుపోనిచ్చి ఆలోచిస్తూ ఉంటాడు... కొంతసేపు ఆలోచించి.]

కమలా! కమలా! (జవాబు లేకపోగా గట్టిగా)

క...మ—లా! (జవాబు ఉండదు... దగ్గరగా స్టూలుమీదఉన్న గాజుగ్లాసుతీసి కిందకొడతాడు... నిశ్శబ్దం... అతడు సిగ్గుపడి... అంతలోనే కోపం తెచ్చుకుంటాడు.)

[కమల నెమ్మదిగా వస్తుంది.]

కమల : పిలిచేరా?

రామం : (ప్రశాంతంగా ముఖంపెట్టి) ఏమీ అనుమానం? వినిపించలే?

కమల : వినిపించినట్టే అయి కనుక్కుందామని వచ్చేను.

రామం : రైట్!-ఏది, ఆ పుస్తకం ఇలా అందుకో

కమల : (పుస్తకం తీసి ఇస్తుంది)

రామం : డాక్టరు చదవొద్దన్నాడు కదూ? చదువు తాను—ఔను.... నీకు చీమకుట్టినట్టన్నా లేదు... చదివి జబ్బు తెచ్చుకున్నా మరేమయినా ఒకటే నీకు.

కమల : అయ్యయ్యో! గ్లాసు ముక్కలయిందే—నన్ను పిలిచి ఉంటే ఇచ్చి ఉండనూ—అక్కడ్నించి అందుకోవాలా? గ్లాసు ముక్కలవడం తప్ప ఏం లాభముంది?

రామం : గాసేకదా?

కమల : కాని చూడండి, ఈ ముక్కలు గుచ్చుకుంటే గాయం కాదూ?

[చిరునవ్వు నవ్వి, గాజుముక్కలు పారేసివచ్చి, ప్రక్కనున్న కుర్చీలో కూచుంటుంది—రామం కొద్దిసేపు చదువుతున్నట్టు నటించి, పుస్తకం ప్రక్కను పెట్టి కమలవేపు చూస్తాడు. కమల మాటాడక క్రిందకు చూస్తూ ఉంటుంది. పుస్తకం క్రిందికితోసి దబ్బున చేస్తాడు—ఆమె చూడదు.]

రామం : (నిట్టూర్చి) సరే తల్లీ... సరే... క్షమాపణ చెప్పుకోనా?

కమల : (గంభీరంగా చూస్తుంది అతని వేపు.)

రామం : నవ్వు రాదేం... క్షమాపణ చాలదా?

కమల : ఏమనుకోవాలి మిమ్మల్ని.

రామం : (నవ్వి) తగ్గు... తగ్గు...

కమల : అత్తయ్య ఎంత బాధ...

రామం : అవు తల్లీ... అవు... ఏం. అనబోతున్నావో ఆమూలాగ్రం గ్రహించేను... గొంతు నొప్పి చేసుకోకు...

కమల : నోరు నొప్పే నన్నమాట...

రామం : కోపం తెప్పించకు... కులాసాగా మాటాడుకుందామనుకుంటే, నువ్వు పట్టినపట్టు విడవ్..

కమల : విశ్రాంతి తీసుకోండి... అట్టె మాటాడ్డం మంచిది కాదు.

రామం : ఎవరికి?

కమల : మీకే—

రామం : నాకేకదా? నీకయితే చెప్పు.

కమల : (మాటాడదు.)

రామం : (కమల చెయ్యి తన చేతిలోకి తీసుకుని) కోపమా?

కమల : (ఊరుకుంటుంది.)

రామం : ఔనుకదూ? చూడు......తలెత్తు...... ఓహోహో... ఎంత అందం! చెక్కి పెట్టినట్టు ఆ ముక్కు, ముద్దొస్తూ పెదవులు,... బంగారు ఛాయ! ఆ రెండు కళ్లూ నన్ను...

కమల : (నవ్వి) కట్టండి గుర్రాన్ని—నిన్న మీ స్నేహితులొచ్చేరు...

రామం : ఔను...

కమల : సరోజ.

రామం : తెల్సు.

కమల : ఏం? అంత చప్పగా ఊరుకున్నారు?

రామం : ఎగిరి గంతెయ్యమన్నావా?

కమల : భక్తురాలు కదా?

రామం : అదేమిటి?

రామం : మీ రచనలంటే ఆమెకి భక్తి...

రామం : దానికి నేనేం చెయ్యను?

కమల : అదేమండీ...భక్తురాలంటే అంత నిర్దయా?

రామం : నయం... తెలివిలేకుండా పడున్నాను ఆమె అగుపించినపుడు.

కమల : అంత ప్రమాదం జరగలేదు—నిద్రపోతూండే వారు...నాతో కాసేపు మాటాడి వెళ్ళింది...

రామం : బతికేనుకదూ...

కమల : అన్యాయంగా మాటాడకండి—నా జాగాలో ఆవిడ ఉండవల్సిందేగా.

రామం నీకెలా తెల్సింది...

కమల : మీరే చెప్పేగా...

రామం: దేవుడిదయవల్ల వెంట్రుకవాసిలో తప్పింది—

కమల : ఎందులో ఆవిడ తీసిపోయింది?

రామం: నీకన్నానా?

కమల : మీ దృష్టిలో...

రామం: నాకసలు వుద్దేశం కలగడమే వింత! నే రాసినవేవో చదివి, వాటిని పొగిడేవాళ్ళకి అంతకన్నా అప్సరాలు, అతిలోకసుందరి లేవనిపించివుంటుంది నాకు...

కమల : ఆవిడకేం నిక్షేపం...

రామం: ఓ! చూసి మూర్ఛపోవాలి ... ఇప్పుడన్నా ఒకింత ఒదుల్తుందా! ఈ రచన బావుంది ... ఆ కావ్యంలో పదాలపొందిక బావుంది అంటూ 'బోర్' చేస్తుంది ... ఈసారి వస్తున్నదంటే వార్నింగియ్యి...ముసుగుతన్నేస్తాను...

కమల : (కుర్చీలోంచి లేచి ఎడమొహం పెడుతుంది)

రామం: ఏమిటీ చిత్రం!

కమల : అంత నిష్ఠూరంగా మాటాడ్డం న్యాయంకాదు మీ రచనలమీద గౌరవంతో ఆవిడలా మాటాడుతుంది—ఇష్టంలేకపోతే అలా చెప్పేరాదు ఆమె ముఖానే? మీరంటే వారందరికీ గౌరవం...

రామం: నీకెందుకు మధ్య రోషం...

కమల : కష్టమనిపించింది—అర్థంచేసుకోలేరూ!

రామం: చూచో...చూడూ...మనిషినయాక నాకూ ఇష్టాయిష్టాలుంటాయికదా? ఎంత కవినయినా రచయితనయినా తప్పించుకోడం కష్టం...

కమల : (నిరాశగా) అంతేనా?

రామం: నేను దేవుణ్ననుకున్నావా?

కమల : (నవ్వి) మనుషులే అనుకున్నా...

రామం: ఇప్పుడిలా అనుకోటంలేదా?

కమల : ఏమా అనుమానం?

రామం: నువ్వున్న రీతిచూస్తే వేసింది లే.

కమల : మనసు పాడుస్తోందా?

రామం: ఎక్కువ ఆశించకూడదు కమలా...నా గురించి పెద్ద అభిప్రాయం ఏర్పరచుకుని వుంటావ్... సగో జయించి నే అలా అనేసరికి, నీ మేడ కూలిపోయింది... నేను నీ దృష్టిలో దిగజారిపోయేను...

కమల : (నవ్వి) అన్నీ మీరే అనుకుంటారు...

రామం: ఆపాటి గ్రహించలేనా? (ఆలోచించి) ఎలా ఉండమంటావ్ నన్ను ... ఎలా వుంటే నే అంటే నీకు గౌరవం వుంటుంది... (గట్టిగా) ఏ అభిప్రాయాలు...ఏ ఆశయాలు...ఏ ప్రవర్తన?

కమల : (అతని నోటిదగ్గర చెయ్యిపెట్టి) ఏమిటా కేకలు? అత్తయ్య వింటే ఏమనుకుంటారు?

రామం: (తగ్గి క్షణం ఊరుకొని) నీముందిలా వాగి ఉత్త చవటలా కనిపిస్తున్నానా?

కమల : ఈ జ్వరం వారం రోజులాయి ఎందుకిలా మారిపోయేరు? ఇదివరకెప్పుడూ ఇలా లేరు... దేనికలా మీలోమీరు బాధపడతారు?

రామం: అదే అదే...నాలో నాబాధే కాని నీకు రవంతయినా అంటను...

కమల : (అతని చేతులు పట్టుకుని) పోనీ, నన్నెలా ఉండమంటారు? ఉంటాను ... మీ మాట కాదన్నానా ఎప్పుడన్నా?

రామం: నే ఎలా ఉండమంటే అలా ఉంటావ్... ప్రేమగా చూస్తావ్ ... నవ్వుతావ్ ... ఏడుస్తావ్ ... నే అలా ఉండమన్నానని...కాని నిజంగా...నిజంగా నీ మనసులో నిజమైన...

కమల: (ఆశ్చర్యపోయి) ఇదా! మీ అనుమానం... (అతని వేపు తీక్షణంగా చూస్తుంది...అతనామె వేపు చూడలేక అటుతిరిగి..."అమ్మా!" అని గట్టిగా మూలిగి, ఇటుతిరిగి, నుదుట వేళ్ళతో కొట్టుకుని)

రామం: ఏమిటి వెర్రివెధవనయిపోయేను...

కమల: (మాటాడక, చూస్తూ నిల్చుంటుంది.)

# ఆత్మహత్య

రామం: లేదు...ఏకోసానా నే అంటే, నా బాధంతే ఎవరికీ సానుభూతి లేదు...

కమల: (కమల కదలదు-మాటాడదు)

రామం: (గొంతు విచారంగానూ, 'ప్రమెటిక్' గానూ పెట్టి) తెల్సు... తెల్సు ... అలానే నిల్చుంటావ్ ... నన్ను కట్టెమీదకట్టి మోసుక పోతున్నా...చితిలో పెట్టి కాలుస్తున్నా...ఆ మంటలు ఆకాశాన్నంటుకున్నప్పుడు కూడా అలానే నిల్చుంటావ్. (ఊరుకుంటాడు... ఆమె ఏమన్నా అంటుందేమోనని...)

కమల: (మాటాడక నిల్చుంటుంది)

రామం: (అటుతిరిగి మళ్ళీ ములిగి) దిగజారిపోయేను...(మూల్గుతాడు)ఇవన్నీ మాటాడి ఉండకూడదు .. అనవయిపోయేను...అలా 'సింపథయిజింగ్' గా చూడనక్కర్లేదు ఫో!

తల్లి : (వచ్చి) ఏం బాబూ...ఏమయింది?

రామం: (మాటాడడు)

తల్లి : ఏమయిందమ్మా కమలా?

కమల: ఏమయిందో తెలీవట్లేదు ... ఇప్పటివరకు మాటాడుతూనే...

తల్లి : (ఒంటిమీద చెయ్యి వేసి) ఒళ్ళు మరిగిపోతోంది..

కమల: ఇప్పటివరకూ మాటాడుతూనే...

రామం: (చప్పున లేచి) అయితే నీకు నమ్మకం లేదన్న మాట?

తల్లి : అయ్యో! ఆవేంమాటలు తండ్రీ ... చూస్తూ ఉండవమ్మా...డాక్టర్ గార్ని తోడ్కొస్తాను నిముషంలో...

రామం: ఒద్దమ్మా...నన్నిలా పడిఉండనీ...డాకర్లూ ఒద్దు గీద్దూఒద్దు ... నాలాటివాడు ఉండి మాత్రం ఏం చెయ్యాలి...మీ అందరికి కష్టం తప్ప...పోయినా ఎవరేడవాలి...నువ్వు తప్ప...

తల్లి : నీకు మతికూడా పోతోంది...చూస్తూ ఉండు తల్లీ...(వెళ్తుంది)

రామం: (మూలుగుతూ ఉంటాడు)

కమల: (ప్రక్కని కుర్చీలో కూచుంటుంది)

రామం: (మూలుగు ఆపి) ఇదిలా ఎక్కువై మనూచికం లోకో జన్నోకొదింపి, ప్రాణం కాస్తా గుటక్ మంటే ఎంత శాంతి! కాదా?

కమల: ఏమిటామాటలు?

రామం: ఇప్పటిప్పుడు బాధపడించి, ఇప్పటిప్పుడే అనర్గళంగా మాటాడుతున్నానని అలా చూస్తున్నావ్? అవునా?

కమల: నే ఎంతబాధపడుతోందీ గ్రహించేగా?

రామం: అన్నిబాధలూ పోతాయి...ఉత్తకణంలో అనుకున్నావ్ కాదూ... మాడు—...చెయ్యి చూడు...(తనచెయ్యి ఆమె చెక్కిలికానిస్తాడు) కుదిరిందా నమ్మకం...మరీ బాగాకగుతుందిలే...నే బుగ్గి, ధూళిఅయిపోయినప్పుడు...బుగ్గి ధూళి అయి ఎగిరిపోయినప్పుడు. (కొనసాగి ప్రేమటిగ్గా) అప్పుడు......అప్పుడన్నా ఒక్క కన్నీటిచుక్క ఈనిర్భాగ్యుడి కోసం రాలుస్తావా? నాకు నమ్మకం లేదు.

కమల: (ముఖం చేతులతో కప్పుకుని, మంచానికి తల ఆన్చి, ఏడుస్తుంది)

రామం: (తృప్తిగా నవ్వుకుని) ఒకే ఒక్క కన్నీటి చుక్క సుమా.. ఒద్దు.. ఏడవకు....అందాలరానివి...ఈ దరిద్రుడితో ఏం సుఖపడ్డావ్? లక్షలు నీ అందానికి జోహారుచేసాగు...నా కంటే అందగాణ్ణి...డబ్బున్నవాణ్ణి పెళ్ళి చేసుకో (గొంతు తగించి) నిజంగా; అప్పుడే నాఆత్మకిశాంతి... నే పోయాక అలా చేస్తావని మాటియ్యి...

కమల: (కళ్ళు ఒత్తుకుని లేచి వింతగా చూస్తుంది)

రామం: ఆ ఆనందంలో అప్పుడప్పుడు ఈ నిర్భాగ్యుణ్ణి తల్చుకో...(తనమీద తనకు కలిగిన జాలివల్ల గొంతు దుఃఖపూరిత మౌతుంది)ఒద్దు... అంత కోరిక కోరలేను...ఏదెవి తీరుసుందంత కోరిక ... నే నేపాటి...(కన్నీరు తుడుచుకుని పక్కకు తిరిగి మూలుగుతాడు)

కమల: (వింతగా చూస్తూ) మీమిలా అయిపోయేరు!

రామం: (చప్పున లేచి) ఇంకా అనవల్సిందనీ..."ఏం ఇలా ఆటడుక్కి దిగజారిపోయేరు...సిగ్గులేదూ" అను...

కమల: (దగ్గరికివెళ్ళి) ఇటుచూడండి......నా వేపు చూడండి—నామీద నమ్మకముంటే నమ్మండి. నేను ఎప్పుడన్నా, మిమ్మగౌరవ పరచినట్టయినా మీకలా నమ్మకం కుదిరినట్టయినా నేను ఏ శిక్షనన్నా అనుభవిస్తాను...

రామం : (మౌనం)

కమల : ఇవ్వాళ నే అన్నమాటల్ని నమ్మగలిగే రోజొస్తుంది...(సౌమ్యంగా) విన్నారా?

రామం : (కూచో నేందుకు ప్రయత్నిస్తాడు)

కమల : లేవకండి...(దిళ్ళు పేరుస్తుంది)

రామం : (వాటికానుకుని కమల చేతులుపట్టుకొని) అర్థంలేకుండా వాగి, నిన్ను బాధపెట్టేసుకదూ.

కమల : నే నేం బాధపడలేదు...

రామం : (అనుమానంగాచూసి) బాధపడలేదూ? మరి అంతలో ఏడ్చేవ్?

కమల : వాగురించి బాధపడి ఏడవలేదు...

రామం : మరెవరిగురించి?

కమల : మీ గురించి...

రామం : ఓహో తెల్సింది—ఏమిలా పిచ్చివాడ్లా వాగుతున్నాడే అని జాలితలచి ఏడ్చేవ్...... అంతేనా?

కమల : మీరన్నీ తప్పుగా...

రామం : (కోపంగా) నీకే మహా అందం ఉందనీ ఆట లాడిస్తున్నావ్ కదూ కోతిని జేసి?

కమల : నేనా?

రామం : నువ్వే! ఎంత గోటు...ఎంత గర్వం! ఒక్క మాట ఊడిపడదే...నన్ను నేను కించపరచుకుంటూ, నా వ్యక్తిత్వాన్ని బుగ్గి చేసుకుంటే నా అందమేకదా పిచ్చిలా ఆడిస్తోందని ఠీవిగా నిల్చున్నావ్...విస్సినా అది నాకోసంట! ఎంత అహం!

కమల : ఎందుకిలా నన్ను పరీక్ష చేస్తారు...

రామం : ఒకనిముషం ఆపుకోలేకపోయేసరికి ఆ విరహాన్ని భరించలేకే కదా పిచ్చిన్ని మర్కటచేష్టలు చేస్తున్నాడూ అనుకుంటున్నావ్...అమాయకంగా అగుపిస్తున్నావ్...ఎంత జిత్తులమారివో నాకు తెల్సు...

కమల : మీ కాళ్లు పట్టుకుంటాను...విశ్రాంతి తీసుకోండి...

రామం : "పీడిచేత అవాకులూ చవాకులూ వాగించేను...నాదే గెలుపు" అని మురిసిపోకు...నేను గెలవక మానను...ఈ జ్వరమిలా ఎక్కువయి...ఊరంతా మశూచికం...అదొచ్చి చావక మానను...ఛీ! మళ్ళీ మొదటికే వచ్చేను.

కమల : పలవరిస్తున్నారా ఏమండీ! ఏమిటీ మాటలన్నీ...

(రామం ఊరుకుంటాడు...కొంతసేపు)

రామం : సరే...నువ్వే గెల్చేవ్...సత్యంటే నాకెంత మమకారమో నీకు తెలిస్తే ఇంత ఉదాసీనంగా ఉండవ్...

కమల : నేనా? ఎప్పుడు?

రామం : ఈ వారంరోజులయి...ఒక్క నిముషమున్నా దగ్గర కూచున్నావూ? నువ్వు దగ్గరుంటే నాకెంత తృప్తి!

కమల : మీకు జ్వరమాయె...

రామం : అయితే?

కమల : (చిరునవ్వుతో) గోరంతలు కొండంతలు చేసుకుంటున్నారు.

రామం : నే అంటే నీ మనసులో నిజంగా...

కమల : (నవ్వి) ఏమిటా ప్రశ్న?

రామం : ప్రశ్నే—

కమల : గ్రహించుకోలేరూ?

రామం : నీ అందాన్ని తల్చుకున్నప్పుడల్లా ఆ అనుమానమూ వస్తుంది...

కమల : (నవ్వి) మీరు లేరూ అందంగా? నాకెందుకు వెయ్యదూ అనుమానం?

రామం : నీ హుషారూ...నీ చలాకీ...నీ మెరుపూ నాకెక్కడివి? మామూలప్పుడే లేదు...ఇప్పుడిలా నే పడుండగా నా కెక్కడిది ఆ జీవం? నా మాటలు...నా గోల...నా స్థితి నీ సంతోషాన్ని చీల్చుకుని నీ మనసును చేరగలవూ...

కమల : (దెబ్బ తిన్నట్టయి లేచి అతని వేపు కొంతసేపు చూసి అతని పాదాలమీద పడి ఏడుస్తూ) నాకు తల్లీ...తండ్రీ...ఎవ్వరూ లేరు...అన్నీ మీరే అనుకున్నాను...ఏం కావాలి...మీరు చెప్పండి.

రామం : చెప్పనా...చెప్పనా?

కమల : (ఆత్రంగా చూస్తుంది)

రామం : ఊహు...చెప్పను...(కళ్లు కప్పుకుని ప్రక్కకి దొర్లిపోతాడు...ఆమె లేచి ఆత్రంగా అతని తల త్రిప్పి చూసి, గాభరాగా అవతలకు వెడుతుంది)

## రంగం: 2

### అదే గది

రామం: కొంచెం సాయం చెయ్యమ్మా పడకకుర్చీలోకి...

తల్లి : డాక్టర్ గారొచ్చే వేళయింది బాబూ...

రామం: ఈ మంచంమీద చికాకుగా ఉంది...... నొప్పోళ్ళయి...

తల్లి : మనరాత! పోనీ, వెంకటరమణమూర్తి దయవల్ల బతికి బయటపడ్డావు...అంతే చాలు...

రామం: ఇదో హాస్యచిత్రం...... నేను బతికి బయటపడితే అంతే చాలు నీకు...ఎందుకు బతికేనా అని ఏడుస్తున్నాను నేను.

తల్లి : ఎన్నిసార్లు చెప్పాలి రామం......అటువంటి మాటలాడ కూడదని...

రామం: ఆకూర్చీలోకి సాయం చేద్దూ...

[లేవబోతాడు]

తల్లి : ఉండుండు...కమలని పిలుస్తాను......అమ్మా కమలా!

రామం: ఒద్దు...దాన్ని పిలవకు...పోనీ ఈ మంచంమీదే ఇలా ఏడుస్తాను...

తల్లి : నీధోరణి నాకేం అర్థంకాకుండా ఉంది...

[కమల వస్తుంది]

రామం: (ముఖం కప్పుకుని) వెళ్ళు...నన్ను చూడకు వెళ్ళు...

తల్లి : ఇలా కొంచెం సాయం పట్టమ్మా ఈ కూర్చీలోకి..

రామం: మీకో లక్ష నమస్కారాలు...పడకా ఒద్దు కుర్చీ ఒద్దు...మీరు వెళ్ళరూ బాబూ...ఒక్క నిముషం ప్రశాంతంగా ఉండనీండి...

[కమల, పైటచెంగుతో, వెల్లుబికే దుఃఖాన్ని ఆపుకుంటూ వెళుతుంది]

హమ్మయ్య! బతుకు జీవుడా అని!

తల్లి : నీకు మతికాని పోయిందా రామం? ఈ నెలాళ్ళూ చచ్చీ చెడీ ఎవరొరే నీకు చాకిరీ చేసింది?

రామం: నేచెయ్యమన్నానా? చాకిరీచేసి, బతికించి ఈ నరకంలోకి తొయ్యడానికి...ఈ నెల్లాళ్ళూ ఆ అమ్మవారు పెట్టిన బాధనయం...

తల్లి : డాక్టరుగారుకూడా దగ్గరికి వెళ్ళేందుకు జంకేరే! పిచ్చి తల్లి...(కళ్ళొత్తుకుంటుంది)

రామం: నువ్వు చెయ్యలేదూ?

తల్లి : నే బతికినా చచ్చినా ఒకటే.

రామం: ఇప్పుడేన్నను బతికుండి చచ్చినట్టు లెక్క కూడా...

తల్లి : సరే...అను..నా రాత...చచ్చేకాలానికి ఇంకా రాసి ఉంచేడు కర్మ...

రామం: (లేవబోతూ) ఏదీ...చూద్దా...

తల్లి : అతనికి సహాయం చేసి పడకకుర్చీలో పడుకుంచి బెడుతుంది.)

రామం: (కుర్చీలో చేరబడుతూ) చచ్చి స్వర్గాన వుందును...బతికి అందరికీ ఈ బాధలు...

తల్లి : నిక్షేపంలా ఉండక ఈ మాటలన్నీ ఏమిటి రామం...ఈ పిల్లా నేనూ ప్రాణాలు గుప్పిట్లో పెట్టుక గడిపేం ఇన్నాళ్ళం...మా అదృష్టంకొద్దీ నువ్వు దక్కేవ్...ఈ ధోరణేమిటో నాకు చెప్పు—

రామం: తెల్సి ఆ ప్రశ్న ఎందుకు? బాధపడి నానోటంట చెప్తే, ఆ బాధచూసి సంతోషించడానికేనా?

తల్లి : చదువుకున్నవాడివి. ఈకాలప్పవాడివి. నీ జ్ఞానం నాకెలా ఒస్తుంది నాయనా?

రామం: జ్ఞానమెందుకు...ఎదురుగా కనిపిస్తూవుంటే జంతువ.

తల్లి : (ఊరుకుంటుంది వింతగా చూస్తూ)

రామం: (తనని చూపుకుంటూ) ఈ జంతువు...

తల్లి : నిక్షేపంలా ఉన్నవాడివి—జంతువేమిటి రామం?

రామం: వింత జంతువని చూసినట్లు, కళ్ళు అంతంతలు చేసుక చూస్తారు..."ఏడీ రామం..." మరి మాట పెగల్దు—అప్పటి స్నేహం, దగ్గరితనం హుషారు ఆ ముఖాలమీద చస్తుంది...బయటపడ్డాక బతుకుజీవుడా అనుకుంటారు.

తల్లి : అంతా నీకలా తోస్తోంది కాబోసు—ఎవరూ అనుకోరు.

రామం: బయటకెవరు...కాని మనసు చెపుతూనే వుంటుంది—ఆ వేడివేడి తాజామనసు చల్లగాఅయి ఊరుకుంటుంది—నా ముఖం చూడు... నేను అప్పటిరామన్నే...

తల్లి: ఈ జబ్బు పడ్డాక నలుపొచ్చింది డాక్టర్‌గారన్నది వినలేదూ? దేవుడి దయవల్ల చర్మానికేం హాని కలగలేదు—ఈ మచ్చలు పోతాయిబాబూ ఏదో మందూ అదీ ఇస్తామన్నారు కదా...

రామం: నా తృప్తికి-నే ఏడవకుండాను. ప్రేమా? అది 'బాగా నటిస్తారు...వికారమైన వస్తువనిచూస్తే ఇష్టం ఎలా కలుగుతుందమ్మా ఎవరికన్నా?

తల్లి: ఏమీ లేనిదాన్ని నువ్వు అంతంత చేసున్నావ్. నువ్వంటే అందరికీ ఇష్టమే...నువ్వింక అలా మాటాడేవంటే నామీద ఒట్టు.

రామం: ఓ...ఇష్టం! నీకుంటే సరా? మనింట్లో నే. (ఆగిపోతాడు)

తల్లి: ఏమిటి మనింట్లో?

(డాక్టరు వస్తాడు బ్యాగ్‌తో)

డాక్టర్: హల్లో! కవిపుంగవా! ఎలావున్నావివాళ...

తల్లి: బాబూ ఇంక సెక్కండి.....ఇందాకట్నుంచీ ఒకేలా...

రామం: (కోపంగా) అమ్మా ఊరుకో.

డాక్టర్: ఏమిటి సంగతి? నాదగ్గరేమీ దాచనవసరం లేదు—

తల్లి: ఏదో ఆలోచించుకుని వాడు పిచ్చెత్తి మమ్మల్ని పిచ్చెత్తిస్తున్నాడంటే నమ్మండి!

డాక్టర్: నాకు చెప్పవయ్యా—నీకన్న పెద్దవాణ్ణి కానా?

రామం: ఏమీ లేదండీ...

తల్లి: అదే అంటే వినడు...తను మునుపట్లా లేనంటాడు...అందుకు తనంటే ఎవరికీ ఇష్టముండదంటాడు...

డాక్టర్: పుర్రాడ్లా అవసరామం—నువ్వు చాలా అదృష్టవంతుడివి. ఇదొచ్చి అంగవైకల్యంతో బాధపడేవారు చాలామంది— నీ చర్మానికి గోతులు పడలేదు...నే రాసిచ్చే మందులు... వాడితే ఆ మచ్చలు...నలుపుదనం పోతాయి...

రామం: నాకేం నమ్మకం లేదు.

డాక్టర్: నామాటమీద నమ్మకం ఉందా లేదా...

రామం: అయినా...

డాక్టర్: నే అన్నట్టు కానప్పుడు నా వృత్తి మానేస్తాను...సరా?

రామం: అంతమాటనడం ధర్మంకాదు, నా ప్రాణం నాకిచ్చేరు—అదే పదివేలు...

తల్లి: (వింతగా కొడుకుకేసి చూస్తుంది)

డాక్టర్: కృతజ్ఞత చెప్పుకోదలుస్తే కమలమ్మకే చెప్పుకో...

తల్లి: (కళ్లొత్తుకొంటూ) చిట్టితల్లి...

డాక్టర్: ఆవిడ కనిపించడమే మానేసేరు...

తల్లి: కమలా! ఇలా రాతల్లీ ఓసారి—

రామం: (గట్టిగా) పక్కవారింటికి వెళ్ళిందిలా ఉంది—

డాక్టర్: డోంట్ వర్రీ...ఫరవాలే...ఆఁ...పుస్తకాలూ అవీ ముట్టకుండా మరో పదిహేను రోజులు పూర్తి విశ్రాంతి తీసుకో...అవక ఆఫీసూ గొడవలూ ఎలానూ ఉన్నాయి—

తల్లి: అంతా మీ చలవ...

డాక్టర్: సరేవస్తా...మరో కేసుంది ఊరినిండా ఉష్ణతగా ఉంది. (లేస్తాడు)

తల్లి: ఉంటాం బాబూ!

డాక్టర్: మంచిదమ్మా

(డాక్టర్ వెళ్తాడు)

తల్లి: ఇప్పుడు మనసు కుదుటబడిందా?

రామం: (చీరాకుగా) ఈ సంగతులన్నీ డాక్టర్కు చెప్పడం నా కిష్టం లేదమ్మా...

తల్లి: నీతో అన్నీ విడ్డూరమే...

రామం: నేనే ఒక విడ్డూరంలే—

తల్లి: పోనీ, నోరు మూసుకపడుంటాలే—

రామం: అన్నీ అతగాడితో చెప్పడం పెద్ద అప్పుడయినట్టు—అతను నన్నొక గాడిదకింద జమకట్టేడు.

తల్లి: అతన్నలా అనడం మంచిదికాదు నీ ప్రాణం నీకిచ్చేడు—

రామం: ఉద్ధరించేడు—

తల్లి: ఇంకా వంటాపనీ చూసుకోవాలి— కాస్త కళ్ళు మూసుకో (లేస్తుంది)

రామం: కాఫీ ఉంటే కొంచం—

తల్లి: కాఫీవద్దు...హార్లిక్స్...

రామం: ఒద్దుబాబో ఒద్దు.

తల్లి: మరి వాదించకు...ఇప్పుడే పంపుతాను...

రామం: పంపుతావా? ఒద్దు.

తల్లి: ఇదేం చిత్రం...

రామం: ఓపిక ఉంటే తెచ్చియ్యి—లేదా రాం రాం!

(తల్లి వెళ్తుంది — రామం క్షణంసేపు కళ్ళు మూసుకుంటాడు—కళ్ళు విప్పి ముఖం చేత్తో రాసుకుంటాడు ... కూనిరాగం తీసి పైకప్పు వేపు చూస్తాడు...రాగం ఆపి నుదుటిమీద వేళ్ళతో కొట్టుకుని...)
లాభం లే...

(కమల వస్తుంది, గ్లాసుతో)

రామం: (ఉలికిపడి చూసి) నిన్నెవరు తెమ్మన్నారు...

కమల: మీరు కావాలన్నారు...

రామం: నీ సున్నితమైన చేతులకి శ్రమకలిగించిన పాపం ఎవరిది?

కమల: ఏ పాపమన్నా నాదే—

రామం: ఎంతమాట! పతివ్రతా తిలకానివి. నీకు పాపమా?

కమల: ఔను.

రామం: పొరపాటు – ఆ పాపం నాది...

కమల: పొరపాటు మీది...

(గ్లాసు ఇస్తుంది)

రామం: (అందుకుని, విసిరిబోయి, తమాయించుకుని, దాన్ని స్టూలుమీదనుంచి) అయితే ఇదే కామోసు పుణ్యానికి ఫలితం.

కమల: నా పాప ఫలం!

రామం: నే ఎందుకనుభవించాలి?

కమల: నా పాపం కొద్దీ.

రామం: ఏమిటో నీ పాపం?

కమల: నేనై పుట్టడం–

రామం: బంగారు బొమ్మవి – నువ్వయి పుట్టడానికి కొంతపుణ్యం చేసుకోవాలి!

కమల: అదే దురదృష్టం.

రామం: ఏది?

కమల: మీరన్నట్టు పుట్టడం–

రామం: ఏది దురదృష్టమో చెప్పనా?

కమల: అది కాదు–

రామం: ఏది కాదు–

కమల: మీరు చెప్పబోయేది–

రామం: నీ కెలా తెల్సు?

కమల: గ్రహించేను...

రామం: అదీ తెలివంటే! అంత అదృష్టం ఉండీ, చంద్రుడిలో మచ్చలు...

కమల: మీకు సంతోషాన్నివ్వలేక పోతున్నాను...

రామం: కాదు...కాదు– నన్ను కట్టుకుని పరిపూర్ణత అంటూకే, అది పొందలేక పోతున్నావ్—

కమల: (అతని కళ్లలోకి చూసి) మీకు సంతోషం కలిగించలేక పోవడమే నా లోపం–అందుకే మీరన్న పరిపూర్ణత నాకెప్పుడూ రాదు– అందుకు నే నేదో గొప్ప పాపంచేసి ఉండాలి.

రామం: లోపం నీది కాదు – తృప్తిపొందలేక పోవడం అన్నది నాది లోపం –

కమల: అందుకు కారణం నేను కానా?

రామం: అందం, గుణం, తెలివి ఉన్న నీకేం? దేవకన్యవి మనుష్య జన్మెత్తేవ్ – నువ్వన్న దురదృష్టమల్లా నన్ను కట్టుకోవడం...

కమల: హార్లిక్సు తాగండి.

రామం: చాలీ ఆరోగ్యం – ఎవరు సంతోషించాలి కనుక.

కమల: మేమంతా ఏమయేం అనుకున్నారు?

రామం: మీరున్నారు... నే ఉన్నానా? నేనానాడే చచ్చేను...ఈ ఒంటిని మాత్రం దాకగా, పతివ్రతా శిరోమణివైన నువ్వు యముడిదగర్నించి ఈడ్చుకొచ్చేరు...తీరా చూదుగుకదా...పొరపాటయిపోయింది...జాగప్న పుట్టేన్నా ఈ ఒకు మనసులో ఏదేగా...మొత్తుకున్నారు...పోనీ ఏంజేస్తాం అని ఊరుకున్నారు...

కమల: (ప్రక్కనున్న కుర్చీలో కూలబడి కళ్ళు కప్పుకుంటుంది)

రామం: అటు దేవుడుకీ, ఇటు నీకూ చులకనయి పోయేను...

కమల: (తలెత్తి) చులకనా! మిమ్మల్నెప్పుడు నేను చులకనగా చూసేను?

రామం: నీ మీద విజయం సాధిద్దామనుకున్నాను... ఈ జబ్బొచ్చింది. అంతవరకూ దేవుడు అనుకూలుడే. అటుతరవాత నన్నాడించి ఆనందిద్దామని వాడికే అనిపించింది. నన్ను చంపకుండా ఇలా చేసివదిలేసా....

కమల: నే నేం చేసేను....

రామం: నువ్వు వాడికి సాయపడ్డావ్—రాత్రి, పగలు, తిండీ నిద్రామానుకుని నాకు పరిచర్య వెలగబెట్టి నన్ను గెలవనీకుండా జేసేవ్....

కమల: మిమ్మల్ని దక్కించుకున్నాను. నాకదే పది వేలు.

రామం : నీ ప్రయత్నంలో నెగ్గినందుకూ, నన్నోడించి నందుకూ నీకంటె ఆనందం.

కమల : మీ మంచిని కోరుకోడం తప్పా?

రామం : దక్కించుకున్నావు? దక్కించుకు, ఎదురుగా పెట్టుకున్నావుగా ప్రతిక్షణం నీ ఎక్కువ తనాన్నీ నా తక్కువతనాన్నీ బుజూ చెయ్యడంకోసం—అదీ పట్టుదలంటే...

కమల : (ఏడుస్తూ) మీరన్నీ తెల్సినవారు...మీపట్ల నాకెంత గౌరవమో, విశ్వాసమో, మీ రెరుగు దురు...అన్నీ తెల్సి మీరిలా....

రామం : పోనీ...అయిందేదో అయిపోయింది. విచారించకు. ఇప్పటన్నా మించి పోయింది లేదు. నీ అందం, గుణం, తెలివి నీకున్నాయి...ఏమీ తరగలేదు...రామం అనేవాడు లేడుకదా (తనని చూచుకొని) ఈ శరీరానికి అభ్యంతరం లేదు. ఈ చేతులెత్తి ఆశీర్వదిస్తుంది.

కమల : దేనికి?

రామం : అదే...పరిపూర్ణత పొందావంటే రామం అనేవాడి ఆత్మకూడా సంతోషిస్తుంది....

కమల : (ఆశగా) మీరు సంతోషంగా ఉండేందుకు ఏం చెయ్యమన్నా చేస్తాను...

రామం : చేస్తావు కద.

కమల : ఆఁ.

రామం : ఆడితప్పవుకద?

కమల : ప్రాణమన్నా ఇస్తాను....

రామం : అది కాదు-ఇది అందరికీ తృప్తీ, సంతోషమూ సరా....

కమల : చెప్పండి.

రామం : అందం, గుణం, తెలివి, దీనికితోడు డబ్బున్న ఒకమంచి వ్యక్తిని చూసి అతడితో కాపురం పెట్టేయి.

కమల : (దెబ్బతిన్నట్టయి, పిచ్చిదాన్లా చూస్తూ ఉండి పోతుంది.)

రామం : ఏమీ కష్టం లేదు...నన్ను చూడమన్నావా? చూసి పెటనా ఓ అబ్బాయిని?

కమల : (మాటాడబోయి, మాటాడలేదు)

రామం : కోటికి పడగెత్తిన వాడుకూడా నీ అడుగులకి మడుగులొత్తుతాడు. అప్పుడు నీకు పరిపూర్ణత.. అందరు సంతోషిస్తాం... (తనని చూపుకొని) ఈ చెవాకుల వెధవకూడా సంతోషిస్తాడు... ఊఁ...అనవూ? అపుడు నీ అదృష్టం పువ్వులూ కాయలూ లోడిగి...నీ కళ్ళలో మెరుపులు మెరిసి...నీ పెదవులలో జీవం తొణికి...నీ ముఖాన హాసం వెలసి....

కమల : (తెలివితప్పి క్రిందకు జారిపోతుంది)

రామం: (చిరునవ్వు నవ్వి) ఎందుకులే ఆ నటన...... ఇష్టం లేదూ? సిగ్గు కదూ? వధువాయె... ఎంత యినా ఏదో ఆనందమూయె...ఈ బాధ, ఈ నరకం, ఎదురుగా ఎప్పుడూ నా ఈ ఆకారం పోతుందాయె... (విషపు నవ్వు నవ్వి కాలితో ఆమెను కదిపి) లే... లేవవూ... అంత సిగ్గా? (కసిగా ముఖం పెట్టి కాలితో గట్టిగా తోస్తాడు ...ఆమె కదలదు. కాలితో తంతాడు...ఆమె కదలక పోగా అతడికూ కంపాలిపోతుంది. గట్టిగా) అమ్మా! అమ్మా!

తల్లి : (వెనుకనుండి) ఏం బాబూ...వస్తున్నా...... (వచ్చి కమలను చూసి) ఇదేమిటి? ఏమయింది నా తల్లి కేమయింది... ఏమయిందే కమలమ్మ తల్లీ!

రామం: అబ్బా...గోల పెట్టకు... వేడి చేసి మొహం తిరిగింది కామోసు...కాస్త నీళ్లు జల్లు...

పైనుండి స్త్రీ, పురుష కంఠాలు, తలుపు కొడుతూ: రామం!...రామం!

రామం: వీళ్లూ తయారయిపోయేరు......వాళ్ళని తగి లేయి...పొమ్మను...

[కుర్చీలోనుండి లేచి మంచంవేపు నడవబోయి, బలం చాలక తూగిపడతాడు.]

తల్లి : అయ్యో దేవుడా! బాబూ రక్షించండి...

## రంగం: 3

** రెండో రంగంలోలానే. రామారావ్ రాసుకుంటూ ఉంటాడు. తల్లి వస్తుంది.

తల్లి : రాసుకుంటున్నావా బాబూ?

రామం: ఆ...ఏదో ఊసు పోయేందుకు... ఇంక రేప ట్నుంచి ఆఫీసూ గొడవా ఎలానూ ఉంది...

తల్లి : వాళ్లు స్నేహితుడివని చూసేందుకొచ్చేరుకదా ...మొహామన్నా చూపించక......ఏం బాగుంటుంది రామం!

రామం: ఆఫీసులో చూసి ఆనందించవచ్చులే...

తల్లి : ప్రసాదేమనుకున్నాడో?

రామం: కొట్లో కలవనీ...

తల్లి : బావుంది ధోరణి...

రామం: ఏమన్నా పనుండి ఒచ్చేవా అమ్మా?

తల్లి : ఉత్తినే...ఏంచేస్తున్నావో చూసిపోదామని...

రామం: అంతేకద...(రాసుకుంటాడు)

తల్లి : (మౌనం కొంచంసేపు...) సుందరమ్మగారు...

రామం: ఆఁ...ఏవిఁటి? ఏ సుందరమ్మగారూ?

తల్లి : బావుంది! పక్కింటి పిన్నిగారు...

రామం : ఓహో...ఆవిడకేమయింది?

తల్లి : నిక్షేపంలా ఉంది. ఆవిడకేమయింది.

రామం : అదేనా చెప్దామనుకున్నావ్.

తల్లి : అదికాదు...ఏదో మంచిసినిమా వచ్చిందిట.

రామం : ఒచ్చిందా? రానీ ... సినిమా రావడానికీ, పిన్నిగారు నిక్షేపంలా ఉండడానికీ ఏవుంది అవినాభావసంబంధం?

తల్లి ; ఆవిడదానికి వెళ్తున్నారు.

రామం : ఆదాకద. వెళ్ళనీ...నాశుభాశీస్సులుకూడా.

తల్లి : (జంకుతూ) పాపం...కమలకి ఈ రెణ్ణెల్లాయి ఊపిరితీసుకుందుకికూడా తీరిక లేకపోయింది.

రామం : సరే...నాదేతప్పు ... ఇపుడు వన్నిందుకు సాధించడం?

తల్లి : నీతో ఏమనడానికీ నాకు భయమే...

రామం : అంతభయం వేస్తూ ఉన్నానా?

తల్లి . (కోపంగా చూసి) లేవు—

రామం : (నవ్వి) కమలకి తీరిక లేకపోడానికీ పిన్నిగారి సినిమాకీ ఏంసంబంధం?

తల్లి : మన కమలనికూడా ఆవిడ రమ్మన్నారు...

రామం : మామ్మయ్యా...తెల్సింది...

తల్లి : ఇది వెళ్ళనంది...

రామం : వెళ్లనందీ?

తల్లి : వెళ్లనంది...

రామం : సరి కథేమాసిపోయ్.

తల్లి : నే వెళ్ళమని ఒత్తిడిచేసేను...

రామం : షెబాష్...మంచిపనిచేసేవ్.

తల్లి : దాని మనసు కొస్త కదుటపడుతుందికదా అని బలవంతపెట్టేను. నే కోపం తెచ్చుకుంటే నే కాని ఒప్పుకుందికాదు.

రామం : ఏమయితేనేం...ఒప్పుకుందికద! మామ్మయ్యా! అయితే నేనేంచెయ్యనూ?

తల్లి : నువ్వూ వెళ్ళమని ఓమాటంటే సంబరపడుతుంది పిచ్చిది.

రామం : ఓ! నాకేం అభ్యంతరం లేదు.

తల్లి : నిజంగా?

రామం : నామీద నమ్మకంకూడా పోయిందా నీకు?

తల్లి : అందుకొంగు నే అన్నది...సరే (వెళ్తుంది)

[రామం రాత కట్టిపెట్టి పడకకుర్చీలో పడుకుంటాడు ఆలోచిస్తూ—కమల వస్తుంది వచ్చి బెదురుగా నిల్చుంటుంది — రామం అటు వేపు చూడడు]

రామం : (ఆలోచిస్తూ) నువ్వంటే ఒకదినంగా నాకు భయంఉండేది. అనూయకొదుకద?

కమల : (బెరుగ్గా) ఎవరూ?

రామం : ఎప్పుడనుకున్నావ్... అప్పుడు ... రామం, రామంగా ఉన్నప్పుడు...చూసేందుకు బాగానే ఉండేవాడ్ని...ఒప్పుకుంటావా పాయింటు?

కమల : మీరెప్పుడూ నాకు బాగానే ఉంటారు...

రామం : కట్టు, గుర్రాన్ని కట్టు — అంత త్యాగం నాకొద్దు...

కమల : మీ కోసం నే ఏమన్నా...

రామం : చాలు. నా కుషీకని అలాటి మాటలనకు— అన్నా తెల్సిపోతుంది—

కమల : మీ రేమన్నా నా మనసు మారదు.

రామం : నీ మనసు నాకు తెల్సు—మార్చుకుందుకి ప్రయత్నించకుమీ!

కమల : నిజవాఁ...?

రామం : నిజవేఁ—సరే—అయిందా-అప్పుడు నాకు భయం—ఎందుకని ప్రశ్నివేస్తావేమో—ఈసాగసైన అమ్మాయికి నే అంటే నిజంగా ఇష్టమూ లేదా అని... నేనూ ఆ అమ్మాయంత బాగానూ ఉన్నానా లేదా అని...నే అంతగా ప్రేమిస్తున్నానని ఈ బొమ్మకి తెల్సునా లేదా అని...ఏవేవో భయాలు...అనుమానాలు...

కమల : ఏఁవిటండీ ఈ మాటలు... నే ఎప్పుడన్నా...

రామం : పోనీ...అయిపోయిందేదో అయిపోయింది. ఇప్పుడు పరమాత్ముడి దయవల్ల నిశ్చింత! నాకే అనుమానాలూ, భయాలూ లేవు. నే అంటే ఎవ్వరూ ఇష్టపడరూ, ఇష్టపడలేరూ అన్న నిజం బాగ పడీపడీ ఒప్పేసుకున్నానివాళ...ఒక వేళ ఇష్టపడ్డట్టు అగుపడ్డా అది నూటికి నూరుపాళ్లూ నటన అన్నది నాకు నేను "ఇదిరా వేదనాయీ నిజం" అని లౌడ్‌స్పీకర్ పెట్టి చెప్పేసుకున్నాను...

కమల : (ముందుకువచ్చి నూలుమీద కూచొని) మీ రెందుకిలా బాధపడుతున్నారో నాకిప్పుడు నిజంగా అర్థమయింది—నేను...

రామం : సరే సరే...అవన్నీ ఎందుకు. నువ్వెన్నన్నా, నన్ను చూసినప్పుడల్లా "దేవుడి దయవల్ల నాకు రాలేదు—బతికేను!" అనిపించడం మానదు—

కమల : నన్నెందుకిలా పరీక్షచేస్తారు? (దుఃఖంలో అతడి ఒళ్ళోకి వాలిపోతూవుండగా అతడాపి)

రామం : అతిపనికిరాదమ్మాయీ...యేదన్నా నయ్మాత్రలంటే మోతాదు—సరే...అయితే సినిమాకి వెడతావా?

కమల : ఊహూ వెళ్ళను—

రామం : మహారాణీలా వెళ్ళు—

కమల : (తల అడ్డంగా ఊపుతుంది.)

రామం : అలాటి భయాలేమీ పెట్టుకోకు...

కమల : భయాలా?

రామం : అదే—ఇదంతా నే అన్నాక, నువ్వు వెడితే నీకు నామీద ఇసుమంతయినా అపేక్ష లేదని, నేను రూఢిపరచేసుకుంటానని భయం వేసిన దానవై, ఇంకా ఏదేదో ఐ...
ఊహుఁ...వెళ్లను" అనవల్సి వచ్చింది.

కమల : నే ఎంతబాధ పడుతున్నదీ మీకు తెలుస్తే మీరీ మాట లనడం...(కళ్లొత్తుకుంటుంది.)

రామం : అగ్నికి ఆజ్యం తోడైనట్టు. అసలే, "నా కర్మ ఇలా కాలిందేం" అని నువ్వేడుస్తూ ఉంటే దానికి సాయం నా మాటలు కూడానూ.

కమల : మీరే నాకు సర్వం అని మిమ్మల్నెలా నమ్మించను!

రామం : 'మే. బిలీవ్' అంటారు. ఒద్దొద్దు—ఆ బాధ లేమీ పడకు. రామకోటిలా రాసి ఇచ్చేమంటే ఓపిగ్గా కూచొని అన్నిసార్లూ రాసిచ్చేస్తావ్ కూడానూ, నే నమ్మేస్తానని నీకు రూఢిగా తెలిస్తే....

కమల : నన్నేం చెయ్యమన్నా చేస్తాను. చెప్పండి...

రామం : పతివ్రతల జాబితాలో కెక్కడానికా?

కమల : మీరు సంతోషంగా ఉండడానికి.

రామం : నా మనసు కొస్తా జోకొట్టేసి, ఒక్కసారి ఆదరించి, పీడా విరగడయినది తల్లీ అనుకుని ఇంక స్వేచ్ఛగా విహారాలు సలపడానికా?

కమల : (అతనివేపు దెబ్బతిన్నట్టు చూసి, ఏమీ చెయ్యలేక కన్నీరు కారుస్తూఉంటుంది.)

రామం : నిజంచెప్తే నిష్ఠూరం అన్నారు.

కమల : మీ రేమన్నా అనండి పడతాను. కాని ఈ అనుమానా లన్నీ ఎందుకు మనసులో పెట్టుకుంటారు? పోనీ ఎప్పుడన్నా ఏ చిన్న పొరపాటన్నా చేసినేమో చెప్పండి....

రామం : అక్కడే ఉన్నాయంటారు తెలివితేటలు.

కమల : నన్నెందుకిలా అసహ్యించుకుంటున్నారు?

రామం : అంత అదృష్టమా నాకు?

కమల : ఏం అదృష్టం?

రామం : అంటే, నీ రూప, యవ్వన, గుణశీలాదులు చూసి ఆనందించలేకపోవడం, ఆనందించలేకపోతున్నానే అని బాధపడడం, ఇవి తప్పుతాయికదా నిన్నసహ్యించుకుంటే....

కమల : నా కర్థమవలేదు.

రామం : బతికించేవ్! ఎందుకనీసేనా ఆ కొస్త మాటా అని బాధపడుతున్నా నప్పుడే....

కమల : (నేలమీదకొరిగి) మీ పాదాలు పట్టుకుంటాను...ఏదన్నా తప్పులు చేసుంటే క్షమించండి...దేవుణ్ని కోరుకుంటాను... నే అంటే మీకు అసహ్యం కలిగించమని మీకదే కావలిసే.

రామం : అవదని తెల్సు కాబట్టి, అలా కోరుకుంటానని ఎంత ఉదారంగా నన్నా అంటావ్....

కమల : నాకు అన్నీ మీరే—

రామం : మందరగిరిలా, ఎవరన్నా రాళ్ళురువ్వితే ఒక కాపు కాయడానికి...

కమల : మీరే అలాఅంటే నేనేం చెప్పను? (ఆమె ఏడుస్తూ ఉంటుంది...పది సెకనులు మౌనం.)

రామం : (కలనిమిరి) పిచ్చిపిల్లా...ఈ పాటిదానికే ఇంతబాధా...

మల : (తలఎత్తి నమ్మలేనట్టు చూస్తుంది).

రామం : నమ్మలేనట్టు చూడకు...నువ్వంటే నాకెంత ఆపేక్షో నీకు తెలీదు—

కమల : (అనుమానంగా చూస్తూ) నిజమేఁ ? నిజమేఁ ?

రామం : నిజం కమలా...ఉత్తినే నిన్ను బాధపెట్టాలని అవన్నీ అన్నాను...లే...కూచో...లే అమ్మా లే ... (ఆమెను లేవదీసి స్టూల్ మీద కూచోబెడతాడు. ఆమె సంతోషంగా చూస్తుంది) ఉత్త అమాయకురాలివి నువ్వు...నిన్ను బాధపెట్టేను కదూ?

కమల : ఊఁహూ— నే నెప్పుడలా బాధపడలేదు— మీరు సంతోషంగా లేరనే నాకు బెంగగా ఉంటుంది.

రామం : అర్థం ఒకటేలే—కాదూ?

కమల : మీ ఇష్టం—

రామం : (ఆమె కేల తన భుజంమీదికి తీసుక, నిమురుతూ) చిట్టితల్లిని బాధపెట్టేనుకదూ...
[మాటాడుతూ ఆమె జుత్తు ముంగురు, తన వ్రేలికి చుట్టుకుని, వదలక గట్టిగా లాగుతాడు]

కమల : (బాధతో) అబ్బ!

రామం : (చిరునవ్వుతో మరింత గట్టిగా లాగుతూ) ఉత్త అమాయకురాలివి...ఈ బాధలన్నీ పాపం నీకు!

కమల : అబ్బ!! వదలండి! (అతని చెయ్యిపట్టుక ఆపి పెనుగులాడుతూ) అమ్మా! ఏఁవిటీపని! (విడిపించుకుంటుంది)

రామం : (వదిలి) బస్! కోపపడిపోయింది—ప్రేమ ఒలికిపోతోంది ఇదుగో...ఇదంతా ప్రేమే! ఒక్క పిసరు ఇష్టంలేనిది జరుగుతే తిరుగుబాటే! ఏదో మొగుడుకదా, నలుగురూ మొహం కొలుస్తారుకదా అని ఈ నటనా దేవిగారు?

కమల : (ఏడుస్తూ ఉంటుంది)

రామం : వెళ్ళు...ఫో! (గొంతుతగ్గించి) ముండా—

కమల : ఎందుకలా ఏవో ఆలోచించక మనసు పాడుచేసుకుంటారు?

రామం : నేనేం ఆలోచించక ఇలా పోతున్నానో నీకు తెల్సు...నే అనుకున్నది నూరుపాళ్ళ నిజం అనికూడా నీకు తెల్సు...

కమల : మీకు విరుద్ధంగా నేను కలలోనన్నా ఏనాడూ అనుకోలేదు...

రామం : (ఆలోచిస్తూ) ఔనా...ఔను. అమ్మో...కన్నీళ్ళు...కలకంఠి కంట కన్నీరొలికిన అని... (కన్నీళ్ళొత్తి) నిన్ను కష్టపెట్టేనా? నా బంగారు తల్లిని ఏడిపించేనా? (ఆమె చేతులు తన చేతులలోకి తీసుకొని) ఏదీ...నవ్వు... నవ్వమ్మా చూదాం...

కమల : (అనుమానంగా చూస్తుంది.)

రామం : అనుమానమా? నన్ను నమ్మవూ? నే నీకేమీ కానూ? ఈసారి మనస్ఫూర్తిగా అంటున్నాను...నవ్వు!

కమల : మీరు సంతోషంగా ఉండండి — అదే నా కన్నీనూ...

రామం : నీ సంతోషమే నా సంతోషం...ఏదీ... ఒక్కసారి నవ్వు...

కమల : (చిరునవ్వునవ్వి, సంతోషంగా చూస్తుంది.)

రామం : వేళవుతోందిలా ఉంది వెళ్ళు...

కమల : ఊఁహూ వెళ్ళను—

రామం : నాకోపమొస్తుంది మరి...

కమల : ఏమనండి, వెళ్ళను...

రామం : నాగురించి నువ్వెందుకు నీ సరదాలు మానుకోవాలి?

కమల : మీరురాందే నే వెళ్ళను.

రామం : నిజమే? నామీద ప్రేమే?

కమల : అదుగో మళ్ళా—

రామం : ఎన్నాళ్ళయిందో కదా పాపం నువ్వెళ్ళి... వెళ్ళవూ? నాకోసం వెళ్ళు...రేపు నాకు కథ, ఎవరెవరెలా నటించిందీ చెప్పు—

కమల : నే వెళ్ళను — అత్తయ్య బలవంతం చేస్తే మిమ్మల్నడిగేందుకొచ్చేను...

రామం : అంతేకాని నీకు వెళ్ళాలని లేదందూ? ఓహో పతివ్రతా! (నవ్వుతాడు.)

కమల : వెళ్తురూ...మీ మాటలు మరినూ—

రామం : (లాలనగా) ఆ కబుర్లకేంగాని...అత్తయ్య అంతగా వెళ్ళమన్నప్పుడు వెళ్ళకపోతే నొచ్చుకుంటుంది. వెళ్ళకపోతే నామీద ఒట్టే...

కమల : అదుగో—అలాంటిఒట్లు వెయ్యకండి—

రామం : నామాట కొట్టిపారేస్తే అంతే—

కమల: (ప్రేమగా) వెళ్ళమన్నారా?

రామం: నే మాటాడింది తెలుగేనా?

కమల: (నవ్వి) చాలండీ మీ హాస్యాలు...

రామం: చూసేవా...అప్పుడే ఆ ముఖంలో కలువ పువ్వులా వికాసం......పున్నమి చంద్రుడిలా వెలుగు.

కమల: (నవ్వుతుంది)

రామం: చూడండి మహాజనులారా! అవుగో ఆ కళ్లలో కాంతులు...గ్రహించండి సహృదయులారా! ఆ మనసు లోతులలోంచి ఉబికివచ్చే ఆనందం—మూగవకే రేపు కథ చెప్పమీ...ఏదో మేం ఇలా పడి ఉండవల్సినవాళ్ళం...నీలాటి అదృష్టవంతులన్నా ఎందుకు హాయిగా ఉండకూడదూ?

కమల: అయ్యో! అవేం మాటలండీ... ఏమండీ అలా చూస్తున్నారు నావేపు?

రామం: సరదాగా, స్వేచ్ఛగా, చకోరాల్లా ఉండవల్సినవాళ్ళు మీరు... నాకోసమని మీరంతా కష్టాలెందుకనాళ్ళ పడాలి? నా కోసం ఎవ్వరూ బాధపడకండి...నా బంధో అని ఏడుస్తూ ప్రేమ తెచ్చిపెట్టుకుని చాకిరీ చెయ్యక్కరేదు...

కమల: నన్నిలా ఏడిపించడం మీకు న్యాయమా?

రామం: బాధవేసిందా వెన్నలాటి మనసుకి...నాతో మాటాడగా లేని ఆనందం సినిమా అనే సరికి పిల్లుబికింది—

కమల: నాకంతా అయోమయంగా ఉంది. ఎంత మారిపోయేరు... ఎంతసంతోషంగా, ఎంత ఉదారంగా ఉండేవారు!...

రామం: ఇప్పుడు ఉదారంగా లేనంటావ్... ఎన్ని గుండెలు! ఆ మాట అన్నదానికి నీకేముంటుంది నా మీద గౌరవం?

కమల: మీలో మార్పువచ్చిందన్నాను. మీ రెలా మారినా, మీ మీది గౌరవం నాకుపోదు...ఈ సంగతి తెల్సికూడా...

రామం: చిన్నమాట...ఇలా విను...

కమల: (ముందుకు వంగుతుంది)

రామం: (ఇదివరలోలా నే ఆమె ముంగుర్లు పట్టుకొని గట్టిగా లాగుతాడు... ఆమె చలించదు. ఆమె కళ్ళలోకి తొణకకచూస్తూ ముంగుర్లు ఊడదీస్తాడు. ఆమె ఏ భావమూ వెలిబుచ్చదు...)

రామం: (పకపకా నవ్వుతాడు)

కమల: (కుర్చీమీద తల ఆన్చి ఏడుస్తుంది)

రామం: (సిగ్గుపడి, సిగ్గుపడ్డందుకు కోపం తెచ్చుకుని గొంతు తగించి) సానిముండా! (ప్రేమగా గొంతుపెటి) షిఫాను చీరకట్టి, క్రేపుజాకట్ వేసి. నీ నల్లటిజడ బుసలుకొడుతూ కనబడేలా జారవిడిచి, చూడముచ్చటగా, బంగారుబొమ్మలా వినోదించు...నాటకాలు...సినిమాలు...సంగీత కచేరీలు...ఇంకా ... ఇంకా ... ఎంత సంతోషిస్తారు రసికులు బంగారు బొమ్మనిచూసి... ఆ కులుకు, ఆ వయ్యారం ... ఆ వంపుల సొంపు చూసి...(తనను చూపుకుని) ఈ వెధవకూడా చూస్తాడు. కాని రాజకుమార్తె దృష్టి ఈ వికారపు వెధవలమీద పడుతుందా...అబ్బే!

కమల: నేను మిమ్మల్నెంత ఎక్కువగా ప్రేమిస్తున్నదీ మీకు తెల్సు...

రామం: ప్రేమకాదు...జాలి...నా మీద జాలి శే నీకు బజారుముండా?...ఎంత అహం పెరిగిపోయింది...నా మాట విని మంచివాణ్ణి చూసి లేచిపో...వాడోడిలీసేడూ మగోడు...ఎవడూ లేడూ అందాన్ని బజార్లో పెట్టు...నా ఎదురుగా నీ గెలుపుని చాటుకుంటూ ఉండగా నాకు శాంతి ఉండదు...విన్నావా?...

కమల: మీకేం చెయ్యండి నాకు మీ పాదాలే గతి...

రామం: అంతేలే—నిన్ను పోనిస్తానూ? అది నీకు మరింత గెలుపు—వాడితో కులుకుతూ నన్ను చవట కింద కట్టి నవ్వుతావ్...నువ్వు ఇక్కడే ఉంటావ్—నిన్నూ...నీ అందాన్నీ...నీ గర్వాన్నీ నా కాలికింద...

(తలుపు చప్పుడు—రామం వెంటనే సర్దుకుంటాడు. ముఖంలోని కోపం మాయమౌతుంది ...(పక్కనున్న పుస్తకం అందుకొని విప్పి చదువుతున్నట్టు నటించి) ఇంక ఆపుడవాళ్ళకి— కళ్ళుతుడుచుకో ...... ఇంక ఆ మొహాన్ని వారందరికీ చూపి "చూసేరా నా మొగుడెంత హింసిస్తున్నాడు" అని చాటుకుంటుంది కామోసు ...పీడ కీపరువు కూడా ఎందుకుండాలని... ఔనా? అక్కడ రక్తం తుడుచుకో...అవసరంలే...సర్దిచెప్పగల నాపాటి...

కమల కళ్లొత్తుకుని, తలకున్న రక్తపు మరక చీర చెరుగుతో తుడుచుకుంటుంది—ఐదు సెకెండ్ల తరవాత సరోజ వస్తుంది.

సరోజ: (చిరునవ్వుతో) మీకు నే నేం అంతరాయం కలిగించలేదు కదా?

రామం: (పుస్తకం దించి) కలిగించేవ్—

కమల: లే... లేదు...

సరోజ: (వెళ్ళిపోతూ) మళ్లీ సారొస్తా—ఓసారి ఎలా ఉన్నావో చూసిపోదామని...

రామం: చూసేవు కద...

సరోజ: (నవ్వడానికి ప్రయత్నిస్తూ) ఏదీ ఇంకా ఇలా ఒస్తున్నాను...

రామం: నే అగుపించేను కదా...

సరోజ: ఔను...

రామం: చూసినట్టేకదా?

సరోజ: ఊఁ...

రామం: ఎలా ఉన్నాను?

సరోజ: ఏమిటా ప్రశ్న?

రామం: క్యూరియాసిటీ కొద్దీ చూసిపోదామని వచ్చేవ్—

సరోజ: అదేం మాట? స్నేహితులని చూడరూ?

రామం: చూసి ఒక అభిప్రాయం మనసులో ఏర్పరచుకొని, ఒక చిత్రం చిత్రించుకుని గప్ చుప్ గా పోదామనుకున్నావా?

సరోజ: (వచ్చి స్టూల్ మీద కూచొని) అనుకున్నా అనుకోపోయినా ఒక మనిషిని కాని, దగ్గర స్నేహితుణ్ణి కాని చూసినప్పుడు అభిప్రాయం ఏర్పడదూ?

రామం: దగ్గర స్నేహితుణ్ణి చూస్తే కొత్త అభిప్రాయా లేముంటాయి?

సరోజ: కులాసాగా ఉన్నాడనో... చిరాగ్గా ఉన్నాడనో...

[కమలని ఇద్దరూ గమనించరు—కమల లోనికి వెళ్తుంది]

రామం: ఆకర్షవంతంగా ఉన్నాడనో, వెగటుగా ఉన్నాడనో...

సరోజ: ఔను. ఓ నిముషం వెగటుగా అనిపించిన వ్యక్తి, మరో గంటలో అతడన్న ఒకమాటవల్లో, బట్టల మార్పువల్లో ఆకర్షణవంతంగా కనిపించవచ్చు.

రామం: అలానే ఓసారి ఆకర్షవంతంగా ఉన్నతను వెగటుగానూ ఉండొచ్చు—

సరోజ: (నవ్వి) నా కది అనుభవం...

రామం: ఎవరి సంగతి...

సరోజ: కొందరిగురించి మనం పిచ్చి అభిప్రాయం ఏర్పరచుకుంటాం—ఆత్మీయులైన స్నేహితు లంటారు... కొన్ని ప్రత్యేక పరిస్థితులని ఎదుర్కోవాల్సి వచ్చినప్పుడు వారి బలహీనతలు, సంకుచితత్వం, వారన్న ఒక మాటవల్లో, ముఖంలోని భావం వల్లో క్షణికంగా బయట పడితే దురదృష్టవశాత్తూ మనం అక్కడుండడం తటస్థిస్తే ఆ వ్యక్తిలో మనకున్న ఆకర్షణపోగా, అసహ్యంకూడా కలుగుతుంది.

రామం: మాటవరసకి నేను—

సరోజ: నీకేం మహారాజులా ఉన్నావ్...

రామం: (ముఖం వికసించగా సావకాసంగా కూచొని) ఎలా ఉన్నాను?

సరోజ: ఎప్పటిలానే ఉన్నావ్.

[కమల వస్తుంది—ముఖంలో ఇదివరకటి కన్నీటి చారలు లేవు—తల దువ్వుకుంది]

రామం: నువ్వు అన్న క్షణిక బలహీనత కాని, సంకుచితత్వం కాని (కమలవేపు చూసి) మరేదన్నా కాని...

సరోజ: ఉంటే ఉండొచ్చు బలహీనతలు, జుగుప్స పుట్టించేవి మాత్రం కావు...

రామం: నీకేం తెల్సు నా బలహీనతలు—

సరోజ: తెల్సినంత మట్టుకు...

రామం: అయితే నే ఇంక జాగర్తగా ఉండాలి... అంతేనా? మరేం అనిపించలే నన్ను చూడగానే?

సరోజ: నే రావడం ఇష్టంలేదనిపించింది, పోదాం అనుకున్నాను...

రామం: వీడి కిష్టంలేకపోయినా వచ్చి, వచ్చిన పనయింది కాబట్టి పోదామనుకున్నావ్...

సరోజ: ఏమిటాపని...?

రామం: నే ఎలా ఉన్నానో చూడ్డం...

సరోజ: (నవ్వి) ఔను—

రామం: (చిరాగ్గా) ఆఁ—నాకు తెల్సు! ఎలా ఉన్నాను?

సరోజ: నిక్షేపంలా ఉన్నావు...నీకేం...?

రామం: అర్థం లేదు..

సరోజ: కాస్త వల్లపడ్డావ్...అదీ ఈ జబ్బువల్ల ననుకుంటాను ... అంతకుమించి ఏమీ మార్పు లేదు...

రామం: ఏమీ?

సరోజ: ఏమీ—

రామం: (సరదాగానవ్వి) నా సంతోషం కోసం అనడం లేదుకదా?

సరోజ: నువ్విన్ని ప్రశ్నలెందుకు వేస్తున్నావో అర్థం కావటంలేదు...

రామం: అమ్మయ్యో! ఇంక జాగ్రతగా మాటాడాలి - ఏదన్నా బలహీనత బయటపడిందంటే...!

సరోజ: (కమల వేపు అసూయతో చూసి) నేనే మను కున్నా నీకు లక్ష్యమా ఏం?

రామం: నీ అభిప్రాయం అంటే నాకు విలువుంది—

సరోజ: (సంతోషం మగుసుపరనూ) ఎప్పటినుండో?

రామం: ఎప్పుడూనూ—

సరోజ: అదుగో బలహీనత...నాదగ్గరేదీ దాగదు—

రామం: నే అలా అనడం నీ కిష్టంలేదా?

సరోజ: నన్ను నే మోసం చేసుకోవాలి...

రామం: ఏమని...?

సరోజ: నిజమని—

రామం: (కమల వేపుచూసి) ఈ క్షణం నుండీ అనుకో...

సరోజ: పాతవి అబద్ధాలు...?

రామం: కావన్నా నువ్వు నమ్మవుగా—

సరోజ: (కమలకేసి చూసి సిగుపడి తల దించుకుంటుంది)

రామం: (విజయగర్వంతో కమలకేసిచూసి) అయ్యో! ఇంతసేపయీ నిలబడిపోయేవే ... ఆ స్టూలు ఇలా లాక్కొని కూచో...

కమల: ఇలా బానే ఉంది—

సరోజ: (ఏదో మాటాడేందుకు అవకాశం దొరికినందుకు సంతోషిసూ) ఇలా కూచో కమల... ఆ స్టూలు నే తెచ్చుకుంటాను.

కమల: ఒద్దు — నే వెళ్లాలి ... అత్తయ్య చూస్తాం టారు..

రామం: కాస్త ఆగు...ఇదుగో సరో... మా కమలమ్మ దయవల్లే ఇలా అన్నా బయటపడ్డాను-ఆ ఋణం నేను ఎప్పుడూ తీర్చుకోలేను...

కమల: (కొయ్యబారి చూస్తుంది)

రామం: ఏం కమలా అలా చూస్తావ్? నే అన్నదేం అబద్ధమా?

సరోజ: అవును మీ అమ్మగారన్నారు... నేకూడా... (టక్కున ఆగిపోయి, భయంతో కమలవేపు చూసి, సిగుపడి, తలవంచుకుంటుంది)

రామం: (ఏదో నిశ్చయించుకున్న వాడిలా) నువ్వు కూడా కమలలా తెగించి పరిచర్య చేసి ఉండలే నంటావ్-(ఇద్దరినీ చూస్తాడు)

సరోజ: (గాబరాగా) కాదు కాదు...అదికాదు... నేనూ చేదును...(ఆమాట అన్నందుకు సిగ్గూ గిరాకూ పడి లేచి) అంటే నా అర్థం అది కాదు...మళ్ళీ ఒస్తాను...

రామం: లేదు సరో...నువ్వు చెయ్యలేవ్... కమలలా నువ్వు పరిచర్య చెయ్యలేవ్...విన్నావా? (లేచి, కమల చేతులు తన చేతుల్లోకి తీసుకుని) నే ఎప్పుడూ నీకు ఋణపడే వుంటాను కమలా... అందరిముందూ ఆమాట అనగలను...అప్పటికీ నాకు తృప్తిలేదు.

సరోజ: (కోపంగా) నే, పరిచర్య, ఎవరికి, ఎందుకు చెయ్యగలగాలో చెప్తారా రామారావ్ గారూ?

రామం: (కమలతో) ఎలా తీర్చుకోడం నీ ఋణం— ఎలా...ఎలా? సరోజా...చెప్పు - నే ఎలా కమల ఋణం తీర్చుకోడం?

సరోజ: నీ అభినయం సరిగా లేదు...

రామం: (దెబ్బతిన్నట్టయి) ఏం అభినయం?

సరోజ: తెలుస్తూనే ఉంది. అడక్కు—

రామం: (కోపంగా) నీదీ అభినయం...

సరోజ: (ఆత్రంగా) ఏం అభినయం?

రామం: కమలకి నీసానుభూతి...

సరోజ: కమలకి నాపూర్తిసానుభూతి ఉంది.

# ఆత్మహత్య

రామం: అసూయ ఉంది....
సరోజ: (కోపంగా) ఎవరికి?
రామం: నీకు...
సరోజ: అసూయా? నాకెందుకసూయ?
రామం: నువ్వు కాలేక పోయావే అని...
సరోజ: అంటే...అంటే....
రామం: (నవ్వి, మాటలు నొక్కుతూ) అంటే.... నువ్వు...నన్ను....ఇంకా ప్రేమిస్తూనే... ఉన్నావని...దాని భావం...

[సగర్వంగా కమలకేసి చూస్తాడు]

సరోజ: (దెబ్బతిన్నట్లయి) నిన్నా...నిన్నా...
రామం: నన్నే...నన్నే...
సరోజ: (ఆవేశంతో) బ్రూట్ !

[రామం కమీజు పట్టుక లాగి చెంపమీద కొడుతుంది]

రామం: (ఆశ్చర్యపోయి, తేరుకుని నవ్వుతూ)చాలు... ఆ నిదర్శనం చాలు...నిన్ను నువ్వే బయట పెట్టుకున్నావ్...(కమల చెయ్యి పట్టుకుని) కమలా నీకెలా కృతజ్ఞత చెప్పుకోను! ఎలా...
కమల: (నీరసంగా) ఎవరికి?...ఎవరికి కృతజ్ఞత? (హిస్టీరికల్ గా నవ్వి కుప్పగా కూలబడుతుంది)
తల్లి గొంతు దగ్గరౌతూ:—కమలా...పిన్నిగారు పిలుస్తున్నారు...(తల్లి వచ్చి చూసి)
అయ్యో కమలమ్మా...
ఏమయిందమ్మా నీకు...
(కమల పక్కని కూలబడి ఆమె తల ఒడిలోకి తీసుకుంటుంది)
రామం: (నెర్వస్ గా) కృతజ్ఞత...కృతజ్ఞతయింది...
సరోజ: (భయంతో వణికి పోతూ కుర్చీలో కూలబడుతుంది. [తెర]

సశేషము

# సముద్రపు మొక్కలు: వాని ఉపయోగములు

డాక్టర్ ఆర్. ఎల్. ఎన్. శాస్త్రి

నేలపై నుండు మొక్కలవలెనే సముద్రములో నుండు అనేక రకముల వృక్షజాతులు మనకు చాల ఉపయోగకరములను సంగతి సామాన్యుల కంతగ తెలియదు. మానవుని ఆహారమునకు అత్యవసరమైన పదార్థాలను సముద్రపు మొక్కలు తయారుచేయగలవు. యిట్టి పదార్థములు యితరత్ర సులభముగా లభ్యము గాజాలవు. కాడ్ లివర్ ఆయిల్ ఆరోగ్యము నిచ్చునన్న విషయము అందరికి తెలిసినదే. కాని దాని శక్తి సముద్రపు మొక్కలనుండి వచ్చునన్న సంగతి అందరికి తెలియదు. కాడ్ అను చేపయొక్క లివర్‌లో కొన్ని విటమినులు, అయొడిన్‌ను నిల్వచేయుశక్తి కలదు. కాని అది ఈ పదార్థములను సరాసరి సముద్రములో నుండి పొందుటలేదు. అది కొన్ని చిన్న చిన్న సముద్రపు జంతువులను తినును. ఈ చిన్న జంతువులు సముద్రపు మొక్కలను తిని బ్రతుకుచున్నవి. సముద్రపు మొక్కలలో అయొడిన్, విటమినులు విరివిగా నుండును. సముద్రపు నీటిలో చాల అయొడిన్ వుండును. దీనిని సముద్రపు మొక్కలు సేకరించి దానిని చిన్న జంతువుల ద్వారా మానవునికి అందజేయుచున్నవి. జపాను దేశీయులు సముద్రపు మొక్కలను ఆహారముగా నుపయోగించుటలో అగ్రగణ్యులు. వారి ఆరోగ్య సంపద, లలితకళలు, సాహిత్యము, విజ్ఞానరంగములలో వారి నిరుపమాన ప్రావీణ్యత వారి తెలివితేటలు మొదలుగాగల ఉత్తమ గుణములన్నియు వారి ఆహారము వల్లనే వచ్చినవందురు. అటులనే చైనాదేశీయుల విషయములోకూడ వారి సముద్రపు మొక్కల ఆహారము యొక్క ప్రభావము కనుపడుచున్నది. జపానులో గోయిటరు అను వ్యాధి చాల అరుదు. కాని అనేక విషయములలో పురోగమించిన అమెరికావంటి దేశములలోకూడ ప్రజల పోషణము సరిగాలేదు.

ప్రపంచమందంతటను ఆహారముగా నుపయోగింపబడుచున్న సముద్రపుమొక్కలు లెక్కకు మించినవి. పోర్ ఫైరా (Porphyra) అను మొక్కను చాల దేశీయులు పులుసుకాచుకొనుట కుపయోగింతురు. ఇది యెఱ్ఱపాచి (Red Algae) అను వర్గమునకు చెందినది. దీనిని ఉత్పత్తిచేసి ఎగుమతి చేయుటలో జపానుదేశము ప్రథమస్థానము నలంకరించినది. సాలీనా జపాన్‌లో పండించు పోర్ ఫైరాపంట విలువ 50,60 లక్షలకుపైబడును. సముద్రపు ఒడ్డుల తగులు ప్రదేశములలో పెదపెద్ద వెదురుగడల మోపులను నీటిలో పడవేయుదురు. వీనిపై పోర్ ఫైరా మొక్కలు పెరుగును. యెకరమునకు సాలీనా వచ్చుపంట విలువ సుమారు 150 డాలర్లుండును.

సముద్రపు మొక్కలనుంచి అనేకరకముల రుచికరమైన వంకటములు చేయుదురు. వాటికి అలవాటు పడినవారికి అవియెంతో ప్రీతికరముగా నుండును. సరియైన పద్ధతిలో తయారుచేసి టొమాటో మొదలైన వాటితో కలిపి తీసుకొనినచో యేవిధమైన దుర్వాసయు లేక రుచిగానుండును. ఈ వంటకములు "నూయిమొనో" అనియు యింకను అనేక వింతపేర్లతో వ్యవహరింపబడుచున్నవి. ఇంగ్లండు, అమెరికాదేశములలో కూడ సముద్రపుమొక్కలను ఆహారముగా అనాదికాలమునుంచి ఉపయోగించుట కలదు. ఇటీవల ఈదేశస్థులలో యిటువంటి ఆహారములో యితోధికమైన ఆసక్తి కలుగుచున్నది. కొన్ని బ్రిటిష్, అమెరికన్ వ్యాపారసంస్థలు సముద్రపు మొక్కలనుండి తయారుచేసిన ఆహారపదార్థములను "ఆర్ గానిక్-సీ-ఫుడ్" "పార్ కెల్ప్" అనుపేర్లతో అమ్ముచున్నారు. వీనిలో మానవుని ఆహారమున కత్యవసరమైన అయొడిన్, యినుము, కాపర్, కాల్షియమ్, ఫాస్ఫరస్, సోడియమ్, పొటాషియమ్, మెగ్నిషియమ్, సల్ఫర్, మాంగనీస్, అల్యూమినియం, జిన్క్, క్లోరిన్, మొదలైన ఖనిజములు. విటమిన్ A, B D I లు కలవు. వివిధ రకములైన ఆహార పదార్థములను అందచేయుటలో సముద్రపు మొక్కలు సాటిలేనివి.

ఆహారముకొరకేగాక సముద్రపు మొక్కలు పరిశ్రమలలో కూడ ప్రాముఖ్యత గలవి. కెల్ప్

(Kelps) అను ఒక రకము సముద్రపు మొక్కలు చిర కాలమునుండి అయోడిన్ తయారుచేయుట కుపయోగపడుచున్నవి. ఇవి "బ్రౌన్ ఆల్ జే" (Brown Algae) అను తరగతికి చెందినవి. సామాన్యముగా అట్లాంటిక్, పసిఫిక్ సముద్రతీరము లందుండును. వీటిలో కొన్ని 30-50 మీటర్ల పొడుగుండి 10-30 మీటర లోతు వరకు పోవును. అయోడిన్ ఖనిజములనుండి తయారు చేయు పద్ధతి కనిపెట్టక పూర్వము, అది చాలమటుకు కెల్ప్‌లనుండే లభ్యమగుచుండెను. ఆధునిక కాలములో కూడ యుద్ధసమయము లందును తదితర అత్యవసర సమయము లందును అయొడిన్ కెల్ప్‌లనుండి తయారు చేయుటకలదు. పారిశ్రామికముగ నేకాక కెల్ప్‌లు ఆహారమునకు కూడ ప్రాముఖ్యత కలవి. జపానువారు ఎండిన కెల్ప్ మొక్కలనుండి "కొంబు" అను ఆహార పదార్థమును తయారుచేయుదురు. జపానులో సాలీనా అనేక వేల డాలర్ల విలువకల కెల్ప్ మొక్కల పంట పండించుచున్నారు.

జున్నుగడ్డి అందరికీ తెలిసినదే. దీనినే "అగర్ అగర్" అని కూడా అందురు. యిది కూడ సముద్రపు మొక్కలనుండి తయారుచేయబడును. బట్టలు తయారుచేయుట మొదలైన పరిశ్రమలలో ఉపయోగపడుచున్నది. ముఖ్యముగా యిది జపానులో ఉత్పత్తి యగుచున్నది. సాలీనా 2, 3 లక్షల డాలర్ల విలువకల అగర్ అగర్ జపానులో తయారగును. దీనిని కొండప్రదేశములలో శీతోష్ణ పరిస్థితులు అనువుగా నున్నచోట్ల తయారుచేయుదురు.

డయటమ్స్ అనునవి మరియొక సముద్రపు మొక్కలు. వీనిలో కొన్నిజాతులు మంచినీటిలో కూడ పెరుగును. ఇవి సూక్ష్మజీవులు. కాని పారిశ్రామికముగా చాల ప్రాముఖ్యత గలవి. సూక్ష్మదర్శినిలో చూచువారికి అత్యంత సౌందర్యవంతముగా కనబడును. ప్రాచీన యుగములలో మహోజ్వల చరిత్ర కలవి. ప్రస్తుత కాలములో వీని మొక్క శిథిలములు ఫాజిల్స్ రూపములో డయటమేషియస్ ఎర్త్ (Diatamaceous Earth) అను పేర అనేక ప్రదేశములలో కన్పడుచున్నవి. కాలిఫోర్నియాలో డయట మేషియస్ ఎర్త్ అనేక మైళ్ళ విస్తీర్ణము కలిగి 700 అడుగులకుపైన మందము కలిగియున్నది. శాంతా మరీనా (Santa Marina) సానువులలో డయట మేషియస్ మృత్తిక భూమి అంతర్భాగమున 3000 అడుగుల లోతువరకు కలదు. అమెరికాలో సాలీనా 2, 3 లక్షల టన్నుల డయటమేషియస్ ఎర్త్ ఉత్పత్తి యగుచున్నది. ఇది డైనమైట్ తయారుచేయుటలోను, పంచదార ఫ్యాక్టరీలలోను, లోహముల కుపయోగించు పాలిష్ తయారుచేయుటలోను, టూత్ పేస్ట్ తయారు చేయుటలోను ఉపయోగపడుచున్నది.

మన దేశములో కూడ సముద్రపు మొక్కలను విరివిగా ఉపయోగించుటకు అవకాశము లున్నవి. మన సముద్రతీరములందు దొరకు అనేక జాతుల సముద్రపు మొక్కలు యిప్పుడు వృథా అయి పోవుచున్నవి. ఉదాహరణకు ఒరిస్సాలోని చిల్కా ఉప్పునీటి సరస్సులోనుండు గ్రాసిలేరియా అను మొక్కను అగర్ అగర్ తయారుచేయుట కుపయోగించవచ్చును. యిటులనే దక్షిణ భారత సముద్ర తీరమందు దొరకు పోర్ ఫైరాను ఆహారపదార్థములు తయారుచేయుట కుపయోగించవచ్చును. ఈ సందర్భములో ఒక విషయమును తెలియజేయవలసివున్నది. కొన్ని దేశములలో సరస్సులందు పాచిమొక్కలను వృద్ధిచెయుటకు ప్రయోగములు చేయుచున్నారు. అట్లు చేసినచో ఆసరస్సులలోనుండు చేపలకు మంచి ఆహారముదొరకును. తిరిగి ఆచేపలవలన మానవునికి మంచి పోషకమగు ఆహారము లభించును. కాబట్టి మన దేశములో కూడ అట్టి ప్రయోగములు చేయవలసిన ఆవశ్యకతను గూర్చి యెక్కువగా చెప్పనవసరములేదు. కలకత్తాలోని ఉప్పునీటి సరస్సులు, ఒరిస్సాలోని చిల్కా సరస్సు, మద్రాసువద్దనున్న ఎన్నూర్ ఉప్పునీటి సరస్సు యిట్టి ప్రయోగములకు వీలుగా నుండును.

# సాంబయ్య చావలేదు

శ్రీ బలివాడ కాంతారావు

ఆవేళ ఆదివారం తలుపు వేసుకొని కథ వ్రాసుకొంటున్నాను. కథలో వ్యక్తి త్రాగుబోతు. అతని భార్య సహనం వ్యక్తీకరిస్తున్నాను. ఇంతలో తలుపు గడ్ గడమంటు నే ఓ బాబూ! అని ఒక వ్యక్తి ఆత్రుతగా పిలుస్తున్నాడు. లేచి తలుపు తీసాను. చవకబారు సారావాసన గుప్పుమని వేసింది.

"నువ్వు గస్తీగానీ కాదు...రా...ర" ఆత్రుత పడుతున్నాడు. మొదట వీడు త్రాగుతాడా అని ఆశ్చర్యం వేసి తరువాత త్రాగే వాళ్లింతు యింతే అని నేను సావధానంగా యేమైందన్నాను.

"చంపుతాడట—వచ్చి తీర్పుచెప్పు!"

"నిన్నెవరూ చంపలేరు. వెళ్లి హాయిగా పడుకో!"

ఈ మాటలు నోట నేవున్నాయి. నా చెయ్యి పట్టుకొని ముందుకు లాగుతూ "ఇదిగో యీ ప్రక్క వీథిలో నే మాయిల్లు...నాది తప్పయితే నాకే నాలుగు చెప్పుదెబ్బలు వాయించు...వాడిది తప్పయితే వాడికి నాలుగు వెయ్యి".

నే నింకేదో అనబోతుంటే అవకాశం యీయకుండా దండాలు పెట్టూ, పెద్దగొంతుకతో ప్రతిమాలుతూ నన్ను వీథిలోకి వెంట నడిపించాడు. ఈ మనిషి పేరు నాకు తెలీదు. ఏం పనిచేస్తున్నాడో అంతకంటే తెలీదు. వీడూ నేను యిదివరకు మూడుసార్లే కలుసుకున్నాం...నాకు బాగా జ్ఞాపకంవుంది...మూడుసార్లే. మొదటిసారి: నేను బీచిలో ఒంటిగా సాయంత్రం కూర్చుని క్రుంగిపోతున్న దినకరుని వెలుతురు వస్తూన్న ఓడమీద పడ్డాంటే చూస్తున్నాను. వెనకనుంచి "రూపాయి తే" అని అరవగానే వెనుకకు తిరిగాను. అతుకులు వేసి మాసిపోయిన బట్టలతో యెత్తైన మనిషి కనిపించాడు. వయసు నలభై దాటేవుంటాయి. కళ్ళు తీక్షణంగావున్నాయి. క్రూరుడని ఆ ముఖమే అద్దంలా చెప్తోంది. నన్నొక అప్పు యెగగొట్టినవాడిలా చూసి అడుగుతుంటే కొద్దిగా మనసు చివుక్కుమంది. ఆ మనిషివాలకం చూడగానే యిస్తేనేగానీ నన్ను నానాతిప్పలు పెడతాడనే సందేహంతో జేబులో రూపాయి తీసి యిచ్చాను. వెళ్ళిపోయాడు.

రెండోసారి: మొదటి ఆట సినీమా చూసి యింటికి పోతున్నాను. అంతదూరంనుంచే "బాబూ. బాబూ" అన్న కేకలు వినపడ్డాయి. అందరితోపాటు నేను వెనకకు చూసాను. పరుగెత్తుకొస్తున్నాడు. ఆగాను. డబ్బు అడిగితే యీసారి లేదని చెప్దామని నిర్ధారించుకున్నాను. నాదగ్గరగా వచ్చి సహజ గంభీర స్వరంతో "నీకోసం వారంరోజులై చూస్తున్నాను. వలవేసినా ఎక్కడా దొరకావు కావు. ఇదిగో... యింద—ఆ వేళ రూపాయి బదులిచ్చావు కదా..." అంటూ నా చేతిలో అంతా చిల్లరపడవేసి "నా పెళ్ళాంకి మందుకొన్నాను. అవసరానికి యిచ్చావు. నిన్ను దేముడు బాగా చూస్తాడు!" అంటూ వెళ్ళిపోయాడు.

లెక్క పెట్టకండా నే ఆచిల్లర జేబులో వేసాను. మూడోసారి నాయింటి అరుగుమీద నన్ను చూసి వెళ్ళిపోతున్నవాడు "యిదేనా మీయిల్లు" అంటూ అరుగుమీద కూర్చున్నాడు. సిగరెట్ పెట్టె నా వేపు చూపించాడు.

"నే కాల్చను."

"నువ్వు మంచిపుట్టుక పుట్టావు. అందుకే నీకు చెడ్డ అలవాటేమీ లేవు. నేను చాలా చెడ్డపుట్టుక పుట్టాను..."

"నువ్వూ మంచివాడివే..."

ఫక్కున నవ్వి లేచిపోతూ "నువ్వొక్కడివే అన్నావు నేను మంచాడినని! నా సంగతి నీకు తెలీదు. ఆరు నెలవుమీద మిలిటరీనించి వస్తున్నాను. ఉత్తిమ వాళ్ళీ వెధవ...ఈసారి నాజోలికొస్తే పీక తెగేస్తాను."

"ఆడంటే నీకొడుకా?" అన్నాను.

ఆ మాట అనగానే తలుపాపి అక్కడనుంచి వస్తానని గబగబ వెళ్ళిపోయాడు. నేనింకా వాడి పేరూ, వృత్తీ యింకా యెన్నో విషయాలు కనుక్కుందామనుకున్నాను గానీ మళ్ళీ అగపడలేదు.

ఈ నాల్గోసారి కలయికవరకు వీడు త్రాగుబోతని అనుకోడానికి ఆస్కారం యిచ్చాడు కాదు. నామనసులో రెండోసారి కలయికనించీ యీ వ్యక్తి చాల వున్నతంగా మెసలుతున్నాడు ఈ అభిమానమే కొంతవరకు నన్ను వాడివెంట నడిపించింది.

ప్రక్కవీధి చివరలో చిన్న పెంకుటిల్లు— త్రేతాయుగం నాటిదిలా వుంది. తలుపు దడదడ బాదాడు. లోనుంచి పొమ్మని అరుపు. ఈ త్రాగుబోతూ తలుపు తియ్యమని కొడుకును నానా తిట్లూ తిట్టూ అరిచాడు. తలుపులు తెరువబడ్డాయి. నిప్పుల్లాంటి కళ్ళతో చేతులు పాము నాలుకలా నిముగుతూ చెయ్యెత్తుజవాను యెదురయ్యాడు. తండ్రి అరిచాడు.

"గాడిదకొడకా! పెద్ద మనిషిని తెచ్చాను. మర్యాద యియ్యరా!"

ఆ తీక్షణమైన కళ్ళు తొలిసారి దాగున్నట్టు ఒక మూలనున్న నా వేపు చూడగానే శాంతించినయ్.

"కూర్చోండి" అంటూ రెండు తలుపులు తెరిచి మూలనున్న చొట్టకుర్చీ ముందుకు లాగాడు వెళ్ళి కూర్చున్నాను. తండ్రి గొంతుక ఒక్కసారిగా "నా ముందు పుట్టాడు గాడిద!...ఈ చేతుల్తో చర్మం వూడబీకేవాడినే...ఆ పిల్లి చూపావా ఆకళ్లు పులిలాగ—ఉత్తి రౌడీవెధవై పోయాడు!"

కొడుకు కళ్ళు యీ మాటలతో మరీ యెరుపెక్కుతున్నాయ్. తండ్రిని ఆగమని సైగచేస్తూ నే వున్నాను. అంతలో కొడుకన్నాడు. "త్రాగున్నాడు. మరేం చెప్పినా వాడికి యెక్కదు!"

తండ్రి నా నోటిలో నోరు 'హా' అంటూ వూది. "తాగాను. పొరపాటుమాట ఒక్కటంటే నీ చెప్పు తీసి నన్ను కొట్టు...ఈ వెధవ నామీదా కళ్ళెర్రజేస్తాడు? ఎన్ని గుండెలుండాలి?"

కొడుకు ముందుకొస్తూ "నీ బతుకంతో నీమాటా అంతేలే... నేను కాబట్టి యివన్నీ సహించుకొస్తున్నాను."

"పెద్ద పెద్దోలూ తాగుతున్నారు— నేను తాగుతున్నాను. నివ్వు కొత్తగా తాగిన వెధవలా మాటాడకురా..."

"నివ్వా...సున్నపోతురి...నీతో నాకేం పని?" అంటూ కొడుకు వెనక్కు తిరిగాడు.

ఈమాట నాకు పిచ్చి అనిపించి "మీరుకూడా మీ తండ్రిపరిస్థితికివస్తున్నారా?" అన్నాను. కొడుకు ఆమాట వినగానే నావేపు తిరిగాడు. ఆ యెర్రటి కళ్ళలో నీరు గిర్రున తిరిగిపోయాయి నా దగ్గరగా వస్తూ "మీకు తెలీదండీ ... నాకు జ్ఞానం వచ్చినదగ్గరనించీ చూస్తున్నాను. ఒక వ్యసనం కాదు. బజారునిండా ముండలే. నన్ను చంపినన్నాళ్ళూ పడ్డాను. నా కళ్ళతో మా అమ్మ ఒళ్ళంతా పుండు చేసిన్నాడు చేసిందిలేక సహించాను" ఇంతలో తండ్రి యేదో అడ్డువస్తున్నా వినిపించుకోక "ఇంతవాణ్ణయ్యానా? ఇప్పుడూ నా యెదరగా మా అమ్మ యెముకలు విరగొట్టంటే చూస్తూ యెలా వూరుకోమంటారు?" అంటూనే బొలాబోలా కన్నీరు కారుస్తూ గబగబ పెరటికివెళ్ళి తల్లి చెయ్యిపట్టుకొని లాక్కొనివచ్చాడు.

కొద్దిగా చాటుగా నిల్చున్నా నా కంటికామె కనిపించింది. గాలేస్తే పడిపోయేటట్లుంది. ఆ కంచిన దుఃఖాన్వితమైన ముఖం చూడగానే నాకళ్ళల్లో నీరు చిమ్మింది. మాసిన బట్టలతో ఒక బిచ్చకత్తెలా వున్న ఆమెను, ఆ నమ్రతను, ఓర్పును చూసి నా శరీరమంతా ఒక్కసారి ఆవేశంతో పెళ్ళుబికి ఆమెను ఓదార్చినా మన్నంత కోరిక కలిగింది.

కొడుకు కళ్ళు తుడుచుకుంటూ "యింత చంపుతున్నా ఒక మాట యెదురాడదు...గొడ్డును బాదినట్లు బాదితే మా అమ్మ మా కంటికి యింకెంత కాలం కనిపిస్తుందండీ? ఈ ప్రేమకైనా నేను నోచుకోవద్దా?"

ఆమె అక్కడనించి వెళ్ళిపోయింది. వెళ్ళిపోతూ ఆమె కళ్ళల్లో నీరు జారటం చూశాను. నా కథలో త్రాగుబోతు భార్యరూపు నా కంటికిప్పుడు అగపడింది. ఈలోగా తండ్రి యేదో పెద్ద గొంతుకతో అంటున్నాడుకానీ వినిపించుకోలేదు. తండ్రే నా వీపుమీద గట్టిగా తట్టూ "చెప్పు తప్పెవరిది?"

నా నోటి వెంబడి మాట రాలేదు. నన్ను కదుపుతూ "నేను తగిన మాటలు అనలేదు. తప్పెవరిది?" అన్నాడు.

"అసలు యీ దెబ్బలాట యెలా వచ్చిందన్నాను. ఈ ప్రశ్న నేను యెలా వేశానో యెందుకు వేశానో నాకే తెలీదు.

"ఇంతసేపు చెప్పాను. చెముడుగాని వుందా? నా పెళ్ళాన్ని నేనేం చేసుకుంటే వాడికేం హక్కు వుందని?"

"నీ పెళ్ళాం వాడితల్లి కదా." అన్నాను.

"బలే న్యాయం చెప్పావులే. నా తరవాత వాడా వాడి తరవాత నేనా దానికి?"

నే నేం సమాధానం చెప్పలేదు. మాటాడవేం అని రెట్టించాడు. నేను లేచిపోతూ,

"ఇంత వయసువచ్చింది. కొంచం కోపం తగ్గించుకో. నిష్కారణంగా అలాంటి మంచి మనిషిని హింసిస్తే నీకేం జయం కా"దంటూ లేచాను. నా చెయ్యిపట్టుకొని 'బాగా విను" అంటూ నన్ను మళ్ళీ కుర్చీమీద కూలదోసాడు. దుఃఖం ఉద్రేకంతో సతమతపడుతూ యిటూ అటూ నడుస్తున్న కొడుకు వేపు తిరిగాను. "ఉద్రేకంతో యే పనీ చెయ్యకండి తరవాత విచారిస్తారు. మీరు కూడా మీ తండ్రిలా కాలేరు గా!"

నేను, తండ్రి కాదన్నా విడిపించుకొని బయలుదేరాను. కొడుకు నా వెనక గుమ్మందాకవచ్చి "మీ సలహాకు కృతజ్ఞుడ్ని" అంటూ తలుపు గడియవేసుకుంటుంటే వెనుతిరిగి చూసాను. ఆ కళ్ళల్లో యింకా తడివుంది. ఆ ముఖంలో నిజంగా నాకేదో సంస్కారం అగపడింది. నేను కదులుతుంటుంటే తండ్రి గొంతుక వినిపిస్తోంది. నేను తిరిగివచ్చి ఆ ఆవేశంలోనే నా కథను పూర్తిచేసాను కథలో త్రాగుబోతు చాల హీనమైనచావు చచ్చిపోతాడు. అతని భార్యకు పట్టిన పీడ వదలిందని యిక సుఖపడుతుందని యిరుగూ పొరుగూ అనుకుంటారు.

కథ వ్రాసానే గానీ నాకెందుకో అది యే సంచికకీ పంపడానికి మనస్కరించలేదు. కథ వ్రాసినంత సేపు నేను విమర్శకుడిని కాలేను. వ్రాసాకే నేను విమర్శకుడను. యెవరూ కోరి చెడ్డవారవటం హాస్యా

ప్రమాద రక్షణకు ప్రశస్తమైనది భీమా
ఎప్పుడు ఏ ప్రమాదం వచ్చేదీ, ఏ క్షణం ఎలా ఉండేదీ తెలియని ఈ దినాలలో
* అగ్ని * మోటార్‌కారు * కార్మిక నష్టపరిహారం * నౌక
* ఫయడిలిటి గ్యారంటీ మొదలైన భీమాలకు
మాతో సంప్రతించండి.
యునైటెడ్ ఇండియా ఫైర్ అండ్ జనరల్
ఇన్సూరెన్సు కంపెనీ,
"బాంబే లైఫ్ బిల్డింగ్స్"
9, బ్రాడ్వే, మద్రాసు. 1.
Telephone: 4241, Telegrams: "UNIGEN"
బ్రాంచీలు:
విజయవాడ - బెంగుళూరు - బొంబాయి - కలకత్తా - న్యూఢిల్లీ - పాట్నా
కొలంబో - సింగపూరు - కోయంబత్తూరు - జాకార్తా.

స్పవంగా వుంటుంది. అగ్నిగుండమని తెలిసి యెవరూ అందులో దూకరు. ఏ పిసుగాలో అందులోనికి త్రోసివెయ్యాలి. ఎన్నో విధాల ఆలోచించాను. ఇలా రోజులు గడచిపోతున్నా నాలో ఆరాటమే గానీ నాకు నచ్చిన ముగింపు తట్టలేదు.

ఒకరోజున పనిమీద ఆ వీధివెంబడి వెళిపోతుంటె "యేం బాబూ" అన్న పిలుపు వినపడింది. ఆ గొంతుక త్రాగుబోతుదె. ముందూవెనకా చూసాను. ఎక్కడా కనపడలేదు. నా కుడివేపు త్రాగుబోతు యిలు వుంది. తెరచిన యింటితలుపులు ద్వారా త్రాగుబోతు మంచంమీద కూర్చొని నన్ను పిలవటం గమనించాను. చిరునవ్వుతో ఆహ్వానిస్తూ కుర్చీ చూపించాడు. నేను కూర్చోకుండానే కదలలేని ఆ మనిషి పరిస్థితిని చూస్తూ ఏమైందన్నాను?..."నీ కొడుకున్నాడా?" అన్నాను.

"శిలవై పోయింది. పోయాడు" అన్నాడు. మొదటిప్రశ్నకు సమాధానం యివ్వలేదు.

పాసర్ ఆఫ్ పారిస్ వేసిన ఆ యెడమకాలు వేపు చూస్తూ మళ్లీ నా మొదటిప్రశ్న వేశాను.

"ఇదా? కాలు విరిగిపోయింది...అంతే!"

"బాగా త్రాగి యిల్లెక్కి గెంతావా! కాలవలోకి వురికావా?"

"ఆసుపత్రిలో కాలవలో పడ్డానని చెప్పానులే" తల ప్రక్కకు తిప్పిన తనను చూసి "అయితే నిజంగా పడలేదా?" అన్నాను.

నాముఖంలోనికి ఒకసారి చూసాడు. "నివ్వు చాలా మంచివాడివి" అంటూ అక్కడనించె "హా" అంటూ నోరు ఆవలించి "నేను త్రాగలే దిప్పుడు" అన్నాడు.

"నీ కాలెలా విరిగిం"దన్నాను. మళ్ళీ వాడి గొంతుక గంభీరమైంది. "నేను బ్రతికుండగా నా కొడుకు నన్ను కాదంటాడా? నన్నేం పోషిస్తున్నాడా నామీద చెలాయించడానికి? ఉత్తి చేతకానివెధవ! కళ్ళెర్ర చెయ్యటం తప్పించి యింకేమీ తెలీదు—చూడు వాడు చీమలాగుండేవాడు. చీమ కుట్టేనే చచ్చిపోతావా?"

"ఇంతకీ నీ కాలెలా విరిగింది?"

"వాడే విరగ్గొట్టి యిలు వదిలిపోయాడు!"

ఈ విషయం నేను నమ్మలేను. "నివ్వు యింత మంచివాడివికదా తాగటం మానేయకూడదూ!" ఈ త్రాగుడే యీచిక్కులు అంతటికీ కారణమని యీ సలహా యిచ్చాను.

"అదా మానేయమంటున్నావ్" అన్నాడు ఆశ్చర్యంగా.

"మానలేవా?"

"అదే నాకు కష్టాల్లో రక్షించింది. ఏడుపులో నవ్వించింది—దానికీ నాకూ యేనాడో ముడిపడిపోయింది. పొత్తు కలిసిపోయింది. అదే నాకు సుఖం యిస్తాది!"

"నీకూ విచారం వుందా?"

నా వేపు ఒకసారి నిదానించి చూచి తల దించాడు. "ఉంది" మళ్ళీ తలొకసారి ఆడించి "అవును—అందరికంటే వాడి హెచ్చే!"

"నీ కెందుకు విచారం? ఎవరు పోయారని!"

వాడు తలెత్తాడు. ఆ కళ్ళల్లో నీరు పేరుకోవటం చూశాను. "నేను ఒకప్పుడు నీలాగే చాలా మంచివాణ్ణి. అందుకే నిన్ను చూస్తే నాకెంతో అభిమానం! నీలో చచ్చిపోయిన నేనును చూస్తుంటాను."

"అయితే నివ్వెందుకిలా అయిపోయావ్ ?

"అంతా వాడే అనుకున్నాను. అంతా అదే అనుకున్నాను. అదే దేవతనుకున్నాను. దానినే నా పెళ్లామని పిలిచాను."

త్రాగుబోతు ఆవేశం అంతా కళ్లల్లో నీరై కారుతోంది. మాటలు తడబడసాగాయి. గొంతుపట్టుకపోతోంది. భిన్నవదనంతో శోకస్వరంతో

"అనుకోకుండానే ఆరోజునుంచీ దానిని రోజూ చంపుతున్నాను. నేనిలా చంపుతున్నా మళ్లీ ఆ దేవతను తేగలనా? అది యెందుకు అనుభవిస్తూ బలవంతంగా చావకుండా వుందో దానికే తెలియాలి!"

ఇప్పుడు నాకథకు ముగింపు తెలిసింది. నా కథలో అసలు సాంబయ్య చావలేదు.

# వసుచరిత్ర - ప్రకృతిదర్శనము

శ్రీ బొడ్డపాటి కుటుంబరాయశర్మ

కేవల కల్పనాకథలు కృత్రిమరత్నము లాద్యసత్కథల్
వావిరిఁ బుట్టురత్నము, లవారిత
సత్కవి కల్పనా విభూ
షావహ పూర్వ వృత్తములు సానలు
దీరిన జాతిరత్నముల్
గావున నిట్టి మిశ్రకథగా నొనరింపుము నేర్పు
పెంపునన్—'
వసు-ఆ 1-ప 19)

అని సాహిత్యరసపోషణుడైన రామరాజభూషణుని వసుచరిత్ర కృతిపతి సబహుమానముగా నాదరించెను. అప్పుడు 'రసోదంచిత చమత్క్రియా కల్పనాకల్పభవ్యంబుగా' మహాకావ్య నిర్మాణమునకు కృతికర్త పూనుకొనెను. ఇంతకు, భట్టుమూర్తి తన కల్పనాచమత్కృతితో పూర్వరాజవృత్తాంతమును గూర్చి వసుచరిత్ర కృతి నిర్మించెను. దీనికి శ్లేషయు, గుణీభూతవ్యంగ్యమును, ధ్వనియు సహజసిద్ధములై తోడ్పడినవి. మూర్తి కవిది హరిశ్చంద్రనలోపాఖ్యానము ద్వ్యర్థి, రెండర్థములుగల కావ్యము. రెండు కథలను వేర్వేరుగా చెప్పినచో "జపార్పణాసమయ సంగతి" తప్పిపోవును గాన, పదశక్తిచే నా రెండు కథల నొకటిగా గూర్చి చెప్పుదునని, మునిరాజు ధర్మరాజుతో పలికినట్లు ద్వ్యర్థికి హేతువు కల్పింపఁబడినది.

శ్లేష వేరు; ద్వ్యర్థి వేరు. ఒక్కచో బహు భావముల కూడిక శ్లేష. ఒక్క చక్కని భావమే ఆనంద మిచ్చుచుండ ననేక భావము లొక్కే పదమున నుప్పతిల్లి యానందమును గూర్పవా? అందుచేతనే ద్వ్యర్థికి పాండిత్యము ప్రధానమై యద్భుతమును గొల్పుచు 'సాహో!' యనిపించుచుండగా, శ్లేషకు ప్రతిభయు గూడ నావశ్యకమై యద్భుతానందముల రెంటిని గూర్చుచు, 'ఓహో' యనిపించుచుండును.

ఇట్టి శ్లేషాదిరచనలు బహుళప్రయోజనసాధకములు చమత్కారముఁ గలవి. చమత్కారము కల్పనకు ప్రాణభూతముగదా! అందుచేతనే పూర్వము విద్వల్లోకమున, ప్రపంచవాఙ్మయములం దెలెడనుగూడ, శ్లేషకు మన్నన. ఆంగ్లేయులను గుడ్డిగా ననుకరించు మన నేఁటి యల్పాభిరుచులమాట యటుంతము. లోకమున ననేక కారణములచే నేఁడు శ్లేషకు చెల్లుబడి లేకపోయినను నది ఘనమైనదియు నుదాత్తభావ ప్రకటనమున కనువైనదియు ననక తీరదు. ప్రాచ్యలోకములో కావ్య శాస్త్ర యుగములయందే గాక, పురాణ స్మృతి వేదయుగములయందు నెంతయో శ్లేషకు కీర్తియుండుటయు, పాశ్చాత్యులలో నుదాత్తముగు శ్లేష గాకున్నను, శ్లేషాభాసము 'అరిష్టాటిలు' నకు పూర్వమునుండి 'ఎడిసను' పిమ్మటివఱకు ప్రసిద్ధికెక్కి క్రమక్రమాభివృద్ధి నొందుటయుఁ, బరిశీలింపఁగా భావగంభీరతకు అలంకారము శ్లేష యనక చెల్లదు. పరిమితపదములతో నపరిమిత భావమును చెప్పుటకే కాక కవికల్పనలను స్వభావసిద్ధములుగా నొనర్చి అద్భుతానందముల సంధానించుటకును శ్లేషాద్యలంకారములు సాధనములు.

అసలు సర్వజ్ఞుని జ్ఞానమునుగూడ మించునది కవిజ్ఞానము. అందును కవికల్పన బహు విచిత్రమైనది. వీనికిఁదోడు శారదామూర్తి చమత్క్రియాకల్పనకు శ్లేషయు, శ్లేష చమత్కృతికి కల్పనయు పరస్పరాధారధేయములైనవి. కాఁగా, భట్టుమూర్తి చమత్క్రియాకల్పన మెందున్నది? అతని విలక్షణమైన యితివృత్తములో నున్నది. అగుచో, నేకథలోగాని వైలక్షణ్యమేల? యనిన, దానిని ప్రౌఢులహృదయము వాంఛించును గనుక, అని సమాధానము. ఆ ప్రౌఢిమకు లక్ష్యముగా ప్రకృతియందుగల యొక వైచిత్రిని వర్ణింపఁబూని, దానిని సహజసుందరముగ చికిలియొనర్చినవాఁడు రామరాజభూషణకవి.

ఆ వైచిత్రి యేదియనఁగా:-కోలాహల పర్వతము నొఱసి శుక్తిమతీనది ప్రవహించుచున్నది. ఆ ప్రవాహవేగముచే కొన్నాళ్ళలో కోలాహలగిరి కొంత యొఱఁగి శుక్తిమతిపై పడినట్లయ్యెనన్నమాట. అది సహజసుందర

మైన దృశ్యము. ఆ యొఱఁగుటను, శుక్తిమతిని మోహించి పర్వతము దానివైపు మొగ్గుటగా భావించి నాఁడు కవి. ఇట్లు పరిశీలనాభావిత మగుటచే నా దృశ్యము సహజ మధురమైనది. ఇది బహు మనోజ్ఞమైన కల్పనా వైచిత్రియు, నద్భుత భావనాసంపత్తియును. తద్దృశ్యమును కవి తన యప్రయత్నలబ్ధ శ్లేషార్థబద్ధవర్ణఘటనాచాతురముచే చిత్రించుటతో మన భావాంబరవిధియందు శుక్తిమతి స్త్రీయు, నా కోలాహలపర్వతము పురుషుఁడునై భాసించుచున్నవి.

ముందీవిధమగు కల్పనలకును, భావనలకును మూలము, ప్రకృతి పరిశీలనాసామర్థ్యము. ఇట్టి తన యనుశీలనమువలన గలుగు విశ్వోపాస్యభావభంగిమలను చదువరులకుఁ గూడ కన్నులకు గట్టునట్లు వర్ణించి, వారి మనస్సును గౌరీశంకరశృంగతుంగముగ నుప్పొంగునట్లు చేయఁగలిన అక్షయానందోపాసకుని, రసతపస్సంతప్త హృదయుని, యథార్థభావ ప్రణయిని, ప్రకృతిదర్శనముగల ప్రతిభాశాలి యందుము. ఈ దర్శనము నధికముగ వసుచరిత్రలోను కొంచితక్కువుగ హరిశ్చంద్ర నలోపాఖ్యానములోనుగూడ జడ మానవదైవి ప్రకృతులను మూఁడు ప్రకృతుల రూపములతో భట్టుమూర్తి కలిగించినాడు. హరిశ్చంద్రనలోపాఖ్యాన ద్వ్యర్థిలో వ్యాశ్రిత ద్వయమున సారూప్యమే లేని శ్వ్రైశానాదిఘట్ట చిత్రణములయందు ప్రకృతిదర్శన మిప్పించుటవలనను; వసుచరిత్రలో నదిపర్వతోద్యానాది వర్ణనఘట చిత్రణములయందు ప్రకృతిదర్శన మిప్పించుట వలనను; మనలను మనోజ్ఞ భౌతిక ప్రకృతి వికాస శోభావలీవచేతస్కుల మగునట్లుగను, రసభావ ప్రదీప్త ప్రఫుల్లహృదయులమగునట్లుగను, సారసాహితీ రస పోషణముఁ జేసి వేయఁగల్గుచున్నాఁడు. వసుచరిత్రలోని యీ వసంతర్తు వర్ణనము విని చూడుఁడు:—

సీ॥ లలనాజనాపాంగ వలనావసదనంగ
  తులనాభికాభంగ దోః ప్రసంగ
మలసానిల విలోల దళసాల నవరసాల
  ఫలసాదర శుకాలపన విశాల
మలినీ గరుదనీక మలినీకృత ధునీక
  మలినీ సుఖిత కోక కులవధూక
మతికాంత సలతాంత లతికాంతరనితాంత
  రతికాంత రణతాంత సుతనుకాంత

గీ॥ మకృత కామోద కురవకా వికలవకుల
  ముకుల సకల వనాంత ప్రమోద చలిత
  కలిత కలకంఠకుల కంఠ కాకలీ వి
  భాసురము పొల్చు మధుమాస వాసరంబు.'
(ఆ 1.ప. 125)

సీ. ఒకచాయ నవపాయ పికగేయ సముదాయ
  మొకసీమ నానామయూర నినద
మొకవంకనకలంక మకరాంకహాయ హేష
  లొకక్రేవ వనదేవయువతి గీత
మొకచెంత సురకాంతలకరాంత తతనాద
  మొకదారి వనశారికోదితంబు
లొకయోర పటుచారణకుమార ఘటితంబు
  లొకదండ నలిమండలికల గాన

గీ. మొక్క మొగి మ్రోయఁ గదళీగృహోపపన్న
  కిన్నరీబృంద బృంద సంగీతరీతి
  నమరు నతివేల కోలాహలముల కలిమి
  నధిప! యీయద్రి కోలాహలాఖ్య మొప్పు!

ఇంకొక దృశ్యమును బరిశీలింపుము. వసంతము రాగానే దక్షిణ వాయువు ప్రసరించి క్రొత్తతీఁగల యందు చివుళ్ళు పొటమరింపఁజేసి యాతీఁగల నెల్లెడ నల్లుకొనునట్లుగా నొనర్చును.

దక్షిణ నాయకుఁడు నవోఢకు కళాస్థానము లంటుచు పెనకువలు నేర్పుటగా, దానిని కవి చూపుట చూడుము:—

'ఒనర, హిమావసంతములోడ్పి తెమల్చిన పత్త్రిభంగముల్
సన, నసియాడుచున్ మొగడ చన్నులు పలవపాణిఁ గప్పు నా
తన లతికాలతాంగుల, నుదారగతిం జలి వాపి, నెయ్యపుం
బెనకువ నేర్చె దక్షిణసమీరణుఁ, డొయ్యనఁ దావు లంటుచున్.
(ఆ 1—ప. 126.)

పిదప వసురాజు వనవిహారము చేయునప్పటి దాడిమలతా వర్ణన మొకటి పరీక్షింపుము. ఒక దాడిమీలత, తన యొజ్జని పూలకాంతి యనెడి పైట నతిక్రమించిన చిలుకలచే నంటబడిన పరిపక్వ ఫలములను, దోహద ధూమమువలన కప్పుకొన్నది. ఒక సుందరుని సందర్శనమున తన కావిపైఁట జారఁగా నొకరాగిణి తన

కుంతలములతో వక్షమును గప్పుకొన్నట్లున్న దది యని కవి నిరూపించుచున్నాడు:—

'చలితలతాంతకాంతియను చందురకావి చెఱంగు దాఁటి, స
మ్మిళిత వయోవిలాసముల మీఁటిన విచ్చు ఫలస్త నాగ్రముల్
వెలువడఁ, గప్పెఁ, దక్షిణము వేల్లిత దోహద ధూప ధూమకుం
తలములు విప్పి, దాడిమలతాలలితాంగి, నృపాలు చెంగటన్.

(ఆ 1—ప. 155.)

ముందు కలుగనున్న గిరికావసురాజుల సమావేశము సూచించుచున్న యీ వర్ణనము, తన్నుపాసించిన రసికులను మఱి ప్రకృతి యెట్లు వంచింపలేదో చెప్పక చెప్పుచున్నది. నానావిధ సన్నివేశ ప్రేరణలచే నాంతరంగిక ప్రబోధ మేర్పడి యపూర్వభావ పరిప్లుతి కలుగుచున్నది. అపుడు భౌతిక మానవ ప్రకృతుల యభేదము ఘటిల్లి యదియే, దైవీప్రకృతియగును. లేదా యీ రసోపాసనియందలి సహజ దైవీప్రకృతియే భౌతిక మానవప్రకృతులతో సమ్మిళితమై, సమైక్య సమన్వయమై; సుషమా సమగ్రమై; శ్లేషార్థమునందువలె సుసంఘటితమగును. దేహప్రాణమనోధాతువుల నతిక్రమించి యాత్మఁడు విశుద్ధజ్ఞానభూమికలో నడుగిడుటతో భిన్నభిన్న ప్రకృతుల మూలకారణ సాక్షాత్కృతి యగు ననుటయే యిది. ఇట్టి సమ్యక్ ప్రకృతిదర్శనము నించుకగా నుదాహరింతును.

వేణిచలింపఁ, గంపిత నవీనమృణాళభుజాగ్రకంకణ
శ్రేణి నటింప, లోలశఫరీనిబిరీసకటాక్షకాంతి వి
న్నాణము చూప హంసకగణక్వణనంబును మీఱ సైకత
శ్రోణి వివర్జితాబ్జముఖశోభితయై కడు సంభ్రమించినన్.

(ఆ 2.ప. 137.)

ఇందలి సులభ సుందర శ్లేషచే నదియందు స్త్రీత్వ మర్ధనారీశ్వర తాండవముగ తొలుదొల్త ద్యోతకమగును. పిదప నాయాభూతముల పృథగ్భావ మేకసముగా నెపుడు సుబోధక మగుచున్నదో, యపుడే ప్రకృతి తత్త్వము గూడ సుజ్ఞేయ మగుటచే మన కానందోపలబ్ధి.

చెలుల జలక్రీడల సందర్భములో రామరాజభూషణు డొక ప్రౌఢదర్శన మిప్పించుచున్నాడు; ఆ పద్యభావ మిది ఒండొరుల భుజములపై చేతులుమోపి కుచపర్యంతమైన నీటిలో చెలులు నిల్చియున్నారు. తమ భుజావలయముచే నేర్పడిన మండలమధ్యమున వారి కన్నుఁదామరల కాంతి ప్రసరించుచున్నది. అపుడా కాంతిస్తోమము మన్మథదేవునకు తెప్పతిరునాళ్ళలో గట్టిన హేమకుంభములుగల, తమ్మితూండ్ల వలయములతో గూడిన పూలతెప్పయో యన్నట్లున్నది. పరికించునది:

'కరములమూఁపులూదుకొని కన్నెలు, చన్నులబంటి నొంటుఱుల్
బరిగొని నిల్వ, తత్పరధి ప్రాంశుమృగాంకకలాప పూరితాం
తరమయి పోల్చె, భావభవదైవత భావిత హేమ కుంభసం
భరిత మృణాళమండలితపద్మమయప్లవమండ లంబనన్'—(ఆ 3. ప. 156.)

భౌతిక, మానవ, మానవాతీత ప్రకృతిత్రయ పరస్పర సంబంధమును గుర్తించిన మహాకవి, ప్రత్యణు స్థిరరసమూర్తి యనుకొనుడు! అతఁ డట్లగుటకు హేతువైనది, మహోదారమైన యాతని ప్రకృత్యారాధనావధానము. కాఁగా, జడమునుండి మానవప్రకృతి ప్రస్ఫుటించి దైవీప్రకృతిగా పరిణమించుటయనుఁడు; లేదా- మూలాధార దైవీ ప్రకృతినుండి ప్రోద్భూతమైన విశిష్టమానవప్రకృతి, బాహిరజడప్రకృతిలో విలీనమై, స్వస్థితినుండి విరమించి పునర్దైవీప్రకృతిగా రూపొంది, రమించి మించుట యనుఁడు; ఈ విలోమానులోమ రమణవిరమణ లీలలకు విరాడ్రూపము మాత్రము కవిరసికుని మనోగతమై భావస్థితరూపమున ప్రకాశించు జన్మజన్మాంతర వాసనావిలసితమగు ప్రకృతిబద్ధ భక్తిభావమును, ఆరాధనాశీలమును గాదనగలమా?

అచేతనములగు శుక్తిమతీకోలాహలములయందు రూపకోపమాదులచేత, చేతనత్వము గలిగించి, తత్పరిణయఫలమైన గిరికాదేవికి దేవాంశగల యుపరిచరవసుసంతతియగు వసురాజును భర్తగాఁగూర్చి, రసధుని యనదగు కావ్యమును నిర్మించిన కవీంద్రుని యంతస్సారము, ప్రకృతి పరిశీలనాబద్ధభక్తిభావమును తద్రూపవిశేషసంపుటీకరణసామర్థ్యమును గలదికదా?

# వసుచరిత్ర : ప్రకృతిదర్శనము

పోనుపోను వసుచరిత్రలో నీ దైవీప్రకృతిదర్శన మధికముగ లభించుననుటకీ క్రింది సాయంసంధ్యాకాల సూర్య చంద్రాస్తమయ వర్ణనల సమీక్షింపుడు :—

'నలినీశాన శిరస్తట త్రుటిత రత్నచ్ఛాయఁ గల్లోలినీ
విటమధ్యంబున వ్రాలె నభ్రమణి తద్వేగాభిపాతోన్నమ
త్పటుపాథోలవధారఁ దారలెగసెం, దగ్ధేందుసందానితో
త్కటసంధ్యానల ధూమకందళములై కప్పెం గ్రొం
జీకటుల్. (ఆ 4—ప. 10.)

'అరవిందోదరమూర్తి భానుఁ డపు డూష్మాంతం
బునన్ సంకుచ
త్సరసీజేక్షణుఁడై పయోనిధిఁ జొరన్, సంధ్యాతటి
త్పూర్వమై
నెరసెం జీకటి కార్మొగుల్, జగతిపై నిమ్నోన్న
తాభోగముల్
సరిగావించుచు, సర్వతోముఖ మహాపార ప్రసా
రంబులన్'—
(ఆ 4—ప. 11.)

'తారాసస్యము పండినన్, గగనకేదారంబునం
జంద్రికా
నీరం బాఱఁగఁ గోసి, తద్గుచ్ఛఫలానీకంబు ప్రాతర్మహా
సేరిగ్రామణి తూరుపెత్తె ననఁ దోఁచెం దూర్పునం
దెల్పు; త
ద్దూరవ్యస్తపలాలరాశిక్రియ నిందుం జేగ నిస్సారుఁడై.
(ఆ 4 ప. 130 )

పింగళి సూరనార్యుని యభంగశ్లేషల యందును, కృష్ణరాయప్రభుని ప్రకృతివర్ణనముందును మన కమేయమైన గౌరవమున్నది. ఆయా శక్తులకు నిజముగా నమస్కారము. కాని రామరాజభూషణుని యాంతర ప్రకృతిదర్శనములో సూరనార్యుని శ్లేషవిశేష సామర్థ్యమును, కృష్ణరాయల బాహిరప్రకృతివర్ణనా వైశద్యమును గూడ సార్థకముగను చమత్కారముగను సంగమించినవి. ఆముక్తమాల్యదలోని ప్రకృతివర్ణన మున్నదున్నట్లు కన్నులకుగట్టు ప్రతిబింబముకాగా, వసుచరిత్రలోనిది కవి మనఃపరికల్పిత దివ్యచిత్రము. ఈ శక్తి శ్లేష సామర్థ్యమున సమకూరినది కావున శ్లేషనుగూర్చి ముందుగా నంత చెప్పవలసి వచ్చినది. ఆ శ్లేషను కారణము, 'రసోదంచిత చమత్కృతియా కల్పనాకల్పభవ్యమ్ము'గా ప్రకృతి ననన్యరీతినిఁ జిత్రింపగలిగినది శారదామూర్తి యాశయము. ఈ శ్లేషయు, నా ప్రకృత్యారాధనాతత్పరతయు వలననే ప్రత్యక్ష జడ ప్రకృతీ పరోక్షమానవప్రకృతుల ద్వంద్వచిత్రణ మేర్పడి, ప్రత్యేకముగా వసుచరిత్ర కవిత్వము నాకు శిష్ట చిత్రణచిత్రితమైన యర్ధనారీశ్వర కవితామూర్తియా యనిపించుచుండును.

ఎల్ల సత్కవుల ప్రకృతి దర్శనముకంటె నతిశయ దర్శనోపలబ్ధిగల్గిన యో రామభూషణకవి!

'నిను', శ్రీరామపదారవిందభజనా'విష్ణున్;' జగ
త్ప్రాణనం
దన కారుణ్యకటాక్షలబ్ధకవితా ధారాసుధారాశి సం
జనితైకైకదిన ప్రబంధ ఘటనా సద్యశ్శ్రిత గ్రంథక
ల్పను; సంగీతకళారహస్యనిధిఁ; 'దల్పన్ ధన్యు
లాంధ్రప్రజల్'

# ఇల్లు కూలింది

## శ్రీ అంగర సూర్యారావు

**పాత్రలు:** రామ్మూర్తి, నారాయణ, శేఖరం, రమణయ్య, నరసయ్య, ప్రకాశం, కుచేలరావు, బిల్లుకలెక్టరు నీలవేణి.

** ఒక ఆఫీసులోని పెద్ద హాలు. హాలు మధ్య రికార్డు రూంలోకి వెళ్లేద్వారం కనిపిస్తోంది. ద్వారానికి యిరువైపులా హాలులో రెండు బల్లలూ రెండు కుర్చీలు ఒకదానికి ఒకటి యెదురుగా వున్నాయి. ద్వారానికి ఎడమవైపు వున్న సీటులో శేఖరం కూర్చుని వున్నాడు. వయస్సు 25 సంవత్సరాలు. రాస్తూ మధ్యమధ్య కుడివైపుచూస్తూ వున్నాడు. హాలుకు ఎడమవైపున ఒక ద్వారం కనిపిస్తూవుంది. పైవాళ్ళు వస్తే కూర్చునేటందుకు హాలులో మరో రెండు ఖాళీ కుర్చీలుమాత్రం వున్నాయ్. కుడివైపునుంచి రమణయ్య నరసయ్య వస్తారు. ఇద్దరూ నలిగిపోయిన పంచెలు, అతుకుల చొక్కాలు వేసుకొని వున్నారు. తలపాగాలు చుట్టుకున్నారు. వయస్సు రమారమి 40 సంవత్సరాలు. ఇద్దరి ముఖాలలో ఆత్రుత, దైన్యం, తొందరపాటు కనిపిస్తూ వుంటాయి.

రమణయ్య : (వస్తూనే) అయ్యా నమస్కారం.

నరసయ్య : నమస్కారం బాబూ!

శేఖరం : ఎవరు మీరు?

రమ : నా పేరు రమణయ్య అండి

నర : అందరూ రమణయ్య మేష్టారు అంటారులెండి.

రమ : వీరిపేరు నరసయ్యగారు.

నర : మేం యిద్దరం బడిపంతుళ్లమండి.

శేఖ : ఎందుకు వచ్చారు?

రమ : సావధానంగా వినాలి తమరు. అంతా పూస గుచ్చినట్టు మనవిచేస్తాం.

నర : పొన్నాగునుంచి యిక్కడిదాకా ఆలోచించుకుంటూనే వచ్చాం. బోల్డు సంగతులున్నాయి మనవిచేసుకోటానికి.

శేఖ : మీరు కొంతసేపు......

రమ : (అమాంతంగా మధ్యలో అందుకొని) బాబ్బాబు! అభ్యంతరం చెయ్యకండి.

నర : మా మనవి వినండి.

రమ : మాది తప్పయితే దండించండి. ఒప్పుకుంటాం.

[శేఖరాన్ని మాట్లాడనివ్వకుండా యిద్దరూ చకచకా చెప్పేస్తూ వుంటారు.]

రమ : మేం కులానికి గొప్పవాళ్లం.

నర : అయినా కూటికి బీదవాళ్లమండి.

రమ : బడిపంతుళ్లకంటే రోడ్లుతుడుచుకునే కార్మికులకు ఎక్కువ హక్కులున్నాయండి.

నర : ఈ మేష్టరు నిర్భాగ్యుడు నోరెత్తితే చాలు "జాగ్రత్త! యేరి పారేస్తాం." అంటున్నారు.

రమ : మళ్లా మాట్లాడితే మళయాళదేశం పొమ్మంటున్నారు.

శేఖ : ఎవరు...? (యింకా యేదో అనబోతాడు)

నర : (మధ్యలో అందుకొని) యికెవరు బాబయ్యా! మా పైవాళ్ళు.

రమ : అంటే మా నెత్తిమీద వున్నవాళ్ళు.

నర : రాజకీయాలకు దూరంగా వుండా లనుకుంటాం.

రమ : కానీ యేం లాభం? పంచాయతీబోర్డు ఎలక్షన్లనుంచి పార్లమెంటు ఎలక్షన్లదాకా మమ్మల్ని ఉపయోగించుకుంటారు బాబయ్యా!

నర : తరవాత పాచిపోయిన విస్తళ్ళలా తీసిపారేస్తారు లెండి.

రమ : బహిరంగ సభల్లో మాత్రం...

నర : ఉపాధ్యాయుడిమీద యెక్కడలేని ప్రేమా వొలకబోస్తారు.

రమ : దేశనాయకుడి దగ్గరనుంచి గ్రామనాయకుడి వరకూ ఒకటే నినాదం.

నర : ఉపాధ్యాయులమీద యెంతో బాధ్యత వుందటండి.

రమ : అతగాడు పిల్లలను ఉత్తమ భావిపౌరులుగా తీర్చి దిద్దాలట!

నర : రాజకీయాలకు మాత్రం దూరంగా వుండాలట.

రమ : ఆ ఉపన్యాసంయిచ్చిన పెద్దమనిషే ఎలక్షను టైముకు మాదగ్గరికి చేతులు కట్టుకుని వస్తారు.

నర : ఓపెదా చేవరకూ ఓపమల్లయ్య....

రమ : తరవాత జోడిమల్లయ్య.

నర : ఈ గొడవలతో చచ్చిపోతున్నాం అనుకోండి.

రమ : పోయిన యెలక్షన్లలో ... ('అంతేకదూ!' అన్నట్లు నరసయ్యకేసి చూస్తాడు)

నర : అదే! మొన్నటి ఎలక్షన్లలోనే నండి.

రమ : మేం చిన్నబ్బాయిగారి తరఫున ప్రచారంచేశామండి.

నర : చెయ్యకపోతే భస్తామటండి.

రమ : ఆయనవల్ల మాకు చాలా ఉపకారాలు జరుగుతున్నాయండి.

నర : తమరిదగర దాచడం యెందుకుబాబయ్యా! నిజం చెప్పేస్తాం. (రమణయ్యకేసి "యేమంటావ్?" అన్నట్లు చూస్తాడు.)

రమ . తప్పేముంది? చెప్పేద్దాం.

నర : చిన్నబ్బాయిగారు వూళ్ళో మంచి మోతుబరి.

రమ : వారికుటుంబంలోని పిల్లలందర్నీ మాదగ్గిరకే ట్యూషనుకు పంపిస్తారండి.

నర . (నెమ్మదిగా రహస్యం చెబుతున్నట్లు) నెలకు ఒకయాభైరూపాయలవరకూ ముట్ట చెబుతారండి.

రమ : అబద్ధం యెందుకు బాబయ్యా! మేం పూర్తిగా ప్రైవేటు మీదే ఆధారపడుతున్నాం.

నర : తమరిచ్చే గ్రాంట్లమీద ఆధారపడితే...

రమ : యేవాడో మేం అక్షయపాత్ర పుచ్చుకోవలిసిందే బాబయ్యా!

నర : చిన్నబ్బాయిగారు మాకు దేవుళ్ళాగా యున్నారు. ఆయన ఎలక్షనుకు నిలబడగానే మా దగ్గరికి వచ్చారు.

నర : మేం వారికి హామీయిచ్చాం.

రమ : రాత్రనక పగలనక తిరిగాం.

నర : మా సాయశక్తులా పనిచేశాం.

రమ : మా గొప్ప మేం చెప్పుకోకూడదుగాని—మేం పనిచేస్తే యిక తిరుగుండదు బాబయ్యా!

నర : చిన్నబ్బాయిగారు పెద్ద మెజారిటీతో గెలిచేసేరండి.

రమ : ఆయనతో పోటీచేసిన వెంకట్రత్నంగారు ఘోరంగా ఓడిపోయారు.

నర : (విషాదంగా) అక్కడినుంచి మా కష్టాలు ప్రారంభమైనై బాబయ్యా!

రమ : వెంకటరత్నంగారు తాచుపాములాగు బుస కొట్టారండి.

నర : (నాలుక కరిచి) అమ్మో! అతగాడిది పాము పగ!

రమ : మాకు ఉద్యోగాలు తీయించెయ్యడానికి విశ్వ ప్రయత్నాలూ చేశారండి.

నర : పిచ్చుకమీద అతగాడు బ్రహ్మాస్త్రమే వేశాడండి.

రమ : చిన్నబ్బాయిగారు కోర మీసం మెలేశారు.

నర : మీకేం భయంలేదు పూరుకోమన్నారు.

రమ : అధికారులు మా మీద కేసు విచారణకు మా వూరు వచ్చారండి.

నర : మామీద పెట్టించిన అర్జీలు, మహజర్లు రెండు పెట్టెలు నిండిపోయినయ్యండి.

రమ : అవన్నీ మోసుకువచ్చారండి మావూరు.

నర : విచారణ ప్రారంభమయ్యింది.

రమ : మా మీద వచ్చిన మహజర్లు ఒకొకటే పైకి తీశారండి.

వర : నాటి మీద యెప్పుడో చచ్చిపోయినవాళ్లే వంత కాలు కూడా వున్నాయండి.

రమ : చిన్నబ్బాయిగారు గుజాపు చేశారండి.

వర : దాన్తో అధికార్లు కేసు కొటిపారేశారండి.

రమ : వెంకట్రత్నంగారు మరీ రెచ్చిపోయారండి.

వర : ఆయన వేసిన అప్పీల్లన్నిటినీ తుక్కు తుక్కు కింద కొట్టి పారేశామండి.

రమ : మమ్మల్ని ఉద్యోగంలోంచి కదపలేక పోయారండి.

వర : తన తరఫున పనిచేసే పంతుళ్లను వేసుకోవాలని మహా ఉబలాటపడాడు.

రమ : యేంలాభం? మేం సాగనిస్తేనా?

వర : పదరు గ్రామవాయకుడు ఉడుకుమోత్తనం ఆపుకోలేక పోయాడండి.

రమ : పదిమంది రౌడీలను చేరదీశాడండి.

వర : వాళ్లు పట్టపగలే తోడేళ్ళలాగ మాబడిమీద పడుతున్నారు బాబయ్యా!

రమ : మేం ఉభయులం తమకు యెన్నో అర్జీలు పెట్టుకున్నాం.

వర : ఒక్కదానికీ జవాబులేదు బాబయ్యా!

రమ : బాబ్బాబు! మీరా వ్యవహారంలో కలగచేసుకోవాలి.

వర : లేకపోతే మేం చచ్చిపోతాం,

రమ : అసలే మేం కష్టాలలో మునిగి వున్నాం బాబయ్యా.

వర : మేం యిద్దరం పదేళ్ళనుంచి ఒకే కొంపలో వుంటున్నామండి.

రమ : (విషాదంగా) ఆ కొంప కాస్తా మొన్నటి వర్షాలకు కూలిపోయింది బాబయ్యా!

వర : సాయం చెయ్యడానికి చిన్నబ్బాయిగారుకూడా గ్రామంలో లేరండి.

రమ : పట్నంలో మకాం పెట్టేశారండివారు.

వర : ఆ మహానుభావుడు వుంటే మా కిన్నిపాట్లు రావండి.

రమ : బతికిచెడ్డవాళ్లం, మారోజులు యిలా మారిపోయినియ్యి బాబయ్యా.

వర : మీరు మాబడిచుట్టూ పోలీసు కాపలా పెట్టించాలి.

రమ : రౌడీలను పటించాలి.

వర : లేకపోతే మేం ఒకక్షణంకూడా పనిచేయ్యలేం బాబయ్యా!

రమ : బాబ్బాబు! మీరు కనికరించాలి.

వర : పిలలుగలవాళ్ళం.

రమ : మామాట తీసెయ్యకండి.

వర . మా పుసుగు తగలనివ్వకండి.

[యిద్దరూ చేతులుకట్టుకొని మౌనంగా నిలబడతారు]

శేఖ : (లేచి) హమ్మయ్యా, చంపి వొదిలిపెట్టారు, ఇంతకూ నేను అధికారినికాను,

రమ : (ఆశ్చర్యంతో) మరి తమరెవరు బాబయ్యా?

శేఖ : నేకన్నిక్కడ ఒక గుమస్తాను. ఒకగంట పోయాక మేనేజరుగారు వస్తారు. వారితో చెప్పకోండి.

వర : ఆమాట ముందే చెప్పకూడదటండీ!

శేఖ : అసలు నన్ను మాట్లాడనిస్తేనా మీరు?

వర : (నిస్పృహతో రమణయ్యకేసి తిరిగి) మనదంతా అరణ్యరోదన మేనా రమణయ్య మేష్టారూ?

రమ : గొంతు తడి ఆగిపోయింది కొంచెం కాఫీనీళ్లు తాగివద్దాం పదండి.

వర : హరిదేవుడా! ఎన్ని కష్టాలు పెట్టావురా!

రమ : నిన్ను తలుచుకొని రోజులేదురా దీనబంధూ?

(యిద్దరూ కుడివైపు వెళ్లిపోతారు. శేఖరం రెండవ టేబులుమీదవున్న రూళ్ళకర్ర తీసుకువచ్చి రూళ్ళు గీస్తూవుంటాడు. — కుడివైపు నుంచి రామ్మూర్తి వస్తాడు. చొక్కా, పంచె—కొద్దిగా నెరిసినతల — వయస్సు 45, సంవత్సరాలు)

రామ్మూర్తి : (వస్తూనే) యేమయ్యా శేఖరం పని యెంతవరకూ వచ్చింది?

శేఖ : గతసంవత్సరానివి ఎకౌంట్సు కావాలండి. అవి లేనిదే పని జరగదండి.

రామ్మూ : నీసీట్లోంచి కదలకుండా గత సంవత్సరం ఎకౌంట్లు కావాలంటే వచ్చిపడతాయా నీదగరకి?

శేఖ : వెతకాలండీ (కోపంగా చూస్తాడు)

రామ్మూ : (ఆశ్చర్యంతో) యింకా వెతకాలా?— నీధీమా చూస్తూవుంటే నాకు ఆశ్చర్యం వేస్తోంది,

రాత్రి తెల్లవారూ నాకు బడ్జెట్ కలలో కని పిస్తూనే వుంది.

శేఖ : తొందరపడితే అవుతుందటండీ!

రామ్మూ : తొందరపడకుండా ఆ లేడీ టైపిస్టు కేసి ఓర చూపులు చూస్తూ కూర్చో. పని దానంతట అదే అయిపోతుంది. (చిరాగ్గా) అబ్బబ్బ! యీ కాలపు కుర్రాళ్లు ఉద్యోగాలకు యెందుకు వస్తారో తెలియకుండా వుంది.

శేఖ : ఇప్పుడు నన్నేం చెయ్యమంటారు?

రామ్మూ : ఈ సంవత్సరం ఎకౌంట్లన్నీ ముందు టోటల్ చెయ్యి. యే ఐటమ్కు ఆ ఐటం సెప రేట్‌గా చూపించు. ఆ పని అయిన తరవాత రికార్డు రూంలో కూర్చుని వెతుకు. గత సంవ త్సరం ఎకౌంట్లు రికార్డురూంలో పారేశాం. నీకు కనిపించకపోతే నేను కూడా వచ్చి వెతు కుతాను.

రామ్మూర్తి శేఖరానికి యెదురుగా వున్న సీట్లో కూర్చుంటాడు. శేఖరం లెక్కలు వెయ్యడం ముగించి లెక్కల కాగితాలు తిరిగి రామ్మూర్తి టేబులుమీద పెడతాడు. యిద్దరూ మౌనంగా కాగితాలు చూస్తూ వుంటారు.— కుడివైపునుంచి నెమ్మదిగా బెరుకు చూపులు చూస్తూ కుచేలరావు వస్తాడు. పొడుగు చేతుల చొక్కా, పంచె, తలపాగా, చంకనిగొడుగు, అరుజోళ్ళు — మాటలలో అతివినయం కనిపిస్తూ వుంటుంది. రామ్మూర్తికి తిన్నగా నిలబడి నమస్కారం పెడతాడు. రామ్మూర్తి అతనిని చూడనట్లు నటిస్తాడు. కుచేలరావు అలాగే కొన్ని నిముషాలపాటు నిలబడి వుంటాడు.)

కుచేలరావు : (బెదురుతూ) రామ్మూర్తిబాబూ!

రామ్మూ : (తల పైకెత్తకుండా) ఉష్! మాట్లాడకు. ఈ ఎకౌంటు. తప్పు పడిందంటే చావాలి. (అంకెలు కూడుతూ) నాలుగూ నాలుగూ ఎని మిది ఏడూ, పదిహేనూ తొమ్మిదీ యిరవై నాలుగూ (పెన్సిలుతో అంకెలుకూడి తల పైకెత్తి) యేం? యెందుకొచ్చావ్?

కుచే : (ఆశ్చర్యంతో) నేను కుచేలరావును. అప్పుడే మరిచిపోయారా రామ్మూర్తిబాబూ!

రామ్మూ : (హేళనగా) ఓహో! కుచేలరావుగారు కాదూ తమరు! పూర్తిగా దిగజారారా మీరిక్క డికి? మీ మీద వందల కొద్దీ అర్జీలు వచ్చి పడు తున్నాయి. చదవలేక ఛస్తున్నాం మేం.

కుచే : అదంతా అన్యాయం బాబూ!

రామ్మూ : (కోపంతో అమాంతంగా పైకిలేచి) యేది అన్యాయం? ముసుగు వేసుకొని పనిచేయి స్తున్నావ్. అయినకాడికి గంటు కొట్టే స్తున్నావ్. ఇదేగా అన్యాయమంటే!!— యీ డబ్బంతా నీ ఒక్కడికే ఎలా అరుగుతుందయ్యా?

కుచే : బాబూ నా మనవి...

రామ్మూ : (అతనిని మాట్లాడనివ్వకుండా విసురుగా) అసలు నీ స్కూల్లు నడుస్తున్నాదా అంట? ఇన స్పెక్టరు విజిట్‌కు వస్తే స్కూల్లు వుండవు. ఎందుకు లేవయ్యా అంటే 'వేసవి సెలవు తీసి' అంటావు— లేకపోతే 'అనూహ్యంగా ఆ రోజే వూళ్లో ఎవరో ప్రాణం వొదిలేశారంటావ్... మరో స్కూల్లో పిల్లల్ని తీసుకువచ్చి నీ స్కూల్లో యినస్పెక్టరు కైముకు సరిపెడతావ్. ఆ ఒక్క రోజూ ఇనస్పెక్టరును కొంచెం మంచిచేసేసు కుంటావు. సంవత్సరమంతా దిలాసాగా గడిపే స్తావ్. శుద్ధమోసం దగా.

కుచే : రామ్మూర్తి బాబూ! తమరు తొందరపడితే నేను చెప్పలేను— ఒక్కసారి తమరు పైకివస్తే అంతా వివరంగా మనవి చేసుకుంటాను.

రామ్మూ : యిప్పుడు లాభంలేదు. ఊపిరి తిరగకుండా పనివుంది.

కుచే : ఎంతోసేపు మాట్లాడక్కరేదు. ఇప్పుడే రెండు నిముషాలలో తిరిగి వదాం.

రామ్మూ : (మెత్తబడి) ఆలస్యంచేస్తే నాపని చెడిపో తుంది సుమీ పద.

[రామ్మూర్తి కుచేలరావు కుడివైపు వెళ్లి పోతారు. శేఖరం వాళ్లిద్దరి కేసి ఒకసారి చిరు నవ్వుతో చూసి తిరిగి రాస్తూవుంటాడు. కుడివైపు నుంచి నీలవేణి వస్తుంది. లేతరంగు జార్జెట్ చీర ముదురురంగు జాకెట్, పెదాలకు లిప్‌స్టిక్ ఎరుపు, ఎత్తు మడమల జోడు, చేతిలో గొడుగు—రూపి షిలో సహజ సౌందర్యం తక్కువ, అలంకర ణతో అలోటును కప్పుకోడానికి ప్రయత్ని సున్నట్లు కనిపిస్తుంది. వయస్సు 20 సంవత్స రాలు.]

నీలవేణి : (వస్తూనే) ఎక్స్‌క్యూజ్ మి శేఖర్! నిన్ను డిజప్పాయింట్ చేశాను.

శేఖ : నువ్వు చెప్పినట్లు ఉదయమే వచ్చి కూర్చున్నాను. అప్పటినుంచి మెళ్ళునొప్పి పుట్టే వరకూ ఎదురుచూస్తూ వున్నాను.

నీల : మా సిస్టర్ని స్కూల్లో చేర్పడానికి వెళ్ళాను. అక్కడ నాకు చదువుచెప్పిన టీచర్ ఒకావిడ కనిపించారు. నేను ఉద్యోగం చేస్తున్నానని చెప్పగానే ఆవిడకు యెక్కలేని సంతోషం వచ్చింది. చాలాసేపు మాట్లాడుతూ కూర్చోబెట్టింది. ఆవిణ్ణి వదిలించుకొని వచ్చేసరికి యీ టైమయ్యింది.

శేఖ : హాయిగా నీతో కొంతసేపు మాటాడవచ్చు కదా అని ఉదయమే వచ్చాను. నువ్వు రాలేదు సరికదా, మధ్యాహ్నం తినవలిసిన చివాట్లు ఉదయమే తిన్నాను.

నీల : అదేం?

శేఖ : నువ్వు ఎప్పుడువస్తావా అని యెగురు చూస్తూ కూర్చున్నాను. జోడుచప్పుడు వినిపించి ఆత్రుతగా చూశాను. నీ నవ్వుముఖానికి బదులు మా సెక్షన్ హెడ్ తో తేలుముఖం కనిపించింది.

నీల : రమ్మూర్తిగారు అప్పుడే వచ్చారా?

శేఖ : పుటి మునిగినట్లు ఉదయమే వచ్చి తగులడ్డాడు. ఎకౌంట్ పూర్తికాలేదని నానా హంగామా చేశాడు.

నీల : (చుట్టూ చూసి) యేరీ? కనిపించరేం?

శేఖ : రాగానే యెవడో మహానుభావుడు దొరికాడు. అతనితో యిప్పుడే బయటకు దయచేశాడు.

నీల : మేనేజరుగారు వచ్చారా?

శేఖ : లేదు. బ్యాంకుకువెళ్ళి డబ్బు తీసుకువస్తారు. ఆయన వచ్చేసరికి చాలా ఆలస్యం అవుతుంది.

నీల : ఇవేళ ఒకటవ తేదికదూ! మరిచిపోయాను.

శేఖ : ఈమధ్య నీకు మరుపు యెక్కువ అవుతోంది.

నీల : అంటే?

శేఖ : మనసు స్తిమితం లేకపోతే మరుపుఎక్కువవుతుందంటారు.

నీల : నిన్ను చూస్తూవుంటే నా క్లాస్ మేట్ మధు జ్ఞాపకం వస్తూవుంటాడు.

శేఖ : అతనుకూడా నాలాగే వుంటాడా?

నీల : రూపంలో కాదు. గుణాలలో—'మరుపు ఎక్కువ', —'దిక్కులు చూస్తూవుంటావు'— మొదలైన మాటలు ఎక్కువగా ఉపయోగిస్తూ ఉంటాడు.

శేఖ : నువ్వేమీ అనుకోకపోతే ఒకమాట అడుగుతాను.

నీల : ఏమి టది?

శేఖ : ఇంతకాలంవరకూనువ్వెందుకు పెళ్ళిచేసుకోలేదు.

నీల : చిన్నవయస్సులోనే చేతులకు సంకెళ్ళు తగిలించుకోమంటావా?

శేఖ : అంటే స్వేచ్ఛగా తిరగడానికి వీలుండదనా?

నీల : (కోపంతో) యేమి టా మాటలు?

శేఖ : యేమీ అనుకోను నీలవేణీ! నీ పద్ధతులు నాకు వింతగా కనిపిస్తున్నాయ్. అసలు జీవితంగురించి, భవిష్యత్తుగురించి నువ్వు కొంచెమైనా ఆలోచిస్తున్నావా అని నా సందేహం.

నీల : ఇంతవరకూ ఆలోచించలేదు. ఇకముందుకూడా ఆలోచించను.

శేఖ : నీ ఉద్దేశం?

నీల : సంతోషంగా జీవితం గడపడమే నా ఆశయం. జరిగిపోయినవాటిగురించి కాని, జరగబోతున్న వాటిగురించికాని నేను మనసు పాడుచేసుకోను.

శేఖ : నీతో చాలా విషయాలు మాట్లాడాలి నీలవేణీ!

నీల : (మెరిసే కళ్ళతో అతని ముఖంలోకి చూస్తూ) నాతోనా?

శేఖ : అవును. నీతోనే!

నీల : కొంపతీసి నువ్వుకూడా నన్ను ప్రేమించానవు కదా?

శేఖ : ఇదివరకే యెవరైనా అన్నారా?

నీల : అవన్నీ యిప్పుడెందుకు?

శేఖ : సరే, సాయంత్రం యింటికి వెళ్ళిపోయే ముందు నన్ను పిలు. యిద్దరం కలిసి వెడదాం.

నీల : ఎక్కడికి?

శేఖ : సినిమాకు, బీచికి, పార్కుకు—యెక్కడికైనా సరే, యేకాంతంగా మాట్లాడ్డానికి వీలుండే చోటుకు.

నీల : ఇక్కడ ఎవరూ లేరుగా. చెప్పు.

శేఖ : ఈ కాగితాల చిట్టడవిలో—క్రూరమృగాలవంటి సెక్షన్ హెడ్స్ తిరిగే చోటులో......

[మాట మధ్యలో కుడివైపునుంచి రామ్మూర్తి అతని వెనక కుచేలరావు తాంబూలం వేసుకుంటూ వస్తారు.]

రామ్మూ: (వస్తూనే) వచ్చావా తల్లీ! (శేఖరాన్ని చూపిస్తూ) అతగాణ్ణి యిక విడిచిపెట్టు. చచ్చేంత పనివుంది. ఆ రెండు సెటిల్‌మెంట్లూ టైప్ చేసి మా మొహాన్ని పారెయ్.

[నీలవేణి మొహం ముడుచుకొని ఎడమవైపు గదిలోకి వెళ్లిపోతుంది]

రామ్మూ: (శేఖరాన్ని సమీపించి) నీ కిదేం పోయే కాలమోయ్? ఆ పిల్ల వచ్చిన దగ్గర్నుంచీ నీదృష్టి పని మీద లేనేలేదు.

శేఖ: లేదండీ?—యిప్పుడే ఆవిడ వచ్చి...

రామ్మూ: (చిరాగ్గా) లేదూ లేదు. కాదూ లేదు. నేను పెద్దవాణ్ణి చెబుతున్నాను విను. నువ్వు మగాడివి. నీకు ఉద్యోగం లేకపోతే నూగో గతివుండదు. (ఎడమ వైపు గదికేసి చూపిస్తూ) ఆవిడకేం మహాతల్లి! ఆవిడకు ఉద్యోగం వున్నా ఒకటే పోయినా ఒకటే. ఎవడో డబ్బున్న మహారాజును చూసి పెళ్ళాడేసుంది. దాన్తో చచ్చినట్టు వాడే పోషించుకుంటాడు— నాయనా! వెర్రి ఆలోచనలతో బుర్ర పాడు చేసుకోకు. లక్షణంగా పనిచేసుకుని బాగుపడు.

కుచే: (వెంటనే అందుకొని) "ఉద్యోగం పురుష లక్షణం" అన్నారు బాబూ!

రామ్మూ: మీరు నిలబడిపోయారు. కూర్చోండి, (ఖాళీ కుర్చీ తన టేబులు ముందుకు లాగుతాడు. కుచేలరావు కూర్చుంటాడు)

కుచే: ఈ నెల నా కెంత గ్రాంటు వస్తుందో కొంచెం చూస్తారూ?

రామ్మూ: సాక్షాత్తూ మీరు అడగడం నేను కాదనడమూనా? (రిజిస్టరుతీసి) ఐదువందల నలభైయేడు రూపాయల ముప్పై అయిదు నయా పైసలు.

కుచే: తమరు బిలు వేగం అందేటట్లు చూడాలి.

రామ్మూ: ఓ! తప్పకుండా,

కుచే: మా మీద వచ్చే అర్జీలనుకూడా తమరు ఓ కంట కనిపెడుతూ వుండాలి.

రామ్మూ: కనిపెడుతూనే వున్నాం. ఇనస్పెక్టర్లూ, గుమస్తాలూ అందరూ ఒక కంట కనిపెడుతూనే వున్నారు. లేకపోతే యేనాడో మీ స్కూలు యెత్తేసి వుండవలసింది.

కుచే: మీ ఉపకారం మరిచిపోను.

రామ్మూ: అహ! దానికేం లెండి.

కుచే: మా వూళ్లో నాకు కిట్టనివాళ్లు కొంతమంది వున్నారు.

రామ్మూ: వుంటారు. తప్పకుండా వుండాలికూడా. వాళ్ళు లేకపోతే అసలు గ్రంథమే లేదు. మీ వంటి పెద్దల దర్శనం మాకు దుర్లభమయిపోయి వుండేది.

కుచే: తమరు హాస్యప్రియులు!

రామ్మూ: యెంతమాట! యెంతమాట! — యివేళ పూరినిండా బడిపంతుళ్లే కనిపిస్తున్నారు. యేమిటి విశేషం?

కుచే: యివేళ యిక్కడ ఉపాధ్యాయుల మహాసభ యేర్పాటు చేశామండి

రామ్మూ: ఓహో! అదా కథ! అలా చెప్పండి— ఉదయం మార్కెట్టుకు వెళ్లేప్పుడు చూశాను యింతిమంది దిగడ్డా రేమిటా అనుకున్నాను.

కుచే: మళ్ళా నెలలో తమదర్శనం చేసుకుంటాను నాకు యిక సెలవు యిప్పిస్తారా?

రామ్మూ: వెళ్లిరండి. మాకూ యివేళ ఊపిరి తిరగని పని వుంది

[కుచేలరావు కుడివైపు వెళ్లిపోతాడు. రామ్మూర్తి, శేఖరం తొందర తొందరగా రాస్తూవుంటారు.]

రామ్మూ: (రాత ఆకస్మికంగా ముగించి) హారి భగవంతుడా! యిప్పుడు మళ్లా పాతఫైలు ఒకటి కావాలి.

శేఖ: (తల పైకెత్తి) ఎక్కడ వుంటుందండి?

రామ్మూ: ఇంకెక్కడ? రికార్డురూంలో.

శేఖ: నేను వెళ్లి తీసుకురానా?

రామ్మూ: వద్దు. నీకు తెలియదు. నీ పని చూసుకో. నేనుపోయి తెచ్చుకుంటాను.

[రామ్మూర్తి రికార్డు రూంలోకి వెళ్లిపోతాడు. శేఖరం తలవంచుకొని రాస్తూవుంటాడు. ఎడమ

వైపునుంచి ఒక కాగితం పట్టుకొని నీలవేణి వస్తుంది.]

నీల : రామూర్తిగారేరీ?

శేఖ : రికార్డురూంలో—వున్నారు. ఎందుకు?

నీల : ఆయన రైటింగ్ నాకు సరిగా బోధపడదు. (అతనిమీదికి వంగి కాగితం చూపిస్తూ) యీ మాట యేమిటి?

శేఖ : డిస్క్రిపెన్సీ.

నీల : ఇందాక ఆయన ఘుమఘుమ లాడుతున్నారెందుకు?

శేఖ : చేతిలో డబ్బులేకపోతే యెక్కళ్లేని చిరాకూ వస్తుంది. ఇప్పుడు చల్లబడ్డారులే.

నీల: ఇంకా జీతం అందలేదుగా!

శేఖ : రామూర్తిగారిపద్ధతి చాలా వింతగా వుంటుంది కొన్నాళ్లకు మనంకూడా అలా తయారవుతా మేమోనని భయం వేస్తుంది.

నీల : యేం? యేం జరిగింది?

శేఖ : ఎవరో ఒక మేనేజరు వచ్చాడు. మాటాడకుండా అతనిని నిలబెట్టేశారు. తరవాత ఆఫీసు యెగిరిపోయేలా అతనిమీద కేకలు వేశారు. వెంటనే అతడు రామూర్తిగార్ని పైకి తీసుకు పోయాడు. ఆ తరవాత యేం జరిగిందీ మనకు తెలియదు. యిద్దరూ ప్రాణ స్నేహితులలా తయారై తిరిగివచ్చారు.

నీల : పోనిద్దూ! అటువంటి గొడవలు మనకెందుకు? (కుర్చీ అతనిముందుకులాగి కూర్చుని) 'హెలెన్ ఆఫ్ ట్రాయ్' చూశావా?

శేఖ : లేదు.

నీల : చాలా బాగుంది. నేను వెళదాం అనుకోలేదు. సుందరం బలవంతం చేస్తే వెళ్లేను.

శేఖ : ఆవిడ నీ స్నేహితురాలా?

నీల : (నవ్వుతూ) సుందరం అంటే ఆడపిల్లకాదు. మగాడు.

శేఖ : అతను మీకు దగ్గరబంధువా?

నీల : ఛ! కాదు. అతనితో పరిచయం చాలా తమాషాగా జరిగింది. ఒకనాడు సిటీబస్సులో ఖాళీ లేదు. అతను లేచి నాకు చోటుయిచ్చాడు. ఆ మర్నాటినుంచీ నాకు రోజూ అతను బస్ స్టాప్ దగ్గర కనిపిస్తూనే వున్నాడు.—మంచి హుషారైన కుర్రాళ్లే! నా పుట్టినరోజుకు షిఫాన్‌చీర ప్రజంట్ చేశాడు. మాయింట్లోవాళ్లంతా తప్పు-తీసుకోవద్దన్నారు. మనం పట్టించుకు కూర్చుంటే అన్నీ తప్పులే! యేమంటావ్?

శేఖ : (సీరియస్‌గా) అప్పుడు నువ్వేంచేశావ్?

నీల : అతనిని డిజపాయింట్ చెయ్యడం నాకు యిష్టం లేదు. యాక్సెప్ట్ చేశాను.

[రామూర్తి రికార్డు రూంలోంచి ఫైలుతీసుకొని వస్తాడు.]

రామూ : (వస్తూనే యిద్దర్నీ చూసి) మళ్లీ ప్రారంభించారూ? ఈ వేళకి యిక బడ్జెట్ అయినట్టే! తెల్లవార్లూ దీపారాధనచేస్తూ కూర్చోవలసిందే!

నీల : లేదండీ! ఈ సెంటెన్సు యేమిటో అడగడానికి వచ్చాను (కాగితం చూపిస్తుంది)

రామూ : (చదువుతూ బిగ్గరగా) "దిస్ డిస్క్రిపెన్సీ షుడ్ బి యెక్స్‌ప్లైన్డ్."

నీల : నాకేం చెముడనుకున్నారా! అంత గట్టిగా కేక వేస్తారు.

రామూ : లేదమ్మా! అసలు ఆ సెంటెన్సు యెంతో కోపంతో రాసింది. అలా చదివితేగాని దానికి 'యెఫెక్టు' రాదు. (నీలవేణి సీరియస్‌గా ఎడమవైపు వెళ్లిపోతుంది.)

శేఖ : ఫైల్ దొరికిందా?

రామూ : (చొక్కాకు వున్న ధూళి దులుపుతూ) దొరక్క యేమౌతుందోయ్! దొరికింది. అసలు ఆ రికార్డు రూంలోకి వెళ్లడానికే భయం, దుమ్మూ ధూళితో నిండివుంటుంది.

శేఖ : మరి అదెప్పుడూ దులిపించరేమండి?

రామూ : ఎవరు దులుపుతారు? కావాలంటే నువ్వూ నేనూ కలిసి దులపాలి!

శేఖ : మరి బంట్రోతు లెందుకండి?

రామూ : బంట్రోతు లెందుకంటావా నాయనా, వాళ్ళు అధికార్ల యిళ్లలో బట్టలు ఉతకడానికి పై పనులు చేయడానికీని. నెలకోసారి వాడు మనుగుడుపు పెళ్లికొడుకులా వచ్చిపోతూ ఉంటాడు. బంట్రోతు చేసేపనికూడా కిమ్మనకుండా గుమాస్తా చేసుకోవాలి. ఏదిగతిలేక ఈ ఉద్యోగం చెయ్యడం కాని—గుమాస్తా పని

చెయ్యడంకంటే సుష్టుగా తినడం నయం. (కాగితాలు తీసి చూస్తూ) కానియ్ నాయనా కానియ్, మనల్ని కష్టపెట్టేనంత పని వుంది.

[శేఖరం రామ్మూర్తి తొందరగా అంకెలు కూడుతూ వుంటాడు. కుడివైపు నుంచి ప్రకాశం వస్తాడు. వయస్సు 20 సంవత్సరాలు. అమెరికన్ జాకెట్, ఫుల్ ఫాంట్, బూటు, చేతికిరిస్టు వాచీ—ముఖంలో చురుకుతనం, ఉత్సాహం కనిపిస్తూ వుంటాయి.]

ప్రకాశం: (రామ్మూర్తిని సమీపించి) మా నాన్నగారు లేరా?

రామ్మూ: (తల పైకెత్తి) నువ్వా నాయనా! కూర్చో!

ప్రకా: (కుర్చీలో కూర్చుని) యెక్కడికి వెళ్ళారు?

[శేఖరం ఒకసారి ప్రకాశంకేసి చూసి తిరిగి పని చేస్తూ వుంటాడు.]

రామ్మూ: బ్యాంకుకు వెళ్ళారు. పది నిముషాలలో వస్తారు. యేమిటి విశేషం?

ప్రకా: పుస్తకాలు కొనాలండీ. డబ్బుకోసం వచ్చాను.

రామ్మూ: (చేతిలో కలం టేబులుమీద పారేసి కుర్చీకి చేరబడి) అలా చెప్పు! అసలు నిన్ను చూడగానే అనుకున్నాను.

ప్రకా: (నవ్వుతూ) యేమని?

రామ్మూ: డబ్బుకోసమే వచ్చివుంటావని.

ప్రకా: లేకపోతే మీ ఆఫీసుకు రావలసిన ఖర్మ నాకేం పట్టిందండి?

రామ్మూ: నిజమే నాయనా, నిజమే! ఖర్మ పట్టినవాళ్ళే యిక్కడకు వస్తారు. (సీరియస్‌గా) చూడు ప్రకాశం నీతో ఒకమాట చెప్పాలనుకుంటున్నాను.

ప్రకా: చెప్పండి.

రామ్మూ: మీ నాన్నగారు యెంతో కష్టపడి నిన్ను చదివిస్తున్నారు. ఎందుకని?

ప్రకా: (తేలికగా) అది ఆయన ధర్మంకనక!

రామ్మూ: ధర్మంకాదు (కోపంతో) నీలాంటికొడుకు వుండడం ఆయన ఖర్మం.

ప్రకా: (కోపంతో) యేమిటండోయ్ రామ్మూర్తిగారూ! చాలా దూరం వెడుతున్నారు!

రామ్మూ: నిన్ను బాగుచెయ్యాలని ఆయన ఉద్దేశం. మాలాగ గుమాస్తా బతుకు బతుకుతూ అష్టకష్టాలూ పడకుండా—నిన్ను మంచిదారిలో పెట్టాలని ఆయన అభిప్రాయం. నిన్ను చదివించడంకోసం ఆయన చేసిన అప్పులు యిన్నీ అన్నీ కావు. ఆయన యిప్పుడు పూర్తిగా మునిగిపోయి వున్నారు.

ప్రకా: నన్నేం చెయ్యమంటారు?

రామ్మూ: నువ్వేం చెయ్యొద్దు. లక్షణంగా చదువుకో! డబ్బు దూబరా చెయ్యకు.

ప్రకా.: మీ మాటలు నాకు బోధపడడం లేదు.

రామ్మూ: (హేళనగా) యెలా బోధపడతాయి నాయనా! కాస్త కిందబడి తిరిగేవరకూ బోధపడవు. యిద్దరు ముగ్గురు పిల్లలుపుట్టి "నాన్నా స్కూలు ఫీజు—పుస్తకాలకు డబ్బు" అని వేధించేవరకూ బోధపడవు.

ప్రకా: పుస్తకాలు కొనకపోతే చదువెలాగ?

రామ్మూ: అబద్ధం ఆడకుండా చెప్పు. నువ్వు ప్రతినెలా పుస్తకాలు కొంటున్నావా? నువ్వు అడిగీ అడగడంతోనే—నీ మీదప్రేమకొద్దీ మారు మాటాడకుండా మీ నాన్నగారు నీకు డబ్బిచ్చేస్తున్నారు—అది నేనైతేనా? (సీరియస్‌గా అతని ముఖంలోకి చూస్తూ) నీకు డబ్బెందుకు కావాలి? యేం పుస్తకాలు కొంటావు? యీ వేషాలు నాదగ్గరా? పదరాపద! పుస్తకాల షాపు దగ్గరకు నేనుకూడా వస్తాను. అనివుండేవాణ్ణి.

ప్రకా: (లేచి) పావుగంట పోయాక వస్తాను. (వెళ్ళిపోబోతాడు.)

రామ్మూ: కూర్చోవోయ్! కూర్చో! రెండు మాటలు చెప్పనీ. మీ నాన్నగారు యెంతో నిజాయితీ అయిన మనిషి. వళ్ళుదాచుకోకుండా పని చేస్తారు. ఆయనకు—రిటైరయిపోయే సమయానికి—యిప్పటికి మేనేజరుగా ప్రొమోషన్ వచ్చింది. ఆయన సంపాదనంతా నీకిందే ఖర్చుపెట్టేశారు. ఎప్పుడూ రోజులు ఒకలాగే వుంటాయనుకోకు. ఒక సంవత్సరంలో ఆయన రిటైర్ అయిపోతారు. ఆ తరవాత సంగతి ఆలోచించు. — ఇప్పటినుంచైనా కొంచెం జాగ్రత్తగా మసులుకో! ఒకటికి లేదీ వచ్చేసరికి యిక్కడకు కాబూలీవాడిలాగ సిద్ధమవ్వకు.

శేఖ: (అంకెలు కూడడం పూర్తిచేసి తలపైకెత్తి) యిది పూర్తి అయిపోయిందండి. యిక లాసియర్ ఎక్కౌంట్సు కావాలి.

రామ్మూ: పద! రికార్డు రూంలోపడి వెతుకుదాం. (ప్రకాశంతో) కూర్చోవోయ్ నాయనా! కూర్చో! మీ నాన్నగారు కూడా వచ్చే టైమయ్యింది.

[రామ్మూర్తి, శేఖరం రికార్డు రూంలోకి వెళ్ళిపోతారు. ప్రకాశం ఒక్కడూ కూర్చుంటాడు. చుట్టూ చూస్తాడు. యేం తోచదు. జేబులోంచి మౌత్ ఆర్గన్ తీసి నెమ్మదిగా 'రాక్ అండ్ రోల్' మ్యూజిక్ వూదుతూ వుంటాడు.— టైప్ చేసిన కాగితాలు చేత్తో పట్టుకొని నీలవేణి ఎడమవైపునుంచి వస్తుంది. ఆమెను చూడగానే ప్రకాశం అమాంతంగా లేచి నిలబడతాడు.]

ప్రకా: హలో! నీలవేణీ! యేమిటిది? యిక్కడున్నావ్?

నీల: ఉద్యోగం.

ప్రకా: యేమి ఉద్యోగం? యెప్పటినుంచి? యేమిటి కథ?

నీల: టైపిస్టుగా పనిచేస్తున్నాను. ఉద్యోగంలో చేరి రెండు నెలలయింది.

ప్రకా: అలా చెప్పు. అందుకే రెండు నెలలనుంచి నీ దర్శనం యెక్కడా లేదు:—ఒక రోజు మీ యింటికి వెళ్ళాను.

నీల: మేం యిప్పుడు అక్కడ లేం.

ప్రకా: అది నాకేం తెలుసు? నేను వెళ్ళి తలుపు కొట్టేసరికి—ఆ యింటిలో వున్న అమ్మమ్మగారో కావిడ చేతిలో వున్న రొట్టెలకర్రతో సహా యివతలకి వచ్చింది.

నీల: (నవ్వుతూ) దాన్తో ఒకటి వెయ్యవలసింది నిన్ను!

ప్రకా: మేం కొత్తగా దిగాం నాయనా—అని ఆవిడ మర్యాదగా చెప్పింది. నిరుత్సాహపడి యింటికి వెళ్ళిపోయాను.

నీల: నాకు ఉద్యోగం దొరికిన వెంటనే యిలు మార్చేశాం.

ప్రకా: వూళ్ళోకి రావడం లేదా?

నీల: యెక్కడికీ వెళ్ళడం లేదు. యెప్పుడూ ఆఫీసూ, యిల్లూ.

ప్రకా: మిజరబుల్ లైఫ్, యెప్పుడూ ఖులాసాగా తిరిగే దానివి. యెలా భరిస్తున్నావో తెలియకుండా వుంది.

నీల: ఏంచెయ్యను? అంతా అలా వొచ్చింది. అసలు యీ వుద్యోగం మీ నాన్నగారే వేయించారు.

ప్రకా: మా నాన్నగారే నిన్ను యీ బోనులో పారేశారన్నమాట,—సరే! యిక యిక్కడినుంచి నీకు కాలక్షేపానికి లోటువుండదు.

నీల: యేం?

ప్రకా: మీ ఆఫీసు వదిలే టైముకు నేను రోజూ వస్తూవుంటాను.

నీల: కొంపతీసి అలాంటి పనిమాత్రం చెయ్యకు.

ప్రకా: అలా కొత్తగా భయపడుతున్నావెందుకు?

నీల: నా అలవాట్లు చాలావరకూ మార్చుకున్నాను.

ప్రకా: మంచిదే!—చూడు! ఇవ్వేళ సాయంత్రం సరిగా ఐదుగంటలకి ఆ కార్నర్‌లో నిలబడి వుంటాను. ఇద్దరం కలిసివెళదాం.

నీల: ఎక్కడికి?

ప్రకా: నియిష్టం. బీచికిపోదాం. లేదంటావా? న్యూ థియేటరుకుపోయి సీటు రిజర్వు చేయించుకు వస్తాను.

నీల: ఇవేళవద్దు. మరోకసారి ఎప్పుడైనా వెళ్ళొచ్చు.

ప్రకా: నో! నో! నువ్వలా అంటే లాభంలేదు.

నీల: లేదు. నేను ఇవేళ వేగంయింటికి వెళ్ళాలి.

ప్రకా: (ఆమెను సమీపించి) ఈ ఒక్కరోజుకూ నామాట కాదనకు.

[ఆమె చెయ్యి పట్టుకోబోతాడు. ఆమె విడిపించుకుంటుంది. సరిగా ఆసమయంలో రికార్డురూం ద్వారం దగ్గర ముందు రామ్మూర్తి, అతనివెనుక శేఖరం కనిపిస్తారు. శేఖరం చేతిలో ఒక ఫైలు వుంటుంది.]

రామ్మూ: (వస్తూనే) ఏమోయ్! అబ్బాయ్! యిదేమైనా ఆఫీసు అనుకున్నావా? నైట్ క్లబ్ అనుకున్నావా? (నీలవేణితో) యేమిటమ్మా! నీకు యీవూళ్ళోవున్న కుర్రాళ్ళంతా పరిచయస్థులు లాగా నే కనిపిస్తున్నారే!

నీల: లేదండి! యీ కాగితాలు టైప్ చేసి తీసుకువచ్చాను. ప్రకాశం కాగితాలు చూడనివ్వమంటున్నారు. నేను ఇవ్వడంలేదు. అంతే!

ప్రకా: ఆడిట్ ఎలా టైప్ చేసిందో చూడ్డామనండి.

రామ్మూర్తి: ఆడిట్ యెలా టైప్ చేసింది చూడ్డానికి, తప్పులు దిద్దడానికి మేం ఇక్కడ అరడజను మంది వున్నాం. నీకెందుకు శ్రమ?—వెళ్ళి పని చూసుకో నాయనా! (ప్రకాశం కుడివైపు వెళ్ళిపోతాడు. అతను వెళుతున్నవైపు చూస్తూ) సుపుత్రా! కొంపకూల్చరా అన్నారు. (నీలవేణితో) ఆ కాగితాలు మా మొహాన్ని పారేసి మిగిలిన కాగితాలు టైప్ చేసుకోనిరా!

[నీలవేణి తన చేతిలోని కాగితాలు టేబులుమీద పెట్టి ఎడమవైపు వెళ్ళిపోతుంది. శేఖరం ఆమె వైపు చురచురా చూస్తాడు.]

రామ్మూర్తి: ఈ కాలపు పిల్లల్ని చూస్తూవుంటే ఆశ్చర్యం వేస్తోంది. పెళ్ళి పెటాకులూ లేకుండా ఆడాళ్ళు మగాళ్లు గాడిదల్లా ఊరిమీదపడి తిరగడం. సంసారం లేనివాళ్ళకు సంసారా లెక్కువట! ఉటినే అన్నారా పెద్దలు!! వాళ్ళు బాల్య వివాహాలు చేశారూ అంటే వెర్రివాళ్లయ్ చేశారటయ్యా? ఇలాంటి అనర్థాలన్నీ ఊహించే వాళ్ళు ఆడదానికి చదువు పనికిరాదన్నారు. ఎనిమిదేళ్ళు నిండకుండా మూడుముళ్లూ వేసెయ్యమన్నారు.

శేఖ: చదువుకున్న వాళ్ళంతా చెడ్డవాళ్ళంటారా? ఎవరో కొద్దిమంది వుంటారు.

రామ్మూర్తి: ఏమిటో దిక్కుమాలిన రోజులు! ఇంగ్లీషు చదువు ఇంగ్లీషు వేషం. ఇంగ్లీషు బుద్ధులూ ఇంగ్లీషు ఆలోచనలూను!! ఒక్క కుర్రవెధవకీ, స్వతంత్రాలోచనా, స్వతంత్రబుద్ధీ లేదుకదా? అంతా అనుకరణ! పూర్తిగా యిమిటేషన్!—కానియ్ నాయనా! పని కానియ్! అవన్నీ ఐటమ్‌వారీ టోటల్ చెయ్యి. నేను పోయి మిగిలిన రికార్డుకూడా వెతికి తెస్తాను.

[రామ్మూర్తి రికార్డు రూంలోకి వెళిపోతాడు.]

శేఖ: (లేచి ఎడమ చివరకు వెళ్లి) నీలవేణీ!

నీల: (ప్రవేశించి) యేం? యెందుకు?

శేఖ: అతనితో నీకేం పరిచయం?

నీల: (కోపంతో) పిల్లిగా మాట్లాడకు. అతను నా మేట్!—ఈ ప్రశ్న వెయ్యడానికా నన్ను పని కట్టుకు పిలిచావ్?

(చరచరా టైప్ రూంలోకి వెళ్ళిపోతుంది—శేఖరం తిరిగి తన సీట్లో కూర్చుని కాగితాలు చూస్తూవుంటాడు. కుడివైపు నుంచి నారాయణ వస్తాడు. లావుగా పొడవుగా వున్నాడు. తెల పంచె, నల్లకోటు, భుజంమీద కండువా—వయస్సు 54 సంవత్సరాలు. చేతిలో చిన్న తోలుపెట్టె వుంది.)

నారాయణ: రామ్మూర్తిగారేరీ?

రామ్మూర్తి: (కాగితాలకట్ట రికార్డు రూంలోంచి మోసుకువస్తూ) యిదిగో! ఈ దుమ్ములోను, దూరంలో నూపడి కొట్టుకు ఛస్తున్నానండి. (చేతిలోవున్న కాగితాలు తన టేబులుమీద పెడతాడు.)

నారా: బడెట్ యెంతవరకూ వచ్చింది?

రామ్మూర్తి: నాలుగోవంతు కూడా అవ్వలేదండి.

నారా: బడ్జెట్ రేపే అన్న విషయం మరిచిపోయారా?

రామ్మూర్తి: లేదు. అది జ్ఞాపకం వుంచుకునే గింజుకు ఛస్తున్నాం.

నారా: రామ్మూర్తిగారూ! యీ రోజు యెంత రాత్రయినా అది పూర్తిచేసేవరకూ ఇంటికి వెళ్లలేం.

రామ్మూర్తి: తప్పుతుందా మరి? అలాగే చేదాం! ఇంటికి వెళ్ళినమాత్రం ఏం సుఖపడి యేడవాలిగనక?

నారా: శేఖరం! ప్రాపర్టీ స్టేట్‌మెంట్లు అందరిదగ్గరా తీసుకున్నావా?

శేఖ: అందరి దగ్గరా తీసుకున్నాను సార్. ఇక రామ్మూర్తిగారి దగ్గరే తీసుకోవాలి.

రామ్మూర్తి: నేనొక్కణ్ణే మిగిలిపోయానా నాయనా! ఇలా పట్రా, రాసి ఇచ్చేస్తాను. ప్రతిసంవత్సరం యిదొక తతంగం. నేనేమీ స్థిరాస్తి సంపాదించుకోలేదని రాసివ్వాలట, నీకు వున్న అప్పులెన్నని యే మహానుభావుడూ అడగడేం? ప్రతి సంవత్సరం మనం అప్పుల్లో మునిగిపోతున్నాం. దీనికి బాధ్యులెవరు?

శేఖ: (కాగితం యిస్తూ) దీనిమీద రాసి సంతకం పెట్టండి.

రామ్మూర్తి: (రాసి యిస్తూ) యిలాంటి వివరాలు మన నాయకుల దగ్గర్నుంచి సేకరిస్తే బండారం బయట పడుతుంది. రాజకీయ బాధితుడనే పేరుతో భూములకు భూములూ లాగేస్తున్నాడు నెలకు వేల కొద్దీ ఆదాయం వచ్చే పదవి కొట్టే

సున్నాడు.—పైగా ఆతగాడు వచ్చి—ముష్టెత్తు కోడానికి సిద్ధంగా వున్న గుమస్తాని 'నువ్వెంత ఆస్తి సంపాదించావని యెదురు తిరిగి అడుగు తున్నాడు ఒకసారి నవ్వండయ్యా నలుగు రూను సిగ్గొచ్చేలాగ!!

నారా: ముందు పని కానివ్వండి. అన్యాయాలనేవి మొదటినుంచీ వున్నవే (రామూర్తికి తిన్నగా వున్న కుర్చీలో కూర్చుని తోలుపెట్టె తెరిచి నోటు కట్టలు టేబులుమీద పెడుతూ) శేఖరం, జీతాలలోంచి ఎంత డబ్బు వసూలు చెయ్యాలో లిస్టు తయారు చేశావా?

శేఖ: రాశానండి. (కాగితం చదువుతూ) ఇన్స్పెక్షను తాలూకు ఖర్చులు మనిషికి ఐదు రూపాయలు—రంగస్వామిగారు బదిలీ అయి పోయినప్పుడు యిచ్చిన టీ పార్టీ ఖర్చు మనిషికి రూపాయిన్నర కోఆపరేటివ్ బ్యాంకు 'లోన్' రికవరీ వడ్డీతో సహా యిరవై రూపాయల నర. మొత్తం యిరవై యేడు రూపాయలు వసూలు చెయ్యాలండి.

రామూర్తి: (కళ్ళు తేలవేసి) యిరవై ఏడు రూపాయలే!

నారా: (రామూర్తితో) ముందు జీతాలు యిచ్చి—తరవాత పని ప్రారంభిదాం.

రామూర్తి: (తేరుకొని) అలాగే కానివ్వండి.

[తన టేబులు మీది కాగితాలు అన్నీ ఒక మూల సర్దేస్తాడు. నారాయణ కొన్ని విడినోట్లు రామమూర్తి ముందు వుంచుతాడు. రామ్మూర్తి, నారాయణ డబ్బు లెక్క పెడుతూ వుంటారు. సరిగా ఆసమయంలో కుడివైపునుంచి ఒక వ్యక్తి వస్తాడు. లాల్చీ, పంచె, చేతిలో ఒక ఖద్దరుసంచి—మధ్య వయసులో వున్నాడు.]

వ్యక్తి: (ముందుకు వచ్చి) సార్!

రామూర్తి: (వెంటనే అందుకొని) మాట్లాడకండి.

వ్యక్తి: అయ్యా! నేను...

రామూర్తి: (కోపంతో) మీరెవరైనా సరే! కూర్చో వలిసిందే. డబ్బు లెక్క పెడుతున్నాం అను కున్నారా? ఆడుకుంటున్నాం అనుకున్నారా? ఒక్క రూపాయి తకరావస్తే చాలు మా ప్రాణానికి.

నారా: (లెక్క పెడుతూ) కూర్చోండి.

[ఆ వ్యక్తి విధిలేక కుడిచివరవున్న ఖాళీ కుర్చీలో కూర్చుంటాడు.]

రామూర్తి: జీతాలు విడిగా పెట్టాను.

నారా: శేఖరం యీ డబ్బు తీసుకువెళ్ళి ఎవరిజీతం వాళ్ళకు యిచ్చెయ్. ఎక్విటెన్సురోల్ లో సంతకాలు పెట్టించు. రికవరీస్ మాత్రం జాగ్రత్త. ప్రతిమనిషిదగ్గరా యిరవైయేడు రూపాయలు వసూలు చెయ్యి.

[శేఖరం ఒక బెండు పుస్తకం కొంత డబ్బు తీసుకొని ఎడమవైపు వెళ్ళిపోతాడు. నారాయణ, రామ్మూర్తి యింకా డబ్బు లెక్క పెడుతూనే వుంటారు. రెండు నిముషాల తరవాత శేఖరం తిరిగి పుస్తకం తీసుకొనివస్తాడు )

శేఖ: (పుస్తకం నారాయణకు యిస్తూ) అందరూ డబ్బు యిచ్చేశారండి. రామనాథంగారూ, సుబ్బారాయుడుగారు మాత్రం యీ నెలలో యివ్వలేమన్నారండి.

నారా: (తలపైకెత్తి) యీ నెలలో యివ్వలేకపోతే వచ్చేనెలలో అంతకంటే యివ్వలేరు. యివ్వవలసిన డబ్బు రేపటి నెలకు రెట్టింపు అవ్వదూ?—అవసరంకొద్దీ అప్పులు చేస్తాం. బాకీలు తీర్చవలిసి వచ్చేసరికి బాధపడతాం. అసలు గాజులలా వున్నాయ్—అబ్బాయ్! శేఖరం! యిదిగో నీజీతం తీసుకో.

శేఖ: (జీతం తీసుకొని పుస్తకంలో సంతకంపెట్టి) నన్ను యివేళ కొంచెం ఐదుగంటలకే విడిచి పెట్టాలిసార్ !

నారా: యేం? యేదైనా సినిమా ప్రోగ్రాంవుందా?

శేఖ: లేదండీ.

నారా: శేఖరం! నీమీద మీ కుటుంబం అంతా ఆధారపడివుందన్న విషయం గుర్తుంచుకోవాలి.

శేఖ: నిజమేనండి

నారా: మీ అన్నగారు పక్షవాతంతో మూలబడి పోయాడు. అంతా నిరాధారం. నీ ఒక్కడి మీదా ఎంతో బాధ్యతవుంది. అవునంటావా?

శేఖ: (అవునన్నట్లు తలవూపుతాడు.)

నారా: నిజానికి నువ్వు చేస్తున్నదేమిటి? జీతం పూర్తిగా యింట్లో యిస్తున్నావా?

రామూర్తి: (నోట్లు లెక్క పెట్టడం పూర్తిచేసి కట్ట కడుతూ) ఇతగాడుకూడా యీమధ్య గందర గోళంలో పడుతున్నాడులెండి.

నారా: చూడు నాయనా! నువ్వు చిన్నవాడివి. మాలాంటి వాళ్ళ మాటలమీద గౌరవం వుంచాలి. నిన్న మీఅన్నయ్య మాయింటికివచ్చి అంతా చెప్పుకుని విచారించాడు. బుద్ధిగా జీతంఅంతా తీసుకువెళ్లి యింట్లో యియ్యి. ఎందుకు చెడిపోతవ్ !

రామూర్తి: వృధాగా జల్సాచేసే నే యేంలాభమోయ్! డబ్బూపోతుంది. పరువూపోతుంది. అన్నీ

పోతాయి. (నారాయణను చూపిస్తూ) మన మేనేజరుగారికికూడా నీలాంటి సుపుత్రుడే ఒకడున్నాడు. యిందాక చూశావుకదూ!— అయ్యో! నారాయణగారూ! మీకు చెప్పడం మరిచిపోయాను. మీవాడు అప్పుడే ఓసారి వచ్చి వెళ్లాడు.

నారా: వాడూ అంతే, ఎంత చెప్పినా వినడు.

రామూర్తి: అయ్యో, మీ నెమ్మది, మీమంచితనం వాణ్ణి పూర్తిగా పాడుచేసున్నై. అసలేనైతే గదిలో పెట్టి రూళ్లకర్ర విరిగేవరకూ కొట్టేవాణ్ణి.

నారా: రామూర్తిగారూ, యిక మనం చెప్పవలసిన దశదాటిపోయింది. వాళ్లంతటవాళ్ళే తెలుసుకోవాలి.

రామూర్తి: ఏం తెలుసుకోవడమో! నీలవేణిగారూ మీవాడూ కలిసి యిక్కడ నాట్యంచేసినంత పనిచేశారు.

నారా: నీలవేణి కుటుంబంకూడా అంతే, ఆమె జీతం మీద తల్లి, యిద్దరు చెల్లెళ్ళు ఆధారపడి వున్నారు. వాళ్ళకు మరో ఆధారం లేదు.

రామూర్తి: (ఆశ్చర్యంతో) అలాగటండీ! టిప్‌టాప్‌గా రాణీగారిలా తయారై వస్తుంది. వేషభాషల్ని చూసి కాస్త కలవాళ్ళనుకున్నాను సుమండీ.

నారా: రవంత ఆ సిరికూడా లేదు. ఆమె అసలు కుటుంబం విషయం పట్టించుకోదు. ఎప్పుడూ తన షికారు, సినిమాలు, స్నేహితులు—తన గొడవే.—దరిద్రంవల్లనే ఆమె అలా తయారైందేమో అనిపిస్తూవుంటుంది నాకు. (డబ్బు రామూర్తికి యిస్తూ) యిదిగో, మీ జీతం కూడా తీసుకోండి.

శేఖ: (లేచి రామూర్తిని సమీపించి) రామూర్తిగారూ, మీ డబ్బుకూడా యివ్వండి.

రామూర్తి: (డబ్బు లెక్కపెడుతూ) ఎంతయిమ్మంటావ్? యిరవైయేడురూపాలా? (నోట్లు శేఖరానికి యిస్తూ) నాకు వచ్చేనెల జీతం తొంభైతొమ్మిదిలోను యిరవైయేడు రూపాయలుపోతే యిక డబ్భైరెండురూపాయలు వున్నాయి. (బాధగా) యీ ముష్టి డబ్భైరెండు రూపాయలతో రెండుపూటలూ భోజనం చెయ్యనా? యిద్దరు పిల్లలకూ చదువుచెప్పించనా? చంటిపిల్లకు పాలడబ్బా కొననా? పెళ్ళాం పిల్లలకు కట్టుకోడానికి బట్టలుకొననా? యేం చెయ్యాలో బోధపడకుండా వుందిరా భగవంతుడా!

నారా: రామూర్తిగారూ, మన గుమాస్తాల బ్రతుకే కాదు యిలా వున్నది. సామాన్యసంసారుల జీవితాలన్నీ యీనాడు కష్టాలతో నిండివున్నాయి. రాత్రి అంతా పీడకలలు, తెల్లవారితే భయం. ప్రతి రోజూ ఒక సముద్రపు కెరటంలా విషాదము మీదపడుతోంది. పరిస్థితులు రోజురోజూకూ దిగజారిపోతున్నై. మధ్యతరగతి ప్రజల జీవితాలు పేకమేడలా వున్నాయి. అవి యేక్షణంలోనైనా కూలిపోవచ్చు

రామూర్తి: (బాధగా) చూడండి నారాయణగారూ! మీరే చెప్పండి. ఈ డబ్బుతో యీ నెలంతా యెలా గడపను?

నారా: తప్పదు. భరించాలి. యీ జీవితమే నయం అని తృప్తిపడాలి—యీ కాస్త ఉద్యోగం పోగొట్టుకుంటే వాళ్ళ కుటుంబం యేమౌతుందో ఆలోచించండి. యే వ్యామోహంలోనోపడి నీలవేణి ఉద్యోగం వదులుకుంటే వాళ్ళ కుటుంబం యేగంగలో కలుస్తుందో ఆలోచించండి. మీరూ నేనూ యే గుండెజబ్బుతోనో అకస్మాత్తుగా ప్రాణాలు విడిచిపెడితే మన సంసారాలేమౌతాయో ఆలోచించండి.

రామూర్తి: యేమౌతాయి? అకస్మాత్తుగా మునిగిపోతాయి. అక్షయపాత్ర చేతికిస్తుంది—మనం ఆస్తి సంపాదించలేదు సరికదా! కావలిసినన్ని అప్పులు సంపాదించి వుంచాం.

నారా: ఒకందుకు నాకు ఆశ్చర్యం కలుగుతుంది. జీవితంలోని యీ కష్టాలను, యీ నిజమైన పరిస్థితుల్ని యీ కుర్రవాళ్ళు యెందుకు గమనించరా అని?

వ్యక్తి: (లేచి రామూర్తిని సమీపించి) అయ్యా! రామూర్తిగారు మీరేనా?

రామూర్తి: (రహస్యంగా) యేం! నేనే! (నారాయణతో) ఈ వేళ బడిపంతుళ్ళంతా సభ చేస్తున్నారు సార్. ఉదయంనుంచి ఒక్కొక్కళ్ళూ మన ఆఫీసుకు దిగుతూవున్నారు. సమాధానాలు చెప్పలేక ఛస్తున్నామ్.

రామూర్తి: (పంచిలోంచి పుస్తకంతీసి) ఒక ఎనిమిది రూపాయలు యిలా యిప్పించండి.

రామూర్తి: (కోపంతో) యెవ్వరివి పంతులివయ్యా నువ్వు? ఎదురుతిరిగి వచ్చి డబ్బు అడుగుతున్నావ్!!

వ్యక్తి: పంతుల్ని కాను, పాడూ కాదు. నేను మునిసిపల్ బిల్లు కలెక్టర్ని.

రామూర్తి: నాకీ ప్రపంచంలో అంగుళం భూమికూడా లేదు. నువ్వేదో పొరపాటున వచ్చివుంటావ్! నేనేం పన్నుకట్టక్కర్లేదు.

బిల్లుకలెక్టరు: వృత్తిపన్ను సార్! వృత్తిపన్ను. ప్రొఫెషన్‌టాక్సు.

రామ్మూర్తి: పారిపోదామనుకున్నా బండికి హాసీలు పన్ను తప్పదన్నారు చిలకమర్తివారు.

బిల్లు: అయ్యా! యిప్పటికే నన్ను చాలాసేపు కూర్చోపెట్టేశారు. వెంటనే యెనిమిది రూపాయలు యిచ్చెయ్యండి. (నారాయణ దగ్గర, శేఖరందగ్గర డబ్బుతీసుకొని రసీదులు రాసియిస్తాడు.)

రామ్మూర్తి: (ఆశ్చర్యంతో) వృత్తిపన్ను ఒక్కసారే ఎనిమిది రూపాయలెలా అయ్యిందయ్యా మహానుభావా?

బిల్లు: గత సంవత్సరం వసూలుచెయ్యడం మరిచిపోయాం సార్. రెండు సంవత్సరాల పన్ను కలిపి ఎనిమిది రూపాయలయ్యింది.

రామ్మూర్తి: (చేతిలోవున్న నోటు మరోసారి లెక్కపెట్టి) యీ డబ్భై రెండు రూపాయలలోను నీకు ఎనిమిది రూపాయలిచ్చేస్తే యికనాకు తిన డానికేముంది గడ్డి: యీ నెలలో యివ్వలేను వచ్చేనెలలో కనిపించు.

బిల్లు: (సీరియస్‌గా) యేమండోయ్! అదేం పనికి రాదు. తక్షణం యిచ్చెయ్యవలసిందే!

రామ్మూర్తి: యివ్వలేను నాయనా! యివ్వలేను. వృథాగా నన్నెందుకు బాధపెడతావ్.

బిల్లు: (తీవ్రంగా) యివ్వకపోతే మీరు కోర్టుకు రావలిసి వుంటుంది.

రామ్మూర్తి: (కోపంతో) కోర్టుకు కాకపోతే సెంట్రల్ జైలుకు వెళతాను! వెళ్ళు! వెళ్లయ్యా. ఇలాంటివి చాలా చూశాం...

బిలు: వుండు! వుండవయ్యా! తొందరపడకు!

(బిలుకలెకరు కుడివైపు నిష్క్రమిస్తాడు)

రామ్మూర్తి: ఈ గుమాస్తా ప్రాణికి ఒకటవ తేదీ అంటే మరణశిక్ష పడేరోజు. — యింటి యజమానికి సంజాయిషీ చెప్పుకోవాలి. పాలమనిషికి సంజాయిషీ చెప్పుకోవాలి. ఆఫీసులో ఆరోజు కాగితం ఆలస్యమయినందుకు అధికారికి సంజాయిషీ చెప్పుకోవాలి. అసలు యీ దౌర్భాగ్యుడి జీవితమే సంజాయిషీల పుట్ట!!

నారా: యేది! — మీరు యింతవరకూ వేసిన స్టేట్‌మెంట్ చూడనివ్వండి.

రామ్మూర్తి: (ఒక కాగితం చూపిస్తూ) ఎస్టాబ్లిష్‌మెంటు వరకూ వచ్చిందండి.

నారా: యింకా మొదటిలోనే వున్నాం. యిదంతా యెప్పటికవుతుందండి?

రామ్మూర్తి: యిప్పటినుంచీ కదలకుండా కూర్చుంటే రాత్రి తొమ్మిది గంటలకు అవుతుందండి.

శేఖ: నన్ను కాస్త ఐదుగంటలకే విడిచిపెట్టాలి సార్!

రామ్మూర్తి: (కోపంతో) యీపని యెలా అవుతుందిరా దేవుడా అని మేం కొట్టుకు ఛస్తుంటే నువ్వుపోతావా?

నారా: వెళ్లనివ్వండి పాపం! అతనికేం పనివుందో!

రామ్మూర్తి: మీరు అందర్నీ యిలా నమ్మేస్తారండి. అతనికి పనీ లేదు. పాటూ లేదు.

[తొందరగా కుడివైపునుంచి రమణయ్య, నరసయ్య వస్తారు. యిద్దరిభుజాలనుంచి సంచులు వేలాడుతున్నై. ఇద్దరూ రామ్మూర్తికి తిన్నగా నిలబడతారు.]

రమ: (రామ్మూర్తిని ఉద్దేశించి) నమస్కారం మేనేజరుగారు!

నర: దణ్ణం బాబూ!

రామ్మూర్తి: (నారాయణను చూపిస్తూ) వీరూ మేనేజరుగారు. నేను కాదు.

రమ }
నర } : (వెంటనే నారాయణకేసి తిరిగి) నమస్కారం బాబయ్యా!

నారా: యేం పనిమీద వచ్చారు?

రమ: చిన్నపని కాదు బాబయ్యా!

నర: చాలా పెద్దపని బాబూ!

రామ్మూర్తి: మీరు బిల్లుకలెక్టర్లు కాదుకదా!

రమ: కాదు బాబయ్యా.

నర: చావలేక బతుకుతున్న బడిపంతుళ్ళం.

రామ్మూర్తి: నాకు చచ్చే అంతపనివుంది. వూరికే సాగదియ్యక మీరు వచ్చిన పనేమిటో మూడు మాటల్లో టూకీగా చెప్పండి.

రమ: అంత తేలిగ్గా తేల్చి పారెయ్యవలిసిన విషయం కాదు బాబయ్యా.

నర: అంతా పూసగుచ్చినట్లు మనవి చేసుకుంటాం.

రమ: తమరు శ్రద్ధగా వినాలని మా ప్రార్థన!

రామ్మూర్తి: ఇప్పుడు మాకు తీరికలేదు. రేపు దయచెయ్యండి.

రమ: (ఆశ్చర్యంతో) రేపు మళ్ళారావడమే!

నర: మావూరినుంచి రావాలంటే ఐదురూపాయలుండాలి బాబయ్యా.

నారా: మీరు చెప్పేదేమిటో త్వరగా చెప్పండి.

రమ: మేం ఆ వూరులో పదేళ్లనుంచి పనిచేస్తున్నాం బాబయ్యా.

నర: గ్రామస్థులకు మేమంటే మహాచెడ్డ అభిమానం!

రమ: మొన్నటి ఎలక్షన్లనుంచీ మారోజులు మారిపోయినై బాబయ్యా.

నర : వెంకట్రట్నంగారి తరఫున మేం ప్రచారం చెయ్యలేదండి.

రమ : మేం చేసిన నేరం అదేనండి బాబూ!

నర : ఆయన మామీద పగసాధించాలని చూస్తున్నారండి.

రమ : మమ్మల్ని ఉద్యోగాలలోంచి తీసెయ్యాలని చాలా ప్రయత్నాలు చేశారండి.

నర : రోజుకో అర్జీ పెట్టారండి.

రమ : మహాజరుకు మహాజరు సృష్టించేశారండి

నర : ఒక మనిషితోనే కుడిచేత్తోనూ, ఎడమచేత్తోనూ అరవైజను వేలిముద్రలు వేయించేశారండి.

రమ : చివరకు న్యాయమే గెలిచింది బాబయ్యా.

నర : చిన్నబ్బాయిగారు దేవుళ్ళా సాయపడ్డారు.

రమ : ఆయనే కేసు కొట్టించేశారండి.

నారా : ఒక్క క్షణం ఆగండి. చిన్నబ్బాయిగారెవరు?

రమ : అదే! చిన్నబ్బాయిగారినే యెరగరా అండి తమరు!

నర : ఆయన మా వూళ్ళో పెద్దమోతుబరి అండి.

రమ : ఆయన ధర్మమా అని మేం యింతకాలం ఖులాసాగా బతికాం బాబయ్యా!

నర : (రమణయ్యతో) దాచడం యెందుకు? నిజం చెప్పేద్దాం.

రమ : తప్పేముంది? చెప్పేద్దాం,

నర : అయ్యా! అసలు రహస్యం చెప్పేస్తున్నాం తమకు.

రమ : చిన్నబ్బాయిగారు తమ పిల్లల్ని తమ బంధువుల పిల్లల్ని మా దగ్గరకే ట్యూషనుకు పంపిస్తారండి.

నర : తమ దగ్గర దాచడమెందుకు? నెలకో యాభై రూపాయలు యిస్తారు.

రామ్మూ : (అమాంతంగా కుర్చీలోంచి పైకి లేచి) హారి మీ యిలు బంగారం కాను! ట్యూషన్లు చెబుతున్నారా? ట్యూషన్లు!!

రమ : చిత్తం బాబయ్యా! చిత్తం!

రామ్మూ : యింకా భయం లేకుండా "చిత్తం" అంటున్నావ్? యీ యిద్దరి పేర్లూ చెప్పండి ముందు. ట్యూషన్లు చెప్పకూడదని మేం ఆర్డర్లు జారీచేస్తూవుంటే మీరు చెబుతున్నారా?

నర : చెప్పకపోతే ఛస్తామా బాబయ్యా?

రమ : తమరిచ్చే గ్రాంటుమీద ఆధారపడితే.........

నర: మేం యేనాడో అక్షయపాత్ర పుచ్చుకోవలసిందే బాబయ్యా!

రామ్మూ : (గద్దిస్తూ) ముందు మీ పేర్లు చెప్పండి. మీ సంగతేమిటో తేలుస్తాం.

నారా : రామ్మూర్తి గారూ! కూర్చోండి. వాళ్ళు చెప్పేది పూర్తిగా విననివ్వండి.

రమ : (సంతోషిస్తూ) తమరు నూరేళ్ళు వర్ధిల్లాలి!

నర : అధికార్లు తమరే వినకపోతే యికమా మనవి యెవరు వింటారు బాబయ్యా.

రమ : మేం ఉభయులం కలిసి తమకు ఒక అర్జీ పంపించాం బాబయ్యా.

నారా : ఎప్పుడు పంపించారు?

నర : అబ్బో! యెప్పుడోనండి! నాలుగు నెలలవుతుందండి.

రమ : తమ దగ్గరనుంచి జవాబు రాలేదండి.

నారా : మాకు అందితే వెంటనే జవాబు యిచ్చేవాళ్ళం. యేమంటారు రామూర్తి గారూ?

రామ్మూ : అంతేనండి మనకేమీ అందలేదు.

రమ : సరిగ్గ అదే తాలూకు కాపీలు తీసుకువచ్చాం బాబయ్యా!

నర : ఒకటీ రెండూ కాదు. ముఫ్ఫై కాపీలుతీసి అందరికీ పంపించాం బాబయ్యా!

రమ : (జేబులోంచి కాగితంతీసి) చదివి వినిపిస్తాను. తమరు శ్రద్ధగా వినాలి.

నారా : చాలా పెద్దదిలావుందే!

నర : (తన జేబులోంచికూడా కాకితంతీసి) యెంతో సేపు పట్టదు బాబయ్యా. చకచకా చదివేస్తాం.

రామ్మూ : (కలం టేబులుమీద పారేసి) యిక యీ బడ్జెట్ యీ వేళకు తెములినట్టే!

రమ : (చదువుతూ) 'అయ్యా, మేము యీ గ్రామములో వినయవిధేయతలతో పని చేయుచున్నాము. మా బడిలో పిల్లల సంఖ్య పెంచితిమి! (తల పైకెత్తి) యిక్కడ అక్షరాలు జారిపోయినై. నరసయ్యగారూ! మీ కాపీ చూడండి.

నర : (చదువుతూ) 'బడిని సర్వవిధముల అభివృద్ధికి తెచ్చితిమి.'

రమ : (చదువుతూ) ఇది యిట్లుండ విషాదకరమైన సంఘటన జరిగినది. గ్రామ పెద్దలు మా ఉభయులను రాజకీయ సుడిగుండములోనికి ... (అక్షరాలు వెతుకుతూ వుంటాడు.)

నర : (వెంటనే అందుకొని) నెట్టిరి. మా చిన్న తలలపై పెద్ద భారమును పెట్టిరి. ఎన్నికలు ముగిసినవి. కోపతాపములు పెరిగినవి. సాధుజనులు మూలపడిరి. రౌడీలు చెలరేగిరి.

రమ : (చకచకా చదువుతూ) 'కర్రలు పైకి లేచినవి. బుర్రలు చితికినవి. కొట్లాటలకు రాకపోకలు పెరిగినవి.'

నర : (చదువుతూ) మేము ప్రాణములు గుప్పిటపెట్టుకొని ఒదిగి కూర్చుంటిమి. రౌడీలు తోడేళ్ళ గుంపువలె మా బడిపైని పడుచున్నారు.'

రమ : (చదువుతూ) 'మేము ఉద్యోగ ధర్మమును సక్రమముగా నిర్వర్తించలేకపోవుచున్నాము. మాకు ప్రాణభయము మిక్కుటముగా నున్నది. మా బడి చుట్టూ పోలీసు కాపలా పెట్టించగలందులకు వినయవిధేయతలతో వేడుకొనుచున్నాము

ఇట్లు : విధేయులు : వెంకటరమణయ్య; అప్పల నరసయ్య.'

[యిద్దరూ కాగితాలు నారాయణుడు యిస్తారు.]

నారా : వూళ్ళో పెద్దలెవరూ కలగజేసుకోవడంలేదా ?

రమ : లేదు బాబయ్యా! పెదమహారాజులంతా పట్నంలో మకాం పెట్టేసి వ్యవహారం నడిపిస్తున్నారు.

రామ్మూర్తి : (సీరియస్‌గా) యేమండోయ్ పంతులూ! మేం యిలాంటి వ్యవహారాల్లో కలగజేసుకోడానికి వీల్లేదు. మీరు పోలీసు స్టేషనుకుపోయి రిపోర్టు చేసుకోండి.

నర : బాబ్బాబు! అలా అనకండి చచ్చిపోతాం.

రమ : మా రిపోర్టుకంటే మీ రిపోర్టుకే విలువ వుంటుంది బాబయ్యా!

నర : అసలే మేం కష్టాలలో వున్నాం.

రమ : మా వుసురు తగల నివ్వకండి బాబయ్యా.

రామ్మూర్తి : ఓహో! శాపనార్థాలు కూడా పెడుతున్నావ్!!

నర : తమరు దయచూపాలి.

రమ : అన్ని కష్టాలూ ఒక్కసారే వచ్చిపడ్డాయి బాబయ్యా.

నర : గర్భదరిద్రులం బాబూ.

రమ : తినడానికి పూరిగా తిండి లేదు. కట్టుకోడానికి సరైన వస్త్రంలేదు.

నర : తలదాచుకోడానికికొంపకూడా లేదుబాబయ్యా!

రమ : మేం యిద్దరంఒకకొంపలోనే వుండేవాళ్ళమండి.

నర : ఆ యిల్లు మొన్నటి వర్షాలకు.........

రమ : (మధ్యలో అందుకొని) మా యిల్లు కూలిపోయింది బాబయ్యా!

నారా: నన్ను కొంచెం మాట్లాడనివ్వండి—మీ యిల్లు కూలిపోయినందుకు నేను చాలా విచారిస్తున్నాను. కాని మా యిళ్ళుకూడా నేడో రేపో కూలడానికి సిద్దంగా వున్నాయ్. మీరు యిక..

రమ : (వెంటనే అందుకొని) రెండు మాటలూ చెప్పెయ్యనివ్వండి బాబయ్యా!

నర : మా యిల్లు కూలిపోయింది. తలదాచుకోడానికి మా గ్రామస్థులెవరూ మాకు చోటు యివ్వలేదు బాబయ్యా.

రమ : ఇవ్వలేదంటే వాళ్ళ తప్పేమీ లేదండి. మాకు చోటు యిస్తే వెంటనే రౌడీలు వచ్చి వాళ్ళ యింటిమీద పడతారని భయమండి.

నర : మేం వెళ్ళి మునసబుగారి కాళ్ళమీద పడ్డామండి.

రమ : ఆయనకు కనికారమూ వుంది; భయమూ వుందండి.

నర : బందెలదొడ్డిలో ఒక ఖాళీ వరండా మాకు యిచ్చారండి.

రమ : అక్కడే వుంటున్నాం బాబయ్యా.

శేఖ : బందెలదొడ్డి అంటే ?

నర : మనుషులు నేరంచేస్తే జైల్లో పెడతారండి.

రమ : అలాగే దూడలు, పశువులు నేరంచేస్తే బందెలదొడ్డిలో పెడతారండి.

నర : బందెలదొడ్డి అంటే అదేనండి.

[దూరాన్నుంచి దగ్గరగా నినాదాలు వినిపిస్తాయి. డబ్బాలో డబ్బులు వేసి గలగల లాడిస్తున్న శబ్దం వినిపిస్తూ వుంటుంది — "ఉపాధ్యాయుల సంఘానికి-జై!"—"ఉపాధ్యాయులు - వర్ధిల్లాలి." "అణా ఉద్యమం—వర్ధిల్లాలి"— అందరూ ఆత్రుతగా కుడివైపు చూస్తూ వుంటారు. నినాదాలు దూరంగా పోతాయి]

నారా: యేమిటది ?

రమ : కొత్త ఉద్యమం బాబూ!

నర : మేం ఎన్నో విజ్ఞప్తులు చేసుకున్నాం.

రమ : అధికారులు మా జీతాలు సరిగా పెంచలేదు బాబయ్యా.

నర : మా దరిద్రం రోజురోజుకూ పెరిగిపోతోందండి.

రమ : మా స్థితి ప్రజలకు తెలియజెయ్యడం కోసమే యీ కొత్త ఉద్యమం బాబయ్యా.

[వెంటనే రమణయ్య, నరసయ్య తమ భుజాలకు వున్న సంచులలోనుంచి చెరొక గిన్నె పైకి తీస్తారు.]

నర : ఇవి అక్షయ పాత్రలండి.

రమ : ఇది అసమ్మతి తెలియజేసే ఉద్యమమండి. ఒక అణామాత్రం వేస్తేచాలు.

నర : (రామ్మూర్తితో) బాబయ్యా! తమరొక అణా వేయించండి.

రామ్మూర్తి: అమాంతంగా (పైకిలేచి) పోతారా? బయటకు గెంటించాలా? జీతాలు చాలవట! బడిలో చదువు చెప్పరు. ఊరినిండా ట్యూషన్లు. ప్రయివేట్ చదివిన కుర్రాణ్ని పాస్ చెయ్యడం.

గ్రాంటుకు గ్రాంటూ కొట్టేస్తున్నారు పైగా బోల్డంత రాబడి! యింకా జీతాలు చాలవట.

రమ: తమరెవరు బాబయ్యా? అలా పూరికే ఇదైపోతున్నారు?

నర: (నారాయణను చూపిస్తూ) ఆ మహారాజును చూడండి. ఎంత ఓర్పో! ఎంత సహనమో!

రమ: (నారాయణతో) మా పూరి వ్యవహారాలన్నీ తమకు యింకా వివరంగా చెబుతాం బాబయ్యా!

రామ్మూర్తి: (గద్దిస్తూ) పోతారా? పోరా? మర్యాదగా వెళ్ళకపోతే బంట్రోతుతో గెంటిస్తాను.

నారా: కూర్చోండి రామ్మూర్తిగారూ!

నర: (వెంటనే అందుకొని) రామ్మూర్తి గారంటే తమరా బాబయ్యా?

రమ: తమరి కీర్తి దిశలు వ్యాపించింది బాబయ్యా!

నర: తమరిగురించి మేం బోల్డు సంగతులు విన్నాం.

రమ: దక్షిణ లేందే పని చెయ్యరని...

నర: రోజుకు ఐదు రూపాయలైనా కంటమూస్తేగాని ఇల్లు చేరరని...

రమ: పెట్టుకున్న అర్జీలను చింపి పారేస్తారని...

నర: గ్రాంటు బిల్లులలో తప్పు అంకెలు వేస్తారని...

రమ: టెండరని రప్పిస్తారని...

నర: బైరాగుల్లాంటి బడిపంతుళ్ళను నిలువునా దోచుకుంటారని...

రామ్మూర్తి: (కోపం పట్టలేక కుర్చీకర్ర తీసి) ఆగు! ఆగు! యేమిటా కూతలు?

[రామ్మూర్తి కుర్చీకర్ర పట్టుకొని వాళ్ళను అదిలిస్తాడు. రమణయ్య, నరసయ్య తొందరగా కుడివైపు పోతూ వుంటారు.]

రమ: (వెళిపోతూ నారాయణతో) సెలవిప్పించండి బాబూ!

నర: మమ్మల్ని మరిచిపోకండి బాబయ్యా.

[ఇద్దరూ నిష్క్రమిస్తారు. రామ్మూర్తి కోపముతో చూస్తూ వుంటాడు. శేఖరం తలవంచి రాస్తూ వుంటాడు]

నారా: కూర్చోండి రామ్మూర్తిగారూ!

రామ్మూర్తి: (కూర్చుంటూ) మీ మంచితనమే మా కొంప తీస్తోందండి.

[తిరిగి ముగ్గురూ పనిలో నిమగ్నులవుతారు— తెర.]


ఒక

రాలే

మీకు వుండడం

గర్వకారణం







రాలె

# కలగూరగంప

## నాగరికత

శ్రీ నాగభూషణం

సంఘ జీవనము సమస్త ప్రాణికోటిలో కన్పించే సహజలక్షణం. బలీయమైన అవసరంకూడా. స్వజాతికి సంబంధించిన జీవులన్నీ ఒక కూటమిగా జీవించడం మనం తిలకిస్తూ ఉంటాం. కాకులు ఒక కూటమిగా, భ్రమరాలొక కూడికగా, మత్తేభములు మరొక కూటమిగా ఉండటం మనం దృష్టాంతములుగా పేర్కొనవచ్చును. పైన పేర్కొనిన "స్వజాత్యాకర్షణ" మానవునిలో కూడ ఉండే సహజ లక్షణం. ప్రయోజనం దృష్ట్యా, సంఘజీవన ఆవశ్యకతను, మానవుడు మరింత గుర్తించాడు. పరస్పర సహాయ సహకారాలే మానవ జీవితాలను సుఖప్రదం చేస్తాయి. పై లక్ష్యం సుసాధ్యం కావాలంటే మానవుడు తప్పనిసరిగా కొన్ని నియమ నిబంధనలను అనుసరించవలసి ఉంటుంది. కాలగమనంతోపాటు మానవజీవితావసరాలు పెంపొందుతూ ఉంటాయి జీవితావసరాలను సాధించే ప్రయత్నములో నాగరికత పురోగమిస్తూ ఉంటుంది. జీవితం మరింత సుఖవంతము చేసుకోవాలనే తీరని కాంక్ష, కళాతృష్ణ నాగరికతా పురోభివృద్ధికి ఆధారభూతాలు.

నాగరికతకు ఒక రూపాన్ని ఆపాదించి, ఆ ప్రత్యేక రూపమే "నాగరికత" అని ఇదమిత్థంగా తేల్చి చెప్పడం కష్టం. జాతి, జాతికీ, దేశదేశానికి మధ్య నాగరికతా స్వరూప స్వభావాలలో వైవిధ్యం ఉండి తీరుతుంది.

వారి వారి, నైసర్గిక పరిస్థితులు, కళాదృష్టి, అవసరాలు, అభిరుచులు, నైతిక దృష్టుల ప్రభావపరంగా, నాగరికతా స్వరూప స్వభావములలో వైవిధ్యం ఉంటున్నది. ఇందుమూలముగా ఒక జాతి లేక ఒక దేశ నాగరికతే ఉదాత్తమైనదని నిర్ణయించడం కష్టం. ప్రయోజనం దృష్ట్యా, కళదృష్ట్యా, ఒక నాగరికత, ఉత్కృష్టత సాపేక్షంగా మాత్రం, నిర్ణయించవచ్చును. ఈ విధంగానైనా ఒక నాగరికత ఉత్కృష్టతను నిర్ణయించే సమయములో, వారి వారి నైసర్గిక పరిస్థితులు, అవసరాలు, అభిరుచులు, నైతిక దృష్టులను, మనం దృష్టిలో ఉంచుకోవలసి ఉంటుంది. మానవుని "భౌతిక సాధన, సంపద, మేధ"లనే నాగరికత అని స్థూలంగా నిర్వచించవచ్చును

ప్రస్తుతం మనం నాగరికతగా పరిగణించే విషయాన్ని రెండు భాగాలుగా విభజించవచ్చును. (1) భౌతిక నాగరికత (2) అభౌతిక నాగరికత.

### భౌతిక నాగరికత

పంచేంద్రియాలద్వారా గ్రహింపబడునది భౌతికము. మానవ నిర్మితమైన భౌతిక సాధనే. "భౌతిక నాగరికత" గృహనిర్మాణము, వస్త్రోత్పత్తి, ఆహారోత్పత్తి వగైరాలను మనం దృష్టాంతములుగా పేర్కొనవచ్చును. మానవావసరములు రెండు రకములు (1) మూలావసరములు (2) కల్పితావసరములు. మూలావసరములు జీవించుటకు తప్పనిసరి అయినవి. ఆహారము, నీళ్ళు, గాలి వగైరాలను మూలావసరములుగా పేర్కొనవచ్చును. వస్త్రధారణ, గృహావాసము వగైరాలను కల్పితావసరములుగా పేర్కొనవచ్చును. కల్పితావసరములు లేకున్నను మానవుడు జీవించగలడు.

మానవప్రయత్న ప్రమేయం లేకుండా ప్రకృతి ప్రసాదితమైన ఆహారముతోనే ఆదిమానవుడు జీవించేవాడు. కాలగమనంతోపాటు ఆహారపు కొరత యేర్పడినది. ఆ కొరతను తీర్చుకొనుటకు మానవ ప్రయత్నాన్ని మేళవించి, ప్రకృతిని వినియోగించుకోవలసి వచ్చింది. ఈ విధంగా మూలావసరసాధనే నాగరికతా పురోభివృద్ధికి ప్రథమ సోపానమైనది. కల్పితావసర సాధన సంపత్తే నాగరికతకు ద్వితీయ సోపానము. జీవితాన్ని

మరింత సంతోషదాయకం చేసుకోవాలనే తీరని కాంక్ష, కళాదృష్టి, అభిరుచి, వగైరాలు, నాగరికతను ద్విగుణీకృతం చేసే మూలసూత్రాలు.

ఈ విధంగా పురోభివృద్ధి పొందుతున్న భౌతిక నాగరికతకు పరాకాష్ఠ అంటూ ఉండబోదు.

## అభౌతిక నాగరికత

అభౌతిక నాగరికతను మరల రెండు విభాగములుగా చేయవచ్చును. (1) నైతిక నాగరికత (2) మేధాత్మక నాగరికత.

## నైతిక నాగరిక

మానవుడిలో కొన్ని మూలలక్షణములు అంతర్భూతమైయున్నవి. అవి ఆకలి, కామం, క్రోధం, స్వార్థం వగైరాలు. ఆది మానవుడు నియమ నిబంధన బద్ధుడు కాకుండా పై లక్షణములకు బానిసగా ప్రవర్తించేవాడు. ఆ ప్రవర్తన ఫలితంగా అతడు అనేక కష్టనష్టములను యెదుర్కొనవలసి వచ్చినది. జీవన క్లిష్టతకూడా యేర్పడినది. జీవిత సక్రమగమనానికై అతడు కొన్ని నియమనిబంధనలకు బద్ధుడు కావలసివచ్చింది. ఆదిమానవుడు క్షుధాగ్నిని తీర్చుకోవటానికి, నిర్దిష్టమైన పద్ధతి అంటూ లేక, తోచిన మార్గము తొక్కేవాడు. కామతృష్ణను, వావివరసలు లేక, సమయాసమయములు లేక తీర్చుకునేవాడు. కేవలం మూలకోర్కెలను తీర్చుకోవటమే ప్రధానాశయంగా ఆదిమానవుడు ప్రవర్తిల్లాడు. పైన పేర్కొనిన మానవ సహజలక్షణములను అదుపాజ్ఞలలో బంధించి ప్రవర్తించటమే నైతిక నాగరికత.

## మేధాత్మక నాగరికత

ఈ సృష్టి అనంతమైన సమస్యలతో కూడుకొని ఉంది. కొల్లలుగా క్రొత్త సమస్యకూడా ఉద్భవించవచ్చును. జలములోని భూతములెవ్వి? ఒక వస్తువును పైకివిసరిన క్రిందకే యెందుకు పడవలె? లాటి అనేకానేక సమస్యలకూటమే ఈ విశ్వం. మానవుడు వాని మేధస్సును వినియోగించి సమస్యలను పరిష్కరిస్తూ ఉంటాడు. భౌతికా భౌతిక సమస్యాపరిష్కరణే మేధాత్మక నాగరికత అని పిలువబడుతుంది.

## కీ. శే. ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు



సుప్రసిద్ధ దేశభక్తులు, సాహిత్య విద్యా విశారదులు, వైజ్ఞానిక ప్రచారకులు సంఘసేవాధురీణులు శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు ఈ సెప్టెంబర్ 25 వ తేదీ గురువారం రాత్రి పరమపదించిన వార్తను పాఠకులకు అందజేయవలసి వచ్చినందుకు చాలా విచారించుచున్నాం. నాటికి వారివయస్సు 81 సంవత్సరాలు. ఉన్నవదంపతుల కార్యక్రమానికంతకూ రంగస్థలమైన గుంటూరు పట్టణమందే ఆయ దేహం చాలించారు. వారిధర్మపత్ని లక్ష్మీబాయమ్మగారు మరణించి ఇప్పటికప్పుడే 12 సంవత్సరాలైంది.

'మాలపల్లి' రచనతో లక్ష్మీనారాయణగారు ఆంధ్రనవలా సాహిత్య ప్రపంచానికి ఒక వెలుగుబాటను చూపించారు. భాషావిషయకంగా ఆంధ్ర వాఙ్మయంలో అది ఒక మహావిప్లవం. 'మాలపల్లి' నవలను ఢిల్లీ సాహిత్య పరిషత్తువారు దేశీయభాషలన్నిటిలోకి తర్జుమా చేయించుచున్నారు. ఈ నవల సినిమా రూపంలో మనకు దర్శనమిచ్చే భాగ్యం త్వరలోనే లభించవచ్చు. ఈ వార్ధకదశలోకూడా ఆయన కలందించకుండా సాహిత్య సేవచేస్తూ వుండటం ఆశ్చర్యకరమైన సంగతి. తిక్కనపై వారు ఒక మహాగ్రంధాన్ని రచించి మెరుగుదిద్దుతూ వున్నట్లు చెప్పుకుంటున్నారు.

స్త్రీ విద్యారంగంలో స్త్రీ పురోగమనరంగంలో ఆ దంపతుల కృషి అజేయమైనది. 'శారదా

నికేతన నిర్వహణకు ఆ దంపతులు తమ సర్వాన్ని త్యాగం చేసుకొని కృతార్థులైనారు. పండు ముసలితనం వచ్చేసినా పుణ్యపురుషులైన వారి నిర్యాణం ఏ ఆంధ్రునకైనా విచారాన్ని కలిగించకమానదు

పూర్ణ పురుషత్వం సిద్ధించుకున్న వారి ప్రతిభా సంపత్తికి జోహారులు.

# ఉద్యోగము - వివాహము

## శ్రీ వేదుల నరసింగరావు

మన భారతదేశములో దినదిన ప్రవర్ధమానమగుచున్న సమస్యలలో నిరుద్యోగ సమస్య, కన్యావివాహ సమస్యలు రెండును ముఖ్యమైనవి. ఈ నూతన యుగములో మానవునకు వుద్యోగము దొరకుట యెంత కష్టమో కన్యకు వివాహము చేయుట కూడ యంత కష్టమే. మన హైందవవివాహములో మానవుని పాపములు పెరుగుచున్నటులే వరకట్నములుకూడ పెరుగుచున్నవి.

తలిదండ్రులు తమ పుత్రుని విద్య పూర్తియగు వరకే తమ బాధ్యత యున్నదనుకొనుట పొరపాటు. కుమారుని భావిజీవితమునకు సరియైన దారి చూపువరకు తలిదండ్రులకు బాధ్యతయుండునని తెలిసికొనలేక పోవుచున్నారు. ఇది యిట్లుండ ధనాశగల తలిదండ్రులు కుమారునకు ఉద్యోగము లేకపోయినను "విద్య-వివాహము" అను మాటలను సార్థకము చేయునటు వివాహముకూడ చేయుదురు. ఇంక ఆ యువకుని గతి వీధులలో తిరుగు కుక్కలకన్న హీనమగును. అందు నేటికాలమున వివాహమయిన అనతికాలమునకే పిల్లలుదయించుట సహజమయినది. ఇంక యింటివద్ద భార్యారత్నము చీరలు, స్నో పౌడరు వగైరాలకు చేయు యల్లర్లు మిక్కుటముగా యుండును. ఇది చూచిన తలిదండ్రులు భార్యాపిల్లలను పోషించలేని యప్రయోజకుడను విషశూలములవంటి మాటలనుట సహజము.

తనుమాత్ర మేమిచేయగలడు. తన సిగరెట్లు వగైరాలకే విత్తములేనపుడు తక్కినవాటి కన్నిటి కెక్కడవచ్చును.

ఆవిధముగ నుండుట తనకుమాత్రము యిష్టమా? తన్ను శక్తివంచనలేక వుద్యోగమునకు వీలైనన్ని దరఖాస్తులు (Applications) పంపుచునేయుండును. కాని ఫలితము శూన్యము. ఒకవేళ "యింటర్వ్యూ"కు పిలిచిన వెళ్ళుటకు ముఖ్యముగా నార్థిక యిబ్బందులు అడ్డువచ్చును. లేక భార్యవద్దనే బంగారపువస్తువులో యమ్మి యింటర్వ్యూకు వెళ్ళినను, వాడు పొడవు చాలదనో, వయస్సు చాలదనో ఏదోయొక సాకు చెప్పి పంపివేయుట తథ్యము. పోనీ పదిరూపాయలు కట్టి సర్వీసుకమీషను పరీక్షకు వెళ్ళినా వెళ్ళుటయే కాని తిరిగి జవాబు శూన్యము. ఈమధ్యను మన యాంధ్రదేశములో యార్థికయిబ్బందులు లెక్కువగుటచే మన యార్థికామాత్యులవారు పన్నిన యుక్తికూడ మనము కొనియాడవలసినదే! పూర్వమీ సర్వీసుకమీషను పరీక్షకు మార్కుల నిబంధన యుండెడిది. ఇప్పుడు మార్కులు హైనలు కృతార్థులైనవారందరిందు కర్హులేయని క్రొత్త చట్టము పెట్టిరి. ఇందువలన ప్రభుత్వమువారికి సంవత్సరమునకు కొన్ని లక్షల ఆదాయము వృద్ధియగుచున్నదికదా!

ఇంక ఆడపిల్లలనుగన్న తలిదండ్రుల గతి మరీ శోచనీయముగ నున్నది. అందును మధ్యతరగతి ప్రజల (Middle Class people) లో గల కన్యాదాతల గతి చెప్ప నలవిగాకున్నది. మీకు మాత్రమా సంగతి తెలియదా! ఒకప్రక్క కుమార్తె వివాహవిషయమును, మరొకప్రక్క ఆర్థికమర్యాదలకును లోబడి చాలా కష్టముపడుచు బ్రతికుండుటకన్న మరణమే మేలనుచున్నట్లున్నారు.

నేటికాలమున పెళ్ళిచూపులనునది యింటర్వ్యూలకన్న కఠినముగా యున్నవి. చివరకు కట్నము చాలదనో, లాంఛనములు చాలవనో లేక పిల్ల నల్లదనో, పాటలు రావనో ఏదోవిధమైన సాకుచెప్పి తప్పుకొనుచున్నారు. మరి వరుడు మాత్రము మానవుడు కాడా? మానవుడై పుట్టినతరువాత నెవరికిమాత్రము తప్పులుండవు?

ఇట్టి మన మధ్యతరగతి ప్రజలకష్టములను జూచి మన గవర్నమెంటువారు "వరకట్న నిషేధ" చట్టమును తయారుచేసినారు. కొద్దికాలములో యీ చట్టము పూర్తిగా యమలులోనికి రాగలదు. అప్పటికైనను మన కష్టములు తీరగలవో లేదో!

# గ్రంథవిమర్శనము



## స్వార్థత్యాగము

రచన: శ్రీ వెలికంటి వేంకటరామశర్మ, ఆంధ్రాధ్యాపకుడు, గాంధీ స్మారక బహుళార్థసాధకోన్నత పాఠశాల, నందికొట్కూరు. వెల: 0-8-0.

మేవాడ రాణాలలో నొకడైన రాజసింహునకు భీమసింహుడని జయసింహుడని యిద్దరు కొడుకులు. భిన్నకళత్రముల కొకే నాడు కొంచెము ముందు వెనుకలుగ వీరు జన్మించిరి. భీమసింహుడు పెద్దపట్టమహిషికి పుట్టినవాడు. అప్పటి రాణాలలో పట్టమహిషికి ముందుగా పుట్టిన శిసువు పాదమునకు రాజు పోయి కవచమును గట్టుట యను ఆచార మొకటి యున్నదట. ఆ శిసువే పిమ్మట రాజగును. ఈ యాచారమునకు భిన్నముగా రాజసింహుడు చిన్న భార్యయందలి మమకారముచే జయసింహుని కాలికిఁ గవచమును గట్టివచ్చెను. జయసింహుడు రాజుకాబోవుట విని పట్టమహిషి రాజు కడకు వచ్చి భీమసింహుని జ్యేష్ఠతను రాజ్యార్హతను నిరూపించి రాజును ధర్మాభిముఖముగ ప్రబోధించెను. రాజు పశ్చాత్తప్తుడై భీమసింహునిఁ బిలిపించి జయసింహునిఁ జంపి రాజ్యమును దీసికొనవలసినదని యాదేశించెను. భీమసింహుడు విరక్తుడై రాజ్యమును తమ్మునకు విడిచి యడవులకుఁ బోయెను. ఇది యింపలి వస్తువు. రచన చక్కగా నున్నది. శైలికి—

తక్కక తండ్రి యాన తలఁ దాల్చుటయా! మఱి
రిత్తపుచ్చుటా!
నిక్కము నాదు హస్తమున నిండు ముదంబున
ఖడ్గమొప్ప వే
ఱొక్కఁడు రాజ్యపీఠమున నుండుట సంభవమా ని
య్యైన వే
వక్కడ జెప్పఁజేటు తగవు వందఱి ముందఱఁ గాన
పోయెదన్.

సోదరుఁ జంపఁ బాపమని చూడకు రాజ్యము రక్త
పంకిలో
త్పాదితమౌను వీరునకుఁ; బాత్రిక కర్మములో రహ
స్యమున్
గాదనఁబోకు నన్ను ఘనకల్మషపంకమునందు
ముంచి నిం
పాదిగ నుండఁ గోరకు మహాఘమవంతయు నన్నె
చేరకున్.

## ఆహ్వానము

రచన: శ్రీ వానమామలై వరదాచార్యులు; దేశోద్ధారక గ్రంథమాల. ప్రచురణము 28; 2844, ఇమాంబావివీథి, సికింద్రాబాదు. వెల: సభ్యులకు 1-31 న. పై. ఇతరులకు 1-50.

'ఆహ్వానము' అనే యీ సంపుటంలో అరవై తొమ్మిది శీర్షికలున్నాయి. వీనిలో 'ప్రతాప ప్రశంస' 'వల్లభభాయి స్మృతి' 'కాళోజికి' అనేవి పద్యశీర్షి


ప్రముఖపత్రికలూ, ప్రఖ్యాతసాహితీవరులూ ప్రశంసించిన

**ఉత్తమ గ్రంథాలు**

1. సంజప్రణయం: హాస్యంతో, వ్యంగ్యంతో నిండిన పదికథలూ, గల్పికలు. రచన: పూషా: వెల 0-50న.పై.
2. పారిజాతం: కథల సంపుటి. కథకులు: దాగంటి సోమయాజులు; రాచకొండ విశ్వనాథశాస్త్రి; పంతుల శ్రీరామ శాస్త్రి; పురాణం సుబ్రహ్మణ్యశర్మ; బొమ్మిరెడ్డిపల్లి సూర్యారావు; హితశ్రీ; పూషా; అంగర వేంకట కృష్ణారావు; ఇచ్ఛాపురపు జగన్నాథరావు; ఈరంకి వేంకటరావు; పూసపాటి కృష్ణంరాజు వెల రు 1-25 న. పై.
3. తెరమెరుగులు: (నాటికల సంపుటి) కుక్కపిల్ల దొరికింది (రావికొండలరావు); దొంగ (పోతుకూచి సాంబశివరావు); తెల్లవారింది (హితశ్రీ); తెరమరుగు పీడలు (కొండముది శ్రీరామచంద్రమూర్తి); త్రీంకు ప్రత్యేకం (అంగర సూర్యారావు). వెల రు 1-50 న. పై.

శోభా ప్రచురణలు, విజయనగరం సిటీ.

కలు. మిగిలిన వన్నీ గేయశీర్షికలు. ఈ గేయశీర్షికల్లో ముప్ఫైమూరు, గాంధిగారిని ఉద్దేశించినవి. 'రైతు రాజు' అనేది గేయనాటిక. ఇందులో పొలం దున్నటం మొదలుకొని, ధాన్యరాసులను ఇంటికి తీసికొనిపోవటంవరకూ గల కర్షక జీవితంలోని వివిధ దశలూ వర్ణింపబడినవి. ఇక 'పంచశీల' 'బుద్ధగీతి' 'నవంబరు 1 వ తేదీ.' 'పతాక వందనం' 'రాజప్రముఖుడు నైజాం' 'గ్రామోద్ధరణం' మొదలైన రాజకీయ వస్తు రచనలూ వున్నాయి. 'వైష్ణవగీత' మనేది 'నరసీ మెహతా' అనే భాగవతుడు పాడినదానికి అనువాదం. ఇది గాంధీగారి పారాయణంలోనిదని కూడా తెలుస్తున్నది. అది యిలా మొదలవుతుంది.

వాడే వైష్ణవుడు, దయగల
వాడే వైష్ణవుడు............
పరులపీడ గుర్తెఱిగిన, నర, సో
దరుడే వైష్ణవుడూ............అని.

'మనవి' అనే శీర్షికలో స్వవిషయం కొంత తెలుస్తున్నది.

వచ్చినటులు నేను వండి వడ్డించితిని
అదియె నేదిని తన్మయానంద మందితిని
ఓపినంతగ, రుచిగ, నుంచ కష్టించితిని
కోప మేటికి? వంట కుదుర లేదని యనిన
నా పాక మే మంచి నలపాకమని యనను
ఎవరెవరి రుచులిందు ఎటువంటివో యేమొ
అవని, నందఱి దనుప నజుని వశమే కాదు—

అంటూ, తమ కవితాపాక నిర్మాణాన్ని గూర్చి కవి, స్వాభిప్రాయం వెల్లడించారు. ఈ సంపుటంలో వున్న శీర్షికల వైవిధ్యాన్ని పట్టి భిన్నరుచియైన జనాన్ని ఆరాధించడంకోసం, కవి చేసిన ప్రయత్నం గోచరిస్తూనే వున్నది.

ఈ శీర్షికలలోనే రుచిభేదాన్ని గూర్చి ప్రస్తావిస్తూ; వీరు—

పుండపై వ్రాలెడు పురుగటేగ యొకండు
తీపివిరులన్ వ్రాలు తేనెటీగ యొకండు
పాలు నీరును వేఱుపఱచు హంస యొకండు
మోమోటమునకునై మంచి మురిపించొకడు
వెన్ను చాపైనంత వెక్కిరించు నొకండు—

అంటూ, లోకస్వభావాన్ని వివరించారు. నిజమైన కవులు ఈ బాదరబందీపట్టించుకోరు. కనుకనే వీరు—

వెలుగు నీడల వోలె వెనుకముందులు నడచు
నిందాస్తుతుల కొక్క వందన మొనరింతు —

అన్నారు. ఈ నిర్లిప్తతతోపాటు—

మాలిన్యమును కడిగి బాలు ముద్దుల కలరు
తలి యాదోషజ్ఞ తల్లజునకు నమస్సు

అనడంలోని వినయమూ—

సుతివిన్న యపుడు నామతిలోని యజ్ఞాన
మరసి గర్వమునోటి కందకుందును నేను—

ఈ వివేకమూ—

నింద విన్నపుడు నా యందున్న గుణజాల
మూహించి దైన్యమృత్యువు గెల్తును నేను—

అని చెప్పుకోగలిగిన ఆత్మప్రత్యయమూ, వుండడం ప్రశంసనీయమైన విషయం! ప్రతిభ కేం? అది దైవమిచ్చినంత వుంటుంది. పైవి, కవిమాత్రు లెల్లరూ అలవరుచుకోవలసిన సల్లక్షణాలు, మాత్రం అవును.

పిలిచిన బైతె జామల తోట కెళ్ళితిని
చిలుకపలుకని తెలిసి సిగ్గొచ్చి మళ్ళితిని
కనుచుండె పొదచాటు కన్నె లేడియొ! లేక
నను గేలిసేయంగ నక్కి యుండెనొ తనే!

మొదలైన చోట భావస్పర్శ—

ఆఱవేసిన చీరలవోలె
తూలుపుట్టన అవులు తోచె—

సరస ప్రపంచ సాహిత్తి

1. సాలీడు సందేశం(శ్రీ ఇ. బి. వైట్ వ్రాసిన పిల్లల బొమ్మల నవల (క్రౌన్ 1/16-210 పుటలు)
అనువాదం : శ్రీ బి.వి.సింగరాచార్య రు. 1-50

2. ప్రపంచ కథావళి (రిప్ వాన్ వింకిల్ మొదలైన జగత్ప్రసిద్ధ జానపద కథలు.)
(క్రౌన్ 1/16-180 పుటలు
అనువాదం : శ్రీ బి,వి,సింగరాచార్య రు. 1-25

3. ఎర్రగుర్రపుపిల్ల (విఖ్యాతి అమెరికా రచయిత శ్రీ జాన్ స్టయిన్ బెక్ వ్రాసినపిల్లలమనస్తత్వం చిత్రించె నవల-(క్రౌన్ 1/16-194 పుటలు)
అనువాదం: శ్రీ బి. శ్రీనివాసాచార్యులు రు. 1-50

పుస్తకాలషాపులవారికి 25% కమీషన్.

కళ్యాణీ ప్రచురణలు,
విశాఖపట్టణం - 3.

..........................

తూరుపు అబట్టు దుమ్ము గ్రేలో, నిను జూచి
మబ్బులో చందప్పు. మన చేల, ఁగిరిచ్చి—

ఈ మొదలైన చోట ఊహారమ్యత, గోచరిస్తున్నాయి. "ప్రతాప ప్రశంస" అనే శీర్షికలో వీరు వెలిబుచ్చిన ఒక అభిప్రాయాన్ని యిచ్చట పరామర్శించటం అవసరం.

కవులు పూజ్యము మీ తెలంగాణసీమ
వనెడి దుష్ప్రథ మా పుటకలరించి—

ఆ అన్నవాళ్ళెవరో తెలియనివారై వుంటారు.

ప్రతిభ అనేది దేశకాల నియంత్రితం కాదు గదా!

వీరు పోతనగారి జీవితమును వస్తువుగా స్వీకరించి కావ్యమొనరించినట్లూ, తద్రచనా ప్రసక్తివల్ల ఆ ప్రాంతంలో "అభినవపోతన" బిరుదాంకితులుగా ప్రసిద్ధులైనట్లూ, ఈ సంపుటి పీఠికవల్ల తెలుస్తున్నది.

అది బయటికివచ్చి వీరి సమగ్రశక్తిని అవగాహన చేసికోగల అవకాశాన్ని ఆంధ్ర రసజ్ఞులకు కల్పించుగాక యని ఆశింప.

## రక్తాక్షి

శ్రీ సోమసుందర్: ప్రతులకు: ఉదయశ్రీ. కళాకేళీ పబ్లికేషన్స్ సామర్లకోట. తూర్పు గోదావరిజిల్లా. వెల: తెలియదు.

'రక్తాక్షి' ఖండకావ్య సంపుటిలో మూడు భాగాలున్నాయి. మొదటి భాగంలోనివన్నీ 'అభ్యుదయ' ధోరణిలో ఖండకావ్యాలు. రెండవ భాగం


# గ్రంథకర్తలకు, ప్రచురణకర్తలకు విక్రేతలకు

# ప్రత్యేక సదుపాయములు!

మన దేశంలో గ్రంథప్రచురణ చాలా వెనుకబడివుంది. ప్రచురణసంస్థలు విరివిగా లేక చాలామంది గ్రంథకర్తలు తమ గ్రంథాలు తామే అచ్చువేసుకుని అమ్ముకుంటున్నారు. ఉన్న కొద్ది ప్రచురణసంస్థలకు కూడా వీ శేషలాభాలు వుండటంలేదు. ప్రచురణావకాశాలు ఇలా వుండటంచేత వైజ్ఞానిక ప్రచారంకూడా చాలా వెనుకబడిపోతున్నది.

**భారతి** కేవలం వైజ్ఞానిక ప్రచారానికి యేర్పడిన వ్యవస్థ. గ్రంథప్రచురణను ప్రోత్సహించే తలంపుతో, గ్రంథముల ప్రకటనలకు సంబంధించినంతవరకు తన ప్రకటన రేట్లు తగ్గించుకుని కొంత సదుపాయం చేస్తున్నది.

ఈ అవకాశాన్ని వినియోగించుకోదలచిన గ్రంథకర్తలు, ప్రచురణకర్తలు, విక్రేతలు ఈ దిగువ చిరునామాకు వ్రాసి ఈ ప్రత్యేక సదుపాయపు రేట్ల వివరములు తెలుసుకొనవచ్చును.

**అడ్వర్టైజ్‌మెంట్ మానేజర్, భారతి**

7, తంబుచెట్టివీధి, మద్రాసు-1

కూడా ఇలాగే సాగిపోతుంది. మూడవభాగం పద్య నాటికా(భ్రాంతి గొలిపే ఖండకావ్యసముదాయం.

మొదట భాగంలోని ఖండికలు చాలావరకు 'అభ్యుదయ' రచనలు. రెండవభాగం మూడవ భాగం కొంత నూతనపంథాలో సాగాయి. మూడవ భాగంలో శీర్షికానుగుణంగా అక్కడక్కడ అభ్యుదయ ధోరణి కనిపించినా ప్రాచీనార్షసంప్రదాయాలు, ఆదర్శాలు, ఎక్కువగా ప్రత్యక్షమౌతూంటాయి.

ముఖ్యంగా ఈ భాగంలో రచయిత కొత్తరకాల ఛందస్సులు వాడి అవి చాకచక్యంతో నిర్వహించారు. దీనికి క్రింది రచన తార్కాణ. ఇది 'విప్లవం' అనే శీర్షికలోని రచన.

'తనయులను కొంచి మన
మనసులు చలించినవి
జనముల విషాదకర
వినిన హృదయమ్ముల్
కదలినవి శోకమున
................
కినిసినవి శౌర్యమున
వణకు భువనమ్ముల్ !"

దీనిమీద అభిప్రాయం వెలిబుచ్చిన శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారన్నట్లు ఈ కావ్యంలోని గూఢార్థం చాలా దుర్గూహంగా ఉన్నది. అనిర్ణీతములు, అస్పష్టములు అయిన సాంకేతికపదాలు వాడడమే ఈ అస్పష్టతకు కారణం. ఎంతో సహనంతో పరిశీలిస్తే తప్ప ఈ రచన అంతరార్థం బయటపడడం కష్టం.

ఈ కావ్యం రచయితకు గల ప్రాచీనాధునాతన భావాల మీది అభిమానం నిగూఢంగా వ్యక్తం చేస్తున్నది. అయితే ఇది అభ్యుదయదృక్పథం అభిమానించే రచన.

'శాస్త్రి'

ఉపయోగమైన సరిక్రొత్త పుస్తకములు
వ్యవసాయము – ఇంజనీరింగు, వైద్యము, నగైగా అనేక గ్రంథములు. కేటలాగు ఉచితము. ఇంగ్లీషులో వ్రాయండి.
N.K Paul & Sons, Post 12202, Calcutta-5.

## నా టి కా గు చ్ఛ ము

శ్రీ సి. రామకృష్ణరావు. టీచర్, జయ్‌హింద్ సెకండరీస్కూల్. మచిలీపట్నం. వెల: ఒక రూపాయి.

దీనిలో 1 అడివి పువ్వులు, 2 ప్రాత క్రొత్తలు 3 స్నేహఫలం, 4 అనుకోని ఆనందం, 5 బాలభటుడు అని 5 నాటికలున్నాయి.

ఈ రోజుల్లో పాఠశాలలో విద్యార్థులు ప్రదర్శించడానికి అనువయిన చిన్న చిన్న నాటికలు చాలా స్వల్పంగా ఉన్నాయి.

అంతగా వ్యయ ప్రయాసలు లేకుండా స్వల్ప వ్యవధిలో విద్యార్థులు సులభంగా ప్రదర్శించుకోడానికి అనువయిన నాటికల గుచ్ఛమిది.

## పు ర మ ం ది ర ము

శ్రీ సి. రామకృష్ణరావు, టీచరు. జయ్‌హింద్ సెకండరీస్కూల్. మచిలీపట్టణం. వెల: ఒకరూపాయి.

ఇది సామాన్య విద్యార్థులే కాక తదితరులుకూడా ప్రదర్శించడానికనువయిన సాంఘిక నాటకం. దీనిలో రచయిత సందర్భానుసారంగా పద్యాలే కాక పాటలు కూడా చేర్చారు. గ్రామసేవాభిలాష, కళాభిమానము మున్నగు విషయాలపై అభిమానం పెంపొందించే లక్ష్యంతో ఈ చిన్న నాటక రచన సాగింది.

## నీవు—నేను

శ్రీ గోటేటి సత్యనారాయణమూర్తి. నంద్యాల. వెల లేదు.

ఇది ప్రాంజలి, ప్రార్థన, ప్రియతముడు మొదలయిన 15 ఖండకావ్యాల సంపుటి. దీనిలో కథాఖండకావ్యాలుకూడా ఉన్నాయి.

ఈ కావ్యాలలో అంతటా ధారాశుద్ధి, సంస్కృతాంధ్ర పాండితి, సంప్రదాయ విజ్ఞానము అనన్యూతంగా గోచరిస్తున్నాయి.

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad.

# కొంగ్రొత్త ప్రచురణలు →

ప్రతి యింట వుండవలసిన గ్రంథాగార
మునకు మరికొన్ని క్రొత్త గ్రంథాలు.
చౌక ధరలలో మంచి పుస్తకములు.

**లోగడ ప్రచురణలు** ↓



రు. 2.00 రు. 4.50 551 పేజీలు





రు. 2.75



రు. 1.25



రు. 1.50



రు 1.50



రు. 1.00

మీరు మామూలుగా కొను
పుస్తక వ్యాపారి వద్ద ఈ
శ్రేష్ఠమైన పుస్తకములు
కొనండి. లేనియెడల ఈ
క్రింది చిరునామాకు
వ్రాయండి:—



రు. 1.50



రు. 1.50



రు. 2.50

కథలు, నాటకాలు, యాత్రా గాథలు -

## సదరన్ లాంగ్వేజిస్ బుక్ ట్రస్ట్

**3, పైక్రాఫ్ట్ రోడ్, మద్రాసు-31.**

పై పుస్తకములు అన్నీ అనేక ప్రత్యేక ప్రచురణ కర్తలవి. లాభకాంక్షలేని సదరన్ లాంగ్వేజిస్ బుక్ ట్రస్టు వారి ఆధ్వర్యాన ప్రచురించబడినవి.

ప్రపంచమును అవగాహన చేసుకునేం →





# భారతి

సాహిత్య మాసపత్రిక



నవంబరు 1958

వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## నవంబరు 1958



# 1893 నుంచి జలుబులకు

# అమృతాంజనము

ఇప్పటికి మూడు తరాలనుంచీ
అమృతాంజనం జలుబులనుండి
శీఘ్రమైన విముక్తికోసం
వాడబడుతున్నదని అంద
రికీ తెలిసిన విషయమే.






అమృతాంజన్ లి., మద్రాసు 4. మరియు బొంబాయి 1. కలకత్తా 7.

AL.57.2 TEL.

ప్రతి ఆదివారం రాత్రి 6-30 గం॥ లకు 41 మీటర్లమీద రేడియో సిలోన్‌లో దక్షిణ భారతభాష లన్నింటిలో వెలువడే ప్రోత్సాహిక కళాకారుల ప్రోగ్రామ్, అమృతాంజలి వినండి.

# మహాత్మ స్మృతి

## శ్రీ కందుకూరి రామభద్రరావు

ఓయి మహాత్మ! నీవొక మహోన్నత పర్వతరాజ మట్లు, భ
ద్రాయితమూర్తివై భరతధాత్రిని నిల్వగ, సర్వమానవుల్
పోయిన సత్తువల్ తిరిగి పొంగులువెట్ట, భవత్ప్రబోధనం
ధాయిత చిత్తవృత్తుల విదల్చిరిగా పరదాస్యశృంఖలన్.

బోసినోరొక నవ్వుపొల్చు వెలార్చినా
పండువెన్నెల యెదల్ నిండిపోయె
పల్కులు జడిగట్టి పైకి వర్షించెనా
అమృత ప్రవాహంబు లంత బారె
కరుణాకటాక్ష వీక్షణములు పరగినా
సతత స్వహృదయవసంత మెసఁగ
ధైర్యహేమాచల దర్శనంబబ్బెనా
మంటి ముద్దల వీరమణులు పుట్టె

అవని పులకింప నీవొక్క యడుగుపెట్ట
మానవాంభోధి జయఘోష మారుమ్రోగ
ధర్మ సంస్థాపనార్థ పథంబువట్టి
పుడమిమెట్టిన యవతారమూర్తి వీవు.

ప్రేమకు వచ్చె నీయెడద పెంపునఁ గోమల నవ్యకాంతి, నీ
నేమపు బాటలో నలిగి నిష్ఠయె నూతన పుష్టిగాంచె, గా
రాముగ నీవుకే లొసఁగ రాచరికంబు వహించె శీల, మే
మేమొ వెలుంగు గుంపులకు నేలిక లయ్యె భవత్కటాక్షముల్

శిథిలపర్ణకుటీర చిరనిరంతరదుఃఖ
ఖిన్నుల కన్నీరు కేలఁదుడిచి
పరదాస్యశృంఖలాబద్ధ నిస్పృహులకు
హృదయగహ్వర తేజ మెసఁగద్రోచి

# భారతి

అజ్ఞాన తిమిరసీమాంతరాంతరముల
మినుకు దివ్వెలు నిల్పి మేలు కనిపి
రక్తసంసిక్త సామ్రాజ్యరాజ్ఞీకరాం
భోజముల్ ప్రేముడులొ్వసి కడిగి

నవ్యనాగరక ప్రసన్నతలనడుమ
తొలగు జీవితమూల్యంబు నిలువబెట్టి
చన్న నీ స్థితప్రజ్ఞకు స్తవనమేడ
నరుల గుండెలలో కృతజ్ఞతలు దక్క

కానియు లేదు నీకయినఁగాంచన వర్షము నీయధీన, మె
ద్దానికి లేదు నీవిభుత, తాల్పె ప్రభుత్వమె నీదు నాజ్ఞ, లీ
మానవకోటికిఁ శిరసు మండన మయ్యె భవచ్చరిత్ర, వ్యా
ఖ్యానము గీతకున్ బ్రదుకు; కారణజన్ముఁడవయ్య ధాత్రిపై

తూరుపుద్వారమందుఁ బరితోషణ తోరణకాంతిపుంజముల్
దీరిచి, మంగళధ్వనులు దిక్కుల బర్వ స్వరాజ్యలక్ష్మికిన్
భారతనారులు న్నరులు పట్టముగట్టిరి పండువృద్ధవై
వారలనమ్రశీర్షములపై వెదజల్లితి మందహాసముల్

పిచ్చికిఁగూడఁ గొంతగ వివేకము కన్పడు; బుద్ధి యెంతక
మ్మెచ్చున లాగినన్ విడదు మీమహిమోజ్జ్వలమూర్తి లోపలన్
చిచ్చఱరవ్వలన్ బఱప చేయెటులాడెనో! గుండెనిల్పెనో!
చొచ్చె తమస్సు నీ వరుగ; శోకము నిండె సమస్త లోకమున్.

మానవమనోంబరంబున మార్గదర్శ
కంబుగ వెలుంగు ధ్రువతారగా మహాత్మ!
పలు శతాబ్దులు నిల్చెదు; పాణిపద్మ
ములు మొగిడ్చి నమశ్శతమునుఘటింతు.

# స్వర్గీయ శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ

## శ్రీ ఆమంచర్ల గోపాలరావు

కత్తి పట్టుకొని జయించడమో, లేక స్వర్గం చూర గొనడమో వీరలక్షణం అని సామాన్యుల అభిప్రాయం. కాని ఆయుధాలన్నీ విసర్జించి, మనోబలంతోనే సాయుధుల నెదిర్చి స్థైర్యంతో నిర్జించడం నిజంగా మహాయోధ లక్షణం. గాంధీజీ మొటమొదటగా లోకానికి కనువిప్పు కలిగించి ఈ విషయమే వెల్లడి చేశారు. ఆ రీతిగానే అనేక మంది యోధులు మన దేశంలో నిరంకుశాంగ్లేయ బలాన్ని ఎదిరించి సాధక జీవను లయినారు. ఈ మహాయోధ బృందంలో, ఎవరికీ తీసిపోని మహనీయుడు మన ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులు.

ఆయనతో మాట్లాడుతున్నప్పుడుగాని, వ్యవహరిస్తున్నప్పుడుగాని ఉన్నవవారి వీరలక్షణం వెంటనే స్ఫురించదు. అనేక ఛలోక్తులతో, అనుక్షణం తోడి వారిని నవ్విస్తూ, మహా విలాస పురుషునివలె కనిపించే వారాయన. అయినప్పటికీ, వారి జీవితపంథాలో అసలు విలాసానికే తావులేదనీ, సంకల్పించిన మహాకార్యాన్ని గురించే అనుక్షణము ఆలోచించేవారనీ, త్వరలోనే స్పష్టమవుతుంది. ఇది మహా వీరలక్షణమని వేరే చెప్ప నక్కరలేదు. గాంధీమహాత్ముని ధీరధోరణికూడా ఇటువంటిదే. ఇట్టి మహాయోధుల సాంగత్యంలో రోజులు రోజులే నిమిషాలుగా గడిచిపోతాయి. జరపవలసిన కార్యక్రమ మేదయినా ఎదురయితే అదెంత మహా తిరమైనదైనా అతి తేలికగాను, సునాయాసంగాను జరిగిపోతుంది. అందుచేతనే, ఎంతటి గొప్ప కార్యక్రమం తలపెట్టినా లక్ష్మీనారాయణగారు తన శిష్యబృందసహాయంతో అదంతా అవలీలగా నిర్వహించేవారు.

ఉన్నవలక్ష్మీనారాయణగారి ప్రథమ సందర్శనం నేనెన్నడు మరిచిపోలేను. గుంటూరులో ఆనాడు Y. M. L. A అని ఒక చిన్న క్లబ్బు ఉండేది. ఆ క్లబ్బులో ఆనాడు ఉత్సాహవంతులైన యువకు లందరు సభ్యులే. లక్ష్మీనారాయణగారు తమ కారాగార వాసం పూర్తి చేసి తిరిగి గుంటూరు వచ్చేవారు. ఆ క్లబ్బుకు ఆయన కూడా రోజూ వచ్చేవారు. సహాయ నిరాకరణోద్యమంలో చదువు మానివేసిన నేను మళ్ళీ గుంటూరు టౌను హైస్కూలులో ప్రవేశించాను. ఖద్దరు బట్టలు వేసుకొని గాంధీ టోపీ పెట్టుకొని సాయంత్రం కాగానే ఒకనాడు నేనా క్లబ్బుకు వెళ్ళాను. లక్ష్మీనారాయణగారు ఒక కుర్చీ మీద కూర్చొని అందరితోను ముచ్చటిస్తున్నారు. ఆయన ఏవో చెబుతున్నారు. అవి వింటున్న అందరితోబాటే ఆయన కూడా నవ్వుతున్నారు. వారిని నేను వెంటనే గుర్తుపట్టాను. కాని దగ్గిరికివెళ్ళి మాట్లాడే ధైర్యం కలగలేదు. ఆయన నన్ను చూచి ఒక్కసారి పకపకా నవ్వారు. నన్ను దగ్గిరికి పిలిచి, భుజం మీద చెయ్యి వేసి, 'ఏం చదువుతున్నా'వని అడిగారు. 'అయిదో ఫారం' అన్నాను. మళ్లీ నవ్వారు. "ఏం! గాంధీ టోపీ పెట్టుకుంటే మీ హెడ్‌మాస్టరు నిన్ను స్కూలుకు రానిస్తున్నారా?" అని అడిగారు. "రానిస్తున్నారండీ" అన్నాను "కాదులే. మా ఏకాంజనేయులి వెళ్ళగొట్టారులే" అని తిరిగి నవ్వారు. నిజంగా, మహాత్ముని ఆదేశంకన్నా, ఇట్టి వీరపుంగవుల కార్యకలాపాలే స్వరాజ్య పథక ప్రథమ సోపానాలై ప్రజలను ప్రోత్సహించాయి. నాడు గుంటూరులో పెద్దమనుష్యులన్నవారంతా ఖద్దరుతప్ప మరొకటి ధరించేవారు కారు. ప్రతి శిరస్సు గాంధీటోపీ అలంకరించేది. ఆనాటినుంచి, దాదాపు ప్రతిదినం నేను వారిని కలుస్తూనే ఉండేవాణ్ణి. ఎప్పుడూ, నవ్వుతూ నవ్విస్తూనే మాట్లాడుతూండేవారు. కాని ప్రతిపదంలోను దేశపరిస్థితులు, మన బానిసత్వం, త్యాగావశ్యకత ప్రతిధ్వనిస్తూ ఉండేవి.

అప్పటికే గుంటూరుజిల్లాలో సత్యాగ్రహోద్యమం ఆలవాటయింది. చీరాలలో దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు, పెదనందిపాడులో కొండా వెంకటప్పయ్యగారు, పలనాడులో ఉన్నవ లక్ష్మీనారాయణగారు నాయకత్వం వహించారు. పలనాటిగడ్డ

లక్ష్మీనారాయణగారికతి ప్రియమయినది. పల్నాటి వీరచరిత్రను గూర్చి, బాలచంద్రుని గురించి మాటిమాటికీ వారెంతో ఉత్సాహంగా ప్రసంగించేవారు. బాల చంద్రుణ్ని గూర్చి ప్రసంగించే సమయాలలో నవ్వు వారి ముఖాన్ని అలంకరించేదికాదు. కళ్లు మెరిసేవి. ఒక ఆవేశంతో దేహమంతా వణికిపోయేది. ఆ రోజుల్లో దేశస్వాతంత్ర్య సమరానికి అట్టి వీరు లెంతో మంది అవసరం. అట్టి వీరుల గడ్డలోనే సత్యాగ్రహ సమరానికి ఉన్నవ లక్ష్మీనారాయణగారు నాయకత్వం వహించారు. యావద్భారత దేశంలోను ప్రప్రథమంగా నిర్బంధింపబడి, కారాగారానికి వెళ్ళినది శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులు.

కార్యకలాపాల్లో, క్లిష్టపరిస్థితుల లేర్పడినప్పుడే ఆయన గొప్పతనం బయటపడేది. మొదట, సహాయ నిరాకరణోద్యమంలోనే, ఆయన గొప్ప తనం బయలుపడింది. చీరాల, పెదనందిపాడు, పలనాడులలో సత్యాగ్రహం ప్రారంభించారు. నిరంకుశులైన బ్రిటిషువారు ఆ ఉద్యమాన్ని లెక్క చెయ్యలేదు. కళ్లుమూసుకొని కొంతకాలం గడిపితే, ఆ ఈ ఉద్యమం దానంతట అదే సమసిపోగలదని వారాశించారు. కాని లక్ష్మీ నారాయణలాంటి వ్యక్తులావిధంగా జరగనీయలేదు. శత్రువులను రెచ్చగొట్టి, రచ్చకీడ్చిస్తేనే జయం. కాని బ్రిటిషువారిని రెచ్చగొట్టడం సామాన్యమయిన కార్యంకాదు. లక్ష్మీ నారాయణగారు ఆలోచించి ఆలోచించి అటవీసత్యాగ్రహం మొదలు పెట్టించారు. వీరుల గడ్డ అయిన పల్నాడులో ఇది బాగా పాకింది. బ్రిటీషువారిక ఉపేక్షచేయడానికి వీలులేదు. నాయకులనందరిని వెంటనే నిర్బంధించడం మొదలుపెట్టారు. ఆనిర్బంధాలు ప్రజలను మేలు కొలిపాయి. వారు స్వరాజ్యావసరం గుర్తించారు. సహాయనిరాకరణోద్యమం జయించింది. కాని మహాత్మాగాంధీ ఆ ఉద్యమాన్ని అంతటితోనే ఆపివేశారు.

ప్రథమ కారాగారవాసం పూర్తి చేసుకొని తిరిగి రాగానే లక్ష్మీనారాయణగారు ఒక దివ్యకార్యక్రమం తలపెట్టారు. బహుశః ఖైదులోనే ఈ కార్యక్రమాన్ని గూర్చి బాగా ఆలోచించారని తోస్తుంది. ఆయన, వారిసతీమణి లక్ష్మీబాయమ్మగారు, శారదా నికేతనానికి పునాదులు వేశారు. ఊరి చివరన ఒక పెద్ద స్థలం. అందులో పాకలు. దేశ స్వాతంత్ర్యం కొరకు పోరాడినవారే ఉపాధ్యాయులు. విద్యార్థినులు బాలికలు. ఆనాడు స్కూళ్ళలో వారికి సరియైన శిక్షణలేదని, సరియైన శిక్షణ గలిగిన స్త్రీలు స్వరాజ్యోద్యమానికి ఎంతయినా తోడ్పడతారనీ లక్ష్మీనారాయణగారి అభిప్రాయం. శారదానికేతనం ప్రారంభించినప్పటినుంచి గుంటూరులో కాంగ్రెసు బలం బాగా ఇనుమడించింది. ప్రతి కార్యక్రమానికి శారదానికేతనం బాలికల సాహాయ్యం అనంతంగా ఉండేది మన స్వాతంత్ర్య సమరంలో ఆంధ్రదేశము అందులోను గుంటూరుజిల్లా ముందంజ వేశాయంటే దానికి శారదా నికేతనం ఒక ప్రబల కారణం అనాలి. గతసంవత్సరం వెన్నెలకంటి వీర రాఘవయ్యగారు ఢిల్లీలో మన రాష్ట్రపతి రాజన్ బాబుతో ప్రసంగించారు. భారతదేశంలో స్వదేశోద్యమం అనేది ఒక్క ఆంధ్రలోనే నడిచిందని రాజెన్‌బాబు ఆ ప్రసంగంలో అన్నారట. ఆంధ్రలో కాంగ్రెసు ఉద్యమం ప్రజల ఉద్యమంగా రూపొందించడానికి శారదానికేతనం ఎంతో సాహాయ్యం చేసింది. దీనిలో అతిశయోక్తిలేదు.

ఆరోజుల్లో కాంగ్రెసువారు ఏర్పాటుచేసే ప్రతి సభకు శారదా నికేతన విద్యార్థినులు వచ్చేవారు. అతిరసవంతంగా జాతీయ గీతాలు పాడేవారు. ప్రజల కెంతయినా ఉత్సాహం కల్పించేవారు. ఇంతేకాదు. కాంగ్రెసు తలపెట్టిన ప్రతిచిన్న కార్యక్రమానికి ధనం కావాలికదా! నేటివలెకాక, నాడు కాంగ్రెసు చాలా బీద సంస్థ. నికేతన బాలికలు జాతీయగీతాలు పాడుతూ అందరి ఇళ్లకు వెళ్ళి కావలసిన ధనం పోగు చేసేవారు. నిజంగా శారదానికేతనం ఆనాడు గుంటూరు జిల్లాలో కాంగ్రెసు సంస్థ బీదరికాన్ని పటాపంచలు చేసింది.

1930 వ సంవత్సరంలో జరిగిన సత్యాగ్రహోద్యమానికి గుంటూరులో జీవంపోసి పెంచినది ఉన్నవ లక్ష్మీనారాయణగారే అని చెప్ప వచ్చును.

ఆ ప్రారంభోత్సవ మెన్నడు మరచిపోలేము. పెద్ద స్వరాజ్య ప్రభ కట్టించారు. ఇరువదినాలుగు ఎద్దులు కట్టిన బండిమీద ప్రభ నిలబెట్టారు. ఉన్నవ వారి శిష్యులు శ్రీ నాదెండ్ల క్రిష్టయ్య, మొదలయినవారు ఆప్రభ కెదురుగా నిలిచి, లక్ష్మీనారాయణగారు

# స్వర్గీయ శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ

రచించిన దండకం, బుర్రకథ చదువుతూ, అశ్వరథ, అశ్వరథ అని నినాదాలతో జనాన్ని ఉద్రేకపూరితులుగా చేస్తున్నారు వెనక రెండు వేలమంది స్వచ్ఛంద సేవకులు బారులుతీరి నిల్చున్నారు. ముందు తప్పెటలు, తాళాలు, ఇంకా అనేక వాద్యాలు. గుంటూరి జనమంతా ఆ ఉత్సవంలో పాల్గొన్నారు. ఆవిధంగా మొదలయిన ఆ ఉద్యమానికి జయం తప్పదనే భావం అక్కడ ఉన్నవారందరికీ కలిగింది.

అది ఒక పెద్ద ఊరేగింపు. మేమంతా గుంటూరు కలయదిరిగి కోనేరు దగ్గిరకి చేరుకున్నాము. దాదాపు రెండువందలమంది శారదా నికేతన బాలికలు మాకెదురయినారు. వారివెంట మరో లక్షజనం ఉన్నారు. "వీరగంధము తెచ్చినారము, వీరు లెవ్వరో తెల్పుడీ! పూసిపోదుము మెడను వైతుము పూలదండలు భక్తితో!" అనేపాట ముక్తకంఠంతో పాడుకుంటూ మాకెదురయినారు. ప్రతి స్వచ్ఛందసేవకునికీ తిలకం పెట్టారు. ఎర్ర గంధం పూశారు. మెడలో ఒక పూలమాల వేశారు. ఆ దృశ్యం చూడవలసినదే కాని వర్ణింప నలవికానిది. వీర రసం ఆనాడు మహా సముద్రంవలె పొంగింది. అప్పుడు ఊరేగింపులో వచ్చిన ప్రతి వలంటీరు అనేకమారులు లాటీ చార్జీలకు గురి అయినాడు. జైలుకు వెళ్లాడు. కాని ఎవ్వరు క్షమాపణ ఇచ్చి వెనుదిరుగలేదు.

మన స్వరాజ్య సాధనలో, శారదా నికేతనం ఎంతో ఉపకరించిందనడంలో అతిశయోక్తి లేదు. ఆ ప్రకారం అత్యుత్సాహంతో ప్రారంభించిన ఆ సత్యాగ్రహోద్యమం, జయప్రదం కావడానికి కూడా లక్ష్మీనారాయణగారే ముఖ్యకారకులని చెప్పకతప్పదు. ఆనాడు దాదాపు రెండు వేలకు మించిన వలంటీరుబృందమంతా యడవల్లి వారి సత్రంలో మకాం చేశారు. రోజూ పికెటింగు చేసేవారు. సమావేశాలేర్పాటుచేసి ప్రచారం చేస్తూ ఉండేవారు. ప్రతిరోజూ క్రొత్తవారు వచ్చి స్వచ్ఛందసేవకులుగా చేరేవారు. రోజు రోజూ ఆ సంఖ్య పెరిగి పోతున్నది. ఆనాడు కాంగ్రెసు అతి బీదసంస్థ. ఎన్ని రోజులు గడిచినా ఎరెష్టులు లేవు. ఊరికే కేకలు వేసి శిబిరమే మూసివేయవలసి వస్తుందా అనే భీతికూడా నాయకులలో మొలకెత్తింది. కాని వెంటనే లక్ష్మీనారాయణగారొక క్రొత్త ప్రణాళిక సూచించారు. దానితో గుంటూరుజిల్లాలో కాంగ్రెసు జయం స్థిరమయింది.

మొట్టమొదట ముప్పయిమంది యువకులను ఏరారు. శ్రీ గౌస్ బేగ్, శ్రీ మంత్రవాది వెంకటరత్నం, శ్రీ తూములూరి శివరాము, శ్రీ అన్నాప్రగడ కామేశ్వరరావు, నేను ఇంకా మరికొంత మందితో కలిసి లక్ష్మీనారాయణగారి ఆజ్ఞను వహించి దేవరంపాడు వెళ్ళాము. అక్కడకూడా గుంటూరులో లాగానే, మూడు నెలలనించి, మూడువందలమందితో కాంగ్రెసు శిబిరం నడుస్తున్నది. నిర్బంధాలు లేవు. మేము వెళ్ళి ప్రభుత్వాన్ని ప్రజలను రెచ్చకొట్టాలి. మేము దేవరంపాడులో పదిహేనురోజులపాటు ప్రతి రోజు లాటీఛార్జీ ఎదుర్కొన్నాము. మమ్మల్ని ముళ్ళకంపలలోకూడా పడవేసి ఈడ్చారు. చివరకు జనంలో కోపాగ్ని చెలరేగింది. బళ్లకొద్దీ ఉప్పు తీసుకువచ్చాము. అక్కడ ఆ నెలలో మూడువందలకు పైగా నిర్బంధాలు జరిగాయి.

ఇంకొక విషయం: గుంటూరు పరిసర ప్రాంతాలలో తాటిచెట్ల సత్యాగ్రహం అనే క్రొత్తప్రణాళిక లక్ష్మీనారాయణగారు ప్రవేశపెట్టించారు. దీనికి బ్రిటిషు దొరతనం తట్టుకోలేకపోయింది. రెండు నెలలయ్యేసరికి గుంటూరులో నయితేనేమి, గుంటూరు జిల్లాలో నయితేనేమి, నిర్బంధాలు రెండు వేలకు పైగా పెరిగిపోయాయి.

అతి క్లిష్ట పరిస్థితులలోకూడా, నిరుత్సాహం పోగొట్టి, ఉత్సాహం కల్పించి, శత్రువులను రెచ్చగొట్టి వారి పరాజయపథకం తయారు చేయడంలో ఉన్నవ లక్ష్మీనారాయణగారు సాటిలేని మేటి.

జైలులో వారితో కలిసిఉండే దినాలుకూడా నిమిషాలలా. గడిచిపోయేవి. ఆయనకు తెలుగు భాషన్నా, తెలుగు దేశమన్నా అతిప్రీతి. ఎప్పుడు తెలుగు కవులనుగూర్చి చర్చిస్తూ ఉండేవారు. మన దేశంలో, బౌద్ధయుగం నాటినుండి ఎన్ని ఉద్యమాలు ప్రజల నావహించాయో సవిస్తరంగా చెబుతూ ఉండేవారు. అనేక ఉత్తమోద్యమాలకు మనదేశం ఆనాదినుంచీ ఆలవాలమయింది. ఎప్పుడూ ఒకక్రొత్త పద్ధతికోసం మనఆంధ్రులు పాటుపడ్డారు. వైదికమతం నుంచి బౌద్ధమతంలోకి మారిపోయారు. అది సరిగా

లేదని మళ్లీ శంకరమతం అవలంబించారు. అంతలో మహమ్మదీయుల తాకిడివచ్చింది. ఆ తాకిడి ఎదుర్కొని మనవారు విచ్ఛిన్నమయినారు. అంతలో బ్రిటిషుపాలన వచ్చింది. తెలుగువాడు తెలుగువాడుగా లేడు. మనకు వేరేరాష్ట్రంరావాలి. కాని అన్నిటికంటె ముందుగా దేశానికి స్వాతంత్ర్యం రావాలి ఇలాంటి ఊహాలన్నీ ఆయన వ్యక్తిత్వ భాగాలే అని చెప్పాలి. ఆయనదగ్గిర చేరిన ప్రతివ్యక్తిని ఈ భావాలావహించేవి. మరి వదిలేవి కావు. నేటి మన ఆంధ్రరాష్ట్రానికి బీజం వేసింది నిజంగా ఉన్నవ లక్ష్మీనారాయణగారే. అందుకు సందేహంలేదు. 1910 వ సంవత్సరంలో నే భాషాప్రయుక్తరాష్ట్రాలు కావాలనే వాదం వారు ప్రవేశపెట్టారు.

1931 వ సంవత్సరంలో అందరూ జైళ్లనుంచి తిరిగి వచ్చారు. లక్ష్మీనారాయణగారికిగాని ఆయన శిష్యులకుగాని అంతటితో తృప్తికలగలేదు. స్వరాజ్య సాధనకు ఇంకా ఎన్నో రకములయిన ప్రణాళికలు కావాలని ఆయన నిత్యము ఆలోచిస్తూ ఉండేవారు.

1936 వ సంవత్సరంలో కాంగ్రెసు ప్రణాళిక మారింది. ప్రభుత్వంలో పాల్గొనాలని కాంగ్రెసు మహానాయకులు నిశ్చయించారు. దేశ స్వాతంత్ర్యానికై నిరంతరంగా పోరాడే మన వీరబృందమంతా, మన దేశంలో ఒక పక్షంగా ఏర్పడింది. లక్ష్మీనారాయణగారికది రుచించలేదు. పక్షం ఏర్పడడం సహజమే గాని ఆపక్షప్రణాళిక సయితం, మన పోరాటాన్ని ముందుకు సాగించే పద్ధతుల ననుసరించాలని వారనేవారు.

అంతలో 1942 వ సంవత్సరం వచ్చింది. ఆ రోజుల్లో లోకమంతా మహాసంగ్రామంలో మునిగి తేలుతున్నది. లక్ష్మీనారాయణగారికి అప్పటికే వయస్సు మీరింది. కాని వారి ఉత్సాహం ఏమీ తగ్గలేదు. ఇక ఉద్యమం వెనుకబడ్డ పల్నాడులో జరపవలెనని వారు ఉద్దేశించారు.

నిజంగా ఆనాడు పల్నాడు బ్రిటీషువారికికూడ ఒక ముఖ్యస్థానమయింది. యుద్ధావసరంవల్ల ఆంధ్ర భాగం నైజాముభాగంతో కలపాలని వారు నిరయించుకొన్నారు. దానికోసం కృష్ణానదిపై తాత్కాలికంగా వంతెన నిర్మించడం మొదలుపెట్టారు. ఆ వంతెనవలన సైనికంగా ఆ రెండుభాగాలు ఏకం కాగలవని వారి అభిప్రాయం.

అక్కడే బ్రిటిషువారిని రెచ్చగొట్టాలి. వీర పలనాటినించే స్వరాజ్యోదయం కావాలి. వారి ఆశయం అది. ఒకనాడు పొద్దున్నే లక్ష్మీనారాయణ పంతులుగారు మా ఇంటికి వచ్చారు.

"గోపాల్! నీవు పల్నాడువెళ్లాలి."

"సరేనండి! పంతులుగారూ! అక్కడ మన శిష్యులెవరైనా ఉన్నారా?"

"దేశసేవ దైవకార్యం! నీవు వెళ్లు. శిష్యులు వారంతట వారేవస్తారు!"

అంతే! అదే వారి సహజధోరణి: సాధారణంగా అనేక ఛలోక్తులతో ఎన్నో విధాల నవ్విస్తున్నప్పటికీ, కార్యంపట్ల ఆయన అతి మితభాషి. వారి ఆజ్ఞలన్నీ సైనికాధికారి ఆజ్ఞలవలె అతిక్లుప్తంగా ఉండేవి.

ఆపైన నేను పల్నాడు చేరుకొన్నాను. తమంతట తామేవచ్చి, అనేకమందిశిష్యులు చేరుకొన్నారు. కాని ఆనాడక్కడ మాకు శత్రువులుకూడా జాస్తి అయ్యారు. పల్నాడు ఆరోజులలో కమ్యూనిష్టులకు ఆటపట్టుగా ఉండేది. మా కార్యక్రమాన్ని భంగం చేయడమే నాడు వారి పరమావధి. కాని లక్ష్మీనారాయణవంటి నాయకులు వారికి లేరు. ఏవిధంగా నయితే నేమి, బ్రిటీషువారికి అలజడికల్గించేతీరులో ప్రజలలో పెద్ద ఆందోళన బయలుదేరింది. అనేకచోట్ల రైలు పట్టాలు లాగివేశారు. వంతెనలు పాడుచేశారు. ప్రజలింకా అనేకంచేశారు.

లక్ష్మీనారాయణగారు, తక్కిన నాయకులతో బాటే మళ్ళీ జైలుకువెళ్లారు.

అంతలో, సుభాష్‌బోసు కృషివల్లనయితే నేమి, గాంధీజీ తపః ఫలితంవల్ల నయితే నేమి, లోకంలో యుద్ధంవలన వచ్చిన క్లిష్ట పరిస్థితులవలన నయితే నేమి మనదేశానికి స్వరాజ్యం వచ్చింది అనేకమంది ఇక మనం చేయవలసిన పని అయిపోయిందనుకొన్నారు.

కాని ఉన్నవ లక్ష్మీనారాయణగారలాగ ఊరుకోలేదు. ఆంధ్రరాష్ట్రం రావాలి. స్వాతంత్ర్య సమరంలో పిన్నలు, పెద్దలు అనేకులు చితికిపోయారు. వారికి దారిచూపెట్టాలి. దేశాభ్యుదయానికి వారిచేత పని

# స్వర్గీయ శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ

చేయించాలి. ఆ రెండు విషయాలు అనుక్షణం లక్ష్మీనారాయణగారి దృక్పథంలో ఉండేవి. ఎప్పుడు వాటి విషయమే చర్చిస్తూ ఉండేవారు. వారు బ్రతికి ఉండగానే ఆంధ్రరాష్ట్రము, సంపూర్ణాంధ్ర రాష్ట్రము సిద్ధించాయి.

కాని స్వాతంత్ర్యోద్యమంలో చితికిపోయిన వీరుల సమస్య, ఆఖరి క్షణంవరకూ వారి దృక్పథంలోనే ఉన్నదని చెప్పకతప్పదు. గత సంవత్సరంలో కూడా ఆయన రాజకీయ బాధితుల సమావేశానికి అధ్యక్షత వహించారు.

ఉన్నవ లక్ష్మీనారాయణగారు స్వర్గస్థులైనారు. నిజంగా అటి వ్యక్తులు మరణిస్తారా? కాని నేడు వారు కీర్తిశేషులే అయినారు. వారు రచించిన కొన్ని ఉద్గ్రంథాలు, వారి స్మృతి తప్ప మనకేమి మిగలలేదు.

ఉన్నవ లక్ష్మీనారాయణగారొక ప్రత్యేక లక్ష్యంతో జన్మించిన మహావ్యక్తులనడంలో అతిశయోక్తి లేదు. లోకంలో క్లిష్టపరిస్థితులు వచ్చినపుడు మానవులంధకారంలో పడి దోవ తెలియక సతమతమవుతున్న సమయాలలో ఇటువంటి మహావ్యక్తులు జన్మిస్తారు. తోవచూపి, సత్యమార్గాన నడిపించి మానవుల్ని తరింపజేస్తారు.

గాంధీ మహాత్ముడు తన మహోద్యమం ప్రారంభించే సరికల్లా లక్ష్మీనారాయణగారివంటి దివ్యమానవులు దేశమంతటా సిద్ధంగా ఉన్నారు. కొండా వెంకటప్పయ్య, కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, బులుసు సాంబమూర్తి, టంగుటూరి ప్రకాశం, డాకర్ సుబ్రహ్మణ్యం, ఉన్నవ లక్ష్మీనారాయణ మొదలైన మహాపురుషులందరు, గాంధీజీ ఉద్యమం కోసమే వేచి ఉన్నట్లు తోస్తుంది. వారందరూ, ఆనాడు తమతమ నిర్ణీత కార్యక్రమాలాచరించి, మన స్వరాజ్యరథాన్ని ముందుకు నడిపించారు. వారంతా అవతరించి ఉండకపోతే మనకసలు స్వరాజ్యమే లభించి ఉండదేమో అని కూడా అనిపిస్తుంది. ఆ స్వాతంత్ర్య యోధులందరూ అమరులు. ప్రాతః స్మరణీయులు. వారికి నా నమోవాకాలు.

# పెద్దమనిషి

## 'మంజీర'

పక్షులు వాటియిష్టం వచ్చినట్టు అల్లరిచేశాయి ఇంకా చీకటి ఉండగానే. మనుషులలాగే వాటికూడా తెల్లవారుతోందంటే ఎందుకో అంత భయమూ దిగులూనూ. తెల్లవారితే తిండికోసం కష్టపడాలన్న ఆందోళనేమో వాటికూడా. ఏమయితేనేం వాటి నిత్యకృత్యం ముగించి మళ్ళీ సంజకెంజాయ రకముందే మెల్ల మెల్లగా నాలుగువైపులా తమ దారి చూచుకుంటూ ఎగిరిపోయాయి.

చలి ద్విగుణీకృత మయింది. ఎంతబలవంతుడినైనా గడగడ వణికించగల పటిమ చూపుతోంది. మంచుకూడా దట్టంగా పడుతూంది. పట్టుమని పదడుగులలో ఉన్న రూపంకూడా కనపడ్డం లేదు. సూర్యుడు చాలా నీరసంగా ఆ మంచులోనుండి తొంగిచూస్తున్నాడు. వీధులంట మనుష్యసంచారం హెచ్చింది.

అప్పటికప్పుడే వెంకమ్మ రోజూ వారి పను లన్నీ పూర్తిచేసుకుని అన్నంకూడా వండేసుకుంది. "నే వచ్చేవరకూ ఉండరా! అబ్బాయీ" అంటూ బుర్రవంచుకుని అడుగుల్లో అడుగులు వేసుకుంటూ బయలుదేరింది.

ముసలితనం తమ్ము వెన్నాడుతోందన్న భయంతో వెలవెలబోతూ వెనుతిరిగి చూస్తున్నాయి ఆమె శిరోజాలు. అస్పష్టంగా ముడతలుపడ్డ ముఖంలోనుండి మిలమిల మెరుస్తున్నాయి ఆమె కళ్ళు. కష్టం ఆమె అవయవాలే ఆవాసం చేసుకుంది. దరిద్రం ఆమెను చుట్టుముట్టేసింది అంధకారంలా. ఆమె తనజీవితాన్ని బాధలకే అంకితం చేసింది.

నడుస్తూండగానే చటుక్కున ఏదో జ్ఞాపకం వచ్చినట్లు హఠాత్తుగా ఆగి ఆ ప్రక్క నేఉన్న పూరిగుడిసెదగ్గిరికి వెళ్లింది. చింకితలుపు లోనవేసిఉన్నట్లుంది. కన్నంలోనుంచి తొంగిచూసింది. కాస్త ఎడంగావచ్చి నిల్చుని "నాగులూ, నాగులూ!" అని గట్టిగా పిలిచింది వెంకమ్మ.

'ఆ! వస్తున్నా పిన్నమ్మా' అంటూ వినిపించింది తరుణకంఠం.

ఆస్వరం అవ్యక్త మధురాలాపనలాగుంది.

రెండుమూడు నిమిషాలకు లోపలనుండి ఊడిపడింది ఓ పధ్నాలుగు, పదిహేనేండ్ల పడుచుపిల్ల. సంస్కారం లేనిజుత్తు. మాసిమరకలుపడి చిరిగిన బట్టలు. విసుగు, వేదనఉట్టిపడేమోము. శరీరావయవాలు చిక్కినా ఏమంత ఆకర్షణీయంగా లేకపోయినా, అన్నీ తిన్నబడితే అందానికేం లోటులేదనిపిస్తుంది. ఆమెలో ఏమూలనుంచో అందం, జిగేలుమని మెరుస్తూంటుంది చీకట్లో మిణుగురులా. ఆమె ముఖం కాస్త కోల. బాగా పాలిపోయిఉంది. చిన్ననోరు, పెద్దకళ్ళు, తిన్ననిముక్కు అందమేమో! లేకపచ్చటి ఆమోటు శరీరపు సౌందర్యమో! ఆమె రాగానే వెలుగు వచ్చినట్లయింది. ఆమెమాటల్లో అపభ్రంశాలు మిగిలిన విశేషాలన్నీ తోసిరాజంటున్నాయి.

"యేమే యెంతసేపయిండేటి నేచి" అంది వెంకమ్మ ఆమెముఖంలోనికి చూస్తూ.

"నేను పిన్నమ్మా. కొంత ఆలిస్సం అయినాది. యేం? యేతన్నా కూలిపనుందా ఏటి."

"యేకూలిపనింక? ఆకోతలు కొత్తా అయిపోయాయి మరి" అని మాట్లాడబోతూ ఊరుకుంది వెంకమ్మ నాగులువైపు దీక్షగా చూస్తూ. నిశ్శబ్దంలో ఓక్షణం గడిచాక "కుప్పనూర్పులు పతీవోడూ, ఆళ్ళకున్న నలుగురుపాలోళ్ళతోటి సరిజూచుకుంటున్నారు. మరింక కూలే" అందిరెట్టించిన నిరాశతో.

"ఆహా" అంది నాగులు దించిన తల ఎత్తకుండానే.

"మరిగంటే మామూల్లా యీయేళ రావా యేం?"

"నా అమ్మకు వంట్లో బాగా నేదు. యెవాగ సెప్పరాడం? మరి రాకపోతే గడవదు."

# పెద్దమనిషి

"మరేం భయం లేదులే మీ అమ్మకు. కొంచెన్నం వండి పడేసి వేగంగా రా మా యింటికి. యీరమ్మ, రాములు, లచ్చిమి, అప్పాయమ్మ యీ గుంటలంతా వత్తారు రోజూనాగే" అంటూ వెనుదిరిగి చూడకుండా వెంకమ్మ వెళ్ళిపోయింది.

నిజానికి నాగులుకి యేం చెయ్యడానికి తోచటం లేదు. ఏదోవిధంగా కష్టపడకపోతే, రోజు గడవటం యెంతకష్టమో నాగులుకి బాగా తెలుసు. ఆమెకు జ్ఞానం రాకపూర్వమే, ఆమె తండ్రి యీ ప్రపంచం వదలిపెట్టాడట. అప్పటినించీ యీతల్లే తన్నింత జేసింది ఈవిషయం తనకు తెలిసినప్పటినుండి ఆమెకు తనతల్లి అంటే యేనో అర్థంతెలీని అభిమానం ప్రేమ. ప్రస్తుతపరిస్థితుల్లో తనూ, తల్లీకూడా కష్టపడినా రోజు గడవటం దుర్ఘటంగా ఉంది.

పని చేయించుకునేవాడల్లా ఎక్కువ ప్రతిఫలం యిస్తున్నానని గోలేగాని ఇచ్చేదాంతో బజారులో యేమొస్తోందో ఎవడికీ అక్కర్లేదు.

ఏది యెలాగున్నా నాగులు యింట్లో పనిచేయని రోజుపస్తే. తల్లి శరీరాస్వస్థతతో నాగులుతలబరువెక్కింది. వెంకమ్మ వాళ్ళతో వెళ్ళడమా లేదా? అన్న ప్రశ్న ఆమె కింకా తలబరువెక్కించింది. ఏమయినా ఆమె తల్లి చెప్పినట్లు "పేదవాడికి పొట్టయుందు". వెళ్ళక తప్పదు.

ఈమధ్య కూలికెళ్ళడం అంటే కష్టమనిపిస్తోంది నాగులికి. శరీరం వంచి కష్టపడి పనిచేయడానికి భయపడి కాదు. తోట కూలీల ప్రవర్తనమూలాన. పనిజేస్తూంటే అస్తమానం తనప్రక్కనే నిలబడుతూ, కళ్ళతో తన శరీరాన్నంతా తడిమి చూసే ముసలి మేస్త్రీని చూస్తే కంఠం కొరుకుదామా అనిపించేదామెకు. పెళ్ళాం ఎదురుగానే తన్ని మాటలతో బాధించి ఆనందించేవాడు మరో కూలివాడు; గంప తనకెత్తికెత్తుతూ పొరపాటున తాకినట్లు మోచేత్తో తనరొమ్ము తాకేవాడు, దున్నపోతులాంటి మరో కుర్రవెధవ. వీళ్ళందరినీ యేంచెయ్యాలో తెలీక కూలిపోయేది. పని చేయకపోతే నిలువునా మాడి చచ్చిపోవలసి వస్తుంది.

తల్లికి చెపితే "అవన్నీ పేదవాళ్ళు తప్పించుకోలేని సాంఘికదౌర్జన్యాలు, కత్తివాయిమీద నడిచినట్లు, యీ జీవితం గడపాలి. ఈ యాతిబాధలన్నీ, అతి నేర్పుతోను ఓర్పుతోను ఎదుర్కోవాలి. పరిస్థితుల్ని మనోధార్ఢ్యాన్ని బట్టి నడుచుకోవాలి. అంతేగానీ, ప్రస్తుత సామాజిక వాతావరణంలో యీ అవినీతి నడవడికను, అసహ్యప్రవర్తనలకు ముక్కుకు సూటిగా ఎదుర్కోడం కష్టం మాటకేమి గాని అసంభవం" అన్న ధోరణిలో ఎంతోచక్కగా చెప్పిందామెకు. ఆమె చెప్పిన విషయాలు చాలా లోతయినవి. జీవితం స్వయంగా చిలికి చేకూర్చుకున్నవి.

నాగులు మనస్సులో తల్లి బోధనలు స్థిరస్థావరా లేర్పరచుకున్నాయి. జీవితం గూర్చి, ప్రపంచంలో నిరాఘాటంగా కొనసాగే చట్టబద్ధమయిన అవినీతుల గూర్చి తన తల్లికి తెలిసినంత యితరుల కెవ్వరికీ తెలీదన్న గాఢ విశ్వాసం ఆమె మనస్సులో పాతుకుపోయింది. తల్లి చెప్పిన మాటలు అమాయకంగా విశ్వసిస్తుంది. అదో అలవాటయింది కూడా.

వెంకమ్మ వెళ్ళాక లోనికిపోయి ఈ విషయం అంతా తల్లితో చెప్పింది. నిజానికి తనకు, ఆమె నాస్థితిలో విడచి వెళ్ళాలని లేదంది. కాని ఆపాటి దానికే నాగులు తల్లి ఒప్పుకుంటుందా? ఆరోజు కూలికి పోకపోతే మరునాడు పస్తు తప్పదని తెలీకపోడం లేనే లేదు. అనేకవిధాల చెప్పి కూలికి వెళ్ళమని ఒప్పించింది నాగులును.

రోజులుమాస్తే కడు నికృష్టంగా ఉన్నాయి. డబ్బున్నా తివ్వేందుకు బియ్యం దొరకడం చాలా దుర్లభంగా ఉంది. ఎక్కడికక్కడే బియ్యంకొరత వినవస్తోంది. దినదినం ప్రజలలో బియ్యాన్ని గూర్చి ఆందోళన ప్రబలుతూంది. ఇదే అదనని అనేకులు అనేకవిధాలుగా బ్రతుకుతున్నారు. డబ్బున్నవాళ్ళు మరీ ధనవంతులవుతున్నారు. ఈ పరిస్థితి అనేకుల అమాయకుల ప్రాణాలు బలిపుచ్చుకుంది.

ఊళ్ళో కూలి లేకపోవడంవల్ల నాగులు, వెంకమ్మ మొదలుగాగల వాళ్ళు ఈ పరిస్థితి ఊతగా తీసుకుని బ్రతుకుతున్నారు. ప్రక్కబస్తీలో దొరుకుతున్న బియ్యం కొని యింకోవూరికి పోలీసుల కంట బడకుండా పట్టుకుపోయి అమ్ముకుంటున్నారు.

అనుకున్న ప్రకారం నాగులు వెంకమ్మ యింటి వద్ద, అందరినీ కలుసుకుంది. ప్రక్క బస్తీకి వెడదామనుకుంటే వెడదామనుకున్నారు. ఏవో ఏవో మాటలు చెప్పుకుంటూ, కిలకిల నవ్వుకుంటూ, దారంట మరేం

జరుగుతోందో తమకేమీ తెలియనట్లు కేరింతాలు కొడుతూ పోతున్నారు. దార్లో నడుస్తూన్న బాటసారులు తమనే హేళన చేసినట్టు మనస్సు చివుక్కుమంటూంటే తీక్షంగా, కోపంగా వీళ్ళవైపు చూసుకుంటూ పోతున్నారు. మధ్యవయస్క కొస్త నరాల నిస్సారణ ఉన్న పెద్దమనుషులు బాహాటంగానే నోరు విడిచి "పోకిరీ వేషాలు! బుద్ధిలేని పాటకపు పీనుగులు!" అని తిట్టుకుంటూ వెళ్ళారు.

ఎవ్వరేమన్నా అనుకున్నా, వినిపించుకోకుండా, లెక్కలేకుండా, నిర్వికారంగా, వాళ్ళు తమ పూర్వానుభూతులు చెప్పుకుంటూ, ఆనంద ఘట్టాలు వినవచ్చినపుడు సంతోషిస్తూ, కొత్త నవ్వు పుట్టించే విషయాలు వినవచ్చినపుడు కొంచెం గట్టిగా నవ్వుకుంటూ, విషాదపరిస్థితులు రూపించినపుడు, విచారంతో మౌనంగా పోతూఉన్నారు.

అలా రైలువచ్చే వేళకు సరిగా రైల్వేస్టేషను చేరుకున్నారు. వెంకమ్మ టిక్కట్లుకోనే కిటికీదగ్గరకు వెళ్ళగానే టిక్కట్లిచ్చే గుమస్తా కనుబొమ లెగరేస్తూ "ఏంముసలమ్మా, యేమిటి ఎంగతి" అన్నాడు మందహాసపూర్వకమయిన ముఖంపెట్టి. వెంకమ్మ ముసలిది మాత్రం కాదు. కాని యౌవనంపొంగే ఆ యువతుల మధ్యఉంటే వెంకమ్మ పడుచుదని ఎవరంటారు.

అయినా వయసులోఉన్న అందాన్ని చూసేసరికి, మూగవాడికికూడా మాటలు పుటకొస్తాయి. అవి వాళ్ళ విలవ ఉపయోగం అంతమాత్రమే నేమో!

వెంకమ్మకు ఎవరికెలా జవాబియ్యాలో బాగా తెలుసును. "నీకు తెలియని దేముందినాయనా!" అంది పాలిపోయిన పెదవులనుండి పేలవమయిననవ్వు జారవిడుస్తూ. ఇతరమయిన ప్రశ్నలేమీ వేయకుండా, ఆ గుమస్తా వెంకమ్మకు కావలసినటిక్కట్లు ఇచ్చేశాడు. వెంకమ్మ అతని బాగోగులు ప్రశ్నించి, వెళ్ళొస్తానంటూ చెప్పి చల్లగా వచ్చేసింది. వాడుకూడా అదేదో గొప్ప ఆనందదాయకమయినట్లు ఆనందించేసి, ఆమె వెళ్ళాక తన చిరునవ్వు నెమరువేసుకుంటూ కూర్చున్నాడు.

ఇలాంటి లౌకిక ప్రవర్తనవల్ల వెంకమ్మ చాలామంది పరాశ్రయ జీవులకు ముట్టజెప్పవలసిన నాలుగు పైసాలు మిగిలించుకునేది. ఎవరివద్ద ఏవిధంగా మాట్లాడాలో ఆమెకు మంచినీళ్ళప్రాయం. అప్రయత్నంగా ఏడవడం, అప్పటికప్పుడే నవ్వడం. పదిరోజులనుండి తిండిలేనట్లు ముఖం పెట్టడం, మృదువుగా నవ్వుపుల్లేటట్లు. దీనంగా సానుభూతికలిగేట్లు మాట్లాడ్డం ఆమెకు కరతలామలకం. ఈలాంటి జీవితంతోనే ఆమె చాలా భాగం జీవితాన్ని గడిపింది. తనతో వచ్చిన జట్టులో ఎవళ్ళకు యే చిక్కువచ్చినా తన శక్తియుక్తులచేత ఎలాగోఒకలాగ తప్పిస్తూ, దినదిన గండం వెయ్యేళ్ళాయుష్షులాగ జరిగిస్తోంది వ్యాపారం. ఆమె జట్టులో ఆమెమాటకెవరూ కాదనరు. ఒకవేళ వాళ్ళకు రావలసినడబ్బంతా, నిజంగా వెంకమ్మ ఎగేసినా ఆ బ్రహ్మ దిగివచ్చి నచ్చజెప్పినా, వాళు వెంకమ్మకెదురుతిరగరు. ఎందుచేతనంటే, వెంకమ్మ తమకెన్నడు ద్రోహం చేయదనీ, చెయ్యలేదనీ, వాళ్ళహృదయాంతరాళనాళాల్లో జీర్ణించిపోయింది. ఆ నమ్మకాన్ని స్థానాన్నీ సంపాదించింది వెంకమ్మవాళ్ళమధ్య.

రైల్వే స్టేషనుమాస్టరు ఏభయ్యోపడిలో ఉన్నాడు. నిర్మలత్వాన్ని, నిశ్చలతను సూచించే గంభీరమయిన ఆ కళ్ళు, ముడతలుపడి మాటాడితే ఊగిసలాడే అతని ముఖము, అసలు కలతజెందని మనస్తత్వము. ఆ తెల్లటి 'యూనిఫారము' పరిశీలిస్తే మామూలు వాళ్ళకు అదో రకమైన భయంతో కూడిన గౌరవం కలుగుతుంది.

వెంకమ్మ స్టేషనుమాస్టరును బాగా ఎరుగును. స్టేషనుమాస్టరుబుకి వెంకమ్మ తన శక్త్యనుసారం చిన్న చిన్న లాభసాటి పనులు చేస్తూంటుంది. ఆమె మాటల మంచితనంవల్లనయితేనేమి, ఆమెవల్ల తనకు జరిగే క్షుద్రలాభాలవల్లనయితేనేమి రెండుమూడు సార్లు ముసలిమాష్టరు వెంకమ్మను నిజమయిన అపాయాలనుంచి రక్షించాడు. వెంకమ్మ అతణ్ణి దేవుడంటుంది.

ఆరోజు మాష్టరుబాబు వెంకమ్మను వీక్షించి దరహాసవదనంతో "ఏం? వెంకమ్మా యేమన్నా ఉందేమిటి?" అన్నాడు.

"యేటిబాబూ, తెలిసున్నోరు మీరుకూడా నా సెప్పండి. మీరేనో పెద్దదొంగ సావుకార్లని పట్టాలి కాని" అంది నవ్వుతూనే.

"బాగా చెప్పావులే."

"అదికాదు బాబూ. మేమిప్పుడు ఈ యాపారం సేత్తున్నామంటే యేంనాభాలు దొరికేడుత్తాయి. యిద్ద

# పెద్దమనిషి

వన్నా యాపారంయేటిలెండి. మమ్మన్నింటిన్నీ దొంగల్లా సూత్తారు. ఏదో ఆ వారానికి సరిపడ దొరికితే అదే గొప్ప. తమ రెరగని దేముందిలెండి. యెంత మంది డాబుసేత్తారో మామీద ఒకడా, ఇద్దరా. దారికడాకు దీపాలే బాబు"

"ఆ దీపాలన్నిటికీ చమురు పొయ్యాలా యేం" అన్నాడు మా పగుబాబు నవ్వుతూ, తనుకూడా ఆ దీపాలలో ఒక దీపమన్న మాట మరచి.

"బాగా సెప్పావుబాబు. మా నాయన, సల్లగా సౌఖ్యంగ ఉండు పదికాలాలపాటు."

"వస్తా. వెంకమ్మా" అంటూ మేపరు తనగదివైపు మరలి కొంతదూరం నడిచి ఏదో జ్ఞాపకం వచ్చినట్లు వెనుదిరిగి "వెంకమ్మా" అని పిలిచాడు. వెంకమ్మ ఆయన దగ్గరకు పరుగు పరుగున వచ్చింది.

"చూడు! ఇంట్లో కూరగాయలు లేక మా చెడ్డ బాధ పడుతున్నాం ఎలాగయినా" అంటూ మాట తుంచి డబ్బులు తీస్తున్నట్లు జేబులో చేతులుంచి గుడ్లు మిటకరిస్తున్నాడు.

వెంకమ్మ కూడా అతని తాపత్రయం అంతా గమనించనట్లు నటిస్తూ—"ఈపాటి భాగ్యానికి డబ్బులివ్వాలా బాబూ. నే తిరిగొచ్చేటప్పుడు తీసుకొని వస్తా" అని చెప్పింది.

"మంచిది అంటూ ముసలాయన తన గదిలోకి వెళ్ళాడు.

అప్పటికప్పుడే రైలుబండి యింటిఫుమ్మంలోకి వచ్చేసింది. స్టేషనులో గణగణ గంటకొట్టారు, ప్రయాణీకులను తమతమ సామానులు సద్దుకుని రైలు ఎక్కడానికి సిద్ధంగా ఉండండని హెచ్చరించేటట్లు. పెట్టెల్లో జనం కిటకిటలాడుతున్నారు. ప్రయాణీకులు ఒక దొమ్మిలో మునిగిపోయినట్లు కుమికూడారు ఆ పెట్టెలవి. వెంకమ్మ ఆమెజట్టు తమ ప్రాణాలు అరచేతులో ఉంచుకుని యెక్కగలిగారు ఆ పెట్టిలోకి.

ఆ రెండు నిముషాల్లోను ఆ ప్లాటుఫారంమీద ఎంత దారుణమయిన అరాచకం రేగిందో ఆ రైలు పోగానే అది అంత నిర్మానుష్యం అయింది.

రైలు కదిలేవరకు రైలుపెట్టెలో మనుషులు ఉడికిపోయారు యెండవేడికి గాలిలేక. రైలునడవటంవల్ల గాలి బాగాసోకుతోంది. లోపలనున్నవాళ్ళ శరీరాలు చల్లబడ్డాయి. నిలుచున్నవాళ్ళు కూర్చున్నవాళ్ళమీద కారాలు మిరియాలు నూరుతున్నారు. వెంకమ్మకు ఆమె జట్టుకు యిది మామూలు ప్రయాణం అవటంవల్ల యీ తగవులాటలనుండి తప్పుకుని ఓ మూల నేలమీద చతికిలపడ్డారు. లోకాభిరామాయణం విప్పారు. కూర్చున్నవాళ్ళు మనకేం అన్నట్టుగా ఒకళ్లిద్దరు కూర్చునే జాగాల్లో కాళ్లుచాపుకుని కూర్చున్నారు.

ప్రౌఢాంగన ఒకరు వేరుశెనగకాయలతుక్క పొయ్యడానికి రైలుపెట్టెలో ప్రత్యేకంగా తొట్లు చేయలేదనే క్రోధంతో కాబోలు వేరుశెనగకాయల తుక్కతో ఆ పెట్టె నింపుతోంది. ఆమె ప్రక్కగా కూర్చున్న నాటుఆసామీ ఒక పొడుగాటిచుట్ట వెలిగించి ఆటంబాంబుపొగమబ్బులు వదలుతున్నాడు. ఇవంతా చూస్తూ సహించి ఊరుకున్నారు ప్రయాణీకులు.

చంటిపిల నెత్తుకున్న ఓ గోసిపిల్లి కూర్చున్న వాళ్ళందరినీ అసూయతో కలయజూసోంది. నుంచోలేకపోతూంది. ఆమెవపు కన్నువాల్చకుండా చూస్తున్న వెంకమ్మ ఆమెను కూర్చోమంది తను లేచి. ఆమె యిటూ అటూ చూసి, తన నీరసానికి, నిస్సహాయతకు మనస్సులోనే తిట్టుకుంటూ అయిష్టంగా చాగిలబడిందా నేలమీద.

ఇవంతా నాకెందుకులే అన్నట్లు రైలుబండి అమితవేగంతో కదలిపోతూంది పొగ వెళ్ళగక్కుతూ.

ఆమె ఒడిలో పిల్లాడు దారుణంగా యేడ్వడం మొదలెట్టాడు. ఆమె ఎంత ఊరడించినా ఊరకోవటం లేదు. ఊరుకోబెట్టినకొద్దీ వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు.

"అమ్మాయీ! యీపాటి తెలీలేదా! కుర్రాడు చెమటు కక్కుతూంటేను. ఉక్కపోసి యేడుస్తున్నాడు యిలాయియ్యి" అని వెంకమ్మ ఆ పిల్లాడిని తీసుకుని పైకియెత్తి అక్కడున్న వారిని ఒత్తిగించి కిటికీదగ్గర నిలబెట్టింది. పిల్లాడు రోదన మానిబోసినోటితో నవ్వుతూ చేతులు కాళ్ళూ ఊపుతూ నాట్యం చేస్తున్నాడు. అంతయేడుపు మాయమయింది ఆర్పిన ఎలక్ట్రిక్ బల్బులో కాంతిలాగ. రైలుబండి మళ్లీ ఆగింది. వెంకమ్మ పిల్లవాడిని తల్లికిచ్చింది.

తమతమ పంచీలు మూటలు తీసుకుని వెంకమ్మ, ఆమెజట్టు దిగిపోయారు గుడ్డితప్పి కన్ను లొట్టపోయిం

దనుకుంటూ. స్టేషన్‌లోని వాళ్ళు తన్ను పలకరించుతూంటే యెవరికి తగిన సమాధానం వారికిస్తూ, ఆపిల్లల గుంపును వెంటబెట్టుకుని వెంకమ్మ బజారుకి చల్లగా జారుకుంది.

దారంట నడుస్తున్నారంతా త్వరిత గమనంతో తెలుతంచుకుని. మొట్టమొదట యింటివద్దనుండి బయలుదేరినప్పుడున్న చలాకీ కబుర్లు నవ్వులూ పూర్తిగా విస్మరించారు కాని, ఆనడకలో యింకా ఆ అహంకారము స్వతంత్రత పూర్తిగా మూర్తీభవించి ఉన్నాయి. వాళ్ళు బజారుకుపోయి కొనవలసిన బియ్యం అన్నీకొని, పరుల కంటబడకుండా ఉండడానికని అనేక చిన్న పెద్ద మూటలుకట్టి మళ్ళీ రైల్వే స్టేషనుకు బయలుదేరారు.

వెంకమ్మ మిగతా వాళ్ళందరకు నడచుకోవలసిన రీతి బోధిస్తూంది. ఎవరితోనూ యేవిధమయిన మాట పట్టింపు పెట్టకోగూడదనీ, తమపని చక్కబెట్టుకునే వరకూ వినయంగాను, ప్రార్థనాపూర్వకంగాను మాట్లాడమనీ సూచించింది.

మిగతా వాళ్లు అంతా వెంకమ్మంత అనుభవశాలులు కాకపోయినా యీ విషయాల్లో కొంచెం విజ్ఞానవతులే అని చెప్పకోవాలి. నాగులుకి మాత్రం యీ ప్రాధేయ పడడంలోను, ప్రార్థనలలోనూ నమ్మకం లేదు. వాటివల్ల మనుషులు యెంత కుమిలిపోవాలో, నవ్వులాట పాలవాలో చాలాచాలా సార్లామె అనుభవించిన విషయం.

ఇలాంటి చట్ట వ్యతిరేక వ్యాపారాల్లో ముఖ్యంగా దీనాలాపాల ప్రభావం అతి స్వల్పం. చిల్లిగవ్వపనికూడా జరగదు. "తామీ విధంగా పొట్టపోసుకోవలెనని చూస్తే, ఓ ఉద్యోగి కాస్త మంచి మంచి దుస్తులు తొడుక్కొని దర్జాగా కాలం గడపాలని చూస్తాడు. మరో దొంగవ్యాపారి అంతస్థుపై అంతస్థు మేడలు కట్టించాలని చూస్తాడు. దీనిలో జాలీ దయా యెక్కడిది?" అనుకుంటుంది నాగులు.

అయినా వెంకమ్మలో ప్రత్యేకత ఉంది. ఆమె టక్కరి బొల్లి బొల్లి యేష్పలతో చాలా గొప్పపనులు తమ కన్నుల యెదురుగానే చెయ్యగల్గింది. అందరూ వెంకమ్మలా ఎలా చేయగలరు! అందుకే తమకు సాధ్యంగాకపోయినా ఆమె మాటలు అందరూ మౌనంగా వింటారు.

వాళ్ళు దార్లో చౌకీకి దూరంగా దూరంగా నడుస్తూ, అనుమానంతో అప్పుడప్పుడా చౌకీదారు వైపు చూస్తూ నడుస్తున్నారు. వీళ్ళు చల్లగా జారుతూంటే ఆ చౌకీదారు చేత్తో సంజ్ఞ చేశాడు. వెంకమ్మకూడా సంజ్ఞా పూర్వకంగానే సమాధానం ఇచ్చింది. వాడు మీసాలు మెలెడుతూ అటువైపు చూస్తూ నిలబడ్డాడు.

అతడి బుజంమీద బరువుగా పడిందో దెబ్బ. అతడు ఉలిక్కిపడి అటు చూచాడు. కాస్త జంకాడు.

"ఆ! యేమిటా సంజ్ఞలు! ఆ ముసలిదాన్నెరుగుదువా?"

"అబ్బే ఏం లేదండి."

"దాంతోటేదో సంజ్ఞలు నడుపుతున్నావు. మాంచి నక్కల్లాంటి గుంట ల్నెంటేసుకు తిరుగుతోంది. యేటి సంగతి."

"యేటో చిన్న చిన్న యాపారాలు సేత్తున్నారండి."

"యేటా యాపారాలు. యేదన్నా పిల్ల యేన కాలబడ్డా వేంటి."

"అబ్బె నేదండి. అలాంటి గొడవ ఏం నేదు."

"మరి నువ్వు సెయ్యాల్సిపుతున్నావు, అదీ చెయ్యాల్సిపుతూంది!"

"ఆ ముసలిదాన్నెరుగుదునులెండి."

"అదిగో దానెనకనే యెడుతూంది, కొత్త నాజూగ్గా బొడుగ్గా ఉంది. దాన్ని సూత్తే మనసు చెగువైపోతూంది. ముసల్దా నేమన్నా కదపగలవా?" అన్నాడా వ్యక్తి. చౌకీదారు నిశ్శబ్దంగా ఉన్నాడు. కాస్త దూరాన్నుండి వెంకమ్మజట్టు దొంగ చూపులు చూస్తూ కదలిపోతున్నారు.

"ఏం మాట్లాడవేం" ఆ ముసలిదాన్నెలా యెరుగుదువు.?"

"బియ్యం యాపారం సేత్తోందండి" అన్నాడు అప్రయత్నంగా చౌకీదారు. తరువాత తన తెలివి తక్కువకు నాలిక కొరుక్కున్నాడు.

"ఆ! అదా సంగతి. ఆళ్ళెదో ముడుపు తొంటారం లేకదూ! ఆహా" అంటూ తలూపాడు. చౌకీదారు తలొంచుకునే నిలబడ్డాడు.

## పెద్దమనిషి

"అయితే యీ యాశేం దొరకదాయేం" అన్నాడు కొత్త వ్యక్తి.

"వాళ్ళు యాదం వాళ్ళేమిస్తారండీ పాపం. పావలా బేడా లాభాని కమ్మకుంటారు.

"పోనీ పశుగట్టికెళ్ళి ఆ మాత్రమేనా పట్రా. చచ్చినాడి పెళ్ళికొచ్చిందే కట్నం. అదీ యివ్వలేక పోతే ఆగుంట నేనా లాక్కురా" అన్నాడు సిగ్గులేని అధికారం వెళ్ళ గక్కుతూ. చౌకీదారు మాట్లాడకుండా పరుగులంకించుకున్నాడు. అయిదు నిముషాల్లో వెంకమ్మను కలుసుకున్నాడు.

"ఏం నాయనా! అంత ఒగురుస్తూ పరుగెట్టుకు వచ్చావు. నీకేమన్నా ముప్పు సెప్పకుండా ఉంటావా" అంది వెంకమ్మ చలాకీగా.

"అడుగో అక్కడింకోడున్నాడు చూశావా" అంటూ చౌకీదగ్గరనుంచున్న ఆ అస్పష్టవ్యక్తిని చూపించాడు. "ఆడు నా నెత్తిమీద దేవుడు" అన్నాడు.

"అయితే యేటంటాడు."

"పావలో పరకో తెమ్మంటాడు. అలా కాకపోతే, నీ యెనకాలే నడుత్తోంది చూడూ, ఆగుంటను యెనకాలే తీసుకు రమ్మంటున్నాడు." అన్నాడు ప్రశ్నార్థకంగా.

నాగులు భయపడిన కోడిపిల్లలా వెంకమ్మ వెనకాల దాగుంది.

"ఆడిజిమ్మడ! యెదవ!" అంది వెంకమ్మ ఉద్రేకంతో అకస్మాత్తుగా. అంత చటుక్కున తిట్టేశందుకు పశ్చాత్తాపపడింది. కళ్లంట నీళ్లు తిప్పుతూ.

"నీకు తెలీని సంగతేముంది బాబూ. మేంకూడా నీలాంటోళ్ళమేనా సెప్పు. రెక్కాడితేగాని డొక్కాడదు. యీ కట్టమంతా పడితే ఓపావులా మిగుల్తుందో మిగలదో, దారిపాడుగనా పతీవోడూ ఓ పావలా గుంజుకుంటే మా బతుకు లేంగాను. ఆ గుంటేమన్నా వాపిల్ల గనకా నీ యెంట వంపడానికి. ఆడికేనా సిగ్గులేదంటావా అలా సెప్పడానికి?"

"మొకటు నే నల్లరి పెట్టానానిన్ను. యేదో ఓ పావలా పారేసి మీ మానాన మీరుపొండి. అది ఆడి మొగాన పారేత్తా." అన్నాడు చౌకీదారు సానుభూతి సూచకంగా. వెంకమ్మకూడా రొంటనున్న పావలా తీసి వాడిచేతిలో ఉంచింది. వాడది తీసుకొని—

"యిదిగో ముసలమ్మా! యింకముందు మీరీ బిచ్చ్యం మూటలట్టుకుని యీ దారినొస్తే జైల్లో పడిపోతారు. లేకపోతే ఆడు సెప్పినట్టు సేత్తాం సవలసిందే. నా సేతుల్లో యేంలేదు. తర్వాత మీయిట్టం." అన్నాడు తీవ్రంగా.

"అయితే మా బతుకులు పోయినట్టే. యీ తాగ గంజికూడా తాక్కుండా పస్తుండాలి" అంది దీనంగా. వెంకమ్మ

"అయితే ఆడు సెప్పినట్టు సేసుకోండి." అన్నాడు విసురుగా.

"అనా యెనాక సేత్తాంబాబూ, మాకు మాతరం గౌరవం నేదాయేటి."

"మీయిటం. నే నేం సెయ్యగల్ను. అయినా యిదివరకు లాగే ఆపాలాలదారిని పొండి, ఎవడూ అడ్డేవాడుండడు కొత్తదూరమయితే నేం" అన్నాడు.

వాడు మాటాడకుండా ఆ పావలా అతని చేతిలో పెట్టాడు. కోపంతో ఆ అధికారి నేలమీద విసరి కొట్టి "హోరి మొద్దూ! మన పరువుతీశావురా. పావలా యిస్తే పుచ్చుకున్నావూ?" అన్నాడు.

"అంతే ఇచ్చారండి నిజం చెప్తున్నాను."

"నాకే డుబికీ యిద్దామనిమాస్తున్నావూ? ఎవడి దగ్గరోయి యీ సాని వేషాలు. వాళ్ళదగ్గర యెక్కువ డబ్బులాగేసి, పావలాఅన్నమాట నానోగుజారిందని ఆ పావలా నా మొఖాన్న కొడుతున్నావా" అని గర్జించాడు.

'లేదండిసార్...లేదండి" అన్నాడతడు వణికే చేతులు నలుపుతూ.

"ఏం లేదు? నువ్వు పుచ్చుకున్నావు. ఎంతిచ్చారు నిజం చెప్పు?" అంటూ ఉరిమాడు.

అధికారం దుర్వినియోగం చేసేప్పుడు మానవునిలో మానవత్వం నశిస్తుంది.

"నిజంసార్ —నిజం. నాపిల్లలతోడుగా చెప్తున్నాను పావలా ఇచ్చారు. అంతేనండి" కళ్ళంట నీళ్ళ పర్యంతం తెచ్చుకుని అన్నాడు.

"ఒరేయి అబ్బాయ్, మనదగ్గర అబద్ధంఆడి బ్రతికి యెవడూ బయటపడలేదు యిలాంటి పక్కాలు వేషాలంటే నలిపి నేలరాసేస్తా తెలిసిందా. ఇప్పుడైనా వాళ్ళెంతయిచ్చారో మర్యాదగా పడెయ్యి. ఇద్దరం సమానంగా పంచుకుందాం. భయపడమాకు" అన్నాడు లాలనగా.

"వాళ్ళు పావలాయే యిచ్చారండి కావాలంటే నాబట్టలు తణిఖీ చేసుకోండి" అన్నాడు భయం ఉట్టిపడుతూ.

"అంతడబ్బివ్వలేనంటే ఆపిల్లనే తీసుకురాలేకపోయినావూ. చచ్చుదద్దమ్మా" అన్నాడు చురచుర చూస్తూ.

"ఆమాటకూడా చెప్పానండి. యీ వేళ కాలస్యం అయినాదంట, మళ్ళీ వచ్చినప్పుడు వస్తానంటూ ఆపిల్లే ఒప్పుకుందండి" అని అబద్ధంఆడాడు అసలు సంగతి పసిగట్టి.

"అలా మొదలే యేడవరాదూ, ఆపావలా ఇలా యియ్యి' అంటూ క్రిందనున్న పావలా వాడిస్తే పుచ్చుకుని యీల వేసుకుంటూ వెళ్ళిపోయాడు.

## 2

వెంకమ్మ వగయిరాలు స్టేషను చేరుకునేసరికి సరిగా బండీ స్టేషనులో ప్రవేశించింది. వెంకమ్మ ఆజ్ఞ ప్రకారం అంతా తలో పెట్టెలోనికి సర్దుకున్నారు. రైలు బయలుదేరగానే యితర రైల్వే ప్రయాణీకులను నానావిధాల బ్రతిమాలి, బియ్యంమూటలను, బస్తాలను రహస్యస్థానాలు చూసుకున్నారు. వాళ్ళుమూటలెంత రహస్యంగా దాచినా, మొగాలు చూచేసరికి బోధపడుతుంది ఆసంగతి. అందరి మూటలూ కట్టే వీళ్ళూ యీ వ్యాపారం సాగిస్తున్నారు.

అధవా వీళ్ళనెవరయినా దమాయించినా, వారి వాటాదా, తీచి నాల్గురాళ్ళు చేతిలోపడేవరకే!

అన్నిటికన్నా ఆశ్చర్యకరమయిన విషయమేమిటంటే, వీళ్ళిలా ధారాళంగా మూటలన్నీ యెక్కిస్తున్నా అందరు చూసీచూడనట్లు ఊరకుంటారు. అధికారు అడిగినా వెంకమ్మ సముదాయించుకుంటుంది. రైలు రెండవస్టేషనులో చేరగానే, వెంకమ్మ అన్ని పెట్టెలు గబగబా తిరిగి అందరినీ ఓసారి చూచుకుంది. మరేం అదుర్దాలేకుండా జాగ్రత్తిగానే ఉన్నారు. తనూ తిరిగివెళ్ళి తనమూటలున్న పెట్టెలో కూర్చుంది.

వెంకమ్మ వెళ్ళగానే నాగులుపెట్టెలోకి, ఈ దొంగబియ్యం పట్టుకుందుకు నియోగించబడిన ప్రత్యేక ఉద్యోగస్థుల సిబ్బంది యెక్కారు. రైలు మళ్ళీ తన ప్రయాణం సాగించడం మొదలుపెట్టింది. వాళ్ళు పెట్టెఅంతా కలయవెతకడం మొదలుపెట్టారు. ఆఖరుకి నాగులు దాచినబియ్యం అన్నీ పట్టుకున్నారు. నాగులు ఓమూల నక్కి భయంతో వణికిపోయింది. మాటాడకుండా కూచుంది తనకు సంబంధం లేనట్టు. అయినా అందరు ప్రయాణీకులు ఊరుకోరదూ. అందులో కొందరు అసూయాపరులు నాగులుసంగతి చాలా సంతోషంతో ఎరుకపరచారు. ఆమె భయంతో ముద్దయిపోయింది.

ఆ అధికారవర్గంలోని ఒకడు ఆమెవద్దకు రుసరుస చూస్తూవచ్చి "యీమూటలునీవేనా?" అన్నాడు.

ఆమె నోరుమూసుకు పోయింది. పెదవులు వణికాయి. కళ్ళంట రెండు నీటిబిందువులు రాలాయి. ఆ అధికారికి కోపం ఎక్కువయింది. ముఖం జేవురించింది. కోపంతో ముఖం వికారంగా విప్పి "యేం, మాటాడవేం వలసేనాపరాయిలాగ? యివి నీవేనా? చెప్పు." అన్నాడు.

"ఆ. నావే" అంది యింక బొంకి లాభం లేదని.

"ఆహా! అలాగా!" అన్నాడు హాస్యధోరణిలో.

ఆమె మాట్లాడలేదు.

"ఈ ప్రక్కస్టేషనులో దిగి పోలీసుఠాణాకి పద" అన్నాడు తీవ్రంగా.

ఇంతలో ఆఫీసరువచ్చి తన కాయశక్తిలా తిట్టాడు.

అతనలా తిట్టవచ్చునని ఏ శాసనంలో ఉందో ఎవరికీ అర్థం అవలేదు. అలా తిట్టినప్పుడు ఆపవచ్చునని కూడా ఏ శాసనంలోను లేదని కాబోలు, ఆ రైలుపెట్టెలో ఎవరూ యేమీ పట్టించుకోలేదు.

నాగులు మాత్రం యేమి మాట్లాడాలో అర్థంగాక అలా శిలాప్రతిమలాగ నిశ్చేష్టంగా నిలబడిపోయింది. ఆ అధికారి అనుయాయులంతా ఆమె చుట్టూ మూగారు. ఆమె అతడి కాళ్ళా వేళ్ళా పడి బ్రతిమాలింది. అతడు చలించలేదు.

# పెద్దమనిషి

విధి నిర్వర్తిస్తున్నాడు పాపం.

అందరూ తలో మాట అంటున్నారు. నాగులు కన్నీటితో వేడుకుంటోంది. అతడు దురుసుగా కసురుతూ అసహ్యించుకుంటూ తిడుతూనే ఉన్నాడు.

అంతలో ఆ రైలుపెట్టెలో ఓమూలనుండి "ఏమండోయ్, యిలా దయచెయ్యండి" అని వినిపించింది. అందరూ ఒక్కసారి అటు చూశారు. ఆ అధికారీ చూశాడు.

మోటు ఖద్దరుబట్టలు కట్టి, తెల్ల టోపీ పెట్టి, మూలకూర్చున్న ఒక వృద్ధయువకుడు మళ్ళీ ఆ అధికారిని దేశించి "తమరినే యిలా దయచేయించండి" అన్నాడు.

ఆ అధికారి ఆవైపు తేరిపారజూచాడు. ఆ టోపీ చూడగానే అధికారం జ్ఞాపకమొచ్చింది. ఆ దుస్తులు చూడగానే రాజ్యతంత్రం కళ్ళలో తిరిగింది. అధికారి కంగారుపడ్డాడు. తన దురుసుతనానికి తనే నొచ్చుకున్నాడు. మంత్రముగ్ధుడిలాగ అతని పక్కకి వెళ్ళాడు.

"ఇలా రండి. ఇక్కడ కూర్చోండి" అని పక్కన ఖాళీజాగా చూపించాడు. అతడుకూడా మాటలాడకుండా అతని అనుమతి ప్రకారం నడుచుకున్నాడు.

"చూశారండి! పాపం! ఆ పిల్ల ఎంత బ్రతిమాలుతూందో అంత ప్రాధేయపడుతూన్నప్పుడు మీరు కాస్త కనికరం చూపాలేమో."

"అయ్యా! వీళ్ల సంగతి తమకు తెలీదు. వీళ్ళకు రోజూ యిదే పని. ఎంతకాలమని యిలా ఊరుకోగలం? మా పని మేము చెయ్యాలిగదాండి."

"అలా చూడండి ఆ పిల్లవేపు! మీరెంత హేయంగా తిట్టినా, మీ మనుషులెంత అవమానించినా, అంత దీనంగా బ్రతిమిలాడుతుంది. ఈలాంటి అపాయకరమయిన పనులన్నీ పొట్టకోసమేగా. కాస్త దయ చూపించండి" అన్నాడా పెద్దమనిషి. ఆ మాటల ధోరణిపట్టి చూస్తే, తను అనుకున్నంత పెద్దమనిషి కాదేమోనని ఆ అధికారికి అనుమానం తట్టింది.

"మీరు లక్ష చెప్పండి, వెయ్యి చెప్పండి! లాభం లేదు. వీళ్లకేదో తిండి లేదనుకుంటారు మీరు. మన కన్నా వాళ్లే నయం. పట్టి దొంగవెధవలు. పూరిగుడిసెల్లో ఉంటూ, మాసిపోయిన బట్టలు కట్టి గంజి తాగి డబ్బు గడిస్తారు. ఎంతెంత డబ్బుంటుందో తెలుసా బాబూ వీళ్ళదగ్గర. ఊరికే పిల్లని దయతలచకూడదండి" అన్నాడు దరహాసవదనంతో.

"దానికేంలెండి గాని. అంత ఏడుస్తూంటే ఎలా సహించగలుగుతున్నారండి. నా మాట విని యీ రోజుకి వదిలివేయండి" అన్నాడా ముతకబట్టల మనిషి. ఆయన మాట ఎందుకు వినాలో అర్థమవలేదు ఆ అధికారికి.

"ఈ విషయంలో మాత్రం నన్ను క్షమించాలి" అన్నాడా ఉద్యోగి నిష్కర్షగా.

ఇంతలో బండి ఆగింది. అధికారి తాలూకు అనుచరులు ఆ బియ్యం మూటలు క్రిందికి లాగారు. నాగులునుకూడా, వాటితో పాటే ఓ బియ్యంమూటలాగే బరబర క్రిందికి లాగేశారు రెక్కపట్టుకుని. ఓ మూలనుండి వెంకమ్మ వచ్చి ఆ జవాన్లతో సంప్రతించింది. వెంకమ్మ తాలూకు ప్రయత్నాలన్నీ విఫలాలయ్యాయి. అంతలో అధికారికూడా క్రిందికి దిగాడు. నాగులు అతని కాళ్ళకు చుట్టుకుపోయింది. అతడు కాళ్ళతో ఆమెను ఓపాతపీలికల మూట తోసినట్లు తోశాడు. బండి కదిలేకాలం వచ్చింది. బండిలోనుండి యీగొడవంతా ఓకంటకనిపెడుతున్న ఖద్దరు పెద్దమనిషి తన సంచీపట్టుకుని క్రిందికి దిగాడు. నాగులు తన్నుద్ధరించడానికి దివి నుండి దిగివచ్చిన పరమేశ్వరుడనుకుంది.

ప్లాటుఫారంనుండి బండి శెలవుతీసుకుంది.

వెంకమ్మకూడా చుట్టుప్రక్కల తచ్చాడుతోంది.

దిగిన పెద్దమనిషి నేరుగా ఆ అధికారి దగ్గరకు వెళ్ళాడు. అతనితో యేదో మాట్లాడుతూ స్టేషను మాష్టరు గదివేపు తీసుకుని వెళ్ళాడు. ఈ లోపున వెంకమ్మ రొంటెనిదాచిన రూపాయలూడదీసి ఆజవానుల చేతుల్లో ఉంచింది. వాళ్ళుకూడా ఆడబ్బు పుచ్చుకుని "నువ్వెళ్ళు ముసలమ్మా. యీ టేసనులోనే ఉండు. మేం దీన్ని, యీ మూటల్ని కూడా తిరిగి పంపేశాం" అన్నారు కాస్తకంగారుగా. వెంకమ్మ తన దుర్విధిని నిందించుకుంటూ, నాగులుని ఊరడించి ఆ చిరుచీకట్లో మాయమయింది. ఆ బియ్యం మూటలన్నింటినీ ఆ అధికారి తాలూకు మనుషులు స్టేషను బయటకు చేర్చారు. నాగులుకూడా వాళ్ళవెలకాలే వెళ్ళింది.

ఆ అధికారి ఆ పెద్దమనిషి కూడా బయటకు వచ్చేశారు.

అధికారి "ఒరేయి! యేం అలా చూస్తున్నారు. పోలీసు ఠాణాకు తీసుకు పదండి" అన్నాడు మేఘం ఉరిమినట్లు. అతని నోటినుండి మాత్రం వాన కురిసినట్లు ఉమ్మి తుంపరు రాలాయి.

"అయితే ఆ అమ్మాయిని పోలీసులకు అప్పజెప్ప డానికే తీసుకుపోతున్నారా?"

"ఆ. యిలాంటి చట్టవ్యతిరేకపు పనులెంతకాలం సాగుతాయి చెప్పండి."

"మనంమాత్రం చట్టవ్యతిరేకాలు చేయటంలేదూ? ఏదో కాస్త కనికరించండి పాపం."

"అదేంకుదరదు బాబూ. దీన్ని తీసుకుపోవల సిందే. ఏమయినా సరే."

"యీ వేళకు నాముఖం చూసన్నా వదలాలి. మీరుమాత్రం చట్టవ్యతిరేకం చెయ్యడంలేదూ. అంతే మరేం అనుకోకండి. మిమ్మలను అభ్యర్థిస్తున్నాను" అన్నాడు.

"మీ ముఖంచూసి యెందుకు వదలాలో నాకర్థం అవడంలేదు. నేను చేసే చట్టవ్యతిరేకపు పనులేమిటో అసలే తెలీడంలేదు" అన్నాడు విసుగుగా అధికారి.

"మీ రామె నలా పదిమందిలో బూతులుతిడుతూ, అవమానిస్తూ, కాళ్లు పట్టుకుంటే కాళ్ళతో తొన్నెయ్యడం, రెక్కపట్టుకులాగడం, యివన్నీ చట్టాన్ని సమర్థించడానికే? యివేవీ చట్టానికి వ్యతిరేకాలు కావూ." అన్నాడా పెద్దమనిషి కించిత్తు కఠినంగానే.

"నీ కెందుకయ్యా యీ శ్రమంతా. నీదారిని నువ్వుపోవయ్యా దేవుడా! లేకపోతే నిన్నుకూడా ఆ పోలీసు స్టేషనులో పారేయవలసి ఉంటుంది ఆ పిల్లతోపాటు. తెలిసిందా వెళ్లు" అన్నాడు.

"ఆహా! మీ సంగతంతా నే చూస్తున్నాగా. ఆ ముసిలిదాని దగ్గర నీ బంట్రోతులు డబ్బు తీసుకోడం నే గమనించలేదనుకున్నావా?" అనేసరికి ఆ అధికారి ఆశ్చర్యపడ్డాడు. కాని బంట్రోతులను ఏమీ అనలేకపోయాడు.

ఎందుకో అందరికీ తెలుసును!

ఈ మౌనం ఆ ముతకబట్టలాయనకి ధైర్యం యిచ్చింది.

"నేనంత చెపుతున్నా నీకు తెలీడం లేదేం నేనెవర్నో? రేపీపాటికి నీ అవస్థ చూసుకుందూగాని. బీదవాళ్ళమీద నీ అధికారం, జులుం అన్నీ బాగా ప్రదర్శిస్తున్నావు." అని ఝాడించేసరికి ఆ అధికారి హడిలిపోయాడు. ఆ మాటలతో బోధపడినట్టుంది. ఆ ముతకబట్టల్లో ఎంత శక్తి, అధికారం ఉందో! తన తెలివితక్కువ ప్రవర్తనకి తన్ను తాను తిట్టుకున్నాడు.

ఆ అధికారి బంట్రోతులతో ఆ మాటలూ, ఆ డబ్బూ ఆ పిల్లకు తిరిగి యిచ్చేయమని ఉరిమాడు. ఆ మాటలూ డబ్బూ తిరిగి యిచ్చేశారు. నాగులు మాట్లాడకుండా నిలుచుంది. అధికారీ అతని బంట్రోతులు ఆ ముతక ముసలివానికి నమస్కారాలు పెట్టి ముందుకు పోతున్నారు నిశ్శబ్దంగా.

## 3

ఆ ముసలి నాగులు దగ్గరకు తిరిగివచ్చాడు. ఆమె కెదురుగా నిలబడాడు. వాళ్ళ నెత్తిమీద వీధిలాంతరు వెలుతురు చిమ్ముతోంది.

"ఆ మాటలు, అవీ నెత్తి నెట్టుకుపో!" అని గదిమాడు. నాగులు కొస్త భయంగాను, కృతజ్ఞతతోను, అతనివైపు చూచింది. అతనియందేదో తెలీని గౌరవం కుదిరింది. ఆమె మాటలు నెత్తి కెత్తుకుంది. ఒకడుగు ముందుకేస్తూ "తమరు నన్ను రక్షించారుబాబూ!" అంది మెల్లగా. "మంచి రక్షించడమే. యింతకన్న కూలిపని చేసుకోరాదూ. నానావెధవలచేతా చేతులూ కాళ్లూ పట్టించుకు నిలాగించుకోడం" అన్నాడు విసుగ్గా తనకూతురే అలాంటి అవస్థలు పడుతున్నట్టు. ఆమె కృతజ్ఞతతో నిండుకుంది.

"అయితే తమరు ఎవరుబాబూ" అంది.

"నేనా మీలాంటివాళ్ళ వ్యతిరేకించే చట్టాలు చేసేవాణ్ణి." అన్నాడు.

అతని సౌమ్య భాషణాలకు ఆమె తేరుకుంది. తలమీద బరువుతో మెల్లగా అడుగులు వేస్తూ "చట్టాలంటే యేటిబాబూ" అంది మళ్ళీ.

"చట్టాలంటేనా, ప్రజలంతా సుఖంగా జీవించ డాని కుపయోగపడే కట్టుబాట్లు. ఒక్కొక్క విష యంలో ఓ విధమయిన కట్టుబాట్లు. ఆకట్టుబాట్లు ఎవరూ ఉల్లంఘించ కూడదు. వ్యతిరేకిస్తే నిన్ను తీసుకుపోయినట్లు తీసుకుపోతారు వాళ్ళని కూడా." అన్నాడు తన అధికారానికి ఆనందిస్తూ.

"మరిగంటే బాబయ్యా—బీదోళ్ళని బాధపెట్ట కూడదని, అళ్ళకితిండి బట్టా యిల్లు అన్నీ ఉండాలని చట్టం చేయకూడదండి మీబోటి బాబుగార్లు" అంది యేదో తీయనితలపులు నెమరు వేస్తూ.

"చూశావుగా యీరోజు నిన్ను బాధపెడితే" ఊరుకున్నానా. అలాగే చట్టాలుచేసి తీరతాం"

అంటూ ఆమె బుజంమీద మెల్లిగా చేయి వేశాడు. నాగులు ఉలిక్కిపడి వెనుతిరిగిచూచింది. గుడ్డివెలుతురు. ముసలాయన మోములో చిరునవ్వువెలుగుతోంది.

ఆమె హఠాత్తుగా తన నడకవేగాన్ని అధికం చేసింది. ముసలివాడి చేయి తెగిన సంకెలలా జారిపోయింది. ఆ వ్యక్తికూడా కాస్త తొందరగా నడిచి ఆమె ప్రక్కకు చేరి "అంత పరిగెడుతున్నావేం" అన్నాడు.

"బండికి టైం అయింది బాబూ" అంది.

"నేనూ వస్తున్నాను" అంటూ మెల్లిగామళ్ళీ చేయి జారవేశాడు ఆమె వంటిమీద.

నాగులుకా పెద్దమనిషి అవస్థ అంతా అర్థమయింది. మానవత్వాన్ని కత్తితో పొడిచినట్లయింది. అతన్నిచూస్తే అదివరకున్న గౌరవం పోయింది. కొంప దీసి యికముందు యిలాంటి చర్యలేమన్నా చేస్తాడేమో అనుకుంది. విషాదమయమయిన ఆమె ముఖంలోంచి చిన్న మందహాసం వెలువడింది, దట్టంగా అల్లుకున్న నల్లమబ్బునుండి తొంగిచూచే మెరుపులాగ. పెద్దమనిషి మృదువైన ఆమెబుజం నెమ్మదిగా నొక్కాడు. ఆమె మళ్ళీ జాగ్రదవస్థలో ప్రవేశించింది. మెల్లిగా అతనిచేయి తనచేతితో తోసేసింది. వృద్ధునికి టక్కున కోపం చక్కా వచ్చింది. అయినా అంతకోపం ప్రకటించడం మంచిది కానట్టు తోచింది. "ఈనాడున నేను తోడుపడకపోతే నీపనేమయి ఉండేదో తెలుసా." అన్నాడు.

"సిత్తం బాబుగారు సానా ఉపకారం చేసినారు. మీ పేరు ఈ జనమలో మరచిపోను." అంది నాగులు.

"మీలాటివాళ్ళంతా మాటలతోటే పనులు చక్కబెట్టుకుంటారు." అన్నాడు తొందరగా నడిచి ఆమె పక్కకుజేరి.

"సత్తెంగా సెపుతున్నా బాబయ్యా! తమ ఉపకారం నే నెప్పుడూ మర్సిపోను."

"నువ్వు మర్చిపోకపోతే నాకు లాభంఏమిటి?" అన్నాడు.

నాగులేమీ మాట్లాడలేదు. గబగబ అడుగులు వేస్తూ వెడుతోంది. అతడు నెమ్మదిగా ఆమె నడుం మీదకు తనచేయి పోనిచ్చాడు ఆమె తుళ్ళిపడి విసుగ్గా అతనిచేయి విసిరి వేసింది. తీసేసిన గోళ్ళెంలా వేలాడింది అతనిచేయి. జబ్బఎముక కాస్త నొప్పిపెట్టింది. తన ఆత్మగౌరవానికి దెబ్బ తగిలినట్టు బాధపడ్డాడు.

"యింతుపకారం చేస్తే యిదేనేమిటి? కొంచెమేనా బుద్ధి ఉంటేగా? నీ గురించి యెంత బతిమాలేను ఆ వెధవని." అన్నాడు కోపంగా.

ఆమె మాట్లాడకుండా వేగంగా నడుస్తోంది.

"లేకపోతే యీ పాటికి జైల్లో పారేసి, బాదగొట్టి చెవులుమూసి, నీ వంటిమీద అందరూ తలో చెయ్యివేస్తే బాగుంటుందేం నీకు?" అన్నాడు.

ఆమె నిశ్శబ్దంగా వేగంగా నడుస్తోంది.

"నీ నక్కవినయాలు, కల్లబొల్లి ఏడుపులు చూచి విడిచాడని అనుకున్నావేం పాపం."

ఆమె నోరు కదపలేదు. వేగంగా నడుస్తోంది.

"దయాగిరానూ. యిలాంటి వాళ్ళమీద దయ కూడాను. ఇంత సహాయం చేసినా సరే....."

ఆమె మాట్లాడనేలేదు. రెట్టించిన వేగంతో నడుస్తోంది.

"మాట్లాడవేం బెల్లంకొట్టిన రాయిలాగ!" అంటూ ఆమెచేయి పట్టుకున్నాడు. ఆమె విదిలించుకుంది. అతడు యింకా గట్టిగా పట్టుకున్నాడు. ఆమె యింకా గట్టిగా విదిలించుకుంది. ఆ అదురుకు నెత్తిమీద మూటలు యిద్దరిమధ్యా పడ్డాయి. ఆమె గుండె వేగంగా కొట్టుకుంటూంది. మాట్లాడలేకపోయింది. ఆమె అసహాయత ఆధారంగా తీసుకుని ఆమెను దగ్గరగా లాగుకుంటున్నాడు. ఆమె భయంతో వణుకుతూంది.

వీధి దీపాలుకూడా బెదరినట్లు కదులుతున్నాయి.

కళ్ళు కోపంతో మెరుస్తున్నాయి. శరీరం బిర బిగుసుకుపోయింది.

"నన్నొదిలెయ్యండి" అని అరిచింది.

"ఇదిగో యీ పదిరూపాయిలు తీసుకో."

"నా దారిని నన్ను పోనియ్యండి" అంటూ తన చేయి లాగుకుంటోంది. అతడు ఆమెను నొక్కిపట్టుకుని తనవేపు లాగుకుంటున్నాడు. ఆమె తనశక్తి అంతా ఉపయోగించి ఒక్కలాగు లాగింది. అతడు ముందుకుపడ్డాడు. ఆమె బరువుగా ఊపిరిపీలుస్తూ నిలుచుంది. అతడు లేవడానికి ప్రయత్నంచేస్తూ కళ్ళంట విస్ఫులింగాలు కురిపిస్తున్నాడు.

"యిదిగో బాబూ! మీ దారిని మీరు పొండి నన్నలరి పెట్టేరంటే గొల్లుపెట్టేసి పదిమందినీ కేక పెట్టేస్తాను." అందామె అతడు లేవకముందే.

"గొల్లు పెట్టేస్తావేం" నీ లాంటి దొంగలకు సహాయంచేయడం నాదే పొరపాటు" అన్నాడు బట్టలు దులుపుకుంటూ.

ఆమెమూటలు నెత్తికెక్కించుకుని, మాట్లాడకుండా, అతనివేపు చూడకుండా, గుడ్డిదీపాల వెలుతురులో స్టేషనువైపు వేగంగా నడుస్తోంది. అతడు నడుంవిరిగిన తాచుపాములా బుసలుకొడుతూ నడిరోడ్డుమీద నిల్చున్నాడు.

వీధిప్రక్క గుడ్డిదీపాల వెలుగులు చల్లగా నవ్వుకుంటున్నాయి.

# ఆంధ్ర వచన రచన: పూర్వరంగము

శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తి

ఋషుల దర్శనములు ఋక్కులు. రసఋషి వాల్మీకి రాగహృదయము కవితాకారణము. ప్రకృతి సౌందర్యపరవశము కవితావకాశము. భక్తిమయమైన భారతావనిలో భగవదారాధనము గత కాలమున కవితాభాగధేయమే. ప్రతి సాహిత్య ప్రారంభము, శ్రుతిలయాత్మకమైన గేయరూపముగ ప్రసిద్ధ సిద్ధాంతము. వైదిక ఋక్కులు, కావ్యానుష్టుప్పులు, గ్రీకు డిథిరాంబ్సు, తెనుగు పదములు అట్టివి. పదకవిత్వమే పరిణామదశలో పద్యకవిత్వముగా పర్యవసించినది. నన్నయభట్టు పద్యకవిత నాందీప్రాయము. నన్నెచోడుడు పేర్కొనిన ఊయెలపదములు, పాల్కురికి సోమనాథుడు పేర్కొనిన తుమ్మెదపదములు మొదలైనవి పూర్వరంగ పురస్కారములు. పదకవిత్వము తరువాత పద్యకవిత్వమువలె పద్యకవిత్వము తదుపరి గద్యకవిత్వము క్రమపరిణామము. "గద్యము"నకు "వచనము" పర్యాయవాచకము. "గద్దె" వికృతి.

వచన శబ్దము వాడినది మొదట నన్నయభట్టు. "మృదుమధురరసభావభాసురనవార్థవచనరచనా విశారదులయిన మహాకవులును" అని భారతావతారిక. ఇట వచన శబ్దము క్లిష్టము. ఇంతకంటె స్పష్టముగా వాడినది తిక్కన సోమయాజి. నిర్వచనోత్తర రామాయణమనుటే తన్నిదర్శనము. గ్రంథనామమునందే గద్యమునకు వచనమని వ్యపదేశము. తిక్కన వాడిన "నిర్వచన" శబ్దము నిరర్థకము కాదు; కాని నిర్దిష్టమే. ఉత్తర రామాయణములో లేని వచనశబ్ద వాచ్యార్థము, విరాటపర్వాదిగా కల గద్యశబ్ద గర్భితార్థము నొకటే. "మహాకవిత్వదీక్షావిధి నొంది పద్యములన్ గద్యములన్ రచియించెదం గృతుల్" అని తిక్కన కంఠోక్తియే. అంతేకాదు. "తెనుంగుబాస గద్యమ్మును బద్యముం బెరయ సంచితభావరసోదయాభిరామ" మనియే కేతన అభిప్రాయము. గద్యశబ్దమును బహుధా వాడినది పాల్కురికి సోమనాథుడు. మఱి, అర్వాచీన లాక్షణికుడు వచన గద్యభేదవర్గీకరణము చేసినమాట వాస్తవమే. అది వక్ష్యమాణము. ఆధునిక పృథక్కరణమును అట్టిది కలదు. ఆంగ్లమునకల "Prose" "Poetic Prose" అనువానికి సమానార్థకములుగా వచన గద్యభేద పరిగణన మది చమత్కార జనకము. యమకములగమకము. అనుప్రాసముల అట్టహాసములుకల ప్రబంధవచనము గద్యము, తదితరము వచనము అనెడి వాదమది సరి కాదు. కామికి రూఢిలేమి యొక కారణము. అదిగాక అట్టి ప్రబంధ వచనము అతఃపూర్వ కావ్యములందే గతార్థము. అంతేకాదు. ఆ పరిగణనము ఆంగ్ల పద్ధతికి అనురూపము కాదు. ప్రబంధేతర గద్యమున కవితాలక్షణము లేకపోలేదు. ప్రబంధ గద్యములందలి శబ్దచిత్రణమే కవితాంశమును కాదు. కనుక తెనుగు సారస్వతమున 'వచనము' అనగా గద్యము అన్నది గతార్థకము కాదు సరికదా సమానార్థకము. సంస్కృతవాఙ్మయమున సైతము వచనగద్య వ్యవహార మొకటే. అసలు "వచ్" "గద్" ధాతువులకే అర్థమొకటి-. "యద్వచఃశ్రోత్రప్రత్యగ్రగాసన్నిధానిగదతః-" గద్యమునకు గద్దె వికృతి మాత్రము. పాల్కురికి సోమనాథుని పండితారాధ్యచరిత్రలో దీక్షా ప్రకరణమున "పంచగద్దెలను" అనుపాఠము కలదు. అంతేకాదు. దక్షిణాంధ్రయుగవాఙ్మయమున కొఱవంజిగద్దెలు కొన్ని కలవు. కనుక వచనము గద్యము, గద్దె ఒకటే.

సంస్కృతాంధ్ర లాక్షణికుల వచనభేదవర్గీకరణము లివి.[1] —

"కావ్యం గద్యం పద్యంచ. గద్యం వృత్తగంధి చూర్ణ ముత్కలికా ప్రాయంచ. పద్యభాగవద్వృత్త గంధి. అనావిద్ధలలితపదం చూర్ణమ్. విపరీత ముత్కలికా ప్రాయమ్." — వామనుడు కావ్యాలంకారసూత్ర వృత్తి.

---

(1) ప్రాచీనాంధ్ర గద్య కావ్యములు — వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. ఆంధ్రసాహిత్య పరిషత్ పత్రిక సంపుటి 1. పుటలు 88-104; "మీఁగడ తరకలు"లో పునర్ముద్రితము.

"వృత్తలేశ విహీనమయిన గద్యము ముక్తకము, వృత్తగంధి, ఉత్కలికా ప్రాయము, చూర్ణకమునని నాలుగు విధములు. తొలిది సమాసరహితము. రెండవది వృత్త భాగములతోఁ గూడుకొన్నట్టిది. మూడవది దీర్ఘ సమాసాఢ్యము. నాలవది అల్పసమాసకము."—విశ్వనాథకవిరాజు, సాహిత్య దర్పణము.

"కం. కనుఁగొనఁ బాదరహితమై
పనుపడి హారిగద్వోలె బహుముఖ రచనం
బున మెఱయు గద్యమది దాఁ
దెనుఁగుకృతుల వచనమనఁగ దీపించుఁగడున్".

గద్యము: స్వస్తి సమస్తభువన రక్షాదక్ష శ్రీపుండరీకాక్ష భుజగపతి సింహాసనారూఢ సురనికర మకుట తటఘటిత సురుచిరమణి గణ ప్రభావిభాసిత పాదపీఠ వేదనినాదానుకార గౌరవ లలితనూపురాలంకృత చరణ సరసిజయుగళ.........శ్రీయనంత పద్మనాభ నమస్తే నమస్తే నమః"—అనంతుని ఛందము.

"ఇఁక నందు గద్యలక్షణం. మఱియు నందు గద్యయు నైదుభేదంబుల విహరించు—నయ్యవి యే వంటెను—గద్యయు బిరుదగద్యయుం, జూర్ణికయుం వచనంబును, విన్నపంబులు నన గద్యభేదంబు లైదును ప్రమోదంబున వివిధమ్ములై వినోదించునందు 1 గద్య క్రమం బెటువలెనం టేని గద్య—అనుకరణ శబ్దయుక్తంబై యొప్పునందు 2 బిరుదుగద్య—సంబోధనాంత పదబంధురంబులై వరిల్లునందు 3 చూర్ణిక—ద్వివచన బహువచన సందర్భములగు వ్యక్త్యనుశాసన సమాసాది సమాసాదిత కల్పనానల్ప జల్పితంబై వెలయు నందు 4 వచనములు—బహుప్రకార రచనా నిచయ ప్రాచుర్యమ్ములై సంచరించునందు 5 విన్నపంబు లెన్నిన్నైన ఋజుమార్గమ్ముల ననుగమించి మించు నీపంచవిధమ్ములు మితివిరహితమ్ములై స్వేచ్ఛాకల్పనా గౌరవమ్ముల కొలంకుల విలసిల్లు"

—పొత్తపి వేంకటరమణకవి, లక్షణశిరోమణి.

సంస్కృతాంధ్ర లాక్షణికుల వచనభేద వర్ణీకరణములలో చూర్ణ, చూర్ణక, చూర్ణిక నామకరణములు సునిశిత పరిశీలనావసరములు. అనావిద్ధలలితపదమైనది చూర్ణము. అదియే చూర్ణకము. అనగా నది సరళ వచనము. మఱి, చూర్ణిక ద్వివచన బహువచన సందర్భము లగు విభక్త్యనుశాసన సమాసాది సమాసాదిత కల్పనానల్ప జల్పితము. అనగా నది దీర్ఘ సమాసవచనము. కనుక సంస్కృత చూర్ణములు తెనుగు చూర్ణికలక్షణములనుబట్టియే భిన్నములని వ్యాఖ్యానం చేయ్యమానములు. అయినను అభిన్నములని ఒకరి వ్రాత!—అది నటి అవిచారితరమణీయము. లక్షణములను బట్టియే కాక, లక్ష్యములను బట్టియు సంస్కృత చూర్ణము, తెనుగుచూర్ణిక భిన్నతరగతులే. ఎఱ్ఱాప్రగడ హరివంశములో ఒక చూర్ణిక కలదు. అది చూర్ణిక అని 1901 సంవత్సరమందలి ముద్రిత ప్రతిలో అతిస్పష్టము. ఆ చూర్ణిక దీర్ఘద్విత్వ సంయుక్త పరుషాక్షర కఠినపదబంధము. అదిగాక మరొక మణిప్రవాళ భాషామయమైన చూర్ణికయు మనకుకలదు "ప్రాయిక వచనము" అను ప్రత్యేకశీర్షిక నది వక్ష్యమాణము. అనంతుని గద్యోదాహరణము, ఎఱ్ఱాప్రగడ హరివంశచూర్ణిక ఒకటే తీరు. ఇక "వచనము" "విన్నపము"లను చూర్ణికా సదృశములే. అన్నిటనొకటే అంతస్తత్త్వము. భగవత్పరమైన భక్తినివేదనముగాని, ప్రభుపరమైన ప్రపత్తి నివేదనముగాని తల్లక్షణము. "వచనము"నకు "చూర్ణపదాఖ్య"మని తాళ్ళపాక అన్నమాచార్యుల సంకీర్తన లక్షణవ్యవహారము. అది రీతిపరముగా అన్వయమంతమే కాని వస్తుపరముగా చూర్ణికయే. అట్టి "వచనము"కంటె "విన్నపము"ను భిన్నమనిపించదు. తాళ్ళపాక పెదతిరుమలాచార్యుల వచనము "విన్నపము చేసిన"దే. అట్టిదే "విన్నపము"ను. అనగా సంస్కృతములోని చూర్ణము, చూర్ణకము, తెనుగులోని చూర్ణపదము రీతిపరముగా నొకటి. తెనుగులోని చూర్ణిక, వచనము, విన్నపము వస్తుపరముగా నొకటి. అంతేకాదు. కొన్ని వచనములందు విన్నపములందు సమాసరచన కలదు. కనుక తెనుగులోని చూర్ణిక, వచనము, విన్నపములందు రీతివివక్ష దుర్ఘటము. ఆమాటను ఒకటే. అనంతుని గద్యమును అంగుగర్భము. బిరుద గద్యమాత్రము భిన్నము. దీనికి కైవారగద్య అని నామాంతరము. కంకంటి పాపరాజు ఉత్తరరామాయణములో నొక కైవారగద్యకలదు అట కైవారగద్య అని లేదు కాని ఆ సందర్భము కైవారమే. తత్పదము నట ప్రయుక్తము. లక్షణశిరోమణి లక్షణమున బిరుదగద్యకు మారు బృహద్గద్య అని ఒకరి ఉదాహరణము ప్రాయికముగా నది ప్రామాదికము. బిరుదగద్యలు రాజలాంఛనములు. విజయనగర సామ్రాజ్యమునకు సంబంధించిన బిరుద గద్యలసప్తకము వెంకయ్య రామరాజీయము లేక నరపతి విజయము అను గ్రంథమున కలదు. ఇక

సంస్కృత లక్షణములోని వృత్తగంధి వచనము పద్య భాగవర్త్ప్రధానము. ఆ పద్యభాగవర్త్నము గణసంఖ్యము కంటె గమనలక్షణము గమనార్హము. నన్నెచోడుని కుమారసంభవములో అట్టి వృత్తగంధి వచనము కలదు. ఆయా ప్రకరణముల ఆయా ప్రభేదములు వక్ష్యమాణములు. ప్రకృతము వచనము రీతిపరముగ అసమాసకము, దీర్ఘసమాసకము అని ద్వివిధమున స్పష్టము. వసుపరముగ తెనుగువచనము త్రివిధము. 1. కావ్యగతమైన గద్యములు. 2. విప్రకీర్ణకములైన చూర్ణికాదులు. 3. ప్రత్యేక వచనగ్రంథములు. అందు మరల అవాంతర భేదములు అనేకము. అది వచనరచనా పరిణామము వలని ఫలస్వామ్యము. ఏవంవిధ వచన పరిచయమునకు సమగ్రాంధ్ర వచన సమీక్షయే కర్తవ్యము.

అసలు పద్యమువలె గద్యము గౌరవప్రదము కాదను దృష్టికలదు. అట్టి భావన అవిచారిత రమణీయమే. "గద్యమ్ కవీనాం నికషం వదంతి" అని ప్రసిద్ధమైన ఆభాణకము. "బాణోచ్ఛిష్టమ్ జగత్సర్వ" మ్మని మించిన కాదంబరియు, "దండినః పదలాలిత్య" మ్మనిపించిన దశకుమార చరిత్రమును వచనకావ్యములే; గద్యగ్రంథములే. పాశ్చాత్యులకును వచనము పరమ ప్రమాణమే.2 ఎలిజబెత్తు కోర్టులోని ఫిలిప్ సిడ్నీ పద్యకవితకు ప్రతిభటత్వము వహించినది వచనరచనములో మహాకవులు కలరనియే. "ఛందస్సువినా ఉత్తమ కవిత ఉండవచ్చును."అనియే కాల్ రిడ్జి అభిప్రాయము: "కావ్యమునకు శ్రుతిలయఃవలన కలుగు నిశ్చితత్వము (Certainity) శక్తిమత్త్వము (Force) నియతత్వము (Regularity) అను గుణత్రయము పద్యబద్ధమైన కావ్యములలో స్పష్టీకృతిమై, హృదయస్పందకము లైనట్లు వచనములో కుదరదు." అని మేత్యూ ఆర్నాల్డు వక్కాణించినప్పటికిని "వచనములోను శ్రుతిలయలు కలవు" అనియే సిడ్నీ వాదము. గద్యముకంటె పద్యము గంభీరమన్నది షిల్లర్. అతడు మొదట తానొక కావ్యము గద్యములోవ్రాసి తరువాత పద్యములో వ్రాయగా భావనాభేదమున గద్యరచనము నీరసమని పించుటేగాక పద్యరచనములో ఆత్మలికసనము కలదని తెలిపిన తదుభయకవి. కాని ఆంగ్లకవులు మాత్రము శ్రుతిలయాత్మకమైన వచనములో రసప్రసరమైన రచనము చేసి "పండితాః సమదర్శినః" అను ప్రవచనమును అన్వర్థము చేసికొన్న ఆదర్శజీవులు. "పద్యగద్యమయం చంపూరిత్యభిధీయతే"—పద్యగద్యాత్మకమైన చంపూ రచనము ప్రత్యేకాంధ్రసంప్రదాయము. కారణము సంస్కృత చంపూకర్తలయిన అనంతకవి (భారత చంపువు) లక్ష్మణకవి (చంపూరామాయణము) ఆంధ్రులగుటయే. కాదంబరీ దశకుమార చరిత్రలతోపాటు తచ్చంపూగత మధురమధుఫణితి ఆంధ్ర సరస్వతికి అధ్యాపకవాణి. సంస్కృత స్వర్గసముల్లసితమై, సహస్రవసంతవికసితమైన, విలసితమైన తెనుగు సారస్వత నందనవనములో పద్యలతికలు గద్యగతికములు.

తెనుగు ద్రావిడజన్యమే అయినప్పటికిని పాలిచ్చి పెంచినవి ప్రాకృతసంస్కృతములు. ముఖ్యముగ సాహిత్యముఖమున ఆంధ్రుల ప్రథమసాహితి గాథా సప్తశతి ప్రాకృతమే. ప్రాకృతము శాతవాహనుల కాలమున రాజభాష. అలనాటి హాలుని అర్ధాంగి లీలావతికి సంస్కృతమే లీలావిలాసము. ఆ రాణీవారికి జలక్రీడలోను గీర్వాణమే! పాపము, హాలునికి సంస్కృతము పాతమైనది. పల్లవులనాడు సంస్కృతము పాలకవ్యవహారభాషయే. మూడవశతాబ్ది శాసనములందుకు మూదల. అట్టి ప్రాకృత సంస్కృతముల ప్రాభవమున ఆంధ్రులదేశభాషకు ఆమనిపాంసు. అసలు దేశభాష అనుదిన వాగ్వ్యవహారము. ప్రతిభాషకు నది ప్రాథమికదశ. వాగ్వ్యవహారము వచనైకరూపము. ఆ వచనము ఆలంకారిక రచనమైనపుడే ప్రత్యేక వాఙ్మయప్రాదుర్భావము. వ్యవహారదశయు వర్ధమానము. వాఙ్మయవచనమునకు వ్యవహారవచనమే ప్రాతిపదిక. ప్రాచీన వ్యవహారవచనమునకు ప్రభువుల శాసనములు కొంతవరకు ఉపాధులు. ప్రజల దైనందిన వ్యవహార వచనమునకు ప్రత్యేకవసతి లేదు. ప్రభుశాసనములందే ప్రజావాణి సకృత్ప్రతిఫలనము సాధకము. అది వచన రచనాప్రాథమికదశ. ఉపలబ్ధశాసనములలో ఉన్నది మొదట గద్యము. తదుపరి పద్యము. కాని పద్య కవిత్వము తదుపరి గద్యకవిత్వము క్రమపరిణామము. నిజమే, శాసనవచనము కవిత్వవచనము కానేకాదు. కేవల పాలక వ్యవహారములోనిది వచనము. శాసనములు వార్తాప్రధానములు. పత్రికలవంటి శాసనములలో ప్రత్యేక సంచికల కవితా నీరాజనములవలె పద్యముల పల్లవి సంభవము. కనుక శాసనములలో ప్రథమతః

(2) అముద్రిత సాహిత్య విమర్శనము—పింగళి లక్ష్మీకాంతము గారు.

కనిపించునది వచనము. అది మరల త్రివిధము. మొదట పదము. పిదప వాక్యము, తరువాత సమాసరచనము. ప్రాకృతసంస్కృత శాసనపాళికలందు తెనుగుపదములు కలవు "వేపూరు. విఱిపఱు" మొదలైనవి. ప్రథమతః లేఖనయోగముపట్టిన తెనుగు వాక్యములు ఆరవ శతాబ్ది క్రింది శాసనపంక్తులు.3

"స్వస్తిశ్రీ పొలిమహారాజు లొళన ఇమ్ముట్లి అణపోతులు రేవణకాలు పుద్దణకాలు ఇచ్చిన పన్నస పన్నాఱు ఇశెఱుసికిన్ తేనిటిచ్చినవాన్డు పఞ్చమహాపాతకున్డగున్"

"మణయశమ్మణగణ యశమ్మణ వృద్ధిశమ్మణ ఇమువ్వుర ఒకొడు బోళచేత శివణగొణిరి ఇట్లికొ వెలుగువారు సమితిబోళును పానబోళును పట్టెముకున రట్టొల్లు పుణ్యసాఱువన్టి బోళును ఇన్దఱు దీనికి సక్షి."

తొమ్మిదవశతాబ్ది4 గుణకవిజయాదిత్యుని ధర్మవర శాసనమున గద్యశక్తి గజ్జె కదలించినది. "అనేక గుణగణాలంకృత సమస్త మహామండల ప్రకాశితకీర్తి" మొదలైన సమాసములు మొదలైనవి. అనగా ప్రాకృతప్రాభవముపోయి సంస్కృత సార్వభౌమత్వమునకు స్వాగతము. పండరంగని అద్దంకి శాసనమున పద్యగద్య రచన పట్టువడినది. రెండవ ధర్మవర శాసనమున గట్టిపడినది. దీర్ఘ సమాస రచనము దీర్ఘ కృతాపాంగమే. "విజయాదిత్య పాదపద్మభ్రమరాయమాణ సమస్త రాజ్యభర నిరూపిత మహామంత్రాధిపతి."— నన్నయభట్టు నాటి శాసనములందు నంతే.5 "సమదారాతి మత్తమాతంగ కుంభస్థలీ విదారదారుణ ఖరనఖరపంజర! సామన్త వజ్ర పంజర నిజభుజ పరాక్రమ నిర్జిత ప్రతిమల్ల పరబల జలనిధి కబళిత బడబానలోదగ్రదావానల!..."

పద్యశాసనములందును గద్యపంక్తులు కలవు. పండరంగని అద్దంకి శాసనమున (క్రీ. శ. 658) "పండరంగు పరమ మహేశ్వరుణు ఆదిత్య భటారనికి ఇచ్చిన భూమి యెనుబది పుట్ల అడ్లపట్టు శేలదమ్మపురంబున దమ్మువులు వీని రక్షిఞ్చువారికి అశ్వమేధంబున ఫలంబు అగు" నని కలదు. యుద్ధమల్లుని బెజవాడ శాసనములో (క్రీ. శ 898) "దినిం జేర్బోలు యేలెడు (వా) రతిరంబేలు (వా) రొణ్డుసాటి గొరగ (లు) ను బెట్టువేసుగను (జ) ను యీ స్థితి సేసిణి కాచు (వా) ర దినిస్ట్రారు నిల్పిన వారు (స్థి)తి డప్పి యతిపుట పా (పం) బు గావ" అని వచన భాగము. ఒక అమరావతి శాసనమున (క్రీ. శ 1108) "స్వస్తి సమస్త ప్రశస్తి సహితం శ్రీమన్మహామణ్డలేశ్వర కులోత్తుంగచోడ గొంకరాజుల దివ్యశ్రీపాదపద్మోపజీవియైన శొజ్జప్రోలె నాయకుని పెద్దకు విణ్ణలకొమ్మసాని శ్రీ మదమరేశ్వర మహాదేవర కాచంద్రార్కము తారగముఖండ వర్తిగా దీపంబున కిచ్చిన గొరియలు 55" అని గద్యము.

అర్వాచీనములైన అనేక శాసనములు కేవల వచన రచనములు. అవిగాక కేవల పద్య రచనములయిన అనేక శాసనములంగును, అంతకంటె కేవల సంస్కృత భాషా రచనములయిన బహుశాసనములంగును, గ్రామసీమలు తెలుపు భాగము తెలుగువచనమే. ఆ వచనము ఆనాటి వ్యావహారిక భాష. అంతేకాదు. అలతివాక్యములు అగుడుగనైనలేని సుదీర్ఘమైన ఏకైక మహావాక్యముగ నుండుట నైలక్షణ్యము. 1430 సంవత్సరమందలి అల్లయ దొడ్డారెడ్డి కొంకుదురు శాసన మిందుకు నిదర్శనము. అలతి వాక్యములు అరుదుగ కల మహావాక్య రచనమును కలదు. 1434 సంవత్సరమందలి అల్లాడ వేమారెడ్డి వేమవర శాసన మిందుకు నిదర్శనము. ఈ రెండు శాసనములు కూడ కేవల సంస్కృత భాషాగ్రథితములే గ్రామసీమలు తెలుపు సందర్భమొకటె తెలుగు వచనము. బహు శాసనముల కిది బాహాటమైన పద్ధతి. ఆ పద్ధతికి అట్టి సర్వశాసనములందును సంప్రదాయమైన పీఠికా ప్రాయ శ్లోకమిది తీరు.

> "అస్య గ్రామస్య సీమానో దిక్షు సర్వాసు చ క్రమాత్
> సర్వేషాం సుప్రబోధాయ లిఖ్యంతే దేశభాషయా"

ఆ దేశభాష ఆంధ్రావనిలో ఆంధ్రమే కదా! ఏత దుదాహరణములు స్థల విస్తర హేతువులని ఉపేక్షితములు. ప్రధానముగ నిట పండరంగని రెండవ ధర్మవర శాసనమునందలి సమాసవచనము గమనార్హము.

---

3. నన్నయకుపూర్వము. ఆంధ్రభాష — మల్లంపల్లి సోమశేఖరశర్మగారు. ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక. వృష. పుటలు 5-16.

4. అముద్రిత సాహిత్య చరిత్ర — డాక్టర్ కె. వి. ఆర్. నరసింహంగారు.

5. భాషాని కొనము — గంటిజోగి సోమయాజి గారు. పుట 149.

అది తొమ్మిదవ శతాబ్ది ఆంధ్ర వచన రచనా పాటవము.

తెనుగు వచనము తొలి వేకువలో నే సమాసకుసుమావళి నివాళి. ఆ గుబాళింపు కన్నడ కస్తూరిగా ఆభాసము. ఆనాటి రాజులు కన్నడ రాజ్యలక్ష్మికి ఆత్మబంధువులే కాని, సంస్కృతము అప్పటికే ప్రభువుల అందల మెక్కినది. అంతే కాదు. దేశమున ఆరాధ్య దేవత. పండితులకు ప్రణవము. ఎనిమిది తొమ్మిది శతాబ్దుల చంపూకర్తలే గాక పదకొండవ శతాబ్ది "అపార శాస్త్ర పారగులైన వైయాకరణులు, భారత రామాయణాద్యనేక పురాణ ప్రవీణులైన పౌరాణికులు, మృదుమధుర రసభావ భాసురనవార్థ వచన రచనా విశారదులైన మహాకవులు. వివిధ తర్క విగాహిత సమస్తశాస్త్ర సాగరగరీయః ప్రతిభులైన తార్కికులు" మొదలైన విద్వజ్జనులు రాజరాజు కొలువులో అమాంతము ఆకాశమునుండి ఊడిపడిన అలఘువ్రతులు కారు. ఆంధ్రావని గల సంస్కృత పండితులే. ఆనాటికే సంస్కృతగ్రంథములు సమాస బంధురములు. "అశ్రాంతశ్రుతిపాఠపూతరసనావిర్భూత భూరిస్తవా జిహ్మ బ్రహ్మముఖౌఘ విఘ్నిత నవస్వర్గ క్రియా కేళి" అని ఆరవశతాబ్ది నైషధశ్లోక సమాస రచనము. ఏడవశతాబ్ది వచన కాదంబరీ సమాసపల్లవము, దండి వచనము ఆంధ్రవచనమునకే ఆద్యప్రకృతులు. ఎనిమిది తొమ్మిది శతాబ్దులనాటికి సంస్కృత వచన సంభాషణలే సమాస భూయిష్ఠములు. "తావచ్చంద్రా తప నక్షత్ర గ్రహాక్రాంత హంస సపచ్ఛదకుముద కోకనదకేదార కుసుమపరాగ ధవళిత దిఙ్మండలం" అని వేణీ సంహారము. అంతే కాదు. అటు నన్నయభట్టుకు, ఇటు శ్రీనాథభట్ట సుకవికి సూత్రమే గాక అనేకాంధ్ర కవులకు ఆదర్శమణి దర్పణమయిన మురారి అనర్ఘ రాఘవము దీప్తసమాస దివ్యద్రవిణా నికషము. "ఇయమనేన పీయూష తుషార శీకరాసార వర్షిణీ సుజన సంవాద కౌతుక మేఘరేఖా పౌరస్త్యేనైవ మరుతా లోకనాథేన సహస్ర శిఖరీ క్రియతే." "అసౌ గోదావరీ తీర తరంగశీకర సేకసుకుమార మాంసల పరిసరారణ్యమాలినో జనస్థాన సీమానః"—అని మురారి నాటక ముగ్ధమోహన సమాసవచనసంభాషణలు. అట్టి సంస్కృత సాన్నిధ్యమున ఆంధ్ర సరస్వతి అవతరణము. అనగా తెనుగు సమాసము సంస్కృత సమాసమునకే అనుపల్లవి.

సమాస రచనము శాసన వచనములలో పరిణతావస. ప్రభుసంబంధి వచనముతో పాటు సర్వప్రభువైన దైవ సంబంధి వచన మొకటానాడు సంభావ్యము. భక్తిరస భరితమయిన ప్రత్యేక రచన పుట్టినది ప్రథమ వాఙ్మయ వచనము. అటి రచనము ఆనాటి భ : అను భావనమే కాదు ఆధారములును కలవు. పండ్రెండవ శతాబ్ది ప్రథమ భాగమునందలి వాడగు మల్లికార్జున పండితారాధ్యుడు బహుగద్యకర్త. బాణగద్య, అక్షర గద్య, పంచగద్యలు వ్రాసినట్లు పండితారాధ్య చరిత్రలో పాల్కురికి సోమనాథుని ప్రత్యక్ష సాక్ష్యము. అవిగాక మల్లికార్జున పండితారాధ్యుని "లింగోద్భవ గద్య" "శ్రీముఖ గద్య" ప్రసిద్ధములు. శ్రీముఖ గద్య తెనుగు వచనము అని కొందరి అభిప్రాయము. అనుపలబ్ధమగు శ్రీముఖగద్య ఆంధ్రవచనము అగునో కాదో అనుమానము. ఇక లింగోద్భవ గద్య—ఇది కూడ అనుపలబ్ధము. ఎఱ్ఱాప్రగడ నృసింహ పురాణములో స్తంభోద్భవ గద్య మొకటి కలదు. లింగోద్భవ, స్తంభోద్భవ నామసాదృశ్యము గమనార్హము. అంతే కాదు. స్తంభోద్భవ గద్యలో "భక్తజన వచనరచన వర్తన చింతనానురాగ నిరవగాఢ కరుణా సుధాపూరిత పుణ్యహృదయ ప్రవేశంబును" అను వాక్యముకలదు. "భక్తజన వచన రచనవర్తనము" కూడ గమనార్హము. అట్టి వచనము—చూర్ణిక—ఎఱ్ఱాప్రగడ హరివంశమునందు కలదని పూర్వోక్తము. అర్వాచీనముగ అట్టి వచనములు శ్రీనాథుని కృతులలో అధికము. అవిగాక "కాలోచితంబుగాఁ గైవార మొనరించెఁ బలుకుఁ దొయ్యలి గద్యపద్య సరణి" అని కాశీఖండమునందు, "హృద్యంబులగు గద్య పద్యంబులు తుంబుర నారదాదులు పఠింప" అని భీమఖండము నందు కలవాక్యములు కైవారగద్యమునకు, భక్తి వచనమునకు స్ఫోరకములు. ఇక పాల్కురికి సోమనాథుని గ్రంథములందు ఇట్టి సూచనలు కోకొల్లలు. బసవ పురాణమున హలాయుధ కథలో "ప్రస్తుతోక్తుల గద్యపద్య కావ్యముల విస్తారముగఁజేసి వినుతించు వారు" అనియు, ఒడయనంబి వాల్మీకి గుడికి వచ్చు సందర్భమున "గద్యపద్యోద్యద్వచన కావ్యముల హృద్యంబుగా సన్నుతిశేయగల్ వోగడ" అనియు, పండితారాధ్య చరిత్రలో వాదప్రకరణమున "గద్య పద్యంబు లాకాంక్ష చదువుచును" అనియు పర్వత ప్రకరణమున "పద్యముల్ వద్యముల్ గద్యముల్

కాంగ" అనియు స్పష్టముగ కలవు. అట్టి గద్యలు అనగా ప్రత్యేకమైన భక్తి వచనములు అర్వాచీన రచనములు పెక్కు ఉపలబ్ధములే. అందు "ఏకంటి వచనములు" "వెంకటేశ్వర వచనములు" వైష్ణవపరములు. "శాశికా వచనములు" "భవానీమనోహర వచనములు" (పురాతన శంకరవచనములు) శైవపరములు. అవే ప్రథమరచనలు, తత్కర్తలే తదాచార్యులు కాదు. అంతఃపూర్వమే అట్టి వచనములు కలవని పై సూచనల పర్యవసానము. పాల్కురికి సోమనాథుని బసవ పురాణమందలి హలాయుధ కథలో "సిరియాలు చరిత్ర ప్రస్తుతోక్తుల గద్యపద్యకావ్యముల విస్తారముగఁ జేసి వినుతించు మేటియై చనుభక్తకూటంబులు" సంస్కృత పండితులు, సత్కవీశ్వరులు కాని సామాన్యాంధ్ర జనులు. వారుగా వినుతించునవి సంస్కృతము వల్లెతలు గాక ఆంధ్రము అల్లికలే. అంతేకాదు. ఆనాటికే భక్తివచనములు ప్రచురప్రచారము, శైలీపరిణామము చెందినవి, ఎఱ్ఱాప్రగడ హరివంశమున మార్జకప్రవేశము, ముద్రచనా ప్రౌఢిమ తెలుపఁబడదు. అట్టి నామసాదృశ్యమున ఎఱ్ఱాప్రగడ శంభోద్భవ గద్యకు మల్లికార్జున పండితారాధ్యుని లింగోద్భవ గద్య ఆద్య ప్రకృతి అగునేమో! ఆద్య ప్రకృతిని మించి వెలసిన అనుసరణాధిక్య రచనా ప్రయత్నము సర్వకవి సాధారణము. ఎఱ్ఱాప్రగ్గడ శంభోద్భవగద్యకు బమ్మెర పోతనామాత్యుని నరసింహావతార వచనము ప్రతిద్వంద్వి రచనమే. కనుక లింగోద్భవ గద్య ఆంధ్ర వచనమగుట అబ్బురము కాదు.

అంతేకాదు. పాల్కురికి సోమనాథుని "ఉరుతర గద్య పద్యోక్తులకంటె" "ఆరూఢ గద్య పద్యాది ప్రబంధ పూరిత సంస్కృత భూయిష్ఠరచన" అను వాక్యములు అత్యంత ప్రసిద్ధములే కదా! అవి నన్నయకు ఆక్షేపములనుట పరిపాటి. కాని "ఆరూఢ గద్య పద్యాది ప్రబంధ" అను వాక్యమున ఆదిశబ్దమునకు అర్థము?—"గద్యపద్యాద్యనవద్య కావ్యములు" అను చోటను ఆదిశబ్దమే. ఆ ఆదిశబ్దమునకు అర్థము? అసలు ప్రబంధ శబ్దమునకు అర్థము?—తిక్కన భారతమును "ప్రబంధమండలి" అనుటచే ప్రబంధమొక ప్రక్రియాభేదముగాను తిక్కన తత్కాలానుయాయులగు బహు సంఖ్యాకుల బాహాటు పరవశము! నన్నయభట్టు ప్రబంధ శబ్దమును భారతపరముగా వాడలేదా?

"సత్యవాక్ప్రబంధ శతసహస్రశ్లోక
సంఖ్యమయినదాని సర్వలోక
పూజ్యమయినదాని బునముని వ్యాసమ
హాముని ప్రణీతంబయినదాని"

అని ఆంధ్ర మహాభారతము ఆదిపర్వము ప్రథమాశ్వాసములో తొమ్మిదవపద్యము సీసముకాక ఎత్తుగీతి. ప్రబంధమనగా గ్రంథము. కావ్యము. ఆధునిక ప్రక్రియాభేద పరిగణనము టుంచి ఆనాడు ప్రబంధమనగా గ్రంథమాత్ర మనుటకు శాస్త్రప్రమాణము, శాసన ప్రమాణము కలవు. "ప్రబంధ రచన" మను శీర్షిక నవి తత్ప్రమాణములు. ప్రకృతము "ఆది ప్రబంధము"నకు అర్థము ప్రశ్నీయము. "గద్య పద్యాది ప్రబంధ"మనగా గద్య పద్యాత్మక గ్రంథమనుట అసంగతము. ఆదిపదమునకు అత్యర్థము కేవల కల్పనా చమత్కారమే. "గద్యపద్యాది ప్రబంధపూరిత" అనగా గద్యము పద్యము మొదలైన గ్రంథములందు నిండిన— అనిమాత్రమే అర్థము. అనగా గద్యగ్రంథములు, పద్య గ్రంథములు, ఇతర గ్రంథములు అనిస్పష్టము. భక్తి వచనమొక ఇతర గ్రంథము. దండకమువలె. అంతేకాదు. ఇంకను బసవపురాణమున "సాంగభాషాంగ క్రియాంగ పటునాటకంబుల నటియించువారు"— "వివిధనాటక మహోత్సవము లొప్పార" అనియు, పండితారాధ్య చరిత్రలో "మానిదండకము, స్తుతిమాలముగు మహాస్తోత్ర సూత్రంబుల శతకంబు, శరణత్ర్య సారంబు, దీపకళిక, మహానాటకము, నుదాహరణములు...ముక్తకావళులు ... గీతంబులు"— "ప్రమథ పురాతన పటుచరిత్రములు క్రమమొందు బహునాటకము లాడువారు"—"లలితాంగ రసకళాలంకారరేఖ లలవడ బహురూప మాడెడువారు" అనియు పాల్కురికి సోమనాథుని అందెంపులే కనుక దేశినాటకము, మహానాటకము, బహురూపము, శతకము, దీపకళిక, ఉదాహరణము, ముక్తకము, గీతము- మొదలైనవి ఆనాటి ఇతర గ్రంథములే. సంస్కృతమునకు సామంతమైన తెనుగు భాషలో ఆది ప్రబంధములని సంస్కృత భూయిష్ఠములగుట సర్వకాల సంభవము. అందలి భక్తి వచనములును అట్లగుటకు సంస్కృత గద్యలును సహకారము. పాల్కురికి సోమనాథుని నమస్కార గద్య, పంచప్రకార గద్య, అక్షరాంకగద్య సంస్కృతములే. పాల్కురికి సోమనాథునికి బహుపూర్వము గద్యలు బహుభాషల కలవు. కనుక సమకాలిక సంస్కృత ప్రౌఢ గద్య ప్రభావమున మల్లికార్జున పండితారాధ్యుని లింగోద్భవగద్య అట్టి సంస్కృత భూయిష్ఠరచన

అగుటయు సంభవము. కనుక నే, అనుసరణమైన ఎఱ్ఱాప్రగడ స్తంభోద్భవ గద్య అంత దీర్ఘద్విత్వ సంయుక్తాక్షర పరుష కఠినపదబంధము! మల్లికార్జున పండితారాధ్యుడు సమానరచన చేసినవాడే. కందము చెప్పిన కవియే ఎఱ్ఱాప్రగడ నాటికి భక్తివచనము ప్రసిద్ధము, శైలీ ప్రౌఢము మాత్రమేగాక ప్రబంధ మధ్యస్థమును అయినది గనుక అతఃపూర్వ లింగోద్భవ గద్య అట్టి వచనమేగాక ఆంధ్రరచనమే అని పర్యవసానము. అదిగాకున్న అన్యథా అట్టి వచనముల స్థితి అపరిహార్యము లింగోద్భవగద్యకర్త మల్లికార్జున పండితారాధ్యుడు నన్నెచోడునికి సమకాలికుడు. అనగా నన్నయకు అవ్యవహితభావి. ఆ నన్నయభట్టు అవతారికలో "వ్యాగుమధుర రసభావ భాసురనవార్థ వచన రచనా విశారదులయిన మహాకవులు" కలరు. ఇట ఆ మహాకవులు చమత్కారముగా మాటాడువారు అను తాత్పర్యము సులభగ్రాహ్యము. కాని వైయాకరణులకు అపారశబ్దశాస్త్ర పారగత్వము, పౌరాణికులకు అనేక పురాణప్రావీణ్యము, తార్కికులకు సమస్తశాస్త్ర సముద్రవిగాహనము లక్షణములు కాగా మహాకవులకు సంభాషణ చాగిమ ఏమంత మహావిశేషమని ఆ విశేషణము? పౌరాణికులు తార్కికులు మాత్రము సంభాషణ చతురులు కారా? అంతేకాదు. సంభాషణమాత్రమే అయినపక్షమున "రచనా విశారదులు" అను వివక్ష అర్థవంతమా? వచనశబ్దము పద్య గద్యోభయప్రయుక్తమా?—అను ప్రశ్నలు ఇట అవశ్యపరిశీలనా సహములు. ఆరవశతాబ్ది సంస్కృత వచనగ్రంథ రచనా వైశారద్యమున వచనశబ్దము పద్య గద్యోభయ వ్యవహారమునుట బోధకము. ఇక సాధకము. ఆంధ్ర సరస్వతి అవతరించక పూర్వము ఆంధ్రులు కన్నడభాషలో కవులు6. అందు ప్రథమాంధ్రకవి నాగార్జునుడు కన్నడ గద్య కావ్యకర్తగ తొమ్మిదవ శతాబ్ది నృపతుంగుని "కవి రాజమార్గము"లో ప్రసక్తము. ఈ నాగార్జునుడే తెలుగులో త్రిపిటకం "రచియింపించి ప్రచురించి"నట్టు బౌద్ధ వాఙ్మయవేత్తల అభిప్రాయము. పండ్రెండవ శతాబ్ది మల్లికార్జునపండితారాధ్యుడు మాత్రమే గాక మోళిగెయ మారయ్య, మరుళ దేవప్రభృతులు కన్నడభక్తివచనకర్తలు.

ఆరవ శతాబ్ది మొదలు పండ్రెండవ శతాబ్ది వరకు అటు సంస్కృతమున ఇటు కన్నడమున వచన కర్తలు వెలయ పదకొండవ శతాబ్ది మధ్యభాగమున— అనగా నన్నయభట్టు అవతారికలోని—వచన రచనా విశారదులు వచనరచనా విశారదులే అగుట విపరీతము కాజాలదు. వారు సంస్కృత కర్ణాట వచనరచనా విశారదులేగాక ఆనన్నయ్యభట్టు వలెనే "ఉభయ కావ్యరచనాభిశోభితులు" అనగా "ఆంధ్రవచన రచనా విశారదులును అగుట సంభవము. ఉభయ కవిత్వమనగా సంస్కృతాంధ్రకవిత్వమని కేతన దశకుమారచరిత్రలో స్పష్టప్రతిపాదనము. కనుక నన్నయ కాలమున కేవలాంధ్ర వచనరచనా విశారదులు కొలువులందు కోవెలలందును ఉండుట సహజము. కారణము ఆనాటి జాతీయ జీవనము ఆలయాశ్రితము. ఆటవారల అలౌకిక రసావేశము గేయరూపమైన భక్తివచనముల ప్రాదుర్భావమునకు ప్రాతిపదిక. భక్తి వచనములే చూర్ణికలు, వచనములు, విన్నపములు. పదకొండవ శతాబ్ది మధ్యభాగమున పద్య కవిత్వమెట్లు ఆకస్మికము కాదో గద్యకవిత్వము నంతియే. నన్నయభట్టు పద్య రచనమువలె, నన్నయ భట్టు గద్యరచనమును పరిణామక్రమ పరాకాష్ఠగ ప్రతీయమానమే. అంతేకాదు. అసలు తెనుగు వాఙ్మయము ఆరంభమే వచనరూపము. నన్నయభట్టు సంస్కృతమున శ్రీకారము చుట్టి ఆంధ్రమున అందుకొన్నది ప్రథమతః వచనమే." అని సకల భువనరక్షణ ప్రభువులె యోగ్యులైన" అనియేకదా ఆంధ్ర వాఙ్మయారంభము. కనుక పదకొండవ శతాబ్ది కావ్యగత వచనముకంటె పూర్వము ప్రత్యేక వచనముయొక్క ప్రాదుర్భావము బహువిధ భాసమానము. అందు భక్తి వచనము లోకము భాగధేయములు. అవి నేడు అనుపలబ్ధములగుట కాలమహిమ! మొత్తముమీద పదవ శతాబ్ది పర్యంతమును ప్రభుసంబంధి శాసన వచనముతో పాటు సర్వప్రభుసంబంధి భక్తివచనము ప్రత్యేకాంధ్రవచన వాఙ్మయమునకు ప్రాథమికావస్థ.

అది పూర్వరంగము. ఆనాటి వ్యవహార వచనమును వాఙ్మయ వచనమునకు శాశ్వత కావ్యగౌరవ ప్రదాత భారత సంహితారచనబంధురుడైన వాగనుశాసనుడు నన్నయభట్టు. పద్యరచనా పరిణామ ప్రాభవమునకువలె గద్యరచనా పరిణామప్రాభవమునకు కూడ నాందీపఠనము నన్నయకృతమే. ఆంధ్రికి నన్నయభట్టు వచనము నాందివచనము.

---

6. కన్నడ వాఙ్మయములోని ఆంధ్రకవులు - పెనుమర్తి వేంకటరత్నము గారు. ఆంధ్రపత్రిక - సంవత్సరాది సంచిక - ప్రమోదూత.

# దివ్యదీపావళి

శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్య

ఇవిగో! దీపము లెల్ల వెల్గె నిపు డింటింటన్ గవాక్షమ్ములున్
వివృతంబైనవి; సర్వమానవ మనో వీథీ సుహృద్భావ గా
రవ మవ్యాహత దివ్యదీపకళికాలంకారనీరాజనో
త్సవమై పర్వెను దిగ్దిగంతర పరీత శ్రీవిరాణ్మూర్తికిన్.

ఏ యింట వెలిగిన నేమి యీ దీపంబు
లింటింట నొకకాంతియే రహించె
ఏ చోట బుట్టిన నేమి యీ పసివాడు
సర్వ మానవ సమాజమ్ము వాడె
ఏ పాట బాడిన నేమి యీ దినమున
ధ్వనియించు నాత్మతత్త్వం బొకండె
ఈ రోజు నా యింటి ద్వారాలు దెఱతు నా
హూతులకును ననాహూతులకును

రండు! మీ కందఱకు సోదరుండ నేను
వ్యక్తిగతమెల్ల నేడు ప్రాపంచిక మ్మొ
నర్చి సేవింతు నా జగన్నాథదేవ
పూర్ణ మంగళాలంకృత స్ఫూర్తి మూర్తి!

ఎచ్చట నీదుపుత్రులు సహింపగరాని దరిద్రతాభరం
బచ్చగ మోయుచున్ ధన మదాంధులచే నవమాన్యులయ్యు ని
ష్పచ్చరమైన యా బ్రతుకు బాటల దివ్వెలబారు దీర్చిరో
అచ్చటికీ జగమ్మును దయాపరతన్ దరలింపుమో ప్రభూ!

# సూఫీ దృక్పథము

శ్రీ. వాసిరెడ్డి పార్థసారధి

జ్ఞాన శిఖరాగ్రములను చేరిన మహనీయులకు అనంతాకాశము కనిపిస్తుంది. అక్కడ నాది నీది అనే భేదభావం స్ఫురించదు. భూమిమీద ఇది ఇంతవరకు నాది, అది అంతవరకు నీది అని స్థాపించుటకు వీలున్నది. పైన ఇటువంటి హద్దుల కవకాశమే లేదు. ఆధ్యాత్మిక జ్ఞాన గౌరీశంకర శిఖరములను అధిరోహించి, అక్కడ జ్ఞానజ్యోతిని ముట్టించినవారిలో ఉపనిషద్ఋషులు అగ్రగణ్యులు. వివిధ కాల దేశములలో అనేక జ్ఞానార్థులకు, ఉపనిషత్తులు గమ్యస్థానము లైనవి. 'జ్ఞానభానుడు తూర్పున (భారతభూమి) ఉదయిస్తాడనీ, భారత దేశం గాలి సోకిందనీ పడమటి దేశములలో ఒకసూక్తి ఉన్నది. మనలో తిరుపతి వేంకటేశ్వరస్వామికి ముడుపుఇవ్వక తప్పదన్నట్లు, జ్ఞానార్తికి భారత దేశయాత్ర తప్పదని జర్మనీవారిలో ఒకనమ్మకం ఉన్నది. ఈ విధంగా పరిష్యావాకు ప్రాణ ధనములను లెక్కచేయకుండా 14 వ శతాబ్దంలో భారతదేశమునకు వచ్చారు.

14 వ శతాబ్దంలో, బాగ్దాదురాజు ఆస్థానసభ్యులలో ఉస్మాన్ షా అనేఆయన ఒకడుండేవాడు. ఇతడు లక్ష్మీపుత్రుడు, పండితుడు, జ్ఞాని. ఇతనికి భారత దేశం సందర్శించాలని ఒక అవ్యక్తప్రేరణ కలిగింది. వెంటనే తన రాజీనామాపత్రము తన ప్రభువుచేతికిచ్చాడు. రాజు నయాన, భయాన పోవద్దని చెప్పారు. వినలేదు. క్రీస్తుశకము 1350 లో భారత యాత్రకు ముగ్గురు మిత్రులతో పయనమైనాడు. స్నేహితులుకూడా ఇట్టి జ్ఞానార్తులే. మనము ఈశ్వర దర్శనార్థము వెళ్ళుచున్నాము, మనకు ధనంతో పనిలేదు, మనవెంట ఏమీ తీసికొని వెళ్ళకూడదని నిర్ణయంచేసుకొన్నారు. ఈ విధంగా వారంతా ఒకపడవలో బయలుదేరారు. కొంతదూరం వచ్చునప్పటికి, పడవ మునుగుటకు సిద్ధమైనది. అప్పుడు ఉస్మాన్ షా మీలో ఎవరైనా డబ్బును దగ్గర ఉంచుకున్నారా అని ప్రశ్నించాడు. వారిలో ఒకడు 'నావద్ద ఒక బంగారునాణెము ఉంచుకున్నాను, వానకురిసిన రోజున అక్కరకొస్తుందనుకున్నాను.' అని పశ్చాత్తాపం ప్రకటించాడు. నీ చేతిలోవున్న ఆ నాణెం సముద్రంలో పారవేయుమని ఉస్మాన్ షా అన్నాడు. అతడు దానిని సముద్రగర్భంలోనికి విసిరివేశాడు. ఆశ్చర్యంగా, ఆ పడవ అపాయం నుండి అధిగమించి, క్షేమంగా పయనించింది. ఈశ్వర సేవకులకు, ఈశ్వరుడే ధనము, వాడే రక్షకుడు. ఈ విధంగా వారు అరేబియన్ సముద్రమును దాటి, సింధు తీరం చేరారు. సెహ్వాన్ అనే పట్టణంలో దిగారు. ఇక్కడి ముసల్మాన్ మతబోధకులు, ఒక పాత్ర నిండా పాలుపోసి, వీరికి పంపారు. ఉస్మాన్ షా, ఈ పాత్ర తీసుకొని, ఆ పాలపైన ఒక పుష్పంఉంచి తిప్పిపంపారు. పాలవలె ఒకపాత్రలో మేముండే వారం కాము. జీవితప్రవాహమనే పాలమీద, పుష్పం వలె తేలియాడేవారమని దీనిమూలంగా ఉస్మాన్ షా తెలియచేశాడు. ఇది సూఫీల మూల లక్ష్యం.

సూఫీలకు సింధురాష్ట్రము పట్టుకొమ్మ. 14వ శతాబ్దంలో మహమ్మదీయ ప్రవక్త మనుమడు అలీ దీనికి జనకుడని కొందరంటారు. ముసల్మానులు సింధుదేశం వచ్చినప్పుడు అక్కడ బౌద్ధమతం ఉన్నదనీ ఈ బౌద్ధమత ప్రభావం వల్లనే వారు సూఫీలుగా మారారనీ కొందరంటారు. ఇది సత్యవిరుద్ధమని నా అభిప్రాయం. సూఫీ తత్వంలో బౌద్ధసిద్ధాంతాలు లేవు. పైగా దానికి విరుద్ధభావాలున్నవి. సూఫీలు ఆస్తికులు, భక్తులు, వీరిభక్తి రాధ మధురభావ భక్తివరకూ వెళ్ళింది. బౌద్ధమతము ఈశ్వరునిగురించి చెప్పదు. కనుక మూల సిద్ధాంతమే సూఫీతత్వానికి వ్యతిరేకంగా ఉన్నది. సూఫీతత్త్వములకు, ఉపనిషత్తుల భావములకు చాలా దగ్గరపోలికలున్నవి. ఉపనిషత్తుల ప్రభావమే వీరిని సూఫీలుగా మార్చినదని నా అభిప్రాయం. సూఫీ గేయాలు వింటే, అచ్చంగా తెలుగునాటపాడే ఉపనిషత్తత్త్వములు విన్నట్టుంటుంది. సూఫీ తత్త్వం పుట్టిన కాలంలో తెలుగుదేశంలో హరిహర మతములకు తీవ్ర కక్షలేర్పడగా మహాజ్ఞానియైన తిక్కన హరిహర సమైక్యం బోధించాడు. సరిగా ఆ కాలంలో ఉత్తర భారతభూమిలో హిందూ ముసల్మాన్ మతములకు తీవ్రకక్షలేర్పడినవి. అప్పుడు ఉన్నత జ్ఞానశిఖరముల నధిరోహించిన బ్రహ్మజ్ఞానులు, సత్యమునకు అవధులు

లేవనీ, ఈశ్వరుడు సమస్త మానవుల హృదయసీమలం దున్నాడనీ బోధించారు. ఇటివారిలో కబీరు ప్రముఖుడు. తెలుగునాట అందరు కబీరు పేరు విని ఉంటారు. ఇతడు సూఫీయే. విశ్వకవి రవీంద్రునికి సూఫీ తత్త్వంపై మిక్కిలి మక్కువ. ఈయన గానం చేసిన గీతాంజలిలో సూఫీతత్త్వచ్ఛాయలున్నవని శ్రీ గురుదయాల్ మలిక్ కొన్ని పోలికలు చూపించాడు. సూఫీతత్త్వం మతమునే చుట్టుగోడలకు ప్రాముఖ్యమివ్వక, ఉపనిషత్తులవలె సత్యాన్వేషణకు, ఏకత్వమునకు ప్రాముఖ్య మిస్తుంది.

## సూఫీ తత్త్వము

సూఫీశబ్దము పరిష్యన్ శబ్దమైన సవ్వాఫ్ నుండి, లేక గ్రీకు శబ్దమైన సోఫోస్ నుండి పుట్టిందని కొందరంటారు. ఈ రెండు శబ్దముల అర్థము జ్ఞానము. అనగా సూఫీశబ్దమునకు అర్థము జ్ఞానయోగమే. కొందరు సూఫ్ శబ్దం సూఫీపదంనుండి పుట్టినదంటారు. సూఫ్ అనగా ఊలు. మొదట సూఫీలు ఊలు చొక్కాలు తొడిగే వారట. దానివల్ల వారిని సూఫీలని పిలిచేవారంటారు. శ్రీ గురుదయాల్ మలిక్ ఈ విషయం వివరిస్తూ "సూఫీశబ్దము సఫానుండి పుట్టిందనీ, సఫా అనగా, ఇంగ్లీషు శబ్దమైన సోఫా అనీ అర్థం చెప్పారు. ప్రవక్త జీవించిన రోజులలో మసీదు బైట ఉండే బల్లలమీద కొందరు కూర్చుని ఉండేవారు. వీరు ముష్టికొరకుగాదు ఇట్లా కూర్చున్నది. అవధులులేని ఈశ్వరుని మసీదు నాలుగుగోడల మధ్య బంధిస్తున్నారని మౌనంగా నిరసన చూపించుటకట్లు కూర్చునేవారు. వీరినే సూఫీలన్నారు. దీని భావమే కబీరు గానంచేశాడు: "మక్కాపోనేల, కాశీపోనేల, ఈశ్వరుడు నీ హృదయంలోనే ఉన్నాడు!" సఫా అనగా శుభ్రం చేయుటని, హృదయమాలిన్యమును పరిశుభ్రం చేయుటే సూఫీ శబ్దమునకు అర్థమని కొందరన్నారు.

ప్రపంచమంతా ఈశ్వరుని స్వరూపమే. ఈశ్వరుడు హృదయాంతర్యామి. హృదయమే ఈశ్వరాలయం. సూఫీలకు వేరే దేవాలయములు లేవు. వారికి మతంపై పట్టుదలలేదు. అసలు సూఫీతత్త్వం మతంకాదని కొందరంటారు. వీరి పూజలు సౌందర్యారాధన, ప్రేమ, పాటలు మొదలైనవి. సౌందర్యము మానవుని హృదయం చైతన్యవంతం చేసి, ప్రేమ విరియజేయగలదని వీరి భావము. హృదయప్రాధాన్యమయిన దితత్త్వము.

## హృదయము, తృతీయకరణము

హృదయమును గురించి శాస్త్రీయ పరిశోధనలు చేసి, నిరూపించినవి ఉపనిషత్తులు. కనకనే, యాంత్రయుగమైన నేటికాలంలో యూరపులో ఉపనిషత్తులఖండప్రశంస లందుకొన్నవి. పండితుడు, ఋషితుల్యుడైన మాక్సుముల్లరు ఇట్లా అన్నారు.

"ఉపనిషత్తులలో మానవుని యోచన ఉన్నత శిఖరముల నందినది. నా ఆనందమయ విరామ కాలంలో ఉపనిషత్పఠన చేస్తాను. ఇవి నాకు ఉదయభానుని ప్రకాశంవలె పర్వతాగ్రములందు వీచు స్వచ్ఛ వాయువులవలె స్ఫురిస్తాయి" జర్మనీ వేదాంతి షోపెన్‌హోవర్ అన్నమాటలివి. "ఉపనిషత్తుల్లోని ప్రతి వాక్యమునుండి, ఆదిమమైన, అగాధమైన, ఉత్కృష్టమైన ఆలోచనలు కలుగుతవి. ఉపనిషత్తులు మహత్తరమైన, పవిత్రమైన, వాస్తవమైన, సత్యమైన భావములతో నిండిఉన్నది. విశ్వమంతటిలో ఉపనిషత్తులవలె శ్రేయస్కరమయిన ఉత్కృష్ట విద్య ఏదీలేదు. ఇవి సంపూర్ణ జ్ఞానదృష్టితో సేకరించబడినవి. ఈనాడుగాని, ఇంకోనాడుగాని, ఉపనిషత్తులు విశ్వమానవమతానికి తప్పక ప్రాతిపదికలు కాగలవు."

కాంటు పుస్తకములోని పదిపేజీలనుండి కన్న, ఉపనిషత్తులలోని ఒక్క పేజీనుండి ఎక్కువ జ్ఞానం పొందవచ్చన్నాడు షోపెన్‌హోవర్. ఇతని నొకరు ఎవరవునీవని అడిగారు. నేనెవరినో నాకు తెలియజేస్తే నీకు నేను చాలా ఋణపడివుంటానన్నాడు. ఇతనెవరో పిచ్చివాడని వదలిపెట్టి వెళ్ళాడా ప్రశ్నించిన వ్యక్తి. ఈ విధంగా ఇతడు ఉపనిషత్తుల పరిశీలనలో పడ్డాడు. ఈశోపనిషత్తు ప్రకారం నూరేళ్ళు జీవించుతానంటూండేవాడు. ఇతనికి ఈ విధంగా ఉపనిషత్తులంటే అగాధప్రేమ ఏర్పడ్డది. ఫ్రాన్సుదేశీయుడు, ప్రఖ్యాత వేదాంతచారిత్రికుడు అయిన విక్టరుకజిన్ 1829 సంవత్సరంలో, ఇలా ఉపన్యసించాడు. "ఇప్పుడు యూరపులో వ్యాపిస్తున్న ఉపనిషత్తులు శ్రద్ధతో పరిశీలిస్తే మహోత్తరమైన విషయాలెన్నో అవగాహన చేసుకొనగలము. ఆ గ్రంథరాజములకు మనం మోకరిల్లవలసిఉన్నది" పండితశ్రేష్ఠుడు సర్ విలియం జేమ్సు ఇట్లా అన్నాడు. "భారతీయ వేదాంత గ్రంథములు చదివినప్పుడు పైథాగరస్, ప్లేటోలు తమ సిద్ధాంతాలు హైందవఋషివర్యులనుండి గ్రహించారా అనిపిస్తుంది." ఈవిధంగా ఈ మహాపండితులు, ఉపనిషత్తులవంటి జ్ఞానగ్రంథములు వేరే లేవని అభి

ప్రాయపడ్డారు. ఛాందోగ్యోపనిషత్తు హృదయ నిర్వచనం ఈ విధంగా ఇచ్చింది. "హృది, అయం, ఇతి, తస్మాత్, హృదయం" ఆత్మ ఇందులో నివసిస్తున్నాడు కనక హృదయమైనది. ఇది ఒక అర్థం. సమస్త ప్రాణములు హృదయంలో ఉన్నవి కనుక హృదయం. ఇది రెండవ అర్థము. కఠోపనిషత్తు హృదయంలో 101 నాడులున్నవనీ, ఇవి శరీరమంతటా వ్యాపించి, శరీరమును నడుపుతున్నవనీ చెప్పుతున్నది. ఇవి శరీరమునకు మూల స్థానాలు. సూర్యుడు హృదయంలో ఉన్నాడు. ఇతని ప్రకాశమే ఇతరత్రా వెలుగునిస్తున్నది. తైత్తిరీయోపనిషత్తులో హృదయమును గురించి విపులంగా చెప్పబడ్డది. కంఠమునకు జేనెడు క్రిందుగా నాభికి జేనెడు పైగా హృదయపద్మం ఉన్నది. ఇది అధోముఖంగా వేళ్ళాడుతున్నది. దీనిలో విశ్వస్వరూపియైన పరమాత్మ ఉన్నాడు. ఈ హృదయం మధ్యలో సూక్ష్మమైన రంధ్రమున్నది. దానిలో పరమాత్మ ఉన్నాడు. ఇక్కడ అగ్నిజ్వాల ప్రకాశిస్తున్నది. ఇది నల్లని మేఘముల మధ్య మెఱయు మెఱుపుతీగవలె ప్రకాశిస్తున్నది. ఇది పచ్చని కాంతి గలదిగాను, వరిముల్లువలె సూక్ష్మమైనదిగాను స్ఫురిస్తున్నది. దీనికి ఉపమానము వేరేలేదు. దీని మధ్య పరమాత్మ ఉన్నాడు. ఇతడే బ్రహ్మ విష్ణు మహేశ్వరులు. సమస్తము ఇతడే. మహోపనిషత్తులో ఈ విధంగా ఉన్నది.

"సంత్యజ్య హృద్గుహేశానం దేవమన్యం ప్రయాంతియే
తేరత్న మభివాంఛంతి త్యక్తహస్తస్థకౌస్తుభాః"

హృదయగుహలోని ఆత్మదేవుని తెలిసికొనలేక ఇంకెక్కడో భగవంతుడున్నాడని అనుకునేవారు, చేతిలో ఉన్న దివ్యరత్నమైన కౌస్తుభమణిని వదిలిపెట్టి, సామాన్యరత్నమును వెదుకువారివలె ఉన్నారు.

మనకు రెండు హృదయాలున్నవి. స్థూల హృదయం మొదటిది. సూక్ష్మహృదయం రెండవది. స్థూల హృదయం ఒకవైపున, సూక్ష్మహృదయం ఇంకొకవైపున ఉన్నవి.

నేను, నేను అంటూ ఆత్మహృదయంలో వున్నాడని రమణమహర్షి తమ అనుభూతి వెల్లడించారు. పరమాత్మ ముఖము సువర్ణమయపాత్రచే మూయబడి ఉన్నది. దీనిని ఈశావాస్యోపనిషత్తు ఇట్లా చెప్పుతున్నది. 'హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితం ముఖం' సాధకుడు, ఈ బంగారుపాత్ర తొలగించాలి. అప్పుడక్కడ పరబ్రహ్మ సాక్షాత్కరిస్తుంది. ఆత్మజ్ఞాన స్వరూపి. అందుకే ఉపనిషత్తు ఈ విధంగా అంటున్నది.

'ఆత్మజ్ఞానస్వరూపి, ప్రాణంలోను, హృదయంలోను ప్రకాశిస్తున్నాడు. కనకనే పరమాత్మకు సచ్చిదానందుడని పేరు వచ్చింది. సత్, చిత్తు, ఆనందుడు. సత్యజ్ఞానానందమయుడు. ఆనందో బ్రహ్మ అని ఉపనిషద్వాక్యం. అతని దర్శనం వల్ల బ్రహ్మానందం కలుగుతున్నది. బ్రహ్మానందం ముందు ఇంద్రియానందము, సూర్యునిముందు దీపం వంటిది. ఇటువంటి బ్రహ్మానందము, జ్ఞానము, సత్యము హృదయంలో ఉన్నవి. దీనిని తెలుసుకోలేక, ఆనందం ఎక్కడో ఉన్నదని వెతుకుట అజ్ఞానం. సచ్చిదానందుని సత్యంలో రెండు లక్షణాలున్నవి. 1 జ్ఞానమయము లేక జ్యోతిర్మయము, 2 ఆనందమయము లేక రసమయము. ఆనందము లేని జ్యోతి సూర్యునివంటిది. జ్ఞానములేని రసము చంద్రుని వంటిది. సూర్యుడు వెలుతురు ప్రసాదిస్తాడు, చంద్రుడు ఆనందం ప్రసాదిస్తాడు. జ్యోతిషశాస్త్రము రవిని ఆత్మ అనీ, చంద్రుడు హృదయమనీ చెప్పుతుంది.

సూఫీలలో 2 రకాలవారున్నారు. 1 వేదాంతి లేక జ్ఞాని, 2 కవి. సూర్యజ్యోతివల్ల ఆత్మజ్ఞానము కలుగును. ఈ విధంగా ఆత్మజ్ఞానం పొందినవానికి జీవితరహస్యములు కరతలామలకము లౌను. వీరిని వేదాంతు లంటాము. చంద్రుని రసమయతవల్ల, మానసికాహ్లాదం కలుగుతున్నది. ఈ విధంగా ఆత్మోపలబ్ధిఅయిన వ్యక్తి సామాన్యుల కందని ఆనందమును అనుభవిస్తాడు. ఇతనిని కవి అంటాము. కవి ప్రకృతిలోని రసమయ రహస్యములు ప్రజలకు పంచిపెడుతున్నాడు, వేదాంతి ఈశ్వరుని జ్ఞానరహస్యములు ప్రజలకు పంచిపెడుతున్నాడు. కవి, వేదాంతి హృదయసాధకులే. కవి ఋషి అని వేదములు చెప్పుచున్నవి. హృదయానందుని దర్శించని వాడు కవి కాజాలడు. పరమాత్మ ఉన్నత శిఖరము అధిరోహించిన వారిలో అహం అనే తెర ఉండదు. అతని ముందున్నది ఏకత్వం. అందువల్ల అతడు విశ్వమానవుడౌతాడు. సమస్తలోక కళ్యాణమే అతని ప్రయత్నం. ఆ ప్రయత్నమును కవి తన కావ్యంలో ప్రవేశపెడుతున్నాడు. కనకనే విశ్వశ్రేయస్సు కోరనిది కావ్యం కాదంటాను. మపాసా రసవత్తరమైన నవలా రచయిత. టాల్‌స్టాయ్ మపాసా నవలాకారుడని అంగీకరించలేదు. విశ్వసహోదరభావం చూపించలేని వాడు నవలాకారుడు కాదని టాల్‌స్టాయ్ భావము. కళలో ఎంతరసమున్నా, విశ్వప్రేమ లేకపోతే ఆత్మలేని శవంవంటిదే. భారతీయ మహాకవు లందరూ విశ్వశ్రేయస్సుతోనే కావ్యములు రచించారు. వ్యాస వాల్మీకులు మహాతపస్సు చేసి, సత్యదర్శనం పొందారు. వారు దర్శించిన సత్యము, జ్ఞానము ఆనందము తమ మహాకావ్యములద్వారా ప్రపంచమునకు పంచిపెట్టారు.

# సూఫీ దృక్పథము

పరమాత్మ హృదయంలో ఉన్నాడని, పైన తెలుసుకున్నాము. వాని వాణికి హృదయమే స్థానము. అక్కడ అంతర్వాణి సర్వదా వినిపిస్తున్నది. భ్రూస్థానంలో అంతర్జ్యోతి కనిపిస్తుంది. భ్రూమధ్య దేశానికి లోపల చూడగల శక్తి వున్నది. కనుక దీనిని తృతీయ నేత్రమన్నారు. హృదయంలో వినగలశక్తి ఉన్నది. దీనిని తృతీయకర్ణమని అనవచ్చునని నా అభిప్రాయము. పెద్దలు ఎందువల్లో ఈ శబ్దం వాడలేదు. పరమాత్మ వాక్కేగాక, సమస్త జగత్తునుండి శబము వినగలస్థానం హృదయం. ఇది టెలిఫోన్ యంత్రంవంటిది. బాహ్యమైన సమస్తేంద్రియాలు నిగ్రహించి మనస్సు హృదయంతో మేళవిస్తే చాలు. రేడియో శబ్దం వినిపించినట్లుగా అక్కడ వినిపిస్తుంది ఒక దివ్యనాదం. మహాత్మాగాంధి అంతర్వాణిపై వ్యాసం వ్రాశారు. తమకు అంతర్వాణి వినిపిస్తున్నదనీ, సాధనచేస్తే అందరికీ అది వినిపించుననీ అన్నారు. పతంజలి యోగసూత్రంలో "హృదయే చిత్తసంవిత్" అని ఉన్నది. హృదయమందు ధ్యానించిన యెడల, తన చిత్తమునందలి విషయములు, పరుల చిత్తములందలి విషయములు తెలియునని దీని భావము. అనగా హృదయధ్యానంవల్ల తనలోని అంతర్వాణియే కాక, ఇతరుల ఆలోచనలు కూడా వినవచ్చునని అభిప్రాయము. ఇందువల్లనే బ్రహ్మానంద స్వామి "గురువు లేనప్పుడు పరిశుద్ధహృదయమే గురు"వని ప్రవచించాడు.

మానవునికి, భగవద్వాక్యం హృదయంద్వారా స్ఫురిస్తున్నది. ఏదైనా చేయకూడనిపనిని చేయునప్పుడు హృదయం చెయ్యవద్దని వారిస్తుంది. ఏదైనా కష్టం రానున్నప్పుడు, కారణం తెలియకుండానే హృదయం ఆందోళితమౌతుంది. మంచిరానున్నప్పుడు హృదయం శరదృతువులో నిర్మలాకాశంవలె ప్రశాంతంగా ఆనందమయంగా ఉంటుంది.

సూఫీలకు ఈశ్వరుడు జ్యోతిస్వరూపి. ఈజ్యోతి ప్రకాశవంతమైనది, పరిశుద్ధమైనది, నీడలేనిది, జ్యోతులకన్నిటికి జ్యోతియైనట్టిది. హృదయధ్యాతల నంతర్ముఖులని అంటారు. క్రైస్తవమతంలో వీరిని మర్మసాధకులంటారు.

ఏల్ యూనివర్సిటీలో 40 ఏండ్లనుండి హృదయకోశం పరిశోధిస్తున్నారు. హృదయంలో వైద్యుత జ్యోతి ఉన్నదని ఇంతకుపూర్వమే కనిపెట్టారు. దీనిలో ఇంకా అనేకాద్భుత రహస్యము లున్నవని ప్రచురించారు.

## మౌనము

హృదయ ధ్యానమునకు ప్రార్థన, నామజపము, స్మరణ, మౌనము సాధనలు. నామజపంకన్నా, స్మరణ చాలా శ్రేష్ఠమని సూఫీలభావన. మౌనము రెండు విధాలు. (1) శారీరకమౌనము, (2) మానసికమౌనము. మౌనమునకుపాంగం ఏకాంతవాసం. శరీరమౌనము ప్రథమసోపానము. దీనికి మానసికమౌనమే గమ్యస్థానం. మౌనమే ఈశ్వరుని వాక్కు. మౌనమనగా శూన్యం కాదు. మౌనము తెల్లకాగితం వంటిది. భగవంతునికి రూపం ఉన్నది, అలాగే రూపం లేదనికూడా అనవచ్చును. భగవంతునికి రూపం ఉన్నది, కాని అది మనం అనుకునే రూపంవంటిది కాదు. భగవంతుని రూపంగురించి ఉపనిషత్తులలో ఒక చక్కని కథ ఉన్నది. బ్రహ్మ ఎటువంటివాడని గురువును శిష్యుడు ప్రశ్నించాడు. గురువు మాటాడలేదు. శిష్యుడు ఆ ప్రశ్నే మళ్ళీ అడిగాడు. గురువు తిరిగి అలాగే అట్లే మౌనంగా ఉన్నాడు. శిష్యుడు మళ్ళీ ప్రశ్నించాడు. గురువు 'నీ ప్రశ్నకు జవాబుచెప్పితినిగదా?' అన్నాడు. ఉపనిషత్తులను అర్థం చేసుకోవాలంటే జ్ఞానసంపన్నులై ఉండాలి. అటువంటివారికిగాని అవి అర్థంకావు. విశ్వరహస్యములన్నీ దాచిన సువర్ణపేటికలవి.

సూఫీముఖ్యులలో దర్యాఖాన్ ప్రముఖులు. వీరు మౌనమునుండి వాక్కు వస్తుందని అన్నారు – అనగా మౌనమనే బంగారమునుండి వాక్కులనే సువర్ణాభరణములు తయారవునన్నమాట. కొందరు భౌతికవాదులన్నట్లు మౌనము సోమరితనంకాదు. వాక్కుకన్న శక్తిగలది మౌనము. ఇందుకే రమణమహర్షి నోటితో చెప్పేబోధకన్న, మౌనంవల్ల ఎక్కువ చెప్పవచ్చునని అన్నారు.

మౌనం ఎప్పుడు భాషిస్తూనే ఉంటుంది. కాని ప్రపంచగోషలవల్ల ఆభాష వినలేకుండా ఉన్నాము. దీనినిగురించి చీనావారి గ్రంథంలో ఒకసూక్తివున్నది. 'బురద నీటిని కదిలిస్తూవుంటే, బురద అట్లే ఉంటుంది. కదిలించకుండా ఉంచితే బురద తేరుకుని శుభ్రజలం వస్తుంది.'

మనస్సు బురదనీటివంటిది. దానిని కదిలిస్తూవుంటే ఎప్పుడూ మలినంగానే ఉంటుంది. మనస్సు కదిలించకుండా ఉంటే, అది పరిశుభ్రమై ఆత్మజ్ఞాన సంపన్నమవుతుంది. మనస్సనే బురదనీటిని కదిలించకుండా ఉంచడమే మౌనం. మౌనమనగాఎటువంటిదో, ముక్తికోపనిషత్తు ఈవిధంగా చెప్పుతున్నది.

'సంత్యక్తవాసనాన్మౌనాదృతే నాస్త్యుత్తమం పరం.' సమస్తమైనవాసనలు వదిలి, మౌనంగాఉంటే ఉత్తమమైనపదవి. మౌనమునకు మాట్లాడకుండావుంటే చాలదు. మనస్సులో ఉండే సమస్త వాసనలు ఆలోచనలు, కోరికలు విసర్జించాలి. పతంజలి యోగసూత్రము

చిత్తవృత్తులను నిరోధించుటే యోగమని అంటున్నది. భగవద్గీత మనోనాశనమే యోగమంటున్నది.

మౌనము పరమసుఖప్రదమైనది. ఆత్మజ్ఞానమును, ఆత్మశక్తిని ప్రసాదిస్తున్నది వాక్కులకు పుష్టి, మనస్సునకు నిర్మలత, ఆహ్లాదము ప్రసాదిస్తున్నది.

మహాపురుషులు కొందరు ఒక కార్యం తలపెట్టినప్పుడు ముందుగా కొంతకాలం మౌనంగా ఉంటారు. పిమ్మట వారిపనులు నిర్విఘ్నముగా జరుగును. బుద్ధుడు, క్రీస్తు, మహమ్మదు, మహాత్మగాంధి మొదలైనవారు కొంతకాలం మౌనముద్రాంకితులయ్యేవారు. మనబోటి సామాన్యులు కూడా ఒకపని చెయ్యబోవునప్పుడు, కొంతకాలం మౌనంగా ఉన్నయెడల ఎంతో ఉపయోగపడుతుంది.

పాశ్చాత్య పండితుడు కార్లయిలు మౌనాన్ని గురించి ఇట్లా అన్నాడు. 'ఒకరోజు మౌనంగావుండు. రెండోరోజున నీభావములెంత తేటగా ఉంటాయో చూడు.' అయిన్‌స్టీన్ అనుభవాన్ని ఇలా చెప్పాడు. 'నేను పల్లెవాసంలో ఏకాంతంగా ఉండి, ఆ ప్రశాంతజీవితము నా సృజనాత్మక మనస్సునకెంతటి పుష్టి ఇచ్చిందో గమనించాను.' ఇంతశక్తి కలదికనుకనే ఏకాంతవాసము ప్రియుని శయ్యాగృహమనీ, అది శరత్కాలచంద్రకిరణములతో నిర్మింపబడినదనీ అంటారు సూఫీలు. ఇందుకే వారు ప్రశాంతనిశాకాశంకింద మౌనముద్రాంకితులై ఉంటారు

## ఓంకారము

వారి మంత్రము ఓంకారమువలె ఉంటుంది. 'హూ' అంటారు దానిని. దీనిని బ్రహ్మాండాక్షరమనీ, వక్రాక్షరమనీ అంటారు. ఈ అక్షరమే భగవంతుని నామమంటారు సూఫీలు. పతంజలి దీనినే 'తస్య వాచకః ప్రణవః' అన్నారు. దీనికి ఈశ్వరుని పేరు ఓంకారమని అర్థము. సూఫీగురువు శిష్యునికి మంత్రోపదేశమిచ్చినప్పుడు, చక్కటి కాగితంమీద ఎంతో సొగసుగా ఈ ప్రణవమంత్రమే వ్రాసి ఇస్తాడు. దీనిని మహాశక్తివంతమైన ఒక విధమైన తాయెతుగా భావిస్తారు. సూఫీలు ధ్యానసాధనకు ప్రణవజపం చేస్తారు. ఇది చీకటిలో దీపంవలె వెలుగునిస్తుందని వారి నమ్మకం.

భావపూరితంగా ప్రణవోచ్చారణ చేసినయెడల. యోగభంగములు తొలగునని ఉపనిషత్తులు చెప్పుతున్నవి. ముండకోపనిషత్తు ఓంకారోపాసన లేనిది సిద్ధిలేదంటుంది. ప్రణవము దీర్ఘంగా ఉచ్చరించిన ముక్తికలుగును. హ్రస్వంగా ఉచ్చరించిన పాపములు నశించును. ప్రణవము భావంతో, భక్తితో ఉచ్చరించిన, ఎటువంటి రోగాలయినా నయముచేసి, నవత్వమునిచ్చును. నూతనత్వం ప్రసాదించునది కనుకనే 'ప్రణవ' మయినది.

## ఆవేదన, బాధ

ఈశ్వరుడు శరీరంలో బందీయై ఉన్నాడు. ఇతనిని పొందుటకు శరీరబంధములనుండి విముక్తిచేయాలి. బంగారము మలినరహితం చెయ్యాలంటే అగ్నితప్తం చెయ్యాలి. ఇట్లే శరీరమునకు బాధ తప్పదు. బాధవల్ల భగవంతుడు సన్నిహితుడవుతాడు. సూఫీలు బాధ ప్రియమిత్రుడంటారు. సంపద ఆధ్యాత్మికమైన మృత్యువని వారంటారు. వారిలో ఒక సూక్తి ఉన్నది. తాను పోగొట్టుకున్నదానినిగురించి హృదయం ఏడుస్తుంటే, తాను కన్నదానినిగురించి ఆత్మ నవ్వుతుంది. తీవ్రావేదన లేనిదే భగవానుడు దగ్గరకు రాడు. ఇందుకు ఎంతో బాధ భరించాలి.

## మధురభావము

సూఫీలు భగవంతుని ప్రియునిగా భావించి ఆరాధిస్తారు. ఇది భారతీయుల నవవిధ భక్తులలో ఒకటి. రాధ శ్రీకృష్ణుని ప్రేమవంటిది. ఈశ్వరుని ప్రాణేశ్వరునిగా ఆరాధించుటే మధురభావము. ఇటువంటిభక్తి చాలా మతములలో ఉన్నది. క్రైస్తవమతంలో కూడా మధురభావం ఉన్నది క్రీస్తుశకము 1336 సంవత్సరంలో సియాన్ క్యాథరైన్ అను క్రైస్తవ భక్తురాలు కలదు. ఈమె క్రీస్తును గుప్తవివాహం చేసుకొన్నది. ఈవిధంగా క్రీస్తుప్రభువును వివాహమాడిన క్రైస్తవభక్తులు చాలామంది ఉన్నారు. గోరానవలలో రవీంద్రనాథ ఠాకూరు ఒకచోట ఇటువంటిభక్తి వివరింపజేశారు. కామమును భగవంతునివైపు త్రిప్పుటే ఈభక్తి.

సూఫీలలో మాలిక్ మహమ్మద్ జయసీ భగవంతుని తనప్రియురాలుగా పూజ్యమహిళగా భావించి ఆరాధించాడు. ప్రియురాలి దర్శనంకోసం బెంగగొనేవాడు.

ఈశ్వరసాయుజ్యమునకు సూఫీలలో కొన్ని సాధనలున్నవి (1) నేను బ్రహ్మమును, (2) నేను శరీరం కాను, (3) నేను బ్రహ్మమును అని మూడు విధాలీభావము. ప్రథమదశలో ఉపనిషద్వాక్యంలోవలె 'అహం బ్రహ్మ అస్మి' అని సాధనచేస్తారు. రెండవదశలో 'నేను' ఏమికాదో అది తెలుసుకుంటారు. ఉపనిషత్తులలోని నేతి, నేతివలె. నేను శరీరంకాను, ప్రాణంకాను. మనస్సుకాను. ఇలాగే తాను కానిదంతా తెలుసుకొంటాడు. మూడవమెట్టులో తానుఏమిటో

తెలుసుకొంటాడు. అప్పుడు సోహంభావన చేస్తాడు అప్పటికి మనస్సులో సూక్ష్మమైన కొన్ని సత్యములు తెలిసీ తెలియకుండా ఉంటవి ఇప్పుడు ఈశ్వరుడు ఉన్నాడా లేడా అనే అనుమానం ప్రవేశిస్తుంది. మర్మసాధకులు దీనిని కాళరాత్రి అంటారు. ఇది చాలా బాధాకరమైనది. నీటిబొట్టు దొరకని సహారా ఎడారి వంటిది. దీనినే భగవద్గీత విషాదయోగమంటున్నది. క్రమంగా ఆవేదన, ఆకాంక్ష తీవ్రమౌతవి తీవ్రతరమైనప్పుడు కాని జ్యోతిర్దర్శనం కాదు. ఇందుకు ప్రార్థన కావాలి. ప్రార్థన అనగా ఈశ్వరార్పణ. ఈశ్వరుని అనుగ్రహంవల్ల ఇంద్రియజయం కలిగి, ఈశ్వరదర్శనం లభిస్తుంది.

రాధాకృష్ణపండితులు సూఫీలనుగురించి ఇలా వ్రాశారు: 'సూఫీలు ఏకాంతవాసప్రియులు, వారు ఎడారులలోనో, అడవులలోనో, కొండలలోనో ఒంటరిగా ఉంటారు. తమదగ్గరకు వచ్చినవారు ఇచ్చేధర్మంవల్ల వారు రోజులు గడుపుకుంటారు. సత్యము నేది ఒకటేఅనీ, అది అవ్యక్తమైనదనీ వారినమ్మిక. మానవాత్మ ఈ అవ్యక్తంలోని ఒకభాగం మాత్రమే. ఆత్మ శరీరంలో బంధించబడి ఉన్నది. శరీరబంధం జయించినప్పుడే. ఆ బందీ విడుదలపొందుతున్నాడు. విడుదల ఈశ్వరధ్యానంవల్ల జరుగును. అవ్యక్తంమినహా ప్రపంచంలోనిదంతా నశించేదే.'

అందము, ఆనందము ఈశ్వరదూతలు. సౌందర్యారాధనవల్ల ఈశ్వరుని చేరవచ్చును. ఒకసూఫీ వేదశాస్త్రప్రకారం సాధనచేసినా, ఈశ్వరదర్శనం కలుగలేదు. ఈశ్వరుణ్ణే అడిగాడు నాకు దర్శనం ఎందుకివ్వవని. నన్నుగురించి పాడుతూ నృత్యంచేసేచోటికి వెళ్లమని ఆదేశించాడు ఈశ్వరుడు. భక్తుడట్లే చేశాడు. ఆగానం, ఆ నృత్యం ఇతనికి పారవశ్యం కలిగించినవి. అప్పుడతని కీశ్వరదర్శనం కలిగింది. కాయ పండుటకు నీడ, ఎండ రెండు యెంత అవసరమో, సిది కలుగుటకు సుఖదుఃఖాలు రెండూ అంత అవసరమని సూఫీలంటారు. గోసాయీలు గంజాయి సేవించినట్లు, సూఫీలు మధువు సేవిస్తారు. గోసాయీలు గంజాయి శివుడన్నట్లు, సూఫీలు షిరాజ్ వైన్ ను అలా అంటారు. అజ్ఞానము ఆత్మకు శత్రువంటారు. కామక్రోధములు అదుపులో వుంచుకోవలెనే కాని, పూర్తిగా తొలగించకూడదని ప్రవక్త అన్నాడు. కామక్రోధములను భగవానుని అనుగ్రహంవల్ల అదుపులోనికి తేవచ్చును. పశ్చాత్తాపం, ఓర్పు, కృతజ్ఞత, ఆశ. భయం, బీదతనము అనుభవించుట, వనవాసం, తపస్సు, ఈశ్వరప్రణిధానము, ప్రేమ, మొదలయినవి సూఫీల నియమాలు. సూఫీలు మాంసాహారం భుజించరు. పునర్జన్మమున్నదని నమ్ముతారు. జలాలుద్దీన్ తను రాతినుండి చెట్టులోను, దానినుండి పశువులోను, దానినుండి క్రమంగా మానవులలోను, దేవతలలోను, ఈశ్వరునిలోను జన్మిస్తానని పాడాడు.

## దర్శనములు

హృదయమాలిన్యం తొలగి, హృదయఫలకం పరిశుభ్రమైనపిమ్మట హృదయమునకున్నావరణం తొలగించబడ్డ తర్వాత కొన్ని సూచనలు కనిపిస్తాయి. ఇవి స్వప్నములుగాను, దర్శనములుగాను, జ్యోతులుగాను భాసించును. హృదయం కొంత పరిశుద్ధమైనప్పుడు మిణుగురు పురుగులవలెను, దీపంవలెను, మంటలవలెను వెలుగులు కనిపించును. ఇంకా కొంచెం పరిశుభ్రమైన తర్వాత చంద్రునివలె ఒకవెలుగు కనిపించును. పిమ్మట అది మధ్యాహ్నభానునివలె కనిపించును. పరిపూర్ణ పారిశుద్ధ్యం కలిగినప్పుడు లోలోపల సహస్రాదిత్యులు ప్రకాశిస్తున్నట్లు కనిపించేరోజు వస్తుంది. జ్యోతులవల్ల ఆనందం కలుగుతుంది. సాధన పూర్తయిన తర్వాత సాధకునికి బైట లోపల ఆత్మదర్శనం కలుగుతుంది.

దర్శనములు, స్వప్నములు 7 విధాలు (1) పృథివీ స్వప్నములలో ఉన్నతశిఖరములు, అగాధమైన లోయలు, ఎడారులు కనిపించును. (2) జలస్వప్నములలో జలసంబంధమైన పచ్చికబయళ్లు. చెట్లు సాగుభూములు, నదులు కనిపించును (3) వాయుస్వప్నములలో తాను ఉన్నతాకాశంలో ఎగురుతున్నట్లూ, నడుస్తున్నటూతోచును (4) అగ్ని స్వప్నములలో తేజస్సంబంధమైనదీపములు ప్రకాశములు కనిపించును. (5) ఆకాశస్వప్నములలో ఆకాశమందూ, స్వర్గమందూ నడుస్తున్నట్లు, ఎగురుతున్నట్లు భాసించును. (6) నక్షత్రమయ స్వప్నములలో నక్షత్రలోకంలో, సూర్యచంద్ర లోకాలలో తిరుగుతున్నట్లుండును. (7) ఇది చివరిస్వప్నం. ఇందులో సాధకుడు తనలోని పశుస్వభావమును జయించినది, లేనిది కనుపించును. ఈవిధంగా సాధకుడు అనేక లోకములలో సంచరిస్తున్నటు తోచును, ప్రతిలోకంలో కొన్ని చిత్రములు కొన్ని కష్టములు కనిపించును. సాధకుడు వీటనే పరమావధులని ఎంచక, తనగమ్యం సాధించాలి.

ఈశ్వరసందర్శనమైనవారికి కాలం తెలియదు, శరీరం తెలియదు. అలీ దైవప్రార్థనలోఉండగా, తొడకోసి దానిలోని బాణం తీసివేశారు. అలీకి ఆబాధ తెలియలేదు. ప్రార్థనలో అహం ఉండకూడదు. సర్వసమర్పణ జరగాలి. శరీరభావంకాని, వ్యక్తిత్వంకాని ఉన్నంతవరకు ప్రార్థనకానేరదు. ప్రియునితో కలిసిన ఆత్మవిహంగం, స్వర్గాకాశములందు విహరించును. అప్పుడంతా పరమానందమే. కాలం తెలియదు. పరమాత్మ కాలంకానివాడు. శరీరం కాలస్వరూపి. ఉపనిషత్తులలో సాధన సిద్ధిస్తుందనే

సూచనలుగా పై జ్యోతులవంటివి కనిపిస్తవనీ కాలం తెలియనప్పుడు సమాధిసిద్ధి కలిగినట్టేనని చెప్పబడ్డది.

## షా లటీఫ్

సూఫీతత్త్వం అర్థం చేసుకొనటకు, ఒక సూఫీ జీవితమును క్లుప్తంగా మనవిచేస్తాను. షాలటీఫ్ సూఫీ భక్తులలో ముఖ్యుడు. సూఫీలకు సింధుదేశం ఆటపట్టు. అక్కడి ఎడారులు, ప్రకృతిసంపద సూఫీ తత్త్వం విజృంభించుటకు కారణమంటారు. పరిషియా నుండి వచ్చే యాత్రికులకు, ఇది రేవుస్థలం. అక్కడి నుండి వచ్చినవారిని, ఇక్కడి నవ్యపరిస్థితులు ఆకర్షించి ఉంటవి. షాలటీఫ్ది సింధుదేశం. ఈయన 1693 సంవత్సరములో జన్మించాడు. తండ్రి విద్యాభ్యాసమునకతనిని గురువుకప్పగించాడు. గురువు 'అలీఫ్' అక్షరము దిద్దపెట్టి, అతనిచేత అనిపించాడు. తర్వాత 'బే' అక్షరము వ్రాసి ఉచ్చరించమన్నాడు. అతను మాటాడలేదు. గురువు కోపంతో, చెయ్యి చేసుకున్నాడు. కాని శిష్యుడు లొంగలేదు. తండ్రివద్దకతనిని తీసుకువెళ్ళి, నీకుమారునికి విద్య చెప్పలేనన్నాడు. 'అలీఫ్' తర్వాతి అక్షరం అనమంటే, అనకపోయినాడని చెప్పాడు. తండ్రి జ్ఞాని. అర్థం చేసుకున్నాడు. 'అలీఫ్' అనగా అల్లా అని అర్థము. అల్లాతప్ప ఇంకొకటి లేదనే ఉద్దేశంతో రెండో అక్షరం అనకపోయినాడని తండ్రి గ్రహించాడు. పిమ్మట అతను బడిలోకి వెళ్ళటం మానుకున్నాడు. ప్రకృతి పాఠశాలలోనే కావలసిన జీవిత విద్య ఆర్జించాడు. ఆ నగరపు పాలకునికి, తండ్రి గృహవైద్యుడు. పాలకుని కుమార్తెకు జబ్బుచేసింది. తండ్రిని పిలువనంపగా, తనబదులు కుమారుణ్ణి పంపాడు. లటీఫ్ వెళ్ళి రోగినాడి పరీక్షించి, ఈశ్వరుని హస్తంలో ఉన్నవారి కెన్నటికి అపాయం లేదని అన్నాడు. రోగి నవయౌవ్వని, సుందరి. ఆసౌందర్యమునకు ముగ్ధుడైనాడు లటీఫ్. ఆమెను తనకిచ్చి పెండ్లి చేయమన్నాడు తల్లితండ్రులు ఒప్పుకోలేదు. ప్రేమ లటీఫ్ని పిచ్చివానినిగా చేసింది. తన సర్వస్వం వదిలి దేశద్రిమ్మరైనాడు. హృదయబాధ భరించలేక 'ఓ సౌందర్య స్వరూపిణీ ఎక్కడున్నావని' అరిచేవాడు. కొంతకాలం తిరిగి తిరిగి గిర్నార్, హింగ్లాజ్ పట్టణములకు చేరుకున్నాడు. అక్కడ మర్మయోగులున్నారు. వారి నాశ్రయించాడు. గురువు ప్రణవాక్షరంను ప్రసాదించాడు. ప్రణవమంత్రం కటికి చీకటిలో తనకు వెలుతురును ప్రసాదించిందన్నాడు లటీఫ్. అనేక కష్టములను భరించి ఇంటికి చేరుకొన్నాడు. ఆలోగా ప్రియురాలు తనలో నేఉన్నదని గ్రహించాడు. ఆనిష్కల్మష ప్రేమ గ్రహించి, పాలకుడు తనకుమార్తె నతనికిచ్చాడు. ఇద్దరూ పెళ్లి చేసుకున్నారు. లటీఫ్ అప్పటికే భగవదమృతం పూర్తిగా సేవించాడు. అందువల్ల స్వేచ్ఛగాను నిర్భయంగాను జీవితం సాగించాడు. తన జీవితమును భగవత్సేవకు, గానమునకు వినియోగించాడు. పారవశ్యంలో ఉండగా అతని గానప్రవాహము, కట్టలు తెంచుకుని వెలువడై ప్రవహించేది. లటీఫ్ మానవేశ్వర ప్రేమలను పై పదములుగా పాడేవాడు. మానవప్రేమ ఈశ్వరప్రేమకు మెట్టువంటిదనేవాడు. మన ముద్దుగోపాల పదములవలె ఉంటాయి ఇతని పాటలు. లటీఫ్ పాడుతూంటే, పక్కనున్నవారు, ఆ పాటలు వ్రాసికొనేవారు. కొంతకాలమునకు ఆ పాటలను సరిచూడమని లటీఫ్కు చూపించారు. అవిఅన్నీ నదిలో పారవేశాడు లటీఫ్. ఇదేమనగా, నా అహంకారమే పారవేశానన్నాడు. అటువంటి అమృతప్రాయమైనపాటలావిధంగా నాశనం చేయటం న్యాయంకాదని శిష్యులు వేడుకొన్నారు. శిష్యులలో ఒకడు ఆ పాటలన్నీ పాడగలడు. అతను పాడుతూంటే వ్రాయించి సరిచూచి ఇచ్చాడు లటీఫ్.

లటీఫ్ త్యాగరాజు, అన్నమాచార్యులవంటి భక్తుడు. ఇతడొకసారి రుద్రాక్షమాలతో నామజపం చేస్తున్నాడు. ఇద్దరు యువతులక్కడికి వచ్చారు. అందులో ఒకామె ఇంకొకతెను నీ ప్రియునితో ఎన్నిసార్లు సమాగమంచేశావని ప్రశ్నించింది. ఆమె ఆ లెక్క ఎందుకు? అతనిని నేను ఎప్పుడూ మరవనని సమాధానం చెప్పింది. ఇది విని లటీఫ్ చేతిలోని మాల విసిరివేశాడు. అనేకసార్లు ఈశ్వరుని నామం ఉచ్చరించేకన్నా, అతనిని హృదయంలో జ్ఞాపకముంచుకొనుటే ముఖ్యమన్నాడు. లటీఫ్ మాంసాహారి కాడు. అనేక లోకములున్నవని చెప్పుతూండేవాడు. చెట్లను, పక్షులను, పుష్పములను, నదులను, పర్వతములను చూచి ఆనందించి, తన్మయుడై పాడుట కుపక్రమించేవాడు. తలనెరిసి పెద్దవాడైన తర్వాత, నీ వయస్సెంత అని ఒకరతని నడిగారు. లటీఫ్ నవ్వి ఊరుకున్నాడు.

కాని ప్రశ్నించిన వారూరుకోలేదు. నీవు వయస్సు చెప్పుటకు సంకోచిస్తున్నావు దేనికన్నారు. నాకు తొమ్మిది నెలల వయస్సని చెప్పాడు. అబద్ధం చెప్పుతున్నావన్నారు. కాదు నేను సత్యం చెప్పానన్నాడు లటీఫ్. నేను భూమిమీదపడ్డ జన్మపోయింది. ఈశ్వర దర్శనమైనతర్వాత నాకు వేరు జన్మం వచ్చింది. ఈశ్వరుని ప్రథమదర్శనం చేసి 9 నెలలైందన్నాడు. అప్పటికతనికి 70 సంవత్సరముల వయస్సున్నదట. 1747 లోనో 1752 లోనో పరమపదించాడని అంటారు. భిట్ షా అనే ప్రదేశంలో ప్రతి గురువారము రాత్రిఅంతా ఇతని పాటలు పాడుతుంటారీమహా సూఫీ తత్త్వవేత్త శిష్యులు.

# ఆత్మహత్య

శ్రీ మంథా వెంకటరమణారావు

* గత సంచిక తరవాయి *

## రంగము 4

** మూడోరంగంలో లానే—తెరలేచే సరికి, గది కాళీగా ఉంటుంది. పది సెకండ్ల తరవాత రామం 'ఉస్సు' మంటూ వచ్చి కూలబడతాడు కుర్చీలో. కొంతసేపటికి డాక్టరు సంచితో లోనుండి వస్తాడు. రామం లేవబోతాడు.

డాక్టర్ : రెస్టు తీసుకో, లేవకు—

రామం : (లేచి) బాధలే—

డాక్టర్ : నామాటవిని ఒకగంటన్నా నిద్రపో—

రామం : అన్నంత సులభమా ?

డాక్టర్ : ఈ పదిరోజులయి నీసంగతే నువు పట్టించుకో లేదు—మొన్న నేకదా పడిలేచేవ్ ?

రామం : ఎలా ఉండంటారు...

డాక్టర్ : (ఐదుసెకండ్ల మౌనం) నిజానికి మొన్న ఆశంతా వదిలేసుకున్నాను......

రామం : (తలఊపుతాడు)

డాక్టర్ : ఇప్పుడు ప్రమాదం దాటింది...ప్రాణానికేం హానిలేదు...

రామం : మరేం చికాకులేదా ?

డాక్టర్ : లేదు...(రామం వేపు ఒకక్షణం చూసి) కాని ఒక సంగతి...

రామం : కళ్ళకేం కాలేదుకద...

డాక్టర్ : (విచారంగా) అదే...అదే...

రామం : పూర్తిగా......?

డాక్టర్ : చెప్పలేను...నువ్వూ చూసేవ్ కదా స్థితి... ఏమీ హానిలేపోతే అది కేవలం అదృష్టమే.

రామం : అంతేనా !

డాక్టర్ : (నిట్టూర్చి) నేనేం చెయ్యను ?

రామం : (కుర్చీలో కూలబడి, నుదురుతుడుచుకుని) ఇది చాలా అన్యాయం !!

డాక్టర్ : అన్యాయమే...ఎవరూ బాధ్యులుకారు...

రామం : (కాస్త ఊరుకుని) నేనేకారణం—

డాక్టర్ : దేనికి—

రామం : కమలస్థితికి...

డాక్టర్ : నీకు మతికూడా పోతోంది—

రామం : నేనే కారణం—

డాక్టర్ : నువ్వా ?

రామం : నాకు పరిచర్య చెయ్యబట్టే కమలకీగతి పట్టింది.

డాక్టర్ : అయితే నీకురావడానికి ఎవరు కారణం ?

రామం : మీరు అలావాదించి నన్ను శాంతపరచలేరు...

డాక్టర్ : (ఊరుకొని) ఇప్పుడు ఇది జరిగిపోయింది. ఏమనుకున్నా ఏముందిలాభం.

రామం : నా మనసులోబాధ ఎలాపోతుంది—

డాక్టర్ : ఇప్పుడు నువ్వెంత బాధపడ్డా ఒకటే...అందువల్ల మరింత నష్టం తప్ప...

రామం : నష్టమా ?

డాక్టర్ : నష్టమే. నువ్విలా బాధపడి మనసు పాడుచేసుకుంటే ఆవిడ గతేంకాను ?

రామం : మరింక దాని గతికేముంది? సంతోషమంటూ ఉంటుందా దానికి ?

డాక్టర్ : నువ్విలా అధైర్యపడితే నే ఏం చెప్పను...

రామం : ధైర్యం ఎక్కడిది ?

డాక్టర్ : ఒకచోట ఉంటుందా ? నువ్వు తెచ్చుకోవాలి...అది నీ మనసులోనే ఉంటుంది....

రామం : ధైర్యం వచ్చాక ? ఏం చెయ్యడం ? ఏమీ లేదు...

డాక్టర్ : ఆవిడకి సంతోషమంటూ లేదన్నా వే, ఆవిడకి ధైర్యమూ, సంతోషమూ రెండూ ఇవ్వగల గాలి...

రామం : అది సాధ్యమా ?

డాక్టర్ : సాధ్యం కాకపోతే లోపం నీది...

రామం : (ఆలోచించి) ఔను ... (లేచి...అసహజంగా) నే తప్ప ఎవరున్నారు ... (ఆవేశం తెచ్చుకుని) ఇలా అన్నా ఋణం తీర్చుకుంటాను! కమల నోసారి చూసివస్తాను... ఎందు కనకండి...నాకిప్పుడు ధైర్యం కావాలి...

(రామం లోనికి వెళ్ళగానే సరోజ వస్తుంది)

సరోజ : నమస్కారం...

డాక్టర్ : నమస్తే...

సరోజ : ఎలా ఉంది డాక్టర్ గారూ ?

డాక్టర్ : ప్రమాదం దాటింది...

సరోజ : (ఎదురుగా గోడకి ఉన్న దేవుడి పటానికి నమస్కరించి, కుర్చీలో కూచొని, కళ్లొత్తుకుంటుంది).

డాక్టర్ : మీరు అట్టే రావడం మంచిది కాదు-

సరోజ : నాకేం భయం లేదు...

డాక్టర్ : మీకు భయంలేనంత మాత్రాన రోగం మిమ్మల్ని చూసి భయపడుతుందా ?

సరోజ : రావాలని ఉంటే ఎక్కడన్నా వస్తుంది-

డాక్టర్ : మన జాగ్రతలో మనం ఉండడం మంచిది.

సరోజ : ఎన్నాళ్లు పడుతుంది కోలుకుందుకి ?

డాక్టర్ : మరో నెల్లాళ్ళు...

సరోజ : (పదిసెకెండ్లు ఊరుకుని) డాక్టర్ గారూ ... కొంత కాలానికన్నా కమల ఎప్పట్లా నే...

డాక్టర్ : నే నేమీ చెప్పలేను ... చూడనే చూసేరు కదా...ఎంత తీవ్రంగా వచ్చిందో ఈ విడకి...

సరోజ : ఏమన్నా ఆశించవచ్చునా ?

డాక్టర్ : నే ఏమీ చెప్పలేను...కళ్ళ సంగతికూడా అనుమానంగానే ఉంది...

సరోజ : (లేస్తూ) కళ్లా !

డాక్టర్ : (ఔనన్నట్టు తలఊపుతాడు)

సరోజ : (కూలబడి) అయ్యో కమలా ! (చీర చెరగు అడ్డుపెట్టుకొని నిశ్శబ్దంగా ఏడుస్తుంది.)

డాక్టర్ : కరడుకట్టిన నాకూ ఎంతో బాధగానే ఉంది...ఎంత చలాకీఐన పిల్ల ...(ఊరుకుని) ఇలాటివి జరుగుతూ ఉంటాయి...ఎవరూ ఏమీ చెయ్యలేరు...

(రామం వస్తాడు)

డాక్టర్ : (రామాన్ని చూసి) ఇప్పు డామెకి ధైర్యాన్నిచ్చే బాధ్యతల్లా రామంది...

రామం : (ఒకక్షణం ఊరుకొని) నాలో నాకే నమ్మకం లేదు-

డాక్టర్ : ఈ క్షణం నీకలా అనిపిస్తోంది. సావధానంగా ఆలోచించు...ఆమెపట్ల నీకర్తవ్యం...

రామం : కర్తవ్యమా... ? ఔనాను...కర్తవ్యముంది-

డాక్టర్ : మనసుకి నేను మందివ్వలేనుకదా...

రామం : ఏంచేసేందుకూ పాలుపోడం లేదు...

డాక్టర్ : నువ్వామెకి అండగా ఉండి, ధైర్యం కలిగించాలి- నువ్వెప్పుడూ తనతో నే ఉన్నావన్న నమ్మకం ఆమెకి కలగాలి....

రామం : నాలో కమలకి నమ్మకం లేదనుకుంటున్నారా డాక్టర్ ...

డాక్టర్ : ఈ సంగతి అతి సున్నితమైనది...ఆవిడ మానసికంగా బాధపడవచ్చు...నీకు తెలుసు....నా నోటంట చెప్పించకు...అందు కామెకా అనుమానం...

రామం : ఎప్పుడూ లేదు...ఎప్పుడూ లేదు...ఆ మాట కొస్తే నే నే ... (ఆగిపోయి తల అడ్డంగా ఊచి) ఊఁహుఁ ... (సరోజవేపు అనుమానంగా చూసి) నువ్వెందు కిక్కడున్నావ్ ?

సరోజ : (ఆశ్చర్యపోయి) ఆదేమిటి రామం !

రామం : నిన్నెవరు రమ్మన్నారు ?

సరోజ : నా మానాన నే వచ్చేను...

రామం : రాకు...

డాక్టర్ : ఇవేం మాటలయ్యా రామం.

సరోజ : ఎప్పుడూ వస్తున్నా కానా...

రామం : ఇంక రాకు...నీకేమయినా అయితే ఎవరు పూచీ పడతారు ?

డాక్టర్ : హా ... అదా ... (నవ్వుతాడు) నిజమే... నిజమే.

సరోజ : మొన్న రాగా లేంది ఇప్పు డే మొచ్చింది ?

రామం : సరే...సరే...మీ ఆడజాతి కో నమస్కారం--మొండిపట్టుపట్టిన దానిగతి అలాఅయింది..

సరోజ : నాకేం అవదు...

రామం : అదుగో 'వానిటీ' తక్కినవాళ్లకన్నా నువ్వేదో వేరనుకుంటున్నావ్...ఔనా?

డాక్టర్ : (చిరాకుగా చూసి) సరే... నే ఇంక వెళ్తాను.. నే చెప్పింది గుర్తుంచుకో...

రామం : (ఇది జ్ఞాపకం వచ్చినవాడిలా అయి) ఉంచుకుంటాను...కమల సుఖంకన్న నాకు కావల్సిందేముంది?

(డాక్టర్ వెడతాడు)

సరోజ : ఎందుకలా విరుచుకుపడ్డావ్ ?

రామం : నీకిప్పుడు సంజాయిషీ ఇచ్చుకోవాలా?

సరోజ : (ఊరుకొని) రామం — డాక్టర్ గారన్నది నిజమే?

రామం : ఏమన్నారు?

సరోజ : కళ్ళగురించి...

రామం : (చిరాగ్గా) నీతో ఎందుకు చెప్పేదు?

సరోజ : అర్థంలేని ప్రశ్న.

రామం : అర్థం లేదూ?

సరోజ : లేదు.

రామం : నువ్వింక వెళ్ళు...దాని కర్థముందా?

సరోజ : లేదు.

రామం : లేదూ?

సరోజ : లేదు...

రామం : (కుర్చీలో కూలబడతాడు) (సరోజ లోనికి వెళ్ళబోతుంది) వెళ్ళకు...

సరోజ : వెళ్ళను...కమలని చూసి—

రామం : అక్కడికే, వెళ్ళకు—

సరోజ : ఏం?

రామం : నీయిష్టమా నాయిష్టము?

సరోజ : ఇష్టం. అయిష్టం ప్రశ్నేలా? చూడటం తప్పా?

రామం : ఎందుకు నీకా క్యూరియాసిటీ?

సరోజ : ఇవాళ నీ తత్వం ఎందుకిలా ఉందో అర్థమవటం లేదు.

రామం : అర్థం చేసుకుందుకి ప్రయత్నించకు—

సరోజ : కమల స్థితి చూడగా అలా ఉంది...ఈ నీధోరణికి అర్థమేమిటి?

రామం : ఒకటే అర్థం...మాటాడ్డం తప్ప ఇప్పుడు చెయ్యగలిగేదేమీ లేదు...

సరోజ : ఈమాటలు కాదు...

రామం : కానీ ఏం మాటాడాలో నువ్వు మాటాడు...

సరోజ : అనవసరం...

రామం : అనవసరం అయినది ఏదీ లేదు...అర్థంలేని వాగుడుకూడా ఆ మనిషి మానసికస్థితి నిరూపణే......

సరోజ : సంజాయిషీ ఒద్దులే—

రామం : (ఊరుకొని) చెడ్డవాళ్లని శిక్షించి, మంచివాళ్ళని రక్షిస్తాట్ట దేవుడు...

సరోజ : నీ మానసిక స్థితి నిరూపణే అనుకోవాలా ?

రామం : చెప్పకు—మా విషయంలో ఇది అక్షరాలా నిజం...

సరోజ : (ఆశ్చర్యపోయి, కుర్చీలో కూచొని) ఎవరా చెడుమనిషి కమలా?

రామం : (లెంపలు వేసుకుని) నేను...

సరోజ : నీకేమయింది?

రామం : ఇంకేమవాలి?

సరోజ : ఔను...నీకేమయింది?

రామం : ఏమీ అవలేదా?

సరోజ : నీకేమీ కాలేదు — బాధ పడుతున్నది కమల...

రామం : అంతే అంటావా?

సరోజ : అంతే...

రామం : నీకు మనసు లేదు...

సరోజ : ఎలా పోల్చేవ్ ?

రామం : నే ఎంతబాధపడేదీ గ్రహించకపోయేవ్...

సరోజ : క్షమించు రామం...నువ్వు బాధపడుతున్నావ్...నాకు తెలుసు...కాని శిక్ష అనుభవించేది కమల...కాదూ?

రామం : డాక్టరన్నదే అయితే నేనూ శాశ్వతంగా ఆబాధ పంచుకోవాలా ఒద్దా?

సరోజ : (ఆశ్చర్యపోయి) ఏమిటీ? నువ్వింత...!

రామం. నేను...ఏమిటి?

సరోజ : (చురుగ్గా చూసి) ఇంత స్వార్థపరుడవనుకోలేదు.

రామం : (ఆవేశంగా లేచి) ఏమిటంటున్నావ్ ? ... నేనా? ఎలా? చెప్పతల్లీ చెప్పు? కమలని నా ప్రాణసమానంగా చూసుకుంటున్నాను...కమల బాధ నాబాధ కాదూ? అందుకు నేను స్వార్థ

పరుశా? నీకిదే అభిప్రాయం ఉందన్నమాట... ఇదివరకల్లా నా మోహంముందర దానికి అవకాశం దొరకలేదు ... ఇలా అవకాశం దొరికిందని... నువ్వేదో అపోహలో ఉన్నావు సరోజా ... కమలే నాకన్నీ...కమల ఋణం ఎలా తీర్చుకోను!

సరోజ : తప్పు మాటంటే క్షమించు రామం ... అంత ఆవేశపడి నోరు పెట్టకు — నే నేం అపోహపడ లేదు...పాతనాటకమంతా ఆడకు — నాకు చిరాకు...

(లేచి గదిలోకి వెళ్తుంది)

రామం : నాటకమా? నాటకం నీది...వినూ...నాటకం నీది...

(తల్లి వస్తుంది)

తల్లి : ఏమిటారోయ్ రామం ... కమల మగతగా నిద్రపోతోంది...

రామం : (తల రెండు చేతులతోనూ పట్టుకుని, మోచేతులు టేబిల్ మీద ఆన్చి) ఈ బాధ, చీదర, దుఃఖం ఇంకా అనుభవించాలా? నే నేపాపం చేసేను!

తల్లి : ఏమిటి వాలకం?

రామం: వాలకమే—చావ వల్సినవాణ్ణి బతకడం వాలకం కాదూ? బతికి ఈ బాధలన్నీ అనుభవించడం.

తల్లి : ఏ బాధలు?

రామం: ఏమీ లేదు. నీకర్థం కాదు...

తల్లి : ఎపుడూ పొరపాటునన్నా అలా అనకు ... కమల చెవిని పడ్డాయంటే...(కళ్ళొత్తుకుని) పిచ్చితల్లి ... దేవుడిది రాతిమనసు ... దానికీ శిక్షలా?

రామం: నే నేకదమ్మా కారణం?

తల్లి : నువ్వా!?

రామం: నా కాచాకిరీ చెయ్యక చావనిచ్చి ఉంటే ఈ బాధలేవీ ఉండకపోను కదా?

తల్లి : అనుబాబు అను...తెలిసిఉండి అన్నమాటలకి నే నేం జవాబు చెప్పను?

రామం: (ఆలోచించి) మరోలా అనుకోకమ్మా... ఏదో చిరాకుగా ఉండి అనేసేను...

తల్లి : (కళ్ళొత్తుకొని) నాకు తెలుసుబాబూ దానిమీద నీకెంత ఆపేక్షో .. నాకు తెలుసు. ఇన్నాళ్లూ తిండీ నిద్రా లేక దాని మంచం దిక్కే కూచున్నావే.

రామం: ఎక్కడా వ్యాయామం లేదు...ఏం చేసిందని...

తల్లి : నువ్వే ధైర్యం వదులుకుంటే నామాటేం చెప్పేవ్ బాబు — నా గుండె తరుక్కుపోతోంది.

రామం: నువ్వేమీ బాధపడకమ్మా ... అంతా నే చూసుకుంటాను...

తల్లి : అలానే కానీ బాబు...కాని నువ్వేం పిచ్చి పిచ్చిగా ఆలోచించకు...దాని బాధ చూడలేక నీకలా అనిపిస్తుంది...

[తల్లి వెళ్తుంది. రామం చిరాగ్గా ముఖంపెట్టి ఆలోచనలో పడతాడు—ఒక నిమిషం గడుస్తుంది. ఎక్కడినుండో ఒక ప్రేమగీతం రికార్డు వినవస్తూ ఉంటుంది. సరోజ వస్తుంది]

రామం: చూడడమయిందా?

సరోజ: ఉఁ—

రామం: ఏఁవిఁటి చూసేవ్?

సరోజ: ఏఁవిటి చూస్తాను? కమలని...

రామం: ఎలా ఉంది...

సరోజ: నిద్రపోతోందిలా ఉంది—

రామం: కూచోవు?

సరోజ: నే వెళ్లాలి...

రామం: జరూరు పనేమన్నా ఉన్నాయా?

సరోజ: టౌన్‌హాల్లో ఏదో 'పెర్ ఫారమెన్సు'ంది— నాకసలు వెళ్లాలని లేదు...విశాల మొండికెత్తి కూచుంది.

రామం: ఔనౌను....ఈ సంగతులే మర్చిపోతున్నాను.

సరోజ: (కూచుంటూ) మనసుకి శాంతిలేనప్పుడు ఎవరికన్నా అంతే...

రామం: (వినవట్టు) మనిషికి వినోదాలు అవసరమన్న సంగతే మరిచిపోతున్నాను....

సరోజ: మనసుకి శాంతిలేనప్పుడు ఎవరికన్నా అంతే.

రామం: టౌన్‌హాల్‌లో పెర్ ఫారమెన్సుందా?

సరోజ: ఉంది...

రామం: ఏం పెర్ ఫారమెన్సు?

సరోజ: నాటకలు. చిన్న నాటిక...

రామం: ఏ నాటిక?

సరోజ: గుర్తులేదు.

రామం: నువ్వెళతావా?

సరోజ: (కోపంగా చూసి, అనక చిరునవ్వు తెచ్చుకుని) వెళితే వెళ్ళొచ్చు....

రామం: విశాల మొండికెత్తిందా?

సరోజ: (సిగ్గుపడి) ఎవరన్నారు?

రామం: కలొచ్చింది లే.

సరోజ: ఇంకేమొచ్చింది కల?

రామం: మరేం రాలేదు—

సరోజ: సరే....ఇంక...వస్తా...(లేవబోతుంది)

రామం: (చెయ్యిపట్టుకుకూచో బెట్టి) ఓ ఐదునిముషాలు ఈ నిర్భాగ్యుడితో మాటాడితే కష్టనష్టాలున్నాయా?

సరోజ: (కూచొని 'ఎమ్యూజింగా' చూస్తుంది)

రామం: ఆఁ హోఁ...అయితే నోకలా?

సరోజ: ఏది?

రామం: టౌనుహాలు...

సరోజ: అదా...ఔను...

రామం: నీకు శాస్త్రీయం ఇష్టమా?

సరోజ: ఇష్టమే—

రామం: ఏదయినా ఇష్టమయితే మనసుకు హాయిగా ఉంటుంది కదూ?

సరోజ: ఒకో అప్పుడు ఉండదు...

రామం: ఎప్పుడెప్పుడు?

సరోజ: ఒకోప్పుడు—

రామం: ఇవాళ హాయిగా ఉండొచ్చు...

సరోజ: ఉండొచ్చు...

రామం: హాయిగా అంటే ఆనందంగా...

సరోజ: ఔను...

రామం: హాయిగానూ...ఆనందంగానూ ... ధ్వనిలో ఏకమయి...ఔనా?

సరోజ: ఔను...

రామం: (చిరునవ్వు నవ్వి) సంతోషిస్తావా? ఆనందిస్తావా...ఇవాళ?

సరోజ: (చిరాగ్గా) ఏదో ఏడుస్తాను...

రామం: మీ విశాల సంతోషిస్తుందా......ఆనందిస్తుందా?...

సరోజ: అవిణ్ణడుగు...

రామం: మీ ఇద్దరూ సంతోషించి ఆనందిస్తారా?

సరోజ: (కోపంగా) ఏదో ఏడుస్తాం...

రామం: ఏడుస్తారా? అయ్యో...అయ్యో...ఇక్కడికి రాకపోవల్సిందే...

సరోజ: ఏం?

రామం: కమలని చూసేవ్—ఈ స్వాళ్లమంతా మనసులో పెట్టుకున్నావ్...నీ సంతోషమంతా ఏడుపు కిందికి మారిపోతుందే అని నా భయం...

సరోజ: ఆఁ!

రామం: మారదా? అయితే నీకు కమలమీద ఏమీ ప్రేమ లేదన్నమాట—

సరోజ: అన్నీ నువ్వే వల్లిస్తున్నావ్...

రామం: ఏడుపుకింద మారుతుందా? మీ విశాలతో అక్కడికి వెళ్లక తప్పదని తెలిసి, ఇక్కడికొస్తే మనసు విచారంగా అయిపోతుందని తెలిసికూడా వచ్చేవ్...ఎందుకమ్మా అంత ఆత్రం? అంత క్యూరియాసిటీ?

సరోజ: నా మనస్సు ప్రతిమాట్నీ 'ఎనలైజ్' చేసి చెప్పాల్సిన అవసరం నీకూ లేదు...నాకూ లేదు...నే వెళ్తున్నా...

రామం: ఆగాగు...నాటకం చూస్తావా?

సరోజ: ఏదో చేస్తాన...

రామం: చూడు...చూడు...ఎలా నటించాలో తెలుస్తుంది...

సరోజ: రామం, నా మనస్సు కష్టపెట్టాలని చూస్తున్నావ్...ఏమిటి నీకా ఆనందం?

రామం: సలహా ఇస్తున్నాను...

సరోజ: థాంక్స్—అక్కర్లేదు...

రామం: ఇందాక ఏమన్నానో జ్ఞాపకం వుందా?

సరోజ: ఏమన్నాను?

రామం: జ్ఞాపకం లేదూ?

సరోజ: ఓమాట అడగనా?

రామం: అడుగూ...

సరోజ: నే సంతోషంగా వుండడం నీకిష్టం లేనట్టుంది...

రామం: ఇదొక్కడి చోద్యం. ఈ ప్రశ్న యెవరు వేస్తారో తెలుసా...పెళ్లాం కాని...ప్రియురాలు కాని...

సరోజ: (కోపంగా) మాటలు సరిగా రానీ...నే సంతోషంగా ఉంటే నీకెందుకూ అసూయ...

రామం : ఔను. నాకెందుకూ అసూయ?

సరోజ : నువ్వే చెప్పాలి—స్నేహం ఉన్నంత మాత్రాన నా సుఖ దుఃఖాలమీద నీకేం హక్కుంది?

రామం : ఔను... ఏం హక్కుంది?

సరోజ : మరీ నాటకమంతా ఏమిటి?

రామం : నువ్వే చెప్పాలి... నాటకం నీదికాబట్టి.

సరోజ : నాదా?

రామం : ఔను...

సరోజ : నాదా?

రామం : నీదే...

సరోజ : ఏమిటో సెలవిస్తారండి రామారావ్ గారూ?

రామం : చిత్తం... మనవిచేసుకుంటాను... కష్టం తోస్తే క్షమించండి... తమకి ఇదివరకు కమలని చూస్తే అసూయ... ఇప్పుడు కమలనిచూస్తే 'శాడిస్టిక్ ప్లెషరు'...

సరోజ : (కళ్ళు అంతెంతలుచేసి) ఏ...మి...టీ!!

రామం : చిత్తం... కమల తమకన్నా అందమయినదని, ఈ భృత్యుడు తమని కాదని కమలని పెళ్లాడేసని, కమల అందం తమకి అసూయ హేతువు...

సరోజ : (నెర్వస్‌గా నవ్వి) నాకా? కమలనిచూస్తే అసూయా? నువ్వెవర్నో పెళ్లాడితే, నాకెందుకూ మత్స్యని అసూయ...

రామం : ఈ నిర్భాగ్యజీవిని తమరు ప్రేమిస్తున్నారు కనక...

సరోజ : (గుండెమీద చెయ్యి వేసుకుని) అమ్మ బాబో! ఏమిటీ అహంనీకు! నిన్ను నే ప్రేమిస్తున్నానా? తమలో ఏంజూసో, సెలవిస్తారా?

రామం : ఆ రహస్యం షేక్స్పియర్ ల వారికే అవగాహన కాలేదు...

సరోజ : నువ్వు ... నువ్వు... (మాటలు పెగలక, కోపం పట్టలేక ఏడుస్తూ కుర్చీలో కూలబడుతుంది)

రామం : కమల ఇప్పుడీ స్థితిలో ఉందికదూ... పెద్ద విజయం సాధించినట్లనిపిస్తోంది నీకు...నీ అసూయంతా దాని బాధ, దాని స్థితి చూసేక ఆనందంకింద మారింది... ఈ జబ్బు దానికొచ్చిందని తెలీగానే నీ గుండెల్లోనుండే బరువు పోయింది... "హమ్మయ్య" అనుకున్నావ్...

సరోజ : ఇంక ఆపు...

రామం : ఈ సంగతి చూడు... కొత్త ప్రచారంలో ఉన్న రచయితంటే అసూయ ఉంటుంది... వాడికి పేరు ప్రఖ్యాతు లొచ్చేస్తున్నాయే అని కొత్త కష్టంగానే ఉంటుంది .... దురదృష్ట వశాత్తూ అతడికి కేదయినా దుఃఖం లోతులలోమాత్రం చెప్పలేని 'రిలీఫ్' కలుగుతుంది...

సరోజ: (కళ్లొత్తుకుని లేచి రామం కళ్ళలోకి నిదానంగాచూసి) నిజమైనమాట చెప్పనా?

రామం. అంతకన్నానా!

సరోజ: నే నిన్ను ప్రేమించినమాట నిజం...

రామం: (గర్వంగా చిరునవ్వు పారేస్తాడు)

సరోజ: కాని నా గురించి నువ్వన్నదంతా నీకు వర్తిస్తుంది...

రామం: (దెబ్బతిన్నట్టయి) ఏమన్నావ్? ఏంకూసేవ్?

సరోజ: నువ్వు వర్ణించినదంతా అనుభవించింది నువ్వు ... నాటకమాడేది నువ్వు ... (కసిగా వేలు చూపించి) ను... వ్వు...ఇన్నాళ్ళయి ఆపాటి తెల్సుకోలేవా?

రామం: (పళ్ళుబిగించి ... టేబిల్ గుద్ది) నేనా... నేనా!

సరోజ: మనుష్యులతత్వం నీకెంత తెలుసో, నాకూ అంత తెల్సు...

రామం: తెల్సా? సిగ్గులేని...(మాటలురాక సరోజ జుత్తుపట్టుకుంటాడు)

సరోజ: (కెవ్వున కేక వేస్తుంది)

రామం: (ఆశ్చర్యపోయి వదిలేస్తాడు)

లోనుండి తల్లి: యేమయిందమ్మా సరోజా...

సరోజ: (చిరునవ్వు నవ్వి ... గర్వంగాచూసి) ఇవీ అసలు రంగులు...

రామం: (పిడికిళ్ళు బిగించి ఆమెమీద పడబోగా ఆమె తప్పించుకు, చిరునవ్వు నవ్వుతూ పోతుంది— తల్లి వచ్చి వింతగాచూస్తూ ఉండిపోతుంది... రామం పిడికిళ్ళుబిగించి నిల్చుంటాడు...)

[తెర]

## రంగము: 5

[అంతా నాల్గోరంగంలానే— రామారావ్ కుర్చీలోకూచొని చదువుకుంటూ ఉంటాడు. కమల తడుము కుంటూవస్తుంది...ఆమె ముఖం నల్లగా మారింది—ముఖంలో మునుపటి కళా కాంతులు పోయేయి]

కమల: ఏమండి...

రామం: (లేచి త్వరగావెళ్ళి ఆమె చెయ్యి అందుకొని) అమ్మలేదూ ?

కమల: పిన్నిగారింటికి వెళ్ళేరు...

రామం: నన్ను పిలవరాదూ ?

కమల: అలవాటు చేసుకోవద్దూ...

రామం: క్రమేపీ అలవాటవుతుంది - తొందరేల ?

కమల: మీకు పని కల్పించడం నా కిష్టంలేదు..

రామం: నయం: చెప్పేవ్... అలాటి పొరపాటు పనులెప్పుడూ చెయ్యబోకు ..

కమల: ఎన్నాళ్లు చెప్పండీ...

రామం: ఎన్నాళ్ళయితే అన్నాళు...రానురాను నీ కలవాటయి పోతుంది...ఇంట్లో ఏవస్తువ ఎక్కడుందో కూడా తెలుస్తుంది...వంటకూడా చేసి పెట్టగలవ్... (నవ్వుతాడు)

కమల: నవ్వకండి... నే అంతపనీ చేస్తాను..

రామం: చెయ్యలేవనా.. ఈ కుర్చీలో కూచో

కమల: ఒద్దు...మీరు కూచోం డండులో ... నన్ను మీపాదాల దగర కూచో నీండి—

రామం: నీ యిష్టం .... (కుర్చీలో కూచుంటాడు... ఆమె కిందని కూచుంటుంది. కొంతకాలం మౌనం) కమలా...

కమల: ఏ మండీ ?

రామం: నీ దుఃఖాలోచనలు తగ్గేయా ?

కమల: (నవ్వి) తగకపోతే మీ రూరుకుంటారా ....?

రామం: (కమల చెయ్యితీసుకొని, నీ సంతోషమే నా క్కావల్సింది...

కమల: మీకు నామీద అంతదయ ఉండగా సంతోషం కాక ఏ ముంటుంది నాలో ..

రామం: జరిగిపోయినవన్నీ మర్చిపో...మనం కొత్తగా కాపురం పెట్టేం అనుకో...

కమల: వెనుకటూ మీ కబుర్లు...

రామం: ఔను - పాతరామం లేడు - పాత కమలా లేదు. ఇకనంతా తృప్తి... సంతోషం తప్ప వేరేమీ లేదు...ఎప్పుడూ ఇలానే ఉంటుంది...

కమల: అంతకన్న ఏం కావాలి నాకు! నే మీకు భారమనిపించకుండా ఉంటే అంతే చాలను కున్నాను ...

రామం: మళ్లీ మొదలెట్టేవ్ ?

కమల: కాని నా అదృష్టం పండింది - మీ దయ, ప్రేమ నా కున్నాయి ....

రామం: నే మనిషిని కా ననుకున్నావా ....

కమల: ఎంతమా టన్నారు!

రామం: ఇకదీనిగురించి ఆలోచించి మనసు పాడు చేసుకోకు .... ఊరికే అన్నాను.

కమల: (అతని కాళ్లకి తల అన్చి) ఈ కాలంలో దేవుడిలా తక్కువ మందికి నమ్మకం.

రామం: నీకుందా?

కమల: బాగా ఉంది....

రామం: నీకేమన్నా వరాలిచ్చేడా?

కమల: ఇచ్చాడండీ....

రామం: ఏమిటో....

కమల: నా క్కావల్సినదేముంది? మీ మనసుకు శాంతి

రామం: (ఉలికిపడి) నా మనసుకు శాంతా?

కమల: ఔనండీ—మీ మనసులో అశాంతి పోవాలని ప్రతిరోజూ కోరుకున్నాను—అతడికి దయ కలిగింది.

రామం: ఇప్పుడు నాలో అశాంతి లేదంటావా?

కమల: లేదండీ....

రామం: నీకెలా తెల్సు?

కమల: నాకు తెలీదనుకున్నారా? మీ మనసెలా ఉన్నదీ నాకు తెల్సిపోదా?

రామం: ఆశక్తికూడా దేవుడిచ్చేడా?

కమల: ముందునుంచీ ఇచ్చేడు.

రామం: ముందునుంచీ నా మనసు నీకు తెల్సా?

కమల: తెల్సు....

రామం: నా మనసులో ఏమున్నదీ తెల్సా?

కమల: అప్పుడు మీలో అశాంతి ఉండేది...ఇప్పుడది పోయింది....

రామం: ఎందువల్ల ఉండేదో...ఎందుకు పోయిందో తెల్సా?

కమల: అంత తేల్చుకోగలిగే శక్తి నాకు లేదండీ—.

రామం: పోనీ ఎంత తెలుసుకున్నావ్?

కమల: నా మనసుకి ఒక అనుభవంలా అవుతుంది... మాటలో చెప్పలేను... నాకే పూర్తిగా తెలీదు తెల్సినట్లే ఉంటూ.... కాని మీరు సంతోషంగా ఉన్నదీ, విచారంగా ఉన్నదీ తెల్సిపోతుంది—ఇప్పుడు నా మనసెంతో సంతోషంగా ఉంది!

రామం: నువ్వు సంతోషంగానే ఉన్నావ్... కాని ఆ మాట నువ్వనడం ఎంత హాస్యాస్పదంగా ఉందో తెల్సా? ఎలా ఉండే దానివి... ఎటువంటి స్థితి వచ్చింది!.

కమల: కోపం తెచ్చుకోరుకదా?

రామం: ఎందుకు?

కమల: ఓ మాటడుగుతాను—.

రామం: నువ్వేమడిగినా కోపంరాదు.

కమల: (క్షణం ఊరుకొని) ఓసారన్నాను... ఇది నమ్మే రోజొస్తుందని....

రామం: ఏది కమలా?

కమల: (సిగ్గుపడుతూ) మీరే నాకు సర్వం అంటే ఇపుడు నమ్ముతారా?

రామం: (ముఖం పాలిపోతుంది... గొంతులో మార్పు కనబడనీయకుండా) నీలో నాకపనమ్మకమా! ఎప్పుడూ లేదు.

కమల: అదే దేవుణ్ని కోరుకున్నాను.

రామం: ఏది?

కమల: నన్ను మీరర్థం చేసుకోవాలని...

రామం: అప్పుడర్థం చేసుకోలేదనుకున్నావా?

కమల: ఒక పల్చటి తెర అడ్డుగా ఉండేది... ఆ తెర పోయింది...

రామం: (ఒకక్షణం మౌనం) ఆ సంగతులు మర్చిపోవలసినవి కమలా... అవి తల్చుకుంటే సిగ్గూ, బాధా తప్ప మరోటి లేదు...

కమల: మీరామాటలనడం నాకెంతో హాయిగా ఉంది. ఆ తల్లి దయకలది... ఈ జబ్బువల్లే నాకు మీరు దగ్గరయ్యేరు...

రామం: నే ఒప్పుగోను- నా పొరపాటు నాకు తెల్పేందుకు నువ్విస్థితికి రావాలా?

కమల: మీ దే పొరపాటు లేదు. మీరు నన్నర్థం చేసుకోగలిగేరు... అంత కన్నా నాకేం కావాలి...

రామం: నువ్వన్నను... నే ఒప్పను... నువ్వన్న తెర కాలక్రమమున పోను- నీకీస్థితి కేవలం ప్రమాదవశాత్తు వచ్చింది... నువ్విలా అవబట్టి నాకు శాంతి కలిగిందని నువ్వనుకుంటున్నావా?

కమల: ఓసారి మీరన్నారు- "నిన్నసహ్యించుకునేపాటి అదృష్టమూ అని" అప్పుడు కోరుకున్నాను.

రామం: నిన్ను నే అసహ్యించుకోవాలని కోరుకున్నావా?

కమల: అందువల్ల మీకు శాంతి ఉంటుందేమో ననుకున్నాను మొదట- కాని నాది పొరపాటని తెలుసుకున్నాను తరవాత. నన్నసహ్యించుకుంటే మీకు మరింత అశాంతి... ఆ కోరికని రద్దు చెయ్యమని మళ్ళా దేవుణ్ని కోరుకున్నాను.

రామం: కాని నీ రెండో కోరిక వినలేదు అతను...

కమల: (బిత్తరపోయి, భయంగా) ఏమండీ, నే మీకు జుగుప్స కలిగిస్తున్నానా?

రామం: (నవ్వి) నీకెందుకా భయం కమలా?...... ఎందుకలా వణికిపోతున్నావ్?...

కమల: మీకు జుగుప్సకలిగిసే నే బతకడంలో అర్థం లేదు... నిజం చెప్పండి...

రామం: ఎప్పుడన్నా నీ మీద నాకుండే మమకారం అపేక్ష పోతాయనుకుంటున్నావా పిచ్చీ! (నవ్వుతూ తలనిమురుతాడు)

కమల: (నిట్టూర్చి) నాకింక ఏ కోరికా లేదు...

రామం: ఏ కోరికా లేదు?

కమల: లేదు...

రామం: మాటవరసకి నేను నీపట్ల విశ్వాసంగా ఉండాలని...

కమల: మీ విశ్వాసాన్ని పుంజుకోనేందుకు నాకేం హక్కుంది?

రామం: నన్ను పెళ్ళాడబట్టి...

కమల: మీకది స్వతస్సిద్ధంగా ఉంటుంది—

రామం: ఉండనప్పుడు...

కమల: అది నా దురదృష్టం...

రామం: నువ్వు బాధపడవ్వూ?

కమల: మీలో నాకు నమ్మకం ఉంది. నాకు బాధ కలి
గించే పనులేమీ మీరు చెయ్యరు.

రామం: అదో కోరిక అవునా కాదా?

కమల: నేనేమీ కోరను—అయినా నిశ్చింతగా ఉండ
గలను...మీలో నాకు నమ్మకం ఉంది—

రామం: నీ నమ్మకం చూస్తే నాకు భయం వేస్తోంది.

కమల: భయమా? ఎందుకండీ?

రామం: నే ఎప్పుడన్నా పొరపాటు చెయ్యొచ్చు—
అప్పుడప్పుడు నువ్వు శాశ్వతంగా బాధ
పడొచ్చు...

కమల: (భయపడుతూ) అంటే మనిద్దరి మధ్యా తెర
మళ్లా రావచ్చంటారా?

రామం: పిచ్చిదానా! నువ్వెప్పుడూ చెడు ఫలితాలే
కోరుకుంటావ్...

కమల: వాటికి తయారుగా ఉండడం మంచిదికదూ?

రామం: నువ్వు తయారుగా ఉన్నావా?

కమల: దేనికి?

రామం: తెర—

కమల: లేనండీ...ఎప్పుడూ ఉండలేను — అదినాకు
సాధ్యం కాదు—ఈసారి నాకింక బతికే అర్హతే
ఉండదు...

రామం: (నవ్వి) నన్ను చాలా ఇరుకున పడేసేవ్...

కమల: (ఆత్రంగా) పొరపాటేదయినా అయితే
చెప్పండి...

రామం: పొరపాటున ఎప్పుడన్నా నీకు తప్పుగా కని
పించే పనేదన్నా చేశానేమోనని ప్రతినిముషం
జాగ్రత్తగా ఉండడం ఎంతకష్టం!

కమల: అయ్యొ! కావాలని జాగ్రత్త వద్దండీ—మీ
మానాన మీరుండండి... పొరపాట్లే మీ రావు
...మీమనసు చూసుకుంటుంది...

రామం: నా మానాన నన్నొదిలీ కమల—అంటే
నేనే పొరపాటూ, తప్పులూ చేసినా నువ్వెప్పు
డూ నాకు ఆప్తురాలవే. అది నువ్వు నమ్ము...

కమల: నేను మిమ్మల్ని నిర్బంధిస్తున్నట్టనిపిస్తే
క్షమించండి...నా కెప్పుడూ ఆ అభిప్రాయం
లేదు...

రామం: నే అనేదల్లా నన్ను అంతగా నమ్మవద్దని...
నాకు ఊపిరి సలపదు...(నవ్వుతాడు)

కమల: మీ ఆత్మలో నాకు విశ్వాసముంది...

రామం: గీత వర్ణించబోకు...

కమల: మీరు స్వేచ్ఛగా ఉండండి... మీ ఆత్మ
చూసుకుంటుంది...

రామం: నీకు చాదస్తం మరీ ఎక్కువవుతోంది...

కమల: అత్తయ్యొచ్చేరు...

(కమల లేస్తుంది)

రామం: నువ్వెక్కడికి?

కమల: కూచుంటే అవుతుందా? అత్తయ్య కాఫీ
కెక్కడిది?

రామం: (నవ్వి) నువ్వెళ్లి ఇంక సాయపడతావా?

కమల: నవ్వకండి—కూచోని కూరలు తరగడమో...
గిన్నెలు కడిగి అందించడమో చెయ్యొచ్చు కదా?
క్రమంగా అన్ని పన్లూ చెయ్యగలను... (నవ్వి)
మీ ప్రోత్సాహం ఉంటే చెయ్యలేనిపనంటూ
ఉంటుందా? వెళ్ళనా...

రామం: వెళ్లూ...ఉండు... (లేచి ఆమె చెయ్యి
పట్టుకుంటాడు.)

కమల: ఒద్దండీ...ఇక్కడికి ఇక్కడికే మీకు శ్రమ...

రామం: అన్నా... పెంకెతనం!

(ఆమెను తీసుకువెళ్ళి ఒకక్షణం పోయాక
ఒంటిగా వస్తాడు—భారం తగ్గినట్టు నిట్టూర్చి
కుర్చీలో కూలబడతాడు—సరోజ వస్తుంది)

రామం: (లేచి, ఉత్సాహంగా) హలో...!

సరోజ: దారంట పోతూ ఓసారి చూసిపోదామని...

రామం: ఏమిటంత హడావిడి...ఎక్కడికి?

సరోజ: మామూలే...మా మండలి గొడవలు...

రామం: (కూచోని...బద్ధకంగా ఆవులించి, చిటిక
వేసి) ఎవర్ని చూసిపోదామనుకున్నావ్...

సరోజ: కొత్తలా ఆ ప్రశ్నేమిటి? కమలని...

రామం: (పరధ్యానంగా ఉన్నట్టు నటించి) కమల
నా...నన్నా?

సరోజ: (ఆశ్చర్యపోయి) ఏమిటి...

రామం: (ఈ లోకంలో పడ్డట్టయి) ఏవి లేమిటి?

సరోజ: నువ్వు కోరి కయ్యానికి కాలు దువ్వుతావ్...
ఏమిటి కారణం...

రామం: నిజం ఎందుకొప్పుకోవు...మనం ఇద్దరమే
కదా ఇక్కడుంటు, ఎవరూ వినిపోతారేమో
అన్న భయానికి.

సరోజ: (కుర్చీ లాక్కొని కూచొని) నువ్వు నమ్మవ్...నిన్ను చూస్తే నేకాని, ఉండలేక వచ్చేననుకుంటావ్...

రామం: కాదూ?

సరోజ: కాదు...నే రోజూ వచ్చేది కమలని చూసేందుకే.

రామం: అది నెపం అనుకో...

సరోజ: నే అంత మనసులేని దాన్ననుకున్నావా?

రామం: ఉంది...నా మీద—నువ్వు నన్నెంతగా ప్రేమిస్తున్నావో నాకు తెలీపోతే నీ మాటలు నమ్మి ఉందును...

సరోజ: అయినా మొహాన చెప్పడం నీకో అలవాటు కింద మారింది. నిన్ను, భరించలేనంతగా ప్రేమిస్తున్నానని నా మనసుని నమ్మించడానికా నీ ప్రయత్నమల్లా?

రామం: నీ సంగతి నిజం కాదా?

సరోజ: నువ్వంటే నా కిష్టం ఉండొచ్చు. అలా అని నేను నా ఇష్టానికి బానిస అయిపోయేంత దుర్బలను కాను...

రామం: అదంతా ఒద్దు...నే అంటే నీ కిష్టము కాదా...

సరోజ: అవొచ్చు...

రామం: అది చాలు—

సరోజ: ఏంటిటి నీ ధోరణి—నువ్వంటే నే ఇష్టపడడం నువ్వేదో నీ విజయంగానూ, గొప్పగానూ నా ముందు చాటుతున్నావ్...నీ అహానికది తృప్తిని స్తోంది...అది నాకు తెల్సు-కాని ఒకటి నువ్వు తెల్సుకుంటే మంచిది. నీ అహాన్ని తృప్తిపరచె యంత్రాన్ని మాత్రం ఎప్పుడూ అవను—

రామం: (అగ్గి జాలిగా గొంతుపెట్టి) కోపగించుకోకు సరోజా...నువ్వే లేకుంటే నే నేమవాలి?

సరోజ: (మెత్తబడి) అదుగో...ఏమన్నా అంటే జాలిగా ముఖం పెడతావ్...

రామం: ఏం చెయ్యను...నువ్వు నన్ను ప్రేమిస్తున్నావన్న నిజంలో నా కెంత బలముందో నీకేం తెల్సు...తెల్సుకో లేవూ?

సరోజ: (మృదువుగా) మనం ఇంక ఆపడం మంచిదేమో రామం...

రామం: ఏది?

సరోజ: తెలిసి అడక్కు—నేను నా దుర్బలతకి లొంగడం నాదే తప్పు...

రామం: కోప మొచ్చిందా సరోజా...

సరోజ: కమలని మన మిద్దరం మోసం చేస్తున్నాం... కమల నాకు ఆప్తురాలు...నీకు కమలపట్ల—

రామం: నా మాటమీద నమ్మకం లేదా? ఎన్నిసార్లు చెప్పినా నమ్మవా సరోజా?

సరోజ: నమ్మడం సులభమా? కమలంటే ప్రాణమంటావ్...కాని ఇదివరకులేని మమకారం నా మీద నీకు ఏర్పడింది—ఏమనుకోడం...

రామం: ఇది నువ్వు నమ్మాలి కాని ఋజువు చెయ్యమంటే నే నేం చెయ్యను...

సరోజ: కమల స్థితి చూస్తూ నువ్వన్నది నమ్మడం కష్టం కదా?

రామం: నా ఆత్మని చంపేసుకున్నానని నీ ఉద్దేశమా?

సరోజ: దీని కర్థ మేమిటి? కనీసం నా మనసుని తృప్తి పరచుకుందు కన్నా ఒక సంజాయిషీ ఉండాలి కదా, నా కెంత స్వార్థమున్నా...

రామం: (చిరునవ్వు నవ్వి) ఇన్నాళ్ళూ ఏదో లోటు ఉన్నట్టే అనిపించేది...ఏమిటో తెల్సేదికాదు. ఇప్పుడు తెల్సుకున్నాను...కమల నా మనసు... నువ్వు నా బతుకువి...రెండూ లేనిదే నాకు పరిపూర్ణత లేదు...

సరోజ: (అనుమానంగా చూసి తేలిపించుకొని) రోజూ నా మనసులో ఎంత అశాంతి రేపుతోందో నీకు తెలీదు ... తెలిసి నే ఎలా మోసం చేసేది కమలని?

రామం: నా మీద నీ కిష్ట ముంది కదా?

సరోజ: ఐతే?

రామం: కమల మనిద్దరికీ ఆప్తురాలే...ఇందువల్ల కమ మనకి మరింత దగ్గరౌతుంది...

సరోజ: నువ్వన్నది పేలవంగా ఉంది...

రామం: పోనీ ఇది విను-నా మనసుకు పరిపూర్ణ లేనిదే నే సంతోషంగా ఉండలేను...... సంతోషంగా ఉండక పోతే కమల అసంతృప్తికి వేరు కారణాలు తీసి బా పడుతుంది—కమల బాధపడడం మనం ఇద్దర చూడలేం...ఔనా...ఔనా...కాదా...

సరోజ : (అనుమానంగా చూసి) కమలనీ నన్ను కూడా మోసం చెయ్యటం లేదు కదా?

రామం : అలా అనడం నీకు న్యాయమే? ఏం చేస్తే నీకు నమ్మకం కుదురుతుందో చెప్పు...చేస్తాను...

సరోజ : (రామం ముఖంలోకి ఒక క్షణం చూసి, నిట్టూర్చి నేలకేసి చూస్తూ ఉండిపోతుంది)

రామం : ఎందుకా కన్నీళ్ళు...

సరోజ : (కళ్లొత్తుకుని) కమలేదీ?

రామం : ప్రశ్న బావుంది...

సరోజ : (చిరునవ్వు నవ్వి కళ్లు బాగా తుడుచుకుని లేస్తుంది)

రామం : ఎక్కడికి?

సరోజ : కమలనోసారి చూసి మండలికి పోతాను...వేళయింది.

రామం : కమలనే కాని నన్ను......(అక్కడి కాపి, నవ్వి) సారీ!

సరోజ : (నవ్వదు......పరధ్యానంగా) లోనికి వెళుతుంది)

రామం : (మనసు తేలికపడ్డట్టు నిట్టూర్చి...గుండెమీద చెయ్యి వేసుకుని) గుడ్ గాడ్...

## రంగము : 6

[అంతా ఐదో రంగంలానే—అందులోనే రామారావ్ కూచొని చదువుకుంటూ ఉంటాడు ...కమల వస్తుంది...]

రామం : (పేపరు దించి) జాగర్త కుర్చీ...

కమల : ఇంకా ఏ వస్తు వెక్కడుందో తెలీదంటారా?

రామం : కూచో...

కమల : (కూచుంటూ) వండడం అవీ చేస్తున్నానా లేదా?

రామం : నీవంటి తెలివైన పిల్లకి ఏది సాధ్యం కాదు?

కమల : నావల్ల మీకు శ్రమ లేకుండా ఉంటే అంతే చాలు...

రామం : అలా అనొచ్చా? నావల్లేకదా నీ కీ స్థితి...

కమల : అలా అని నన్నెందుకు నొప్పిస్తారు?

రామం : నిజం కాదా?

కమల : అంతా మీ దురదృష్టం—

రామం : (ఆశ్చర్యపోయి) నా దురదృష్టమా?

కమల : కాదు?

రామం : కాదు...నీది దురదృష్టం.

కమల : నే నొచ్చుకుంటాననా?

రామం : నామాట నమ్మవా?

కమల : కాదండీ...మీకేమీ ఇవ్వలేకపోయి, మీనుంచి అన్నీ పొందడం నాది అదృష్టం కాదా?

రామం : నీవల్ల నే పొందని దేముంది!

కమల : ఏమీ పొందలేదు—నాకు మరీ స్వార్థం ఎక్కువయిపోతోంది ..ఎప్పుడూ మీరు మాట్లాడుతూ దగరుంటే బావుణ్ణనిపిస్తుంది...ఎలా సాధ్యం—అయినా నా కా కోరిక పోదు...

రామం : అన్నీ సాధ్యమే...

కమల : నాకైతే ఏ పనీలేదు...ఎప్పుడూ మీ గురించే ఆలోచన—మీరు పనులు మానుక నాతో కూచోగలరా?

రామం : కూచోలేదా?

కమల : అందుకు నాకు మరీ భయం—ఇలా కొన్నాళ్లకి మీకు చికాకు, విసుగు కలుగుతాయేమోనని...

రామం : నీతో కూచోడం నాకెప్పుడూ సంతోషమే...

కమల : మొదట్లో ఎప్పుడూ నా దగరే ఉండేవారు—ఎన్నో తియ్యని కబురు చెప్పేవారు...ఇప్పుడు మీ పనులవల్ల బొత్తిగా మీకు తీరిక లేదు. ఏదెలవాటయినా అది లేకపోయేటప్పటికి బాధగానే ఉంటుంది.

రామం : వీలు చిక్కినప్పుడల్లా నీతో నే కదా గడుపుతున్నాను. నువ్వు అనవసరంగా బాధపడకు...

కమల : (ఆర్తంగా) నే ఇలా అన్నానని మీ పనులు మానుక నాతో కూచోకండి.

[నవ్వుతుంది]

ఏది సరోజ ఇవాళ రాలేదు...

రామం : వచ్చే వేళయింది.

కమల : సరోజకి నేను ఋణపడిఉన్నాను...

రామం : అందరూ అందరికీ ఏదోవిధంగా ఋణపడే ఉంటారే...

కమల : అలా అనకండి—నాకు ధైర్యాన్ని ఇచ్చింది సరోజే...

రామం : నేను కానా?

కమల : మీరు విశ్వాసాన్నీ, నమ్మకాన్నీ కలిగించేరు నాకవి లేనప్పుడు ధైర్యంవుండి ఏంలాభం?

రామం : అది నావిధి—

కమల : ఏంమాటలు! విధి కాబట్టి చేస్తున్నట్టు...

రామం : మనసుకి దగ్గరగా ఉన్నవారిపట్లే విధు లుంటాయి.

కమల : మీకు పొగడ్డం బాగా వచ్చు...

రామం : దీనికే ఉబ్బితబ్బిబ్బవకు...

కమల : సరోజస్నేహం నా అదృష్టం—మరవకుండా వచ్చి, దగ్గరకూచొని వెళ్ళేసరోజుంది...ఇంత ప్రేమకి నేను తగను—అందుకు నాస్థితే కారణ మయితే అంతకన్న సిగ్గుపడవల్సింది లేదు...

రామం : అపోహపడకు...

కమల : నాకు జాలిపెద్దు...కంటే, కష్టమనుషులను చూస్తే జాలి వేస్తుంది...అసహ్యం కూడా వేస్తుంది...అదే నాభయం....

రామం : నీకీ ఆలోచన్లు అలవాటుకింద మారేయి—

కమల : నిజమే...నాలో నాకు నమ్మకంపోతోంది. అందుకే నాకీ అనుమానాలన్నీనూ.

రామం : ఏ అనుమానాలు?

కమల : మీకు శ్రమనిస్తున్నానని...

రామం : అంతేనా?

కమల : మీకొక గుదిబండలా ఉన్నాననిపిస్తుందొకొక్క అప్పుడు.

రామం : (నవ్వుతాడు)

కమల : ఆనవ్వువింటే ధైర్యం వస్తోంది...

రామం : ఎందుకు నీకు ధైర్యం?

కమల : ఇదే...నేమీకేమీ ఇవ్వక, మీకొక భారంగా ఉండి శ్రమనిస్తూఉంటే మీకు విసుగుపుడుతుం దేమోనని భయం.

రామం : నీకనుమానం కలిగించే పనులేమన్నా చేసేనా?

కమల : అయ్యో లేదండీ...

రామం : నీ కేదో అనుమానం వేసిఉండాలి.

కమల : (ఊరుకుంటుంది.)

రామం : ఏమిటా అనుమానం?

కమల : మరేమిలేదు...మీరు మునపట్లా నాతో లేక పోయేటప్పటికి...

రామం : అంటే?

కమల : కోపమా?

రామం : లేదుకమలా చెప్పు...

కమల : నాతో ఎంతో ప్రేమగా, లాలనగా మాట్లాడే వారు...ఇప్పుడు మీకు తీరిక లేక...

రామం : ఇందుకేనా...

కమల : ఉత్తినే ఏవో ఆలోచన్లు. అయినా నేను అందుకు తగనప్పుడు ఆశించడం...

రామం : అదుగో మళ్ళా...ఇలా మాటాడితేనే నాకు చికాకు...

కమల : అదుగో చూసేరా? మీకు చికాకు కలిగింది...

రామం : చిన్నసంగతులు మనస్సులో పెట్టుకొని ఇలాటి ఆలోచనలు చెయ్యకు—

కమల : క్షమించండి...మరోలా అనుకోకండి—

రామం : ఆ క్షమించమనడం చూస్తే అనుమానం నీకుంది—

కమల : నాకనుమానం ఉంటే నాదే తప్పు...మీ అనురాగాన్ని చేజేతుల్లా పోగొట్టుకుంటున్నట్టే అందువల్ల.

రామం : (కమల చేతిని అందుకుంటాడు.)

కమల : అదుగో సరోజ.

రామం : నా కగపడలేదు—నువ్వు పసిగట్టేసేవ్...

కమల : ఒకశక్తిని తీసుకున్నప్పుడు దేవు డింకొకశక్తిని ఎక్కువ చేస్తాడుట...

(సరోజ వస్తుంది)

సరోజ : కమలా...చాలా కులాసాగా ఉన్నా వివాళ?

కమల : ఒకనాడు కులాసాగా లేనుకనక నా...

సరోజ : ఆ చిరునవ్వా అదీ...

కమల : నీకన్నీ కొత్తే...

సరోజ : నువ్వెప్పుడూ కొత్తే...(కూచొని) రోజుల తరబడీ విచారంగా ఉంటావ్...అనక విచారమూ ఉండదు, నవ్వూ ఉండదు...ఆలోచిస్తూ ఉంటావ్...ఒకోనాడు ఇంత కులాసాగానూ ఉంటావ్.

కమల : మీ ఇద్దరి ప్రేమ, అనురాగం నా వుండగా సంతోషం కాక మరేముంటుంది నాకు—

సరోజ : ఎప్పుడూ అలా ఉండరాదూ?

కమల : అత్యాశకూడదు...ఇంత అనురాగానికి అలవాటు పడ్డదాన్ని అది లేకుండాపోతే ఏమయి పోతానో అనిపిస్తూ ఉంటుంది...

(రామం, సరోజ ఒకరినొకరు చూసు కుంటారు—)

రామం : నీ కెందుకో అనుమానం...

సరోజ : నీకన్న నాకెవరు ఆప్తులు కమలా? నీకా భయం ఎప్పుడూ ఒద్దు...

కమల : నా స్థితికి జాలిపడి కాదు కద...

సరోజ : నమ్మి... కాదు...

రామం : (సరోజ చెయ్యి తన చేతిలోకి తీసుకుని కమలతో) అర్థంలేకుండా మాటాడకు కమలా.

సరోజ : (చెయ్యి విదిలించుకుంటుంది)

రామం : (చేత్తో ఏం? అని ప్రశ్నిస్తాడు)

సరోజ : (కమలను చూపిస్తుంది)

రామం : (చిరునవ్వు నవ్వి పెదవి విరిచి నుదుటిమీద (వేలిలో కొట్టుకుని "లేదు" అన్నట్టు చెయ్యి ఊపుతాడు)

సరోజ : (కోపంగా చూస్తుంది)

కమల : నే అనుకునే వాటికి అర్థం ఉండకూడదనే దేవుణ్ని కోరుకొనేది...

రామం : నాలో నమ్మకం చాలదా?

కమల : అదేంమాట!

రామం : మరి దేవుడెందుకు?

కమల : ఏమండీ అలా అంటారు? దేవుడు దేవుడు కాడా?

రామం : నీకు నాలో నమ్మకంపోయిన్నాడు దేవుడేం చేస్తాడు?

కమల : మీలో నాకు నమ్మకంపోడమా? అలా అవ గలుగుతుందని మీకు నమ్మడమా?

రామం : నేఅనేది, నేదేనికేదిచేసినా, నీకు నామీద ద్వేషంపుటి నమ్మకం పోతుందని...

కమల : మీరేంచేసినా ద్వేషించను ... మిమ్మల్ని గౌర వించడంతప్ప ద్వేషించేశక్తి నాకు లేదు...

రామం : దేవతగా మారిపోతున్నావ్...

కమల : మీకలా అనిపిస్తే అది నా దురదృష్టమే...

రామం : సంతోషించక...

కమల : ఎందుకండీ? మీకలా నిజంగా అనిపించిన నాడు నేను మీకు దూరమౌతున్నానని సూచన ...మనిషిగా ఉండగలుగుతే నే మీఅనురాగాన్ని పొందగలను.

రామం : కమలమాటలు వింటున్నావా సరోజా...
(ఆమాటలంటూ రామం సరోజని దగరగా తీసు కుంటాడు ... సరోజ పెనుగులాడుతుంది పడి లేకుండా)

రామం: జవాబు చెప్పు...

సరోజ: చెప్పననుకున్నావా? (కష్టంమీద విదిలించు కుంటుంది___
రామం వింతగా ఆమె వేపు చూస్తాడు...
ఆమె చీర చెరగుతో కళ్ళొత్తుకుంటూ ఉం టుంది)

రామం: నీ అభిప్రాయం?

సరోజ: గొంతులో (దుఃఖం తెలీనీకుండా) నే కమల పక్షం...

రామం: ఔను...వీళ్ళలో మీకొసింపథీస్ ఉంటాయి మరి...

సరోజ: అర్థంచేసుకున్నాకే నా సానుభూతి...

కమల: మీరూ నాపక్షమూ కారా.

రామం: దేవతగా మారిపోతున్నావని ఇందాకన్నాను. అలా అన్నానని నేను నీకు దూరమౌతున్నట్టు నువ్వనుకుంటున్నావా?

కమల: ఊహూఁ...

రామం: ఏమీ?

కమల: మా టవరసకన్నారో నిజంగా అన్నారో మీ రన్న విధం బట్టి తెల్సుకో లేననుకున్నారా?

రామం: అయితే నీతో మాటాడేటప్పుడు జాగ్ర త్తగా ఉండాలి.
(సరోజ తల తన భుజంమీదికి తీసుకుంటాడు.. ఆమె విదిలించుకో చూస్తుంది...కాని లాభం ఉండదు)

కమల : ఎందుకండీ...ఏముంటుంది నానుండి దాచడా నికి మీకు...

రామం: (ఆశ్చర్యపోయి సరోజన్ని వదిలేస్తాడు) ఏఁవీఁ ఉండవా?

కమల : ఉండవు.

రామం: నువ్వలా గుడ్డిగా మనుషులని నమ్మేయకూడదు...

కమల : నే గుడ్డిదాన్నేకనండీ...

రామం: క్షమించు కమలా...అనాలని అనలేదు...

కమల : నాకు తెలుసునండీ...మీరు బాధపడకండీ...

సరోజ: (లేచి) నేవెళ్తానింక...

కమల : అదేం సరోజా అప్పుడే...

రామం: (లేచి, ఆమె రెండుభుజాలూ పట్టుకొని) ఉండూ___మరికొస్సేపు___

సరోజ: మళ్ళీరానూ సాయంత్రం...

రామం: కూచుందూ...

కమల: నువ్వెప్పుడొస్తావా అని చూస్తూ కూచుంటాను. ఇలా వచ్చి అలా పోతానంటావ్...

సరోజ: (ఏ మనడానికీ పాలుపోక) మీ ఇద్దరూ వాదించుకోనంటే కూచుంటాను...

రామం: నే కమలకి చెప్పే దేమంటే ఎవరినన్నా ఎక్కువ నమ్మకూడదని...

కమల: నాకు నమ్మకముంటే ఎందుకు నమ్మకూడదండీ?

రామం: అది బాగానే ఉంది. కాని దేని కేదయినా ఎక్కువ బాధపడాలి... ఒప్పుకుంటావా సరోజా....

తల్లి: (లోనుండి) కమలా!

కమల: (వెంటనే లేచి) అత్తయ్య పిలుస్తోంది... ఉండు సరోజా ఇప్పుడే వస్తాను.

(కమల వెళ్తుంది.....కమల వెళ్లగానే-)

సరోజ: (లేచి, కోపంపట్టలేక) ఛీ! నీ ముందు ఇంక ఒక క్షణంకూడా ఉండలేను...

రామం: ఏం...ఏమయింది...

సరోజ: ఏమవాలో అదయింది ..

రామం: అర్థంకాలే...

సరోజ: తెలీదూ?

రామం: తెలీదే?

సరోజ: నాకూ సిగ్గూ, లజ్జ, ఆత్మగౌరవం ఉన్నాయన్న సంగతి నీకు తెలీసులే...

రామం: ఎందుకో ఈఆవేశం చెప్పూ...

సరోజ: చెప్పాలి? కమల ఎదురుగా నాతో ఆ ప్రవర్తనేమిటి"

రామం: ఏమయిందీ?

సరోజ: మొన్నింకొంచెం... ఇవాళ మితిమీరిపోయింది...

రామం: దానివల్ల ఏమయింది...

సరోజ: ఏమయిందా? నువు మనిషివే? ఎంత చనువున్నా దానికీ కొన్ని హద్దులున్నాయి...

రామం: బయట నాతో చనువుగా ఉంటున్నావా లేదా?

సరోజ: అవన్నీ వేరు...

రామం: ఏదీ వేరు లేదు...కమలకి తెలీపోడం మనకు కావల్సిన సంగతి...

సరోజ: (దెబ్బతిన్నట్టయి) కమలంటే నీకు ప్రేమ, గౌరవం...ఏమీ లేవా? నాతో నువ్వు చెప్పినదంతా అబద్ధము?

రామం: నేనే అబద్ధం చెప్పలేదు—నీకా అనుమానముంటే నేనన్న దెందుకు నమ్మేవ్? నీకూ స్వార్థంఉంది...అనుమానం నీకున్నా, నా మాటలు నమ్మదలచుకొని నన్ను నువ్వు మోసం చేసుకున్నావ...

సరోజ: (ఆశ్చర్యపోయి, తలవంచుకుని) నిజమే... నాదే పొరపాటు...నాదే నేరం...నువ్వెంతన్నా తగుదువని తెల్సుకోవల్సింది...నా అనుమానాలనే నమ్మకోవల్సింది—

రామం: (ప్రేమగా) నీ అనుమానా లన్నీ తప్పు సరోజా...నాకు కమలంటే ఎంత మమకారమో...

సరోజ: అయితే ఆమె ముందే అలా ఎందుకు ప్రవర్తించేవ్...

రామం: నీమీద ప్రేమ ఉండబట్టలేక...

సరోజ: ఇలాటిమాట లనడానికన్నా నీకు సిగ్గు వెయ్యదు కామోసు...అది చాలా క్రూరం...

రామం: ఈ నీతులుంటే నవ్వుతారు సరోజా... బయట బాధలేదుట...కమల ముందూ అనేసరికి ఇంతబాధట...ఇదెక్కడి చోద్యం.

సరోజ: చనువిచ్చేనని...నీ ఇచ్ఛను పారంగా...నీ నీచేతిలో బొమ్మలా ఆడలేను...

రామం: చనువుగా ఉండకుండా ఉండనూ లేవు...

సరోజ: ఏమిటా బెదిరింపు...

రామం: బెదిరింపే...

సరోజ: ఏం జేస్తావేమిటి...

రామం: మరింక నీతో నాకు ఏ సంబంధం ఉండదు...

సరోజ: బతికిపోతాను...

రామం: చూదాం ఎవరు బతికిపోతారో!

సరోజ: (తగ్గి) చూడు రామం—కమలని మోసం చేసేందుకు నే ఎంత బాధపడుతున్నానో నీకర్థంకాదు...అయినా నిన్ను వదులుకోలేని స్వార్థం నాది...కాని మనసులో ఘర్షణవల్ల పడేబాధ ఇంక ఓర్చుకోలేకపోయేను...ఇంకనుంచి మనం స్నేహితులగామాత్రం ఉందామని చెబుదామని

వచ్చేను...కాని నువ్విలా ప్రవర్తిస్తావనుకో లేదు...

రామం : యిప్పుడేమంత ప్రమాదమయింది ... యింక ముందునుంచీ జాగ్రత్తగా ఉంటాలే...

సరోజ : ఏ జాగ్రత్తా అవసరం లేదు...మనం ఇంక కేవలం స్నేహితులం...

రామం : పైకలానే ఉందాంలే కావలిస్తే...

సరోజ : నీ మాటలు వింటే స్నేహం కూడా నిలవదనిపిస్తోంది...

రామం : చిలిపి పిల్లలా అనకు...సిల్లీ...బతికే నాలుగు రోజులూ కులాసాగా వెళ్ళిపోనీ...

సరోజ : విను రామం ... నీకు కమలమీద ప్రేమ గౌరవం ఉండొచ్చు ... నా స్వార్థంకొద్దీ నన్ను నే మోసం చేసుకుని...నా బలహీనతకి లొంగిపోయేను...నువ్వు సంతోషంగా ఉండక పోతే కమల బాధపడుతుందన్న బెదిరింపులకి లొంగికాదు... నేచేసింది క్షమించరాని నేరం...

రామం : చాల్లెద్దూ...ఒప్పేసుకున్నావ్ కనక పాపం పోయింది.

సరోజ : పోలేదు...కాని నే రోజూ మనసులో ఎంత బాధపడేదీ దేవుడికి తెలు ...ఇంక ఓర్పుకో లేకపోయేను... అదే చెబ్దామనుకున్నాను... దానికి తోడు మనం ఎంత నీచానికన్నా దిగి పోతున్నాం అని ఇప్పుడు తెల్సుకున్నాను...

రామం : నిజం చెప్పాలంటే సరోజా...నిన్ను కమల ముందు కూచుంపెగా చూసేక రోజూ ఆ కోరిక ఉండేది... తొక్కిపట్టేవాణ్ని...కాని రాను రానూ ఆశక్తిపోయింది...

సరోజ : కమలముందు కూచుండగానా ?!

రామం : ఆ—

సరోజ : నా కర్థమవలేదు...

రామం : మీ ఇద్దరిలో భేదం కొట్టొచ్చినట్లుగా ఉండేది...నాకెంతో బాధగా ఉండేది... అందుకా కోరిక తీవ్రంగా ఉండేది...నిన్ను ఆమెముందు దగరగా తీసుకుంటే మళ్ళా మామూలు స్థితికి మనసు రావొచ్చనిపించింది... అదికాక ఏదో శక్తికి లొంగిపోయేను...

సరోజ : అదెంత నీచమో గ్రహించలేకపోయేవూ ? నే ఎంత బాధపడతానో ఊహించలేక పోయేవూ...

రామం : ఆ కబుర్లు చెప్పకు...నిన్ను కమలముందు దగరికి తీసుకున్నప్పుడు ఎప్పుడూ లేని ఆనందం పొందేను...

సరోజ : (కళ్ళు పెద్దవిచేసి) ఏ...మి...టీ ?... ఆనందము...

రామం : (నవ్వుతాడు.)

సరోజ : దీనికింక అంతెక్కడ ? నీకు కమలకంటే గౌరవం, ప్రేమా...ఏమీ లేవు......నువ్వింక ఎంత నమ్మించినా నేనమ్మను...ఎంత మోసం!

రామం : (ఆలోచించి...నవ్వి) తోడుదొంగవి... ఇంతవరకూ వచ్చాక దాచి ఏం లాభం.

సరోజ : (నమ్మలేక) ఒప్పుకుంటున్నావ్ కూడాను ?

రామం : ఒప్పుకోపోతే నువ్వు నమ్ముతావా...ఒప్పేసుకున్నాక మనం దగ్గరవుతాం...

సరోజ : అవం...అవం...

రామం : అవుతాం...ఇద్దరు కలిసి ఓ నేరం చేశాక ఒకరి అవుసరం ఓరికుంటుంది...

సరోజ : నా కవసరం లేదు...

రామం: కమలంటే నాకు ప్రేమ గౌరవం లేవన్నావు ...అవి పోయేందుకు తనే కారణం...

సరోజ: తనా !!

రామం: జబ్బులో అన్ని వేళలా దగ్గరుండి చూసేను... అనక బాధపడకుండా దాని మనసు సరైన రస్తాలో పెట్టడంలో కొన్నాళ్లు...ఇంక అన్ని వేళలా దగ్గరుండి తియ్యని కబుర్లు కొన్నాళ్లు ...ఇలా ఎప్పుడూ అదే...దాని గొడవే... విసుగూ చిరాకూ పుట్టడం నాది తప్పా...

సరోజ: అది ఆమె తప్పా...

రామం: ఏదీ ఎవరి తప్పూ కాదు...

సరోజ: ఎంత మోసం !! ఏది నమ్మినా నమ్మక పోయినా, నీకు కమలమీద ఎంతో గౌరవం, ప్రేమా ఉన్నాయని నమ్మేను ... (కుర్చీలో కూలబడి...) నన్నూ కమలనీ ఇద్దర్నీ మోసం చేసేవ్...(లేచి కోపంగా) ఇప్పుడు తెల్సిందా ఎవరు నాటకమాడేరో...

రామం: ఇద్దరం ఆడేం...

సరోజ: నన్ను కలపకు...

రామం: మడికట్టుకున్నావా....

సరోజ: నీమనసంత వంకరలు తిరగలేదు నా మనసు...

రామం: చాల్లే బడాయి...(లేచి)

సరోజ: నేఅన్నది నిజం అని నీకు తెల్సు...

రామం: నాకదేం తెలీదు...

సరోజ: నువ్వేమన్నా నే మోసపోను...

రామం: ఇద్దరం రొంపిలో దిగేక నువ్వు మోసపోనను కున్నా, మోసపోయేననుకున్నా ఒకటే...

సరోజ: నే తప్పించుకున్నాను...

రామం: లేదు...పోలేవ్...నే వెళ్ళినివ్వను...

సరోజ: బెదిరించి నన్ను లొంగదియ్యలేవ్...

రామం: నువ్వేమిటో నాకు తెల్సు...

సరోజ: ఏమిటి తెల్సు...

రామం: మనం ఇద్దరం ఏంజేస్తున్నామో మన ఇద్దరికీ తెల్సు, ముందునుండీ—

సరోజ: అంటే...

రామం: నే నిన్ను పెళ్ళి చేసుకోవల్సింది...కాని నీ బదులు కమలయిందిౘ—నీకన్న అందంగా ఉంది కనక, కమల్ని చేసుకున్నానని నీకు తెల్సు నాకూ తెల్సు...నీకు అందుకు కమల అందం చూస్తే జెలసీ—కమల ఇలా అయ్యాక నీకు సంతోషం-ఒకరోజున కాపోయినా మరో రోజన్నా నే నీకు దగరౌతానని — అది అయింది...నువ్వు నన్నాకర్షించేవు ... నేను నీకు దగరా ఆయేను కమలకన్న అందంగా ఉన్నావ్ కనక—

సరోజ: (కళ్లు కప్పుకుని) ఇది కేవలం అమానుషం! నీకు మనస్సులేదూ? ఆత్మలేదూ?...

రామం: నే మనిషి నేకదా? అందుకది మానుషమే...

సరోజ: గర్వంగా చెప్పుకుంటున్నావ్ కూడానా?

రామం: (నవ్వి) వినేది నువ్వేకదా—

సరోజ: నే నేమనుకున్నా నీకు లెఖ్ఖలేదన్నమాట....

రామం: అనుకోవాలూ, లేకపోడాలూ ఎందుకు? నీకేం కావాలో నీకు తెల్సు--నాకు తెల్సు.. మనసు నెందు కిరికిస్తావ్ అందులో...

సరోజ: నా మనసుని ఇంకా నేను చంపుకోలేదు. నే నే మనుకున్నది నీకు లెఖ్ఖలేక, నే బాధ పడా, సంతోషించినా నీకు లెఖ్ఖలేక, నేను నీకో క పరికరంలా కనిపిస్తే మనం స్నేహితు లగాకూడా ఉండలేం ..ఇంక సెలవ్!

(లేస్తుంది.)

రామం: (నిరసనగా) వెళ్లు...వెళ్లు ...

సరోజ: తప్పకుండా...

రామం: వెళ్ళి, మరి రాకు...

సరోజ: మరి రాను—

రామం: రేపు నా కాళ్లముందు వాలినప్పుడు జ్ఞాపకం చేస్తాలే.

సరోజ: (వెళ్తున్నదల్లా ఆగి) ఏంటేంటి నీకీ అహం! ఏం చూసుకొని?

రామం: నే అన్నదయినప్పుడు చెపుతాలే, ఏం చూసుకునో!

సరోజ: అదెప్పుడూ జరగదు....

రామం: సరే, రేపు తెలుస్తుంది.

సరోజ: ఆ ఆశేమీ పెట్టుకోకు....

రామం: (నవ్వుతాడు)

సరోజ: నమ్మవుకదూ? ఏ మంటే నమ్ముతావో నాకు తెల్సు....

రామం: అని చూడు—

సరోజ: ఒకరు కష్టపడితే నీలా నే చూసి సంతోషించలేను—

రామం: (పెదవి విరిచి) నమ్మకం కుదరకే...

సరోజ: నే అనబోయే దదికాదు....

రామం: అనకు...

సరోజ: నీ మనసు ఏదో గొప్పదని భ్రమించి మోస పోయేను ... నువ్వంటే మా కందరికీ ఎంత గౌరవం ఉండేదో నీకు తెల్సు...నీ ఉదా రత, గొప్ప భావాలూ, ఆశయాలూ మమ్మల్నందిర్నీ వశపరచుకున్నాయి...... కాని ఎంతమార్పు! అప్పటి నువ్వేవీ? క్రమంగా నిన్ను నువ్వే చంపుకున్నావ్... ఇప్పుడునువ్వు మనిషివి కావు...అర్థమయిందా?

రామం: (నవ్వి) కాలేదు.

సరోజ: కాలేదూ? సరే విను...నీలో నాకాకర్షణ? మనసు...అది చచ్చింది...ఇప్పుడు నీలో నాకే ఆకర్షణలేదు...నీ అందం చూచి మూర్ఛపోయి నిన్ను ప్రేమించలేను—నీ స్ఫోటకపు మొహం చూసీ ప్రేమించలేదు...గుడ్ బై!

(గబగబా ద్వారంవరకూ వెడుతుంది)

రామం: (ఒళ్లు కంపిస్తుంది...ముఖంలో చెప్పవలని కాని క్రోధం, బాధ, అంతకుమించి మానుషం

కాని ఒకభావం వ్యక్తమౌతాయి... ఒక్క పరుగున వెళ్ళి ఆమె జుత్తుపట్టుకొని) బజారు ముండా! (ఆమెనలాగే లాక్కొస్తాడు)

సరోజ: (పెనుగులాడుతుంది—కాని లాభం ఉండదు) కమలా! కమలా!

రామం: (ఆమెని నేలమీద తిరగద్రోసి ఆమె తల నేలకేసి కొడుతూ) సిగ్గులేని రండా! నాది స్ఫోటకం మొహమా...నువ్వే మహా అందగత్తె ననుకుంటున్నావే? నీ అందం తేల్చి పారేస్తాను...

(కమల వస్తుంది)

కమల: (కంగారుగా) ఏమయింది...ఏమయిందండీ...

సరోజ: (ఏడుస్తూ) కమలా...కమలా...

రామం: నోర్మూయ్యి... (సరోజ నోరు మూసి) అందం ఉన్నంత కాలం మీఇద్దరూ ఒక్కటే... దానికితగిన శాస్తి దేవుడే చేసేడు...నీకు శాస్తి నే చేస్తాను...ఏది ఆకత్తెర అందుకో...ఒద్దీ దానిని...నీకేం కనిపిస్తుంది... నేనే తీసుకుంటాను...(ఆమెను టేబిల్ వరకూ ఈడ్చుక వెళిపోతాడు...ఆమె లేచి పెనుగులాడుతుంది ఆమెను క్రిందకితోసి) ఇంత అహంకారము... (ఆమె తలపట్టుకుని పెనుగులాడుతాడు)

సరోజ: రాక్షసుడా...ఒదులు...

రామం: రాక్షసుణ్ణా...

కమల: అత్తయ్యా!...అత్తయ్యా... !

రామం: నీ రక్తం కళ్లజూస్తాను... నాతో పోయింది. అడ్డమయిన మగాళ్ళందరితోనూ పోయింది ...దీనికి మనసు కావాలిట... మనసు...నాది స్ఫోటకం మొహమట!

సరోజ: నీమొహమే కాదు...నీమనసు కూడా విను... (సరోజలేస్తుంది...రామం మళ్ళీ ఆమెను క్రిందకి తోస్తాడు...టేబిల్ తగిలి రక్తం కారుతుంది ఆమెతలనుండి...తల్లివచ్చి విస్తుపోయిచూస్తుంది)

రామం: ఉండు ఇంకా అవలేదు నీపని...(కాలు ఎత్తి తన్నబోయి, తల్లినిచూసి ఆగిపోతాడు.)

తల్లి: ఏమిటిదంతా!...ఏమిటిరామం! (సరోజముందు వాలి, ఆమెను తన ఒడిలోకి తీసుకుని) అయ్యో సరోజా... (ఆమె రక్తం తుడిచి. చీర చెంగు అక్కడనొక్కి పెడుతుంది) అయ్యో నాతల్లీ...

కమల: (రాముంని చేరుకొని, తడుముకుంటూ, అతని భుజం పట్టుకొని) ఏం జేసేరు, ఏమయింది... సరోజ కేమయింది...

తల్లి: (కోపంగా, దుఃఖంతో నిండిన గొంతుతో) రామం! నేనింక నీతల్లిని కాను... ఇలాంటి రోజంటూ ఒస్తుందని నే నేనాడూ అనుకోలేదు.

రామం: ఇంక నాకు నీతులు చెప్పకు – నేను ఎవరికీ ఏమీకాను – అనాడు చావకబతికి ఉన్నందుకు ఫలిత మిది...

తల్లి: నిజమైనమాట అన్నావ్ నాయనా...

రామం: (దెబ్బతిన్న వాడిలా బాధగా) ఆఁ! ఏఁవి టన్నావ్! (కుర్చీలో కూలబడతాడు నీరసంగా)

తల్లి: లే సరోజా...రాతల్లీ...లోపలకిరా...(సరోజని లేవనెత్తి సాయంచేస్తూ లోనికి తీసుకువెళ్తుంది)

రామం: నిజానిజాలు తెలీకుండా మాట అనకూడదమ్మా....

తల్లి: అన్నీ గ్రహించేన్నాయనా...

రామం: నువ్వూనా కెదురు తిరిగే వన్నమాట——

తల్లి: అలా అని నన్ను బాధపెట్టకు బాబూ... (సరోజతో లోనికి వెళ్తుంది)

కమల: (తడుముకుని అతని దగ్గరగావెళ్ళి కూచొని అతని కాళ్ళకు తలవాన్చి) ఏమయిందో నాతో చెప్పండి...

రామం: (ఆమెను విదిలించి) ఛీ! ఫో!

కమల: (అతని కాళ్ళు పట్టుకొని) ఎందుకొచ్చింది మీకు కోపం...ఎప్పుడూ లేని దివాళ...

రామం: నన్ను ముట్టకోకు. చెయ్యితియ్యి

కమల: ఈ కోపమంతా ఎందుకో చెప్పండి...

రామం: కోపం కాదు...అసహ్యం...నువ్వంటే నే నా కసహ్యం...

కమల: (ఏడుస్తూ) ఏం చేసేనో చెప్పండి...

రామం: నిన్నుచూసి భరించలేను. విన్నావా...

కమల: (అతని పాదాలమీద పడి) మీ పాదాల ముందు ఉండనిస్తే చాలు......మీ మనసుకు దగ్గరగా ఉన్నానన్న...

రామం : గుడ్ గాడ్! నీకూ మనసే కావాలీ... నేనింక భరించలేను...అరి భగవాన్!

కమల : అయ్యో!

రామం : (ఆమెను తోసి) దేవుడే నాకన్యాయం చేసేడు! అందమైన భార్య కావాలని కోరుకున్నాను—మరీ అందమైన దానినిచ్చాడు.... ఆ అందంతో నన్ను నరకయాతన పెట్టేవ్... నా వ్యక్తిత్వాన్ని, నా ఆత్మగౌరవాన్ని చంపేవ్...ఎన్ని ఏకారాలు చెయ్యాలో అన్నీ చేసేను...అటుగుక్కి పోయేను...నీకే జబ్బు వచ్చే సరికి నా గుండెలోంచి పెద్ద బరువు పోయింది...విన్నావా? బరువుపోయింది...

కమల : (తల నేలకు కొట్టుకుని) అయ్యో దేవుడా!

రామం : కాని సుఖపడే బతుకేది? పాపులని శిక్షిస్తూనే ఉంటాడు దేవుడు...నీ అందాన్నీ, కళ్ళనీ కూడా తీసుకున్నాడు నన్ను శిక్షించడానికి......ప్రతిక్షణం నీ ముందు, నీ మొహం చూస్తూ ఉండవల్సిందే నేను... ఎంతకని ఓర్చేది...సహనానికి హద్దెక్కడ! నేనూ మనిషి నేనా! నువ్వెంత వికారంగా ఉన్నావో నువ్వు నమ్మవుకదూ? (నవ్వుతాడు)

కమల : (ఏడుస్తూ) ఔను! మీరన్నది నిజమే... మీ బతుకు మీకు బాధగా చేసేను...పాపాత్మురాల్ని...ఔను!

రామం : నేనూ పాపాత్ముడ్ని! నువ్వు కావు...నీ రూపంలో దేవుడు నన్ను శిక్షిస్తున్నాడు... నువ్వు దేవుడిలా భాగానివే! దేవతవి!!

[పకపక నవ్వి, పోతాడు]

కమల : (నిశ్చేష్టురాలయి ఉండిపోతుంది, కూచొని, ఎటో చూస్తున్నట్టు ముఖం పెటి...అలా ఒక నిముషం గడుస్తుంది...లైట్లన్నీ ఒక్కటొక్కటే ఆరిపోతాయి ...స్టేజ్ మీద చీకటి...ఆ చీకటిని చీల్చుకుని కమల గొంతు) అమ్మా! ఎక్కడున్నావ్! నన్ను తీసుకపోవూ! నన్ను పిలుచుకోవూ నా తల్లి!!

[ తెర ]

# కాటయ వేమభూపతి

శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి

ఆంధ్రభూభువన మధ్యప్రదేశము మధ్యయుగమున నిరుపద్రవముగను ధర్మోత్తరముగను కళావిభవసముపేతముగను పాలించిన ప్రభువులలో వేమనామధారులైన రెడ్డిప్రభువులు ప్రధానముగ గణింపఁదగినవారు. కాకతీయ సామ్రాజ్యము విచ్ఛిన్నమైన తరువాత, నాంధ్రదేశము యవనాక్రాంతమై భారతీయ ధర్మము విధ్వస్తమైనపుడు తదుద్ధరణమునకై బుద్ధి బాహుబలములు వినియోగించి, తదుద్ధారమునకై యత్నించినవారిలో ప్రథమగణ్యుఁడు ప్రోలయ వేమారెడ్డి. ఈతఁడు మహాశూరుఁడు పరమ ధార్మికుఁడునై, అద్దంకి రాజధానిగా రాజ్యపాలనము సేయుచు ధర్మోద్ధరణమునకు సారస్వతపోషణమునకు నెంతయుఁ దోడ్పడెను. శివకేశవులం దఖండ భక్తిభావ సమన్వితుండై శ్రీశైలాహోబల క్షేత్రములందు సోపానసరణి నిర్మింపఁజేసి పుణ్యకీర్తుల నార్జించిన ధన్యుఁ డీతఁడు. ఆంధ్ర వాఙ్మయోద్ధారకుఁడై శంభుదాసుఁడగు నెఱ్ఱాప్రెగడచే రామాయణ హరివంశముల నాంధ్రమునం దవతరింపఁజేసిన ధన్యుఁడు. శ్రీశైలవాసియగు ఘోడెరాయ గురువర్యుని యాదేశానుసారము రాజ్యపాలనము సాగించుచుఁ, దదుపదిష్టవిధానమున హేమాద్రిదానముల నాచరించిన ధార్మికుఁడు. ఈ విషయ మంతయు దృజ్జవరపు శాసనమునం దిట్లు పేర్కొనఁబడియున్నది.

శ్లో. తేషాం ప్రశస్తమహిమాపరపారిజాతః
శ్రీ వేమభూమిరమణో జగనొబ్బగండః,
శ్రీ ఘోడెరాయ గురువర్య దయావిశేషా
త్పృథ్వీం ప్రశాస్తి సకలామకలంక వృత్తిః.

హేమాద్రిణా నిగదితాని గురూపదేశాత్
దానవ్రతాని సుమహాంత్యపి యశ్చకార
దత్వాయుధేచ్ఛమవనిం సకలద్విజేభ్యః
శిషాంచయః పృథుయశాః స్వయమన్వభుఙ్క్త.

పాతాళగంగా మధికృత్యస్నాణాం
శ్రీ పర్వతాగ్రాదవరోహణాయ,
సోపాన పంక్తిం వ్యతనోన్మహాత్మా
కల్యాణశైలం స్వయమారురుక్షుః. [1]

ప్రోలయ వేముని యీ ధార్మికకృత్యములు, ఆతని తరువాతి రెడ్డిరాజులు నిర్మించిన దాన శాసనములందుఁ దఱుచుగఁ బేర్కొనఁబడుచునే వచ్చినవి. ప్రోలయ వేముని శౌర్యము ధర్మనిరతియు నీతని తరువాతి రెడ్డిప్రభువుల కాదర్శప్రాయమై వెలసినవి. ఈతని కుమారుఁడగు అనవేమారెడ్డియు నీతనివలెనే మహావీరుఁడు, పరమధార్మికుఁడు విద్యాపోషకుఁడునై వన్నెకెక్కినాఁడు. అనవేముని వదాన్యత సర్వాంధ్రదేశ ప్రసిద్ధమై పండిత రసనారంగముల నాఁటికి నేఁటికిఁ బాయక నిలిచియున్నది. ఈతనిశౌర్యము కాటయ వేముని కొమరగిరి శాసనమునం దిట్లు వాకొనఁబడినది.

శ్లో. యస్యాస్తాం విజయే సముస్తిదితౌ శ్రీశైల సింహాచలౌ
స్తంభౌ పశ్చిమపూర్వదిగ్విభజన వ్యాఖ్యాన వైజ్ఞానికౌ. [2]

ఈ శ్లోకమునుబట్టి యనవేముఁడు శ్రీశైల వింధ్యాచలములను పశ్చిమ పూర్వదిశలందు విజయ స్తంభములుగాఁజేసి, తన్మధ్యాంధ్రదేశమును దనవశము గావించి పాలించెనని తెలియవచ్చుచునే యున్నది.

ప్రోలయ వేముని దౌహిత్రుఁడగు కాటయ వేముఁడు విజయసాధనమున శౌర్యాటోపమున ధర్మనిరతిని అగ్రహారాది దానమున సర్వథా మాతామహుని బోలినవాఁడు. ఈ విషయ మంతయు కాటయ వేముఁడు గోదావరీమండలమున నెలకొల్పిన దానశాసనమువలన విస్పష్టముగఁ దెలియవచ్చుచునే యున్నది. మాతామహునికంటెను గూడ నీతని కొక విశిష్టత గొని తెచ్చిపెట్టిన దీతనికిఁ గల సంస్కృతభాషా పాండిత్యము. రాజరాజనరేంద్రుని తరువాతి రాజమహేంద్ర

1. చూ. రెడ్డిసంచిక. అనుబంధము. 1. శాసనము.
2. See. J. A. H. R. S. Vol XI P. P. 209

వరము రాజధానిగా నాంధ్రదేశపాలనము మరల నతని నాటనే కొనసాగినది.

ప్రోలయ వేమునినాడును, అతని జ్యేష్ఠసుతుడైన యనపోతా రెడ్డినాటను కొండవీటి సామ్రాజ్యము కృష్ణానదీ పరిసరములందే సీమితమైయుండెను. అనపోతుని తరువాత కొండవీటి రాజ్యసింహాసనాధ్యాసియైన అనవేమా రెడ్డి, గోదావరీ పరిసర దేశమంతయు జయించి, రాజ్యసీమను ప్రాగుత్తరముగా సింహాచలము వఱకు వ్యాపింపజేసెను. అనవేము డుభయ గోదావరీ తీర పరిసర దేశమంతయు జయించినట్లు లాతని దక్షారామాది ప్రదేశముల నెలకొల్పిన శాసనములబట్టియు, ఆనాఁడా తీరములందు వెలసిన వేమవరాగ్రహారముల బట్టియు దెలియవచ్చుచున్నది. మఱియు శ్రీశైలమున మల్లికార్జునస్వామి యాలయమునందు వీరశిరో మంటపమును నిర్మింపజేసి, వెలయింపజేసిన శాసనమునందలి బిరుదావళిలోని "సింహాచలాది వింధ్యపాదప్రతిష్ఠాపిత కీర్తిస్తంభ, సం[సా]గర గౌతమీ [సంగమ] సకల జలదుర్గ సాధన రఘురామ, రాజమహేంద్రవర నిరవద్య నగరాది బహువిధస్థలదుర్గ విదళన బలరామ[3]" ఇత్యాది విశేషణములచే నీతడు గోదావరీతీర దుర్గములను జయించి, కొండవీటి రాజ్యమును సింహాచలమువఱకు బొడిగించెనని నిర్ధారితమగుచున్నది. అనవేముని తరువాత కొండవీటి సామ్రాజ్యపాలకుడుగా కుమారగిరి వచ్చినపుడు, అనవేమునినాడు విస్తృతమైన రాజ్యసీమ లన్నియు నాతని యేలుబడికి జెల్లునట్లు చేసినవాడు—ప్రోలయ వేముని దౌహిత్రుడు, అనపోతా రెడ్డి యల్లుడు, కొమరగిరికి సోదరీ భర్త, చతుర్విధోపాయనయ ప్రవీణుడు, సామ్రాజ్య నిర్వహణ దక్షుడు మహామాత్యుడు ప్రధాన సేనానియు నగు కాటయ వేమారెడ్డియే.

కాటయ వేముడు కుమారగిరి భూపాలుని సింహాసనమున గూర్చుండబెట్టి శ్రీకృష్ణుడు ధర్మజునివలె పట్టాభిషిక్తుం జేసెనని, కాటయ వేముని గోపవరము తామ్రశాసనములలోని యీ క్రింది శ్లోకము తార్కాణించుచున్నది.

శ్లో. సింహాసనే నిధాయాసౌ కుమారగిరిభూభుజమ్
అతేజయ న్మహాతేజా శ్రీకృష్ణ ఇవ ధర్మజమ్[4].

కాటయ వేముని రాజనీతి చతురత బాహుపరాక్రమము మహోన్నతములని యీ క్రింది శ్లోకమువలనఁ దెలియుచున్నది.

శ్లో. ఆసీ దమాత్యరత్నం కాటయవేమ ప్రభు స్తస్య
అతి సురగురుభార్గవ మతి రతిభార్గవ విజయ
విఖ్యాతిః 5

శ్లో. పల్వలపంచక మకరోత్ప్రధనే నిర్జిత్య వైరిణో
రామః,
వైరికుల పరశురామః కాటయవేమస్తు కీర్త్యా
ర్ధశతమ్. 6

కుమారగిరికి కాటయవేమ ప్రభువు ప్రధానామాత్యుఁడు. ఈతఁడు బుద్ధి విభవమున బృహస్పతి శుక్రులను, విజయములు సాధించి విఖ్యాతి నార్జించుటలోఁ బరశురాముని మీఱినవాఁడు. పరశురాముడు యుద్ధములందు శత్రువులను జయించి పల్వల పంచకమును (ఐదు మడుగులను) గావించెను. శత్రుకుల పరశురాముఁడైన కాటయ వేముడు వందలకొలఁది కీర్తి సముద్రములను నిర్మించెనని పీనిభావము. కాటయ వేముఁడు తన బుద్ధిబలమున రాజకీయము లన్నియు సగిదిద్దుచు, బాహుబలమున సుస్థిత శత్రువర్గము నణఁచుచుండ, నాతని కేలికయైన కుమారగిరి వసంతోత్సవములతోడను, నాట్యాభినయ ప్రదర్శనముల తోడను, సప్త సంతానాభ్యుదయములతోడను నానందముగఁ గాలము గడుపు భాగ్యముఁ బడయఁగలిగెనని, కాటయ వేమ విరచిత మాళవికాగ్నిమిత్ర వ్యాఖ్యానము నందలి యీ క్రింది శ్లోకము తార్కాణించుచున్నది.

శ్లో. భాగ్యం నామ సమగ్ర మీదృశ మతి స్నేహైక
పాత్రం యతో
వీరం కాటయవేమ ముద్ధత రిపు ధ్వంసే నియుజ్య
స్వయమ్,
నిత్యం నందతి నర్తనై రభినవైః కాంతై
ర్వసంతోత్సవై
స్సంతానాభ్యుదయైః కుమారగిరి భూపాలో
నృపాలోత్తమః,

కాటయ వేముఁడు కుమారగిరిని దన కేలికగా భావించుచు, నాతనియెడఁ గృతజ్ఞత గలిగి యాతని యాజ్ఞను శిరసావహించుచు, నాతని పక్షమున విజయములు సాధించుచుండెడు వాఁడను విషయమును అని

3. See S. I. I. Vol x No 559.

4. J. A. H. R. S. Vol XI.

5. Epi. Ind. Vol IV P.P. 318 to 327.

6. అభిజ్ఞానశాకుంతల వ్యాఖ్య. కుమారగిరి రాజీయము.

త్రి కలువచేరు శాసనమునందలి యీ శ్లోకము తెలుపుచున్నది.

శ్లో. మాలా మమ్లాన పుష్పామివశిరసివహ న్యస్య
భూభర్తురాజ్ఞా
ముర్వీం ఖర్వీకృతారి క్షితిపతి రఖిలామ్ప్రతీప
ప్రతాపః,
జిత్వా సామ్రాజ్యలక్ష్మీ మనుపమ విభవాం
జృంభమాణ సంభృతశ్రీ
కీర్తిః సేవాపరో భూత్కొమరగిరి విభోః
కాటయాధీశ వేమః 7

కాటయ వేముఁడు కొమరగిరి యాజ్ఞను శిరోధార్యముగాభావించి, యాతనికి విజయములు చేకూర్చుచుండెనను విషయమును అనుపఱితిశాసనము తెల్పుచున్నది. కుమారగిరి తన కుమారుఁడగు అనపోతారెడ్డిని యౌవరాజ్య విభాసినిగావించి, నూత్న దిగ్విజయాప్రాంతి మైన దేశము నాతనికీయఁదలఁచినాఁడు. ఆ పని కాటయ వేమున కొప్పగించెను. ఆ ప్రకరణము నందు కొమరగిరి వేమున కిట్లాజ్ఞాపించి యున్నాఁడు.

ఉదీచ్యాదాక్షిణాత్యాశ్చ ప్రతీచ్యాశ్చ మహీ
శ్వరాః
ఆచరంతి సదా మైత్రీ మస్మాభి రతిగౌరవాత్
తస్మాత్సింహాద్రి పర్యంత ప్రాచ్యా ఏవ
మహీశ్వరాః
జేతవ్యా స్తన్మహీపాలా స్త్వధునా జయ లీలయా.8

కొండవీటికి ఉత్తరమునను దక్షిణమునను పడమటను నుండెడి మహీపాలుగు మనతో నతిగౌరవముతో మైత్రి నెఱపుచున్నారు. కావున సింహాచల పరిసరమునందుండెడి తూర్పునాఁటి మహీపతులే జేతవ్యపక్షములోనివారు. కావున వారిని నీవు హేలగ జయింపుము అని పై శ్లోకముల భావము.

ఇచట కుమారగిరితో మైత్రి నెఱపుచుండిరని తెలిపిన యుత్తరదేశ మహీపాలు రండఱును కాటయ వేముని శౌర్యమునకు నీతి నిపుణతకు లోఁగియే యట్లు చేయుచుండిరని మనమూహింపవచ్చును. కొండవీటికి దక్షిణమునందుండెడి విజయనగరాధిపులు, పశ్చిమమునందలి సులతానులు ఉత్తరమున కొండవీటికి రాజమహేంద్రవరమునకు నడుమనుండెడి దుర్గాధిపతులు కుమారగిరితో నానాఁడు మైత్రి నెఱపుచుండెడివారని, హరవిలాసమునందలి.

"హరిహరరాయ ఫేరోజ
సహాసురధాణగజాధిపాది భూ
వరులు నిజప్రభావ మభివర్ణన
జేయఁ గుమార గిర్యధీ
శ్వరుని వసంతవైభవము......"

సాగుచుండెనను శ్రీనాథుని వచనములఁబట్టి తెలియుచున్నది. కాటయ వేమునకు హరిహరరాయలతో వైవాహిక సంబంధమేర్పడినట్లు, అల్లాడ వేముని వేమవరశాసనమునందలి యీ క్రిందిశ్లోకము తెలుపుచున్నది.

శ్లో. పుత్రీం కాటయ వేమయక్షితి
పతేః పౌత్రీంచ కాటప్రభోః
దౌహిత్రీం చతుర్ధవం
హరిహరక్షోణీపతే శ్శాసితుః,
తన్నామ్నా విదితామ్ప్యాయాం
హరిహరాంబాం చారుమ్రగాహాయ
త్ప్రేణా వేమమహీశ మల్లనృపతే
స్సామ్రాజ్య లక్ష్మ్యాసమ్9.

హరిహరరాయల పుత్రికను కాటయ వేముఁడు పెండ్లాడుటచే విజయనగరాధీపులతోడి చెలిమితో లుతకాటయ వేమునకును, తన్మూలమున కుమారగిరికి నేర్పడి, పిమ్మట వేముని పుత్రిక హరిహరరాయల దౌహిత్రియగు హరిహరాంబ నల్లాడ వేముఁడు పెండ్లాడుటచే నల్లాడరెడ్డికిఁ దత్పుత్రులకును విజయనగరాధిపులతోఁ జెలిమి యేర్పడియుండెనని మన మూహింపవచ్చును. ఫెరోజిషా, గజపతులు మున్నగువారు కాటయ వేముని ధాటికి తాఁగలేక మైత్రి నెఱపుచుండెడి వారనియు నూహింపవచ్చును."

ఇఁకఁ దూర్పునాఁటి వారనఁగా రాజమహేంద్రవరము మొదలుగా సింహాచల పరిసరమువఱకు నుండిన ప్రాజ్యమహీపతులు. వీరు వేముని నాఁడణఁగియుండి, కుమారగిరి నాఁడు మరలఁ దలలెత్తియుండిరి. వారిని జయించుటకై కుమారగిరి నియోగింపఁగా కాటయ వేముఁడు కొండవీటినుండి సైన్య సన్నాహముతో

---

7. చూ. ఆం. సా. ప. పత్రిక. సం. 2. పుట. 108. అనితల్లి కలువచేరు శాసనము.

8. చూ. ఆంధ్రేతిహాస పరిశోధక మండలి. రెడ్డి సంచిక. పుట. 383.

9 See. epi Ind vol XIII P. P. 237 t 257.

దాడివెడలి వచ్చి, రాజమహేంద్రవరమున నిలిచి, యచటనుండి ముందునకు సాగి విజయమును సాధించి నట్లు అనపర్తి శాసనమే తెలుపుచున్నది. మఱియు నానాఁటికి రాజమహేంద్రవరము కొమరగిరిపాలనము నందే యుండినట్లు క్రింది శాసన శ్లోకములు వివరించు చున్నవి.

శ్లో. తత శ్శైలపురా త్తస్య కుమరగిరి భూపతేః
రమ్యం రాజమహేంద్రాఖ్య నగరీం
ప్రత్య పద్యత,
తతస్సింహాద్రి వింధ్యాద్రి మధ్యవర్తి
మహేశ్వరాన్
జిత్వా తద్దేశదుర్గేషు నియుజ్య స్వాధికారిణః

కాటయ వేముఁడు కొండవీటినుండి బయలుదేరి, కొమరగిరికిఁ జెందిన రాజమహేంద్రనగరమును జేరి, యటనుండి దండువెడలి వింధ్యపర్వత సింహాచల మధ్యస్థులయిన మహీశులను జయించి, యాయా దుర్గములందుఁ దన యధికారులను నియమించి ఉపహారములతోఁ గూడిన విజయమును. కొమరగిరి కర్పించెననునది యీతచ్ఛాసన విషయము. ఈ తీరున వేముఁడు జయించిన దుర్గము లేవియో యీ శాసనమున నిరూపింపఁబడియుండలేదుగాని, కాటయ వేమ విరచితమైన అభిజ్ఞానశాకుంతల వ్యాఖ్యానమునం దిక్రింది విధముగ వివరింపఁబడినవి.

శ్లో. ధాటీఘోటీ ఖురాగ్రత్రుటిత గిరితటే
యత్ర మొల్లేటి దుర్గం
దుర్గం కిమ్మూర సంజ్ఞం దళితరిపుబలే
దుర్గమం బెండపూండిమ్,
దుర్భేదం వజ్రకూటం జితవతి రభసా
రామగిర్యాఖ్య దుర్గం
విఖ్యాతం వీరఘోటం గలిత మనుహ్యాదాం
వీరసన్నాహధాష్ట్యమ్

కాటయ వేముఁ డశ్వసైన్యముతో దాడివెడలి గిరితటములు పిండిసేయుచు, మొలేరు, కిమ్మూరు, బెండపూఁడి, వజ్రకూటము, రామగిరి, వీరఘోటము అను దుర్గములు జయించి. శత్రువుల శౌర్య సన్నాహము నణఁగించెనని దీని భావము. ఈ దుర్గము లన్నియు కొండవీటికి ప్రాగ్దేశీయములోనివి. వీనిలో —.

బెండపూఁడి — ఇది పిఠాపురమున కుత్తరముగ నేడుక్రోసుల మేరలో, అన్నవరక్షేత్రమునకు ఒక క్రోసు దిగువుననున్నది అచట శిథిలమైన దుర్గ మొకటి నేఁటికినిగలదు.

వజ్రకూటము — ఇదియును పిఠాపురమునకు వాయవ్యముగ నెనిమిది క్రోసుల మేరలో నున్నది. అచటను దుర్గశిథిలములుగలవు. ఇది నేఁడు పిఠాపురమున వంకాయలకుఁ బ్రసిద్ధివహించియున్నది. వజ్రకూటపు వంకాయలని వాకొనుచుందురు.

వీరఘోటము — దీనిని నేఁడు 'వీరఘట్టము' అనియందురు. ఇది శ్రీకాకుళముజిల్లాలో పాలకొండకు సమీపమునందున్నది. ఇది నేఁడు అడ్డాకులకుఁ బ్రసిద్ధివాల్చియున్నది.

మొలేరు — ఇది నేఁటి తూర్పుగోదావరిజిల్లా ఎల్లవరము తాలూకాకుఁ జెందిన గ్రామము. ఈ యూరఁ గాటయ వేమునితోడి సంబంధముగల శాసనము గానవచ్చినది. 10.

కిమ్మూరుదుర్గము — ఇది యీ జిల్లాలోని పెద్దాపురము తాలూకాకుఁ జెందినది. పెద్దాపురము తాలూకాలోని కొన్ని గ్రామములకు కిమ్మూరుసీమ యని పేరు. ఈ తాలూకాకుఁ జెందిన జగంపేటయను గ్రామమునకు సమీపమున కిమ్మూరు లక్ష్మీపురమను గ్రామముగలదు. దాని దాపున కిమ్మూరుదుర్గమని వ్యవహరింపఁబడు ప్రదేశముగలదు దుర్గప్రదేశము చాలవఱకు సాగుబడిలోనికి వచ్చినను దానికా నామము నిలిచియేయున్నది. దుర్గశిథిలములుకూడ గానవచ్చును.

రామగిరిదుర్గము — ఇది రాజమహేంద్రవరమున కుత్తరముగ పదిక్రోసుల మేరలో, అచటి గౌతమీ తీరమునంటియున్న రెడ్డిపోలవరమున కావలియొడ్డున మూఁడు క్రోసుల మేరలోనున్నది ఇది గిరి దుర్గము జలదుర్గము కూడనైయున్నది. ఇది నేఁటి కిని దుష్ప్రవేశస్థితియందే యున్నది. ఇది కాటయ వేమునినాఁడు అన్నదేవచోడునకు రాజధానియై యుండునోపును. పట్టిసక్షేత్రమున కిది నాలుగు క్రోసులమీఁద నున్నది. ఈ జలదుర్గమునం దొక పెద్ద పద్మాకరము గలదు.

ఈవిధముగఁ గాటయ వేముఁడు రాజమహేంద్ర వరమాదిగ సింహాచలమువఱకు నుండిన దుర్గములను జయించి విజయము సాధించెనని యూహింపనగును.

10. See S. i. i. vol X No 578.

తరువాత కుమారగిరి కాటయ వేముని పరాక్రమమునకు సంతసించి, దిగ్విజయాక్రాంతమైన ఈ రాజమహేంద్రవరప్రాంతము నాతని కిచ్చినె చెనని కాటయ వేముని శాసనములలోని ఈ క్రింది శ్లోక మెఱుకపఱుచుచున్నది.

శ్లో. కుమారగిరి భూపాలో యస్మై విక్రమతోషితః,
ప్రాదాత్ప్రాచీం భువం రాజమహేంద్రనగరీ
ముఖామ్.

ఈ శ్లోకము కాటయ వేముఁడు నెలకొలిప్ప కొమరగిరిపురము గోపవరము తొత్తరమూఁడిశాసనముల మూఁడిటను గానవచ్చుచున్నది. కాటయ వేమునకీ రాజ్యసంక్రాంతి, కొమరగిరి పుత్రుఁడైన అనవోతారెడ్డి మరణించినతరువాత, కుమారగిరి జీవించియుండఁగనే జరిగెనని యూహింపనగును. కాటయ వేముని నాఁటినుండియే మరల రాజమహేంద్రవరము రాజధానిగా రెడ్డిరాజుల పాలనము నెలకొనుట, రాజమహేంద్రవరరాజ్యము ప్రత్యేక రాజ్యముగుటయు జరిగినది.

కాటయ వేమునకుఁ గుమారగిరియెడల విశిష్టమైన గౌరవము గలదనుటకు నిదర్శనములు పెక్కులు గానవచ్చుచున్నవి. 1. కుమారగిరిని సింహాసనముపైఁ గూర్చుండఁబెట్టి తానే మహామాత్యుఁడై రాజ్యభారమంతయు నిర్వహించుట. 2. అతని యాదేశానుసారము దిగ్విజయములు సాధించుట. 3. అతని ప్రీతికై కుమారగిరి పేర కాళిదాసవిరచితమైన నాటకత్రయమునకు వ్యాఖ్యానములు రచించుట. 4. ఆ వ్యాఖ్యానమును కుమారగిరిరాజ విరచిత వసంతరాజీయోదాహృతులతో సమర్థించుట. 5 తన కుమారునకు కుమారగిరి పేరు పెట్టుట. 6. తాను సుకృతార్థియై దేవబ్రాహ్మణుల కిచ్చిన యగ్రహారముల కన్నిటికిని 'కొమరగిరిపురము' అని నామకరణము సేయుట—యనునవి. ఈ విషయముల నన్నిటిని కాటయ వేమారెడ్డి శాసనములు సమర్థించుచునేయున్నవి. వానిలో కాటయ వేముని అహోబలశాసనము ధార్మిక ప్రవృత్తితో నాతఁడు నెఱపిన దానముల కన్నిటికిని 'కొమరగిరి మండల' మను పేర నొక సూచికను దెలియఁజేసినది. కాటయ వేముఁడు కొమరగిరి జీవించియున్నపుడే గాక, అతఁడు మరణించిన తరువాతఁగూడఁ గృతజ్ఞత గలిగియుండెననుటకు, ఆతని కక్షయ సుకృతము కలుగుటకై అహోబల నృసింహస్వామికి 'గలుపచేరు' అను గ్రామమును ధారవోయుటయే తార్కాణము. ఆ శాసనస్వరూపము నిటుఁ బొందుపఱచుచున్నాఁడను.

శుభమస్తు—

ఏతత్సౌర సురాధీశ మౌళిశ్రేణి విరాజితమ్
అహోబల నృసింహస్య దేవదేవస్య శాసనమ్.

స్వస్తిశ్రీ శకవర్షంబులు ౧౧౩౭ అగు నేంటి విక్రృతి సంవత్సర మార్గశిర శు ౧౫ గురువారానను శ్రీ అహోబలదేవర నిత్య అవసరానకు కొమరగిరిరెడ్డింగారికి సుకృతముగాను కాటమరెడ్డి వేమారెడ్డింగారు కలుపచేరు కొమరగిరి పురమని ధారవోసి సమర్పణసేసిరి.

వప్తా కాటయ శౌరేః పౌత్రో మారస్య
కాటనృప సూనుః
వీరాన్నపోతినృపతేర్జామాతా జయతి వేమ
భూపాలః

కొమరగిరయ్యంగారికిని పరమహితుండైన కాటమరెడ్డి వేమారెడ్డిం [గా]రు తనకు స్వామి అయిన కొమరగిరి రంగయ్యగారికిన్ని వారిదేవులైన అమ్మంగారులకున్ను అక్షయ సుకృతముగాను దేవర్లకున్ను బ్రాహ్మలకున్ను దారవోశి ఇచ్చిన కొమరగిరి మండలం.

పెద కొమరగిరిపురం, అమ్మలపురం. శ్రీ వారణాసి విశ్వేశ్వరదేవర కొమరగిరిపురం, శ్రీ పర్వతనాతని కొమరగిరిపురం. పంగులూరి పసుపతియంగారి కొమరగిరిపురము, పంగులూరి భీమణయంగారి కొమరగిరిపురం, శ్రీ భట్టరయంగారి కొమరగిరిపురం, కందాళయంగారి కొమరగిరిపురం, శ్రింగార రాయని కొమరగిరిపురం, శ్రీ సర్వజ్ఞరపు బావయ్య కొమరగిరిపురం, మురంతేశ్వర దేవర కొమరగిపురం, శైవుల కుమరగిరిపురం, సాత్వికుల కొమరగిరిపురం పాళ్లివారి కొమరగిరిపురం సామవేదాల కొమరగిరిపురం, సోమజోస్యుల కొమరగిరిపురం, స్థానాపతి అల్లభన్న కొమరగిరిపురం, శ్రీ గోపీనాథుని అబ్బవ కొమరగిరిపురం, బ్రహ్మయ్య శ్రీపాదాల కొమరగిరిపురం, తేజోమూర్తుల కొమరగిరిపురం, బొగ్గరపు మాచిరాజువారి కొమరగిరిపురం, మహాదేవయ్యగారి కొమరగిరిపురం, వేమనాపకింగారి సింగన సోమయాజుల కొమరగిరిపురం, జతనము పెద్దిరాజు

వారి కోమరగిరిపురం, మండెల రామనాథ సోమయాజులవారి రుద్రభట్లు నూరుభట కోమరగిరిపురం, గ్రామాగ్రేశ్వరుల కోమరగిరిపురం, అన్నదానం అవుభళయంగారి రామనంగారి కోమరగిరిపురం, వలసవల్లి అన్నభళభట్ల కోమరగిరిపురం, [శ్రీ] హారం వీరఘంట శ్రీ గిరన్నంగారి కోమరగిరిపురం, వినపాల పె[ద్ది] కోమరగిరిపురం......కోమరగిరిపురం...పోతరాజు వారి కోమరగిరిపురం, వుతాయపెటి [చిన] కోమరగిరిపురం, వుంగ్రాజువారి తల్లా [ప్రె]గడ కోమరగిరిపురం, వేదాద్రి శ్రీ నరసిహ్మదేవర కోమరగిరిపురం, కూచిరాజు తిప్పనంగారి కోమరగిరిపురం, ఆరాధ్యుల మల్లనంగారి కోమరగిరిపురం, చేయేటి శ్రీ కేశవనాథని కోమరగిరిపురం, కాకొండ శ్రీ నరసిహ్మదేవర కోమరగిరిపురం, యోబపోతసిష్టుల కోమరగిరిపురం, జాయూరి సోమయాజులువారి మలుభట కోమరగిరిపురం, శింగాయ పండితులవారి విశ్వనాథ పెమ్మన కోమరగిరిపురం, శిద్దాయ పండితులవారి అన్నా పండితుల కోమరగిరిపురం, పంతులూరి శ్రీ గిరయ్యంగారి దేవులైన మల్లాయాంమంగారి పసపుకిచ్చిన కోమరగిరిపురం, మైలార దేవరకోమర గిరిపురం, మూలం గూరంమ కోమరగిపురం.

శింగాయ పండితుల...[త్రి]మా పండితులవారి అన వేంవరము, ఆకుల...పెద్దిభట్ల వారిమా [రి మండ మారవర...] [కొట]మ రెడ్డి వేంవరం, దేవణ్ణయంగారి ప్రతాప అన్నవరం, మాడ్డెము రామనా[థ] సోమయాజుల నాగిపెద్దవరం, సంవేస్యుల కేశవదేవర వేంవరం, పెన్నవరం, వీరవరం, ప్రసన్న శ్రీ పాదాల శ్రీ లక్ష్మీనరసిహ్మపురం.

కొటమరెడ్డి వేమారెడ్డింగారి అర్ధాంగలక్ష్మి [అ]ఇ ఆ కోమరగిరయ్యంగారే ఇ కోమరగిరయ్యంగారై అవతరించిన [ఇ] కోమరగిరియ్యంగార్కి తల్లింగారైన తల్లసానంమంగారు ఇ కోమరగిరయ్యంగారికి [న్ని] కొటమరెడ్డి వేమారెడ్డింగార్కిన్ని సుకృతముగాను శ్రీ గౌతమీ తీరమందును వేదాద్రి శ్రీ నరసిహ్మ దేవరకును ప్రతి సంవత్సర తిరునాళ మహోత్సవానకు ధారవోసి సమర్పణచేసిన వెలుమూరి తల్లవరము. కొటమరెడ్డి వేమారెడ్డింగారి అర్ధాంగలక్ష్మి ఆ ఇన మల్లసానంమంగారు కొటమరెడ్డి వేమారెడ్డింగార్కిని స్వామి అ ఇన కోమరగరయ్యంగార్కిన్ని వారి దేవులైన అనుంగారులకున్ను ఆత్మీయ సుకృతము ఇ అట్లుగాను మకర సంక్రమణ పుణ్యకాలమందు రాజమహేంద్రవరానను శ్రీ గౌతమీ తీరమందు మార్కండేశ్వర దేవరకు పహిండి గుడికట్టించి, మార్కండేశ్వర దేవరకు నిత్య అవసరాలకు ఇచ్చిన మల్లవరము. 11

ఈ యాహోబల శాసనము కొటయవేముని వదాన్యతకు సుకృతాసక్తిన దృష్టికి కృతజ్ఞ భావమునకు నిదానము. ఈ శాసనమున చెర్కొనబడినవానిలో నేటి అములాపురము తాలూకాకు జెందిన కోమరగిరిపట్నము మురముళ్ళ వీరేశ్వరునకు జెందిన కోమరగిరి, సర్వేశ్వర భావనారాయణస్వామికి జెందిన పిఠాపురమునకు సమీపముననున్న గోరస కోమరగిరియు నాపేర్లతో నిలిచియున్నవి. మిగిలినవాని పేర్లు వినవచ్చుటలేదు. మొత్తముమీద రాజమహేంద్రవర రాజ్యమాతనికి వశమైనతరువాత కాటయవేముడు గోదావరీతీర భూములందు పెక్కు గ్రామములు ధారవోసి యిచ్చి తన ధార్మికతను సుస్థిరము చేసియున్నాడు. ఈ శాసనము నందలి తుదివాక్యములనుబట్టి కాటయవేమునకు తల్లాంబిక మల్లాంబిక యను నిరువురు భార్యలుండినట్లు తెలియవచ్చుచున్నది. వీరిలో తల్లాంబికయే కాటయవేమునకు పుత్రుడై జన్మించిన కోమరగిరికి తల్లియని యీ శాసనము స్పష్టము చేయుచున్నది. వేముని కనితల్లి యను పుత్రిక గలుగు కాటయవేమునకేకైక పుత్రుడగు కోమరగిరి మరణించినవెనుక, కాటయవేమునును దివంగతుడైనపిదప రాజమహేంద్రవర రాజ్య మీయనితల్లికే సంక్రమించినది. ఈయనితల్లిని గన్న తల్లి యెవరగా? యనునది సంశయాస్పదముగ నున్నది. ప్రోలయ వేముని కొడుకు అనవేముడయినట్లు, తల్లాంబిక కూతురనితల్లి యైనదా? లేక మల్లాంబిక కోమరగిరి సోదరియై తత్పుత్రయగుటచే అనితల్లికీ రాజ్య సంక్రాంతి గలిగెనా? దీనిని వివరించు శాసనాద్యాధార మేదియు నింతవఱకు బయలుదేలి యుండ లేదు.

ఇది యిటుండ అనితల్లి కలువచేరు శాసనములో అనితల్లినిగన్న తల్లి దొడ్డాంబిక యనిపించు శ్లోకమొకటి యీ తీరుగ నున్నది.

శ్లో. యస్యావేమ నృపాలో జనకో దొడ్డాంబికా తు జనయిత్రీ
సా దీవ్యత్యనితల్లీ సమూర్తి రివ దేవభూమిదేవశ్రీః.

11. see. s. i. i. vol x No. 577.

ఈ శ్లోకమునకు యథాస్థితముగా నర్థము చెప్పుకొనినచో, ఎవనికు వేమనృపాలుడు తండ్రియో, దొడ్డాంబిక తల్లియో, ఆయనితల్లి ఆకృతి దాల్చిన దేవభూదేవి లక్ష్మీవలె దేజరిలుచున్నదని యర్థము చెప్పవలెను. దీనిని బట్టి దొడ్డాంబిక యాపెకుఁదలి యగువలెను. కొటయ వేమునకు తల్లాంబిక మల్లాంబిక లిరువురు భార్యలై యుండినటు అహోబల శాసనము తొత్తరమూఁడి శాసనము తార్కాణించుచున్నవి. వారి యిరువురిపేర తలవరము మలవరము అను గ్రామములు దానముచేయబడినటులా శాసనములు నిరూపించుచున్నవి. వేమునకు దొడ్డాంబిక యను భార్య యుండినట్టు లీయొక్క శాసనముననేగాక మఱెక్కడను నా విషయము తెలుపఁబడియుండలేదు. కాని కొటయ వేమునితల్లి, ప్రోలయ వేముని కూఁతురు, అనపోతారెడ్డి సోదరియునగు నామె 'దొడ్డాంబిక' యని బహుశాసనప్రసిద్ధము. ఈ విషయమును ధ్రువముసేయు నీక్రింది శ్లోకము వేముని పెక్కుశాసనములలో గానవచ్చుచున్నది.

శ్లో. నప్తా కొటమహీభుజో, గుణగణోదారస్యధార ప్రభోః
పౌత్రః, కొటయ వేమ భూమిరమణః శ్రీ వేమ పృథ్వీపతేః
దౌహిత్రః, పునరన్నపోతనృపతే ర్భాత్రీశ చూడామణే
ర్జామాతా జయతి క్షితిం చిరమసౌ దొడ్డాంబికా నందనః. 12

ఈ శ్లోకమునుబట్టి కొటయ వేముఁడు దొడ్డాంబికాసుతుఁడనుట నిర్వివాదవిషయము. కావున పై కలువచేరు శాసన శ్లోకమునకు "ఎవనికి దొడ్డాంబికతల్లియో యటి కొటయవేముఁడు జనకుఁడుగాఁగలయని తల్లి" యని యర్థము చెప్పుకొనవలెనా? లేక లేఖక ప్రమాదమున నీ శ్లోకమున 'తలాంబికా', లేక మల్లాంబికా' యనుటకు బదులుగా 'దొడ్డాంబికా' యయినదా? యను విషయమింతదనుక విడరానిచిక్కుగ ముడివడినది. చరిత్రకారులు మాత్రము కలువచేరు శాసనమునకు సర్వధాప్రాముఖ్యము నంగీకరించి, కొటయ వేమునకు మూఁడు భార్యలనియు, వారిలో దొడ్డాంబిక కొమరగిరి సోదరియనియు, తత్పుత్రియగుటచే అనితల్లికి వేముని రాజ్యము సంక్రమించినదనియు వ్రాసిని యున్నారు. కాని యీ విషయమును స్పష్టముచేయు శాసనాద్యాధారమేదైన ప్రత్రిక నుపలబ్ధ మగునంతవఱకు నిట్టియూహ పరిగ్రాహ్యమని నాకుఁ దోఁచుటలేదు.

రాజమహేంద్రవర రాజ్యమును, కొటయ వేముని తరువాత నాతని వంశాంకురమై నిలిచి, రాజ్య సంక్రాంతికి దాయాదిగలది అనితల్లి యగుటచే, నామెకు మామగారగు అల్లాడరెడ్డి యామెకే రాజ్యమును సంక్రమింపఁజేసెనని యీక్రింది శాసన శ్లోకములు నిరూపించుచున్నవి.

శ్లో. దురిత రహితచిత్తో దొడ్డయల్లాడ భూపో
భువ మరి జనవశ్యాం భూయసాహృత్య దోష్ణా,
విమలగుణయుతాయాం వేమ భూపాత్మజాయా
మవని సురసుధాయా మన్నితల్లాం న్యధత్త. 13
గతే దివం కొటయవేమభూపే
నిర్మూల్య తద్ద్రోహికులం సమస్తం,
అచంచల శ్రీక మసౌ తనోతి
తత్సంతతే రాజ్యమరాత్యనృపవ్యమ్. 14

కొటయ వేముఁడు తూర్పునాఁటి దురవిజయమునకు బయలుదేఱినపు డాతని వెంటవచ్చిన సేనాధిపతులలోఁ బ్రధానుఁడు, కొండవీటి ప్రభువులతో బాంధవ మావఱకే యేర్పడియున్న రెడ్డివిరుఁడు అల్లాడరెడ్డి. ఈతఁడు కొటయ వేముని యీ విజయయాత్రలో నాతని కండదండయై నిలిచినవాఁడును నాతనితో వియ్యమందినవాఁడును. కొటయ వేముఁడు తన కూఁతులలో హరిహరాంబను అల్లాడరెడ్డి సుతులలో జ్యేష్ఠుఁడైన వేమునకును, ఆతని ద్వితీయ సుతుఁడైన వీరభద్రారెడ్డికి అనితల్లిని నిచ్చి వివాహము చేసెను. తనమూలకముగఁ గాటయ వేముని రాజ్యము ననితల్లికి సంక్రమింపఁజేయుపని వియ్యంకుఁడైన అల్లాడరెడ్డిపైఁబడినది. హరిహరాంబయుఁ గాటయ వేముని పుత్రియై యుండ, అనితల్లికి కొటయ వేముని రాజ్యమును సంక్రమింపఁజేయుటకుఁ గారణ మీమె కొండవీటి ప్రభువులకు దౌహిత్రియై యుండుటయే గావలయును. లేకున్న కొటయ వేమసుతయైన హరిహరాంబకో రాజ్యమేల సంక్రమింపరాదు? కొటయ వేముఁడు దివంగతుఁడైనంతనే, రాజమహేంద్రవర

12. చూ. కొమరవరము, గోపవరము, తొత్తరమూఁడి శాసనములు.

13. చూ. అనితల్లి కలువచేరు శాసనము.

14. See. S. i. i. vol V No 118.

రాజ్యమును గబళింపఁ జూచినవారు, వేమునివైరి వర్గములోనివారు నగు కోమటి వేమ అన్న దేవచోళాదుల నల్లాడరెడ్డి నిర్మూలించి, రాజ్యమును శత్రుదుర్భేద్యము గావించి, అనితల్లి కిచ్చెనని భావము. ఈ కార్యము గురితరహితచిత్తుఁడై యల్లాడరెడ్డి నెఱపె ననుటలో, దాయనిర్ణయ విషయమున వివాద మేర్పడినపుడు ధార్మికదృష్టితో నాతఁ డనితల్లికి రాజ్యమును సంక్రమింపఁ జేసెనను విషయము వ్యక్తమగుచున్నది.

రెడ్డి ప్రభువుల చరిత్రములకు సరియైన వెలగట్టి కవితాతులను దూఁగించి మూల్యము నేర్పఱచు శ్రీనాథుఁడు, అనితల్లికి కాటయ వేముని రాజ్యము లభించుట నిట్లు వివరించి యున్నాఁడు.

మ. మనుతుల్యుండగు కాటభూవరుని
వేమక్ష్మాతలాధీశునం
దనపాణిగ్రహణంబు చేసెఁ బ్రియ మొంద
న్వీరభద్రేశ్వరుం
డనితల్లి న్వనితామతల్లి నుదయాస్త్రాద్రీంద్ర
సీమావనీ
ఘన సామ్రాజ్య సమర్థన ప్రథిమ
సాక్షాదిందిరా దేవతన్
— కాశీ. 1-43.

శ్రీనాథుఁడు కాటయ వేముని మనుతుల్యునిగా నిరూపించియున్నాఁడు. అనగా మనువువంటి ధర్మనిర్వాహకుఁ డనుట. వేమన కంతటి ధార్మిక దృష్టియే లేకున్నచో నీతని శక్తి సామర్థ్యములకు కుమారగిరి నాఁడు కొండవీటిరాజ్యము నే పాలించి యుండెడి వాఁడు. మనుతుల్యుఁడు గావుననే ధర్మతత్పరత గలిగి కొమరగిరి యాజ్ఞ నుశిరసావహించి తానార్జించిన విజయముల నాతనికి సంక్రమింపఁ జేసి తన్నుఁ గృతకృత్యునిగ భావించియున్నాఁడు. అట్టి వేముని తనూజాత యగుటచే ననితల్లికి ఘనసామ్రాజ్యసమర్థన ప్రథిమ యేర్పడెనను విషయముపై పద్యమున వ్యక్తమగుచున్నది. మఱియు ననితల్లియే రాజమహేంద్రవర రాజ్యమునకు రాణియై పాలనము సాగించుచుండెనను విషయ మిందు ధ్వనితమగుచున్నది. ఈ విషయము కలువచేరుశాసనమునం దిట్లు స్పష్టము సేయఁబడినది.

శ్లో. వినత నరపాలపాళీ, కనదురు
మౌళిస్రగుదిత గంధాఢ్యా,
అనితల్లీపతిదైవా, ఘనసచివీభూత
భావుకా భువమవతి,

అనితల్లి భూమిని పాలించుచుండ నరపాలు రామె పాదములపైఁ బూలమాలికలు పడునట్లు వినతులగుచుండఁ దదంశము పాదముల కంటుచుండెననియు, నామె భర్తను దైవముగా భావించుచు, తనకు బావయైన వేముఁడు మహామాత్యుఁడుగా భూమిని రక్షించుచుండెనని యీ శ్లోక భావము. అల్లాడరెడ్డి రాజమహేంద్రవర రాజ్యాధికార మనితల్లికి సంక్రమింపఁ జేయఁ, దద్భర్తయగు వీరభద్రారెడ్డి సింహాసన మలంకరించినవాఁడు, కుమారగిరికిఁ గాటయ వేమునివలె ననితల్లి కల్లాడ వేమారెడ్డి మహామాత్యుఁడు ప్రధాన సేనానియునై కార్యఖడ్గములు రెండును నిర్వహించుచుండెడివాఁడను విషయము నీశ్లోకము తెల్లము చేయుచున్నది. ఈ తీరుగఁ గాటయ వేముని రాజ్యము అల్లాడవేమ వీరభద్రారెడ్ల పాలనములోనికి వచ్చిన నాఁడే కవిసార్వభౌముఁడైన శ్రీనాథున కాశ్రయము లభించు నవకాశము గలదై చరిత్ర ప్రసిద్ధి వహించినదయినది.

కాటయ వేముఁడు తన చరిత్రమున మాతామహుఁడైన ప్రోలయ వేముని యాదర్శములను, తన రాజధానియందు కొండవీటి విభవమును సమకూర్చుకొనినట్లు వేముని యపదానముల వలనఁ దెలియవచ్చుచున్నది. హరిహరులందు విశిష్ట భక్తిభావము గలిగి భీమమండల ప్రసిద్ధమైన దేవళములకు విభవములు కల్పించుట, భూసురుల కగ్రహారములు దానముసేయుట, దిగ్విజయములు సాధించుట, కవుల కాశ్రయ మిచ్చుట, ఘోడెరాయ భీమయ గురువును శ్రీశైలమునుండి పట్టణమునకుఁ గొనివచ్చుట, యను నివి ప్రోలయ వేముని యాదర్శములు. రాజమహేంద్రవరమున త్రైలోక్య విజయ సౌధమును నిర్మింపఁ జేయుట, మూలఁ గూరశక్తిని వెలయించుట యనునవి కొండవీటి విభవాదర్శములు.

శ్లో. కవీనామాశ్రయో మంత్రీ కాటభూప తనూభవః.

అను కుమారగిరి రాజీయ వాక్యముచే నీతఁడు కవుల కాశ్రయభూతుఁడై యుండినట్లు తెలియవచ్చుచున్నది. కాని వారు తెలుఁగు కవులుగాఁ గానరారు. అగ్రహారములు స్వీకరించిన వారిలో సంస్కృత కవు లెవరైనఁ గలరేమో? కాటయ వేముఁ డెంతటి పరా

క్రమవంతుఁడో అంతటి సంస్కృత పాండిత్యము గలవాఁడు. ఈతని వైదుష్యము కుమారగిరి యానతిని వసంత రాజీయోక్త మార్గమున నాట్యార్థ సమన్వయము చేయుచు రచించిన కాళిదాస విరచిత రూపకత్రయ వ్యాఖ్యానము లయిన కుమారగిరి రాజీయములందుఁ గానవచ్చును. ఈతని వైదుష్యమును గూర్చి నే నీవఱకు రెడ్డి సంచికలో 'కాటయ వేముని వైదుష్యము' అను వ్యాసమునఁ గొంత తెలిపియుంటిని [15].

కాటయ వేముఁడు కడుసమర్థతతో కాళిదాస విరచిత దృశ్యకావ్యములు మూఁడింటికి వ్యాఖ్యానము రచించి యుండుటచేతనే, మల్లినాథసూరి శ్రవ్యకావ్యములకు కూలంకషముగ వ్యాఖ్యరచించి దృశ్యకావ్యములకు వ్యాఖ్య రచించుట మానినాఁడు. వేముఁడు కుమారగిరి యాదేశమున, నాతనియెడఁ దనకుఁగల కృతజ్ఞత వెల్లడించుచు, తద్విరచిత వసంత రాజీయోదాహృతులతో లక్షణ సమన్వయము నెఱపుచుఁ గృతిరచనమునకుఁ గడఁగుటచే, నీతని వ్యాఖ్యవలనఁ గుమారగిరి పాండిత్యముకూడ జిజ్ఞాసువులకు విదితమగుచున్నది. ఏయే తావులందు భరతాది ప్రాచీన నాట్యశాస్త్రవిషయములకు లోఁగని యంశము లుండునో యట్టి తావులందే వసంతరాజీయోక్త పద్ధతిని నాట్యార్థ సమన్వయము గావింపఁబడినది. కాని యుదాహృతమైనచోట లక్షణము సర్వథా సంశయవిచ్ఛేదకముగ నుండును. వ్యాఖ్యానమును చేయు పద్ధతిలోఁ గాటయవేముఁ డంగీకరించిన పద్ధతి సర్వదా సమర్థనీయముగ నుండును. ఈతని వ్యాఖ్యలందలి విశిష్టతను గూర్చియు వసంత రాజీయవిశిష్టతను గూర్చియు మఱియొకప్పుడు నాయెఱుక కొలఁది వివరింప బ్రయత్నింతును.

15. చూ. రెడ్డి సంచిక పుట ౪౯౪. ౪౬౬.

ప్రమాద రక్షణకు ప్రశస్తమైనది భీమా
ఎప్పుడు ఏ ప్రమాదం వచ్చేదీ, ఏ క్షణం ఎలా ఉండేదీ తెలియని ఈ దినాలలో
* అగ్ని * మోటార్‌కారు * కార్మిక నష్టపరిహారం * నౌక
* ఫయడిలిటి గ్యారంటీ మొదలైన భీమాలకు
మాతో సంప్రతించండి.
యునైటెడ్ ఇండియా ఫైర్ అండ్ జనరల్
ఇన్సురెన్సు కంపెనీ,
"బాంబే లైఫ్ బిల్డింగ్స్"
9, బ్రాడ్వే, మద్రాసు. 1.
Telephone: 4241, Telegrams: "UNIGEN"
బ్రాంచీలు:
విజయవాడ - బెంగుళూరు - బొంబాయి - కలకత్తా - న్యూఢిల్లీ - పాట్నా
కొలంబో - సింగపూరు - కోయంబత్తూరు - జాకార్తా

# అంతర్వాహిని

## హితశ్రీ

* గతసంచిక తరవాయి *

## 12

విశ్వం హైదరాబాద్ నించి తిరిగివచ్చాడు. బండి దిగగానే ఎదురుగా వొచ్చాడు గోపీ. తనకు చనువు ఉన్నవాళ్లు ఎవరొచ్చినా గోపీకి అలా ఎదురురావటం అలవాటు. విశ్వం అది చాలాసార్లు గమనించాడు. అయితే అలా ఎదురురావటమనేది అందరిపట్లా సర్వ సామాన్యమే. తనూ తెలిసినవాళ్లొస్తే ఎదురువెడతాడు. కాని తనలాంటి పెద్దవాళ్ళు అలాచెయ్యటంలో కుర్రవాడైన గోపీ అలాచేయటంలో తేడాఉంది. వరండాలో తీరికగాకూర్చుని కబురు చెప్పుకుంటున్నప్పుడు విశ్వం గోపీని అడిగాడు. "వాకిట్లో బండిఆగి చుట్టాలెవరైనా వొస్తున్నప్పుడు ఎదురువెళ్లటం దేనికిరా గోపీ, వాళ్లెలాగూ ఇంట్లోకి వస్తారుగా."

గోపీ ఈ ప్రశ్నకి తెల్లబోయాడు. ఏం సమాధానం చెప్పాలో వాడికి తెలియలేదు.

"ఊరికే" అన్నాడు.

"మర్యాదకోసమా?"

గోపీ థర్డ్‌ఫారం చదువుతున్నా అది ఈడుకి మించిన చదువు. వాడికీ ప్రశ్నలోని భావం సరిగా అర్థంకాదని విశ్వానికీ తెలుసు. "ఊహుఁ" అన్నాడు గోపీ ప్రశ్న అర్థమైనట్టుగానే.

"వెళ్లాలనిపిస్తుందా?"

అవునన్నాడు గోపీ. ఎందుకనిపిస్తుందో వాడికి తెలియదు. వాడు ఆలోచించివెళ్లడు. కాళ్లు లాక్కుపోతాయి, అంతే.

విశ్వం ఆలోచించాడు. తనలా ఎదురువెడితే ముఖ్యంగా మర్యాదకోసం వెడతాడు. మనస్సు హెచ్చరిస్తుంది. పసివాడికి ఆహెచ్చరిక ఏంలేదు. పరిచయస్థుణ్ణి చూడగానే హృదయగత బాంధవ్యం ఏదో అప్రయత్నంగా వాడిని అలా లాక్కుని వెడుతుంది.

ఇది పైకి చాలా చిన్నవిషయంగానే కనిపించినా ఇందులో గంభీరభావం ఏదో ఇమిడిఉన్నదనిపించింది విశ్వానికి. అన్నిసార్లు గోపీ తన బండిదగ్గిరికి పరిగెత్తుకుని వచ్చినా తనావిషయం గురించి ఈరోజు ఆలోచించినట్టు ఆలోచించలేదు పూర్వం ఎన్నడూ. ఈసారి గోపీ అలా రావటం చూడగానే తనకీ ఊహ ఎందుకు కలిగిందో!

కొంచెంసేపాగి విశ్వం అడిగాడు.

"గోపీ, నువ్వెరిగిన వాళ్ళందరిలో ఎక్కువ మంచి వాడెవరు?"

"రంగారావు మాస్టరుగారు." తడుముకోకుండా చెప్పాడు వాడు.

"ఎందుకూ?"

గోపీ ఆలోచించాడు.

"ఏమో" అన్నాడు చివరికి.

రంగారావు మంచివాడే. అయితే గోపీమాస్టరలో అంత మంచివాళ్లు ఇంకా ఉన్నారు. కాని వాడికి రంగారావంటేనే అభిమానం ఎందుకో? ఆ విషయం వాడికే తెలియదు.

"అందరిలోకి ఎవరంటే నీకిష్టం?"

గోపీ కొంచెం ఆలోచించి అన్నాడు.

"అక్కయ్య."

"ఎందుకు?"

ఈసారి సమాధానం వాడికి తెలుసు. స్టేషన్‌కి వెళ్ళినప్పుడు రైలు కదులుతుంటే అక్కయ్య దూరమవుతుంటే వాడికి కన్నీళ్ళుతిరిగాయి, అక్కయ్యకీ తిరిగాయి. వాడికి అక్కయ్య కావాలనిపించింది. వాడి ఆలోచనలు ఆమెవైపు మరలాయి. జవాబివ్వటం మర్చిపోయాడు. విశ్వం అది గమనిస్తూనే ఉన్నాడు. వాడి మనసులో ఏముందో కూడా అతనికి తెలుసు.

విశ్వం ఆలోచనలోపడ్డాడు. కొన్ని విషయాలు

కేవలం తార్కికంగా ఆలోచిస్తే తేలేవి కావు. ఆ అవసరం కూడా లేదేమో. హృదయంలోని ఏవో అనుభూతులు మన ప్రవర్తనకి కారణ మౌతాయి కొన్ని సమయాల్లో. అది హేతుపూర్వకంగా ఉండక పోవచ్చు. సమర్థనీయం కూడా కాకపోవొచ్చు. కాని హృదయంలోని ఆ అవ్యక్తభావాలని కాదనటానికి వీల్లేదు.

డాక్టర్ ప్రవర్తనగురించి తను సందేహంగా చెప్పినప్పుడు ఆమెలో కలిగిన ధోరణి తనుమర్చిపోలేడు. ఆమె ఆలోచించటం మానేసింది. హృదయం మూగగా ఏదో పలికింది. లేకపోతే ఆమె అలా ఆవేశంగా మాట్లాడలేదు. ఆక్షణంలో తన హృదయం స్పందించింది. అంతగా హృదయాన్ని ఊపి వేయగల సన్నివేశం తన జీవితంలో ఇంతవరకు జరగలేదు. పద్మ వ్యక్తిత్వం తనకిప్పు డర్థమవుతోంది. అంతగా తన వ్యక్తిత్వాన్ని అర్థం చేసుకోడంవల్లే డాక్టర్ మీద ఇతర్ల అభిప్రాయాల్ని తృణప్రాయంగా చూసి ఉదాత్తంగా వ్యవహరించ గలిగింది. పద్మలా ఎంతమంది ఉంటారు!

కాసేపు అలాగే ఆలోచిస్తూ కూర్చున్నాడు విశ్వం. ఆలోచనల్లో వసంత జ్ఞాపకం వచ్చింది. పదిహేను రోజులైనా అయివుంటుంది తనామెను చూసి. బయటికి వెళ్ళి కాస్త కాఫీతాగి అలా వసంత ఇంటికి వెళ్లాలనుకున్నాడు విశ్వం. కాని ఇంతలో మనసు మార్చుకున్నాడు. రైల్లో నిద్రలేక కళ్ళు బరువుగా వున్నాయి. సాయంత్రం వెడితే కులాసాగా ఉంటుందనుకున్నాడు.

సాయంత్రం కాగానే ఆకాశంలో మబ్బులు అలుముకోసాగాయి. సన్న జల్లుకూడా ప్రారంభమయింది అయినా విశ్వం బయల్దేరివెళ్లాడు. తలుపు తటబోయేసరికి అతనికి లోపలనించి ఏవోమాటలు వినిపించసాగాయి, ఆగాడు. మాటలు రానురాను స్పష్టంగా వినిపించసాగాయి. వసంత కంఠం తీవ్రంగా వినిపిస్తోంది. ఉన్నట్టుండి చెంప ఛెళ్లుమన్న శబ్దం వినిపించింది. దడాలున తలుపు తోసుకుని లోపలికిఅడుగు పెట్టాడు విశ్వం. దండతాడిత భుజంగంలా ఉంది వసంత. పక్కన నటేశ్వరరావు కందగడ్డలాంటి వదనంతో నుంచున్నాడు. చప్పుడు విని ఇద్దరూ తలుపు వైపు చూశారు.

"ఏమైంది?" అన్నాడు విశ్వం యిద్దరివైపూ చూస్తూ.

నటేశ్వర్రావు ముఖం మరింత ఎరుపెక్కింది.

"చెయ్యి పట్టుకున్నాడు దుర్మార్గుడు," అంది వసంత రోషంతో.

"పతివ్రత, పాపం" అన్నాడు నటేశ్వర్రావు హేళనగా.

"షటప్" అన్నాడు విశ్వం వొళ్లుమరిచి.

"విశ్వంగారూ, మర్యాద ఇచ్చి పుచ్చుకోండి. మీకు పరిస్థితులు తెలియవు. ఎంతడబ్బు తగలేశానో, భవానీ శంకరుడిలా."

"ఎవరికి?" అంది వసంత రెట్టిస్తూ.

"చెప్పాలా?"

"నేను మీ బహుమతి ఒక్కటికూడా ముట్టుకోలేదు. ఎప్పటికప్పుడే తిరగ్గొట్టినా సిగ్గులేక..." వసంత పూర్తి చెయ్యలేదు.

"మీవాళ్లకిస్తే ఒకటే నీకిస్తే ఒకటేనా?"

"నాకు వాళ్లతో సంబంధం లేదు."

వసంత కళ్లలో నీళ్లు తిరిగాయి.

"ఇదేనా మీ నాటక కళోపాసన?" విశ్వం నటేశ్వర్రావు వైపు అసహ్యంగా చూస్తూఅన్నాడు.

"మీ చిత్ర కళోపాసన సంగతేమిటో!"

విశ్వం నిరుత్తరుడయాడు ఒక్క క్షణం.

"గురువింద గింజ తన నలుపెరగదట!"

"నే నేం దౌర్జన్యాలు చెయ్యలేదు గెటౌట్" గట్టిగా అరిచాడు విశ్వం.

"తమరే దయచెయ్యండి" అన్నాడు నటేశ్వర్రావు వ్యంగ్యంగా.

విశ్వం చెయ్యి చేసుకోటానికి సిద్ధమయాడు.

"సిద్ధమే."

వసంత కలగచేసుకుంది.

"నటేశ్వర్రావుగారూ, మా ఇంట్లోనుంచి వెళ్ళిపొమ్మంటున్నాను. పెద్దమనిషితరహాగా ప్రవర్తించరా?"

ఏమనుకున్నాడోగాని నటేశ్వర్రావు "ఆల్ రైట్" అని వెళ్ళిపోయాడు.

"బి. ఎల్. ప్యాసయాడు. రేపోమాపో ప్రాక్టీస్ పెటబోతున్నాడు. ఏంబుద్ధులివి?" అన్నాడు విశ్వం జుగుప్సగా.

"మొదటినించి ఆయన ప్రవర్తన అటువంటిదేనండీ. నేను భయపడుతూనే ఉన్నాను ఇలాంటిదేదో జరుగుతుందని" గాద్గదికంగా అంది వసంత.

విశ్వం ఏమీ అనకుండా కుర్చీలో కూర్చున్నాడు. మేకపిల్లని తోడేలు తరుముతున్నట్టు అతని మనోవీధిలో గోచరించింది. విశ్వం తలపట్టుకున్నాడు.

"అసలు బహుమతులు ఎందుకు తీసుకున్నావు?"

"నేను తీసుకోంకే!"

"ఎవరికో ఇచ్చానంటున్నాడుగా."

"దానికి నేను బాధ్యురాల్నా?"

"మీ వాళ్ళేటగా?"

"అయినా నాకు వాళ్ళతో ఏం సంబంధం లేదు. నేను వేరే వుంటున్నానని మీకు తెలుసుగా?"

"అయితేమాత్రం, చెప్పాలిసిన బాధ్యత నీకు లేదూ? ఈ మాత్రం విషయంకూడా మరొకరు చెప్పాలా?"

కోపంగా అన్నాడు విశ్వం. వసంత కళ్లలో నీళ్ళు తిరిగాయి.

"తెలిసికూడా మీరలా మాట్లాడితే ఎలా?" అందామె గాద్గదికంగా.

విశ్వానికి జాలేసింది. ఆమెని కోపగించుకోటానికి తనెవరు? తనకేం హక్కుంది? అయినా ఆమె అలా తిరస్కరించకుండా తనకి సమాధానాలు చెబుతోంది. అన్నివైపుల్నించి అందరూ ఆమెని బాధపెడుతుంటే ఎలా తట్టుకుంటుంది?

"వసంతా!" అన్నాడు కారుణ్యం ఉట్టిపడే స్వరంతో. ఆమె కళెత్తి చూసింది.

"ఆదుకునేవాళ్ళు లేనివాళ్ళని ఆదరించటం మాని వాళ్ళ నిస్సహాయస్థితి ఆధారంగా తీసుకుని స్వప్రయోజనాలు సాధించుకునేవాళ్ళ నేమనాలో తెలియటం లేదు."

"తోడేళ్ళు" ఆవేశం అణచుకోలేక అంది వసంత.

సరిగా తన మనసులో ఉన్నదే ఆమె అంది. ఆమాటే అన్నాడు విశ్వం ఆమెతో. అలా ఇద్దరి మనసుల్లో ఒకేమాట తోచటం అదే మొదటిసారి అని ఇద్దరూ ఒకరికొకరు చెప్పుకున్నారు.

సన్నజల్లు చిలికి చిలికి గాలివానయింది. ఉరుములూ, మెరుపులూ, వానా, గాలితో ప్రకృతి భీభత్సంగా ఉంది.

"ఇక్కడ చిక్కుపడ్డానే" అన్నాడు విశ్వం.

"తొందరపని ఉందా?"

"ఏం లేదు లే."

"మరయితే నష్టం ఏముంది? ఏమైనా చెప్పండి. వింటాను."

"అనగా అనగా ఒక రాజు - చెప్పాలా?"

"వేళాకోళం కాదండీ"

"బొమ్మ వేసుకుంటే బావుంటుంది. ఎన్నాళ్ళకీ అది పూర్తి కావటం లేదు."

"ఇప్పుడా?" అంది వసంత,

"ఏం? మోడల్ ఇవ్వటానికి ఓపిక లేదా?"

"మీ కోసం వస్తుందేమోగాని, ఎన్నాళ్లండీ మోడల్ ఇచ్చేది?"

"నేను ముందరే చెప్పానుగా. బాగా వెయ్యాలంటే కొన్ని నెలలు తీసుకోంటుంది ప్రతిబొమ్మ."

"మీకు శ్రద్ధలేదు. హైదరాబాద్ వెళ్ళి ఇన్నిరోజులు చేశారుగదా. ఏ ఉద్యోగమో అయితే బొమ్మ పూర్తి చెయ్యకుండానే వొదిలి వెళిపోతారు"

"ఉద్యోగం వొచ్చేసూచన ఏమీ లేదు."

"ఎందుకు రాదు?"

"ఇన్ని దరఖాస్తులు పెట్టాను, ఒక్కరూ కనీసం ఇంటర్వ్యూకయినా పిలవలేదు."

"అవుతుంది లెండి." అని భరోసా ఇచ్చిందామె.

విశ్వం పరికరాలు తీసుకున్నాడు. వసంత మోడల్ ఇస్తోంది.

బయట హోరు గాలి. కుంభవృష్టి.

కనుముక్కు తీరు సరిదిద్దుతున్నాడు విశ్వం. తళుక్కున మెరుపు మెరిసింది. కిటికీలోంచి ఆ కాంతి సరిగా వసంతమీద ప్రసరించింది.

"మెరుపు మెరిసి మీరు జారిపడ్డారనుకున్నాను" అన్నాడు విశ్వం చిరునవ్వు నవ్వుతూ.

"మీరు కవిగారు కారుకదూ? బొమ్మ గీసుకోండి కవిత్వం జోలికపోకుండా" అంది వసంత.

పెదవులు కెంపురంగుతో చిత్రిస్తున్నాడు విశ్వం. రేఖలు సరిచూసుకోటానికి కొంచెం దగిరగా వచ్చి నిలబడమన్నాడు. ఆమె వెంటనే అలాగే చేసింది.

పెదవులరేఖలు చూడబోయి ఎరుపుదనం చూస్తూ నుంచున్నాడు విశ్వం. సరిగా అదే ఎరుపు ఎలా వేయటం? అది సాధ్యమయేలా లేదు. మెరుపు మెరిసింది కళ్ళు మిరుమిట్లు గొల్పాయి. ఆ మెరుపులో మెరిసిపోయే వసంతిసౌందర్యమంతా, ఆ తనూకాంతి ఉన్నదివున్నట్లుగా ఎలా చిత్రంలోకి తీసుకురావటం?

వర్ణాలకలయిక సాధించటంకోసం ఏయే వర్ణాలు కలిస్తే ఆమె శరీరవర్ణం వస్తుందో ఆలోచిస్తూ ఆమెని నఖశిఖపర్యంతం చూడసాగాడు. ఆ శరీరవర్ణానికి రేఖాసౌష్ఠవం మెరుగులు దిద్దుతోంది. ఆ వంపులన్నీ తన చిత్రంలోకి రావాలి. ఎంతవరకు తను ఆ రేఖల్ని చిత్రంలో పొందుపరచాడో!

పరిశీలనగా చూస్తున్నాడు విశ్వం. ఒక్కసారి సింహావలోకనం చేశాడు వసంత స్వరూపాన్ని నర్తకి భంగిమలో.

వసంత ఇన్నాళ్ళూ ఎంత సౌందర్యం తననించి మరుగుపరిచింది! ఇన్నాళ్ళూ తను చూడని అందాలేవో ఆమెలో ఈరోజు కనిపిస్తున్నాయి.

“అనాఘ్రాతం పుష్పం కిసలయ మలూనం కరరుహైరనావిద్ధం రత్నం...”

ఎవరి అనుభవంకోసం ఈ అందం?

బొమ్మసంగతి మర్చిపోయాడు విశ్వం. వసంత అలాగే నుంచునివుంది. కిటికీలోంచి విసురుగా జల్లు కొట్టింది. ఆ తుంపరలు చల్లగా విశ్వాన్ని పలకరించి పులకింపచేశాయి.

బయట ఉరుము ఉరిమి మెరుపు మెరిసింది. మెరుపులో వసంత...

ఆ సౌందర్యం భరించలేకపోయాడు విశ్వం. తటాలున ఆమెని కౌగిలిలోకి పొదివి పట్టుకున్నాడు. కళ్ళల్లోకి చూసి పెదవులు చుంబించబోయాడు. కాని అకస్మాత్తుగా ఆగిపోయాడు. వసంత విడిపించుకోలేదు. కాని ఆమెముఖంలో ముఖం పెట్టి చూసిన విశ్వానికి ఆమె వదనంలో ఏదో వింతదనం కనిపించింది. అది ఆశ్చర్యమో, భయమో, కోపమో, నిస్సహాయతాభావమో, హేళనో... మరేమిటో, లేక అన్నిటి సమ్మేళనమో విశ్వానికి అంతుపట్టలేదు. తటాలున తన్నుతాను తెలుసుకొని ఆమెని వొదిలేశాడు. తరవాత ఒక్కమాటకూడా అతను మాట్లాడలేదు. ఆమెవైపు చూడటానికికూడా సాహసించలేదు. గబగబ బయటికొచ్చి ఆ గాలివానలోనే ఇంటివైపు నడిచిపోయాడు. వసంత ఏమీ ఆలోచించేస్థితిలో లేదు. అలాగే అతనివైపు చూసింది. మెరుపు మెరిసింది. కిటికీలోంచి చరచర నడిచిపోతూ విశ్వం కనిపించాడు. అప్పటికి ఆమెకి పరిస్థితి తెలిసింది. ఆమెకి తెలియకుండానే కిటికీదగ్గరగా వెళ్ళింది. ముఖంమీద జల్లు కొడుతోంది. తనునూ నెవున్నా వెనక్కి రావాలని ఆమెకి తోచలేదు. అలాగే చూస్తూ నిలబడ్డది.

## 13

ఆ రాత్రంతా విశ్వానికి సరిగా నిద్రపట్టలేదు. కన్నుమూసుకున్నా కన్ను తెరిచినా వసంత కనిపిస్తోంది. తెల్లటి అందాలతో, తెల్లటి కాంతులలో మెరిసిపోయే వసంత! తియ్యతియ్యటి కబుర్లుచెప్పే వసంత! అమాయకంగా మనసులో ఉన్నవన్నీ చెప్పే వసంత! మేకపిల్లలాంటి వసంత! హఠాత్తుగా విశ్వం ఉలిక్కిపడ్డాడు. అప్పుడే మాగన్నుపట్టింది. కల వచ్చింది. మేకపిల్లని తోడేలు తరుముతోంది. పటుకునీ పటుకునేసరికి కల చెదిరిపోయింది. అంతచలిలో ఆ హోరుగాలిలోకూడా విశ్వానికి ముచ్చెమటలు పోశాయి. తనే తోడేలు! ఎవరినో ఆ మాటతో నిందించాడు. కాని పయోముఖవిషకుంభంలా తయారయాడు తను. వసంత ఏమనుకుందో. ఆ ముఖకవళికలు తనెలా మర్చిపోగలడు. ఆ వదనంలో చెదిరిపోయిన గుండె కనిపిస్తోంది తనకి. తొలగిపోయిన విశ్వాసం కనిపిస్తోంది. “నువ్వు ఇంతేనా?” అని నిస్సహాయంగా కూలబడిపోయినట్టు కనిపిస్తోంది వసంత. తను అది భరించలేడు. ఒక్కక్షణం — మరొక్కక్షణం తన మూర్ఖత్వం తనని విడిచిపెట్టి ఉండకపోతే ఆమెని నాశనం చేసేవాడు. అక్కడికి తను అదృష్టవంతుడే.

అండదండలులేని వసంత తనని నమ్మి చనువిస్తే అవర్ణ తను గుజాపు చేసుకున్నాడు కంచె చేను మేస్తే!

విశ్వానికి తనమీద అసహ్యం వేసింది. ఒక్క మంచిపనికూడా చెయ్యలేకపోగా ప్రప్రథమంగా ఒక చెడ్డపని చేశాడు! ఆ ఉపన్యాసకుడు ఇప్పుడు తనని నిలదీసి “ఇరవైరెండేండ్ల జీవితకాలంలో నువ్వు

చేసిన ఒక్క చెడ్డపని చెప్పమంటే తను ఆలోచించుకోనక్కర్లేదు. మంచిపని చెప్పమంటే—అదే పూర్వపు సమాధానమే. వేసిన చోటే గొంగళి.

ఒక్క మంచిపని!.

విశ్వానికి తటాలున ఆలోచన తట్టింది. వసంతని తను పెళ్ళిచేసుకుంటే! ఒక అబలని, దురాచారానికి బలికాకుండా తప్పించుకోవాలని తాపత్రయపడే ఒక కన్యని ఉద్ధరించినట్లవుతుంది. అంతకంటే ఎవరు మాత్రం చెయ్యగల గొప్ప మంచిపనేముంటుంది? తను వసంతని వివాహం చేసుకుంటాడు.

కాని అది అంతసులభమా? ఎన్ని అడ్డంకులు దాటాలో! ఎన్ని చిక్కులొస్తాయో! అన్నట్టు మావయ్య మళ్ళీవొస్తే పట్టుబడితే! ఒకవేళ జానకికి తననే చేసుకోవాలని ఉంటే! ఈ పరిస్థితుల్లో తనేం చెయ్యాలి. ఏం చెయ్యగలడు? పైగా ఈ వివాహానికి ఇంట్లో ఒప్పుకోరు. వేరేచోట ఇంట్లోంచి వెళ్ళిపోయి పెళ్ళి చేసుకోవాలి. బహుశా మళ్ళీ ఇంట్లో అడుగు పెట్టనివ్వరు. ఉద్యోగం అయితే పరవాలేదు. కాకపోతే తనెలా ఆమెని పెళ్ళిచేసుకోగలడు!

కాని వసంత ఇలా సంఘర్షణలో నలిగిపోతుంటే ఎలా ఊరుకోగలడు? తనామెని ఉద్ధరించలేనంత నిస్సహాయుడా? వెంకటేశ్వర్రావులాంటి తోడేళ్ళ బారినించి ఆమె తన్ను తానెలా రక్షించుకుంటుంది, పాపం.

విశ్వానికి ఎటూ తేలలేదు. రాత్రంతా ఆలోచనలతోనే కాలం గడిచింది. తెల్లారేసరికి కళ్ళు ఎర్రబడి ఉన్నాయి తల దిమ్మెక్కింది. వర్షంలో తడవటంవల్ల ఆరోగ్యంకూడా దెబ్బతింది. ఒంటరిగా ఉన్నప్పుడల్లా రాత్రిజరిగిన సంఘటనే మనసులో మెదుల్తోంది.

విశ్వం ఇలా ఆలోచిస్తుండగా రంగనాథంగారు ఓ ఉత్తరం తెచ్చి అతనికిస్తూ "ఏమిట్రా ఇది?" అనడిగారు. ఉత్తరం మొదటి పంక్తి చూడగానే అతని ప్రాణం పైనేపోయింది. అది ఆకాశరామన్న ఉత్తరం. లోకల్ డెలివరిలో వచ్చింది. విశ్వానికి వసంత అనే నాటకాల్లో వేషాలు వేసే అమ్మాయితో సంబంధం ఉందనీ, వాళ్ళు పెళ్లి చేసుకోబోతున్నారనీ హెచ్చరించాడు, ఆకాశరామన్న. ఇది వెంకటేశ్వర్రావు పనే అయి ఉంటుందని వెంటనే ఊహించాడు విశ్వం.

"శుద్ధ అబద్ధం" అన్నాడు విశ్వం ధైర్యంగా.

"నువ్వు రోజూ పొద్దున్నే ఎక్కడికి వెళ్ళేది?"

విశ్వానికి నిజం చెప్పాలో అబద్ధం చెప్పాలో తెలియలేదు. ఎందుకైనా మంచిదని నిజమే చెప్పాడు.

"ఆ అమ్మాయి ఇంటికే."

"బొమ్మ వేస్తున్నాను. దానికి మోడల్ కావాలి. ఇంటిదగ్గర బావుండదని అక్కడికి వెళుతున్నాను."

ఈ సమాధానానికి రంగనాథం కొంచెం వెనక్కి తగ్గాడు.

"ఇహనించీ అది మానుకోటం మంచిది. ఏమంటావు?"

"బొమ్మ పూర్తికావొద్దూ?"

"అక్కర్లేదు."

"అయితే సరే"

"ఒకవేళ నువ్వేమైనా మనసులో ఆ పిల్లని పెళ్ళిచేసుకుందామని అనుకుంటున్నావేమో. అలాంటివి నాకు సరిపడవు. నీదారి నువ్వు చూసుకోవాల్సిందే ఆ పక్షంలో. ఆనర్స్ ప్యాసయినవాడివి. నీకింతకంటె ఏం చెప్పక్కర్లేదు."

అనేసి ఆయన వెళ్ళిపోయాడు. విశ్వం దీర్ఘంగా నిట్టూర్పు విడిచాడు. తను రాత్రి అనుకున్నాడో లేదో, అప్పుడే విఘ్నాలు మొదలు. ఈ కుళ్ళిపోయిన సంఘంలో ముందడుగు వెయ్యటం సాహసకార్యమే. కాని తను హేతువాదానికి నిలబడాలి. తను చెయ్యగలిగింది తప్పక చేయాలి. వసంతని తను పెళ్ళిచేసుకుని తీరాలి. జీవితంలో అవకాశాలు సులభంగా రావు. వొచ్చిన వాటిని సద్వినియోగం చేసుకోవాలి.

ఆ సాయంత్రం వసంతి ఇంటికివెళ్లి తన నిశ్చయం చెప్పాలనుకున్నాడు విశ్వం. కాని ఆమె ముఖం చూడటానికి సాహసం చాలక మానుకున్నాడు. ఉత్తరం రాద్దామని ఆలోచించాడు. కాని ఉత్తరాలు ప్రమాదకరమని రాయలేదు.

ఈ సంఘటన జరిగిన తరవాత విశ్వానికి ఇంట్లో మెసలటం కష్టం అనిపించింది. తనని అదోవిధంగా చూస్తున్నారు. అది కాక తను రెక్కలు వచ్చి ఉద్యోగంలో ఇంకా చేరలేదు. తనమీద నిర్లక్ష్యభావం ఇంట్లోవాళ్ళకి ఏర్పడసాగిందని అతను భావించాడు.

# అంతర్వాహిని

అదృష్టవశాత్తూ తను విజయవాడలో ఒక ఆఫీసులో ఉద్యోగానికి పెట్టిన దరఖాస్తుకి ఫలితం దక్కేలా ఉంది. ఇంటర్వ్యూకి రమ్మని రాశారు. విశ్వం ఏమీ ఆలోచించకుండా వెంటనే బయల్దేరాడు, పెట్టేబేడా సర్దుకుని. ఉద్యోగం చిన్నదే, అయినా తాత్కాలికంగా చెయ్యవచ్చు ననుకున్నాడు. రంగనాథంగారేమీ అడ్డు చెప్పలేదు. ఈ ఊరినించి వెడితే అమ్మాయి వ్యవహారం కూడా పరిష్కారమైపోతుందని ఆయన భావించాడు. అందువల్ల ఏదో ఓ ఉద్యోగం ఎక్కడ దొరికినా సరే వెళ్లటం మంచిదని ఒక సాధారణ సలహా ఇచ్చాడాయన. విశ్వానికి ఆ సలహా కొంచెం కష్టంగానే ఉంది. తను ఇంట్లో ఊరికే ఉండటంవల్ల అలా తండ్రి అభిప్రాయపడ్డాడని అతననుకున్నాడు.

విశ్వం దరఖాస్తు పెట్టింది ఒక రాజకీయపార్టీ ఆఫీసులో అకౌంటెంట్ పనికి. ఇంటర్వ్యూలో కార్యదర్శి ఏవేవో ప్రశ్నలడిగి చివరికి విశ్వంవైపు దీక్షగా చూసి అన్నాడు.

"రావు అనేపేరు బ్రాహ్మలేకదండీ పెట్టుకునేది?" ఆ ప్రశ్నలోని భావం వెంటనే విశ్వానికి అర్థంకాలేదు.

"ఈ రోజుల్లో అందరికీ అది మామూలుగా ఉండేపేరే గదండి" అన్నాడు.

కార్యదర్శి విశ్వంవైపు చూస్తూ ఏదో అడగటానికి సంకోచిస్తున్నాడు.

"మీరు...?" అంతవరకే ఆయన అడిగాడు, విశ్వం సమాధానంకోసం ఎదురుచూస్తూ.

అర్థమైంది విశ్వానికి. అతనిముఖంలో అసహ్యం తాండవించింది. ఈ మనిషికి రెండుముఖాలు. గట్టిగా అడిగే ధైర్యం ఆయనకిలేదు. కులతత్వాలకి అతీతుడనుకోవాలి ప్రజలు. అడక్కుండా ఉండలేడు. తన కులంకాకపోతే ఉద్యోగం ఇవ్వడు. అంతవరకు ఖాయం. "మంచిచెడ్డలు రెండే కులాలు అన్నాడు కదూ కవి! మరి నామంచినిగురించి నేను చెప్పుకో కూడదు." అన్నాడు నవ్వుతూ. కార్యదర్శి ముఖం చిట్లించుకున్నాడు. అలా చిట్లించుకుంటాడని విశ్వానికి తెలుసు. ఆయనకి వచ్చే సమాధానం తనదగ్గరుంటే సూటిగా చెప్పేసేవాడేనని కార్యదర్శి ఊహ! అలాంటి ఆఫీసులో ఉద్యోగంఇచ్చినా తనకక్కర్లేదు. అయినా పైకి కనపడనివ్వకుండా ఏవో ఒకటిరెండు విషయాలు మాట్లాడి ఇంటర్వ్యూ ముగిస్తూ "వెళ్లిరండి" అన్నాడు కార్యదర్శి.

"ఫలితం ఎప్పుడు తెలియచేస్తారు?"

"పోస్టులో తరవాత పంపిస్తాం- సెలెక్టయితే."

వెళ్లాడు విశ్వం. ఆ తరవాత కుతూహలంకొద్దీ ఆఫీసులో విచారిస్తే ఆ ఖాళీ భర్తీఅయిందని తెలిసింది. కొత్త ఉద్యోగి కార్యదర్శిగారి స్వకులస్థుడేట! బి.ఏ. తప్పాడట!

విశ్వం ఓగది అద్దెకు తీసుకుని ప్రతిఆఫీసు తిరగసాగాడు. ఎంప్లాయిమెంట్ ఎక్స్చేంజిలో పేరు నమోదు చేయించుకున్నాడు. కనీసం లోవర్ డివిజన్ గుమాస్తా అయినా సరేనని ఆఫీసర్ గారితో చెప్పాడు. ఒక ఆఫీసులో ఉద్యోగం వచ్చినట్టే వచ్చి పోయింది. పొద్దున వచ్చి పనిలో చేరమని అంగీకారంగా చెప్పాడు మేనేజర్. ఇంటికి ఉత్తరంకూడా రాసేశాడు ఉద్యోగం వచ్చిందని. కాని ఉదయం ఆఫీసుకి వెళ్లేసరికి మేనేజర్ తన విచారం తెలియచేశాడు. కొన్ని పరిస్థితులవల్ల ఆ ఉద్యోగం మరొకరికి అవశ్యంగా ఇవ్వాలిసొచ్చిందని చెప్పాడు. కాళ్ళీడ్చుకుంటూ నిరాశతో వెళ్ళిపోయాడు విశ్వం.

ఇంటినుంచి తెచ్చిన డబ్బు అయిపోవచ్చింది. ఉద్యోగంవచ్చే ఆశ ఏమీ లేదు. తిరిగి ఇంటికి వెనక్కి వెళ్ళటానికి అతని అభిమానం అడ్డొచ్చింది. ఏ ఉద్యోగమైనా సరే చేరటం మంచిదట! పొట్టగడిచేది ఏదైనా సరే తను చేరదలచుకున్నాడు. కాని ఆశలన్నీ అడియాసలౌతున్నాయి. కాఫీ మానేశాడు. టిఫిన్ మానేశాడు. భోజనంలో పెరుగు మానేశాడు. తరవాత ఒకపూట భోజనం మానేశాడు. ఏదో ఒక టిఫిన్ భోజనం బదులు తినేవాడు తరవాత రెండుపూటలు అలాగే చేశాడు.

అర్థాకలివల్లా, నిరాశవల్లా పట్టుదల సడలొచ్చింది. కాని అభిమానం ముంచుకొస్తోంది. ఏ ఉద్యోగమైనా సరే! ఆనర్సు ప్యాసైనట్టు ప్రొవిజనల్ సర్టిఫికేట్టు చేతిలో ఉంది. కనీసం తిండిపెట్టే స్తోమతు దానికి లేదా?

డబ్బు తగ్గిపోతున్నకొద్దీ దాని విలువ మరింత ఎక్కువైపోతోంది. ఒకపూటే టిఫిన్ తీసుకోసాగాడు.

భోజనం మొదలే లేదు. చివరికి ఆలోచించి అతి చౌక విధానం కనిపెట్టేశాడు బతకటానికి. అరటి పళ్లు!

"ఫరవాలేదు. అరటిపళ్లు బాగానే ఉంటాయే" అనిపించింది విశ్వానికి. చాలారోజుల తరవాత మొదటి సారిగా రుచిచూశాడు. తనకి అవి సహించేవి కావు పూర్వం. చక్కెర కేళీ అయితే నే తినేవాడు.

ఉన్నడబ్బయిపోయింతరవాత ఏం చేయాలో విశ్వానికి తోచలేదు. తక్కువ పనులు చెయ్యటానికి అతనికి మనస్కరించటంలేదు. రిక్షా లాగి కూలీ చేసుకొనీ బతక్కపోతే ఏం? కాని— 'జీవన్ భద్రాణి పశ్యతి!' జీవించటానికేనో పనిచెయ్యాలి. అందులో గౌరవహాని ఏంలేదు. కాని తనచదువు వృథా! అయినా పనిచెయ్యటానికి తను సిద్ధమే. కాని పని ఎవరిస్తారు? ఒకసారి బట్టల షాపులో తను కనుగున్న వ్యక్తి కళ్లలో మెదిలాడు. అతని రూపానికీ తన రూపానికీ ఇప్పుడంత తేడా ఏంలేదు. గడ్డంచేసి ఎన్నాళ్ళో అయింది క్షేడా పెట్టి చేసుకోనటమే! ఎనిమిది అరటిపళ్ళొస్తాయి.

తనుమాత్రం చచ్చినా బిచ్చమెత్తడు. అతని కళ్ళలో నీళ్ళు తిరిగాయి. అడుక్కునే వాళ్లని సానుభూతితో చూశాడు. అభిమానం చంపుకుంటున్నారు, పాపం.

తను ఎన్నోపనులు చెయ్యదలచుకున్నాడు. కాని తనజీవితం ఇలాగే అంతమవుతుందేమో! ఇప్పుడు ఈ స్థితిలో వసంత తననిచూస్తే! ఏం చేస్తుందో! కన్నీటితో అభిషేకం చేస్తుందేమో!

తననిచూసి తను జాలిపడుతున్నాడు. అకస్మాత్తుగా ఈవిషయం గ్రహించాడు విశ్వం. ఇతరుల బాధలు చూసి జాలిపడటం మంచిగుణం. కాని తనమీద జాలి ఘోరం! మరుక్షణంలో విశ్వం ముఖంలో గాంభీర్యం వచ్చింది.

సంజకెంపులు విరజిమ్ముతోంది సూర్యబింబం. మర్నాడు తను ఏదో ఒకపనిలో చేరతాడు. అది ఏదైనా సరే. దృఢనిశ్చయం అతని కళ్లలో మెరిసింది. ఏపనిచేసినా ఇక తనమీద తను జాలిపడడు. అనంత విశ్వంలో తనూ ఒకడు. తన బతుకుకోసం ఏదోవిధంగా ప్రయత్నించటం తన విధి. ఇన్నాళ్లూ తనేదో లేనిపోని గౌరవం తనకి ఆపాదించుకొన్నాడు తను చదువుకున్నవాడు కావొచ్చు. అయితే చదువు పనికొచ్చే పరిస్థితి లేనప్పుడు తను విచారించాల్సిన అవసరమేమీ లేదు. తను కొంతవిజ్ఞానం సంపాదించుకున్నాడు. అది విజ్ఞానంకోసం. అంతే. అది ధనార్జనకి పనికిరాలేదని తనకి ఇంత కాలంకోపంగా ఉంది. వెర్రివాడు తను! పరిస్థితులు తనెవరో గురుచేస్తున్నా కూడా గుడ్డివాడైగమనించలేక కాలం వృథాచేశాడు!

విశ్వం అరటిపళ్ళకొట్టువైపు నడిచాడు. నాలుగు అరటిపళ్ళుకొని తిరుగుముఖం పట్టాడు. కుళాయి కనిపిస్తే మంచినీళ్లు తాగాడు. రెండడుగులు వెయ్యగానే అకస్మాత్తుగా నీరసం ఆవహించింది. ఎన్నాళ్లనించో అరటిపళ్లమీద బతుకుతున్నాడు. అవి కడుపునిండా తను తినలేదు. తిన్నా సరిపడదు. కాసేపు కూర్చుని మళ్లీ రెండడుగులు వేశాడు. కళ్లు గిర్రున తిరిగాయి. ఎదురుగుండా రిక్షా వస్తోంది. పక్కకి తప్పుకుంటూ తూలిపడిపోయాడు. రిక్షాలో కూర్చునివస్తున్న స్త్రీ అదృశ్యం చూసింది. రిక్షా ఆగింది. రిక్షావాలా విశ్వం ముఖం మీద నీళ్ళు జల్లాడు. విశ్వం తెప్పరిల్లి కళ్లు తెరిచాడు. "ఎవరో ముసివాడు కాబోలు పాపం. ఎన్నాళ్లనించి తిండి లేదో. ఇదిగో ఈ రూపాయి అతనిచేతిలో పెట్టు" రూపాయి నోటు రిక్షావాలాకి అందించిందామె. అతనది విశ్వానికివ్వబోయాడు.

"నేను అడుక్కునే వాడినికాదు!" విషాదంగా హీనస్వరంతో అన్నాడు విశ్వం.

"మీ రెవరు? ఇలా పడిపోయారేం?" అందామె అనునయంగా, తనుచేసిన పొరపాటుకిచింతిస్తూ.

"నేను ఆనర్స్ గ్రాడ్యుయేటుని, కవిని. చిత్రకారుణ్ణి..." అంటూ ఆమె ముఖంలోకి చూశాడు విశ్వం. అతని ముఖం వివర్ణమైంది. ఆశ్చర్యంతో "జానకీ" అన్నాడు. ఆ పిలుపుకి జానకి అప్రతిభురాలైంది. పరకాయించి చూసింది విశ్వాన్ని. సంభ్రమాశ్చర్యాలతో దగిరికొచ్చింది.

"నువ్వేనా బావా! ఏమిటిదంతా?" ఆమె కంఠం గద్గదికమైంది.

విశ్వం ఏమీ అనలేదు. మెల్లిగా లేచి నుంచున్నాడు. కింద అరటిపళ్ళు పడిఉన్నాయి. వొంగి తీసుకోవాలని ప్రయత్నించి ఓపిక లేక మానేశాడు.

"మాట్లాడవేం బావా?" అంది జానకి అతనివైపు జాలిగా చూస్తూ.

"పరిస్థితుల ప్రభావంలే" అన్నాడతను.

"పోదాం పద."

"ఎక్కడికి?"

"ఇంటికి."

"ఇల్లా?"

"అవును రెండు రోజుల్నించీ ఇక్కడ ఉంటున్నాం. తరవాత చెబుతాలే. పద."

"తర్వాత వొస్తాలే"

"నిన్నిలా వొదిలివెడతాననా నీఅభిప్రాయం?"

"నాకు రూమ్ ఉంది."

"ఉంటే ఉందిలే."

విశ్వం కాసేపు తటపటాయించి "సరే పద" అని రెండడుగులు వేశాడు రిక్షావైపు. అతని కాళ్ళు తేలిపోయాయి.

"నిస్సత్తువగా ఉంది జానకీ" అంటూ వెనక్కి తిరిగాడు, అరటిపళ్లకోసం.

అరటిపళ్లు ఒక వరాహం కబలిస్తోంది.

"అయ్యో!" అన్నాడు విశ్వం అప్రయత్నంగా.

"ఏమిటి బావా?" అని వెనక్కి తిరిగి చూసింది జానకి.

"తినటానికేమైనా ఉంటే బాగుండును!" హీనస్వరంతో అరటిపళ్లవైపు చూస్తూ అన్నాడు విశ్వం.

తన గుండె ఎవరో గట్టిగా గుప్పిటో బిగించినట్టయింది జానకికి.

రిక్షావాడికి డబ్బిచ్చి చక్కెరకేళీపళ్ళు తొందరగా పట్టుకురమ్మని చెప్పింది.

"ఎందుకూ, సాదావి చాలు. ఇదిగో, నాదగ్గిర ఒక అణా ఉంది." జేబులో చెయ్యిపెట్టి అణా తీసి రిక్షావాడివైపు చూశాడు. వాడంతకిముందే వెళ్ళిపోయాడు.

విశ్వం చేతిలో అణా అలాగే పట్టుకుని శూన్యంగా జానకివైపు చూశాడు.

"అణా ఉందా బావా?"

"ఉంది జానకీ, ఇదిగో" అమాయకంగా చూపించాడు విశ్వం.

జానకి కళ్ళలో నీళ్లు గిర్రున తిరిగి నేలమీదికి టపటప జారాయి.

అణా ఉందట.

ఆఖరి అణా.

సాదా అరటిపళ్లకోసం.

"అరటిపండు మాత్రం ఇవ్వకు జానకీ. నాకు చక్కెరకేళీ తప్ప సాదావి ఇష్టం లేదు" అన్నాడు విశ్వం బావ ఒకసారి.

"సాదావి చాలు జానకీ" అంటున్నాడీరోజు.

ఆ దైన్యం భరించలేకపోయిందామె. దుఃఖం ఆమెలో పొంగిపొర్లింది. సంజకెంతుల్లో మెరుస్తూ ఆమె కనుకొలకులలోంచి కన్నీటి బిందువులు నేలకి జారుతుంటే తదేకదృష్టితో ఆ దృశ్యం చూస్తూ నిలబడిపోయాడు విశ్వం.

## 14

గవర్నమెంటు జనరల్ ఆస్పత్రిలో స్పెషల్ వార్డులో పడుకుని ఉన్నాడు సూరి. తలకి కట్టు కట్టి ఉంది. అతని మంచం పక్కనే ఒక స్టూల్ మీద కూర్చున్నాడు విశ్వం. జానకి సూరి తలవైపు కూర్చుని ఉంది.

"ఏమిట్రా ఈ ఉపద్రవం?" అడిగాడు విశ్వం.

"జానకి చెప్పలేదా?"

"చెప్పిందిలే. కాని నువ్విప్పుడు చెప్పగలిగే స్థితిలో ఉన్నావుగా. ఏం జరిగిందో చెప్పు. ఫస్ట్ హాండ్ ఇన్‌ఫర్మేషన్ కావాలి."

"ఏముంది, మామూలు గొడవలే."

నువ్వు జోక్యం కలిగించుకునేవాడివి కావుగా"

"ఈ సారి కలిగించుకున్నాను."

"ఎందువల్ల?"

"ఏం చేస్తాం? ఊరు మొత్తం కొర్టు కెక్కుట్టుంటే!"

"ఏం జరిగిందేమిటి?"

"పంచాయితీ ఎన్నికలు జరుగుతున్నాయి కదూ. ప్రెసిడెంటు పదవికి ఇద్దరు పోటీచేయదలుచుకున్నారు మా ఊళ్లో. ఇంకేం తగాదాలు, కొట్లాటలు మొదలు".

"నువ్వే పార్టీ?"

"నాకు పార్టీ ఏమిటి?"

"మరి దెబ్బలెందుకు తగిలాయి?"

"చెప్పేది విను. మునసబుగారబ్బాయీ, నేనూ స్నేహితులం. నేను సామాన్యంగా పేచీ వ్యవహా

రాల్లో కల్పించుకోను. కాని అతని పరిస్థితులు మరీ విషమించేట్టున్నాయి. ఏదో చెయ్యాలని నడుం కట్టాడు. చూస్తూ ఎలా ఊరుకోను? ఒంటరిగా ఏం చేస్తాడు! ఇద్దరం కలిసి ఒక అభ్యర్థిని పోటీనించి విరమింపచేయాలని ప్రయత్నించాం. ఇద్దరికి మా మీద అనుమానం ఏర్పడ్డది. మేమేదో మూడో పార్టీ పెట్టి ఓగు మావైపు తిప్పుకోవాలని చూస్తున్నామని వాళ్లూహించారు."

"మన విదేశాంగ విధానంలా ఉంది నీకథ"

"చివర మారిందిలే. విను మరి. మూడో పోటీదారు వచ్చాడనుకునేసరికి వాళ్లిద్దరూ ఏకమయ్యారు. ఇద్దరూ కలిసి ఏదో సంప్రదించుకున్నారు. పోటీ తప్పిపోయింది. కక్షలు తగ్గిపోయాయి. అంటే నా ప్రయత్నం సఫలమైందన్నమాట. నాకేదో సన్మానం జరుగుతుందని తెలుసులే."

"శుభం. కాని దెబ్బల సంగతేమిటయ్యా మహాప్రభూ?"

"అదే సన్మానం. కావాలని రెచ్చగొట్టానులే. అయితే ఇంత పని జరుగుతుందని అనుకోలేదు. ఏదో కొద్దిలో పోనిస్తారనుకున్నాను"

"నువ్వు చెప్పేది నాకేమీ అర్థం కావటం లేదు."

"అర్థం కానిదేముందీ? పోనీ ఇంకొంచెం విపులంగా చెబుతాను. వాళ్ళని పోటీ విరమించుకోమని మంచిగా చెబితే వినలేదు. వినరని ముందే తెలుసులే. అందుకని ఈ మూడోపక్షం గురించి పుకార్లు లేవదీశాను. అక్కడా అక్కడా వాళ్లని గురించి నేనేదో అన్నట్టు కల్పించాను. దాంతో వాళ్లకి ఉక్రోషాలు పెరిగాయి. ఏమయితే ఏం? ఊళ్లో పేచీలు తప్పిపోయాయి ప్రస్తుతానికి."

విశ్వం సూరివైపు ఆశ్చర్యంగా చూశాడు.

"అయితే సాహసించి కావాలని అభాండాలు నెత్తిన వేసుకున్నావా?"

"మరి ఏం చెయ్యను? లేకపోతే ఆ ఊళ్లో బతకటం మరీ కష్టం. నీకు తెలుసుగా. గలాటాలంటే నాకు చెడ్డ తలనొప్పి."

"నిన్ను కొట్టినవాళ్ళెవరు?"

"ఎవరయితే ఏంలే..."

"అదేమిటి? క్రిమినల్ కేసు పెట్టి జైల్లో పడేయించి వాడి పొగరు వాడికి కరపకుండా ఉంటావా?"

"నీకు తెలియదులే బావా ఈ గొడవంతా, ఆ కోర్టు గొడవలు లేకుండా చెయ్యటానికికదూ ఇంత శ్రమా పడ్డది."

విశ్వం సూరివైపు అర్థం కానట్టుగా చూశాడు.

"అయితే వాడిని వొదిలేసావా?"

"లేకపోతే వాడిమీద నాకు కక్షేమిటి? వెధవ ఎదురుగా వస్తే ఎడంచేత్తో కాలవ కట్టమీదకి విసిరెయ్యగలను. బుద్ధి తక్కువపని చేశానని లబో దిబోమంటూ ఉంటాడీపాటికి."

"నీది గాంధీగారి పద్ధతిలా ఉంది."

"నా దేపద్ధతీ కాదు. అది నా స్వభావం. అంతే."

"సుజనపద్ధతి అంటాలే."

"అదిగో, అదే నాకు సరిపడదు. నేను వాళ్లకోసమో, వీళ్లకోసమో ఏదీ చెయ్యలేదంటే నమ్మరేం? నాకో ఊరుంది. ఆ ఊళ్ళో నేను జీవితం గడపాలంటే అందుకు తగిన వాతావరణం సాధ్యమైనంతవరకూ కల్పించుకోవాలి. దీనికేమిటో పేర్లు పెడతారేం?... ఇంతా చేస్తే, ఈ మూడోపక్షం సంగతి ఆ మునసబుగారబ్బాయి టపాకాయలా పేల్చేస్తాడేమోనని భయంగా ఉంది. ఎరక్కపోయి అతనికి చెప్పాను. ఊళ్లో అప్పుడే నేనేదో తంత్రం పన్నానని గుసగుసలుగా ఉందిట. నాన్న చెప్పాడు. అసలు ఈ మనుషులకి పొగడ్తలంటే మహా ఇష్టం."

గబగబ మాట్లాడటంతో సూరికి కొంచెం ఆయాసం వొచ్చింది. జానకి అతనిని మాట్లాడవద్దని హెచ్చరించింది.

విశ్వం సూరివైపు ప్రశంసాపాత్రంగా చూడసాగాడు. ఏదో పొగడ్తగా అనబోయినవాడల్లా సూరి అన్న చివరిమాటలు విని నోరెత్తకుండా ఊరుకున్నాడు. సూరిని తను చిన్నప్పటినించీ ఎరుగు. వాడింత ఘటికుడని తను అనుకోలేదు, తను వాడినించి నేర్చుకోవాలిసింది చాలా ఉంది!

మరి కాసేపటికి వెంకట్రామయ్యగారు వచ్చి "మీరిద్దరూ వెళ్ళి భోజనం చేసిరండి. నేను మీరొచ్చేదాకా సూరి దగ్గర ఉంటాను" అన్నారు.

జానకీ, విశ్వం ఆస్పత్రి బయటికొచ్చారు. దారంలో జానకి సూరినిగూర్చి వెంకటపతి వృత్తాంతంతోసహా అంతా చెప్పింది. విశ్వానికి అదంతా చాలా కొత్తగా ఉంది సూరి ప్రవర్తననిజంగా అపూర్వం అనిపించిందతనికి. తను సూరిని పైచదువుకి వెళ్లమని ప్రోత్సహించాడు, వెడితే సూరి బాగుపడేవాడే వ్యక్తిగత అభ్యున్నతి దృష్ట్యా. కాని ఊరు పాతకాలంలోలాగే ఉండేది.

భోజనంచేసి పడక కుర్చీలో పడుకున్నాడు విశ్వం. అతని మనసులో ఏవేవో ఆలోచనలు కదిలాయి. జానకి చాపమీద కూర్చుని ఏదో పనిచేసుకుంటోంది.

ఆమెవైపు యథాలాపంగా చూశాడు విశ్వం. ఆమె వదనంలో ప్రశాంతత తాండవిస్తోంది. తనని దౌర్భాగ్యస్థితిలో చూసినప్పుడు ఆమె ముఖంలో ఎంత ఆవేదన ప్రస్ఫుటమైంది! పొంగి పొర్లే దుఃఖాన్ని ఆమె బలవంతాన ఆపుకుంటుంటే ఆ దుఃఖమంతా కన్నీరై నేలమీదికి జారే దృశ్యం అతని మనోవీధిలో మెరిసింది. అది విపరీత పరిస్థితే కావచ్చు; కాని తను కష్టంలో ఉంటే అంతగా ఆమె బాధపడాలిసిన అగత్యమేమిటి?

అకస్మాత్తుగా విశ్వం భావవీధిలో ఏదో వెలుగు గోచరించింది. జానకి తనని ప్రేమిస్తోందా? ఎలా ఈ విషయం తెలుసుకోవటం. ఒక వేళ ఆమె తనని ప్రేమిస్తే జీవితంలో ఒక గొప్పసమస్య తను ఎదుర్కోవాలి. పరిస్థితులు ప్రశుతిమించకముందే నిజం తెలుసుకుని సమయోచితంగా ప్రవర్తించాలి. సరాసరి ఈ ప్రశ్న జానకిని అడిగితే? ఆమె ఏమనుకుంటుందో! ఇప్పటికే ఒకసారి ఒకవ్యక్తి ఇచ్చిన చనువుదుర్వినియోగం చేసుకున్నాడు. డొంక తిరుగుడుగా ఆమెచేత విషయం బయటపెట్టించాలి.

"జానకీ. "

"ఏమిటి బావా?"

"వ్యక్తిలో ఎటువంటిగుణాలు నీకిష్టం?"

"మంచి గుణాలు." ఇదికూడా ఓ ప్రశ్నేనా అన్నట్టుగా జానకి సమాధానం చెప్పింది.

"చెడ్డగుణాలుగల మనిషైతే?"

"బాధగా ఉంటుంది."

"అది సరే. అతనిపట్ల నీ ప్రవర్తన ఎలా ఉంటుంది?"

"ఇప్పుడెందుకా సంగతి?"

"కావాలి."

"ఆ సందర్భంలోకాని తెలీదు."

"నేను తాగుడు అలవాటుచేసుకుంటాననుకో."

"నాలుగు చివాట్లు పెడతాను."

"అంతేగాని ఇంకేం చెయ్యవా?"

"వీలైతే బాగుచెయ్యటానికి ప్రయత్నిస్తాను."

"లేకపోతే?"

"ఒక దణ్ణంపెట్టి ఊరుకుంటాను."

"అంతేగాని అసహ్యించుకోవా?"

"గుణాల్నిగాని మనుషుల్ని అసహ్యించుకోటం ఎందుకూ?"

"నీకాబోయే భర్త అలా చేస్తాడనుకో."

"చాల్లెద్దూ, వేళాకోళం." అంది జానకి చిరుకోపంతో విసుగ్గా.

"కాదు జానకీ చెప్పు."

"అప్పుడేంచేస్తానో వొచ్చి చూద్దువుగానిలే."

ఆమెవంక పరిశీలనగా చూశాడు విశ్వం.

"రానిస్తావా?"

"పరాయివాడివైనట్టు మాట్లాడతావేం?"

"రానిచ్చినా ఇటువంటి సంగతులు చెబుతావేమిటిలే," ఆమెవంక దొంగతనంగా చూస్తూ అన్నాడతను. జానకి ఏమీ మాట్లాడలేదు.

"ఊరికే అన్నాలే జానకీ, నీకు మంచి మొగుణ్ని వెతికి పట్టుకొస్తాంగా."

"పనీపాటా లేకపోతేసరి." అనేసి జానకి లేచి వెళ్ళబోయింది.

"వెళ్లకు, వెళ్ళకు, నీకు పుణ్యముంటుంది, ఒక్క సలహా ఇవ్వు జానకీ."

"నాకు సలహాలివ్వటం రాదు."

"వొచ్చులే. చూడు, మనిషి ఏదైనా ఒక మంచి పని చెయ్యాలని నీకనిపించదూ?"

"ఒకటేమిటి, చాలా చెయ్యాలి."

"కనీసం ఒక్కటి. కొంచెం ఆలోచించి చెప్పు. నేనేంచేస్తే బావుంటుందంటావు?"

"నీ ఇష్టంవచ్చింది చెయ్యి. నాకేం తెలుస్తుంది".

"నాకిలా సాహ్యకుడా ఏదైనా మంచిపని చెయ్యాలని ఉంది."

"అన్నయ్య అలా చేశానని ఎప్పుడూ చెప్పుకోడే"

"అహాం. అ కాదు. సంఘాన్ని ఉద్ధరించేపని చేస్తే బావుండదూ?"

"నువ్వూ నేనూ ఒకర్ని ఉద్ధరించేదేమిటి లే బావా."

"అలా తీసెయ్యకు మరి. పెళ్ళి విషయమే తీసుకో. కట్నం లేకుండా పెళ్ళిచేసుకోటమో, వర్ణాంతరం చేసుకోవటమో......"

"రెండో పెళ్ళి చేసుకోకుండా ఉండటమో..." జానకి నవ్వుతూ అంది.

"హాస్యంకాదు. సాంఘికదురాచారానికి బలి కాబోయే స్త్రీని పెళ్ళిచేసుకుంటే?"

"చేసుకో, మంచిదే." నిర్లిప్తంగా అందిజానకి.

విశ్వం ఆమె ముఖంలోకి చూశాడు. ఆమెలోని ఏ భావమూ ముఖంలో ప్రతిఫలించటం లేదు.

"జాగ్రత్తగా ఆలోచించి చెప్పు. వేళాకోళానికి అడగటం లేదు."

జానకి కొంచెం ఆలోచించింది.

"ధైర్యం ఉంటే, మనసారా కోరితే చేసుకోటం మంచిదె బావా. ఇందులో సలహా చెప్పటానికేముంది? అది కేవలం వ్యక్తిగత విషయం కదా?"

అంత తేలిగ్గా, ఏ భావమూ లేకుండా ఆమె అభిప్రాయం వెలిబుచ్చుతుందనుకోలేదు విశ్వం. కాని ఆ సమాధానం అతనికి తృప్తినిచ్చింది. ఒక గడ్డు సమస్య ఎదుర్కోవలసిన అవసరం తప్పింది.

"నువ్వంటే నాకెంతో అభిమానం జానకీ."

"చెప్పాలా ఏమిటి?" అంది నెమ్మదిగా జానకి.

"నీకు మంచి సంబంధం రావాలనీ, మూడు పువ్వూలూ ఆరు కాయలుగా, నిత్యకల్యాణం పచ్చ తోరణంగా నువ్వు సంసార జీవితం గడపాలనీ నా కోరిక."

"నువ్వు మంచివాడివి బావా." అందామె.

"నేనంటే నీకు అభిమాన మేకదు జానకీ?"

ఆమెలో ఏ జ్ఞాపకాలు మెదిలాయో, కళ్లు చెమ్మగిల్లాయి. ఆ నీళ్ళు నిండిన కళ్లతో నే విశ్వం వైపు ఒకసారి చూసింది. విశ్వం హృదయం ఆర్ద్రమైంది

"ఏమిటి బావా, చాదస్తం? నువ్వంటే నాకభిమానం ఉండదూ?"

"ఎందుకుండాలి?" కావాలని తర్కించాడు విశ్వం.

"బావవి కనుక. మంచివాడివి కనుక. ఇంకా-నేనంటే నీకభిమానం కనుక."

అంతేనా?"

"మరింకేముంటాయి కారణాలు? అయినా ఇవన్నీ నేనెప్పుడూ ఆలోచించలేదు. ఆలోచించను కూడా. తిరిగ్గా కూచుని భలే ప్రశ్నలడుగుతున్నావులే. రేపు పెళ్ళయితే మా అక్కయ్యని కూడా ఇలాగే అడుగుతావు కాబోలు." అని కలకల నవ్వుతూ జానకి అతనివైపు చూసింది.

ఆ నవ్వులో నిర్మలగంగాప్రవాహపు గలగలా, ఆ చూపులో ఆత్మీయత, స్నేహగౌరవాదరాభిమానాలూ దర్శించి పరవశించాడు విశ్వం. స్త్రీపురుష భేదానికి ప్రాముఖ్యం లేని ఏదో పవిత్రమైన ఆత్మీయత తమ హృదయాలని ఆవరించినట్టు అతను ఆ క్షణాన అనుభూతిపొందాడు.

స శే షం

# విదేశద్రవ్యమారకరంగంలో విషమస్థితి

## శ్రీ బులుసు వెంకటసుబ్బారావు

ఆర్థికరంగంలో అన్నివిధాల అధఃపతితమైన ఒక విస్తృతదేశాన్ని శతాబ్దాలుగా స్వాతంత్ర్య వాతావరణంలో పురోగమించిన ఇతరదేశాలస్థితికి తేవడం అత్యంత కష్టసాధ్యమైన కార్యం. మన కళ్ళయెదుట ఆర్థికపురోగమనంవ్యాప్త్యా అఖండ వైభవ సంపదలతో విలసిల్లుతూన్న — అమెరికా — ఇంగ్లండు — జర్మనీ — జపాన్ — మొదలైనదేశాలు ఒక్కరోజులో అట్టి అపూర్వమహోన్నతస్థితికి రాలేదు. బీదరికానికి అమెరికా, జర్మనీదేశాల నుదాహరించిన రోజులు లేకపోలేదు. కాని శతాబ్దాలుగా జయాపజయాల నెదుర్కొంటూ అచంచలదీక్షతో, అకుంఠిత దేశభక్తితో నిరవధికంగా ఒనర్చిన కృషిఫలితములే నేటి ఆదేశాల వైభవప్రాభవాలు. అయితే కొన్ని దేశాలలో ఆర్థికపురోగమనం అతిత్వరితంగా సాగింది. మరికొన్ని దేశాలలో కొంచెం మందంగా సాగింది. దీనికి కారణం ఆయాదేశాలు అవలంబించిన విభిన్నమైన ఆర్థికవిధానాలే. ఈ భిన్నత్వం ఆదేశాల రాజకీయవాతావరణాలపై ఆధారపడి ఉంటుంది. నియంతృత్వ దేశాలలో (Totalitarian States) వ్యక్తిస్వాతంత్ర్యాన్నరికట్టి ప్రభుత్వమే అన్నిపనులు చేయుడంవలన పురోగమనం, స్వేచ్ఛావ్యవస (Free Enterprise) పై ఆధారపడే పెట్టుబడిదారీదేశాల (Capitalist Countries) కన్న త్వరితంగా సాగవచ్చు. ఈ రెండువిధానాల నటుంచి సంపూర్ణంగా విదేశీయసాహాయ్యంపై ఆధారపడి కొన్ని దేశాలు అత్యల్పకాలంలో అత్యధిక ఆర్థికాభివృద్ధిని పొందాయి. 1945 లో సర్వవినాశకరమైన సంగ్రామం సంభవించినా విదేశీసాహాయ్యంవలన మహత్తరమైన ఆర్థికపురోభివృద్ధి సాధించింది పదమూడు సంవత్సరాలలోనే పశ్చిమజర్మనీ

భారతదేశార్థికపురోభివృద్ధిసాధనలో పైమూడు అంశాలు సమ్మిశ్రితమయ్యాయని చెప్పవచ్చు. భారతదేశం ఇటు పూర్తిగా పెట్టుబడిదారీవిధానాన్నవలంబించినదేశం కాదు. అటు అన్నిరంగాలందు ప్రభుత్వప్రమేయం కలిగినదేశంకూడా కాదు. మనది ఒకవిధమైన మిశ్రమార్థికవ్యవస. ఒకవంక ప్రభుత్వం ప్రణాళికల ద్వారా పురోభివృద్ధికి కృషిచేస్తూనే పెట్టుబడిదారులకు చేయూత నొసగుతోంది. దేశపురోగమనానికి ఇటు ప్రభుత్వరంగంలోను (Public Sector) అటు ప్రజారంగంలోను (Private Sector) తీవ్రకృషి జరుగుతోంది. ఈవిధంగా రష్యా అమెరికాల ఆర్థిక పురోగమనచరిత్ర నాకళించుకొన్న భారతదేశం ఆదేశాల పద్ధతుల్ని సమన్వయించి ఒక మిశ్రమ వ్యవస్థను స్థాపించుకొన్నది. అంతేకాదు. కేవలం మన స్వయంకృషి మనం తలచిన అభ్యుదయాన్ని సాధింపలేదు. ఇన్ని శతాబ్దాలుగా బానిసత్వంలో మగ్గిన మనదేశంలో ఆర్థికపటుత్వం క్షీణించింది. పూర్తిగా స్వయంకృషి మూలకంగా మన లక్ష్యాన్ని సాధించలేం. కాబట్టి విదేశీ సహాయం అవసరం. అల్లాగని, యుద్ధానంతర పశ్చిమ జర్మనీవలె మనం స్వేచ్ఛావిదేశీ విధానాన్ని పరుల హస్తగతంచేసి సంపూర్ణంగా వారి సహాయంపై ఆధారపడలేము. అంతర్జాతీయ రంగంలో తన రాజకీయ ప్రతిపత్తికి ఏమాత్రం భంగం రాకుండా ఉంటేనే స్వతంత్ర భారతదేశం విదేశీ సహాయాన్ని ఆకాంక్షిస్తుంది. ఈ మూడు విషయాలను మనం జ్ఞప్తియందుంచుకొని స్వతంత్రభారతార్థిక పురోగమన పథాన్ని పరిశీలిద్దాం. ఈ పథంలో మన మెదుర్కొనవలసిన అనేక దుర్గమాలలో ప్రధానమైనది విదేశీ మారకద్రవ్యపు కొరత.

ఈ కఠిన సమస్య ఏవిధంగా ప్రారంభమైనదో తెలుసుకోవడం అతిసులభం. సంపూర్ణంగా ఆర్థిక పటుత్వాన్ని కోల్పోయి అణగిన ఒక దేశాన్ని, పారిశ్రామికంగా ఉన్నతి స్థాయిలోనికి తీసుకురావడానికి మనం తదవసరవస్తు సముదాయాన్నంతా విదేశముల నుండి దిగుమతి చేసుకోవాలి. చిన్న యంత్రాలు, భారీ యంత్రాలు, రవాణా సౌలభ్యాని కవసరమైన యంత్ర సామగ్రి, ఇవికాక ఈ యంత్రాంగాన్ని నిర్వహింప

గలిగే విదేశీ సాంకేతిక విజ్ఞాన నిపుణులను కూడా మనం అత్యధిక వ్యయప్రయాసలకోర్చి దిగుమతి చేసుకోవాలి. ఒక అణుశక్తి ఉత్పత్తి యంత్రాంగాన్ని మన దేశంలో సంస్థాపించాలంటే దానికవసరమైన ప్రతివస్తువు కూడా విదేశంనుండే రావాలి. అవేవీ కూడా మన దేశంలో ఇంకా ఉత్పత్తి కావటంలేదు. ఉత్పత్తి సాధకాలైన యంత్రాంగాన్ని ఎల్లకాలం మనం విదేశాలనుండి దిగుమతి చేసుకోనజాలం. ఈ ఉత్పత్తి సాధక యంత్రాంగాన్ని నిర్మించే ఉత్పాదకశక్తి కూడా మన దేశంలో పెంపొందించుకోవాలి. ఒక దేశాన్ని పారిశ్రామిక దేశంగా మార్చాలంటే అన్నిటికన్నా ముందు విస్తృతమైన రవాణాసౌకర్య నిర్మాణం అవసరం. అందులో భారతదేశం అతివిశాలమైనది. బొగ్గుగను లొకచోట, ఇనుము ఉక్కుగను లొకమూల, యంత్రాంగం ఒకమూల, పెట్టుబడిదారు లొకమూల, ఎగుమతి దిగుమతులకు నౌకా కేంద్రా లొకవంక ఉన్నాయి. వీటన్నిటిని అత్యాధునిక రవాణామార్గాలతో కలపడం సామాన్యమైనది కాదు. ఈ రవాణాయంత్రాంగానికి మనం సంపూర్ణంగా విదేశీ దిగుమతులపైనే ఆధారపడవలసి వస్తోంది.

ఇంకొక విషయం కూడా ఇక్కడ అవిస్మరణీయమైనది. మనం విదేశాలనుండి కొనగలిగే వస్తుజాల పరిమాణం, మనం విదేశాలకమ్మగలిగే వస్తుజాల పరిమాణంపై ఆధారపడి ఉంటుంది. మనది బీదదేశం. విదేశీ అభిరుచులకు తగినట్లుగా మనం వస్తువులను తయారు చేయలేం. ఇక మన ఎగుమతులలో ముడిపదార్థాలే ఎక్కువ. ఇటీవల ఈ ముడిపదార్థాల విక్రయంలో కూడా మన దేశం వెనుకపడుతోంది. కొన్ని వస్తువులలో ప్రపంచక్రయవిక్రయంలో భారతదేశం ఆధిపత్యం వహించింది. ఉదాహరణకు, జనపనార వస్తువులు, టీ మున్నగునవి. కాని నేడు ఆ వస్తువులు సహితం విదేశీయుల స్పర్థకు తట్టుకొనలేకపోతున్నాయి. పాకిస్థాను జనపనార వర్తకంలో చాలా ముందంజ వేసింది. అదీకాక మన ఎగుమతులు వ్యావసాయికమైనవవడంవలన వాని ఉత్పత్తి పరిణామాలు మన అదుపులో ఉండవు. ఒక సంవత్సరం ఎక్కువ ఉత్పత్తి కావచ్చు. ఒక సంవత్సరం తక్కువ కావచ్చును.

1956 వ సంవత్సరంలో ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ప్రారంభమైనదాదిగా విదేశీమారకరంగంలో మనకన్నీ అడ్డంకులే సంభవింపసాగాయి. ఎన్నో అవాంతరాలు సంప్రాప్తిస్తాయని మనం ఊహించే ప్రణాళికాపథకాన్ని తయారుచేశాము. కాని మన మనుకున్న అవాంతరాలకు పరిష్కారమార్గాలనింకా యోచించుకోనకపూర్వమే అనేకవిధాలైన నూతనసమస్యలుద్భవించి మన పథకాన్ని తారుమారు చేశాయి. ఈవిధంగా తారుమారౌతుందని ముందుగానే ఊహించి ప్రణాళికా పరిమాణాన్ని తగ్గించమని హెచ్చరించినవారు లేకపోలేదు. ప్రప్రథమంగా వారిలో పేర్కొనవలసిన వ్యక్తి ఆచార్య బి. ఆర్. షినాయ్. ఈయన 1956 లోనే, ఆర్థికశాస్త్రజ్ఞుల సమితితో (Pannel of Economists) పూర్తిగా వ్యతిరేకించి, ప్రణాళికారచనలో వాస్తవికత లోపించరాదని ఉద్ఘాటించారు. అయితే అప్పట్లో ప్రథమ పంచవర్ష ప్రణాళికలో సంపూర్ణవిజయం సంపాదించామనే గర్వంతో (నిజానికి మనం సంపాదించిన విజయం అతి తాత్కాలికమైనది) ఆయన మాటలు ఎవరూ వినలేదు. క్రమంగా దిగుమతుల సంఖ్య అత్యధికమైపోవడం, ఎగుమతులు క్షీణించడం, విదేశాలనుండి అనుకున్నంత సహాయం రాకపోవడం సంభవించి ఆ ఆర్థిక శాస్త్రజ్ఞుని మాటలను సత్యాంశాలుగా నిరూపించాయి. నేటికీ భారతప్రభుత్వం ప్రజావిశ్వాసంకోరకై, భారతదేశంలో ద్రవ్యోల్బణం అంతగా లేదని ప్రకటించడం ఎంతైనా హాస్యాస్పదంగా ఉంది. పరాజయంకన్నా వాస్తవిక పరిస్థితులపట్ల అంధత్వం సహింపరానిదే అవుతుంది.

ఇక ప్రణాళికారచనలో అంచనాలను పరిశీలించిన పిదప అవి ఏవిధంగా తారుమారయ్యాయో పరిశీలిద్దాం.

దిగుమతులు ఈ క్రిందివిధంగా అంచనా వేయబడ్డాయి. అయిదు సంవత్సరాలకు కలిపి మొత్తం దిగుమతులపై చేయబడవలసిన వ్యయం రూ 4,340 కోట్లు. అంటే సరాసరి సంవత్సరానికి ఎనిమిదివందల డెబ్బై కోట్ల రూపాయిలన్నమాట. ఈ ఖర్చులో ఎక్కువ భాగం, యంత్రాంగం, వాహనసౌకర్యాలు, ఇనుము ఉక్కు లోహాలు, తైలములు మొదలయిన వానిపై వెచ్చింపబడుతుంది.

ఇక, ఎగుమతులు మొత్తం రూ 2,965 కోట్ల ఖరీదు కలవిగా అంచనా వేయబడ్డాయి. అంటే సరా

# విదేశద్రవ్యమారకరంగంలో విషమస్థితి

సరిని సంవత్సరానికి 593 కోట్ల రూపాయిల విలువగల వస్తు సముదాయాన్ని భారతదేశం 1956-61 లో ఎగుమతి చేయకలదని ఊహింపబడింది. భారతదేశపు ఎగుమతులందు ముఖ్యవస్తువులు, టీ, జనపనార వస్తువులు, ప్రత్తి వస్తువులు. 1955వ సంవత్సరపు ఎగుమతులకన్న ఎక్కువ ఎగుమతి పరిమాణం, టీ, ప్రత్తివస్త్రములందు సాధ్యమౌతుందని భావింపబడింది. ఈ అధిక పరిమాణమైనా అంత చెప్పుకోదగినది కాదు. అది నాటికి ఇరవై పాళ్లకంటెకూడా తక్కువే.

1956-61 ఎగుమతుల అంచనా

| వస్తువులు | ఎగుమతి పరిమాణం (1956-'61) |
|---|---|
| టీ | రూ. 635 కోట్లు |
| జనుము, వస్తువులు | 610 ,, |
| ప్రత్తి, వస్త్రములు | 375 ,, |
| తెలములు | 110 ,, |
| పొగాకు | 75 ,, |
| తోళ్ళు, చర్మం | 140 ,, |
| ముడిప్రత్తి, వేస్టు | 110 ,, |
| లోహ ఖనిజములు | 115 ,, |
| బొగ్గు, కోక్ | 25 ,, |
| రసాయనికములు, మందులు | 25 ,, |
| ఇనప వస్తువులు, విద్యుత్పరికరములు | 20 ,, |
| ఇతరములు | 725 ,, |
| | రూ 2,965 కోట్లు |

దిగుమతుల అంచనా (1956-61)

| వస్తువులు | దిగుమతి పరిమాణపు అంచనా (1956-'61) |
|---|---|
| యాంత్రిక సామగ్రి, రవాణా వాహనములు | రూ 1500 కోట్లు |
| ఇనుము, ఉక్కు | ,, 430 ,, |
| ఇతర లోహములు | ,, 220 ,, |
| ధాన్యములు, దినుసులు, పిండి | ,, 240 ,, |
| చక్కెర | ,, 35 ,, |
| తైలములు | ,, 410 ,, |
| రసాయనికమైన ఔషధములు | ,, 160 ,, |
| రంగు సామగ్రులు | ,, 85 ,, |
| కాగితం | ,, 55 ,, |
| లోహసామగ్రి, విద్యుత్పరికరములు | ,, 145 ,, |
| ముడి ప్రత్తి | ,, 270 ,, |
| ముడి జనుము | ,, 90 ,, |
| ఇతరములు | ,, 700 ,, |
| | రూ 4,340 కోట్లు |

ఎగుమతి, దిగుమతి వస్తువులుకాక విదేశీమారకపు రంగంలో వచ్చే అంశాలు మరికొన్ని ఉన్నాయి. ఉదాహరణకు పైదేశంనుండి సాంకేతిక నిపుణులు మన దేశానికి వచ్చినపుడు వారిఖర్చు, వారి జీతములు విదేశీ ద్రవ్యంలో మనం చెల్లించాలి. అంతేకాక పై దేశాలనుండి మనం పుచ్చుకున్న ఋణాలపైన వడ్డీ కట్టాలి. ఈ లెక్కలలో భారతదేశానికి మిగులు వస్తుందని ప్రణాళికా రచయితలు భావించారు. అయిదు సంవత్సరాలకు కలసి ఈరీతిగా లభించే మొత్తం 255 కోట్ల రూపాయిలు కాగలదు. అంటే సరాసరిన సంవత్సరానికి 51 కోట్ల రూపాయిలన్నమాట. పై అంచనాల ప్రకారం ఎగుమతుల విలువ 2,965కోట్ల రూపాయిలు, దిగుమతుల విలువ 4,340 కోట్ల రూపాయిలు. మనకు అయిదు సంవత్సరాలలోను లభించేవి దేశీమారకపు ద్రవ్యం రూ 2,965 కోట్లు + రూ 255 కోట్లు = రూ 3220 కోట్లు. మనం విదేశాల కీయవలసిన విదేశీమారకపుద్రవ్యం రూ 4,340 కోట్లు. అంటే భర్తీకావలసింది రూ 1,120 కోట్ల రూపాయల విలువగల విదేశీమారకపు ద్రవ్యం. ఇంతపెద్ద మొత్తం భర్తీచేయడానికి ఈ క్రింది సూచనలను ప్రణాళికాసంఘం సూచించింది. వానిప్రకారం భారతదేశానికి లండనులోకల స్టర్లింగు దాపరికంనుండి రూ 200 కోట్లు, ఇతర విధములుగా భారతదేశంలో పెట్టుబడి పెట్టేవారి మూలకంగా రూ 100 కోట్లు రాగలవని భావింపబడింది. ఇక మిగిలిన రూ 800 కోట్లు విదేశీ సాహాయం మూలంగా లభించాలి. అమెరికా సంయుక్త రాష్ట్రములు ప్రథమ ప్రణాళికలో గోధుమ ఋణం మూలకంగా రూ 90,31 లక్షలు, ఆంగ్లో, అమెరికా సహకార కార్యక్రమం మూలకంగా రూ 102,55 లక్షలు, ఇచ్చింది. ఆ విధంగానే ఆస్ట్రేలియా, కెనడా, న్యూజిలాండు, నార్వే, బ్రిటన్, రష్యా, ఫోర్డుసంస్థ, ప్రపంచ బాంకు మున్నగునవి సహాయం చేశాయి. ఈ సహాయం కొంత ఋణ రూపకంగాను, కొంత దాన

రూపకంగాను జరిగింది. ఈ పై దేశాలు, విదేశీసంస్థలు, ద్వితీయ పంచవర్ష ప్రణాళికా కాలంలో కూడా ఇతోధికంగా సహాయం చూపి ఆ రూ 800 కోట్ల మారకపు ద్రవ్యాన్ని భరీ చేస్తాయని ప్రణాళికా రచయితలు ఆశించారు.

కాబట్టి ద్వితీయ పంచవర్షప్రణాళికా విజయం విదేశీ సాహాయ్యంపై ఆధారపడి ఉంది. మొత్తం వ్యయ పరిమాణం రూ 4,800 కోట్లలోను, స్వయంకృషివలన 4,000 కోట్లను, రూ 800 కోట్లను విదేశీ సాహాయ్యం వలన సాధించ కలిగితే భారతదేశం ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో సంపూర్ణవిజయం సాధించినట్లన్నమాట. అయితే రూ 800 కోట్ల విదేశీమారక ద్రవ్యాన్ని సంపాదించడం సులభసాధ్యమైన పని కాదు. ఏదో ఒక రాజకీయ పక్షంలో చేరనిదే అంత పెద్ద మొత్తాన్ని భారత దేశానికి ఏ విదేశము కేవలం కొన్నాళ్ళ గాని, దీర్ఘకాలిక ఋణంగా కాని ఇవ్వదు. కాబట్టి ప్రణాళిక అంచనాలు సరిగా అనుకొన్నట్లు ఫలించినా కూడా రూ 800 కోట్ల విదేశీ సహాయం ఒక గడ్డుసమస్య అయిఉండేది.

అయితే అంత మాత్రంతో కూడా ఆ సమస్య మనలను వదలలేదు. అది మరింత తీవ్రతర స్వరూపం ధరించి, ప్రణాళిక అంచనాలను తారుమారు చేసి, ప్రణాళికా విజయాన్నే మట్టుపెట్టే మహాసమస్యగా మారింది. ఇదే నేడు భారతదేశం ఎదుర్కొంటూన్న విదేశీమారకపు ద్రవ్యపు కొరతవలన ఏర్పడిన అతివిషమ పరిస్థితి. ఈ సమస్య ఏ విధంగా పరిణమిస్తుందోనని భారతీయులే కాక విదేశీయులు—శత్రువులు, మిత్రులు—కూడా ఎంతో ఆత్రంగా ఎదురుచూస్తున్నారు.

అయితే, విదేశీద్రవ్యపు కొఱత అనుకున్న అంచనాలకన్న అత్యధికమై, ఈ సమస్య భావించిన దానికన్న అత్యంత విషమ మవడానికి కల కారణాలను పరిశీలించాలి. ఏ ఒక్క కారణం ఈ అంచనాలను తారుమారుచేసి సమస్యను విషమతరం చెయ్యలేదు. అనేకములైన నూతన సమస్యలు అంకురించి ప్రణాళికా రచయితల ఊహలను వమ్ముచేసి విదేశీమారకపు ద్రవ్యపు లోటును అతివిస్తృతంచేసి సమస్యను మరింత అగాధం చేస్తాయి.

దిగుమతుల దృష్ట్యా తిలకిస్తే ప్రణాళికా రచయితలు ప్రథమంలో వేసిన అంచనాలకన్న అత్యధిక పరిమాణంలో దిగుమతులను మనం చేసికొన వలసి వచ్చింది. ఎక్కువ దిగుమతులు చేసుకున్నామంటే ఎక్కువ విదేశీ మారకపు ద్రవ్యపులోటు ఏర్పడిన దన్నమాట. అంచనా పరిమాణాల కన్న ఎక్కువ దిగుమతులు చేసికోవలసిన అవసరం ఈ క్రింది కారణాలవలన సంభవించినది.

ప్రప్రథమంగా గణింపవలసినది, అత్యధికమైన ఆహారపు కొరత. దేశంలో ఆహార స్వయంసమృద్ధి విషయంలో ప్రథమ పంచవర్షప్రణాళిక సాధించిన విజయం చాలా తాత్కాలికమైనది. ఆ విజయమైనా ప్రణాళికా కృషి ఫలితమవడంకంటె 1953—54 సంవత్సరాలలో భారతదేశంఅనుభవించిన అనుకూలమైన ఋతుపవనముల ఫలితమవడం ఎక్కువ వాస్తవికమైన విషయం. కానిక్రమంగా అట్టి అనుకూలపవనాలు మార్పుచెంది ప్రతికూలంగామారడంతో ఆహారోత్పత్తి పరిమాణం తగ్గిపోయింది. 1956-57 లో నైతే ఆహారోత్పత్తి గిరాకీకి ఎంతమాత్రం సరిపోలేదు. ఉత్తర్ ప్రదేశ్, బీహార్, మధ్యప్రదేశ్ మున్నగు రాష్ట్రాలలో అనుకున్న ఆహారోత్పత్తికన్న చాలాతక్కువ వచ్చింది. 1955-56 కన్న 1956-57 లో మొత్తం ఆహారోత్పత్తి 28 3% నుండి 24 8% కు పడిపోయింది.

ఈ విధంగా ఆహారోత్పత్తి తగ్గిపోయి విదేశాల నుండి అమితవ్యయంతో దిగుమతులు చేసుకోవడానికి అనేక కారణాలున్నాయి ఆహారోత్పత్తి విచారణ సంఘం అధ్యక్షుడు శ్రీ అశోక మెహతా (Food grain Enquiry Committee report) వివరించిన కారణం ముందుగా పరిశీలింపవలసినది. ఈయన భావన ప్రకారం, ఒక బీదదేశంలో ఆహారపదార్థాలకు గిరాకీ ఎక్కువ కావడంవల్ల ధరలు పెరుగుతాయి. కనక రైతులు ఆ పదార్థాల సరఫరా ఎక్కువ చెయ్యరు, పైగా ఇదివరకుకన్న తగ్గిస్తారుకూడా. ఈయన వాదం బహిరంగంగా కొంత అసహజంగా కనబడవచ్చు కాని అది సహజాతిసహజమైనది. గిరాకీ పెరగడంవలన ధరలు పెరుగుతాయి. ధరలు పెరగడంతో, పూర్వం విక్రయిస్తున్న పరిమాణంకన్న తక్కువ పరిమాణానికే పూర్వపు ఆదాయం రైతు పొందకలుగుతాడు. అంత వరకు సరియైన ఆహారాన్ని భుజించడానికి తగిన

## విదేశద్రవ్యమారకరంగంలో విషమస్థితి

సామర్థ్యంలేని బీదరైతు ఇప్పుడు తాను పూర్వం తిన్న జొన్నలు మొదలైనవాటిని వదలి బియ్యం, గోధుమ మొదలైన ఉత్కృష్ట ధాన్యాలను ఉపయోగించు చుంటాడు. దీనితో అతడు తేగలిగిన సరఫరా పరిమాణం (Amount of supply) పడిపోతుంది. క్రమంగా పారిశ్రామిక పురోగమనం చెందుతూన్న దేశాలలో జనాభా పెరిగి తద్వారా ఆహారధాన్యాలకు గిరాకీ పెరుగుతుంది. దీనివలన ఉత్పత్తి పెరగకపోయినట్లయితే ఆహారపు లోటు ఏర్పడుతుంది.

ఇక రెండవ కారణం మనదేశంలో కొన్ని రాష్ట్రాలలో కలిగిన ప్రకృతి భీభత్సాలు. బీహార్, బెంగాల్. అస్సామ్. ఉత్తర్ ప్రదేశ్ మున్నగు రాష్ట్రాలలో వరదలు, అతివృష్టి, అనావృష్టి దోషాలవలన అనేక లక్షల ఎకరాలు నిష్ఫలము లయ్యాయి. ఈ రెండు కారణాలు కాకుండా మిడతలదండు, తదితర క్రిమికీటకాదులవలన పూర్వంకన్న ఎక్కువ నష్టం సంప్రాప్తించి, ఆహారోత్పత్తిని తగ్గించింది. ప్రణాళికా రచయితలు ఆహారోత్పత్తివృద్ధికి అంచనాలు వేశారు కాని తత్ప్రకారం నీటిపారుదల, క్రొత్త భూములను వ్యవసాయిక క్షేత్రాలుగా మార్పుచేయడం మొదలైన రంగాలలో ఆ భావనలు కార్యరూపం దాల్చలేదు. పైగా దేశంలో ఆహార ధాన్యాలు నిరవధికంగా దాచిఉంచడంవలన, జనాభా అన్ని అంచనాలు దాటి పెరిగిపోవడం సంభవించడం వలన ఆహారసమస్య తీవ్రతరస్వరూపం ధరించింది. ఈ విషమాహారసమస్య విదేశీమారకపు ద్రవ్య రంగంలో చూపిన ప్రభావం అత్యంత ప్రాముఖ్యం వహించి భారతపారిశ్రామిక పురోగమనానికి, ద్వితీయ పంచవర్ష ప్రణాళిక విజయానికి గొడ్డలిపెట్టైంది.

కేవలం ఆహారధాన్యాల దిగుమతులే ప్రణాళికా రచయితల అంచనాలను మించి విపరీత పరిస్థితి కలిగింపలేదు. ఇతర యంత్రాంగం, పారిశ్రామికోత్పత్తి సాధనాలు కూడ అంచనాలను బాగా మించి, దిగుమతి అయ్యాయి. ఒక పారిశ్రామిక పథకానికి ప్రణాళికా రచయితలు, ఉదాహరణకు రూ 300 కోట్ల విదేశీ మారకపు ద్రవ్యము విలువగల వస్తువులను దిగుమతి చేసికొనవలసివస్తుందని అంచనా వేస్తే, తీరా ఆ పథకం కార్యరూపం ధరించేసరికి తదవసరమైన దిగుమతుల విలువ రూ 400, 500 కోట్లు దాటేది. దీనితో అసలే గడ్డుగా ఉన్న విదేశీ మారకపుద్రవ్యసమస్య మరింత విషమంగా తయారవసాగింది. ఈ తప్పుడు అంచనాలకు మూల కారణం, అంచనాదారులు భావించినదానికన్న ప్రపంచంలో ధరలు అధికం కావడమే.

పై రెండు కారణాలు కాక ఎక్కువ దిగుమతుల ద్వారా విదేశీమారకద్రవ్యపు లోటును అధికం చేసిన మరొక కారణం, ఇటీవలి కాలంలో భారతదేశం పెంచిన దేశరక్షణ వ్యయం. భారత పాకిస్తాన్ దేశాల నడుమ కల సంబంధ బాంధవ్యాలు అనభిలషణీయంగా రూపొందడంవలన, నిరవధికంగా పాకీస్తాన్ అమెరికానుండి ఆయుధ సామగ్రులను దిగుమతి చేసికొనడంవలన, విధిగా భారతదేశం కేవలం స్వయంరక్షణకొరకు విదేశీమారకపు ద్రవ్యాన్ని వెచ్చించి ఆయుధ సామగ్రులు దిగుమతి చేసికొనవలసి వచ్చింది. ఈ వ్యయం ప్రణాళికా రచనలో ఊహింపబడలేకపోవడంవలన విదేశీ మారక ద్రవ్య సమస్యను మరింత విషమం చేసింది.

దిగుమతులపై వ్యయం ఎంత ఎక్కువ అయినప్పటికీ, అదే పరిమాణంలో ఎగుమతులను మనం చేయగలిగి ఉండినట్లైతే ఈ సమస్య ఇంత తీవ్రస్వరూపం పొంది ఉండకపోను. కాని ఈవిధంగా కూడా భారత దేశం లాభం పొందలేకపోయింది. విదేశీ స్పర్ధవలన (Foreign Competetion), అంతర్జాతీయ వాణిజ్య రంగంలో. ముఖ్యంగా అమెరికాలో ఏర్పడిన ఆర్థిక మాంద్యంవలన, క్రమంగా హెచ్చుతూన్న భారతదేశపు ధరలవలన ఎగుమతులు ఎక్కువవడం మాటటుంచి తీవ్రంగా సంకోచం చెందుతున్నాయి. కొద్ది సంవత్సరాల క్రితంవరకు జనపనార పారిశ్రామికోత్పత్తిలో ప్రపంచ వాణిజ్యరంగంలో భారతదేశం సంపూర్ణాధిపత్యం వహించింది అయితే పాకిస్తాన్ విభజనతో జనుము పండే సుక్షేత్రాలన్నీ పాకిస్తాన్ కు, మిల్లులుగల ప్రాంతాలన్నీ భారత దేశానికి లభించాయి. విభజన తరువాత కొది వత్సరాలవరకు పాకిస్తాన్‌లో యాంత్రిక సామగ్రి లేక పోవడంవలన అక్కడ పండిన జనుము భారత దేశానికే దిగుమతి అయింది. కాని క్రమంగా పాకిస్తాన్‌లో కూడా మిల్లులు వెలిసి జనపనార వస్తువులలో ఈ రెండు దేశాల నడుమ స్పర్ధ అనివార్యమైంది. దీనితో ఏ వస్తువు ఎగుమతిపై భారతదేశం, విదేశీ మారకపు ద్రవ్యంకొరకు అత్యాశ పెట్టుకుందో దానిలో నే

అవాంతరం సంభవించి ఎగుమతి వర్తకానికి గొడ్డలి పెట్టైంది. అలాగే ప్రత్తి వస్త్రముల ద్వారా మంచి రాబడి రాగలదని అంచనాదారులు ఆశించారు. కాని దీనిలో కూడా భారతదేశం నష్టాన్నే ఎదుర్కొనవలసి వచ్చింది. విదేశాలతో పోటీచేయవలసి రావడంతో తద్వారా లభించే మారకపు ద్రవ్యం తగ్గిపోయింది. పూర్వపు దేశాలేకాక చైనా నుండికూడా వస్త్రపరిశ్రమలో భారత దేశానికి స్పర్థ సంభవించింది. ఇంతేకాక అమెరికాలో సంభవించిన ఆర్థికమాంద్య ఫలితంగా భారత దేశపు టీ ఎగుమతులకు నష్టం సంభవించింది.

అంచనాలకన్న ఎగుమతులు తగ్గిపోవడానికి మరొక మూలకారణం ప్రపంచ ధరలతో పోల్చిచూస్తే భారతదేశపు ధరలు భారతదేశపు నూతన పారిశ్రామిక చైతన్యంవలన అధికము కావడం. దీనితో విదేశీయులు భారత దేశంలో అధికమైన ధరలకు దిగుమతి చేసుకోవడం మాని ధరలు తక్కువగానున్న ఇతర దేశాలనుండి దిగుమతి చేసుకుంటున్నారు. దీనితో మన ఎగుమతులు పడిపోసాగాయి.

ఈ విధంగా ఎగుమతులు తగ్గిపోవడం దిగుమతులు అంచనాలను మించి అత్యధికం కావడంతో విదేశీ మారక ద్రవ్యం తీవ్రసంకోచం పొంది ఆసమస్య విషమతరం అయింది. ఇంతేకాక అంతర్జాతీయ వాణిజ్యరంగంలో లెక్కకువచ్చే ఇతరములు—వడ్డీలు అప్పులు, బహుమతులు, విద్యార్థి వేతనాలు యాంత్రిక వ్యయాలు—మున్నగు వానియందు కూడా భారత దేశం అనుకున్నంత లాభాన్ని పొందలేక పోతోంది.

ఈ పైకారణాలవలన ప్రణాళికా రచనలోనే ఒక సమస్యగా భావింపబడిన విదేశీమారకద్రవ్యపు లోటు, ప్రణాళిక ఆచరణలోనికి వచ్చేసరికి తీవ్రతర స్వరూపం ధరించి అంతుచిక్కని అభేద్య సమస్యగా రూపొందింది.

అయితే ఈ సమస్యతో పూర్తిగా నిరాశచెంది ద్వితీయ పంచవర్ష ప్రణాళికను త్యజింప నక్కరేదు. సమస్య లంకురించినపుడే పరిష్కార మార్గాలు జనిస్తాయి. కొన్ని సమస్యలకు పరిష్కారమార్గాలు అత్యంత కష్టసాధ్యములైన వైతే కొన్ని సమస్యల పరిష్కార మార్గాలు సులభ సాధ్యములు కావచ్చు. ఈ సమస్య పరిష్కారం మన జాతి దీక్షపైన, మన ఆర్థిక శాస్త్రజ్ఞుల మేధాశక్తిపైన, మన రాజకీయవేత్తల అంతర్జాతీయ విఖ్యాతిపైన ఆధారపడి ఉంటుంది కష్టనష్టాల నెదుర్కొనకుండా చరిత్రలో ఏ దేశం ఆర్థిక పురోగమనాన్ని సాధింపలేదు. ఏదేశమైనా ముప్పై నలభైసంవత్సరాలలోనే ఆర్థికరంగంలో పాశ్చాత్యదేశాలను.తలదన్న కలిగే అభ్యున్నతిని సాధింప కలిగినదంటే, అది ఆ ప్రజల మాతృదేశభక్తిపైనా ఆ దేశపు ఆర్థిక విధానాలపైనా ఆధారపడడం వల్లనే. జపాన్ పూవుల బాట ద్వారా ఆర్థికాభ్యున్నతి సాధింపలేదు. ఏ దేశానికైనా ఆర్థిక పురోగమనపథం దుర్గమమైనదే కాని తత్సాధన ఆ దేశపు దీక్షపైనే ఆధారపడి ఉంటుంది.

ఈ కఠినసమస్యకు మూడు ప్రధాన పరిష్కార మార్గాలున్నాయి. మొదటిది : ఎగుమతుల పరిమాణాన్ని అధికం చేయడం, రెండవది : దిగుమతుల పరిమాణాన్ని సాధ్యమైనంతవరకు తగ్గించడం. విదేశీ సహాయాన్ని పొందడం మూడవ పరిష్కార మార్గం. ఈ త్రిమార్గాలందు కూడా భారత ప్రభుత్వం నిరవధికంగా కృషి చేస్తోంది.

ఎగుమతుల నధికం చేయడానికి ఉపాయాన్ని సూచిస్తూ కేంద్రమంత్రి శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి వస్తువులను విదేశీయులకు తక్కువ ధరలకు, మన దేశపు గిరాకీదారులకు హెచ్చు ధరకు విక్రయించాలని చెప్పారు. తక్కువ ధరలు ప్రదర్శించటం ద్వారా విదేశీయుల గిరాకీని ఆకర్షింప వచ్చును. తక్కువ ధరల మూలంగా సంభవింప కలిగే నష్టాన్ని మన దేశస్థుల కెక్కువ ధరల కా వస్తువులను విక్రయించడం ద్వారా సరిపెట్టుకొనవచ్చు. నిజానికి పూర్వం జపాన్ దేశం ఇండియా వాణిజ్యరంగంలో బ్రిటన్‌ను జయించి, ఆధిపత్యం సంపాదించడానికి ఇదే విధానాన్ని వలంబించింది. దీన్నే ఆంగ్లంలో డంపింగ్ (dumping) అని వ్యవహరిస్తారు. ఈ విధానాన్నవలంబించడం ద్వారా ఎగుమతులను పెంచవచ్చును కాని ధరల తగింపు వలన విదేశీయుల అభిరుచులని మార్చలేం. తరువాత స్పర్థ (Competetion) తీవ్రమైనదైతే విదేశీయులు కూడా ఈ విధానాన్నే అవలంబించి అనభిలషణీయమైన పరిస్థితులకు దారి తీయవచ్చును. కాబట్టి ఈ విధమైన పద్ధతిని అవలంబించే ముందు తగు జాగ్రత్తలు తీసుకోవాలి.

# విదేశద్రవ్యమారకరంగంలో విషమస్థితి

ప్రభుత్వం వివిధ వస్తువుల ఎగుమతుల నధికం చేయడానికి ఆయా వస్తువులకు ఎగుమతి సంఘాలను నియమించింది. ఇటువంటి సంఘాలలో (Export promotion councils) అతి నూతనమైనది ఆట వస్తువుల ఎగుమతి వృద్ధికి కృషి చేసే సంఘం (Sports goods export promotion council). దీనిని యూనియన్ మంత్రి శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి జూలై ఆరవ తేదిన ప్రారంభించారు. ఈ సంఘ సభ్యులు ఆయా వస్తువులకు విదేశాలలో గిరాకీ కల్పించడానికి కృషి చేస్తూ చాలవరకు కృతకృత్యులవుతున్నారు.

ఎగుమతులను ప్రోత్సహించడానికి భారత ప్రభుత్వం అనేక వస్తువులపై కంట్రోళ్ళను తొలగించింది. ద్వితీయ పంచవర్ష ప్రణాళికా విజయంకొరకు ఈ విధంగా సుమారు 200 ఎగుమతి వస్తువులపై ఆంక్షలు తొలగించబడినాయి. అంతేకాక అవసరమైనచోట పన్నులను తగ్గించడం ఎగుమతి సుంకాలను తీసివేయడం, సబ్సిడీ నొసగి ప్రోత్సహించడం మున్నగు అనేక పనులను భారత ప్రభుత్వం చేస్తోంది ఇటువంటి ప్రోత్సాహం క్రొత్తగా పైకి వస్తూన్న ఎగుమతి దారులచే ముందంజ వేయించి విదేశీ స్పర్ధవలన వెనుకంజ వేసూన్న ఎగుమతి దార్లకు ధైర్యం కలిగిస్తుందనడం నిస్సంశయాంశం.

ఎగుమతులను అనేకవిధాలుగా ప్రోత్సహించడం వలన మారక ద్రవ్యసంపాదనేగాక ఉత్పాదనశక్తి కూడా పెరగగలదు. అధికమైన ఎగుమతులవల్ల ప్రణాళికా విజయం చేకూరుతుంది. ఎగుమతులు ఇటీవలి కాలంలో వలెనే దిగజారిపోతే పరిస్థితి మరింత విషమిస్తుంది.

ఇక రెండవ పరిష్కారమార్గం దిగుమతులను సాధ్యమైనంతవరకు తగ్గించడం. దిగుమతుల పరిమాణాన్ని తగించేముందు ప్రథమంగా భారతదేశం చేసుకొంటూన్న దిగుమతులను విలాస వస్తువులు, అవసర వస్తువులుగా విభజన చేసి సామాన్య ప్రజా సౌఖ్యానికి అడ్డు తగలని విలాస వస్తువుల దిగుమతి నిషేధించడం కాని తగ్గించడం కాని చేయాలి. భారత ప్రభుత్వం తదనుగుణంగా అనేక వస్తువులపై ఆంక్షలు విధించి దిగుమతులను తగ్గించింది. కాని పై విభజన అంతగా పాటింపబడలేదనే చెప్పాలి. అత్యవసర వస్తువులైన మందులు, రసాయనికపు ఔషధాలు, బ్లేడ్లు, పిల్లల ఆరోగ్యాన్ని కాపాడే హార్లిక్సు, ఓవల్టైన్, పిండిపాలు మున్నవాటిపై ఆంక్షలు విధించడం దేశానికంత క్షేమకరం కాదు. వీటికి సరియైన దేశీయ వస్తువులు ఇంకా ఉత్పత్తి అవడంలేదు. పిల్లలకవసరమైన పాలడబ్బాలను విలాస వస్తువులుగా గ్రహించి నిషేధించిన ప్రభుత్వ విధానం అంత ప్రశంసనీయమైనది కాదు. కొన్ని విలాస వస్తువులను సంపూర్ణంగా నిషేధించడంవలన దేశంలో ఏ కొద్ది మందికో తక్క మిగిలిన వారికి అంత ఇబ్బంది కలుగదు. ఉదాహరణానికి టాయిలెట్ సామాన్లు, కార్లు, సెంట్లు, ఖరీదైన రేడియోలు మొదలయిన వాటిని ప్రభుత్వం సంపూర్ణంగా నిషేధించాలి. విదేశీ రేడియోలను, అతిఖరీదైన విదేశీ వస్త్రాలను సంపూర్ణంగా నిషేధించడంవలన సామాన్య ప్రజ అంతే వంత చెందదు.

కాని దిగుమతి నిషేధవిధానాన్ని అనేకులు అనేక విధాలుగా విమర్శించారు. అవన్నీ పూర్తిగా సత్యదూరాలు కావు. ఆచార్య బి. ఆర్. షినాయ్ మున్నగువారు, ఈ నిషేధంవలన వ్యక్తి స్వాతంత్ర్యం దెబ్బతింటుందని, భారతదేశం వంటి ప్రజాస్వామిక దేశంలో ప్రభుత్వం ఇట్టి పనులు చేయడం ప్రజాభిప్రాయవిరుద్ధమని వాదించారు. ఈ వాదం సత్యమే అయినప్పటికి, దేశ సంక్షేమం కోసం ఇట్టి నిషేధాలను తాత్కాలికంగా విధించినా అంత అనభిలషణీయమైన పరిస్థితులేర్పడవు. అయితే ఈ నిషేధం కేవలం తాత్కాలికమయేటట్లు మాత్రం తగు జాగ్రత్త వహించాలి. రెండవ విమర్శ ఏమంటే విదేశీవస్తునిషేధం వలన దేశీయ వాణిజ్య రంగంలో దేశీయోత్పత్తిదారులకు ఆధిపత్యం కలిగి ప్రశస్తమైన వస్తువుల ఉత్పత్తి లేకపోవచ్చును. స్పర్ధ లేకపోడవంతో చౌకబారు వస్తువులే అతి ఖరీదైన ధరలకు అంగడిలో ప్రత్యక్షమవడం మనం నేడు చూస్తున్నాం. కాని ఈ దోషం కూడా, నిషేధం తాత్కాలిక మవడంవలన, తాత్కాలికమే అవుతుంది. మనం విదేశీ దిగుమతులను నిషేధించడం వలన, మన ఎగుమతులను విదేశీయులు బహిష్కరింపవచ్చును. కాని ఈవిమర్శ సహేతుకమైనది కాదు. ఈనిషేధం కేవలం భారతదేశ ఆర్థిక పురోగమనమునకే అవటంవలన ఇతర దేశాలు మన ఎగుమతులను బహిష్కరింపవు.

దిగుమతి నిషేధంవలన గత ఒకటిన్నర వత్సరాలలోను, భారతదేశం చెప్పుకోదగినంత విదేశీ మారకపు

ద్రవ్యాన్ని కూడబెట్టుకొనగలిగింది. కాని విచక్షణా శక్తి ఇంకా ప్రసరిస్తే ఈ విధానం వలన సామాన్య ప్రజలకే ఇబ్బంది కలగకుండానే ప్రభుత్వం మరింత విదేశ మారకపు ద్రవ్యాన్ని కూడబెట్టగలదు.

## విదేశీయ సహాయం

ఇక మూడవది విదేశీయ సహాయం.

విదేశీయ సహాయం ఒక సంపూర్ణ స్వాతంత్ర్య దేశం కోరవచ్చునా అన్న ప్రశ్న ఉదయింపగా, రాజకీయ సంబంధం లేకుండా, అంతర్జాతీయ రాజకీయ రంగంలో దేశపు కీర్తిప్రతిష్ఠలకు విఘ్నంగాను భంగం వాటిల్లకుండా ఉండేరీతిని, విదేశసహాయం అభిలషణీయమైనదే అని చెప్పబడింది. నిజానికి నేడత్యున్నత దశలో ఉన్న అనేక దేశాలు పూర్వం ఎప్పుడో ఒకప్పుడు విదేశసహాయం పొందినవే! ఫ్రాన్సునుండి జర్మనీకి, ఇంగ్లండునుండి అమెరికాకు ధనం ఋణరూపంలో ప్రవహించిన కాలం ఉంది. ఋణాన్నర్థించినంత మాత్రాన ఒక దేశం యాచకులదేశ మవదు.

ఈ రంగంలో ఆశావాదానికి అమిత ప్రోత్సాహం కనబడుతోంది. భారతదేశానికి క్లిష్టపరిస్థితిలో సహాకారమిచ్చే దేశాలు—అమెరికా, ఇంగ్లండు, ఆస్ట్రేలియా, పశ్చిమజర్మనీ, సోవియెట్ రష్యా, జపాన్—మున్నగునవి ఎన్నో ఉన్నాయి. వీనిలో ముఖ్యమైనవి అమెరికా బ్రిటన్లు. అమెరికా ఇంగ్లండు దేశాలు భారతదేశానికి కేవలం భ్రాతృభావంతో కాక ఒకవిధమైన భయంతో ఇస్తున్నాయి.

1958 జూలై 28 వ తేదీన బ్రిటిషు పార్లమెంటులో శ్రీ జేమ్స్ కాలింఘన్ ఈ ఉద్దేశాన్నే చక్కగా విశదీకరించారు. "ఆగ్నేయాసియాలో నేడు చైనా ప్రభావానికి లోనుగాని కమ్యూనిస్టు విభిన్నపక్షానికి భారతదేశం ప్రాతినిధ్యం వహిస్తుంది. మనం హిందూ దేశానికి సంపూర్ణంగా ఆర్థిక సహాయ సహకారముల నొసగకపోతే, శ్రీ నెహ్రూ కాలంలో కాకపోయినా, ఆయన అనంతరమైనా, భారతదేశమంతా సామ్యవాద సిద్ధాంత ప్రభావానికి లోనైతీరుతుంది" ఆసియాలో భారతదేశం సామ్యవాదమతం స్వీకరించినట్లయితే అది అమెరికా బ్రిటన్లకు గొడ్డలిపెట్టవుతుంది. కాబట్టి మన మీద అమెరికా బ్రిటన్లకు ప్రేమాదరాలు లేకపోయినా, భయంకొద్దీ అయినా మన పంచవర్ష ప్రణాళికా విజయానికి చేయూతనొసగక తప్పదు.

ద్వితీయ పంచవర్ష ప్రణాళికారంభంనుండి అనేక విదేశాలు, ముఖ్యంగా అమెరికా బ్రిటన్లు, అనేక విదేశ సంస్థలు మనకు సాహాయ్యం చేస్తూనే ఉన్నాయి. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక మొదటి అర్థసంవత్సరంలో యీ క్రిందివిధంగా సహాయం లభించింది. భారతదేశానికి, అమెరికా సహాయ కార్యక్రమం క్రింద రూ 809 లక్షలు, ఉచితంగానూ, రూ 2263 లక్షలు ఋణరూపకంగాను భారతదేశం సహాయ్యం పొందింది. పబ్లిక్ లా 480 (Public law 480) క్రింద రూ 2,571 లక్షలు ఉచితంగాను, రూ 11,143 లక్షలు ఋణరూపకంగాను అమెరికానుండి మనదేశానికి లభించాయి. అదేకాలంలో ఆస్ట్రేలియానుండి రూ 4 లక్షలు, కెనడానుండి రూ 8.57 లక్షలు, న్యూజిలాండునుండి రూ 101 లక్షలు; నార్వేనుండి రూ 100 లక్షలు భారతదేశానికి ఉచితంగా లభించాయి. బ్రిటన్ రు 20 కోట్లను ఋణంగా ఇచ్చింది రష్యా రూ 75 లక్షలను ఉచితంగాను, రూ 12,300,00,000 ను ఋణంగా ఇచ్చింది. ఫోర్డు ఫౌండేషన్ ఉచితంగా రు 14,00000 ఒసగింది. ప్రపంచ బ్యాంకు రూ 4557 లక్షలను, బ్రిటిషు బ్యాంకులు రూ 15,00,000,00 లను, అమెరికా పరపతి బ్యాంకు రూ 5,33,000,00 లను ఋణరూపకంగా భారతదేశాని కొసగాయి. ఇవికాక కొలంబో ప్రణాళిక (Colombo plan) వలన, ఐక్యరాజ్యసమితి సహాయం వలన భారతదేశం అమిత సాంకేతిక సహాయాన్ని పొందింది.

1958 జూలై 12-వ తేదీన అమెరికా సంయుక్త రాష్ట్రం ఎగుమతి దిగుమతుల బ్యాంకు (United states Exports Imports Bank) ఒక సంవత్సరానికి సరిపోయేటట్లుగా భారతదేశానికి 150 మిలియన్ల డాలర్లు ఋణరూపకంగా ఒసగింది. ఈ ద్రవ్యాన్ని భారతదేశం నీటిపారుదల, పునఃస్వాధీన పథకాలకు, శక్తి పథకాలకు, గనులకు, రవాణా సౌకర్యాలకు, పరిశ్రమలకు వినియోగింపదలచింది. ఈ ఋణాన్ని భారతదేశం $5\frac{1}{4}\%$ వడ్డీతో పదిహేను సంవత్సరాలలో తీర్చాలి. ఇదికాక ఇదేబ్యాంకు అభివృద్ధి ఋణ కార్యక్రమం క్రింద 75 మిలియన్ల డాలర్లనొసగింది.

# విదేశద్రవ్యమారకరంగంలో విషమస్థితి

పబ్లిక్ లా - 480 (Public law 480) క్రింద అమెరికా ప్రభుత్వం పూర్వ సహాయం కాక అదనంగా 7 లక్షల టన్నుల ఆహారధాన్యాల నొసగేందుకు సమ్మతించింది. దీనిలో 5 లక్షల టన్నుల గోధుమ, 2 లక్షలు ఇతరధాన్యాలు. ఇవి కాక ఇటీవల ప్రపంచ బ్యాంకు 85 మిలియన్ల డాలర్లు భారతదేశం రైలుమార్గాల అభివృద్ధికి ఒసగింది. యూనియన్ ఆర్థిక శాఖామంత్రి శ్రీ మొరార్జీ దేశాయ్ అమెరికాయాత్ర చాలవరకు ఫలోన్ముఖమైనదనే చెప్పాలి. అమెరికా వారు మనమీద గౌరవం చేత్తైనా, మనం కమ్యూనిస్టుల మాత్రమునే భయంకొద్దీ అయినా, మనకు సహాయం చేయడానికి ముందంజవేస్తున్నారు. పబ్లిక్ లా.480 క్రింద 200 మిలియన్ డాలర్ల సహాయం, అభివృద్ధి ఋణ కార్యక్రమం క్రింద వందమిలియన్ డాలర్ల సహాయం చెయ్యడమే కాక, మనం 1951 లో పుచ్చుకున్న గోధుమ ఋణాన్ని (Wheat loan) తొమ్మిది సంవత్సరాల పాటు వాయిదా వేశారు. భారతదేశానికి సహాయం చేయడంలో ప్రపంచ బ్యాంకు చూపుతున్న ఉత్సాహం ప్రశంసనీయమైనది. ఇది భారతదేశం రైల్వే అభివృద్ధికి 85 మిలియన్ డాలర్లను ఋణరూపకంగా ఈయడమే కాక వాషింగ్‌టన్‌లో అమెరికా, ఇంగ్లండు, పశ్చిమ జర్మనీ, కెనడా, జపాన్ దేశాల ప్రతినిధులను సమావేశపరచి భారతీయులకు చేయూత నొసగవలసిన అవసరాన్ని ప్రబోధిస్తోంది. గత మే, జూన్ మాసాలలో మనదేశపు ఆర్థికవ్యవస్థను పరిశీలించడానికి పర్యటించిన ప్రపంచ బ్యాంకు సభ్యులు తయారుచేసిన నివేదికలో భారతదేశపు ఆర్థిక పటిష్ఠతను ప్రశంసించి, ఈ దేశంలో విదేశీయులు పెట్టుబడి పెట్టడానికి ఏమీ సంకోచపడనక్కరలేదని అభిప్రాయమిచ్చారు.

ఈవిధంగా నేడు అంతర్జాతీయ ఆర్థికరంగంలో భారతదేశపు పరపతి పడిపోలేదు. విదేశీ సాహాయ్యం, దిగుమతుల తగ్గింపు, ఎగుమతుల హెచ్చింపు విషయాలలో భారతదేశం క్రమంగా విజయాన్ని పొందుతోంది. మనపట్లనున్న విదేశాలు ముఖ్యంగా అమెరికా బ్రిటన్లు భారతీయులకు సహాయం చేయడానికి ఉత్సుకతను చూపడం హర్షదాయకం. కాబట్టి ఈ పంచవర్ష ప్రణాళికయందు విదేశీయమారకపు ద్రవ్య సమస్యను భారతదేశం పరిష్కరించగలదనే ఆశించవచ్చును.

# మొగలిపువ్వు

శ్రీ ఆర్. యస్. సుదర్శనం

శ్రీనివాసరావు క్యాంపునుండి తిరిగివచ్చి ఆయాసంగా కుర్చీలో కూర్చున్నాడు. తనతో తిరిగివచ్చిన హోల్డాలు, చేతిసంచీ, గొడుగు ఎదురుగా కనిపిస్తున్నాయి. కుప్పగా ఒకదానిమీదొకటి గిరవాటుపెట్టి వెళ్ళిపోయాడు కూలివాడు. చేసయిస్తే తక్కువని నసిగాడు వాడు. ఎక్కువివ్వటానికి అభ్యంతరం లేదు, కాని తనదగ్గర అంతకుమించి......"చిల్లర లేకపోయింది!"

"ఏవండీ, చడీచప్పుడూ లేకుండా వచ్చి కూర్చున్నారే! ఇందాకటినించీ మీకోసమే చూస్తున్నా......ఇవ్వాళ బస్సు లేటయిందేమిటి?" అంటూ శ్రీమతి ప్రవేశించింది... "ఇదుగో, ఇంట్లో బియ్యం నిండుకున్నాయి; ఆదివారం కాబట్టి పర్వాలేదు ఆలస్యమైనా...మీరు కాస్త బజారు వెళ్లొస్తే అంతలో స్నానానికి వేన్నీళ్ళుకూడా రెడీ అవుతాయి."

"డబ్బూ, సంచీ తీసుకురా" అన్నాడు శ్రీనివాసరావు.

"డబ్బు! అదేదో మీదగ్గరేవుండాలి!...అదుగో సంచీ, మీరు క్యాంపుకు తీసుకెళ్లినదాన్నే ఖాళీచేసి పట్టుకెళ్లండి... ఆ రెండోదికాస్తా ఎలకలు కొరికేశాయి."

"నాదగ్గర డబ్బులేదే...ఎట్లాగమరి?

"ఎట్లాగ! అని కూచుంటే ఎలాగండీ? విచిత్రంగావుంది...క్యాంపునుంచి వస్తున్నారుగదా తెస్తారనుకొన్నాను."

ఎదురుగావున్న హోల్డాలు, సంచీ, గొడుగూ వైపు నిశ్చలంగా దృష్టినిలిపి శ్రీనివాసరావు చిన్నగనవ్వాడు......

"మంచిదానివే! ...ప్రక్కవాటాలో వాళ్లని బదులడుగు."

"వాళ్లకిప్పటికే రెండుసార్లు బాకీ యివ్వాలి మనం......ఇహ డబ్బా? డబ్బు ఆవిడదగ్గరెక్కడుంటుంది, పాపం!...మీరే వెళ్ళి ప్రయత్నించండి."

శ్రీనివాసరావు కదల్లేదు; దుమ్మునిండిన సామాను వైపు పరిశీలనగా చూస్తూ, పరధ్యానంగా కూర్చున్నాడు.

కొన్ని క్షణాలు నిదానించిన శ్రీమతి—"ఎవరైనా స్నేహితుల్నడగండీ!...అలా కూచుంటారేమిటే? ఏమీపట్టనట్టూ! పెద్ద వేదాంతిలా......పలక్కుండా, జవాబు లేకుండా కూర్చోటం అలవాటు చేస్తున్నారేమిటీమధ్య! నన్నేదో సాధిస్తున్నట్లు! వేగిరంకదలండిమరి... లేకపోతే యీపూట పస్తే!" అన్నది.

శ్రీనివాసరావు లేచి నుంచున్నాడు. "...అది కాదు......రాధా, ఒక్కపూట అన్నంలేకపోతే ప్రపంచం తలక్రిందవుతుందటావా?"

"ఏంమాటలండీ! బాగుంది...పెళ్లాం పిల్లలు పస్తుంటారంటే మీకేం చీమకుట్టినట్లుకూడా లేదన్నమాట!...అయినా వెళ్లి జరిగేపనేమిటో చూడకుండా ప్రపంచాన్ని గురించి వైరాగ్యాలుమాట్లాడుతూ కూచుంటారేమిటంట?"

"నువ్వు అరవబోక...ఇదుగో, ...ఏంలేదులే! ...వెళ్తున్నా! అంటే, నేననేది మరేమీ విపరీతం కాదు! ఈ పూట అన్నం మానేసి రాత్రికి వండుకుంటే యింతలో జరిగే ప్రమాదం ఏమిటి, అని అనుమానం!"

"ఏం ప్రశ్నలండీ!... అసలు పస్తుండాల్సిన కర్మమేంకాలిందీ? అంత దరిద్రం మనకేమొచ్చింది?... ఇబ్బందులు ఎవరికైనా వస్తాయి...కానీ, ఎల్లాంటి యిబ్బందులు వచ్చినా పస్తుపడుకునేంత దరిద్రం మనకెన్నడూ రాదు ... ఎల్లాంటివాళ్లు పస్తుపడుకునేది! ఊరికే కబుర్లు చెప్పక వెళ్లిరండి...పుణ్యముంటుంది."

# మొగలి పువ్వు

శ్రీనివాసరావు బయలుదేరాడు గొడుగు, సంచీ పుచ్చుకొని...రాఘవతో వాదించి ప్రయోజనం లేదు... అసలు ఎవరుమాత్రం యీ విషయంలో తనతో ఏకీభవిస్తారు? ... నిజంగానే, ఒక్కపూట పస్తుంటే ఏం పుట్టిమునుగుతుందో! బాగా ఆకలివేసి రెండో పూట అన్నం రుచిస్తుంది, అంతేగా!...కానీ, ఒక్కపూట పస్తుండిపోతే...ఏదో అవమానం, ఎంతో మేరసాంఘికంగా దిగజారినట్లు... "అయ్యో! తినటానికి లేక పస్తున్నాం!!" ఆ మాటలో ఏదో పెద్ద దిగులు! "పిల్లలు కడుపులు వెన్నంటుకుపోయి అలమటిస్తుంటే కళ్ళతో చూశాం...తల్లీ దండ్రీ యిద్దరయూ బ్రతికి వుండీను!" అని విసుపు, తిట్టుకోటం, ఏదో మహాఘోరం జరిగిపోయినట్లే బాధపడడం...ఇక తర్వాత, తర్వాత—"ఫలానారోజు, బియ్యంలేక, అవి తెచ్చుకోటానికి చిల్లిగవ్వ లేక, పస్తుపడివున్నాం"...అంటూ జీవితచరిత్రలో ప్రధానఘట్టం కింద చిత్రించుకోవటం ... ఈ గోలంతా ఒక్కపూట తిండిని గురించే!! కో-ఆపరేటివ్ జూనియర్ ఇన్‌స్పెక్టరు చేస్తున్న మానవుడి జీవితంలో యిలాంటివే మైలురాళ్ళు!

శ్రీనివాసరావు హెడ్‌క్లార్కు రామనాథం గారి దగ్గరకువెళ్దాం అనుకుంటూండగానే పిలిచాడు కృష్ణమూర్తి — 'ఏం, శ్రీనివాసులూ! మొగల్లపాలెం నించి ఎప్పుడొచ్చావ్ ... ఈ బస్సుకేనా? ... మొగలి రేకులు తెచ్చావా? ... మా పెద్దమ్మాయి సరదా పడుతూందోయ్! ... 'ఇవ్వాళ మా మున్సిపల్ క్యాంపునుంచి వస్తాడు, తెస్తాడు లేవే' అన్నాను." ...కూరల సంచి సైకిలుకు తగిలించుకొని, మొహంమీద జలపాతంలా ప్రవహిస్తూన్న చెమట తుడుచుకొంటూ, మూడణాల మొగలిపూల కోసం లేని బాంధవ్యాన్ని నొక్కిచెప్పుతూ, నవ్వుతూ, ఆశగా నిల్చున్నాడు కృష్ణమూర్తి.

"నాదగ్గర డబ్బులేదు, తీసుకురాలేదోయ్! ... ముందే చెప్పరాదూ!"

కృష్ణమూర్తి ముందే చెప్పడు; చెప్పితే డబ్బు ఇచ్చుకోవాల్సి వస్తుందేమోనని!

"కరణానికి చెప్పలేకపోయావ్? బండ్రోతు గాళ్లని పురమాయించేవాడు...

"వాటివిషయం అనుకోలేదు. .ఇంటరెస్ట్ లేదు... సరే, బ్రదర్! ఒక అయిదు రూపాయలు కావాలి అర్జంటుగా...బియ్యం తీసుకెళ్ళాలి యింటికి..."

కృష్ణమూర్తి ముఖంలో నవ్వు మాయమైంది... "సారీ బ్రదర్! ఇవ్వాళ ఇరవైమూడో తారీఖు అని మరిచిపోయావు కాబోలు! మనం అంతా ఒక బోటులోనే ప్రయాణం!" అంటూ సైకిలెక్కి రివ్వున మాయమయ్యాడు...

శ్రీనివాసరావు రామనాథంగారి యిలు చేరుకునేటప్పటికి ఆయన భోజనానికి కూర్చున్నాడని తెలిసింది. వరండాలో నిల్చున్నాడు శ్రీనివాసరావు...చెమట పోస్తూ చాలచికాగ్గా వుంది...బస్సులో రద్దీ...ఇద్దరు లావుపాటి మనుష్యులమధ్య బస్సు కుదుపులకు బాగా నలిగిపోయాడు....తలనిండా, ఒంటినిండా దుమ్ము... చెమటతో కలిసినదుమ్ముస్పర్శ తుడుచుకోటానికి ప్రయత్నించినప్పుడల్లా, అసహ్యంగా వుంటోంది. బస్సు దిగి వెళ్లిగానే స్నానంచేసి, మంచంమీద వాలుదామనుకొన్నాడు ప్రయాణంలో వున్నంతసేపూ...కాని ఆ యోగం పట్టలేదు...మెలగా నడినెత్తి కెక్కుతున్న సూర్యుడు రామనాథంగారి వరండాలో విజృంభిస్తూ, దేహాన్ని, బట్టల్ని చివరికి ఊనికినే దుర్భరం చేస్తున్నాడు.

అసహ్యంనించే కొన్నేపటిలో నిర్లిప్తత పుట్టుకురావటం గమనించాడు శ్రీనివాసరావు. అప్రయత్నంగా ఎండిపోయిన పెదవులు నాలుకతో తడుపుకొంటూ...ఎదురుగుండావున్న యింటి కిటికీవైపు చూశాడు...కిటికీ తలుపు ఓరచేసుకుని రెండుకళ్లు తనవైపు కేంద్రీకృతమై ఉండటం తెలిసింది—ముఖంమీది చెమట తుడుచుకొని, జుత్తు కొస్త సవరించుకొని, ఠీవిగా నిల్చుందామనిపించి, చెయ్యి జేబురుమాలు కోసం పంట్లాం జేబులోకి వెళ్లింది అటాలున...కాని మళ్ళీ అక్కడే జేబులోనే ఆగిపోయింది...నిర్లిప్తంగా శ్రీనివాసరావు తన దృష్టి రోడ్డువైపు మళ్ళించాడు... కుక్కలు రెండు పరస్పరం మూచూచుకుంటూ వలయాకారంగా తిరుగుతున్నాయి!

శ్రీనివాసరావుకు పెద్ద విసుగు పుట్టుకొచ్చి అక్కడినుంచి వెళ్ళిపోదామనుకున్నాడు...ఏం, వట్టి చేతుల్తో యింటికి వెళ్తే యేం? రాధ మొత్తుకోవటం, పిల్లల గోల...అంతకన్న ప్రమాదం ఏమీ జరగబోదు కద! వరండా మెట్టొకటి దిగబోయాడు వెళిపోవాలని శ్రీనివాసరావు. కాని, రామనాథంగారు తలుపు తెరిచి లోపలికి రమ్మని పిలిచారు...సరే, తప్పదు!

"ఏమిటోయ్, ఈమధ్య కనిపించనే లేదు!... మీ నాన్నగారు కులాసాయేనా?...ఇప్పుడాయన మీ అన్నయ్యదగ్గర కదూ ఉంటోంది? నెల్లూరా?"

శ్రీనివాసరావు చెవులు మూసుకోలేదు గాని, వినటం మాత్రం మానివేశాడు..."...పాపం కదూ!" అని ఆగారు రామనాథంగారు.

"అవును" అని అంగీకరించాడు ఏమిటో తెలియకుండానే.

"నలుగురు పిల్లలోయ్...అకస్మాత్తుగా ఆమె పోయిందా, యిహ ఆ సంసారం గతేం కావాలి, ఆలోచించు! ఏమిటో యీ కష్టాలు!"

"అవును...పాపం" అన్నాడు ఆయన్ని ప్రతిధ్వనిస్తూ

"ఈవార్త విన్నప్పట్నుంచీ మా యింటిల్లిపాదీ విచారంలో మునిగి పోయామనుకో!"...ప్రేవు మని త్రేన్చారు రామనాథంగారు. త్రేనుపు ఆపుకోవటం సాధ్యం కాదు......దానికి ఎందగ్ని శుద్ధి తెలీదు... రామనాథంగారు అన్నవాహికను సరిచేసుకుంటూ ఆగిన అవకాశం పోగొట్టుకూడదని శ్రీనివాసరావు సొంతవిషయానికి వచ్చేశాడు వెంటనే...

"ఏమండీ......నాకో పది రూపాయలు అర్జంటుగా కావాల్సి వొచ్చాను...గంట క్రితం క్యాంపునుంచి వచ్చాను, యింట్లో బియ్యం నిండుకున్నాయి, చేతిలో కానీ లేదు!"

"ఆఁ...పది రూపాయలు నెలాఖరులో నాదగ్గర మాత్రం ఎక్కడుంటాయోయ్! ... మా ఆఁవిణ్ణి అడుగుతానుండు...

లోపలికివెళ్ళి అయిదురూపాయలు తెచ్చి యిచ్చారు.

"చాలా థాంక్స్ సార్......జీతం రాగానే యిస్తాను...సెలవు."

* * *

స్నానంచేసి, భోజనం చెయ్యగానే కునుకు పట్టింది శ్రీనివాసరావుకు...'క్యారు'మని ఉయ్యాలలో చంటిది ఏడవటంతో మెలకువ వచ్చింది..."అబ్బ, పాడు గోల!...రాధా రాధా"...కేక వెయ్యాలన్న మామూలు ఉద్రేకం......వచ్చికూడా, అంచుదాటని పాలపొంగులా చల్లారిపోయింది......కేకలు వెయ్యకుండా అలానే చూస్తున్నాడు...రాధ వచ్చి పిల్లను తీసుకు వెళ్ళింది...రెండో వాడు—ఏణ్ణర్థం వయసు—మూత్రంపోసి ఆ మడుగు రెండు చేతుల్తో తట్టుతూ ఆనందిస్తున్నాడు...శ్రీనివాసరావు గోడవైపు తిరిగి పడుకున్నాడు...గోడ మీద డాగులు...అందులో రెండు చారలు—నల్లి రక్తం తాలూకు..." అదుగో నల్లి! పోతోంది. వెళ్ళిపోతోంది...చంపాలి!...ఎడమ చేతి బొటన వ్రేలితో ... ఊఁ లోపలి ప్రేరేపణకు చెయ్యి మాత్రం కదల్లేదు...శ్రీనివాసరావు చూస్తూ ఉండిపొయ్యాడు..."నల్లి వెళ్ళిపోయింది! ఇహ కనపడదు!"...పోనీ...ఏం మునిగిపోయినట్టు?

"ఏఁవండీ...కాఫీ......లేచి మొహం కడుక్కోండి!"...

కాఫీ త్రాగి మళ్ళీ మంచంమీద కూర్చుంటే రాధ చంటిదాన్ని తెచ్చి ఒళ్ళో పెట్టింది..."ఇవాళ్టికి యింట్లోనే వుంటారు కదూ!"

"లేదు...అలా వెళ్ళి రావాలి"

రాధ అన్నందుకే బయలుదేరాడు...ఎక్కడికి? ...యాంత్రికంగా కాళ్ళీడ్చుకుంటూ చెరువుకేసి నడుస్తున్నాడు......రైలు గేటు దగ్గరకు వచ్చేప్పటికి రైలువచ్చేసింది...గేటు మూశారు...నిలుచున్నాడు. రైలుపెట్టెల్లోంచి వింతగా మనుష్యులు తనవైపే చూస్తున్నారు! వేగంగా పెట్టెలు ఒకదాని తర్వాత ఒకటి మనుషుల్తో వెళ్ళిపోతున్నాయి, టకా—టక్ టకా—టక్ శబ్దం చేసుకుంటూ...

గేటు తెరిచారు. టకా—టక్, టకా—టక్ చెవులో మోగుతూనే వుంది...తలుపులు మూసుకుని కిటికీ సందుల్లోంచి తొంగి చూస్తూ కూచుంటారు... ఎలుకల్లా...బొరియలో పందికొక్కులా...టకా—టక్, టకా—టక్ వెళ్ళే రైలుపెట్టెలో...పాడు మనుషులు!...ఆ రైలు కోసం తనెందుకు ఆగాడు? ఆగకపోతే...తన దేహం రైలు క్రింద పడుతుంది... అప్పుడు తప్పకుండా రైలు ఆగిపోతుంది!...బోనుల్లోని ఎలుకలు, బొరియలోని పందికొక్కులూ, బిలబిలా వచ్చి గుంపుగా చేరి, గలగలా శబ్దం చేస్తాయి...

శ్రీనివాసరావు చెరువుగట్టుమీదకూర్చుని నీళ్ళ వైపు చూశాడు...తనకు నీటి ప్రమాదం లేకుండా చెయ్యాలని చిన్నప్పుడు తండ్రి పట్టుపట్టి ఈత నేర్పించాడు...ఎంత జాగ్రత్త!...ప్రాణాలు ఎక్కడ

తప్పించుకొని పారిపోతాయోనని భయం... ప్రతిదీ యిలాగే...తండ్రి చెప్పినవన్నీ తు, చ, తప్పకుండా ఆచరించాడు...ఇంకా ఆచరిస్తున్నాడు.... ఫలానా వాళ్లతో స్నేహం వద్దంటే మానుకున్నాడు, ఫలానా పుస్తకాలు మంచివి, చదవమంటే చదివాడు; తప్పకుండా పరీక్షలు పాసవమంటే, అయ్యాడు; బి. ఏ.లో క్లాసురావాలంటే, క్లాసు తెచ్చుకున్నాడు. ఫలానా అమ్మాయిని చేసుకో చాలమంచి సంబంధం. అంటే చేసుకున్నాడు, పిల్లల్ని కన్నాడు...తండ్రీ, పెద్దలూ, మిగతావాళ్ళూ, అందరూ ఏది మంచిది అంటారో అంతా అలానే చేశాడు...యీ కో_ఆపరేటివ్ ఇన్స్పెక్టరు గిరీ—సర్కారు ఉద్యోగం—ఆలస్యం చెయ్యకు, వెంటనే ప్రవేశించు, మంచిది అంటే డిగ్రీ పుచ్చుకున్న ఏడాదే అందరి సమ్మతి ప్రకారం ప్రవేశించాడు...పైఅధికారులు చెప్పింది చేస్తున్నాడు, ఎప్పుడూ తిరగబడలేదు. పనిచెయ్యకుండా తప్పించుకోలేదు. అబద్ధాలు చెప్పలేదు, లంచాలు తీసుకోలేదు. ఇక తను చెయ్యవలసిందేమిటో ఎవరూ చెప్పలేదు... ఇప్పుడు చెప్పటంలేదు. రాత్రి మాత్రం దినకార్యక్రమం జరుపుతూ వుంటుంది........"ఏమండీ, మొహం కడుక్కోండి...... కాఫీ తాగండి......స్నానం చెయ్యండి...భోజనం చెయ్యండి... బజారుకువెళ్ళండి ...ఇక పడుకోండి దీపం ఆర్పివేస్తాను..." ఇది జీవితం అంటే!...

మరి దీన్లో ఏమి విశేషంవుందనీ...కాకపోతే, తనలాంటి వాళ్ళు యీ జీవితంనుంచి ఏం విశేషాన్ని ఎట్లా సృష్టించగలరనీ......ఊరికే మభ్యపెట్టటం చిన్నప్పట్నించీ!..."ఇదిగో అబద్ధం చెప్పబోక... అందరికీ మంచిగావుండు ...... తల్లిదండ్రుల్ని గౌరవించు...అణకువ, విధేయత నేర్చుకో..." గౌతము బుద్ధుని లాకావచ్చునని ఆశ చూపెట్టడం ... నీతి, నీతి...మరి యీ నీతికి, ఆదర్శాలకి బద్ధుడైన తనజీవితం యిట్లా రైలు పెట్టెలా, బురద గుంటలా తయారవటం ఎందుచేత?......తను యింకేం చెయ్యాలి?...... చెయ్యాల్సిందేమీ లేనప్పుడు జీవితంనుంచి నిష్క్రమిస్తే ఏమి? చావంటే పూర్వమేదో భయంవుండేది... యిప్పుడా భయమేమీ లేదు......తనకు నీటివల్ల చావు లేదు...రైలు క్రింద పడుకుంటే...గమ్మత్తుగా వుంటుంది......జీవితానికి అటు వేపు ఏముందో చూడవచ్చు.

శ్రీనివాసరావు తిరిగి వస్తూంటే గోపాలం కనిపించాడు...గోపాలం హైస్కూల్లో టీచరు...

"సినిమాకు వస్తారా, ఇన్స్పెక్టరుగారూ!..." అర్థంలేని వ్యంగ్య ధోరణి!

"డబ్బు లేదోయ్."

"నేను తీసుకువెళ్తాను రావయ్యా....చాలా బాగుందంటున్నారు!" చెయ్యి పుచ్చుకుని లాక్కువెళ్ళాడు గోపాలం .... పంద్రెండణాలటిక్కెట్టు కొన్నాడు.

జానపదచిత్రం...అరగంట తర్వాత కూర్చోబుద్ధెయ్యలేదు శ్రీనివాసరావుకు..."గోపాలం! సినిమాలో యింటరెస్టు పుట్టటంలేదు... నేను వెళ్తానోయ్!"

"అదేమిటి! ఎందుకని? తలనొప్పా?"

"లేదు...ఊరికేనే."

"ఏమిటోయ్. కారణమేమీ లేకుండానే! ఇదిగో యిహ హీరోయిన్ డాన్సు వుంటుంది.... కాస్తవుండు, ఎంజాయ్ చేస్తావు...ఇంటరెస్టు దానంతకదే పుట్టుతుంది...". ఆ ఎంజాయ్‌మెంటు తనతో పంచుకుంటేగాని తృప్తిలేనట్టు ప్రాధేయపడ్డాడు గోపాలం.

హీరోయిన్ డాన్సు ప్రారంభమైంది. సగం తర్వాత మళ్లీ శ్రీనివాసరావు అన్నాడు.... "వెళ్తానోయ్."

"పంద్రెండణాలు పెట్టానుబాబూ, సగం విలవైనా వసుంది, ఇంటర్వల్ దాకా వుండవోయ్!"

నిజమే...డబ్బు దండగపోవటం దేనికి? ఇచ్చిన డబ్బుకోసమైనా చివరిదాకా కూచోవలసిందే...అదే అందరూ చేసేపని...లేకపోతే, తనేం ధనవంతుడా, డబ్బు నిర్లక్ష్యం చెయ్యటానికి! గోపాలం వదిలిపెట్టడు...డబ్బు వృథా కానివ్వడు...తగిన కారణం లేకుండా వెళ్లటానికి వీల్లేదు....

"గోపాలం! మా చంటిదానికి వంట్లో వెచ్చగా వుందని చెప్పింది మా ఆవిడ...నా కోసం కనిపెట్టుకుని వుంటారేమో యింటిదగ్గర..." అబద్ధం చెప్పాడు.

"నిజంగా నేనా?.....యీ సంగతి ముందే ఎందుకు చెప్పలేదోయ్?... సినిమా ప్రొప్రైటర్ కి ఉత్తి పుణ్యానికి చెల్లించాను....మంచివాడివే!" విసుక్కున్నాడు.

"మరేమనుకోను...వెళ్తాను."

శ్రీనివాసరావు యిలు చేరేటప్పటికి పెద్దవానికి అన్నం పెడుతూవుంది శ్రీమతి...మిగతా యిద్దరూ నిద్రపోయారు...కండువా చిలక్కొయ్యకి వేసి, చాప తీసుకొని డాబామీదికి వెళ్ళాడు శ్రీనివాసరావు.

చాపమీద వెల్లకిలా పడుకున్న తర్వాత నక్షత్రాలకేసి చూస్తూ ప్రశ్నించుకున్నాడు—"రైలు పట్టాలమీద పడుకునేదెప్పుడు?" "ఎప్పుడో ఒకసారి, వెధవది! దానికీ కొంత ప్రయత్నం కావాలి!" అని జవాబు వచ్చింది.

శ్రీమతి మెట్లెక్కి వచ్చింది...దగ్గరగా వచ్చి "ఏమండీ, వడ్డించమంటారా?" అన్నది. మొగలిపువ్వు పరిమళం తెర శ్రీనివాసరావును ఉక్కిరి బిక్కిరి చేసింది,

"ఎక్కడివి మొగలిరేకులు?"

"పక్కింటావిడ ఇచ్చింది...ఏం, వడ్డించనా, లేక యింకా ఆలస్యంవుందా?...లేవండి! తర్వాత వచ్చి పడుకుందురుగాని!"

"ఊఁ...కానీయి," రాధ క్రిందికి వెళ్ళిపోయింది.

శ్రీనివాసరావుకు జ్ఞాపకం వచ్చింది...నక్షత్రాలు, ఆకాశం, మొగలిరేకులవాసనా, గాజుల గలగలా, చిక్కనిచీకటి, వెచ్చని కౌగిలి...సుజాత, మొగల్లిపాలెం ప్రైమరీస్కూలుటీచరు .... రైలు ప్రమాదంలో చనిపోయింది....

ఆదర్శానికి, నీతికి బద్ధుడుగా తనెక్కడున్నాడు?...రెండేళ్ళక్రితం సుజాతతో ప్రణయం.. అది అవినీతి, రాధకు అన్యాయం...మెలకువతో కాపాడుకోవలసిన రహస్యం ... క్యాంపుకు వెళ్ళిన ఒక్కొక్కసారి ఒక మహత్తరమైన అనుభవం... సుజాత తనవాణ్ణి చేసుకుంది...భయపడ్డాడు, బాధపడ్డాడు...క్యాంపునుంచి తిరిగివచ్చిన ప్రతి పర్యాయం పశ్చాత్తాప పడ్డాడు...కాని, సుజాతను చూడగానే భయమూ బాధా, పశ్చాత్తాపమూ, పాపమూ, అన్నీ అంతర్థానమయ్యేవి!......ఎంత మంచిది సుజాత!...ఆమె కోరిన ప్రతిఫలం ఏమీ లేదు...ఒకసారి, 'బాగుంటు'దనుకొని, పదిహేను రూపాయలు పెట్టి షిఫానుచీర కానుక తీసుకువెళ్ళితే...వద్దన్నది... తర్వాత నెల తిరక్కుండానే, సుజాత లేదు!

"ఏఁవండోయ్, మిమ్మల్నే!...ఎంతకూ రారేమిటి?"

ప్రత్యక్షానుభవంగా ఉన్నప్పుడు భయమూ బాధా కలిగించినా ... దానిమూలంగానే ... ఆ రహస్యంవల్లే ... మొగలిపువ్వు వాసన, నక్షత్రాలు, ఆకాశం ఆనందం...వీనితోపాటు తనూ వుంటాడు!




ప్రపంచమంతటా మన్నన పొందినది

రాబిన్‌హుడ్

తయారుచేయువారు



సెన్-రాలె




SRC-56 TE

# ఛాయా సంవాదము

శ్రీ బొడ్డు బాపిరాజు

నరుడు

ఓయి, నా వెంట బడక వేంచేయుమోయి.
నీకు పుణ్యమ్ము నా తోడ రాకయున్న
ఒక్క నిమిషమ్ము నిలిచి నిట్టూర్పుకొనగ
విడువు మేకాంతముగ నన్ను; వేడుకొందు!

ఇన్నాళ్లున్ నిను వెంటబెట్టుకొని యూరేగించితిన్; నేడు నీ
వన్నన్ కత్తులమీది సామయిన; దేలా నన్ను వేధించుచున్
వెన్నాడంగ? చిరంతనంబయిన యానేస్తంబు పాటించి వీ
డ్కొన్నన్ దీపము వెట్టి నిన్ దలచి పేర్కొందున్ దయాసింధువున్

ఛాయ

తల్లి యుదరమ్ము నుండి భూతలముమీద
అడుగుమోపని మొదలు నీయడుగుజాడ
విడక కొలిచిన అగ్రజన్ముడను నేను
నేడు తెగ్రెంచినన్ ముడివీడి పోదు!

పసితనపుం దువాళముల, భవ్యకళా కమనీయ సాహితీ
వ్యసనములందు, జవ్వనపువాలుమెరుంగుల కోరమీనముల్
మిసమిసలాడునప్డు, డవిసీత జరాపరిరంభ వేళలన్
విసుగక తోడునీడనయి నిన్ను భజించు ఫలంబు లిట్టివే?

నరుడు

మానిసి యన్న వెన్క ఒకమాటును మర్మము లేక యుండ, ద
వ్వాని యెడందలో పసిడిపాన్పుల నిద్దురవోని కోర్కులన్
తానయి తీర్చుకోవలయు దారులు గోప్యము; లెట్టిచాటు వి
య్యానకు తోటిపెండ్లికొడుకై చనుదెంతువు, దుర్భరమ్మురా!

అలసెన్ నా బ్రదుకెల్ల నీ తగులమాయానంబుగా;—కామినీ
లలితాశ్లేషసుఖానుభోగములు—మిత్రశ్రేణి సల్లాప వా
క్సులభానంద మధుక్షణమ్ములు—కృతిస్తోమాను సంధాన ని
స్తుల నిర్వేలసుధాముహూర్తములు నీతో దక్కలేవయ్యెలే!

కలదట తల్లికైన మరుగన్నది; రెండవ కంటి వానికిన్
తెలియఁగ రాని, వాత్మగత దేవరహస్యము లెల్ల తిర్చుకో
వలె నిను చంకబెట్టుకొని, పాయని ఈ తగులం బశాంతికి
న్నిలవయి, సర్పపుంబడగ నీడల కాపురమట్లు వేచెడిన్.

వేవురిలోన 'మంచి'దనిపించెనులే పయి తళ్కుపూత; నీ
జీవిత—'మాపసిండినగిషీ తెరచాటున దాగియున్న దు
ర్భావభయానకమ్ము అసిపత్రవనమ్మను నీవెరింగి యు
న్నా'వని గుండెలో మసలు నాకు సుఖమ్ముగ నిద్రపట్టునా?

ఛాయ

నావలన కాదు భయమిది,
నీ వరిగెడు డొంకత్రోవ నిను వెరపించున్.
కేవల మనుచరుడను న
న్నీ విధమున దుయ్యబట్ట నేమగునయ్యా?

ఆపదలందు, సంపదలయందు, సుఖమ్ముల, రోగశయ్యలన్
ప్రాపులనుండి పాలుగొను నాప్తుడ, ఆపయి నాలుబిడ్డలున్
తిపులు చెల్లుబెట్టకొని నిన్ను చితాగ్నుల కిచ్చునాడు వెన్
జూపక చెల్మిమై విడువనొల్లని నాయెడనా కృతఘ్నతల్?

బ్రదుకు వైకుంఠపాళి నీపావు గెలిచి
నిచ్చెనలనెక్క నందరు మెచ్చుకొంద్రు;
పాములకు జిక్కి దిగజారి పడెడు వేళ
నిన్ను కనిపెట్టుకొని యుందు నేనొకండ!

కులమర్యాదలు గాలికిన్ వదలి, షోకుల్ పెంచి, గొంతెమ్మ కో
ర్కులు పండించుకొనంగ డంగి పెడదారుల్ త్రొక్కి, వల్లించు నీ
తులకున్ మానక చేయుచేతలకు నీ దోబూచులన్ జూచియు
'న్వలదన్నా,' యని ఒక్కనాడయిన నేవారింపనే లేదుగా!

వేసిలి పేకమేడలకు వెల్లలు. లోకపుకంటిమూసలో
పోసివెలార్చు నీ సొగసుబొమ్మ, నసల్ సినలైన మూర్తినిన్
త్రాసున తూచి వాటితలలన్ ధరకట్టుట ఎంత సేపు? నీ
వేసము లన్నియుం దెలిసి వెంబడి వచ్చెద మూకసాక్షినై.

# ఛాయా సంవాదము

## నరుడు

నిండిన వేమి లాభములు నీవలనన్ మరి—మంచి చెడ్డలం
దొండనకుండ జూడ? పని కోప యామగనిడింట నుండినన్
దండుననున్న నొక్కటె కదా? చనుమన్నను చూరుబట్టి వ్రేల్
దుండగ మేలనోయి, కలదో బలవంతపు బ్రాహ్మణార్థమున్!

ప్రతిపద భయాస్పదమ్ము జీవితపథమ్ము
దుస్సహము చేసివైచె నీ తోడి పొత్తు
చాలు! సడలించి భవదీయ సాహచర్య
శృంఖలాబంధనము, దయచేయు మింక.

## ఛాయ

అంభోధి నమృతంబు హాలహాలము భంగి
నీలోన కనరాక నెలవు కొనుచు
ప్రబలంబులై పరస్పరజిగీష నజస్ర
మలయక మంచి చెడ్డలును రెండు
దేవదానవుల రీతిని కలహింపగా
దివురు, వివేకాగ్ని నివురుగప్పె;
పెడదారులకు పోయి పుడమి కన్నులు మూయు
వెరవులో బ్రదుకె దుర్భరముగాగ

నీవు నన్ను శంకించుచున్నావు గాక
హాని లేదోయి నావల్ల—వ్యాధి యొకటి
మందొకటియైన నయమౌనె? ముందు నీవు
చక్కబడినంత అంతయు చక్కబడును!

జీతము బత్తె మివ్వని దసీ! కొలువేమిటి నాకు? ఇట్టి సం
గాతము లేర్చికూర్చె మనకావిధి; నేపగవాడగాను; నీ
చేతల కీడుమేళ్లు జమచేయగవచ్చిన కర్మసాక్షి నో
యీ, తగవేల మేలితెరువెంచి చరించి సుఖించు మీపయిన్

నన్నెరిగి కన్ను తెరచిన
అన్నరునకు కానిత్రోవ నడుగుపడునె? నా
సన్నిధి సుకృతమ్ములకున్
పెన్నిధి యని తెలిసి బ్రతుకు వెలిగింపుమురా!

# చంద్రశేఖరకవి ఆంధ్రామరుకము

శ్రీ వేదం వేంకటకృష్ణశర్మ

శృంగార నాయికానాయక విలాసవిభ్రమలీలా వైభవముల నాతివిస్తరముగ వెల్లడించు శతశ్లోకములకావ్య మీ 'అమరుకము'. ఏతత్కర్తృతత్కాలాదికముల నిర్ణయింపఁదగు నాధారము లొకింతేని ఇంతదనుకఁ గాన్పింపవు. పరిశోధకులు కొందఱిది అమరుకుఁడను కవి విరచితమనుచున్నారు. మఱికొందఱు శ్రీ శంకరభగవత్పాద ప్రణీతమని నుడువుచున్నారు. ఎవ్వరేమన్నను, వారి నిర్ణయములెల్ల కేవల మూహాజన్యములు. త్రాడు బొంగరములేని యిట్టివారి వాదములు గాలిమేడలు. నేలవిడిచినసాములు.

శ్రీ శంకరభగవత్పాదుల కీకావ్యనిర్మాణ మంటఁగట్టువారికి దేశవ్యాప్తమగు పుక్కిటి పురాణమొండాధారమయ్యెను. కాని, అదియొక కట్టుకత. విశ్వాసార్హము గాదు. అయినను పాఠకుల పరిశీలనమున కది పనికివచ్చునని యీ క్రింద నుట్టంకింతును.

ఆజన్మ బ్రహ్మచారియగు శ్రీ భగవత్పాదులు మాతాజ్ఞంగూడ నుల్లంఘించి, సన్యాసమును స్వీకరించి, సమస్త శాస్త్ర పారంగతుఁడయి, అద్వైత సిద్ధాంత ప్రతిపాదకమగు తనమతమును వ్యాపింపఁజేసినట్లు వారి జీవితచరిత్రము వక్కాణించుచున్నది. ఇట్టులన్నికళలయందును ప్రావీణ్యము గడించిన ఆ మహాత్మునకుఁ దెలియనికళ శృంగార మొక్కటే. అంతమాత్రమున అతని యనుభవమున నది లేకపోయినను కామశాస్త్ర రహస్యము లాతనికిఁ దెలియవని కాదు. తెలిసియు నిష్ప్రయోజనములని యతఁడనుకొన్నవి. ఆకథ నిట సూచించుట యప్రస్తుతము గాదనుకొందు.

అమరకుఁడను భూపాలుఁడు మరణించెను. తచ్ఛవమును చితిపైనుంచి దహనసంస్కారమొనర్చనుండగాఁ దదవకాశమును బురస్కరించుకొని శంకరుఁ డాకళేబరమున జొచ్చెను. కొంతకాల మాయన అంతఃపురాంగనలతోఁ గేళీవిలాసముల నోలలాడుచు గాలక్షేపమొనర్చెను. రాణివాసస్త్రీజనము నృపాల శరీరగతి ప్రాణి స్వభావమును, ప్రవర్తనమును, చాలకముగ నిశితముగ బరిశీలించి, యాజీవి తమ వల్లభుఁడయిన నరేంద్రుఁడు కాఁడనియు, నాత డెవ్వడో యొక మహాయోగిపుంగవుఁడు గానోపుననియు, గారణాంతరమున దనతనువును దాఁచియుంచి, యీ మేన ప్రవేశించెననియు, బరకాయ ప్రవేశాదికములు సామాన్యుల కలవడవనియు నిశ్చయించిరి. వెంటనే, రాణులు మంత్రులను రావించి, విషయములెల్ల వివరించి చెప్పి,— రాష్ట్రమున నెల్లెడ గాలించి, సంగుప్తదేహములున్నచోఁ దెప్పించి, కాల్పించివేయుడని కట్టడ గావించిరి. ధరాధిపునొడలి నాశ్రయించి యున్న శంకరుఁ డది యెఱింగి రాట్ఛరీరము నుజ్జగించి—చితిపై దహింపఁబడనున్న తనమేని యందు శిష్యప్రేరితుఁడై చొరఁబడెను.

'కథ'కు కాళ్ళు, ముంతకు చెవులు లేవని లోకోక్తి కాని, కథకు కాళ్లు ఉన్నవి. లేనిచో నెల్లెడ సంచరించు ప్రకృతి ఎక్కడిది? 'ముంతకు' చెవులు లేవనుటకూడ నట్టిదే. దానిఅంచులు చెవులుగాక మఱేమి? అట్టిదే ఈ కథకూడ. శ్రీ శంకరుని పరకాయప్రవేశము!—అదియు గామకళాభ్యాసార్థము!! కొండను త్రవ్వి ఎలుకను పట్టినట్లున్నది—ఈ కథా విషయము. దేశవ్యాపమయి, ఆచార్య చరిత్రాంతర్గతమయి, సర్వప్రజాముఖస్థమయి — ప్రసిద్ధికెక్కిన యీకథ అమరుక కావ్యసృష్టికి ఆధారము కాని ఆధారమనక తప్పదు. ఇటి గాథలు చారిత్ర కాధారములతో నిశ్చయములని వాదించుట కడుంగడు ప్రమాదము. కావున ఎంతమాత్రమును విశ్వాసార్హము కాదు.

ఇఁకఁ బ్రకృతము : అమరుక కావ్యకర్త యెవ్వఁడయినను- ఇందలి విషయములు పరికించుచో- అతఁడు అత్యంత ప్రౌఢకవితా ధురీణుఁడనియు, శృంగారకళా రహస్య పారీణుఁడనియుఁ దోఁచకమానదు. ఇందలి యొక్కొక్క శ్లోక మొక్కొక్క జాతిరత్నము, రసిక జనానంద సంధాయకమగు ఈ కావ్యములోని శ్లోకము లొకకొన్నింటిని తొమ్మిదవ శతాబ్దమువాఁడగు ఆనంద

ఆత్మ ప్రశంస:—తన్నుఁగూర్చి కవి యిట్లు తెలుపుకొన్నాఁడు:—

"ఇతి శ్రీమత్త్రిపుర సుందరీ కృపాపరీవాహ పారంపరీ సమాలబ్ధ షడ్విధ విచిత్ర కవిత్వ నిరంకుశ ప్రభా భాసమాన,— నిరంతర మదనాంతి కార్పణ్యధురీణ,—కోటిపంచాక్షరీజప ప్రవీణ, సాధుపల్లీ వల్లీ మతల్లీ నివాసి,— సకలబుధజనోల్లాసి, — విద్వజ్జన విధేయ-వేంకటరాయ నామధేయ-తనూభవ-శృంగార జగన్మోహినీ భాణ నిర్మాణ చాతురీధురీణ, వినిర్మిత భాణసంధాన, శ్రీమన్మహీశూర మహారాజాస్థాన లబ్ధ ప్రతిష్ఠా విద్యోతమాన—బాలచంద్ర శేఖరాభిధాన విద్వన్మణి ప్రణీతంబైన—'శృంగార లహరి' యను నాంధ్రామరుక కావ్యంబునఁ బ్రథమాశ్వాసము."

దీనింబట్టి యీకవి మైసూరు రాజ్య పాలకుల యాస్థానమున లబ్ధప్రతిష్ఠుఁడై సత్కారము లందినవాఁడని విదితమగుచున్నది. కావున మైసూరు రాష్ట్ర సరిహద్దులలో ఆంధ్రదేశమును ఆనుకొని యున్న 'సాధుపల్లి' యను గ్రామమే యీతని యభిజనమనుట సుస్పష్టము. తన యాంధ్రీకృతి 'అమరుకము'ను ఈతడు 'శృంగారలహరి' యనియుఁ బేర్కొన్నాడు.

చంద్రశేఖర కవి 'అమరుక' ఆంధ్రానువాదమే కాక మరికొన్ని కృతులుగూడ రచించినట్లు, గ్రంథ మండలి—ఈ క్రింది పద్యమువలనఁ దెలియవచ్చుచున్నది:—

సీ. లలిత గీర్వాణాంధ్రములు గూర్చి చేసితి
సత్యభామామణీ సాంత్వనంబు,
సరస కర్ణాటభాషను సంతరించితి
నవ్య మనుచరిత్ర నాటకముగ,
భువిని ప్రచండపాండవమను కర్ణాట
నాటకంబును జేసినాఁడఁ జూడ,
కలికి శృంగార జగన్మోహనాఖ్యమా
మిశ్రభాణంబు నిర్మించినాఁడ
మహితమా శ్రీకంఠ మహిమావతార
తారావళి రచియించినట్టివాఁడ
చెన్నపురీ రత్నచంద్రరేఖా దండ
కము చేసి విభవంబుఁ గాంచినాఁడ
విదిత సిద్ధాంతకౌముదికి కర్ణాటభా
షను టీక వ్రాసితి ననువుతోడ
భాగవతదశమంబు గీర్వాణభాష
ఖడ్గవృత్తంబుగం జేసి, గరిమఁ గాంచి
నాఁడె వేంకటరాయ నందనుఁడ, బాల
చంద్రశేఖరకవి రాజచంద్రుఁ డేను

పైపద్యమువలన, ఈకవి సంస్కృతాంధ్రకర్ణాట భాషలలో గ్రంథరచనములు సాగించుటలో బ్రవీణుఁడని తేటతెల్లమగుచున్నది. ఈ 'ఆంధ్రామరుకము' తప్పఁ దక్కిన గ్రంథములేవియు నింతవఱకు బయలు పడలేదు. పైపద్యములోనివే కాక మరికొన్ని కృతులను గూడ ఇతఁడు సంతరించినట్లు ఆంధ్రామరుకమువలననె తెలియుచున్నది. ఈకవి 'ఘటికాప్రబంధము'— కట్టినవాఁడఁట! వేయాఱు శృంగారజావళ్ళు చేసిన వాఁడఁట! అంతియగాక—'సర్వతోభద్ర భాస్వర కల్పవల్లి కాద్యాశుప్రబంధములు చేసినవాఁడఁట!

ఇంతకు—ఈ చంద్రశేఖరకవి కాలమునుగూర్చి తెలిసికొనుటకుఁ దగు నాధారములు గ్రంథమున న్యూనములు. అటని సూచనప్రాయములుగఁ గొన్ని లేక పోలేదు. లోఁగడ నితఁడు కంకంటి పాపరాజకృతమగు నుత్తరరామాయణ పద్యము ననుకరించు పద్యమొండు వ్రాసెనని తెలిపియుంటి కదా! కాన నీతఁడు పాపరాజునకు ఈవలివాఁడు అతఁడు (పాపరాజు) ఇప్పటికి దాదాపు నూటయఱువదేండ్లకు క్రిందటివాఁడుగఁ 'ఆంధ్ర కవుల చరిత్రము' వక్కాణించుచున్నది. అగుచో, ఈ చంద్రశేఖరకవి గతశతాబ్ద పూర్వార్ధమున నుండి యుండుననుట సముచితము — ముఖ్యప్రత్యంశముల మూలముగఁగూడ ఈ చిక్కు కొంతవఱకు దీరుచున్నది. ఈ యమరుక కావ్యమును వాజపేయం కృష్ణయ్య—యను బెంగుళూరువాస్తవ్యుఁడు తన బెంగుళూరుబుక్కు డిపో ముద్రాక్షరశాలయందు 1896 సంవత్సరమున ముద్రించి ప్రచురించినటు తెలియుచున్నది. చంద్రశేఖరకవి—ఈ గ్రంథరచనకుఁ బూర్వమే పెక్కు కృతులు వ్రాసినట్లు అతఁడే చెప్పుకొనియుండుటచేత, కొంచెము వయసు మరలిన తరువాతనే ఆంధ్రామరుకమును జేసియుండు ననుట యుక్తియుక్తము. అగుచో నితఁడు 1825.30 ప్రాంతమున జనియించి 60 యేండ్ల నడిమిప్రాయమున ఈ గ్రంథానువాదము నొనర్చియుండును.

ఇఁక ఇతని నివాసస్థలము—'సాధుపల్లి'— ఆంధ్ర మహీశూరరాష్ట్రముల సరిహద్దునఁ గర్ణాటకమునకుఁ జేరియుండిన గ్రామమగుటచేతనే, కన్నడ శబ్దము లటనట నితఁడీ కావ్యమున వాడుటయేగాక, ఆభాషలోఁ బాండితీ కవితలు సముపార్జించి, మైసూరు ప్రభు సమాదరణమునకుఁ బాత్రుఁడై యనేక సన్మానములు బొందినట్లు స్వయముగఁ దెలిపికొన్నాఁడు.

ఇతని ఆంధ్రామరుక కావ్యమంతయు 'శార్దూలము' తక్కఁ దక్కినవృత్తము లన్నింటిలోను సాగినది. కాని వ్యాఖ్యాభిప్రాయములతో రచియింపబడె నను నుబలాటమునఁ గాఁబోలు, నాలుగుపాదముల నియ

మనుఁ బాటింపక, యిచ్చవచ్చినరీతిని పద్యముల చరణములను పెంచినాఁడు. ఇందలి పద్యములలో రెండు మాత్రమే చతుష్పాదులు. ఇఁకఁ బంచపాదులు 12; షట్పాదులు 50; సప్తపదులు 29; అష్టపాదులు 6; నవపదులు 2

కవితారంగమున నిరంకుశుఁడనని పగలు పలికిన యిమ్మహాకవి ప్రతిశ్లోకభావమును నాలుగు చరణముల వృత్తములలో నిముడ్చలేకపోవుట శోచ్యము. ఇతనికి దేశ్యములమీఁద ప్రీతి మెండు. చాలచోట్ల కొచ్చికములతో మృదుమధురముగఁ గమ్మచ్చునఁ దిగ సాగింటితని కవిత్వ మొడుదుడుకులు లేక నిరాఘాటముగఁ బరువిడుచుండును. లలిత శయ్యలో ఈ యద్భుతకావ్యమును ఆంధ్రమున నిర్మించిన కొలదిమంది కవులలో నీతఁడొకఁడు. ఒకటి రెండు పద్యములు శ్లోకసహితముగ ఈయాంధ్రామరుకమునుండి మచ్చునకీ క్రింద నిచ్చుచున్నాఁడను:—

"ఆలోలామలకావళీం విలులితాం
బిభ్రచ్చలత్కుండలమ్
కించిన్మృష్టవిశేషకం తనుతరై
స్స్వేదాంభసాంజాలకైః
తన్వ్యా యత్సురతాంత తాంత
నయనం వక్త్రం రతివ్యత్యయే
తత్త్వాం పాతు చిరాయ కిం
హరిహరబ్రహ్మాదిభి ర్దైవతైః"

ఈ శ్లోకమునకు కవి క్రింది యేడుపాదముల చంపక వృత్తమును వ్రాసినాఁడు:—

"అలికమునం గడుం జెదరి, యల్లల నాడెడు
సోగముంగురుల్
గలిగి, చలించు కుండల యుగంబును
మోమున సన్నసన్నఁగా
జిలికెడు ఘర్మబిందువులచే నొకయించుక
జాఱు బొట్టునున్
సలలితమై చెలంగి, పురుషాయిత
కేలమునందుఁ జెందు పే
రలసటచేత కాంత సురతాంతమునం,
దటమోడ్చు కన్నులం
గళలను జిమ్ముచున్, సుచిరకాలము
నిన్ కృపతోడఁ బ్రోచు నా
చిలుకలకొల్కి మోము, శశిశేఖర
విష్ణు విధాత లేటికో?"

"సందష్టాధరపల్లవా, సచకితం, హస్తాగ్ర
మాధూన్వతీ,
మా మా ముంచ శఠేతి కోపవచనై
రానర్తిత భ్రూలతా,
సీత్కారాంచిత లోచనా సపులకం
యైశ్చుంబితా మానినీ,
ప్రాప్తం తై రమృతం శ్రమాయ మథితో
మూఢై స్సురై స్సాగరం"

దీని కాఱు పాదముల చంపకము:—

"కమనుఁడు వాతెఱన్ జుఱుపుగాఁ గొఱుకన్,
భయసంభ్రమంబునన్
గ్రక్కునఁ జేవిదిల్చి, 'విటరాయఁడ! వద్దిఁకఁ జాలు
వీడు'—మం
చమరినకిన్క పల్కులకు నటిటు కన్బొమతీవె
లాడఁగా
సమముగ సీత్కృతాంచిత దృశన్ వడిఁ బట్టుచుఁ
బుల్కలొల్క, నా
యమలతరాంగిమోవి సెవ రానిరో వారమృతంబుఁ
జెందఁగా,
శ్రమకోఱకే మథించిరి, సురాసుర లంబుధి
మూఢచిత్తులై"

పూర్వకవి ప్రయోగ ప్రసిద్ధములు కాని—తడ, కామనుడు, అపేక్షలు ఈలాంటి యపూర్వశబ్దము లిందు క్వాచిత్కములుగ గానవచ్చెడు. లక్షణ విరుద్ధప్రయోగములు సహిత మటనట దోచెడు.

చూడకన్, కఠినోక్తులాడకన్ చేతును, తిరుంగు ఒణకెడు, వడిక్ యల్లార్చి, ముగ్ధతనము, చాడిమాట్లు (మాటలు) మచ్చికమాట్లు, లేక చెప్పెడు, అలయింపన్నెదురు—ఈలాటి వ్యాకరణ వ్యతిరిక్తములు అందందున్నవి.

ఇట్టి దోషములకేమి, కాని, రసవంతములగు—అచ్చతెన్గుపలుకులు ముచ్చటఁ గూర్చుచు, రసికులగు పాఠకులకు విసుగుఁగూర్పని శైలిలో ఈకావ్యమును చంద్రశేఖరకవి యనువదించుట కడుంగడు శ్లాఘ్యము. ఇతని తక్కిన రచనములును లభించిననాఁడు తెలుఁగు దేశము ధన్యత గాంచును. తెలుఁగువారును మహత్తర గరిమఁ గాంతురు. మున్ముందయినఁ బరిశోధకుల ప్రయత్నమువలన నవి బయలువడి ఆంధ్రశారదకు వినూత్నాలంకారము లగుఁగాక!

# కలగూరగంప

## ఆప్తమిత్రుడు తెన్నేటి సూరి

### శ్రీ పి. శ్రీరాములు

వానరాకడా ప్రాణంపోకడా ఎవరికీ తెలియదంటారు.

అక్టోబరు 16 శుక్రవారం అనుకుంటాను. ఆ క్రితం రోజునుంచే ఎడతెరిపిలేని వర్షం. ఎక్కడికీ కదలడానికే వీల్లేదు. మధ్యాహ్నం రెండుగంటలయ్యేసరికి



అశనిపాతంలాంటి వార్త అందింది. ఆప్తమిత్రుడు తెన్నేటి సూరి మరణించాడని విని నిలువుగా నీరైపోయాను. సూరి మరణించాడంటే నమ్మలేకపోయాను. అంతకు సరిగా రెండురోజుల క్రితం చూడడానికి వెళ్ళినప్పుడు అయినవరంలోని అద్దెఇంట్లో మంచంమీద పడుకొని ఏదో బాధపడుతున్నాడు. ఆ బాధ మరణవేదనే అని గ్రహించలేకపోయాను. మరో ముప్ఫయిఆరు గంటలలో మృత్యుదేవత కబళించి వేయబోతున్నదని ఊహించలేకపోయాను.

ఆ బక్కపలచని శరీరమూ, దానికి తగిన ఎత్తూ, కోటేరు వేసినట్లు కనిపించే ఆ పొడుగాటి ముక్కూ, విశాలమైన చక్రాల్లాంటి తళతళ మెరిసే ఆ కళ్ళూ, ఆ కళ్ళలోనుంచి వెలువడే తీక్ష్ణమైన చూపులూ, ఆ చూపులలో గోచరించే చురుకైన తెలివితేటలూ, మందహాసం విరజిమ్మే ఆ కోలముఖమూ... మరిచిపోదామన్నా మరపురావు.

జీవించింది యాభై యేళ్ళలోపే అయినప్పటికీ అందులో సగభాగానికి పైగా తెన్నేటి సూరి సాహిత్యసేవకే వినియోగించాడు. కవిగా, కథకుడుగా నవలారచయితగా, నాటకకర్తగా తెలుగుదేశంలో పేరుప్రఖ్యాతి ఆర్జించుకున్నాడు. తన పేరుతోనూ 'సీరపాణి' అనే మారుపేరుతోనూ అనేక రచనలు ప్రచురించాడు. వాటిలో సుబ్బిశెట్టి కథలు, అగుణరేఖలు. నాగజి (నాటకం), చెంఘిస్‌ఖాన్ మొదలైనవి ముఖ్య రచనలు. చెంఘిస్‌ఖాన్ నవల ఆంధ్రపత్రిక సారస్వతానుబంధంలో సీరియల్ గా వెలువడింది. అనువాదమైనప్పటికీ, సొంతరచనే అయినప్పటికీ సూరి ప్రతిరచనలోనూ ప్రతిభా వ్యక్తిత్వాలు ప్రస్ఫుటంగా గోచరిస్తూంటాయి. అనువాదంలో అతని ప్రతిభకు 'రెండు మహానగరాలు' ఉత్తమ నిదర్శనం. ఇది ఆంధ్ర సచిత్ర వారపత్రికలో సీరియల్ గా ప్రచురణ అయింది.

జీవిత సమస్యలపైగాని, సాహిత్య సమస్యలమీదగాని, ఏ ఇతర విషయాలపైగాని తెన్నేటి సూరిని నిద్రలేపి అడిగినా ఖండితమైన, అతి స్వతంత్రమైన భావాలు ప్రకటించేవాడు. తన భావాలు ఎదటివారికి నచ్చినా నచ్చకపోయినా కుండబద్దలు కొట్టినట్లు నిర్మొహమాటంగా చెప్పివేయడం సూరి ప్రత్యేకత. తన కలం హలంగా, తాను సీరపాణిగా నాతిక్లిష్ట సాహిత్య వ్యవసాయం చేశాడు. ఎప్పుడో నవయుగోదయమవుతుందని దానికి నాందిగా "మానవ స్వాతంత్ర్య 'మాగ్నకార్టా' పైన రక్తాక్షరాలతో వ్రాలు చేశాను" అని తన 'అగుణరేఖలు' అనే గేయ సంపుటిలో వ్రాసుకున్నాడు.

సూరి భావాలు మనకు ఇంకా స్పష్టంగా అవగాహన కావాలంటే "అగుణరేఖలు" లోని ఈ క్రింది పంక్తులు మచ్చుముక్కలుగా ఉపయోగపడతాయి.

“అంటరాదని యొకడు,
అధికుడని మరియొకడు,
గొంతుల్లు కోసుకుంటూరా!
కల్లికందరు బిక్ష లోకమేమురా!
తల్లి వింటే భేదపడుతుందిరా!”

అన్నాడు అంటరానితనం ఖండిస్తూ.

‘కేలు గుర్రమువైన,
బాలీసు కానుకుని
ప్రాణాలు లేనట్టి
భగవంతుడొచ్చాడు—
ఊరంత ఊరేగుతూ
ఉత్సవము సాగించుతూ—
కూలి మాటడగండిరా!
అన్నాలు
చాలవని చెప్పండిరా!

ఇవి కీలుగుర్రం అనే గేయంలోని తొలిపంక్తులు.

నీ కవిని బ్రతికించుకోవాలిరా!
నీవు మనిషనిపించుకోవాలిరా!
బ్రతికి యున్నన్నాళ్లు పట్టెడన్నము నిడవు,
అతడు చచ్చిన వెనుక అందలాలంటావు...
నీకవిని...

అని హెచ్చరించాడు.

ఇంతేగాక భారతిలో కొన్నాళ్ళ క్రితం ‘సీరపాణి’ అనే మారుపేరుతో సూరి రచించిన ‘సాహిత్య సమాచారం’, ‘విరహా విషాద నిషా హామేషా’ అనే వ్యంగ్య రచనలు, తెలుగు సాహితీప్రియులను విశేషంగా ఆకర్షించాయి.

సహృదయుడు, ప్రేమపాత్రుడు అయిన తెన్నేటి సూరి ఆంధ్రపత్రిక సంపాదకవర్గంలో సరిగా పదేళ్ల క్రితం ప్రవేశించాడు. ఇంచుమించుగా గత ఐదేళ్ళ నుంచీ ‘భారతి’ సహాయ సంపాదకుడుగా పనిచేస్తూ వచ్చాడు.

సూరి స్వస్థలం కృష్ణాజిల్లా తెన్నేరు గ్రామం. శ్రీ తెన్నేటి తిరుమలరావుగారి జ్యేష్ఠపుత్రుడు. బందరు నోబుల్ కాలేజీలో ఉన్నత విద్యాభ్యాసం చేసి పట్టభద్రుడైనాడు. తండ్రి శ్రీ తిరుమలరావుగారు పరమపదించి ఆరునెలలైనా నిండాయో లేదో, ఇంతలోనే ఈ విషాద సంఘటనకూడా జరిగింది.

తెన్నేటి సూరి అకాల మృతి తెలుగు సాహితీ ప్రపంచానికి తీరని లోటు. ఆ స్నేహితుని సమున్నత స్మృతికిదే నా బాష్పాంజలి.

# 40 కోట్ల సమస్యల సమస్య

## శ్రీ సా. సుబ్రహ్మణ్యశాస్త్రి

“...అందువల్ల ఈ రెండు ఖండాల ప్రాంతాల ప్రజల ప్రగతి సమస్యను ఆర్థికంగానే గాక సాంస్కృతికమైన దృష్టితో కూడా చూసి అర్థం చేసుకోవలసి ఉన్నదని సరియన్న భారత ప్రధాన మంత్రి ప్రకటనలు, ప్రపంచ ఆర్థిక వేత్తల ఢిల్లీ సభలో ప్రారంభించిన వారల హృదయాన్ని ఆవిష్కరించాయి అనవచ్చును. ప్రపంచ బ్యాంకు (W. B.) అంతర్జాతీయ ద్రవ్య నిధి (I. M F) అంతర్జాతీయ పెట్టుబడి సంస్థ (I. C F)ల మహాసభ భారత రాజధానిలో జరిగినందువల్ల చేకూరిన ముఖ్య ప్రయోజనాలలో ఇది ఒకటి. వెనకబడిన దేశాలవారికిని, సహజ వాతావరణంలో నిజస్థితిగతుల మధ్య అగ్రగామి దేశ ప్రతినిధులు చూసి ఆ యా విషయాలను తెలుసుకోవడానికి అవకాశం కలిగింది.

అక్టోబరు రెండో వారంలో జరిగిన ఈ సభకు 68 దేశాలనుంచి దాదాపు వెయ్యి మంది వచ్చారు. (వీరిలో ప్రతినిధులు 420 మంది మిగిలిన అంతా సిబ్బంది) కలవారూ లేనివారూ కలిసి జరిపిన చర్చల సందర్భంలో భారతీయ విజ్ఞానభవనం నాలుగు రోజుల పాటు ఆర్థిక భువన భవనంగా భాసించింది. మహాసభకు బెల్జియం ఆర్థిక మంత్రి శ్రీ జీన్ వాన్ హౌటీ అధ్యక్షత వహించారు. భారత ప్రధాన మంత్రి శ్రీ జవాహర్‌లాల్ నెహ్రూ సభను ప్రారంభించారు:

## రెండుఖండాల అఖండశక్తి

మూడుశతాబ్దాల నిద్రాణ స్థితిలో ఉన్న ఆసియా ఆఫ్రికాలు ఇప్పుడు మేలుకున్నాయి. ఇటీవలి సంఘటనల సంఘర్షణతో ఈ రెండుఖండాల జనతలో చైతన్యం ఒక్కసారిగా విజృంభించింది. అన్నవస్త్రాలు కూడా సమస్యే అయిన కోట్ల ప్రజలు ఈ నాడు తమ జీవన ప్రమాణాలు వృద్ధి చేసుకోవాలని సంకల్పించారు. వాళ్ళు అలా చేయరాదని ఎవరూ చెప్పలేరు. ఈ అమేయమైన శక్తిని ఎవరూ అణచలేరు. వారి జీవన్మరణ సమస్యలు పరిష్కరించడానికి సహాయపడడం మంచి స్థితిలో ఉన్నవారి కర్తవ్యం. ఆ కర్తవ్యాన్ని...ముందుకురాకపోతే మరొకరు...నెరవేరుస్తారు. అందువల్ల మీరు కర్తవ్యాలను ఆలోచించి నిర్ణయించడంలో ఈ వెనకపడిన దేశాల

సమస్యలను—కేవలం రాజకీయ ఆర్థిక సమస్యలుగానే కాక, మనుషుల సమస్యగా చూడాలి. దీనిని ప్రాజెక్టుల నిర్మాణంలో, పరిశ్రమల నిర్వహణంలో మటుకే కాక, మనుషుల కష్టసుఖాలలో దర్శించాలి అని శ్రీ నెహ్రూ చెప్పారు.

ప్రపంచ బ్యాంకు మహాసభ తీర్మానాలలోనూ, ప్రపంచ బ్యాంకు అధ్యక్షుడు యూజీన్ బ్లాక్, అంతర్జాతీయ ద్రవ్యనిధి అధిపతి పెర్ జాకబ్‌సన్, అమెరికా ఎగుమతి దిగుమతుల బ్యాంకు అధ్యక్షుడు శామ్యూల్ క్లార్క్ వా, అంతర్జాతీయ పెట్టుబడిసంస్థ అధ్యక్షుడు రాబర్ట్ గార్నర్, బ్రిటన్ ఆర్థికమంత్రి హీత్ కోట్ అమొరీ ప్రభృతులు సమావేశాల లోపలా వెలుపలా వెలిబుచ్చిన అభిప్రాయాలలోనూ కూడా భారత ప్రధాని వినతికి ఫలితం, సమాధానం కనిపిస్తాయి. ఇవి పరిశీలిస్తే ప్రధాని అభివర్ణించిన ఆసియా ఆఫ్రికాల సమస్యను, దాని తీవ్రస్థితిని ఈ సభ వారు అవగాహన చేసుకొన్నారని విశదం అవుతుంది.

## ఋజంమీద నిజం

ఆసియా ఆఫ్రికా ప్రజల జీవన ప్రమాణాలు పెరిగి, వారు వృద్ధికి రావడం జరిగితే అంతర్జాతీయ వర్తక వాణిజ్యాలు బాగుపడతాయనీ, ఆర్థికమాంద్యాలూ ద్రవ్యోల్బణాల వంటి ఉత్పాతాలను నివారించడానికీ, వచ్చిపడే వాటిని ఆగుపుచేయడానికీ తగు బలం ఉంటుందనీ మహాసభ అభిప్రాయపడింది.

జీవన ప్రమాణాలు పెంచడానికై ద్రవ్యనిధి, ప్రపంచ బ్యాంకులకు సభ్యదేశాలు కట్టే చందాలను పెంచి పెట్టుబడిని వృద్ధిచేయాలని ఏకగ్రీవంగా తీర్మానించింది. (వర్తమానస్థితి యథాప్రకారం ఉండాలన్నా కూడా పెట్టుబడిఖర్చు పెంచక తప్పదని నెహ్రూ అన్నారు.) ఈ ప్రతిపాదను అమెరికా అధ్యక్షుడు శ్రీ ఐసెన్‌హోవర్ పంపారు.

దీనితోపాటే ఆయన పంపిన మరొక ప్రతిపాదన, అంతర్జాతీయ అభివృద్ధికార్యక్రమ నిర్వాహణ సంఘం (International development Association) నెలకొల్పాలనేది సభ ఆమోదం పొందలేదు. ఆ విషయాన్ని లోపాయికారీ చర్చల ఘట్టంలోనే ఇంకొంచెం నలగనివ్వదలచుకున్నారు.

లోపాయికారీ స్థాయి చర్చలలోనలిగే మరొక ముఖ్యాంశం ఐ. ఎం. ఎఫ్. (ద్రవ్యనిధి), డబ్ల్యు. బి. (ప్రపంచ బ్యాంకు)లకు సభ్యదేశాల చందాలను ఎంతెంత చొప్పున పెంచాలీ అన్నది. వీటిలో మామూలు బ్యాంకు రేట్ల స్థాయి వడ్డీలపై సభ్యదేశాలకు అప్పులు ఇచ్చేది ప్రపంచబ్యాంకు. దీని పెట్టుబడి స్తోమతును-ఇప్పుడున్న 940 కోట్ల డాలర్లను-రెట్టింపు చేయాలని అనుకుంటున్నారు. (ఇందులో అమెరికా చెల్లించగల వాటాను 600 కోట్ల వరకూ పెంచడం జరుగవచ్చునని ఒక అంచనా) ఇక రెండవది ఉత్పాతాలువచ్చి పడినప్పుడు ఆయా దేశాలను ఆదుకొనే అంతర్జాతీయ ద్రవ్యనిధి (IMF). ఈ ద్రవ్యనిధి మూలనిధిని నూరింట 50 వంతులు పెంచుతారు. (ఇందులో కూడా అమెరికా విరాళం 410 కోట్ల డాలర్ల దాకా పెరగవచ్చునట) ఏయే దేశాల వాటా ఎంతెంత పెంచాలో ఆలోచించడానికి ఒక సంఘం ఏర్పాటైంది. వీరు నెలాఖరులో ఒక నివేదిక రూపొందిస్తారు. మొత్తంమీద అన్ని దేశాలకూ (68 ఉన్నాయి) కొంచెం అటూ యిటూగా ఒకే సాయిన (నూటికి 50 వంతుల హెచ్చింపు) వాటాలు వేసినా ఒకటి రెండింటికి మాత్రం కొంచెం ఎక్కువే వడ్డించవచ్చునని బ్రిటన్ ప్రతినిధి హీత్ కోట్ అమొరీ అన్నారు. ఈ రెండింటిలోనూ అమెరికా ఉండకపోవచ్చుననీ, ఆ దేశాన్ని ఇంకా ఎక్కువ చెల్లించమనరనీ ద్రవ్యనిధి అధిపతి జాకబ్‌సన్ చెప్పారు. బహుశా ఎక్కువ కోటాలుపడేది. జర్మనీ, ఇటలీలకు కావచ్చునని ఆయన అన్నారు. ప్రపంచదేశాల శ్రేణిలో, అమెరికాను మినహాయిస్తే కాస్త 'బాగా పచ్చగా' ఉన్నది జర్మనీ. ఇక పోతే, ఇటలీ కోటా పెంచాలనుకొనడానికి కారణం అక్కడ డబ్బు మురిగిపోతూందన్న దురభిప్రాయం కాదనీ, ఇప్పుడు ఉన్న సరళంగా అన్ని దేశాలూ ఇచ్చే విరాళాలలో చిన్న వాటా ఇటలీదే కాబట్టి వాళ్ళని ఇంకాస్త ఎక్కువ (ఆమేరకు) అడగవచ్చునను కొంటున్నారని జాకబ్‌సన్ అన్నారు. ప్రపంచ బ్యాంకు ఖాతాలో ఇటలీది మూడవస్థానం కిందటేడు అప్పు 7½ కోట్ల డాలర్లు.

## మన సమస్య

ఇక మనకు సంబంధించినంతవరకూ ఈ వ్యవహారంలో ఒక చిన్న పేచీ ఉంది. అంతర్జాతీయ ద్రవ్యనిధి పాలక సంఘంలోని ఎక్స్ ఆఫీషియో స్థానాలు (వాటాలను బట్టి ఇచ్చే ప్రాతినిధ్యం) ఐదింటిలోను భారతదేశానిది ఐదవది. ఇప్పుడు ఆయా దేశాల విరాళాలు పెంచడం జరిగితే కొత్త వాటాల తరతమాల వరుసమేరకు మనకి ఉద్వాసన చెప్పడం జరుగవచ్చు. దీనికి అవకాశం ఉంది అయితే, ప్రజాస్వామ్య ప్రపంచానికి స్తంభం వంటిదైన ఇంత పెద్ద దేశాన్ని చందాలపేరిట త్రోసి రాజనడం శ్రేయస్కరం కాదని బాధ్యతగల వారంతా భావిస్తున్నారు. అందువల, ఈ విషయం రచ్చకెక్కించకుండా లాబీలలో, లోపాయకారీ చర్చలలో పరిష్కరించి ఏదో మార్గం చూడాలని ప్రయత్నాలు

చేస్తున్నారు. ఇది డిసెంబరు నెలాఖరుకు తేలిపోగలదని అంటున్నారు.

## ఊహాగానంలో అపశ్రుతి

ఐసెన్‌హోవర్ సూచించిన మూడవ ప్రతిపాదన—I. D. A. (అంతర్జాతీయ అభివృద్ధి సంఘం) నెలకొల్పాలన్నది ఈ సభలో నెగ్గుకురాలేదు. వెనకబడ్డ దేశాలకు తక్కువ వడ్డీమీద, ఎక్కువ వాయిదాలమీద పెద్ద మొత్తాలు అప్పు ఇవ్వడం ఈ సంఘం చేయాల్సినపని ఈ సదుపాయం ఈనాడు ఆసియా ఆఫ్రికాలకు చాలా ముఖ్యమనీ, చాలా అవసరంగా జరగాల్సినదనీ అందరికీ తెలుసు. అప్పులు తీసుకునే వాళ్ళంతా దీన్ని హర్షించి బలపరచినా, పెట్టుబడి పెట్టేవాళ్ళుమటుకు (అమెరికా సహా) అపరిమితోత్సాహం ప్రదర్శించలేరు... ఇందులో ఎన్నో వ్యవహారపరంగా తలెత్తబడే సాంకేతికమైన అభ్యంతరాలు ఉన్నాయనీ, అయినా ఈ లోపాలు తొలగించి ఈ ఊహాలకే కొత్తరూపం తొడగవచ్చునని లండన్ టైమ్స్ పత్రిక వ్రాసింది. ఐనా అపశ్రుతితో ఆరంభమైన ఈ ఊహాగానం మళ్ళీ దారికి రాకపోవచ్చునని నిరాశ ధ్వనించింది. దేశదేశాలవారు స్వయంగా భారతదేశంవెళ్ళి అక్కడి స్థితిగతులు చూచి, తద్వారా 'ఈ బీదదేశాలు, బీద అరుపులు అరచి, కావలసిన దానికన్నా ఎక్కువ అడుగుతున్నాయన్న' దురభిప్రాయం చెరిపేసుకున్నందువల్ల ఈ ప్రయత్నం ఇంతటితో ఆగిపోదు అని కొన్ని లండన్ పత్రికలు సూచించాయి. మాంచెస్టర్ గార్డియన్ పత్రికధి వ్రాసిన వాక్యాలు: "ఈ సమస్య ఇప్పుడున్న అంతర్జాతీయ సంస్థల తాహతుకు మించినది; కొత్తది పెట్టేదాకా ఓపలేనిది."

మన సమస్య (వర్తమాన ఆర్థిక స్థితిగతులపై శ్రీ బులుసు వెంకటసుబ్బారావుగారు వ్రాసిన వ్యాసము 71 పుటలో చూడండి) మున్ముందు—మూడవ ప్రణాళిక సాగేనాటికి తీవ్రతర రూపం ధరించగలదని బాధ్యత గలవారు అంచనాలు వేసి తేల్చారు. అప్పటికి మన అప్పులూ వాటిమీద వడ్డీలూ కుప్పతెప్పలుగా పెరుగుతాయి. మాటనిలబెట్టుకోడానికి పెద్ద పెద్ద మొత్తాలు చెల్లించవలసివసుంది. దీనికి ఇప్పుడున్న సంస్థలు గట్టిగా ఆదుకోగల అవకాశాలు బొలెడన్ని ఉన్నాయని ఎవరూ గట్టిగా చెప్పలేరు. ఉన్న కొన్నిటిలో:

ప్రపంచబ్యాంకు ప్రాజెక్టులకు సహాయం చేస్తుంది (దీనికొత్తలో మనదే పెద్దఅప్పు. కింద లేదు 82 కోట్ల రూ. లు) "మీరు రక్షణశాఖకు ఆయుధాలకు ఖర్చు తగ్గించుకుంటే, ప్రాజెక్టులకు ఎక్కువసహాయం చేస్తాం" అని యూజిన్‌బ్లాక్ అన్నారు.

అమెరికా ఎగుమతి దిగుమతుల బ్యాంకు మొన్న ఏప్రిల్‌లో మనకు 15 కోట్ల డాలర్లు మంజూరుచేసింది. దీన్ని ప్రయివేటు రంగానికీ, ప్రభుత్వం వేసిన పథకాలకూ పంచుతారు. ఇందులోనూ, పెద్ద పథకాలకన్న, ఎక్కువమందికి ఉపాధులు చూపగల చిన్న పరిశ్రమలకు సహాయంచేయడానికే ఆ సంస్థ మొగ్గుచూపుతుందని దాని అధ్యక్షుడు శామ్యూల్ వా ప్రకటన విడదలచేసింది.

ఇక అంతర్జాతీయ పెట్టుబడి కార్పొరేషన్ (I. F. C.). ఇందులో 55 దేశాలు (ఇవి ప్రపంచ బ్యాంకులోకూడా సభ్యదేశాలే) ఉన్నాయి. ఈ సంస్థ ప్రయివేటు రంగానికి తోడ్పడుతుంది. వీరు ఇచ్చే అప్పులకు ప్రభుత్వం హామీ యివ్వనక్కరలేదు. అప్పుతీసుకొనే పరిశ్రమల నిర్వహణాదికాలలోకూడా వీరు యాజమాన్యం అపేక్షిస్తారు.

## వా వాక్యమ్ :

మనదేశం సమస్య ఇప్పుడున్న సంస్థలకు లొంగనిది అని మాన్‌చెస్టర్ గార్డియన్ వ్రాసిన వాక్యానికి స్థూలంగా తాత్పర్యం ఇది. మరొక అంశంకూడా చెప్పుకోవచ్చు: ప్రయివేటు రంగానికి సహాయంచేయడానికి ఈ సంస్థల సభ్యదేశాలు ఎక్కువ సుముఖంగా ఉన్నాయని. ఇది కూడా అనుకూల వాతావరణం ఉంటేనే. అది:

శామ్యూల్ వా వాక్యాలలో: Private Capital would come only when it is wanted, well-received and well treated This is needed if you want it here."

*    *    *

మొత్తంమీద కొన్ని విషయాలు అంత ఉత్సాహకరంగా లేకపోయినా, ప్రపంచ ఆర్థికవేత్తల సభ ఢిల్లీలో జరగడంవల్ల వారు ఇక్కడి స్థితిగతులను స్వయంగా తెలుసుకునే అవకాశం కలిగింది. సహాయం చాలా అవసరం అని గ్రహించడం జరిగింది. తత్ఫలితంగా ప్రపంచ బ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్యనిధుల పెట్టుబడి స్తోమతును పెంచాలన్న నిర్ణయం (ఇంతకు పూర్వం నుండీ అనుకుంటున్నదైనా) ఏకగ్రీవంగా జరిగింది.

ఇక, ముఖ్యంగా కావలసిన అంతర్జాతీయ అభివృద్ధి సంస్థ (I. D. A.) వంటిది నెలకొల్పడానికి తోచినమార్గాలు కలసి రావటంతో మార్గాంతరాలు ఆలోచించడం న్యాయ్యం. ఎందుకంటే 300 ఏళ్ళ క్రితంవరకు ఆసియా ఉచ్ఛదశలో ఉంటువచ్చి దరిమిలామా వేసింది. 150 ఏళ్ళనించి అపార

పారతంత్ర్య ప్రభావం క్రిందపడి ముందుకు వేయక పోవడమే కాక వెనకడుగులు కూడా వేసింది. అదే కాలంలో పశ్చిమరాజ్యాలు ఈ పరిస్థితులను కూడ తీసుకొని పారిశ్రామికంగా అభివృద్ధి సాధించాయి. అందువల్ల వీటికి తోడ్పడటం పశ్చిమ రాజ్యాలకు ధర్మం. భారత ప్రధాని తన ప్రారంభోపన్యాసంలో ధ్వన్యాత్మకంగా స్పృశించి వదలివేసిన తాత్పర్యం ఇదే. ఆసియావాసుల హృదయమూ ఇదే.

# న్యాయమూర్తి వేపా రామేశం

## శ్రీ సి. హెచ్. వి. రామమూర్తి

పాండితి, అసాధారణ ధారణశక్తి, అవి సద్వినియోగం కావడానికి వివేకం, ఈ రెండిటిని రాణింపును తెచ్చే సౌమనస్యం, వినమ్రత కలిసి నిలిచే 'సందర్భాలు' నిత్యజీవితంలో తరచు సంభవించవు. వస్తే ఎన్నటికీ మరువలేము. అటువంటి 'సందర్భాల'లో వేపా రామేశం పంతులుగారి ఉజ్జ్వలజీవితం ఒకటి. వ్యక్తిగా ఆయన ప్రతిభావ్యుత్పత్తులు, కార్యదీక్ష, క్షమ, న్యాయవాదిగా వారి న్యాయబుద్ధి, చిత్తశుద్ధి న్యాయమూర్తిగా దక్షత, మానవత ఆయన జీవనావరణంలోకి వచ్చినవారికి భక్తిప్రపత్తులూ, దూరం నుండే ఆయనను చూచిన అపరిచితులకు విశేషగౌరవాభిమానాలూ కలిగించాయి.

రామేశంగారు 1875 జూలై 27-న విశాఖపట్నంలో జన్మించారు. 1892 లో బి.ఎ. (మద్రాసు), '95 లో బి.ఎల్. ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులై 21 వ ఏట న్యాయవాదిగా విశాఖపట్నంలో బోర్డుకట్టారు. కొద్దికాలంలో మద్రాసుకు తరలివచ్చి 1916 వరకూ లాయరుగా ఉంటూ 'గొప్ప'వాడనే కాక మంచివాడని కూడా పేరు గడించారు.

కోటి విద్యలూ కూటికొరకే నన్నారు కాబట్టి, అవసరం అయినా కాపోయినా అన్ని విద్యలూ ప్రయోగించి డబ్బుగడించాలనుకునే తరహా వ్యక్తులజాబితాలో రామేశంగారిపేరు చివరకూడా చేరదు. వకీళ్ళకు డబ్బుమీద సరదా తక్కువ అంటే నవ్విపోయే వారేగాని నమ్మిపోయేవారుండరు. రామేశంగారు న్యాయవాదిగా చాలా సంపాదించారు కాని అందులో అన్యాయంగా కక్షిదారులవద్ద పుచ్చుకొన్నదేమీ లేదు. ఎవరైనా కక్షిదారుడు ఎక్కువ రుసుము ఇస్తే, అందులో న్యాయంగా తనకు రావలసింది పుచ్చుకుని మిగతాది వారికి ఇచ్చి పంపేవారు రామేశంగారు.

1896 నుంచి 1916 దాకా లాయరుగా ఉన్న రామేశంగారు '16 లో ప్లీడరుగా ప్రభుత్వ



న్యాయవాదిగా ఆ తరువాతి నాలుగేళ్ళూ ఆయన చూపిన కార్యదక్షత, వాదనైపుణి, వాదప్రతివాదనలో నిరూపణలో ప్రజ్ఞ అద్వితీయ జ్ఞాపకశక్తి అరుదుగా కనిపిస్తాయి.

1920 లో పిదప రామేశంగారు జస్టిస్ రామేశం అయ్యారు. అక్షరాలా న్యాయమూర్తిగా ఆయన కీర్తి, మద్రాసు ప్రధాన న్యాయమూర్తి శ్రీ పి. వి. రాజమన్నారుగారి వాక్యాలలో "అచంద్రార్కం" ఉండిపోతుంది.

ఈ ప్రజ్ఞ జనబాహుళ్యానికి తెలిసే తరహాది కాకపోవచ్చు గాని, న్యాయపరిపాలనలో సంబంధం ఉన్నవారు, న్యాయనిర్ధారణ శిల్పంలో కష్టసుఖాలు తెలిసినవారు రామేశంగారి పద్ధతి చాలా గొప్పదని చెబుతారు. వాదప్రతివాదవిధులలో లేచే దుమారాలపొరలలోంచి నిజానిజాలబొమ్మబొరుసులు తెలుసుకు నిరూపించడంలో రామేశంగారి సహనమూ, న్యాయశాస్త్ర కర్మకాండలవల్ల నిజం అబద్ధంగా, అబద్ధం నిజంగా మారిపోయే సూచన కనిపిస్తే, ఆ రకం తంతుని, ఆర్భాటాలను అవతలకు నెట్టి ధర్మస్వరూపాన్ని అన్వేషించే ఆయన మానవత, సమకాలిక న్యాయమూర్తుల గౌర

వాభిమానాలకు పాత్రుణ్ణి చేశాయి. విచారణ వేళకు న్యాయపీఠం ఎదుట హాజరు కాలేకపోతే ఏమవుతుందో నని లాయర్లు భయపడుతూ ఉంటారు అలాంటి భయం లేనిది మద్రాసు హైకోర్టు సెకండ్ కోర్టులోనే... అక్కడ రామేశంగారుంటారు. ఆయన మంచివాడు. ఫరవాలేదు. కేసు కొట్టెయ్యడు... సెకండ్ కోర్టులో జస్టిస్ రామేశంగారూ, బెంచీ గుమాస్తా కూర్చుని లాయర్లకోసం ఎదురుచూడడం ఆనాడు జరిగేది!

1935 లో న్యాయమూర్తి పదవి విరమించిన (అలాగా మూడుసార్లు తాత్కాలిక ప్రధాన న్యాయమూర్తిగా ఆయన వ్యవహరించారు.) తరువాత రామేశంగారు రిజర్వుబాంకు మద్రాసుపాలక సంఘంలో సభ్యుడుగా, ఇండియన్ స్కూల్ ఆఫ్ మెడిసిన్ బోర్డు సభ్యుడుగా, కొంతకాలం మద్రాసు రెవెన్యూబోర్డు ప్రథమ సభ్యుడుగా బాధ్యతగల కార్యక్రమాలు నిర్వహించారు.

ఈ పదవులూ బాధ్యతలూ ఎన్ని ఉన్నా గ్రంథపఠనం ఆయన దైనందినియంలో ముఖ్యభాగం. ఎన్నో పుస్తకాలు సేకరించారు. అది ఎవరికి ఇచ్చినా పుచ్చుకున్నా రాసుకునేవారు. మనసులో గుర్తుంచుకునేవారు. '120వ పుట కొంచెం నలిగితే' అది ఆయనకు గుర్తే. ఈ కాలంలోనే ఆయన ఆహార నియమాలమీద, సంతాననిరోధంమీద ఉపన్యాసాలు ఇచ్చి వ్యాసాలు వ్రాసి అనుసరణీయ మార్గాలను ప్రచారం చేశారు. ఆయనకు ఎనమండుగురు కూతుళ్ళూ, ఇద్దరు కొడుకులూ ఉన్నారు. ఈ విషయం ప్రస్తావించి, 'పిల్లలున్నవాడే సంతాన నిరోధం గురించి ప్రచారం చెయ్యాలి. అందులోనే అందచందం ఉన్నా'యని పట్టాభి సీతారామయ్యగారు మొన్న అన్నారు. రామేశంగారు ఆంధ్రదేశ చరిత్రను తేదీలవారీగా ఏర్పరచి 'ఆంధ్రక్రొనాలజీ' అనే మంచి గ్రంథాన్ని వ్రాశారు. సూర్యమండలంలో గ్రహనిరూపణమీద కొన్ని పుస్తకాలు వ్రాశారు. ఆయనకు అన్నీ అభిమాన విషయాలే. అన్నిటి గురించీ చదివి తెలుసుకున్నారు.

అర్థంచేసుకుంటే, చేతనైనవాడి చేతిలో క్లిష్టమైన లెక్కలా చక్కగా విడిపోతుంది జీవితం. వీణమీద స్వరాలలా, పట్టుదారంమీద మంచి ముత్యంలా సాఫీగా సాగిపోతుంది. రామేశంగారి జీవితం చక్కని లెక్కలా, పదో ఎక్కంలా చకచకా సాగిపోయినా, బహుముఖ కార్యకలాపాల కాలవాలమైన ఆయన జీవితం పొడుగునా హారంలో దారంలా ఒకానొక నిరంతర సత్యాన్వేషణ గోచరిస్తుంది. ఈ తపస్సు సత్యాన్వేషణకూ సంగీతారాధనకూ దగ్గిరబంధువైన గణిత శాస్త్రాధ్యయనం రూపేణా సాగింది. ఆయనకి అది అభిమాన శాస్త్రం. ఎప్పుడూ ఏదో ఒక ప్రాబ్లెం పరిశీలిస్తూ పరిష్కరించ ప్రయత్నిస్తూ, పరిష్కరించి అనుభవైకవేద్యమైన ఆ మాధుర్యాన్ని, ఆనందాన్ని అనుభవిస్తూ ఆయన కాలం గడిపారు. 88-వ యేట మరణానికి రెండురోజుల ముందుకూడా ఎంతో శ్రద్ధతో ఓపికతో ఆయన ఒకానొక క్లిష్ట గణిత సమస్యకు సమాధానాన్ని అన్వేషిస్తున్నారంటే, ఆ వ్యక్తి మరణం కాలధర్మం అనిపించుకోదు. ఆయన ఇంకా పది కాలాలు ఉండవలసిన వాడనీ పరిశోధించి తెలుసుకొన్న అంశాలతో గణితశాస్త్రంమీద గొప్ప గ్రంథం వ్రాసి ఉండవలసిన వాడనీ అనిపిస్తుంది.

---

ప్రముఖపత్రికలూ, ప్రఖ్యాతసాహితీపరులూ ప్రశంసించిన

**ఉత్తమ గ్రంథాలు**

1. **సంజప్రణయం:** హాస్యంతో, వ్యంగ్యంతో నిండిన పదికథలూ, గల్పికలు. రచన. పూషా: వెల 0-50న.పై.

2. **పారిజాతం:** కథల సంపుటి. కథకులు: చాగంటి సోమయాజులు; రాచకొండ విశ్వనాథశాస్త్రి; పంతుల శ్రీరామ శాస్త్రి; పురాణం సుబ్రహ్మణ్యశర్మ; బొమ్మిరెడ్డిపల్లి సూర్యారావు; హితశ్రీ; పూషా; అంగర వేంకట కృష్ణారావు; ఇచ్ఛాపురపు జగన్నాథరావు; ఈరంకి వేంకటరావు; పూసపాటి కృష్ణంరాజు వెల రు 1-25 న. పై.

3. **తెరమెరుగులు:** (నాటికల సంపుటి) కుక్కపిల్ల దొరికింది (రావికొండలరావు); దొంగ (పోతుకూచి సాంబశివరావు); తెల్లవారింది (హితశ్రీ); తెరమరుగు నీడలు (కొండముది శ్రీరామచంద్రమూర్తి); త్రిలోక ప్రత్యేకం (అంగర సూర్యారావు). వెల రు 1-50 న. పై.

శోభా ప్రచురణలు, విజయనగరం సిటీ.

# గ్రంథవిమర్శనము

## యజుర్వేదభాష్యము

[తృతీయాధ్యాయము]

అనువాదకులు: ఆచార్యాగ్న్యలు. ప్రతులకు: ఆ శ్వే కేశవార్యశాస్త్రి. 3-5-1003 నారాయణగూడ, హైదరాబాదు, ఆంధ్ర. వెల రెండురూపాయలు.

ఆర్యసమాజప్రవర్తకులు మహర్షి దయానంద సరస్వతి సంస్కృతంలో రచించిన యజుర్వేద భాష్యానికిది ఆంధ్రానువాదము. అనువాదకులీ గ్రంథంలో మూల సంస్కృతభాష్యంకూడా ముద్రించారు.

దయానందసరస్వతి యజుర్వేద మంత్రాలకు పదక్రమము, ప్రతిపదార్థము, అన్వయము రచించి, ఆయా మంత్రాలకు ప్రత్యేకంగా ఋషులను దేవతలను కూడా పేర్కొన్నారు. అంతేకాక ప్రతి పదానికిఛందస్సు,షడ్జాది స్వరాలు కూడా నిర్దేశించారు.

పాశ్చాత్య సంస్కృత విద్వాంసులలో చాలా మంది వైదికమంత్రాలకు, దేవతలకు, సంప్రదాయాలకు కేవలం భౌతికార్థాలే ప్రతిపాదించారు. పురాతనార్యు లాదిమానవులనీ, ప్రాకృతికములయిన మెరుపులు, మేఘాలు పృథివ్యాది పంచభూతాలు మొదలయినవి పరిశీలించి పరమాశ్చర్యమగ్నులై ఆయా వైదిక మంత్రాల రచన కుపక్రమించారనీ వారభిప్రాయపడ్డారు. వారిది కేవలం చారిత్రకపరిణామదృష్టి. నేటిగతితార్కిక భౌతికవాదులు, తదితరులుకూడా ఈ విషయంలో ఇంచుమించుగా ఇదే దృక్పథం అవలంబిస్తున్నారు.

మన సాంప్రదాయికమైన వైదికభాష్య దృష్టి పై దానితో ఏకీభవించదు. ఆయా దేవతలకు భౌతిక స్వరూపాలున్నా వారారూపాల కతీతులనీ, దివ్యులనీ ప్రాచీను లభిప్రాయపడుతున్నారు. ఈ విషయంలో వీరిది ముఖ్యంగా ఆధ్యాత్మిక దృక్పథం.

దయానంద సరస్వతి ఆర్యసమాజప్రవర్తకులని అనుకున్నాము. అందుచేత వారి వేదభాష్యంలో మంత్రాల కక్కడక్కడ ఆ విధమైన దృక్పథం గోచరించడం సహజం. అయితే అంతమాత్రంచేత ఆయనప్రతి వేదమంత్రార్థము తమ ప్రత్యేక దృక్పథాని కనుకూలంగా తారుమారు చేస్తున్నారని భావించనక్కర లేదు. వీరి భాష్యంలో ప్రతిపదార్థ వివరణము చాలా వరకు సాంప్రదాయికమార్గమే అనుసరిస్తున్నది.

ఆంధ్రానువాదకులు మూలంలో ప్రతిపదానికీ తేట తెనుగుమాటలతో వివరణలు, వ్యాఖ్యానాలు రచించారు. వీరి అనువాదం సంస్కృతభాష్యం అర్థం చేసుకోడానికేగాక, వైదికమంత్రాల అవగాహనకుకూడా చాలా సహాయం కలిగిస్తున్నది.

మన సంస్కృత విద్వాంసులలో నే వేదార్థం వివరించగలవారిని వేళ్ళమీద లెక్కపెటవచ్చును. తెనుగులో వేదార్థం వ్యాఖ్యానించే గ్రంథాలు, చాలా స్వల్పంగాను అసమగ్రంగాను ఉన్నాయి ఎవరో ఒకరిద్దరు ఈ విషయమై కొంత ప్రయత్నించారు గాని వారి కృషి కొనసాగటా సాగలేదు.

దయానందుని యజుర్వేద.భాష్యంఅంతా ప్రస్తుత సంపుటంవంటి నలభై సంపుటాలలో పాఠకులకు కందించ తలెనని ప్రకాశకు లాశిస్తున్నారు.

వీరి కృషి తెలుగునాట లుప్తప్రాయమైపోయిన వైదిక విజ్ఞానాభివృద్ధికి చాలావరకు సాహాయ్యకారి కాగలదని ఆశిస్తున్నాను. వైదిక విజ్ఞానాభిమానులు పరిశీలింపదగిన గ్రంథ మిది. 'శాస్త్రి'

## త్రివేణి

[పద్యకావ్య సంపుటి]

ప్రతులకు: శ్రీ గోదా గ్రంథమాల శ్రీమన్నారాయణపురము. ఉలిపాలెం పోస్టు. దివితాలూకా. కృష్ణాజిల్లా. వెల తెలియదు.

దీనిలో మూడు కావ్యాలున్నాయి. మొదటిది శ్రీ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులుగారు రచించిన శ్రీ శఠకోపచరిత్రము. రెండవది శ్రీ తి. వ. సం. జ. తిరువేంకటాచార్యులగారు రచించిన శ్రీ పరాంకుశ శతకము. మూడవది శ్రీ నల్లాన్చక్రవర్తుల వేంకట

# గ్రంథ విమర్శనము

రాఘవాచార్యులుగారు రచించిన 'శఠకోప గీతామృతము.

నమ్మాళ్వారులే శఠకోపనామంతో సుప్రసిద్ధులైనారు. ఆయన చరిత్రమే శఠకోపచారిత్రము. ఈ సంగ్రహకావ్యం రచించిన శ్రీ కృష్ణమాచార్యులుగారి కవితాశైలి ధారాళంగా సాగిపోతున్నది. ఒక్కొక్క చోట వీరి కవనం కథానుగుణమైన ఉదాత్తతతో చక్కని ధోరణిలో సాగిపోతున్నది. మధురకవి, పరాంకుశునికి ప్రణమిల్లి విన్నవించిన ఈ క్రింది ఘట్టం దీనికి తార్కాణం.

'భవదవమందు మ్రగ్గి యెటు
బారుటకున్ గతిలేక కిట్టెపా
టవ మగియున్న మాదృశ జన
ప్రకరమ్ము నను గ్రహింపగా
నవతరణమ్ము గాంచిన మహామహా!
నీ పద పంకజ ద్వయం
బవ్వుదల దాల్చినా దెస కృపా
మృతవర్షణముం బొసగ్గుమా!
'నెట్టన నీగుపదమ్ములు
బట్టితి నాచార్య! యింక పై నిద్ధరణిన్
బుట్టుట గిట్టుట నాపెడి
గుట్టు దెలిసి నన్ను వేలుకోగదె కరుణన్'

ఈ శఠకోపయతీంద్రునికే పరాంకుశులనీ, వకుళభూషణులనీ, ప్రసిద్ధ నామధేయాలేర్పడ్డాయి.

శ్రీ తిరువేంకటాచార్యులుగారు పరాంకుశమునిని సంబోధిస్తూ రచించిన శతకమే పరాంకుశ శతకము. ఈ శతకంలో అక్కడక్కడ కొన్ని పద్యాలలో సహజమైన భక్తిభావము, సూక్తులు, మధురోక్తులు జాలువారుతున్నాయి. కవికిగల ద్రావిడ వేదాభిమానానికీ, వైష్ణవ ప్రపత్తికీ కవితా ధోరణికి ఈ క్రింది పద్యాలు ఉదాహరణంగా ఇవ్వవచ్చును.

'భాషల లోపలన్ ద్రవిడ
భాషయు, దేశికులందు మీరలున్,
శేషశయానుడున్ సురల, జేతను
లందున నిత్యసూరులున్,
దోషములందు భాగవత
దూషణ మెక్కువ యండ్రు దాస
హృత్తోషణ! రమ్య వాగ్విభవ
భూషణతోషణ! శ్రీ పరాంకుశా!

'ద్రావిడ వేదమెల్ల నుదరంబున
దాల్చిన మిమ్ము గర్భమం
దె వనితామతల్లి ధరి
యించెను ఆయమ భాగ్యమెట్టిదో!
దేవనియంత్రమాత, వసు
దేవుని పత్నియు. గోపలాఖ్య ధా
త్రీ వసుపుత్రి యాయమను
దీటుగనందురు శ్రీ పరాంకుశా!'

నమ్మాళ్వారు రచించిన 'తిరువాయ్ మొళి'కి శ్రీ నల్లాన్ చక్రవర్తుల వెంకట రాఘవాచార్యులు గారొక పద్యానువాదం రచించి, అది 1942 లో నే పుస్తకరూపంలో ప్రకటించారు. ఆ గ్రంథంలో కొన్ని పద్యాలేర్చి కూర్చి ప్రస్తుత 'శఠకోప గీతామృతం'లో చేర్చారు. ఒక శఠకోప సూక్తికి వీరి అనువాదం ఇది:

"మతనులార! యాసిగల
సాధనలన్ని తిజేసి కొంచు కొం
తీత ఫలమెంత? దానవ సిద్ధి
యదెంత? యాదన్ని నాళ్లు సం
గతము? గన్న మాళి సుర
కొంతునుతింప, దనంతవారి జే
సి తనిపి జన్మపాశములజించి
స్వకీయపు గోష్ఠి జేకొనున్"

'శాస్త్రి'

## సంగ్రహ కథాసరిత్సాగరము

వేదము వేంకటరాయశాస్త్రి. ప్రకాశకులు: వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్. 4, మల్లికేశ్వర స్వామిగుడి సందు, లింగిసెట్టివీధి. మదరాసు–1 వెల: రూపాయిన్నర.

ఆంధ్ర శాతవాహన చక్రవర్తుల కాలంలో అవతరించి గుణాఢ్యుని పైశాచీప్రాకృత బృహత్కథ భారత భాగవత రామాయణాలవలె సంస్కృత వాఙ్మయాభివృద్ధికే ఒక పెన్నిధి అయింది.

కాని ఆ గ్రంథం మన కిప్పుడు దొరకడంలేదు. అయితే దానికి, మూడు సంస్కృతానువాదాలు మాత్రం లభిస్తున్నాయి. వాటిలో సోమదేవుని కథా

ఉపయోగమైన సరిక్రొత్త పుస్తకములు
వ్యవసాయము – ఇంజనీరింగు, వైద్యము, వగైరా అనేక గ్రంథములు. కేటలాగు ఉచితము. ఇంగ్లీషులో వ్రాయండి.
N. K. Paul & Sons, Post 12202, Calcutta-5.

సరిత్సాగరం బహుళ ప్రచారం పొంది బాగా ప్రసిద్ధికెక్కింది.

దీనికి మహామహోపాధ్యాయ వేదం వెంకటరాయశాస్త్రి 1880 లోనే తెనుగులో ఒక గ్రాంథికానువాదం రచించారు. అదివారి వచనరచనకొక నికషోపలమై తెనుగునాట ప్రసిద్ధి పొందింది. ప్రస్తుత గ్రంథం వారి పౌత్రులయిన వేదం వెంకటరాయశాస్త్రిగారు రచించారు.

దక్షిణభాషా పుస్తక ప్రచురణసంస్థ వారి సాహాయ్యంతో వీరే ఇది ప్రచురించారు.

తమ తాతగారి గ్రంథంలోని గాథలే స్వీకరించి ఆయా ఘట్టాలలో ఉన్న వర్ణనలు మొదలైనవి తగ్గించి తామీ సంగ్రహ కథాసరిత్సాగరం సంతరించామని రచయిత తెలియజేస్తున్నారు. మూలసంస్కృతగ్రంథంలో ఒక మహాగాథలోనే అనేక కథలిమిడిఉంటాయి. అందుచేత ఇటువంటి చిన్నపుస్తకంలో ఇవి కేవలం స్వతంత్ర కథలుగా రూపొందించడం తప్పనిసరి. ఇందుచేత వీటి సహజస్వరూపానికేవిధంగానూ లోపం కలుగకపోవచ్చును. కాని పాఠకుల కవి స్వతంత్ర కథలవలె స్ఫురిస్తాయి.

దక్షిణభాషా పుస్తక ప్రచురణ సంస్థవారు తమ గ్రంథాలు అక్షరాస్యులైన సామాన్యప్రజల కందియవలెనని సంకల్పించారు. అయితే రచయిత కథాకథనానికి మూలగ్రంథంలోని గ్రాంథిక భాషే ఎన్నుకొన్నారు. చదువుకోవడానికిది సరళంగానే సాగిపోతున్నది.

కాని వ్యావహారికంలో ఈ రచనసాగి ఉంటే స్వతంత్ర కథాగుచ్ఛంగా రూపొందిన ఈ చిన్నపుస్తకం పాఠకులందరికీ ఇంకా అందుబాటులోకి వచ్చిఉండేది.

ముఖచిత్రము పుస్తక స్వరూపము చక్కగా ఉన్నాయి. దీని ప్రకటనకు తోడ్పడిన దక్షిణభాషా పుస్తక ప్రచురణ సంస్థ అధికారులభినందనీయులు. మన ప్రాచీన భారతీయ కథా సాహిత్య ప్రచురణకు వీరితోధికంగా తోడ్పడగలరని ఆశిస్తున్నాను.

'శాస్త్రి.'


## భారతి సచిత్ర మాసపత్రిక

### ప్రకటన రేట్లు

| కవరు పేజీలు | కాజువల్ | కంట్రాక్టు |
|---|---|---|
| 4 వ కవరు పేజీ | | |
| 2 లేక 3 రంగులు | రు. 125/- | రు. 100/- |
| 2 లేక 3 వ కవరు పేజీ | | |
| ఒకే (నలుపు) రంగు | 90/- | 75/- |
| లోపలి పేజీలు | | |
| పూర్తి పేజీ | 70/- | 60/- |
| అర్ధ పేజీ | 35/- | 30/- |
| పావు పేజీ | 20/- | 15/- |

ప్రత్యేక స్థానములకు 25% అదనం.

సం॥నకు వరుసగా 12 ప్రకటనలు చేయువారికే కాంట్రాక్టు రేటు వర్తించును.

* కవులు, కళాకారులు, రచయితలు మొదలైనవారి ప్రకటనలు ఒక కాలం ఇంచికి తేపకు రు. 2/- చొప్పున ప్రకటించబడును.

మేనేజరు, భారతి,
మద్రాసు-1.


## గ్రంథ స్వీకారం

### బొమ్మలుచెప్పిన భూగోళం

రచన: శ్రీశైలం. భవానీ పబ్లిషింగ్ హౌస్, విజయవాడ. వెల: 75 నయాపైసలు.

### జనవాక్యం

వల్లభనేని కాశీవిశ్వనాథం. ప్రతులకు: రచయిత మెయిన్‌రోడ్. పవరుపేట, ఏలూరు, పశ్చిమగోదావరి జిల్లా. అమూల్యము.

### చిక్కుల గుర్రమునకు కక్కుల కళ్ళెము.

శ్రీ పి. యస్. ఆచార్య. ప్రకాశకులు: సత్సాహిత సంఘము. కుందేరు. కృష్ణాజిల్లా. వెల: 25 నయాపైసలు.

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad.

రు. 1.50 - రు. 2.00

దీపావళి కానుకలుగా మీ స్నేహితులకు, బంధువులకు గ్రంథాలను బహూకరించి, ప్రతి యింటిలోను ఒక గ్రంథాలయం వెలయడానికి, చౌకగా గ్రంథాలు వెలువడడానికి దోహదం కల్పించండి.

రు. 2.75 రు. 1.50 రు. 1.50

సిద్ధార్థ

కథామంజరి

రు. 1.00

ప్రాచీన కావ్యమంజరి

నేడే ఒకటి కొనండి -
రోజూ పుస్తకాలు చదువండి

రు. 2.00 రు. 4.50

రు. 1.50 రు. 1.50 రు. 2.50

మంచి పుస్తకములు, మీరు మామూలుగా కొను పుస్తక వ్యాపారివద్ద ఈ శ్రేష్టమైన పుస్తకములను కొనండి, లేనియెడల మాకు వ్రాయండి:

# సదరన్ లాంగ్వేజస్ బుక్ ట్రస్ట్

3, పీట్ క్రాఫ్ట్ రోడ్, మద్రాసు-31.

పై పుస్తకములు అన్నీ అనేక ప్రత్యేక ప్రచురణకర్తలచే. లాభకాంక్షలేని సదరన్ లాంగ్వేజస్ బుక్ ట్రస్టు వారి ఆధ్వర్యాన ప్రచురించబడినవి.

## త్వరలో వెలువడుతున్నవి!

సుబ్బన్న

పిసినిగొట్టు

నాలుగు నాటికలు

రు. 1.25 - రు. 1.00 -

# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

డిసెంబరు 1958

సంపుటము 35 : : సంచిక 12

విడిపత్రిక వెల ఒక రూపాయి




# విల్సన్ 'అమర్'

పెన్ను యొక్క పాళీకి
మీరు గర్వపడతారు!

- అసలైన ఓస్మి-ఇరిడియమ్-టిప్పుడు గోల్డ్ ప్లేటెడ్ పాళీ అన్ని రకముల కాగితముల మీద మెత్తగా, బాగుగా వ్రాస్తుంది
- ఈ పాళీతో 5 సంవత్సరముల గ్యారంటీ కలదు
- సొగసైన ఆకారము, అందమైన రంగులు గల యీ పెన్నులు అందరికీ నచ్చుతాయి
- పెన్నులో ఎక్కువ సిరా పోయవచ్చును
- సరసమైన ధర — రు 7.75 మాత్రమే

ఇతర మోడలు పెన్నులు
రు 3.75 నుండి
రు 20.00 వరకు
ధరలలో లభిస్తున్నాయి

బంగారు పాళీగల పెన్నులు మరియు కానుకగా యిచ్చుటకు దివ్యముగా ఉండే పెన్ను మరియు పెన్సిలు సెట్టులు కలవు.

పాడవుటకు
వీలులేని
పాళీతో

అన్ని చోట్ల లభిస్తున్నాయి

**కిరణ్ అండ్ కంపెనీ**

బొంబాయి • మద్రాసు • కలకత్తా • ఢిల్లీ

## విల్సన్ పెన్నును కొనండి—సంతృప్తి పొందండి

KC 58-3A TEL EVEREST

# భారతి ముప్పదిఅయిదవ సంపుటము

## అకారాది విషయ సూచిక

# విషయానుక్రమణిక

## డిసెంబరు 1958

# అమృతపాతము

**శ్రీ దాశరథి**

మరల మాయింటి మల్లియ మాటునుండి
చందమామ కన్పించె, మిళింద బృంద
మావహించిన చెంగల్వ అంబుజాక
రాంబువులనుండి తలయెత్తినట్లు— నేడు.

అతడు తొంగిచూచినపుడెల్ల అమృతపా
తమ్ము జరుగు, యౌవనమ్ము పెరుగు
కలతలెల్ల తరుగు, కవితా సరస్వతీ
మృదు పదాలు నాల్కమీద తిరుగు.

అతడు నా చిన్ననాడు దయాపయోధి,
నేడు కఠినునివోలె కన్పించినాడు,
నాడు నావెంట ఆడుకొన్నాడు వాడు,
నేడు మిన్నెక్కి కూర్చుండినాడు—రాడు.

భీతిలేనివాడు, ఖ్యాతికోరనివాడు
ఆకసమ్మునుండి దూకె మున్న
తనువుతనువదెల్ల వ్రణములైపోయెను,
మానలేదు నేటికైనగాని

బాధలోనకూడ, పలుకడు, ఉలుకడు
మరల దూకుమాట మరచి పోడు,
వాని తెగువజూడ భయమౌను, ప్రియమౌను
ప్రాణభీతిలేని ప్రాణివాడు.

వాడు నన్ను విడచి పరువెత్తు ననుమాట
కలలలోన గూడ తలపలేదు
దూర తీరమందు తారా సతీమణి
పిలచినంత పరుగువెట్టినాడు.

నన్ను విడచిపోయె మన్ను విడచిపోయె
మన్నులోని అసలు తన్ను విడచె
తారచూపువలని తనువెల్ల కాంతింప
మన్నులోన లేని మహిమనందె.

ఒడలినిండ వ్రణము లుండియు తారకా
బాహు బంధనమ్మువలన వాడు
కాంతిమంతు డయ్యె కాంచన కేతకీ
భ్రాంతి గొలుపుమేని పసిమితోడ.

వాని వలని రాత్రి వయసు వచ్చినదయ్యె,
ఇరుల ముసుగులను హరించె నతడు,
వాని బుజముజారి ప్రాకె వెన్నెల వల్వ
నగ్నమైన నభము నడుము చుట్టు.

ఒక్కనాడు కూడ నొరుల బాధింపని
కరుణగలుగు నేస్తకాడు వాడు
నేడు పెచ్చుపెరిగి ఏడులోకమ్ముల
కౌముదీ మహాగ్ని గాల్చినాడు.

వాడు నన్నుగూడ వదలడు, పసినాటి
బాంధవమ్ము దూర పరచినాడు,
గుండె పగిలిపోయి కూర్చున్న నామీద
రేయి యెండ క్రుమ్మరించినాడు.

నేను వానిమీద బాణమేయగబోవ
తార కొప్పులోన తాను డాగు,
ఆమె కొప్పు కేమి యాపద గలుగునో
యనుచు దించినాడ నంబకమ్ము

ఆమె కొప్పులోన అతడు చేమంతిపై
అందగించుటే ప్రియమ్మునాకు
ఆత డామెగలసి యసితాంబుదమ్ముల
నవలద్రోయుటే జయమ్మునాకు

తనువుగాల్చునట్టి ఇనునకు వెరతుము,
మనసుగాల్చు చందమామప్రియము,
మనసు కాలినపుడె జనియించు నవకళా
దివ్యలోకమందు దీప్తిరేఖ

గాయపడిన గుండె కనిపించు చంద్రుడై
దేహమనెడు గగన దేశమందు,
గుండెలోన నుండి కురియు జ్యోత్స్నవృష్టి
నవ్యకావ్య దివ్య నదమునందు

ఇట్లు తలపోయుచున్న నన్నెట్లు చూచె
నేమొ చంద్రుడు— భువికి లంఘింపజొచ్చె
గాయపడు నేమొ యనుభీతి కందువాను
రెండు చేతులవిచ్చి నిల్చుండి నాను

భిక్షుకుని కరాల ప్రియురాలు విసరిన
హృదయ కబళమునకు ఉదహరింప
చందమామ తాను చనుదెంచి నాజోలె
వ్రాలినాడు— పట్టె జాలివాడు.

ఒడలెల్ల వెన్నెలలతో
తడియగ ననుకౌగిలించి, తా తెచ్చిన పూ
తొడవులిడి నాకు, ప్రేముడి
కడలి వలెన్ పొంగ, గుండె కదలగ పలికెన్

"చిరకాల మిట్లు నిను విడి,
ధరణిని విడనాడి గగన తలమున నిలువన్
దురితము వాటిల్లె సుహృ
ద్వర! మన్నించెదవో లేక దండించెదవో
నీతోనే నివసించెద
నీతో నీ మృత్తికా పునీతస్థలిలో

చేతః ప్రీతిగ నాడెద,
గీతములను వ్రాయుటందు కేలుగలిపెదన్
మనుజుడు పంపెడి కృత్రిమ
వనచారులతోడ గగన భాగము నిండెన్,
నను గాంచు వారలెవ్వరు
కనరారిక — నాకు దివిని కాపురమేలా!

నాపైదాడి యొనర్చ జూచెదరు
బాణవ్రాతముల్ చిమ్మి — జ్యో
త్స్నా పల్యంక శయానుపై అనలమున్
సారింతురే? చంద్రికా
దీపజ్వాలిక నార్చ జూచెదరు
గాదే వీరు — తారాసతీ
శ్రీ పాణిగ్రహణమ్ము చేయుటకు
చేరెన్ కృత్రిమేందుచ్ఛటల్

నాపని మైపోయిన దిక
ఆపై సూర్యునికి గూడ ఆపద వచ్చున్,
రేపో మాపో దివిపై
కాపురముండెదరు మనుజగణములు మిత్రా!

భువినుండి పైకి వెడలితి
భువికే అరుదెంచినాడ — పోనిక తారా
నవిధమున — కనెను చంద్రుడు
చివుక్కుమనె నామనస్సు, చింతించితి నే—

చంద్రునికోసమై వెతలు సైచె,
తపోనిధి యైన వృద్ధ మా
నీంద్రుని వీడె, నిందల నవెన్నొ
భరించె, నభో విసీల శై
లేంద్రమునన్ గృహమ్ము రచియించి
క్షయజ్వర బాధితాబ్జు ని
స్తంద్రత గొల్చుచుండునది
తారక! ఆయమ కర్మమేమగున్

# అమృత పాతము

ఆయమ వీడి వచ్చిన మహో
దురితాత్ముని చంద్రు కొట్టగా
బోయితిగాని శాంతిగొని,
పొంగెడి దుఃఖముతోడ మల్లికా
ఛాయల కూరుచుండి సరసమ్ముగ
—వానిని తార చెంతకుం
బోయెడి నట్లుచేయుటకు
బూనితి — నిట్లని విన్నవించితిన్

"ఒకడు వచ్చి వ్రాలె, ఒక్కడు మరికూలె
ఒకడులేచి లేచుచుండి వ్రేలె,
ఒకడు తిరుగుచుండె నికరేపొ యెల్లుండో
కూలనుండె — బ్రతుక జాలకుండె

కాంతిలేని లోహ కంజారులను జూచి
చింతచెంది భూమిజేరదగునె,
వానినెల్ల తార వలచునే యెంతైన—
గుండెలేనివాని గోరునెట్లు ?

హృదయ మెల్ల అమృతనదిగా స్రవించెడి
నిన్నుబోలగలవె ఇన్ని శశులు
తారకా భుజాగ్ర తపనీయ చేలమ్ము
నందుకొనునె కృత్రిమేందు గణము.

ఈయజాండాకృతికి సూర్యుడిందు డనెడి
రెండు కన్నులు వెల్గొందుచుండు నెపుడు,
ఒకటి భువినెల్ల నిప్పుల నుప్పళింప,
నొకటికప్పురమున దేల్చు నుప్పరంబు.

నీవు వ్రాలెదేని దేవుని కొక కన్నె
కానబడును—దానకలదు మంట :
దయను గూర్చునట్టి ప్రియనేత్రమే లేక
అతడు ప్రాణికోటి నాత్రపరచు.

చల్లనయ్యావు నీవుంట నెల్లజనులు
మందువేసంగి భరియించుచుండి నారు
పగటియెండను రేయెండ వలనిగెలిచి
ప్రేయసీప్రియు లెట్లో జీవించువారు.

హృదయమ వీవు మాఁకు, మధురించెడి
కోర్కెలకొండమీద నీ
వుదయము కాగనే బ్రదుకు లూయెల
లూగును—శాంతి చంద్రికా
స్పదమగునీ నవాననము
ప్రాణులకుఁ బ్రణయప్రకోపన
ప్రదము, నభోవిటంకమును
ప్రాకి మముఁ సుఖియింపజేయవే ?

ఒక్కపక్షము మాపక్షముండినీవు
మా వెతలుజూచి కృశియించి పోవగలవు,
ఒక్కపక్షమ్మొరుల పక్షముండి వారి
పోడిమిని గాంచి ఉప్పొంగి పోవగలవు.

నలువే అందముగా వరించిన
అనంతవ్యోమకాంతామణీ
విలసద్దివ్య ముఖమ్మునందు సొగసుల్
బింబించు గోరోచనా
తిలకంబీవు—తమః ప్రపంచమునకుఁ
దీపంబ వీ వస్మదా
దులకుఁ దగ్గరివాడవెందుల కిటుల్
దుఃఖించుటల్ చంద్రమా !

ఉచ్చపదవినొంది యున్న నిఁ దరిసించి
క్రిందినుండి మెచ్చుకొందు నేను,
అద్దమందు వెలుగు ముద్దుల ముఖబింబ
మనలు ముఖముజూచి యలరినట్లు"

అతడు నాదు వినతి నంగీకరించెను,
ప్రాణికోటి సౌఖ్యవార్ధి దేలె.
కృత్రిమేందువులకు రీఘాకరమ్మయి
తరుణ చంద్రమూర్తి తారజేరె!

# శబ్దవిన్యాసవైచిత్రి

శ్రీ చిరుమామిళ్ల శివరామ కృష్ణప్రసాద్

వ్యాకరణ శిక్షితమైన మాట, శబ్దము, అని పెద్దలు నిర్వచించియున్నారు. విన్యాస మనగా రచన. కాబట్టి, వీను మిగిలిన కవులు తమ కావ్యనిర్మాణంలో శబ్దసంపదను వివిధంగా వినియోగించి, 'తేటతేనియ యూట తెనుగుమాట' అనే ప్రతిష్ఠను మన భాషకు తీసుకొనివచ్చినారో, స్థాలీపులాక న్యాయంగా మాత్రమే మన మిప్పుడు పరామర్శింపవలసియున్నది.

శబ్దము కావ్యానికి పునాదిరాయివంటిది. పైమెఱుగు లెన్ని చేసినప్పటికి, కనువిందు గూర్చే విధంగా నిర్మాణంలో ఎంత పనితనము చూపించినను, పునాది సరిగా లేకున్న, ఎంతటి రమ్యహర్మ్యమైనను కాలపురుషుని దండాభిఘాతములకు, నేలమట్టము కాగలదు. కథలో ఎంతటి అందచందము లున్నప్పటికి శబ్దసంపద కొఱవడియున్నచో, ఆ రచన రాణింపదు. విస్మృతి వారాశిలో, ఆ గ్రంథము, త్వరలోనే కలసిపోగలదు. కావున శబ్దవిన్యాసము కవిత్వమునకు జీవగఱ్ఱ. ఒక కవియొక్క ప్రతిభావ్యుత్పత్తులను తెలిసికొనుటకు కావ్యమును సంపూర్ణముగ పఠింపవలసిన పని లేదు. కొన్ని పద్యములను ముఖ్యముగ, కథావస్తువునందలి విలువగల సన్నివేశములయందు చదివిచూచినచో కవియొక్క ప్రతిభ మనకు సులభముగ తెలియు నవకాశము లభించును. ఒక్కొక్క పద్యమునందు, ఒక్కొక్క సమయమున సత్కవి గావించు శబ్దప్రయోగము, మనకు తన్మయత్వమును గల్పించును. ఒక శబ్దమునందు లేదా శబ్దద్వయమునందు, కవిభావమును నిక్షేపించి. ఎన్నియో పంక్తులలో వ్రాయవలసియుండు విషయమును. కొలది శబ్దములతో పూర్తియొనరించుటయు గలదు. మహాకవి ఏదో ఒక అర్థమును సాధించుటకే, ఒక శబ్దమును వింత సన్నివేశములందు సమకూర్చును. ఆశబ్దము వ్యర్థపదముగ, పద్యతూకమునకు వాడిన "పడికట్టు రాయిగ' మనకు గన్పించును, కాని కొంచె మోపికతో పరిశీలించినచో, ఒక విషయమును సాధించుటకు, ఒక యర్థము నుద్భవింపజేయుటకు, పద్యగమనమునందొక కులుకుందనము నాపాదించుటకు, ఆ శబ్దము నా స్థలమునందు, కవి సమకూర్చెనని మనము తెలిసికొని యాశ్చర్యమును పొందగలము. పద్యములందలి శబ్దప్రయోగములను బట్టియే మనము కవియొక్క 'సత్తా'ను గ్రహింపగలుచున్నాము. ఒక విషయమును, పద్యముతో నక్షరాస్య లోకమునకు తెలియజెప్పినంత మాత్రమున నాతడు కవి కానేరడు. విషయమే, తెలియవలయుననిన, వచనము లేదా. పద్యమేల కావలయును? భాషయందలి సౌందర్యమును విశదబరచుచు, భావమున కనువగు విధమున శబ్దములను కళాకాంతులతో చికిలీ చేయగా, అవకాశము పద్యరచనమునందున్నట్లు, వచన రచనమున లేదు. అందులకే, పద్యరచనమునందు శబ్దవిన్యాసమున కంతటి ప్రాముఖ్యము కుదిరినది. "ఎవ్వనిచే జనించు జగమెవ్వనిలోపలనుండు లీనమై..." అను పద్యము నెఱుగని యాంధ్రాక్షరాస్యుడుండడు. కాని ఆ పద్యమునందలి భావము నే వచనమున పోతన రచియించియుండినచో, ఆ వచన రచన కింతటి ప్రాశస్త్యము తెలుగు నేలయందు కలిగియుండెడిది కాదు!

ఒక కావ్యమునందు కవి బ్రతికియుండుటను సూచించునది, శబ్దసందోహము; అనగా పద్యరచనావిధానమును గుర్తించి, ఒక కావ్యము ఫలితకళను చెందినదా? లేక, లలితకళను చెందినదా? అని నిర్ణయింపవచ్చును. ఒకరిని అలరించుటకు, ఒక విషయమును, లేదా, ఒక బహుమానమును సాధించుటకు వ్రాయబడు కావ్యము ఫలితకళకు చెందినది. కవి, ఒక ఫలము నపేక్షించి కలము నడపుచున్నాడు, అందుచే నాతడా కావ్యమున బ్రతికియుండడు; కథ యుండవచ్చును. అలంకారము లుండవచ్చును, కాని కవియొక్క హృదయ 'స్పందము' మనకా కావ్యమున వినిపించదు. తన హృదయమున కానందమును గల్గించి, తనయందు దాగియున్న భావములను వెలువరించుట కుత్సాహమును గూర్పువస్తు సందర్శనము వలన లేదా, వితతీకృతమైన

# శబ్దవిన్యాస వైచిత్రి

విషయ సందోహము వలన కలిగిన భావోన్మాదమున తన్నుదా నలరించుకొనుటకు, తనతోపాటు కలిసి వచ్చు లోకము నలరించుటకు, వ్రాయబడిన కావ్యము లలితకళ కాస్పదమైయుండును. ఇందు కవి బ్రతికి యుండును. కవియొక్క వ్యక్తిత్వము, మనకిందు యథాతథముగ ప్రత్యక్షమగును. శబ్ద విన్యాసమును ఇట్టి కావ్యములయందు పరిశీలించి, ఆ కావ్య మే కవిచే వ్రాయబడినది మనము పేరు చూడకయే చెప్ప వచ్చును. పద్యమును చదివి, ఆపద్య మే కవిచే రచియింప బడినది, చెప్పుటయందు గొప్పదనమును మన మాపా దించుకొనవలసిన పనిలేదు! ఆ ప్రతిష్ఠ కవికి చెంద వలయును. ఎందుచేత? తన ప్రతిభచే, ఒక విశిష్టమైన శబ్ద విన్యాసము నాతడు తన వశమొనరించుకొని, తన కవిత్వమున తన వ్యక్తిత్వముద్రను, ఆపాదింపజేసికొన గల్గుటచేత. సమకాలికులగు, శ్రీనాథుడు, పోతనల కవిత్వముల యందీ వ్యక్తిత్వముద్ర ఎంత విస్పష్టముగ కానవచ్చుచున్నదో వివరింపవలసిన పనిలేదు. ఈ విశిష్టత కవిత్వమున, నలవరచుకొనుటకు కవి, సంపూర్ణముగ శబ్ద సంపదను, సన్నివేశము ననుసరించి శబ్ద ప్రయోగమును చేయజాలు ప్రతిభను, కలిగియుండ వలయును. పద్యరచనకు ప్రారంభించి నంతనే, భావమున కన్న, మిన్నగ శబ్ద సందోహము కవియొక్క యూహాప్రపంచమున ప్రదర్శితము కావలయును. తన యాలోచనమునకు వచ్చిన భావమును, అక్షర రూపమున వెలువరించుటకు వలయు శబ్దములను, కవి తన యందున్న కళాప్రతిభల సహాయమున నిర్ణయించు కొని, పద్యమును రచియించినప్పుడే, అందు తాను బ్రతికియుండి పరువము చెడని భావమును పాఠకున కందించి ప్రశంసల నందగలడు.

శబ్ద సంపదను వశ మొనరించుకొనుట యనగా ఎప్పుడును గండ్లు గుండ్లుగల బాటను బండ్లు నడచి నట్లుండు శబ్దములనే, ప్రయోగించుట లేదా, పేలవములు, కేవలము తూకమునకై ప్రయో గించిన వ్యర్థపదములతో పద్యములను పూరించుట, మొదలగు నలవాట్లు కానేరదు. సమయమున కనుకూల ముగ భావబంధురము, భాషాసౌందర్యవిలసితము లైన శబ్దవిన్యాసమే ఆదరణపాత్రమై యుండును. అతి క్లిష్టముగ నిప్పుడు ప్రాచీనాంధ్రకవులయందు ఆధుని కాంధ్రకవులయందు ఈ శబ్దవిన్యాసము రచనాశిల్పమున కెంతవరకు సాయ మొనరించినదో పరిశీలింతము.

ప్రాచీనకవులయందు వలె నేటి కవులయందును, వ్యక్తి త్వమును తమరచనావిధానమునందు ప్రదర్శించి ఒక ప్రత్యేకతను పద్యరచనమునందు గొనివచ్చినవారు లేక పోలేదు:

ఒక విషయమును వర్ణించునపుడు ఆవిషయమునం దున్న మృదుత్వమును, సౌందర్యమును, ఇతర బాహి రిక స్వరూపమును, శబ్దగతార్థమునుబట్టియే గాక ప్రయో గింపబడు శబ్దములనుబట్టి, అనగా నిర్ణయింపబడి ఒకదాని వెంట నొకటి కూర్చబడిన మాటల గమనమునుబట్టి స్ఫురింపజేయుట ఒక రచనా వైదగ్ధ్యమునకు చిహ్నము.

"లలితకలాపి కోమల కలాప
కలాప కలాపలాప చే
శల మృదుకేశ మంజరులు,
సన్నపుగొల్లను జిక్కగాపి చెం
గలువలు జాజులుం గలయ
గమ్మని పువ్వులసేసకొప్పు దా
పలి కొరగంగబెట్టె నొక భామిని
నైషధభూమి భర్తకున్."

పెండ్లికొమరుని గాంచి అలంకరించు సందర్భ మున నలుని మృదుకేశమంజరులను కవి సార్వభౌము డుపమానపూర్వకముగ వర్ణించుటకు నిర్ణయించిన తొలి పాదమునందలి శబ్దసందోహము శిరోజములకువలె నె మృదుత్వమునువహించి, నడకయందు నొక్కులు నొక్కులుగనుండి ఒక వింతభావనాచిత్రమును పాఠ కునియందు స్ఫురింపజేయుచున్నవి. ఇక శబ్దగతార్థము పైన పొడమిన స్ఫురణమును బలపరచుచు భావమునకు జీవమును కూర్చుచున్నది. ఇచట శబ్దములు ఒక యర్థము నేకాదు పాఠకున కొక యనుభూతినికూడ సంతరించిపెట్టుచున్నవి. శబ్దములయొక్క యీగౌరవ మును, ఉలుకుందనమును గుర్తించిన కవియే ఇట్టి రచన చేయగలడు.

ఒక కథను వర్ణించునపుడు కొన్ని శబ్దములను, కవి, కొన్ని స్థలములయందు సమకూర్చి ఒకయప్రస్తుత విషయమును ప్రస్తావనమునకుగొనివచ్చినటుగ గన్పట్టును. పరిశీలనా పాటవము లేని పాఠకుడు, ఆ శబ్దములకు వలయు విలువ నొసంగక, కథాగమనమునందే దృష్టిని నిలిపి, తొలగిపోవును. సమర్థుడగు కవి, యప్రస్తుత విషయ ప్రసక్తి నెన్నటికిని చేయడు. కొన్ని శబ్దము

లను రానున్న విషయముయొక్క ఛాయలను స్ఫురింప చేయుటకు సంతరించి ప్రయోగించును.

"............మందారవనాంతరామృత సరః ప్రాంతేందుకాంతోపలోత్పల పర్యంకరమావినోది యగు నాపన్న ప్రసన్నుండు......" అని, వైకుంఠ పురములో, నగరిలో, పూలపాన్పుపై, రమాదేవితో వినోదము లాడుచుండిన శ్రీ మహావిష్ణువును "ఆపన్న ప్రసన్నుండు" అని ఆ సమయమున వర్ణించుట, అప్రస్తుత మని తోచుట కవకాశ మున్నది. కాని వెంటనే, "...విహ్వల నాగేంద్రము పాహిపాహి యన కుయ్యాలించి, సంరంభియై" అను శబ్దసందోహము, లోచనగోచరము కాగానే, 'సరంభియై' అను శబ్దము నకు, ఆ తరువాత వచ్చు "సిరికిం జెప్పడు శంఖచక్ర యుగమున్ చేదోయి సంధింపడు..." అను పద్యము నకును, "ఆపన్న ప్రసన్నుండు" అను శబ్దద్వయ మెంత అర్థపుష్టిని, ఔచిత్యమును, గొనివచ్చినదో గుర్తింప వలసియున్నది.

కథయం దున్మీలనము కావలసియున్న రసము ననుసరించి నిర్ణయించుకొనుశబ్దములే, కవియొక్క ప్రతిభకు నిదర్శనములు. ఒకింత, చులకనతనమును, ప్రచ్ఛన్నమగు వెడగుదనమును, ప్రదర్శింపవలసిన సంభాషణమును, నరకాసురునకు, ఊర్వశికిని, మధ్య నేర్పుమీద నడిపిన, నాచన సోమన్న ప్రతిభ, కొలది యిడరానిది. ఇట్టి సన్నివేశమునందె కవియొక్క శబ్దసంపద బయల్పడునది : ఇచ్చట శ్లేష ధ్వని ప్రధానములైన శబ్దములతో, సాధారణ సంభాషణమునందే ఉపాయవంతురాలగు నూర్వశి ని, మూర్ఖుడు, మదోన్మత్తుడగు నరకుని, చిత్రింపవలసి యున్నది. ఈ సంభాషణమును విపులముగ బరా మర్శించుట కిది యదనుగాదు. అందుకే, ఇందు సోమన్న చూపిన శబ్ద విన్యాసమును క్లప్తముగ వర్ణించు చున్నాడను. "ప్రోలు దొలంగి తేమిటికి బొత్తుల దానవు నీవు తొయ్యలీ!" అని నరకు డూర్వశిని ప్రశ్నించి నాడు; ఆమె, "చతురవచోవిలాసగుణసాగర!" అని నరకుని ప్రశంసించి, తనయుపన్యాసమును ప్రారం భించుచున్నది. ఇందలి యౌచిత్యమును రసజ్ఞులు గ్రహించు టతిసులభము. ఈ పట్టునందు, సోమన్న ప్రయోగించిన, 'నాడికారి తనము', 'మిండతికంబు చేత,' 'కొలువు మానిని', 'సంతె నెన్నడో జవ్వన మమ్మ కొన్న గడసాని,' 'భావజ సౌఖ్యవ్యాజ పదరాజు', మొదలగు శబ్దములు. ఆయా సన్నివేశముల యందు, లలితములు, స్వభావ సిద్ధములు, పాత్రల మన స్తత్వ జ్యోతకములు, అగు భావములను వెలార్చి, ప్రతిభా సమన్వితు డగు కవిప్రోల, శబ్దము లెట్లు లొంగి పోవునో తెలసికొనుట కవకాశమును సంతరించి పెట్టు చున్నవి. సాధారణభావములను వెలువరించుట యందును, ఒకవింత యొయ్యారమును ప్రజ్ఞావంతుడగు కవి ప్రదర్శించును. స్త్రీ వర్ణనమునందు, శాతో దరిగా ఒక యందగతెనుగూర్చి వ్రాయు టాచారము; అదే భావమున కొక కులుకుందనము నాపాదింపజేసి, 'అస్తి నాస్తి విచికిత్సాహేతు శాతోదరిన్' అని, శ్రీనాథు డొక యొయ్యారమును భావమునం దిమిడ్చి తనశబ్ద విన్యాస చాతుర్యమును ప్రకటించియున్నాడు. సాధారణ భావములే; సాధారణశబ్దములే; కాని వాని కూడికను, సన్నివేశమున కనుగుణముగ, రసోదంచిత మొనరించుటయందే యున్నది, కవియొక్క ప్రతిభా విశేషము!

పద్యరచనమునందు శబ్దములతో గారడి చేయు కవు లున్నారు. అది వారి శబ్దవిన్యాస దక్షతకు తార్కా ణము కాజాలదు. అట, శబ్దముల విరుపులవలన నొక క్రొత్త యర్థ మాపాదింప బడవచ్చునుగాని, ఆ యర్థము గాని, ఆ శబ్దముగాని భావ సౌందర్యమునకు దోహదము చేయ నేరదు. కవియొక్క శబ్దసంయోగ శక్తికి మాత్ర మది తార్కాణము కాగలదు. అర్థసౌష్ఠవములేని శబ్ద సంయోగ మెందుకు? సౌరభములేని పూలు, అర్థసౌష్ఠ వములేని శబ్ద సందోహము, నిరుపయోగములు. అర్థము లేని శబ్దముండునా? ఉండ నేరదు; కాని, ఆయా సన్నివేశమునుబట్టి, ఆ సమయమున, ఆ స్థలమునందు శబ్దమర్థ రహితమై, నిస్సారమై, వ్యర్థమై గన్పట్టు నవ కాశము లనల్పముగ నున్నవి!

"అరచంప మాము నేలిన
దొరగా నెన్నుదురు నెన్నుదురు బిత్తరికిన్,
బరువంపు మొల్ల మొగ్గల
దొరగా బల్కుదురు బల్కుదురు జవ్వనికిన్."

అను, కందమునందు, నెన్నుదురు, నెన్నుదురు, అను స్థలమునందును, పల్కుదురు బల్కుదురు, అను స్థలమునందును, కొంచెము విరుపుతో, కొలది యొయ్యారమును శబ్దవిన్యాసమునందు జూపినాడు,

# శబ్దవిన్యాస వైచిత్రి

చేమకూర వెంకన్న; కాని యదేవిధమున కావ్యము నంతయు నడుపబోయి:

"సహకారాళి పదమ్మజూడ గ
వయస్యా హాళి వాటిల్లెడున్,
సహకారాళి పదమ్మజూడగ
వయస్యా హాళి యగా నేకదా !

అను పద్యమునందు, చివరపాదమునకు వలయు నర్థపుష్టిని గూర్ప నేరక పోయినాడు. అచ్చట కొన్ని శబ్దము లర్థశూన్యములు కావలసివచ్చినవి. ఇందు, కేవల మతడు సాధించినది, వీనులకు విందుగూర్చు శబ్ద సంయోగమును మాత్రమే, అర్థగౌరవమునకు ప్రాముఖ్యము నొసంగియుండ లేదు

పద్యపాదము నందలి యర్థముతో బాటు, ఆ పద్యమునందు సమకూర్పబడుశబ్దములందును, ఒకవిధమైనశైలి, గన్పట్టవలయును. ఆ శబ్దముల యుచ్చారణమున సమయానుకూలముగ నుత్సాహమో, యుద్రేకమో. పాఠకుని హృదయమున పొడసూపవలయును. అర్థసంపదను మరువక, తానాసమయమున నిర్ణయించుకొను శబ్దములు, తన కనుకూలమగు వాతావరణమును శ్రోతల హృదయమున నుత్పన్నముచేయ సమర్థములైనవానిగా, సమర్థుడగు కవి, జూచుకొనును. రాయలు స్వర్గస్థుడైన తరువాత, సమయము దొరకినదను సంతోషమున, అల్లకల్లోలముగా నున్న దేశముపైబడి కొల్లగొట్టదలచి, సకల సైన్యసమేతుడై వచ్చిన స్వార్థపరుడగు, గజపతిని భయపెట్టి, భంగపరచి, వెనుదిరిగిపోవునట్లు చేసిన దొక్క సీస పద్యము ! చరిత్రకారు లేవిధముగ అనుకొనినను, మన మిచ్చట పరీక్షింపవలసినది, ఆ పద్యమునందలి శబ్ద విన్యాసమును. ములుకులబోలు పలుకు లందు కొనరావు, ఆ వాచ్యములగు శబ్దములకందు తావులేదు. జాతియొక్క నిండుగర్వమును వెలువరించు శబ్దములకూర్పు పగవాని హృదయమునందు మార్పుగొనివచ్చె ననుటలో నాశ్చర్యము లేదు.

"రాయరాహుత్తుగండ రాచయేనుగువచ్చి
ఆరట్లకోట గోరాడు నాడు,
సమ్మెట నరపాలసార్వభౌముని కంచుకేలుపుల
కరుల ఢీకొలుపు నాడు......"

అను పద్యము, కేవలము శబ్దసంయోగశక్తివలన దేశచరిత్రయొక్క గమనము నే మార్చివదనుటలో వింత లేదు. శబ్దమునకుగల సత్తువ యట్టిది ! దానిని, ఏ సమయమునం దేరీతి ప్రదర్శింపవలయునో సమర్థుడగు కవియే యెఱుంగును.

ఒక భావమును స్మరించుకొని, ఆ భావమును, మొక్కవోని శబ్దములమూలమున పాఠకుల హృదయముల కెక్కింప కవి తన శబ్దసంపదను విరివిగ నుపయోగించును. ప్రప్రథమమునుండియే, తన హృదయమునందు, నిక్షిప్తమొనరించుకొనియున్న భావము భాసించునట్లు శబ్దములను సంతరించుకొనును. తాను వ్రాయవలచిన పద్య సందోహమునకు, శీర్షికను నిర్ణయించుటయందే ఒక భావవిన్యాసమును మనసునందుంచుకొనును. ఔచిత్య మెఱిగిన పాఠకుడు శీర్షికను బట్టియే, రానున్న భావపరంపరను గ్రహించును: రావణుడు రాక్షసరాజు. తానొనరించిన కార్యముల వలన, ఈ నాటివరకు భారతీయుల భావమునందు, మన్ననల నంద నేరని దైత్యకులముఖ్యుడై యున్నాడు. కాని దుష్టునియందును కొన్ని సమయములయందు శిష్టాచారసంపత్తి కానవచ్చును. అందులకే, రావణుని, రాముని భక్తునిగా, రానున్న విషయముల నెఱింగి ప్రవర్తించిన జ్ఞానిగ, కారణ జన్మునిగా, ఒక నవ్యాంధ్రకవి చిత్రించి, కృతకృత్యుడగుట ప్రశంసార్హము. ఇక, ప్రథమమునుండియే, శబ్ద విన్యాసమునందు అనితరతుల్యమగు ప్రతిభను ప్రకటించియున్నాడు శీర్షికను నిర్ణయించుటలోనే, కవి హృదయము కరతలామలకమువలె గన్పట్టుచున్నది. రావణుడు, పులస్త్యబ్రహ్మ కుమారుడు. అందులకే అపత్యార్థ తద్ధితమువెంట పౌలస్త్యుడైనాడు. "రావణుని హృదయము" అని శీర్షిక నిర్ణయించినచో, తెనుగు వారికి రుచింపదు, ఎందుచేత ? రావణశబ్దము విని నంతనే, హృదయమున నుత్పన్నమగు వికృతభావజాలమువలన !, అందులకే "పౌలస్త్య హృదయము" అను శీర్షిక నిర్ణయింపబడినది ఈ శీర్షికమూలమున వికృతభావము లరికట్టబడుటయేగాక, రావణుని వంశమర్యాదలు విదితమై హృదయమునందు కొంత, యుపశమనమును పొందుట కవకాశము కలుగుచున్నది. ఉపశమనము కలిగిన హృదయముతో పాఠకుడిక, కావ్యమువైపు కన్ను ద్రిప్పుచున్నాడు; చూడుడు, ప్రతిభావంతుడగు కవి, ఒక్క శీర్షికమూలముననే తన కావ్యవస్తువున కెంతటి సానుభూతిని పాఠకునికడనుండి పొందుచున్నాడో! ఇది శబ్దవిన్యాసము నందకుడగు, కవిశేఖరుడు సాధింపగల కార్యము:

"శివకోదండము ద్రుంచె, సీత వరియించెన్
రాముడన్నప్డె, మా
ధవు కార్యం బనుకొంటి............" అని, రావణుడు, రామావతార తత్త్వము నెఱింగియే, "కామోత్కంఠిత గోపికల్, భయమునన్ కంసుండు, వీరక్రియా సామగ్రిన్ శిశుపాలదంతనృపతుల్ ......" శ్రీహరిని జేరుటకు చెప్పబడిన వివిధములగు విధములయందు, శిశుపాలాది నృపతులు నడచిన బాటవెంట తాను నడచి, తుదిని నిర్వాణపథమును పొందగోరిన ట్లిందు చిత్రింపబడుట, నవ్యముగను, భవ్యముగను ఉన్నది.

"రావణుడన్న గాళ్ళబడు
రాయియు, అప్పయు గాదు, జాలిపై
గావగ నాతి కోతియును
గాకియు గ్రద్దయు గాదు, లోక వి
ద్రావణు డుగ్రవీరచరిత
ప్రథితుం డతిమాని యా దశ
గ్రీవుడు, పోరిలో బొడిచి
గెల్చును జచ్చును గాక, వేడు నే?" అని, రోషావేశమున బల్కు రావణుని మాటలయందు. అహల్యాశాప విమోచనమునుండి, జటాయువుకథవరకు గల శ్రీరామచరిత్ర ప్రస్తరింపబడుటయే గాక, నిర్ణయించి, నిరుపమానమగు కూర్పు నేర్పుతో సమకూర్పబడిన పదజాలముయొక్క సౌందర్య సౌలభ్యమును గుర్తింపవలయునని మనవి. "పోరిలో బొడిచి గెల్చును జచ్చును గాక" అని శపథము పూనిన ఉగ్రవీరచరితుండగు రావణుడు!

"చూడుము నెచ్చెలీ! విభుని
జూచితి వేకద! చెప్పుమెట్టులు
న్నాడో, రఘూద్వహుండు, లలనా
విరహవ్యధ గ్రాగి చిక్కియు
న్నాడో? దశాస్య కంఠదళన
ప్రవణాగ్రహ వృత్తి వెల్గుచు
న్నాడో? అధిజ్యధన్వ్యరుణ
ద్యుతిరంజిత నేత్రకోణుడై"

అని ప్రశ్నించుచున్నాడు. మొదటి పద్యమువలనను, తరువాతి ఈ పద్యమువలనను, రావణునకు స్వవచనవ్యాఘాతదోష మాపాదింపబడవచ్చును. కాని సమర్థుడగు కవి రచనమునందు, మనము పరిశీలింపవలసినది, శబ్దవిన్యాసమును :

"ఉట్టిగట్టి యిచట నూరేగనుంటినా
యేమి? శోకభీతి యేల నాకు?
దక్కనిమ్ము మంచితనమెల్ల విభునకే,
అతడు నన్నెఱుంగు టదియుచాలు"

అను పద్యమును జాగ్రత్తగా పరిశీలించినచో రావణుని హృదయము తేటతెల్లమగును. ఈ కావ్యమునందలి, శబ్దరసనిష్పత్తినిగూర్చి వివరించుటకీ కష్టప్రయత్నము చాలదని మనవి

కథాగమనమునందు, కొన్ని స్థలములయందు స్తబ్ధత ఏర్పడు నవకాశము లున్నవి. కథావస్తువును బట్టియు, పాత్ర నిర్మాణమును బట్టియు, ఒకప్పుడొకింత యలసత కథయందు కలుగుట సత్యము. అట్టి సమయములందు వింత శబ్దముల పొందికతో పాఠకుని హృదయమునందు ఉత్కంఠను రేపి, కథాగమనమునకు, జవమును. జీవమును, గల్పించుటకు కవి ప్రయత్నించును:

"రెండు వందల గజముల కొండగొండె
విపుల సామ్రాజ్య చక్రము విరిగిపడును..."

అని కవి యొక యుద్ధమునందొక సన్నివేశమును వర్ణించుచున్నాడు. కొండగొండెను, విపుల సామ్రాజ్యచక్రమునకు, ఇచ్చట సంబంధము సమకూర్పబడినది. ఆ కొండగొండెయొక్క ప్రాముఖ్యమును పాఠకుడు తెలిసికొన తహతహలాడుచున్నాడు!

'ఒకటి రెండుమారులు రవి నేలకు వ్రాలె
కాపలా జవాను కరకుకత్తి,
సురటి విసరుచేటి మరచి నిద్దురబోయె,
ఖంగు మనుచు నొంటిగంట గొట్టె."

ఈ పద్యమునందు, సాధారణ సన్నివేశమునొకదానిని వర్ణించుచున్నాడు. ఆసమయమునందలి నిశ్శబ్ద జగతిని వర్ణించుటకు, సరలి నేలకు వ్రాలినకత్తి, మరిచి నిద్దురవోయిన చేటి, 'ఖంగు'న మ్రోగిన ఒంటిగంట సవ్వడిని, ఇనుమడింపచేయుటకు, తోడ్పడుచున్నవి. మనస్సునందొక భావచిత్రమును నిర్మింపజేయుటకీకొలది పదసామగ్రిని సంతరించిన కవి ప్రశంసార్హుడు కాడా?

వేదాంతసంబంధములగు విషయములను, ప్రకృతిసంబంధమగు వర్ణనములను, గ్రంథసమొనరింప దొరకొనినపుడు, పాఠకుని హృదయమునకు విసుగు జనింపకుండ, కేవలము శబ్దసంపద సహాయమున, క్రొత్త

# శబ్దవిన్యాసవైచిత్రి

చవులూరించు భావములతో కృతకృత్యులైన కవులన్నారు. సూర్యోదయ వర్ణనమును, సులభములగు శబ్దములతో ఆలోచించినకొలది, క్రొంగ్రొత్తభావముల నుత్పన్నమొనరింపగల శబ్దజాలముతో ఒక ఆధునిక కవి గావించిన తీరు తిలకింపుడు.

'కుంకుమపంక ముం బులుము
కొన్నవి. తూరుపుకొండ కైతముల్
పంకజబాంధవుం డరుణ పాదములన్
నిగిడించె మింట నే
జొంకుడు చిన్నవోయి, చర మాచల
సానుతటమ్ము లెక్క మై
జింకయు దాను గడ్డిగర చెన్,
పెనుచీకటు లార్చె కాకులై."

ఈ పద్యమునందలి కొన్నిశబ్దములు వెలార్చుచున్న వింతయర్థమును, శబ్దజాలముయొక్క నిర్ణయమునందు కవి చూపించిన ప్రజ్ఞను గూర్చి వివరించిన కాలవిలంబన మగునని వదలివేయుచున్నాను. పెనుచీకటు లార్చె కాకులై అను చివర పాదమునందలి, చివరిభాగమును రసజ్ఞులు పరామర్శించి శబ్ద విన్యాసమునందలి సౌందర్యమును గుర్తింతురని యాశించుచున్నాను.

పరమేశ్వరుని యనుగ్రహమును బడయుటకు, సంఖ్య ననుసరించి, కాలమాన పరిస్థితుల ననుసరించి, చేయబడు జపతపములకన్న అన్ని వేళలయందు భగవంతుని హృదయమున నుంచుకొని సత్యమార్గము నవలంబించుచు పరమేశ్వరానుగ్రహసంజనిత హృదయానందమున, పటాటోపరహితమైన జీవితమును గడపువాడే ధన్యుడు, భక్తుడు, కాగలడను నీలమువంటి నీతిని సాధారణలోకవృత్తము నాధారముగాగొని అనువైనపదసామగ్రితో ఎట్లు ఒక కవి విశదపరచుచున్నాడో పరిశీలింపుడు.

గంగయొడ్డున ప్రతిదినము భగవంతుని నామ పారాయణమునందు నిమగ్నుడైయున్న ఒక సన్యాసి కొన్ని దినములకు తాను స్మరించిన భగవన్నామముల సంఖ్యను లెక్కజూచి, సంఖ్యాగణనాతిగర్వమున గ్రాలుచున్నాడట. ఇంక కొలది దినములలో కొన్ని లక్షల నామములు, సంఖ్యయందు సంపూర్ణమై తనకు ముక్తిచేకూరునని యాతడాశించుచుండెను. ఇంతలో ఒకనాడు "గంగాగతమైన నీరమునుగైకొని, గంగకు దాము మారుగా వాగమృతమ్మునిచ్చి చనువారి నవోఢలను ఇరువురను సన్యాసి చూచినాడు. అందొక యువతి వేరొకతెను:

"చెలియల! నీవెన్ని మాగులు కలసితివే యింతవరకు కాంతుని తోడన్? కలయూపు చెప్పు"మని అడిగినది. అందులకా రెండవ యువతి:

"ఖాతా పాత మొకంటు గుట్టి ఇది
లెక్కల్ వ్రాయకే పోరమా?
చేతో నాథుని పేరు నా మనసులో
చేకొన్న యలంత నే,
నా తల్లీ విను, నన్ను నేనె మరతున్
నా కెట్లు సిద్ధించు నా
ఖాతా వ్రాయగ నంచు నా యువిద
సంభ్రాంతాత్మయె పల్కెనన్."

ఈ పలుకులన్నియూ విన్నాడా సన్యాసి. వెంటనే "జపమాలన్ దిసి సన్యాసి, తా గంగాగర్భమునందు వైచుచును, ఇంకన్ నేను సన్యాసినా! శృంగారాంగులు నాకు ఒజ్జలనుచున్ జేమోడ్చె నవ్వారికిన్" విషయమెంత వేదాంత సంబంధమునకు చెందినదైనను, దానిని విశదపరుప నిర్ణయించుకొనిన కథ, సులభశబ్ద సందోహము, కవియొక్క నిర్మాణచాతుర్యమునకు, నిదర్శనములై యొప్పుచున్నవి.

కథను నిర్ణయించుకొనుట ఒకయెత్తు, నిర్ణయించుకొనిన కథను, నేర్పుమీద నడుపుట వేరొకయెత్తు, కథయందలి హెచ్చుతగ్గులను, రసమును, పాత్రనిర్వహణమును, శబ్దసంపదచే రాణింపునకు తీసుకొని రావలసిన బాధ్యత కవిపైనున్నది. పుష్కలముగు శబ్దసంపగల కవి కిది కష్టసాధ్యములు కానేరవు. ఒక హార్మ్యము, రమ్యముగా నున్నదనిన, దాని, నిర్మాణమున కుపయోగింపబడిన ప్రతి చిన్న వస్తువునందును, రమ్యత స్ఫురింపవలయును. సుమదామమునకు కలుగు సువాసన, చక్కదనము, అందు గూర్చబడిన ప్రతి కుసుమమున కుండు పరిమళము, చక్కదనముపై నాధారపడి యుండును. ఇట్టే, ఒక కావ్యము, జనరంజకమగుటకందలి కథావస్తువుపైన నేగాక, ప్రయోగింపబడిన ప్రతిశబ్దముపైన కావ్యమునందలి కళాకాంతు లాధారపడియుండును. ఈ చిన్న వ్యాసము శబ్దవిన్యాసమునందలి చక్కదనమును అతి స్వల్పముగ మాత్రమే వివరింపసమర్థమై యున్నదని మనవిచేయుచున్నాను.

# రాత్రించరులు

**'భాను'**

## 1

నిశాకాంతబంధుర వినీలకుంతలాలఛాయ రోదసీకుహరాంతరంలో వ్యాపించి స్థావరజంగమ ప్రకృతిని క్రమ్ముకొని తెరగా మారిపోయింది.

వలని ఆకాశంలో పలుచని మబ్బులు పిచ్చివాడి ఆలోచనలా అలిబిల్లిగా క్రమ్ముకొన్నాయి. మొయిలు పయ్యెదలలో మసకబడిన నక్షత్రాల కాంతిలత్తుక చుక్కల కాంతిలా ఉంది. ఆకులను చలింపజేయలేని పిల్లవాయువులు వీస్తున్నాయి. ప్రకృతి స్తంభించింది.

కామంలాంటి చీకటి; పాపంలాంటి చీకటి; కటిక చీకటి మానవజీవితపు చరమరంగస్థలంలో భయానకంగా నర్తిస్తున్నది హృదయంలో భయాన్ని పెంచే ప్రళయవాతావరణం.

శిక్షుల్లాగా నిలబడ్డ గుబురు వెదురుచెట్లు. వివిధాకారాలతో భయం గొలిపే రెల్లుగడ్డిదుబ్బులు. విశృంఖలంగా ఊళలు వేస్తున్న సృగాల సరాగాలు. ఎఱ్ఱని కన్నుల్లో గసి తిరుగుతున్న తోడేళ్ళగుంపులు. భూమి మీద చుక్కల్లాగా పరిభ్రమిస్తున్న మిణుగురుపురుగుల మందలు—ఇవన్నీ ఒకవైపున ఉన్నాయి.

మాతృగర్భంలో శిశువులాగా కదిలే ప్రక్క ఏటిలోని నీటి నిశ్శబ్దం. ప్రవాహానికి పైన వంగి అడ్డుపడిన గట్టుపైన జామచెట్టుకొమ్మ చేస్తున్న మంజులమైన గలగల సందడి. ఆ నీటిజాలుల గలగలశబ్దంతో గళాలు మేళవించి శ్రుతికలిపి, లయానుగుణంగా తాళాలు వేస్తున్న కీచురాళ్ళు. రెల్లుగడ్డిదుబ్బులపై స్వైరవిహారం చేస్తున్న మిడతలరెక్కల చప్పుడు. నిద్రపోతున్న నిద్రగన్నేరుచెట్టపైన నిద్దురపోతున్న పక్షుల కలవరింతలు—ఇవన్నీ ఇంకొకవైపున ఉన్నాయి.

ఉధృతంగా జ్వలిస్తున్న కాష్ఠాలలో చితులు. టప్పున పగిలిపోయే కపాలాల చప్పుళ్ళు. మనోవేదన కలిగించే మాంసపు కవురుకంపు. వెంట్రుకలు కమురుకుపోయిన వాసన. నక్కలు కొరుకుతున్న శవాల ఎముకలశబ్దం. వాటి కాళ్ళ తాకిడికి కణకణమంటున్న పగిలిన కుండపెంకులు. ఎండుటాకుల మర్మరధ్వనులకు వల్మీకరంధ్రాల్లోనుండి మెరుస్తూ తొంగిచూస్తున్న పడగలువిప్పిన విషకాకోలాలు. తళుక్కుమంటున్న ఆకులతో రావిచెట్టు. దానితొఱ్ఱలోనుండి విస్ఫురన్నేత్రాలతో తీక్ష్ణదృక్కుల విహంగాలు—ఇవ్వన్నీ మరొకవైపు.

స్త్రీశవపు నవ్వులాగా నవ్వుతున్న కొర్నాసుల యికిలింతలు, ఊడలుదిగిన మఱ్ఱిచెట్టుపైన మాటికి మాటికి అరుస్తున్న తీతువు పిట్టలు. తుమ్మచెట్టుపైనుండి కర్ణాలను ఘూర్ణింపజేస్తున్న రాత్రిఈగల సంగీతం మిగుభూమిని మరులుకొలుపుతూ వుంది.

మరొకప్రక్కగా—

జుట్టు విరియబోసుకొని మఱ్ఱిఊడల ఉయ్యాలలూగుతూ, ఘక్కున నవ్వుతూ, కొప్పు ఊపుతున్న నగ్నస్త్రీలు. తమాషాగా చలిస్తున్న అవయవాల పొందిక. హృదయ విదారకంగా రోదిస్తున్న మరికొందరు స్త్రీల ఆర్తనాదాలు. గుంపులు గుంపులుగా కేకలు వేస్తున్న పురుషుల ఆకారాలు. జోలలు పాడుతున్న కంఠస్వరాలు. ప్రేమగీతాలు ఆలాపిస్తున్న కొన్ని గొంతుకలు. పల్లకిమోస్తున్న బోయల కేకలు, బట్టలు ఉతుకుతున్న చాకలికేకల వైఖరులు—కిచకిచమంటున్న అవ్యక్త ధ్వనులు.

మఱ్ఱిచెట్టు చిటారుకొమ్మమీద తెల్లనికోక కట్టుకొన్న వెండిబొమ్మలాంటి యువతి దిక్కులు చూస్తూ కూనిరాగం తీస్తున్నది. కొంతదూరంలో తుమ్మచెట్టు పంగలో ఒక యువకుడు కూర్చొని ఈలపాట పాడుకొంటున్నాడు.

ఘల్లుమనే గజ్జెలతో కొందరు నృత్యం చేస్తున్నారు. అక్కడక్కడ మండిపోతున్న చెట్లు మళ్ళీ మామూలు చెట్లవుతున్నాయి. క్షణక్షణం మండుతూ ఆరిపోతున్న అగ్నిజ్వాలలు అక్కడక్కడ కనబడుతున్నాయి.

కాని, ఎవరిముఖాలూ స్పష్టంగా కన్పించడం లేదు.

భీకరమైన కోలాహలం సాగుతోంది. అంతా నిరామయం.

రోదనలు, కేరింతలు, పకపకలు, పసిపిల్లల యేడ్పులు, బండబూతులు.

మంచి మనసులో పాడు ఆలోచనలా వుంది ఆ ప్రాంతం.

నిశ్చలమైన సరసులో సుడిగుండంలా వుంది ఆ ప్రదేశం.

# రాత్రించరులు

అదొక ప్రత్యేక ప్రపంచం. ఒక ప్రత్యేక వాతావరణం.

అంతలో యెక్కడో అడుగుల సవ్వడి. గాలి దుమారం. పిచ్చిపిచ్చి మాటలు వినిపించాయి. అవసాన కాలంలో వెలువడ్డ భీకరమైన పెనునవ్వు.

ఆ ప్రదేశపు కోలాహలం సమసిపోయింది. నక్కలు రెల్లుగుబ్బల్లో దాక్కున్నాయి. తోడేళ్ళు గట్టుమీద కసిగా చూస్తున్నాయి. గుడ్లగూబలు భయంకరంగా అరిచాయి. అగాపులకు, ఏకుర్లకు గొంతులు బిగుసుకుపోయాయి. ఆకారాలు అదృశ్యమైనాయి.

శూన్య గడియలు. కీచురాళ్ళ గళారవాలు. ఆకులు రాలుతున్న చప్పుడు రెండు మూడు గబ్బిలాల రెక్కల విసురు మఱ్ఱిచెట్టు వైపుగా వెళ్ళింది.

దారిద్ర్యంలాంటి చీకటి; కాటుకలాంటి చీకటి; మరణంలాంటి చీకటి మరీ దట్టంగా అల్లుకుపోయింది.

ఏదో ఆకారం అస్పష్టంగా, వికారంగా, రోగగ్రస్తమైన పశువులాగా వదురు పొదలకు, పురుగుల కంపలకు నడుమ కదిలింది.

ఎక్కడో బల్లి అరిచింది. సర్పపు నోట్లో కప్ప బాధతో మూలిగింది.

ఆ ఆకారం నెమ్మదిగా అడుగులు వేసున్నది.

సంస్కారశూన్యమైన తల దుబ్బుగా వుంది. గడ్డం బాగా పెరిగిం . మానాన్ని మాత్రమే సంరక్షించే జీరాడుతున్న జీర్ణవస్త్రాలు. అసహజమైన దుర్గంధం. తదేకదృష్టితో చూస్తున్న మిణుగురుపురుగుల్లాంటి కనుపాపలు. మాటిమాటికి తుపుక్కున ఊసేస్తున్న శబ్దం మధ్యలో ఏదో గునుస్తున్న గొణుగుడు.

మఱ్ఱిచెట్టుకు దగ్గరగా వచ్చాడు. చేతులు ఆడిస్తూ నడుస్తున్నాడు. ఏవో బిగరగా కేకలు. ఒక ఎత్తైనగట్టు లాంటి ప్రదేశంమీద కూర్చొని కుంప త్రిప్పుతున్న కుంటనక్క అతని అంగలోనుంచి పరిగెత్తింది

అతను నవ్వాడు. మనుష్యుల్లా నవ్వలేదు. అదో రకంగా నవ్వాడు పిచ్చిగా నవ్వాడు అతని నవ్వు విని నక్కలు మోరలెత్తి అరిచాయి అతను వీపుమీద మూటదింపి, ఒక చేతి ఎముకను పట్టుకొని అటు, యిటు పరుగెత్తాడు. కాని ఏమీ కనబడలేదు.

ఆకులు మరింతగా రాలినశబ్దం. వగరు ఆకుల మీద జగజరమన్న కాంతి. సన్నని చినుకులు. ఏడవబోతున్న ఆకాశం. కొద్దిగా చలిగాలి.

రెల్లుగుబ్బల చాటున జ్వలిస్తున్న మంటలు. అతను ఆ మంటల దగ్గరగా వెళ్ళాడు అక్కడ మంటలు లేవు. ఇంకొంచెం దూరంలో మండుతున్నాయి.

వెఱ్ఱిగా నవ్వుతూ మంటలదగ్గరకు పరుగెత్తాడు. అవి అక్కడ మాయమైనాయి. అతనిచుట్టూ మంటలు పరివేష్టించాయి మానవాకారాలుగా మార్పుచెందాయి. అవి నోరు విప్పుతూంటే పుష్పాలలాగ అగ్నికణాలు రాలుతున్నాయి. వాటి ముఖాలు మడతలు పడి భయోత్పాతాన్ని కలిగిస్తూ వున్నాయి. అవి పైకి వస్తున్నాయి. ఆ పిచ్చివాడు చలించలేదు.

“ఓసీ...ఓసీ!” అంటూ ప్రక్కనవున్న మండుతున్న కాష్ఠాన్ని పట్టుకోగానే బిలబిలమంటూ పరుగెత్తాయి.

“హీ...హీ...హీ......కొరివి దెయ్యాలు...వన్నెం...చేస్తాయ్య...మోసం” వికృతంగా నవ్వుకొని తృప్తిపడ్డాడు.

నెమ్మదిగా నడిచి మఱ్ఱిచెట్టు మొదలు దగ్గరవున్న రాతి అరుగు మీద చెట్టుకు వీపు ఆన్చి ఆవులిస్తూ చూస్తున్నాడు. అతని కళ్ళకు చీకటి ఈగలు ముసురుకొన్నాయి. అతని మనస్సు వర్తమానంలో నిమగ్నమైంది అతన్ని గూర్చి అతనికి ప్రస్తుతంలో ఏమీ తెలియదు. మానవ సహజమైన ఆలోచనా జ్ఞానం లోపించింది.

నిశ్చల నిర్నిమేష దృక్కులతో నిరామయంగా చూస్తున్నాడు.

అంతా చీకటి. అతని తలలో చీకటి. బయట చీకటి.

మరలా గట్లమీద ఆకారాలు మాయాలుగా తమ యథాప్రకార కార్యక్రమాన్ని సాగిస్తున్నాయి. అతనికి ఎదురుగా జ్వలిస్తున్న చితులు. మండుతున్న మంటలు. అతను ఎదటి ప్రదేశాన్ని మాత్రమే చూస్తున్నాడు.

## 2

అతని ఎదురుగా ఒక ఆకారం కదిలింది. మెడ ఎత్తి చూడాలని ప్రయత్నం చేసేలోగా—క్షణంలో ఆకారంపుఛాయ అతనిపై పడింది. శరీరం బండబారి పోయింది. సర్వాంగాలు మొద్దుబారిపోయాయి. విప్పారిన కళ్ళు అలా నేల చూస్తున్నాయి. మత్తులాంటి అవస్థ; మగత లాంటి స్థితి ఆవరించింది. హృదయంపై భరించలేని భారం పెట్టినట్లనిపించింది. విలయతాండవం చలిద్దామన్నా అశక్తిగావుంది.

ఒక్క నిమిషం గడిచింది.

చలిగాలిలో వణికిపడి అరిచాడు. కాళ్ళు చేతులు కొట్టుకొన్నాడు. చెట్టు పైన దృష్టి సారించాడు చిటారి కొమ్మమీద తెలకోక మనిషి; వెండి బొమ్మలాంటి ఆకారం కనబడింది. అతనికి పరిచయమైన ముఖం లాగా కనబడింది. ప్రక్కన ఊయ్యాల

లాగుతున్న నగ్న యువతుల ఆకారాలు. సుందరంగా, సుకుమారంగా, మెల్లిగా ప్రాణాలు తోడేస్తున్నట్లుగా చలిస్తున్నాయి వారి ఉన్నత వక్షోజాలు. అతను చేతులు నలుముకొన్నాడు. గాలిలోని ప్రమిద చలించి నట్లు హృదయంలో ఒక భాగం భయపడింది. ఆదృశ్యం చూడ్డానికి దగ్గరగా వెళ్లాడు. మరీ దగ్గరగా వెళ్ళాడు పట్టుకోబోయాడు. ఊగుతున్న ఊడలు. రాలుతున్న ఆకులు. అంతే! ఇంకేమి కనబడలేదు. మళ్ళా గుండె అలిసిపోయింది. శరీరం స్పర్శకి కని కోల్పోయింది. కన్నులు చూస్తున్నాయి. ఏదృశ్యం గాని వస్తువుగాని చెట్టు చేమగాని కన్పించడం లేదు. తల దిమ్మెక్కింది. అతని ముందు ఆకారాల ఛాయలు, వెనుక కొన్ని ఆకారాల నీడలు. అతను నడుస్తున్నాడు. వలయాకారంగా తిరుగుతున్నాడు. వీపు మీది మూట భుజాన్నుండి జారింది. అతను గుబ్బలు, గట్లు లు దాటి నడుస్తున్నాడు. నడుస్తూ, నడుస్తూ ఒక్క చోట చటుక్కున ఆగిపోయాడు.

శరీరం తేలికయ్యింది. కళ్ళు చూడగల్గుతున్నాయి ఎదురుగా తుమ్మచెట్టు తుమ్మపూలవాసన. అతను బండ బూతులు తిట్టాడు. కాళ్ళల్లో ముళ్ళబాధ కలుక్కుమంది. వంగి తీసుకోబోయాడు. వెనుక నవ్వుతున్న కిచకిచ ధ్వనులు. వెనుతిరిగాడు. గాఢంగా. చీకటి కడుపులో మరగిపోయిన నిశ్చల ప్రకృతి. ఇంకేం కనబడలేదు.

ముందు తుమ్మచెట్టు పంగలో ఈలపాట. అతను ముందుకు తిరిగాడు. తుమ్మచెట్టు పంగలో మానవాకారం. క్రమేణా స్థాయి హెచ్చవుతున్న ఈలపాట. నిద్రా ముద్రితమైన ప్రకృతికి జోలపాట పాడుతున్న కీచురాళ్ళ కంఠాలు ఈలపాటలో ప్రతిధ్వనిస్తాయి. తీతువుపిట్ట వికృత గానం లయగా సాగుతోంది. ఏవో పక్షుల రెక్కల విసురులు గాలికి శబ్దం చేస్తున్న మంటలు.

చెప్పడానికి వీలులేని ప్రకృతి; వ్రాయడానికి వీలులేని ప్రకృతి, వికారం లాంటి ప్రకృతి, అజ్ఞానం లాంటి ప్రకృతి.

అతను ఈలపాట వింటున్నాడు. మునుపు విన్నట్టనిపించింది. పాలోచనగా వింటున్నాడు. మెదడులో మెరుపు మెరిసింది. పిచ్చిగా నవ్వాడు. కసిగా నవ్వాడు. అదోరకంగా నవ్వాడు.

"వాడిదే యీపాట...!...హు హూఁ... వాడిదే...అవును...అదే. ఈడకెందుకొచ్చాడబ్బా. ఏమోలే...హహాఁ.... అవును లే ...అటువంటోళ్ళు... ఎక్కడ కొస్తారు...మరి?...ఇప్పుడిక్కడికెందుకొచ్చాడు...ముదనష్ట వాయాలు...వాడికేం అధికారముంది?...ఇదంతా మంది" హీ హీ హీ అంటూ నవ్వాడు.

ఈలపాట ఆగలేదు. పై పెచ్చు హెచ్చు స్థాయిలోకి వెళ్ళింది. రకరకాల ప్రాణుల కంఠస్వరాలు సమ్మిశ్రితమైనాయి. ఈలపాట సాగుతూనే వుంది అతనిలో కోపం పెల్లుబికింది. కోపాన్ని ఆపుకోలేక పోయాడు.

"ఎవడ్రా నువ్వు...?...ఆపు...ఎదవపాట" ఆవేశంగా అన్నాడు.

"నవ్వాపమనడానికి నీకేం అధికారముంది?" స్పష్టమైన ప్రతి వచనం వచ్చింది.

"...రేయి! నాకే ఎదురు సెప్తావట్రా... చంపేస్తా! తెలుసా...! హా హా హా" అంటూ నవ్వాడు.

"ఏ జీవికి రెండుసార్లు మరణం లేదు తెలుసా?" సున్నితమైన నవ్వు. నిష్కళంకమైన నవ్వు, హాయి అయిన నవ్వు విన్పించింది.

అతను చేతిలోని కొయ్యని బలంగా ఆకారం వైపు విసిరాడు. అది ఆకారం దగ్గరకు వెళ్ళి తగిలింది. 'ఢన్' మని శబ్దం. ఆక్షణంలో ఆకారం అక్కడలేదు. అతను ఆశ్చర్యపడి. దగ్గరకు వెళ్ళాడు. వెనక మళ్ళీ అదే యీలపాట. అదే స్థాయి. అతను వెనక్కు తిరిగాడు. తాటిబోంద ప్రక్కన కాళ్ళు సాచి కూర్చున్న దా ఆకారం. అతను చెంగుమని అక్కడకు దూకాడు. నట్టేనేల. మోకాళ్ళ చిప్పలు కొట్టుకుపోయాయి. మళ్ళా వెనుక పూర్వస్థలంలో అదే పాట, అదే ఆకారం. చేతిలో మూట బలంగా విసిరాడు. ఆ ఆకారం కదలేదు. నెమ్మదిగా దగ్గరకు వెళ్ళాడు. ఆకారం రెండు మూడు అడుగుల దూరంలో వుంది. తూర్పున మెరుపు మెరిసింది. ఆ ఆకారం ముఖం స్పష్టంగా కనపడింది. అతను వెనుకంజ వేశాడు. చిన్నపిల్లవాడిలా భయపడ్డాడు.

'శ్రీ ... సు ... దర్శనం ...' తలగోక్కుంటు పిచ్చిగా జ్ఞాపకం తెచ్చుకొన్నట్లు అన్నాడు.

'జ్ఞాపకానికి వచ్చానా? సూరి...' దీనంగా ధ్వనించాయి మాటలు.

సూరి మాట్లాడలేదు. పిచ్చిగా నవ్వుతున్నాడు. రెప్పలు మాటిమాటికి అల్లలార్చాడు. దగరపడ్డ మూట తీసుకునుంచుకున్నాడు. పాచిపటిన సరసులాంటి మనసులో మటి శెస్తలాంటి విషయం చొచ్చి కొద్దిగా స్వచ్ఛతను కనుపరుపజేసింది. సూరి ఛటాలున వెనుతిరిగి నడక ప్రారంభించాడు. ఎదురుగా సుదర్శనం ఆకారం.

'ఛీ...అడ్డంలే' ఛీత్కారంగా అన్నాడు.

'ఇంకెక్కడికి వెళ్ళగలవూ?' నవ్వుతూ సుదర్శనం ఆకారం అంది.

'ఏం?...' పెదవులు కొరుక్కుంటూ అన్నాడు.

'అహా... ఏమీ... లేదు. ఇక్కడకు వచ్చినోళ్ళు అక్కడకు వెళ్లలేరు; అందుకని' చిలిపి సమాధానం.

'నీవంటి దౌర్భాగ్యుడు... మిత్రద్రోహి... సరిగా చెప్పాడని నేననుకోనులే' అన్నాడు సూరి. అతని మనసులో గతస్మృతులు మెదిలాయి.

'అవును; ఇద్దరం అంతే. నీ దృష్టిలో నేను, లోకందృష్టిలో నువ్వు' కలకలమని నవ్వుతూ అన్నాడు.

సూరి పగలబడి నవ్వాడు ఆ నవ్వుకు నిశ్శబ్దం ప్రతిధ్వనించింది. ఆకాశం ఉరిమింది.

'అవును; ఇద్దరం అంతే వాళ్ళు యిట్లాగే అన్నారు. ఇట్లాగే...అన్నారు' అని మౌనంగా వూరుకొన్నాడు.

'సూరీ! మాట...' ప్రాధేయపూర్వకమైన కంఠం.

'ఏహ్! యీ ప్రపంచకంలో మనం ఎవ్వరి మాటయినా నమ్మలా. నిన్ను నమ్మాం....బోల్తా కొట్టాం. ఇక ఎవరిమాట వినం' పెరిగిన మీసాల మధ్య చెయ్యి వేసుకొన్నాడు సూరి. నెమ్మదిగా నడవడానికి ప్రయత్నిస్తున్నాడు. సుదర్శనం ఆకారం ప్రక్కగా నడుస్తున్నది.

'సూరీ! నన్నేదో అపార్థం చేసుకొన్నావు. నా జీవితాన్ని భగ్నంచేశావు. అమానుషంగా చేశావు ...నాతో ... ఒక్కమాట ... ఒక్కమాట ... అనకుండా నన్ను యీ గతికి...దుర్భరమైన యీ స్థితికి ...ఈ నిశ్శబ్దపు బందిఖానాలోకి...ఈ చీకటిలోకపు పొలిమేరలలోకి...ప్రవేశపెట్టావు...ఎందుకు? ఎందుకు చేశావా రాక్షసకృత్యం?...ఎందుకు చేశావా దారుణకృత్యం' సుదర్శనం ఆకారం వాపోయింది.

శిథిలమై, శీర్ణమై, శక్తిహీనమైన సూరి పిచ్చి మేధ కూడుకోడానికి ప్రయత్నిస్తున్నటుగా వుంది. హృదయంలో మంటకు చలనం కలిగింది. మెదడు లోపల ఏవో బాధ ఉపశమిస్తున్నట్లుంది. ఏవో సరి క్రొత్త భావనలు.

'నీ కడుపులో ఏవో అనుమానముండి చేశావు గదు సూరీ? ఇలాగయ్యాను అటు మానవుణ్ణి కాకుండ —ఇటు జంతువును కాకుండ నికృష్టమైన, దుర్భరమైన ... యీ జీవితంతో గడుపుతున్నాను. ప్రకాశించే దీపాన్ని ఆర్పినట్లు, వికసించని పువ్వును తుంపినట్లు, పాడుతున్న కంఠాన్ని నలిమినట్లు, కన్నబిడ్డను చంపినట్లు నా జీవితాన్ని దుమ్ముచేశావు. ఈ స్థితి ఎటువంటిదో తెలుసా? ఏడవడానికి కన్నీళ్ళు రావు. అనుభూతికి ఆకలింతలు రావు. ఆనందం ఊహకి అందదు. మధురమైన స్వప్నాలు రావు. మాట్లాడానికి నోరురాదు. హృదయంతో మాటాడాలి చివరి సమయపు సంఘటనలే ఈ స్థితిలో జ్ఞాపకం వుంటాయి' సుదర్శనం ఆకారం ద్రవించేటట్లు మాట్లాడింది.

గాఢనిద్రలో మేల్కొని నిద్రించే స్థితిగా, జ్ఞప్తికి తెచ్చుకొంటున్న పసిపాప మనసులాగా, ప్రకృతి నయనాలు దృష్టిని పొంది అపూర్వమైన సౌందర్యాన్ని వీక్షిస్తున్నట్లున్న స్థితిగా సూరి మనస్సు భ్రమిస్తున్నది.

వాళ్ళిద్దరూ తిరుగుతున్నది కాటిలాంటి ప్రదేశంలో. నక్కలు పరుగెత్తుతున్న చప్పుడు. మిడతలు లేస్తున్న విసుర్లు. కీచురాళ్ళ యీలలు సంద్రస్థాయిలో వున్నాయి. తెరలు తెరలుగా శబ్దం వినవస్తూవుంది.

'సూరీ! మనం సన్నిహితులం... స్నేహితులం. కంటిరెప్పల్లాగా జీవించాం. కలలోకూడ మనకు అభిప్రాయభేదాలు రాలేదు. మంచి చెడు కలసే చేశాం. జీవితాన్నిగురించి చర్చించుకొన్నాం. మనం జీవితంలో పరస్పరం విడిపోకూడదని తీర్మానించుకొన్నాం. కాని అంతా తలక్రిందులైంది. ఎందుకు అమానుషంగా ఘోరంగా అలా చేశావ్? ఎందుకుచేశావ్ సూరీ? నా ప్రాణంలాంటి స్నేహితుడిచేతిలో అట్లా అవసం స్వరంకన్న అధికమైందే! కానీ... ఒకటి... నాకు జరిగిన కార్యం... ఏ కారణంవల్ల సంప్రాప్తమైందో నాకు తెలియకుండా జరిగింది అదే నాకు...యిప్పటి వరకు అశాంతి... ప్రసవవేదనలాంటి అవస. అందుకే యిలా అయ్యాను. ఎందుకుచేశావ్ సూరీ? కారణం చెప్పవూ? నా తపమైన హృదయానికి కొంచెం తృప్తి కలిగించవూ?' సుదర్శనం ఆకారం బొంగురుకంఠం దీనంగా ప్రార్థించింది.

సూరి మనసులో సుళ్లు తిరుగుతున్న ఆలోచనల్లో ఒక ఆలోచనాతరంగం బుద్ధికి గమ్యమైంది. ఒక అసహ్యమైన, వికారమైన నవ్వు నవ్వాడు.

'అవును! అమలను నాకు కాకుండా చెయ్యాలనుకొన్నావు అందుకే నిన్ను క్రూరంగా చంపాను. అందుకే...చంపాను...అందుకే చంపాను' సునాయాసంగా అన్నాడు.

'ఎవరన్నారు...ఆమాట?' గాలి వేగంతో ప్రశ్న.

మళ్ళీ అదే నవ్వు. 'లోకం...క...లోకంఅంది కాదు; చూసినోళ్ళు అన్నారు. నేను లేనప్పుడు నువ్వు అమలదగర ఎలా ప్రవర్తించింది? ఏం మాట్లాడింది? అంతా నాకు తెలుసు. పిల్లి పాలు తాగుతూ ఎవ్వరూ చూడడంలేదు అనుకొన్నట్లు అనుకొన్నావు.'

"కాదు; అబద్ధం. పూర్తిఅబద్ధం. నీ అపోహ నా మరణానికి ఎలా కారణమైందో యిప్పుడు తెలుసుకో గల్గుతున్నాను. నూరీ! నేను సత్యం చెపుతున్నాను. నిజంగా నాకేమి తెలియదు. నేనిపుడు లోకపు పరిధిలో లేను. మామూలు లోకంలో అబద్ధానికి జీవితానికి సామరస్యంవుంది. అబద్ధమే జీవితం అంటే అతిశయోక్తి కాదేమో? కానీ... యిప్పుడు...యిక్కడ ఆపరిస్థితికి పూర్తి వ్యతిరేకం. జరిగినదియేదైనా అసత్యాలైనా, యథార్థాలైనా అవసరంవస్తే విధిగా చెప్పాలి. కాబట్టి నేను నిజాన్ని దాచుతున్నానని భ్రమపడనక్కరలేదు. అసలు విషయం చెపుతున్నాను. నాకు ఆమెకు...సోదరవాత్సల్యం తప్పితే మరేలాంటి సంబంధం లేదు. మనం...మొట్టమొదట ఆమెను చూశాం. మీరిద్దరూ పరస్పరం చూసుకొన్నారు. ఆమె నీతో జీవితంలో భాగస్వామిగా వచ్చింది. అప్పటినుండి లోకంలో నేనున్నంతవరకు నేను మాత్రం స్వంతసోదరిలాగా చూసుకొన్నాను. కాని యీవిషయం లోకం అనే అర్థంలో తారుమారైంది. ఆఛాయ నీలో పగావర్తనమైంది. నూరీ; అసలులోకం చెవులకు, కళ్ళకు మనం అనుకొన్న విషయాలు అనుకొన్నట్లుగా వినబడవు అందుకే నువ్వు లోకరీత్యా మనసు లోతుల్లోకి చూడలేకపోయావు. మానవ సహజమైన మానసిక బలహీనతలో సత్యాసత్యాలు గమనించలేకపోయావు. నేను యిప్పుడు అనుకొంటూ వుంటాను, మన సుదీర్ఘమైన పరిచయఫలం ఏమైందా? అని.

"నేననుకొన్నా; నువ్వు తొందరగా ఇక్కడకు వొస్తావని; ఆవాడైనా నాకెందుకీ పరిస్థితి జరిగిందో తెలుసుకోవాలని అనుకొన్నా. అసలు సంగతి తెలిసింది. నా నిర్దోషత్వం వెలువరించాను. ఏమిటో...నిజంగా నాభారం ... ఏదో ... తగ్గినట్టుంది. అబ్బ...తేలికగావుంది నూరీ! ఇక వుండలేను. అబులుసుబుల్లి ప్రక్క సమాధి నది. వస్తా 'నూరీ...నువ్వు సాధ్యమైనంత తొందరగా కలుస్తా' ననుకొంటాను. భీకరమైన, ప్రచండమైన, భయానకమైన గాలివీచింది సుదర్శనం ఆకారం రెప్పపాటులో మాయమైంది.

నూరి మనస్సు జాగ్రదవస్థనుండి వెలుగులోకి తొంగిచూసింది. ఏదో ఒక ఆలోచన గాలిలోని గుడ్డలాగా చలించింది.

దిక్కులు చూశాడు. భయంలాంటి చీకటి; భారంలాంటి చీకటి; వికారంలాంటి చీకటి; మూగ చీకటి క్రమ్ముకుపోయింది.

'సు...ద...ర్శ...నం' గావు కేక. నిశ్శబ్దపు కడుపులో ప్రతిధ్వనించింది. రాత్రిచరిస్తున్న జీవులన్నీ ఒక్కసారిగా కంఠాలు విప్పాయి.

ఆ పిలుపును అందుకొన్నట్టు ప్రక్క యేటిలోని చేపతోకతో నీటినెగిరిచి శబ్దంచేసింది. కప్పలు ఒక్కసారిగా బెకబెకమన్నాయి. రావికొమ్మల సందుల్లోనుంచి చూస్తున్న చుక్క నవ్వింది ముసిముసిగా.

మబ్బుల మాటున గురకొయ్యలు నెత్తిమీద కొచ్చాయి — సన్నని తుంపురుల వర్షం వంటిమీదపడి ఆహ్లాదాన్ని కలిగిస్తూ వుంది. అడవి పువ్వుల సువాసన ఏటిదరినుంచి మెల్ల మెల్లగా వీస్తున్నది.

## 3

నూరి ఊడలమఱ్ఱిచెట్టుకు పదిగజాలు ముందు నుంచున్నాడు. చెట్టు గుబురుగా సందడిగావుంది. అతను చెట్టుదగ్గరకు వచ్చి మొదట్లో రాతిమీద కూర్చున్నాడు. అతనితలలో ఏవో ఆలోచనలు భ్రమిస్తున్నాయి.

యథావిధిగా సాగుతోంది ఆ ప్రదేశపు వాతావరణం.

నూరి లోలోపల గొణుక్కుంటూ ఆలోచిస్తున్నాడు. కొన్ని క్షణాలు గడిచాయి.

మఱ్ఱిచెట్టుమీద జిగేలుమని విద్యుత్తులాంటి కాంతి మెరిసింది. మఱ్ఱాకుల ఈనెల నీడలు ఆ వెలుతురులో భూమిమీద ప్రతిబింబించాయి. నూరి కళ్ళు బైర్లు క్రమ్మాయి. హృదయం ఒక్క క్షణం సంభ్రమించింది. చెట్టుపైకి చూశాడు తెల్లని ఆకారం కన్పించింది. ఏదో మధురమైన కూనిరాగాన్ని ఆలపిస్తూవుంది. ఆ రాగాలాపన హృదయ విదారకంగా కొంతసేపు ఉత్సాహభరితంగా కొంతసేపు వినబడ్తూ వుంది. నూరి మ్రాన్పడిపోయాడు. విప్పారిన నేత్రాలతో రెప్పవేయకుండా చూశాడు. గుండె వేగంగా స్పందించడం మొదలుపెట్టింది. ఏదో దిగులులాంటి బాధ. బాధలాంటి అనుభూతి. అనుభూతిలాంటి తలోచన మనసులో కదిలింది అతను అలానే చూస్తున్నాడు. చిటారికొమ్మమీద వెండిబొమ్మ అంతర్ధానమైంది. నూరి గాభరాపడ్డాడు కళవళపడ్డాడు; కంగారుపడ్డాడు; దిక్కులు పరికించాడు. ఇనుపతెరలాంటి చీకటి, తారురంగులాంటి చీకటిలో దృష్టి అనుసరించలేదు.

మఱ్ఱిమాను వెనుకగా పూర్వపు కూనిరాగం. చిరుగాలికి ఆ ఆకారపుపయ్యెద నీటితరంగంలా చలిస్తూవుంది. ఆ ఆకారం చెట్టుచుట్టు తిరిగి నూరికి సమీపాన.

నిలబడి ఆగిపోయింది. సూరి లేచి నుంచున్నాడు. ఆకారం కదల్లేదు, మెదల్లేదు.

"ఎవరు నువ్వు?" గాద్గదికంగా ప్రశ్నించాడు.

'ఎందుకూ?' సమాధానం. సూరికి అటువంటి మాటే ఎప్పుడో విన్నట్లు జ్ఞాపకానికి వచ్చింది.

'అసలు ఎవరో చెప్పు' గట్టిగా అడిగాడు.

'చెప్పకపోతే...' చిరునవ్వులో జవాబు.

'చంపుతా' అంటూ దగ్గరగా వెళ్ళాడు.

"అలాగే..." ఆకారం అదృశ్యమైంది. సూరికి ముచ్చెమటలు పోశాయి. ఆమాట ఎక్కడో విన్నట్లనిపించింది అతని వెనుక ఆకారం నిలిచింది.

అప్పటినుండి యిప్పటివరకు చంపడమేనా నీపని సూరీ?' అవహేళనను సూచించే కంఠనాదం ధ్వనించింది.

'అమ...లా' పిచ్చిగా, గోముగా అన్నాడు.

'జ్ఞాపకం ఉన్నానా?' జాలిగా అంది.

మెదడులో ఏదో షాక్ లాంటి ప్రవాహం, వీపున ఎవరో చరిచినట్లనిపించింది.

'నీకోసం...నీకోసం...యిలా అయిపోయాను అమలా! నిజంగా...' నిదానంగా మాట్లాడాడు.

'కాదు...అవినయంగా చేసినందుకు ఇలా అయ్యావని చెప్తే బాగుంటుంది' అంది వికృతంగా నవ్వుతూ.

'అంతేనంటావా?' అమాయకమైన ప్రశ్న వేశాడు.

'కాకపోయినా...ప్రస్తుతం ప్రమాదం లేదులే' ఖచ్చితంగా అంది కంఠం.

'ఎందుకు అమలా నాపైన ఇంత నిర్దయ. నీ కోసం నీ ఇష్టమైన చీరను తెచ్చానుయిదిగో!' అంటూ చింకిమూట విప్పబోయాడు.

'నేననుకొన్నా; నువ్వు తెస్తావని' ముక్కుతో నవ్వింది.

'నీకెలా తెలుసు' ఆదుర్దాగా అన్నాడు.

'ఆс...నీ సంగతి నాకు తెలియదూ?' ముసిముసి నవ్వులు ఒలికించిందాకారం.

ఆ నవ్వును చూసి రెప్పవేయకుండా అలానే వుండిపోయాడు. ఒక అలౌకిక స్థితిలోనికి అడుగుపెట్టాడు. మనస్సు ఒక మధురక్షణంకోసం రాగం పాడింది. శరీరపు అవయవాలు సమ్మె చేశాయి.

ఎదురుగా మల్లెపువ్వులాంటి పళ్ళతో అమల. పాలరాయి లాగావుంది ఆమె శరీరం, చీరలోనుండి తొంగిచూస్తున్న ప్రకృతి సౌందర్యం. శరీరంలో చలిస్తున్న లావణ్యప్రవాహం. ఆచ్ఛాదనం లేనట్టుగా కనబడుతూ గుండెలను గుబగుబలాడిస్తున్న ఉత్తుంగ వక్షోజాలు. తల దిమ్మెక్కిస్తున్న నిశ్చలదృష్టి. అంతంకాని అనగాలు. నల్లని వెంట్రుకలు. ముద్దుపెట్టుకొంటున్న నున్నని బుగ్గలు.

పిచ్చిసూరి ఉన్మాదుడయ్యాడు. సూరి శరీరం ఉడికింది. వేడెక్కింది. రక్తం ప్రకోపించింది. శరీరం తీయనిబాధతో వణికింది నరాలు పగాకు పొందాయి. కళ్ళకు చీకటి తెరలు క్రమ్మాయి. దేహాన్ని ఏదో శక్తి సమ్మోహనపర్చింది అతను గబుక్కున అమల ఆకారాన్ని కౌగలించుకొన్నాడు. ఆమె హృదయం ఘటిగా గుండెను హత్తుకున్నాడు అమల ఆకారం సూరి గాఢ పరిష్వంగంలో లీలమైనట్లనిపించింది. కాని త్రుటిలో అమల ఆకారం సూరికౌగిలిలో లేదు. ఏదో మెత్తని అసహ్యమైన పదార్థం కనబడింది. దానిని దూరంగా విసిరాడు. కొద్దిక్షణాలలో నవ్వుతూ ఆకారం ఎదుట ప్రత్యక్షమైంది. ఆమె కళ్ళు నవ్వుతున్నాయి.

సూరి తమాయించుకొన్నాడు. శరీరానికి చెమట పట్టింది అతను ఆకారంపైపు క్షుధార్తిత నయనాలతో చూశాడు. ఆమె తమాషాగా నవ్వింది.

'సూరీ! నిజంగా నువ్వెందుకు పిచ్చాడిలాగా అయ్యావు?'

'నీకోసం అమలా...నీకోసమే.....యిలాగయ్యా.'

'ఓహో! 'నీ' గాని 'మీ' కాదన్నమాట. అవసరమైన వస్తువు ఎదురుగా వున్నపుడు ఆలోచించకుండా తర్వాత అది కనబడకపోతే ఆందోళన చెందుతున్నట్టు కనబడే స్వభావం నీ ఒక్కడికే కాదులే! అది సరేగాని మన ప్రథమ పరిచయం ఎలా అయింది? నాకు జ్ఞాపకం లేదు. అందుకని అడుగుతున్నా. నీనోట తెలుసుకోవాలని వుంది యిప్పుడు.' సూరి కళ్ళల్లోకిచూస్తూ అడిగింది.

'ఓ...నాకు జ్ఞాపకం వుంది. ఆ రోజు సాయంత్రం పినుమూడి దగ్గర పికునాలాడడానికి నేను, సుదర్శనం వచ్చాం. చివరి బస్సు కొద్దిలో దాటిపోయింది. ఆ రాత్రి అక్కడే వుండడానికి నిశ్చయించుకొన్నాం. అప్పుడే నువ్వు, నుస్సిగా వున్న మీ ముసలమ్మ వచ్చారు. ఆ సంధ్యాసమయంలో చంద్రకాంతిపురంగు చీరలో వున్న నిన్ను చూశాను, నువ్వు కూడా చూశావు. మన కళ్లు భాషించుకొన్నాయి. ఆ

రాత్రి అక్కడ జాగరం చేశాం. తెల్లవారింది. ఉదయ భానుని తెలిరేఖలు తూర్పున. ఆ రోజు ఎంతో ఆనందంగా వుంది. అప్పుడే మీ ముసలమ్మ చనిపోయింది. నీకేమీ గతిలేదని దీనంగా యేడ్చావు. దిక్కు మొక్కు లేదని వాపోయావు. నేను నీకు అభయమిచ్చాను. కన్నీళ్ళతో నాతో వచ్చేశావు. అదేగా మన మొదటి పరిచయం.' తొలినాటి సంఘటనలు స్మృతిలో మెదిలాయి.

'అవును నిజంగా అదే రోజు ... అవునూ ... మరే ... తొలిరోజుల్లో నా సాహచర్యాన్ని గూర్చి ఏమనుకొనేవాడివి.?'

'ఏముందీ ... నీకనుసన్నల్లో నేను మెలగాలని అనుకొన్నావు. నేనూ ... భరించలేని ఆనందంతో తబ్బిబ్బయ్యాను. అప్పుడే...జీవితం అనే పదానికి అర్థం అవసరమైంది. నా యెడారి జీవితంలో అమృతం వర్షించావు. అగమ్యమైన జీవితానికి ఒక దారి తెన్ను కనబడింది. నేను మాత్రం...ఈ ఉపోద్ఘాతం యెందుకు గాని నా జీవితం మారిపోయింది అని అనుకునేవాడిని.' ఒక ప్రక్కకు చూస్తూ అన్నాడు.

'ఊఁ... నేనూ కొంతకాలం అయిన తర్వాత అనుకొన్నా నా జీవితం మారిపోయిందని' ఒక దరహాసంలాంటిది వెలువడింది. క్షణంలో మాయమైంది.

'ఇంతకీ...నన్ను బాగా...ప్రేమించావంటావు?'

'ఏం...అనుమానమా?' ఆమె దగ్గరగా వెళ్తూ అన్నాడు.

అమల ఆకారం అతనికి దూరంగా నడుస్తున్నది. కాదు; నడుస్తున్నట్లుంది. ఆకారం పాదాలు నేల మీద ఆనటం లేదు. ఆమె గాలిలో నడుస్తుంది. సూరి కూడా నడుస్తున్నాడు.

'అహాఁ... లేదు ... ఆఁ... అన్నట్టు ...సుదర్శనం...స్థితి ఎలావుందో?' సూరిని ప్రక్క చూపులు చూస్తూ అడిగింది.

సూరి తలలో పిడుగుపడింది. కళ్ళల్లో కారం రేగింది. నిశ్వాసంలో వేడి కలిసింది. హృదయంలో విషం ఊరింది.

"నీకనవసరం" తీక్షణంగా చూస్తూ, పౌరుషంగా అన్నాడు.

'పోనీ...మీ విషయంలో' ఆకారం ముఖంలో నవ్వు తొణికిసలాడింది.

'అదే...నీకనవసరం' ప్రతిపదాన్ని నొక్కుతూ అన్నాడు.

'మీ మిత్రుడు కదా?!' ఆశ్చర్యంలాంటి అవస్థలో అంది.

'ఏం...?... నీకు ... మాత్రం ... కాదా?' ముక్కుపుటాలు ఎక్కువ గాలిని తీసుకొంటున్నాయి. కళ్ళు సంకుచించాయి.

'నాకు మిత్రుడేంకర్మ...' అమల ఆకారం ఫకాలున నవ్వింది. తెరలు తెరలుగా నవ్వింది. కవ్వించినట్లు నవ్వింది. హృదయంలో చెయ్యిపెట్టి కెలికినట్లు నవ్వింది.

సూరి రక్తం సముద్రపుపోటులా పొంగింది. కళ్ళు మూసుకపోయాయి. గొంతు విప్పారింది. పెదాలు స్పందించాయి.

'అ...మ...లా...' గొంతు మరోకలోకంలో ధ్వనించింది. యోగప్రకృతి రాగం తీసింది. స్వప్న ప్రపంచంలోని ప్రాణులు ఉలిక్కిపడి లేచాయి. రోషంతో ఘోషించాయి. భంగపడిన నిశ్చలప్రకృతి నిశ్వాసంగా పెనుగాలి విడిచింది. ఆకులు రాలుతున్న శబ్దం. ఏటికడుపులో అలలు కదిలిన శబ్దం. ఎండుటాకులు ఫెళఫెళమన్న చప్పుడు.

'అయితే...నిజమేనన్నమాట. వాడు...చెప్పిన మాటలు పచ్చి అబద్ధాలన్నమాట. అబ్బో! ధైర్యంగా చేసిన ఘనకార్యాన్ని వెల్లడిస్తున్నావా వంచకీ! ఆడజాతికే కళంకం తెచ్చావు...'

'ఎట్లా కళంకం?' నవ్వుతూ అంది.

'ఇంకోణ్ని వాంఛించడం ఏమవుతుంది?' కసిగా అన్నాడు.

'కామానికి...పరిభాష అవుతుంది. కాకపోతే ...నువ్వు లలితతో ...ఏంచేశావో అదే అవుతుంది... అంతేగా" ముసిముసినవ్వులు నవ్వింది. నవ్వుతుంటే ఆమె రొమ్ములు లేస్తున్నాయి.

అగ్నిపర్వతం ప్రజ్వరిల్లింది. సముద్రం అవధి అధిగమించింది. కళ్ళలో రక్తం కారింది. ఆకాశం విరిగింది. భూమి బ్రద్దలైంది.

'మగవాణ్ణి...ఏమైనా చేస్తా...కానీ...నిన్ను ...నిన్ను ముక్కలు చేయనందుకు విచారిస్తున్నా. నీ రక్తాన్ని...కళ్ళజూడనందుకు సిగ్గుపడుతున్నా... అబ్బా!...నిన్నేం చేయాలి?' మనిషి చలించిపోయాడు. అమల ఆకారాన్ని పట్టుకోబోయాడు. ఎలా సాధ్యం? ఆకారం నవ్వుమాత్రం ఎగతాళిగా ధ్వనించింది.

'వాడు లేడూ?...సుదర్శనంగాడు. వాడి రక్తం త్రాగాలి; స్నేహాన్నే కలుషితం చేశాడు. వాడి-

గుండెకు రంధ్రాలు వేసి, నీముఖం చెక్కి, అవయవాలు చిత్రవధ చేసి, మ్యూజియంలో పెట్టి....'స్నేహానికి ప్రేమకి ప్రతిబింబాలు' అని వ్రాసివుండాల్సింది. భలేగుండేది. బ్రహ్మాండంగా వుండేది...అహ్హాహా...అహ్హాహా...' అంతులేని నవ్వు, అర్థంకాని నవ్వు, అపశ్రుతిలాంటి నవ్వు స్మశానంలో మారుమ్రోగింది.

మసక చుక్కలు మబ్బుముసుగుల్లో దాక్కున్నాయి. వికసించబోతున్న పుష్పం ముకుళించుకొంది. మాతృగర్భంలోనుంచి లోకంలోకి రానున్న శిశువు మరణించింది. ఆలోచనా తంతువు తెగింది. మెరుపుతీగ విరిగింది. కన్నీళ్ళకు ఆనకట్ట కట్టబడింది. హృదయం పాషాణకవచం ధరించింది.

సూరి నవ్వుతున్నాడు. అది పిచ్చినవ్వు అనుకొంటే సూరి మంచివాడు మంచివాడు అనుకొంటే పిచ్చినవ్వు. సూరి తూర్పువైపు నడుస్తున్నాడు రాక్షసిబొగ్గులాంటి చీకటిలో మల్లెమొగ్గలాంటి అమల అతన్ని వెంబడిస్తూ వుంది. రావికొమ్మల్లోని చుక్క పిచ్చిగా చూస్తోంది. ప్రకృతి మౌనందాల్చింది. మఱ్ఱి చెట్టు దాటారు. కొంతదూరం వెళ్ళాక —

'నీకోమాట చెప్పాలని వుంది?' అంది అమల గొంతుక.

సమాధానంగా అనంతమైన నవ్వు. అర్థంకాని నవ్వు. పిచ్చినవ్వు.

'నువ్వు నన్ను ప్రేమించానన్నావు. మొట్టమొదటిరోజుల్లో అంతేననుకొన్నా. తర్వాత కామించావు అని తేలింది. అంతేకాదు; రంగురంగుల పుష్పాల ప్రియుడవనికూడా తెలిసింది. నేను మోహం మొత్తాను. నీలో మార్పు గమనించాను. నేను ప్రకృతికి అతీతురాల్ని కాదు; నా రక్తానికి సమాధానం చెప్పుకోడం నా చేతకాలేదు. నా తృష్ణను ఆర్పుకోలేక పోయాను. నామనస్సును బంధించలేకపోయాను. కాబట్టే సుదర్శనాన్ని వాంఛించాను; కోరాను; కాంక్షించాను. ఇదంతా నువ్వు లేనప్పుడే జరిగింది. కాని...ఏం... జరిగిందో తెలుసా? లోకం అనుకొనేదానికి వ్యతిరేకంగా జరిగింది. ఊహించలేనంత విపరీతంగా జరిగింది. సుదర్శనం...నీ...నిజమైన స్నేహితుడు. హృదయంలో ఆలోచించే మగాడు. నన్ను నిరాకరించాడు. ఆశ్చర్యపడుతున్నావా? నిజంగా...నిరాకరించాడు. కాని...ప్రేమించాడు...సోదరిగా ప్రేమించాడు... సోదరిగా ప్రేమించాడు. చందమామలాంటి మనస్తత్వం గుర్తించలేక, నిజానిజాలు తెలుసుకోలేక, మనస్సులో కుళ్ళి గ్రహించలేక లోకం గోడువిని, అమానుషంగా, మూర్ఖంగా, దారుణంగా మమ్మల్ని చంపావు. రత్నాన్ని జారవిడుచుకొన్నావు.' కంఠం ఆగిపోయింది.

రెల్లుగడ్డి దుబ్బుల్ని పట్టుకొని నీటి నిశ్శబ్దతను, కప్పల అరపులను పరిశీలిస్తూ పెనగులాడుతున్న సూరి చివరివాక్యాన్ని వినగానే స్తంభించిపోయాడు. దిగ్భ్రాంతుడయ్యాడు. మంచు పర్వతంలాంటి కఠిన హృదయానికి అమల మాటల వేడితగిలి కరగిపోయింది. మనస్సుకు అర్థంకాని కాని సమాధానం స్ఫురించింది. ఆకాశం ప్రశాంతమైంది. రావికొమ్మల్లోని చుక్క హేళనగా చూసింది

సూరి చేతిలోని రెల్లుగడ్డి పట్టు తప్పిపోయింది. తల క్రిందుగా జారిపోయాడు. ధన్‌మని మోత. జాము కొమ్మ విరిగింది కట్టు ప్రవాహాన్నుండి ఏటిగర్భంలోనికి సురక్షితంగా వెళ్ళిపోయాడు. వలయాకారంగా నీటి తరంగాలు వ్యాపించింది అలసి నిద్రపోయాయి.

వికసించిన పుష్పం రాలిపోయింది. ఆలోచనా తంతువు అతుక్కుంది మెరపుతీగ కలిగింది. ఏదో ప్రాణి గోలచేసింది. హృదయం కవచంవిప్పి జలస్నానం చేసింది.

తీతువుపిట్ట వికృతంగా కూసింది.

చుక్క రాలింది.

ఎక్కడో సుదూరంగా కోడికూసింది.

ఒక్కసారి ప్రకృతి ఆహ్లాదంగా కోలాహలం చేసింది.

రాత్రి కొంత కళ్ళు నులుముకొంటానికి ప్రయత్నం చేస్తోంది.

తూర్పు సూర్యుణ్ణి ప్రసవింప బోతుంది.

# రామాయణ కల్పవృక్షము : విరాధవధ

## శ్రీ కేతవరపు వేంకటరామకోటిశాస్త్రి

శ్రీమద్రామాయణమున ప్రసక్తములైన చిన్న కథలలో విరాధుని దొకటి. రాముడు వీనిని చంపినాడు. చంపలేదు. చచ్చునట్లుగా చేసినాడు. ఆ చేయుటయు విరాధునిమాట చొప్పున. ఇది చిత్రముగానున్నది. అనగా విరాధుడు తనను చంపుమార్గ మిది యని రామునితో చెప్పినాడన్నమాట. ఇట్లనుటవలన విరాధుడు చావును కోరి దానికై నిరీక్షించుచున్నాడన్నమాట. ఈవిరాధుని జీవలక్షణమే చమత్కారముగా నున్నది. వాల్మీకి వ్రాసినాడు. "స్వయం విరాధేన హి మృత్యు రాత్మనః ప్రసహ్య రామేణ యథార్థ మీప్సితః నివేదితః కాననచారిణా స్వయం న మే వధః శస్త్రకృతో భవే దితి" రామాయణమును తెనుగున చాలమంది వ్రాసిరి. ఊరక కథ వ్రాయుట కేమి? ఎవడైనను వ్రాయవచ్చును. కథాగత జీవలక్షణమును గుర్తించి వ్రాయుట నిశిత పరిశీలనాదక్షము, ధీవిశేషముగలవాడు చేయగలిగినది. విరాధవధ నిర్వహణమున కేవల మొక్క విరాధుని జీవలక్షణము ప్రస్ఫుటమైన తత్సన్నివేశము పూర్ణాకృతినందినట్లు గాదు. రాముడు, లక్ష్మణుడు, సీత వీరు ముగ్గురును విశిష్ట ఘటనముతో సంబంధముకలవారు. వారివారి జీవలక్షణములును అచట సముచితముగా చూపబడవలయును. భాస్కర రామాయణమున నీ ఘట్టము ఇరువది నాలుగు గద్యపద్యములలో ముగిసినది. భాస్కరునకు కథాగతములైవచ్చు పాత్రముల జీవలక్షణములను స్పష్టముగా నిర్మించుశక్తి లేదు. వాల్మీకి రాముడు విరాధుని చంపినట్లుగా వ్రాసినాడు గనుక భాస్కరుడును వ్రాసెను. అసలు రామాయణము నాత్మను స్వయము దర్శించి అది ఫలానా అన్న నిష్కర్షతో వ్రాసినవాడు కాడు భాస్కరుడు.

వాల్మీకి రామాయణమునకు భాష్యముగా వచ్చిన శ్రీమద్రామాయణ కల్పవృక్షమున పూర్వరామాయణములలో లేని వైశిష్ట్య మొకటి ఎడతెగక స్ఫుటముగా నున్నది. ఈ విరాధవధ ఈ కల్పవృక్షమున యాభై ఆరు గద్యపద్యములలో నిర్వహింపబడినది. దీనికి ముందు ఎనిమిది గద్య పద్యములతో పూర్వరంగము నిర్మింపబడినది. ఈ పూర్వ రంగ కల్ప కేవలము విశ్వనాథోపజ్ఞము. ఏ తద్రంగమట్లుగా న టకు హేతువు రాముని జీవలక్షణములోని వైచిత్ర రాముని జీవలక్షణము స్వరూపమేమి? ఏతత్స రూపము సర్వమును ఇట సమీక్షింపక ప్రధానా ములను చెప్పెదను. అందు హాస్యశీలత మొదటి ఋషులన్న మెత్తని తలపు రెండవది. అన్నింటికి మూలమైనది ధర్మాధర్మ వివేకముతోడి ఆత్మజ్ఞత్వ ఈ యీ గుణములు రామునియం దీకల్పవృక్షమ తత్రతత్ర నిక్షిప్తములు. బాలకాండమున శ్రీరా సోదరుల విద్యాభ్యాసంగముతో పూర్తియగు అ తార ఖండాంతమునకు రాముడు హాస్యాద్భుత శీ యని కవి తానుగా నిష్కర్షచేసెను. అయోధ్యా కాండ ప్రస్థాన ఖండమున యమునానదిని దాటి తరువాత శ్రీరాముని విరుగబడి నవ్వుటను చూచి సీత లక్ష్మణులు "ప్రకృతితో నొకడై పసివానివో కన్పడు, కుహనా మనుష్యాకృతి సాగరబంధము లూడి నట్లుగ" అని అనుకొనినట్లుగా చెప్పి రాము హాస్యశీలత అరణ్యమునకు వచ్చినతరువాత మరియ నధికమైనట్లుగా చూపించినాడు కల్పవృక్షకర్త. తర వాత అరణ్యకాండమున మారీచునిచే రామునిలోనున లోప మా హాస్యశీలతయే అనిపించును—ఈ రాము హాస్యశీలమును విశ్వనాథ ఇంతగా అచ్చటచ్చట స్పష్టప చేసినాడని చెప్పుట యేలయనగా రాముని జీవలక్ష సంబంధి హాస్యమే ఈ విరాధవధకు పూర్వరంగము సముచితముగా నిర్మించినదని చెప్పుటకు. అనగా విశ నాథ రాముని ఆ జీవలక్షణము నచట పైకి తెచ్చినాడన మాట.

అసలు విరాధవధకు మొదటేది వాడు సీతను పట్టు కొనుట. అడవిలో సాధారణముగా లక్ష్మణుడు ముం నడచును. వెనుకగా రాముడు, సీత మధ్యలోనుం నడచును. ముగ్గురును దాదాపు వెంటవెంటగా నడతుర రామలక్ష్మణు లంత దగ్గరగా నున్నపుడు విరాధుడ సీతను పట్టుకొనుటకు వీలు లేదు. వీలు లేదనగా వీ

# రామాయణ కల్పవృక్షము : విరాధవధ

లేదని కాదు గాని, వారు సీతమీదికి వచ్చినప్పుడు వారేమిచేయుచుండిరను ప్రశ్న వచ్చును. రంగనాథుడు వ్రాసినాడు. గరుడుడు బాలనాగమును బలిమి నొడిసి మింటి కెగసినట్లుగా విరాధుడు సీత నెత్తికొని మింటి కెగసినాడని—అది వేగు విషయము. భాస్కరుడీ మాత్రపు టూహాయును చేయలేదు. "గదిసి జానకిఁబట్టె శీఘ్రముగ జంకఁదాల్చి"నా డనినాడు. ఈ కల్పవృక్షమున సీతను విరాధుడు పట్టుకొను సమయమునకు రామలక్ష్మణు లిరువురును సీతకు కొంత దూరముగాపోయిరి. ఊరక సీతను దూరముగా వదలి వారు పోరు. ఆ వారి పోవుట చమత్కారముగా కల్పింపబడినది. రాముని జీవలక్షణ మాధారముగా కల్పింపబడినది. దండకారణ్యమున వారు ముగ్గురును పోవుచున్నారు. దూరముగా సమీపమున చెఱు వేదో ఉన్నట్లు తోచినది. సీత నడువలేక కొంతసేపు సేద తీర్చుకొనవలయు నను కొన్నది. అనుకొన్న తరువాత—

"చెఱువు నొద్దున విశ్రమించెదము కాదె
యనిన జానకి శ్రీరాముడనె అయోధ్య
వదలి విశ్రాంతికొరకయి వచ్చినావె
అనిన జానకి యటఁగలదా యటంచు"

"అవున అయోధ్యలోఁ దెలిపి
యంతని యింతని చెప్పనా? ధరా
ధవుడు స్వస్నైక జీవదనె
దైవతలోకము బిడ్డయైన రా
ఘవుని వనంబుపోక కథకట
నిరంతము ప్రస్తుతలి. అ
న్న వదలినటి చెప్పులయినన్
బినతమ్ముడు కొల్వ దప్పరిన్."

ఇది సీతారాముల సంభాషణము. 'చెరువు నొద్దున విశ్రమించెదము కాదె' యనిన జానకి మాటలోని యర్థమది కొంచెముసేపు సేద తీర్చుకొనవలయును. నే నలసిపోయినాను అని. అయోధ్య వదలి విశ్రాంతికొరకయి వచ్చినావె యని రాముడనుట చమత్కారగర్భము. చిన్న దెప్పిపొడుపు. అది పుట్టిదని ఎప్పుడో తెలియునన గా అయోధ్యాకాండమున రాముడు సీతను నీ వరణ్యము రావద్దనుట—ఆమె వచ్చెదననుటగా సాగిన అచటి సంభాషణము స్మృతిలో నున్నప్పుడు. "వైదేహి యున్ నీ వెంటం బడిరాక నీకు బరువా?" "వనంబులకు నేన్ నీ వెంట నే వచ్చెదన్" అన్నది సీత.

"నీ వరుదెంచు మార్గమున నీ పదుబాటకు (నాకు) బాధ తప్పదు" అనినాడు రాముడు. "నిన్ను వెన్నాడి దను నాకు నెవ్వగ యని కలిగింపగద. బానయుఁ గలుగు నీకు" అన్నది సీత. అప్పుడా యనుట నిజమే. నీతో నున్నచో నాకు బాధేమి. అదే సుఖము అని అప్పుడన్న సీతమాటలోని పరమార్థము వేరు. తీరా అడవిలో నడచుట ప్రారంభమగుకాగా సీతకు కొంచెము శ్రమయనిపించినది. అందుకన్నది చెఱువునొద్దున విశ్రమించెదము కాదె అని. హాస్యశీలుడు రాముడు దానిని సాగదీసి చమత్కరించినాడు. ఆ చమత్కారమును సీత మరొకవైపుగా త్రిప్పినది. "అవును అయోధ్యలో తెలిపి యంతని యింతని చెప్పనా... అన్న వదలినటి చెప్పులయినన్ పిన్నతమ్ముడు కొల్వ దప్పరిన్" సీత ఇట్లుగా త్రిప్పుట నిజమునకు భరతునిపై తనకట్టి యభిప్రాయ ముండికాదు. కేవల రాముడు మాటకు మాటగా నేదో మాటాడవలయునని మాత్రమే. సీత ఆంతర్యము రామునకు తెలియదా? బాగుగా తెలియును. కాని తదాంతర్యమును గుర్తెరిగినవానివలె పై యర్థమునకు కోపమువచ్చిన వానివలె నయ్యెను. అందువలన రాముడు మాటాడలేదు. నడచుచుండెను. సీతకు రాముడు మాట్లాడుట కావలయును. రామునకు కోపము వచ్చినట్లుగానున్నది తానే కల్పించుకొని మాటాడవలయును.

మనము మరలు తీగను త్రో
వ్వన జాడగఁగానిపించుఁ గేవల మిది త్రో
వన విలు లేదు చేఱువను
కానివది కన్పింప దడవికోనయొకొ కన్"

"నా రాముఁడనె నెంతయున్ మరులు
కొన్నంగాద టే ఘోరకాం
తారంబున్ పతితోడ వచ్చి
టనినన్ ధాత్రీజ గర్వంపుబు
ద్ధ్యై రాసైనది భర్తపై మరలు లేదన్నన్
రఘూత్తంసకుం
డారంభించు శిరఃప్రకంపము
ముందై యేగ మారంబునన్"

ఎంతసేపటికి చెఱువు రాదేమి? మనము మార్గము తప్పలేదుగదా? ఈయడవిలో నెంతసేపని యిట్లు నడచుట?—ఇది సీత తాత్పర్యము దానికేదో రాముడు సమాధానము చెప్పవలయును. చెప్పనియే— చెప్పవ

లయుననియే సీత అట్లనినది. రాముడు బదులు మాటాడినాడు. ఆ మాటాడుటలో నున్నది చమత్కారము. సీత మాటలుగా నన్నది మనము మరులు తీగను త్రొక్కినజాడగా గనిపించుచున్నదని. హాస్యాద్భుతశీలి రాముడు ఆ సీతయన్నదానిలోని మరులు శబ్దమును విడిగా గ్రహించి తదర్థమును పైకలాగి దానిని జానకిమీదికి విసరినాడు. ఆమె అంతకుముందు అయోధ్యలో మాత్రము విశ్రాంతియున్నదా అన్నట్లుగా ధర్మంపు బుద్ధ్యా రాపైనది. భర్తపై మరులు లేదన్నది. ఆమె ఈ మాటను చమత్కారగర్భముగా గడుసరిమాటగా అన్నది. రాముడా చమత్కారమును గ్రహింపనివాడువలె కోపముడి విస్ఫుట కోపాభిమాన హృదయుడట్లుగా, ఆరంభించు శిరఃప్రకంపముగా సీతను వెనుకగా చేసి ముందుగా నడచినాడు. క్రమమున కించిద్దుఃఖాభిమాన హృదయ జానకి వెనుకనై సాగినడచినది—వారు తటాకము తీరము చేరుకొన్నారు. లక్ష్మణుడు కంటకావృతమైన తత్తటమును యోగ్యసనాస్థానము చేసినాడు. కాని రాముడు ఇంకకొంచెము దూరముగా బోయి నిలువబడినాడు. సీత అట్లే వెనుకగా నిలువబడినది. లక్ష్మణున కేమియు తోచక తను తటాకములోనికి దిగినాడు. రాముడు దూరముగా సీతవైపు చూచుచు నిలువబడలేదు. విముఖుడై నిలువబడెను. వెనుదిరిగి తనను పిలచునేమోనని సీత అట్లే నిలువబడినది. విముఖుడైన రాముడు నెమ్మదిగా అడుగులు ముందుకు వేయుచుండెను. ఈ సమయమున విరాధుడు సీతను పట్టుకొనెను. రాముడు సీతవైపు చూచుటలేదని ముందుకడుగులు వేయుచున్నాడని, ఎట్లు తెలియ వచ్చినదనగా—విరాధుని వికటాట్టహాసమునకు "విముఖుండైచను స్వామి జానకిదెసన్ వీక్షించె"నన్న పద్యము వలన—విరాధుడు సీతను పట్టుకొనుటకై పూర్వరంగమును రాముని హాస్యశీలము నాధారముచేసి సీతనుండి రాముని దూరము చేయుటలో ఈ వ్యాసమున మొదట వేయబడిన ప్రశ్నకు సావకాశము లేకపోవుటతో బాటు మరొక రహస్యమున్నది. రాముడు చెంతలేనపుడే సీతకు కష్టము వచ్చునుగాని దగరగా నున్నపుడు రాదు. రావణుడు సీత నపహరించినది రాముడు లేడివెంటబడి దూరముగా బోయిన తరువాత. కాకాసురుడు సీతను వేధించినదియు రాముడు సమీపమున నున్నను నిద్రించుచున్నపుడు. జాగృతుడు దూరమున నున్నను నిద్రితుడు ప్రక్కనున్నను ఫలిత మొకటియే. మరియును ఈ మూడింటియందు నొక విశేష మున్నది. లేడివెంటబడి రాముడు దూరముగా పోవుటకు సీతయే హేతువు. శోకముచే నంతగా పీడింపబడుటకును 'తానట్టిట్టుల దూగినన్ బతికి నిద్రాభంగమౌ' నని ఓర్చుకొన్న సీతయే హేతువు. ఇపుడు విరాధుడు పట్టుకొనుటకు వీలుగా రాముడు దూరము పోవుటకును మాటకు మాటగా చమత్కరించిన సీతయే హేతువు—కల్పవృక్షమునందలి విరాధవధకైన పూర్వరంగ మింతగా భావగంభీరము. సన్నివేశ మత్యంతము సహజముగా దానంతట అది అట్లుగా ఏనట్లుండుట రాముని జీవలక్షణసంబంధి హాస్యశీలత—సీతాపాయరహస్యము—పరస్పర ముత్కర్షాపాదకములుగా పూర్వరంగము నిర్వహింపబడినది. వ్యంగ్యసర్వస్వ భారతియైన మహాకవి కావ్యనిర్మాణ శిల్పమట్లుండును.

ఇచట నింకొక విషయము చెప్పవలయును. రాముడు దగ్గరగా నున్నపుడు విరాధుడు సీతను పట్టుకొన్నతో రాముడూరకుండునా అన్న ప్రశ్న వచ్చునని రాముడుదూరముగానున్నటు కల్పింపబడినట్లు చెప్పినావుగదా?—వెనుదిరిగి సీతను పట్టుకొన్న విరాధుని చూచికూడ రాముడువెంటనే వానిమీదకు రాక లక్ష్మణునితో ఏమేమో అనుచూ బాష్పపర్యాకులేక్షణుడైనట్లు వ్రాయుట బాగున్నదా? అను సందేహము కొందరకు రావచ్చును. "తరణికులులు నిలిచి చూచుచుండి వివ్వెరపొందిరి సీత పొందుచున్న చేటునరసి" అని వ్రాయబడినది. అనగా దాని అర్థమిది. వారరణ్యము ప్రవేశించిన తరువాత కనిపించిన మొదటి రాక్షసుడు విరాధుడు. వాని యాకారము వాని వేషము—వాని హుంకారము రామలక్ష్మణులకు భయము గొల్పునట్లుగా నున్నవి. తాటకొడుకులను చిన్నతనమున చూడలేదా? సంహరింపలేదా? అని యనవచ్చును ఇపుడు సీత చేటు పొందుచున్నది. అయినవారిశ్రేయోపదగా రక్షించుటకు వెంటదూసుటయు, ఒడ్డున కాలు నిలువద్రొక్కకొనలేక గావుకేకలు పెట్టుచు ఏడ్చుటయు రెండును లోకమున నున్నవి. పైగా విరాధుని సీతపట్టుకొనుట హఠాత్సంభవము. దానివలన నిశ్చేష్టత. వెంటనే విరాధుని మీద పడవలయునన్న ఊహరానీయ నిశ్చేష్టత ఇంకను విరాధుడచటనుండిపోక ఆమెనట్లే పట్టుకొని వారితో మాటలకు దిగినాడు. ఆ మాటలలో వాడు కొంచెము సరళస్వభావుడుగా నున్నాడు. సామముమీద వాని

నుండి సీతను విడిపించుకొనుట ఒక ఊహ. ఆ కష్ట సమయములో రామునకు తన యీ రాకకు హేతువైన కైకస్మృతికి వచ్చుటయు, తాను వద్దన్నప్పుడు మాట వినని సీత అరణ్యమునకు రాకుండినచో బాగుండెడి దన్న భావము వచ్చుటయు అసహజములు కావు.

ఇక విరాధుడు, వాని యుదంతము చిత్రమైనది. బ్రతికియుండగనే పాతి పెటబడిగాని వాడు మరణింపడు, అదియును రాముని చేత. ఇదంతయు వానిని శపియించిన కుబేరుడు తనకు ప్రార్థనా మృదువై ప్రసాదించిన శాపావసాన విషయము. దీని యొక్క విరాధునకున్నది ఉన్నదని యెటు తెలియును వాల్మీకి రామాయణము చదివిన తెలియును. "తపసా పురుష వ్యాఘ్ర! రక్షసోఽయం నశక్యతే, శస్త్రేణ యుధి నిర్జేతుం రాక్షసం నిఖనావహే" అని రాముడనగానే "హతోఽస్మి పురుషవ్యాఘ్ర! శక్రతుల్యబలేన వై మయా తు పూర్వం త్వం మోహాన్న జ్ఞాతః... ...త్వం విదితో మయా వై దేహీ చ మహాభాగా లక్ష్మణశ్చ మహాయశాః. అపి శాపాదహం ఘోరాం ప్రవిష్టో రాక్షసీం తనుమ్, తుంబురుర్నామ గంధర్వ శ్శప్తో వైశ్రవణేన హ. ప్రసాద్యమానశ్చ మయా సోఽబ్రవీన్మాం మహాయశాః, యథా దాశరథీ రామస్త్వాం వధిష్యతి సంయుగే. తదా ప్రకృతిమాపన్నో భవాం స్స్వర్గం గమిష్యతి" ఇత్యాదిగా తనపూర్వజన్మవిషయమును విరాధుడు చెప్పినాడు. విరాధుని ఆయెరుక వాల్మీకి రామాయణమును విశితముగా పరిశీలించినచో బోధపడును. ఆ యెరుక విరాధునకుండనిచో రాముడిక వీడు చావడు గాని గోయి త్రవ్వుము. దొల్లింత మనగానే వాడంత తెలివిగా మాట్లాడినట్లుగా వాల్మీకి వ్రాయుట పొసగదు. అంతకుపూర్వము వానితో పోరాడిన వారెవ్వరును గోయి త్రవ్వి పాతిపెట్టు నూహ చేయలేరు. ఆ యూహ రామునకు వచ్చినది. విరాధునకు శాపావసానము సన్నమైనదిగదా యని ప్రాణములు లేచివచ్చినవి. విరాధుని జీవసంపుటిలోని ఆ వైశిష్ట్యమును విశ్వనాథ పట్టుకొనెను. ఆ పట్టుతో విరాధుని పాత్రను కల్పవృక్షమున చిత్రించెను. శాపావసాన విషయము మెఱుకలో గలవాడు, దానికై నిరీక్షించువాడు, ఐన వాని ప్రవృత్తి యెట్లుండును? దానిని ఊహించుటకు మహాప్రతిభ కావలయును. ఆ యూహ చేసినపుడు వాని పైశాచిక దేహధర్మమున కది భిన్నముగా నుండరాదు. ఉన్నచో ఆత్మ పట్టుకొని దేహమును వదలినట్టగును. అనగా విరాధునికథ వ్రాయువానికి వాని ఆత్మధర్మము, దేహధర్మము రెండును ముఖ్యము లౌనన్నమాట. విరాధుని సర్వప్రవృత్తియు రాక్షస సహజముగా కనిపించుచు గంధర్వత్వ భావము స్మృతిపథమునుండి జారిపోలేదన్నట్లుగా నుండవలయును. అట్లుగా నిర్వహింపబడినపుడే కావ్యము రమణీయమగును.

"మీ దేదేశము? మీరలున్ ద్విజులె
కా? మీ నామధేయంబు లె
ల్లైదీపించును? శూద్రమాంసమును
వాడన్ నేను. మీ రిట్టిరం
చాదింజెప్ప డెరుంగరానిదగు
నీ అన్నంబు నేముట్టను
ద్వ్యాగుల్ క్షుద్రజనుల్ భుజింతు
రటవీ పర్యంత మే దైవనున్"

విరాధుడు రామలక్ష్మణులతో తన బలపరాక్రమములు చెప్పి వారిని బెదరించి చివరకన్నమాట లివ్వి. ఈ అనుట చాల చిత్రముగా నున్నది. వాడు శూద్రమాంసమును వాడడు. క్షుద్రజనుడు కాడు తాను. రాక్షసాకృతి నున్నవాడట్లుగా మాటాడుట హాస్యస్ఫోరకమై వాని వికటత్వమును స్థాపించుచున్నది. మరియు నది వానిగంధర్వత్వభావమున కనుగుణముగా కూడనున్నది—శాపావసాన మెఱుకలో నున్నవాడు దానికొరకై వేచియుండును. అందువలన వాడెవరి మీదకు పోయినను వారియానుపూర్విని ముందుగా విచారించును. తన శాపమోక్షమును ప్రసాదించు రాముడెప్పుడైనను రావచ్చును. రాముడు క్షత్రియుడు. అనగా ద్విజుడు. ఆ కులమువాడై ఆ పేరుతో నున్నవాడు తనకు శాపమోక్షము ననుగ్రహించువాడు కావచ్చును. అందుకై విరాధుడు ముందుగా విచారించును. శూద్రమాంసమును తాను వాడకపోవుటను చెప్పుట ఎదురయిన వ్యక్తి ఫలానా అని తెలియుటకు. వాడు నిరంతరము ద్విజమాంసము నే తినుచుండు వాడేల కారాదు? కావచ్చును. ముందట్లుగా విచారించి తనకు శాపమోక్ష ప్రదాయి కానివానిని తినుచుండవచ్చును. రాముడు విరాధుని ప్రశ్నలకు సమాధానముగా తమ యుదంతము చెప్పిన తరువాత "ఈ మెను వదలి మీ దారిని మీరు పొండు. తండ్రి మాటబడి యడవికి వచ్చితిమని చెప్పుచున్నావు. మిమ్ము చంపి తినుట యెందులకు?" అనినాడు విరాధుడు. విరాధుడు శాపావసాన మెరిగి దానికై వేచియున్నవాడు కలెనే ఆ మాటయు ననినాడు. రామలక్ష్మణులను చంపి తినవలయునని వానికి లేదు. తాను వారిచేత చంపబడవలయుననియే యున్నది. ఇది ఆత్మధర్మము. పైకి వికటముగా రాక్షసుడువలె కామాతురుడైన వాడువలె ఈ మెను వదలి మీరు పొండు— మిమ్ము చంపి తినను. అది నా కేమాలకగు ననినాడు.

విరాధుడనలేన గంధర్వత్వ భావము కలిమి పైశాచిక దేహముతోడి ప్రవృత్తి నెరపుట విశ్వనాథ బహుచమత్కారముగా నిరూపించినాడు. లక్ష్మణుడు క్రుద్ధుడయి రాముడు స్వవిషయము చెప్పక మునుపు విరాధుని నీ వెవ్వడవురా ? అని గద్దించినపుడు "విరాధుడు అంతె వికటాట్టముగా నగి మీ రెవ్వ రెందుకనను పోవుచుంటిరని తొల్తను నేనడుగంగ మీరు చెప్పిన యాదిలేదు, నన్నడుగ దెచ్చితి" అనుటకూడ విరాధుడు తన శాపావసాన మెరిగి విచారించుచుండుటను స్థాపించుచున్నది. రామలక్ష్మణుల మని రాముడు చెప్పినప్పటినుండియు వాడు సంతోషించుచునే యున్నాడాత్మలో. సీతను వదలి మీ దారిని మీరు పొండనుటలో విరాధుని అంతర్య మదియే. వారెల్లను సీతను వదలిపోరు. సీతకొరకై తనను చంపుదురు. తనకు కావలసినదే అది. అందువల్లనే రాముడు క్రోధముతో "వరలుగా సీతవదలి నీవలను పొమ్ము" అనినపుడు—రాముని క్రోధము విరాధుని ఆత్మలో సంతోషము కలిగించుచున్నది. ఆ యాత్మలోని సంతోషము దేహధర్మమును మార్గమున వికటముగా వ్యక్తీకరింపబడుచున్నది. "అనిన విరాధుడు నవ్వి మీరు నన్ను జంపెదమంటిరి గదా? సీత వదలిన యేటికి జంపెదరు?" ఇవి విరాధుని మాటలు. సీతను వదలినచో నిజమునకు వారు విరాధుని చంపరు. కాని చంపుట వానికి కావలయును అది అవచనములోని యాంతర్యము. కావలసిన దానిని కావలసినట్లుగా స్పష్టముగా చెప్పుటకు రాక్షస దేహాభిమానము అడ్డు వచ్చును. వచ్చినది. అందువలననే ఆ విరాధుని వాక్యము మూర్ఖునిమాటగా నున్నది. రాముడనినాడు "మాహాత్మ్యంబు మీ స్పృష్ట్యుద్యోతకుణం"బన్నీ. పాత్రజీవలక్షణమును పట్టుకొనినపుడే అట్లుగా వ్రాయుట సంభవించును. పూర్వజన్మ సహజమైన గంధర్వత్వమును స్మృతిలో నుంచుకొని, తాత్కాలికమైన పైశాచిక దేహముతోడి యునికతో, తద్దేహమును వదలించుకొను యత్నమున జాగృతుడైన జీవి విరాధుడైన తుంబురుడు. తజ్జీవలక్షణము గుర్తింపబడి తగు ప్రతిపాదకముగా సర్వ రచనయు చేయబడిన దీ కల్పవృక్షమున. అసలు శ్రీమద్రామాయణమునందలి సర్వవిషయముల జీవలక్షణము భావ్యము చేయబడి శ్రీమద్రామాయణ కల్పవృక్షమైనది.

విరాధుని జీవలక్ష్మి యిదియని రామాయణ కల్పవృక్షమున చెప్పబడిలేదు. లేదనగా లేదని గాదు. చమత్కారముగ నున్నది. ధ్వన్యర్థమున నున్నది. వీతద్రవలో నున్నది. విరాధునకు తాను శస్త్రాస్త్రములతో చావనని తెలియును. తాను బ్రతికియుండగానే పూడ్చిపెట్టబడవలయును. ఐనచో రాముడని తెలిసికొనగనే విరాధుడాయనకీ విషయము చెప్పవచ్చును గదా? చెప్పలేనేమి? శ్రీరాముడు "వీడిక చావడు గోయి త్రవ్వు." మని లక్ష్మణునితో ననిన తరువాత "శ్రీరామా! మంచియూహ చేసితివయ్యా" అనినాడేమి? ఆత్మజ్ఞత్వమునకును దేహాభిమాన కలిత పవ మలిన వాసనలకును భేద మిచటనే యున్నది. విరాధునకా తెలివి రాముడీమాట అన్న తరువాత కలిగినదా? లేక రామలక్ష్మణులమని ఆయన చెప్పగనే కలిగినదా? అప్పుడే కలిగినది గాని రాముని ఆ మాటలతో అది పైకి వచ్చినది. అనగా వాక్ స్థితికి వచ్చినది. దేహధర్మమును త్రోసి ఆత్మధర్మము వాక్స్థితికి వచ్చుట యింతసేపు పట్టినదన్నమాట. విరాధుని పూడ్చిపోవుచు వారిలో రాముడనినాడు.

"తన పూర్వంబగు జన్మలో గలుగు
    వృత్తాంతంబు తా నెఱుంగు
గను, గుప్తాచరణంబు నేపగిదిఁ
    గైకొన్నాడు? నన్గాంచినం
తన పూర్వ స్మృతిగల్గెనా వెదకు
    చుండా వచ్చె నన్నాడుగా
నను? పైశాచిక దేహమే! బలము
    గంధర్వత్వ భావాంకుర్?"

రాముడన్నట్లుగా వ్రాయబడిన ఈ పద్యమువలన సాధింపబడిన ప్రయోజనములు రెండున్నవి. విరాధుని జీవసంపుటలోని వైలక్షణ్యమును అర్థించి నిష్కర్షించుట ఒకటి. రామునియొక్క జీవసంబంధ విచారణైకశీలమును నిరూపించుట రెండవది. తాటకవధనాటి నుండి రాముని ఈ విచారణైకశీలము తుదిదాక సముచితముగా నిరూపింపబడినది రామాయణకల్పవృక్షమున.

విరాధుని పైశాచికదేహమునకు తగిన యుద్ధతి యనిపించు మూర్ఖ్యము—ఉద్ధతమైన వాని గంధర్వత్వ భావస్మృతితోడి జీవలక్షణము—వాడు సీతను పట్టుకొనుట కనుకూలముగా కల్పింపబడిన పూర్వరంగ నిర్వహణము, నాన్యతో దర్శనీయమై పరమరమణీయముగా ఈ రామాయణకల్పవృక్షమున ఉన్నవి. అనంతకోటి కావ్యశిల్పములు బహుసహస్రముఖముల ప్రదర్శింపబడిన మహాకావ్యేతిహాసములోని ఒక చిన్న విషయమును స్థూలముగా వ్రాసినాను.

# దృష్టి

శ్రీ కొలకలూరి ఇనాక్

***పాత్రలు: రమేష్‌బాబు, హేమలత, గంగాధరం, నరసమ్మ, డాక్టరు: ప్రభాతసమయం, మురళీగానము**

గంగాధరం: అమ్మా!

హేమలత: ఏం నాన్నా!

గంగా: కాఫీ ఏలావుంది?

హేమ: బాలా బాగుంది నాన్నా! కన్నతల్లి లాంటిది మన దాది.

గంగా: మీ అమ్మే వుంటే నీ కిన్ని కష్టా లుండక పోయేవి.

హేమ: అదేమిటి నాన్నా! నా కిప్పు డేం?

గంగా: ఏవమ్మా! ఆవిడే వుంటే...(బాధపడి...తేరుకొని) విధి వ్రాత ఎవరు తప్పిస్తారు? నీ కళ్ళే వస్తాయో! భగవంతుని కరుణ ఎలా వుందో?

హేమ: (బాధగా) డాక్టరు చెప్పారుగా నా కళ్ళు వస్తాయని. రాత్రి నువ్వూ చెప్పావు—నాకళ్లు వస్తాయని డాక్టరు చెప్పారని. నువ్విప్పుడు బాధ పడ్డమెందుకు నాన్నా!

నరసమ్మ: అది మీ నాన్న గారి అనుమానం గాని తప్ప కుండా నీ కళ్లొస్తాయి తల్లీ!

హేమ: నిజంగానా? మా అమ్మలాగా నన్ను కళ్లలో దీపాలు పెట్టుకొని రాత్రీ పగలూ అనకుండా చూస్తున్నావు. నీ ఋణం తీర్చుకోవడం కష్టం.

నర : పిచ్చితల్లీ! పడుకో! ఎక్కువగా మాట్లాడకు.

హేమ: ఇవాళ డాక్టరుగారు నా కళ్లు విప్పుతానన్నారుగా, నీతో ఏమైనా చెప్పారా?

నర : చెప్పారమ్మా. నీ కళ్లు తప్పకుండా వస్తాయనీ, ఇవాళ కట్లు విప్పుతారు.

హేమ: వారిని నేను చూడలేదు గాని. వారి హృదయం మాత్రం చూడగలుగుతున్నాను. చాల కరుణా మయులు. నెల రోజులనుంచి టైముకు వచ్చి శ్రద్ధ తీసుకొని మరీ, నన్ను చూస్తున్నారు.

గంగా: మంచివాడు. మొన్న మొన్న నే ప్రాక్టీసు పెట్టాడు. ఎంతో మంచి డాక్టరని అప్పుడే నలుగురూ అనుకొంటున్నారు.

నర : వారున్న దాన్ని ఉన్నట్టు చెప్తారమ్మా! సూటిగా మెలిగే పద్ధతి వారిది. వారవుతుం దంటే అవు తుంది. లేదంటే లేదు. అంతే!

హేమ: అయితే నాకు చూపు తప్పకుండా వస్తుం దన్నమాట.

నర : చూపు తప్పకుండా వస్తుంది. ఎందుకమ్మా అంత భయం.

హేమ: నాన్నా! ఇవాళ చాలా ఆనందంగా వుంది.

గంగా : నెలరోజుల తరవాత...అపూర్వ సంతోషమమ్మా!

నర : కన్నకూతురు మరి. కళ్లకు వచ్చింది.

గంగా : నరసమ్మా! కాఫీ కప్పులు పట్టుకెళ్లు.

నర : సరేనండి (కప్పులు కడిగితే వచ్చేస్తానని. వెళ్లి పోయింది)

హేమ : నాన్న ! మనదాది మంచిది.

గంగా : అవును గానీ......

హేమ : ఏంనాన్నా !

గంగా : రమేష్ వస్తున్నాడు.

హేమ : ......బావ......

గంగా : అవునమ్మా! నిన్న ఉదయం మద్రాసు వచ్చాడు.

---

* భారతీయ భాషలలో విశ్వ విద్యాలయం విద్యార్థులకు ఆలిండియా రేడియో (ఢిల్లీ) వారు శ్రవ్య నాటికల పోటీలు జరిపారు (57-58). "దృష్టి" ద్వితీయ బహుమతి పొందింది.

హేమ : బావదగ్గర డబ్బుందో ? లేదో ??

గంగా : మీ బావకు నేను ఎన్నడైనా డబ్బువిషయంలో లోపం కలుగజేశానా ? ఎక్కువే పంపా !

హేమ : ఇక్కడికి బావ ఎప్పుడొస్తాడు నాన్నా !

గంగా : నిన్న సాయంకాలం టెలిగ్రాం ఇచ్చాడు బయలుదేరుతున్నట్టు. నిన్న జనతకు బయలుదేరినా తొమ్మిదిన్నరకల్లా వస్తాడమ్మా !

హేమ : తొమ్మిదింటికే వస్తాడా నాన్నా !

గంగా : అవునమ్మా !

హేమ : అయితే కారు స్టేషనుకు పంపు నాన్న.

గంగా : అలాగే చేశానమ్మా !

హేమ : నాన్నా !.........ఫారిన్ వెళుతున్నప్పుడు చూశాను బావను. మళ్లీ ఇదే చూడబోవటం. ఈ కట్లతో ఎలా నాన్న ? డాకర్ని పిలవ్వా ?

గంగా : సరేనమ్మా !

హేమ : నాన్నా ! నాన్నా ! జనతా కరెక్టు టైమే నేమో కనుక్కో !

గంగా : సరేనమ్మా ! డాక్టరూ వస్తాడు. రమేషు వస్తాడు. డాక్టరే ముందువచ్చేట్టు చూద్దాంలే— అమ్మా, ఏమిటి నీరసంగా వున్నావ్ జ్వరంగా వుందా ?

హేమ : నీరసమూ, జ్వరమూ—ఏమిటి నాన్నా నువ్వనేది ?

గంగా : ఏమిటోనమ్మా, నీముఖం పేలవంగా జీవకళ లేకుండా వుంది.

హేమ : అదేమిటి నాన్న ! నాకివాళున్నంత ఆనందంగా ఎప్పుడూ లేదు. కాని—ఒకటే అనుమానంగా వుంది—

గంగా : అనుమానమేమిటి ?

హేమ : నాకళ్ళొస్తాయో, రావో ?

గంగా : తప్పకుండా వస్తాయి. భయపడకు. ధైర్యంగా వుండాలి మరి.

హేమ : బావ నన్నొక వేళ.........

గంగా : బావ నిన్నొక వేళ...ఏమిటమ్మా ?

హేమ : కళ్ళురాకపోతే పెళ్ళిచేసుకోడేమో ?

గంగా : అమ్మా ! అదా నీభయం. అందుకా ముఖం అలా పెట్టకున్నావ్. అతనికి హృదయమున్న సంగతి నాకంటే నీకే బాగా తెలుసు. అతను కృతఘ్నుడు కాడు. అయినా నీకు చూపు తప్పకుండా వస్తుంది. భయపడ నక్కరలేదు.

హేమ : నిజంగనా నాన్నా ! నిజంగానా !

నర : (ప్రవేశించి) పిచ్చితల్లి ముఖంలో ఇప్పుడు వెలుగు రేఖలు చూస్తున్నాను.

హేమ : ఏమిటి నరసమ్మా !

నర : నిజమేనమ్మా ! ఇప్పుడు కళకళలాడుతున్నారు మీరు.

హేమ : నాన్నా ! టైమెంత ?

నర : రమేష్ ఇంకోగంటా గంటన్నరకల్లా వచ్చేస్తాడులే అమ్మా !

(టెలిఫోను మోగింది)

హేమ : బావ స్టేషనుకువచ్చి ఫోను చేస్తున్నాడేమో చూడు నాన్నా

(టెలిఫోను మళ్ళీ మోగింది)

గంగా : నరసమ్మా, ఫోను చూడు!

నర : సరేనండి. (వెడుతుంది)

(గోడ గడియారం ఎనిమిదికొట్టింది)

గంగా : అప్పుడే వస్తుందటమ్మా ( టెయిను. తప్పకుండా తొమ్మిదింటికల్లా వస్తాడమ్మా!

హేమ : నాన్నా !

గంగా : ఏమమ్మా! తప్పకుండా తొమ్మిదింటికివస్తాడు.

నర : (వచ్చి) తప్పక వస్తారట గాని తొమ్మిదింటికి కావట. తొమ్మిదిన్నర తరువాత. పేషెంట్లు బాగా వున్నారట, ఒక కేసు సీరియస్‌గా వుందట.

గంగా : అవును మరి. డాక్టరు! అర్జెంటు కేసులుంటాయి. అయినా నరసమ్మా! మళ్ళీ ఫోను చేయి. అమ్మాయి ఎదురుచూస్తోందని చెప్పు. వీలైనంత త్వరగా రమ్మను.

హేమ : బావ వస్తాడు. చూడాలి. కట్లు విప్పాలి. తొమ్మిదిలోగా, వెంటనే రమ్మని చెప్పు!

నర : సరేనమ్మా!

హేమ : డాక్టరు వేగమే రావాలి. కట్టు విప్పాలి. బావవస్తాడు. నాకు కళ్ళు వస్తాయి. బావ వస్తాడు. నాకు కళ్ళు వస్తాయి.

గంగా : అవునమ్మా!

హేమ : నాన్నా! బావ! అమెరికా వెళ్ళేటప్పుడు కన్నీటికి నోచుకున్న నాకళ్ళు...ఇవాళ...

గంగా : (బాధగా) అవునమ్మా!

హేమ : నాన్నా!

గంగా : ఏవమ్మా?

హేమ : బావగారు నా కళ్ళ విషయం తెలుసుకదూ!

గంగా : రమేష్ ఆఖరి యూత్తెల్లో అసలే తీరిక వుండ దని వ్రాశాడుగా. అందుకని వచ్చేయుంటే ఆఖరి ఉత్తరంలోనే నీ కళ్ళ విషయం రాశాను. ఆ ఉత్తరం అందినవెంటనే బయలుదేరాడు— వరసమ్మా ఫోను చేశావా? ఏమన్నారూ.

వర : వారు వెంటనే బయలుదేరుతున్నానని చెప్పా రమ్మా!

గంగా : అయితే తప్పకుండా వస్తాడు. సరేగాని జనతా కరెక్టు పైమేమో చూడు.

హేమ : ఆఁ! అవును!జనతా కరెక్టు పైమేమో కనుక్కో.

వర : సరేనమ్మా!

హేమ : బావ ఎలా వున్నాడో?

గంగా : ఏమీ కొరతలేకుండావుందికదమ్మా. చీకూ చింతా లేకుండ చేశానుగా. అన్నివిధాలా అభివృద్ధి చెందుతాడు. అసలు మనరమేష్ చాలా అదృష్టవంతుడు. నీ అనుగ్రహం లభించింది. నా ఆశయం దొరికింది.

హేమ : ఏమిటి నాన్నా!

గంగా! అవునమ్మా! అందుకే అందరికీ అందుబాటులో వుండని అమెరికా చదువు. ఏనాడో యస్. యస్. యల్. సీ పరీక్షకు పోతేక చదువు మానుకోవా ల్సిన అతను. ఆగ్రా నేజ్ లో చదువుకు నే అతను ఒక ఫారిన్ డాక్టరేట్ తెచ్చుకుంటున్నాడు. అదృష్టవంతుడంటావా? కాదా? అతనికి పరి స్థితులు అనుకూలించాయి.

హేమ : (కొంచెం కోపంగా) నాన్నా! ఏమిటి నువ్వనేది?

గంగా : అదిగాదమ్మా ... (మారుస్తూ) ఒకఫోటో పంపాడు. అందులో చాలాఅందంగావున్నాడు. ఎంతో ఆరోగ్యంగా వున్నాడు. ముఖంలో జీవకళ తొణికిసలాడుతోంది.

వర : జనతా కరెక్టు పైమేనటండీ!

గంగా: అమ్మా!

హేమ: ఏం నాన్నా!

గంగా: నేనలా బయటికిపోయివస్తా!

హేమ: సరేనాన్నా !...వరసమ్మా!

వర : ఏవమ్మా!

హేమ: నన్ను కిటికీదాకా నడిపించు.

వర : ఎందుకమ్మా!

హేమ: ఊర్పోలేకపోతున్నా! పడుకోలేకపోతున్నా నపవాలనిపిస్తోంది. గుండె తేలిగ్గావుంది. నడి పించు!

వర : అసలే ఓపిక లేదేమో!

హేమ: ఓపికేం? దివ్యంగావుంది. నడిపించుదూ కాస్త!

వర : సరే! లే అమ్మా...ఆఁ...చేయి ... భుజం... ఇటు...ఇటు... ఆఁ...ఆఁ ... నిలబడమ్మా... ఇంక నడువు... మెల్లగా...మెల్లగానమ్మా... ఏమిటమ్మా...అంతిహుషారుగా వున్నారు... ఇటు...ఇటమ్మా... ఇక్కడ...ఆఁ ... ఆఁ... నిలబడు...ఇదిగో...ఇది...పట్టుకో...ఆఁ!

హేమ: చల్లగా గాలి వీస్తోంది.

వర : మన యింటిముందు పూలమొక్కలమీదుగా వచ్చినగాలి పరిమళంతో వస్తుందమ్మా!

హేమ: మల్లెతీగ ఎలావుందో చూడు!

వర : పందిరమీదికి ప్రాకింది. పూలు పూస్తోంది.

హేమ: క్రోటను మొక్కలు ఎలావున్నాయి.

వర : వాటికేం తల్లి! పనిమనిషి రోజూ నీళ్ళు పోస్తున్నాడుగా. అవి నిగనిగలాడుతున్నాయి. సన్నజాజితీగకూడా పందిరిమీదకు ప్రాకు తోంది. పక్కనే ముద్దబంతి మొక్కలు బాగానే వున్నాయి.

హేమ: వాటిప్రక్కనే గులాబీతీగ లుండాలిగదూ.

వర : ఉన్నాయి, బాగాపూచి.

హేమ: అవి పెట్టుకుంటే ఎంతో అందంగా వున్నట్లు అనందించేదాన్ని.

వర : "హేమ అసలే దీపకళిక. పైగా గులాబీపువ్వులు పెట్టుకొని మరీ పూచిం తంగేదులావుందికదూ" అనేవారమ్మా మీ బావ.

హేమ: బావ నన్ను మెప్పించడానికి.

వర : కాదమ్మా! అప్పుడు నిన్ను చూచిన ఏమగాడైన తన్మయుడౌతాడు. సాధారణంగా ఏ ఆడది చూచినా ముఖం చిట్లించి కుళ్ళుకుంటుంది.

హేమ: అలా చూడు! పోకచెట్ల కెదురుగా గన్నేరు చెట్లుండాలి.

వర : ఉన్నాయమ్మా! పచ్చని పూవుల్తో.

హేమ: ఆ చెట్టుక్రింద పచ్చని గరిక మీద బెంచీ వుంది కదూ!

వర : అవునమ్మా! చాలరోజుల్నించీ వాడుక లేకుండా వుంది.

హేమ: బావ ప్రయాణానికి ఒక రోజు ముందు ఆ బెంచీ మీద తన కౌగిట్లో నన్ను చేర్చుకొని 'హేమా' 'నువ్వు లేకుండా నే కాలమంతా ఎలా గడప గలను...'

వర : అంతలో నేనువచ్చి భోజనానికి రమ్మంటే వచ్చారుగదూ!

హేమ: అవును. బావ వెళ్ళిపోయేరోజు, సరీగ్గా ఇదే కిటికీ, నా కళ్ళల్లోకి చూస్తూ ఏమేమో చెప్పాడు. నేను, 'బావా ఈ కాలమంతా ఎలా గడిపేది? ఇంతవరకూ కలిసిమెలిసివుండి చదువుకున్నాం. ఇంక ఎలాగా...'

వర : అంతలో నాన్నగారొచ్చి. 'రమేష్ ట్రెయిన్ టైం అయింది. త్వరగా తెమలండి' అన్నారు గదూ!

హేమ: అవును. అప్పుడు వెంటనే విడిపోయాం. ఇవాళ బావ వస్తున్నాడు నా కళ్ళొస్తాయో! రావో!! ఏమంటాడో? ఏమో??

వర : భయపడకమ్మా! రమేష్ నిన్ను ఏ పరిస్థితుల్లోనూ కాదనడు. నీ కళ్ళు తప్పకుండా వస్తాయి.

(కారు హారను)

హేమ : అదుగో బావ వచ్చాడు.

వర : ఇంతత్వరగా బావ వస్తాడనమ్మా! మరీ ఓపిక లేక పోతే ఎలా—డాక్టరొచ్చారు!

హేమ : (సంతోషంతో) డాక్టర్! డాక్టర్!!

డాక్టరు: హల్లో...ఏమిటి కిటికీదగ్గర చేరారు—సంతోషంగా వున్నట్లున్నారు. గుడ్ అలావుండాలి—చల్లనిగాలి పీల్చుకుంటున్నారు—దట్ ఈజ్ బెటర్. యస్, మర్చిపోయాను. ఆరోగ్యంగా నే వుంది కదూ—ఇంతవరకు జ్వరం రాలేదుగా—అవును రాదు. రావటానికి వీల్లేదు. యస్ పదింటికే విప్పుతాను. కళ్ళొస్తాయి. రమ్మన్నారట. ఏమిటి విశేషం సీరియస్ కేసొకటుంది.అయినా తప్పకుండా రమ్మన్నారని వచ్చాను. ప్రత్యేకంగా విశేషంవుంటే చెప్పండి. హుషారుగా వున్నారు. గుడ్ అలావుండాలి.

వర : బాబూ!

డాక్టరు : పదింటికివస్తాను. అర్జెంటుగా వెళ్ళాలి. వీరిని కొంచెం గాలిలో తిప్పు. వస్తాను మరి.

హేమ : ఏమండీ!

డాక్టరు : ఏమిటన్నారూ? ఏమిటది?

హేమ : కొంచెం ముందుగా కట్లు విప్పాలి అవసరం.

డాక్టరు : కొంచెం ముందుగానా? నో నో—టైమ్ ఈజ్ హేర్ - పదింటికే ఇంకా కట్టు విప్ప కూడదు. మీ క్షేమంకోసం చెబుతున్నా. ఓ.కే. వస్తామరి.

హేమ : ఏమండీ!

డాక్టరు : ఏమిటంటారో చెప్పండి. అటు సీరియస్ కేస్ వుంది. వెళ్ళాలి. ఏదో చెప్పబోయారు చెప్పండి! మిమ్మల్నే!

హేమ : నా కళ్ళు.........

డాక్టరు : డెఫ్‌నెట్లీ. తప్పకుండా బాగవుతాయి. పదింటికే. వస్తామరి యస్. ఓ.కే. బైబై. (వెళ్ళిపోయాడు.)

హేమ : ఏమిటి వారికంత తొందర. మాట కూడా నిదానంగా మాట్లాడరేం?

వర : వారిమాటే అంతే ఆలోచనమగుతుంది. అందుకే ఆ మాటల్లో ఆతొందర. ఆయన హస్తవాసి...

హేమ : అంతత్వరగా వెళ్ళిపోయాడేం?

వర : అక్కడేదో సీరియస్ కేసట. కాని మీరు ఫోను చేశారనే సరికి అన్ని విషయాలూ అలా వుంచి ఇక్కడికొచ్చారు.

గంగా : (వస్తూ) జనతా వచ్చిందమ్మా!

హేమ : అవునా నాన్నా!

గంగా : అవును. టైం అయింది.రమేష్ వస్తూవుండాలి.

హేమ : నాన్నా! కాగా సంపావుగా. డ్రైవరుకు బావ గుర్తేనటనా? మర్చిపోయాడేమో. ఆ మాట అడిగావా?

(గోడ గడియారం తొమ్మిది గంటలు కొట్టటం మొదలు పెట్టింది. వరమ్మ, హేమలతల సంభాషణలు జరుగుతున్నాయి.)

హేమ : (సంతోషంగా) ఏవమ్మా!

వర : అమ్మా!

హేమ : బావ...

వర : వస్తున్నాడు.

హేమ : బావు...

నర : ఆనందంగా వుంది.

హేమ : అవును.

నర : అలా గేవమ్మా మరి.

(...గడియారం తొమ్మిదిగంటలు కొట్టటం నరసమ్మ హేమలతల సంభాషణ ఆగిపోవటం జరిగింది. అంతలో కారు హారను...)

హేమ : బావ వచ్చాడు.

నర : అవును వస్తున్నారమ్మా!

హేమ : (పెద్దగా) బావా!

రమేష్ : (దూరంగ) హేమా!

నర : రమేష్ బాబుగారు ఇక్కడికే వస్తున్నారు. నువ్వు కూర్చోవమ్మా! కూర్చో!

రమ : హేమా!

హేమ : బావా!

రమేష్ : ఏలాగైపోయావు హేమా.

హేమ : (నిర్లిప్తంగా) ఆఁ!—ఎన్నాళ్ళ కొచ్చావు బావా!

రమే : మరి అమెరికా......

హేమ : రెణెలనుంచి ఉత్తరంకూడా వ్రాయలేదే!

రమే : మూణ్ణెల్లనుంచి థీసీస్ కాపీల హడావిడిలో వుంటంవల్ల తీరుబడిలేక పొరపాటుజరిగింది.

హేమ : పొరపాటేముంటిలే బావా!

రమే : బాగా చిక్కిపోయావు!

హేమ : నేనలా కనిపిస్తున్నానా? బావా! నిన్ను చూచే భాగ్యం లేకపోయింది. డాక్టరుగారు ఇవాళే కట్టువిప్పుతానన్నారు.

రమే : హేమా! అసలు నీ కళ్ళకు ఏమయ్యాయి.

హేమ : (బాధగా) ఏంచెప్పేది బావ! నెలరోజుల క్రితం అదేదో జ్వరంవచ్చింది. నాలుగురోజులు తీవ్రంగావుంది. నాలుగోరోజు రాత్రినుంచి ప్రారంభం, కళ్ళు మసక మసగ్గా కనిపించాయి. నీ ఫోటోదగరకుపోయిచూశా. బావా! ఫోటో కనిపించిందికాని గుర్తు తెలియలేదు.

రమే : (ఆశ్చర్యంగా) ఆఁ!

హేమ : చీఁటి కారణముని నిద్రపోయాను. తెల్లవారి లేచాను. మసక మసగావుంది. రాత్రికంటే కొంచెమెక్కువ సూర్యుడు పొక చెల్లమన్నగా వచ్చి, కళ్ళలో పడుతున్నాడు. కళ్ళవెంబడి నీరు కారడం మొదలుపెట్టింది. నాన్న ఇంటి వద్దలేరు బావా! నరసమ్మను కేకేసి చెప్పాను. ఆవిడ హైరాన్యవ కళ్ళుతిరుగుతున్నాయేమోనని నన్ను కుర్చీలో కూర్చోబెట్టి వెళ్ళింది. కళ్ళు మూసుకూర్చున్నాను కొంచెం సేపట్లో నాన్న వచ్చారు. నన్ను పిలిచారు. లేచాను. కళ్ళు తెరిచాను నాన్నమాట విన్పించింది కాని, నాన్న కన్పించలేదు. ఏమిటమ్మా వెర్రిచూపు అన్నారు నాన్న.

రమే : (ఆశ్చర్యంగా) వెర్రిచూపా?

హేమ : నేను భోగుపడ్డాను. (అప్పటికే హేమలత కంఠం వణికిపోయింది)

రమే : ఎంతపని జరిగింది?

హేమ : నెలరోజుల్నించి డాక్టరు శ్రమతీసుకుంటున్నారు. కళ్ళు వస్తాయని పదేపదే పనికటు కొని చెబుతున్నారు. ఇంకోగంటకల్లావచ్చి, డాక్టరు కట్టు విప్పుతారు.

రమే : డాక్టరు జాగ్రత్తగా చూస్తున్నారా! (గంగాధరం బైటికి వెళిపోయాడు.)

హేమ : చూస్తున్నారు.

రమే : నరసమ్మ నిన్ను కంటికి రెప్పలాగా కాపాడుతోందికదూ!

హేమ : అవును బావ!

రమే : వీళ్ళిదరూ జాగ్రత్తగా చూడకపోతే ఇది చాలా ప్రమాదకరమైన కేసు. కళ్ళురాని ఇన్సిడెంట్సు కూడా వున్నాయి.

హేమ : (భయంగా) బావా!

రమే : భయపడకు హేమా! కళ్ళు బాగవుతాయని డాక్టరు చెప్పాగన్నావుగా. విచారించకు ధైర్యంగావుండు. అప్పటి చురుకుదనం నీలో ఏమైంది హేమా! ఇంత నీరసంగా వున్నావ్!

హేమ : అదేమిటి?

రమే : ఆరోజు మెయిల్ సెకండుక్లాసులో ఒంటరిగా వున్నప్పుడు...

[ ఫేడిన్ ]

* * * *

(—రైలుకూత—రైలు పోతున్న సవ్వడి. క్రమంగా దూరమాతుంది)

రమే : నాకు తలనొప్పిగావుంది.

హేమ : కాఫీ యివ్వనా?

రమే : కళ్ళు తిరుగుతున్నాయి.

హేమ : ఏమిటిబావా! ఇంకెవరూ లేరిక్కడ? ఇప్పుడేం చేసేట్టు?

రమే : ఇలారా హేమా!

హేమ : ఎందుకుబావా! (లేచింది)

రమే : ఇక్కడ కూర్చో! ఆఁ.................... నాకే బాధావుండదు, హాయిగా వుంటుంది.

హేమ : ఏమిఁటిబావా!

రమే : అలా కూర్చో! లేవబోకు—

హేమ : ఇదా ఎత్తు?

రమే : కారణం మరి నీకళ్ళు.

హేమ : నాకళ్ళా!

రమే : అవును నీకళ్ళు

హేమ : ఏం?

రమే : (భయంగా) నాకు భయంగావుంది.

హేమ : ఎందుకూ? ఏమయింది? ఏమిటిబావా!

రమే : నీ కళ్ళు...

హేమ : నాకళ్ళ కేమిటీ?

రమే : నాకు భయంగావుంది. నన్ను మింగేస్తున్నాయి. నేనిక్కడ కూర్చోలేను.

హేమ : ఏమిటి—పిచ్చిబావా! పాపం అక్కడ పడుకో పో!

రమే : హేమా!

హేమ : ఆఁ!

రమే : భగవంతుడు నీ కళ్ళింత అందంగా ఎందుకు తయారుచేశాడో (రైలుపోతున్న శబ్దం— కూత వినిపించి ఆగిపోతుంది)

* * . * *

[ఫేడౌట్]

హేమ : (విచారంగా) ఆ కళ్ళిప్పుడు,......

రమే : హేమా! విచారందేనికి? సంతోషంగావుండు. ఎంత 'శ్రమపడి థీసిస్ సబ్మిట్' చేశానను కున్నావ్. రాగానే నిన్ను చూచి ఆశ్రమంతా మరిచిపోదామనుకున్నా! నువ్విలావుంటే ఎలా హేమా!

హేమ : థీసిస్ బాగా వ్రాశావుగా?

రమే : ఫరవాలేదు. త్వరలోనే డాక్టరేట్ వస్తుంది.

హేమ : ఇంతకాలంనుంచి నువ్వులేవు. ఇక్కడ నాకు ఇన్నాళ్ళు నిస్పృహగానే గడిచాయి. నువ్వు వస్తా వనుకు నేసరికి ఇదొకటి.

రమే : విచారించకు హేమా! త్వరలోనే నయమవుతాయి.

హేమ : కాని బావా! అమెరికానుంచి రాగానే మన మేరేజి అన్నావు.

రమే : ఇప్పుడేం?

హేమ : ఏవాఁ!

రమే : అవు నిప్పుడేం?

హేమ : ఒకవేళ నాకు దృష్టిరాకపోతే నన్ను......

రమే : రాకేం చేస్తుంది. ఇవాళే కట్లు విప్పుతారటగా!

హేమ : ఒకవేళ రాకపోతే, నేను నీకు......

రమే : డాక్టరు దృష్టి వస్తుందని చెప్పారన్నావుగా.

హేమ : నిన్న మొన్నటినుంచి మాత్రమే వస్తుంది. తప్పక వస్తుంది, అంటున్నాడు. కాని, అంతకు ముందు చెప్పలేం, ప్రయత్నిస్తానన్నాడు, అది తల్చుకుంటే గుండె ఆగినంత పనవుతోంది. అయినా నాక్కళ్లొచ్చిందాకా నమ్మకంలేదు.

రమే : తప్పకుండా చూపు వస్తుంది. భయపడకు హేమా!

హేమ : ఒకవేళ రాకపోతే... నా జీవితం...

రమే : ఆలోచింపవలసిన విషయమే!

హేమ : (ఆశ్చర్యంగా) ఆఁ! ఏమిటి! (కోపంగా) బావా!

రమే : (మాటాడడు).

హేమ : ఏమిటిబావా నువ్వన్నది.

రమే : ఆఁ! ఏముంది! ఏమీలేదు! ఊరికే నే అన్నాను.

హేమ : ఏమనీ! ఆలోచింపవలసినవిషయమని నేగదూ!

రమే : పిచ్చిహేమా! నేను నిన్నుతప్ప మరొకర్ని పెళ్ళి చేసుకోగలనా?

హేమ : నిజమాఁ బావా!

రమే : అనుమానం కూడానా!—అది న్యాయం. సరే గానీ నేనిక్కడ ప్రొఫెసర్ని కలుసుకోవాలి. పది దాటేంతరవాత దొరకడు. వారితో మాట్లాడితే రేపు డాక్టరేట్ రాగానే సెంట్రలు అపాయింటుమెంటు జరుగుతుంది. అదీ మన బాగుకే కద! పోయి మాట్లాడివస్తా!

హేమ : డాక్టరు వచ్చేవేళయింది. కట్లు విప్పింతరవాత పోకూడదూ!

రమే : ఫరవాలేదు హేమా! పదింటికి డాక్టరువచ్చి కట్లు విప్పుతారు. కళ్ళొస్తాయి. పదింటికి నేను ప్రొఫె

సగంతో మాట్లాడంకూడా అయిపోతుంది. వెంటనే వస్తాను. వస్తామరి.

హేమ: బావా! నువ్వు హృదయ పూర్వకంగా నాకు కళ్ళు రావాలని కోరుతున్నావా?

రమే: అదేంమాట హేమా!

హేమ: ఏముంది? నాకు కళ్ళు రావాలని కోరతావు గానీ రాకపోతే పెళ్ళి చేసుకోవుగదూ.

రమే: ఏమిటంది?

హేమ: ఏముంది నా సవాసికి నా గ్రూపం.

రమే: పోయిరావాలి. వస్తా మరి.

హేమ: సరే!

గంగా: (వస్తూ) ఎక్కడికి రమేష్.

రమే: ఇప్పుడేవస్తా మావయ్యా!

గంగా: డాక్టరువచ్చే వేళయింది. కట్లు విప్పిం తర వాత పోకూడదూ?

రమే: అప్పటికి వస్తా మావయ్యా! (స్వరం క్రమంగా దూరమౌతుంది).

గంగా: అమ్మా! రమేషూ—

హేమ: వస్తాడు! నాన్నా! నాకు కళ్ళొస్తాయా!

గంగా: తప్పకుండా—.........

హేమ: బావ నన్ను పెళ్ళిచేసుకుంటాడని మీకు నమ్మకం వుందా?

గంగా: అదేం మాటమ్మా! అపనమ్మకమా మీ బావ విషయంలో...

హేమ: కాదు నాన్నా! అసలు జీవితమే ఓ పరీక్ష. అందులో మళ్ళీ...

గంగా: అవాంతర పరీక్షలుంటాయా?

హేమ: అవసరమైతే అవి తప్పవు నాన్నా!

గంగా: ఏమిటమ్మా నువ్వనేది?

హేమ: ఏవి లేవులే నాన్నా!

(—కారు హారను.—) డాక్టరొచ్చివుంటాడు నాన్నా!

గంగా: అవునమ్మా! డాక్టరే! (నసుగుతూ) రమేషు కూడా...

హేమ: బావ రాడులే నాన్నా!

నర : (వచ్చి) డాక్టరొచ్చారమ్మా!

(గోడ గడియారం పదిగంటలు కొట్టింది.)

హేమ: (మొదటి మ్రోత) నాన్నా! (రెండో మ్రోత) నరసమ్మా! (మూడో మ్రోత) డాక్టర్ (నాలుగో మ్రోత) వచ్చారా. (ఐదో మ్రోత) కట్లు, (ఆరో మ్రోత) బాగవుతాయి (ఏడో మ్రోత) నాన్నా (ఎనిమిదో మ్రోత) నాన్నా! (తొమ్మిదో మ్రోత) బా...(పదో మ్రోత). వ!

డాక్ట: హల్లో!

[విరామం]

* * *

(గోడగడియారం మూడుగంటలు కొడుతుంది.)

గంగా: రమేష్ ఇంకా రాలేదే! ఎలా నిలబడ గలుగుతాడో!

నర : వెళ్ళినపని అవ్వాలి కదండీ!

హేమ: అవును కావద్దూ మరి. వస్తూవుంటాములే. జీవితాలు.........

[కారు హారను]

గంగా: రమేష్ వచ్చాడనుకుంటా!

రమే: (ప్రవేశిస్తూ దూరంగా) హేమా!

హేమ: (సమాధానం లేదు.)

రమే: మాటాడవేం హేమా? మావయ్యా! ఏమిటి మీ ముఖంలో అదోమాదిరిగా వుంది. లేనినవ్వు తెచ్చుకోడానికా? ఉన్ననవ్వు పోగొట్టు కోడానికా? ఏమిటా ప్రయత్నం.

గంగా: (సమాధానం లేదు.)

రమే: నరసమ్మా! ఏమిటిదంతా?

నర : అమ్మాయి నే అడుగుబాబు!

రమే: హేమ పలకటంలేదు—హేమా!

హేమ: (గద్గదస్వరంతో) ఏం బావా!

రమే: కళ్ళొచ్చాయా?

హేమ: (దుఃఖంతో) అంతభాగ్యమా?

రమే: రాలేదా?

హేమ: లేదు బావా!

రమే: కళ్ళు రాలేదా!

హేమ: (ధైర్యం తెచ్చుకొని, దుఃఖం ఆపుకుంటూ) నిదర్శనముండగా అనుమానం దేనికి బావా. విధి నన్ను చిన్నచూపు చూశాడు. ఇంతకూ నా అదృష్టం ఇలా వుంది.

గంగా: (దుఃఖం దిగమింగుకొని) నేనలా వెళ్ళివస్తా నమ్మా!

రమే: అదృష్టం దురదృష్ట ఏమిటి? డాక్టరు సరిగా ట్రీట్ చేయలేదేమో.

నర : నే నిప్పుడే వస్తానుబాబూ! (నరసమ్మ గంగాధరం వెళ్ళిపోతారు.)

హేమ: అదేమిటి బావా!

రమే: ఏముంది హేమా! మనిద్దరం ప్రేమించుకున్నాము?

హేమ: ఊఁ!

రమే: పెళ్ళి చేసుకుందామనుకున్నాము?

హేమ: అవును.

రమే: నిన్నటిదాకా నువ్వు పెళ్ళికి తగినదానవు. ఇవాళ మాత్రం కాదు.

హేమ: ఆఁ (ఆశ్చర్యంగా)

రమే: అందుకే అదృష్టంమీద నాకు నమ్మకం లేదు.

హేమ: బావా ఏమిటా మాటలు? నన్ను పెళ్ళి......

రమే: నీకు కళ్ళు లేవుగా!

హేమ: నీకు న్యాయమా? 'దుఃఖంలో' మన జీవితాల కిది పరీక్ష బావా. నాకళ్ళు మరోకట్టుతో రావచ్చునని డాక్టరు చెప్పాడు. ఈసారి కట్టుతో కళ్ళు తప్పక వస్తాయి. నన్ను కాదనకు బావా! కళ్ళు రాకపోవు బావా!

రమే : నెలరోజులు ప్రయత్నం చేస్తే రాని నీకళ్ళు ఇంకో కట్టుతో రాకపోవంటే తెలివైనవాడెవడు నమ్మడు. నీకు కళ్ళు రావు.

హేమ : బావా!

రమే : హేమా! నీకు కళ్ళురావటం కష్టం

హేమ : బావా!

రమే : అంతే హేమా! బాధ ఎందుకనవసరంగా కల్పించుకుంటావు.

హేమ : నాకళ్ళు అందంగా వుంటాయనీ......

రమే : నే నొప్పుకుంటాను. కాని కళ్ళులేని నీ ముఖంలో ఏ కళా కాంతులు వుండవని నీకు తెలుసు.

హేమ : డాక్టరు కళ్ళు రావచ్చునన్నాడు బావా!

రమే : డాక్టర్లు అలాగే అంటారు.

హేమ : మా నాన్న చాలా ధనవంతుడు.

రమే : కావచ్చు!

హేమ : బాగా పొలముంది.

రమే : లేదని ఎవరూ అనరు.

హేమ : మూడు మేడలున్నాయి. నేనొక్కదాన్నే వారి సంతానం. నీకు తెలుసుగా బావా!

రమే : మీ నాన్న తలుచుకుంటే రేపీపాటికి నీకు పాతిక పెళ్ళిళ్ళు చేయించగలడు.

హేమ : (కోపంతో) బావా!

రమే : అంతే కాదు. లక్షమందిని పోషించగలడు. అయితే దాని వెనక భయంకరమైన స్వార్థం పేరు ప్రఖ్యాతులకోసం వళ్ళు విరుచుకుంటోంది.

హేమ : నన్ను కూడా.........

రమే : (బాధగా) అన్నావా హేమా! పోషించాడు. పెద్దవాణ్ని చేశాడు. అమాట తప్పకుండా ఒప్పుకుంటాను. (కోపంగా) కానీ నిలువెల్ల విషం కక్కుతూ, పొగలు బుసకొడుతు స్వార్థపిశాచి టెర్రిఫిక్ డాన్సు.

హేమ : ఏమిటి నువ్వనేది?

రమే : నువ్వు నన్ను ప్రేమించకపోతే, రెక్కలులేని పక్షినైన నాకు ఒక గూడంటూ లేకపోయేది. అలాంటి మంచి ఆశ్రయం దొరికిందంటే కూతురికి నచ్చినవాడు అల్లుడు కాబోతున్నాడని, చెల్లెలు కొడుకుని చేరదీసి పెద్దచేశాడని లోకం అనుకుంటుందనే మీ నాన్న స్వార్థమే. కారణం నీ అనుగ్రహం.

హేమ : కాదు మా నాన్న నిన్ను చెల్లెలు కొడుకువనే ప్రేమతో చేరదీశాడు.

రమే : ఆమాటే నేను ఒప్పుకోను. మా నాన్న పోయిన తరవాత ఒక్కగానొక్కణ్ణే సంతానమైన నన్ను చదువాపకుండా చేయాలనే పట్టుదలతో మా అమ్మ మీ నాన్న దగరకు వచ్చి. డబ్బు అడిగితే, ఆయన అడిగిన మాటలూ, తిటిన తిట్లూ డబ్బు పంపుతూ నువ్వు వ్రాశావు గుర్తుందా? ఆ తరవాత...(గొంతుక గద్గద మౌతుంది) మా అమ్మ ఇంటికి కూడా తిరిగి రాలేదన్న సంగతి కూడా నీకు తెలుసుగదూ! (బాధతో) నాకు హృదయం లేదుగాని వుంటే ఏనాడో పగిలి పోవలసింది.

హేమ: నీకు హృదయం లేదన్న సంగతి వేరే చెప్పక్కర్లేదు.

రమే: హేమా!

హేమ: నీకు ఆశ్రయమిచ్చింది మా నాన్న!

# దృష్టి

రమే: మా కుటుంబం చితికిపోవటానికి కారణమూ ఆయనే!

హేమ: నేను నీకేమి అపకారం చేశాను బావా!

రమే: నువ్వు నాకేమీ అపకారమూ చేయలేదు. నేను నిన్ను ప్రేమించింది కూడా, మీ నాన్న ఆ ఆస్తిపాస్తులు చూచి కాదు. ఆ తరవాత ఆ ఆస్తి ఉపయోగపడుతుందంటే అవసరాల్లో వున్నాను కనుక కాదూ కూడదూ అనలేను. నేను నీ అందాన్ని చూచి...

హేమ: మరి?

రమే: దాసోహమన్నాను నీకు అన్యాయం చెయ్యాలన్న భావం నాకిప్పటికీ లేదు. నిన్ను నేనెందుకారాధించానో అదివాడు నీలో లేదు. నిన్ను నేను కాదనటానికి కారణం నువ్వు గంగాధరం కూతురు అవటం కాదు.

హేమ: నిన్ను నే నే పరిస్థితులలోనూ వదిలిపెట్టనన్నావుగా బావా!

రమే: అవును హేమా! కానీ నేనీనాడు ఒక గజెటెడ్ ఆఫీసర్ని కాబోతున్నాను నా గౌరవమర్యాదల విషయం ఆలోచించు. ఒక గజెటెడ్ ఆఫీసరు, ఒక గుడ్డిదానితో కాపురం చేస్తూ పొందే గౌరవం ఏమిటి?

హేమ: బావా! నీకు నే నేవిధంగానూ అడ్డం లేకుండా వుంటానికి ప్రయత్నిస్తా. నీ పాదసేవ చేస్తా. ఆరాధిస్తా. పువ్వుల్లో పెట్టుకొని పూజించుకుంటా. నన్ను పెళ్ళిచేసుకో. మా నాన్న కారణంగా నన్ను బలిచేయవద్దు.

రమే: హేమా! నీవు నన్ను హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నావా?

హేమ: ఏమిటి బావా? కొత్తగా...

రమే: అది కాదు హేమా! నీ హృదయ నైర్మల్యాన్నీ, పవిత్రతని, గాంభీర్యాన్ని అర్థం చేసుకోలేక కాదు. సమాధానం కావలని...

హేమ: నీకు తెలుసుగా.

రమే: నేను క్షేమంగా, సంతోషంగా వుండటం నీ కిష్టమే కదూ?

హేమ: నేనింకెవరి క్షేమం కోరగలను?

రమే: అయితే దయతలచి మన పెళ్ళి ప్రస్తావన తేవొద్దు.

హేమ: బావా!

రమే: ఆ పిలుపు కింక అనర్హుణ్ణేమో హేమా!

హేమ: బావా!

రమే: ఆ పేరుతో నన్ను పిలవకుండా వుండకూడదూ!

హేమ: (కోపంగా) మిస్టర్ రమేష్! తప్పకుండా అనర్హుడివి. ఇంక నిన్ను ఆ పేరుతో పిలవను.

రమే: హేమా!

హేమ: ఇంక ఆవిధంగా పిలవకు మిస్టర్ రమేష్!

రమే: హేమా!

హేమ: డోన్టాక్. నాకు కళ్ళు లేవు!

రమే: హేమా!

హేమ: నోరు మూసుకో. నీకు హృదయం లేదు.

రమే: హేమా!

హేమ: మిస్టర్ రమేష్! నోరు మూసుకుంటే మంచిది.

రమే: మీ నాన్న డబ్బు చూచి కాకుండా నీ అందం చూచి నిన్ను ప్రేమించాను. మీ నాన్న చెడ్డ పనులు కారణంగా నిన్ను విడిచిపెట్టంలేదు. నీ దృష్టి లోపం నన్ను కలవరపెడుతోంది. నిన్ను పెళ్ళి చేసుకోలేను.

హేమ: రమేష్! మిస్టర్ రమేష్!! రమేష్!!!

రమే: గుడ్డిదానితో నేనుపొందే గౌరవమేముంటుంది. ఎంతకాలం సుఖంగా జీవించగలను. ఆలోచించు హేమా! నేను సుఖంగా జీవించాలనీ, ఏదో ఉన్నతదశ పొందాలనీ ఏదో మధురానుభూతిపొందాలనీ అనుకోవటంలో తప్పేముంది. ఆలోచించు. నేను నిన్ను ప్రేమించిన బావననుకోకుండా డాక్టరేటున్న పౌరుణ్ణి ఊహించు. ఒక గుడ్డిపిల్లను పెళ్లి చేసుకోవచ్చునేమో? ఆలోచించు!

హేమ: నీకు తెలియని ఏదో బ్రహ్మాండాన్ని బద్దలు చేస్తూ హాయిగా కూర్చో.

రమే: నన్నర్థం చేసుకోవటం లేదు.

హేమ: లేదు. అర్థం చేసుకున్నాను. నేను పెళ్లి కాక, పెళ్లి చేసుకునే మగాడు లేక, కళ్ళు లేక, కళ్ళు లేని లోకంలో అందులో నీలాంటి వాళ్ళున్న జీవితమంతా, చచ్చేదాకా ముసలిదాన్నయ్యేదాకా అవమానాల పాలవుతూ నాశనమైపోతాను.

రమే: నా ఉద్దేశం అది కాదు.

హేమ: మరేమిటి?

రమే : నీకు కళ్ళు లేకపోవటం.........

హేమ : నువ్వు ప్రేమించింది నన్నా ? నా కళ్ళనా ?

రమే : నిన్నే కానీ............

హేమ : కళ్ళుండి హృదయంలేని స్త్రీ కావాలా ? కళ్ళు లేకపోయినా హృదయమున్న నేను కావాలా ?

రమే : నా గౌరవ మర్యాదల విషయం ఆలోచించటం లేదు నువ్వు !

హేమ : నా జీవితాన్ని గురించి నువ్వుమాత్రం ఆలోచిస్తున్నావా ?

రమే : ఏ మాలోచించను ?

హేమ : కళ్ళు లేనంతమాత్రాన నా జీవితం నాశనం కావలసిందేనా ?

రమే : కళ్ళులేని నిన్నుకట్టుకొని నా గౌరవ మర్యాదల్ని నాశనం చేసుకోవాల్సిందేనా ?

హేమ : నీ గౌరవంకోసం నా జీవితం నాశనం కావాలంటావ్ ?

రమే : నీ జీవితంకోసం నా గౌరవం నాశనం కావాలని నువ్వంటున్నావ్ ?

హేమ : గౌరవం, జీవితం ఒకటేనంటావ్ ! రమేష్ ! నీవంటి మహామేధావి డాక్టరేట్‌తో ఫారిన్ రిటర్న్ ఓ అంధురాల్ని పెళ్ళాడితే అబ్బ ! ఎంత త్యాగపురుషుడో అని లోకం ఎంత గౌరవిస్తుందో గమనించు. నన్ను పెళ్ళాడటంవల్ల నీ గౌరవం ఎక్కువవుతుందేగాని ఎంతమాత్రం తగిపోదు. అలానువ్వు పెళ్ళాడకపోతే, గుడ్డితనం కారణంగా కాక ప్రేమకారణంగా నా జీవితం నాశనమవుతుంది. నిజంగా నేను నిండుకన్నులతోవున్నా నన్నునువ్వు పెళ్ళాడినా, కారణం నా కళ్ళూ నా అందచందాలూ కావు. మన ప్రేమ. అది మరచిపోకు రమేష్.

రమే : మన ప్రేమ నిజమే హేమా ! ఇప్పటికీ మనస్ఫూర్తిగా నీమీద నాకు ప్రేమవుంది. కాని ఒక అంధురాల్ని భార్యగా స్వీకరించి ఆ జన్మాంతం అవస్థపడలేను.

హేమ : అంతేనా రమేష్ ?

రమే : అంతే హేమా !

హేమ : అంతే కదూ ?

రమే : అంతే !

హేమ : సరే ! రమేష్ ! నిజంగా నీకు నామీద ప్రేమ లేదు. నా కళ్ళూ అందచందాలూ కంటే నా డబ్బుమీద నీ దృష్టి. నీ చదువుకీ, నీ గొప్పకీని. మన పెళ్ళాడన్నదే నా దృష్టి. అయితేం నా డబ్బుతో నీ అవసరం తీరిపోయింది. ఫాల్స్ ప్రిస్టేజి ఓకుంటిసాకుగా తప్పించుకోవాలని ప్రయత్నిస్తున్నావ్.

రమే : నీ డబ్బుకోసం నిన్ను ప్రేమించానంటావు. పైగా నా స్థితిని ఫాల్స్ ప్రిస్టేజి అంటున్నావ్. ఇంకా ఏమైనా అనగలవు. ఏమన్నా నేను అంధురాలి భర్తను కావటం అసంభవం.

హేమ : అంధురాలి భర ! రమేష్ ! బాహ్యదృష్టి లేని అంధురాలా ? ఆంతర దృష్టి లేని అంధురాలా !

రమే : ఆంతర దృష్టేమిటి అర్థంలేనిమాట.

హేమ : అంటే నీకు అవసరమైన అంతర్‌దృష్టి లేదన్నమాట నిజంగా నువ్వే గుడ్డివాడివి. అంతరాత్మలేని అంధుడివి. మూర్ఖుడివి.

రమే : (తీక్షంగా) హేమా !

హేమ : రమేష్ : నీకు ఆంతరదృష్టేవుంటే ఆ పేరుతో పిలవ్వు. నువ్వు మూర్ఖుడివే కాదు. బుద్ధిలేనివాడివి.

రమే : అట్టే వాగకు హేమా !

హేమ : అవును వాగటమే అనిపిసుంది బుద్ధివుంటేగా ! సెల్ఫిష్‌ఫూల్ ! అన్‌గ్రేట్‌ఫుల్ రెచ్ !

రమే : షటప్ ! (చెంపపెట్టు)

హేమ : అబ్బా !

వర : బాబూ ! (అంటూ నే వస్తుంది)

గంగా : చెయ్యికూడా చేసుకున్నావా రమేష్ ! (వచ్చాను).

హేమ : చెయ్యేమిటి మరేమైనా చేసుకుంటాను. కళ్ళు వుండి కనిపించనివాడు. మిష్టర్ రమేష్ నీకు కావలసిన బాహ్యదృష్టి నాకు సరీగ్గానేవుంది. తెలుసా ?

రమే : ఆఁ !

హేమ : మిష్టర్ రమేష్ ! నిజంగానే నాకు కళ్ళు వచ్చాయి.

రమే : ఆఁ !

హేమ : కళ్ళు లేక చూడలేనిదానిని కాదు. కళ్ళు వుండి...

# దృష్టి

వర : అవును బాబూ! కట్లు విప్పగానే ఉదయం కళ్ళొచ్చాయి.

గంగా : డాక్టరుగారు మంచి ట్రీట్‌మెంటు చేశాడు. ఆయనకెంతెన ఋణపడివున్నాను. అమ్మాయి నీతో అబద్ధమాడింది. నిన్ను ఆనందేసుకోటానికి పిచ్చితల్లి ప్రయత్నం. వద్దన్నా వినదికొదు.

రమే : నిజంగానా?

హేమ : అబద్ధం సరే?

వర : నిజం బాబు!

గంగా : హేమకు దృష్టి వచ్చింది రమేష్.

హేమ : రమేష్‌కి దృష్టిరాలేదు నాన్నా! మామూలు కళ్ళు మాత్రం వున్నాయి. మనుష్యుల హృదయాలు చూచే కళ్ళు లేవు. ఏం రమేష్! నాకు మామూలు కళ్ళు వచ్చాయంటే నువ్వు నమ్మలేక పోతున్నావ్?

రమే : నమ్మలేకుండా వున్నా!

హేమ : నువ్వు నమ్మలేవు. నమ్మే అర్హత నీకు లేదు. నమ్మినా ప్రయోజనం అంతకంటే లేదు. రమేష్! నీకొకావలసింది బాహ్యదృష్టి కూడా కాను. బాహ్యాడంబరం. ఇప్పుడు నువ్వు ఇది వరకటికంటే వేషభాషల్లో ముందడుగు వేశావ్. అది నీ ఫారిన్‌టూరికి ఫలితం.

రమే : ఇదంతా ఏమిటి?

హేమ : ఏంవుంది? నీ కళ్ళకు కృత్రిమమైన కళ్ళజోడు చేరింది.

రమే : హేమా!

హేమ : అనేకసార్లు చెప్పాను అలా పిలవద్దని. ఆఖరిసారిగా మరోసారి చెబుతున్నా. బుద్ధివుంటే నన్నింకలా పిలవకు.

రమే : హేమా!

హేమ : కళ్ళొచ్చాయి కదా పెళ్ళిచేసుకుందామనా —మాటాడవేం?

గంగా : అమ్మాయ్!

హేమ : నాన్నా! ఇది నా స్వంతవిషయం. నీకు మేనల్లుడిమీద మమకారం వున్నా, రాతిహృదయం గల రమేష్‌మీద నాకు ఎంతమాత్రం అభిమానం లేదు. ఉండదు.

వర : అమ్మా!

హేమ : రమేష్! నీగౌరవానికి లోపంరాని వివాహమే చేసుకో, ఇకవెళ్ళు.

రమే : హేమా!

హేమ : డోన్టాక్!

గంగా } (ఒకసారి) { అమ్మాయ్!
వర } { అమ్మా!

హేమ : ఇది నా స్థిరనిశ్చయం. గుడ్డిదాన్ని పెళ్ళాడితే గౌరవానికి లోపంవచ్చే గజిటెడ్ ఆఫీసరుగారికి నేను తగనిదాన్ని. గుడ్డివాన్నట! ఎవరుగుడ్డో! ఎవరికి సరైన దృష్టి లేదో!

రమే : క్షమించు హేమా!

హేమ : అనవసరం. నాకు దృష్టిపోయింది. మళ్ళీ వచ్చింది. అసలు నీకు దృష్టి అన్నదేలేదు. అమాయికంగా బాల అని ప్రేమించిన నాలో స్వార్థం వుందన్నావ్! ఆ స్వార్థం నీలోనే కరుడు గట్టింది. నిజానికి నీకు దృష్టి లేదు. ఏ దృష్టి నాకు లేదని గౌరవభంగం అనుకున్నావో ఆ దృష్టే కాని, అంతకంటె ఉన్నతమైన అంతరదృష్టి, మానవుడికి అత్యవసరమైన అంతరదృష్టి అసలు నీకు లేదు. అలాంటి నిన్ను క్షమించటం అనవసరం.

రమే : హేమా!

హేమ : మిష్టర్ రమేష్!

రమే : ప్లీజ్ !

హేమ : గెటౌట్ !

రమే : (దగ్గరగా) హే.... (దూరంగా) మా....

ఆలిండియా రేడియో హైద్రాబాదు,
విజయవాడుల సౌజన్యంతో

# కౌముదీవిహారము

శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

కవితా సుందరి రమ్ము చేగలిపి ప్రక్కన్ నిల్చి నాయంసమం
దివతాళించు భవద్భుజమ్ము నిడి రమ్మా కౌముదీ వేళ, నీ
పువుటంగమ్ములు సోక క్రొంబులకరింపుల్ పూవ నెమ్మేన త్రి
దివ మాధుర్యము చూరలాడి భువి కందిత్తున్ సుధాగీతముల్.

రావే బర్హిశిఖాచకచ్చకిత నేత్రా! సాంధ్యమల్లీ స్ఫుర
ల్లావణ్యైక నిధాన మంజుహసితా! లక్షింతు నీ కోసమై
ఈ వైశాఖ సితాభ్రఖండ రథమం దేతెంచి గోదావరీ
శైవాలి న్యుపకంఠ కుంజములపజ్జన్ సుంత కాలూనుమా!

వేయి సువర్ణకాంత లొకపెట్టున నవ్విన హాస రాసు లే
మో, యమరాసురోన్మథిత మోహన ఫేనిల దుగ్ధసింధు వే
మో, యనిపించు నేటిదరి పున్నమి వెన్నెల క్రొత్త పొంగులో
హో! యిటు చూడు! కోటి మధురోహాలు గొంతులు విప్పజూచెడున్.

నీకడ గంటి తళ్కు దయనిల్వని నా యెద దీనవీణ, నీ
రాకలు లేని రాక యవురా! నును రేకలు లేని పూవు, ఇం
తేకద! ఏది సుంత విదళింపుము నీ కరకంకణ ధ్వనుల్
శోకము శ్లోకమై పొరలు సూనృత మంగళగీత మాధురిన్.

నీరవ దూరదూరముల నిండిన వెన్నెల స్వీయ రమ్యతా
భారము మోయలేక విదుపన్ పిడికిళ్ల కొలంది శుభ్ర శో
భా రమణీయతల్ చెదరిపడ్డవి చల్లని మల్లెలౌచు ని
తీరములందు, తీవి నరుదేరుము పూవుల త్రోవలో సఖీ!

అవనియె ఒక్క తెల్లగలువై యిటదేలెను చూడు చంద్రికా
ప్రవిమల పంకజాకర వరమ్మున, తుమ్మెద జంటవోలె నీ
పువు బారలన్ విహారములు పోదము, జుమ్మని కంఠమెత్తి భూ
ర్భువములు మారుమ్రోగ నరి క్రొత్తవి గీతము లాలపింతమే!

# కౌ ము దీ వి హా ర ము

ఒకడ భరింపలేను గద యుగ్మలి! ఈ నవచంద్ర చంద్రికా
ప్రకటిత విశ్వరూప బహుభారమనోజ్ఞత, రమ్ము సుంత చెం
తకు కలహంసివోలె సికతాస్థలిపై నడ లందగింప; నా
కకు దెరచాప లెత్తుదము గౌతమి యూయల లూప పొంగుచున్.

*        *        *        *        *

[1]* ఈ పల్లె యగ్రహారము
మాపట నిద్రించు నిట నమాయికముగ మా
జ్ఞాపకముల వెల్గించుచు
లోపల నేదేదొ స్వప్నలోకము విరియన్.

ఓహో! జ్ఞప్తికి వచ్చె నీమహి చళుక్యోర్వీశు నౌదార్య సు
శ్రీ హృద్యంబయి బారసాచినది; ధాత్రీ దేవతా పుణ్య రే
ఖా హాస్యుండగు చీదమార్యుని యమోఘాశీస్సు లాంధ్రేశు శ్రీ
వా హీరాంచిత హారశోభలయి వహ్వా! వెల్గుచే నేటికన్.

వెన్నెల వెండిమెట్ల సరవింగొని మెల్లగ దిగ్గివచ్చు న
ర్వోన్నత రూపశాలి యెవరో!—అవునౌను చళుక్య మన్మథుం
డెన్నటివారు నన్నయకవీంద్రులు! [2]నందమపూడి భాగ్య సం
పన్నుని కేలు కేలగొని వచ్చె నవాంధ్రము జూచువేడుకన్.

తొలి తెల్గుబాల ముద్దుల మాట గావించి జాణ గీర్వాణితో జతలు కలిపి
వేంగి భూవిభు యశోవిమల కర్పూరముల్. రాకానిశలయందు రంగరించి
వేదవోదిత మహా విపులార్థములు తెన్గు పలుకుపొందికలోన పదునుపరచి
నారాయణుని తోడునన్ తెల్గు గాండీవ మెత్తి పూజల్లుల నెగురజిమ్మి
వ్యాసు గంభీరముద్ర, పంపన్న హాయలు కరుగబోసి త్రైలింగ్య కీర్తి మెఱుగులిడిన
ఆంధ్ర కవితాదిమార్గ మహాపథికుడు అదుగో! మరల గౌతమీతీరమందు దోచె.

గౌతమి యొడ్డులన్ ముదురగాచిన వెన్నెలపాలపొంగులన్
ప్రీతి విదల్పలేక తెలిరేల విహారము సల్ప వచ్చిరే
మో, తెలుగుం బొలమ్ములకు భూవిభుడుం గవిమిత్ర యుగ్మమున్—
మాతృ ధరిత్రిపై మమత మాయని తీయనగాదె! యేరికిన్.

---

1. కొరుమిల్లి యగ్రహారము చంద్రగ్రహణ సమయమున చీదమార్యుడను బ్రాహ్మణునకు దానమీయబడినది.
2. నారాయణభట్టు.

# భారతి

వ్యాసు [1]సరస్వతిన్ అమృతభాండమువంచి శరత్సమాగమం
బౌ సకలాంధ్ర నవ్యరుచియై తనియింప కవీంద్రమండలో
పాసిత రాజహంస గరుదంచిత భారతవాణి గౌతమీ
శ్రీ సరిదంచలమ్ములకు జేర్చిన పుణ్యులకున్ నమస్కృతుల్.

కోరి శరన్నిశారుచులకున్ నవజీవముపోసి కంఠముల్
దారకహారకమ్ముల దళత్తళలీన నలంకరించి క
ల్హారసుగంధముల్ తనువు లంటగ, గ్రపురంగు సన్న క్రొం
జీరలుగట్టి మాకు దయచేసిన సత్కవికిన్ కృతజ్ఞతల్.

నోరెరుగని ముని భారత
శారదరాత్రులకు ప్రౌఢ చంద్రముఖీ శృం
గారమయ చాతురీ సువి
హారములం గరపినట్టి ఆద్యాంధ్రకవీ!

ఒక సైకత స్థలి నొదిగి యచ్చర కన్నెలారవైచిన పట్టుచీర లనగ
ఒక శుభ్రపులినవేదిక నొల్కి జాల్వారు గోక్షీర సుమధుర కుల్యలనగ
ఒక శాశకుంజవీథిక చంద్రభాండమ్ము ప్రిదిలి చిందిన సుధాబిందు లనగ
ఒక నదీనీలవేణిక తీర్చికై సేయు బొండు మల్లియ పూలచెండు లనగ
రాజరాజమహేంద్రు హర్మ్యమున నిలిచి, ఎన్ని శారదశోభ లీక్షించినావొ
గూడుగట్టిన సౌందర్య గుంఫనములు, తెల్గుభారతమందు ముద్రించినావు!

నీవు పెట్టినభిక్ష వెన్నెలలు మాకు
నీవు కట్టిన రక్ష యాంధ్రికి సురమణి; *
ప్రతిరజతరాత్రి నీదు సంస్మృతులతోడ
అమృతకవితాలతాంగి ప్రత్యక్షమగుత!

1. వ్యాసుని శరద్వర్ణనము సరస్వతీ నదిప్రాంతమున. ఆశరత్తునకు నవ్యరుచులు కల్పించి నన్నయ తెలుగులసొత్తు గావించెనట.

*. ఆంధ్రశబ్ద చింతామణి.

# అంతర్వాహిని

## హితశ్రీ

* గతసంచిక తరవాయి *

## 15

వసంత కిటికీలోంచి చూస్తోంది. అల్లంతదూరంలో కనిపించాడు పోస్ట్‌మన్. 'అమ్మయ్య!' అనుకొని ఆమె అతనివైపే ఆతృతగా చూస్తూ నిలబడ్డది. తన వాకిలివైపే వస్తున్నాడు. ఇవాళ తప్పక తనకి ఉత్తరం వస్తుంది ఆమె ముఖంలో ఆశ చిగురించింది.

పోస్ట్‌మన్ వసంత ఇంటిమీదుగా పైకి వెళ్లిపోయాడు. వసంతముఖం మబ్బుపట్టిన చంద్రబింబంలా అయింది. సరిగా చూశాడో లేదో! ఇవాళకూడా రోజూకిమల్లేనే గడిచిపోతుందా! ఆమె నిట్టూర్పు విడిచింది.

ప్రతిరోజూ ఆమె ఎదురుచూస్తూ నేవుంది-విశ్వం కోసం, కనీసం విశ్వం ఉత్తరంకోసం. ఆ రోజున అతనలా వెళ్ళిపోయిన రాత్రినుంచీ ఆమెకి మనసులో అదే దృశ్యం మెదుల్తోంది. గంభీర భీభత్స ప్రకృతిలో దూర దూరంగా వెళ్ళిపోతున్న విశ్వం, గాలివానలో ఊగిపోతూ తడిసిపోతూ ఆ చిమ్మచీకటిలో మెరుపుల సహాయంతో ముందుకి సాగిపోతున్న విశ్వం. ఎలా వెళ్ళనిచ్చింది తను? తను చెయ్యదలచుకున్నది చెయ్యగలిగే నైతికబలంతో అనుకున్న కోరికతో నిర్మించిన విశ్వం రూపమే ఆమెకళ్లలో మెదుల్తోంది. తను ఒక్కమాట అని వుంటే విశ్వం తనకింత దూరమై పోయేవాడు కాదు. ఆ సమయంలో తను దిగ్భ్రమ చెందినమాట నిజమే. కాని సరైన సమయంలో తనకి చైతన్యం రాకపోవటం దురదృష్టం. అదే పరిస్థితిలో విశ్వం కాక మరొకవ్యక్తి అయివున్నట్లయితే తనపరిస్థితి ఎలాఉండేది! ఆయన విశాలహృదయుడు మహానైతిక శక్తిసంపన్నుడు. క్షణికంగా ఉద్రేకానికి లోనైనా పగ్గాలు పట్టుకుని నిలదొక్కుకోగల ధీశాలి. మనసిచ్చి మాట్లాడాలనిపించే ఆకర్షణశక్తిగల సహృదయుడు.

ఆ మర్నాటినించి వసంత, విశ్వం మళ్లీ వస్తాడని ఎదురుచూస్తూ నేవుంది. రోజులు గడిచిపోతున్నా ఆమె విశ్వాసం సన్నగిల్లలేదు. కాని ఆమెలో పూర్వపు ఉత్సాహం లోపించింది. మళ్లీ నాటక సంఘంవారి నాటకంలో పాత్ర స్వీకరించిందేగాని రిహార్సల్స్‌లో పూర్వపు ఆసక్తి, ఉత్సాహమూ లేవు.

రంగారావు ఒక్కడే నాటకసంఘ సభ్యుల్లో తనకి స్నేహితుడని విశ్వం చెప్పటం ఆమెకి గుర్తుంది. అతన్ని అడిగింది విశ్వం విషయం. తనకి అతని విషయమేమీ తెలియదన్నాడు రంగారావు. ఆమె కోరికమీద విశ్వం తండ్రిని కనుక్కున్నాడు. కాని ఆయనకూడా విశ్వం అడ్రసు చెప్పలేకపోయినాడు. ఏదో ఉద్యోగం వచ్చిందని విశ్వం రాసిన ఉత్తరం తరవాత అతని దగ్గర్నుంచి మళ్ళీ ఇంకొక ఉత్తరమేమీ ఆయనకి రాలేదు. ఆ విషయమే చెప్పాడు. తనకీ విశ్వం విషయం ఆదుర్దాగానే ఉందనీ, ఒకవేళ మరో ఊళ్ళో ప్రయత్నాలేమైనా చేస్తున్నాడేమోననీ అన్నాడు.

రంగారావుకి వసంత పరిస్థితి కొంత అర్థమైంది. ఆమెతో విశ్వానికి ఉన్న పరిచయంకూడా అతనికి తెలుసు. అందువల్ల ఆమెపట్ల సానుభూతి పూర్వకంగా ప్రవర్తించసాగాడు. వసంత నాటకసంఘం వారి నాటకంలో పాత్ర స్వీకరించటానికికూడా రంగారావే కారణం. అతను ఒకరోజున వచ్చి వసంతని ప్రాధేయపూర్వకంగా అడిగాడు. ఎంతైనా అతను విశ్వం స్నేహితుడు. ఆ గౌరవంవల్లనే ఆమె ఒప్పుకుంది.

వసంతపట్ల ఎవరైనా అగౌరవంగా మాట్లాడితే అతనూరుకోడు. విశ్వం చీవాట్లు పెట్టినప్పటినించీ అతను తన బాధ్యత గుర్తెరిగి నాటకసంఘ కార్యకలాపాలు నిర్వహించసాగాడు. వసంతకి విశ్వం విషయాలు ఏమైనా చెప్పేది అతనొక్కడే. తీరిక దొరికినప్పుడు ఇద్దరు విశ్వాన్నిగురించి మాట్లాడుకుంటారు. విశ్వం మీద రంగారావుకి అభిమానం ఏర్పడటానికి ముఖ్య

కారణం అతను తన గానాన్ని ఏ మినహాయింపూ లేకుండా మెచ్చుకోవటం.

రోజులు గడుస్తున్నాయి. మహేశ్వర్రావు అప్పుడప్పుడు వసంతిని సందర్శిస్తూనే ఉన్నాడు. ఆమె చేత చివాట్లు తింటూనే ఉన్నాడు. రిహార్సల్సు అయేసరికి ఒక్కొక్కసారి చీకటిపడితే ఇంటిదాకా వస్తానని తయారవుతాడు. ఆమె విసిరికొడుతూనే ఉంటుంది. ఆ సమయాల్లో ఆమెకి విశ్వం జ్ఞాపకంవొస్తాడు. మొదటిసారి విశ్వంతో కలిసి ఇంటికివచ్చిన సన్నివేశం తన జీవితంలో మరపు రాదు. తెచ్చిపెట్టుకున్న సంస్కారం కాక స్వతహా మనిషిలో ఉన్న ఆ మాట మంచితనం తన హృదయంలో వెయ్యివీణలు మోగిస్తుంది.

"నేను కవిని కాను" అన్న విశ్వంమాటలు జ్ఞాపకంవొస్తే నవ్వొస్తుంటుంది. 'కవిగారూ' అని పిలవకూడదట. ఆయన కవి కాకపోతే మరెవరు?

"కాస్తో కూస్తో చిత్రకళ ఉందిట" ఆ విషయం తలపుకొస్తే తన నట్టికి చిత్రం వైపు చూడకుండా ఉండలేదామె.

ఆమె ఒకసారి రిహార్సల్లో ఉండగా ఆ మాటలు జ్ఞాపకంవొచ్చాయి. హృదయంలో ఏదో భావం పెల్లుబికింది. ఎంత అణచుకున్నా ఆగలేకపోయింది. సరాసరి ఇంటికి వచ్చి తనచిత్రం ముందు కూర్చుంది.

తన చిత్రం అసంపూర్తిగా వొదిలేసి వెళ్లిపోయాడు విశ్వం. కనీసం ఆ చిత్రం పూర్తిచెయ్యటానికైనా ఆయన తిరిగిరావాలి. వచ్చితీరతాడు. తన బొమ్మ తయారుచేసిస్తానని మాట ఇచ్చాడు. మాట తప్పే పెద్దమనిషి కాదు విశ్వం.

కన్నీళ్లు గిర్రున తిరుగుతాయి వసంతకి. విశ్వం పెద్దమనిషి, అంతకంటె పెద్దమనిషి ఎవరైనా ఉంటారేమో తన ఊహకి మాత్రం అతీతం. తన చిత్రం అసంపూర్ణంగా మిగిలిపోతే తన జీవితమూ అంతే. ఏమేం సాధించినా ఆ చిత్రం పూర్తికానిదే తన జీవితం సఫలం కాదు.

తమ ఇద్దరికీ ఆ చిత్రానికీ మధ్య అవినాభావ సంబంధం ఉంది. అందులో తన బాహ్యరూపమే కాక అంత సౌందర్యం ఉంది. అది విశ్వానికి తెలియకపోవచ్చు. హృదయం రాగరంజితమైన తరుణంలో వదనంలోని ప్రణయరాగదీప్తులు చిత్రించటానికే విశ్వం శ్రమపడ్డాడు. ఆ రాగరేఖల్ని దర్శించినవాడు విశ్వం. ఆ అనురాగానికి ఆలంబనం అతడేనని విశ్వానికి తెలియకపోవచ్చు. కాని అతని కళాసృష్టిలో, నేత్రద్వయం ఆ సత్యాన్ని ఎల్లప్పుడూ చాటుతూనే ఉంటుంది. తన సృష్టిలో తన హృదయం ప్రతిబింబిస్తుంది. చిత్రంలో విశ్వం హృదయం తను స్పష్టంగా చూడ గలుగుతోంది.

ఆ చిత్రం తనది కాదు. రెండు మానవ హృదయాల్లోని రాగోదయ దృశ్యం.

## 16

అదృష్టవశాత్తూ విశ్వానికి ఒక వారపత్రికా కార్యాలయంలో ఉద్యోగమైంది. జీతం చాలా తక్కువే ఐనా విశ్వానికి ఆ ఉద్యోగం నచ్చింది. ఏ ఆఫీసులోనో గుమాస్తాగా చేరటంకంటే తను చదివింది కాస్తో కూస్తో పనికొచ్చే పత్రికా రచయిత పదవిలో ప్రవేశించటం అతనికి ఉత్సాహాన్నిచ్చింది. శ్రద్ధగా పనిచేయసాగాడు. అతని రచనలవల్ల పత్రికకి కూడా కొంచెం ప్రతిష్ఠ లభించసాగింది.

ఉద్యోగం చేస్తూనే ఉన్నా అతను చిత్రకళ అభ్యసించటం వొదలలేదు. ఆఫీసుకి వెళ్ళేముందు రోజూ ఏవో బొమ్మలు వేసుకుంటూ ఉండేవాడు. ఈ అన్ని వ్యాపకాల్లోనూ వసంతని అతను మర్చిపోలేదు. ఆమె జ్ఞాపకం వచ్చినప్పుడలా అతని మనసు పరిపరివిధాలపోయేది. ఆమెకి ఉత్తరం రాయాలని అనుకునేవాడు. కాని తీరా రాయటానికి కూర్చునేసరికి ఆ ప్రయత్నం విరమించటం మంచిదనిపించి మానేసేవాడు. ఉత్తరంలో తన విషయం తెలియచేస్తే ఆమెకి కొంత ఊరట కలుగుతుందని అతను ఆలోచించకపోలేదు. కాని అనవసరంగా ఆమె జ్ఞాపకాలని మళ్ళీ రేపి బాధకలిగించటమవుతుందేమోనని అనుకునేవాడు. తను ఇప్పట్లో గుంటూరు వెళ్లడు. ఆమెని కలుసుకోటం అంత త్వరలో సాధ్యం కాదు. ఉత్తరం రాసినప్పటినించీ ఆమె తన కోసం ఎదురుచూస్తూ ఆశాభంగం చెందితే తనకి కష్టంగా ఉంటుంది. అదికాక ఉత్తరంలో అన్ని సంగతులూ రాయటం కష్టం. తన మనసులోనిదంతా ఆమెకి తెలియచెప్పటం అవసరం. ప్రత్యక్షంగా కలుసుకున్నప్పుడు తనామెని వివాహం చేసుకోటానికి సిద్ధంగా ఉన్నాడని చెబితే ఆమె భావోద్రేకం చూడాలని గాఢంగా తనకి అనిపిస్తోంది.

# అంతర్వాహిని

ఉత్తరం రాయకపోవటానికి మరో ముఖ్య కారణం కూడా ఉంది. తను మాటమీద నిలబెటానికి సర్వవిధాలా ప్రయత్నిస్తాడు, నిజమే. కాని మొదట ఆమెని వివాహం చేసుకుంటానని ఉత్తరంలో రాసి ఏ కారణంవల్లనైనా అది నెరవేర్చలేకపోతే ఆమెని వంచించినట్లవుతుంది. తనా పని చెయ్యలేడు. ఈ సంగతులేవీ లేకుండా ఉత్తరం తన ఉనికిని తెలియచేస్తూ రాస్తే తనమీద ఆరాత్రి ఆమెకి కలిగిన అభిప్రాయం అలాగే ఉండిపోయి తన నిజాయితీమీద నిర్లక్ష్యం ఏర్పడవచ్చు.

ఇలా కారణాలు వెతుక్కుంటూ విశ్వం జాబు రాయటం ఉపేక్షించాడు. కొన్ని సమయాలలో తను తొందరపడి ఆమెకు మాటివ్వకూడదని నిశ్చయించుకుంటాడు. మరికొన్ని సమయాలలో వెంటనే ఆమెకి పరిస్థితులు తెలియచేసి వివాహం చేసుకుంటానని చెప్పాలనుకుంటాడు.

ఈ స్థితిలో ఒక వారంరోజులు విశ్వం జబ్బుపడ్డాడు. చూసేవాళ్ళు లేకపోయింది. ఒక్క ప్రేమ పూరితమైన మాటకోసం తపించాడు. ఒంటరితనం భరించటం దుర్భరమైపోయింది. ఆ సమయంలో వసంత చిరునవ్వు లొలికిస్తూ చల్లటి హస్తస్పర్శతో పులకింపచేసినట్టు ఊహాపథంలో మధురానుభూతిని పొందాడు. ఆమె అమాయకత్వంలోని ఏదో ఆకర్షణ బలీయంగా విశ్వాన్ని కలవరపెడుతుంది.

జ్వరం తగ్గగానే విశ్వం తండ్రికి సుదీర్ఘమైన ఉత్తరం రాశాడు. తన పరిస్థితులన్నీ తెలియచేసి వసంతని తను పెళ్లిచేసుకోక తప్పదనీ, తనని క్షమించి అందుకు అంగీకరించవలసిందనీ ప్రాధేయపూర్వకంగా రాశాడు.

విశ్వం ఉత్తరానికి తిరుగుటపాలో జవాబు వచ్చింది. అందులో రంగనాథంగారు నిష్కర్షగా తమ తిరస్కృతిని తెలియచేశారు. ఉత్తరం చదవగానే విశ్వానికి ఒళ్లు మండింది. ఆ నిరంకుశత్వాన్ని సహించలేకపోయాడు. ఒక ముగ్ధబాలికని ఇనపపాదాల కింద తొక్కిపట్టిన సంఘాన్ని ఎదిరించి ఆదర్శంగా ప్రవర్తించాలని తను మనస్ఫూర్తిగా కోరుకుంటే పరిస్థితుల్ని అర్థంచేసుకుని సహకరించకుండా బెదిరించే పితృత్వాన్ని ధిక్కరించటానికి తనకి ముందు వెనుకలు చూడాలిసిన అవసరంలేదని తీర్మానించుకున్నాడు.

తను ఆర్థికంగా అధోగతిలో ఉన్నాడు. తన సంపాదన తనకే చాలదు. వసంతనేం పోషిస్తాడు? డబ్బు లేనిదే వ్యవహారం జరగదు. ఒక ప్లీడర్‌తో సంప్రదించి ఆస్తిలో భాగంకోసం తండ్రికి రిజిస్టర్డ్ నోటీసు ఇప్పించాడు.

అది పోస్టుచేసినరోజు రాత్రి విశ్వానికి నిద్ర పట్టలేదు. తనేదో తప్పుచేశాననిపించసాగింది. సమర్థించుకున్నాడు. కాని నోటీసు ఇప్పించేటంతటి పరిస్థితి ఇప్పుడు లేదు. అప్పుడు తను చేసిన దోషం ఏమీ లేదు. తప్పంతా నాన్నమీద ఉంది ఇప్పుడు తనమీదికి ఆకాశం విరుచుకుపడేట్టుంది. తను ఇలాంటి దావాల్ని గురించి పూర్వం విన్నప్పుడు చాలా తిరస్కార భావంతో విమర్శించేవాడు. ఇప్పుడు తను అదే పొరపాటు చేశాడు. విశ్వానికి ఒక్కటే సమర్థనీయాంశంగా తోచింది. ఇది తనకోసం చేసిన పనికాదు. ఒక కోమలిని పాడు సంఘం బారినించి రక్షించటానికి చేశాడా పని. స్వార్థంకోసం చేస్తే క్షంతవ్యుడు కాడు.

నోటీసు అందినట్టు సంతకం ఉన్నా జవాబు మాత్రం ఏమీ రాలేదు. భయం భయంగా రోజూ పోస్టుకోసం చూస్తున్నాడు విశ్వం. రోజులు గడిచిపోతున్నాయి. యథావిధిగా తన ఉద్యోగవిధులూ, చిత్రలేఖనమూ చూసుకుంటూనే ఉన్నాడు విశ్వం. కొన్ని చిత్రాలు ప్రదర్శనకికూడా పంపాడు. వాటికి ప్రశంసలు లభించాయి.

ఒకరోజు ఉదయం గదిలో కూర్చుని ఏదో రాసుకుంటుంటే తలుపు తట్టిన చప్పుడు విని లేచి తలుపు తీశాడు విశ్వం. సూరీ, జానకీ వచ్చారు. కుశల ప్రశ్నలైపోయి తీరిగ్గా కూర్చున్నప్పుడు అడిగాడు విశ్వం.

"ఏమిటి విశేషం, ఏదో పనిమీద వొచ్చినట్టున్నారు."

"వెండి సామాన్లూ, చీరలూ, నగలూ మొదలైనవి కొనాలి." అన్నాడు సూరి తాపీగా.

"ఏమిటి గిరాకీ?"

"మా జానకీ—పెళ్ళికూతురాయె నే," అని రాగయుక్తంగా అభినయపూర్వకంగా చూశాడు. జానకి ఇదంతా తనకేమీ పట్టనట్టు తనేమీ విననట్టూ పేపరు చదువుకోసాగింది. కొద్ది క్షణాలాగి విశ్వం అకస్మాత్తుగా నిద్రనించి లేచినవాడిలా అన్నాడు.

"చెప్పావుకావే! ఎప్పుడూ ముహూర్తం?"

"రోజులో నే. శుభలేఖ ఇస్తాంలే."

"ఇవ్వకపోతే లాక్కుంటాను. సరే, సంబంధం ఏ ఊరేమిటి?"

"మీ ఊరే"

"ఎవరూ?"

"ఆయన పేరు నటేశ్వరరావు."

విశ్వం ముఖంలో నెత్తురుచుక్క లేదు. అతనికి నోట మాటరాలేదు. హీనస్వరంతో అడిగాడు

"ఏ నటేశ్వరరావు?"

"బి. ఎల్. ప్యాసయి కొత్తగా ప్రాక్టీసు పెట్టాట్ట. కొంత పాతకాలపిన్ని కూడా ఉందిట. నువ్వెరిగే ఉంటావనుకున్నాను. తెలుసా?"

విశ్వానికి ఏం జవాబు చెప్పాలో తెలియలేదు.

"తాంబూలాలు పుచ్చుకున్నారా?"

"ముహూర్తంకూడా నిశ్చయమైపోయి రెండు రోజులో పెళ్ళిజరగబోతుంటే ఇంకా నువ్వుతాంబూలాల దగ్గిరే ఉన్నావూ?"

విశ్వం ముఖం పాలిపోయింది. నెమ్మదిగా సూరికిమాత్రం వినిపించేలా అడిగాడు.

"జానకికి ఇష్టమేనా?"

"నీ కా అనుమానం ఎందుకు కలిగింది?"

విశ్వం జవాబు చెప్పలేదు. చూడటానికి నటేశ్వరరావుది సుందరవిగ్రహమే. మాటలో మర్యాద, నడకలో హుందాతనం ఉన్నాయి. ఎంతైనా నటుడు. కాని జానకి అతన్ని వివాహమాడి ఏంసుఖపడుతుందో! విశ్వానికి గుండె గతుక్కుమంది ఆ ఆలోచనరాగానే. మంచిమొగుణ్నే వెతుకుతాంలే అని భరోసా ఇచ్చాడు జానకికి, తనచేతుల్లో ఏదో ఉన్నట్టు. ఎంత పొరపాటు చేశాడు! స్థిరపరచుకునేముందు తనతో మాటమాత్రం అంటే, ఓ ఉత్తరంముక్కయినా రాసివుంటే ఇంత అనర్థం వాటిల్లేదికాదు. ఇప్పుడు సమయం మించిపోయింది. పరిస్థితి మరీ చెయ్యిదాటిపోలేదు. కాని చిక్కులున్నాయి. వాళ్ళది పల్లెటూరు. మళ్ళీ ఇంకో సంబంధం కుదుర్చుకోటమంటే తలోమాటా అంటారు. తను అంతదాకా వెళుతున్నాడు. జానకి ఒప్పుకోంటుందా ముందు? తను మహాచిక్కుపరిస్థితిలో పడిపోయాడు. తెలిసీ చెప్పకపోతే తరవాత విచారించవలసి వస్తుందేమో. చెబితే ఎటువంటి గడబిడ జరుగుతుందో? జానకి ముఖంవంక చూశాడు విశ్వం. ఆమెలో ప్రశాంతత తొణికిసలాడుతోంది. జానకి ఎప్పుడూ అలాగే చీకూచింతా లేనట్టుగా ఉంటుంది భవిష్యత్తు ఎలా వుంటుందో!

సూరి స్నానాలగదిలోకి వెళ్ళాడు. విశ్వం జానకీ ఒకరికెదురుగా ఒకరు కూర్చున్నారు. ఆమెని చూస్తున్నకొద్దీ తనలో ఏదో విశ్వాసం కలుగుతోంది.

"నీ పెళ్ళికి రమ్మంటావా జానకీ?"

"నీ పెళ్ళికి నేను రావాలని ఉంటే రా, లేకపోతే లేదు," అలా తపిమని జవాబు చెప్పడం ఆమె కలవాటేనని విశ్వానికి తెలుసు.

"రావటానికి వీలుండదేమో."

"ఏదైనా వంక దొరికిందా?"

"గుంటూరునించి నాన్నగారూవాళ్ళూ వస్తారు కదూ?"

"వస్తే? వస్తే వాళ్ళే నువ్వు నువ్వే. బలవంతం చేయించుకోవాలని ఉన్నట్టుందే పాపం." విశ్వం నవ్వే స్థితిలో లేడు.

"వాళ్ళొస్తే నేను రావటానికి వీలుండదు."

"అదేమిటి? వింతగా మాట్లాడుతున్నావే!"

"కాదు జానకీ. నిజంగా చెబుతున్నాను. నేను వాళ్ళున్నచోటికి రాలేను. ఆ రోజులు పోయాయి."

"ఏమిటిబావా నువ్వుమాట్లాడేది?" ఆశ్చర్యంగా అడిగింది జానకి.

"పార్టిషన్ దావా వేస్తానని నోటీసిచ్చాను."

అప్రతిభురాలైంది జానకి. విశ్వం ముఖంలోకి "నిజమా?" అన్నట్టు ఆశ్చర్యంగా చూసింది.

"అవును. జానకీ," అన్నాడు విశ్వం.

"అటువంటి దుర్బుద్ధి ఎందుకు పుట్టింది?"

విశ్వం పరిస్థితులు చెప్పాడు. వసంతనితను వివాహమాడక తప్పదనికూడా చెప్పాడు.

"ఐతేమాత్రం అదేంపని?" అందామె.

"ఏం చెయ్యను?"

"ఏం చెయ్యలేకపోతే దావా వేస్తావన్నమాట. అదా నీ ప్రయోజకత్వం?"

ఇంతఘాటుగా జానకి ఏ విషయంలోనూ ఏ సందర్భంలోనూ తనతో అనలేదు.

విశ్వం సమాధానం చెప్పలేకపోయాడు.

"నువ్వయితే ఏం చేసేదానివి?"

"నేనయితే అలా ఎన్నటికీ చేసేదాన్ని కాదు. భరించలేక ఒకవేళ చేసినా వెంటనే బుద్ధి తెచ్చు

గని వెళ్ళి కాళ్ళమీద పడేదాన్ని. ఘనకార్యం చేశావులే" అందామె.

జానకి ఇంత తీవ్రంగా విమర్శిస్తుందనుకోలేదు. అతనేమీ అనలేకపోయాడు.

"నువ్వు తొందర మనిషివి బావా" అంది జానకి.

"ఆలోచించే చేశాను" అన్నాడతను.

"ఏం లాభం.?"

"ఇప్పుడేం చెయ్యమంటావు నన్ను ?"

"మావయ్య తప్పు చేశాడనుకో. నువ్వుకూడా అలాంటి తప్పే చేస్తే నీ గొప్పతనమేముంది ? పొరపాటు చేశానని క్షమాపణ కోరుకో బావా. ఆయన మనసు ఎందుకు క్షోభ పెడతావు ? ఇంతలో నీ వ్యక్తిత్వానికీ, అహానికీ ఏం దెబ్బ లేదులే. ఏం? ఏమంటావు?"

విశ్వం జానకివైపు కళ్ళార్పకుండా చూశాడు. ఈ సలహా ఎవరైనా ఇవ్వగలరు. అసలు తనకే అలా చెయ్యాలని తట్టకపోలేదు. కాని జానకి అలా ప్రోద్బలం ఇవ్వటంలో ఏదో మహత్తర శక్తి ఉంది. హృదయంలో ఏదో అస్పష్టమైన బాధ కలిగిందతనికి. ఏదో ఆవేదన తనకి విశ్రాంతి లేకుండా చేస్తోంది. వాళ్ళకీ తనకీ మధ్యన అసహజమైనదేదో అడ్డుపడ్డది. దానికి తనే బాధ్యుడు. సరిదిద్దటానికి కూడా బాధ్యత తనదే !

"సరే జానకీ." అన్నాడు.

"నువ్వు మంచివాడివే. నాకు తెలుసు." ఆమె అలా అనటంలో ఏదో అనునయం ఉంది. జానకి తనకంటే చాలా చిన్నది. అయినా ఆమెలో ఉన్న శక్తి ఏదో తనని శాసిస్తోంది.

ఆ సాయంత్రం బజారుకు వెళ్ళి వెండి చెంబులూ, పట్టుబట్టలూ, చీరెలూ, ధోవతులూ, నగలూ కావలసినవన్నీ తెచ్చుకున్నారు. ఇంటికి తిరిగివచ్చేముందు విశ్వం అన్నాడు.

"స్కూల్ భవనంలో చిత్రకళాప్రదర్శనం ఉంది. దగ్గిరే, చూసి వెడదాం రండి."

"నేను ఈ వస్తువులన్నీ ఇంటిదగ్గిర పడేసివస్తాను. మీరక్కడ ఉండండి." అని నూరి బండిలో వస్తువులన్నీ వేసుకుని ఇంటికివెళ్ళాడు.

జానకీ, విశ్వం ప్రదర్శనశాలవైపుకి నడిచారు.

* * *

చిత్రకళా ప్రదర్శనశాలలో చిత్రాలన్నీ వరసగా చూస్తూ ఒకచోటికివచ్చి అలాగే నిలబడిపోయింది ఒక అమ్మాయి. అక్కడ రెండు పెద్దపెద్ద బొమ్మలున్నాయి.

ఒకటి "సౌందర్యం"

రెండోది "తోడేలు, మేకపిల్ల."

అవి వేసిన చిత్రకారుడు విశ్వం.

వాటిదగ్గిర నుంచుని చూస్తూ ఉన్న అమ్మాయి వసంత.

'తోడేలు, మేకపిల్ల' చిత్రం చూడగానే ఆమె స్మృతిపథంలో విశ్వం మెదిలాడు. పేరు చూసింది అప్పుడు. ఆమె పెదవులమీద చిరునవ్వు తాండవించింది. కళ్ళలో ఆనంద బాష్పాలు నిండాయి. అదేపనిగా ఆ బొమ్మ చూస్తోందామె. చూస్తున్నకొద్దీ తనకి నవ్వొస్తోంది. ఆ తోడేలులో క్రౌర్యం లేదు. ఆ మేకపిల్లలో భయం లేదు. పరిగెత్తుకుపోయే మేకపిల్లని పట్టుకునీ పట్టుకోనట్టుంది తోడేలు. ఆ చిత్రం అర్థమేమిటో పసికట్టింది వసంత. ఆ చిత్రం ప్రధానోద్దేశం జాలి కలగచెయ్యటం. అందరూ దాన్ని తెగ మెచ్చుకోటం ఆమె చూస్తోంది. కాని ఆ చిత్రం చూస్తే తనకి జాలివెయ్యదు. నవ్వొస్తూంది.

రెండో చిత్రం "సౌందర్యం." ఆరు ఋతువుల దృశ్యాలూ కలగాపులగంగా చిత్రించబడ్డాయి. ఎర్ర చిగుళ్ళు, ఎండమావులూ, నీల మేఘాలూ, గాలివానా, తెలిమబ్బులూ, పంటచేలూ మంచుతెరలూ, రాలే ఆకులూ అన్నీ ఒక క్రమంలో కాకుండా చిందరవందరగా చిత్రించబడ్డాయి. సర్వత్రా సౌందర్య దర్శనమే జీవిత పరమావధి అని చిత్రం సందేశం. వసంత సమ్మోహితురాలై ఆ దృశ్యం అలాగే కన్నార్పకుండా చూడసాగింది.

"అమ్మకానికి" అని ఆ రెండు చిత్రాలకీ కాగితాలు తగిలించి ఉన్నాయి. రెండూ కలిపి వెయ్యి రూపాయలు.

"ఈ రెండు చిత్రాలూ నాకు కావాలండీ!" అంది వసంత ప్రదర్శనశాల నిర్వాహకులతో.

"అలాగేనండి. కాని ప్రదర్శనానంతరము అవి మీకు పంపగలము."

"ప్రదర్శన ఎప్పటివరకూ ఉంటుంది."

"ఇవాళతో ఆఖరు. రేపు మీకు పంపుతాం."

వసంత ఆలోచించింది. ఆ బొమ్మలు తనతో తీసుకు పోవాలని ఆమెకి ఉంది. వాళ్లు పంపేటయితే తన అడ్రసు ఇవ్వాలి. అడ్రస్ ఇస్తే విశ్వానికి తెలిసి పోతుంది. బతిమాలుతున్నట్టు అంది. "చూడండీ, ప్రదర్శన ఇంచుమించు ఎలాగో అయిపోయిందికదూ. చీకటిపడుతోంది. ఇంక ఎక్కువమందిరారు. ఇవి ప్యాక్ చేసి నాకిస్తే సంతోషిసాను. ఇవి నాకు ఇప్పుడు తీసికెళ్ళటానికి మాత్రమే వీలవుతుంది. మీరు తరవాతగాని పంపటానికి వీలేదంటే కొనటానికి నాకు ఇబ్బందిగా ఉంటుంది. ఏమంటారు.?"

నిర్వాహకులకి ఆ బేరం పోగొట్టటం ఇష్టం లేదు అసలు కొనేవాళ్లే తక్కువ. అందులో అంత డబ్బుపెట్టికొనే కళాపోషకులు మరీ అరుదు. చిత్రకారుడు సంతోషిస్తాడని వాళ్ళు 'సరే' అన్నారు.

"ఈ డబ్బు ఆర్టిస్ట్ కే వెడుతుందికదండీ."

"అవును. మీపేరేం రాయమన్నారు?"

"రేఖ."

వసంత ఖరీదిచ్చింది, రసీదు తీసుకుంది.

"వారి అడ్రెస్ చెబుతారా?" అందామె.

అడ్రస్ రాసిచ్చారు.

వసంత చిత్రాలు బండిలో పెట్టించుకుని వెళ్ళి పోయింది. విశ్వం ఈ విషయం తెలిసి ఏమనుకుంటాడో! ఎంతసంతోషిస్తాడో! అప్పుడాయన ముఖంలోని ఆనందం చూడాలనిపిస్తోంది తనకి!

బండీ వెళుతోంది స్టేషన్ కి.

యథాలాపంగా రోడ్డుచివరదాకా చూసిన వసంత ఉలిక్కిపడ్డది. మళ్ళీచూసింది. విశ్వమే సందేహం లేదు. పక్కన ఎవరు? ఆమె తెల్లబోయింది. క్రమంగా వాళ్ళు దగ్గిరౌతున్నారు.

ఇద్దరూ ఏదో మాట్లాడుతూ నవ్వుతూ నడుస్తున్నారు.

విశ్వం పెళ్ళిచేసుకున్నాడా?

తను భూమిలోకి కుంగిపోతున్నట్టనిపించింది వసంతకి.

బండి వాళ్ళిద్దరినీ దాటిపోయింది.

విశ్వం తనని చూడలేదు. చూస్తే ఏంచేసేవాడో! వసంత ఉత్సాహమంతా దిగజారిపోయింది.

బండీ క్రమక్రమంగా దూరమైంది.

విశ్వం, జానకీ ప్రదర్శనశాలకివొచ్చారు.

అతను వచ్చీరాగానే నిర్వాహకులు జరిగిన విషయం చెప్పారు.

వెయ్యి రూపాయలు!

ఆమె ఎవరో రేఖట!.

ఆ బొమ్మలు అంతఖరీదుపెట్టి ఎవరూ కొంటారని తను అనుకోలేదు. విశ్వం తన చెవుల్ని తనే నమ్మలేకపోయాడు.

వెయ్యిరూపాయలు సంపాదించటంవల విశ్వానికి మహోత్సాహం కలిగింది. ఇకవసంతని తను వివాహం చేసుకోటానికభ్యంతరం ఏమీ ఉండదు.

ఆ మర్నాడు విశ్వం కోటిపల్లి ప్రయాణమై వెళ్ళాడు. అక్కడ నాన్నకి క్షమాపణ చెప్పుకున్నాడు. వెంకట్రామయ్యగారుకూడా అక్కడే ఉన్నారు.

"మనవాళ్ళు వొట్టి వెధవాయిలోయ్" అన్నాడు ఆయన గిరీశంగారి ఫక్కీలో.

రంగనాథంగారు మనస్ఫూర్తిగా నవ్వారు. పెళ్లి బాజాలు మోగుతున్నాయి.

ఊళ్ళో జనం అంతా వెంకట్రామయ్యగారి ఇంటి ముందే ఉన్నారు. అక్కడ పార్టీ గొడవలు లేకుండా అందరూవచ్చి కులాసాగాకబురు చెప్పుకోటం చూసి విశ్వం సూరివైపు చూసి భావగర్భితంగా నవ్వాడు. సూరి పొడిగా నవ్వాడు.

విశ్వాన్ని అక్కడ చూడటం నటేశ్వరరావుకి కొంచెం విషమంగానే ఉంది అయితే విశ్వం జరిగింది మర్చిపోయి నటేశ్వరరావుని హృదయపూర్వకంగా అభినందించి స్వాగతం చెప్పటంవల్ల అతను విశ్వం ఉనికిని అంతగా పట్టించుకోలేదు.

సుముహూర్తం జరిగిపోయింది. పండితు డెవరో శ్లోకం శ్రావ్యంగా పఠిస్తున్నాడు.

జానక్యాః కమలామలాంజలిపుటే యాః
పద్మరాగాయితాః
న్యస్తా రాఘవమస్తకేచ విలసత్కుంద
ప్రసూనాయితాః
స్రస్తాః శ్యామలకాయకాంతి కలితా యా ఇంద్ర
నీలాయితాః
ముక్తాస్తా శ్శుభదాభవంతు భవతాం శ్రీరామ
వైవాహికాః

ఏదో పవిత్రత ఆవరించింది వివాహానుబంధాన్ని. తన్మయత్వంతో విన్నాడు శ్లోకపఠనాన్ని విశ్వం. ఈరోజునుంచీ జానకి కొత్తజానకి. ఆమెకి పెళ్ళయింది! భర్తే సర్వస్వంగా ఆమె జీవిస్తుంది. తను ఆమెతో ఇదివరకు తీసుకున్నంతగా చనువుతీసుకోలేడు. పద్మని ప్రేమించినంతగా, ఇంకా ఎక్కువగా కూడా తను జానకిని ప్రేమించాడు. ఆమె అంటే ఏదో అనిర్వచనీయమైన అభిమానం తనికి. జానకి సుఖంకోసం తనేమైనా ఇవ్వగలడు. ఆమె కష్టంలో ఉంటే తనగుండె ఎవరో నులిమినట్లుంటుంది. సత్యేశ్వరరావు ఆమె భర్త అవుతాడని తెలిసినరోజున అలాగే అనిపించింది. అతను అదృష్టవంతుడు. పద్మ అదృష్టవంతురాలు.

కాని జానకి జీవితం పూలబాట కాదేమో. ఆమె కష్టించి సాధించుకోవాలి జీవితం. ఆమెలో ఆశక్తి ఉంది.

జానకిలో ప్రశాంతత ఉంది. అందుకే ఆమె ఒక ప్రభంజనం కాగలదు, అవసరమైతే. వసంత! మూర్తీభవించిన అమాయకత్వం. ఆమెలో అందరికీ అంత అమాయకత్వం కనిపిస్తుందో లేదో కాని తనకలా అనిపిస్తుంది.

సంభావనకి వచ్చినవారు వేదం చదువుతున్నారు. ఆ సంగీతం వింటూ అలాగే కూర్చున్నాడు విశ్వం.

అక్షతలు జల్లుతున్నారు.

జానకితలపై శుభాక్షతలు చల్లుతుంటే ఏదో దివ్యానందం కలిగింది విశ్వానికి. మనసులోనే ఆశీర్వదించాడు. ఆమెకళ్ళతో చిరునవ్వు నవ్వింది.

“నువ్వు మంచివాడివి బావా” అని జానకి అన్నట్టనిపించి అతనికళ్ళు చెమ్మగిల్లాయి.

తను నిజంగా మంచివాడైనా కాకపోయినా జానకి అలా అన్నప్పుడు తను పూర్తిగా మంచివాడై పోవాలనిపిస్తుంది. ప్రతిమనిషిలో కొంతోకొంతో మంచీ చెడు రెండు ఉంటాయి. మనిషిలోని మంచితనాన్ని కొందరు పెంపొందింపచేస్తే, మరికొందరు చెడునే రెచ్చగొడతారు. జానకి అందరిలో మంచినే చూస్తుంది. తటాలున విశ్వానికి ఎంతో మనశ్శాంతి నిచ్చే భావం కలిగింది. ఒకవ్యక్తి జీవితాన్ని తీర్చిదిద్దే అవకాశం జానకికి లభించింది. అందుకు ఆమెకి శక్తి సామర్థ్యాలున్నాయి. సరిపడని విషయాలు తను చీదరించుకుని ఊరుకుంటాడు. కాని జానకి పద్ధతి వేరు. ఎవరినిగానీ ఆమె చీదరించుకోటం తనెప్పుడూ చూడలేదు, అశాంతీ అసహనము అసంతృప్తి తనని బాధించినట్లు ఆమెని బాధించవు కాబోలు.

## 17

ఆకాశంలోకి శూన్యంగా చూస్తూ నిలబడ్డది వసంత. ఆమె వదనంలో కళాకాంతులు తరిగిపోయాయి. నిర్లక్ష్యంగా వొదిలిన జుట్టు గాలి కెగురుతోంది.

అకస్మాత్తుగా ఆమెలో ఏదో మార్పు కలిగింది. ఆమె కళ్ళలోకి ఏదో వెలుగువచ్చింది. ఆమె పెదవులపై చిరునవ్వు వెన్నెల విరిసింది. ఒకసారి ఒక భావానికి స్పందించిన హృదయం మళ్లీ మళ్లీ అదే భావానికి స్పందించినా అందులో కొత్తదనంఏమీ లేదు. ఆ అనుభవంలోని ఆనందం నిత్యనూతనం. మళ్ళీ మళ్ళీ అది కావాలని అర్రులు చాచటం మానవ స్వభావమే, కాని అది అశక్తి వశంకావటం.

ఒకసారి చూసిన దృశ్యం మళ్ళీ చూడాలనిపించవచ్చు. కాని ఆ మొదటి అనుభవమే చిరస్మరణీయం.

ఈ మాత్రం విషయం తెలుసుకోలేక తనెంత మథనపడ్డది!

జ్ఞాపకాల్లోని మాధుర్యం కంటె అదే అనుభవం మళ్ళీ మళ్ళీ అనుభవించటంలోని మాధుర్యం ఎక్కువ కాదు. విశ్వం, తనూ మాట్లాడుకున్న సన్నివేశాలు ఎన్నో, అవన్నీ మధుర క్షణాలు, మధుర ఘట్టాలు. ఒక జీవితకాలం అంతా వాటిని జ్ఞాపకంచేసుకుంటూ గడిపివేయవచ్చు మహదానందంగా.

తలుపు చప్పుడు విని తలెత్తి చూసింది వసంత: తన కళ్ళు తనే నమ్మలేకపోయింది. విశ్వం.

“వసంతా!”

“మీరా!”

“నేనే వసంతా” ఆప్యాయంగా అన్నాడు విశ్వం.

వసంత కన్నీరు తుడుచుకుంది. విశ్వం ఆ దృశ్యం చూసి చలించాడు.

“ఏడుస్తున్నావా వసంత ?”

“లేదు” అంది ఆమె గద్గదికంగా. ఆలోచనలో ఆమె గమనించలేదు. తను ఆలోచిస్తున్నంత

నేపు కన్నీరు కారింది కాబోలు. విశ్వంరాగానే అది విజృంభించింది.

"నన్ను క్షమించు వసంతా" అన్నాడు విశ్వం.

వసంతకి గొంతు పెగల్లేదు. ఆమె ఏమీ అనక పోయేసరికి ఆమెకోపం తగ్గలేదనుకున్నాడు విశ్వం.

"ఎన్నాళ్లి నించో క్షమాపణ చెప్పుకుందామనుకుంటున్నాను."

అందుకేనా విశ్వం వచ్చింది!

"ఎందుకూ?" అంది ప్రయత్నించి ఆమె.

"ఆరాత్రి అలా తొందర పడ్డందుకు. ఇన్నాళ్లి నించీ ఆక్షమాపణ వాయిదా వేసినందుకూ."

"ఇన్నాళ్లు ఎక్కడ ఉన్నారు?"

"విజయవాడలో కొన్ని చిక్కుల్లో పడ్డాను. ఇప్పుడు పరవాలేదనుకో."

"కులాసాగా ఉన్నారా?"

"ఓ నీకో మంచి సంగతి చెప్పమన్నావా?"

తనకి తెలుసు ఆసంగతేమిటో! వసంత ముభావంగా ఊరుకుంది.

"నువ్వు ఊహించనంత! అవును."

బొమ్మల ఖరీదు అంత వుంటుందని తనెప్పుడూ అనుకోలేదు.

"చెప్పండి" అందామె ముక్తసరిగా.

ఆమె ఎందుకో నిరుత్సాహంగా ఉంది! తను ఇప్పుడా విషయం చెబితే ఆశించినంత మాధుర్యం అందులో ఉండదు. వసంత ఎందుకలా ఉందో!

"పోనీ, తరవాత చెబుతా లే."

"మీ ఇష్టం."

విశ్వం గదిచుట్టూ చూశాడు. తను పూర్తి చెయ్యని నర్తకిబొమ్మ ఇంకా అలాగే డ్రాయింగ్ స్టాండ్‌మీద ఉంది. అతని హృదయంలో చెయ్యి పెట్టి కలచినట్టయింది.

"వసంతా, నన్నా బొమ్మ పూర్తిచెయ్యనిస్తావు కదూ?"

వసంత కళ్లలో నీళ్లు తిరిగాయి. అసంపూర్ణ రాగోదయ చిత్రం......చివరిదాకా అసంపూర్తిగా మిగిలిపోయే జీవితం.

ఆమె సమాధానంకోసం ఎదురుచూడకుండానే విశ్వం ఆ చిత్రం దగ్గిరికివెళ్ళి తదేకంగా చూడసాగాడు.

ఆనాటిరాత్రి జరిగిన ఘట్టం స్మృతిపథంలో మెరిసింది. చప్పున కిటికీలోంచి బయటికిచూశాడు. తరవాత అలా చూసినందుకు అతను కొంచెం నవ్వుకున్నాడు.

ఇక వసంత తనదవుతుంది. తనకేం భయం? ఆమెకోసం తను అన్నీ త్యాగంచేయబోతున్నాడు. జీవితంలో తిరుగులేని మంచిపనిచేసి ఘనంగా తలెత్తుకు తిరగబోతున్నాడు.

"అన్నట్టు, వసంతా, నేనీమధ్య ఓ వెయ్యి రూపాయలు సంపాదించాను తెలుసా?"

అంటూ విశ్వం అక్కడ వెనక్కి తిప్పివున్న చిత్రాలు ముందుకు తిప్పిచూసి నిర్ఘాంతపోయాడు.

వసంతికి నవ్వొచ్చింది. కాని ఆపుకుంది.

"ఇవి నీకెక్కడివి?"

"కొన్నాను."

"కొన్నావా? ఎక్కడ?" ఆశ్చర్యంగా ఆమె వైపు చూశాడు విశ్వం.

"చిత్రకళాప్రదర్శనశాలలో."

తెల్లబోయాడు విశ్వం.

"అయితే నువ్వేనా? లేకపోతే నా బొమ్మలు వెయ్యిరూపాయలిచ్చి కొనేదెవరు లే."

ఆమాటలకి చివుక్కుమంది వసంత మనసు. ఆ బొమ్మలు తను అలా ఎదురుగా ఎందుకు పెట్టింది!

"కాని నీ కంత డబ్బెక్కడిది?"

"సంపాదించాను."

"ఎలా?"

"సినిమాల్లో వేషం వేస్తున్నాను."

ఆమెవైపు ఆశ్చర్యంగా చూశాడు విశ్వం.

"సినిమాలోనా? ఎప్పటినుంచీ? నాకు తెలియదే!"

"ఇంకా మొదల్లేదు. మొన్ననే బుక్ అయాను. త్వరలో మద్రాసీ వెళ్లాలి."

"అయితే నేను కొన్నాళ్లాగివస్తే చిక్కేదానివి కాదన్నమాట."

ఆ మాటలకి అతనివైపు ప్రశ్నార్థకంగా చూసిందామె.

"అంటే."

"మద్రాస్ వెళ్ళిపోయేదానివిగా."

"ఊఁ" అంది వసంత ముభావంగా.

"విజయవాడ వచ్చినదానివి ప్రదర్శనశాలలో నా అడ్రస్ తీసుకుని నా దగ్గరకొచ్చి పోకూడదూ?"

"రావాలనే బండిలో బయల్దేరాను. అయితే మీరు ఎవరితోనో కలిసివెళుతూ దారిలో కనిపించారు. పలకరిస్తే బావుండదని వొచ్చేశాను."

"నువ్వు నన్ను చూశావా?" అని ఆశ్చర్యంగా అడిగాడు అతను. "నేను చూడలేదే!"

"మీరెవరో సరదాగా మాట్లాడుకుంటూ వస్తున్నారు. ఆమె ఎవరు?"

కుతూహలంగా అతనివైపు చూసిందామె.

"మా మేనమామకూతురు. జానకి. నిన్ననే పెళ్ళయింది."

"నిన్ననా?"

"అవును. పెళ్ళికొడుకెవరో తెలుసా? మన నటేశ్వరరావు."

అత్యంతాశ్చర్యంతో కళ్ళు పెద్దవిచేసి చూసింది వసంత!

"అలాగా!" అందామె. ఏదో బరువు తీరిపోయినట్టయింది ఆమెకి.

జానకి వివాహంప్రసక్తిరాగానే తను వొచ్చిన పని జ్ఞాపకం వొచ్చిందతనికి. ఉత్సాహంగా పెదవికదిపాడు. కాని అంతలోనే అతనికి తటాలున ఓసందేహం కలిగింది. ఇన్నాళ్లు తను మాట్లాడకుండా ఊరుకుని ఇప్పుడా సంగతి చెబితే ఆమె ఏమనుకుంటుందో. ఇప్పుడు వసంత సినిమానటి అవబోతోంది. తను అది తెలుసుకుని పెళ్ళిచేసుకోటానికి సిద్ధపడుతున్నాడనుకుంటుందేమో. అదికాక సినిమాలో ఆమె వేషాలు వెయ్యటం తన కిష్టం ఉండదు. ఆమె అందుకు ఇష్టపడుతుందా? తనుసరైన సమయంలో రాలేదు. ఆలస్యం జరిగిపోయింది. ఇప్పుడు తన మంచి పనిని వసంత అర్థం చేసుకునే స్థితిలో లేదు. పైపెచ్చు స్వార్థం అంటగట్టవచ్చు.

అతని ముఖంలో ఆశాభంగం స్పష్టంగా కనిపించింది. కొంచెంసేపవరకూ మాట్లాడలేదు.

"నీకు సినిమాలో అవకాశం ఎలా దొరికింది?"

"దరఖాస్తుపెట్టాను. డైరెక్టర్ గారు విజయవాడలో మకాంచేసి ఇంటర్వ్యూకి అక్కడికి రమ్మంటే వెళ్లాను. వెంటనే బుక్ చేసుకొని అడ్వాన్సు కూడా ఇచ్చారు."

సినిమాలో నటించటం విశ్వానికిష్టంలేదని వసంతకి తెలుసు. కాని తనేం చేస్తుంది. విశ్వం జాడ తెలియనప్పుడు ఆ పనిచేసింది.

విశ్వం ఒక్క మాటంటే తను మానేస్తుంది!

కాని... కాని... అయన?

వసంత ఏదో ఆలోచిస్తోంది.

"మద్రాసు ఎప్పుడు వెడతావు?"

"రేపే వెడదామనుకున్నాను."

వసంత ఆగింది. విశ్వం ఇంకేమీ అనలేదు. ఆమెలో ఏదో నిరాశాభావం కలిగింది తను అందని మ్రానిపండుకి ఎగబాకుతోంది.

"ఒంటరిగా వెళ్ళటం భయంగా ఉందండీ. మీరు కూడా వొస్తే ధైర్యంగా ఉంటుంది."

వెనకరిహార్సల్స్‌కి వెళ్ళేటప్పుడూ ఇలాగే తను వొస్తే ధైర్యంగా ఉంటుందని వసంత అనటం అతని స్మృతిపథంలో మెదిలింది.

"సరే." అన్నాడు బరువుగా.

## 18

మద్రాస్ మెయిల్ చీకట్లో చీల్చుకుంటూ పరిగెత్తుతోంది. రిజర్వుచేసిన మొదటి తరగతి సీట్లలో వసంత, విశ్వం కూర్చుని ఉన్నారు. రివ్వు రివ్వున గాలి వీస్తోంది. కిటికీలోంచి విశ్వం బయటికి చూస్తున్నాడు. గాఢాంధకారంగా ఉంది. "చీకట్లో ఒంటరితనం భయం వేస్తుంది ఎందుకో" అనుకున్నాడు విశ్వం. తనకి దేవుడు దయ్యం భయంలేదు. కాని ఆ చీకట్లో తననే తను చూసుకోలేడు, తనేదో ఐపోతున్నట్టు అనుభూతి కలుగుతుంది. సముద్రపు ఒడ్డున ఒంటరిగా నుంచుంటే ఆ ఆటుపోటులతో సముద్రం భీభత్సంగా ఉన్నప్పుడు ప్రకృతిలో పరమాణువులా తాను అల్పుడైపోతున్నట్టు అనిపిస్తుంది. ఆ సమయంలో ఒంటరితనం మరీదుర్భరం.

అయితే ఈ ఒంటరితనమనేది తనకో జబ్బులా ఉంది. పట్టణం నడిమధ్యన పట్టపగలు నడిబజార్లో జనసందోహంలో ఉన్నప్పుడూ తను ఒంటరిగాడైనట్టు అనిపిస్తుంది. ఒక్కోసారి తనకెవరూ లేరా అనుకుంటాడు. తన మనసెప్పుడూ ఆలోచనలతో నిండి ఉంటుంది. ఆలోచించటం తనకో దీర్ఘవ్యాధి. కాని ఎలా? మనిషి ఆలోచించకుండా ఎలా ఉండగలడు? ఆనర్స్ పరీక్ష రాసి కాలేజీ చదువుకి స్వస్తి చెప్పినప్పటినుంచి తనకి ప్రతివిషయమూ ఆలోచనీయాంశంగా కనిపిస్తోంది.

విశ్వం జేబులోంచి సిగరెట్ తీసి వెలిగించాడు.

"ఇదెప్పటినుంచి?" అంది వసంత.

"ఈమధ్య ఒంటరితనం బాగా అలవాటయి నప్పటినించీ."

పొగ గుప్పున వొదిలాడు.

వసంత దగ్గింది.

"నీకు పడదు కాబోలు."

"పరవాలేదు" అంటూనే వసంత మళ్ళీ దగ్గింది.

విశ్వం సిగరెట్ బయటికి విసిరేశాడు. అతను మళ్ళీ ఆలోచనలో పడ్డాడు.

కాని కొన్ని కొన్ని విషయాల్ని గురించి ఆలోచించినకొద్దీ బుర్ర చెడిపోతోంది. సమాధానం సరైంది రాదు. ఏదో ఊహాగానం చేసి ఒక థియరీ తయారు చేస్తారు. అందులో బోలెడు వితండవాదం ఉంటుంది.

ఒక్కోసారి హృదయంలో ఏదో అస్పష్టమైన బాధగా ఉంటుంది. కారణం తెలియదు. ఒక్కోసారి మనసుని సరిపెట్టుకుంటుంటే ఆ బాధ మరీ ఎక్కువగా ఉంటుంది. ఏవో పేర్లు పెట్టొచ్చు ఇటువంటి భావాలకి. కాని అదంత ముఖ్యం కాదు. ఒక పసిపాపని చూస్తే అనిర్వచనీయమైన ఆనందం కలుగుతుంది. ఆ పాప ఒక్కసారి నవ్వితే ఏయే లోకాల్లోనో విహరిస్తున్నట్టుంటుంది. ఎందుకు?

మొదట చిత్రకళ అభ్యాసం చేస్తున్నప్పుడు ఉత్సాహంగా ఉండేది. రానురాను ఏదో వెలితిగా ఉండేది తనకి. విమర్శకులు 'భేష్' అనే బొమ్మలు వేశాడు. వేస్తున్నంతసేపూ ఏదో అసంతృప్తి తనకి ఉంటూనే ఉంది. సృజనశక్తి ఉపయోగించటంలో ఆనందం ఉంది. కాని అలౌకికానందం లేదు.

కాని ఆ అలౌకికానందం తను ఎన్నోసార్లు అనుభవించాడు.

ఒక్క మాటలో.

ఒక్క చూపులో.

ఒక్క మృదుస్పర్శలో.

మనసులో దిగులుగా ఉన్నప్పుడు హృదయం ఆక్రోశించటం స్వానుభవమే. మనస్సు రంజిల్లినప్పుడల్లా హృదయం రంజిల్లదు.

విశ్వం వసంతవైపు చూశాడు. ఆమె కళ్ళల్లో ఏవో ఆలోచనలు కనిపిస్తున్నాయి.

"సినిమాలో బాగా పేరొస్తే ఏం చేస్తావు వసంత?"

ఆమెకేమీ సమాధానం తోచలేదు. తెలివిగా తప్పించుకుంది.

"బొమ్మలెయ్యటంలో మీకు బాగా పేరొస్తే ఏం చేస్తారు?"

ఏం చేస్తాడు తను? ఏమీ సమాధానం తోచదేం? నిన్న వేసిన బొమ్మ ఇవాళ పాతబడుతుంది. మళ్ళీ కొత్తది వేస్తేనే ఆనందం. ఎంత గొప్పదైనా చూసిందే చూస్తుంటే విసుగు పుడుతుంది. జీవిత పర్యంతం అలా నిత్యనూతనత్వం అన్వేషిస్తూనే ఉండాలి. కాని అన్వేషించి చేసేదేమిటి? ఆ సృజనశక్తి వినియోగంలో ఆనందం ఉంది కాని అంతేనా? నలుగురూ మెచ్చుకుంటారు. కీర్తి ప్రతిష్ఠలు వొస్తాయి. వొస్తే? ఇంకా రావాలని ఉంటుంది. దానికోసం తాపత్రయం. అందర్నీ మించాలని కోరిక. అసంతృప్తి. ఈర్ష్య. పొగడ్తలు. ఆగిపోతే విచారం. 'నిన్న' గొప్పగా ఎత్తేసినవాణ్ణి 'ఇవాళ' కిందికి లాగేస్తుంది. ఈ రోజు వెలిగే వ్యక్తి రేపు చీకటిలోకి పోవొచ్చు. ఏమిటి గొప్పతనమూ, కీర్తి ప్రతిష్ఠలూ? తాత్కాలికంగా మనసుని రంజింపచేస్తాయి. అంతే! ఇంకా ఇంకా కావాలని మనసు ఆక్రోశిస్తుంది.

తన జీవితం గడిచిన సంవత్సరంలో చెందిన మార్పులు జ్ఞాపకం చేసుకున్నాడు విశ్వం.

చెయ్యాలనుకున్న మంచిపని చెయ్యనే లేదు. కాని కొన్ని దివ్యమైన అనుభూతుల్ని పొందాడు.

# అంతర్వాహిని

కొందరు వ్యక్తుల్ని సరిగా అర్థం చేసుకున్నాడు— కనీసం వారి దృక్పథం అర్థం చేసుకున్నాడు.

ఆలోచనతో అతని మనసు వేడెక్కింది.

"తల దిమ్ముగా ఉంది" అన్నాడు.

"అలా చల్లగాలిలో తలపెట్టుకుంటే ఉండదా మరి. ఆ అద్దం వేసెయ్యండి" అంది వసంత.

"తిరిగి వచ్చేటప్పుడు నాకిలా సలహాలిచ్చే వాళ్లుండరు కాబోలు" అన్నాడు. అతని స్వరంలో ఏదో వేదన ఉంది. వసంత అతనివైపు కొంచెం జాలిగా చూసింది.

"మీకు శ్రమ ఇస్తున్నాను."

"నాకు చాలా హాయిగా ఉంది" అన్నాడు విశ్వం. వసంత ఊరుకుంది.

ఒక్కొక్కరూ తనకి దూరమైపోతున్నారు.

పద్మ, జానకి, వసంత.

వసంతని తను ఉద్ధరించాలనుకున్నాడు!

ఏమిటి తను ఉద్ధరించేది! అకస్మాత్తుగా అతనికి జానకిమాటలు జ్ఞప్తికొచ్చాయి.

"నువ్వూ నేనూ ఒకర్ని ఉద్ధరించేదేమిటి లే బావా!"

ఎంత సత్యం ఉంది జానకిమాటల్లో. గుడ్డివాడు తను. ఇప్పుడు తెలుసుకుంటున్నాడు. ఆమె చదువులో ఆలోచనలో తనకంటె మించిందికాదు. అయినా జీవితాన్ని కాచి వడపోసినట్లు మాట్లాడింది!

వసంత తనదారి తను చూసుకుంటోంది.

తనుకూడా ఉంటే ఆమెకి ధైర్యంగా ఉంటుందిట.

ఇహ ఆ మాటకూడా ముందు అనదు.

విశ్వం హృదయంలో ఏదో వేదనగా ఉంది. వసంతకి తను కావాలో అక్కర్లేదో, కాని తను నోరు తెరిచి ఒక్కమాట అంటే తనకోసం అన్నీ వొదులుకుంటుందామె. కాని ఇంకా తనవేదో అడ్డుపడుతోంది.

"నువ్వు లేనిదే నాకు జీవితంలేదు వసంతా." అని తను అనగలిగితే...! కాని...కాని......ఎలా? తనని ఉద్ధరించమని ఎలా అడగగలడు వసంతని? వసంతని మదరాసులో వొదిలిపెట్టి తను వొచ్చెయ్యాలి అర్థరాత్రి నిమిషాలు లెక్కపెట్టుకుంటూ. వెర్రి మొర్రిగా ఆలోచిస్తూ తిండిమెక్కి అవస్థపడుతూ ప్రయాణం చెయ్యాలి. హృదయం ప్రఫుల్లం చేసే చిరునవ్వుకూడా తనకి కరువౌతుంది. తిరిగి ఇంత దూరము తను ఒంటరిగా రావాలి.

తనకి అధైర్యం కలుగుతోంది. తను ఒంటరివాడై పోతున్నాడు. వసంత తనకి దక్కీ దక్కకుండా పోతోంది. ఈ ఊహాగానే నిస్పృహతో నిట్టూర్చాడు విశ్వం.

"నేను తిరిగి ఇంతదూరమూ ఒంటరిగా రావాలి కాబోలు."

వసంత వేదనతో అతని ముఖంలోకి చూసింది. అకస్మాత్తుగా అతనిలో ఎన్నడూ కలగనంత అధైర్యం కలిగింది.

"నేను రాలేను వసంతా."

చిన్న పిల్లవాడిలా వాపోయాడు విశ్వం. వసంత కళ్లలో గిర్రున నీళ్లు తిరిగాయి. ఆమె హృదయంలో దుఃఖం పొంగి పొర్లింది. అతనివైపు జాలిగా చూసింది. అంత మనిషి ఒక చిన్న పిల్లవాడైపోయి ఏదో మారాం చేస్తున్నట్లు అనుభూతి పొందింది వసంత. ఆమెసర్వం మర్చిపోయింది.

"వొద్దు వొంటరిగా రావొద్దు. నేను కూడా మీతో వచ్చేస్తాను" అంటూ వసంత అతనికి దగ్గరగా జరిగింది. విశ్వం ఆమెని కౌగిలిలోకి తీసుకుని హృదయానికి అదుముకున్నాడు.

చిమ్మచీకట్లోంచి దారిచేసుకుంటూ మద్రాస్ మెయిల్ పరుగెత్తోంది.

సమాప్తం

# జాతక హితోపదేశము

శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు

ఆరోగ్యము తృప్తికరముగా నున్న దినములలో వైద్యులను కాని, జీవితము ఆనందకరముగా నడచునప్పుడు జ్యోతిష్కులను కాని, సంప్రదించ గోరువారు సాధారణముగా అరుదు. ఆహార విహారములలో, సాంఘిక, నైతిక ప్రవర్తనములలో, తామలవరచుకొని యున్న నియమములే తమ ఆరోగ్యమును, జీవితమును నిరుపమముగా సాగించుచున్నవని వారికెంతో గట్టి నమ్మకము. ఇది చాలవరకు సత్యమే. కాని కాలమొక్కటే రీతిగ నుండదు.

"కస్యైకాంతం సుఖముపనతం, దుఃఖమేకాంతతో వా,
నీచైర్గచ్ఛత్యుపరి చ దశా, చక్రనేమి క్రమేణ."

అను విధమున కాలము మారుచుండుటచే, దశలు తారుమారగును. ఆరోగ్య విషయములో కాని, జీవిత సందర్భములలో కాని, పరిస్థితులు కొయ్యబారినట్లు, ఒకేరీతిగా సర్వదా ఉండజాలవు. సృష్టిధర్మములలో ఇది యొకటి. ఒక్క వయస్సులో హితకరములగు ఆహార విహారములు కాని, నైతిక ప్రవర్తనలు గాని మరియొక వయస్సునకు తగియుండవు. పరిస్థితులు మారుటచే, ఒకప్పుడు హితకరములగు ఆహారాదులు అభ్యాసములు, వేరొక వయస్సున అహితములగుచున్నవి. ఇది సామాన్యానుభవము. సాధారణముగా దేహస్థితిలో ఏ లోపము రానున్నదో దశలలో ఏ విషమస్థితి ఏర్పడగలదో, మునుముందుగా తెలుసుకొని, తగిన మార్పుల నలవరచుకొని ప్రవర్తించు జాగరూకత ఏ కొందరు అనాగత విధాతలకో కాని, పలువురకు అందుకోలేని ఫలము. శరీరములో రోగము సంక్రమించి ముదురు పాకమునకు వచ్చిన తరువాతనే గత్యంతరము కానక, వైద్యుల నాశ్రయించుటయు, జీవితము విషమ పంథలో నడచుచు, క్లేశమాకరించుకొని దుర్భరమైన తరువాతనే దిక్కుతోచక, జ్యోతిష్కులతో జాతకదశా పరిణామమును గూర్చి సంప్రతించుటయు, సామాన్యముగా జరుగుచున్న ధోరణి. యదృచ్ఛవిద్య సంప్రదాయపు నిర్లిప్తులకంటే, ఈ ప్రత్యుత్పన్నమతుల పద్ధతి ఎంతో మేలు—ప్రాపంచికముగా చూచినచో.

ఒక చిన్న ఉదాహరణము జ్యోతిష విద్యార్థికే కాక, ఇప్పటి నవనాగరక యువతీ యువకులు సయితము గమనించదగిన అంశములు పెక్కులు దానిలో నున్నవని భావించి, పాఠక మహాశయులకు నివేదించ బూనితిని.

ఒకానొక యువకుని జీవితములో అతిక్లిష్టసమస్య లేర్పడినవి. సామాన్య కుటుంబమునకు చెందినవాడతడు. రెండవ యేటనే మాతృదేవతను కోలుపోవు దురదృష్టము పట్టినది. సవతితల్లి ఆశ్రయములో పెరుగుచు, పదునారు వత్సరములు వచ్చీరాకమునుపే, పక్షవాతముతో తండ్రిని పోగొట్టుకొన్నాడు. కష్టముల కోర్చి, కళాశాల చేరి తగుపాటి ఆధునిక విద్యను సంపాదించుకొని, రాజకీయ కార్యస్థానములలో నొకచోట చిన్న ఉద్యోగమొకటి సంపాదించుకోగలిగినంతనే తగిన ఇంటి కన్యనొకరుకను పరిణయమై, రెండు సంవత్సరములుగా సొంత కాపురమును సాగించుచున్న కష్టజీవి అతడు. అన్ని విషయములలో పురోగమించి అభివృద్ధిని సాధించుటకొరకై అర్థశాస్త్ర నిష్ణాతులచే నానావిధ ప్రణాళికలను సిద్ధము చేయించి, అచంచల విశ్వాసముతో, మహత్తర దృఢసంకల్పముతో, ఆ ప్రణాళికలను కార్యరూపమునకు తెచ్చుటకు రాజ్యాంగవేత్తలు భగీరథ ప్రయత్నములు చేయుచుండగా, ఇతర విషయములమాట ఏమో కాని, సామాన్య కుటుంబములు మాత్రము గంగపాలై, వారి ఆర్థిక క్లేశము అనుభవించుటకు సాధ్యము కానంత దినదినాభివృద్ధికి వచ్చుచుండుటె ఈ కాలపు విశేష లక్షణము కదా? ఉద్యోగమువలన సంపాదించిన పాడి కాగితములు (రూపాయనోటు) పొట్టకు, బట్టకు చాలక సంసారయాత్ర అతికష్టముతో మన యువకుడు సాగించుచుండుట. ధనార్జనమునకు మార్గాంతరములు

కాని, అవకాశముకాని చూపట్టవు. ఉద్యోగములో అభివృద్ధికి సూచనలు దృష్టిపథములో కానరావు. అది సంపాదించుటకు వలసిన మహదాశ్రయము సామాన్యులకు లభించుట దుర్ఘటము. పోతే, ఉన్న పదవి అయినా, స్థిరముగా ఉండునో, ఊడిపోవునో అను సంశయమున్నది. ఆ యువకునికి ఇటి పరిస్థితులలో, ఉల్లాసముకాని, మనశ్శాంతికాని ఎట్లు రాగలదు?

దారిద్ర్యము చెడ్డది. ఎంత విద్య ఉండినా, ఎన్ని సుగుణములుండినా, ఇంటిలో తాండవమాడుచున్న దారిద్ర్యదేవత ఎదుట చిల్లిగవ్వకు కొరగావు. లక్ష్మీకటాక్షము లేనిచో, పాపము, సరస్వతి ఏమి చేయగలదు? పద్యములు వ్రాయించగలదు; పాటలు పాడించగలదు. పొటనింపుట ఆమె పనికాదు. ఆ అధికారము అత్తగారిది.

దరిద్రుని అవస్థను మహాకవి భర్తృహరి ఎంత సానుభూతితో వర్ణించినాడో, చూడుడు:—

"మాతా నిందతి, నాభినందతి పితా,
భ్రాతా నసంభాషతే,
భృత్యః కుప్యతి, నానుగచ్ఛతి సుతః
కాంతా చ నాలింగతే."

కాని, దైవానుగ్రహావశమున: భర్తృహరి చెప్పిన బాధలలో చాలవరకు కథానాయకునికి లేవనుట కొంతలో కొంత క్షేమము. నిందించుటకు తల్లి లేదు; అభినందించకుండుటకు తండ్రిలేడు; సోదరులు లేరు కనుక, వారు మాటలాడరను వ్యసనమునకు అవకాశము లేదు; భృత్యుని ఏర్పరచుకొను జాలిన స్థితిలేని కారణమున, వాని బాధలేదు; ఇప్పటికింకా సంతానపు తొందరలు ఆరంభము కాలేదు. పోతే, ఇక, సొమ్ములలో ముంగరవలె, మిగిలినది భార్య ఒక్కతే! ఆ భార్య సంతోషముతో చేరరాదనుచున్నాడు భర్తృహరి! సహజమే! పేదసంసారమును వాల్గుయూలలా సవరించలేక, నిర్వహించలేక, క్లేశము ననుభవించుచున్న భార్యకు మాత్రము ఉల్లాసము, ఉత్సాహము, ఎట్లు వచ్చును?

జాతకుడు అశాంతిపాలయినాడు. పరుపాయములు తోచినవికావు. తన భవిష్యజ్జీవనము ఎట్లు సాగునో, జాతకము ద్వారా తెలుసుకొందమని సంకల్పించినాడు. జాతక పరిశీలనము చేయించి, "శాంత పలహో అడుగుట మంచిదని తోచినది. తన యొక్క తన అర్ధాంగియొక్క, జాతక సామగ్రిని పంపెను. అతని సాయన జాతకచక్ర మీ క్రిందనున్నది.

| | | | |
|---|---|---|---|
| రా 17-49 | I 8-44<br>వ 23-8 (వ) | చ 22-41 | |
| | (సాయనము)<br>—<br>కథానాయకుని<br>జాతకము<br>— | | దాంపత్య 2-6<br>కు 12 20<br>శు 15-22 |
| శ 29-22<br>(వ)<br>X 6-24<br>పుణ్య 1-11 | | | బు 20-11 (వ) |
| | | భార్య 8-44 | ౦ 0-13 59<br>గు 2-40<br>ఇ 7-25<br>కే 17 49 |

లగ్నము ఉదుకు ౦క్తియుగల మేషము. 'అహం' భావము ప్రధానగుణము సైనికస్వభావము. సహనశక్తి తక్కువ. తనకు విసుకువచ్చినా, తన మార్గమునకు ఇతరులు అడ్డమైనా, యుద్ధమునకు సిద్ధమగుట సామాన్య ధర్మము. ఇతరుల మనోధర్మములను పటించుకొనుట చేతకానిపని. ధారాళ స్వభావమున్నది కాని, దయా దాక్షిణ్యములు మట్టపురికము. ఆత్మాభిమానము, ఆత్మవిశ్వాసము, గొప్పవి.

లగ్నముయొక్క నైజస్వభావమిది. ప్రతాపశాలి వరుణుడు తను భావమందే ఉచ్చయనుగుచున్నాడు. తీవ్రములైన భావములు, ఉద్రిక్త చిత్తవృత్తి, సంకల్ప దార్ఢ్యము, వ్యధికరణ స్వభావము, వరుణుడు సమకూర్చును. పంచమ భావమందలి బుధునితో ఈ వరుణునికి ప్రత్యక్ష మిత్రదృష్టియున్నది. ఊహాలు గొప్పవి; ఆదర్శములు అంతకంటె గొప్పవి. ఆలోచనా శక్తి హెచ్చు, తెలివి తేటలు పదునైనవి. కాని, లగ్నాధిపతి కుజుడు కర్కాటక రాశిలో నీచుడై నాల్గింట నిలిచినాడు. కుజుని ప్రభావమును ప్రకటించుటకు అర్హమగు స్థానము దశమకేంద్రము కాని, చతుర్థము కాదు. శౌర్యసాహసములతో ప్రతాపమును రణరంగములో ప్రదర్శించగల యోధుడు ఆ ఉద్యోగము మాన్పించి ఇంటిలో ఒక మూలలో కూర్చుండుమన్నచో, అతనికి ఎంత మనఃఖేదకరముగ నుండునో,

మనము ఊహించుకోగలము. ఈ జాతకములో కుజుని స్థితి అట్టిది. కావుననే,

"విసుఖః, పీడిత మానస శ్చతుర్థే" అని, వరాహ మిహిరుడు నాల్గింటి కుజుని ఫలమును నిరూపించుట. సుఖము లేదు; మనోవ్యథ, ఉత్సాహశక్తి ఎట్లుండ గలుగు? ఈ కుజుని సమీపముననే సప్తమాధిపతి శుక్రుడున్నాడు. వలసినంత సుఖము, ఆనందము, ఇచ్చుటకు బద్ధకంకణురాలై కళత్రము చేగవనే సిద్ధముగ నున్నది. కాని, ఆరింట రవినుండి ఈ శుక్రునికి నికరముగా అర్ధకేంద్ర వేధ! ఇతని రాజసముతో ఆమె నిర్వహించుట కష్టము. ఈ వేధచే, సుఖము లేదని తోచి మనస్సు అశాంతి పాలగును.

ధనభావములో బలశాలియైన చంద్రుడున్నాడు. ఆర్థిక సౌకర్యమునకు తగిన యోగమే ఇది. కొంత ఎగుడు దిగుడులు ఉండగలవు. కాని, మధ్య వయస్సునుండియే సుఖముబ్బుననుట వృషభచంద్రుని ఆశీర్వాదము. ఇట్లుండగా ఈ చంద్రునికి సింహ బుధునినుండి కేంద్ర దృష్టికలదు. ఆర్థిక క్లేశము నే సూచించు పరిస్థితి ఇది. కర్కాటక మంగళి కుజునికి అవకాశానుసారముగా చిక్కని అర్ధసపటుత్వమున్నది. కాని, ఫలము పైన దృష్టియే కాని, పదతుల పైన దృష్టి తక్కువ. ఆరింట రవి గురువులకు ఇంద్రసంయోగము కలదు కదా? ఆ ఇంద్రునికో, వరుణుని సార్ధకేంద్ర విషమ దృష్టి! ఆశకు, ఊహకు, తగిన ఫలిత మిచ్చుట కష్టము. అనేక సమయములలో వ్యక్తికీకల అహంభావము, స్వాభిమానము, క్రమతారాహిత్యము, కారణములు కావచ్చును.

రాజ్యాధిపతి శని స్వక్షేత్రబలముతో లాభభావమందే యున్నాడు. ఎక్కువ కష్టము లేకయే, పేనాప్తిని (ఉద్యోగమును) చూపించినాడితడు. ఈ శని క్రమాభివృద్ధి నిచ్చువాడే కాని, కుజుని ఆశకు తగినట్లు ప్రారంభములోనే ఉన్నత స్థాయిని తెచ్చి పెట్టువాడు కాడు. చలితదశమ కేంద్రము ఏ వయస్సున తన్నాశ్రయించెనో, అప్పుడే ఉద్యోగములో చేర్చినాడీ శని, స్వధర్మమును విడుచువాడు కాడు. స్వధర్మమును పాలించుచు ఓపికతో పని చేయువారికి స్వక్రమాభివృద్ధిని నిశ్చయముగా శని సంపాదించి యీగలడు. కాని, గొంతెమ్మ కోరికలు కోరుట అతనికి రుచించదు. శని ఏ కార్యము చేసినా స్థిరముగా నుండునట్లుగనే చేయగలడు. శ్రమపడి పైవారి మెప్పును సంపాదించి, నెమ్మదిగా అభివృద్ధికి రావలెననునదే ఆ దశమాధిపతి దీక్ష. దీనికి కావలసిన సహనము అగ్రతగాడగు లగ్నాధిపతికి లేదు. మనః క్లేశమునకు హేతువిది.

కథానాయకుని జాతకస్వభావ మిట్టిది. ఇట్లుండగా, ఇంతలో రానున్న దశలయినా (దేవమాన దశలు) ఉపయోగకరమైనవి చూపట్టకున్నవి. ఇపుడు చలితకుజుడు శనితో సమసప్తక వేధపాలైనాడు. శని ఇచ్చిన ఉద్యోగము లగ్నాధిపతి కుజునికి తృప్తి లేదు. గురువు, ఆకాశాది చలించి ఇంద్రునిమీదికే వచ్చియున్నాడు. ఆశ పెరుగుటకే అవకాశము వచ్చినది. అందుకోరానంత దూరములో బంగారుకొండలు దృగ్గోచరము లగుచున్నవి. అచటికి చేరుకోగలిగినచో, ఎట్టి కనకసౌధములు కట్టుకోవచ్చునో! వరుణుడు పంచవర్ష ప్రణాళికలను సిద్ధము చేయుచున్నాడు. ఉద్యోగాధిపతి శని ఇట్టివానికి అవకాశమీయడు. కనుక, అతృప్తి పెరుగుటకే దశ తోడ్పడుచున్నది. కోరికలను కొనసాగించుటకు అనువైన దశలు ఇంతలో రావు. జాతకునికి ఇంకా పూర్వవయస్సే. మధ్య వయస్సు రావలయును కదా, చంద్రుని సాహాయ్యము వచ్చుటకు? ప్రస్తుతమున్న కుజ శని వేధ తొలగుటకు రెండు సంవత్సరములు పట్టును. ఇది కడచుదాక, ఉన్నంతలో తృప్తిపడి ఓపికతో కాలమును వెళ్ళబుచ్చ వలసియేయున్నది. ఈ కాలములో అభివృద్ధి లభించుట కష్టము. 1961 లో చలితకుజునినుండి లగ్నమునకు మిత్రదృష్టి వచ్చును. చలితరవికి చలిత శనితో అనుకూల దృష్టి ఏర్పడగలదు. వృత్తిలో అపుడు స్థైర్యము రాగలదు. పురుషకారానుసారముగా కొంత అభివృద్ధిసహా కలుగవచ్చును. 1963 లో చలితరవి జన్మశనికి మిత్రుడై తులాప్రవేశము చేయగలడు. నెమ్మదిగా జీవితము జరుగుటకు ఆరంభమై క్రమాభివృద్ధి వచ్చును. విషమ కాలమున చేయు ప్రయత్నములు క్లేశమునకే దారితీయుననుట మరువరాదు. కష్టకాలమున ఓపికతో పరిశ్రమ చేయువాడే శని మెప్పునకు పాత్రుడు కాగలడు. ఇచట రాజ్యభావాధిపతియు, లాభప్రదుడును, శనియే.

ఇది ఇట్లుండ ఈ యువకునికి 'పిచ్చి ఎత్తించు' వేరొక క్లిష్టసమస్య యున్నది. దానినిగురించి సహా జాతకపు సలహానర్థించినాడతడు. ఆ వివరములు హృద

యంగముగా వర్ణించిన అతని మాటలతోనే చదువరులు గ్రహించుట మేలు.

"నా వివాహమైనది మొదలు నాకు నా భార్యకు అభిప్రాయములు కలువక తరుచు మనస్పర్థలు సంభవించి, నాకు తీవ్రమగు అశాంతిని కల్గించుచున్నవి. ఈ రెండేండ్ల అనుభవములలోనే నాకును ఆమెకును ఈ దీర్ఘబంధము నిలుచుట కష్టమని నిశ్చయించుకొంటిని. స్వభావమునుబట్టి ఆమె చాలా చురుకైనది. మాట గురుసు. ఆమె స్వభావము నాకు దినదినమునకు అసహ్యకరముగా పరిణమించుచున్నది. శీలవతి అయినంతమాత్రమున ఫలమేమి? ఆమె నాకు సరిపడిన సుగుణవతి కాదు. వైమనస్యములు ప్రథమమునుండియే ఉన్నవని చెప్పవలెను. కాని అవి సమసిపోయి మామూలు జీవితము మరల సాఫీగా జరుగుచుండుటకూడా కలదు. ఈ వైమనస్యములు అప్పుడప్పుడు అతి స్వల్పవిషయములపై తలఎత్తి, పట్టుదలవలన రెచ్చి, కొంతకాలము మనస్సును కలచివేయును. ఉదాహరణమునకు:— భోజనముచేయునపుడు ఒక కూరనదను కొలది అధికముగా వడ్డించినందుకు నేను కోపమును ఆపుకొనలేక తిట్టుదును. అట్టిచో, సాధారణముగా ఆడుది నోరెత్తదు. కాని మా విషయము అట్లు కాదు. నేను కేకలు వేసినందులకు ఆమె మరీ రెచ్చిపోవును. దానిపైన తగాదా; కొంతకాలము ఎడబాటు. ఆమె అట్లు రెచ్చినపుడు జవాబు చెప్పుటయే నా పట్టుదలనుకూడా అధికము చేయును. అట్టిచో, మా ఇరువురకు పొత్తు కుదురుట అసంభవమనిపించును. సంభాషణము విడాకులవరకు సాగిపోవును. ఇక సాంసారిక జీవితమునందు లోపములేమియు లేవు. స్త్రీ సహజమైన ఉద్రేకము ఆ విషయములో ఆమెకు కొంత అధికము. ఈ వైమనస్యములు కలిగినపుడు ఆమె చూపు పట్టుదలకు, ఆమె తన జీవితమును తానే పాడుచేసుకొనునేమో అనిపించును. భవిష్యత్తులో మా మనస్సులు కలిసి మా దాంపత్యము సౌఖ్యదాయకమగునా, లేక మాకు త్వరలో విడాకులు సంభవించు సూచనలు కలవా? ఇవి ఏమీ సంభవించక, జీవితమంతయూ అశాంతితో కడపవలసినదేనా? తగిన సలహాయిచ్చి దరిజేర్పగలరని ప్రార్థన"

కథానాయకుని దృష్టితో చూచితిమేని, ఇది వాస్తవముగా క్లిష్టసమస్యయే అగును. కావడిబరువు మోయువానికేగదా తెలియును.

"చెప్పులోని రాయి, చెవిలోని జోరీగ,
కంటిలోని నలుసు, కాలిముల్లు,
ఇంటిలోని పోరు, ఇంతింత కాదయా,
విశ్వదాభిరామ, వినర వేమ"

అని చెప్పిన వేమన ఎంత ప్రపంచానుభవశాలియో?

జాతకుని శ్రీమతి జాతకము నొక్కింత పాఠక మహాశయులు పరిశీలింతురుగాక. ఆమె సాయన జాతక చక్రమిది:—

| | | | |
|---|---|---|---|
| భర 13 9 | శ 1-35 | వ 13 7 (వ)<br>I 17 24 | కే 9-13<br>చ 25-0 |
| పుణ్య9-19<br>X 7-13 | (సాయనము)<br>—<br>కథానాయకుని<br>శ్రీమతి<br>జాతకము<br>— | | దాంప [illegible]<br>8-2 |
| గు 17-44 | | | |
| న 27 31<br>రా 9-13 | | ర 8-5-16 | శు 1-46<br>బు 16-5<br>ఇ 19-15 |

వృషభలగ్నములో జనించిన వ్యక్తి ఈమె. క్షేత్ర సహనశక్తి, ప్రశాంతచిత్తవృత్తి, యథాలాభసంతుష్టి, ప్రాపంచిక వివేకదృష్టి, ప్రధానధర్మములు. భుక్తి, వసతి, దాంపత్యము తృప్తిగానున్నచో, ఇతరలోకములను వరకుచేయని స్వభావము. లగ్నములో కుజుడు ఉదయించుచున్నాడు. స్వాభిమానము, స్వాతంత్ర్యప్రీతి, పట్టుదల, చూపట్టగలదు. ధర్మకర్మాధిపతియగుటచే రాజయోగకారకుడైన శని లాభభావములో నుండుట! ఇకనికి సప్తమాధిపతి కుజుడు కేంద్రము. ఈమె పనులలో భర్తకు అతృప్తి. పంచమభావమందున్న బుధునితో ధర్మస్థానమందలి బృహస్పతికి చక్కని త్రికోణశుభదృష్టి సౌకర్యమున్నది. నిర్మలమగుశీలము, యోగ్యమయిన ప్రాపంచిక వివేకము, సంసారనిర్వహణ కౌశలము, ఈ యోగపు ఫలము. ఈ శుభగ్రహద్వయము యొక్క కోణదృష్టి లగ్నముపైనున్నది. వ్యక్తి ఉత్తమురాలు, సమర్థురాలు అనుటకు సందేహము పనిలేదు.

ఈమె జాతకములో లోపము లనదగినవి మూడు. చంద్రకుజులకు సమసప్తకదృష్టియున్నది. నిర్వహణశక్తి గొప్పదేకాని, దోషము కొంత తీవ్రముగానుండును తనలో తప్పులేదని తోచినప్పుడు విమర్శనమును ఓర్వలేదు. కుజుడు సప్తమాధిపతియగుటచే, భర్తవలన మనఃక్లేశము పాలగుననుట. రవి శనులకు సమసప్తక వేధ యుండగా, వీరిరువురి నుండియు చంద్రుడు కేంద్ర వేధపాలయినాడు. చిత్తవృత్తి కొంత పెడసు. ఇతరుల ననుసరించి వారితో 'పొంది పొసగి, మనుట' ఆమెకు రానివిద్య. అష్టమమందున్న సప్తమాధిపతి కుజునితో ఐదింటనున్న లగ్నాధిపతి శుక్రునికి మంచి మిత్రదృష్టియున్నది.

“లగ్నేశాస్తపయోః స్నేహ
దృష్ట్యా సౌఖ్యం విధోభవేత్.”

అని హిల్లాజమతము. భార్యాభర్తలకు దాంపత్యజీవితములో అన్యోన్యముగా ఆనందమును కూర్చు యోగమిది. భర్తపట్ల ప్రీతి, చక్కని దేహపాటవము, యోగ్యములగు కోరికలు, సహో దీని ఫలము. కాని, రవి శనుల వేధవలన సులభముగా భావతృప్తి చెందు స్వభావము కాదు. ఆమెది దేవతాత్త్వ మట్టిది.

ఈ దంపతుల జాతకములను పోల్చి చూడుడు. రవి చంద్రులకు ఔదాసీన్యము. వీరి దాంపత్యములో పరస్పరముగా భక్తికి స్థానము లేదు. కుజశుక్రులకు మైత్రి చూపట్టదు. రక్తిమట్టటు లగ్నములా ద్విద్వాదశరాలు. పరస్పరానువర్తనము కష్టము. భర్త లగ్నములో భార్య శని; భార్యదశమ కేంద్రములో భర్త శని! భార్య పనులు భర్తకు కాని, భర్త స్వభావము భార్యకు కాని, రుచించుట అరుదు. అతని రవి గురువులమీద ఆమె శుక్రుడు నిలుచుట. ఆమె వరుణుడు అతని శుక్రుని అర్ధకోణదృష్టితో ప్రబలముగా చూచుచున్నాడు. ఈ అన్యోన్యాకర్షణము కారణముగా వీరు దంపతులైనారు. భార్య లగ్నములోనున్న భర్త చంద్రునికి సయితము దీనిలో కొంత కైవాటము కలదు. అతని హృదయము ఆమెకు లభించినదికదా?

పరస్పర జాతకగ్రహసంబంధము లట్లుండగా, భావోద్రేకము కలిగించు వయస్సులో వీరికి వచ్చిన దశాయోగములు అతిప్రబలములై, అన్యోన్యముగా ప్రబలాకర్షణమునకు వీరిని గురి కావించినవి. భర్తచలిత బృహస్పతి మాయలమారి ఇంద్రునితో చేరి భార్య చలితలగ్నమును గుప్త విషమ (కేంద్ర) దృష్టితో లాగుచుండగా, సమయముమించి పోరాదని అనుకొన్న రీతిగా,

“పాయకపాకశాసనికి భారత
ఘోరరణంబునందు నా
రాయణునట్లు.”

ప్రచండ యోధుడగు వరుణుడు తన అర్ధ కేంద్రదృష్టి వాగురులొడ్డి ఆ లగ్నమునే పొదవిపట్టినాడు.

“అతడు వాలము త్రిప్ప,
నితడు శూలము త్రిప్ప.”

అనునట్లు, భార్యసయితము ఊరకయుండక తన ఉడుత భక్తి చూపినది. ఆమె చలిత బుధుడు (ధనపంచమాపతి) అతని లగ్నాధిపతి కుజునిపై కేంద్ర కటాక్షవీక్షణము విసరినది. ఆమె చతుర్థకేంద్రము అతని చలిత శుక్రుని మంగళాక్షతలతో పసుపు కుంకుమలు పెట్టి ఆహ్వానించి, ఆప్యాయమానముగా ఆతిథ్యమిచ్చి గారవించినది. ఆమె చలితవరుణుడు అతని చలిత బుధుని కోణదృష్టితో ఆకర్షించినాడు! ఇన్ని దశలిట్లు సిద్ధము కాగా, వివాహపు ముడివడుటలో వింత యేమి?

భర్త చలిత జాతకములో ఇంద్రగురువు లొకచోట చేరి అతని చలిత లగ్నమునకు నిండు త్రికోణములో నుండిన కాలమది. అతని భావములు ఇంద్రజాల ప్రపంచములో మేఘమాలలలోని కంపాలతలమీద సవిలాసముగా విహరించుచుండినవి. దృష్టిపడినచోట కనిపించినదంతా బంగారమే. చలిత శుక్రుడు సింహములో నుండి జన్మలగ్నమునకు నికరముగా కోణస్థితికి వచ్చియుండినాడు. అర్ధాంగి వచ్చుట అవశ్యకమైనది. చలిత రవి దాంపత్య సహాయముల కపుడు అర్ధకోణ మైత్రి, నూటికి నూరుగా, అతని సుస్వీకరించినది. లక్ష్యమున కందినది తప్ప, విషయాంతరము గోచరించు కాలము కాదది.

దధి మధురం, మధు మధురం,
ద్రాక్షామధురా, సుధాపి మధురైవ,
తస్య తదేవ హి మధురం,
యస్య మనో యత్ర సంలగ్నం”

అను సుభాషితము అన్వయించు దశ అది. వివాహము దానిఫలము.

కాని, ముందు రానున్న ముసుల్లిపండుగ కథానాయకు డెరుగడు. వివాహమైన సంవత్సరము లోపలనే ఆమె చలితరవితో అతని శకుణుడికి 'ఎగురుకోలు మహోత్సవము' జరుగునని ఆ అమాయిక వ్యామోహ ముగ్ధహృదయుడగు తరుణునికెటు తెలియును? ఇంతే కాదు. త్వరలోనే అతని చలిత కుజుడు సైతము అతగాడి చలితశనికి ముఖాముఖి ఎగురునిలిచి శనియు, ఆమె చలిత బుధుడు అతని శుక్రునికి కేంద్రమునకు రాగలడనియు, అతనికి చెప్పువారు లేరు. చెప్పియుండినా, ఆ ఇంద్రియమాయలో అతని చెవికెక్కియుండదు. అందుబాటులో నవనిధులు కంటికి కానవచ్చుచుండగా, దృగ్గోచరము కాని దశలను నమ్మి 'సిరి రా మోకాలొడ్డు' మందమతు లెవరుందురు?

పోనిండు ఐనదేమో అయినది. ఈ విమర్శ గత జలసేతు బంధనము. ఇప్పటి కర్తవ్య మేమి? రవివగుణుల వేధ సాధారణముగా విడాకులు వెతికించునట్టిది. వాగ్వాదపు వేళలలో, అప్రయత్నముగనైనా, అట్టి మాటలు పుట్టించున్నవట కదా? ప్రకృత కాలపు శాసన కర్తల పుణ్యాన, తరువాతి మెట్టు చాలా సులభమైనది. దానిని సులభతరముగా చేయు సదుపాయములు చూపి సహాయపడుటకు న్యాయవాది మహాశయులు ఉండనే యున్నారు. సంకల్పించి పురుషకారము నెంపినచో, కుజశనుల వేధ ముగియులోపల (1960) విడాకులు సంపాదించుట అంతకష్టము కాదు.

కాని, మార్గాంతరము లేదా?

సరే కాని, నైయమికముగా లోప మెందున్నది? భార్యాభర్త లిరువురును యోగ్యులే, గుణవంతులే, అన్యోన్యానురూపులే! ముఖ్యమైన దాంపత్య జీవితములో వారి కేవిధముగనైనా లోపము లేదు. స్వభావములలో కొంత సామ్యమే కలదుకూడ. వ్యక్తి స్వాతంత్ర్య ప్రీతి, స్వాభిమానము, రోషప్రకృతి, హఠవాదము, మాటపట్టింపు మున్నగు ధర్మములు ఉభయులలో సమానముగనే యున్నవి. ఇరువురికిని లగ్నములో వరుణమహాశయుడు ప్రత్యక్షముకదా! ఒకరి స్వభావమును మరియొకరు తప్పుపట్టుట యేమి న్యాయము?

"కార్యేషు దాసీ, కరణేషు మంత్రీ,
రూపేణ రంభా, క్షమయా ధరిత్రీ,
స్నేహేచ మాతా, శయనేచ వేశ్యా,
షడ్ధర్మయుక్తా, కులధర్మపత్నీ".

అని ఏ పాతకాలపు పెద్దలో భార్యా ధర్మములను శాసించియుండుట వాస్తవమే. తన ఇష్టానుసారముగా పనుల నెరవేర్చుచు, చీటికిమాటికి చేయు విమర్శనములు సవరించుచు, పెట్టిన చీవాట్లకు నమ్రతతో ఓర్చుకొనుచు, తన సతీమణి యుండవలెనే అని కథానాయకుని బెంగ. ఇరువదియవ శతాబ్దములోని స్వాతంత్ర్య దినములలో తా ముండుట అతడు తన ఆక్రోశములో మరచినాడు.

పోగా, "కోపయేన్న నిజాంగనాం" అనినయితము ఆ పెద్దలే చెప్పిరి. భార్యను కోపమువచ్చురీతిగ భర్త ప్రవర్తించరాదని వారి ఆజ్ఞ. అల్ప స్వల్పవిషయముల కొరకై తనకు అలవికాని కోపమునేల అని ఆత్మ విమర్శనము జాతకు డేల చేయరాదు? కొంతఅధికముగా కూర వడ్డించినచో ఏపుట్టిమునిగెనో? దానికై అప్రకో లేనంత కోపమువచ్చి తిట్టుట భర్త ధర్మమని ఏ పరాశర స్మృతి విధించినదో? మేషలగ్నపు జాతకుడు లఘు భోక్త. వృషభలగ్నపు భార్యదృష్టికి అది తృప్తి యుండదు. కనుక, అభిమానముతో, ఆశతో, ఆమె కొంత అధికముగా వడ్డన చేయును. అంతేకాని, అజీర్ణముతో భర్త బాధపడవలయునని అట్లు చేసెనవ గలదా? తనకు వలసినంత భుజించి, చిరునవ్వుతో నెమ్మదిగా మాటలాడినచో, భార్య ఎంతో సంతోష పడియుండునుకదా? గోటితో పోవుపనికి గొడ్డలి నుపయోగించ నేల? వాస్తవముగా మేషలగ్నమునకంటే వృషభలగ్నమునకే సహనశక్తి హెచ్చు. కాని, మితి మీరినచో, కోపమువచ్చినా, ఇంతింతలలో శాంతించునది కాదు వృషభము. సాదురేగినచో తలపాలముదాక నిలువదటకదా?

తన స్వభావమును అరము చేసుకొని భార్య ప్రవర్తించదని జాతకుని ఆక్రోశము. భార్యయయితము ఇట్టి ఆరోపణ తనపై చేయవచ్చుకదా? అతని స్వాభిమానపూరిత హృదయమునకు ఇది తోచదు. సత్యమును విచారించితిమేని, పరస్పరస్వభావములను అరము చేసుకొనకపోవుటచే వచ్చిన చిక్కు కాదిది. ఒకరినొకరు అనువర్తించవలయునను మహత్తర దాంపత్య ధర్మరహస్యము ఇద్దరికిని స్ఫురించని దోషమే.

"సంతుష్టో భార్యయా భర్తా,
భర్త్రా భార్యా తథైవచ,
యస్మిన్నేవ కులే నిత్యం,
కల్యాణం తత్ర వై ధ్రువం." మనువు

అన్యోన్య సంతోషకరముగా ప్రవర్తించుట ధర్మమని వారిరువురు గుర్తించిరేని, జీవితము రమ్యముగా, శాంతియుతముగా, జరుపుకొనగలరనుటకు సందేహము లేదు.

దుష్టదశలు ప్రబలముగానున్న కాలములో చేసుకొన్న వివాహపు ఫలమును ఈ తరుణదంపతు లిట్లనుభ

వించుచున్నారు. ప్రౌఢావివాహములలో ఇట్టి చిక్కులు సంభవించుటకు అవకాశము లున్నవి. దాంపత్య జీవితవ్యామోహము నుద్రేకింపజేయు వయస్సులో, దుష్టదశలువచ్చినపుడు, ప్రయత్నించిన వివాహములు రమ్యముగా, శాంతియుతముగా. పరిణమించుట అరుదు. అందము, వన్నె అంతస్తు బాగున్నవని కొనవచ్చినతోడనే. పూర్తి మెరుగులకు భ్రమిసి, వెనుక ముంగలు గమనించక, వ్యామోహ ప్రవాహములో తన మున్కలకు వచ్చు ఉద్రిక్తభావములుగల యువతీ యువకుల సామాన్య లక్షణము. ఆకర్షించిన వ్యక్తి మన సత్యమెట్టిదో, ఆ స్వభావములో తనకు సామంజస్యము కుదురగలదా, మనోధర్మముల తూకగలవా, జాతకానుకూల్యమున్నదా, మున్నగు విషయములను పూర్తి ఆలోచించుటకు అవకాశము లేకయే, మూడుముళ్లు పడగలవు. తరువాతికథ దైవాధీనము. పరస్పర త్యాగమును అలవరచుకోలేని స్త్రీ పురుషులు వివాహమునకే అనర్హులను సూత్రము ఇప్పటి నాగరక యువతీ యువకులలో అనేకులకు తెలియదు. కావుననే, ఇట్టి దృష్టాంతము లందందు చూపట్టుచున్నవి.

అది యట్లుండె. కథానాయకుడు మొదట తన జాతక వాగ్దానమును గమనించుట కర్తవ్యము. గృహస్థానము (చతుర్థభావము) లో కళత్ర భావాధిపతి శుక్రుడు వెలుగుచున్నాడు కదా ? చతుర్థము శుక్రునికి హర్షస్థానము. భార్య ఉత్సాహముతో గృహకృత్యములు నిర్వహించగలది. కాని, పంచమాధిపతియగు రవితో ఆ శుక్రునికి విషమదృష్టి. ఆమె ప్రవర్తనమో, పనులో, తనకు రుచించవు. లగ్నాధిపతి నీచమై వాల్గింట నుండుట మనస్సును చిర చిర లాడించు యోగము. సర్వదా, ఏదో అసంతృప్తి. కారణమేదైననేమి ? భార్య స్వభావము చురుకైనదని ఇపుడు అసంతృప్తి వచ్చినది. అట్లుకాక, ఆమె స్తబ్ధప్రకృతికలదై యుండినచో, కొరగాని 'మోటు సాంబ్రాణి' అని అతృప్తి వచ్చును. మాటకు మాట జబాబు చెప్పినచో, గయ్యాళి అని అతృప్తి. నోరు మూసుకొనియుండు వ్యక్తి అయినచో. 'మూగదయ్య' మని అతృప్తి. అతృప్తి మనోధర్మమైనపుడు, ఏ భార్య ఐననేమి ? వేరు కన్యక భార్యగా వచ్చియుండినచో మాత్రము మనస్సు కుదుటపడునా ? భ్రమ ! ఆమె జాతక ధర్మముల ననుసరించి, అనారోగ్యమో, శీలలోపమో, స్తబ్ధస్వభావమో, వంధ్యాదోషమో, విరసప్రసక్తియో, మరి ఏదో, చూపటి మనస్సును అశాంతి పాలు కావింపగలదు స్వరూపములో వ్యత్యాసమే కాని, స్వభావములో భేదములేదు. ఇది అనుభవము చేసుకోగలిగినేని. జాతకుడు తన సంసారమును ఉన్నంతలో చక్కబెట్టుకొనగలడు. శాంతికో, అశాంతికో, మానవుని అంతరంగమే ప్రధాన కారణము. బైటికారణములు గౌణములు ఇంతెని గెలువలేక, రన్నును తప్పుపట్టుట ఇది.

భర్తస్వభావములో దోషము లెంచుటకాని, భార్యలోపములను సమర్థించుటకాని, నా ఉద్దేశము కాదని ముమ్మాటికి నామనవి. సత్యము చెప్పినచో, భార్యదశలకంటె భర్తకు వచ్చియుండు దశలే ప్రమాదములయినవి. వాని మూలమున అతని హృదయము విరసమై యుండుటవలన కల్గిన పరిణామ మిది. బుధ చంద్రులకు కేంద్ర వేధకలవ్యక్తి కావున అతని బుద్ధికి ఏదోతోచి, మనస్సును కలవరపరచును. అంతే ఏల ? భార్య హితమునుకుని చేసినపనిసహా, అరుచికరముగా చూపట్టగలదు.

“కూరిమిగల దినములలో,
నేరము లేమియును కలుగ నేరవు; మరియా
కూరిమి విరసంబైనను
నేరములే తోచుచుండు నిక్కము, సుమతీ.”

అను బద్దెనీతి వినుదుము కదా ?

ఆపదలు కాపురము చేయవు. చీకటివెళ్ళగానే, వెన్నెల వచ్చును. దశలు మారుచుండును. భార్య చలిత రవి జాతకుని వర్గుణుని సమసప్తక వేధను దాటి 1958 లోనే ముందునకు వెళ్లను. దానితో సగము పీడ పోయినట్లే ! ఆమె చలితబుధునికి అతని శుక్రుని వేధసహా ఈ ఏడే ముగియగలదు. పుణ్యమా అని, చలిత వివాహసహమమునకు వరుణదృష్టి దాటిపోయినది. కాని, శని సమసప్తకమును దాటవలసి యున్నది. చలిత కుజునికి శని వేధ దాటుటకు ఇంకా రెండేండ్లు పట్టును. ఈ దశాకాలమును ఓపికతో గడచినచో, తరువాత తొందరలుండవు. ఈలోగా పత్నింతాన ప్రాప్తికి అవకాశమున్నది. తన్మూలమున, తరువాతి జీవితము రమ్యముగా జరుగగలదు.

# కాళిదాస ప్రశస్తి

శ్రీ ఉండేల మాలకొండారెడ్డి

అమర వాఙ్మయ రాజహర్మ్యమ్మునందుఁ
గావ్యమణి దీపదీధితుల్ కడలు కొలిపి,
విశ్వమోహన శోభఁ గల్పించినట్టి
సరస హృద్వాస! కాళిదాసా! నమోస్తు!

కుప్పించి, నందినీగోవుపై దుమికిన మృగరాజు వికచ దంష్ట్రికల మెఱపు,
బాహు ప్రతిష్టంభ పరివృద్ధకోపాగ్ని నాపుకోలేని దిలీపు ప్రతిమ,
పూవిల్తు నిల్చిన బూదిగావించిన అభ్రకేశునికంటి అగ్నికీల,
అలరతీదేవి దుఃఖాశ్రుపూరమ్ములోఁ బాగరాజు వలరాజు బూదిప్రోవు,

కట్టెదుటఁ గానుపించెడుకరణి, శబల వర్ణ కాంతులఁ జిత్రముల్ వ్రాసినావు
గంటమే, రంగుకుంచియగా నొనర్చి, క్రమకవితానమున్నేమ! కాళిదాస!

నీ స్వర్ణలేఖినీ నృత్యశాలనటింప అమరశారదకు ఒయ్యారమబ్బె,
నీవు సృష్టించిన నీరదగర్జకుఁ బ్రణయ సందేశ గౌరవము గలిగె,
నీ కళాశాఖిపై నిలిచి "శకుంతల"పరుల, కనాభ్రూతప్రసవమయ్యె,
నీవు శాసించిన నిర్జరసుందరి నరునితో నిలిచి కాపురము చేసె,

కూతునకుఁ దండ్రికెడబాటు గూర్పనీవు, చిన్నితీగకుఁ గన్నులు చెమ్మగిల్లెఁ,
బ్రకృతి నాడించు ఐంద్రజాలికుడ! నీవు గంటమూగింప వింతలు కలుగకున్న?

నీ "ఉపమా"రుచి నిచ్చలు మెచ్చుచు భుజియించి త్రేన్చని భోక్తయేడి?
నీ "మేఘ" గంభీర నిర్ఘోషమున కుల్కి, ధవుఁ గౌగిలింపని తరుణియేది?
నీ కావ్యకన్యల నిత్యకోమల ముఖాబ్జములు చుంబింపని భ్రమరమేది?
నీ రమ్యకృతినంది నీధేనువునకు వత్సమ్ముగానట్టి రసజ్ఞుడేడి?

వాణివాయించు మాణిక్యవీణలోని తీవవై నీవు మూర్ఛనల్ పోవునపుడు
పులకరింపని చిఱుగడ్డిపోచయేది? సద్యశోమూర్తి! రసరాజ్యచక్రవర్తి!

తుంగశృంగమనోజ్ఞ తుహినాద్రిఁ బృథివికి మానదండమ్ముగా మలచినావు
కిన్నరమిథునముల్ క్రీడించు గుహలకు నీలిమబ్బుల తెరల్ నిలిపినావు
వాగర్థశిల్పివై వాగర్థములలీలఁ దొలియాలుమగలనే కలిపినావు
అలకాపురములోని యక్షకాంతకుఁ బ్రేమవార్తలు గాలిలోఁ బంపినావు

ఏమి సేయవు తలచిన ? ఇంతవాఁడ, “వందని ఫలమ్ము కొఱకయి అనసేయు
చిట్టి మఱుగుజ్జచే”నని చెప్పినావు, విశ్వకవిరాజ! ఎంతటి వినయమయ్య!

మ్రోడువాఱిన హృదయాలు మోసులెత్త అమృతమొలికించి, భారతీయాత్మతోడఁ
గలిసిపోయిన నీ దివ్యకావ్యవాణి, అమరభాషకె అమరత్వమబ్బఁజేసె!

లలితమృదూపమాన మధురమ్ములు విశ్వరసజ్ఞ మానసం
బులు గిలిగింతవెట్టెడు అపూర్వకృతుల్ రచియించి, కీర్తిశ
య్యల సుఖనిద్రఁ దేలెదు మహాకవి! మేల్కొనుమా! కళాప్రియుల్
తెలుఁగులు నేఁడొసంగెడు స్మృతిప్రసవాంజలి స్వీకరింపుమా!

---


# రాలెను మించిన సైకిల్ మీరు కొనలేరు

# రాలె








A SEN-RALEIGH Product

ప్రపంచ ప్రసిద్ధి గాంచిన సైకిల్

SR.C-53 TE

# గిరీశం పాత్రచిత్రణం

శ్రీ యస్. టి. నరసింహాచారి

బాగా పరిచయమున్నవాళ్ళను కూడా మనము పూర్తిగా అర్థము చేసుకున్నామని చెప్పలేము. మనకు తెలిసినవాళ్ళనని ఎక్కువగా ఆలోచించము. అంత మాత్రము చేత మన ఆత్మీయతకు, స్నేహసంబంధాలకు ఏవిధమైన లోటు రాదు. గిరీశం అందరికీ కొద్దో గొప్పో తెలిసినవాడే. ఆంధ్రదేశంలో అక్షరజ్ఞానమున్నవాళ్ళంతా కన్యాశుల్కం చదివే వుంటారు; నాటకరంగం మీద, ఈమధ్య సినిమా ద్వారా, నిరక్షరాస్యులకు కూడా గిరీశంతో కొంత సంబంధం ఏర్పడింది. ఇదివరలో భారత భాగవతాలకు వచ్చినంత ఆదరణ ఈ కాలంలో కన్యాశుల్కానికి వచ్చిందంటే అతిశయోక్తి కాదు. తైలసంస్కారము లేని జుట్టుతో పొడుగులాల్చీ వేసుకొని కొంచం నిర్లక్ష్యంగా నడిచిపోతూంటే గిరీశం పోజులో వున్నాడని చమత్కరించటము చాలాసార్లు విన్నాము. అబద్ధాలు, మోసాలు, మధురవాణి, బుచ్చమ్మల బెడద అంటకట్టనంతవరకు పోలీసులతోను, శ్రీమతులవలన ఇబ్బంది వుండదు! నాటకము చదివి మనస్సులో గిరీశాన్ని గురించిన భావం (idea) ఏర్పడి వుండవచ్చు. కాని రూపురేఖలు, పోజులు ఏ నాటక రంగం మీద చూచి నిదమైన వ్యక్తికి సంబంధించినవిగా భావించుకుంటున్నారో! గిరీశం తీరు తెన్నులు ఆంధ్రుల నిత్యజీవితములో చేరిపోయాయి. అయితే మన జీవితములో ఆడాబు, దర్పం, తేలికతనం వున్నాయని ఇతరులు అంటే గిరీశం వుత్సాహం (Spirit) కూడా వుందని జవాబు చెప్పచ్చు. గురజాడవారి గిరీశం నాటకంలో ఒక పాత్ర కాదు. ఆంధ్రుల మనస్సులో ఒక సహజమైన వ్యక్తి. గిరీశం పాత్ర కల్పనకు దోహదం చేసిన వ్యక్తి నిజంగా ఎవరైనా వుండి వుంటారా అని చాలా కాలం అనుకున్నాను. ఉన్నట్టు గురజాడవారి స్మారక సంచికలో చదివాను. ఒకరిద్దరు వ్యక్తులమాట అటుంచి గిరీశం ఆంధ్రుల మంచిచెడ్డలకు ఒక సంకేతం (Symbol). పాత కొత్త వ్యవస్థల మధ్యకాలంలో సాంఘిక పరిస్థితుల ప్రతిబింబం 'కన్యాశుల్కం' అని కాదనటం లేదు. అంతకు మించిన సత్యం కూడా నాటకములో వుందేమో అనిపిస్తోంది.

గిరీశం మంచిచెడ్డలు మనము అంతగా పట్టించుకోలేదు. సాంఘిక నైతికదృష్టితో చూస్తే ఇంత అభిమానము చూపేవాళ్ళము కాదు. గిరీశం గుణగణాలు, చేసినపనులు నాటకంలనుండి వేరు చేసి ఎవరైనా చెపితే "ఇటువంటివాడని అనుకోలేదు" అని ఆశ్చర్యపడుతాము. నిజానికి గిరీశం అంత చెడ్డవాడు కాదేమో. సంఘ సంస్కారంకోసమే గురజాడవారు ఈ పాత్రను కల్పించలేదేమో. అందుకనే మనకు ఎంత సన్నిహితంగా కనపడినా గిరీశాన్ని పూర్తిగా అర్థము చేసుకోలేదంటున్నాను. సజీవమైన వ్యక్తులు మనస్సుకు హత్తుకపోతారు. దానితో పాటు విశిష్టమైన వ్యక్తిత్వమైతే ఆకర్షణ ఇంకా ఎక్కువ. ముక్కుకు సూటిగా పోయే సరళమైన ప్రకృతిని తేలికగా అర్థము చేసుకుంటాము. కాని జటిలమైన స్వభావాన్ని తరిచి చూడాలి. గిరీశాన్ని గురించి అన్ని విషయాలు తెలుసుకోకుండానే మనము ఆ వ్యక్తిత్వాన్ని ప్రేమిస్తున్నాము. బుద్ధికి మించిన అవగాహన (Intuition)తో పరిగ్రహించటం, త్యజించటం జరుగుతోంది.

కన్యాశుల్కం సాంఘిక నాటకం. ఆడపిల్లలను అమ్ముకోవటమే కాకుండా వైధవ్యం, వ్యభిచారం, వ్యాజ్యాలు, మోసాలు, దుస్సంస్కారాలు, అధికారుల ప్రవర్తన మొదలైన అనేక ఆనుషంగిక విషయాలు నాటకవస్తువుకు సమగ్రత కల్పిస్తున్నాయి. సంఘసంస్కారము గురజాడవారి లక్ష్యం అనటములో సందేహం లేదు. అన్ని సాంఘిక సమస్యలతోనూ గిరీశానికి ప్రత్యక్షంగానో, పరోక్షంగానో సంబంధముంది. అయితే ఈ వ్యక్తిద్వారా సంఘములోని దోషాలు వ్యక్తము చేయుటమే గురజాడవారి ఆశయం అనలేము. గిరీశం అబద్ధాలు చెప్పాడు. మోసం చేశాడు. గొప్పగా చదువుకున్న వ్యక్తిలా అమాయ

కులను నమ్మించి ద్రోహం చేశాడు. అర్థం పర్థం తెలియని ఆడపిల్లను లేవతీసుకుపోయాడు. పినతండ్రి ఆస్తి కోసం వల విసిరాడు. కథ అడ్డంగా తిరిగినందున రంగం మీనుంచి తప్పుకున్నాడు. ఇటువంటి వ్యక్తులు సంఘానికి చీడపురుగులని గర్హించటానికి గురజాడవారు గిరీశాన్ని సృష్టించివుంటే, ఆయన తన ప్రయత్నంలో సఫలుడు కాలేదనే అనాలి. గిరీశం గురజాడవారికే ఎదురు తిరిగాడు. నా వ్యక్తిత్వం ఇంతను మించిందని చూపించాడు. గిరీశాన్ని కల్పించి విజయనగరంలో బొంకుల దిబ్బమీద నిలుచోపెట్టక గురజాడవారు తన ఇష్టము వచ్చినట్లు నడిపించలేక వాని మానాన్న వదిలిపెట్టారు. (పాశ్చాత్యులు ఈ నాటకీయ పద్ధతిని గొప్పగా ప్రశంసిస్తారు. ఈ విషయములో షేక్స్పియరుతో సమానమైనవారు లేరంటారు) గిరీశం తన ప్రతాపం చూపించాడు. తను చెడ్డవాడని నలుగురూ అనుకుంటానికి ఆస్కారమే ఇవ్వలేదు. లేకపోతే గురజాడవారు తనకు తెలియకుండానే గిరీశంలో ఒక ఆకర్షణ కల్పించారని అనాలి. గిరీశం మాటలద్వారా నవ్విస్తూనే వ్యక్తిలోని లోపలను చూసి ఒక సాంఘిక ప్రయోజనాన్ని సాధించామని గురజాడవారు అనుకుంటే అట్లా జరగలేదు. నవ్వినా ఆ పాత్రయందు విముఖత కలిగేటట్లు రచయిత ప్రయత్నించాలి. కాని నవ్వటమే కాకుండా మనం గిరీశంమీద అభిమానాన్ని ప్రకటిస్తున్నాము. అంటే గిరీశం వ్యక్తిత్వములో మనల్ని ఆకర్షించే శక్తి ఏదో వుంది. అందువలనే గిరీశం చేసే పనుల అంతరార్థం నైతికవిలువలు మరిచిపోతున్నాము.

గురజాడవారు మిగతా పాత్రలనుకూడా తీర్చిదిద్దారు. వాళ్ళ వ్యక్తిత్వముకూడా మనల్ని తక్కువగా ఆకర్షించదు. కాని వారి మాటలు, చేష్టలు సాంఘిక పరిస్థితులు చిత్రించటములో నాటకమందు ఆశించిన సంఘ సంస్కారానికి దారితీసేవిగా వుంటాయి. గిరీశంకూడా నాటకంలో సమిష్టి ప్రయోజనానికి సాధనమే అయినా అది వదిలి వ్యక్తిగతంగా మరొక కొలతబద్దతో విలువ కడుతున్నాము. మంచి చెడ్డలు అటుంచి కేవలము Shallow అయిన (గాంభీర్యంలేని) వ్యక్తి. అటువంటి పాత్రకు బ్రహ్మరథం పడుతున్నాము. గిరీశంవలన ఏదైనా సాంఘికప్రయోజనం సిద్ధించాలంటే గిరీశాన్ని చూచి నవ్వాలి. కాని గిరీశంతో నవ్వుతున్నాము. అంటే చూచి ఆనందిస్తున్నామన్న మాట. హాస్యానికి వ్యంగ్యానికి ఇదే తేడా. నిర్మలమైన మనస్సుతో నవ్వి ఆనందించినప్పుడే హాస్యమవుతుంది. దెబ్బకొట్టి, దాన్ని చూచి నవ్వితే మనస్సు తేలికపడదు. వ్యంగ్యంవలన వచ్చిన నవ్వు చివరకు ఏదో ప్రయోజనాన్ని ఆశిస్తుంది. కొట్టిన దెబ్బ పెద్దదైతే నవ్వుకు బదులు ఏడుపు వచ్చి కరుణగా మారుతుంది. గిరీశం మాటలలో నవ్విస్తాడు ఇతర పాత్రలను కవ్వించి ఏడిపించి నవ్విస్తాడు. గిరీశాన్ని చూచి నవ్వే పరిస్థితులలో తనే నవ్వి మీరంతా నవ్వటానికే ఇట్లా చేస్తున్నానని, అనేటట్లు ప్రవర్తిస్తాడు. ఈ హాస్యంలో ఎక్కడా సాంఘిక ప్రయోజనానికి ప్రాధాన్యం కనపడదు. అందుకనే వ్యంగ్యానికి ఆస్కారం లేదు.

నైతిక దృష్టితో చూస్తే గిరీశం ప్రవర్తనలో ప్రశంసించతగినదేమీ లేదు. నూతిలో వురికే వెంకమ్మను రక్షించటం, అగ్నిహోత్రావధానులు ఇంట్లో గిరీశం ఆడిన నాటకంలో ఒకభాగమే. నాటకంలో అందరూ చివరకు గిరీశం చేసిన మోసం గ్రహిస్తూనే వుంటారు. మాటలు, చేష్టలు, వుద్దేశాలు గ్రహించి పాత్రస్వభావాన్ని నిర్ణయిస్తాము కాని బుద్ధితో ఆలోచించి చేసిన నిర్ణయాన్ని నమ్మి నాటకము చదువుతున్నప్పుడు మనస్సులో ఏర్పడిన భావాన్ని (impression) కాదనలేము. సాహిత్యంలో పాఠకుని అనుభూతి ముఖ్యమైంది. రచయిత అనుకున్నదానికి భిన్నమైన అనుభూతి కలిగిన సందర్భాలు ఎన్నో వున్నాయి. పరిశీలనగా చూచినప్పుడు గిరీశం చేసిన పనులు మనము ఆమోదించకపోవచ్చు కాని నాటకము చదువుతున్నప్పుడు మనలో కలిగిన భావసంచలనమే, ఏర్పడిన భావమే ఆ పాత్రను గురించి మన సరియైన అభిప్రాయము. పాత్రతో పాఠకుని సంబంధము ఆలోచించుకొని ఏర్పరుచుకొన్న అభిప్రాయాలనుబట్టి వుండదు. మన భావాలు, మన సంస్కారము, అంతర్దృష్టి సహజంగా గ్రహించినదై వుంటుంది. అందుచేతే పాత్రను గురించిన పూర్వాపరాలు విమర్శించుకోకుండానే రాగానుబంధం ఏర్పడుతోంది. గిరీశాన్ని ప్రేమిస్తున్నాము. జాగ్రత్తగా ఆలోచించి గిరీశంలో చెప్పుకోతగ్గమంచి ఏమీ లేదనికూడా అంగీకరిస్తున్నాము. పరస్పర విరుద్ధమైన ఈ అభిప్రాయాలను ఏవిధంగా సమన్వయపరచటం? మన భావాలు, మన అనుభూతి, మన ఆలోచనలు వేరు

# గిరీశం పాత్రచిత్రణం

వాదానికి కట్టుబడినవి. తప్పని రెండింటిలో దేనిని త్రోసివేయలేము. కేవలము హాస్యధోరణితో గిరీశం మన అభిమానాన్ని పొందటములేదు. నవ్వించ కలిగినంత మాత్రాన మనము దుష్టస్వభావాన్ని భూషించి ప్రేమించలేము. రచయిత ప్రతిభ, కళాకౌశలం చెడులోకూడా ఆకర్షణ కలిగించటములోనే వుంది. అంతమాత్రముచేత చెడును మంచిగా ప్రచారము చెయ్యటములేదు. దాన్ని కప్పిపుచ్చి తప్పుదారి పట్టించటము లేదు. స్థూలదృష్టికి కనపడే గిరీశాన్నిగురించి ఆలోచించితే సరియైన నిర్ణయానికి రాలేము. పూర్తి వ్యక్తిత్వాన్ని అర్థము చేసుకుంటానికి ప్రయత్నించాలి. పాత్ర గుణగణాల స్థూలమైన వర్గీకరణ దారితప్పిస్తుంది. మహాకవుల సృష్టి సామాన్య రచయితల పాత్ర కల్పనకు భిన్నంగా వుంటుంది సులభంగా గ్రహించలేము. మాటలలో స్పష్టముగా ఇదమిత్థమని చెప్పలేము. నిజంగా సజీవమైన పాత్రను సజీవమైన వ్యక్తిలాగా ఆలోచనల హద్దులమధ్య చూడలేము జటిలమైన ప్రకృతిగల పాత్రలు సామాన్యబుద్ధికి అన్ని అంశాలలోనూ పూర్తిగా అవగాహనకురావు.

పాత్రను వస్తువునుండి, ఇతరపాత్రలనుండి వేరుచేసి చూడకూడదు. గిరీశానికి కన్యాశుల్కంలో అన్ని సమస్యలతోనూ, పాత్రల దరితోనూ సంబంధముంది. కాని ప్రత్యక్షంగా ఏ సమస్యకూ మూలకారణంగా ఈ పాత్ర కల్పన జరగలేదు. కన్యాశుల్కం సుబ్బమ్మది. వేశ్యలనుగురించి మధురవాణి వుంది. వైధవ్యానికి ప్రతినిధి బుచ్చమ్మ. హెడ్డు, ఇనెస్పెక్టరు అధికారుల ప్రవర్తన చాటుతారు. సౌజన్యరావు, భీమారావునాయుడు, డిపీ కలెక్టరు న్యాయ పరిస్థితులు ప్రకటిస్తారు. వ్యాజ్యాలకు సాక్ష్యాలకు అగ్నిహోత్రావధానులు, రామప్పపంతులు వున్నారు. వైధవ్యకారణ వ్యభిచారము మీనాక్షిది. గిరీశం అన్నింటిలోనూవుండి దేనిలోనూ లేడు. మిడిమిడి ఇంగ్లీషు చదువుల ఫలితం గిరీశం అనవచ్చు. కాని గిరీశాన్నిగురించి ఆలోచించవలసినది ఇంకా ఎంతో వుంది. అన్నీ కలిపి చూస్తే ఈ విషయ ప్రాధాన్యం మరుగునపడిపోతుంది. ఇతర పాత్రలతో గిరీశం పరిచయం వాళ్ల స్వభావాన్నీ, నాటక సాంఘిక ప్రయోజనాన్ని స్పష్టముచేస్తుంది. అంటే ఒకవిధంగా గిరీశం సాంఘిక ప్రయోజనానికి అతీతుడు. ఇతర పాత్రలను వెలుగులోకి తీసుకురావటానికి, నాటక ఆశయాన్ని స్పష్టము చేయటానికి వుద్దేశించబడిన పాత్ర. ఈ దృష్ట్యా నాటకంలో గిరీశానికి ఒక ప్రత్యేక సార్థకత ఏర్పడుతుంది. పాత్రలోని చెడు కొంత కప్పబడుతుంది.

మనకు కనపడేది ఒకవిధంగాను, అనుభూతి మరొక విధంగాను వుందంటే ఆ పాత్రలో బయటకు కనపడేదానికి మించిన దేదో వుందని అనుకోవాల్సి వస్తుంది. రచయిత ప్రతిభ, మానవ ప్రకృతి రెండింటి మీద సూక్ష్మపరిశీలనా దృష్టి లేకపోతే పాత్రలోని విశిష్టత అర్థంకాదు. గిరీశంలోని ప్రత్యేకత గిరీశం వుత్సాహం (spirit). తనదారిలో ఎన్ని ఆటంకులు వచ్చినా ఆ వుత్సాహం పోలేదు. కథ అంతంగా తిరిగినా గిరీశం గిరీశమే. ఇంకొకళ్ళలో ఆ వుత్సాహాతిశయం (sportive spirit) నిర్లిప్తత అసంభవం. చేసిన పనులన్నీ గిరీశానికి ఒక ఆట. ఆటలో ఓడినా దిగులు లేదు. ఆటకు మంచి చెడ్డలు లేవు. గిరీశానికి జీవితం నిజంకాదు. దాగుడుమూతల ఆట (make-belief) గిరీశం చేసిన చెడుపనులన్నీ కప్పిపుచ్చటానికి ప్రయత్నించటములేదు. పాత్రకల్పన విలన్ దృష్టితో కాదని మాత్రం చెపుతున్నాను. ఆంధ్రుల వుత్సాహం గిరీశంలో మూర్తీభవించింది. అందుకనే గిరీశమంటే ఆంధ్రులకు అంత ప్రేమ. ఆ వుత్సాహం మనిషిని ఊపి ఒగులుతుంది. ఏ పనిచేసినా నవ్వుతూ చెయ్యటం, కష్టసుఖాలు, మంచి చెడ్డలు ఆలోచించకుండా ప్రతిదానిని ఒక ఆటగా భావించటము మనిషిలోని వుత్సాహానికి నిదర్శనం. ఉత్సాహములో చేసిన పనుల మంచిచెడ్డలు సాంఘికదృష్టిలో నిర్ణయించి విలువ కడతాము. అప్పుడు చెడును గర్హించినా మనిషిలోని వుత్సాహాన్ని ప్రశంసించుతాము.

మాటలలో చమత్కారము (wit) గిరీశంలో ఆకర్షణ అనుకుంటాము. అంతకంటే ఎక్కువగా ప్రతి సన్నివేశంలోను చక్కని హాస్యముంది. ఎటువంటి గడ్డు పరిస్థితి అయినా చాకచక్యంగా గిరీశం తప్పించుకు పోతూవుంటే నవ్వి ఆనందించకుండా వుండలేము. గిరీశం చీపురుదెబ్బలు రామప్పపంతులు తింటాడు! ‘వెఱ్ఱిప్పా! మంచంకిందదూరా, వెఱ్ఱిగవల గొడతాను’ అని పూటకూళ్ళమ్మను రమ్మని తను రెండోపక్కనుండి పారిపోతాడు. వెడుతూ వెడుతూ తనవునికి చెప్ప

సంగుకు రామప్రపంచులు నెత్తిమీద చిటిక వేసి మరీ వెడతాడు. గిరీశం నిలబడి, మాటమార్చి తననుసమర్థించుకొన్న సన్నివేశాలుకూడా తక్కువలేవు. ఆ సాహసాన్ని మెచ్చుకోకుండా వుండలేము. గిరీశం పెద్దపెద్ద లెక్చరు కొట్టగలడు కాని అవి సిటీల్లోనే కాని పల్లెటూళ్లలో ఎంతమాత్రం పనికిరావు. అందుకనే కన్యాశుల్కం పనికిరాదని లెక్చరిచ్చి వృథా ఆయాసం పడటంకంటే అగ్నిహోత్రావధానులు చెప్పిందే బాగుందని ఒక సమ్మోహనాస్త్రాన్ని ప్రయోగించేటప్పటికి ఆయన వశ్యుడైపోయాడు. అభిప్రాయాలు మార్చుకొని సమర్థించుకోలేనంత తెలివితక్కువవాడు కాదు గిరీశం. ఇనెఫెంటు మారీజీలు అయితేనేకాని యంగ్ విడోస్ వుండరు. ఆ బ్లిపుంటేనే కాని విడోమారేజిరిఫారముకు అవకాశం వుండదు. ముసలాళ్లను పెళ్లాడి బాగా కన్యాశుల్కం తీసుకొని, వాళ్ళు త్వరలో చచ్చిపోయాక గిరీశంలాంటి యువకుని పెళ్ళిచేసుకొని ఆడబ్బుతో సుఖపడవచ్చు. అగ్నిహోత్రావధానులవంటి వ్యక్తిని మంచిచేసుకోగలిగాడు గిరీశం. ఇవ్వాళ్ళకు అగ్నిహోత్రావధానులకు తగినవాడు దొరికాడని కరటకశాస్త్రి ప్రశంసాపత్రాన్ని అందుకున్నాడు. సౌజన్యారావుగారిముందు మధురవాణి గిరీశం బ్రతుకు బట్టబయలుచేస్తే గిరీశం అనే Young foolishman, అనే Beautiful నాచ్ Devilకథ ఖురవాని పశ్చాత్తాపము గిరీశం అద్భుత ప్రజ్ఞకు నిదర్శనం.

గిరీశంలో వుత్సాహము, శక్తి వున్నాయి. చమత్కారానికి, హాస్యానికి, ఇతరులను ఏడిపించి పరిహసించటానికి ఇదే మూలకారణం. అవకాశం దొరికితే నవ్వటానికి, నవ్వించటానికి తయారుగా వుంటాడు. మనస్సు, బుద్ధి ఎప్పుడు పదునుగానే వుంటాయి. మనిషికిగాని వాటికి బద్ధకమంటూ లేదు. వుత్సాహముంటే జీవితములో ప్రతివిషయాన్ని తేలికగా తీసుకుంటాము. నవ్వుతూ చేస్తాము. జీవితాన్ని ఒక ఆటగా సరదాగా గడిపే గిరీశంలాంటి వ్యక్తి సామాన్యమానవుని తరహాగా మంచి చెడ్డలు ఆలోచించడు. జీవితాన్ని ఈదృష్టితో చూడటము వలనే చెడ్డ గిరీశాన్ని కూడా ప్రేమిస్తున్నాము. చెడుగా ప్రవర్తిస్తున్న జీవితాన్ని తేలికగా తీసుకోవటము. అనుభవించటము, ఆనందించటము—అందులోను నిర్లక్ష్యం ధైర్యం సాహసం మనల్ని ముగ్ధుల్ని చేస్తాయి. వెంకటేశంతో పారిపోవటానికి ప్లానువేసుకొని Jollyగా పాడుతూ తిరుగుతాడు. విజయనగరంలో తనవునికికి సంబంధించిన గడ్డు పరిస్థితులు ఆజీవాన్ని ఏమాత్రం కదల్చలేకపోతాయి. పాత్రలందరితోను ఒకేవిధంగా కులాసాగా కాలక్షేపం చేస్తాడు. కులాసా ధోరణిలో యుక్తి, కల్పన చమత్కారం ఎంతకి తగ్గకుండా కొత్తరూపాలు ధరిస్తుంటే గిరీశంఅబద్ధాలు. పిరికి పందలా పారిపోవటము అన్నీ కేవలము చమత్కారంలా కనపడతాయి. పూటకూళ్ళమ్మనుగురించి అద్భుతంగా కథ అల్లుతాడు. బుచ్చమ్మను వశపరచుకునే ప్రయత్నంలో గిరీశం బుద్ధి వైభవం కల్పన పటన గిరీశం అసమాన ప్రతిభను చాటుతుంది. బుచ్చమ్మలాంటి ప్యూర్ డైమండును చూడగానే టెంపరరిగా బుద్ధిమంతునివేషం వచ్చేస్తుంది. "టుమారీ యె విడో, ఆర్ నాట్ టు మారీ దటీజ్ ది కొశ్చన్" లాభనష్టాలు బేరీజు వేస్తే మంచిదనే తేలింది. నవ్వుతూ మాటాడినా గిరీశం తెలివి తక్కువవాడు కాదు. తన స్వార్థాన్ని మరిచిపోడు. సందుచూసుకొని విధవల అవస్థ వర్ణించి పరాశరస్మృతిలో విధవలు పెండ్లాడవలసినదని వున్నట్టు ప్రమాణం చెప్పాడు. బుచ్చమ్మను నమ్మించటానికి వేసినప్లాను, ఇచ్చిన ఉపన్యాసం గిరీశం బుర్రలోంచే పుట్టుకురావాలి; మరొకరికి సాధ్యం గాదు. బుచ్చమ్మ ఎంత అమాయకురాలైనా సంస్కారాలు సహజంగా కొన్నిటిని కట్టేసాయి. సానుభూతి సంపాదించటానికి గిరీశంపాట్లు చెప్పలేము. బుచ్చమ్మలాంటివాళ్ళకు నచ్చచెప్పాలనే ప్రయత్నం ఎంత వ్యర్థమో గిరీశానికి తెలుసు. ఇట్లాంటి తెలివితేటల్లో గిరీశాన్ని ముందు చెప్పాలి. లోకకల్యాణానికోసం అవతరించిన గిరీశానికి పెళ్ళిమీద అసలు మనసు లేదు. కాని లోకం ఎంత విలువో అంతకంటె ఎక్కువ విలువైన రత్నంలాంటి మనిషి కాబట్టి బుచ్చమ్మకోసం లోకసేవ చేయాలనే ఆదర్శం వదులుకుంటానికి సిద్ధపడ్డాడు. బుచ్చమ్మకోసం బానిసత్వమైన ఉద్యోగాన్నికూడా చేస్తాడు. గిరీశంగారి సంసారం dream children ఒక తియ్యని కల. అంతటితో పోనివ్వలేదు. బుచ్చమ్మలేకుండా గిరీశం అంచనాలన్నీ వృథా. బ్రతుకు వ్యర్థం. జోడుగుళ్ల పిస్తోలు యెక్కుపెట్టి గుండె తూసిపోయేటట్లు కొట్టుకుంటాడు. స్వర్గం పోయాక రంభవచ్చినా 'నేను అంటే నాచ్' పొమ్మంటాడు. ఆనేక సంవత్సరాలు తపస్సుచేసి బుచ్చ

మ్రను స్వర్గంలోనైనా పొందుతాడు. బుచ్చమ్మ కనక వెంట పారిపోయి రాకపోతే ప్రాణత్యాగం చేస్తాడు. పెళ్ళికి వెడుతూ రాత్రి ఉడాయిస్తే, చెల్లెలు పెళ్ళి కూడా ఆగిపోయి బుచ్చమ్మ కోరిందికూడా సిద్ధిస్తుంది. పిచ్చిపిల్ల గిరీశం చేతుల్లోంచి ఎక్కడకుపోతుంది. గిరీశం ప్లాను, కల్పన అనుకున్నట్లు పని జరుపుతాయి.

చివరకు గిరీశం ఆడిన నాటకంకూడా తక్కువ రక్తి కట్టదు. కలబొల్లియేడుపులో, సానుభూతి చూపుతూ దత్తత చేసుకోమంటాడు లుబ్ధావధానులను. సౌజన్యరావుగారు నీ తరపున పని చేయటానికి పంపారని దానికి వచ్చాను. శుభం పలకరా పెళ్ళికొడుకా అంటే ఏదో అన్నాడుట. హత్యానేరానికి జైలుకు పోవాలని ముందే ఆశీర్వచనం. సత్యాన్ని వుపాసించే గిరీశం అబద్ధం సాక్ష్యాలు ఒప్పుకోడు. ఆ హృదయనైర్మల్యం, బుచ్చమ్మమీద అవ్యాజమైన ప్రేమ చూచి సౌజన్యరావుగారే మెచ్చుకుంటాడు. గిరీశం మామూలు మనిషి కాదు, నెపోలియన్ ఆఫ్ ఆంటినాచ్. మారువేషంలో వున్న మధురవాణితో సంభాషణ గిరీశం ప్రజ్ఞకు గీటురాయి. మంచిగా, వినయంగా మాట్లాడుతూ గూఢంగా మధురవాణికి అప్పీలు చేస్తాడు. పేరులో ఏముందని మధురవాణిని తనెవరో చెప్పవద్దంటాడు. మాటవరసకు తనే చెడ్డవాడంటాడు. కర్మ అనేది ఎంత మంచివాడిని అయినా రెక్కపట్టుకొని తప్పుదారిలోకి లాగుతుందంటాడు. మధురవాణి వేషం తీసివేశాక కూడా పశ్చాత్తాప దగ్ధుడైన గిరీశం ఒక చిన్న కరుణార్ద్రమైన సన్నివేశాన్ని సృష్టిస్తాడు. ఆ ఎత్తూ పని చేయక కథ అడ్డంగా తిరిగిందని నిష్క్రమించవలసి వచ్చింది.

గిరీశం చెడు అలవాట్లు, దురుద్దేశాలు సహజమైనవి అయినా, పరిస్థితులనుబట్టి వచ్చినవి అయినా, అన్నింటిలోనూ హాస్యం, చమత్కారం చూస్తాడు. తను ఆనందించి మనలను ఆనందింపచేస్తాడు. బార్బరస్ మనుష్యులతో ఏమీ తోచదికంటే, లైఫ్‌లోకూడా క్రమేణా అందం, ఆనందం చూస్తాడు. వూసుపోదని అనుకుంటాము కాని ఎన్నో అవకాశాలున్నాయి. బుచ్చమ్మలాంటి బ్యూటిఫుల్ యంగ్ విడోస్ వుంటే రిఫారముకు ఎంతో ఛాన్సువుంది. ధూమపానాన్ని వదలలేక, కాల్చి పారవేసే పొగాకుకు దొంగతనం చేసినా నైతికంగా ఏమీ ఇబ్బందిలేదంటాడు. బృహన్నారదీయం నాలుగో అధ్యాయంలో 'పొగ తాగని వాడు దున్నపోతై పుట్టున్' అన్నది ప్రమాణంగా గురుశిష్య సంవాదరూపేణ చుట్టల నుంచి చెప్పి అన్నీ కూలంకషంగా చర్చించి గిరీశ ప్రణీతమైన 'పొగాకో పనిషత్తు'ను నాబోటి ధూమపాన ప్రియులకు ప్రకాశించకుండా వుండలేను. హాస్యం. అతి తెలివితేటలు గిరీశం పాలబడ్డవారికి బాధగా వుండివుండవచ్చు. మనలాగా ఆనందించలేకపోవచ్చు. అయినా వాళ్ళూ నవ్వుతారు. నవ్వక ఏడవాలి. పంటనొక్క గాసిపగా మారిన రామప్పంతులు నవ్వుతూ ఏడుస్తాడు. గిరీశం నాటకానికి విదూషకుడు మాత్రం కాదు. ఇతరపాత్రలు గిరీశంతో పాటు నవ్వలేరు. వాళ్ళలో నవ్వే శక్తిలేదు. విదూషకుని హాస్యంలో ఆడంబరం ఎక్కువ. అది పాత్రపోషణకు పరిమితి. గిరీశంలోని వుత్సాహము, సజీవమైన ప్రకృతి, చమత్కారం లేవు గిరీశంతోపాటు నవ్వుతున్నామంటే మనలో ఆ వుత్సాహము, శక్తి వున్నాయన్న మాట.

గిరీశంలోని విశిష్టత అవగాహన చేసుకుంటానికి మానవ ప్రకృతిని పరిశీలించాలి. మనిషి చేసిన చెడును మంచిగా చెప్పలేము, కాని పరిస్థితులు, భిన్న వ్యక్తులతో పరిచయము, జీవితదృష్టి పరీక్షిస్తే పాత్ర విషయంలో మన అభిప్రాయానికి ఒక కొత్త పంథా చూపుతాయి. గిరీశంలో చెడును చూచి నవ్వుతున్నాము. ఎందుకంటే నిజానికి గిరీశం ద్వంద్వ వ్యక్తిత్వములో అది ఒకవైపు, రెండోవైపు గిరీశం వుత్సాహము చూస్తున్నాము. లేకపోతే అటువంటి మరొకవ్యక్తిని అసహ్యించుకుంటాము. దూరంగా తొలగిపోతాము. సరియైనహాస్యం కరుణ జుగుప్సల మధ్యమార్గాన పోతుంది. గిరీశం ఏ పరిస్థితులలోనైనా చమత్కారంగా తప్పించుకుంటాడు. అది బుద్ధివైభవం. బుచ్చమ్మ సమక్షంలో వెంకటేశానికి విధవలనుగురించిన వుపన్యాసం యిస్తూ, బుచ్చమ్మతో మాట్లాడుతూ, వెంకటేశాన్ని జామచెట్టుమీదనుంచి తోలి అగ్నిహోత్రావధానులు వస్తే ఎటువంటి అనుమానం రాకుండా మాటలుమార్చి, నచ్చేమాటలు చెప్పి, దొరల గొప్పతనాన్ని చాటి చాకచక్యంగా జాగ్రత్తపడతాడు.

పారిపోయినా, లేచిపోయినా గిరీశంధోరణి, సమర్థన మనిషి పిరికితనం వైపు పాఠకునిదృష్టి పోనీదు.

తప్పించుకోవటము లోని సమర్థతను గిరీశం విశేష ప్రతిభగా భావిస్తాము. పూటకూళ్లమ్మతో దెబ్బలాటలో కిందకు దిగజారినా నవ్వేస్తాడు. చమత్కారం పనిచేయక వెక్కిరింపుగా మొహం పెట్టి, మాటలతో కానిపని ఆంగిక హావభావాలలో పూర్తి చేస్తాడు. హాస్యం మొగటుగా వుండని, గిరీశం బోర్లా పడ్డాడని అనుకోలేము. ఓడిపోయినా అంగీకరించని తత్వం గిరీశానిది. గ్రంథం ఎంత చాకచక్యంగా నడిపించినా చివరికి ఓడిపోతూ వచ్చాడు. విజయనగరంలో నెగ్గను రాలేక పోతాడు. బుచ్చమ్మను పొందలేక పోయాడు. లుబ్ధావధానులతో కూడా పాచిక పారలేదు. కాని ఓడిపోయానని అంగీకరించడు. స్థానాలు మార్చి ప్రయత్నాలు చేస్తూనే వుంటాడు. రంగంమీద నుంచి నిష్క్రమిస్తూ కూడా పరాజయాన్ని అంగీకరించడు. ఇతరులు వెక్కిరించారని బాధలేదు. అంతకు రెట్టింపు వినిపిస్తాడు. నాటకంలో అందరూ గిరీశం సూటిమాటలకు, ఘాటైన విమర్శకు నిరుత్తరులవుతారు. చాటుగా గిరీశాన్ని తిట్టినా ప్రత్యక్షంలో ఆ వాగ్ధోరణికి తల ఒగ్గుతారు. సౌజన్యరావుగారు కూడా ఏమీ చేయలేక పోతారు. కాలుజారితే లేచి దులుపుకుపోతాడు. అంకురించిన వుత్సాహము, శక్తితో పని ప్రారంభిస్తాడు. చివరివరకూ తన ప్రయత్నాలు వదలడు. ఆ జీవితములో స్థలాలు, వ్యక్తులు మారవచ్చు కాని ఆ మనిషిలో మార్పులేదు. కథ అడ్డంగా తిరిగిందని వెళ్లిపోయినా పూనుకునే ఘటం కాదు. మళ్లీ మొదలు పెట్టాలంటే ఇంకో గురజాడవారు కావాలి ఇంకో గిరీశం లేడు. మరో గురజాడ రారు. గిరీశంపాపం పండినట్లు అనిపిస్తుంది. అంత మునిగాక మళ్లీ తేలతాడని అనుకోలేము. గిరీశం రంగంమీదనుండి నిష్క్రమించవలసిన పరిస్థితులు వచ్చాయి. సౌజన్యరావు గారితో చివరిపాచిక విసురుతాడు. కానిమధురవాణి రాకతో ఆట కడుతుంది. కాని గురజాడవారు గిరీశాన్ని అన్యాయం చేయలేదు. అంతగా అభిమానం చూరగొన్న పాత్రను అవమానం పాలుచేసి, చివరి దాకా నవ్వించి ఏడుపులోకి దించలేదు. నాటకానికి అంతం ఉంటూవుంది. పాత్రలు ఒక ఒడ్డుకు చేరుతారు. నాటక ప్రయోజనానికి సాఫల్యం కల్పిస్తూ, కళాగౌరవానికి భంగంరాకుండా అంతా ఒక దారిన పడ్డారు. కాని గిరీశం మారలేదు. మారితే గిరీశమే కాదు. గురజాడవారు గిరీశాన్ని మళ్ళీ మొదటి స్థితికి తెచ్చివదిలారు. కథ అడ్డంగా తిరిగి సంకటస్థితిలో పడ్డంత మాత్రాన గిరీశం పని అయిపోయిందని అనుకోలేము 'డామిట్! కథ అడ్డంగా తిరిగింది' అనే చివరి ముక్కలు గిరీశం స్వభావానికి మచ్చుతునకలు. మళ్ళీ మరో ప్రయత్నము తప్పదు. సౌజన్యరావుగారి సదుపదేశానికి ఫలితంగా బాగుపడతానని జవాబురాదు. తన ఎత్తు పారలేదంటాడు. లుబ్ధావధానుల డబ్బు, బుచ్చమ్మ చేతిలోంచి జారిపోయారనే ఆక్రోశం మాత్రమే వ్యక్తం చేస్తాడు.

తరువాత మళ్ళీ 'కొండుభట్టీయం'లో గిరీశాన్ని చూస్తాము. కాని సజీవమైన ఉత్సాహం కనబడదు. నామసామ్యం స్థూలమైన కొన్ని బాహ్య విషయాలు వదిలి అది వేరే పాత్ర జీవితాన్ని తేలికగా తీసుకునే గిరీశంలో కొంత గంభీరత వచ్చేసింది. సంస్కార దృష్టి, సంఘాన్ని మార్చాలనే ఆవేశం, దుర్బలత్వాన్ని కనికరించటం లోతైన వ్యక్తిత్వాన్ని సూచిస్తాయి. హిందూ, బ్రాహ్మ వివాహపద్ధతులలోని సాధకబాధకాల చర్చ, వ్యక్తులను పరిస్థితులను అర్థంచేసుకొని ప్రవర్తించటము, ఆ పాత్ర కన్యాశుల్కంలోని గిరీశం కాదని స్పష్టంచేస్తాయి. వేదాలతోసహా అన్నిటినీ లెక్కించి వెళాకోళంచేసి, పెద్ద పిన్న తారతమ్యం మరిచి హాస్యరకంగా మాట్లాడే తుంటరి అని రాజారాం గారి సర్టిఫికేటు పొందినా ఈ హాస్యధోరణి స్థూల దృష్టికే సమానంగా కనిపిస్తుంది. ఈ వెక్కిరింపులో మొనటిపసలేక కేవలం చమత్కారం అనిపిస్తుంది. ఆకారకోలగా వెర్రిగుల వ్యాఖ్యానం ఎంత నవ్వించినా కన్యాశుల్కంలోని లెక్చర్ల వాగ్వైదగ్ధ్యాన్ని ప్రకటించదు. జీవితంలో మొదట వుత్సాహంలేని గిరీశం కొండుభట్టీయంలో సజీవమైన సృష్టిగాక అనుకరణగా భావిస్తాము.

గిరీశం వ్యక్తిత్వం విలక్షణమైంది. ఆ తెలివి తేటలు ప్రశంసిస్తాము. కాని అవి గౌరవ ప్రతిపత్తులకు ఆస్పదమైనవి కావు. చెడును తప్పుగానే చూస్తాము. కాని దుష్టస్వభావమని ఖండించలేము. చెడ్డగుణాలకు ఏమీ లోటులేదు. దొంగతనం, జిహ్వాచాపల్యం, డాబుదర్పం. గొప్పలు, పిరికితనం, మోసం, అమాయకులను అన్యాయం చెయ్యటం, ముఖంముందు ప్రశంస, వీపు తిప్పగానే తిరస్కారం, వ్యభిచారం, వేషాలు, అబద్ధాలు, పోకిరీపోకడలు, కోతలు, అల్పబుద్ధులు— సర్వలక్షణసంపన్నుడనే చెప్పవచ్చు. నాటకంలో

# గిరీశం పాత్రచిత్రణం

గిరీశంచేసిన ప్రయత్నాలన్నీ కొంచెం యించుమించు ఈ మార్గాన్నే వున్నాయి. విజయనగరంనుండి పలాయనం, బుచ్చమ్మను వలలో వేసుకోవటం, లుబ్ధావధాను డబ్బుకోసం దగ్గర చేరటం అన్నీ గిరీశందుర్గుణాలే చెప్తాయి. మానసిక దౌర్బల్యాలవలన ఎంత అనుభవమున్నా బుచ్చమ్మమోహం ఎదుటకు వచ్చేటప్పటికి ట్రెంబ్లింగ్ పట్టుకుంది. మంచిముంగుకొంచెం వెనకాడవలసివచ్చింది. బుచ్చమ్మ మధురవాణికాదు మరి. ఈ దౌర్బల్యాలు అందరిలోనూ కొద్దో గొప్పో వుండేవే. కాని అన్నీ వుండటం గిరీశంఘనత. వాటిని కప్పిపుచ్చే గుణగణాలు వుండడం గిరీశంలోని గొప్ప. ఈ మంచి చెడ్డలు ఒకదానికొకటి పరిపూరకలౌతాయి. యౌవనం, వుత్సాహం. సాహసం, చమత్కారం, తెలివితేటలు, వాక్చక్యం, మనిషిని కనిపెట్టగల శక్తి, ప్రశంసించి వశపరచుకోవటం, వుపాయాలు, దూరదృష్టి, మనిషికి తగినమాట, నిశ్చింత, ఎత్తులు, మాట దాటించటం, వాక్చాతుర్యం, నీతులు, భావావేశం, లెక్చర్లు, తప్పించుకునే నేర్పు—ఎన్నో విశేషాలు వింతలు కలిసి విశిష్టమైన గిరీశాన్ని సృష్టించ కలిగాయి. డిప్టీకలక్టరు మెచ్చాడని కరటకశాస్త్రిని, మాటలో మీఅంతవారు పెద్దవారు ఏమన్నా నేను పడటం భాగ్యమేనని అగ్నిహోత్రావధానులను టోపీలో వేస్తాడు. నానా మాటలు అంటున్నాడు వెళ్ళిపోతానని బెదిరిస్తాడు. న్యాయసల్లాపమాటవిని 'డామిట్' అని నీతులు వల్లిస్తాడు. ఆవేశంగా మాట్లాడి హడలగొడతాడు. శిష్యుడిచేత దొంగనాటకాలు ఆడించి ప్రమాదాలు తప్పించుకోవటములో ఏమైనా వచ్చినప్పుడు బ్రహ్మభేద్యమైన తన్నానవేయటంలో పొలిటీషియను తెలివితేటలన్నీ చూపిస్తాడు.

గిరీశం మనలను ఏవిధంగా నవ్వించి మెప్పు పొందుతున్నాడో కూడా ఆలోచించాలి. నవ్వించటములోను, కవ్వించటములోను గిరీశానికి జోహారు చేయక తప్పదు. ఇతరపాత్రలను ఏడిపించి మనలను నవ్విస్తాడు. పూటకూళ్ళమ్మ, రామప్పపంతులు, లుబ్ధావధానులు వుదాహరణ. ఇతర పాత్రలను మోసగించి మనలను నవ్విస్తాడు. అగ్నిహోత్రావధానులు, సౌజన్యరావు, మధురవాణి గిరీశం మాయలో పడతారు. అమాయకుల ముందు తన ప్రభావాన్ని చాటి మనలను నవ్విస్తాడు. వెంకటేశం, బుచ్చమ్మ అవన్నీ నమ్మి చేతులు జోడిస్తారు. అసలు గిరీశాన్ని చూచే నవ్వుతాము! వేషం పోజులలోని ప్రత్యేకత అటువంటిది. హావభావాలు, చేష్టలు చూచి నవ్వటం ఎల్లనూ తప్పదు, వ్యక్తిస్వభావము, ప్రకృతికూడా నవ్విస్తుంది. గిరీశం ఏ సన్నివేశంలో వున్నా అసలు విషయాన్ని మరిచి నవ్వేస్తాము. శరీరం సుఖాన్ని కోరుతుంది. ఎక్కడవున్నా కళ్ళు అందాన్ని వెతుకుతాయి. మంచి వస్తువులను చూస్తే జిహ్వాచాపల్యాన్ని ప్రకటిస్తుంది. నవ్వుతూ అన్ని పనులూ చేస్తాడు. మాటలలో మనల్ని బోల్తాకొట్టిస్తాడు. ఆ బురలోని యుక్తులకు, కల్పనలకు అంతంకనపడదు. స్వేచ్ఛ, ఆనందం, డాబు. అతిశయోక్తులు—అన్నీ హాస్య ధోరణిలోనే వస్తాయి. గిరీశం పదహారణాల నిజం చెపుతున్నా నవ్వుతాము. యధార్థం కాదు నవ్వులాట అంటాము. చేసిన తప్పు, చెప్పే విషయం మాటల ధోరణిలో మార్చి అంతా కేవలం వకతాయితనం అని నమ్మిస్తాడు. స్వగతాల్లో తన దోషాలుతనే చూపి నవ్వి నవ్విస్తాడు. అంత వుత్సాహములోను స్వార్థాన్ని మరవడు. కాని ఎవరినీ ద్వేషిస్తున్నాడని అనలేము. గిరీశం రంగంమీద పాత్ర కాదు, స్వభావతః నటుడు. అందుకనే గిరీశంచేసే పనులు, చెప్పే మాటలు యధార్థంగా తీసుకొని నిరసించక, నటనగా నవ్వేసి పూరుకుంటున్నాము.

ఎంత తెలివితేటలుంటే జీవితంలో గిరీశంలాగా నెట్టుకు రాగలుగుతాము. ఎటువంటి పరిస్థితుల లోనూ చలించని స్థైర్యం కావాలి. విజయనగరంలో సంభవించిన విపత్ పరిస్థితులు తేలికగా ఎదుర్కొంటాడు. తన దారిలో వచ్చే అడ్డంకులు దాటటానికి, తప్పించుకు పోవటానికి, మాటలలో చమత్కారం గిరీశానికి సహజమైన సాధనం. ఈ రూపేణ అగ్నిహోత్రావధానులతో కూడా నెగ్గుకు రాగలిగాడు. అబద్ధాలు, మోసాలు ఆత్మరక్షణకు ఆయుధం. అన్ని పరిస్థితులలోను ఇవే గిరీశానికి అడ్డు పడ్డాయి. వీలు, అవకాశం జీవిత ఆదర్శం. చాన్సు దొరికితే పోనివ్వడు ఆత్మరక్షణకు వెంకటేశంతో వచ్చి బుచ్చమ్మకోసం ప్రయత్నిస్తాడు. అవసరమైతే ఒకక్షణంలో అభిప్రాయాలు, ఆదర్శాలు మార్చుకుంటాడు. అగ్నిహోత్రావధానులు సౌజన్యరావుగార్ల అభిప్రాయాలకు తలవూపుతాడు. మాటలలో ఏముంది క్రియ జరగాలనే తత్వం. మాట మార్చుకోవటమే కాకుండా

త్సవాదంలో ఏవిధమైన విరోధము లేనట్లుగా సమర్థించుకు పోతాడు. ఎవరైనా అభ్యంతరము చెపితే తక్షణంలో జవాబు చెప్పనీడు. అగ్నిహోత్రావధానులను వశపరచుకోవటానికి కన్యాశుల్కాన్ని ఒప్పుకొని వెంకటేశానికి నచ్చచెపుతాడు. తనకు వీలుగా వుండటము తప్ప అబద్ధం—నిజం అనే ప్రశ్నే లేదు. వెంకటేశాన్ని సమర్థించటానికి, బుచ్చమ్మను ఒప్పించటానికి ఎన్నో కోతలు కోస్తాడు. సమయానుకూలంగా కల్పించి చెప్పటములో ప్రతిసారి ఒక కొత్త విషయాన్ని తీసుకువస్తాడు. అవ్యూహాలు తరిగేవి కావు. కన్యాశుల్కములోని హాస్యమంతా గిరీశం స్వకపోల కల్పితాలమీదే ఆధారపడి వుంది. అంతగా గడ్డుపరిస్థితి వస్తే తప్పించుకుంటానికి ఏదో మిష వుండనే వుంది. ఆ మిషలతోనే అందరినీ నమ్మిస్తాడు. సౌజన్యారావు గారితో తన దౌర్బల్యాలన్నీ బాల్య చాపల్యాలని పశ్చాత్తాపం ప్రకటిస్తాడు. లేకపోతే చివరకు 'దాసోహం.' కాని అంతలోనూ గిరీశం గిరీశమే. మధురవాణి మారువేషంలో సౌజన్యారావు గారి దగరకు వచ్చి మాటల సందర్భంలో ఒక్కొక్కరు మంచివారి దగ్గరకూడా అబద్ధమే చెప్తూవుంటారని గిరీశాన్ని సంకేతంగా అంటే ఆట్టి మనిషిమీద కనికరం చూపాలని దంభనగా దయాభిక్ష యాచిస్తాడు.

గిరీశం మాటలలో హాస్యపోషణకు కావలసిన హంగులన్నీ వున్నాయి. నవ్వించటానికి గిరీశం ప్రయోగించిన ట్రిక్కులు చాలా వున్నాయి—గిరీశంగారి గౌరవబిరుదులు, స్వనామాంకిత ప్రవచనాలు, కోతలు, గొప్పవారిపేర్లు ప్రమాణాలుగా చూపటం. మిథ్యమిథ్య సమర్థించుకుంటానికి సంస్కృతి, ఆంధ్ర, ఆంగ్ల ప్రమాణవాక్యాలు, అబద్ధాలు, ఆత్మప్రశంస, నీతులు, వుపదేశాలు, అనుభవాలను పురస్కరించుకొని మానవప్రకృతిని గురించిన విపరీత వ్యాఖ్యానాలు, వాక్చాతుర్యం, మాట దాటించటం, మాట మార్చటం, లెక్చరు, సమయానుకూలంగా మాట్లాడి ప్రమాదాలు తప్పించుకునే Politician వాగ్జాలం, కుతర్కాలు, వ్యంగ్యం, దబాయింపు, పెద్ద కబుర్లు, లాభనష్టాలబేరీజు కొత్త అర్థాలు—వ్యాఖ్యానాలు. వాటితో మాట్లాడటమే ఒక ఎడ్యుకేషను అని ఆత్మప్రశంస, పూనాలో ఒక్క బిగువున మూడు గంటలు మాట్లాడి ప్రొఫెసరును డంగుచేశానని అతికటులు కోస్తాడు. అబద్ధమాడి, జందెంమీద ఒట్టేసి పని జరుపుకొని ఆ అనుభవాన్ని పురస్కరించుకొని ఒకరిమార్కు - "థియాసాఫిస్టులు చెప్పినట్లు మన ఒట్టు కట్టమున్న అన్నింటికీ ఏదో ఒక ప్రయోజనం ఆలోచించే మనవాళ్ళు యేర్పరిచారు. ఆత్మానుభవం అయితేనేగాని తత్వం బోధపడదు." గిరీశం లెక్చరు వింటే దేవుడుకూడా హడలిపోవలసిందే. గిరీశానికి పాపపుణ్యాలంటూ లేవు. మనస్సు యిండిపెండెంటుగా చేస్తే గిరీశంగారి యిష్టం, దేవుడికి ఏమీ ప్రమేయం లేదు. డిపెండెంటుగా చేస్తే ఆ బాధ్యతంతా దేవుడిదే. గిరీశం వెంకటేశానికి 'పాతయముడివా కొత్తయముడివా' అని అడిగిన పెద్ద మనిషికంటే ఒక ఆకు ఎక్కువగా చదువుకున్నాడు. హాస్యానికి మూలం వైరుధ్యాలు. ప్రపంచ ధర్మానికీ, గిరీశం ధోరణికీ వున్న విరోధం వల్ల నవ్వువస్తోంది. మాటలు పరిస్థితులకు అనుగుణంగా సామాన్య మానవులు మాట్లాడేటట్లుగా లేవు. గిరీశం ప్రకృతికి సామాన్య మానవ ప్రకృతికి ఎక్కడా సాపత్యం లేదు. అసంభవ మనిపించేటంతటి అన్యూనతవ్యక్తి. మరొకరైతే నిస్సందేహముగా అస్వాభావికమనే ప్రవర్తన.

పార్వతీశంలా మొదట నవ్వేసినా 'పాపం అమాయకుడని' జాలిపడకుండటంగాదు. గిరీశాన్ని చూచి నవ్వే సాహసం మనలో లేదు. ఆ గడుగ్గాయి చేతిలో ఆంధ్రులు పూర్తిగా ఓడిపోయారు. స్వయంగా గురజాడవారే నీ మాసాన్న హామ్మని వదిలేస్తే ఇంక ఇతరులు చేసేది ఏమి లేదు.

# బ్రతుకు బరువు

శ్రీ కాసారం కుప్పస్వామి

పది సంవత్సరాల క్రితం ఉద్యోగాన్నించి విరమించుకునే సమయంలో కుట్టించుకున్న కోటు తొందర తొందరగా తొడుక్కుంటూ జేబులు తడుముకున్నాడు రామయ్య పంతులు. ఒక జేబులోనుంచి చేయి అవతలకువెళ్ళి వెకిలిగా వెక్కిరించింది. మరొక జేబులోని చిరిగిన పేలిక పంక్తికిలించి నవ్వింది. జేబులన్నిటినీ గజిబిజిగా వెతుక్కుంటున్న రామయ్య పంతుల్ని చూసి ఊడినకుట్లు, చిరిగిన బొత్తాములు, పాలిపోయికూడా పాతబంధాన్ని పుటుక్కున తెంచుకోలేని గుండీలు పరిదీనంగా ముఖకవళికలు పెట్టినవి. జేబులు తడుముకుంటూనే 'దివా! ఒరే దివిగా! అని యిల్లు దద్దరిల్లేటట్లు కేకలు వేశాడు పంతులు.

బిక్కుబిక్కుమంటున్న గుండెలను సరిదిద్దుకుంటున్నట్లు, చొక్కా గుండీలను త్రిప్పుకుంటూ ఎనిమిదేండ్ల బాలుడొకడు నక్కినక్కి వచ్చి గోడకానుకొని నిల్చున్నాడు.

"ఒరే! జేబులోని పావలా ఏదిరా?' గద్దించాడు పంతులు.

గుండెలు తడబడగా పై ప్రాణం పైనేపోయినట్లు భయంతో గజగజలాడిపోయాడు దివాకర్. నోటినుంచి మాటరావటం లేదు.

'ఎన్నిరా అడిగేది? గుడ్లప్పజెప్పి చూస్తావేం? కోపంతో పంతులు పెదవులు వణికిపోతున్నాయి. గద్దిస్తూ బాలుని సమీపించాడు.

'తీశాను నాన్నా తీశాను. మాటలు వాటంతటవి వచ్చాయి. తిరుగుతున్న గ్రామఫోనుమధ్య ఉన్నట్టుండి సూదినానిస్తే వచ్చినట్లున్నాయా మాటలు.

'ఏం జేశావు?' గర్జించాడు పంతులు.

"మరే...మరే...పక్కింటి అవ్వ జ్వరంతో వుంటే...తీసుకెళ్ళి కాఫీ కాచిచ్చాను నాన్నా! అన్నమే లేదంది అవ్వ అందుకని...భయంతో తడబడుతూ చెప్పుకపోతున్నాడు దివాకర్.

షెడీ షెడీమని చెంపలువాగిపోయాయి. "ఎందుకని కాఫీ కాచిచ్చావురా భడవా? ఇంట్లో పెద్దల నడక్కుండా చేస్తావా అపని?" చెంపలు కందిపోయాయి. పిచ్చివానిలా దివాకర్ని బాదేస్తున్నాడు పంతులు. గగ్గోలుగా ఏడుస్తూ అటూ యిటూ పరుగెత్తాడు దివాకర్. 'అమ్మా!' అని పొలికేకలు వేస్తూ తలుపుదగ్గరకు వెళ్ళి తలుపు తగిలి బోరగిలపడ్డాడు.

'నా నాయనా' అంటూ పరుగెత్తివచ్చి దివాకర్ను ఒడిలోనికి తీసుకొని గుండెలకు హత్తుకొంది ఆదిలక్ష్మమ్మ. కోప శోకాలు ఆమె హృదయాన్ని మార్చివేయగా "ఏమిటండీ మీరు? బాగా కొట్టారు గాని" అంది.

'వాణ్ణి కొట్టడమేనా? చంపేయాలి. జేబులోని చక్కెర పాట్లంతీసి ప్రక్కింటవ్వకిస్తాడా? ఇప్పుడిన స్పెక్టరుగారికి ఏం బెట్టి కాఫీ కాచిచ్చేది? ఈ దొంగబుద్ధులు ఎవరు నేర్పారు వీడికి? భృకుటీ తటముల దుర ప్రస్తారుయుతూ చేయి పైకెత్తాడు పంతులు.

ఆదిలక్ష్మమ్మ ప్రక్కకు తప్పుకొని 'అవునా దివా?' అని గదిమింది. దివాకర్ యింకా భయభీతుడై ఔనన్నట్లు తలవూపాడు. 'ఎందుకు తీశావు? అలా తీయవచ్చా?' కసురుకుంటూ దివాకర్ను చంకనుండి క్రిందకు దించేసింది ఆదిలక్ష్మమ్మ.

క్షమాపణ కంఠస్వరంలో ధ్వనింపగా 'అమ్మా! తప్పు చేశానే. ఇంట్లోనే కదా కదా అని తీశానే! ఇంక నేనెప్పుడూ చేయనే. ఇంక చేస్తే నన్ను చంపేయండే...వెక్కి వెక్కి ఏడుస్తూ గబ గబా గుంజిళ్ళు తీస్తున్నాడు దివాకర్.

తల్లికి కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగినవి. ఆదిలక్ష్మమ్మ ఉద్వేగంగా దివాకర్ను ఎత్తిగుండెలకు హత్తుకొన్నది.

రామయ్య పంతులు దివాకర్ను అందుకుంటూ గద్గదకంఠంతో 'అలా చేయవచ్చా మరి?' అన్నాడు.

'అన్న బువ్వతిని నాల్గురోజు లైందట. ఆకలిగా వుందంటే కాఫీ కాచిచ్చాను నాన్నా!' ఏడ్పు నదుముకుంటూ దివాకర్ అంటున్నాడు.

'మంచిదే నాయనా! దొంగతనం చేసావచ్చా?'

'ఇది దొంగతనమా?' ఆశ్చర్యముగా అడిగాడు దివాకర్.

'కాదా మరి? అడక్కుండా చాటుగా తీయడము దొంగతనం కాదా?'

'దొంగతనమని తెలియదు నాన్నా. ఇక తీస్తే నరికేయండి నాన్నా!'

చంకలోనుంచి దిగజారుతున్నాడు దివాకర్. పంతులు దివాకర్‌ను వక్షస్థలానికి గట్టిగా అదుముకున్నాడు. అతని కళ్లలోనుంచి అశ్రుబిందువులు జారినవి. పంతులుగారి అర్ధనిమీలిత నేత్రాలు చూసి ఆదిలక్ష్మమ్మ కన్నులరమోడ్చి నమస్కరించుకొంది. దివాకర్‌ను మెల్లగా తన చేతులలోనికి తీసుకొంది.

ఐదారుమంది పిల్లలు 'నాన్నా! నాన్నా! ఇనస్పెక్టరు వచ్చేశారు నాన్నా. రా నాన్నా వెళ్దాము' అంటూ ఏకకంఠంగా అరుస్తూ వచ్చారు.

'వచ్చేశారా! వస్తున్నాను. మీరు పదండి' అని కోటు సర్దుకుంటూ 'లక్ష్మీ రెండణాలుంటే యివ్వవే. పాలయినా యివ్వకుంటే ఏం బాగుంటుంది నాకు ఎగ్జంప్షన్ అయినా యిస్తాడా?' ప్రాధేయపడ్డాడు రామయ్య పంతులు.

'లేదండి.' ఆ శోకస్వరంలో జాలికూడా పాలు తీసుకున్నది.

దీర్ఘంగా నిట్టూర్చి ముందుకు నడిచాడు రామయ్య పంతులు.

'నమస్కారమండీ పంతులుగారూ!' సుపరిచిత కంఠం పలుకరించటంతో చుట్టూ కలయజూశాడు. విలువగల సూటుబూటులు ధరించి ఠీవిగా నిలుచున్న నల్లకళ్లద్దాల మనిషి కనిపించాడు. ఎవరైందీ తెలియక తికమక పడుతున్నాడు—'ఆ యినస్పెక్టరు మారిపోయి యీ క్రొత్తాయన వచ్చాడా?... నాకు నమస్కార మంటాడేం?'...

ఏమిటండోయ్? గుర్తించలేనట్లున్నారు. నేను రంగనాథాన్ని గదూ! అప్పుడే మరిచిపోయారా?' అంటూ కళ్ళద్దాలు చేతికితీసుకున్నాడా నూతనవ్యక్తి.

'ఓఁ! నీవా రంగనాథం? ఎన్నాళ్ళకు? ఎన్నాళ్ళకు...? ఇపు డెక్కడున్నావు? ఇటెక్కడికి వెళుతున్నావు? మాకు క్రొత్త యినస్పెక్టరేమైనా వచ్చాడేమోనని బెదరిపోయానుగదయ్యా!...

'ఓహో! అదా సంగతి? ఈదినం మీ యినస్పెక్టరుగారు రారయ్యా! బస్సులో తారసిల్లారాయన. మాటామాటామీద ఆయనగారు యినస్పెక్టరని యీవూర్లో మీరు పనిచేస్తున్నారని తెలుసుకున్నాను. నేను యిటు కడప వెళేవాడిని ప్రయాణం ఆపుచేసుకుని మిమ్ముచూచిపోదామని దిగానయ్యా. ఏం? అలావున్నావే? యిన్ని దినాలయ్యాక నీదర్శనం? మనం ట్రయినింగ్ స్కూల్లో గడిపిన జీవితాలు మరిచిపోయారేమిటి...?" రంగనాథం హాస్యధోరణిలో మాటాడుకుంటూ పోతున్నాడు.

ఆఁ ఆఁ! ఎలా మరవగలం రంగనాథం...? అంతా క్షేమమేనా? మనిషే మారిపోయావే!' పంతులుగారి మాటలు తడబాటులో ఆశ్చర్యాన్ని వ్యక్తంచేస్తున్నవి. ఆశ్చర్యానికి మరుగున ఏదో భయం అస్పష్టంగా వుంది 'స్కూల్లో పిల్లలరుస్తూ ఉంటారు. అక్కడికెళ్దాం పదండి రంగనాథం...'

ఫకఫకా నవ్వేశాడు రంగనాథం. 'స్కూలేమిటయ్యా? లీవు చెప్పేశాను. నేను పోగానే నన్ను ఇనస్పెక్టరనుకున్నారు పిల్లలు. నాకు కావలసిన మీయింటి అడ్రసు కనుక్కొని యినస్పెక్టరు హోదాలో నే స్కూలుకీదినం లీవు చెప్పేశాను. నీ పెద్దకుమారుడు కాబోలు, స్కూలు మూసేసివస్తున్నాడు. పదవయ్యా యింటికి" దడదడా మెయిలులా చెప్పుకపోతున్నాడు రంగనాథం.

గుడ్లప్పగించి నోరు తెరిచేసుకుని ఆశ్చర్యంగా రంగనాథాన్ని చూస్తున్నాడు రామయ్యపంతులు. ఇంతలో బీగాలగుత్తి ఆడించుకుంటూ ఒకడు పరుగెత్తుకుంటు వచ్చి 'వీరేనా నాన్నా! మేం యినస్పెకరంది' అన్నాడు.

'సరే బాగుంది. వీరి సూట్‌కేసు తీసుకుని యింటికి నడు' అన్నాడు రామయ్యపంతులు.

'ఏం రామయ్యా! ఎలావుంది బ్రతుకు? ట్రయినింగ్‌లో అందరినీ సవాలుచేస్తుంటివే. మేమంతా పిసినార్లమని? నీవేమో మహాధర్మాత్ముడవైనట్లు!...

అనాడు మా యింటికి వచ్చావుగదూ! ఎన్ని ఏండ్లయిందయ్యా!...గతంలో సంచరిస్తూ రంగనాథం, ఆనాడు విందుచేయగా రామయ్య తప్పులుపట్టిన ఒక ఘట్టాన్ని జ్ఞాపకం చేశాడు.

పంతులుగారు ఇక్కడ వినడం లేదు. మధ్యమధ్య అసందర్భంగా వూకొడుతూ ఒకటి రెండు మాటలు మాటాడుతున్నాడేగాని, అతని మనస్సు ఎక్కడో సంచరిస్తున్నది. జరుగబోయేదాన్ని ఆలోచిస్తున్నది

ఇల్లు సమీపించింది. ఇంటిలో సూటుకేసు పెట్టించి ఒక నులకమంచం వేసి రంగనాథాన్ని కూచోమన్నాడు. రంగనాథం ఏమిటేమిటో మాట్లాడుతూ కోటు తగిలించేందుకు కొక్కెము, కూర్చునేందుకు కుర్చీ యిత్యాదులకోసం అడిగి తెలుసుకుంటున్నాడు. పెద్దపిల్లవాడు చెంబుతో నీళ్ళిచ్చి కాళ్ళు కడుక్కోమన్నాడు.

'కడుక్కున్నంతపుణ్యం. కాఫీనీళ్ళు ముందు పట్టుకరావోయి!' నవ్వుతూనే రంగనాథం అనేస్తున్నాడు.

"కడుక్కోండి రంగనాథంగారూ! తర్వాత నేను చూస్తాను. మీరిక్కడ కూర్చోండి" అంటూ వంటయింటిలోనికి నడిచాడు రామయ్యపంతులు.

'ఎవరండీ ఆయన! రావడంతోటే కాఫీ అని కలవరిస్తున్నారు.' ఆదిలక్ష్మమ్మ చిరునవ్వుతో అడిగింది.

'ఆయనా? నా చిన్ననాటి స్నేహితుడు-రంగనాథం. ఇద్దరం కలిసి ట్రయినింగ్ చదివాము. ఇంట్లో కాఫీపొడి లేదుకదూ! పాలుకూడా లేవాయె. ప్రక్కింటి మంగమ్మనడిగైనా తవ్వెడుపాలు తీసుకరావే." తొందర తొందరగా రామయ్యపంతులు మాట్లాడుతున్నాడు.

"ఏమిటండీ! ఆయన యీపూట కిక్కడే మకాం వేస్తారా ఏమిటి?" కొంపమునిగిపోతున్నట్లు ప్రశ్నించింది ఆదిలక్ష్మమ్మ.

'అవునే. ఈ పూటకు బియ్యమున్నాయా లేవా?' తటపటాయిస్తూ అడిగేశాడు పంతులు.

లేవని ఆదిలక్ష్మమ్మకు బాగా తెలుసు. కానీ ఆ మాట వెంటనే చెప్పివేయలేదు. పతి చూస్తూండగా ఓ మారు ఘంసెలుదించి 'లేవు గదండీ ఇంట్లో అన్నీ అలానే వున్నాయి. అయితే ఆయన తప్పకుండా వుంటాడంటారా?' అమాయకంగా అడిగింది.

'ఉంటాడే లక్ష్మీ సరిచేయగలవులే!' దీనత్వం గుండెలు కరుగదీస్తున్న స్వరంలో అన్నాడు. జవాబును నిరీక్షించకుండానే 'నేనూ అలా బజారుకు వెళ్ళివస్తా'నంటూ పెరటి దారిన వీధిలోనికి గబగబా నడిచాడు పంతులు.

## 2

కాలచక్రం నిర్విరామంగా పరిభ్రమిస్తూనే వుంటుంది. ఇరుసున కందెన పెట్టక పరమేశ్వరు బండి అయినా నడవదన్నారు. కానీ యీ కాలచక్రానికి కందెన వేసేదెవరో? నడిపే దెవరో? దానికి అలుపూ సొలుపూ వుందో లేదో? ఎందుకలా నడుపుక పోతున్నారో?...ఈ వివరాల భోగట్టా యింతవర కెవ్వరూ తెలుసుకోలేదు. కానీ ఒక్కొక్కరు ఒక్కొక అభిప్రాయాన్ని పారేస్తూ వస్తున్నారు. ముదిరి పండిపోయిన వేదాంతులు ఇదంతా దేవుని కొక లీల అంటూ గొడ్డుపై చక్రం దొర్లవేసుకపోయే పిల్లవానికి పోల్చేసి, ఆ నగ్న సత్యాన్ని తామే గుర్తింప గలుగుతున్నట్టు ఆ గగన పథాలలో అయోమయ దృష్టులు పారిస్తారు. అదంతా వారికే ఎరుక.

అయినా...ఈ కాలచక్రమొక్కటే తిరిగిపోతుంటే దాని ప్రమేయం మానవునికేమాత్రమూ లేకపోయేది. తనతో కోటానకోట జీవిత వలయాల లాక్కుంటూ, కాల్చివేస్తూ పోతున్నది. కాలచక్రం ఒక పెద్ద ముళ్ళచక్రం గాబోలు! దానికి మానవజీవిత వలయాలు గడియారంలోలాగా తగుల్కొన్న చిన్న చిన్న చక్రాలేమో! ఆ పెద్దచక్రం ఒక చుట్టు చుట్టేసరికి చిన్నవి ఎన్నో చుట్లు చుట్టేసి మసిబట్టి శక్తిహీనములై రాలిపోతున్నవి కామోసు! అంతే అయి వుంటుంది. ఒక్క దినంలో ఎన్ని ప్రాణాలు చావడం లేదు? ఎన్ని ప్రాణులు పుట్టడం లేదు? ఈ కాలచక్ర పరిభ్రమణ పరిధిలో ఎన్నో ఉత్తుంగోత్తుంగ పర్వతాలు, అట్టడుగు మట్టుకునే అగాధమయిన లోయలు, ఆకాశం తలనద్దుకునే అపార జలనిధులు, అంతూ పొంతూ లేకుండా వ్యాపించి అగ్నికణసందోహంలాగా మండిపోయే ఎండుటిసుక ఎడారులు...ఎన్నో అడ్డు వస్తున్నవి. వీటికి తట్టుకోలేక దాట శక్తిచాలక యెన్నో జీవితవలయములు ఆగిపోతున్నవి. కానీ కాలచక్ర వేగం

అవగింజంత తరుగదు. ఆ తరుగుబరుగులను, ఆ గమన వేగదూరాలను కొలిచే కొలతబద్దలు ఎక్కడా లేవు. ఉత్త్రిమాత్రను మనుకుంటున్న మానవజీవితగమనం యే మిల్లీమీటరులోనో సహస్రాంశమౌతుంది—ఆ కాల దూరాన్ని కొలవాలనుకున్నప్పుడు!

పంతులుగారు ఆలోచిస్తున్నారు. 'డెబ్బది సంవత్సరాలు బ్రతికాను. నా బ్రతుకంతా యేమిటి? సత్యంతో చేసిన సాహసేగదా!' అంటాడు మహాత్ముడు. 'నా జీవితమంతా యేమిటి? దారిద్ర్యదేవతా సంఘర్షణే కదా!' అనుకున్నాడు రామయ్యపంతులు.

దూరంలో సుడిగాలి రేగింది. శుష్కపత్రాలు, దుమ్ము, ధూళి ఒకసారి ఆకాశాన్ని అందుకోవాలని ఒక్కుమ్మడిగా ప్రయత్నం చేస్తున్నవి. తిని పారవేసిన పులివిస్తరాకుల వీరవిహారం ఆ గాలిలో గుర్తింపదగిన విషయం. తాళవృక్షసదృశంగా ఏర్పడిన ఆ యిసుక స్తంభం అల్లీబిల్లీ తిరుగుతూ పంతులు సమీపానికి వచ్చి అదృశ్యమయింది. సుడిగాలేమిటి? అత్యుష్ణతవల్ల ఒకొక్కచోట భూమి వేడెక్కి వాయురహితమై పోతుంది. ఆ ఖాళీప్రదేశాన్ని ఆక్రమించుకునేందుకు చుట్టూరా వున్న గాలి సహస్రాధికయోజనవేగంతో ప్రసరించి ఆ ప్రదేశంలో సుళ్ళుదిరిగిపోతుంది. అదే సుడిగాలి అలా అయితే మానవజీవితాలు ఒకప్పుడు సుడిగాలులౌతాయి. ఆశాజ్యోతులు ఆరిపోగా నిరాధారమైన మానసపథంలో అంధకారప్రభంజనాలు అతివేగంగా ప్రసరిస్తాయి ఆ తీవ్రవేగంలో సుడిగాలి లీలగా సుళ్ళు తిరిగిపోతుంది. సుఖదుఃఖానుభవాలు, అనుభూతులు శుష్కపత్రాల్లా విహరిస్తాయి. ఏమీ చేయలేని మానవుడు సుడిగాలిలా ఆకాశాన్నందుకోవాలని తన్నుతాను గతస్మృతులలో కోల్పోతాడు. సుడిగాలిలోని పచ్చనిఆకులను నగ్నశరీరంతో వెళ్ళి చించితే నెత్తురు కారుతుందట. హృదయాంతరాంత విషాదాంత ఘట్టాలను కెలికి వెలికితెచ్చి చించిచూస్తే నెత్తురు కారడమేగాదు. హృదయం బ్రద్దలై లావాలు ప్రవహిస్తాయి. వాటి వేడిమిని, తన్నిహిత ప్రభంజనశక్తిని ఎవరంచనా వేశారు?

“ఇరవై సంవత్సరాలు అస్పష్టంగా గడిచాయి. ఇరువదియైదులో కాబోలు ట్రయినింగ్ వెళ్ళాను. అది ఒకకలగా గడిచింది. ఏమోచేస్తూ ఏమోచేయాలని ఏవేవో ఆలోచనలు మానసాన్ని పీల్చి పిప్పిచేసేవి. నీటిలో తారాడే చేపకు పోచికమల్లే మిత్రులు తారసిల్లారు. అది నాజీవితానికి స్వర్ణయుగమేమో! ఆ సమయంలోకూడా మానసపథంలోనించి హృదయ సామ్రాజ్యంపై అనేక దండయాత్రలు జరిగినవి. కానీ పదిమందిలో కలిసి తిరగడం, పట్టినదల్లా బంగారం కావడం నిరాటంకంగా సాగింది ఆ ట్రయినింగ్ స్కూల్లో. రాజ్యంలేని రాజునయ్యాను. రాణీస్థానం ఖాళీగానే వుండిపోయింది ఎందుకో ఆశించా రాస్థానాన్ని. అప్పుడేకదూ యీ రంగనాథం స్నేహము నన్ను సుప్తద్రకవరిగా చూచేవాడు. నామట్టుకు నేను పిల్లజమీందారు ననుకునేవాడను. నాచుట్టూ పదిమంది కలిసుదిరిగేవారు. గ్రీకుహీరోలా పోజుపెట్టి నిలిచేవాడను. సమాజం చక్కబాట్లనుగూర్చి ఏదేదో వాగేవాడను. ఏదో అందుకోవాలని అందుకుంటున్నానని ఆరాటాలుండేవి. ఈతడేం రాజారాం మోహనరాయల ద్వితీయావతారమా? అని కొందరూ, నా సైకువని కొందరూ, పిల్లవెధవాయని కొందరు నన్నుగురించి అనుకునేవారట. పిల్లవెధవన్న వారివళ్ళు నుగ్గునూచం చేయాలన్నంతకోపం వచ్చేది. కొందరికి చేశాను కూడా. ప్రధానోపాధ్యాయుల కెదురుగా ఉపన్యాసమిచ్చానని, ఆ ఉపన్యాసం వ్యంగ్యాత్మకంగా సాగిందని నన్నాక్షేపించారు సభ్యులు. అప్పుడు రంగనాథం కూడా ప్రతిపక్షి. ఆ వేళంలో అందరినీ తిట్టిపోశాను. ముక్కలు విరుగుతాయన్నాను. తర్వాతే కదూ యీ రంగనాథం పిల్లిలాగా నా ప్రక్క చేరింది! అదంతా అమ్మానాన్నల చలువ. ఒక్క చిక్కూ వుండేదిగాదు. డబ్బు నీళ్ళలా ఖర్చు చేసేవాడిని. ఆ కాలం వెళ్ళింది. ఇలాగనుకొని తల్లిదండ్రులను తలచుకొని కన్నులర మోడ్చాడు రామయ్య పంతులు.

“ఎంత వుబలాటపడ్డారు నా పెండ్లి గురించి! వారిముందరే నాపెండ్లి జరగాలట. వృద్ధాప్యంలో చివరికోరికట. అప్పుడే ఏమిటని తెమ్మన్నాను. ససేమిరా అంది అమ్మ. అటుకాదురా అన్నాడు నాన్న. జరిగిపోయింది పెండ్లి. ఆదిలక్ష్మి నా గృహలక్ష్మి అయ్యింది. అంటే యిప్పటికి నలభై సంవత్సరాల క్రిందటి మాట. వివాహం జరిగిన మూడురోజులు జ్ఞాపకమున్నాయి. అంతే. విడదీయరానంత చిక్కగా జీవితఘట్టాలు సుళ్ళుదిరిగి ముడులు పడిపోయాయి. ఏమీ గుర్తు లేదు. ఏవో రెండు...మూడు స్పష్టంగా

గుర్తున్నవి. అమ్మా నాన్నలు చనిపోయారు. ఆదిలక్ష్మి మగ పిల్లవాణ్ణి కనింది. పుట్టిన గ్రామములోని ఇల్లూ భూమి వేలమైపోయింది. రెండు మూడుమార్లు ఆత్మహత్యకు ప్రయత్నించాను. ఆత్మహత్య పాపమని నన్నెవరో ఆపారు. ఎవరాపిందీ గుర్తులేదు. ఇంకేమున్నాయి? ఆరు ఉద్యోగాలు చేస్తూ వూరులు తిరిగాను. బోర్డుస్కూళ్ళు, పంచాయతీ స్కూళ్ళు, మేనేజ్‌మెంటు స్కూళ్ళు అన్నీ చూశాను. ఎన్ని వూళ్ళు తిరిగానో గుర్తులేదు. ఏయే వూళ్ళో ఏయే బిడ్డను కనిందో లక్ష్మికి బాగా తెలుసు. లక్ష్మినడిగితే ఆ వూళ్ళ వివరం బాగా చెప్తుంది." నవ్వుకున్నారు రామశాస్త్రి పంతులు. ఆలోచనల్లో గంటలకొలది తోమబడే ఆ పలువరస వేసవిలో మండిపోయిన ఆకాశములో సద్దులేకుండా మెరిసే మెరుపులా కనిపించి మాయమయ్యింది. జీవితమంతా నిర్జీవంగా గడిచింది. పూలరాలిపోయే ముషిణికాయలా జీవితం గడచిపోయింది. ఈ కాయను ఎవరు గుర్తించలేరు. ఈ జీవితంలో సాధించిన సన్మానాలేమున్నాయి? బాహ్య జగత్తులో శరీరానికి జరిగే సన్మానాలను ఘోర తిమిరావృత జీవితాన్ని మోసుకవస్తున్న మనస్సు ఎలా గుర్తించగలుగుతుంది? అందుకనే జ్ఞాపకంలేదు. కందిగుంటలో కాబోలు పూలమాలవేశారు. పోయినది పోగా నాచే పునరార్జితమైన యావదాస్తిని గంజికేంద్రానికి వినియోగించానని నా త్యాగానికి ఒక్క పూలమాల విలువ కట్టారు. నిట్టూర్పు నవ్వుకున్నాడు రామశాస్త్రిపంతులు.

జీర్ణజీవితంలాగానే జేసెకు కొంప వాసయోగ్యమయ్యేది. ఉద్యోగం నెలగబెట్టిన ఏ వూరిలోనూ అంతకు మించిన కొంప బాడుగకూడా దొరికేది గాదు. ఆ కొంపలను కూడా పొగడినవారు లేకపోలేదు. చూడ సహ్యమయ్యే ఆడపిల్లలెందుకు వారలా పొగిడేవారో వివాహయోగ్యులయిన కుమార్తెలను జూచి తర్వాత వూహించుకున్నాను. కట్నాల శాశించి నేనిచ్చే కన్యాదానముల స్వీకరించారుకారు. లీల, జానకి, సరోజలను పెండ్లిచేయాలి పెద్దవాడు కూడా వివాహవయస్కుడే. పేరున వానికేం పెండ్లి?... చదివివెలగబెట్టాడా? సంపాదించి దిగదుడిచాడా? ఆదిలక్ష్మి మంచిచీర ఎన్నడయినా కట్టిందా? పాపం అభాగ్యరాలు నాకు భాగ్యయింది... నేనీ కోటుమార్చి ఎంతకాలమయింది? అందరూ బాకీలాంటికోట్లు రెండు మూడున్నాయనుకుంటారు. ఆదిలక్ష్మి కూడా చెప్పేదట. 'వారికట్టికోట్లంటేనే యిష్టము. వేరేగంపులో కట్టించుకోరు' అని పిచ్చిది. స్వాభిమానం అబద్ధాలు కూడా చెప్పిస్తుంది... ఒక్కొక్క కుచేలునికి సంతానమెందుకిస్తాడో మరి భగవానుడు? ఈ నాలురక్కల సంపాదనతో ఆపదిమందినీ పోషించాలి... దివాకరను అన్యాయంగా బాదేశాను. దారిద్ర్యంపై కోపము, యింకా వాళ్ళు డబ్బులు సంపాదించి కష్టాల్లోంచి గట్టెక్కలేని నా అసమర్థతకు నాపైన నాకేవున్న కోపము మితిమీరి వాడిపైన చూపించానే గాని, వాడేం తప్పుచేశాడు? ఇంత కర్తవ్యతా విమూఢుడనై వాణ్ణి అలా చెంపలు వాయించేశాను. పాపిని. వాడే నాకులజ్యోతి... పంతులుగారి కళ్ళల్లో నీళ్ళు గిఱ్ఱున తిరిగాయి.

ఛీ! యిదంతా ఎందుకాలోచిస్తున్నాను. నా జీవితగ్రంథంలోని పుటలు ఎందుకిలా తిరగబడ్డాయి? ఓం. రంగనాథం వచ్చాడుగదూ? నా జీవిత సింహావలోకనానికి కారణం అతడా? మానవప్రకృతి చాలా చిత్రమయింది. గత్యంతరం తెలియనప్పుడు గతించిన విషయాలు జ్ఞాపకం చేసుకుంటుంది. తిరుమల కొండనెక్కేవారు 'అలిపిరిమెట్టు ఎక్కేశాము. మోకాళ్ళ ముడుపు దాటేశాము ఇంకెంత దూరం? ఈ చదరం దాటితే దీనజనబాంధవుడు వెంకటేశ్వరుడు కనిపిస్తాడు.' అని అనుకుంటారు. నిజానికి యిప్పటికి దాటింది చాలా సులభమయిందగను, ఇక దాటవలసిన దూరం చాలా కష్టమయిందిగను వుంటుంది. కానీ వారలాగే అనుకుంటారు. వారం రోజులుగా సహారా ఎడారిలో నడిచేవాడు నీడకానక యింకెంత దూరం నడచినా నీడ కనిపించదు. దాటివచ్చిన ఆ యిసుక తిన్నె నీడ క్రిందయినా కూచున్నాంగాదు. అక్కడే కూచునేందుకయినా వీలుండినది. ఈ మిట్ట మధ్యాహ్నపు యెండలో ఆ మాత్రం నీడకూడా యికముందు కనిపించదేమో! అంటూ గడచిపోయిన వాటిని గురించి ఆలోచిస్తాడు. నైరాశ్యంలో నడచివచ్చేవారు మున్ముందుకు ఆలోచించి ఎండిపోయిన ఖర్జూరపు చెట్టయినా కనిపించవచ్చు. వాటి నీడలో కొద్దిగానయినా ఆశ్రయం దొరుకవచ్చు అని వూహించనయినా వూహించరు. సరికదా తిరిగి వెనుకకు పయనించడమే మంచిదని ఆలోచిస్తారు. చిత్రమయింది మానవప్రకృతి!...

పంతులుగారు తన వునికిని గుర్తించుకున్నారు. సాక్షి బొల్లి మ్యుల్ శ్రేష్ఠి దుకాణం ఎదురుగా కనిపించింది. బజారువీధంతా నడిచి సన్నిధివీధి మలుపు ఎప్పుడు తిరిగిందీ గుర్తులేదు. అదే తన కొత్త అంగడి. అంగడిలోనికి ప్రవేశించాడు. కానీ సెట్టిగారు చూచీ చూడనట్లున్నారు. అంగడి రద్దీగా వుంది. సెట్టిగారి నటన గ్రహించినా పంతులుగారు చేయగలిగిందేముంది? అవమానభారంతో అర్థగంట గడిచింది. పంతులుగారే పలుకరించుకున్నారు. 'ఓహో! హో! మీరా! రండి. కూర్చోండి' అంటూ తనపనిలో నిమగ్నులయి పోయినారు సెట్టిగారు. ఎక్కడ కూర్చోవలయునో తావయినా చూపించాడు గాదు. మరలా అర్థగంట గడిచిపోయింది. అంగడిలో రద్దీకూడా తగ్గిపోయింది. కానీ ఏదో పనివున్నట్లుగానే సెట్టిగారు లెక్కలకాగితాలు తిరగవేస్తున్నారు. ప్రాణం చచ్చి నోరు మెదలించి పంతులు సామ్రగియిమ్మని అడిగారు.

'ఓ, అదే చూస్తున్నానండి. ఎనభయిపైదు రూపాయలా డెబ్బది ఎనిమిది నయాపైసాలు బాకీ తేలుతోంది. ఇప్పుడు చెల్లు ఎంతవేసారు.' తన ప్రత్యేక కంఠస్వరంలో భరోసాగా చిరునవ్వుతో సెట్టిగారు అన్నారు.

'అయివుంటుంది లెండి'...

'అయివుంటుం దేమిటండోయ్? లెక్క మీరే చూడండి.' సెట్టిగారు మధ్యలోనే మాటల నందుకున్నారు.

'మాచే దేముందిలెండి. చెల్లు వేసేటప్పుడు చూచుకుందాంగాని యిప్పుడీసామానివ్వండి.' మెల్లగా వినయంగా అన్నాడు.

ఒక్కసారిగా సెట్టిగారు తేలకండ్లు వేసేశారు. 'ఏమిటే!' జీతాలు వచ్చినప్పుడు కూడా యివ్వకుంటే యింకెప్పుడయ్యా మీరిచ్చేది? ఇట్లయితే యీ అంగడి ఏం కావాలనుకున్నారు?...గొంతు తారస్థాయినందుకో జూస్తున్నది.

'ఒక్క నెలజీతమే వచ్చిందండి. ఇంకా నాల్గు నెలల జీతం రావాలి. ప్రస్తుతానికి......

'పోనయ్యా వాలుగాని చెప్పాచ్చావ్ మహా. మేం మీకేమీ ఋణపడలేదుగాని వచ్చేనెలలో లెక్క తెల్చి మరీపని చూడండి? గడియారం 'టంగ్' అని ప్రమోగి పదకొండున్నర గంట చూపించింది. సెట్టిగారు భోజనానికి వెళ్లిపోయారు.

పంతులు అటూ యిటూ చూచి గబగబా మెట్లు దిగి వచ్చేశాడు ఇపుడేం చేయాలి? ఇంకెవరినడగడం? అడిగిఅడిగి వున్న కొస్తా పగవుకూడాపోయింది. ఇచ్చేవాళ్లేమో లేరు. హే భగవాన్, యీ దారిద్ర్యజీవితమెందుకిచ్చావయ్యా? లోకంలో యీ విషమపరిస్థితుల కల్పించడమే నీ సృష్టయితే నీలో మానవత్వంకూడా లేదని యీమానవులు ఎందుకు శంకించకూడదయ్యా? తిండీ బట్టలకోసం, పరువూమర్యాదలకోసం తపించే మానవానీకానికి దిక్కు తెన్నూ లేదు. భోగభాగ్యాలకోసం మానవుడు తోటిమానవుణ్ణి నలగ్రదొక్కేస్తున్నాడు. కడుపుకక్కూర్తికి పైవాని చెప్పుచేతల్లో తనజీవితాన్ని సర్వనాశనం చేసుకుంటున్నారు బీదలు. మానజీవిత పరమార్థమింతేనా?"—తపించుని పంతులుగారిని గ్రుద్దుకున్నాడొకడు. పడబోయి నిల్రదొక్కుకుని పరధ్యానంగా తానే ఎదుటివాణ్ణి గ్రుద్దుకున్నాననుకున్నాడు పంతులు. క్షమాపణ చెప్పబోయే సమయానికి తనజేబులో చేయి మెదలడం గుర్తించి ఆచేయి నదిమిపట్టుకున్నాడు—'ఏరా జేబులు కొట్టాలని చూస్తావ్? సిగ్గులేదూ?'...ఏంటయ్యా ఎదురుగా మనిషుండేది కూడా తెలియదంటే. చేయి విడువు' కసురుకున్నాడు ఎదటివాడు.

వాని మాయోపాయానికి పంతులుకు నవ్వు వచ్చింది. 'బాగుంది నాయనా! నన్నే కసురుకున్నావా? అవన్నీ నాకు తెలిసినవేగాని నీకీ పాడు బుద్ధేమిటిరా? 'పోలీసుల కప్పగిస్తే ఏమవుతావు?" మాటల్లో పంతులు చేయి జారిపోయింది. ఒక్కవుదుటుగా ఆ వ్యక్తి గుంపులో దూరి మాయమయ్యాడు.

'జీవిత సమస్యలు మానవుణ్ణి ఏవిధంగా తయారు చేస్తున్నాయి? పాపం. నా జేబులో చేయి వేశాడు. కోటు చూసి ఏదో విధంగా వూహించి వుంటాడు. కానీ ఈ నాగరిక తాబురఖాల మాటున వుండే నగ్న మానవరూపం ఎలా కనిపిస్తుంది? కడుపుకోసం ఒకడు సూటు బూటులు వేసి పట్టపగలు మోసాలు చేస్తున్నాడు. ఒకడు చాటుమాటుగా జేబులు కొడుతున్నాడు. ఒకడు చింకి పేలికలతో భిక్షాటనం చేస్తున్నాడు. ఒకడు కండలు కరిగించి బండలు పిండిచేసి పిడికెడన్నానికూడా నోచుకోక పస్తులు చస్తున్నాడు. హా తవిధీ! ఇదా ప్రపంచం?......

# బ్రతుకు బరువు

మిత్రులనుకున్న వారి ఇండ్లకంతా పంతులు తిరిగి వట్టిచేతులతో వచ్చేశాడు. రోడ్డులో కనిపించే దృశ్యాలన్నిటికీ నిర్వచనాలిచ్చుకుంటూ మెల్లమెల్లగా ఇంటికొచ్చేశాడు పంతులు. రంగనాథం మంచి నిద్రలో వున్నాడు. వంటింటిలోని ఆదిలక్ష్మమ్మ అలికిడి విని పలకరించింది. ప్రక్కింటావిడ వడిగి కాఫీమాత్రం కాచి యివ్వగలిగిందట. కాఫీ త్రాగిందే తడవుగా గురకనిద్రలో బడిపోయినారట ఆ వచ్చిన అతిథిగారు. కాఫీ కాచి ఇచ్చేటప్పటికే! పంతులుగారు వన్నెక్కడో దిగవిడిచి యెక్కడికి దయచేశారు. స్వామిగా వున్నారే!' అన్న వాక్యాలు నిద్ర వచ్చేంతవరకూ వుచ్చరించుకుంటూ వుండేవట. ప్రస్తుతం ఆతిథ్య సత్కారాలకు యెటయినా పంతులుగారే సరి చేయాలట. పన్నెండుగంటలకు 'సైరన్' అప్పుడే వినిపించిందట...వినడం చాలించి పంతులు మండువాలోవచ్చి కూర్చున్నాడు పిల్లలు నానాఅల్లరి చేస్తున్నారు. తనబుర్రలో సగుసులిడే వేయి గ్రైబంధ కూతల్లాగా కేరింతలు కొడుతున్నారు. ఒక్కసారి కసురుకుందామనుకున్నాడు. 'ఏం? వాళ్ళయినా సంతోషంగా వున్నారు. నీలాగా వుండలేదనేనా వారిపై కోపం. ఇది అసూయేగదూ!' కొరడా పెట్టుల్లాగా ఈ భావం మెదడులో చెళ్ళుమన్నది. తేరుకునేసరికి నాన్నా! 'నాన్నా! కోటు క్రిందపడిపోయిందినాన్నా. సునీతే నాన్నా క్రిందతోసింది' అని దివాకరం చెప్పడం వినిపించింది.

తన ధ్యాసలోనే నిమగ్నమై నోరు కదపకుండా యాంత్రికంగా లేచి యింటోకి వెళ్ళిన పంతులుకు చిందరవందరగా పడిన కాగితములమధ్య 'పర్సు' ఒకటి కనిపించింది. చిలుకకొయ్యనుండి జారిపడిన కోటుజేబులోని కాగితములవి. వాటన్నిటతీసి కోటు జేబులో ఉంచేసి కోటు చిలుకకొయ్యకు తగిలించాడు. తిరిగివచ్చి తిన్నెపై యథారీతి పంతులు కూర్చున్నాడు

'సర్వానర్థాలకు దారితీసేది ధనమే' అని సెలవిచ్చిన పెద్దలు ఆ ధనంలేకుండా ఎలా జీవించ సాధ్యమౌతుంది; అనే విషయం సెలవిచ్చారుకారు. సత్యం న్యాయం, ధర్మం, కర్తవ్యం పరువు. ప్రతిష్ఠ, నీతి, నిజాయితీ, మర్యాద—ఇన్ని అంశులు కల్పించి బ్రతుకమన్నారు. ఆ బ్రతుకునకు ధనం ఏమాత్రం అందుబడిలోనికి రాదన్న విషయం ఆలోచించనే లేదు. ధనవంతుడు తనపై అంశులను ఏమాత్రం లెక్కించడు అట్లు లెక్కిస్తూ కూచుంటే ధనవంతుడే అయివుండడు. ఇక ధనవంతుడుగా వుండజాలడు. కానీ అవన్నీ వాని పాదాక్రాంతమౌతున్నవి సమాజంలో చెలామణీ కాగలుగుతున్నాడు. తేనె పెరచుట్టూ యీగల్లాగా సమాజం వానిచుట్టూ ముసురుకుంటున్నది. ధనవంతులో జీవితంలో అతడీ నియమాలు పాటిస్తున్నాడా? ఇవేమీ పాటించకుండా ఆర్జించిన ఆ ధనమున్నంతకాలము యివన్నీ వానికి లభ్యమై లొంగిపోతున్నవి. ఆ ధనం కాస్త తొలగిపోయినప్పుడు యివి వెళ్ళిపోతున్నాయి. వాటన్నిటి పాటించి చెయిచాపిన వారికి పాటి వన్నుకూడా లభ్యం కావడం లేదు. ఏమిటీ ధనమహిమ?

నామునకు నాకు ఏముంది? మిత్రుణ్ణి గౌరవించేపాటి పరిస్థితులుకూడా లేవు. సమాజంలో చెయిచాపితే చెంపదెబ్బలు లభిస్తాయేగాని చేరెడు బియ్యమన్నా లభించవు. ఎందుకని? పరువు ప్రతిష్ఠలు ఎంతవరకు విడిపించగలవో అంతవరకు విడిపిస్తాయే గాని మానవుని జీవన సమస్యలను ఎక్కడ తీర్చగలుగుతున్నవి? ఏమిటి గౌరవ మర్యాదలు? మర్యాదకోసం క్రుంగిచావడం మర్యాదయా? గౌరవంకోసం కుళ్ళి కృశించిపోవడమే గౌరవమా? మానాభిమానములని మనసును శోధించుకోవడం మంచిదా? ఇంతచేసి కూడా తద్వ్యతిరిక్తంగా అవమానం జరగడంలేదా? అందుకనే రంగనాథాన్నే కొంత డబ్బు అడుగుదాం? ఇవ్వకపోతాడా? అతిథిగా వచ్చిన మిత్రుణ్ణే ధన మడగడమా? ఇంతకన్నా సిగ్గుచేటు విషయం యింకేముందోయ్? తన్నుతానే విమర్శించుకున్నాడు రామయ్యపంతులు

వర్తమాన పరిస్థితుల ననుసరించి మానవుని బుర్రలో నీతులు, శాస్త్రాలు మెదల్తూవుంటాయి. తానెప్పుడో చిన్నప్పుడు చదువుకొన్న నీతిశాస్త్రంలోని శ్లోకం జ్ఞప్తికి వచ్చింది.

"భార్యావియోగశ్చ జనాపవాదః
ఋణస్య శేషః కుజనస్య సేవా
దారిద్ర్యకాలే ప్రియదర్శనంచ,
వినాగ్నినా పంచ దహంతి కాయమ్"

సరిగ్గా చెప్పాడెవడో నీలాంటి దౌర్భాగ్యుడు. అగ్గి లేకుండా యీ అయిదు శరీరాన్నీ తగులబెట్టేస్తాయట.

ఎంతబాగా చెప్పారు. ఇట్టివి సంభవించినా బ్రతికి వుండడం జీవచ్ఛవంగా గాకమరేమిటి? ఎందుకీ బ్రతుకు? ఎక్కడో పడి చావడం మంచిది. రెండు చేతులతో తల గట్టిగా అదిమి పట్టుకున్నా ఇప్పటికి యెందుకూ పనికిరాని ఆలోచనలు సుళ్ళులాగా పుట్టుకొని వస్తూనే వున్నవి.

ఎందుకు నేనిలా కుమిలి చావాలి? నా పరిస్థితుల నెందుకు దాచుకోవాలి? ఆంతమాత్రం సమర్థం చేసుకోలేడా రంగనాథం? ఇందులో తప్పేమిటి?...తప్పు లేదు. కానీ తప్పులేని వాటన్నిటినీ వెల్లడిచేసి ఆదరించగల అవకాశం మనోధైర్యము వుండేవుంటే యీ దశ యీ ప్రపంచంలో ఎందుకుంటుంది? ఈ ధనవంతుల తప్పులను విచారిస్తే వాళ్ళకు మిగిలేదేమిటి? పరువూ ప్రతిష్ఠలూ బుగ్గైపోవూ? వారివద్ద వుండే ఆ ధనంలో చిల్లి పైసాయైనా వారికి మిగులుతుందా?...మరలా ఆ పెడవాదము వస్తూవుందే? అదంతా అనవసరము. రామయ్యపంతులు లేచి యింట్లోకి వెళ్ళినాడు.

రంగనాథం మంచి నిద్రలో వున్నాడు. రెండు మూడుసార్లు పిలిచినా పలుకలేదు. అనవసరంగా నిద్రాభంగం చేయడమెందుకు? ఇప్పుడు నిద్ర లేపడం కూడా మంచిదికాదు. భోజనం తయారయిన తర్వాత లేపడం మంచిది. అయితే డబ్బుమాట? జేబులో కావలసినది తీసుకుందాం. లేచిన తర్వాత చెప్పేద్దాం. లేదా ఎట్లయినా సరిచేసి తిరిగి యిచ్చేదాం. మేము చనువుగా నెట్టప్పుడు ఎన్నిసార్లు ఒకరినొకరు అడుగకనే జేబులోంచి తీసుకోలేదు పంతులు ఆలోచిస్తున్నాడు. తన ఆలోచన తనకు సబబుగానే తోచింది. కానీ ఏదో జంకుగానే వుంది. చిలుకకొయ్యకు తగిలించిన కోటుదగ్గరకు వెళ్ళాడు. బిడియంగానే వుంది. మెల్లగా పర్సు పైకితీశాడు. చిల్లరకనిపించింది. ఇంకొక పొర తెరచాడు. పదిరూపాయల కాగితం కనిపించింది. కొద్దిగా తటపటాయించాడు తొందరతొందరగా ఆ కాగితాన్ని తీసి తన జేబులో ఉంచుకొని పర్సు యథారీతిగా వుంచేశాడు. రామయ్యపంతులు బజారువైపు నడిచాడు.

## 3

'ఏమిటో రామయ్యా? ఇవన్నీ! బోలెడు వంటకాలు చేయించావ్. గారెలు బలేమజాగా వున్నాయే!' రంగనాథం భోజనం చేస్తూ పాకశాస్త్ర పరీక్ష చేస్తున్నాడు

రామయ్యపంతులు తలవూపుతూ వున్నాడేగాని తనలోతాను ఎంతో మధనపడుతూ వున్నాడు. తను పదిరూపాయలు తీసినవిషయం రంగనాథంతో చెప్పాలని అనుకుంటున్నా చెప్పలేకపోతున్నాడు. రెండు మూడుసార్లు నోటివరకు వచ్చిన మాటలు నాలుకపైనే వుండిపోయాయి. ఆ యాతనాస్థితి అట్టి యాతన బడినవారే గుర్తించగలరు. పంతులుగారి బుద్ధి వేరొక్క ఆలోచనలలోనికి దిగింది 'ఎక్కడయినా సరిచేసి తిరిగి యథాప్రకారం ఉంచేయడం చాలా మంచిది. వడ్డీల సేట్ జీ ఎవరికయినా యిస్తాడుకదా! వారానికి రూపాయకు బేడవడ్డీమాత్రం తీసుకుంటాడు. పోతేపోయింది. సమయానికయినా యిస్తున్నాడు గదా! ఇప్పటివరకు అక్కడికి వెళ్ళకుండా ఎట్లో గడుపుకొన్నాము. ఈ దినం అక్కడకూడా చేయి చాపేయబోతున్నాను. ఎటుజరుగవలెనో అటు జరుగుతుంది. అక్కడ తెచ్చి యథాప్రకారంగా ఉంచేదాం ఇంతమాత్రానికే రంగనాథానికి చెప్పకపోతే యేం? రామయ్యపంతులు ఒక నిశ్చయానికి వచ్చేశాడు.

'నలభీమపాకాలంటారే-అది నిజమే నంటావా రామయ్యా? ఆడవాళ్ళచేతి పాకాలు అమృతానికన్నా మిన్న అంటేకూడా అతిశయోక్తి ఏమీ వుండదుగాని...

'అసంబద్ధంగా మాత్రం వుంటుంది.' అంటూ వంటయింట్లో ఆడపిల్లలు నవ్వుకుంటున్నారు. కానీ అవన్నీ రంగనాథానికి వినిపించడంలేదు.

...మగవాళ్ళ చేతిపాకాల నేమిటయ్యా యీ పిచ్చిపురాణాల్లో పొగడడం? ఆహా. నాకు తెలియక అడుగుతాను. ఆ భీముడికీ, ఆ నలుడికీ ఏ ఏ కూరలో ఎంతెంత చింతపండు వేయాలనో తెలుసా? అంట— రంగనాథం పాకశాస్త్రవిమర్శ వంటింటిలోని జానకీ సరోజలకు కడుపుబ్బ నవ్విస్తూంది. నవ్వలేక పడి చస్తున్నారు.

ఈ పాకశాస్త్ర విమర్శలకు మధ్య మధ్య పెదవిపై నవ్వుతో పంతులు జవాబులిస్తూనే ఉన్నాడు. కానీ జవాబుల నపేక్షించే ప్రశ్నలు గావు. రంగనాథంవి. రంగనాథం భోజనకార్యక్రమం గంటలో పూర్తి

చేసుకుని లేచాడు. తాంబూలం సేవిస్తూ పునః శయ్యాగతుడయ్యాడు.

పంతులుగారి శరీరం మిత్రునితో సంచరిస్తున్న మాట నిజమేగాని మనస్సు ఎక్కడెక్కడో సంచరిస్తూవుంది. తొందర తొందరగా యింటిలోని పతిని నిద్రింపజేసి వెచ్చమిచ్చే విటునికోసం బయలుదేరే భోగముచానలా రంగనాథాన్ని విడిచి రామయ్య పంతులు సేట్ జీ ఇంటికి బయలుదేరాడు. మండు టెండలో చెమటగా చిత్తడియౌతున్న కోటు సవరించుకుంటూ పంతులు సేట్ జీ ఇంటికి వెళ్ళాడు. దరిద్రునికి వడగండ్లవానే ఎదురౌతుందట. ఎండలో మాడిపోతున్న బట్టతల వానిపైనే తాటిపండు పడుతుందట. అవును. ఆ మాటలు నిజమైనవే. పంతులుపట్ల అక్షరాలా నిజమైనవి: సేట్ జీ యింటిలో లేడు. వ్యాపారార్థం బయట వూరు వెళ్ళాడు. వారంరోజుల్లోగాని రాడు. పిడుగు పడినా రామయ్యపంతులు చలించి వుండడు. ఇప్పుడింకా దారుణంగావుంది పరిస్థితి. హతాశుడైన పంతులు వూరికే వుత్తిరంగా నడిచి ఒక చిన్న పాదలో కూచున్నాడు. రెండు ప్రక్కలా గుచ్చుకునే ముండ్లు కూడా పంతులుగారిని తనవైపు మళ్ళించుకోలేక పోయాయి. అలానేపడి నిద్రపోయిన పంతులుకు మెలకువ వచ్చేసరికి తత్తరపాటు కలిగింది. కోటుకు గుచ్చుకొన్న ముండ్లను దులుపుకుంటూ వడివడిగా యింటికి నడిచాడు.


## గ్రంథకర్తలకు, ప్రచురణకర్తలకు విక్రేతలకు

# ప్రత్యేక సదుపాయములు!

మన దేశంలో గ్రంథప్రచురణ చాలా వెనుకబడివుంది. ప్రచురణసంస్థలు విరివిగా లేక చాలామంది గ్రంథకర్తలు తమ గ్రంథాలు తామే అచ్చువేసుకుని అమ్ముకుంటున్నారు. ఉన్న కొద్ది ప్రచురణసంస్థలకు కూడా విశేషలాభాలు వుండటంలేదు. ప్రచురణావకాశాలు ఇలా వుండటంచేత వైజ్ఞానిక ప్రచారంకూడా చాలా వెనుకబడిపోతున్నది.

**భారతి** కేవలం వైజ్ఞానిక ప్రచారానికి యేర్పడిన వ్యవస్థ. గ్రంథప్రచురణను ప్రోత్సహించే తలంపుతో, గ్రంథముల ప్రకటనలకు సంబంధించినంతవరకు తన ప్రకటన రేట్లు తగ్గించుకుని కొంత సదుపాయం చేస్తున్నది.

ఈ అవకాశాన్ని వినియోగించుకోదలచిన గ్రంథకర్తలు, ప్రచురణకర్తలు, విక్రేతలు ఈ దిగువ చిరునామాకు వ్రాసి ఈ ప్రత్యేక సదుపాయపు రేట్ల వివరములు తెలుసుకొనవచ్చును.

**అడ్వర్టైజ్ మెంట్ మానేజర్, భారతి**

7, తంబుచెట్టివీధి, మద్రాసు-1

రంగనాథం హడావుడిగా ప్రయాణ మౌతున్నాడు. పంతులు రాగానే—'ఏమిటయ్యా! ఒక్క క్షణమయినా యింట్లో కాలు నిలచేటట్టు లేదే! సరే గాని వస్తాను రామయ్యా. ఓఁ గంట అప్పుడే నాలుంబావయిందే. బస్సు మిస్సయిపోతుందేమో!' రంగనాథం మాట్లాడుతుంటే కొడూరు మిటంగో జనతా ఎక్స్‌ప్రెస్ కదిలిందన్నమాట. ఇంద్రజాలికుడు తమ యింటికి వచ్చినట్టుంది రామయ్యపంతులు పిల్లలకు. రంగనాథం తొందర ఆతని దురుసు నడక చూడ చాలా వింతగావుంది పంతులుగారి పిల్లలందరూ చుట్టూరా నిల్చున్నారు. వాళ్ళను చూడగానే రంగనాథానికేదో చటుక్కున జ్ఞప్తికి వచ్చింది. మాయామంత్ర కరండంకోసం జోలి తడుములాడుకుంటున్న మాంత్రికునిలా కోటు జేబులు తడుముకొని పర్సు బయటికి దీశాడు రంగనాథం. మాయాబజారిచ్చి మామిడికాయలు రాలుస్తాడేమోనని పిల్లలందరూ రెప్ప వాల్చకుండా చూస్తున్నారు. రంగనాథం పర్సు అందరికీ ఓ వింతగా ప్రదర్శించి టపుక్కున బట్టన్ నొక్కి తెరిచేశాడు. అటూ యిటూ ఆడించి చిల్లర డబ్బులు గలగలలాడించాడు. కంగారు కంగారుగా పర్సు ఆడించేస్తూ—"ఇందులో పది రూపాయల కాగితం లేదే! రామయ్యా ఏమయింది? ఈ యింటిలో దొంగలు కూడావచ్చారా?" మాట్లాడేస్తున్నాడు రంగనాథం.

కత్తివేస్తే నెత్తురుచుక్క లేదు పంతులుగారి ముఖంలో. వేయి పిశాచాలు గజ్జెకట్టి కాటిసీమలో ఆడుతున్నట్లు రంగనాథం మాటలు అతని మస్తిష్కములో నాట్యం చేస్తున్నాయి. లక్ష హాలాహలాల కోలాహలాలు ఆతణ్ణి చుట్టుముట్టివేశాయి. అమాంతముగా ఆకాశం విరిగి అతనిపై పడిపోయింది. వేయి బారువుల యినుపగుండు నెత్తికెత్తినట్టయింది. తల వంచుకొని—'నేనే తీశాను రంగనాథం—' అన్నాడు.

"ఆఁ! నీవే తీశావా? చాటుగా నన్నడగకుండానే తీశావా?"—వజ్రాయుధ ప్రహారం ఎవరికీ అంతబాధ యిచ్చివుండదు. యమలోకంలోని ముళ్ళ పంజరం ఒక్కసారిగా శరీరాన్ని తూట్లు చేసివేసినట్లుంది.

'నాన్నా! దొంగతనం చేశావా? నేను చేశానని మరి నన్ను కొట్టావే!' దివాకరం పరుగెత్తుకుంటూవచ్చి పంతులును వూపివూపి ప్రశ్నిస్తున్నాడు.

కొరడా పెట్లలా చెడేల్‌మన్నాయి దివాకరం మాటలు. పిండారీలు కంపెలు తిరిగిన కన్నెల చెరబట్టి కొరడాలతో కలిగించే బాధయది. చర్మం చిట్లి కండలు ప్రేగులు, ముఖం నజునజయిపోగా పడే బాధ ననుభవించాడు రామయ్యపంతులు. తల పైకెత్తి చూశాడు. ప్రళయకాలంలో సప్త సముద్రాలు పొలెత్తి పొంగిపోగా జలప్రళయంలో తానూ మునిగిపోతూ కన్నుతెరచి చూచినట్లుంది. ఎదుట నీరే కనిపించింది. కనురెప్పలు కదిపి తేరిపార చూశాడు. ఉసిరికాయలంత రెండు కన్నీటిబొట్లు నేలరాలిపోయాయి.

'దివాకరా!...' ఆ పిలుపులోని ఆ చూపులోని ప్రశాంతత విశేషింప బడేదిగాదు. అర్థం చేసుకోవాలంటే యోగివేమన్న శిష్యత్వం వేయిజన్మలు చేయాలి. పంతులుగారి కళ్లలోని కన్నీరు యిగిరి పోయింది.

# మహామేధావి జాన్ రస్కిన్

శ్రీ రెండుచింతల లక్ష్మీనరసింహశాస్త్రి.

## జననము, బాల్యము :

జాన్ రస్కిన్ క్రీ. శ. 1819 సంవత్సరమున లండనులో జన్మించెను. ఇతని తలిదండ్రులు విద్యావంతులు నీతిమంతులు నగు స్కాచ్ దంపతులు. వారికితడే కైకపుత్రుడు. ఇతని పూర్వీకులందరు క్రైస్తవ మతానుయాయులు. బాల్యమునుండి లభించిన సంస్కారమంతయు బైబిలుకు సంబంధించినదే యగుటచేత నతడాజన్మాంతము తదనుసారముగనే జీవితము గడపెను.

బాల్యమున నతడెవరితోను ఎక్కువ మాటలాడక, ఎవరి సహాయమును ఎక్కువ యపేక్షింపక కాలమునంతను ఒంటిపాటున గడిపెను. ఇట్లు వృథాగా కాలము వెళ్ళబుచ్చినందులకాతడు వయస్సు మీరినకొలది పశ్చాత్తాపతప్తుడు కాజొచ్చెను. తన తలిదండ్రులకీతడొక్కడే సంతానమగుటచేత నెట్టి కొరతయు లేకుండెను. అన్నియు ననుకొనుటయే తడవుగ సమకూరుచుండెను ఈ విషయములో రస్కినుయొక్క బాల్యదశ విక్టోరియను శకమునకు చెందిన మరొక ప్రవక్త థామసు కార్లైలు బాల్యమునుండి భేదించుచున్నది. కార్లైలు బాల్యము చాల కష్టనిష్ఠురములతో గడచెనని మనము వినుచున్నాము. రస్కిను తన బాల్యమును గూర్చి వ్రాయుచు నిట్లు నుడివెను: "నా బాల్యమునకు తగిన సాధనయు, నా సహనమునకు తగిన పరిశోధనయు, నా ధైర్యమునకు తగిన నిర్ధారణయు లేకపోయెను." ఇట్టి యననుకూలపరిస్థితులలో నున్నను గాథిక్ శిల్పముతోడను. కళతోడను పరిచయ మేర్పరచుకొను నవకాశ మతనికి బాల్యముననే కలిగెను. వయస్సు మీరినకొలది రస్కిన్ కళలో మంచి యభిరుచి కలవాడయ్యెను. ప్రఖ్యాత ప్రకృతిచిత్రకారుడు టర్నరు అనువాని చిత్రములు తిలకించు నవకాశ మతనికీ దశలోనే కలిగెను. తన పదునేడవయేట నితడు టర్నరును గూర్చి యొక ప్రశంసాత్మకమైన వ్యాసమును వ్రాసెను తరువాత కొన్నియేండ్లకు 'మాడరన్ పెయింటర్స్' అను గ్రంథములో టర్నరు చిత్రములయందలి సూక్ష్మార్థమును వివరించుచు నెక్కువగా ప్రశంసించెను.

## విద్యార్థిదశ

రస్కిన్‌యొక్క ప్రాథమిక విద్యాభ్యాసమంతయు నింటివద్దనే సాగెను. పదునెనిదేండ్లు వచ్చుసరికతడు తనకు పనికివచ్చు పఠనవిధాన మొకటి నిర్ణయించుకొనెను. అందులో కవిత్వము. శిల్పము, గృహనిర్మాణశిల్పము, భూగర్భశాస్త్రము కూడ చేరియుండెను. డా॥ అండ్రూస్ అను వాతడు గ్రీకుభాషలో నేర్పెడు కొన్ని పాఠములు మినహా తక్కిన బోధనమంతయు నతని తల్లియే స్వయముగా నిర్వహించుచుండెను. డా॥ అండ్రూస్ స్థానిక పండితుడుగా పేరు గడించినను అతనినుండి రస్కిను నేర్చుకొనిన గ్రీకు అత్యల్పమనియే చెప్పవలెను. తరువాత రెవరెండు థామస్ డేల్ అను నధ్యాపకుని పాఠశాలలో రస్కిను రెండేండ్లు చదివి యక్కడనుండి ఆక్స్‌ఫర్డుకు వెడలెను. ఆక్స్‌ఫర్డులో కార్పస్ క్రిస్ కళాశాలలో చేరి చదువ దొడగెను. ఆనాటి కాలములో తమ కుమారుడొక మతగురువు కాగలడని యాతని తలిదండ్రులు ఆశించిరి.

విశ్వవిద్యాలయమున నున్న కాలములో నతడు తన భక్తి నైపుణ్యముచే పెక్కురనాకర్షించెను. సహపాఠులయెడ నాతడు చూపిన దాతృత్వము గణ్యము. కాని కుమాస్తాలుగా తయారుచేయు నీ చదువుపై నాతడేమియు మోజుపడలేదు. ఆక్స్‌ఫర్డులో ఆరోగ్యము చెడిపోవుటవలన నతని చదువున కంతరాయము కలిగెను. నిరాశాహతుడై యనర్స్ పరీక్షకు చదువుట విరమించుకొనెను. అంగ్లమున కవిత చెప్పినందులకు న్యూడిగేట్ ప్రైజును సంపాదించెను. ఆ పద్యమున కాతడెన్నుకొనిన కథావస్తువు పశ్చిమ భారతదేశమునకు చెందినది. పద్యముపేరు సాల్ సెట్ అండ్ ఎలిఫెంటా (Salsette and Elephanta) ఈ పద్యమున భారతదేశములో క్రైస్తవమత గతిరంగమును వర్ణించు ఘట్టమొకటి కలదు. 1841 లో నతడు బి. ఎ. డిగ్రీని పొందెను.

రస్కిను కళను, సాహిత్యమును బాగుగా నభ్య సించెను. గ్రీకు లాటినుభాషలలో సంపూర్ణ పాండిత్య మును గడింపకున్న నేమి? వీనిలోను, విశ్వవిద్యాలయపు చదువులోను అతడు చాలా వెనుకబడియుండెను అయిన నేమి? తలిదండ్రులతో గలిసి ఐరోపా ఖండమును పర్యటించెను. రూన్, జెనీవా, పిసా వంటి మహానగర ముల సందర్శన మాతని మనస్సును గొప్పగ తీర్చిదిద్దినది. న్యూమన్, ఆర్నాల్డుల విషయములోవలె ఆక్స్ఫర్డు రస్కిను విషయములో నెట్టి యావలోకమునకు హేతువు కాలేదు.

## జీవితలక్ష్యములు, ఆశయములు :

1858 సంవత్సరములో ఆక్స్ఫర్డులో బయలు దేరిన కాథలిక్ పునరుద్ధరణోద్యమ మీతనిపై నేమియు ప్రభావము చూపలేదు. కార్డినల్ న్యూమన్కూడా నీతనిపై నేమియు ప్రభావము చూపలేదు. కార్లైలుతో నితడేకసరణిలో నిలబడెను. ఈ ఇరువురు మేధావులు ప్రొటెస్టెంటులైనప్పటికి మధ్యయుగమునాటి జీవిత పద్ధతులను, నాటికళను ఆదరించిరేకాని ఆధునికకళను, జీవితమును ఆదరింపరైరి. ఈతడు తన విమర్శన ప్రకారముచే మధ్యయుగాచారములను పునఃస్థాపన చేయుటలో గల యడ్డంకులను ఖేదించెను. బైబిలులో గల ప్రతివాక్యము అక్షరాలా నిజమని యాతనినమ్మకము. డార్విన్ పరిణామవాదము క్రైస్తవమత సిద్ధాంతము లకు విరుద్ధమైనదని నిరూపించి దానిని నిరాకరించెను. తనయున్నమీదికొలది క్రైస్తవమతమునందాతని విశ్వా సము గాఢతరమగుటయే కాక తదనుసారముగా జీవ యాత్ర గడపుటలో పట్టుదలయు హెచ్చెను.

అతడు తన తండ్రినుండి వారసత్వపు హక్కు వలన పొందిన ధనమంతయు దానధర్మములకు, సంఘ సేవకు వినియోగించెను. పుస్తకములపై వచ్చు వాదా యముతోడనే యతడు జీవితావసరవస్తువులను కొనవల సినవాడయ్యెను. కొన్ని సందర్భములలో నాతడు పుస్తకములువ్రాసి తానే యచ్చొత్తించి, పాఠ కులకు స్వయముగా నమ్మెడివాడనికూడ తెలియు చున్నది. వ్యాపారదృష్టిని, మధ్యలాభము తీయు వారిని నిరుత్సాహపరుపవలెనని యాతడు పెక్కు తడవ లుపదేశించెను. ఈ సిద్ధాంతమును స్వయ ముగా నాచరణలో పెట్టుటకో యనునట్లుగా పైరీతిని గ్రంథవిక్రయ మొనర్చెను. ఇట్లు వెలువరించిన గ్రంథము లలో 'ఫార్స్ క్లావిజెరా, ది ప్రాక్టిరిటా' అనునవి ముఖ్య ములు. వీని నాతడు స్వహస్తముతో చిత్రపటశోభి తములుగా చేసెననికూడ తెలియుచున్నది.

## రచయితృదశ

ఇతని సాహిత్యసముల్లోచనా కాలము రెండు దశలుగా విభాగింపబడియున్నది. వీనిలో మొదటిదశ 1860 తో నంతమగుచున్నది. రెండవది 1860 నుండి 1888 వరకు విస్తరించియున్నది. ఈ రెండుదశలలోను ఇతడు వ్రాసిన గ్రంథములు ముప్పదివరకు నున్నవి. మొదటిదశలోని గ్రంథములకును, రెండవ దశలోని గ్రంథములకు గల ముఖ్యభేదమేమనగా నీ రెండవదశలో వెలువడిన గ్రంథము లాతి డాయాసము ములలో నిచ్చిన యుపన్యాసము లేయగుట. వీని నాతడు కొలదిమార్పు లతో గ్రంథస్థము కావించెను.

మరొకభేద మేమన క్రీ. శ. 1860 వరకు నీతడు తనరచన లన్నిటిని కళాపరముగా కొనసాగించెను. 'ది సెవెన్ లాంప్స్ ఆఫ్ ఆర్కిటెక్చర్' అను గ్రంథ మీదశకు చెందినది. 1861 నుండి యతడు భిన్నదృక్ప థము కలవాడయ్యెను. కార్లైలువలెనే యీతడుకూడ నాధునిక పారిశ్రామికరంగములో నేదో తీరనిలోటు కలదని భావింపదొడగెను. కళారంగమునుండి వైదొలగి యాతడు క్రమముగా ఆర్థిక, సాంఘిక సమస్యలను చర్చించుటకు కలమును, కాలమును వినియోగింప దొడ గెను. ఈమార్పు కలిగిన కాలములో రచింపబడినదే "అన్టు దిస్ లాస్ట్" అను గ్రంథము. ఈ గ్రంథమును వ్రాయుటతో తనజీవితాశయము, జీవితగమ్యము సిద్ధించి నట్లుగా రస్కిను భావించెను. మన జాతిపితయగు గాంధిమహాత్ముని మనస్సుపై నీ గ్రంథము శాశ్వతముద్ర వేసినదనియు, భారతజాతీయ మహాసభయొక్క చరఖా ఉద్యమము రస్కిన్యొక్క మహోపదేశ ఫలిత మేయని చెప్పినను అంతయు నీ గ్రంథప్రాశస్త్యమునే తెల్లము చేయుచున్నది. దీని తరువాత వ్రాయబడిన రెండు గ్రంథములు మునేరా పల్వరీస్, ది క్రౌన్ ఆఫ్ వైల్డ్ ఆలివ్ అనునవి. వీనిలో కడపటిది ఆర్థిక పారిశ్రామిక సమస్యలను చర్చించునట్టిది. 'యుద్ధము' అనువిషయముపై నాతడిచ్చిన యుప

న్యాసము అతని యసమాన మేధావిత్వమును, తర్క శాస్త్రకుశలతను, విశాల పాండితీగరిమను చాటు చున్నది.

ఇతని తొలిదశకు చెందిన ది సెవెన్ లేంప్స్ ఆఫ్ ఆర్కిటెక్చర్ అను గ్రంథమును గూర్చి యించుక ప్రస్తావించెదను. ఇది యొక విమర్శన గ్రంథము. కళకు నీతికి అన్యోన్యసంబంధము కలదని యీ గ్రంథమున నీతడు ప్రవచించెను. ఇందలి భావములు విశాలదృష్టితో సేకరించబడినవి. ఇతని మతము ప్రకారము శిల్పానికి కల యేడు దీపికలేవన 1. త్యాగదీపిక 2 సత్యదీపిక 3 అధికారదీపిక 4. సౌందర్య దీపిక 5. జీవనదీపిక 6. స్మృతిదీపిక 7. వినయదీపిక. రస్కిన్ పరిశీలనలోనికి వచ్చిన యే శిల్పఖండమైనను ఈయేడు దీపికలలో నేదో యొకదానిక్రిందకు రాక తప్పదు. అధికారదీపికవలన నొక మహోత్కృష్టమేర్పడు ననియు, ఈశక్తిచేతనే మానవుడు పరిపాలనదక్షుడగు చున్నాడనియు నీతడు వ్రవచించెను; రస్కిన్ మతము ననుసరించి మహాభవనములన్నియు మానవుని పరిపాలన దక్షతను, సమావేశపరచు శక్తిని తెలియజేయునవిగా నున్నవని తెలియుచున్నది. సౌందర్యదీపికవలన నానంద ముత్పన్నమగుచున్నదనియు, దీనిచేతనే మానవుడు సమావేశపరచు శక్తికలవాడగుచున్నా డనియు నీత డుద్ఘాటించెను.

పరిపాలనదక్షతన భవనముయొక్క ఉనికి, విన్యాసములలోను, సంకలనవిధానము పరిష్క్రియ యందును నిండియున్నదని యీతని వాదము. ఇట్లే తక్కిన దీపికలకుగూడ నీత డర్థమాపాదించెను. ఈదీపికలను గూర్చి విమర్శించుచు ఆఫ్ మోర్ విన్ గేట్ అను నాతడు ఇట్లు వ్రాసెను. "పట్టుదల, కల్పన అను రెండు గుణములు మాత్రమే భవననిర్మాణ శిల్పమున కావశ్యకములు. అధికారదీపికలో మాత్రము తక్కిన యన్ని దీపికల గుణములు సమీకృతములై యున్నవి." ది సెవెన్ లెంప్స్ ఆఫ్ ఆర్కిటెక్చర్ వలన రస్కిను గ్రీసుదేశపు తత్త్వవేత్త ప్లేటో రచనలచే నావేశింపబడెననుట విదితము. ఎట్లనగా ప్లేటో ననుసరించి సౌందర్యమునకు, పావిత్ర్యమునకు, సర్వసమానత్వము కలదు. రస్కిన్ కూడ నీసిద్ధాంతమునే ప్రతిపాదించెను. రస్కిన్ వాదము ప్రకారము ఒక కట్టడమువల్ల దాని యొక్క ఆశయము లేక ఉద్దేశ్యము తెల్లమగునవియు, అంతేకాక భవననిర్మాతయొక్క ఆత్మభావనకూడ అందు ప్రతిఫలించుననియు తెలియుచున్నది. ఒక దేశముయొక్క స్వభావము, శీలము ఆదేశమునందలి గోపుర ప్రాకారాదుల నిర్మాణమువల్లనే స్పష్టమగునని రస్కిను తెలిపియుండెను. ఈ విధముగా నితని గ్రంథములయందలి గుణగణము లసంఖ్యాకములుగా నున్నవి.

## ఉద్యోగిదశ

1864 లో నాని తండ్రియు 1874 లో తల్లియు స్వర్గస్థులైరి 1870 నుండి 1878 వరకు నాతడు ఆక్స్‌ఫర్డులో లలితకళలకు స్లేడ్ ప్రొఫెసరుగా నియమింపబడెను ఆ పదవిలో నుండగా కళనుగూర్చి యాతడిచ్చిన యుపన్యాసములన్నియు నొక సంపుటిగా వెలువడెను. కాని యాత డధ్యాపకుని హోదాలో చేసిన సంఘసేవకంటె వితరవిధముగా అనగా విద్యార్థి సమావేశములలోను, కార్మికుల సభలలోను, ఇంకా ఇతరత్ర యుపన్యాసములద్వారా చేసిన సంఘసేవయే గణ్యతరము. ఈ కాలములోనే యాతడు కొన్ని గ్రంథములను, కరపత్రములనుగూడ ప్రచురించెను 1883 లో మూడవతూరి యాతడు స్లేడ్ ప్రొఫెసరుగా నియమింపబడెను కాని అతని యారోగ్యము భగ్నమయ్యెను. విరమింపవలెనని చూచు సమయమునకే అనగా 1884 వ సంవత్సరాంతమునకు ఆక్స్‌ఫర్డు విశ్వకళాశాలలో నొక జాంతవప్రయోగశాలను తెరచు సందర్భమున గావింపబడిన జంతువధకు అధిక్షేపణ తెలుపుచు నాతడా పదవికి రాజీనామా నిచ్చెను.

## చరమదశ :

క్రీ. శ. 1871 సంవత్సరమువరకు నాతడు లండనులో తన తండ్రిగారి గృహమున నివసించుచుండెను. ఆ సంవత్సరముననే అతని తల్లి చనిపోవుటతో నాతడు లంకాషైరులో బ్రాంటువుడ్డు అనుచోట గల ఎరస్ను తీరమున నొక భవనము కొనెను. అచటనే యాతడొక గులాబీతోటను పలురకముల పూలమొక్కలను పెంచెను. ఆ ప్రశాంత వాతావరణములో నాతడిరువది సంవత్సరములు గడపెను. ఈ కాలములోనే యాతడు ప్రెటెరిటా అను పేరుతో తన జీవితచరిత్రసంగ్రహమును ప్రకటించెను. ఇందులో ఇరవైనాలుగు భాగములు వరుసనే వెలువడినవి. 1864 వరకు సంఘటించిన

యతని జీవితవిశేషములన్నియు నీ సంపుటములలో వివరింపబడెను. కాని యటుతరువాత దైహికముగా నాతి దశేనుడైపోయిన కారణమున కాలమునంతను సతనమందిగములోను, శయనమందిరములోనూ మాత్రమే గడుపుచుండెను. క్రీ. శ 1900 సంవత్సరము జనవరి 18వ తేదిన వతడు ఇన్‌ఫ్లూయెంజా జ్వరమునకు గురియై అటుపిమ్మట రెండురోజుల కిహలోకయాత్ర చాలించెను.

ఈ విధముగా విక్టోరియను శకమునకు చెందిన యొక మహామేధావి జీవితకథ ముగియుచున్నది. అయితే యీ విశ్వసాహితీ చరిత్రలో నీతడాక్రమించు కొన్న స్థానముత్కృష్టతము, అజరామరము. దాని నించుక వివరించి యీ ప్రసంగమును ముగింతును.

## రస్కినుయొక్క సాంఘిక దృక్పథము; ఆర్థిక రాజకీయ సిద్ధాంతములు

ఇతడు తన రెండవ సాహిత్యదశలో కళనుండి, ఆర్థిక సాంఘిక సమస్యలవైపు దృష్టి మరలించెనని మొదట తెలిపియున్నాను. ఇందుకు కారణములు బహువిధములుగా నున్నవి. ఇతని సమకాలికుడును, విక్టోరియను శకమునకు చెందిన మరొక ప్రవక్తయు నగు కార్లైలు తోడి సన్నిహితసాంగత్యమొక కారణము. ఇంకొక కారణము నాటి సాంఘిక పరిస్థితులు. ఇవి చాల భయాందోళనలను కలిగించునవిగా నుండుటచే రస్కిను అదివరకే కొంత పేరు గడించిన తన లేఖినిని ఈ యార్థిక రాజకీయ సమస్యలను గూర్చి చర్చించుట కుపయుక్తపరచెను. కార్మికుని మితిమీరిన శ్రమయు దానికి వచ్చు స్వల్ప ప్రతిఫలమును ఈతనిని కలవరపరచెను. అంతియకాక పెరిగిపోవుచున్న పెట్టుబడి తనము నరికట్టవలెననియు నీతడు తలంచెను. ఈ యాలోచనయొక్క ఫలితమే ట్రాఫిక్ అను నుపన్యాసము. సంపద దినదినాభివృద్ధి చెందుచుండెను. గాని కొద్దిమంది భాగ్యవంతుల చేతిలో నదిమిగిలిపోవుచుండ పెక్కుమంది కార్మికులెప్పటి దుర్దశనే యనుభవించుచుండిరి. పనివాండ్రు యజమానుల దయాధర్మములపై నాధారపడియుండిరి.

1890 వరకు బ్రిటిషు పార్లమెంటులో కార్మిక పక్షమేర్పడలేదు. మధ్యతరగతిజనులు వాణిజ్యము ఉత్పత్తి, యంత్రపరిశోధన వృద్ధిచెందుటతో తాము సుఖముగానే యున్నామని భావింపదొడగిరి. వర్తకము వృద్ధిచెందుటవల్ల దేశమునకు దేశమునకు నడుమ మైత్రి పెంపొంది యుద్ధములు రాకుండ పోవుననియు వారు భావింపదొడగిరి. వాణిజ్యము, విద్య వృద్ధిచెందినచో దారిద్ర్యము రూపుమాసిపోవుననియు, నేరములుకూడ జరుగవనియు వారు తలంచుచుండిరి. ఇంగ్లండు యొక్క అభ్యుదయము ప్రపంచాభ్యుదయమే యని వారభిప్రాయపడిరి.

ఈ అభిప్రాయములు రస్కిను కించిన్మాత్రము సమ్మతములు కావు. పేరుకొనియున్న సంపదవల్ల ఆత్మనిర్వీర్యమగుటయు, పేరుకొనియున్న దారిద్ర్యమువల్ల దేహము, ఆత్మ రెండును నిర్వీర్యమగుటయు తటస్థించునని యాతడు నమ్మెను. శాంతినిగూర్చి రాజతంత్రజ్ఞులెంత గంభీరముగా నుపన్యసించినను, యుద్ధములు రాక మానుటలేదనియు, ఐరోపా అమెరికా ఖండములే యుద్ధక్షేత్రములుగా మారుటయు, ఇంగ్లాండు రాజకీయ నైతిక పతనమునకు గురియగుటయు చూడ శాంతియే వీరి లక్ష్యమని యెవ్వరు కలలోనైన ననుకొనరనికూడ రస్కిను వ్యక్తపరచెను. ఒకవైపున సాయుధీకరణములో పెద రాజ్యములవిరామముగా పోటీపడుచు, నింకొకవైపున 'శాంతి! శాంతి' యని నినాదములు చేసిన నెవ్వరును నమ్మజాలరని యాతడుద్ఘాటించెను. రస్కిన్ జీవితానంతరము కూడ నీ పోటీ సాగుచునే యున్నది. ఇప్పుడిది రస్కిను చూచినట్లుగా నొక్క ఐరోపాఖండమునకే కాక యావత్ప్రపంచమునకు పరివ్యాప్తమైనది.

ఈ సమస్యలను చర్చించు దృష్టితోడనే రస్కిను పని, వాణిజ్యము, యుద్ధము అను విషయములపై నుపన్యాసముల నొసంగెను. కార్మికునికి సంతోషము లేని పని, విషాదము. కష్టము, భయంకరము నగు 'పని' — వర్తకునకు లాభము దేశమునకు నష్టము తెచ్చిపెట్టు వాణిజ్యము, వృత్తిచే సైనికులైనవారి నడుమ పెట్టి క్రోధావేశములు లేకయే, పెట్టుబడిదారులైన రాజనీతిజ్ఞుల యనుశాసనముచే నేర్పడిన యుద్ధము — అను నీ మూడు విషయములపై వాతడిచ్చిన యుపన్యాసములు అన్ని కాలములకు, అన్ని జాతులవారికి నీతిబోధకములగు పాఠములుగా నుండగలవు. ఈ యుపన్యాసములలో రస్కిను ఒక అధిక్షేపకునివలెను, ఒక ప్రవక్తవలెను నిలబడెను. అధిక్షేపకుడు పరిశీలితాంశముల గల

# మహామేధావి జాన్‌రస్కిన్

లోపమును వేలెత్తి చూపును; ప్రవక్తయు స్తెమహాన దర్శకత్వమును నిర్వహించును. రస్కిను ఈ రెండు రాచబాటలలోను మేటియై నిలచెను. అతని జీవిత కాలములో ఈ అభిప్రాయములన్నియు మహోచిత్రములుగా త్రోసివేయబడినను అతని జీవితానంతరము గణనలోనికివచ్చి ఆచరణయోగ్యము లయ్యెను.

## రస్కిను ఇచ్చిన సందేశము.

అన్‌టు దిస్ లాస్ట్ అను గ్రంథములో రస్కిను ఆచరణసాధ్యము కాని ఆదర్శమును ప్రతిపాదించెనని చాలమంది ఆక్షేపించిరి. కాని యది నిజము కాదని కాలమే ఋజువుచేసినది. కార్మికపక్షమువంటి యొక ప్రధాన రాజకీయపక్షమునకే యాతడు సూచించిన విధానము పట్టుగొమ్మ యయ్యెను. యాంత్రికము కూర్చి యాతడిచ్చిన యభిప్రాయము సరియైనదే యని యిప్పు డెల్లరును గుర్తించిరి. యాంత్రికమును పూర్తిగా విసర్జించుటకిప్పు డెవ్వరు నంగీకరింపకున్నను యాంత్రికత వల్ల మానవులలో మానవత్వము తగ్గిపోవుచున్నదనియు, ఆ కారణమున మానవులను యంత్రములవలె దాసులనుగా గాక వ్యక్తులనుగా జేయు విధానము ననుసరింపవలె ననియు నెల్లరు నంగీకరించుచునే యున్నారు. రస్కిను ఇచ్చిన సందేశములో నిదియొక భాగము.

ఇంకను అతడు మానవహృదయములలో సుకృతము ప్రకృతితోపాటు రాతికి, అలకు, మొక్కకుగల యాత్మప్రకృతికూడ కలదని తెలిపెను. పనివానియొక్క సుఖజీవనముపై సృజనాత్మకశక్తియొక్క నియమములు నిర్మాణముయొక్క అందచందములు ఆధారపడి యుండునని తెలియజేసెను. వ్యాయామము సూర్యునిపై మన జీవిత నియమావళి యాధారపడి యుండుననియు, కావున సరళము జీవనము గడుపునప్పుడు ధనవంతుని సామ్రాజ్యములో నుంటిమని గుర్తించి, అందు సేవవారనీ, భాగ్యవంతులనీ, సామాన్యులనీ, గొప్పవారనీ తారతమ్య ముండదని యెలుగగలెను స్వాతంత్ర్య మెల్లరి హక్కు అనియు ధనవంతుని ప్రేమకు ఎల్లరము వారసులమే యనియు గుర్తించినవాడే లోకమున శాంతి నెలకొనును. ఇదియే రస్కిను దివ్యసందేశము.

# బహుమానం

శ్రీ పురాణం సూర్యప్రకాశరావు

నేను సాయంత్రం ఆఫీసునుంచి వస్తూ సేవను ఎదురుగావున్న విశాలమయిన మేడముందు అలవాటుగా ఆగి గోడకి తగిలించివున్న ప్రకటన చదువుతూ నిలబడిపోయాను. ఆ ప్రకటనలో ఇలా ఉంది:

ది......ఆదివారం సాయంత్రం ఆరుగంటలకు చిత్రవిచిత్రమయిన వస్తువులు, అందమైన ఫర్నిచరు, అలంకరణ వస్తువులు, గాజుపాత్రలు మొదలుగాగల రకరకాల వస్తువులు వేలం వేయబడును ఈ సదవకాశాన్ని వదులుకోవద్దని మనవి" అంటూ ఇంకా ఏవేవో వస్తువుల జాబితాతో ఆ ప్రకటన నిండి ఉంది.

సహజంగా ఇలాంటి వేలంపాటల్లో పాల్గొనటం అంటే నాకు చాలా సరదా. తరుచుగా ఆ ఆవరణలో జరిగే వేలంపాటల్లో కొన్నా కొనకపోయినా పాల్గొంటూనే ఉంటాను. అప్పుడప్పుడు అందుబాటులో వున్న వస్తువులేవైనా ఉంటే కొంటూ ఉంటానుకూడా. నేను నిత్యం వాడుకునే పౌంటెన్ పెన్ను, చొక్కా గుండీలు అలా కొన్నవే. ఇలాంటి వేలంపాటలో కొన్నవస్తువుల నాణ్యత గురించి సంశయించాల్సిన అవసరం ఉన్నా అప్పుడప్పుడు చాలా మంచి మంచి వస్తువులు అతిచవుకగా లభించే అవకాశాలు కూడా లేకపోలేదు. నేను తొందరపడకుండా విదానంగానే అక్కడ వ్యవహారిస్తానని చెప్పటానికి నేను కొన్న చిన్నచిన్న వస్తువులే నిదర్శనం. కలవాళ్ళు ఖరీదైన వస్తువులే కొనుక్కుని పోతూంటారు. పుష్పక విమానం వంటి వారి గృహాలు ఎప్పుడూ కొత్త వస్తువులకు చోటుఇస్తూనే ఉంటాయి. గతిలేని కొంపల్లోంచిగాని, చితికిపోయిన సంసారాల్లోంచిగాని కొన్ని కొన్ని వస్తువులు అక్కడికి చేరుతూంటాయని నాకు తెలిసినా అప్పుడంతగా పట్టించుకోలేదు. ఈ విషయం బయటపెట్టటానికి ఇప్పుడు సిగ్గుపడుతున్నాను. పదిసంవత్సరాల నుంచీ ఈ మేడలో జరిగే వేలంపాటలతో నాకు పరిచయం ఉన్నా నిన్న జరిగిన సంఘటనతో ఇకమీదట ఇక్కడికి చేరకూడదనే నిర్ణయానికి వచ్చేసాను. జీవితానికంతా సరిపోయే ఆ ఒక్క అనుభవం నాకుచాలు!

ఇప్పుడా ప్రకటన అలవాటు కొద్దీ గబగబా చదివినా ఈ ఆకర్షణకు మనసులోనే నవ్వుకుని మీద చినుకులు పడుతున్నట్టుగా తోచి గొడుగు తెరుచుకుని ముందుకు అడుగువేశాను.

అసలు జరిగిందిది:

అరుణ కొత్తగా కాపరానికి వచ్చిన రోజులు. అంతేకాదు నేను ఉద్యోగంలో చేరి కొత్త రొమ్ము విరుచుకుని గర్వంగా తిరిగే రోజులుకూడా అవే. అమ్మ నెల్లాళ్ళు వండిపెట్టి అరుణ కొత్త అలవాటు పడింతర్వాత వెళ్ళిపోయింది. 'పెందరాళే ఇంటికిరండి' అని అరుణ మెల్లగా వీధి గుమ్మంలో నిలబడి అంటే మతిపోయినట్టు అనిపించి ఆఫీసుకి శెలవుపెట్టేద్దామా అనిపించేది ఇలాంటి రోజుల్లో అరుణకి ఏదైనా ఒక చక్కని బహుమానం తెచ్చి ఇవ్వాలని ఒకనాడు అనుకోవడం జరిగింది. నా కోరిక ఆమె ముందు ఉంచాను. ఆమె తృప్తిగా నవ్వుతూనే 'ఆ వస్తువు ఇద్దరికీ ఉపయోగించేదిగా ఉండాలి' అని షరతు పెట్టింది.

"పోనీ ఆవస్తువేదో చెప్పరాదూ?" అన్నాను.

"అలా కాదు. మీకు తోచింది తీసుకురండి" అంది అరుణ.

ఆ తర్వాత మనసుకు నచ్చిన బహుమతికోసం వీలుచిక్కినప్పుడల్లా గాలిస్తూనే ఉండేవాణ్ని. ఆ చిన్న ఇల్లాలు కూడా తొందర చేసేదికాదు. మధ్య మధ్య ఆ భావం స్ఫురించేట్టుగా నవ్వుతూండేది. ఆ ఉత్సాహం ఆఫీసు పని రద్దీలో వెనకపడుతూ వచ్చింది.

ఒకనాడు పక్కగుమాస్తాకీ నాకూ జరిగిన సంభాషణతో నాలో విషాదంలాంటి బాధ గుండెల్ని అలుముకుని ఏమైనాసరే మాయీ దాంపత్యపు తొలిరోజులకు చిహ్నంగా ఒక వస్తువు ఆమెకు నేను బహూకరించక

తప్పదు. 'అని గట్టిగా అనుకున్నాను.' ఏముంది భాయీ కొత్తగా పెళ్ళాం కాపరానికి వస్తే నాలుగు రోజులు కులుకుతాం. అయిదో నాటినుంచే తగాయిదాలు, కయ్యాలు, ఆవిడపుట్టింటికి పోతానని బెదిరించటం, మనం మొగతనం చెలాయించటం, వాళు పస్తుపడుకోవటాలు, పిల్లల్ని కనటం, మనదరిద్రం వాళ్ళకి పంచిపెట్టటం. ఇదేకదూ భాయీజీవితం! అన్నపక్క గుమాస్తా మాటల్లోని యధార్థత నన్ను చాలా ఆందోళన పరిచింది ఆనాడు ఇంటికి వస్తూ స్టేషనుముందు మేడలో వేలంపాట ప్రకటన చూస్తాను. అందులో చిత్రవిచిత్రమైన వస్తువులున్న ప్రకటనచూసి ఆ మర్నాడు ఆ వేలం పాటలో పాల్గొన్నాను.

నేను లోపలికి ప్రవేశించేసరికి జనం కిటకిట లాడుతున్నారు. జనాన్ని ఒత్తిగించుకొని ముందుకు వెళ్ళి నిలబడ్డాను. రకరకాల వస్తువులు అనేక కోణాల్లోంచి కళ్ళముందు మెరిసి అమ్ముడు పోతున్నాయి. పాటగాని గొంతుసరాలు చెమటతో మెరుస్తున్నాయి జనాన్ని ఆకర్షించగలిగే అతనిగొంతు నిర్విరామంగా మోగుతూనే ఉంది చిన్నచిన్న దువ్వెనల దగ్గర్నించి వందల ఖరీదు చేసే వస్తువుల వరకూ అమ్ముడు పోతూనే ఉన్నాయి. నాకు మనసుకు నచ్చిన వస్తువు ఒక్కటీ రాలేదు. కాళ్లుతీపులు పుడుతున్నాయి. ఇకపోదామా అనిపించి కదలబోతుంటే 'ఇదిగిదిగో ఇదిగోవండోయ్' అన్నపాటగాని గొంతువిని ఆగిపోయాను.

అది రెండు ఫోటోలు పెట్టుకొనేందుకు వీలయిన ఫోటోస్టాండు. ముందుకువెళ్ళి 'ఆవస్తువు చూస్తాను. ఇస్తారా' అన్నాను.

అతను అందించాడు. 'మంచి గంధపుచెక్కతో తయారుచేసింది సార్. దానిశిల్ప నైపుణ్యం చూడండి. ఇది తప్పకుండా కొనవలసిన వస్తువుసార్. మీలాంటి వారి ఇంట్లో ఉండతగింది' అంటూ చెప్తూను పోతున్నాడు.

పక్కనున్నాయన నామీదకు ఒరిగి 'చాలా బాగుందండి' అన్నాడు.

'నిజంగా ఆవస్తువు చాలా అందమయింది.' అని నాకు అనిపించింది.

'దుమ్ముపట్టి దాని అందం తెలియటంలేదు సార్. గరుకుకాగితంతో ఓసారి రుద్దితే దాని అందం బయటపడుతుంది.'

ఆ వస్తువుమీద నా మోజు అధికమయింది. పాట మొదలయింది. రూపాయితో ఆరంభమయి పదిహేను రూపాయలదాకా త్వరత్వరగా పాకింది. అక్కడితో చాలామంది తప్పుకొన్నారు. నేనూ వదిలిపెట్టలేదు. పట్టుదల పెరిగింది. 'పదిహేను' అన్నాను.

నా పక్కాయన 'ఇరవై' అన్నాడు నావైపు ఓరగా చూస్తూను.

'ఇరవై అయిదు' అనేశాను తెగించి.

నా పక్కాయన తగ్గిపోయాడు. ఆయ కోపంగా నావైపు ఓచూపు విసిరి అక్కడ్నించి వెళ్ళిపోయాడు. పాట నాకే ఖాయం అయిపోయింది. నేను పదిరూపాయలు తీసి అతనికిచ్చి మిగతా పదిహేను మర్నాడువచ్చి ఇచ్చి వస్తువు తీసుకుపోవటానికి ఏర్పాటు చేసుకుని ఇవతలకి వచ్చేశాను. నాకు పాటలో వళ్ళు తెలియలేదుకాని ఇవతలకివచ్చి గడియారం చూసుకుంటే తొమ్మిదిన్నరయింది.

ఇంటికిచేరి ఇల్లాలి చెవిలో ఈ వార్త వేసేవరకు ఆ ఉత్సాహం నాలో క్షణం క్షణం పెరిగిపోతూనే ఉంది.

"ఏదో అన్నానుగాని అంతఖరీదు పెట్టిదేనికి?" అంది అరుణ.

"నువ్వలా అంటే నా మనసు కష్టపడుతుంది" అన్నాను.

ఆ మాటతోనే ఆమె కంగారుపడిపోయి దగ్గరగావచ్చి చొక్కా గుండీలుపట్టుకుని 'క్షమించండి.' అంది.

భోజనంచేస్తూ మంచిగంధపు చెక్కతో నగిషీలు నగిషీలుగా ముచ్చటైన ఆ శిల్పనైపుణ్యం గురించి నేను వర్ణిస్తుంటే ఆమె తన్మయురాలై వింటూ కూర్చుంది.

అందులో అమర్చటంకోసం ప్రత్యేకంగా రెండు ఫోటోలుకూడా ఆ మర్నాడే తీయించుకోవాలని నిశ్చయించుకున్నాం. ఆమె ముఖంలో భావాలు కనిపెట్టి 'నాకు తెలుసు దీనికి అనవసరపు ఖర్చు అని నీ ఉద్దేశంకదూ. కాదు...కాదు ఉండాలి ఈ మధురమైన రోజులు...ఒక చిహ్నం'" అంటూ

ఆచి ఆచి అంటూంటే అడ్డుపడుతూ ఈ మాధుర్యం కలకాలం ఉండేదేగా. ఇక దీనికి చిహ్నాలు దేనికి? ఆ మాట మీరు అంటే కష్టంగాకూడా ఉంటుంది. ఎదుట లేని అనుభవానికి చిహ్నాలు కానీ కలకాలం నిలిచే ప్రేమకి చిహ్నాలా?" అంది అరుణ.

పక్క గుమాస్తా అన్నమాటల్లో నాకు పూర్తి విశ్వాసం లేకపోయినా ఎందుకో ఆ మాటలు మర్చిపోలేకుండా ఉన్నాను.

నా మౌనానికి అరుణ "పోనీలెండి. మీకు ఎలా చెయ్యాలని ఉంటే అలాగే చేద్దాం" అంది.

ఆ మర్నాడు ఉదయం నేను పైకం తీసుకుని ఫొటోస్టాండు తెచ్చుకుందుకు వెళ్ళాను. నేనువెళ్ళేసరికి మేనేజరు హాలుమధ్యని కూర్చుని వస్తువులన్నీ గదిలో అందంగా సర్దిస్తున్నాడు నౌకర్ల చేత. నన్ను చూసి గౌరవ పూర్వకంగా లేచి నిలబడి నమస్కారం చేసి కూర్చుందుకు కుర్చీ చూపించాడు.

నేను జేబులోంచి పైకంతీసి అతనికివ్వబోతుంటే అతను కుర్చీదగ్గిరికి లాక్కుని కూర్చుంటూ "ఉంచండి. ఒక్క పదినిముషాలు ఆగితే ఆ పుస్తకాలు, అవీ గుమాస్తా తెస్తాడు. అర్జంటుగా వెళ్ళిపోవాలా?" అన్నాడు.

అంత తొందర లేదన్నట్టుగా తలఊపాను.

నౌకర్లు వస్తువులు భద్రంగా అమరుస్తూనే ఉన్నారు. మేనేజరు చెమటపట్టిన ముఖాన్ని తుడుచుకుని 'మీరు కొన్నారు చూశారూ ఫొటోస్టాండు అ వారిది' అని గుమ్మంవార నిలబడివున్న ఒక స్త్రీని చూపించాడు. ఆమె కుచ్చెళ్ళ మధ్యని ఓ చిన్న కుర్రవాడు నిలబడి వున్నాడు. ఆమెకు సుమారు ఇరవైమూడు సంవత్సరాలు వుండవచ్చు.

మేనేజరు గొంతు తగ్గించి "డబ్బుకోసం వచ్చింది పాపం. ఆమెది ఓ పెద్దగాథ. అయినవాళ్లందరికీ దూరమై నమ్ముకున్న ప్రియుడుతో ఇంతదూరం వచ్చి కలో గంజో తాగి బ్రతుకుతుంటే దేముడు ఆమెకు పసుపుకుంకుమ లేకుండా చేసేశాడు. ఆడబిడ్డ కష్టాలు పడుతూంది" అని అతను ఫొటోస్టాండు తీసుకువచ్చి ఒకచోట వేలుపెట్టి చూపిస్తూ 'చదవండి' అన్నాడు.

నేను దుమ్ముదులిపి 'ప్రేమ బహుమానం' అని కింద పేరు పోల్చుకోలేక తడబడుతూంటే 'అతని పేరులెండి. ఆమెకీ అతనికీ ఉన్న అనుబంధం ఎంత గాఢమయినదో, పవిత్రమయినదో చూశారా. అతను ప్రేమగా సమర్పించిన ఈ బహుమతికూడా అమ్ముకునే స్థితిలో ఉంది పాపం అయినవాళ్ళు వెలేశారు. ఎవరాదరించగలరు" అంటూ నిట్టూర్చాడు.

ఆమె తలవంచుకుని కుర్రవాణ్ని దగ్గరగా తీసుకొని అక్కడే నిలబడివుంది.

నౌకర్లు చేసే పెద్ద పెద్ద ధ్వనుల్లో మా మాటలు రెండో వారికి వినిపించే అవకాశం లేదు.

"మరి ముందు జీవితం?"

రెండుచేతులూ పైకెత్తి ఆకాశంవైపు చూపిస్తూ 'భగవంతుడి ఇచ్ఛ' అన్నాడు మేనేజరు అర్ధనిమీలిత నేత్రాలతో.

గుమాస్తా పుస్తకాలు పట్టుకుని వచ్చి డబ్బు పుచ్చుకుని రసీదురాసి నాకిచ్చాడు. మేనేజరు ఫొటోస్టాండు నా చేతిలో పెడుతూ "సంచీలో పెట్టుకోండి. ఆమె చూస్తే బాధపడుతుంది" అని కదలబోతుంటే నేను మరో పదిరూపాయలు అదనముగా ఇస్తూ 'ఇది దానం అన్న విషయం ఆమెకు చెప్పకండి' అన్నాను.

అతను ఆ సొమ్ము ఆమెచేతిలో వెయ్యటం — ఆమె లెక్క చూసుకుని డబ్బు ముట్టినట్టుగా వేలు ముద్దర వేసి పిల్లవాణ్ని చంక నెత్తుకుని బరువుగా వెళ్ళిపోవటం ఈనాటికీ నా కళ్లముందు మెదుల్తూనే ఉంటుంది. ఆ కుర్రవాని తప్పటడుగులు నా హృదయంలో కదుల్తూనే ఉంటాయి. ఆమె దైన్యమైన జీవితం మనసులో చెరగని ముద్రవేసి ఎన్ని సంవత్సరాల నుంచో పరిచయమున్నట్లుగా నిలిచిపోయింది.

నేను ఈ గాథంతా అరుణకి చెప్పలేదు. ఆమె సున్నితమైన మనస్సు గాయపర్చటం యిష్టములేక కొన్ని అబద్ధాలుకూడా ఆడాను.

ఆమె ఆ వస్తువు అందానికి ముగ్ధురాలవుతూ 'ఎంత బాగుందండి. అయితే ఇక్కడ ప్రేమ బహుమానం అని రాసి ఉందేమిటి?' అంది.

కంగారు కప్పిపుచ్చుకుంటూ 'అవును ప్రేమ బహుమానం కాదూ? నేనే చెక్కించాను' అన్నాను.

'కింద ఇంకో పేరు ఏదో ఉన్నదే' అని ఆమె దాన్ని పరీక్షించబోతుంటె ఆమె చేతిలోంచి ఆ వస్తువు లాక్కుని 'అదా? అక్కడ కొద్దిగా ముక్క

పోయిందిలే...అంతే. అంతకు తప్పించి మరేమీ లేదు" అని సర్ది చెప్పాను.

గరుకు కాగితం తెచ్చి ఆ వస్తువుని శుభ్రం చేసాను. మర్నాడు అనుకొన్నట్టుగా విడివిడిగా ఇద్దరం ఫోటోలు తీయించుకున్నాం. ఆ రెండు ఫోటోలు ఆ స్టాండులో అమర్చాం: ఆ రోజల్లా దానివైపే చూస్తూ కూర్చున్నాం. రకరకాలుగా ఆలోచించాం. మా ఆలోచనలు ఎంతవరకూ పోయినాయంటే ఆ స్టాండుయొక్క అందం ద్విగుణీకృతం కావటంకోసం పక్కన ఒక ఖరీదైన రేడియోకూడా అవసరం అన్నంతవరకూ పోయాయి. అరుణ నవ్వేసి బాగుందండి. నాడా దొరికిందని గుర్రం కొనాలనుకున్నట్టు ఒకతను. అలాగుంది మీరు చెప్పేది' అంది.

నాకు అభిమానం వేసింది. 'అయితే ఆపాటి స్తోమతు లేదనా నీ అభిప్రాయం' అన్నాను పౌరుషంగా నే.

'అది కాదండీ లేదని ఎవరన్నారు? అసలు మన ధోరణి చెబుతున్నాను" అంది అరుణ అనునయించే ధోరణిలో.

అరుణకు ఆ వస్తువు రానురాను ఎంత ప్రీతి పాత్రమయిందంటే ఒకనాడు అది టేబిల్ మీంచి జారి కిందపడితే ఆమె కన్నీరు ఆపుకోలేకపోయింది. 'ఎంత తప్పు చేశాను'అన్నట్టుగా బాధగా నావైపు చూసింది.

ఇలా రోజులు వెళ్ళిపోతున్నాయి.

అరుణ తొలిపంటగా పండులాంటి పిల్లవాణ్ని పొత్తిళ్ళలో వేసుకుని గడపతొక్కింది. అనుకున్న వ్యవధికంటె ముందే వచ్చేసింది కూడా, అత్తగారు కూడా వచ్చారు.

నేను ఎదురుగా వెళ్ళి పిల్లవాణ్ని అందుకోవటానికి సిగ్గుపడ్డాను. అరుణ నా కళ్ళల్లోకి చూడటానికే సిగ్గుపడిపోయింది.

అత్తగారు గలగలా జలపాతంలా మాట్లాడే మనిషి! ఆవిడ ధోరణి వినటానికి విసుగ్గా నే ఉంటుంది. రెండు మాసాలు కూతురికి సహాయంగా ఉండి ఆవిడ వెళ్ళిపోయింది.

అరుణా, నేనూ, పిల్లాడూ మిగిలాం. అరుణకి ఎంతసేపూ వాడితో సరిపోయేది.

ఏం కాలం వచ్చిపడిందమ్మా పిల్లాడికిపోతపాలా! ఈ ఆడబిడ్డల బలాలు అలా ఉన్నాయి" అంటూ దవడలు నొక్కుకుంది పనిమనిషి.

ఆమె ఆశ్చర్యంలో శేషబబు ఏమీలేదు. ప్రతి నెలా పది పన్నెండు రూపాయలు వాడ్రికింద ఖర్చు.

వాడికీ కాస్త లేచీలబాటం ఏదైనా ఆసరా ఉంటే పాలుగుడుకులు వెయ్యటం వచ్చేసరికి అరుణ అన్నం సయించటంలేదనీ, ఒంట్లో బాగా ఉండటం లేదనీ, వాంతులు వెళ్ళుతున్నాయనీ బద్ధకంగా అస్వగతాలు మొదలుపెట్టింది.

పనిమనిషి జోస్యం చెప్పింది. అయిదురూపాయలు పుచ్చుకున్న డాక్టరూ అమాటే చెప్పింది. నామటుకు నాకు "మళ్ళీనా?" అనిపించింది.

అరుణ ఈమారు ఆడపిల్లని కన్నది. సంవత్సరానికి ఆరుమాసాలు హోటలుతిండి తినడంతో సగం అయిపోయాను. ప్రాణాలు కళ్ళల్లో పెట్టుకుని అరుణకి స్వాగతం చెప్పాను.

మూడోమారు అరుణే సిగ్గుపడింది. "బాగుందండీ, తొలిసారీ మలిసారీ ముద్దుగా ఉంటుందిగాని ఏటా పుట్టింటికిపోవటానికి అభిమానంగా ఉంటుంది. ఇక్కడే హాస్పిటల్లో పోసుకుంటాను. అంతగా కావలిస్తే ఆ పది రోజులూ అమ్మవచ్చి చేసిపెడుతుంది" అంది.

అరుణ గండం తప్పి బయటపడింది. కడుపులో నే బిడ్డ చనిపోయింది. పెద్దప్రాణం దక్కినదని తృప్తిపడ్డాను. అరుణకి పెద్దజబ్బే చేసింది. ఖర్చు సంగతి సరేసరి.

పదిరోజులుండటానికి వచ్చినఅత్తగారు నెల్లాళ్ళవరకూ కదిలేఆస్కారం లేకపోయింది. అరుణ కాస్త ఓపిక చేసుకొని నా సహాయంతో రోజులు నెట్టుకొస్తూంది. పిల్లలు బరువైపోయారు. వాళ్ళని సమర్థించుకోలేక అరుణ నలిగిపోయేది.

జీవితం అసిధారావ్రతంలాగుంది.

అరుణ రక్తమంతా హరించిపోయి తెల్లగా పాలిపోయింది.

ఓపిక లేదు. ఆఫీసులో పని రద్దీ ఎక్కువగానే ఉంది. మనసులో గుబులుగుబులుగా, తిక్కగా ఉంటుంది.

మా ఫోటోస్టాండు సంగతి అప్పుడు మా యిద్దరిలోనూ ఎవరికీ పట్టలేదు. పనిమనిషే అప్పుడప్పుడు దాన్ని శుభ్రంచేస్తూ ఉండేది. "అప్పటికీ ఇప్పటికీ అసలు పోలికే లేదు. ఎంత చిక్కిపోయారు!" అంటూ ఆశ్చర్యం ప్రకటిస్తూ ఉండేది.

"నీపని నువ్వు చూసుకో. అనవసరపు ప్రసంగం" అని అరుణ విసుక్కునేది.

ఆస్టాండు చేతిలోకి తీసుకొని కాసేపు తదేకధ్యానంగా చూసి మళ్ళీ అక్కడపెట్టేసి ప్రేమ బహుమానం అని అస్పష్టంగ అనుకొన్నాను మనసులో.

ఒకనాడు ఆఫీసునించి ఇంటికి వచ్చేసరికి అరుణ ఉన్నట్టుండి కొంప మునిగిపోయినట్టుగా 'ఇక ఈ ఇంట్లో ఒక్క నిముషం వుండటానికి వీల్లేదండీ మరో ఇల్లు చూసుకుందాం' అంది.

నేను ఆశ్చర్యర్యంగానే ఏమిటి కారణం? అన్నాను.

గొంతు తగ్గించి 'ఈ పక్క డాబాఉంది చూడండి. అందులోకి ఓ పరువులేని ఆడది చేరింది. ఇలాంటి పొరుగున ఉండకూడదు.'

ఆమె ఊహించినంత అసహ్యం నా ముఖంలో ద్యోతకం కాకపోవటంతో అరుణ ముఖమంత చెండుకుని 'ఏం మొగవారండీ! ఏదో సామాన్యమయిన విషయంలా చూస్తారేం. చేతనయితే వీధిలో వాళ్ళంతా కలిసి ఆవులటని, ఆ నీతిలేనిదాన్ని అక్కణ్ణించి వెళ్ళగొట్టండి. లేదంటారా మనమయినా యిక్కడ్నించి ఖాళీ చేసిపోదాం.' అంది.

'ఇంతకీ ఆమెను నేను చూడలేదు. ఆమె గురించి నేను వినలేదు. నాకంటె ముందు నీకెలా తెలిసింది.'

'పనిమనిషి చెప్పిందండి. నేనూ కనిపెట్టాను' అంది అరుణ నెత్తి మొత్తుకుని.

నేను ఆమెను రిక్షాలోంచి దిగుతుండగా చూసి ఆశ్చర్యపోయాను. ఆనాడు చిన్నపిల్లవాణ్ని పక్కన పెట్టుకుని గుమ్మంవారగ ఒదిగి డబ్బుకోసం నిలబడ్డ స్త్రీ మూర్తి కంటిముందు మెదిలితే నిశ్చేష్టున్నయి చూస్తూ నిలబడిపోయాను.

అరుణ గుమ్మంలో నిలబడి "ఆమె అందానికి ముగ్ధులయి పోతున్నారా?" అంది.

తెప్పరిల్లి ఈ కఠినమయిన ధోరణికి కోపం వచ్చినా తమాయించుకుని 'మాటలు జాగ్రత్తగా ప్రయోగించాలి అరుణా' అన్నాను.

'రెండువీధుల అవతల రెండిళ్ళు ఖాళీగా ఉన్నాయట పోదాం' అంది అరుణ.

అలాగే అని నేను నా గదిలోకిపోయి ఆలోచిస్తూ కూర్చుండిపోయాను. దిక్కులేని దీనురాలు, తనదగ్గర దానం పుచ్చుకున్న అభాగ్యురాలు ఇలా మారిపోయిందే అన్న ఆలోచనతో అలిసి నిద్రపోయాను.

నిద్రలో రూపాయలు గలగలలాడుతూ మీద వర్షిస్తున్నట్లుగా కలవచ్చింది.

అరుణ చెప్పింది. ఆమెపేరు 'రాధ'ట అంతా 'రాధాభాయి' అని పిలుస్తారుట.

నేను అరుణ ఒత్తిడి పడలేక ఇల్లు మార్చేసాను. మంచిపని చేశాను అని నామటుకు నేనూ తృప్తిపడ్డాను.

అరుణ దేముడుగుళ్ళో అమ్మవారికి పూజ చేయించింది.

అయినా ఆమె రాధాభాయిని మర్చిపోలేదు. ముఖం వెగటుగా పెట్టుకుని 'ఏం జీవితం? పాడు బ్రతుకులు! ఆ వెధవ బ్రతుకులు బతక్కపోతే చావకూడదూ" అంటూ అసహ్యించుకుంటూనే ఉండేది.

పనిమనిషి రాధాబాయినిగురించి ఒద్దన్నా ఏదో ఒకటి చెబుతూ ఉంటుందని అరుణ దాన్ని కూడా మానిపించేసి కొత్తి పనిమనిషిని కుదుర్చుకొంది.

కొత్తయింట్లో అరుణ ఫోటోస్టాండుని టేబిల్ మీద అమరుస్తూంటే నామనసులో అదోరకంగా అనిపించింది. పడుపు వృత్తిచేసుకునే ఆడదాని వస్తువు సంసారుల ఇళ్ళల్లో వాడుకోవటమా అనిపించి సరిపడక "ఆస్టాండు తీసెయ్యి అరుణా" అన్నాను.

అరుణ ఆశ్చర్యంగా ఏం? అంది.

"అదేం బాగులేదు. ఇంకోటి మంచిది తెస్తానుగా" అన్నాను. అరుణ అనుమానంగా" ఏదో కారణం ఉంది. చెప్పండి" అంటూ రొక్కించ సాగింది.

"ఏమీలేదు ఊరికేనే"

# బహుమానం

"అయితే ఫర్వాలేదు నాకు చాలా బాగుంది, అది బాగులేదంటే ఎవరేనా నవ్వుతారు."

"అదికాదులే చెప్పినట్టు చెయ్యి దాన్ని పెట్లో పడెయ్యి" అన్నాను విసుగ్గా.

'ఎందుకో చెప్పండి బాగులేకపోవటం ఒక్కటే కారణం అంటే నమ్మలేను.' అంది అరుణ దగ్గరగా వచ్చి.

నేను వెనక్కి తిరిగి కిటికీ గజాలుపట్టుకుని 'ఆ వస్తువు రాధాభాయిది' అన్నాను.

'హా!' అన్న ఒక్కముక్క తప్పించి ఆమె నోటమాట రాలేదు. అరుణ ఎర్రబడిన ముఖంతో 'ఆ రహస్యం ఇన్నాళ్ళుగా ఎందుకు దాచారు' అంది.

'నేనేకాదు నువ్వూ ఇవ్వాలివరకూ దాని సంగతే పట్టించుకోలేదు. ఇవాళ ఆవస్తువు ప్రత్యేక శ్రద్ధతో ఆ టేబిల్ మీద అమరుస్తుంటె వెగటుగా తోచింది.' అన్నాను.

'ఇప్పటికయినా చెప్పారు నయం' అని అరుణ ఆ ఫ్రేములోంచి రెండుఫోటోలు ఇవతలకి తీసి దాన్ని గదిమూలకు గిరవాటుపెట్టింది. అది వెళ్ళి పాత బట్టలమూటమీద పడింది. లేకుంటే ముక్క చెక్కలయేది ఆవిసురుకి

నాకు ఓ ఆలోచనతట్టింది. 'ఎలాగూ పనికి రానప్పుడు ఆవస్తువు ఇంట్లో ఉంచటం దేనికి? అమ్మే ద్దాం...ఎంతోస్తే అంతే' అన్నాను.

'అలాగే చెయ్యండి' అంది అరుణ
నేను ఆ వస్తువుని తీసుకొని మెట్లు దిగబోతుంటే అస్పష్టంగా తప్పు చేస్తున్నానా అనిపించి "పోనీ ఉంటే ఏం?" అన్నాను.

"మీదంతా వెర్రితనం అలాంటి వస్తువుల్ని ఇంట్లో పెట్టుకొంటామా?" అంది అరుణ.

"కాదు మన తొలినాటి..."

అడ్డుపడుతూ అరుణ "అక్కర్లేదు, మన ప్రేమకి చిహ్నాలు ఈపసిపిల్లలు లేరూ? ఇలాంటి పాపిష్ఠివస్తువులు మనకి వద్దు" అంది.

నేను వేలంపాట మేనేజర్ని కలుసుకుని సంగతి చెప్పాను.

అతను ఆశ్చర్యం ప్రకటిస్తూ, "ఇంత మంచి వస్తువు దేనికిసార్ అమ్మటం?" అన్నాడు.

"కాదు మేనేజరుగారూ. అమ్మేసెయ్యండి విషయం మీకే తెలుస్తుంది" అన్నాను.

ఆయన వస్తువు తీసుకుని 'సరే' అని నిట్టూర్చాడు.

నేను లేచి "మళ్ళీ ఎప్పుడు రమ్మంటారు?" అన్నాను.

"రేపు ఆదివారంనాడే పాట పెడతాం. సోమవారం రండి. వీలుంటే రేపే రావచ్చు."

నేను ఇవతలకి వచ్చేశాను. హృదయం తేలిక పడింది. అరుణ మాటలు జ్ఞాపకం వచ్చాయి అరుణ చెప్పింది నిజం!

ఆదివారంనాడే నేనూ వేలంపాటకు వెళ్ళాను. దూరంగా నిలబడ్డాను. ఆ పూట వాన బాగా కురిసి ముసురుగా ఉందని కాబోలు జనం అంతగా రాలేదు. పాట మొదలయింది.

నా ఫోటో స్టాండుకూడా పాటకి వచ్చింది.

నాగుండెలు ఎందుకో దడదడ మన్నాయి.

ఇదిగిదండో ఇదుగో సండోయ్! అన్న కంఠం నా చెవుల్లో మారుమ్రోగింది.

ఆ గొడవలో ఎవరు పాడారు, ఎంతకి పాడారు నాకు వినిపించలేదు పాటగాడు మరోవస్తువు అందుకున్నాడు.

జనాన్ని తప్పించుకొంటూ నెత్తిన ముసుగు వేసుకున్న ఓ స్త్రీ నా ఫోటోస్టాండుని హృదయానికి దగ్గరగా హత్తుకొని ఇవతలికి రావటం చూసాను. ఆమె వీధిదీపం వారనిలబడి 'రిక్షా' అంటూ పిలిచింది.

ఆమె నెత్తిమీద ఉన్న ముసుగు వెనక్కి జారిపోయింది. దీపం వెలుగులో ఆమెను గుర్తుపట్టాను.

ఆమె రాధాభాయి!!

నిన్న జరిగిన సంఘటన ఇది,

రాత్రి అరుణ 'ఏమిటో ఈ జీవితాలు...ఒక మొగవాడు, ఒక ఆడది ఒకచోట చేరటం—పిల్లలూ... బాధలూ...ఏమిటీ బ్రతుకులు! రానురాను మనమీద మనకే అసహ్యం పుడుతోంది' అంది కన్నీటితో. నేను చప్పునవారిస్తూ 'అలా అనకు అరుణా మనజీవితం విలువ మనకి తెలియదు...ఆ విలువ తెలిసినవారు వేరే ఉన్నారు.' అన్నాను.

# పాస్టర్ నాక్ ఖండకావ్యాలు

శ్రీ ఏ. సోమసుందర్

బోరిస్ పాస్టర్ నాక్ కవి, కథకుడు అనువాదకుడు, జననం 1890 లో. ప్రముఖ రష్యన్ విప్లవకవి మయకోవిస్కీ ప్రారంభించిన భవిష్యత్కవితోద్యమం (Futurist Poetry) లో ఈయన ప్రముఖపాత్ర వహించాడు. భావకవిత్వ పునరుజ్జీవనవాద మీయన కవితలో గోచర మవుతూన్నదని ప్రముఖాంగ్ల విమర్శకుడు జార్జి రెవీ 'నేటి సోవియట్ సాహిత్యం' అనే తన విమర్శగ్రంథం (142 పుట) లో తెలిపాడు. ఈ కవి కృతులలో కొన్ని ముఖ్యమైనవానిని సంపుటీకరించి 'లిండ్సే డ్రమ్మన్ లిమిటెడ్, లండన్ ప్రకాశకులు 1946 లో గ్రంథంగా ప్రచురించారు. ఈ కవి గేయాలను ఇంగ్లీషులోకి జె. యం. కోహేన్ అనువదించారు. 1948 లో పీపుల్సు పబ్లిషింగుహౌస్ బొంబాయి వారు ఆ గ్రంథాన్ని బహుళంగా ప్రచారం చేసి విక్రయించారు.

రష్యన్ విప్లవానికి పూర్వస్థితిని దృష్టిలో వుంచుకొని శ్రీ పాస్టర్ నాక్ యిటీవల రచించిన 'డాక్టర్ ఝివాగో' అనే నవల సోవియట్ పాఠకులలోనూ, రచయితలలోనూ తీవ్ర సంచలనానికి గురిఅయింది. విపరీత విమర్శకులకు కారణభూతమైంది. ఈ నవలను ఒక యిటాలియన్ గ్రంథప్రకాశనసంస్థ నిరుటి సంవత్సరం ప్రచురించింది. ఈ యేడాది ఆ నవలకు నోబెల్ బహుమానంకూడా ఇవ్వబడింది.

రష్యన్ సాహిత్యంలో మణిదీపాలనదగిన టాల్‌స్టాయి, గోర్కీ, ఛెకోవ్, డాసవిస్కీ షొలొకోవ్, ఇల్యా ఎహ్రెన్‌బర్గు మున్నగు ప్రముఖరచయితల ఉత్కృష్ట నవలలకు లభించని ఈ గౌరవం పాస్టర్ నాక్ నవలకే రావడమంటే దానివెనుక ఏదో రాజకీయపు టెత్తు వున్నదని సోవియట్ సాహిత్యసంస్థలు, ప్రభుత్వము భావించడంలో వైపరీత్యం లేదేమో!

ఏమైనా ఈ కవి 1945 పూర్వం రచించిన ఈ గేయకృతులన్నీ అపూర్వకవితాసౌరభంతో విలసిల్లుతున్నవి. ఈయన రష్యన్ భాషలోనికి షేక్స్పియర్ నాటకాలను, షెలీ, కీట్సు మున్నగు ప్రముఖాంగ్లకవుల కృతులను అనువదించి, ప్రచురించి, విశేషకీర్తి సముపార్జించుకున్నాడు.

'హేమంతరోదసి' అనే ఈ క్రిందిరచన లిండ్సే డ్రమండ్ వారి గ్రంథంనుంచి స్వీకరించబడ్డది. రష్యన్ మూలంలోని ఛందస్సునుగాని, ఆ భాషా సంప్రదాయాలకు పరిమితమైన సంకేతాలనుగాని ఆంగ్లానువాదకుడు స్వీకరించలేదు. అట్టే తెలుగులో సంప్రదాయానుగుణమైన ఛందస్సు, పదచిత్రాలు అనువాదంలో మలచుకొనివలసి వచ్చింది.

## హేమంతరోదసి

సరిగానే చెబుతున్నా, ఒక వారంక్రిందటనే
చుక్కల పెనువెలుగు వాక పొగమంచును చీల్చివెడలె!
హిమబిందు స్నపితమూర్తి ఘలంఘలల మొరసి నడచె,

## పాస్టర్‌నాక్ ఖండకావ్యాలు

గాజుతలుపు బ్రద్దలైన సవ్వడివలె యామినీధుని గడచెను,
మంచుగడ్డ పలకపైన జారినటుల, సంతసాల
పంటకోసి కుప్పవేసుకొనెను నాడు !

మంచుగడ్డపై నడిచే సాహసయాత్రిక, వినుమా !
సావధానచిత్తుడవై వేయవలయు ముందు కడుగు !
లేకుంటే నీ యడుగులు తడబడిపడిపోదువులే !
మలుపుతిరుగు దోవ, సులువుకాదు, నీవె నీకు బరువు
తెరువెవ్వరి వేడెదవో - తరిగే దార్ఢ్యము కడవర !

ఇరుల దొంతరల కొండకు యినుపగొలుసుతో గాలిని
బంధించిన నిశీధ మిది, పగతో విషసర్పకులా
యము లన్నీ తెరచె నదే ! శర్వరీరహోగీతుల
శల్యకుల్యముల పరచెను, సావధానచిత్తుడవై
సాగించుము ముందుకు పథికా !

చలికాలపు పెనుగాలుల వేటకుక్క మెడగంటలు
నలుగడలకు పరచె భీతి ! నిశిరక్కసి యినుపమడిమ
కలిగించెను నెలవంకకు ఘనీభావవిషరూపము !
ఊపిరినలుపని నాలుక లావా కీలల నుమిసెను,
నోళుల లాలాజలములు గడ్డకట్టుకొనిపోయెను,
సావధానచిత్తుడవై సాగించుము జీవయాత్ర !

## సుప్తారామం

సుప్తారామము వెదజల్లెను జీర్ణపత్రముల -
కరగి కాలి నుసియైపోయిన యిత్తడిరేకుల;
నాతో, నా సహచారిణి దీపశిఖాపింఛముతో -
సప్తవర్ణదీధితిమయ విశ్వమహాజ్యోతిర్మయి
—ప్రేలుచుండె తలక్రిందుగ !

వినిపించని దేదో జీవపరమార్థము
రహస్యమై, శ్రవఃపేయనిశ్వనమై, సుహాసమై,
వినిపించెను లోలోపల; నిశాశిఖరి తిమిరగర్భ
సోపానము లొకటొక్కటి — తారావళి నూతగగొని
—ఆరోహించెద నొంటిగ !

గిరిమల్లికశాఖలవే, వియద్రాజ్యజయకేతన
ధ్వజముల నెత్తిన రీతిగ - గర్వోన్నతమై నిలచెను;
శుష్కపత్ర సముచయాల, జీర్ణకుసుమసమూహాల -
చాంద్రీబింబావరణము కప్పుచుండె మేలిముసుగు -
తెరల మరల సుతారముగ !

అదిగో అదె కాసారం - ఎదవెలువడు రహస్యమై
పదిలముగా గుసగుసలతో బదరీపాదపముతోడ,
పలుకుచుండె, తీవ్రకాంక్షవోలె నిలచి, పిలుచుచుండె,
ప్రేల్లిత జలధరపంక్తుల నంబర మదె మొగసాలల
నారామస్థగితమై శ్రీ సుమసదనము భాసించగ !!

# కలగూరగంప

## డాక్టర్ ఝివాగో

స్టువార్ట్ హాంప్‌షైర్

డాక్టరు ఝివాగోకన్న గొప్ప నవల గత ఏభైఏళ్లలోగా వెలువడలేదని మనం నిస్సందేహంగా చెప్పవచ్చును. ఇది ఏ పరిస్థితులలో వ్రాయబడినదో తెలిసినప్పటికీ, మన అభిప్రాయాలపై ఈ పరిస్థితుల ప్రభావ మేమిటో గ్రహించినప్పటికీ, ప్రపంచ యుద్ధానంతరం ఇటువంటి రచన వెలువడలేదని ఒప్పుకోవాలి.

మన దేశంలో ఈ నవలను గురించి బయలుదేరిన ఉత్సాహానికి మన మంతగా ఆశ్చర్యపడనక్కర లేదు. రాజకీయాలనబడే వాటితో గాని, కమ్యూనిజంతో గాని గ్రంథకర్తకు కలిగిన భంగపాటులపై దాక్షిణ్యంతో గాని, ఈ ఉత్సాహానికసలు సంబంధం లేదని నా అభిప్రాయం. ఈ నవల చదివిన వెంటనే పాశ్చాత్యులకు కలిగే అనుభూతి ఈవిధంగా విశదీకరించవచ్చు ననుకుంటాను: వీరికి తమ గత చరిత్రలోని మహత్తరమైన అనుభూతులు జ్ఞప్తికి వస్తాయి; ఊహాపూరితమైన గతకాల పునర్నిర్మాణము, ఒక సమగ్రదృష్టి, సంపూర్ణమైన సందేశాన్నదించగల సంప్రదాయము, జ్ఞాపకం వస్తాయి: సాంఘిక పరిణామాల భీభత్సాల తీవ్రత ఈ సంప్రదాయాన్ని అంతమొందించిందని నమ్మేవారికి ముఖ్యంగా ఈ అనుభూతి కలుగుతుంది. విభిన్నమైనప్పుడే, వ్యంగ్యమైనప్పుడే కళ ఉత్కృష్టమవుతుందనే ఊహ మనలో స్థిరపడిపోయింది. గడిచిన శతాబ్దంలోని సారస్వత కాంతులు, తాత్త్వికసంస్కృతి ఇంకా నేడొక ఒక రచయిత ప్రతిభలో సజీవంగా ప్రతిఫలించడ మసంభవం. పాస్టర్ నాక్ లో ఇవన్నీ సంభవించడం ఆశ్చర్యకరమైన యాదృచ్ఛిక సంఘటన. డా. ఝివాగో చదివినప్పుడు ఒకమహా ప్రళయం మధ్యలో గతంలోనిదొక మార్గం స్పష్టంగా సురక్షితంగా ఉన్నట్లనిపిస్తుంది. అసాంస్కృతికము సుదీర్ఘము అయిన ఈ రచయిత ఏకాకిత్వమే ఈవిధంగా పరిణమించినదేమో. సమకాలికుల ప్రభావం తప్పించుకోవడంవల్లనే



బోరిస్ పాస్టర్ నాక్

ఈ రచయిత కళ ఈవిధంగా పరిపక్వం చెందినదేమో. పాశ్చాత్యులలో కలిగిన కదలిక, ఏదో ఒకముక్తి కలిగినదన్న భావంతోను ఒకరకమైన పురాప్రవాహణీయతతోను, ఆవిర్భవించిన దవడంలో సందేహం లేదు. ఒక నిశ్చితమైన వ్యాయము స్వేచ్ఛాప్రవర్తన వీలుండే స్వర్ణయుగంలోనికి తిరిగి వెడుతున్నామనే ఊహ కలుగుతుంది.

ఫ్రాన్సు, బ్రిటన్, అమెరికాలలో నవలా రచనపైన డాక్టరు ఝివాగో ప్రభావమేమాత్రం ఉండదు.

ఆ నవలా రచనా ప్రవాహంగతిలోది మరీ దూరమయి పోయినది; గత ముప్ఫై సంవత్సరాల పోకడలకు దీనికీ సంబంధం ఏమీ లేకుండాపోయినది. ఇదివిస్మృతిమైన ఒక సంస్కృతికి చెందినట్లనిపిస్తుంది. ఈ నవల థామస్ మాన్ రచనల కోవలోనిది. అంతేకాని ఫాల్క్‌నర్ సార్త్రేల నవలలకోవకిది చెందదు. దీనిలోని స్వేచ్ఛ. నిరాడంబరం అనుకరించరానివి; అభివృద్ధి చేయజాలనివి. ఎందుచేతంటే ఒక విషయంయొక్క భీభత్సంలోకి సొరొక్కగలిగిన తత్వము, ఆ తత్వంలోని పృథగ్విన్యాసము ప్రాచ్యదేశాలలో ఎవరికీ లేవు. ఈ నవలలో పాస్టర్నాక్ సింహావలోకనం చేస్తున్నాడు: తన ఆత్మ సందేశం చాటుకున్నాడు. కమ్యూనిష్టు విప్లవం అతని అనుభవాలలో ఒకటి గనుక ఇది కేవలం సాధారణమైన సింహావలోకనం కాదు ఇతడు భావి జీవితాన్ని నిరూపించగలననుకున్న సిద్ధాంతాలతో సమాధానపడ్డాడు. ఇటు పాశ్చాత్య రచయితలేమో ఒక నిర్ణయానికి రాలేక దేనికో నిరీక్షిస్తూ ఉన్నారు. ఒక విధమైన అరాజకంలో అవాంతర స్థితిలో (interregnum) లో నిర్జీవంగా ఉన్నారు. ప్రత్యేకమైన అనుభవసిద్ధమైన ఆశయాలేవీ వారికి లేవు. వ్యంగ్యధోరణికీ, విలక్షణమైన భావప్రకటనకీ వీరు లోబడిపోయారు. గడిచిన నలభైఏళ్ళ మన అనుభూతులనంచనా వేయలేకుండా ఉన్నారు.

ఈ నవలలో మనము ఎదుర్కొనే చిక్కు, దీర్ఘధ్యానానంతరం అతి జాగ్రత్తతో వ్రాయబడిన ప్రతి రచనలోను ఎదుర్కొనేదే. షిల్లర్ ఉద్దేశించిన అర్థంలోనే ఇది నిరాడంబర (naive) మైన రచన: అంటే సాధారణంగా ఆ (naive) మాటకున్న అర్థం దీనికి వర్తించదు. నవలలోని భాషవల్ల కూడా మరొక సమస్య తయారవుతుంది. మనం మామూలుగా చదివే రష్యన్ పుస్తకాల ఆంగ్లానువాదాలకంటే ఈ రచన ప్రత్యేకంగా బాగున్నది. లోపాలసలు లేవని కాదు. రష్యన్ మాతృకలోని భాష ఎంత సంపన్నమైనదో ఈ అనువాదం సూచిస్తున్నది. పేదసాదల సంభాషణల ఘట్టాలలో ఈ విషయం ఇంకా వ్యక్తమవుతుంది. రష్యాకు సంబంధించిన ప్రతి విషయంలోను ప్రగాఢమైన అభిమానం వ్యక్తమవుతుంది. గ్రహించినవారికి ఇంగ్లీషువారికి పరిచితంకాని తర్కాతీతమైన ఒక దేశభక్తి కూడా వ్యక్తమవుతుంది. రష్యన్ దృశ్యాలపైన, సంభాషణలపైన ఉండే అభిమానం, గాఢానుభూతి, శైలియందలి అర్థచ్ఛాయల మార్పుల ద్వారా గోచరిస్తాయి. ఆ దేశస్థులనివి ఎంత గాఢంగా కదిలించగలవో గ్రహించగలుగుతాము, కథకు ప్రధాన విషయమైన విప్లవం, పాత్రల యోగవియోగాలు ఎంత ముఖ్యమైనవో ఈ సంభాషణలు.దృశ్యాలు కూడా అంతముఖ్యమైనవి. భిన్నభిన్నదృశ్యాల తర్వాత వచ్చే ప్రశాంతత, హింసాత్మకమైన ఘాతలము, పరిణామము ఒకవిధమైన అతిసున్నితమైన సాన్నిహిత్యం సూచిస్తాయి. సంగీతంవలె మానసిక వృత్తిని అనుసరిస్తాయి అందువలనే మొదటి నూరైదు పేజీలు చాలా మందకొడిగా నడుస్తాయి. ఒకదానికొకటి సంబంధం లేని భావాలు, ఎక్కడో చివరికిగాని సరిగా తెలియని పాత్రలు ప్రవేశిస్తాయి పాస్టర్నాక్ కథ సరిగా నడపడానికికూడా ప్రయత్నించడు. ఆయన ఒక తాత్వికమైన నవల వ్రాస్తున్నాడు. తన భావాల, అనుభూతుల సారాంశం విశదీకరిస్తున్నాడు నవలలోని పాత్రలేమవుతాయో అన్న ధ్యాస అతనికి లేనేలేదు. కథలోని 'విలన్' కేవలం సమాజంలోని నైచ్యం నిరూపించేందుకు మాత్రం సృష్టింపబడ్డాడనే అనుమానం కలుగుతుంది. కథానాయకికీ ఇతనికీ ఉన్న సంబంధం కూడా కొంచెం హాస్యాస్పదమైనదే.

ఈ కారణాలవల్ల, ఇంకా ఇతర కారణాలవల్ల టాల్‌స్టాయికి పాస్టర్నాక్‌కు పోలికే కుదరదు. అనాకరినీనాలోని కథాప్రారంభము, పాత్రల సజీవత సహజములనిపించే వారి జీవితాలు. డాక్టరు ఝివాగోలో కనుపించవు. ఝివాగో చిత్రణం కూడా అసంపూర్ణంగానే జరిగింది. పాత్రల జీవితాలు పూర్తిగా మనకళ్ళకు కట్టినట్లుండవు కథలోని సంఘటనలు ముఖ్యపాత్రలతో సరిగా అతకవు. పాతసమాజం కూలిపోయి క్రొత్త వ్యవస్థ ఏర్పడుతూ ఉండగా కలిగే భయము, వ్యాకులత, ఇవి ఏవి కథానాయకీనాయకుల భావాలలో తప్ప ఇతరత్ర కనిపించవు. ఈ రచయితపైన ప్రభావమేదైనా ఉంటే అది షేక్స్పియర్‌దే. ఉపపాత్రలు వాడే ఆవేశపూరితమైన సంభాషణలు చిన్న చిన్న సంఘటనలు ఆంటోనీ క్లియోపాత్రాలో (Anthony and Cleopatra) వలెనే, అతి దూరంలో సంఘటనలు జరుగుతున్నాయనే భావం కలిగిస్తాయి. పాస్టర్నాక్ సృష్టించిన రష్యాలో. ఐంద్రజాలికులు, వేదాంతమూర్తులు కూడా ఉన్నారు. వీరితోబాటు కాలుష్యాన్ని తప్పించుకుందామని ప్రయత్నించే ఆదర్శానురాగ చిత్రణలు కూడా ఉన్నాయి ఈ విధమైన ప్రపం

చంలో వ్యక్తిత్వానికి స్థానం లేదు. ఎందుకో నే నిక్కడ సరిగా చెప్పలేను కాని షేక్స్పియర్ లో వలె తత్వార్థ చింతనము. ఊహా కల్పన, ఆకస్మికంగా మెళిసే మవుతాయి భావానికి స్వరూపానికి ఉండే సాన్నిహిత్యం అధికమవుతుంది.

ఈ నవల కమ్యూనిజాన్ని ఖండిస్తున్నదని అనడం సరికాదు. రచయిత ఉద్దేశ్య మేమిటో తెలుస్తూనే ఉన్నది. (Proust) ప్రూస్ట్ వలె ఇతడు కూడా తన తత్వాన్ని సమగ్రంగా చర్చిస్తాడు. రాజకీయాలు, సంస్కృతి, నీతి నిబంధనలు, ఇవన్నీ కూడా పాత్రల సంభాషణల ద్వారానే వ్యక్త మవుతాయి. వ్యక్తిస్వాతంత్ర్యాలకు, జీవితాశయాలకు ఆధారమైన విప్లవానికి ప్రస్తుత రష్యా ప్రభుత్వం తిరుగుముఖం పట్టినదనే ఆరోపణ కూడా లేకపోలేదు. ఈ విప్లవం మానవ చరిత్రలోనే అత్యద్భుతమైన సంఘటనలలో ఒక ఘట్టంగా పరిగణింపబడుతున్నది. రోమ్ ప్రాభవ పతనంతో తులతూగగలదిగా భావించ బడుతున్నది. ఇప్పటి క్రూరత్వం లేకపోయినా జార్ (Czar) పరిపాలనలో కూడా ఈలాగే వ్యక్తి జీవనం నశించిపోయిన దన్న సూచన ఉన్నది. జీవితంలోని ముఖ్యాశయాలకు మతం, కళ, ఇవే ప్రాణధాతువులు: రాజకీయ ప్రవర్తనలు వీటికి యాదృచ్ఛికాలు. మానవుడు జీవితాశయాలలో తన పాత్ర ప్రాముఖ్యం గుర్తించినప్పుడు మరణం వ్యర్థం కాదని తెలుసుకుంటాడు. పిత్రాశయాలు పునరావృత మవుతాయి. కథలలో, కళాసృష్టిలో, తన అనుభూతి సారాంశం ఇతరులలో పంచుకోగలిగినప్పుడే మానవునికి శాంతి, మోక్షం లభిస్తాయి డాక్టర్ ఝివాగో భార్య, లారా భర్త అని సాధించలేకపోయారు. వీరి నిర్వేదం తీర్చరానిది. 'జీవితానుభూతి వ్యక్తి కిరణాలెప్పుడూ పెరుగుతూనే ఉంటాయి. వాటి సంఖ్యను చెరిపేసే ఆకాంక్ష ఈ రచనకు ప్రాణం పోస్తున్నది. ఇది మూలాల్ని కదలించి వేస్తున్నది. సోవియట్ పాలనలోని దోషాలు, క్రూరత్వము నిరాశావాదానికి పునాదులు కావు. విప్లవానికి ప్రతివిప్లవం జరుగ గలదనే ఆశ కాని, పాశ్చాత్యదేశాలు తమ నిగుసేతినుండి విడిపించగలవనే నమ్మకం గాని సూచనప్రాయంగా కూడా దీనిలో లేవు.

నవలలో కొన్ని భాగాలు చదువుతూంటే హెగల్ (Hegel) రచనలు జ్ఞాపకం వస్తాయి. మానవుడింక బానిసగా గాని, ప్రభువుగా గాని ఉండనక్కరలేదని (Hegel) హెగల్ చెప్పిన సిద్ధాంతాన్ని పాసర్ నాక్ పునరుద్ఘాటిస్తాడు. ఈ శతాబ్దంలో కల్లా రష్యా అతి ముఖ్యమైన దేశమని పాస్టర్ నాక్ దృఢవిశ్వాసం. స్వదేశంలోనే ఉండిపోయి, ఇతడు రష్యన్ తీవ్రవాదుల (Radical intelligentsia) సంప్రదాయాన్ని నిర్వహింపగలిగాడు. ఇతని సృష్టి మనకొక ఆదేశాన్ని, ప్రోత్సాహాన్ని, ఇస్తున్నది. కళాసృష్టిలోను, వ్యక్తి జీవితంలోను స్వేచ్ఛా ప్రాముఖ్యం ఈ రచన ప్రతిపాదిస్తున్నది. కాని పశ్చిమదేశాలలో సామాన్యంగా వాడుకలో ఉన్న మితవాదాలవలె ఈ ప్రతిపాదన నిర్జీవం (Frigid)గా ఉండదు. మట్టిగోడలు కట్టుకుని బాహ్యప్రపంచం విస్మరించాలని ప్రయత్నించే వారి కంఠస్వరం కాదిది.

ఒక దీర్ఘకాలంలో సృజింపబడిన డాక్టర్ ఝివాగో ప్రపంచంలోని నూతన సారస్వతంలో (Modern Literature) కరుణ ప్రధానమైన రచనలలో అతి ముఖ్యమైనదని భావిస్తున్నాను.

'ఎన్ కౌంటర్' నుండి.

# భారతవీరుల పతాకలు

శ్రీ తనికెళ్ల శ్రీరామమూర్తి

సీ. కాంచనమయ వేదికా కనత్కేతనోజ్జ్వల
విభ్రమము వాడు కలశజుండు
సింహలాంగూల భూషిత నభోభాగకేతు
ప్రేంఖణము వాడు ద్రోణసుతుడు
కనక గోవృష సాంద్రకాంతి పరిస్ఫుర
ద్ధ్వజ సముల్లాసంబు వాడు కృపుడు
లలితకంబు ప్రభాకలిత పతాకా విహారంబు
వాడు రాధత్యజుండు
మణిమయోరగ గాంచితాల మహితమైన
పడగ వాడు కురుక్షితిపతి మహోగ్ర
శిఖరము తాళతరువు పసిడెము వాడు
సురనదీసూనుడేర్పడ జూచికొనుము
—విరాట. పంచమ ఆ.

మహాభారతవీరుల పతాకలకు ఒక ప్రత్యేకత వ్యక్తిత్వం ఉన్నది. ఈ విషయాన్ని మనస్సులో పెట్టుకొనే కవిబ్రహ్మ ఒకటి రెండు సందర్భాల్లో ఆయా వీరుల జెండాలను ప్రత్యేకంగా వర్ణించి

చెప్పాడు. ఈ కేతనాలు ఆయా వీరుల వ్యక్తిత్వాలకు బాహ్యచిహ్నాలు; వారి వీర్య శౌర్య పరాక్రమాదుల నిజస్వరూపాలను, మనస్తత్వాలను సూచించే చమత్కార సాధనాలు. పై పద్యంలో వర్ణించబడ్డ వీరుల కేతనాలను పరిశీలిస్తే ఈ విషయం వ్యక్తం అవుతుంది.

భీష్ముడు మహోగ్రశిఖర ఘనతాళశిఖిధ్వజపు పడగవాడట. చెట్లల్లో తాటి చెట్టుకు ఒక ప్రత్యేకత వుంది. దీన్లో వొక రాజఠీవి నిశ్చలత్వం గాంభీర్యం వున్నాయి. నిలువుగా పెరిగి తలవంచక పెనుగాలి తాకిడికైనా లొంగక మూర్తీభవించిన పౌరుషంలా నిలిచివుంటుంది. సాధారణ వృక్షాలమల్లే కొమ్మలు రెమ్మలు లేక మొండిగావుంటుంది. ఈ లక్షణాలన్నీ మనకు భీష్మునిలో కన్పిస్తాయి. ఇతడు కడునిశ్చలుడు. ఓటమిని తలవంపును ఎరుగని వీరవరుడు. పరశురాముడనే ఝంఝామారుతాన్నే లెక్క చెయ్యలేదు. భార్యాబిడ్డలు బెడదలేకుండా మొండులా ఉంటాడు.

కాంచనమయ వేదికా కనత్కేతనోజ్జ్వల విభ్రమమువాడు కలశజుడు. ఇదం బ్రాహ్మ్యమిదం క్షాత్రం అన్నట్లు ఈ మహానుభావుడు బ్రహ్మక్షత్ర తేజాల సమన్వయం. విధివశంచేత క్షత్రధర్మాన్ని చేబట్టినా త్రికాలాలందు వైదిక ధర్మానుష్ఠానాన్ని విస్మరించని కర్మయోగి. యుద్ధరంగంలో దుర్యోధనుడి ఋణం తీర్చుకొని తుదకు అస్త్రసన్న్యాసం చేసి యోగ సమాధిలో బ్రహ్మైక్యాన్ని పొందిన ఈ మహానుభావుడు వేదికాధ్వజుడవటం మిక్కిలి సమంజసంగా వుంది.

కృపాచార్యుడు అసమాన శౌర్యపరాక్రమాలు గలవాడు. అయితే ఇతనిలోవున్న బ్రహ్మక్షత్ర ధర్మాలు సత్వ రజోగుణాలను క్రోడీకరిస్తున్నాయి. కాబట్టే ఇతని జెండా కనకగోవృషచిహ్నితము— వృషభము మహాసత్త్వాన్ని పౌరుషాన్ని సూచిస్తుంది. దాని ధావళ్యం సత్వగుణ సూచకం. అయితే యిక్కడ గోవృషానికి కనకపురంగు. అంటే రజోగుణ సూచకమన్నమాట.

ఇక అశ్వత్థామ పుట్టుకచేత బ్రాహ్మణుడైనా తద్విపరీతలక్షణాలు కొన్నున్నా యితనిలో. శౌర్య పరాక్రమాదు లటుండగా, ఓర్వలేనితనము, దురుసు, కచ్చ పగ, క్షుద్రసంకల్పం, సాహసం, మొండిపట్టుదల యిత్యాదులెన్నో. ఇతని మాత్సర్యాన్ని తామసాన్ని దురాగ్రహాన్ని సూచిస్తుంది. 'సింహలాంగూలము.' (తోకమున్నే సింహానికిగూడా కోపానికి ఉనికిపట్టు తోకయేమో) అయితే సింహపుతోక గాబట్టి యితని లోని సింహపరాక్రమాన్ని గూడ సూచిస్తుంది.

తరువాతవాడు రారాజు. 'మణిమయోరగ రుచి జాలసహితమైన పడగవాడు.' ఇతడు రాజరాజు, అతడు నాగరాజు. ఇరువురు భోగులే, భూభరణోద్యోగులే. ఇద్దరూ కుటిలస్వభావులే; యిరువురికీ నిలువెల్లా విషమే. అందుచేత దుర్యోధనుడికి నాగేంద్ర కేతనం మిక్కిలి తగివుంది.

కర్ణుడి విషయం. 'లలితకంబుప్రభాకలిత పతాకా విహారంబువాడట. శంఖం గెలిచినదానికి చిహ్నం— అయితే లోపలిభాగం గుల్ల. అదీ కర్ణుని వ్యక్తిత్వం. పరాక్రమంలోను అస్త్రవిద్యలోను అర్జునునికి తీసిపోడు. అయితే దురదృష్టవంతుడు— బహుముఖ శాపోపహతుడు— 'అరయంగా కర్ణుడీలె నారుగురిచేతన్' అన్నట్లు ప్రతివాడు యితని నెత్తిన రెండు అక్షతలు వేసి పనికిమాలిన అభాగ్యుణ్ణిచేశారు— బయటికి డాబుగా కన్పడ్డా అంతస్సారం నశించింది. ఇక మిగిలింది శంఖారావంలా డంబాలుకొట్టడం. పోతే 'కంబుప్రభ'వల్ల యితనికి దాతృత్వం ప్రసాదించిన నిర్మల కీర్తి సూచితమౌతోంది.

పై పద్యంలో చెప్పబడనివాళ్ళలో అర్జునుడు అభిమన్యుడు మిగిలారు వీరికేతనాలు కూడాపరిశీలిద్దాం. అర్జునిని జెండానుగురించి ఆట్టే తడవవలసినవసరం లేదనుకుంటా. పద్నాలుగు లోకాల్లో యీడులేని వీరుడు హనుమంతుడు. అట్టి కపిరాజు జెండామీద వుండటం కేవలం అర్జునుడుకూడా అంతవాడేనని చెప్పడానికే. పైగా హనుమంతుడు రామభక్తుడు. ఆ మూలంగా పరమాత్ముని సాన్నిధ్యం కొంతవరకు సంపాదించుకున్నాడు. ఇక అభిమన్యుడు 'కర్ణికార కేతనుడు! పాలాశకుసుమంవిస్ఫారత్వాన్ని నిరర్థకత్వాన్ని సూచించినట్లే యీ కొండగోగు 'అల్పాయుర్దాయాన్ని' సూచిస్తుంది. ఈ పువ్వు ఆకారం అందం అన్నీ వున్నా అతిసున్నితం అల్పాయుష్కం. ఇదే అభిమన్యుడి వ్యక్తిత్వం. మహావీరుడే; అర్జునినంతటివాడే! సుకుమారుడే ముగ్ధమోహనాకారుడే. అయితే యేమిలాభం? హతవిధి అతణ్ణి అకాలమృత్యువువాత బెట్టాడు.

ఇది వారివారి జెండాలలోనుండే చమత్కారం.

# గ్రంథ విమర్శనము

## జయంతి

[సారస్వత మాసపత్రిక]

సంపాదకులు: శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, శ్రీ మలంపల్లి సోమశేఖరశర్మ ప్రభృతులు. సాలు చందా, ఎనిమిదిరూపాయలు. విడిప్రతి వెల: 75 నయాపైసలు. చిరునామా. సంపాదకులు: 516 సుల్తాన్ బజార్, హైదరాబాదు.

శ్రీ విశ్వనాథ సంపాదకత్వంలో పూర్వం ఒకప్పుడు వెలువడిన జయంతి వైజయంతివలె ఆధునిక సారస్వతోపాసకుల కందరికీ ఆనందం కలిగించింది. తిరిగీ శ్రీ విశ్వనాథ ప్రభృతుల సంపాదకత్వంలో ఆ పత్రిక ఈవిధంగా వెలువడడం ముదావహం.

ఈ జయంతిలోని కథలలో బుచ్చిబాబు 'కార్యసాధకుల మహాకావ్యం' ఎన్నదగిన రచన. శ్రీమతి పి. శ్రీదేవి గారికథకూడా తప్పక చదవవలసినదే. చెకోవ్ రచన 'వినోదులు'కథలో అనువాదం అంతగా సరిగా సాగలేదు.

శ్రీ మలంపల్లి వీరేశ్వర శర్మగారు ఆముక్తమాల్యదపై చేసిన విమర్శన తలస్పర్శి. ఈవ్యాసం ఇంకా విస్తృతంగా వివరంగా రచించివుంటే బాగుండునని అనిపించింది. శ్రీ సత్యనారాయణ గారు 'అభిజ్ఞాన శాకుంతలము' అనేవ్యాసంలో శాకుంతలంలోని 'గ్రీవాభంగాభిరామం' అనే శ్లోకానికి ఒక వినూతనమైన వ్యంగ్యార్థం ప్రతిపాదించారు. ఈ విధంగా రూపక మన్యగతిమైన శ్లోకంలో కావ్యవస్తు సూచన చెయ్యడం ప్రాచీన సాంప్రదాయిక మార్గం కాదు. అయినా కాళిదాస మహాకవి కావ్యం భిన్నభిన్న దృక్పథాలతో పరిశీలించవచ్చును. కనుక ఈదృష్ట్యా విశ్వనాథవారి విమర్శన సహృదయులందరు తప్పక పరిశీలింపవలసినదే. ఇంకా ఈసంచికలో 'శిండిల' రచించిన 'కొన్ని సామెతలగన్న చిన్నకథలు' అన్న వ్యాసంకూడా ఒక కొత్తధోరణిలో హృద్యంగా సాగిపోతున్నది. 'రాయప్రోలునుండి దేవులపల్లివరకు' అన్న రచనలో శ్రీ రమణారెడ్డిగారు దేవులపల్లివారి ఊర్వశిపై చేసిన విమర్శనలో కొంత సహృదయదృష్టి లోపించింది.

ఇక ఈ సంచికలో ఉన్న రెండు మూడు ఖండకావ్యాలలోను శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారి "ముత్యాలశాల" మనోజ్ఞంగా సాగిపోతున్నది...

సంపాదకీయంలో సంపాదకులు స్థూలంగా నేటి కాలపు వాఙ్మయ పరిస్థితులు సింహావలోకనంచేసి సూక్ష్మంగా తమ లక్ష్యాలు నిర్దేశించారు.

ఈ కాలంలో కేవల సారస్వతమాసపత్రిక నిర్వహించడం అనుకున్నంత తేలిక కాదు. అయినా ఈ మొట్టమొదటి సంచిక సర్వాంగసుందరంగా రూపొందించడానికి చేసిన కృషికి వే అభినందనలు.

సంపాదకలక్ష్యాలతోధికంగా ఆచరణలోనికి రాగలవనీ అధునాతన జయంతి క్రమక్రమంగా ప్రాచీన జయంతి ఔన్నత్యం అందుకోగలదనీ ఆశిస్తున్నాము.

'శాస్త్రి'

## పంచకల్యాణి

డాక్టరు యస్వీ జోగారావు. ప్రచురణ ఆంధ్ర రచయితలసంఘం, హైదరాబాదు; వెల రూపాయిన్నర.

ఈ కవి అటు ప్రాచీనాంధ్ర కవితా వాహినిలో ఓలలాడి ఇటు అత్యధునాతనాంధ్ర కవిత్వపు పోకడలు


ఉపయోగమైన సరిక్రొత్త పుస్తకములు

వ్యవసాయము - ఇంజనీరింగు, వైద్యము, వగైరా అనేక గ్రంథములు. కేటలాగు ఉచితము. ఇంగ్లీషులో వ్రాయండి.

N.K. Paul & Sons, Post 12202, Calcutta-5.

కొన్ని చాలా జాగ్రత్తగా ఆకళించుకొన్నవారు. ఇందువల్ల ప్రాచీనాంధ్ర కవుల ధోరణులేకాక, నేటి వారి పద్ధతులుకూడా వీరి కవితలో గోచరిస్తుంటాయి. కవన ప్రారంభదశలో ఈ విధంగా ఇతరకవుల ముద్రలు పడటం సహజం. అయితే ఈ కావ్యంలో కవి తన సొంత గొంతు ప్రత్యేకంగా వినిపింపవలెనని కూడా చేసిన ప్రయత్నంలో కృతకృత్యులయినారు.

ఈ కావ్యంలో వృత్తాలు, గీతికలు, గేయాలు, వచనకవిత మొదలైన వివిధమార్గాలు కనిపిస్తాయి.

వచనకవిత ప్రస్థానం నివాబ్రహ్మంలో ఈ తిమకవితా మర్యాద అందుకొన్నది. ఆ ధోరణిలో నేటికాలంలో కొందరు రచనలు సాగించారు. కాని కవితాస్థాయి అందుకొన్నవి చాలా తక్కువ. ఈ కావ్యంలో ఆ పంథాలో రచించిన 'ఉషా ప్రహేళిక' కవితాస్థాయి అందుకొన్నది. మన కధువాతివమైన ఈ కొత్త మార్గంలో కలం నడిపిస్తున్నందుకు వీ రభినందనీయులు.

ఈ కవిపై అభ్యుదయ కవిత్వపద్ధతి గట్టి ముద్రే వేసింది. అయితే ఆ బాటలో వీరు సాగించిన రచనలలో కవిత్వం బాగా పలక లేదు.

ఇంచుమించుగా ఈ ధోరణిలో సాగిన 'సినీవాలి' ఈ ఖండకావ్య సంపుటిలో చేర్చకుండా ఉంటేనే బాగుండునని అనిపించింది.


ప్రముఖపత్రికలూ, ప్రఖ్యాతసాహితీపరులూ ప్రశంసించిన

**ఉత్తమ గ్రంథాలు**

1. **పంజప్రణయం:** హాస్యంతో, వ్యంగ్యంతో నిండిన పదికథలూ, గల్పికలూ. రచన పూషా: వెల 0-50 న.పై
2. **పారిజాతం:** కథల సంపుటి. కథకులు: చాగంటి సోమయాజులు; రాచకొండ విశ్వనాథశాస్త్రి; పంతుల శ్రీరామ శాస్త్రి; పురాణం సుబ్రహ్మణ్యశర్మ; బొమ్మిరెడ్డిపల్లి సూర్యారావు; హితశ్రీ; పూషా; అంగర వేంకట కృష్ణారావు; ఇద్పాపురపు జగన్నాథరావు; ఈరంకి వేంకటరావు; పూసపాటి కృష్ణంరాజు వెల రు 1-25 న. పై
3. తెర మెరుగులు: (నాటికల సంపుటి) కుక్కపిల్ల దొరికింది (రావికొండలరావు); దొంగ (పొతుకూచి సాంబశివరావు); తెల్లవారింది (హితశ్రీ); తెరమరుగు నీడలు (కొండముది శ్రీరామచంద్రమూర్తి); త్రిలకు ప్రత్యేకం (అంగర సూర్యారావు). వెల రు 1-50 న. పై.

శోభా ప్రచురణలు, విజయనగరం సిటీ.


పంచకళ్యాణిలో చేర్చిన శీర్షికలలో గీతపద్యాలలో 'ప్రభవతాం' 'కాళరాత్రి' 'దీపావళి' పేర్కొనదగిన రచనలు.

వృత్తాలలోను, కందాలలోను వీరికి బాగా చెయ్యితిరిగింది. ఆపైన సంస్కృతాంధ్ర పాండితి కూడా దీనికి తోడయింది. ఇందుచేత ఈ వృత్తాలలోను కందాలలోను కొంత ప్రత్యేకత గోచరిస్తుంది. ఫలశ్రుతిలో వృత్తాలు దీనికి తార్కాణాలు. ఈ క్రింది వృత్తం వీరి రచన కొక ఉదాహరణ:

"ఇన్నాట నీ వివికమున
నింతి ప్రసాదము వాత్మఖేద పా
టన్నర పైన పావక ఘుట
మ్మొక కమ్మని పద్యకావ్యమున్
నిప్పులు గీతిబంధముల
పెర్పొలయించుము నీవు నున్నచో
వచ్చును గా వివిక్త
మువిదా! అవిము కముగా నగుంగదా!"

వీరి 'కవికైవారము'లోని కందంకూడా ఉదాహరింపదగినదే!

"ఏ కవి ముఖముకురము కవి
తా కళ్యాణి కలగూపుదాల్చె మొదట వా
మా కులపతి జగకేక ము
హాకవి వాల్మీకి మాని కంజలి నింతున్."

డాక్టరు గుప్పీ జోగారావుగారి 'పంచకల్యాణి' ఆధునిక కవితాభిమానులందరు తప్పక పరిశీలింపదగిన ఖండకావ్య సంపుటి.

## భారతాభ్యుదయము

### [పద్యకావ్యము]

కవి: కోటసుబ్రహ్మణ్యశాస్త్రి, ప్రతులకు: గ్రంథకర్త: ఆంధ్రభాషోపన్యాసకులు వెంకటగిరిరాజ కళాశాల, వెలూగు. వెల రూపాయిన్నర.

ఈ కావ్యానికి 'శబరబాల' అని కుండలీకరణంలో ఇంకొక పేరుకూడా ఉన్నది.

ఇది స్వకపోలకల్పిత కథతో రచించిన పద్యకావ్యము. యాత్రికులను కొందరిని ఆటవిక తెగ రొక్కాని దోచుకొంటారు. ఆ యాత్రికులలో ఒకరికి చెందిన అనాథబాలిక బోయలకు దక్కుతుంది. వారా

మెను పెంచి పెద్దదానిని చేస్తాడు. ఆమె ఆ అరణ్యంలో తపస్సు చేసుకుంటూ ఉన్న ఒక మునికుమారుణ్ణి చూసి మోహిస్తుంది. అతడు అరణ్యంలో ఒక బ్రాహ్మణ తపస్వి పెంచిన 'అనాథబాలకుడు. అచిరంగా వారిద్దరి మధ్య ఏర్పడిన అన్యోన్యత వివాహంగా పరిణమిస్తుంది. చిట్టచివరికి కావ్యం శుభాంతంగా ముగిసిపోతుంది.

ఈ కవి కావ్యకథా నిర్మాణంలో కూడా కొత్త పద్ధతే అవలంబించారు. సామాన్యంగా అధునాతన కావ్యాలేవయినా కొంత శ్రద్ధపెట్టి చదువుకోవాలి. ఈ కావ్యం మొదటినించి చివరివరకు ఒక చిన్న కథ లాగే సుఖంగా సాగిపోతుంది.

'భారతాభ్యుదయం'లో వాడినవన్నీ సాంప్రదాయిక ఛందస్సులే. ఇవన్నీ సరళంగా హృద్యంగా సాగిపోతున్నాయి. పదాలకూర్పులో పాండిత్యం ప్రస్ఫుటంగా ప్రకటించగల విద్వత్తు ఉన్నా అది పదాడంబరంగా పరిణమించకుండా జాగ్రత్తపడగల కవులు వీరు.

ఈ క్రిందిది మునికుమారుడు శిబరశాఖను తిలకించిన అనంతరఘట్టం. ఇది వీరి కవితాధోరణికి తార్కాణం.

"తనవదంష్ట్రచే జేగు చిగు
రాంబుదపంక్తులు తేటవెన్నెలన్
రానము లాడఁ. సుందరద
వన్యతిలో మగుహారదిధితుల్
తీవము గాఁగ, గాలికిఁ జ
లించిన పయ్యెదమాటి వల్లెసల్
మేనిపసింపి క్రొందళుకు
మించుతళోదరి తోఁచెఁ జాక్కికిన్."

ఒక పెద్ద కలకలం హఠాత్తుగా ఆగినపిమ్మట ఏర్పడే నిశ్శబ్దత ఈ క్రిందిపద్యంలో రూపొందుతున్నది.

"చపచప ఉడిగెన్ సుడిగాలిఁ,
బద చెడి తెమ్మెరలు మూకభావముఁ దాల్చెన్;


ప్రమాద రక్షణకు ప్రశస్తమైనది భీమా

ఎప్పుడు ఏ ప్రమాదం వచ్చేదీ, ఏ క్షణం ఎలా ఉండేదీ తెలియని ఈ దినాలలో

* అగ్ని * మోటార్‌కారు * కార్మిక నష్టపరిహారం * నౌక

* ఫయడిలిటి గ్యారంటీ మొదలైన భీమాలకు

మా తో సంప్రతించండి.

యునైటెడ్ ఇండియా ఫైర్ అండ్ జనరల్ ఇన్సూరెన్సు కంపెనీ,

"బాంబే లైఫ్ బిల్డింగ్స్"

9, బ్రాడ్వే, మద్రాసు. 1.

Telephone: 4241, Telegrams: "UNIGEN"

బ్రాంచీలు:

విజయవాడ - బెంగుళూరు - బొంబాయి - కలకత్తా - న్యూఢిల్లీ - పాట్నా

కొలంబో - సింగపూరు - కోయంబత్తూరు - జాకార్తా.

గనిమపంగిన కాలాబ్దము
వసుధన్ వర్షించి వెలియువనువునం దోంచెన్"

దీనిని 'భారతాభ్యుదయము' అనడంకంటే 'శబరబాల' అనడమే సముచితం.

సహృదయులాదరించదగిన చిన్న కావ్యమిది.

'శాస్త్రి'

## తెరమెరుగులు

[నాటికల సంపుటి]

ప్రకాశకులు: శ్రీమతి ఆర్. వి. రమణమ్మ, శోభా ప్రచురణలు, విజయనగరం. వెల: రూపాయిన్నర.

దీనిలో అయిదు నాటికలున్నాయి. మొదటి నాటిక 'చుక్కపిల్ల దొరికింది' రచించినవారు శ్రీ రావి కొండలరావు. రెండవ నాటిక 'దొంగ' వ్రాసినవారు శ్రీ పోతుకూచి సాంబశివరావు. మూడవనాటిక 'తెల్లవారింది' రచయిత 'హితశ్రీ'. నాలుగవది 'తెరమరుగు నీడలు'. ఇది రచించినవారు శ్రీ కొండముది శ్రీరామచంద్రమూర్తి. చివరి నాటిక 'స్త్రీలకు ప్రత్యేకం' రచయిత శ్రీ అంగర సూర్యరావు.

కథానికా రచన మన వాఙ్మయంలో ప్రారంభించి చాలాకాలమే అయింది కాని చిన్న నాటికల రచన ఇటీవల కొంచెం విరివిగా సాగుతున్నది. ఈ నాటికలలో కొన్ని ఉత్తమరచనలు కూడా వస్తున్నాయి.

ఈ సంపుటిలో కొన్ని నాటికలు సునిశితమైన వ్యంగ్యంతో సున్నితంగా సాగిపోతాయి. శ్రీ రావి కొండలరావు 'చుక్కపిల్ల దొరికింది', శ్రీ పోతుకూచి సాంబశివరావు 'దొంగ' ఈ జాతికి చెందిన నాటికలు.

'తెల్లవారింది' అనే 'హితశ్రీ' నాటికలో ఇతివృత్తం అంతగా గట్టిగా తట్టకపోవచ్చును. కాని దీనిలో రచయిత మన మధ్యతరగతి కుటుంబాలలోని సామాన్య సాంసారిక జీవితము, కష్టసుఖాలు చిత్రించారు. నిజానికి దీనిని ఒక 'చిత్రణం' అనడం సబబేమో! శ్రీ అంగర సూర్యారావు 'స్త్రీలకు ప్రత్యేకం' ప్రత్యేకంగా నేటి కాలపు స్త్రీల నుద్దేశించి వారి సమస్యలను గురించి చేసిన రచన. స్త్రీలే ప్రత్యేకంగా ప్రదర్శించుకోడానికి వీలయిన నాటిక ఇది.

'తెరమరుగునీడలు' నాటికా రచయితల ఇబ్బందులు గోరంతలు కొండంతలుగా చేసి చూపే రచన. ఈ అత్యుక్తివల్లనే దీనిలో 'సహజత్వం' కొంత లోపించింది.

అయితే మొత్తంమీద ఈ అయిదు నాటికలు ప్రదర్శనానికే గాక చదువుకోవడానికి కూడా బాగా అనువయిన రచనలు.

ఈ విధంగా నేటి కాలపు నాటికలలో అయిదు చిన్న నాటికలేర్చి కూర్చి అందరికీ అందుబాటయిన విధంలో ప్రచురించిన సంపాదకు లభినందనీయులు.

'శాస్త్రి'

---

## సవరణ

1958 అక్టోబరు భారతిలో 'జ్యోతి రథతరణము' రచించినవారు 'సుప్రసన్న' గాని శ్రీ బి. రామరాజు కాదు. ఆ సంచికలో పడిన ఈ పొరబాటు పాఠకులు గమనింప ప్రార్థితులు.

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad